శ్రీ

# ఆంధ్ర విజ్ఞానము

# (Telugu Encyclopædia)

ఏడవ సంపుటము.

Andhra Vignanamu

ప్రసాద భూపాలుఁడు

జమీందార్ ఆఫ్ దేవిడి.



జ్ఞానోదయము.

మొదటికూర్పు 1000 ప్రతులు.

1941

PRINTED AT THE BOX PRESS

BY B. V. RAMANAYYA & SONS, RAJAHMUNDRY.



శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాదభూపాలుఁడు

(జమీందార్ ఆఫ్ దేవిడి)

# విషయసూచిక

**సమాసము (కావ్యమునందలి సమాసము)**:—పదములను గదియించి కూర్చుట (అనఁగా సమసింపఁజేయుట) సమాసముగ నెఱుంగునది. అనఁగా కావ్యరచనయం దాయా తావుల కనుకూలించి రుచించునటుల పద్యమందు పదములను సమసింపఁజేయుట యనిభావము. వ్యాకరణశాస్త్రవేత్త లీసమసింపఁజేయువిధముల నాఱుగ విభజించియున్నారు.

౧ అవ్యయీభావసమాసము:— ఇది ౧ అవ్యయ పూర్వపదమనియు, ౨ అవ్యయోత్తరపద మనియు, ౩ నామోభయపదమనియుఁ ద్రివిధము.

౨ తత్పురుషసమాసము:—ఇది యెన్మిదిభేదములు గలది. ౧ ప్రథమావిభక్తితత్పురుషము. ౨ ద్వితీయావిభక్తి తత్పురుషము, ౩ తృతీయావిభక్తి తత్పురుషము, ౪ చతుర్థీవిభక్తి తత్పురుషము, ౫ పంచమీతత్పురుషము, ౬ షష్ఠీతత్పురుషము, ౭ సప్తమీతత్పురుషము, ౮ నఞ్ తత్పురుషము.

౩ కర్మధారయసమాసము:— ఇది తొమ్మిదివిధములు. ౧ విశేషణపూర్వపదము, ౨ విశేష్య పూర్వపదము, ౩ విశేషణోభయ పదము, ౪ ఉపమానపూర్వపదము, ౫ ఉపమానోత్తర పదము, ౬ అవధారణపూర్వపదము, ౭ సంభావన పూర్వపదము, ౮ లుప్తమధ్యమపదసమాసము, ౯ భిన్నోక్తరపదసమాసము.

౪ ద్విగుసమాసము లేక ద్విగువు:—ఇది ఏకవిద్భావి, అనేకవిద్భావి యని యిరుదెఱంగులు.

౫ బహువ్రీహి సమాసము:—ఇది పండ్రెండువిధములు. ౧ ద్వితీయాబహువ్రీహి, ౨ తృతీయాబహువ్రీహి, ౩ చతుర్థీబహువ్రీహి, ౪ పంచమీబహువ్రీహి, ౫ షష్ఠీబహువ్రీహి, ౬ సప్తమీబహువ్రీహి, ౭ వ్యధికరణబహువ్రీహి, ౮ సహపూర్వపదబహువ్రీహి, ౯ ఉపమాన పూర్వపదబహువ్రీహి, ౧౦ దిగంతరాళబహువ్రీహి, ౧౧ వ్యతికరణలక్షణ బహువ్రీహి, ౧౨ నఞ్ బహువ్రీహి.

౬ ద్వంద్వసమాసము:— ఇది ద్విపదద్వంద్వమనియు, బహుపదద్వంద్వమనియు ద్వివిధము. అందొక్కొక్కటి యితరేతర యోగమనియు, సమాహారమనియు ద్వివిధమగుట మొత్తమున నీద్వంద్వసమాసము నాల్గుతెఱంగులుగఁ దనరెడిని.

**సమ్మిట్ [శిఖరము]**:— [Summit or Top of a mountain) పర్వతముయొక్క యెత్తగు భాగమునకు 'Summit' అనియు, 'Top' అనియుం బేరులు.

(Mountains చూడుఁడు.)

**సముఁడు**:— మగధ బార్హద్రథ సంతతి క్షత్రియుఁడు. తండ్రి ధర్మసూత్రుఁడు. పితామహుఁడు సువ్రతుఁడు. పుత్రుఁడు దృఢసేనుఁడు.

**సముఖము వెంకట కృష్ణప్ప నాయకుఁడు**:— ఆంధ్రకవులలో నాధునికకవులలోఁ బరిగణింపఁ బడినవాఁడు. తండ్రిపేరు మీనాక్షినాయకుఁడు. రచించినవి 'అహల్యాసంక్రందన' మనుప్రబంధమును, జైమినిభారతమను వచనకావ్యము నని తెలియుచున్నది. ఈకవి దక్షిణమధురాపురాధీశ్వరుండగు విజయరంగచొక్కనాథమహీనాథునికాలమువాఁడు గాన క్రీ.శ. ౧౭౦౦ సంవత్సరప్రాంతమువాఁడు.

**సముద్రగుప్తుఁడు:—** మగధదేశము క్రీ. శ. 326 - 375 చక్రవర్తిగ రాజ్యపాలన నెరపినవాఁడు. రాజధానిని పాటలీపుత్రమునుండి యయోధ్యకు మార్చినవాఁడు.

(మగధరాజ్యము చూడుఁడు).

**సముద్రము ఘనీభవించు టధిక కష్టము:—** సముద్రపునీ రితరజలములవలెనే శీతలసహవాస మధికమైనకతన ఘనీభవింపఁ (freeze) దగినదియే. అటుల ఘనీభవించి మంచుగనై పోవుటకుఁ గొన్నియాటంకములు కలవు. పెక్కండ్రు సముద్రపునీటియందలి యుప్పు ఘనీభవింపనీయదని పొరఁబడుచుందురు. కాని నిజము బరిశీలించిన సముద్రపుజలములలోతును, సముద్రమందుఁ దఱుచుగ జరుగుచుండు నాకర్షణశక్తినుండి సంభవించుచుండెడి పోటుపాటులవలనఁ గల్గెడి జలప్రవాహంపుఁ గదలికయును, దానింబట్టి నిరతము సముద్రమున సంభవించుచు నదే పనిగ జరుగుచుండు నీటికదిలికలును సముద్రమందలినీటిని ఘనీభవింపనీక నాటంకములై దనరుచున్నవి. వీటియతిశయములేని యుత్తరదక్షిణ ధ్రువప్రదేశములు చక్కఁగ ఘనీభవింపఁ గల్గుచున్నవి. పోటుపాటుల కదలిక కాస్పదమైన ధ్రువములదిగువప్రదేశములందున్న సముద్రజలములు ఘనీభవించుటకు వీలు తప్పుచున్నది. ఇంక సముద్రపు టధికలోతుప్రదేశములు నీటిపై పొరను మాత్రమే ఘనీభవింప నిచ్చుచున్నవి. లోనివేడి వాటిం గరఁగించి వేయుట నచటను మంచు నిలువఁజాలకున్నది. కదలికబాధలు లేని పర్వతాగ్రములం దీమంచు కూడుట కేబాధయు లేదుగాన నున్నతపర్వతశిఖరములు హిమనిలయములుగ నుండఁగల్గుచున్నవి.

**సముద్రజలము:—** ఇటీవలి పరిశీలనలు సముద్రజల ముపరిభాగ మేడింట నైదు భాగములని యంచనా వేసినవి. అనఁగా భూమి యొక్క యుపరిభాగమునందని భావము. ఇంక సములోతులు పెక్కులుగ నుండును. ఒక్కొక తావున మహాపర్వతములందు మున్గిపోవునంతలోతుండును. నీటిధ్వనులంబట్టి లోతుంబోల్చు విద్యయందుఁ బ్రముఖులగు పండితు లుత్తర దక్షిణధ్రువసముద్రములఁదక్క తక్కిన ప్రదేశముల దానూహాయిలోతు (average depth all the world ower) రెండున్నరమైళ్ళని లెక్కించిరి. శాస్త్రజ్ఞులు Challeger expidition నందుఁ బనిచేసి 323220000 (ముప్పది రెండుకోట్ల ముప్పదియేఁడులక్షల యిరువదిరెండు వేల) ఘనఁపుమైళ్ళనీరు సముద్రములం దున్నటుల నంచనా వేసియున్నారు. ఈసందర్భమున నొక మైలు పొడవు, నొకమైలు వెడలుపు, నొకమైలు లోతుగల (Cubic mile) ది ఘనఁపుమైలని యెఱుంగునది.

**సముద్రజలప్రవాహములు (Ocean Currents):—** శీతోష్ణస్థితులతో సంబంధము గల్గి వాటి నించుక సవరింపఁగల్గినవని పేరందినవి సముద్రజలప్రవాహములు. వీటిలోఁ గొన్నింటికి ‘Ocean Currents’ అనియు, కొన్ని ‘Gulf steams’ అనియు నాంగ్లభాషయం దనఁబడుచున్నవి. (ప్రపంచమందలి సముద్రభాగము చూడుఁడు). ఇవి యెడతెగని వాయుప్రవాహములు నీటిపైఁబ్రవహించుచుంటఁ గల్గుననుచున్నారు. ఈవాయుప్రవాహములకు లోఁబడి కల్గిన సముద్రజలప్రవాహము లాప్రక్కదేశముల యుష్ణాధిక్యత, అతిశీతలములం దగ్గించి, యించుక సమత్వస్థితిం గల్గించునట. ఒకగల్ఫుస్ట్రీము సముద్ర

జలప్రవాహము మెక్సికో సంయుక్తాగ్రగుడము (gulf) నుండి బయలువెడలి నీటిపైనుండి వీచు వాయుప్రవాహము(South westerly wind) ననుసరించుచు, అట్లాంటిక్‌మహాసముద్రము కడ్డముపడి నడుచుచుండును. అది నలువది లేక యేఁబదిమైళ్ళ వెడలుపుగల గొప్పనదీజలప్రవాహముంబోలి నడుచుచు గంటకు నాలుగు లేక యైదుమైళ్ళ వడిని పాఱుచుండును. అట్లాంటిక్కుమహాసముద్రము గడచి గమనవేగము తగ్గి త్రివేణియై మూఁడుప్రవాహములు చీలి యొకటి ఐస్లాండుద్వీపపు దెసకును, ఒకటి స్పానియాదేశపు దెసకును, ఒకటి స్కాట్లాండుప్రక్కంబడి నార్వేదేశముల దెసకుం బ్రవహింప మొదలిడును. ఇంతదనుక దీనిపైని వీచుచుండు వాయుప్రవాహమును కడుంగడు వేడిగనేయుండి యింతటినుండి యదియుఁ జీలిపోయి మూఁడుప్రవాహముల ననుసరించియే తానును మూఁడుగనై జనుచుండ మొదలిడును. చీలకము న్నట్లాంటిక్కుమహాసముద్రముపై వీచు గాలియందలివేడి నొకచోఁ జేర్పఁగల్గిన నది మంచుం గరఁగించి, ఆల్ఫ్సుపర్వతములం బోడికొండలుగఁ జేయఁజాలిన దందురు.

ఇట్టి జలప్రవాహములు సముద్రమునం దింకను గొన్ని గలవు. ఇది చాలపెద్దదై ముఖ్యమైనదిగాఁ జెప్పఁబడుచున్నది. కడ కీమూఁడుశాఖలప్రవాహముత్తరధ్రువసముద్రముదరికిం జేరుకొనువఱకు బలము తగ్గి ప్రవాహపటిమం గోల్పోయి కలసిపోవుటతోఁ బైనుండి వాయుప్రవాహమునుచల్లఁబడి మహావాయుపథమున సరుదుకొనును.

**సముద్రతరంగములు, జలప్రవాహము:—** సముద్రజలతరంగములు గాలివలనఁ గల్గిన తోపుడునకు లోభాగమునుండి సముద్రతీరములకుఁ దరంగరూపమున నిటునటుం గదపుచుంటయేగాని జలప్రవాహము కానేరదు. ఏలయన దరి కరగిన జలము లాఁగిపోవుంగాని యింకను ప్రవహింప వీలుండదు. దీనింగూర్చి "The wave which moves across the sea to the shore is a transference of motion and not of water" అని నిర్వచింపఁబడినది. జలతరంగము వాతావరణమునందలి గాలిబలము ననుసరించి యుండును. గాలిబలము లేక వాతావరణము ప్రశాంతమై యుండుతఱి సముద్రతరంగములు తగ్గిపోయి నామమాత్రావశిష్టమై యుండెడివి. అది యల్లకల్లోలమగుతఱిఁ దరంగములును గొప్పవిగ కలవరపఱచెడివి.

Leyden Jar అను పేరుగల Elictric battery యందుఁ గల్గెడి చిన్నచిన్న electric sparks గాలియందుఁగాక ఈథరు లేక స్పేస్ నందుఁ దరంగములం గల్గించి యొకసాటి రిసీవర్ (Receiver) యంత్రపరికరములోని డ్రమ్ము భాగమునకుఁ దాఁకి వినఁబడఁజేయుచు వైర్లెస్ టెలిగ్రాఫ్, టెలిఫోనుల నిజరహస్యః నిట్లే బయలుపెట్టెడివి. ఇవి ధ్వనితరంగములు.

**సముద్రతీరము [బీచ్] Beach:—** (Sea beach. సముద్రపుటొడ్డు, తీరము, Sea Portions చూడుఁడు).

**సముద్రప్రవాహములు (Ocean currents):—** సముద్రజలము సముద్రమున నెక్కడి దక్కడనే నిలచియుండునని పెక్కండ్రు తలంతురు. ఇది సరి కాదు. భూమియందుఁ బల్లఁపుమార్గములగు గండెలగుండా నీరు ప్రవహించుచు నదులగునట్లే మహాసముద్రముల యడుగు భాగమునఁ జాల వెడలుపును, కడులోతును గల్గిన గండెలు కడుదూరము వ్యాపించియుండునవి గొప్ప

గొప్పవి పెక్కులు కలవు. వీట్లలో సముద్రపు నీరే ప్రవహించుచుండును. ఇవి నీటియందలి యడుగుప్రవాహములు. ఇంక నీటియొక్క యుపరి భాగమునందుఁ బరుగిడుచుండు జలప్రవాహములును గలవు. ఒక్కొకసారి యడుగుప్రవాహము, పై ప్రవాహము కలిసి యొకేదెసగ నడుచును. వేరొక్కసారి యడుగుప్రవాహ మెదురగును. వేఱొక్కచో నొకటి నొకటి దాఁటును. ఇంకను వేర్వేఱువిధములై యుండును.

వీట్లకుఁ గారణములు పెక్కు గలవు. ఉత్తర దక్షిణధ్రువములకడఁ గడుశీతల మగుట, నీరు చల్లగ నౌట బరువై, కాలానుగతమున నేర్పడి పెద్దవై సిద్ధముగనున్న పల్లములలోనికిం దొరలుచు, వెనుకవచ్చు నీటిబరువుచే ముందుకుఁ ద్రోయఁబడుచు, ముందునకుఁ గదలి ప్రవహింప నారంభించును. ఇట్టిప్రవాహములు సాధారణములు. శీతలములగు నుత్తరదక్షిణధ్రువములకడ నారంభమై వేఁడిప్రదేశములగు భూమధ్యరేఖ వైపున కేగుచుండునవిగా నెఱుంగఁబడుచున్నవి. భూమధ్యరేఖకడ వేఁడి నందిన నీరు పోటున కుబ్బియును, బిదప శీతలప్రదేశములగు నుత్తరదక్షిణ ధ్రువములవైపున కిరుదెసలనుబర్విడి యచట పల్లములంబడి కదలిపోవుచున్న శీతలజలములస్థానముల నాక్రమించి, కాలవశమునఁ దామును శీతలములై యందే పడుచుఁ బైనుండి తమ్ము వెంటాడివచ్చు వేఁడిజలములకుఁ దా విచ్చుచుండెడిని.

ఇంకను నొకేదిశ కదేపనిగ వీచుచుండు వాయువులప్రవాహములబలముచేఁ ద్రోయఁబడి కదలి యావాయుప్రవాహమార్గముననే బర్విడు జలోపరిభాగప్రవాహములు కొన్ని యుండును. వీట్లకును కొద్దిగనో, గొప్పగనో సముద్రపు టడుగు భాగమున పల్లపుదారు లేర్పడియే యున్నవి. గాన దారి తప్పి ప్రవహించుట యరుదు.

వీట్లప్రవాహమునకు ముఖ్యకారణము వేరొక్కటి కలదు. భూమి గిరగిరఁ దిరుగుచుండుటచే వేగమున కీప్రవాహములును ద్వరితగతి నందుచు నిరుదెసల కక్కడక్కడఁ జెదరి వేర్వేరు పాయలై పరుగులిడుచు సముద్రపుటడుగుభాగమునఁ దమ మార్గములం దాఁ గోసికొని యేర్పఱచుకొని యాయాట యందు నడుచుచుంట వేర్వేరుప్రవాహము లేర్పడియున్నవి. ఇందుఁ గొన్ని పోనుపోను బలహీనములై తగ్గిపోవుటయుఁ గలదు. భూమధ్యరేఖాస్థానమున వేఁడినందిన జలములప్రవాహములు కొన్నియు, భూమిలోపలనుండు వేడి యచ్చటచ్చట బలహీనములగు తావులఁ బైకిఁ జిమ్ముప్రదేశముల నావేఁడికి నుష్ణములై ప్రవహించు వేఁడి నీటిప్రవాహములును గొన్ని గలవు. ఎచ్చటనో యొకటిరెం డరుదుగఁ దప్పఁ దక్కిన సముద్రప్రవాహము లడుగున జనునవి శీతలముగను, నుపరిభాగమునఁ బ్రవహించునవి వేఁడిగను, సర్వసామాన్యముగ నుండునని యెఱుంగవలయును. గాలివల్ల నేర్పడిన ప్రవాహములకు 'Drifts' అనియును, తక్కినవాట్లకు 'Ocean currents' అనియును నాంగ్లమున వాడుదురు.

ఈసముద్రజలప్రవాహములు (Ocean currents) భూమధ్యరేఖాప్రదేశమున కిరుదెసలను జనించు వాటిలో ముఖ్యమగునవి రెండు గలవు. వాట్లకు 'Equatorial currents' అని నామమిడియున్నారు. అం దుత్తరదిశ నుద్భవించు ప్రవాహమునకు 'North Pacific current' అనియును, దక్షిణదిశం జనించిన ప్రవాహమునకు 'South Atlantic current' అనియును వాడుకనామములు. రెండును సామాన్యనామమున 'Equatorial currents' (భూమధ్యరేఖాసంబంధ ప్రవాహములు) అని చెప్పఁబడు

చున్నవి. ౯౦ దుత్తరపవ్రివాహమును జపాను దేశ స్థులు "కూరోశివో" అనియెదరు. జపాన్ భాష యందు, కూరోశివో యన 'నల్లని సీ' రని యర్థము. జపాన్ ప్రాంతమునఁగల పచ్చసముద్రఁపు [yellow sea] బురదనీటినుండి వేరైన యిది 'నల్లనిజల' మని భావము.

South Atlantic Equatorial current ఆఫ్రికాఖండఁపు బశ్చిమతీరప్రాంతమున భూమధ్యరేఖకు దక్షిణమున ౧౦—౨౦ డిగ్రీల మధ్య ప్రారంభమై పశ్చిమముగ నడచి యట్లాంటిక్ మహాసముద్రము నధిగమించి దక్షిణయమెరికాయొక్క తూర్పుతీరమున బ్రెజిల్ దేశఁపుఁ గొనవద్దకు నఁగా భూమధ్యరేఖకు దక్షిణమున ౧౦ డిగ్రీలప్రదేశమునకుం జేరి, యటఁ జీలి యుత్తర దక్షిణములకు రెండుపాయలై జనును. అందు దక్షిణఁపుశాఖ దక్షిణ యమెరికాయొక్క తూర్పు తీరమునంటి కతిపయదూరమునం జనుచు దక్షిణముగఁ బ్రవహించుచుఁ గ్రమముగ దక్షిణధ్రువమునకుఁ జేరుకొనును.

ఉత్తరశాఖ వాయవ్యదిశకు మరలి పర్విడుచు భూమధ్యరేఖాప్రదేశముం దాఁటి యుత్తరగోళార్థమునకుం జేరి, ఈశాన్యదిశగా దక్షిణయమెరికాయొక్క యుత్తరఁపుభాగమునకు సమీపముననె జనుచు కారిబ్బియ న్సముద్రము [Caribbian sea] నం జేరి యాతీరమునకుం దగిలి యుత్తరముగఁ దిరిగి నడచి మెక్సికోసంయుక్తాగ్రగుడము [Gulf of mexico] లోనికిం జని యచటి యుత్తరతీరమునకుం దాఁకి కొంచెము తూర్పునకు మరలి నడచును.

అత్తటి క్యూబాద్వీపమునకును, ఫ్లోరిడాద్వీపకల్పమునకును నడుమగ నేగుచో జలములు వేడి యగును. అంతటినుండి warm gulf stream అనంబడి యాగ్నేయముగా నేఁబదియవ డిగ్రీప్రదేశముకడ కరఁగువఱకు డెబ్బదిడిగ్రీల 70° F. వేడి కలదియై రమారమి నూరుమైళ్ళ వెడలుపు గల ప్రవాహముగ విజృంభించి ౬౦౦ మొదలు ౧౨౦౦ అడుగులలోతుగల ప్రవాహముగఁ దనరి న్యూఫౌండ్లాండుతీరముల రాచుకొని పోవుచోఁ దూర్పునకు మరలి యట్లాంటిక్కు మహాసముద్రముం దాఁటి ౫౦—౬౦ డిగ్రీలనడుమగఁ జనుచు బ్రిటీషుద్వీపములతీరము నొరసికొని పోయి యవ్వలి కరగి యీశాన్యదిశకు మరలి ౭౦° డిగ్రీలవఱకట్లు జనుతఱి నార్వే దేశఁపుఁ బశ్చిమతీరప్రాంతముననే నడచి ముందుకుం జని యుత్తరధ్రువమున మృగ్య మగును.

ఇంక North Pacific Equtorial current ఫిలిప్పైన్‌దీవులకుఁ దూర్పుగను, న్యూగినియా కుత్తరముగను, పసిఫిక్ మహాసముద్రమున భూమధ్యరేఖాప్రదేశమునుండి యుత్తరమునఁ బది డిగ్రీల లోపుననే జనించి, యుత్తరముగ నడచుచు 30° మొదలు ౫౦° డిగ్రీలనడుమ జపాన్‌తీరమును నొఅసికొనుచుఁ జని, తనవేడిచే జపాన్ తీరములకు సమశీతోష్ణస్థితిం గల్గించి Kuro–Sivo యుత్తరధ్రువమువైపునకుం జని యట నంతరించును. ఈప్రవాహముల నోడలు నడుచుతఱి వెరచునంతటి వేగముఁ గల్గియుండెడిని.

**సముద్రపార, తీఁగ:**—లా. Convolvulus. spacions. ఇది పెద్దయాకులుగల తీఁగయనియు నాకులను నూరిగాని, యాముదమున వెచ్చఁజేసిగాని పైనకట్టిన గడ్డలు నెత్తఁబడి పగులుట, మానుట గల్గుననియుఁ జర్మరోగములు మానుననియుఁ జెప్పుదురు.

## సముద్రఁపుజబ్బు (Sea sickness):-

సముద్రఁపుప్రయాణము మొదలగు కొన్నిపనులు జబ్బుచేయుట.

కొందరు బండ్లలో నెక్కి ప్రయాణము చేయ వెఱతురు. కొందరు సవారీనెక్కి యేగ భయపడుదురు. పెక్కండ్రు సముద్రమున నోడ నెక్కిపోవుతఱిఁ గక్కుకొందురు. ఇట్టిజబ్బులకుఁ గారణము మనస్సునందలి యయిష్టముగాని, పిఱికితనముగాని యైయుండును.

మనస్సున కామోదము, ధైర్యము గల్గియున్నయెడల నెంతకష్టమయినను సరదాగానే పరిణమించును. ఓర్పునుగల్గియుండు మనసు గట్టిలేకుండినను, విధిలేక తా ననుభవింపవలసియున్నట్లు నిస్సహాయత, బెదురు తోఁచినను, తాను జబ్బుపడక తీరదను నిరాశ, నమ్మకము తోఁచును. తోడనే కడుపులోఁ ద్రిప్పుటగాని, తలనొప్పి, వికారము, తలదిమ్ము మొదలగు బాధలు కల్గును. ఒకవమనము సంభవించి కడుపులో నేమియు లేకుండిన నివి నివారణ మగును.

## పై రంగుల మార్పు:

సర్వసాధారణముగ నాకాశఁపురంగులు సముద్రఁపునీటిపైఁ బ్రసరించుచుండెడిని. రాత్రియం దాకాశము దట్టమైన మేఘచ్ఛన్నమగుతఱిఁ గల్గిన గాఢాంధకారమున సముద్రఁపునీటిపై నల్లరంగు గన్పించెడిని. ఇంక నాకాశము పగలు నిర్మేఘమై, యూదారంగుగా నుండునపుడు సముద్రఁపునీరును నూదారంగునే గల్గియుండును. లోఁతు లేనితావులందు సముద్రఁపునీటిపై సూర్యరశ్మి ప్రసరించి నీటిగుండా యడుగున కఱుగుతఱి వెలుతురు రంగులమార్పులంబట్టి సముద్రఁపునీ రాకుపచ్చగఁ గన్పించెడిని. ఇట్టిరంగు లనేకములు వెలుతురు ప్రసరించుట, సముద్రఁపులోతు, ఆకాశమునఁ దెల్లరంగు మేఘములుండుట కారణములుగ సముద్రఁపునీటిరంగు మాఱుచుండి కన్పించుచుండెడిని.

## సముద్రఁపునీటిమట్టముపై దూరఁపువస్తువులు కన్పించుయెత్తు:—

| మైళ్ళ దూరము | అడుగులు ఎత్తు |
|---|---|
| 1.31 | 1 |
| 2.96 | 5 |
| 3.24 | 6 |
| 3.39 | 7 |
| 3.73 | 8 |
| 3.96 | 9 |
| 4.18 | 10 |
| 5.92 | 20 |
| 6.61 | 25 |
| 7.25 | 30 |
| 7.83 | 35 |
| 8.37 | 40 |
| 8.87 | 45 |
| 9.35 | 50 |
| 10.25 | 60 |
| 13.23 | 100 |
| 16.22 | 150 feet |
| 18.72 | 200 ,, |
| 22.91 | 300 ,, |
| 29.58 | 500 ,, |
| 33.41 | 1000 ,, |

1 Mile దూరము 96.10 అడుగులయెత్తు.

## సముద్రఁపు నీటిమట్టము (sea level):—

సముద్రము పోటున కుబ్బుట, పాట

నందుఁ దగ్గియుంట సుప్రసిద్ధము గాన సముద్రపు నీటిమట్టముగ నొకమధ్యలెక్క నేర్పఱచుకొని యున్నారు. అట్టికొలత యింగ్లాండుదేశపు లివర్పూల్ పట్టణముకడఁ జూడనగును. ఇంకను వేర్వేఱుదేశములందునను గలదు. ఇంక సర్వసందర్భమున నిట్టిసముద్రపునీటిమట్టము కొలతనుండి యటనున్న యెత్తులు వివరించి యున్నారు. పర్వతాదుల యెత్తు పరిమాణముల నీ నీటిమట్టము లెక్కనుండి యే లెక్కించెదరు.

పోటుపాటులు సముద్ర మంతట నొకేతీరుఁ గలుగక, చంద్ర సూర్యసందర్భముల నాయా తావులందుఁ గల్గుచుండునని యెఱుంగునది.

## సముద్రపునీటియందలి రంగులు:-

సముద్రపునీటిమట్టమునఁ దేలుచుండున ట్లగుపడుచుండురం గాకాశపుఁబరిస్థితులనుండి కన్పట్టుచుండునది. అనఁగా నించుమిం చాకాశపురంగులే నీటియందుఁ గన్పించుచుండునని భావము. కొన్నితావుల నాకుపచ్చరం గగుపడుచుండును. ఇంకం గొన్నితావుల నూదానల్లరంగు గాననగును. వెల్గులేనిరాత్రులందు నల్లసిరావంటినల్పు గాననగును. ఇట్టిభేదము లనేకతావుల ననేకములున్నను నిజమున నీటియం దేరంగు నుండదు. సింహాలద్వీప సముద్రముల నీపద్ధతి యింకను విచిత్రమై చక్కఁగఁ గన్పట్టెడిని. ఆకాశమేఘములరంగు గూడ నీటియం దప్పటప్పటఁ గాననగుచుండును.

ఇంక నీటియందుఁ గాననగురంగులు లోతుననుసరించి యుండును. అవ్వియు వెలుతురుపై నాధారపడియుండెడిని. రంగులనిన నిట నింద్రధనుస్సు (rainbow) నందలి యెల్లరంగులు నని యెఱుంగునది. పరిశీలనలు సముద్రపునీటిమట్టము నుండి దిగువ ౧౫౦౦ అడుగులలోతుదనుక వెలుతురు ప్రసరించుననియు నెల్లనను 3000 అడుగులలోతునకు మించి దిగువను సూర్యునివెలుతురు పోఁజాలదనియుఁ దేల్చినవి.

ఈసందర్భమున స్విజర్లాండుదేశపు నైసర్గిక లక్షణ పరిశీలకుఁడగు (naturalist) Hermann Fol చిరస్మరణీయుఁడు. ఆయన నీస్పురము కడ తాను లోతునీటిలోనికి డైవింగ్ స్యూటుం ధరించి దిగి పరిశీలించి ముప్పదియడుగులలోతుననే యెఱ్ఱనిరంగువస్తువులు వెలుగునందు నల్లఁబడి గాన్పించునని తెల్పియున్నాఁడు. అనఁగా వెలుతురునందలి యెఱ్ఱనికిరణములు (red rays) అంత దూరము నీటిలోనికిం జొరఁజాలకుండునని యెఱుఁగునది. ౧౫౦౦ అడుగులలోతునుండి మందిసూర్యరశ్మి కల్గియుండిన యదనున నాంగ్లమున 'Violet' అనంబడురంగున చూడనగునని పరిశీలకు లనుచున్నారు. అంత కెక్కువలోతునందుఁ జేఁపలు సైత మచటిపరిస్థితులమేర కాంగ్లమున brown అనంబడు రంగునను, black (నలుపు) అనంబడు రంగునను గన్పట్టెడినట. ఇంకఁ గొందరు Violet black అనంబడు రంగునను గానఁబడునని యనుచున్నారు. ఎఱుపునకుఁజెందిన రంగులు కడకుఁ గన్పట్టి పిదప లోతున ననఁగా 3000 అడుగులలోతునుండి యసలే రంగు లుండకపోయెడిని. మఱియు నట వెలుఁగుఁ జొచ్చుకొనిపోఁజాలదు. అట్టియంధకారమునందుఁ జేఁపలశరీరములందున్న phosphorescent spots అనంబడు వెలుఁగిచ్చుమచ్చలు నక్షత్రములఁబోలి ప్రకాశమానములై గన్పట్టుచుండు నందురు. అట్టితావుల వసించుచేఁపలలోఁ గొన్నింటి కాంగ్లపరిశీలకులు 'midshipmen' అనిపేరిడిరఁట. నీటిమట్టమునుండి 3000 అడుగు లధికమగులోతునకు ultra-

violet rays పోఁగల్గునని పెక్కండ్రు తలంచుటయుఁ గలదు.

## సముద్రపు నీటి రంగులు:—

సముద్రపునీటిరంగు నీలియూదాయని చెప్పఁబడుచున్నది. రాత్రియందు సముద్రము నల్లరంగుగఁ గన్పట్టెడిని. వెన్నెలరాత్రులందు సముద్రము నల్లరంగుగఁ గన్పట్టెడిని. వెన్నెలరాత్రులందు సముద్రమునల్పిన వెండితళుకుంబోలి చంద్రికలు ప్రతిబింబించెడిని. ముఖ్యముగ నాకాశపురంగు సముద్రమునం దద్దమునందువలె తననిజచ్ఛాయను ప్రతిభవింపఁజేయును. గాన నాకాశము రంగే సముద్రమునఁ బ్రధానవర్ణము.

ఇంకను బెక్కుకారణములు సముద్రపు నీటి రంగులకు మార్పుఁజెందించెడిని. నదులు సముద్రముం జేరుప్రాంతముల వర్షకాలమున బురదగలిసినరంగు గన్పట్టును. సముద్రమునఁగల గడ్డిగాదల మొక్కలు, చచ్చిపడియున్న జంతుదోషములు, జీవించియున్న చేఁపలతండములు నాకాశమునందలి తెల్లని యెఱ్ఱని పసుపుపచ్చని నల్లనిరంగులుగల మేఘములు, నివియన్నియుసముద్రపురంగునందుఁ గొద్దిగనో, గొప్పగనో బాధ్యతగల్గియే యున్నవి. సముద్రముయొక్క వివిధభాగములయందు లోతు మెరకలును సముద్రపురంగును మార్పఁ గారణములగును.

## సముద్రపునీ రుప్పగానుండుట:—

ప్రతిసంవత్సరము నదులు జలములం గొనితెచ్చి సముద్రమునఁ జేర్చుచుండును. నదులు ప్రవహించి మార్గమంతయు నది కోసుకొని ప్రవహించుటయు, నాకోతకు పోయిన మట్టిలోప మెత్తగుపర్వతముల భాగములందుఁ దా జనించినతావునుండి సమతలమగుపల్లపుఁ బ్రదేశమున సముద్రపుదరికిం జేరువరకు మెరకలనుండి కోసుకొని తెచ్చినమన్ను పల్లముల నింపుటయుఁ జూడఁగలము.

ఇందు భూమిలో ననేకరకముల పదార్థములు గలవు. అందులోఁ జాలభాగము ఉప్పున్ను కలదు. నది కరగించి తోడ్కొనిజనిన మంటిలోనియుప్పునీటం గలియును. ఏలయన నుప్పున కుదకమునందాఁ గలియుశక్తియే గాక యావిరిరూపముననున్న నీటింగూడ తనవైపున కాకర్షించుకొను శక్తి గలదు. అట్లు తనయందుఁ గలసియున్నయుప్పును నదులు గొంపోయి సముద్రమునఁ జేర్చుచుండును. సృష్ట్యాదినుండియు నిట్లే జరుగుచున్నది. ఉప్పును గొనుచు నదులు ప్రవహించుతరియును సముద్రముఁ జేరినపిదపనుగూడ ననుదినమునను సూర్యరశ్మి కావిరి యగాముఁ జాలనీ రాకసమున కెగిరిపోవుచునేయుండినను నుప్పుమాత్రము సముద్రముననే నిలచియుండును.

ఏఁటేట సముద్రమునం దెంతనీరు జేరుచుండునో యంతనీరు నావిరియై యాకసమున కేగుచుండును గాన నేఁటేట నదులు గొనివచ్చునుప్పు సముద్రమున నిలుచుచున్నదనియు, దానిని వదలి నీరుమాత్రము తిరిగి మరుచటిసంవత్సరము మరి యంతయుప్పుం గొనితెచ్చుట కావిరియై మేఘములై యాకసమున కేగుచుండును. ఇట్టుల సముద్ర ముప్పునకు నిలయము.

నదులు కలియునట్టి తావులును కలిసియుప్పునీరున్నప్రదేశములనుండి కడుదూరమున నుండునట్టియు సూర్యరశ్మి కంటి నీ రావిరియై యాకసమునకేగుపరిస్థితులు లేనితావులగు నుత్తర దక్షిణ ధ్రువములు (North & South poles) కడ సముద్రపునీరు రమారమి తియ్యగానేయుండును. ఎండలు తీక్ష్ణముగఁ గాయుతావులనే నీరెక్కువ యుప్పగుట.

**సముద్రపునీ రుప్పును గల్గియుం డుట:—** నదులు జన్మస్థానమునుండి సముద్రముం జేరువఱకుఁ బ్రవహించుటయందు దారిపొడవునను మన్ను గరగించుచుఁ గొంపోయి నడుమ నడుమ లంకలం జేర్చుటయ గాక నదీముఖద్వారమున నొకపెద్దలంకం [delta] బెంచుచు దాని గుండా తాను సముద్రపునీటితోఁ గలసిపోవునని యెల్లరెఱింగినదే. అట్లు పోవుచో భూమియందలి యనేకములగు నుప్పులు నదీజలంబులఁ గరఁగిపోయి చనిచని సముద్రమునందుఁ జేరుచుండును. వేసవియెండలు సముద్రమునుండి యొక్కజలము నావిరిగఁ బీల్చివేయుంగాని యందుఁ జేరియున్న యిట్టి యుప్పు నట్లే సముద్రమున వదలివేయుచుంట నవి యందే నిల్వయగుచు లెక్కింప నశక్యమైనవత్సరముల యుప్పుకూడికయై సముద్రజలముల నుప్పగనుండున ట్లొనర్చెను.

ఉత్తర దక్షిణధ్రువప్రదేశముల సముద్రములింతయుప్పగ నుండుటలేదు. ఏలనన సూర్యరశ్మి యింతగ నట జలములం బీల్చ బలముగల్గినది కాకుంటయు నందుఁ జేరునదు లంతగా లేకుంటయుఁ గారణములు. పాలస్తినాదేశపు డెడ్సీ (dead sea) జలములం దు ప్పధికము. ఏలయన నందులోని జార్డనునదియు నితరప్రవాహములును, తమజలములతో నుప్పుం జేర్చుచుంటయు నాసముద్రోదకము లితరతావులసముద్రోదకములందు కన్న వేఁడిగల సూర్యరశ్మికధికముగ గుఱియగుచుఁ బీల్చఁబడుచుంటయు, డెడ్సీ యితరసముద్రములతో సంబంధములేక నొకపల్లపుఁ బ్రదేశమున నిల్వయైన జలమువలెనుంటయు, నందు జేరినలవణము లందే యధికముగ నిల్వయై శరీర మందు మునుగుటకుంగూడ వీలుగాక తేలఁగొట్టునంతటి యుప్పగానుండనైనది. శాస్త్రవేత్త లీడెడ్సీ కొంత కాలమున కిటుల నీరంతయు నావిరిగనై వట్టిపల్లముగ బయల్పడి యుప్పుకుప్పలం బ్రదర్శించుచుతావగునను చున్నారు.

**సముద్రపుఁబండు చెట్టు:—** దీనిం గూర్చి సరిగాఁ దెలియదు. సముద్రఫల మంగడులందుఁ జిక్కునుగాని, దానిపూర్వచరిత్ర తెలియరాకున్నది. లాటిన్భాషయందు Argyria spoecia అనియు. నాంగ్లమున sea fruit అనియు, సంస్కృతమున సముద్రఫలః యనియుం బేర్లు. (పెద్దనిమ్మకాయంత యుండును.)

దీనిచూర్ణము పీనసరోగముల నివారించునుగాన ముక్కులోనికిం బీల్తురనియు నందురు.

**సముద్రపుఁబ్రవాహములు:—**
(డ్రిఫ్టు చూడుఁడు.)

**సముద్రపుఁబోటు, పాటు:—** భూమి తన మధ్యభాగమునకుఁ బ్రతివస్తువు నాకర్షించుటను 'గ్రావిటేషన్ పుల్' అనెదరు. భూమియు, సూర్యుఁడు, చంద్రుఁడు, పదార్థములు (mass) గ నాంగ్లరసాయనశాస్త్రమునఁ బేరిడఁబడినది. ఇట్టి (mass) పదార్థములు తమదెస కట్లే ఇతరముల నాకర్షించుకొనుచుండుశక్తిఁ గల్గినవి. భూమియందలి సముద్రజలములును భూమితోఁబాటివే. భూమియొక్కయు, సూర్యచంద్రులయొక్కయు నాకర్షణల నందుచున్నవియే. చంద్రుఁడు భూమికి సమీపముగనుండు గొప్ప గోళముగాన చంద్రగోళముయొక్క యాకర్షణ, అనఁగాఁ దిరుగుదలలోఁ జంద్రగోళము కెదురుగానుండు భూమియొక్క భాగమునందున్న సముద్రపునీరు చంద్రుని యాకర్షణమువలన పైకి లాగఁబడి యుబుకును. అత్తరి సరిగా నాకర్షణ నందలి

ప్రక్కభాగములనుండి నీరు అట కరుదెంచును. ఎత్తుగ నీ రుబికినతావుల నది పోట (tide) నెద రు. ప్రక్కనుండి నీ రరుదెంచ నట పల్లమైనతావుల పోటనెదరు. ఈపోటుపాటులు హార్బరుగోడపై నెక్కి పరిశీలించినవారికి నీ రుబుకుట, తగ్గిపోవుట చక్కగ తెలియ నయ్యెడిని.

భూమి తానై గిరగిరఁ దిరుగుచుండుటయు, పోటుపాటులందుఁ గొంతపనిజేయుట కలదు. కాని ప్రధానకార్యము చంద్రునియాకర్షణమె. సూర్యు నియాకర్షణయు సముద్రజలముల నాకర్షించుచు, పోటుపాటులం గల్గించుచుండుంగాని కడుదూర మందున్న సూర్యునియాకర్షణ చాలాతక్కువపనిం జేయును.

అది తెలియంబడనంత తక్కువగా నుండుం గాని తెలియుటకు వలయుసాధనములు లేకపో లేను. పౌర్ణములందు సూర్యచంద్రు లిర్వురు భూమి కిరుదెసలం దుండుటయు నామావాస్యలం దు సూర్యచంద్రు లిర్వు రొకేదెసనుంటయు సంభ వించుంగాన నమావాస్యలం దిర్వురియాకర్షణలు బలపడి నధికపర్చుచుండును.

పోటుపాటులు భూమియొక్క యాకర్షణశక్తి యగు గ్రావిటేషన్‌పుల్‌ను, చంద్రునియొక్క యాకర్షణశక్తియగు గ్రావిటేషన్‌పుల్ యెదిరించి యాకర్షించుటయని వేరుగఁ జెప్పనక్కరలేదు.

## సముద్రపులోతుభాగములు:—

భూమిపై పర్వతములు, ఐదుమైళ్ళకన్న నెత్తుండవు గాని సముద్రమున లోతుభాగము లేడున్నరకన్న నధికమగులోతుంగూడ నుండునవికలవని భూగోళ శాస్త్రజ్ఞులలో నొకడుక్తి కలదు. అంట్లాంటిక్ మహాసముద్రపు దక్షిణభాగమున మధ్యగా నేడు న్నరమైళ్ళకన్న నధికలోతుగలప్రదేశమున్నదనియు, పశ్చిమశెంటిహెలినా మైదమ్ముమ్మప్రాతికమైళ్ళలో తనియు చెప్పంబడినది. ఇంకను పసిఫిక్కుమహా సముద్రమందుకూడ నిట్టిప్రదేశములు కలవట. వీటియందు విచిత్రాకారమత్స్యము లుండునట. అవి సముద్రపునీటిభారాధిక్యతను భరింపఁగలవట. కాని పసిఫిక్కుమహాసముద్రపు లోతుప్రదేశ ములు సరిగాఁ బరిశీలింపఁబనిలే దందురు.

## సముద్రపుహోరు (Roaring of the sea):—

ఇది యొకధ్వనికాదు. సముద్ర మున నేర్పడిన వేర్వేఱుయలలు తిరుగఁ బడు చుంట గల్గుధ్వనులసముదాయము. వేర్వేరు ధ్వని యలలుగ గాలియందేర్పడినను రానురాను, అవి కలసి వ్యాపుచు నొకధ్వనిగనే యించుకదూరమున నున్నవారిచెవులకుం జేరుటను సముద్రపుహో రనెదరు. నీటియందు మున్గియున్న కర్ణేంద్రియ ముల కీహోరు నీటిగుండా చేరవలసియుండును. దరి కరగి చూచితిమేని ఏయల కల్గించినధ్వని యాప్రత్యేకశబ్దములుగ మనకర్ణేంద్రియములకుం జేరనగుచుంట తెలిసెడిని. గొప్పగొప్పతరంగములు విరిగిపడుతరి గల్గుధ్వనియు గొప్పదిగనే యుండి యధికబలముతో వాయువునందు శబ్దతరంగములం గల్గించెడిని. అట్టితరి హోరుమధ్యమున గొప్ప పేలుడు శబ్దమువలె నది యించుక దూరమున విన్పించెడిని.

## సముద్రఫేనము లేక సముద్రపు నురుగు:—

ఇది నిజమగు సముద్రపునురుగు గాదు. ఆంగ్లమున Shark's dung అని యం దురు. Ossepiae cuttle bone అనియు నందురు. సంస్కృతమున డిండీరః - ఫేనః - సము ద్రఫేనః అని పేర్లు కలవు.

సముద్రఫేనమునందు మిక్కిలి వాచాళుత్వ మిచ్చుగుణమును, కండ్లలోనిపువ్వులు, దుర్మాంసపుఁగండలు మొదలగునేత్రరోగముల నివారించు గుణమును, కడుపులోనిబల్లలు, మూలవ్యాధుల నడంచుగుణమును, శూలల నడంచు గుణమును కలదందురు.

**సముద్రభాగములు:—** Sea Portions సముద్రము - జలము - దానిభాగములు.

విస్తారఁపుఁబరిమితిగల యుప్పునీటిజలప్రదేశములకు Occan (మహాసముద్రము) అని పేరు. సముద్రపుఁనీ రుప్పగనే యుండును. మహాసముద్రమునందలి భాగములకు Sea (సముద్రము) అని సాధారణముగ నందురు.

అన్నివైపులను భూమిచేఁ జుట్టఁబడిన విస్తారఁపు జలభాగమునకు lake (సరస్సు) అనిపేరు. సరస్సు లుప్పునీటివి, తీయనినీటివిగూడ నుండును. సముద్రఁపునీటి సరస్సునకు 'lagoon' అనిపేరు.

కొంచెము హెచ్చుతక్కువగ నన్నివైపుల భూమిచేఁ జుట్టఁబడిన సముద్రమునకు 'Gulf' (సంయుక్తాగ్రగుడము) అనిపేరు. విస్తారఁపువెడలుపున భూమిలోనికిఁ జొచ్చికొనియున్న సముద్ర భాగమునకు Bay (వియుక్తాగ్రగుడము) అని పేరు. భూమిలోనికిం జొచ్చుకొనిపోవు సన్నని పొడవుగల సముద్రభాగమునకు 'Creek' అని పేరు. ఇవికొండవెడలుపున వంకరలు తిరుగుచు భూమిలోనికిఁ గడుదూరము వ్యాపించుజలభాగములకు నార్వేస్వీడను దేశములందు Fiord లేక Fijord అనివాడెదరు. తీరములందు సముద్రఁపుటోడ లలజడిలేక సౌఖ్యమున నిలచి తాము గొని తెచ్చిన సరకులను దరికిఁజేర్చుటకు వీలుగల్గిన సముద్రతీర జలభాగములకు 'Horbour' అనియు నాతీరభూప్రదేశమునకు 'Port' అనియుఁ బేరులు. ఓడలు క్షేమముగా నిలువఁదగిన ప్రదేశమునకు Road అనియు, Roadstead అనియు వాడుక గలదు. మఱియు లోతులేని (మెరక) నీటిభాగమునకు Shoal అని యనియెదరు.

తియ్యనినీటిచే నావరింపఁబడియు లోతులేని (జలభాగమునకు) Swamp (తంపల- ఆవ) అని పేరు. పెద్దవగు రెండు సముద్రభాగములనుగల్పు సన్నని జలభాగమునకు 'Strait' లేక 'Sound' అనిపేరు. రెండుసముద్రభాగముల నడుమఁగల Strait విస్తారముగ పొడవుగలది యగునేని దానికి Channel అని వాడుదురు. జలప్రవాహములు నదులంగూర్చి వేరుగ వివరింపఁబడినది. (చూడుఁడు).

**సముద్ర మల్లకల్లోలమై యపాయకరముగ నుండుతరి నూనెఁబోసి శాంతపఱచి యోడల కపాయము గలుగకుండ రక్షించుట:—** తుపానులు, సుడిగాలులు, ప్రచండవాయువులు మొదలగుకారణముల వలన సముద్రోదకము లల్లకల్లోలమై యెడుచు నోడల కపాయమగుతరి పొగయోడలయందు భద్రపఱచియుంచుకొనిన నూనెపీపాలను తెరచి నలుదెసల నూనెం జల్లుదురు. తోడనే సముద్రోదకము లాప్రాంతమున శాంతపడును. ఓడయు సౌఖ్యముగ నిలచును.

ఉదకకణము లొకటి కొకటి హత్తుకొనుగుణము గలవి. దీనికి 'State of Teusion' అందురు. ఇంక తైలకణముల కీగుణముండియు దీని కన్న నధికమగు మఱియొకగుణము కలదు. తైలమునందుఁగలజిడ్డు బంకతోనంటించినట్లు కణముల

నన్నింటిని బలముగ నంటించి పట్టియుండును. ఈబలము నీటియం దుండదు.

ఇట్లుండ నీటికన్న నూనెలు తేలికవగుట పైc దేలును గాని నీటిలో మునుcగవు. గాన నల్లకల్లోలమగు నీటిపై వ్రాcకి వ్యాపించుచోc బలుచని యొకపొరవలె నీటి నడcచిపట్టునట్లు శాంతింపcజేయును. ఈరహస్య మెఱిcగినపిదప నిక్కాలమునc బ్రతిపొగయోడయుc గొంతనూనెను పీపాలంdu నింపుకొని యెల్లప్పుడుc గొనిపోవుచునే యుండును. మఱియు నవసరమగుతఱి పై విధమున నుపయోగించుకొనియెడిని.

## సముద్రమునందు కేబిలు తెగిపోయిన నాతావుం బోల్చుట:—

గొప్ప గొప్పసముద్రముల కీద్దరి యద్దరులకు రాగితీగెను నీటియందుc బడవైచి యిటునటు తంతివార్తలను నడుపుదురు. ఆతీగెలను 'Cables' అని యాంగ్లమున పేరు. అట్టియేర్పా టైర్లాండునుండి యమెరికాసంయుక్తరాష్ట్రములకు, కనడాదేశమునకుc జేయcబడి యట్లాంటిక్కుమహాసముద్రము యొక్క రెండుతీరములకుc దంతివార్తలు నడుచుచుంట యెల్లరెఱిcగినదే.

ఈకేబిలుతీగ యేప్రమాదవశముననైనను తెగి పని యాcగిపోయినతఱి నిరుతీరముల పండితోద్యోగు లింతదూరమునc దెగిపోయిన దైలెంగి యటకు మరమ్మత్తుచేసి రెంటింగలుప నోడలలో మనుష్యులం బంపుచుందురు. దీనిదూరము నెఱుంగుట వింత యనిపించెడిని.

అట్టితీగెలందు గజమున కింతయెక్కుమేరకు విద్యుచ్ఛక్తి ప్రసరించునని లెక్కకలదు. గాన నెంతవిద్యుచ్ఛక్తి యా తెగిపోయినతావునకుc బట్టుట లెక్కింపcబడుచుండునో దానింబట్టి యాదూరము నెఱుంగ వీలయ్యెడిని.

## సముద్రమున తీయని (మంచి) నీరు దొరకుతావులు:—

సముద్రమునలభించునది యుప్పునీరని యెల్లరెఱింగినదే గాన లవణసముద్రమున మంచినీరు దొరుకుతావులంగూర్చి యిప్పుడు విచారించుట ధ్రువములు మొదలగు తావుల సముద్రcపునీ రంతయుప్పగానుండదు గాని యది తీయని (మంచి) నీరన వీలుండదు.

గొప్పగొప్పనదులు సముద్రమున సంగమించు తావుల కెదురుగ సముద్రమున మంచినీరు లభించుచుండుట విచిత్రమనిపించకపోదు. నదులుతెచ్చిన తీయనీరు సముద్రcపునీటిపై నొకకొంతదళసరిగల పొరగా నేర్పడి యదుగునుండి యుప్పునీటితోc గలియుచుండుంగాని మంచినీ రదేపనిగ వచ్చుచుంట నట్టితావులందు మంచినీ రెల్లప్పుడు లభించుచునేయుండును. ప్రపంచమున గొప్పనది యనంబడు 'ఏమజాను' నదినుండి సముద్రమునcజేరుచుండు మంచినీరు సెకెండుకాలమునందుc బదిలక్షల ఘనcపుటడుగులని (a millian cubicfeet) యంచనాగా లెక్కింపcబడి తీరమునుండి రెండువందలమైళ్ళదనుక వ్యాపించుటc గన్గొనcబడియున్నది. అది దాహోదకముగనే యుండెడినట. దీనింగూర్చి యొకచిత్రమైనకథ నావికులంచుc బఱిపొపు యున్నది. కొంతకాలముక్రిందట నొకయోడ ఏమజానునదీముఖద్వారము కెదురుగ నిరువదిమైళ్ళ దూరమున దాహోదకము లేక దాహపీడితులమై చనిపోవుచున్నారమని జండాలసిగ్నలు చేయుచుండెనట. దానింగాంచిన వేఱొకయోడ యించుక దూరమునుండిజనుచు సముద్రపునీటిం దోడుకొని త్రాగుcడని జండాసిగ్నల్లుతోc బ్రత్యుత్తరమీయ

నా దాహాతురులు మొదట హేళనయేమో యని సంశయించి తిరుగతిరుగ నాప్రత్యుత్తమేరా నెట్ట కేల కట్లొనర్చి తీయనిజలములం ద్రావి సలహాకుం గృతజ్ఞులైరంట. నేఁటికిని గొన్నియోడ లట్టితావుల నుండి నీరుగైకొనుచుండునంట.

ఆస్ట్రేలియాఖండఁపుఁ దూర్పుతీరమునఁ గొన్ని తావుల సముద్రతీరములఁ దీయనినీరు సముద్రము లందే దొరకుచున్నది. దానిని నావికులు తోడు కొనుచు నోడలందు నింపుకొనుచున్నారు. ఈవిచి త్రమునకుఁ గారణముఁ గన్గొనఁ బెక్కుపరిశీలనలు జరిపిరి. ఆఖండమునఁ దూర్పువైపు విస్తారభాగము భూమట్టమునుండి కొన్నివందలయడుగులలోతున గొప్పరాతిచట్టు చట్టావలె నున్నదంట. మఱియు నిచటిభూమి గట్టిపడనిదిగ నుండి యేటేటఁ గురియు వర్షములజల మింకిపోవుచు నడుగురాతిచట్టాకుఁ జేరి సముద్రఁపుఁదెస వేర్వేరుపల్లములందుఁబడి ప్రవహింప మొదలిడి సాగరసంగమమునంది తక్కు వ యొత్తిడియు దట్టమును (lesser density than sea water) గల్గియుండుకతన సముద్రపు నీటిపై దేలి యుపరిభాగమునఁ గొన్నియడుగుల దళసరిగల మంచినీటిపొరగా నేర్పడుచుండునంట. అడుగునుండి మంచినీరదేపనిగ వచ్చుచుంట నత్తా వెప్పుడును మంచినీటిని గల్గియుండ నోడలట కరిగి దాహోదకములం గైకొనుచుండునంట. ఇట్టి పరిస్థితియేగల South sea islands నందు మంచి నీటికి lesser density than sea water గానందున సముద్రమునం గలసినతోడనే యుప్పు నీరుగనై పోవుచుండుకతన నచటివారు నీటమున్గి యానపకాయతుంబలతో గట్టిగ మూతవైచి మంచినీటిం బయటికిం దెచ్చుకొనుచున్నారు.



**సముద్రమున నొకప్పుడు గన్పించు నూదారంగు:**— దీనికిఁ గారణము 'Phosphorescence' అనుచున్నారు. సముద్రము నందు గన్పించురంగు గాకాశఁపురంగు ప్రతిఫలించుటయే యైనను ఫోస్ఫరసును గాలికిఁగాని ఆక్సిజెను కుఁగాని తెరచియుంచిన జరుగుపని యొక్కటిగనే యుండుంగాన నొక్కొకతరి నట్లేజరుగుచుఁ గన్పట్టుచుండెడిని.

సముద్రఁపునీట 'ఫోస్ఫరస్'ఉండు కొన్నిసాల్ట్సు ఉండినను అసలు ఫోస్ఫరస్ ఉండదు. గాని దాని యందుండు matter దీనింగల్గింప slow burning oxidation జరుగుచుంటయే యిట్టిదృశ్యమునకుఁ గారణము. ఇది సముద్రఁపునీటియందుఁ గరఁగియున్న ఆక్సిజెనుచే oxiadise చేయం బడుట నిట్లగుపడుట సంభవించెడిని.

**సముద్రము, పోటుపాటు:**—సర్వసాధారణముగ సముద్రమునందలి నీ రెక్కువగుట పోటనియు, నీరుతక్కువయగుట పాటనియు నిది చంద్రునితో సంబంధముగలది యనియు నాది కాలమునుండియు భరతదేశమున నెఱింగియే యున్నారు. ఇందింకను రహస్యములు గలవు. ఈ పోటుపాటు (Elb and Tides) లొక్కచంద్రునితోనే గాక సూర్యునితోడను నెత్తుగుపర్వతములతోడను నెత్తుగనుండు పెద్దపెద్దపీఠభూములతోఁ గూడ సంబంధముగల్గి వానివలన నీరాకర్షింపఁ బడుటవలన నీరు పొంగుటంజేసి కలుగుచున్నవి గాన నాకర్షణశక్తింగూర్చి యెఱుంగు టత్యావసరము.

ప్రపంచమున ఘనపదార్థము లన్నియు (Solids) నొకటి నొకటి యాకర్షించుకొనుచునే యున్నవి. ఎత్తుగుపదార్థము లెక్కువదూరము

వఱకుఁ దమయాకర్షణశక్తిని వ్యాపింపఁజేయఁగలవు. ఇట్లయ్యును బ్రితి [solid] పదార్థమును భూమియొక్క యాకర్షణకు లోబడియుంట బరువై కదలక భూమిపై పునకుం జేరి భూమి నంటిపెట్టుకొని (భూమి నానుకొని) యుండెడిని. ఉదకము ద్రవపదార్థమగుట (liquid) నాకర్షణశక్తి బలమగుతఱి తనయందు గట్టిలేమి (loose) నాకర్షణకు లొంగి యొకచోటఁ జేరుకొని లొంగి తన మితిం (usual level) దాటి పొంగును. అట్లు సముద్రమునందు సంభవించినదానికి పోటందురు (Tide).

రెండేసిపౌనులబరువుగల రెండినుపగుండ్లు నొకటికొకటి తగులుచు దగ్గరగనుండునట్లు వ్రేలాడఁజేతుమేని యీరెండు నన్యోన్య మాకర్షించుకొనుచునే యుండును. కాని యెక్కువబలముగల యాకర్షణశక్తితో రెంటింగూడ తనపై పాకర్షించుకొనుచుంటంజేసి బరువుగలవిగనగుచు భూమిపై పున కేగుప్రయత్నములో నుండియు తమ్ము మోయుచు బంధించియున్న త్రాటిం దెంచుకొని పోలేక అట్లేనిలచియున్నను వానినంటియున్న యన్యోన్యమగు నాకర్షణశక్తి బలముచాలనిదియై వ్యాపించి యట్లే నిలచియుండెడిని. ఆ రెంటికినిమధ్యగల శక్తిని $2 \times 2=4$ గా మనము లెక్కింపనగును. భూమి వీనినాకర్షించుకొనుశక్తి నాల్గింటిశక్తికన్నఁ జాల నధికముగాన దానికి వ్యతిరేకముగ నిది యేమియుం జేయఁజాలదు. ఇంకను ముఖ్యమగునది యేమన రెండుగుండ్లును ఘన [solid] పదార్థముగాన నందు వసులుగానుండునదేదియు నుండమి నాకర్షణశక్తివలనఁ బైకిలాగఁబడుటకు వీలగునదేదియు నందుండదు.

ఇంక నీరెండుగుండ్లును మూడేసిపౌనులబరువుగలవి యగునేని యాకర్షణశక్తి $3 \times 3=9$ అని స్పష్టమగుచునేయున్నది. వీనిని గొంతదూరముగ నుండునట్లుఁ జేతుమేని $3 \times 3=9 \div \frac{1}{2} \div \frac{1}{2}=2\frac{1}{4}$ మధ్యనుండుశక్తు లొకటినొకటి కలియుతావున $2\frac{1}{4}$ మాత్రమే యుండెడిని. ఏలయన దూరము దీనినుండి యొకసగమును, దానినుండి యొకసగమును తగ్గించుటంజేసి దగ్గరనేయుండునంత యాకర్షణశక్తియుండక దూరమగుకొలఁదిని క్షీణించి రెండుశక్తులుఁ గలియువఱకు రెండుంబాతిక శక్తి మాత్రమే నిలచెడిని. మఱియు నాదూరము నినుమడింపఁజేసి మఱియు నంతదూరమున నుంతుమేని యింకను తగ్గిపోయి $3 \times 3=9 \div \frac{1}{2} \div \frac{1}{2}=2\frac{1}{4} \div \frac{1}{2}=1\frac{1}{8}$ శక్తియే కలియును. ఇట్లు దూరము హెచ్చగుచుండుకొలఁది నాకర్షణశక్తి క్షీణించుచుండుటయు, నాకర్షించువస్తువులు పెద్దవగుకొలఁది నాకర్షణశక్తి యెక్కువగుచుండుటయు దీని పద్ధతియని మనస్సునం దుంచుకొనవలయును. ఈయాకర్షణశక్తికి 'Universal Gravitation' అని పేరిడియున్నారు. హిమవత్పర్వతములు, టిబెట్టుదేశఁపు పీఠభూమియు, నరేబియాసముద్రము (Aarabian sea) ను నిట్లాకర్షించుచు మూఁడువందలపరిమితి బలముగల యాకర్షణశక్తిచే నాకర్షించుచున్నవని లెక్కింపఁబడియున్నది. ఇట్లే దక్షిణమెరికాఖండమునఁ బశ్చిమదిశపొడవున హారన్ అగ్రము (cape Horn) మొదలు ఉత్తరఁపుఁగొనను పనామా [Panama] వరకును సముద్రతీరమున వ్యాపించియుండు మహాపర్వతపంక్తి యగు ఏండీస్ పర్వతసముదాయ [Andes mountain range] మంతయు నంతకన్న నెక్కుడుగనే పశిఫిక్ మహాసముద్రమందలి యుదకముల నాకర్షించుచున్నవని కనిపెట్టఁబడినది. మరియును భూమి సూర్యునియాకర్షణకు లోబడియుంటయుఁ జంద్రుడు భూమియాకర్షణకు లోబడియుండి భూమినుండి ౨, ౩౮, ౮౦౦ మైళ్ళదూరమునం

డున్న ౨,౧౬౦ మైళ్ళుచుట్టుకొలతగల గొప్ప ఘనపదార్థ (Solid matirial) గోళమగుట భూమియందలియుదకములను తనవైపునకాకర్షించుకొనఁగల్గుచున్నది. భూమికంటె సూర్యుని పరిమాణము ౧౩౮౦ వేలరెట్లధికమై యున్నది. చంద్రునిచుట్టుకొలత ౨౧౬౦ మైళ్ళని యంచనావేయబడియున్నది. భూమిచుట్టుకొలత ౨౪౮౯౦ మైళ్ళని యెరింగియె యున్నాము. ఇంక వీని యాకర్షణశక్తులంగూర్చి యోచింతము. భూమినుండి సూర్యుఁడు ౯౩౦ లక్షల మైళ్ళదూరమునందుండుటయు చంద్రుడు భూమినుండి యుండుదూరమును లెక్కించిన సూర్యునిదూరమున చంద్రుడున్నదూరమున $\frac{1}{23250}$ అని గానవచ్చెడిని గాని చంద్రుని యాకర్షణశక్తి సూర్యుని యాకర్షణశక్తి కన్న నెంత యెక్కుబలముగ భూమితోసంబంధించి యుండునో తెలియగలదు. దానింబట్టియె సూర్యునకుగాని చంద్రునకుగాని యెదురుగనుండు భూభాగమునందలి సముద్రజలములు పొంగి పోటెక్కుటయందుగల తారతమ్యములం గ్రహించవచ్చును. ఇవియన్నియు సముద్రపునీటినుబ్బించి పోటునకుం గారణములగుచున్నవి.

సూర్యునిదివస మిరువదినాల్గు గంటలగునట్లు చంద్రదివస మిరువదినాల్గుగంటల యేబదినాల్గు మినిట్లకాలమగును. కాన చంద్రు డాలస్యముగ నుదయాస్తమానములు రోజునకురోజు దోచుచుంటయెగాక కృష్ణపక్షమున క్షీణించియగుపడుచు యమావాస్యనాటి కసలేగన్పించకుండును. అనగా పగలు భూమికిని సూర్యునకును నడుమనుండితిరుగుచు కానరాకుండును. శుక్లపక్షమున నభివృద్ధినందుచున్న ట్లగుపడుచు రాత్రులందు దినానుగతముగ నెక్కువకాలము వెన్నెలంగాయుచు తుదకు పౌర్ణమినాటికి భూమినుండి సూర్యు డున్నదిశకు గాక యవ్వలిదెసం దిరుగుచుంట భూమి సూర్యునకును చంద్రునకును మధ్య నుండుట సంభవించెడిని.

అమావాస్యదినమున సూర్యచంద్రు లొకేదెస నుండి పగలు భూమినాకర్షించుటంజేసి సముద్రోదకములందు పగలు పోటెక్కువగ గల్గియుండును. వీని కాంగ్లమున Spring tides అందురు. పౌర్ణమియం దట్లుకాక నిరుదెసలను సూర్యునివైపు పగలు కొద్దిగను చంద్రునివైపు రాత్రి హెచ్చుగను పోటుగల్గియుంట నదియునుఁ గొంత పెద్దదనియె చెప్పవచ్చును. దీనిని Spring tide అందురు. moon's first and last quarters దినములందు వేర్వేరు దెసలనుండి యాకర్షణమున పో టంత యధికముగానుండదు. దాని కాంగ్లమున Neap tides అందురు. పోటు లేకుండుతరి పాటనంబడును. పాటన తగ్గియుండుటని యర్థము.

ఇటుల నాకర్షింపబడిన నీరుపొంగి పోటుకాలమునకుం బిదప నేమగునని యడుగవచ్చును. భూమియొక్క చలన (పర్విడుటయు) ముత్తర దక్షిణ ధృవముల కడ నీరు శీతలాధిక్యమున బరువై యడుగంటె సముద్రంపు టడుగుభాగముల లోతగుగండ్లలోబడి నదులవలె ప్రవహించుచుంట నావెలితియైన తావుల కీపోటు నీరు బర్విడును. అట్లు జనునపుడు భూమియు కొండలును నడ్డమగునేని స్థంభించి చాలయెత్తునకుపై కిలేచును. అట్టివిపరీతదృశ్యమొకటి Nova scotia కును నమెరికాతీరమునకును నడుమగల ఫండేవియుక్తా గ్రగుడము (Tnndey day) నందు డెబ్బది యడుగులయెత్తునకు నీరులేచుట గాననగును. గాని మధ్యధరాసముద్రము (meditarranian sea) వంటి భూపరివృత జలరాసులందు (Inland sea)

అంతగాగాదు. ఏలనన వానికిబహిర్మహాసముద్ర మంతగా సంబంధముండమి పోటుపాటుల జల ప్రవాహప్రభావములు దరిజేరకుండును. ఇంక వానిదెసలను గల్గు యాకర్షణలును బహుస్వల్పములగుట గానరాకుండెడిని.

సముద్రజలములందలిపోటు మహిమ ప్రక్కల నుండునదులలో కొన్నిటియందొక మార్పుగల్గించును. సముద్రమునకీ రెక్కవయాటనదిలోని నీటిని సముద్రములోనికిం బ్రవహించనీయక స్థంభింపజేయును. ఆనదీజలము లట్టితఱి సముద్రమువైపునకుఁ బ్రవహించుటమాని వెనుకకుమరలి ప్రవహించుటయుం గల్గును. ఇట్టిదృశ్యము కలకత్తానగరముకడ జూడనగును. హుగ్లీ నదియందలి జలములు సముద్రపుఁబోటువేళ దేశమువైపువెనుకకుఁబ్రవహించుటయు పాటువేళ సముద్రమువైపుఁ బ్రవహించుటయు గాననయ్యెడిని. కొన్నినదులందీపోటు నీ రెగదన్ని గొప్పధ్వనింజేయుచుఁ బర్విడును. దీనికి Bore అనిపేరు.

పోటుజలములకు సముద్రప్రవాహములతో (Occean currents) సంబంధముగలదు గాన వానియందు విస్తారము వివరింపంబడును. ఎస్ట్రోనోమీ శాస్త్రమున నమావాస్య, పౌర్ణములందు గల్గుపోటునకు Springtides అనియు, moon's first and lastquarters నందు Neap tides అనియు అమావాస్య moon's first quarters నడుమకాలమున గల్గువాటికి Prime అనియు moon's first quarter పౌర్ణముల నడుమ గల్గువాటికి lag tides అనియు పౌర్ణమి last quarter ల నడుమ గల్గువానికి prime tides అనియు last quarter and new moon అనియు పేళ్లు వాడియున్నారు.

## సముద్రములందున్న యుప్పు:—

కొందరు పరిశీలించి సముద్రజలముల నంచనావైచియందు 144 Billion tons of salt ఉప్పుండునని యంచనావైచియున్నారు. ఇదియే నిజమగునేనిసంద్రమందలి యుప్పును భూభాగమంతటను ౪౦౦ అడుగులయెత్తున బఱచనగునని యనుచున్నారు. ఇట్లేయొనర్చిన లండనునగరమందలి సెంటు పాల్సుదేవస్థాన ముప్పునందు మున్గియుండవలసియుండును. ఈలవణ మంతయు భూమిం గరఁగించి నదీజలములు సముద్రమునకుం జేర్చినదియే.

## సముద్రమైనా యీదవచ్చును గాని సంసార మీదుట దుస్తరము:—

(ఆంధ్రలోకోక్తి)

## సముద్ర విజ్ఞానము:—

ఇది యూరోపాఖండమువారికిని అమెరికా జపాన్ మొదలగు కొన్ని దేశములవారికిని జక్కఁగఁ దెలిసినవిజ్ఞానము. ఓడలు సముద్రమున నడచుతఱి నావికు లెఱుఁగవలసినకళ. భూమింగూర్చిన యిట్టికలకు "జియాలోజీ" యనెదరు. (జియాలోజీ చూడుఁడు). ఈశాస్త్రముమేరకు సృష్ట్యాదియందు భూమి చాలచిన్నదిగా నుండి చాల వేఁడిగల యగ్నిపిండమై యుండెననియు, నందు సముద్రములు నదులు లేకుండెననియు, దానింజుట్టి వాతావరణముగూడ లేకుండెననియుఁ జెప్పఁబడినది.

ఆభూమి రానురాను పెద్దదిగ నెదుగుచుండెను. ఎదిగినకొలఁది వేఁడితగ్గుచుఁ బైపొర చల్లబడుచుండె ననియు, దానితో దానింజుట్టి వాతావరణమేర్పడుచుండెననియు, నత్తఱిఁ జెట్లుచేమలు లేకుంట వాటికార్యమగు నాక్సిజెనుగాలి వాతావరణమున లేకుండెననియుఁ దలంపఁబడినది. భూమి పూర్తిగ నెదుగువఱకు దానివెలుపలిపొర (Litho

sphire) చల్లఁబడి స్థిమితము గలదయ్యెను. అదివఱ కది యుడుకుచున్నటుల కదలికఁగల్గి మెరకపల్లము లేర్పడుచుండి యందలి చులకనిప్రదేశము లెత్తుగనై భూఖండములుగను తక్కినగట్టి ప్రదేశములు పల్లములుగనై సముద్రములుగను నేర్పడియెను. భూమియొక్క లోపలిభాగము లిప్పటికిని కొద్దిగనో గొప్పగనో వేడిగనే యుండుట దీనికి సాదృశ్యమనియెదరు.

చల్లఁబడిన భూమిచుట్టును శీతలము జేరి సూర్యకిరణములవేడి కావిరియగుచు గాలిలోఁ దేలి మేఘములుగనై వర్షములు ప్రారంభమై నీరు పల్లములందుఁ జేరుచు రానురాను, నవియే సముద్రములుగ నేర్పడి మెరకప్రదేశములు భూఖండములుగ నిలచెను. అప్పటప్పట కొన్నిమార్పులు జరఁగుచుండినను నివి యేర్పడినవిధాన మిది యని జియాలోజీ కలావిశారదులు వివరించుచున్నారు. ఇఁక నీమతముం గూర్చి కొందఱి కభిప్రాయభేదము గలదు. వారు తొల్లింట భూమి జలమైయుండి రానురా నాజలములు తగ్గుచు భూమి బయల్పడెననియు, మిగిలినజలభాగములు సముద్రము లాయెననియు, జలములు భూమినుండియే యుద్భవించెననియు వివరించుచు నీటియూటలు భూగర్భమునందలి జలప్రవాహములను సాదృశ్యములుగఁ జూపుచుందురు.

ఏది యెట్లు జరిగినను వీరును వారునుగూడ భూగోళమును మూఁడు ముఖ్యభాగములుగ విభజించుచున్నారు. అందు మొదటిది భూభాగము. ఇది యెత్తుగనున్న భూప్రదేశమును భూఖండములకుం జెందినటుల సముద్రతీరప్రాంతములనేయున్న ద్వీపములును నై యున్నవి. ఇవి సముద్రమునందలి స్వతంత్రద్వీపములు కానేరవు. మరియు భూఖండములం జుట్టియున్న సముద్రములును నిందుఁ జేరును. రెండవది యేటవాలుప్రదేశములు, మూఁడవది సముద్రమునందలి లోఁతుభాగముల యడుగుప్రదేశము. దీనిని 'abyssal area' అనెదరు. ఇది యించుమించు పదికోట్ల చతురఁపుమైళ్లుండు నని యంచనా వేసియున్నారు.

ఇంక సముద్రముం గూర్చి యోచింతము. సముద్రమువలన నుపయోగము లనేకములు గలవు. ఇది యుష్ణప్రదేశములవేఁడిని శాంతింపఁజేయును. సముద్రప్రవాహములు ocean currents పరిసరదేశముల శీతోష్ణాధిక్యతం దగ్గించును. నదు లుప్పొంగి వెల్లువలై నతరిఁ గూడ వానిజలములం దాను భరించును. వర్షములఁ గల్గించు మేఘములగుటకు వలయు నీటియావిరి నొసంగును. అపరిశుభ్రతలఁ దా భరించి జగత్పరిశుభ్రతం గాపాడుచుండును. రాకపోకలకు వర్తకఁపుదినుసులనడపుటకు నోడలనుతనపైఁ దేల్చుచు దేశదేశములకు సంబంధములం గలిపి వర్తకము సాగించును. భూమిని నివాసార్హముగను వ్యవసాయార్హముగను నుంచును. గాలులు వీచుటకుఁబ్రారంభించుట సముద్రమునుండియే యని యెఱుంగుచున్నారు. జగత్తునందు నివసించుప్రాణులలో నధికసంఖ్యాకముగఁ జెప్పఁబడిన జలచరజంతువులు సముద్రమునందే వసించుచున్నవి.

ఇట్టి సముద్రమునందలిరంగులు వింతగొల్పకపోవు. తఱుచుగ నాకాశము సముద్రమునఁ బ్రతిఫలించునది యైనను నన్నియెడల నీధర్మము వర్తించుట లేదు. నీలియాదారంగే గాక నీలిమందు వంటిరంగుగూడ నొక్కొకతావున నాకాశమునందుండ నుత్తరధ్రువసముద్రములం దాకాశము నిర్మేఘమైన యదనునఁగూడ నచటిసముద్రమునం దాకాశపురంగే యుండదు. ఎక్కువపొడవుగల

గాజుగొట్టమునందు స్వచ్ఛమగునీరునింప నం దూ దారంగుధాతువు గన్పించెడిని. అపరిశుభ్రపదార్థము లెక్కువగ నీటియందుఁగలతావుల సముద్రి మాకుపచ్చధాతువుం గల్గియుండునటులఁ గన్పట్టును. పరిశుభ్రోదకప్రవాహమగు 'గల్ఫుస్ట్రీము' సదా నీలియూదారంగునే గల్గియుండును. చీనా దేశముకడనున్న యెల్లోసీ పసుపుగ గన్పించుటకు నదులనుండివచ్చిన పచ్చని బురదపరమాణువులు నీటం దేలుచుంటయే కారణమని తేలినది. ఎఱ్ఱని ధాతువుగల 'ఆల్గా' యనంబడు సముద్రపుగడ్డి మొక్కలతునుకలు తేలుచుంట రెడ్సీ యెర్రధాతువు నీటని గల్గియుండునని చెప్పఁబడినది. ఇంకను నుప్పు సముద్రమున నెక్కువగను తక్కువగను నుండుట నీటిరంగులమార్పులకుఁ గారణమని పరిశీలకు లనుచున్నారు.

సముద్రఁపునీరు కెరటములుగ విరిగిపడుతఱి చీఁకటియందుఁ దళతళ మెఱయుచుండు మిణుగురుతళుకులు మెఱయుచుండును. ఇవి జలచర జంతువులలోఁ గొన్నిటి దేహములందలి పొలుసులందుఁగల తళుకులై యవి చచ్చినపిదప వాని శరీరములనుండి వేరై, ముక్కలుగఁగూడ నయ్యు నీటియందుఁగలసిపోయి యటుల మెఱయుచుండు నవి నావలతెడ్డులకుఁ గూడ నంటి కన్పించుచుండుటయుఁ గలదు. వీనిని 'Phosphorecent Bactaria' యని యందురు. ఇట్టిజంతువులు సముద్రిమునం దపరిమితముగఁ గలవు. ఈమెఱయు పదార్థమును 'Luciferin' అనెదరు.

భూఖండములు, అందుముఖ్యముగ నెత్తగు పర్వతపంక్తులు, దరి సముద్రిపునీటి నాకర్షించునని చెప్పఁబడినది. దాని కాంగ్లమున 'Gravitation pull' అనినేరు. హిందూమహాసముద్రము మధ్య భాగముదనుక హిమవన్నగ మిట్లాకర్షించుచున్న దనియెదరు.

సముద్రిమునం దధికభాగము రెండువేలు మొదలు మూఁడువేలఫాతములవఱకు లోతుగల్గియుండునని చెప్పఁబడినది. Sir John murray పండితుఁడు సముద్రిపుఁబరిశీలనలను జక్కఁగ నొనర్చినమహనీయుఁడు. ఈయన మూఁడువేల ఫాతముల కెక్కువలోతుగల నీటిభాగములకు 'deeps' అనిపేరిడియున్నాఁడు. పశిఫిక్కు మహాసముద్రిమున వాయువ్యభాగమున 5269 ఫాతములలోతుగల Challenger deep అనునదియు మిండానావో కవ్వల 5348 ఫాతములలోతుగల Swire deep అనునదియు ప్రసిద్ధాగాధములుఁగ జెప్పఁబడినవి. రెండవదానియందు హిమవన్నగము నందలి గౌరీశంకర (ఎవరెస్టు) శిఖరము మునిఁగిపోయి పైగా ౩౦౮౭ అడుగులజల ముండునని యీయనయే యంచనాలెక్కం దెలిపియున్నాఁడు.

ఇట్టి యగాధజలములందు సూర్యకిరణముల వెలుతురైదువందలఫాతములలోతు దనుక బలహీనముగనైన జొరఁగల్గుంగాని, యంతకెక్కుడు లోతున చీకఁటిగనే యుండెడిని. ఇంకను నడిభాగఁపుజలములు oxygenate అగుచుంట కనేకకారణములు గలవు. అందు సూర్యకిరణ ప్రసారము ముఖ్యము గాన జలచరములు చీఁకటియందు నివసింపవని కొందఱు పరిశీలకులు తలంచుచున్నారు. మఱియు నగాధజలములలోనికి సూర్యకిరణములవేఁడి యిన్నూటయేఁబది ఫాతములవఱకుఁ జననోపుఁగానఁ దక్కిన క్రిందిభాగమంతయు శీతలముగనే యుండెడిని. మరోపరిశీలకుఁ డేఁడువందలఫాతములలోతు నీటియందు బెంపరేచరు ఫారన్హీటుతెర్మోమీటరు నలుబదిడిగ్రీల లోపునే

యుండుననియు, సముద్రమంతటను నెనుబది డిగ్రీ లుండుననియు వివరించియున్నాఁడు. ఎటులనైనను బెక్కండ్రు నీరు ఘనీభవించుట కించుక తక్కువగ నగాధములయందు శీతలముండునని తలంచుచున్నారు.

ఆయగాధజలముల పై భాగఁపు పెంపరేచరునం దొకచిత్రము గమనింపఁదగినది కలదు. వేఁడి యెక్కువగుటతో నీటియావిరియు నధికముగ లేచుచు పెంపరేచ రతిత్వరితముగ లేవకుండ నాపుటయు, శీతల మెక్కువగుటతో పై నీటియావిరి దట్టమై మేఘమువలెఁ గ్రిమ్మి పెంపరేచరు నతిత్వరితముగ దిగిపోకుండ నాపుటయుఁ గల్గుచుండును.

సముద్రజలములందు (నదీజలములు సరస్సులందలి జలములవలెనే) కరఁగినసాల్టులు కొన్నియు, కరఁగనిసాల్టులు కొన్నియు నుండెడిని. సముద్రమునం దిట్టివి రెండువందలరెట్లకధికముగ నుండును. వీటియందు ముప్పాతికభాగము మామూలు సముద్రలవణమే యుండును. అది 77.7 భాగముండునని లెక్కింపఁబడినది. సగటున సముద్రోదకములు నూరుపౌనుల జలములందు మూడున్నర పౌనులు సముద్రలవణ ముండునని లెక్కించియున్నారు. కాని, సముద్రమునం దన్నితావుల నుప్పొకేరీతి నుండదనియు, నుత్తరధ్రువసముద్రము మొదలగుకొన్నిభాగముల నీ రంతయుప్పగా నుండదనియు, మనసునం దుంచుకొనవలసి యుండును.

నదులుప్రవహించుమార్గముల భూమియందు రాళ్ళయందుఁ గలలవణము కరఁగుచు నదీజలముల నుండి సముద్రమునకుఁ జేర, నచటినీ రావిరిగ నెండల కెఁగసిపోవుచుండ, లవణము సముద్రజలముల నిలచి, రానురాను పెరుగుచు సముద్రఁపు నీరంతయు నుప్పగనైనదని పండితు లనెదరు. దీని కాంగ్లమున 'salinity' యనెదరు. ఇది శీతోష్ణస్థితిననుసరించియు, వాయుప్రసారము తక్కువగను చులకనగను నుండుతావులను వర్షాధిక్యముగల తావులందు నీరు తలక్రిందుగాఁ బడుజలపాతము లనీరధికముగఁ గలుపుకొనినతావులందును సముద్రజలములసెలినిటీ తక్కువగా నుండును. రెడ్సీ డెడ్సీ మొదలగు తావులందు నీటియావిరి వేఁడి వలన నధికముగ లేచుంగాన వానియం దీసెలినిటీ యధికము. పాలస్తినాదేశఁపు డెడ్సీయం దీసంగతి సుప్రసిద్ధము.

సముద్రజలములం దింకను magnesium Chloride 10.8 percent భాగమును, magnesium Carbonate 0.7 perceut భాగమును, magnesium Bromide 0.7 per cent భాగమును, Sulphate of magnesium 10.8 percent భాగమును, Calcium 10.8 percent భాగమును, Polassium 10.8 pecent భాగమును Calcium carbonate 0.7 percent భాగమును నున్నవనియు నింకను గొన్ని యితరములగుసాల్టులు కలవనియు, సముద్రజలములందు నదీజలములందుకన్న Silica చాలతక్కువ యుండుననియుఁ బరిశీలకు లనుచున్నారు. Oysters మొదలగువాని బరువగు చిప్పలు Carbonate of Lime తోఁ జేయఁబడినవి కలవు. ఇట్టి వింకను సముద్రజలచరములకుఁ లెక్కింటికిఁ గలవు. ఈసందర్భమున silica యనిన 'a crystalline form of silicon-de-oxide' అని యెఱుంగునది.

ఇంకను సముద్రఁపునీటినుండియే యుత్పత్తిగల సీమసుద్దయు (సీమసుద్ద చూడుఁడు) పగడఁపుఁ జట్టును (పగడఁపుఁ జట్టుచూడుఁడు) ఈసందర్భ

మున నెఱుంగవలయును. పగడఁపుఁజట్టును 'Coral reef' అనియెదరు.

పిదప నెఱుంగఁదగినది సముద్రఁపుజలములందలి యొత్తిడి (pressure) యైయున్నది. అగాధజలములందు పైజలములు క్రిందిజలములపై బరువుగ నుండి క్రిందిజలములం దొత్తిడిఁ గల్గించును. పైపొరయందు నీటియొత్తిడి తక్కువగనుండును. పైనీటియం దొత్తిడిలేకుండియు ౨౫౦౦ ఫాతముల లోతున చౌకఁపుటంగుళమునకు రెండున్నరటన్నుల బరువని యంచనా వేయఁబడినది.

మూఁతలేని గాజుపాత్ర నగాధజలములలోని కంపిన దానిలోని వెలుప ఒత్తిడి యందు భేదముండదు గాన నేమియుఁ జరుగదు. ఒకసీసా నొత్తిడిలేనిపైనీటిచే కొంతవఱకు నింపి మూఁతఁ బిగించి భద్రపఱచి యగాధజలముల క్రిందిభాగమునకు దింపిన బలాత్కారముగ నా మూఁత నెగురఁగొట్టుటయో సీసాపగులుటయో సంభవించును. దీనిని J. Y. Buchanan పండితుఁడు పరిశీలించి వ్రాసియున్నాఁడు. దానిని J. Y. Buchanan's Experement అని సుప్రసిద్ధముగ వాడుచున్నారు.

క్రీ. వె. 1873 సంవత్సరమున ఛాలెంజరుడీప నంబడు నగాధజలముల 3873 ఫాతములలోతున రెండుతెర్మోమీటరులు పేలిపోయినవి. దీని కొత్తిడియే కారణమని బుచానన్పండితుఁడు తలంచి యింకను బరిశీలింపఁదలచి యొకగాజు గొట్టమును రెండువైపులను మూసి భద్రపఱచి పైనొకబట్టంజుట్టి దాని నొకరాగిపీపాయం దుంచి పీపాకు రంధ్రములుచేసి యాఛాలెంజరుడీపునఁదుఁ మూఁడువేల ఫాతములలోతునకుఁ ద్రింపి పైకిఁ దీయువఱ కాపీపా సుత్తులతో మోదఁబడినటులను లోనిగుడ్డలోని గాజుగొట్టము మెత్తనిపొడుమై పోయి యుండెను. ఇది నీటియొత్తిడి యొసర్చిన కార్యము. ఇట్టిపనుల కాంగ్లమున implosion అనెదరు. అనఁగా పేలి భగ్నమగుట. explosion నకు వ్యతిరేకకార్యమని భావము.

పిమ్మటఁ దెలియందగినవి సముద్రపునీటియం దలి కదలికలు, నల్లకల్లోలములు, ప్రవాహములు నై యున్నవి. సముద్రపునీ రెల్లప్పుడును గదలికం గల్గియుండును గాని స్థిమితముగ నిలచియుండదు. ఇది తొణుకుచుండుటగాఁ బెక్కుండ్రు తలంతురు.

కెరటముల (అలల) నెల్లరెఱింగియే యుందురు. తీరముండి యరమైలుదూరముదనుక నివి నీటియందుఁ గల్గియుండును. అల లొకపాటిపడవల నెత్తగలవు. చిన్నరాళ్ళను పైకెత్తి విసరుటకును, పెద్దరాళ్ళను నెట్టుకొనిపోవుటకును బలము గలవి. తఱుచుగ పెద్దయలలేఁబదియడుగుల యెత్తువఱకు లేచును. ఒకప్పుడు సిసిలీద్వీపఁపు సముద్రతీరమందు లైట్‌హౌసునందున్న గంటను నూరడుగుల కన్న నధికముగల కెరటము వచ్చి గొంపోయెనని వింతగఁ జెప్పుదురు. కెరటములకుఁ బునాది వఱె నీటియం దడుగున నెట్టెబలము నుండదని తేలినది.

సముద్రజలములందు సంభవించుచుండు తుపానులు, సుడిగాలులు, ప్రచండవాయువులు. భూకంపములు, అగ్నిపర్వతశిఖరోద్ధృతములు మొదలగు నన్నియు జలముల నల్లకల్లోలపఱచును. బలముగ గల్గుతఱి మార్పులఁగూడఁగల్గించును. అత్తరి నోడలు నడువ నపాయకరముగ నుండెడిని.

పోటుపాటులసందర్భమున నీరు ప్రవహించును. గల్ఫుస్ట్రీము, ఓషన్ కరెంట్సు, మొదలగున వన్నియు సముద్రప్రవాహములే. భూమి తనకు తానై గిరగిరఁదిరుగుచుంటయు భూమధ్యరేఖకడ

నాస్థితి యెక్కువగాఁ దెలియుచుంటయు నచట నల్లకల్లోలముగ నుంట నోడలాప్రదేశముందాఁటుట కష్టముగా నుండును.

ఇంకను క్రిందిజలము లొకదెసకరుగుచుండ పై జలములు వేరొకదెస కరుగుటయుఁ గనిపెట్టఁ బడినది. ప్రవాహము లెదుర్కొను తావులందు నీరు పై కెగురుచుంటసంభవించును. దీనికి 'whirl pool' అనియెదరు. ప్రవాహమును గొప్పగాలి యెదుర్కొనునేని పెద్దయలలుగల్గి యల్లకల్లోలమగును. నీటియందు పదియడుగులలోతునుండి నూరుపాతములలోతుదనుకఁ గలగండశిలలు నీటి పై పొరయం దల్లకల్లోలములం గల్గింపఁ గారణ మగుచుండును. కొన్ని కారణములచే నీటియందు సుడులేర్పడి గుండ్రనిప్రవాహములు గల్గుచుంటఁ గనిపెట్టఁబడినది. సముద్ర కేత లీప్రవాహములు, నల్లకల్లోలములు మొదలగునవన్నియు (శరీరమందలి రక్తప్రవాహముల వలెనే) సముద్రజలములు పరిశుభ్రమగుచుంటకుఁ కారణములని యనెదరు. అదేపనిగ నొకదెసకు వీచుబలమగు గాలి నీటిపైపొరయందుఁ బ్రవాహముం గల్గించును. దీనికి 'surface circulation' అని పేరు.

ఉత్తరంపు టట్లాంటిక్కు మహాసముద్రంపు మధ్యభాగము బ్రశాంతమునకుఁ బేరందినది. దీనికి 'Atlantic calm' అనియెదరు. సర్గాసోసముద్ర తీరములు గడ్డిపట్టియుంట నొకగొప్పసరస్సువలెనే ప్రశాంతమై యుండెడిని. అది యనేకలక్షల చతురపుమైళ్ళ వైశాల్యము గలది.

ఇంక నీసందర్భముననే యుప్పు చాలతక్కువగాఁ గల్గియుండు నుత్తరధ్రువసముద్రములనుండి గొప్పగొప్ప హిమములనుండి తెగి బయలుదేరి దక్షిణదిశ కేతెంచు Ice berg లంగూర్చి యించుక వివరింపవలయును. ఇవి ద్వీపములవలెఁ గొన్ని మైళ్ళ వైశాల్యముం గల్గి చాలపెద్దవిగను పర్వతములవలెను నీటఁదేలుచు వచ్చుచుండును. వీనిని మంచినీటి మంచనియే చెప్పఁదగును గాని యిందేలనో చెత్తచెదారము మొదలగు నపరిశుభ్రపదార్థములు విస్తారము చేరియుండును. ఓడల కివి చాలయపాయకరములు. క్రీ. శ. ౧౯౧౨ ఏప్రెల్ ౧౪ తేదీని 'టిటానిక్కు' అను యోడయు నందలి ౧౫౧౭ జనులును వీనివలన సముద్రముపాలై మృతులైరి. ఇవి యేగినప్రాంతమునఁ గడుదూరము వెంపరేచరును శీతలపఱచి యపరిమితమగు చలిబాధను కొంతకాలముదనుకఁ గలుగఁజేయును. నోవాస్కోటియా, లేబ్రిడోరు మొదలగు దేశము లీచలి కప్పుడప్పుడు బాలగుచుండును.

ఇంక వివరింపఁదగిన దీసముద్రమున నివసించు జంతుజాలములంగూర్చిన విషయమైయున్నది. అవి పెద్దశరీరములుగల జంతువులుమొదలు అణుమాత్రశరీరములుగల చిన్నజంతువులవఱకు నుండును. సర్వసాధారణముగఁ జిన్నజంతువులు సముద్రములందేవేర్వేరుతావులందు మొలచి పెరుగు గడ్డిమొక్కలు నాచు మొదలగువానిం దిని బ్రతుకును. పెద్దజంతువులకుఁ జిన్నజంతువు లాహారముగ నుపయోగించును. తీరములదరినున్న జలములందు చిన్నజంతువులం దిను పెద్దజంతువులు; చేపలను, తిమితిమింగలములను, శీలులను బట్టు వేటకాండ్రను వెరులగుట జలచరములకు నిలుచుటకును, నాహారము గొనుటకును, నపాయములు మెండై జాగ్రత గొనవలసియుండును.

సముద్రంపునీటియం దనుకూలప్రదేశముల బేక్టేరియాసంబంధపు మొలకలు (diatoms of Bactaria) విస్తారముగ నుండ నట్టితావులందు

వానిం దిని వృద్ధినందు హెర్రింగుచేపలు మొదలగునవి విశేషముగ నుండెడిని. జర్మనుదేశప్రాంతముల [Kiel Bay] యందు జలబిందువునందు రెండువందలవఱకు డైటోములు కలవనియు; నార్తుసీయందు, బాల్టిక్కు సముద్రమునందు, చతురపుమీటరుజలములందు దశకోట్లపరిమితిగల బేక్టేరియాడైటోమ్సు గలవనియు సుప్రసిద్ధపరిశీలకు లంచనావైచియున్నారు. వీనిందిని వర్ధిల్లు హెర్రింగుచేప లీనీటియం దపరిమితములై యుండెడిని. Sir Ray Lankester పండితుఁడు బేక్టేరియాగూర్చి వ్రాసినవ్యాసమున 'సీమైక్రోబులు సముద్రోపయోగము నధికపఱచుచున్న' వని వ్రాసియున్నాఁడు. ఈవ్రాత యగాధజలములంగూర్చి యంతగాఁ దెలియరాకున్నది గాన విస్తారములోతుండని సముద్రభాగములంగూర్చియేయని యెఱుంగఁదగును.

అగాధజలములందు (deeps) లోతున గొన్నిచేపల పొలుసులందలి మిణుఁగురుల వెలుతురు తప్ప వేరువెలుఁగులేని గాఢాంధకారము, నిశ్శబ్దము, ప్రశాంతములుఁ గల్గి చెట్లు చేమలు లేక కదలిక యనునది గానరాని తావుల వసియించుచు పెద్దజంతువుల కాహారమైయుండుతావుల వసించు జంతువు లతికోమలదేహములును వంగిపోవునట్టి యెముకలును మెత్తనిమాంసమును గల్గియుండి శరీర కష్టమున కోర్వజాలవని తోఁచకపోదు. అచటి తక్కువకెంపరేచరు జలములయొత్తిడియు నంతములేనిరాత్రియు, నాకలిబాధ నధికముగఁ దెలియనీయకుండును.

**సముద్రవృష్టిన్యాయము:-** సముద్రములో వర్షించినవర్షము నిరుపయోగమని భావము.

**సమునాయనగోత్రము:—** భృగుసంతతి. (ఆర్ష్టిషేణగణము చూడుఁడు).

**సమూరైజాతి:—** వీరు జపాన్ దేశములో భరతదేశఁపుక్షత్రియులం బోలిన యొకజాతివారు. తొల్లింట జపాన్‌సామంతరాజులకొల్వున యుద్ధవీరులుగ నుండిరి. ఇక్కాలమున జపాన్‌దేశమునఁ బోలీసుఉద్యోగులుగ నున్నారు. వీరిని 'సాన్' అని పిలువవలయునఁట. వీరిస్త్రీలు గృహములందు మర్యాదగఁ జూడఁబడుసేవకురాండ్రై యుందురు. వీరికిఁ జాలగౌరవము గలదు. వీరుశూరులు.

**సమూలిర్వాగోత్రము:-** (ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**సమ్మర్‌సొలిసిటిస్ (Summer solstices:—** (సీజన్సు చూడుఁడు.)

**సమేరియమ్ (Samarium):—** ఇది 'rare earth metal of the cerium group' అనిచెప్పఁబడినది. దీని chemical symbal Sa యనియు, atomic weight 150.43 అనియు, atomic number 62 అనియుఁ జెప్పఁబడినది. దీని oxide కలదు. క్రీ. శ. ౧౮౭౯ లో Lecoqde Boisbandrian అనువారు కనుఁగొనిరని చెప్పఁబడినది. వారు దానిని Samarskite యందుఁ గనుఁగొనిరఁట.

**సమ్మోటయిరాఁగ:—** (ఈఁగలు చూడుఁడు.)

**సమ్మేళితశైవము:-** ఇది చతుర్దశశైవభేదమతములలో నొకటి. (చూడుఁడు.)

త్రిపదార్థములు సత్యమనియు, నందు పాశము (పశువులను) ప్రాణముల ననాదిగా బంధించు

చుండునది యనియుఁ, బతియగు పరమేశ్వరుఁ డనా దిగ ముక్తావస్థయం దున్నవాఁడే యనియు, నిది త్రిపదార్థములస్థితియనియు నెఱుంగునది.

శివజ్ఞానముఁ గల్గియుండుట, శివధ్యానతత్పరుఁడై యుండుట, శివార్చనానిరతుఁడై యుండుటల వలన పాశబంధములనుండి విముక్తుఁ డగుననియు, నందువలన శివైక్యము గల్గుననియు (అదియే ముక్తి) వీ రనెదరు. వీరికి పతి, పశు, పాశములు, త్రిపదార్థములు. అవి నిత్యములు సత్యములు నని తేలుచున్నది.

## సమోత్రాకిద్వీపము:—

(కేండియాద్వీపము చూడుఁడు.)

## సమోత్రేషియాద్వీపము:—

(కేండియాద్వీపము చూడుఁడు.)

## సమ్మోహకసన్నిపాతము:—

(సన్నిపాతదోషము చూడుఁడు.)

**సయ్యుద్వంశనృపతులు:**—వీరు తుగ్లకునృపులకుఁబిదప నుత్తరహిందూస్థానమున 'మహమ్మదీయరాజ్య' మేలిన మునల్మానునృపతులు (మహమ్మదుగోరీ చూడుఁడు.)

వీరికాలమున ఢిల్లీ రాజధాని. వీ రఱువదివత్సరములు (అనఁగా క్రీ. వె. ౧౪౧౪ మొదలు ౧౪౭౪ వఱకు) పాలించిరఁట.

**సయాందేశము:**— ఆసియాఖండమున నిండోచైనీస్పెనెన్సులాయందున్న దేశము. ఇది స్వదేశప్రభువుచే బాలింపఁబడుచున్న స్వతంత్ర దేశము. మలయపెనెన్సులాయొక్క యుత్తరార్ధ భాగ మీదేశమునందుఁ జేరియున్నది. ౨౪౪౦౦౦ చతురఁపుమైళ్ళ వైశాల్యముగల దేశము. ధాన్యము విస్తారము పైరుచేయఁబడును. ధాన్యము, కలపదూలనులు, తోళ్లు, చేపలు, విస్తారమీదేశము నుండి యెగుమతి చేయఁబడుచున్నవి. వర్తకము ముఖ్యముగా భరతదేశముతోను చీనాదేశము తోను నడుచుచున్నది. ఇనుపబాటలు వేయఁబడినవి. మేకాంగునదికిఁ దూర్పుననున్న కొంతప్రదేశ మిటీవల ఫ్రెంచివారిపశమైపోయినది.

సయాందేశఁపుఁ బ్రజలు కొంతవఱకు బర్మాప్రజలం బోలియున్నారు. కాని వీరు వేరు తెగవారు. దేశమున కాపురముకుదిరిన చీనామనుష్యులనేకులు గలరు. సగటున నుత్తరభాగముల షాన్ తెగవారును, దక్షిణమున మలేతెగవారును, విస్తారముగఁగాన్పింతురు. వీరందఱును బౌద్ధమతస్థులు.

మేనమ్నదిపై నున్న బేంకాక్పురము రాజధాని. ఇది దీని ముఖద్వారమునుండి యిరువదిమైళ్ళ దూరముననున్న నగరము. బేంకాక్పురమున సగముమంది నదియందుఁ దేలుచున్నపడవలపై గట్టఁబడిన యిండ్లయందు వసించుచుందురని చెప్పఁబడినది. దేశమందు వర్తకము చీనాదేశస్థులహస్తగతమై యున్నది. అయూతియా (బహుశః అయోధ్యాపురము) తొల్లింటిరాజధానిగ నుండిన పురము. ఇది మెనమ్నదిపై నెగువనున్నది. ఛింగ్మాయిపురము వర్తకస్థానమగు రేవుపట్టణము. (ఇండోచైనీస్పెనెన్సులా, ఆసియాఖండము చూడుఁడు).

**సయాందేశప్రభుత్వము (Siam):**— ఆసియాఖండమునందలి దేశము. స్వతంత్రపరిపాలనాధికారముగల భూపాలపాలితము.

రెండులక్షల నూటయేఁబది చతురఁపుమైళ్ళ వైశాల్య మనియు, నొకకోటి జనసంఖ్యయనియుఁ దెలియుచున్నది. రాజధాని బాంకాకునగరము. ఇది మెనమ్నదిపై నున్నది.

## సయాం దేశపు బౌద్ధమతము:—

ఇది బౌద్ధమతమే యైనను దూరదేశమగుటం గొన్నివిషయములందు మాఱిన ట్లగుపడును. వీరు బుద్ధభగవానుని సోమకోతముం డందురు. ఈయన పుష్పమునందుం బుట్టినవాఁడనియు, సర్వజ్ఞాని యనియు నందురు. ఒక చెట్టుక్రిందం దపమొనర్చి సిద్ధుఁడాయెనని చెప్పుదురు. మఱియు నాయనకు 'దేవతాన్' (బహుశః దేవదత్తుఁడు) అనుపేరు గలసోదరుం డుండెననియు, నొకతరి సోదరు లిరువురకుం గలహము గల్గి సోమగోతముఁడే జయించె ననియు వీరిమతగ్రంథములందుం జెప్పఁబడినది. ఈయనకు దేవాలయములు గలవు.

వారిమతిగురువులకు 'పుంగీ' లనెదరు. వారిని వారిగ్రంథములందు సరియగుపేరు 'తలపాయీ' లనియున్నదఁట. వీరు బౌద్ధమతభిక్షువులం బోలిన వారు. స్త్రీలయం దిట్టివారే యోగినులు గలరు. మతవిధివిధానము బౌద్ధమతపద్ధతులే యైనను దేశభాషాభేదములచే నించుక మాఱియున్నట్లుం దోఁచెడిని.

## సర్ హెన్రీ కాటన్ (ఐ. సి. యస్ గారు):—

ఈమనీయుఁడు బ్రిటీషురాజకీయవేత్త. భరతదేశాభిమాని. ఈయనపూర్తియగు పేరు Sir Henry John Stedman Cotton. జన్మకాలము ౧౮౪౫ సెప్టెంబరు ౧౩ తేది. కొంతకాలము బెటనుపురంపుపాఠశాల యందును, లండనుశాఖాశాలయందును, విద్యాభ్యాస మొనర్చి I. C. S. పరీక్షయందుం గృతార్థుఁడై భరతదేశమున సివిల్ యుద్యోగిగనుండినవాఁడు. ౧౮౭౩ లో బంగాళాప్రభుత్వమునం దండర్ సెక్రటరీగాను ౧౮౯౧-౯౬ గవర్నమెంటు ఛీఫ్ సెక్రటరీగాను, ౧౮౯౬--౧౯౦౨ ఆసామ్ దేశపు కమీషనరుగాను పనిచేసి యుపకారవేతనమొంది Sir బిరుదముం గైకొనియెను.

౧౯౦౬—౧౦ తూర్పునాట్టింగ్హామ్ః శిరిచే నెన్నుకొనఁబడి రేడికల్ కక్షకుఁజెందిన బ్రిటీషుపార్లమెంటుసభ్యుఁడై భరతదేశాభిమానిగం బనిచేసి యుండెను.
౧౯౧౫ అక్టోబరు ౨౩ తేది నితఁడుమరణించెను.

## సరట (తొండ) శాస్త్రము:-

తొండ పైకెగబ్రాకిన (శరీరమునందని భావము) శుభఫలమనియు, మేనిపైఁబడి క్రిందికి దిగినఁ గీడనియు, శరీరమునకుం దాకినను నేదేనియవయవముం జుట్టినను మేలనియుం జెప్పఁబడినది.

తొండ ముక్కుపైఁబడుట శరీరమునందలి వ్యాధి యడఁగి నిరోగ మగుననియు, వక్షస్థలము పైఁబడిన మృష్టాన్నభోజనము లభించుననియు, భుజములపైఁ బ్రాకిన భూషణములు (నాభరణములు) ధరించుట సంభవించుననియు, శిరస్సుపైఁ బడిన భయమనియు, కుడివైపు నొసటిమీఁదఁ బడిన లక్ష్మీప్రసనమనియుం జెవిమీఁద (ఏచెవియైనను సరే) బడిన భూషణప్రాప్తి యనియుం గంటిమీఁద (ఏకన్నైనను సరే) బడిన దుఃఖప్రద మనియుం జేతులపైఁబడిన (ఏచేయియైనను సరే) తనపశువులకుం గీడనియుం గడుపుపైఁబడిన బంధుదర్శనమనియు, పిరుదులపైం బడిన లాభప్రద మనియు, తొడలపైం గాని కాళ్ళమీఁం గాని తొండపడుట రోగహేతువనియు, దేహమునందు కుడివైపునఁబడిన ధనహానియు, నెడమవైపునఁ బడిన ధనలాభముననియు, పాదములనడుమ తొండపడిన లాభమనియు, కుడిపాదమునందు తొండపడిన ధనలాభ మనియు, నెడమపాదమునందుం బడిన తొలుత నించుక భయంకరముగ నుండియు

గడకు లాభముగాని శుభముగఁగాని పరిణమించు ననియు సరటశాస్త్రములఁ జెప్పఁబడినది.

ఇది విరివిగఁ జెప్పఁబడిన శాస్త్రము కాదు.

**సరబత్నది:—** ఏష్యామైనరునం దున్న నది. అర్కిపిలెగోసముద్రమునం గలియును. [ఏష్యామైనరు చూడుఁడు].

**సరయూ గోమతీసంగమము; భాగేశ్వరము:—** సంయుక్తరాష్ట్రములకుఁ జెందిన కుమాన్ డివిజనునం దున్నది. అల్మోడానుండి ౨౬ మైళ్ళదూరము. ఇట భాగనాధ శివలింగము నెదుటనే సరయూగోమతీనదులు కలియు పవిత్ర స్థలి కలదు. భాగేశ్వరము వర్తకస్థలము. ఇట భూటియాఫెయిర్ [సంత] సుప్రసిద్ధము.

**సరవన (పుర) ము:—** ఇది గోశాల. మాంకాళీపుత్రుని జన్మస్థానము. శ్రవస్తీపురసమీపము. అజీవకసంఘమున కీతఁడు నాయఁకుడు. అజీవకమార్గమునకుఁ గర్తయే యని కొందఱు తలంచుచున్నారు.

**సరస్వతి:—** బ్రహ్మదేవునిచే సృజింపఁబడి యతనికి భార్యయైనవనిత. విద్యల కధిదేవత గాననే విద్యానిలయమునకు సారస్వతమని యందురు. సరస్వతీదేవికి ప్రీతికరమగు దినములుగాన శరదృతువు [ఆశ్వీయుజకార్తిక మాసము] నందలి మొదటితొమ్మిదిరోజులను సరస్వతీపూజలొనర్తురు. ఈయాశ్వయుజ



శుద్ధపాడ్యమిమొదలు శుద్ధదశమివఱకగు తొమ్మిది రోజులను శరన్నవరాత్రము లనియెదరు. పుస్తకరూపిణియగు సరస్వతీదేవి నారాధింతురు. మఱియు సరస్వతికి శారద యనియుఁ బేరుకలదు. నాల్గు చేతులందు నక్షమాల, చిలుక, కమలము, పుస్తకముధరించినట్లుగాని, రెండుచేతుల వీణవాయించు నటులను, తక్కిన రెండుచేతులను పుస్తకము, జపమాల యుండునట్లుఁగాని సర్వతీచిత్రముం జిత్రింతురు. సంగీతసాహిత్యములు సరస్వతీ కుచములని వర్ణింతురు. మఱియు నంతిసారునిభార్య పేరు సరస్వతియే. ఇంకను సరస్వతీనది [ఓఘావతి] ప్రసిద్ధమగునది.

**సరస్వతీనది:—** సరస్వతీనది హిమాలయ పర్వతభాగమగు 'శివాలిక్' అను నామాంతరము గల శిర్మూర్ పర్వతములం దొకప్లక్షవనమున జనించును గాన నీనది 'ప్లక్షావతరణ' యనియు, ప్లక్షప్రశ్రవన యనియు వాడుక నందియున్నది. హిందువులకు మహాపవిత్రవంత మగునది. జన్మస్థానము గొప్పపుణ్యతీర్థమని యెంచుచున్నారు.

అంబాలామండలములోని 'ఆదిబదరి' యనంబడుతావునఁ గొండలనుండి సమతలప్రదేశమునఁ బ్రవహింపమొదలిడును. సరస్వతీజన్మస్థానఁపుఁబవిత్రతఁ గూర్చినప్రశంస మహాభారతముఆదిపర్వము ౧౭౨ అధ్యాయమునను, పద్మపురాణము స్వర్గ ౧౮ అధ్యాయమునను గలదు. ఋగ్వేదము ౧౦—౭౫ యందుఁ దొలుత సరస్వతీనది ప్రశంసింపఁబడినది.

సరస్వతీనది సమతలప్రదేశమునఁ బ్రవహింప నారంభించి,కొంతద వ్వరిగి 'ఛకార్' అను గ్రామముకడ భూమియం దింకిపోయి, భవానీపూరనం బడుతావునఁ దిరుగ భూమినుండి పైకెగసి ప్రవహింప నారంభించును. పిదప బాల్ఛప్పా రను తావునఁ దిరుగ నింకి, బారాఖేరా యనంబడు తావునఁ దిరుగనుబికి ప్రవహించుచుండును.

పిదపఁ బిహారీకడనున్న 'టర్నయి' యను గ్రామముకడ మార్కండనదిని తనయందుఁ జేర్చు

కొని ముందునకుఁ జనుచుఁ గొంతదవ్వున కేగు వఱకు ఘర్గరా (ఘగ్గరని వాడుక) నది యిందు సంగమించును. ఘర్ఘరానదికిఁ దొల్లింట సరస్వతి యని పేరుండె నందురుగాని యాపేరెట్లుమారెనో తెలియరాదు. కురుక్షేత్రమునఁ బ్రవహించుతరి దీనిని 'పావనీనది' యందురు. ఇందా పావనీ నామము ఘర్గరముదో లేక సరస్వతిదో తెలియ కున్నది. సరస్వతియనియు వాడుకఁగలదు. రామా యణము ఆదికాండము ౪౩ అధ్యాయమున సర స్వతీనది గంగానదియొక్క తూర్పుశాఖగఁ బేర్కొనఁ బడినది. భరతుఁడు సరస్వతిని గంగాసంయోగము కడ దాటెనని చెప్పఁబడెను గాని, గంగానదికిని సరస్వతీనదికి నేసంబంధమును గానరాదుకాని కురు క్షేత్రమున స్థానేశ్వరమున కుత్తరముగ గంగాతీర్థ మనుపేరుగల యొకతీర్థముఁ గలదు. ఇది సరస్వతి యందు చాల ప్రసిద్ధతీర్థమై యున్నది.

మహాభారతమున వనపర్వము ౮౨ అధ్యాయ మున సరస్వతీనది భూమియం దంతర్వాహినిగ నగుచుఁ దిరుగ భూమినుండి పైకి బహిర్వాహినిగ గన్పించుతావులకు చమసోద్భేద మనియు, శిరో ద్భేదమనియు, నాగోద్భేదమనియు మూఁడుపేర్లు చెప్పఁబడినవి. గాన భవానీపూరువద్ద పునరుద్భవ మునకు చమసోద్భేదమనియు. భారాఖేరావద్ద పునరుద్భవమునకు శిరోద్భేదమనియు, గ్రహింప నగుచున్నది గాని నాగోద్భేద మెటనో తెలియ రాకున్నది. అత్తావు బహుశః నేలంగలసి ప్రవాహ మట బహిర్గమనముగ నానాఁటికి మారియుండ నోపు.

ఇంక మహాభారతమువలననే సరస్వతీనది సీర్సా యనంబడుతావునకు సమీపమునంగల వినాశనతీర్థమున నింకిపోవునని తెలియుటంజేసి ఛకారనుదానికో భాల్చస్పారనుదానికో వినాశన తీర్థమని పేరుండియుండనోపు. కురుక్షేత్రముకశ నున్న సరస్వతీనదిని ప్రాచీనసరస్వతియని యం దురని (అనఁగా తూర్పుసరస్వతి) పద్మపురాణో త్తరఖండము ౬౭ అధ్యాయమునఁ దెలిసెడిని.

మఱియుఁ బద్మపురాణము సృష్టిఖండము ౧౮ అధ్యాయమునుండి [అజిమీరుకడనున్న బ్రహ్మక్షేత్రమగు] పుష్కరసరస్సునుండి యుత్ప న్నమై కచ్చిసంయుక్తాగ్రిగుడమున సంగమించు నదికి పుష్కరసరస్వతి యనిపేరని తెలియుచున్నది. ఇంకను గుజరాతులోని సోమనాథక్షేత్రమున కృష్ణనిర్యాణస్థలమువెంబడి ప్రవహించి సముద్ర గామియగు రౌనాక్షి యనంబడు చిన్నదికిని ప్రభాసనరస్వతి యనిపేరుకలదనియు, నిది ప్రాచీన సరస్వతినుండి యేతెంచినజలములే యనియు స్కాందపురాణ ప్రభాసఖండము [ప్రభాసమాహా త్మ్యము] ౩౫ – ౩౬ అధ్యాయములందుఁ గలదు. ఈనది అబూ [అర్బుద] పర్వతమున జనించి, అం సోరుకడ మార్బెల్ రాళ్ళగుట్టలందున కోటేశ్వర శివలింగము [దేవస్థానము] ప్రక్కఁబడి పశ్చిమ వాహినిగ కచ్చిసముద్రమున కేగునని భూగోళ శాస్త్రకర్తలు తెల్పుచున్నారు.

పారశీకులు జెందవెస్తాయందు సరస్వతీనది హరక్షైతియని పేర్కొనఁబడియున్నది. ఆఫ్ఘనిస్థా నమునందలి హెల్మండునదికి తొల్లింటిపేరు సరస్వతీ నదియే యనియు, నాదిసింధునదికిని సరస్వతీనదియని పేరనియుఁ దెలియుచున్నది. అథర్వణవేదమున త్రిసరస్వతులు ప్రశంసింపఁబడియుంట నామూఁడు సరస్వతీనదులు ౧ సరస్వతీనది, ౨ సింధునది, ౩ హెల్మండునదియు నని పెక్కండ్రు పరిశోధకు లభిప్రాయపడియున్నారు. పారశీకులఅవెస్తాయందు హెల్మాండునదీసందర్భమునను హరక్షైతియనియే యుండుట దీనిని బలపఱచుచున్నది.

ఇది యిటుండ వహ్నిపురాణము ౧౮౯ అధ్యాయమున నలకానంద గంగయం దొకనరస్వతీనది సంగమించునదిగఁ జెప్పఁబడియున్నది. ఇప్పుడు కాశ్మీరపండితులను శాఖవారును, గొంకణదేశము ననున్న సారస్వతశాఖవారును దొల్లింట సరస్వతీ నదీతీరదేశవాసులౌట నటుల పేరొందిరని తెలిసెడిని. కొంకణు లాదేశమందు పడమటికనుమలలోఁ బుట్టి దొరలుచు జాఱుచుఁ గ్రిందికిదిగి యరేబియా సముద్రమునంగలయు నొకచిన్ననదికిని సరస్వతీనది యనిపేరిడిరి. మదధదేశమున రాజగృహముకడ నుండిన యొకనదికి సరస్వతీనది యనిపేరు. కాని యిట్టివన్నియు భక్తిసారవశ్యమున నిడిననామము లనుట స్పష్టమే.

(నగోద్భేదము చూడుఁడు).

**సరస్వతీపట్టణము:**—దీనిని క్కాలఁపు టాంగ్లోచ్చారణమున సుర్వాయ (Surwaya) యనుచున్నారు. ఇదియిప్పటి గ్వాలియరుసంస్థాన రాజ్యమున నున్నది. ఈరాజ్యమున జాన్సిపురము నుండి పోవు నుత్తరఁపుఁబెద్దబాటయందు శివపురి వద్ద బాట వంకరతిరుగుస్థలమునుండి యొకసన్నని బాట బయలుదేరి; యచ్చటకు పద్రెండుమైళ్ళ దూరమునను న్న యీసరస్వతీపట్టణమును జేరును. ఇది పురాతనకట్టడములయొక్క భారతీయశిల్ప రచనాకౌశల్యమునకు మిక్కిలి పేర్వడసియున్నది.

ప్రస్తుతమున నీస్థలమున నొకచిన్నపల్లెటూరు గలదు. గాని యొకానొకసమయమున సరస్వతీ పట్టణమనుపేరున గొప్పయున్నతినొంది, మహా రాజులకును, సామంతరాజులకును, రాజధాని యై యుండెడిదని శాసనములవలనఁ దెలియుచున్నది. ఇంతియేగాక నిట నేఁటికిని నిలిచియున్న ఱాతిగోడ లును, గొప్పపనివాటితనముగల ఱాతికట్టడము లును, దానిపూర్వోన్నత్యమును దెలియఁజేయు చున్నవి. ఈకట్టడములయందలి ఱాతునుకలును, పాడుకట్టడములును, సుమారు పదియవశతాబ్ద మునుండియు, నై దారువందలసంవత్సరముల కాలమునందలి భిన్నభిన్నభాగములను దెలుపుచున్న వని పరిశీలకు లనుచున్నారు.

ఈప్రాంతమును మార్వారు, ప్రతిహార, జాజి పెల్లావంశస్థులగు రాజపుత్రులును, శ్రీరాజా సాహసాములుఁడును, రాజమాత సలపాసదేవి, మొదలగువారు పరిపాలించియుండనోపు. పిదప నిది మహమ్మదీయాక్రాంతమైనట్లు తెలిసెడిని. అదియేగాక పదమూఁడవశతాబ్దమందలి యచ్చటి కాపురస్థులనుగూర్చియు, వారి మహత్కార్య ములఁగూర్చియు, నాశిధిలములను జదువువారికి విశదపడఁగలదు. వీనియందలి మహాబలిష్ఠమగు నెజ్జకోటయందలి దేవాలయములు మహమ్మ దీయులు కట్టినట్లు కనఁబడును. అందుఁజిన్నవి యగు మూఁడుదేవాలయములు ముఖ్యములు. వీనిలో నొకటి విష్ణ్వాలయమును, రెండవది మఠ మును, మూఁడవది సన్యాసులుమొదలగువారి యాశ్రయము నై యుండెడివందురు. వీటికడనే రాతిపలకతోఁగట్టిన దిగుడుబావి గలదు. ఈకట్టడ ము లన్నియు సున్నము, సిమెంటు మొదలగువానిని వాడుకచేయక రాతిపలకలపేర్పుచే మాత్రము నిర్మింపఁబడినందున వింతగొల్పెడిని. ఈదేవాలయ ములు, మఠములు మొదలగువానిలో ననేకముల శిఖరములు చెడియుఁ, గొన్నిభాగములు విఱిగియు నచ్చటచ్చటఁబడియుండి యగుపడుచుండును. ఐన ను వానిపనితనము, పురాతనభారతీయ శిల్పవిద్యా నైపుణ్యమును వేనోళ్లఁ బొగడుచున్నది. ఇచ్చటి పెద్దయాలయము పనితనమునమేమి, మలచిన

గోడలందును నాలయములపై నుంచినవిగ్రహ ములజీవకళయందేమి మహాప్రశ స్తములు.

ఇంతియేగాక నీసరస్వతీపట్టణము, గ్వాలియర్ సంస్థానరాజ్యమందలి, శాక్యసాగరమున కనతి దూరమున, ననుపమానసృష్టివై చిత్ర్యముగల స్థల మున నిర్మింపఁబడినందున, చూపరుల కాదృశ్య మామోదముగల్గించును. ఈసరస్వతీపట్టణనా మము సుర్వాయగా నెట్లుమారినదో తెలియదు. ఈపరిసరముల నీపట్టణమునుగూర్చి తెల్పువా రెవరును లేరు, గాన నింతకెక్కుడు తెలియదు. గ్వాలియరుస్టేటు ఆర్కియాలోజికల్ డిపార్టుమెం టువా రీస్థలమును బరీక్షించుచుందురు.

## సరస్వతీప్రయాగ:—
(పంచప్రయాగలు చూడుఁడు).

**సరస్వతీ (పక్షి) శాస్త్రము:—** సరస్వతీ పక్షిని కబ్బపులుగనియు, పులుగుపిట్టి యనియు, జయపక్షియనియునందురు. ఈపక్షిపలుకులఫలము రాత్రి నాల్గుజాములను అష్టదిక్కులం దిట్లు చూ చుకొనునదిగఁ జెప్పఁబడియున్నది.

ప్రథమయామమున— తూర్పున మరణము, ఆగ్నే యమునఁ గష్టము, దక్షిణమున ప్రియము, నైరుతిదిశయందు వర్షము, పశ్చిమమున భయము, వాయవ్యదిశను శుభము, ఉత్తర దిశయందు సంతోషము, ఈశాన్యదిశయందు నిష్ఫలము.

ద్వితీయయామమున— తూర్పు-వర్షము, ఆగ్నేయ- సంపద, దక్షి-అతిశయము, నైరు-కార్యసా ఫల్యము, పడ-అనుమానము, వాయ-రాజ శోకము, ఉత్త-శత్రుభయము, ఈశాన్య-రక్త దర్శనము కల్గునంతటి భీతి.

తృతీయయామమున— తూ-భయము, ఆగ్నే-కల హము, దక్షి-వర్షము, నైరు-బంధుదర్శనము, పడ-ధనలాభము, వాయ-శుభము, ఉత్తర- వ్యయము, ఈశాన్యదిశయందు లాభము.

చతుర్థయామమున— తూ-భోజనసౌఖ్యము, ఆగ్నే- అగ్నిభయము, దక్షిణ-కలహము, నైరు-శత్రు వులకు పీడ, పడ- అతివృష్టి, వాయ-తేజస్సు, ఉత్తర-నష్టము, ఈశాన్యదిక్కునఁ గూసిన నష్టము.

తనయూరఁగాని, తనయింటఁగాని, తానుండ కుండునపుడు తనతల్లి యెరుగకుండ, వినకుండ, తనకుడిప్రక్కను సరస్వతీపక్షి కూసిన ధనలాభ మును, శుభఫలమును గల్గునని పెద్దలుచెప్పుదురు.

## సరస్వతీహస్తము:—
(హస్తాభినయము చూడుఁడు — భరతశాస్త్ర ము చూడుఁడు).

## సరస్సులు పవిత్రమైనవి పండ్రెం డు:— (ద్వాదశపవిత్రసరస్సులు చూడుఁడు).

## సరాగోజగోత్రము:—
(నిధృవగణము చూడుఁడు).

**సరుగుడుచెట్టు:—** ఆంగ్ల Casuarina Tree. ఇది విదేశములనుండి భరతభూమికి రప్పిం పఁబడిన చెట్టు. వంటచెఱుకుగ నుపయోగపడు చున్నది. ఇసుకభూములందుఁ జక్కఁగఁ బెరుగును. కొన్నిచోట్ల నింటివాసములు రాటలు దూలము లకుఁగూడ నుపయోగించుచున్నారు. పదిసంవత్స రములకుఁ జేవ యేర్పడినపిదపఁ గొంతకాలము నిలచియుండెడిని.

**సరెండర్** (Surrender):— వాణిజ్యసంబంధపరిభాషాపదము. తానే యిచ్చివేయుట, స్వాధీనపఱచుట, పంపివేయుట మొదలగునవి. ఒకభీమాపోలసీని భీమాచేసినకంపెనీవారికే యిచ్చివేసి కొంతసొమ్ము తీసుకొనుట కీపేరు వర్తించును. తీసికొనినసొమ్ముకు 'surrender value' అనిపేరు.

## సరోవరములైదు (పంచసరోవరములు:—

ఉత్తరమున మానసరోవరము - హిమవన్నగములపై కైలాసశిఖరముకడ నున్నది.

తూర్పున బిందుసరోవరము. శ్రీజగన్నాధమున కవ్వల భువనేశ్వరక్షేత్రమున నున్నది.

దక్షిణమునఁ బంపాసరోవరము. బ జిల్లా హాసుపేటకడనున్న జీర్ణవిజయనగరమున ఋష్యమూక, మాల్యవంతపర్వతములదరిని తుంగభద్రానదీతీరమున విరూపాక్షక్షేత్రముకడ నున్నది.

పశ్చిమమున నారాయణసరోవరము. సింధునదీ ముఖద్వారముకడ. రాన్ ఆప్ కచ్ఛి యనంబడు, నీటితంపరకుఁ బడమటికొనలో నున్నది. మధ్యమమునఁ బుష్కరసరోవరము. అజిమీరు నగరమున కిరువదిమైళ్ళదూరమున పుఖార్ అనంబడుతావునఁ గలదు.

**సర్కుమ్పోలార్ స్టార్సు** (Circum Polar Stars):—ఉత్తర దక్షిణ ధ్రువముల కడనుండు (Pole Stars) ధ్రువనక్షత్రముం జుట్టు తిరుగుచుండున ట్లగుపడునట్టి నక్షత్రముల కెట్టోతినామికాశాస్త్రమున నీపేరు వాడఁబడినది.

## సర్పములు - గానసుఖము:-

పాములవాఁడు నాగస్వరమునం బాడుతఱి పాములు పడగలు విప్పి కొంచె మిటునటు నాడించుచు వినుచుండుట యెల్లరెఱింగినదే. గొప్పగొప్ప త్రాచుల నీగానమువలనం బైకి రప్పించి రంజిలఁజేసి (acrobates) పట్టుకొని నిర్బంధించి యుపాయముగ వానినోటినుండి విషఁపుదిత్తులం దీసివైచెదరు. మఱికొందఱు (కోరలపండ్ల) నే దీసివైచెదరఁట. ఇంక నాపాము కఱచిన నపాయముండదు. "కోరలుతీసినత్రాచు" అనుసామెత కలదు. ఇది దొరికిపోయినదుర్మార్గునింగూర్చి చెప్పెదరు.

పాములను గానముచే రంజింపఁజేయువిద్య భరతదేశమునను, ఐగుప్తు (Egypt) దేశమునను, మొరకష్ (Morroco) దేశమునను ననాదిగనున్నది.

## సర్పములు, నిరశనము, వాయుభక్షణము:—

సర్వసాధారణముగ సర్పము లడవిమృగములవలెనే పగటియందునిద్రించుచు, రాత్రులందు బయటికిఁబోయి యాహారము సంపాదించుకొను జంతువులుగ నున్నవి. వేసవియం దవి స్వేచ్ఛగఁ దిరుగఁ గల్గుఁగాని వర్ష కాలమునం దవి తిరుగుట దుస్తరము. కాన పరిస్థితులమేర కవి వేసవియం దధికకొవ్వును తమశరీరమున నిల్వయుంచుకొనుచువర్షములందు నిరాహారముతో నూపిరిఁదీయుట యధికముగ (ఆక్సిజెనుగాలిం) బీల్చుకొని బ్రతికియుండును. గానన వేసవియందు మనము చూచినయడవిపాము బలముగనుండుటయు వర్ష కాలమునఁ జిక్కియుంటయు సంభవించుచుండెడిని. ఇంతియేగాక పాములవాండ్రు పాములపెట్టెలందుఁ బెంచుపాములు సైతము మనము చూచి

నతరి వానియందు నిద్రించుచుంటయే గాననగును. ఏలయన మనము తలచుగఁజూడ సంభవించుట పగటికాలమునందే యగుటయు, నది వాటికి నిద్రించుకాలమే యగుచుంటయుఁ దటస్థించు చుండెడిని. అవి మేల్కొనియుండు రాత్రులందు వానిం దలుచుగఁజూచుట సంభవింపదు. ఒకవేళ చూడసంభవించిన నవి మేల్కాంచియే యుండె డిని. ఎట్లైనను గనులపై రెప్పలులేని జంతువు లగుటఁ గనులు మూయఁ బడక తెఱచియుండు కతన నిద్రించుటయో, మేల్కాంచియుంటయో నేత్రములనుండి తెలియుట దుస్తరము. వాని వర్షకాలఁపు టుపవాసస్థితినుండియే సర్పములు వాయుభక్షులనువాడుక బయలుదేఱనది. పగటి నిద్రింబట్టి వానికి 'సర్పాణా మతినిద్ర' యని వాడుకయుఁ గల్గియుండనోపు.

## సర్పశీర్షహస్తము—

(హస్తాభినయము చూడుఁడు, భరతశాస్త్రము చూడుఁడు).

## సర్దార్‌బిరుదము— ఇది పంజాబుదేశమున నధికవ్యాపకము నందియున్నది. సైన్యాధిపతియని యర్థమఁట. ఈజిప్టుదేశమున ఁడుకియం దుండెను.

## సర్పాక్షిచెట్టు. లా. Ophiorhiza-mungoos. ఆంగ్ల mongoose plant. సం. సర్పాక్షీ:— సర్పగంధా.

దీనివేరుయొక్కయు, నాకులయొక్కయు రస కషాయములు వేఁడిఁజేసి యెలుకకాటు విషమును, క్రిములను హరించును. స్త్రీల ప్రదరరోగము (కుసుమరోగము)ను నివారించునని చెప్పఁబడినది.

సర్పాక్షి, పెద్దసర్పాక్షి, చిన్నసర్పాక్షి యను భేదజాతులు రెండుగలవనియు, నిది చిన్నసర్పాక్షి యనియు, పెద్దసర్పాక్షియొక్క రసకషాయములు క్రిమిహృద్రోగములు, విషజంతువుల విషములు నివారించుననియు, వ్రణములు మాన్పుననియుఁ జెప్పుచున్నారు.

## సర్పి-చప్పి-చప్పిడి—

(విసర్పి చూడుఁడు).

## సర్పిణి (క్రియ)— పతాకహస్తము చేత నెడమప్రక్కకుఁ (వంకకుఁ) జేయిచాచుటకుఁ బేరు.

ఇది సంగీతశాస్త్రమున క్రియాప్రాణములలోని దేశ్యక్రియ లెన్మిదివిధములలో నొకటి. [క్రియా ప్రాణము చూడుఁడు].

## సర్ఫేస్ టెన్షన్ (Surface Tension):-

ఇది యాంగ్లరసాయనికశాస్త్ర మందలి యొకపరి భాషాపదము. "Surface tension is a force that acts in the particles at the surface of fluids and acts in such a way that each attracts each, and pulls on each, and will stretch rather than seperate from its neighbours" అని నిర్వచింపఁబడియున్నది. గాన నల్లు కలయుచున్న జలపరమాణువు (water particles) లతిపలుచనిపొరంబోలిన యొకహస్తును జలముపై నిర్మించుచుండెడిని. ఆజలపరమాణువుల కలయికపద్ధతికే 'సర్ఫేస్ టెన్షన్' అనియెదరు. అదియేభావితమగు సన్ననిపొర.

ఒకపాత్రయందు నీరుఁబోసిన నానీటిపై సర్ఫేస్ టెన్షను వ్యాపించి జలపరమాణువుల (water particles) నొకటికొకటి లాగుకొనుచుంటకు

'Pulling on each other' అని యాంగ్ల శాస్త్రవిదులు పేరిడిరి. అట్టి సర్ఫేస్ టెన్షన్ ఆపాత్ర యందలినీటిని బైకిరాకుండ నాపునదిగా నున్న దందురు. దీనికి దీనిపైనున్న వాతావరణఁపుగాలి వలని యొత్తడి (air pressure) కలదందురు. నీటిబుడగయు నిట్టి సర్ఫేస్ టెన్షన్ పొరచే నేర్పడి లోన గాలింజుట్టుకొని వెలుపల గాలియొత్తడినందు చుండు గుండ్రని యాకారమే. ఇంక నిది సబ్బు నీటిబుడగ యగునేని యించుక బలము గలదిగ నుండెడిని.

నీటిబుడగయందలి జలపరమాణువు లన్నియు నొకేబలముతో నొకటినొకటి హత్తుకొనుట యందు నొకటినొకటి లాగుకొనుటయందు, భేద ములేనివై యున్నను లోపలనున్న గాలి యొకేవిధ మగు నొత్తిడిని నంతటకు లోపలనుండి యొసఁగు నదిగానున్నను కొలఁదికాలములో నా సర్ఫేస్ టెన్షను బుడగ భగ్నమైపోవుచుండుటకుఁ గార ణము గ్రావిటేషన్ ధర్మము. అందలి ప్రతిజల పరమాణువును భూమిచేఁ గ్రింది కాకర్షింపఁబడు చునే యుంటకుఁ 'గ్రావిటేషన్' అనిపేరు. ఈ గ్రావిటీ (ఫోర్సు) శక్తి సర్ఫేస్ టెన్షనుశక్తి కన్న బలమగునదిగాన జలపరమాణువులు క్రింది కాక ర్షింపఁ బడుచు జాఱుటనుండి బుడగ భగ్న మగుట సంభవించును.

సబ్బునీటియం దేర్పడినబుడగలను బాలు రొక కన్నఁపుగొట్టమునందు ముంచి పైకెత్తి యెగురఁ గొట్టుచు నాడుకొనుచుంట నెల్లరెఱుంగుదురు. ఇదియు సర్ఫేస్ టెన్షను నేర్పాటునుండి కల్గింపఁబడి నదియే యని యిది వఱకే యెఱుంగనైనది. సన్నఁ పుగొట్టముగుండా యింటిలోని కూడఁబడినగాలి యూపిరిగాలియే గాన నించుక వేడిగ నుండును.

వాతావరణమునందలి గాలికన్న నీబుడగలోనిగాలి వేడిగనుండ కొంచె మాబుడగ బెలూనువలె పైకెగురును గాని యావేడి చల్లఁబడి క్రిందికి దిగ నారంభించును. కడకు గ్రావిటేషను ధర్మమునకు లొంగిపోయి సర్ఫేసుటెన్షను ధర్మము వీడ నా సబ్బు బుడగయు భగ్నమగును. నీటి బుడగకు సంస్కృతమునఁ 'బుద్బుద' మందురు.

## సర్వంజానం ధర్మిణ్యభ్రాన్తం ప్రకారేతు వ్యత్యయ యితి న్యాయః:—

దేని నైనఁ జూచి దానిని [ఫలానావస్తువుగా] భ్రమించి గ్రహించిచూచిన నది తాననుకొనినవస్తువు గాకుండినచో నాతప్పు గ్రహించుటయందలిది గాక యట్టిభ్రమను గల్గించిన యావస్తువునందలిగుణము దియని భావము.

ముత్తెపుఁ జిప్పంజూచి వెండిగా భ్రమించుట యందలితప్పు ముత్తెఁపుఁజిప్పయందు, వెండియందు నొకేవిధమునునుండి [భ్రాంతిఁగల్గించి] న తెల్లని రంగుదని యెఱుంగునది.

## సర్వం బలవతః పథ్యమ్ ఇతి న్యాయము:—

బలవంతుల కన్నియు ననుకూలించునని భావము.

## సర్వకాముఁడు:—

ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి ఋతుపర్ణుఁడు. కుమారుఁడు సుదాసుఁడు.

## సర్వగోత్రము:—

[నిధ్రువగణము చూడుఁడు].

## సర్వజ్ఞసింగమనాయఁడు (సింగమనీఁడు):—

ఈనృపతియింటిపేరు రావువారు.

పద్మనాయకకులుఁడు (వెలమవారు.) రెండవ ప్రతాపరుద్రమహారాజునకు సామంతరాజుగనుండిన బలాఢ్యుఁడు, యుద్ధవీరుఁడు, గొప్పపండితుఁడు. ఈతనిరాజధాని నెల్లూరుమండములోని వేంకటగిరి. వీరిది రేచర్లగోత్రము.

తండ్రిపే రనపోతమనాయఁడు. పెద్దకుమారుని పేరు ననపోతమనాయఁడే. ద్వితీయపుత్రునిపేరు మాదానాయఁడు. జ్యేష్ఠపుత్రుండగు ననపోతనాయడికి పెద్దసింగమనాయఁడు, ధర్మానాయఁడు నని యిర్వురుపుత్రులు గలరు. అందు ధర్మానాయనిసుతుఁడు తిమ్మానాయఁడు. వీరందరు గాక [వరంగల్లు] నరపతులకు సామంతనృపులే.

సర్వజ్ఞసింగమనాయఁడు రచించినవి సింగభూపాలీయము, నాటకపరిభాష యను సంస్కృత గ్రంథములు. ఈనృపతి బమ్మెరపోతరాజుచే భోగినీ దండకమును రచింపఁజేసి తాఁ గృతినందెనని వాడుకగలదు. ఇది ప్రవాదమేయని కొంద అనుచున్నారు. ఎట్లైనను శ్రీనాథమహాకవియు, బమ్మెరపోతనయు నీనృపుని సమకాలికు లన సంశయ ముండదు.

ఈయనశూరత్వముంగూర్చియు, యుద్ధసాహసముంగూర్చియుఁ గవుల చాటుధారలంగొనుటఁ గూర్చియుఁ బెక్కువింతకథలు గలవు. ఆంధ్రదేశమున వెలమవారియందు రావువారను సంటిపేరు గలవారికి మూలపురుషునిగాఁ జెప్పఁబడుచున్నాఁడు.

మఱియు నీమహనీయుఁడు రెంటూరి గంగరాజుకవిచే భానుమతీ పరిణయ మను మహాప్రబంధమును గృతినందినవాఁడని వాడుకగలదు గాని యీయనకృతితోనున్నగ్రంథము కానరాకున్నది. ప్రచారమందున్న భానుమతీపరిణయమను ప్రబంధ మీయన సంతతివారగు వెలుగోటిరాయప్ప నృపతికిఁ గృతి యీయఁబడినదిగ కాననగుచున్నది. ఆతఁడు శాలి సం. ౧౫౫౦ నాటివాఁడని తలంచుచున్నారు.

ఈకుటుంబమునకు మూలపురుషుండు పోలభూపాలుండని యుండెనట. ఆయననాఁడు, అమనగండిగోత్రము వీరి కుండెనట. ఈయనసుతుఁడు చెవ్విరెడ్డికాలమున రేచర్లగోత్రముగ మార్పంజెందెనఁట. వీ రాదిజగన్నాథరావుగారి సంతతివారని చెప్పఁబడినది గానవనే యింటిపేరు రావువారనియేర్పడియెను. చెవ్విరెడ్డికాలమునపిల్లలమఱ్ఱి భేతాళరెడ్డి యనుపౌరుషనామ మోరుగంటి ప్రతాపరుద్రభూపతి వీరి కిచ్చి గౌరవించెనఁట.

వెలమవారిగోత్రముల యేర్పాటు వ్రాయఁబడినకాలము శాలివాహనశకము ౧౧౧౦ సంవత్సరములనాఁడు, అప్పనప్రభుండు రేచర్లగోత్రమున కుండెనట. ఆయనయు చెవ్విరెడ్డిప్రభునివలెనే బహుయుద్ధములం జయించి పెక్కుబిరుదములందిన కీర్తిశాలి.

ఈవంశస్థులు చంద్రవంశక్షత్రియులను యుద్ధముల నిహతులంజేసియుంట 'సోమకులపరశురామ' యను బిరుదముం గల్గియుండిరని చెప్పఁబడినది.

# సర్వజ్ఞ సింగమనాయని వంశావళి

వీరు వెలమవారు. ఇప్పటి వేంకటగిరి, బొబ్బిలి, పిఠాపురం జమీందారుల వంశములకు మూలపురుషుఁడు. వీ రింటిపేరు రావువారు.




**సర్వతేజస్సు:**—వ్యుష్టి కొడుకు. తల్లి పుష్కరిణి. భార్య ఆకూతి. కుమారుఁడు చక్షుర్మనువు.

**సర్వపది:**— భట్టికావ్యమునకు మల్లినాథుఁడు రచించినవ్యాఖ్య.

**సర్వమంగళాక్షేత్రము:**—బెంగాల్నాగపూర్ రెయిల్వే మేదినీపురం ఝరియాలైను పైనున్న గార్బెట్టా యనంబడుస్టేషను గ్రామమునందున్న దేవీక్షేత్రము. ఇటఁగల శివలింగమునకు 'కంగేశ్వరుఁ' డని యందురు. కడుపురాతనమైన కట్టడము. ఇట నేఁడు సరస్సులును, వాట్లమధ్యమునం దొక్కొక దేవళమును గలదు. శివాలయము చాల గొప్పది. వీటియాజమాన్య మాయ గ్రామకుటుంబ మనంబడువారిది.

**సర్వర్ధి:**—వత్సరుని భార్య; పుష్పార్ణుని తల్లి.

**సర్వరోగహరణ చక్రాధిదేవతలు ౮:**—దేవీవిద్యోపాసకులు. (మంత్రశాస్త్రమున) శ్రీ చక్రమునందలి సప్తమావరణమున సర్వరోగహరణ (అష్టకోణ) చక్రమున కోణమున కొక్కొక యధిదేవతగా నీయష్టాధిదేవతల నావహించి పూజింతురు.

**సర్వసిద్ధిప్రద అష్టముద్రలు:**— ఇవి మేధాదక్షిణామూర్తి మంత్రజపమున నుత్తరముద్ర

లుగ వాడుచున్నారు. (సర్వసిద్ధిప్రద చతుర్వింశతి పూర్వముద్రలు చూడుఁడు. గాయత్రీ ముద్రలు చూడుఁడు.)

| | |
|---|---|
| ౧ ధేనుముద్ర, | ౨ పరశుముద్ర, |
| ౩ మృగీముద్ర, | ౪ అభయముద్ర, |
| ౫ బోధనముద్ర, | ౬ జ్ఞానముద్ర, |
| ౭ లింగముద్ర, | ౮ నిర్వాణముద్ర. |

**సర్వసిద్ధిప్రద, చతుర్వింశతిముద్రలు:**— ఇవి మేధాదక్షిణామూర్తి మంత్రజపమున పూర్వముద్రలుగ వాడుచున్నారు. (గాయత్రిముద్రలు చూడుఁడు.)

౧ జ్ఞానముద్ర, ౨ తత్త్వముద్ర, ౩ అక్షమాలా ముద్ర, ౪ పుస్తకముద్ర, ౫ త్రిశూలముద్ర, ౬ అభయముద్ర, ౭ వరదముద్ర, ౮ మృగీ ముద్ర, ౯ టంకాముద్ర, ౧౦ హారికముద్ర, ౧౧ కిరీటముద్ర, ౧౨ కుండలముద్ర, ౧౩ చాప ముద్ర, ౧౪ బాణవధముద్ర, ౧౫ కంకణముద్ర, ౧౬ కటిసూత్రముద్ర, ౧౭ తులాకోటిముద్ర, ౧౮ డమరుకముద్ర, ౧౯ పరశుముద్ర, ౨౦ విభూతిముద్ర, ౨౧ ఉద్ధారణముద్ర, ౨౨ కపాలముద్ర, ౨౩ పతకముద్ర, ౨౪ అంగదముద్ర, (సర్వసిద్ధిప్రద, అష్ట, (ఉత్తర) ముద్రలు చూడుఁడు.)

**సర్వాంగాసనము:**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడినయాసనములలో నొకటి. వెల్లకిలఁబరుండి నడుమునకుఁ గ్రిందుగా నిరుదెసల నఱచేతులు రెండింటి నానించి కంఠమువఱకు శరీరమును బైకి లేవనెత్తి (కాళ్లు లాకసమునకు) యుండుట సర్వాంగాసనము.

ఇది యారోగ్యముగల్గించునని చెప్పఁబడినది.

**సర్వాణి లేక సర్వాణికారోగము:**— ఇది నేత్రసంధిరోగముగఁ జెప్పఁబడినది.

**సర్విస్ రేంజి ఎఫెక్టివ్‌రేంజి, (Service range, Effictive range:**—రేడియో వైర్లెస్ సంబంధమున Broad cast transmitter నుండి బయటికిఁ బంపంబడు మాటలు, పాటలు మొదలగునవటనుండి నలుదెసలకేగును. (రేడియో వైర్లెస్ చూడుఁడు). అట్లేగుట మాటలంబంపు స్టేషనునందలి ట్రాన్సుమిటరు మొదలగు యంత్ర పరికరముల శక్తిసామర్థ్యముల పరిస్థితులంబట్టియు, పిదప Recieving station నందలి యంత్రములు, నందు ముఖ్యముగ Recieving set పరిస్థితుల ననుసరించి యుండును.

ట్రాన్సుమిటరునుండి రిసీవరువఱకుఁ గల దూరము రెండువిధములుగఁ జెప్పఁబడుచున్నది. సర్విస్‌రేంజి (service range) అనిన కావలసిన తావునకు మాత్రము గలదూరము. ఎఫెక్టివ్‌రేం (Effective range) యనిన పైపరిస్థితులకు లోఁబడి యాధ్వను లెంతదూర మింకను బోవు లుగునో యంతదూరమునకుఁ జేరును.

ఇవి సర్వసాధారణముగ గ్రహింపఁజాల రనివారు తమ ario set బలహీనమనియు, సరిగా బనిసేయుట లేదనియు, transmetting station నందు బలహీనతగల్గిన దనియుఁ దలంచి పొరపడుచుందురు.

**సర్వేగుణాః కాంచనమాశ్రయంతి:**- ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి.

ఇందుఁ గాంచన (బంగారు) మనఁ గాంచనము గలవాఁడని (ధనవంతుఁడని) యర్థము. ధనవంతు

నన్నిగుణము (యోగ్యతలు) లాశజయించియుండు నని భావము. (ఆంధ్రలోకోక్తి.)

**సర్వెంటాఫిండియా సంఘము, పూనా:—** తొల్లింటికాలమున నాంగ్లవిద్యవ్యాపింపక పూర్వము దేశసేవయొనర్చువారిని ప్రభుత్వము వారివిరోధులుగఁ దలంచుచుండిరి. గొప్పపేరు సంపాదింపఁగోరిన దేశబాంధవు లనేకులు ప్రజల నుండి డబ్బుతీసుకొని మోసగించుచుఁ గొంత కాలము పరాక్రమశాలులై యుండిరి. నిజమున దేశసేవయొనర్చువారు తక్కువగనేయుండి బలము చాలకుండెను. ఈదుస్థితిం దొలఁగించి కొందఱు దేశసేవానిరతులను సిద్ధపఱుచుట కర్తవ్యమేమో యని గోఖ్లేమహాశయుఁడు తలంచుచు పూనా నగరమునుండి శాంగ్లీపురమునకేగుచు, నచటిదేశ భక్తులగు డాక్టరు దేవు అచ్యుతరాందేశాయి గార్లతో ముచ్చటించుచు విధానమును దర్కిం చుచుండెడివాఁడు.

ఎట్టకేలకు క్రీ.వె. ౧౯౦౫ సంవత్సరమున జూన్ ౧౨వ తేదీని గోఖ్లేమహాశయుఁడే పూనానగరమున 'సర్వెంటాఫ్ ఇండియాసంఘమును స్థాపించి, యం దు యువకులను సభ్యులుగఁ జేర్పనారంభించెను. దేశమున రాజకీయప్రజాసేవ యొనర్చువారు తప్పు త్రోవలఁబడకుండ వారి కర్హవిద్యంగఱపి యాయ త్తపఱచుటకీసంఘోద్దేశ్యమని చెప్పఁబడినది. ఇప్పు డీసంఘ కార్యాలయభవనములు మొదలగునవి పూనానగరములోని చతుశ్శృంగియనఁబడు పర్వ తోపరిభాగమునందుఁ గాననగును. ఆసంఘమున కగ్రాసనాధిపతి లేఁడు. ప్రథమసభ్యుఁడే యాకా ర్యనిర్వహణ మొనర్చును. గోఖలేగారే ప్రథమ సభ్యుఁడై జన్మాంతము సేవయొనర్చెను. ఈయనకుఁ బిదప వీరిశిష్యులలో నగ్రగణ్యుండగు రైటాన రేబిల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారు ప్రథమ సభ్యులైరి.

ఈసంస్థకు సంవత్సరమున కిరువదివేలరూప్యము లవ్యయము కలదఁట. పెక్కండ్రు ధనికులు దీని యందు బాధ్యతవహించి యున్నారు. దీనికి గొప్ప పుస్తకభాండాగారము కలదు. అందు వివిధదేశ ముల రాజకీయార్థికస్థితులం దెలుపుగ్రంథములు, మహనీయుల జీవితచరిత్రలు, ప్రభుత్వప్రచుర ములు మొదలగు కొన్నిగ్రంథములు గలవు. అవి రాజకీయ విద్యాభ్యాసికే గాక రాజ్యకార్యధురం ధరులకుఁగూడ నవసరములే.

ఇందుఁ బెక్కుగ్రంథములు హిందుదేశాభి మానియగు డిగ్బీ యనునాంగ్లేయునివై యుండి, వారివద్దనుండి వాడియా యనుధర్మాత్మునిచేఁ గొనఁబడి, యీసంస్థ కీయఁబడినవి.

ఈసంఘమునఁ జేరఁబోవుసభ్యులు పట్టపరీక్ష యందుఁ గృతార్థులైనవారుగ నుండవలయును. వా రిందుఁ జేరునపుడు ప్రమాణపూర్వకముగ నేఁడువిధులకు లోఁబడవలసియుండును. మఱియుఁ బ్రథమసభ్యునికడ రాజకీయవిద్యం జనువుచు విద్యార్థివలె వారికి లోఁబడి విద్య నభ్యసింపవలె ను. ఐదుసంవత్సరములు విద్యాభ్యాసకాలము ముగియువఱకు నుపన్యాసము లీయఁగూడదు.

౧ దేశాభివృద్ధికరము లగువిషయములనే చింత చేయుచు తనసామర్థ్యమునెల్ల మాతృదేశసే వకై వినియోగించుచుందునని ప్రమాణము.

౨ స్వవిషయమగువాంఛల నాసించుట మాను కొందునని ప్రమాణము.

3 జాతి మత భేదముం బాటింపక, యెల్లరం బ్రే మించుచు సోదరులుగ భావించి వారిక్షేమ మునకై కృషిసల్పుటకుఁ బ్రమాణము.

౪ సంఘమువారు తనకిచ్చుద్రవ్యముతోఁ గుటుంబపోషణ మొనర్చుకొనుచు స్వలాభమునకై ధనము నార్జింపక దేశసేవకు స్వాధీనుఁడనై యుండునని ప్రమాణము.

౫ సత్ప్రవర్తనఁ గల్గియుండునని ప్రమాణము.

౬ పరులతో స్వవిషయమైనపోరాటములు సలుపకుండుటకుఁ బ్రమాణము.

౭ సర్వకాలసర్వావస్థలందు సంఘోద్దేశముల పని నభివృద్ధినిఁగోరుచు వానిసాఫల్యమునకై పాటుపడుచు వానికి వ్యతిరేకములగు కార్యముల నేమియు నొనర్పనని ప్రమాణము.

ఇప్పుడీ సంస్థకుఁజేరిన యాస్తులు రెండులక్షల రూప్యముల విలువయుండుననియు నివిగాక యింక లక్షరూప్యములకుఁ బైగా నుండుననియుఁ దలంపఁబడుచున్నది.

## సర్వేయింగ్ ఎండు లెవిలింగ్ (Surveying and Levelling):—

ఇది Civil Engeneering నకుఁ జెందిన యొక యుపకల. భూముల పరిమాణము, కొండలయెత్తులు మొదలగువాటిని గొలుచువిధానమునకుఁ బేరు. ఎత్తుపల్లముల నెఱుంగువిద్యకు 'Levelling' అనెదరు.

స నాల్గువిధానములు వాడుకయం దున్నవి

౧ Theodilate సర్వే. ఇది యెక్కువవిస్తీర్ణములుగల ప్రదేశములను గొలుచువిధానము. ఇది To-pography of (the area) the lands ను గూర్చి వివరించెడిని. మఱియు దీని సాహాయ్యమునసే పర్వతాదుల యెత్తులం గొలిచెదరు. ఇది భూపటములు వ్రాయుటయం దుపయోగించును.

౨ Chain Survay— ఇది గొలుసుతోఁ గొలుచుకొలత. Theodilate survey ప్రదేశములలో తప్పిళ్ళుకొలతలకుఁ గాను Chain survey ప్రదేశములను గొలుసులతోఁ గొలిచి సరిచూచి ప్లానుల నెక్కించుకొనెదరు. నిష్కర్షగా నుండుకొలత. ఈగొలుసులు [Chains] ద్వివిధములుగ నున్నవి. ౧ P. W. D. Chain. ఇది నూరడుగుల పొడవుండును. ఇం దొక్కొక యడుగుప్రదేశ మొక 'Link' అనియెదరు. ఇది D. P. W. శాఖోద్యోగసంబంధపుఁ గొలతల కుపయోగించుచున్నారు. ౨ Gunters Chain. దీనిపొడవు 66.66 అడుగులుండును. ఇందున నూరులింకు లుండును.

ఈగొలుసునందలి లింకుపరిమాణ మించుమించు 7.9 in ఉండెడిని. ఇది రెవిన్యూశాఖవారి (Revenue Department) పొలములు, ప్రదేశములు మొదలగువాటికి నుపయోగించుచున్నారు. దీనితోఁ జేయఁబడినసర్వే రివిన్యూసర్వేయని చెప్పఁబడుచున్నది. ప్రభుత్వశాఖయగు సర్వేడిపార్టుమెంటువా రొనర్చు సర్వేలన్నియు నీగొలుసులతోఁ జేయఁబడునవియే.

3 ప్రిజ్మాటిక్కు లేక కంపస్‌సర్వే— ఇది యెక్కువనిష్కర్షగా నుండఁదగిన సర్వేచేయుట కుపయోగించు విధానము. ఇం దుపయోగించుకంపసు (దిక్కులంజూపు యంత్రము) నందు మూఁడువందల యఱువదిడిగ్రీలు గీయఁబడియుంట ప్రదేశము యొక్క వేర్వేఱుదిక్కులహద్దులు, లోని తప్పిన్లు చూపుటయం దీ Compass ఎక్కువసాహాయ్యకారియై కొలతను, దిశలను హెచ్చుతగ్గులు గాసీక

సరిగాఁ జూపుచుండెడిని. ఇది కనుచూపుకన్న నధికదూరముగలవానిని కొలువఁజాలదు.

౪ Plane table survey— ఇది సర్వే చేయఁబడు ప్రదేశములందే యొకముక్కాలిబల్ల పైఁ గాగితమును బిగించుకొని కొలువఁ దగిన హద్దుల నానవాలుజండాల నాటుకొని వాని కర్తవ్యమగు గీతలం గీచుకొనుచుఁ జేయు కొలతకు 'ప్లేన్టేబిలుసర్వే' యని పేరు. దీనిమూలమున పైనుసర్వేకన్న నతిత్వరితముగ Survey చేయనయ్యెడిని. అంతియేగాక నతిజాగ్రతగా locality గుర్తింప నగుచున్నది.

ఈనాల్గును కొలత లోసర్వనగు విధానములు. ఇంక areal survey యనంబడునది ఏరోప్లేను లెగురుటకు గాలి వాటములంగల్గిన యాకాశమార్గములు marine survey యనిన సముద్రము నందు మెరకపల్లముల నరసి యోడ లేగఁదగిన సిరపాయమార్గములు వేరుగ నీడినములం దేర్పడి యున్నను నవి పైన వివరింపఁబడిన నాల్గువిధముల సర్వేలతోనే సంబంధములు గలవి గావు.

రెయిల్వేసర్వేయనంబడు సర్వే యిటీవల నేర్పడియున్నది. అందినుపబాటలకు వలయు మెరకపల్లములు వంకలు (Curves) tunnulling, bridging, Excavations, Embank, ments, Levels మొదలగున వన్నియు పాటింపఁబడుచుండును.

ఇరిగేషన్సర్వే యనంబడు సర్వేయందు నదులు, సరస్సులు నానకట్టుకట్టుట కర్తవ్యస్థానములు. నీటికాల్వలం ద్రవ్యనర్తనములగుమార్గము, పొలములకు సస్యోపయోగముగ నెక్కువప్రదేశమునకు నీరియ్యఁదగిన విధానఁపు మెళుకువలు, లాకులు, మురుగుకాల్వలు మొదలగువాట్లంగూర్చి వివరించుకళ యైయున్నది.

Geological survey యనంబడు సర్వేయందు భూమిలోనున్న లోహములు, ఖనిజపదార్థములు, గండశిలలు మొదలగువాటింగూర్చి వివరింపఁబడును. దీనివలన భూమియందున్న లోహాదులను, భూమిపైనున్న మట్టి (strata) రాళ్ళు, ఇతరపదార్థములు మొదలగువాటింబట్టి పోల్చ నగును. దీనికి 'mining survey' అనియందురు.

సర్వే యనిన కొలచి తెలిసికొనుటయని యర్థము. గాన Rural survey, Economic survey, Trade survey, Zoological survey (Tanna), Botanical survey (Flora), Geographical survey, Archaeological survey, Astronomical survey, Map survey, Topographical survey (ఈరెండునూ geographical survey లోని యంతశ్శాఖలు). మొదలగుసర్వేలు కలవు. ఇవి యన్నియు civil Engineering నకుఁ జెందినశాఖలై యున్నవి.

ఇంక నెత్తుపల్లములు నెఱుంగువిద్యయగు levelling దీనితోఁజేరినదియే. కొలచుప్రదేశములందున్న మెరకపల్లముల నెఱుంగుట, వాటియెత్తు లోతులం గొలుచుట మొదలగుకార్యములకు 'levelling instrument' అను యంత్రపరికరమూలమునఁ గొలవనగుచున్నది. ఇది యొకగాజు గొట్టమును, అందు గాలియు, దానినడుమ Vaccume ఉండెడిని. దానిమూలమున నెఱుంగఁగల్గుచున్నారు. దీని కింకను టెలిస్కోపుయంత్ర మమర్పఁబడియే యుండెడిని. దారిపొడవునను మెరకపల్లముల నొక contouring chart చేసికొనుచు నరిగి ప్లానులను వ్రాయుచుందురు. మఱియు గట్లు, కాల్వలు చేయుటయం దీలెవెలింగుపని యత్యవసరమెయుండెడిని. ఈసందర్భమున

భరతదేశమునందలి కరాచీపట్టణముకడ sea-level standard గా గైకొని దానికి 'Beach Mark అని పేరిడియున్నారు.

## సర్వోహిలోకో హ్రియతే ప్రియేణః—

ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. లోకులందఱుఁ బ్రియవాక్యముల నామోదించు చుందురని భావము.

## సర్టిఫికేటు (Certificate):—

వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఒకసంగతి యదార్థమనియు, సన్నృతముకాదనియు, దానినెఱింగిన యధికారి యొసంగిన యథార్థపత్రము. యథార్థమని తెలుపుటకు లేక Certificate నొసంగుటకు 'to Certify' అనియెదరు. ఒకఁడు దివాలాతీసి నిరాస్తిపరుడగుట యథార్థమేయని న్యాయస్థానమువారు తీర్మానఁపుఁబత్రమొసంగుతరి Certificated Bankruph' అనియెదరు. ఒకసంబంధఁపు వాటా లొకరికుండ వాట్లలోఁ గొన్నిటినమ్మికొనినేసి మిగిలినవి వానికున్నట్లును, అమ్మినవి కొనినవారికున్నట్లును వారివారి పేర్ల నాసంఘమువా రొసంగు యథార్థపత్రమునకు 'Certificates of shares' అనియెదరు. ఓడపై దిగుసరుకునకు నష్టము damage కల్గినట్లోడయధికారిచ్చిన పత్రమునకు 'Certificate of damage' అని పేరు. ఒకవర్తకసంఘమును రిజిస్ట్రారాఫీసులో రిజిష్టరైనట్లు రిజిస్ట్రారిచ్చు పత్రమునకు 'Certificate of incorporation' అనిపేరు. ఒక transfer యథార్థముగ జరిగినదని యిచ్చు యథార్థపత్రమునకు Certificate of Transfer అనిపేరు.

## సర్హిందుపురము:—

ఇది పాడుపడియున్న పురము. పంజాబులోనిది. హిందూముసల్మాను రాజ్యములకు సరిహద్దుపురమని యర్థమఁట. కాని దీనితొల్లింటిపేరు సైరంధ్రిపుర మనియుఁ జిన్నరాజ్యమునకు రాజధానిగ నుండెననియు, సైరంధ్రులు ప్రజలనియుఁ బరిశీలనలనుండి తేలుచున్నదట. వరాహమిహిరుని బృహత్సంహితయందును, నంతకుఁబూర్వుఁడగు పరాశరజ్యోతిషశాస్త్రకారుని గ్రంథములందునను, 'సైరంధ్రి పుర' మనియే పేర్కొనఁబడినది.

## సర్ప్లస్వర్క్సు (Surplus works):—

ఇరిగేషన్ ఎంజినీరింగునందు వివరింపఁబడిన నిర్మాణములు. (ఇరిగేషన్ చూడుఁడు).

కాల్వలయందుఁ గాని, రిజర్వాయరులందుఁ గాని, చెఱువులందుఁగాని పట్టఁదగినవిగ నిర్మాణకాలమునం దేర్పఱుచుకొనిన నీటిపరిమితికన్న నెక్కువగా జలములు (వర్షములు, వెల్లువలు, ముంపులు మొదలగు కారణములచే) వాట్లయందుఁ జేరినిలిచిపోవునేని వాటిగట్లకపాయకరముగ వాటిని భగ్నముచేయనోపుఁగాన నట్టిబాధలు కలుగకుండ వాటియం దర్థస్థలముల పొరలుపింగలాలు లేక పొర్లుపాఱుదలలు (Escapes), 'సర్ప్లస్ వీర్సు' (Surplus weirs) 'సర్ప్లస్ స్లూస్' (Surplus stues) మొదలగుపొర్లుపారుదలలను [Escapes] నిర్మింతురు. ఇవి యధనముగానున్న నీటిని భద్రముగను, నిరపాయకరముగను నుండ వీలుగఁ జేసిని.

## సలార్ (శైలార్) క్షత్రియులు:—

(క్షత్రియకులముఁ జూడుఁడు.)

## సలిలరాజతీర్థము:—

(వరుణతీర్థము చూడుఁడు.)

## సల్ఫేటు (Snlphate):—

సల్ఫ్యూరిక్ ఆసిడ్కుఁ జేరిన కొన్ని [salts] కి పేరిడఁబడినది.

కొన్ని Natural sulphates యందు Epsom salts - Gypsum - Barite - Celestine - Chalcauthite మొదలగునవి చెప్పఁబడినవి.

ఈసందర్భమున 'sulphate of ammonia netrogenons' అనియు, Gas works నందు by prouduct గాఁ జేయఁబడుచున్నదనియు మనస్సునం దుంచుకొనవలయును.

**సల్ఫైడ్కలర్సు (Sulphide colours) రంగులు:**— (రంగులు చూడుఁడు.)

**సవనుఁడు:**—ప్రియవ్రతుని కుమాళ్ళలో నొకఁడు. ఇతఁడు పుష్కరద్వీప మేలినవాఁడు. కుమా ళ్లిద్దరు.

**సవరను (సవరసు) నాణెము (Sovereign):**—ఇది బ్రిటన్, ఐర్లాండు దేశముల బంగరు నాణెములు. ఆంధ్రదేశమున దీనిని 'సవరను', సవరసు, పెద్దకాసు, అనంబడుచున్నది. బ్రిటీషుద్వీపములందు పౌను (20 షిల్లింగులు) గా వాడఁబడుచున్నది. ఏఁడవ హెన్రీభూపతివలన నేర్పఱుపఁబడినది. ౧౮౧౭ సంవత్సరమున 'Standard money' అనఁబడినది. క్రీ. వె. ౧౯౧౪ లోఁ బ్రచారమునుండి నిలిపివేయఁబడినది.

**సవరము చిననారాయణరాజు కవి:**— ఈతని కేలనో సవరము చిననారాయణనాయకుఁడని వాడుక పేరుకల్గెను. ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ జేర్కొనఁబడివాఁడు. క్షత్రియుఁడు. కాశ్యపసగోత్రము. తండ్రిపేరు రాయభూపాలుఁడు, తల్లిపేరు తిరుమలాంబ. రాయభూపాలునకు, తిమ్మయ్య యనియు, తిరుమలయ్య యనియు నిరువురుభార్యలు. అందు తిమ్మయ్యవలన ౧ వేంకటరాజు, ౨ రంగరాజు ననుసుతులును, తిరుమలయ్యవలన 3 గోపాలరాజు, ౪ చిననారాయణరాజు (కృతికర్త), ౫ కస్తూరిరాజు, ౬ రఘునాథరాజు, ౭ తిమ్మరాజు ననువారును గల్గిరి. గాన వీరందఱు సోదరులే.

చిననారాయణరాజు కువలయాశ్వచరిత్ర మను ప్రబంధమును రచించి, తిమ్మనరపాలసుతుండగు నారాయణభూపతికిఁ గృతి యిచ్చెను. మఱియు నీరాయణనృపతి సామంతుఁడుగ నార్వీటి శ్రీరంగ రాజసుతుండగు వేంకటపతిరాజునను యువసాహాయ్య మొనర్చినకతన క్రి. వె. ౧౫౮౦ ప్రాంతమున నుండినట్లు తలంపఁబడుచున్నాఁడు.

**సవ్యాపసవ్యపద్మాసనము:**- యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి [ఆసనములు చూడుఁడు.] ఇది పద్మాసనమునకు సంబంధించిన యవాంతరభేదాసనము. ముందుగ నెడమపాదమును కుడితొడపై నుంచి, పిదప కుడి పాదము నెడమతొడపై నుంచి, తక్కినదంతయుఁ బద్మాసనమువలెనే చేయునది.

(పద్మాసనము చూడుఁడు).

**సశబ్దమార్గక్రియ:**— ఇది నాల్గువిధములు. ౧ ధ్రువము, ౨ శమ్యము, 3 తాళము, సన్నిపాతమునని. (క్రియాపాణము చూడుఁడు).

**సస్రామునందలి షర్షాగోరీ:**—సస్రాం పట్టణము బీహారములోనిది. గయాప్రాంతము. ఇట షర్షాగోరీ కలదు. ఈతఁడు చరిత్రప్రసిద్ధుఁడు. ఆఫ్ఘనుదేశస్థుఁడగు భూపతిగోరీపై గొప్ప భవనము నిర్మింపఁబడినది. మహమ్మదీయులు దీనిని భక్తితో దర్శించుట కలదు.

**సస్పెన్సు (Suspense):**— వాణిజ్యసంబంధపరిభాషాపదము. తాత్కాలికముగనాపివేయుట

కీపేరు వర్తించును. ఒకవ్యవహారమున సరియగు భోగట్టా రాకుండమిగాని, విపరీతపు వార్తలు తెలియుటఁగాని, చావుచేటులవలనఁగాని, ఎక్కౌంటులు, వ్యాపారఁపుఁబనులు నాపివేయుట కీపేరు వర్తించును. ఇట్లే సొమ్ము చెల్లించ నాపివేయుటకు 'Suspension of payments' అని యెదరు.

## సహచౌలిగోత్రము:—

[పరాశరగణము చూడుఁడు.]

## సహజ స్వభావలక్షణశక్తి (Instinct):-

దీనిపే రాంధ్రమున రచించుటకన్న నాంగ్లమున వచించిన భరతదేశమున సర్వసాధారణముగ నెల్లరకుఁ దెలిసెడిని. నిజమున దీనినెల్లరు గన్గొనుచుండుట ననుదినమును జరుగుచునే యుండును. కుక్కలు తనయజమాని యడుగులతావులను పసిఁబట్టుచు నెంతదూరమైన నేగుచుంట ఇన్‌సింగ్టే. తలిదండ్రులకు బిడ్డలపైఁ బ్రేమయుండుటయు, పిల్లులకుఁ గుక్కలకు వైరముగల్గుచుండుటయు, నిట్టివియే. సహజస్వభావలక్షణశక్తి వేర్వేఱు జాతులజీవములందు వేర్వేరై యుండినను, ఉన్నతావులందు భేదములుండవు. మానవులు కొందరు గడసరులు దాని నించుక దాఁచుకొనఁగల్గియున్నను నైసర్గికముగ వారియం దాలక్షణము లుండక పోవు.

దీనింగూర్చి గొప్పపరిశీలన లొనర్చి లోకమునకుఁ దెల్పినవాఁడు Proffessor william Mc. Dougall పండితుఁడు. ఈతఁడు క్రీ. శ. ౧౯ శతాబ్దకాలమునం దుండినవాఁడు. ఆంగ్లేయుఁడు. అమెరికాసంయుక్తరాష్ట్రములం దుపాధ్యాయుఁడుగ నున్నవాఁడు. ఆమహనీయుఁడు చిరస్మరణీయుఁ డగుఁగాక. ఆయన కభిమానశాస్త్రము Psychology (సైకాలోజీయనంబడుకల) అందులోనిదే. ఈ instinct ధర్మ మాయనడక్కులమేరకు ౧౩ ప్రధాన సహజస్వభావలక్షణశక్తులు [instinct] అనియు, నింకఁ గొన్ని చిన్నచిన్నవగు ఇన్స్టింగ్ట్సు కలవనియుఁ దేలుచున్నవి. వాటిని వివరించుటకు మున్నుగ సైకాలోజి నాంధ్రమున 'ఆత్మవిచారము లేక మనశ్శాస్త్ర'మని చెప్పవలసియుండునని వివరించుట సమంజసము. డౌగాల్ పండితుఁడు వీటి నిటుల వివరించియున్నాఁడు.

"It is inherited for an innate Psycho - Phynical (pertaining to mind and body) disposition which deter mines its possessor to percei ve and pay attention to objects of a certain class to experience an imotional excitment of a particular quality upon perceiving such an object, and to act in regard to it in a particular manner, or to experience an impulse to such action." దీనింగూర్చి ఇంకను నిస్సంశయముగ వివరింపంబ్రయత్నించినవారు "Instiucts are not to be regarded as blind but they are main springs of purpose they are fundamental urges directed by intelligence to wards Very definite goals". "It is bassed on doctrine of purpose fulness of all mental life, it is of ten described as "purposivism."

తొలుదొల్త సైకాలోజిశాస్త్ర పితరుఁడనంబడిన డా. Sigmemd Frend పండితుఁడాశాస్త్రకర్తగాఁ బేర్కొనఁబడినవాఁడు. ఆయన instiuct ను ద్వివిధములుగ విభజించెను. అవి ౧ Eros [ప్రేమసంబంధములు] ౨ death

(బాధసంబంధము) లని. మొదటిదానియందు దాత్మ •ప్రేమ, తలిదండ్రులపైఁ బ్రేమ, పిల్లలపై ప్రేమ యు, మిత్రప్రేమ పిదప మానవత్వముపై ప్రేమ, తానమ్మినవాటిపై భక్తియుం జేరియుండెడివి. రెండవదానియందు aggressinencss అన్యుల బాధించుట, దుఃఖసంబంధములు మొదలగునవి యు నుండెడివి. ఇది irrorganic staze మొద లుకొని Living matter యొక్క general triend దనుక నుండునని తలంపఁబడినది. ఇంకఁ గొంద అన్యపరిశీలకులు ప్రత్యేకతలను నుడివి యుండిరట. Frend పండితుఁడు Sex instinct ను చక్కఁగఁ బరిశీలించియుండిన వాఁడందురు. ఆయన "It binds individual to society is not remotely different from that binding him to his love object" అని తలంచి వివరించెనట.

ఇంకఁ దరువాతిపరిశీలకుఁడగు Dougall పండితుని పదమూఁడు ముఖ్య సహజ స్వభావలక్షణ శక్తులను (instincts) వివరించుట సముఁజసము. అవి యిటుల వివరింపఁబడినవి.

(1) Parental instinct (మాతృపితృసంబంధము)
(2) Combative instinct (కలహప్రియత్వ సంబంధము)
(3) Curious instinct (జిజ్ఞాససంబంధము)
(4) Hunger instinct (వాంఛించు లేక ఆకలి, అపేక్షించుసంబంధము)
(5) Repulsion instinct (నిరాకరణము లేక పరాభవసంబంధము)
(6) Escape instinct (తప్పించుకొనిపోవు సంబంధము)
(7) Herd instinct (మంద లేక సంఘ సాముదాయిక సంబంధము)



(8) Self assertion instinct (స్వసంబంధోక్తి సంబంధము)
(9) Submisstion instinct (నమ్రత లేక విధేయతసంబంధము)
(10) Mating instinct (మైత్రిసంబంధము)
(11) Acguisitive instinct నేర్చుకొను లేక సంపాదించుశక్తి సంబంధము)
(12) Constructive instinct (నిర్మాణసంబంధము).
(13) Appeal instinct [విన్నవించు దీనాలాప సంబంధము]

వీనికింకను గొన్ని యంతగాఁ బ్రాముఖ్యములు గాని 'instincts' గలవందురు.

## సహజానందము:—

(ఆనందము చూడుఁడు).

**సహదేవి:—** దేవకుని కుమార్తె. వసుదేవుని భార్య. కుమారుఁడు శుభ్రతముఖ్యుఁడు.

**సహదేవిచెట్టు:—** లా. Conyza Cinerea. ఆంగ్ల Osh coloured flia bane. సం. సహదేవీ. దీనివేరుయొక్క, ఆకుల యొక్క రసకషాయములు గర్భిణీస్త్రీల జ్వరముల నడంచుననియు, ఆకు నూరి కట్టిన కండ్లమొలు పులు మానుననియుఁ జెప్పఁబడినది.

**సహదేవుఁడు:—** అత్రి చంద్ర పూరువు కురు బార్హద్రథసంతతి క్షత్రియుఁడు. తండ్రి జరాసంధుఁడు. కుమారుఁడు మార్జాలి. ఈసహదేవసంతతివా రిరువదియొక్కరు మగధరాజ్యమును భారతయుద్ధమునకుఁ బిదప రాజ్యముఁ జేసికొని యేలిరి.

మఱియు పాండవులలోఁ గనిష్టుఁడొక సహదేవుఁడు. తల్లి కుంతి. అశ్వినీదేవతలయంశమున

జనించినవాఁడు. పుత్త్రులు ద్రౌపదివలన శ్రుతసేనుఁడు, విజయవలన సుహోత్రుఁడు ననువిద్దఱు.

ఇంకను సుదాసునిసుతునకు సహదేవుఁడని యే పేరు. ఈతనిసుతుండు సోమకుఁడు.

**సహారాయెడారి:—** దీనిని గొందఱు తప్పుగా 'షహారాయెడారి' యనియెదరు. ఇంకను గొందఱు గొప్పయెడారి (Great Desert) అనియెదరు. ఉత్తరమున బేర్బరీస్టేట్సుదేశము, తూర్పున నీజిప్టుదేశము, పశ్చిమమున నట్లాంటిక్కుమహాసముద్రమధ్యమున వ్యాపించియున్న మహాసైకతస్థలిప్రదేశము. ఇది యాఫ్రికాఖండములోనిదని యందఱెఱింగినదే. దీని పూర్వభాగమునకు 'లైబ్యన్ఎడారి' యని కొందఱు వాడుచున్నారు. ఇది వేఁడిగాడ్పు లన్నిదిశలనుండి వీచుప్రదేశము. మేఘములంబోలి యిసుక గాలిదుమారముతోఁ బైకి లేచి నేలంబడుచుండును. ఒక్కొకతఱి కార్వానాలు నడుచుమార్గముల నేగుచున్నవెుంటెలను, మార్గస్థులను గప్పివేయునని చెప్పుదురు. వర్షము లిందుఁ గురియనే కురియవు. వేఁడి పగళ్ళయందుఁ దాండవ మాడుచున్నను, రాత్రులందు మంచును, శీతమును గల్గియుండెడిని.

సహారాయెడారి యంతయు సంచుమించు సముద్రంపునీటిమట్టముపై ౧౫౦౦ అడుగులయెత్తుగలదియై సీఠభూమివలె నుండును. ఇందచ్చటచ్చటఁ గంకరయు, సర్వత్రా యిసుకయుఁ గల్గియుంటయేగాక ననేకచిన్నకొండలును, గొన్ని ౪౦౦౦ అడుగులు మొదలు ౭౦౦౦ అడుగులవఱకు నెత్తుగల కొండలును గలవు. ఇసుకదిబ్బలు కొండలవలెనే కన్పించునవి కొన్ని కలవు. ఇందు నదులు లేవు. శీతకాలమున నట్లాంటిక్కుమహాసముద్రమునుండియు, ఎడారిపై గాలి వీచుచుండుం గాని యిం దేమాత్రమును చెమ్మగాని, చల్లదనముగాని యుండనే యుండదు. తక్కిన వేసవియం దెడారినుండియే గాడ్పు లట్లాంటిక్కుమహాసముద్రములోనికి వీచెడిని. మొరాకోదేశఁపు దక్షిణభాగము ప్రారంభముగ నట్లాంటిక్కుసముద్రము దనుక నొకపల్లఁపుఁబ్రదేశమును, అం దుప్పునీటిసరస్సులు కొన్నియును, నెడారియందుఁ గలవు. ఈప్రాంతము దాహోదక మనునది దొరకని ఘోరతర ప్రదేశమని చెప్పఁదగినది.

సహారాయెడారి పొడవున ననేకదిక్కులుగ లోటిపిటలకారవానులు నడచుమార్గములు లెక్కలేకయున్నవి. అవి యిసుకయందలి కాలిబాటలే గాని, పరుపంబడిన రస్తాలు కావు. వానిపై కార్వానాలు, ఒంటెలు, ఎడ్లు మొదలగువానిపై సరకులం గైకొని వేర్వేఱుదేశములకు వాని మార్గములంబడి నడుచుచుఁ బోవుచుంట యెడారి యంతటను గానవగుచుండును. మఱియు నీయెడారి యంతటను నచ్చటచ్చట నీటియూటలప్రదేశము లున్నతావుల నొక నుయ్యియుఁ గొన్ని చెట్లుచేమలు పెరిగియుండు నత్తావులందుఁ గార్వానాలు విడసి పగటిని గడపి తిరుగ రాత్రులందుఁ



బయనము సాగించు చుండును. ఇవి 'ఓయసిస్' లనంబడుచున్నవి. ఇవి యెడారి యంతటను దూరదూరము లందుఁ గలవు. వీటిలోఁ గొన్ని యించుక పెద్దవియై పట్టణముగ బలసియుండుటయు నందు సింహములు మొదలగు నడవిమృగము లుంటయు వార్తలుగఁ దెలియుచుండును.

వీనియం దారబులు, మూరులు, బెడోయినులు, తమగుడారముల గ్రామములతోఁ దిరుగు

చుందురు. ఒయాసీసులకడ జలములకై యాఁగుచు వర్తకసరకులం గొనిపోవుచుండు కార్వానాజనులు, బెడోయినులు, అరబ్బులు, మూరులు, నీమెడారి ప్రజలనవలయునేగాని నివాసము కుదిరినవా రెవ్వరును లేరు. దీని కుత్తరదేశవాసులు బెర్బరజాతులును, దక్షిణదేశవాసులు నీగ్రోలు నని యెఱుంగునది. ఎడారిపశ్చిమభాగము తమదని ఫ్రెంచివారనుచున్నారు. (ఆఫ్రికాఖండము చూడుఁడు).

ఈయెడారిగుండా యినుపబాట వేయుటకుఁ దలపఁబడియున్నది. అర్థ్వాస్థలములందు జెట్లు నాటుటకుఁగూడ తలంపఁబడుచున్నది.

**సహస్రపాదుఁడు:—** ఋషి. ఖగము ఖుఁడును, సహస్రపాదుఁడును సహాధ్యాయులు. పరియాచకమున కొకతరి సహస్రపాదుఁడు గడ్డిపాము ను ఖగముఖునిపై వైవ నాతఁడదరిపడి కోపమున 'నీవు సర్ప మగుదువుగాక' యని శపించెనట. సహస్రపాదుఁడు డుండుభమై చిరకాలముండి రురునిదర్శనమున శాపవిముక్తిఁ గల్గించుకొనె నట.

**సహస్రజిత్తు:—** అత్రిసంతతి. చంద్రవంశము. యదువుయొక్క జ్యేష్ఠపుత్రుఁడు. క్షత్రియుఁడు. (యాదవులు). కుమారుఁడు శతజిత్తు.

మఱియు యాదవులలోని భజమానునిసుతులలో నొకనికి సహస్రజిత్తని పేరు గలదు.

**సహసారామము:—** ఇప్పుడు బీహారమునం దున్నది. ఇప్పుడు 'ససరా' మనంబడుచున్న పురము. షహాబాదుజిల్లాలో నున్నది.

**సహసా విదధీత న క్రియామ్:—** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. ఏపనిగాని తొందరపడిచేయుట యసమంజసమని భావము.

**సహస్రానీకుఁడు:—** అత్రి చంద్రపూరువు కురువు కురు పరీక్షిత్తుసంతతి క్షత్రియుఁడు. తండ్రి శతానీకుఁడు, అశ్వమేధజుఁడు.

**సహాయసిద్ధి:—**
(లోకనీతిసిద్ధులు చూడుఁడు).

**సహ్యాద్రిజానది:—**
కావేరీనది కీపేరు గలదు.

**సహ్యాద్రిపంక్తి:—** పడమటి కనుమల కీపేరు గలదు. అందు ముఖ్యముగ కావేరీనది కుత్తరభాగమునకు నీపేరు వర్తించునందురు. దక్షిణభాగమునకు 'మలయగిరి' యందురు. కావేరీనదికి 'సహ్యాద్రిజ' యని పేరు కలదు

**సహ్యాద్రిమలయపర్వతములు:—** పడమటికనుమలయందుఁ గావేరీనదీజన్మస్థానమున కుత్తరభాగమునకు సహ్యాద్రి యనియు, దక్షిణభాగమునకు మలయపర్వత మనియుఁ బేర్లుగ మహావీరచరిత్ర నాటకము పంచమాంకమునఁ గలదు.

మఱియుఁ గావేరీనదికి 'సహ్యాద్రిజా' యనిపేరు కలదని శివపురాణము విద్యేశ్వరసంహిత ౧౦ వలన దెలియుచున్నది.

**సహ్యామలకగ్రామము:—**
(ఆమలకగ్రామము చూడుఁడు).

**సహిగోత్రము:—**
(సంకృతి ఉపగణము చూడుఁడు).

**సహితకుంభకము:—** ఇది సగర్భమనియు, నిర్గర్భమనియు ద్వివిధము. సగర్భ ముకారస్వరస్మరణయుతము. నిర్గర్భము స్మరణ లేకుండ కేవలక్రియాచరణము.

(కుంభకము చూడుఁడు, అష్టాంగయోగము చూడుఁడు).

**స్కల్ప్చర్ (Sculpture):-** రాయి, కఱ్ఱ, సున్నము, మట్టి మొదలగువానితో విగ్రహములు చెక్కుట మున్నగు శిల్పకళ. ఇది రెండు విధములు. అసలురూపములకుఁ బ్రతిరూపములను నిర్మించుటయు, శిల్పి తనబుద్ధికుశలతచే రూపనిర్మాణము చేయుటయును, ప్రాచీనకాలమందు 'చర్చి' (ప్రార్థనమందిరము) మొదలగువానిని నిర్మించునపుడు శిల్పకళ ప్రదర్శించెడువారు.

పాశ్చాత్యశిల్పనమునం దనుకరణము సౌందర్యముద్రితమై యలరినది. హైందవశిల్పమునందు భావప్రకటనము ప్రాధాన్యమగు స్వతంత్రశిల్పము ప్రవర్తిల్లినది. హైందవశిల్పము కొన్నివేలయేండ్లనుండియు దైవసంబంధమగునట్టియు, కల్పనాశక్తిచే నిర్మింపఁదగినట్టియు శిల్పకళయే నిర్మింపఁబడినట్లు గానవచ్చెడిని.

**స్కల్ప్చరుకల (Sculpture):—** ఈ విద్య జగమంతయు వ్యాపించియున్నది. ఆదిని గ్రీకు లీవిద్యయం దారితేరినవారట. వారినుండియే యాంగ్లేయు లీకలను గ్రహించిరట. నిజపదార్థములనుగాని, భావింపఁబడిన పదార్థములంగాని, బంగారముతోఁగాని, వెండితోఁగాని, దంతముతోఁగాని, బోంజునందుఁగాని, రాతితోఁగాని, మట్టియందుఁగాని రచించువిగ్రహశిల్పము. ఈవిద్య నుత్తమజాతి విద్యగను, మధ్యజాతి విద్యగను నధమంపుజాతివిద్యగను త్రిభేదములుగ నేర్పఱచిరి. అం దుత్తమజాతిది గ్రీకువిద్యను బోలియుండు నందురు. భరతదేశమునం దిట్టి కలకు విగ్రహచిత్ర మనియెదరు.

**స్కవరింగుస్లూస్ (Scouring sluices):—** Irrigation (పంటకాల్వల) engineering నందుఁ జెప్పఁబడిన యొక నిర్మాణమునకుఁ బేరు. (ఇరిగేషన్ చూడుఁడు).

నదీప్రవాహజలముల నెత్తుమట్టమునకు నిలుపుటకు నదియందు అడ్డముగా నానకట్ట కట్టి జలముల మట్టము నెత్తుచేసినతరి నెగువనుండి జలప్రవాహమునందుఁ గొట్టుకొనివచ్చుచుండు నిసుకయు, బురదయు నానకట్టకడకుఁ జేరి, నిలిచిపోయి మేట వేయుచుండు టప్పటప్పట సంభవించు చుండును. అత్తఱి నదియం దిట్టినీరు కాల్వలోనికిఁబోక నిలిచిపోవచ్చును గాన నటుల మేటవేసిన యిసుక బురదల నానకట్టులదిగువభాగమునకు నెడలఁగొట్టుట కానకట్టయందు నిర్మింపఁబడు ద్వార (జలమార్గ) ములకు 'స్కవరింగుస్లూ' సనిపేరు. వీటిని నవసరములనెంబడి తెఱచుట, మూసియుంచుటలను regulator అనియు control అనియు నందురు. వీనిని తెఱచుటవలనఁ గాలువల హెచ్చుగా నిసుకడం కేరిన మేటయు కోసివేయఁబడునని చెప్పఁబ.

**స్టంప్ ఒరేటర్ [Stump orator]:—** విలువలేని హీనోపన్యాసము లొసంగువానిం గూర్చి పల్కుచున్న ఉక్తి. అమెరికాదేశమున కాంగ్రెసుపక్షమువారమని చెప్పుకొను కొందరు ప్రతినిధుల నెన్నుకొనువారలకుఁ జెట్లకొమ్మలపైకెక్కి యిచ్చు నుపన్యాసములనుండి వాడుక యేర్పాటయ్యెనట. వీరు ద్రవ్యమునకై యిట్టి యుపన్యాసముల నొక్కొకరి నెన్నుకొనుమనుచు నిచ్చువారు

**స్తనకర్ణగోత్రము:-**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**స్పంజి (Sponge):**—ఇక్కాలమున స్పంజి నెఱుంగనివా రుండుట యరుదు. సర్వసాధారణముగ జంతుజాలము "Those made up of single cell and those made up of more than one cell" అని ద్వివిధమందు స్పంజి శరీరముగల జంతువులు. రెండవతరగతికిఁజెందిన యధమఁపుఁజాతివని చెప్పఁబడినవి. ఇందెముకలుండవుగాని కొమ్ములు, డెక్కలు, గోళ్లు వంటి కఠిన పదార్థవిరచితమైన శరీరఁపుఁజట్రు ముండుననియు నదియే మనమెఱెంగినస్పంజి యనియుఁ బరిశీలకు లనియెదరు. స్పంజి స్నానములకు వాడఁబడునది 'Bath sponge' అనఁబడుచున్నది. వైద్యాలయములందు రోగులపుండ్లు మొదలగునవి కడుగుటకు నీటిని ధరింప నుపయోగించుచున్నారు. స్పంజిజాతు లింతయేగాక పెక్కులు గలవు. పైవాడుకలందున్న రెండుజాతులస్పంజులు ఫ్లోరిడా నుండియు, గ్రీసుదేశమునుండియు, టర్కీనుండియు వచ్చుచున్నవి. స్పంజులను బరీక్షించితిమేని ఎల్ల పరిమాణములు, ఎల్లయాకారములఁ గాంచ విచిత్రమనిపించును. వీటియందుఁ బెక్కురంగులవి కలవు. గుండుసూదితలయంతస్పంజి మొదలు మనుష్యశరీరమంత పొడవుగలస్పంజిలు కలవు. కొన్ని చెట్లంబోలియు, కొన్ని గిన్నెలం బోలియు, కొన్ని విసనికఱ్ఱలంబోలియు, కొన్ని బుట్టలుతట్టలంబోలియుఁ గాననయ్యెడిని. కొన్ని తెల్లనిరంగు గలవి. కొన్ని యూనుపచ్చరంగుగలవి. కొన్ని మెఱ్ఱనివి. యూదారంగుగలవి. కొన్నిపసుపుపచ్చ, మాసినపసుపుపచ్చరంగుల స్పంజిజాతులు గలవు. కొన్ని సున్నముచేఁ జేయఁబడిన ట్లుండియు మెత్తగనే యుండి ముడిచిపట్టిన యులుకుశక్తిం గల్గి యున్నవి. కొన్ని యద్దమువలె స్వచ్ఛమైనవి కలవు. వెనస్ బాస్కెట్ [Venus basket] అను పేరిడంబడిన జాతిస్పంజి యొకచక్కనిబుట్టవలె



నుండును. అందు సిలికా [silica] దారములు కుట్టి గట్టిపఱచినట్లు భద్రపఱుపఁబడి యుండును.

స్పంజిజంతువులం దాడుజాతియు, మగజాతియు గలదు. ఇవి సముద్రముననే వసించు జలచరములలోనివి. తొలుత నందముగ నివి జనించి శరీరమంతటను వేళ్లొదన్నిన ట్లంతటఁ జిగిర్చి, దాని యథాకారమునకుఁ బెరుగునని పరిశీలనలు తెల్పుచున్నవి. ఇవి ముత్యాలచిప్పలకువలెనే నీట వలలతో మున్గియుఁ దీయుచుందురు. ఇవి టర్కీ, గ్రీసుదేశముల సముద్రములందుఁ గలవఁట.

**స్పజ్జిన్కి గోత్రము:-**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**స్ఫటికలౌహిత్యన్యాయము:** స్ఫటికమేరంగు లేని స్వచ్ఛతం గలినది. దానియందేరంగైనను పొడకటిన నది సమీపమునందుండిన వస్తువులయొక్కరంగని యర్థము

అన్యులవలన గుణముం గ్రహించునటులఁ దెల్పుటయం దీన్యాయమును వాడుచుందురు.

**స్వతంత్రము, స్వర్గలోకము:—**
(ఆంధ్రలోకోక్తి).

**స్వతస్సిద్ధ (స్వంత) వైద్యవిజ్ఞానశక్తి:—** సృష్టియందలి రహస్య విచిత్రములు చక్కఁగాఁ బరిశీలించినకొలఁది బయల్పడుచుండును. పెక్కులాదియందుండినవి మఱుఁగు పడిపోయి యున్నవి. కొన్ని యూనెయం దెఱుకఁబడక మఱుఁగుననుండి రానురాను బయల్పడుచున్నవి. దీనినిజముల నెఱుంగక తాము నవనాగరికులమనియు, విద్యాధికులమనియు, పూర్వ లజ్ఞానులగు మూర్ఖులనియు, తాము నమ్మినదే లోకమునకు విధాయక మనియుఁ

పెక్కండ్రు పొరబడుచు వాదించుచుందురు. కొందఱు పూర్వము విజ్ఞాన మధికమైయుండెఁగాన పూర్వాచారములే విధులని పల్కుచుందురు. కాని సృష్టియందు సర్వజంతువులకంటె మనుష్యు లధికవిజ్ఞానులుగ సృష్టింపఁబడియుంట నెవ్వరు కాదనఁజాలరు. నిష్పక్షపాతబుద్ధితో నాలోచించిన విజ్ఞానమునకు మేరయనునదిలేదనియు, నేకాలమున నెవ్వరి కెంతదనుక వలసియుండునో యంతవఱకే యది యుండునని తలంపఁబడుచుండునని తోఁచెడిని. మృగములు, పక్షులు మొదలగుజంతువులకు విద్య యనునది లేదు. వాటిభద్రతకై వలయు, విద్యా విజ్ఞానములు, వాటియందే స్వతస్సిద్ధముగ నుండును.

మానవాభ్యుదయమునకై కన్గొనఁబడినవైద్య విద్య జంతువులందు స్వతస్సిద్ధముగనే యుంట గాననగును. వాటియందు వేఱుగ డాక్టరులు, వైద్యవిద్యావిశారదులు నుండనక్కరలేదు. దాని కవసరమగు ద్రవ్యసాహాయ్యము మొదలగునవి దేని కదియే కుదుర్చుకొనఁ గల్గియుండును. ఆశక్తి వాటియందు స్వతస్సిద్ధనైసర్గికముగనే యుండును. (instinctive knowledge).

పుండ్లను శుభ్రపఱచుకొనుట నైసర్గికముగా నవి మానునట్లు చేయుటకేయని యెల్లరెఱుంగుదురు. జంతువులు పుండ్లనునాకి శుభ్రపఱచుకొనుచుండును. వాటి నోటి చొంగయందు enzymes కలవనియు నవి Germicide గా పనిచేయుననియు నిటీవలి పరిశీలనలు బయల్వెఱచినవి. దీనినుండి Anti septic అయిన Iodine మొదలగు నాంగ్లౌషధములవలెనే పనిచేయునని తెలియుచున్నది. జ్వరముతో బాధనందుచున్నతరి జంతువులొక చల్లని మాఱుమూల కరిగి యేమియుం దినక పరుండి, కాలముఁ గడుపును. వాతనొప్పులు, మేహవాతనొప్పులు (Rheuatic pains) కలిగినప్పు డొకవెచ్చని ప్రదేశమున లేక నెండతగులు తావునకుఁ జేరుకొని elimination process of the body విధానమునకుఁ దానే ప్రోత్సహించుకొనుట చూచుచునేయున్నాము. విరేచనము వలయుతరిని వేటిం దినవలయునో యవి యన్నియు వాటికిఁ దెలియును. పక్షు లట్టితరి పచ్చినిరపపండ్లం దినుట మనము చూచుచునేయున్నాము. ఎండయొక్కవిలువ జంతువులకుఁ జక్కఁగఁ దెలిసియేయున్నది గాననే యెండ నవి చక్కఁగా నుపయోగించుకొనుచునే యుండును. ఎట్టి యాహార మేశారణముల నవి తినఁదగునో వాట్లనే జంతువులు స్వేచ్ఛదశయందు దినుంగాని యనవసరమైనవి తినకుండును. ఇది జంతువుల స్వేచ్ఛాప్రవృత్తికార్యములయందుఁగాని, పట్టణములందుఁ గట్టి నిర్బంధించి మేతవేయు నిర్బంధస్థితియందుఁగాదని మనస్సునం దుంచుకొనవలయును. దీనిని చక్కఁగా యోచించిన విటమినులస్థితి జంతువు లెఱుంగునేమో యనుననుమానము పొడకట్టకమానదు. చక్కఁగఁ బెరిగిన పచ్చికనే తినుటకుఁ బశువు లభిలషించుట విటమినులకాంక్షయా యనిపించును. మేఁక లాకులం దినుటయందును, పక్షులు పండ్లం దినుటయందును నీవిధానము సరిపోవుచునే యుండును. మనుష్యునకుఁ గొన్నివిటమినుల లోపము చేతఁ గల్గుచుండు నేత్రరోగములజబ్బులు కోఁళులకుం గల్గుచుండుటఁ గానరాదు. అవి తినువానువులయందు విటమిను లధికములని చెప్పకనే తెలియుచున్నది. మాంసాహారము దిను జంతువులు, తాము తినుచుండు జంతువులలోని liver pancreas మొదలగు internal organs నుండి వలయు విటమినుల నందుచునే యుండును. శరీరమునంటిన parasites మొదలగు వాటినుండి తప్పించుకొనుటకు జంతువులు, పక్షులు స్నానము

చేయుట, బురదయందు, బుగ్గియందుఁ బొరలుట, నీటియందు మునిఁగియుండుట నెల్లరెఱింగినదే. ఏనుఁగులు, లేళ్ళు, గుఱ్ఱములు యీపనులం జేసికొనుచుండుట పరిశీలించినవారికిఁ దెలియఁగలదు. ఈకార్యములు వాటికి Hygiene సంబంధములై యున్నవి. అడవిజంతువులు వలయుతరి నప్పుడప్పుడు. కొన్నిచెట్లపట్టలం గొఱికి నమలి పిప్పినుమ్మివేయుట యడవివాండ్రకుఁ బెక్కండ్రకుఁ దెలియును. ఇవి వాట్ల intestines కు వలయు tannic acid కలిసియున్నరసముఁ గల్గియున్న పట్టలు. కుక్కలు, పిల్లులు వమనముకావలసివచ్చినప్పుడు గరికెచిగుళ్ళం దినుట నందరును చూచుచున్నదే. ఏజంతువైనను తనశరీరరక్షణ కపాయకరమగు పదార్థములం బెట్టిన వాసనం జూచి వదలివేయునేగాని తినకుండుట నందరుఁ జూచుచున్నదే. ఇది వానియొక్క పథ్యాపథ్యవిచక్షణ యని స్పష్టముగాకపోదు. ఏది యెట్లయినను నెల్ల శరీరములందుండు నారోగ్యవిజృంభణశక్తి మఱుగుపడిననే యనారోగ్యము సంభవించుచుండు ననియు, మృతి సమీపించినందప్ప నారోగ్యవిజృంభణము [curative powr] కొంత యొకప్పుడు తగ్గినను తిరుగ బలపడి విజృంభించుచుండుననియు మనసునం దుంచుకొనుచుండ వలసియుండెడిని. ఇట్టి విచిత్రమగు స్వతస్సిద్ధస్వవైద్యవిజ్ఞానశక్తి యాదిసృష్టియందు మానవులకుఁ గూడఁ గలిగి యుండునుననియే తోఁచుచున్న, మొదట మానవుఁడు కేవలాజ్ఞానదశయందేయుండి రానురాను స్వానుభవాదులవల్ల విజ్ఞానియయ్యెనని తలంచు నవ నాగరికులవాదము సకారణముకాదని తోఁపక పోదు. ఇట్టి విజ్ఞానశక్తి యిక్కాలమున నభివృద్ధి నొందెననుట కేసంశయమును లేదు. రాజసము, మతిజ్ఞానవిహీనత, గర్వము, క్రోధ, లోభ, మద, మత్సరములందు మనస్సు నధికముగ వ్యాపింపఁ జేయు వాణిజ్యదృష్టి, అతిగడుసుదనము, అతి ధనాశ, లోకవంచకత్వము మొదలగునవి చేఁదోడు వాఁదోడుగ నుండునవనాగరికతసంపర్కముచే విజ్ఞానము మఱుఁగుపడుచుండుననియుఁ గొంతకాలమునకు మఱపే గలుగుననియు స్ఫురించెడిని.

**స్వధ**:- పితృదేవతలభార్య.

**స్వప్నము** (Dream):— మేధస్సు (Brain) అంతయు నొకేభాగము గాదు. అందనేకపొర లనేకభాగములుగ నుండును. అందొక్కొక్కప్పుడు గొన్ని విశ్రాంతి నందుచు, (నిదురించుచు) నుంటయు, నింకఁగొన్ని చైతన్యముం గల్గి పనిచేయుచుంటయు, సంభవించు చుండెడిని. అత్తఱి స్వప్నములుగ నిద్రయందుఁ గల్గుచుండు నని కనిపెట్టఁబడినది. మేధస్సుయొక్క యుపరిభాగము లత్తరి నిద్రించుచుంటయు, దిగువభాగములు పనిచేయుచుంటయు జరుగుచుండునట. అన్ని భాగములు విశ్రాంతిఁగొనుచు (నిద్రించుచు) నుండు తఱి నది గాఢనిద్ర యగు నందు స్వప్నము లుండవు. ఇంకఁ బైభాగము లెక్కువగ నిద్రించి యుంటయు, క్రిందిభాగములం దొకటిరెండు పనిచేయుచు మేల్కాంచియుంటయు సంభవించు తఱి గల్గినస్వప్నములు మేల్కాంచినతరి జ్ఞాపకమే యుండకుండ మాసిపోవును. ఈస్వప్నములందు భయముంగల్గించునవి దుస్స్వప్నము (Night mare) లనంబడును. ఇవి హృదయబలము చాలనివారి [week heart or heart disease] కధికముగఁ గల్గుచుండునట. అత్తరి మేధస్సునకు రక్తప్రసారము సరిగాఁ గలుగకుండ నిబ్బంది కల్గుచుండునట. దుస్స్వప్నముల ప్రారంభము పొత్తి కడుపునం దనియు, నజీర్ణము, నరగని బరువుపదా

ర్థములం భుజించుటయనియుఁ దలంపఁ బడుచున్నది.

కొన్ని స్వప్నములం దుస్సాధ్యపుఁబనులు జరిగిన ట్లగుపడుటయు, నిదియసంభవమని యత్తరి మనంబున తోఁచకుంటయు, విచిత్రము. అత్తరి మనస్సునందు విమర్శనశక్తి మందగించియుండునని గ్రహింపనగుచున్నది.

## స్వప్నము, కాలపరిమాణము:-

ఒక్కొకస్వప్నము స్పష్టముగను, పెక్కుస్వప్నములతిత్వరితముగ నడచుచు ఛో సినీమాలోఁ గన్పడు బొమ్మలు జరిగిపోవుచందమున నతి త్వరితగతిని ఛాయామాత్రముగఁ గానవగును. గాని స్వప్నమునఁ గొందరు నడతురు, కొందరు కొన్నిపనులం జేయుదురు. వీట్లకు సరియగుకాలమే యవసరము గాన కార్యాచరణకాలమును, స్వప్నదర్శనకాలమును సమముగ నుండునాయని సంశయము తోఁచెడిని.

గాని స్వప్నముం గనువారి కాస్వప్నముం గూర్చి యంతయు సరిగా జ్ఞాపకమే యుండదు. పెక్కెండ్రు స్వప్నమునుండి మెళకువ గల్గినంతనే కొంతకొంతజ్ఞాపకము తెచ్చుకొనియు, దాని కనుబంధమగుదానిని కొంతయూహించియు నాస్వప్నముం దలంచుకొనువారే గాని తోడనే స్వప్నమంతయు నుడివెడివా రుండరనియే చెప్పవచ్చును. దీనింబట్టి యిది సినీమాలోనిబొమ్మలు గన్పించుచు జరిగిపోవునట్లు త్వరితగతిని నడిచిపోవుననియే తోఁచెడిని.

స్వప్నము పైత్యవిజృంభణ కారణమనియుఁ గొందరందురు. గాన స్వప్నదృశ్యము త్వరితగతి గలది యనియు, స్వప్నకార్యములు సరియగు కాలము నాక్రమించునవి యనియుఁ దలంపనగును.

ఇంకను పండితులు దీనిం బరీక్షించుచునే యున్నారు.

మెళకువయందు స్వాధీనమందుఁగల చైతన్యము స్వప్నమున స్వాధీనము తప్పియున్నను, స్వప్నమున జాగ్రతపటిమఁజెడదని గ్రహించియున్నారు. మెళుకువయం దపాయము సంభవించుతరి జాగ్రిత పటిమదప్పి మఱిగిపోవును. స్వప్నమందు పటిమఁజెడదు గాన స్వప్నమున నడచినను దెబ్బలుతగులుట, అపాయములు నింతవఱకెఱుకపడలేదు.

## స్వప్నములు:—

(స్వప్నశాస్త్రము చూడుఁడు. శుభస్వప్నములు చూడుఁడు.)

**స్వప్నశాస్త్రము:**—స్వప్నశాస్త్రములు పెక్కుదేశములందుఁ గలవు. మహానాగరికులమని గొప్పలు పలుకుచుండు నైరోపాదేశములందు స్వప్నఫలములను దెల్పుగ్రంథము లనేకము లున్నవి. అవి యన్నియు వారిదేశసంబంధములే. భరతదేశమందలి స్వప్నశాస్త్రము పెక్కండ్రు ఋషిమతములం గ్రహించి చేయఁబడినవి. అందొకటి దత్తరామకృతము. ఈమహానీయుఁ డాయుర్వేదవిద్యావిశారదుఁడు.

మనస్సు సంచరించునాడులందు వాతపిత్తశ్లేష్మములు విషమములై దోషముఁ గల్గించుకతనను, విషయేంద్రియములు తమవ్యాపారములంజాలించియుండ మనస్సునకు వ్యాపారము గల్గియుండుకతనను, స్వప్నములు గల్గుచుండునని చెప్పఁబడినది. గాఢముగ మైమఱచిన నిద్రపట్టక యుండుతరి మనోవ్యాపారము నడచుచుంటయే స్వప్నముగ నిర్వచింపఁబడినది.

స్వప్నము లేఁడు విధములు.

౧ దృష్టస్వప్నములు:— పగలు తాఁ గనినవాట్లను రాత్రి నిద్రయందుఁ గనుట.

౨ శ్రుతస్వప్నములు:— తా నదివఱకు వినినది తలంపునకుబలమై దగులుకతన నిద్రయం దా సంగతినే గనుట.

3 అనుభూతస్వప్నము:— జాగ్రదవస్థయందుఁ దా ననుభవించుకతన మనస్సునకు గాఢమైనాట మనోవ్యాపారము బలపడి నిద్రయందునను నదే సిద్ధమై గాన్పింపఁగల్గిన స్వప్నము.

౪ ప్రార్థితస్వప్నము:—తాను కోరుచుండిన (జాగ్రదవస్థయందు) వస్తువులు లేక కార్యములు తనకు నిద్రయందు సిద్ధమైగాన్పించినస్వప్నము.

౫ కల్పితస్వప్నములు:— తాను జాగ్రదవస్థయం దూహించి కల్పించిన యాలోచన పదార్థములు, కథలు, నిద్రయందు సిద్ధమై గాన్పించినస్వప్నము.

౬ భావికస్వప్నములు— తా నదివఱ కెఱుంగని క్రొత్తసంగతులను, క్రొత్తచరిత్రను, పదార్థములను స్వప్నమునఁ జూచుట.

౭ దోషజస్వప్నములు— శరీరమున ప్రకోపస్థితినంది యున్న వాత పైత్యశ్లేష్మాది దోషముల వలనఁ గల్గినస్వప్నములు. వీట్లకు రోగహేతు స్వప్నము లని స్వప్నశాస్త్రగ్రంథములందుఁ బేరు వాడఁబడినది. ఇవి పదునొకండు భేదములు గలవి. ఇవి పైకి స్పష్టపడినను, స్పష్టముగఁ గన్పించకున్నను శరీరాంతర్గతములై యుండురోగములను సూచించెడిని. వీట్లం గూర్చి వరుసగ వివరింతుము.

స్వప్నము లేఁడువిధములును, నగటున సఫల స్వప్నము లనియు, నిష్ఫలస్వప్నము లనియు ద్వివిధము. దృష్టస్వప్నములు, శ్రుతస్వప్నములు, అనుభూతస్వప్నములు, ప్రార్థితస్వప్నములు, కల్పితస్వప్నములు నొకదానియం దాధారపడి కల్గినవిగాని స్వతంత్రముగఁ గల్గినస్వప్నములుగావు గాన నిష్ఫలస్వప్నములని పెక్కండ్రు విజ్ఞానులగు ఋషులు వచించిరి. ఇంకను గొందఱిమతమున దివాస్వప్నములు (పగటియందుఁ గల్గినవి), అతి హ్రస్వస్వప్నములు, అతిదీర్ఘములు నగుస్వప్నములకు ఫలములేదని చెప్పఁబడినది. రోగహేతుజన్యములగు దోషస్వప్నములు శరీరస్థరోగములను సూచించునవిగాన వాట్లంగూర్చి వేరుగ నేమియుఁ జెప్పఁబడనక్కఱలేదు. ఇంక సఫల స్వప్నములు భావికస్వప్నములని యెఱుంగునది. ఇవి శుభస్వప్నములనియు నశుభస్వప్నములనియు ద్వివిధము.

సఫలస్వప్నములకు— రాత్రి ప్రథమయామ [జాము] మున స్వల్పఫలమును, చతుర్థయామమున [తెల్లవాఱుజాము] నఁ గల్గినచో పూర్ణఫలమును చెప్పఁబడినది. మఱియుఁ దెల్లవాఱుజామున తా లేచుతఱి గల్గినస్వప్నమునకుఁ దక్షణమే ఫలముగల్గు నని పెక్కండ్రు ఋషు లనియున్నారు.

ఇంక నిష్ఫలస్వప్నములగు దృష్టస్వప్నములు, శ్రుతస్వప్నములు, ననుభూతస్వప్నములు, ప్రార్థిత స్వప్నములు, కల్పితస్వప్నములయొక్క నిజతత్వము వివరించుట యిందు నిరర్థకము.

(శుభస్వప్నములు చూడుఁడు - దుస్వప్నములు చూడుఁడు - నిష్ఫలస్వప్నములు చూడుఁడు).

## స్వాపాజిగోత్రము:—

(వశిష్ఠగణము చూడుఁడు).

**స్వప్నావస్థ:—**
(అవస్థాత్రయము చూడుఁడు).

**స్వభావో దురతిక్రమః:**—ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. నైసర్గికముగ నేర్పడిన స్వభావగుణమును దాఁట కష్టసాధ్యమైనదని.

నేర్చినవియైన యభ్యాసముల వీడనగుంగాని స్వభావమును దాఁటఁ గష్టమగును.

**స్వయంతీర్ణః పరాన్తారయతి:—** తాను తరించి యితరులం దరింపఁ జేయనగును. తాఁ దరింపలేనివాఁ డితరులం దరింపఁజేయలేఁడనియు, తాను ముందు తరించి యితరులం దరింపఁజేయఁగల్గుననియు నీలోకోక్తి భావములు.

**స్వయంవ్యక్తక్షేత్రములు - (అష్ట స్వయంవ్యక్తక్షేత్రములు) వైష్ణవమత యాత్రాస్థలములు:—**

౧ శ్రీరంగము [తిరుచినాపల్లికి సమీపము. కావేరీనది మధ్యద్వీపము నం దున్నది].
౨ శ్రీముష్ణము [చిదంబరమున కిరువది మైళ్ల దూరము].
౩ తోతాద్రి.
౪ సాలగ్రామము [నేపాలదేశమున గండకీనదీతీర మందలి ప్రధాన విష్ణుక్షేత్రము. ఇట సాలగ్రామములు నదియందు దొరకును.]
౫ నైమిశము [ఈస్టుఇండియన్ రెయిల్వే సీతాపూర్ లైనుపై నిమ్సార్ స్టేషనుకడ నున్నది. తొల్లి యిది నైమిశారణ్యము].
౬ బదరికాశ్రమము [హిమవన్నగముపై ఘూర్వాల్ సంస్థానముకుం జేరిన బదరీనాథము లేక బదరీనారాయణక్షేత్రము].
౭ కాంచీక్షేత్రము [కంచి వరదరాజస్వామి దేవస్థానము.]
౮ తిరుమల తిరుపతి వేంకటేశ్వర దేవస్థానము [చిత్తూరుజిల్లాలోనిది].

**స్వయంసంచలనము:—**
(మాక్సువెల్ సిద్ధాంతముఁ జూడుఁడు).

**స్వరగతులు ౮ (అష్టస్వరగతులు):**— ౧ ఫలితము, ౨ వక్రితము, ౩ స్ఫుటితము, ౪ స్థలితము, ౫ జ్వలితము, ౬ ధ్వంసమానము, ౭ సుషుప్తి, ౮ అస్తమయము.

**స్వర నాడులు:**—స్వరశాస్త్రమున నిట్టులఁ జెప్పఁబడినది. సకలప్రాణులకు స్వర నిదానందర్శమున ముఖ్యకారణమై యున్నది. నాభికిఁ జుట్టును మొలకవలె బైలుదేఱుచు డెబ్బదిరెండు వేల నాడులు దేహమంతటను వ్యాపించియుండు నని యు, వీనిమూలముననే శరీరేంద్రియముల కన్నింటికి సంబంధముండు ననియుఁ జెప్పఁబడినది. మఱియు నాభికి దిగువ కుండలిస్థానమున సర్పాకృతిగ నొకనాడియును, క్రిందుగ పదినాడులును, మీదుగ పదినాడులును నుండుననియు, సూక్ష్మముఖములగు నానాడులమధ్య నొకచక్రమున నిడ, పింగళ, సుషుమ్న యనంబడు ముఖ్యనాడులును మూఁడు కలవనియుఁ జెప్పఁబడినది.

ఎడమముక్కుగుండ 'ఇడా' నాడియు, దక్షిణ నాసికారంధ్రమున 'పింగళా' నాడియు నీరెంటికి నడుమ సుషుమ్నానాడియుఁ గలవని యందురు. (స్వరము చూడుఁడు). నాడులలోఁ బ్రధాన నాడులు పదియని యందురు. అవి ఇడానాడి, పింగళ, సుషుమ్న, గాంధారి, హస్తి, జిహ్వ, పూషలము, భూషితము, కుహూక, శంఖిని, శారద యను పేర్లం బరగునాడులు. ఇందు 'ఇడా' నాడియు,

"పింగళా" నాడియు నెల్లప్పుడును వాయువును వహించియుండునవిగఁ జెప్పఁబడినవి.

సుషుమ్నానాడి బ్రహ్మరంధ్రమున కాల మార్గముచేనుండు ననియు, పూషలమును భూషితము నేత్రములం దుండునదిగను, గాంధారినాడియు, హస్తిజిహ్వయు, కర్ణరంధ్రములం దుండు నదిగను, కుహిక గుదరంధ్రముననను, శంఖిని లింగద్వారమునందును, శారదానాడి నోటియందుండు నదిగను జెప్పఁబడినవి.

**స్వరభంగరోగము:**— స్వరము [కంఠస్వరము] క్షీణించిపోయెడిరోగము.

**స్వరములు:**— స్వరమన షోడశస్వరములు [౧౬ అచ్చులు].

ఆద్యస్వరము ౧ అ—దీనినుండి జనించిన [స్వరములు] ౨ ఇ—౩ ఉ—౪ ఋ—వీటినుండి వికారరూపములుగ గల్గిన స్వరములు] ౫ ఆ— ౬ ఈ— ౭ ఊ— ౮ ౠ— ౯ ఌ— ౧౦ ౡ— (మిశ్రములు). అ × ఇ= ౧౧ ఏ— అ × ఉ= ౧౨ ఓ— అ × ఏ= ౧౩ ఐ— ఆ + ఓ=౧౪ ఔ ౧౫ అనుస్వారము, ౧౬ విసర్గము (అక్షరములుచూడుడు.)

సప్తస్వరములు లేక సంగీతస్వరములు.

౧ షడ్జమస్వరము—స. గురుతు నెమలికేకంబోలు ధ్వని. ఇది ప్రకృతి యొకేవిధము. ఇందు నాల్గుశృతులు కలవు. అవి ౧ తీవ్ర, ౨ కుముద్వతి, ౩ మంద, ౪ ఛన్దోవతి యనునవి.

౨ రిషభస్వరము—రి గురుతు. ఎద్దుఅంకెం బోలు ధ్వని. ఇందు ప్రకృతి శుద్ధరిషభ మనియు, వికృతి, చతుశ్రుతి, షట్శ్రుతి రిషభములనియు, త్రివిధము. ౧ దయావతి, ౨ రంజని, ౩ రక్తిక యిందలి శ్రుతులు.

౩ గాంధారస్వరము— గ గుర్తు. ఇందు ప్రకృతి శుద్ధగాంధారమనియు, వికృతి సాధారణ అంతర్గాంధారములనియుఁ ద్రివిధము. రౌద్రి, క్రోధ, శ్రుతులు.

౪ మధ్యమస్వరము— మ గుర్తు. ఇందు ప్రకృతి శుద్ధమధ్య మనియు, వికృతి ప్రతిమధ్యమ మనియు ద్వివిధము. వజ్రిక, ప్రసారిణి, ప్రీతి, మార్జని యిందలిశ్రుతులు.

౫ పంచమస్వరము— ప గుర్తు. ఇందు ప్రకృతి యొకేవిధము. క్షితి, రక్త, సందీపని, ఆలాపిని, శ్రుతులు.

౬ దైవతస్వరము ద గుర్తు. ఇందు ప్రకృతి శుద్ధదైవతమనియు, వికృతి, చతుశ్రుతి, షట్శ్రుతిదైవతము లనియు త్రివిధము. మదన్తి, రోహిణి, రమ్యా శ్రుతులు.

౭ నిషాదస్వరము— ని గురుతు. ప్రకృతి శుద్ధనిషాద మనియు, వికృతి కైశికి కాకాలీ నిషాదములనియుఁ ద్వివిధము. ఉగ్రా, క్షోభిణీ యనునవి శ్రుతులు.

ఉచ్చారణస్వరములు:—

౧ హ్రస్వము (పొట్టిగఁ బలుకునది.) క, న, త మొదలగునవి.

౨ దీర్ఘస్వరము (పొడవుగాఁ బలుకునది.) కా, నా, తా మొదలగునవి.

౩ ప్లుతస్వరము (అతిదీర్ఘముగఁ బలుకునది,) పెరుగో!!! పెరుగు అని కేకవేయుతటేఁ బలుకునంతటి పొడుగు.

వేదస్వరములు:— ౧ ఉదాత్తము (పైకెత్తి పలుకునది), ౨ అనుదాత్తము- క్రిందికి (దిగువగాఁ బలుకునది), ౩ స్వరితము- (దీర్ఘముగఁ బలుకు స్వరము), ౪ ప్రచయము- (సమముగఁ బలుకు స్వరము).

షట్స్వరములు:— ౧ బాలస్వరము, ౨ కుమారస్వరము, ౩ రాజసస్వరము, ౪ వృద్ధస్వరము, ౫ మృతస్వరము, ౬ సంక్రిమస్వరము.

**స్వరశాస్త్రకాలమానము:—** స్వరశాస్త్రమునఁ జెప్పఁబడిన మేరకు లోపలి కూపిరి యేగి తిరిగి పైకివచ్చుకాలమునకు [ఒకయూపిరి] 'ప్రాణ' మనంబడును. అట్టిప్రాణము లారైన [ఆరు ఊపిరులకాలము] నాకాలమునకు 'ఫల' మని పేరు. అట్టి ఫలమునకు 'విఘటిక' అనియుఁ పిదప పేరయ్యెను. దీనిని 'లిప' యనియు నందురు.

అట్టిఫలము లఱువదియైన నొకఘటిక యగును. ఘటికకు కాలదుందుభి యనియుం బేరు కలదు. అట్టిఘటికలు దినమున కఱువది. ఇంక నీదినములు పక్షములుగను, మాసములుగను, ఋతువులుగను, సంవత్సరములు ౬౦ గను, విభజింపఁబడినవి. అవి సుప్రసిద్ధములే.

౬ ప్రాణములు ౧ ఫలకాలము (విఘటిక లేక లిప్త).

౬౦ ఫలములు ౧ కాలదుందుభి ఘటిక.

౬౦ ఘటికలు ౧ దినము.

౩౦ దినములు [౪మూరమి] ౧ మాసము.

౨ మాసములు ౧ ఋతువు.

౬ ఋతువులు లేక ౧౨ మాసములు ౧ మనుష్యమానసంవత్సరము.

౧ మనుష్యమానఁపు మాసము ౧ పితృదేవ మానమున దినము.

౧ మనుష్యమానఁపుసంవత్సరము ౧ దేవమానమున దినము.

**స్వరశాస్త్రము:—** స్వరశాస్త్రముఁ బరమేశ్వరుండగుశివుఁడు తనశక్తియగు పార్వతీదేవి కుపదేశించినశాస్త్రముగఁ జెప్పఁబడినది. ఆదిని శ్వేతయోగి యనుపేరంబరఁగిన మహాశివభక్తుం డీశాస్త్రమును రచించియుండెను. ఈయనకు శ్వేతకేతుం డనియుఁ బేరు గన్పించెడిని.

శ్వేతుఁడు మొదలు లకులీశుండను వానివఱకు యోగాచార్యులని శైవగ్రంథములందుఁ జెప్పఁబడినది. వీరికి నూటపండ్రెండుగురు శిష్యులు గలరు. పిదపఁ జిరకాలమునకుఁ బతంజలి యోగశాస్త్రమును సూత్రములుగ రచించెను. శ్వేతకేతుకృతమగు స్వరచింతామణియును గలదు. ఇందు ముఖ్యసాధన మంతశ్శుద్ధికిఁగాను వాయుధారణము చెప్పఁబడినది. మఱియు నీవాయుధారణమున కెన్మిది యంగయోగసాధనములు నుడువఁబడినవి. అవి యమము,నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణము, సమాధి యనంబడునవి. (అష్టాంగయోగములు చూడుఁడు). పిదపకాలమున దీనికి సాంఖ్యశాస్త్ర మనియుఁ బేరుఁ గల్గెను.

సాంఖ్యము సేశ్వరసాంఖ్య మనియు, నిరీశ్వరసాంఖ్య మనియు ద్వివిధము. నిరీశ్వరసాంఖ్యము దేవుఁడులేఁ డనువాదము. సేశ్వరసాంఖ్యమున నీశ్వరుఁడు, ఆత్మ, ప్రకృతి యనంబడిన త్రిపదార్థములు చెప్పఁబడినవి. అం దీశ్వరుఁడు ప్రకృతిసంయోగమునఁ జలింపకయుండు ననియు, ఆత్మకుఁ బ్రకృతిసంయోగము గలుగఁగనే సకలవేదనలపాలగుననియు, నావేదనలం జయించి మహానంద సుఖముఁ జెందవలెనని నష్టాంగయోగము లభ్యసించవలెననియుఁ జెప్పఁబడినది.

ఈశాస్త్రమునందుఁ బరమేశ్వరుఁడు స్పష్టముగానివాఁడుగను, సర్వానంద మయుఁడుగను, సర్వవ్యాపకుఁడుగను, సర్వకారణభూతుఁడుగను, జెప్పఁబడెను. మరియు జగత్తెవ్వనినుండి బయలుదేఱి తిరుగ నెవ్వనియందు లీనమగునో యట్టివాఁడు పరమేశ్వరుఁడని చెప్పఁబడినది. ఇది యాత్మజ్ఞానముం గల్గించుశాస్త్రము.

ఇవి గాక సంగీతశాస్త్రమున షడ్జమ, రిషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాద స్వరములని సప్తస్వరములు చెప్పఁబడినవి. (సంగీత శాస్త్రము చూడుఁడు.)

ఎడమ ముక్కురంధ్రముగుండా వెడలు గాలి (ఊపిరి లేక శ్వాస) కిఁ జంద్రనాడి యనియుఁ బేరు కలదు. ఇది స్థిరమనియు, శైత్యలక్షణము గలది యనియుఁ జెప్పఁబడినది. ఈచంద్రస్వరము నడచుతఱి దూరదేశయాత్రసల్పుట శ్రేయస్కరమందురు. మరియు నిందు స్థిరకర్మలు, ప్రయాణములు, రాజదర్శనము, సంధియోగాభ్యాసము, ఔషధములుచేయుట, శుభకార్యములు, విషచికిత్సలు, గృహప్రవేశము, విత్తులునాటుట, దేవతాప్రతిష్ఠలు చేసిన లభించునని చెప్పఁబడినది.

దక్షిణరంధ్రము (కుడిముక్కురంధ్రము) గుండా వెడలుగాలికి సూర్యనాడి యనియు పింగళ యనియుఁ బేరు కలదు. ఇది చరము, ఉష్ణలక్షణము గలవి. ఇది నడచుతఱి దీక్షాప్రారంభము, విద్యారంభము, వర్తకము, శస్త్రవిద్యాభ్యాసము, కీలము, భేదము, శిల్పము, వ్రాత, చిత్రరచన, గానము (పాడుట), స్నానమొనర్చుట, భోజనము, శ్రేయము లని చెప్పఁబడినవి. ఇడ పింగలలకు నడుమ 'సుషుమ్న' యనంబడునాడి యగును. ఇది యుభయమను పేరం గూడఁ బరఁగెడిని.

ఇంకను గొందరు వామనాడిగాని, దక్షిణనాడిగాని, శైత్యముగ, క్రిందుగా నడుచుచుండిన చంద్రనాడి యనియు, వేఁడిగను, పొడవుగను నడుచుచుండిన సూర్యనాడి యనియు నందురు.

సంక్రమస్వరము నడుచుచుండుతఱి యాత్ర చాల యపాయముఁ గల్గించుననియు, నిందు మానవులకు సుఖదుఃఖములు రెండును గల్గుచుండుననియు నిది యుదయాస్తమయకాలములందు నడుచుచుండిన నపమృత్యుకరమనియుఁ జెప్పఁబడినది.

మఱియు స్వరశాస్త్రముమేరకు స్వరములు బాలస్వరమనియు, కుమారస్వరమనియు, వృద్ధస్వరమనియు, మృతస్వరమనియు నాల్గువిధములుగ నుండును. శ్వాసము లక్ష్యస్థానమును దాఁకియుండినది బాలస్వరము. శ్వాసము లక్ష్యస్థానమును లెస్సగా నంటియుండియు ప్రబలమైయుండినది కుమారస్వరము. దీనికి రాజ్యస్వరమనియుఁ బేరు కలదు. స్వరము లక్ష్యస్థానము దాఁకి దురుసుగఁ గొట్టుచుండిన నది వృద్ధస్వరము. శ్వాసము లక్ష్యస్థానముం దాఁకకయే యడఁగిపోవుచుండిన నది మృతస్వ మనంబడును.

ఇందు బాలస్వర మాలస్యముగ నించుక ఫలమొసంగుననియు, కుమారస్వరము పూర్ణఫలప్రదమనియు, వృద్ధస్వరము కార్యభంగకర మనియు, మృతస్వరము సకలకార్యనాశనకర మనియుఁ జెప్పఁబడినది.

ఇంక నీస్వరభేదములు నాల్గును నొక్కొక్కటి ఫలితము, వక్రితము, స్ఫుటితము, స్ఖలితము, జ్వలితము, ధ్వంసమానము, సుప్తము, అస్తమయము నని యెనిమిదివిధములుగఁ గతులుకలవని చెప్పఁబడినది.

శ్వాసము ముక్కుకొనకు గట్టిగాఁ దాఁకుచు నడుమచుండిన నది ఫలిత మనఁబడును. ఇది కార్యహానిగఁ జెప్పఁబడినది.

శ్వాసము వాయుతత్త్వమును వీడి, భుజశిఖరములవఱకుఁ బొలుచు మధ్యను నిలుచుచు మరలుచు నడుచుచుండిన నది వక్రిత మనంబడును. ఇది కార్యములను వక్రగతిం బొందించునది.

శుభతత్త్వములతోఁగూడి రెండుశుభతత్త్వములం దాఁకి నడచినది స్ఫుటిత మనంబడును. ఇది శుభకరమని చెప్పఁబడినది.

శుభతత్త్వములతోఁ గూడి దీప్తతత్త్వములయందు నడచిన నదియు స్ఫుటితమనంబడును. ఇది క్రూరకార్యజయప్రదమని చెప్పఁబడినది.

శ్వాసము కనుపించియుఁ గనుపించక నడుమ తెగినట్లుండిన నది స్ఖలిత మనంబడును. ఇది కార్యానుకూలమనియు, నుపఘాతమనియుఁ జెప్పఁబడినది.

శ్వాసము తేజస్తత్త్వసంబంధమున నతితీక్ష్ణముగా నడచిన నది జ్వలిత మనియు, మహాఘాతమనియుఁ జెప్పఁబడును. మఱియు నాజ్వలిత మత్యుష్ణమై దురుసుగా నడుచుచుండిన నది 'అత్యగ్ని' యనంబడును. అది నడచుతఱి కలహ మపాయకర మని చెప్పఁబడినది.

శ్వాసము ముక్కున నిండి పడిశెమువట్టినరీతిని కనుపడకయుండిన నది ధ్వంసమాన మనంబడును. ఇది కార్యనాశనకరమని చెప్పఁబడినది.

**స్వర్గలఘువు:**— సంగీతశాస్త్రమున జాతి (లయ) ప్రాణము నందుఁగల దశలఘువులలో నొకటి. మూఁడక్షరముల కాలము.

(జాతి (లయ) ప్రాణము చూడుఁడు).

**స్పర్శము (స్పర్శజ్ఞానము లేక స్పర్శ చైతన్యము) Sens of touch:**— శ్రోత్రనందు ముఖ్యముగఁ జేతివ్రేళ్ళకడలందు స్పర్శజ్ఞాన మధికముగ నుండునని చెప్పఁబడియున్నది. అందు నాడులసముదాయము కొనలను విప్పియుండును. వీటి కాంగ్లశరీరశాస్త్రవిదులు 'Bodies of touch' అని పేరిడియున్నారు. ఇతరపదార్థములను స్పృశించుట (తాఁకుట)వలనఁ గల్గుజ్ఞానము లేక చైతన్యము స్పర్శము శరీరమునందు గప్పఁబడియుండుచర్మమును స్పర్శేంద్రియ మని వాడియున్నారు. ఆర్యమతధర్మమున స్పర్శేంద్రియము శరీరతత్త్వములలో నొకటిగను, చైతన్యతత్త్వములు ముప్పదియాఱింటిలో స్పర్శతత్త్వ మొకతత్త్వముగను చెప్పఁబడియున్నవి. సర్వశరీరము నావరించియున్నత్వక్ (చర్మము) నందంతటను స్పర్శచైతన్యము కలదనియు నందు ముఖ్యముగ వ్రేళ్ల కొనలు, అధరము, నాలుకచివర నునికలగు తావులం దధికముగ నుండుననియుఁ బరీక్షలు తెల్పుచున్నవి. అఱచేతియందు బరువులు నెఱుఁగు శక్తి కడుసున్నితముగను కలదు. అది శరీరతరభాగములందుఁ గానరాదు. అఱచేతి కిరువదిరెట్లు తక్కువగా [Twenty times less] గ్రాహ్యముగ నుండునని పరిశీలనలు తెల్పుచున్నవి.

ఉష్ణమును, శీతలమును, నొప్పియగు స్పర్శజ్ఞానము దంతటను గలదుగాని యొకచోటఁ జేయుభావదిగాని యీస్పర్శసంబంధము కానేరదు. శరీరభాగములందు బుగ్గి, చమురు, ఉష్ణము గలతావులం దధిక వేఁడి తగులుటయు వాటిం జక్కఁగ వదలునట్లు కడిగినఁ దగులకుంటయు, పరిశీలనలవలనఁ దెలియునైనవిషయమే. కొందఱాంగ్లపరిశీలకులు చర్మమునందు వేరు [glands] కలవని యందురు గాని, ఉష్ణము, బుగ్గి యధికముగ వేఁడిందగులున స్వేదసర్పుట

యనుభవపూర్వకముగ నెఱుంగుచున్నాము. ఇంక బోధందెల్పుచైతన్య మొకటి కలదు. అది వేఱు జాతిదేమో దానింగూర్చి సరిగాఁదెలియదు. శరీరమందలి వేర్వేఱుభాగములు వేర్వేఱువిధములుగ నొప్పిని గ్రహింపఁగల్గుచున్నవి. కాని, చర్మము మాత్రము నొప్పి నధికముగా గ్రహించునవి యెల్ల రెఱుంగుదురు. ఇంక లోపలిభాగఁపుఁగారణములంగూర్చి సరిగాఁ దెలియదు.

**స్వర్ణరేఖానది:**— ఉత్కలదేశమున వేఱొక సువర్ణరేఖానది గాననగుచున్నది.

[గిరినగరముఁ జూడుఁడు].

**స్వర్ణరోముఁడు:**— ఇక్ష్వాకు సంతతి సూర్యవంశక్షత్రియుఁడు. మిథిలదేశాధిపతి. తండ్రి మహారోముఁడు. కుమారుఁడు హ్రస్వరోముఁడు.

**స్వర్ణషోడశ గౌరీవ్రత తృతీయ:**— శ్రావణశుద్ధతృతీయ. ఈదినమున పైవ్రత మొనర్తురు. మఱియు నీదినమున మంగళవారము గూడ సంభవించునేని కుజగౌరీవ్రత మొనర్తురు.

దక్షిణదేశమునను, కన్నడదేశమునను భాద్రపదశుద్ధతృతీయ యందు స్వర్ణషోడశ గౌరీవ్రత మాచరింతురు. మఱియు నీవ్రతమునకు మంగళగౌరీవ్రత మనియుఁ బేరుకలదు. [పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు].

**స్వర్గారోహణశిఖరము:**— రుద్రహిమాలయ శిఖరములలో నొకటి.

[గంగానది చూడుఁడు].

**స్వర్భానవి:**— ఆయువు భార్య.

[ఆయువు చూడుఁడు]

**స్వర్భానుఁడు:**— ఈపేరుగల రాక్షసులిర్వురు గలరు. కశ్యపునకుఁ దనువునందుఁ గల్గినసుతుఁ డొకస్వర్భానుఁడు. మఱియు విప్రచిత్తి కుమారుఁడగు రాహువుపేరు స్వర్భానుఁడే.

**స్వారోచి:**—గంధర్వుఁడు. తండ్రి మాయాప్రవరుఁడు. తల్లి వరూథిని (నలనాభునిసుత). భార్యలు మనోరమ, విభావసి. కుమారుఁడు మనోరమవలన స్వారోచిషుఁడు. మనోరమ స్వారోచికి మేనమామయగు నిందీవరాక్షునికుమార్తె. అస్త్రవిద్యనేర్పియు, విభావసి మందారుఁడను విద్యాధరుని పుత్రిక మృగపక్షిజాతులభాష నెఱుంగువిద్యను నేర్పియు స్వారోచిం బరిణయమైనవారని చెప్పఁబడినది.

**స్వర్ణోదకానది:**— నైమిశమందలి జప్యేశ్వరమున సంగమించు నైదునదులలో నొకటి. (పంచనదములు చూడుఁడు).

**స్వాలోక్యగోత్రము:**—
(కుండినగణము చూడుడు.)

**స్వావభ్రిష్ఠగోత్రము:**—
(నిధ్రువగణము చూడుఁడు.)

**స్వావసుగోత్రము:**—
(శండిలగణము చూడుఁడు).

**స్వవిషమూర్ఛితో భుజఙ్గ ఆత్మానమేవ దశతీతి న్యాయము:**—

తనవిషభరముచే సమ్మోహితమై బుద్ధిహీనమగుతరి తననేతాఁ గఱచికొనఁ బ్రయత్నించెడిని. (యట్టి తనతోకనే పాములు కఱచుకొనునని భావము.)

**స్వశస్త్రభయమేకాని పరశస్త్రభయము లేదన్నాఁడట:**—

(ఇంటివాఁడే కుంటివాఁడనునట్టి సామెత.)

**స్వశ్వ గోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు).

**స్వసులి గోత్రము:—**
(కుండినగణము చూడుఁడు).

**స్వస్తరి గోత్రము:—**
(కపియుపగణము చూడుఁడు).

**స్వస్తికాకారములు: —**



**స్వస్తికము:—** ఇదియొకచిహ్నము. స్వస్తి శబ్దమునకు మంగళమనియు, క్షేమమనియు, గౌరవమనియు నర్థములు. స్వస్తిక మోంకారతుల్యమని కొందఱనియెదరు. దీనిజన్మము భరతదేశముననే యని తేలుచున్నది. అట పై యర్థములకుఁ జిహ్నమై వాడఁబడుట మతగ్రంథములందే గాక యితరత్ర విరివిగఁగలదు. శైవులయం దిది 'బసవని గద్దె' యనఁబడుచున్నది. కొంతకాలము భరతదేశమున దేశీయమహాసభాధ్యక్షునిచే నీస్వస్తికచిహ్నము ధరింపఁజేయు నాచార ముండెడిది.

ఇది యార్యులతో నాసియా, యైరోపా ఖండములందు వ్యాపకముఁగాంచినదిగఁ బరిశీలకు లనుచున్నారు. ఐనచో నైదువేలసంవత్సరములకుఁ బూర్వము, అనఁగా క్రీ. పు. మూఁడువేలసంవత్సరములకుఁ బూర్వమే యిది యుండనోపు. తొల్లింట ననార్యజాతులనుండి యార్యులంగుర్తింప నీస్వస్తికము చిహ్నమైయుండె ననుచున్నారు. ఇది ప్రదక్షిణమునకుఁ గుఱుతని సుప్రసిద్ధుండగు హావెల్పరిశీలకుఁడు తలంచుచున్నాఁడు. మఱియు నాయనయే యిది భరతదేశపు సౌరమతచిహ్నమను మాట నంగీకరించుచు నాదికాలఁపు టార్యులపై నిక శిబిరద్వారములపై రక్షణకుఁ జిహ్నముగ నుంపఁబడుచుండెనని వివరించెను. క్రీస్తుమును పేడవశతాబ్దమువాఁడని చెప్పఁబడినపాణిని, ఆఁబోతుల కచ్చుపోయుటయందు స్వస్తికచిహ్నము వివరించెను. బంగాళదేశము, అఱవదేశము, కన్నడదేశములం దీస్వస్తికఁపువాడుక యధికమని తోఁచెడిని. తొల్లింటి కొన్నిప్రభుత్వనాణెములపై నీచిహ్నము వేయఁబడుచుండెడిని.

హిమాలయప్రాంతఁపు బౌద్ధభిక్షువులు (టిబెట్టు లామాలు) స్వస్తికమును పవిత్రచిహ్నముగా ధరించుచున్నారు. డార్జిలింగునందలి యబ్జర్వేటరీహిల్ పైనున్న లామాల (బౌద్ధమత) దేవళమగు మహాకాలదేవళము నీరెండుతావులందు స్వస్తికచిహ్నములు గలవు. ఉత్కలదేశఁపుఁ బూరీ (జగన్నాథ భువనేశ్వర) పరిసరములనున్న యుదయగిరి ఖండగిరిగుహాలయం దీస్వస్తికము పవిత్రచిహ్నముగఁ జెక్కఁబడినది.

బేబిలోనియారాజ్యమునను, నందుఁ దొల్లింటి పారశీకుల తావుగనుఁడిన సుసాయందు, త్రవ్వఁబడిన తావుల నీచిహ్నముగల వస్తువులు దొరకినవని చెప్పఁ బడుచున్నది. ఇంకను నస్సీరియా, మెసపొటేమియాలయందునను, ట్రోయి దేశములందునను, ఇటలీ స్పెయినుదేశములందు త్రవ్వఁబడిన పాతకుండపెంకులపై నను, ఈజిప్టుదేశఁపుఁ

పురాతనకాలమునను, గ్రీసుదేశఁపుఁ బురాతనఁపు పెర్రాకోటాపనులు ఫైట్వర్కు-పనులపైనను, ట్రాన్సిల్వేనియా క్రీటీ సిసిలీ దేశములందుఁ బురాతనఁపు stone age నాటివస్తువులపైనను స్వస్తికచిహ్నములుంట బయల్పడినది.

చీనా దేశమునందు స్వస్తికమును 'వాన్' అని యెదరు. దానికి అన్నా, అనంతము నని యర్థమట. జపానుదేశమున నెన్మిదవశతాబ్దకాలఁపుఁ (చక్రవర్తిగారి) ప్రభుత్వఁపు టాజ్ఞలపై తలయందు దీస్వస్తికచిహ్నము వాడఁబడుచుండెడిదఁట. అమెరికా, మెక్సికో, పెరూవియాలయందుఁ ద్రవ్వఁబడిన నియోలితిక్ కాలమునాఁటి శ్మశానములు సమాధులందు స్వస్తికచిహ్నములు గలవస్తువులు దొరకినవని తెలియుచున్నది.

**స్వస్తికరేఖ:—**(పురుషసాముద్రికము చూడుఁడు. స్త్రీసాముద్రికము చూడుఁడు.)

**స్వస్తికహస్తము:—** (హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.)

**స్వస్తికాసనము:-** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి.

ఇది జపమున కుపయుక్తము. ఎడమకాలి తొడకు, పిక్క-కు నడుమగా కుడిపాదమును, కుడికాలితొడకు, పిక్క-కు నడుమగా నెడమపాదమును నుండునట్లు మరము వైచుకొనికూర్చుండి సిద్ధాసనమునందువలె చేతులు నాభికడ వెల్లకిలవైచి యందు, పై రెండచేయియుంచి భ్రూమధ్యమున దృష్టినిల్పి జాలంధరబంధమునఁ గూర్చుండుట యారోగ్యప్రదమని చెప్పఁబడినది.

**స్వస్తికృత్గోత్రము:—**
(ఆత్రేయగణము చూడుఁడు.)

**స్వస్తికరగోత్రము:—**
(వశిష్ఠగణము చూడుఁడు.)

**స్వస్థచిత్తము కుదిరితే చాలాయోచనలు స్ఫురిస్తవి:—** (లోకోక్తి.)

**స్వస్థే చిః వృత్తయః సంస్ఫురన్తి:-** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. మనస్సు స్వస్థముగా నుండిన యోచనలు స్ఫురిస్తవని భావము.

**సాంకరగోత్రము:—**
[ఔతథ్య ఉపగణము జూడుఁడు].

**సాంకాశ్యపురి [ఇప్పటిసాంకిసా]:—** ఇప్పుడు కాళీనదియనంబడుచున్న యిక్షుమతీనదీ తీరము. ఇది యిప్పుడు సాంకిసా యనంబడు బౌద్ధక్షేత్రమైయున్నది. తొల్లి యొకప్పు డీప్రాంతదేశము నేలిన శిరధ్వజుఁడు నతనిసోదరుఁడగు కుశధ్వజుఁడను నరపాలురకు రాజధానియై యుండెను. సంకాస్యవసంతపుర మనియుఁ బేరుండెనట.

బుద్ధభగవానుఁ డిట కిందబ్రహ్మలు వెంటరా త్రియస్త్రింశ స్వర్గములనుండి భూమికి స్వర్ణనిశ్రేణిక (నిచ్చెన) పైనుండి దిగెనట. ఆతావుననే యిప్పటివిశారీదేవియాలయము నిర్మింపఁబడెనట. ఇట నశోకనిర్మితమగు స్థూపమును గలదు. దీనిని క్రీ. వె. ౪౧౫ న పాహియానును, క్రీ. వె. ౬౩౬ యందు హ్యూయనచ్యాంగును దర్శించిరి.

ఇది సంయుక్తరాష్ట్రములలోని యెటాజిల్లా ఫతేఘడ్‌పురమునకుఁ బశ్చిమముగా ౨౩ మైళ్లును, కనూజపురమునుండి వాయవ్యముగ ౪౫ మైళ్ళ దూరమునఁ గలదు.

**సాంకృత్యగోత్రము:—**
[జమదగ్నివత్స ఉపగణము జూడుఁడు].

[హారిత ఉపగణముఁ జూడుఁడు].

**సాంఖ్యశాస్త్రమతము[నిరీశ్వరసాంఖ్యము]:—**ఈమతమునం దీశ్వరుఁడు బరిగణింపఁబడమి దీనికి నిరీశ్వరసాంఖ్యమనియు, కపిలర్షిప్రోక్తమౌట కాపిలమనియు, వారుకపేళ్లు గలవు. ఈమతమునకుఁగర్త కపిలుఁడు. కపిలర్షులు నల్వురు గలరు. అం దీతఁడొకఁడు. సాంఖ్యమున లెక్కించునదియని యర్థము. ఈమతమున లెక్కింపఁబడునవి తత్వములని యెఱుంగునది. ఈమతము పాతంజలికృతమగు యోగశాస్త్రమతముతోఁ (సేస్వర సాంఖ్యముతోఁ) గొంతవరకును సంబంధముగల్గిన మతము. ఇది యాధ్యాత్మికశాస్త్రమతములలో నొకటిగఁ జెప్పఁబడినది. కపిలకృతసాంఖ్యసూత్రములును, దానికి శబరస్వామిభాష్యమును, ఈశ్వరకృష్ణునివార్త్తికమును, దానిపై గౌడపాదాచార్య భాష్యమును బ్రధానగ్రంథములు.

ఈమతమున నీశ్వరుఁ డంగీకరింపఁబడలేదు. జగత్తంతయుఁ బంచభూతాత్మకమైనది. ఇది ప్రకృతియొక్కపనిగాఁ జెప్పఁబడినది. ప్రకృతి నిత్యమును సర్వత్ర వ్యాపించి యుండునదియును, జడముగనుండియు సమస్తవస్తుకారణమైనదియును, చైతన్యములేనిదియును, జడముగనుండియు సమస్తవస్తుకారణమైనదియునుగాఁ జెప్పఁబడెను. ప్రకృతియందు సత్వరజస్తమములను మూఁడుగుణములు సమముగ నుండుననియు, పైః గోచరముకానిదనియు, గుణత్రయమే శరీరముగాఁగల్గినదనియు, సూక్ష్మమై దనరుకతన నవ్యక్తమై బరగునదియనియుఁ జెప్పఁబడినది. ప్రకృతి వృద్ధినొందుటకు, క్షీణించుటకుశకిఁగలది. ప్రకృతియొక్క యుపాదానకారణము వికృతియని చెప్పఁబడినది. అనగా ననాదిగనుండునది. ప్రకృతికారణమును, వికృతికార్యమును, సత్వరజస్తమో గుణములకుఁ బ్రధానావస్థ ప్రకృతియే.

నిరీశ్వరసాంఖ్యమతమున నాత్మలు పెక్కుకలవని చెప్పఁబడినది. ఇవి నిత్యములు, నాశరహితములునైనవి. శరీరమంతటను నాత్మ వ్యాపించియుండునది. పైకి గోచరముగానివి. సర్వకర్తృత్వము, సర్వజ్ఞత్వములు లేనివి. జ్ఞానమాత్రమైదనరునవి. ఆత్మలకుఁ బురుషతత్వ మనిపేరు. ఇవియే ప్రాణము లనంబడునవి. ఆత్మలు సంసారావస్థయందు, వేదనలందు మున్గియున్నను ముక్తావస్థంజెందినను నొకేరీతిని మాలిన్యరహితములైయుండునవి. ఆత్మలకన్న వేరుగ నీశ్వరుఁ డనంబడునదెద్దియు లేదని చెప్పఁబడినది.

ఆత్మలు శరీరమునందుండుతరి నందు బుద్ధితత్వమే ప్రధానతత్వముగఁ జెప్పఁబడినది. ఆదినుండియు బుద్ధిగతమై యజ్ఞాన ముండియున్నదనియు నజ్ఞానవశమున సంసారబంధసంబాధమగు సుఖదుఃఖజ్ఞానము సంభవించుచున్నదనియు నదియే లోకవేదనయనియుం జెప్పఁబడినవి. నిరీశ్వరసాంఖ్యమున నాత్మజ్ఞానమునకు విద్యయనియు నాత్మజ్ఞానము లేకుండుట కవిద్యయనియుఁ బేళ్ళు వాడియున్నారు. సంసారసంబంధమున దోఁచు సుఖదుఃఖభ్రాంతి యవిద్యాసంబంధమును, ననాదిగ బుద్ధితత్వము నాశ్రయించియుండునదిగఁ జెప్పఁబడినది.

ప్రకృతి, పురుష (ఆత్మ) వివేకజ్ఞాన ముదయించి యవిద్య నశించుటయే యీమతమున మోక్షమని చెప్పఁబడినది. ఇంక నీసాంఖ్యమతమునఁ దత్వములను లెక్కించుటయే ప్రధానాం

గముగఁ దనరు మతముగాన వానింగూర్చి యిఁక వివరింతము.

౧ పృథ్వీతత్త్వము
౨ జలతత్త్వము
౩ అగ్నితత్త్వము
౪ వాయుతత్త్వము
౫ ఆకాశతత్త్వము
— ఇవి పంచభూత తత్త్వములు.

౬ గంధతత్త్వము
౭ రసతత్త్వము
౮ రూపతత్త్వము
౯ స్పర్శతత్త్వము
౧౦ శబ్దతత్త్వము
— ఈయైదును పంచతన్మాత్రి తత్త్వములు.

౧౧ పాయుతత్త్వము
౧౨ ఉపస్తత్త్వము
౧౩ పాదతత్త్వము
౧౪ పాణితత్త్వము
౧౫ వాక్తత్త్వము
— ఈయైదును పంచకర్మేంద్రియ తత్త్వములు.

౧౬ ఘ్రాణతత్త్వము
౧౭ జిహ్వాతత్త్వము
౧౮ చక్షుస్తత్త్వము
౧౯ త్వక్తత్త్వము
౨౦ శ్రోత్రతత్త్వము
— ఈయైదును జ్ఞానేంద్రియ తత్త్వములు.

౨౧ మనస్తత్త్వము
౨౨ అహంకారతత్త్వము
౨౩ బుద్ధితత్త్వము. దీని నంతఃకరణమనియు వాడి యున్నారు. (దీని నితరమతములందు మహత్తత్త్వమనియుఁ జెప్పుదురు).
౨౪ ప్రకృతితత్త్వము.
౨౫ పురుషతత్త్వము— ఇదియే యాత్మ. [ఇతర మతములందు దీనిని ప్రాణమందురు].

ఈతత్త్వములందుఁ గొన్నిప్రకృతిరూపములు, గొన్ని వికృతరూపములు, గొన్ని యుభయరూపములు, గొన్ని యనుభయరూపములు నై యున్నవి. ప్రకృతియే ప్రపంచకారణమగుట దానిని మూలప్రకృతియనియు నందురు. ఇది జడము. సాంఖ్యశాస్త్రము మేరకు ప్రకృతి సర్వవ్యాపకత్వముఁ గలది. (పరమాణువుల సముదాయము కాదు). ఇది సత్వరజస్తమోగుణములను సమభాములుగ గల్గియున్నది. (సత్వమన సంతోషము, రజ స్సనగా దుఃఖము లేక వేదన, తమ మనగా నుపేక్షయని యెఱుంగునది).

కాన జగత్తున కట్టికారణము ప్రకృతియనియు నాప్రకృతియొక్క కార్యము వికృతియనియుఁ జెప్పఁబడినది. ఇవి పంచమహాభూతములు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, మనస్సునై యున్నవి.

సూక్ష్మభూతములు తన్మాత్రలు. ఇవి మహాభూతములకుఁ బ్రకృతిగను నహంకారమునకు వికృతిగను దనరెడిని. ఇటులనే యహంకారము తన్మాత్రలకుఁ బ్రకృతియై మహత్తులకు వికృతిగఁ దనరెడిని. మరియు మహత్తహంకారమునకుఁ బ్రకృతిగను, మూలప్రకృతికి వికృతిగను దనరెడిని. ఇటుల నివి యొకటికొకటి ప్రకృతులుగను, వికృతులుగను దనరుటంజేసి యుభయాత్మకతత్త్వములై దనరునని చెప్పఁబడినది.

పురుషతత్త్వము కారణము, కార్యమునుగూడ గాక ప్రత్యేకముగ గల్గినది. అనఁగాఁ బ్రకృతియు పురుషతత్త్వము (ఆత్మ) ను ప్రత్యేకప్రత్యేకముగ గల్గినవి. జగత్తన నీరెండేనని భావము. గాన పురుషతత్త్వ మనుభయతత్త్వమని చెప్పఁబడినది. (రెండునుకానిది). ఇది మధ్యస్తమనియు కేవలస్వరూపమనియు, సాక్షియనియు, ద్రష్టయనియు, కర్తృత్వము లేనిదనియు, కార్యము, కారణము, కాదనియు భావము.

ఆత్మలకు క్షీణించుటకు, వృద్ధినొందుటకు శక్తి లేదు. ఇట్టిశక్తి ప్రకృతియందుఁ గలదు. ప్రకృతి పురుషసంయోగమున మహత్తు (బుద్ధి) జనించె

డిని. ఈసంయోగ మాకస్మికముగాని ప్రయత్న పూర్వకము గానేరదు. ఏలనన నాత్మ కేయిచ్ఛయు లేదు. గాన ప్రకృతిపురుషులు సమీపించుటయే కలయికకుఁ గారణమని చెప్పఁబడినది. అట్లు కలియుటవల్ల మహత్తు వీనిం జేరును. [మహత్తనిన బుద్ధి]. ఇందువలన జ్ఞాన ముదయించును. ఇది వేరొకపదార్థము.

మహత్తునుండి యహంకారమును, దానినుండి తన్మాత్రలును నింద్రియములును, వానినుండి సూక్ష్మభూతములును, వానినుండి స్థూలభూతములు జనించునని చెప్పఁబడినది. వేదనలనుండి తప్పించుకొనుటకు సాంఖ్యవిచారము చేయవలయుననియు, సాంఖ్యవిచారముచేత ననర్థరూపమగు నహంకారమమకారములు వదలి నిశ్చయజ్ఞానము గల్గెడిని. అటుల సాంఖ్యవిచార మొనర్చువాని కధికారియని పేరు వాడియున్నారు. ప్రయోజనము దుఃఖనివృత్తియనియు, విచారమున నాల్గుసంగతులు గలవనియుఁ జెప్పఁబడినవి. అవి ౧ ప్రకృతిం గూర్చియు, ౨ పురుషునిగూర్చియు, 3 సంబంధముంగూర్చియు, ౪ ప్రతిపాద్య ప్రతిపాదకభావముంగూర్చియు సాంఖ్యవిచార మొనర్పవలయును. ఈనాల్గింటికి ననుబంధచతుష్టయ మని పేరు. ఈవిచారము లేనివి సృష్టించుట యున్నది నశింపజేయుట సంభవింపకుండునటుల ౧ ప్రత్యక్ష, ౨ అనుమాన, 3 శబ్దప్రమాణములు మూటిచేత నొనర్పవలయును. మరియు సాంఖ్యవిచారమున నారు నియమములు విధింపఁబడినవి. ఆనియమ వ్యతిరేకము సంభవించెనేని యది దోషముగఁ బరిగణింపఁబడవలయును. అవి ౧ ఇంద్రియనాశము, ౨ ఇంద్రియములలో నొకదానిచే మనస్సాక్రమింపఁబడియుండుట, 3 దర్శనీయమగుపదార్థ మతిసూక్ష్మముగ గనఁబడుటయు, ౪ అట్టిపదార్థము మహత్తుగనుండుటయు, ౫ అట్టిపదార్థము దూరముగఁ గనఁబడుటయు, ౬ అది యత్యంతసమీపముగ నుండుటయు విచారణదోషములుగఁ జెప్పఁబడినవి.

సాంఖ్యశాస్త్రమునఁ జెప్పఁబడిన యిరువదియైదు తత్వములను పదార్థములనియు నందురు. బుద్ధి కాత్మవివేక ముం (తానేయాత్మ ననుభ్రమ) దుటంజేసి యాత్మయందు బంధమోక్షము లారోపింపఁబడినవికాని పరమార్థమునఁ గానేరవు. అవి ప్రకృతియొక్క పరిణామములని చెప్పఁబడినది. అవివేకమువలన సిద్ధించినభోగమునం దాత్మ కర్తగఁ దోచుచున్నది కాని యాత్మ కర్తగాదు, భోక్త గాదు. ఆత్మయగు పురుషుఁడు ప్రకృతియుగాఁడనియు, వికృతియుఁగాఁడనియు, కార్యకారణకర్త నెవ్వఁడునుగాని యసంగుఁడనియుఁ జెప్పఁబడినది.

పురుషుని భోగమోక్షములందుఁ బ్రకృతియే [illegible] పురుషుఁడు ప్రవర్తించుటలేదు. ప్రకృతియొక్క విషయరూప పరిణామముచేత పురుషునకు భోగము సిద్ధించెడిని. బుద్ధిద్వారా వివేకరూపపరిణామముచే మోక్షము సిద్ధించెడిని. బుద్ధియే భోక్తయనియు, బుద్ధివేరును నాత్మవేరు ననియు నీజ్ఞానమునకే వివేకమనియు, నీజ్ఞానాభావమున కవివేకమనియుఁ బేర్లువాడఁబడినవి.

సాంఖ్యమతసిద్ధాంతము మేర కాత్మకుఁ బ్రతిజన్మమునను వదలిపోవుచుండు స్థూలశరీరముగాక లింగశరీరమనఁబడు సూక్ష్మశరీరము సూక్ష్మభూతములచేఁ జేయఁబడినది యొకటిగలదనియు, ప్రకృతిని సంపూర్ణముగ జయించి మోక్షసిద్ధి యగు వరకును నీలింగశరీరము నశింపదనియు నాత్మను వీడదనియుఁ బురుషునకు జ్ఞానముగలుగ వేదనలు వదలిపోవుననియు, వేదనలు నశించుటయనఁ బ్రకృ

తిని త్యజించుటయే యనియు సట్టితరి సంపూర్ణ సుఖానుభవము గల్గుటయే ముకి యనియుం జెప్పఁబడినది.

**సాంఖ్యాయనగోత్రము:—**
(జాతుకర్ణ్యగణము చూడుఁడు.)

**సాంఖ్యాయనగోత్రము:—**
(ఉపమన్యుగణముచూడుఁడు.)

**సాంఖ్యాయనగోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు.)

**సాంఖ్యాయనుఁడు:—**
ఋషి. ఋగ్వేదాధ్యాపకుఁడు.

**సాంఖ్యేయగోత్రము:—**
(ఆత్రేయగణము చూడుఁడు.)

**సాంగ్రిహవాన్‌గోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు.)

**సాంగిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**సాంగ్లీస్టేటు:—** బొంబై రాజధాని ప్రభుత్వఁపు టధికారమునకు లోఁబడిన చిన్న స్వదేశ సంస్థానము. మహారాష్ట్రదేశము లోనిది. ఇది యిప్పుడు జ్యేష్ఠ, కనిష్ఠ సంతతులవారికి రెండుగ విభజింపఁబడి యున్నది. సాంగ్లిపురము దీనికి రాజధాని.

**సాంచిస్థూపము (శాన్తిస్థూపము):—** భూపాలసంస్థానరాజ్యమున భీల్సాపురమున నైఋతిదిశగా నారుమైళ్ల దూరమున (భీల్సాస్థూపములు) సాంచి (శాన్తి) స్థూపము కలదు. అది యుండిన తావునకుఁ దొల్లింటిపేరు కాకనాదము. ఇది గొప్పస్థూపము. ఇందు బుద్ధభగవానుని శి...డై నాలందవిశ్వవిద్యాలయ ప్రధానబోధకుఁడుగ, పరీక్షకుఁడుగనుండిన శారీపుత్ర మొగ్గల్లనుల అస్థికాముల నుంచ శుంగవంశస్థుఁడగు నొకభూపాలుఁడు నిర్మింపఁజేసెనట. స్థూపము క్రీ.ము. ౧౮౮ సంవత్సరమునను, నాల్గుదర్వాజాలు (ఒకశిలాద్వారబంధముల చాలాగొప్పవి పనితనముగలవి) శకాంతమునను, చుట్టునుగల రాతివాసముల యావరణ (Railing) మధ్యకాలములను నిర్మింపఁబడెనట. చూడ నాశ్చర్యముఁ గొల్పెడిసి. (కాకనదముఁ జూడుఁడు.)



**సాండు ఫౌండేషన్** (Sand foundation:— (పునాది చూడుఁడు).

**సాంతనాధుఁడు (శాంతనాధుఁడు):—** జైనతీర్థకరులలో నొకఁడు. (తీర్థకరులు చూడుఁడు). చిహ్నము లేడి. కురువంశక్షత్రియుఁడు. తండ్రిపేరు విశ్వసేనరాజా. తల్లిపేరు 'ఏరాదేవి'. జన్మస్థానము హస్తినాపురము. పొడవు ౪౦ ధనస్సులు (ధనస్సుమూఁడున్నమూర). వర్ణము సువర్ణచ్ఛాయ. ఆయువు లక్ష. గణధర్సంఖ్య ౩౬. నిర్వాణస్థలము సుమేరుశిఖరము. అంతరాళ మురపల్లు.

**సాంతాలకులగోత్రము:-** ఆరువైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. సాంతాలకులగోత్రము. ఏకార్షేయ (౧౦) గోత్రము. శాల్మీకగణము. సంస్కృతగోత్రము వాల్మీకస. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ. సుమంత్రేశుఁడు దేవత. కాంతమాంబ భార్య. విజయాద్రి తపస్థానము. చంచరీకసరస్సు తటాకము. జపము కోటి. దీపములు ౨౫. క్షేత్రసంఖ్య ౧౭. సప్తసంతానములు దానము. జమ్మివర్జనీయము. (వైశ్యగోత్రములఁజూడుఁడు).

**సాంద్రమణిగోత్రము:—** (జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**సాంద్విచ్ద్వీపములు (హావీద్వీపము):—** ఓసీనియాయందలి పోలీనేసియాద్వీప సమూహమునకుఁ జెందినవి. మెక్సికో దేశమునకుఁ బశ్చిమమున మూఁడువేలమైళ్లదూరమున Tropic of Cancer రేఖకు దగ్గరగా సాండ్విచ్ ద్వీప సమూహము గలదు. ఇవి పోలినేషియాద్వీపము లలో ముఖ్యములైనవి.

క్రీ. శ. ౧౭౭౭ వ సంవత్సరమున కెప్టెన్ కుక్కు గారు వీటిం గనుఁగొని, అప్పుడు 'First Lord of Admirality' యుద్యోగిగానుండిన సాండ్విచ్ ప్రభుని పేరఁ బరిగునటుల నీపేరిడిరనియు, కుక్కు గారిని సాండ్విచ్ ద్వీపములలోని హావీద్వీపమున చంపివేసిరనియుఁ జెప్పఁబడినది.

హావీదీపము నాంగ్లమున Hawaii అనుట బెక్కుండుగ్రి పొరబడి హావాయి యనుచుందురు గాని స్వదేశభాషయందు హావీయనే దీని నుచ్చ రింతురు. ఇది యెక్కుశక్యముగాని యేటవాలు గల యెత్తైనకొండలంగల్గి సాండ్విచ్ ద్వీపములలోఁ బ్రధానద్వీపముగ నెన్నంబడుచున్నది. ఇది యీ ద్వీపసముదాయమునఁ బెద్దద్వీపము. ఇందే ప్రధాన పట్టణమును, ప్రభుత్వకార్యస్థానమును నగు హానోలూలూపురము గలదు. ఇది రేవుపట్టణము. అనేక యోడ లిటనిలచెడి రేవు. ఇప్పు డమెరికాసంయుక్త రాష్ట్రములకుఁ జేరియున్నది. తక్కినద్వీపములు చిన్నవి. అంతప్రాముఖ్యత నందినవికావు.

**సాందీపుఁడు:—**ఋషిసత్తముఁడు. శ్రీకృష్ణబలరాముల విద్యాగురువు. ఉజ్జయిని లేక అవన్తి (మాళవదేశము) పురముకడ నంకపాద మనం బడుతావున నీమహానీయుని యాశ్రమముండిన తావు గలదు. ఈతనిసుతుఁడు ప్రభాసతీర్థముకడ స్నాన మాచరించుచుండ వానిని పంచజనుండను దానవుండు నీటిలోని కీడ్చుకొనిపోవ శ్రీకృష్ణుం డాదానవుం జంపి వానియెముకను తాశంఖముఁ జేసికొనెనుగాన దానికిఁ బాంచజన్యమని పేరయ్యె ననియు, మరియు శ్రీకృష్ణుం డాసందీపకుమారుం దెచ్చి సందీపనికి గురుకట్నముగ సమర్పించె ననియుఁ జెప్పఁబడినది.

**సాంప్రదాయము** [Tradition]**:—** అనుశ్రుతముగ పూర్వులనుండి యిప్పటివారి కొసఁగఁబడిన యాచారధర్మములు సాంప్రదాయములనఁబరగుచున్నవి. దీని కాంగ్లమున 'ట్రెడిషన్' అనియెదరు. యుద్ధములవలనను, ప్రభుత్వములు మారుతరిని యీభరతదేశమున సాంప్రదాయముల నాటంకములుగల్గించి మార్పులఁ గల్గించుచున్నవి.

**సాంపిల్సు (మచ్చు)** (Samples)**:—** వాణిజ్యసంబంధ పరిభాషాపదము. మచ్చునకై కొంచమునరకిచ్చుట యనియర్థము. ఒకగోడౌన్ లేక వేర్‌హౌస్ నూపరెంటెండెంటున కందునిల్వ యున్న సరకులనుంచి కొంచముమచ్చు పేర్కొనఁబడినవారి కిమ్మనివ్రాయఁబడిన యుత్తరువునకు Sampling Orders అనెదరు.

**సాంబ్రాణిచెట్టు:-** లా. Gratiola momieria అనియు; Herpestis momieria. ఆంగ్ల Thyme-leaved Gratiola అనియు; Styrax tree. సం. చర్మకషా; చర్మకాలీ.

సాంబ్రాణిచెట్టుబంక సాంబ్రాణియనంబడును. ఇది చెట్టునుండి పాలరూపమున వెలువడి రబ్బరుచెట్టునుండి రబ్బరువలెనే తీయఁబడి వండి

గట్టిగఁజేయబడినదానికి సాంబ్రాణియందురు. ఇది సువాసనద్రవ్యము. ధూపమున కుపయోగింతురు. సాంబ్రాణి కాంగ్లమున Banzoin అనెదరు. సాంబ్రాణిచెట్లు సుమత్రా జావాద్వీపములందు విస్తారముగ గలవు. మనదేశమునఁ జక్కఁగఁ బెరుగుటలేదు.

సాంబ్రాణిపలాస్త్రి గాయమును, పగుళ్ళను మాన్పును. వాపులను నివారించును. లోనికిచ్చిన త్రిదోషముల నడంచునందురు. దంతములకు బల మిచ్చును. ఇంచుక విరేచనబద్ధమును గల్గించును. సాంబ్రాణితైలము [Banzoin] వాత, మేహ వాత, పక్షవాతఁపునొప్పుల నివారించును.

**సాంబుఁడు:—** అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి శ్రీకృష్ణుఁడు. తల్లి జాంబవతీదేవి. సోదరులు ప్రద్యుమ్నాదులు. (శ్రీకృష్ణుఁడు చూడుఁడు.)

**సాంభరాయణగోత్రము:—**
[గర్గ ఉపగణము చూడుఁడు].

**సాంభవాహగోత్రము:—** ఇది యగస్త్య సంతతి. అగస్త్యప్రగ్గణములోని సామ్భవాహ ఉపగణముగఁ జెప్పఁబడిన గోత్రము. దీని కగస్త్య, దైర్ఘచ్యుత, సాంభవాహ యని ప్రవర. త్రయార్షేయము.

**సాంభేయగోత్రము:—**
(అత్రిపుత్రికాపుత్రులగణముఁ జూడుఁడు).

**సాంశివ్యగోత్రము—**
(కుశికగణముఁ జూడుఁడు).

**సాకాక్షిగోత్రము—**
[అగస్త్య ఉపగణముఁ జూడుఁడు.]

**సాక్సియాపీవమార్ గ్రాండుడచ్చీ:—** ఐరోపాఖండమున జర్మనుదేశములోని మైనరుస్టేట్సునకుఁ జెందిన గ్రాండుడచ్చీయను ప్రదేశము. [జర్మను మైనరుస్టేట్సు, జర్మనీదేశము చూడుఁడు].

**సాకేతనగరము:—**
(అయోధ్యఁ జూడుఁడు).

**సాకేతాయనగోత్రము:—**
[ఆత్రేయగణముఁ జూడుఁడు].

**సాక్సోనీరాష్ట్రము:—** ఐరోపాఖండము లోని జర్మదేశమునందలి యొకదేశము. చాల చిన్నది. ౫౮౦౦ చతురఁపుమైళ్ళ వైశాల్యము. క్రీ. శ. ౧౮౦౬ లో రాష్ట్రముగాఁజేయఁబడినది. ఈదేశప్రభుత్వము నెపోలియన్వశ మవలంబించుటఁజేసి క్రీ. శ. ౧౮౧౫ లో దీనినుండి కొన్ని ప్రదేశములు తీసివేయంబడి యితరరాష్ట్రములకుఁ గలుపఁబడినవి. సాక్సనీ యైరోపాఖండమంతటిలో నధికజనాభాగల ప్రదేశము. ఇందు చౌకఁపు మైలునందు ౭౨౫ గురు జనులు వసించుచున్నారని లెక్కింపఁబడినది. భూములు చాల ఫలవంతములగుటయు, వ్యవసాయము మంచిస్థితినుంటయు నెల్లెడల గాననగుచుండును. ఇచటి గొఱ్ఱెలమందలు ప్రశస్తమైన యుత్తమజాతి యున్నికి పేరందినవి. చేతిపను లపరిమితముగఁ దోఁచుచుండును.

ప్రజలు విద్యాధికులు. విద్య చక్కఁగ వ్యాపించియున్నది. ప్రొటస్టాంటుక్రైస్తవులు. ఎల్బినదీతీరమునందున్న డ్రెస్డెనుపురము ప్రధానస్థానము. ఇందు నొకచిత్రశాలయందు వ్రాతచిత్రములు, చేతచిత్రములు నపరిమితముగ కూర్చి చేర్చియున్నారు. ఇటకుఁ బదునేనుమైళ్ళదూరమున

మెయిసెన్ పురమున చేయఁబడు డ్రెస్డెన్ చైనా సామాను లోకప్రసిద్ధము.

లీప్జెగ్ పురము సంతలకును, పుస్తకవ్యాపారము నకును పేరందినది. అట సుప్రసిద్ధవిశ్వవిద్యాలయము గలదు. క్రీ. శ. ౧౮౧౩ లో నెపోలియన్ లీప్జెగ్ పురముకడనే యోడిపోయెనని చెప్పఁబడినది. వీస్బర్గపురము లోహఁపుగనుల నడుమనున్న పురము.

(ఐరోపాఖండము, జర్మనుదేశము చూడుఁడు).

**సాక్షులకాళ్లు పట్టుకొనుటకన్న వాదికాళ్లు పట్టుకొనుట శ్రేష్ఠము:—**
( . )

**సాగరగోత్రము:—**
[కపిఉపగణము చూడుఁడు.]

**సాగరద్వీపము:**—బంగాళదేశమున గంగా నదిలోని యొకశాఖయగు హుగ్లీనది సముద్రమున సంగమించుతావునఁగల ద్వీపము. ఇట మాఘ మాసమునను, మకరసంక్రాంతికాలమునను గొప్ప స్నానయాత్ర జరుగుచుండును. దీనితో గొప్ప సంత గూడుచు వర్తకము నడచును. కలకత్తా నుండి స్టీమరుపై సాగరద్వీపమునకుఁ బోవలయును.

**సాచర్యగోత్రము:—**
[వాధ్ర్యస్య లేక మిత్రయువగణము చూడుఁడు.]

**సాత్యకాయనగోత్రము:—**
[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.]

**సాత్యకాయనగోత్రము:—**
[విష్ణువృద్ధఉపగణము చూడుఁడు.]

**సాత్యకి:**—అత్రి. చంద్ర. యాదవక్షత్రియుఁడు. తండ్రి యుయుధానుఁడు. ఇతనికి శైనేయుఁడనియుఁ బేరుకలదు. ఈత డర్జునుని శిష్యుడు.

**సాత్యకిగోత్రము:—**
(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు).

**సాత్యకిగోత్రము:—**
(వాధ్ర్యస్వ లేక మిత్రయువగణముఁ జూడుఁడు).

**సాత్యకిగోత్రము లేక సాత్వకిగోత్రము:**—(ఆత్రేయగణము చూడుఁడు.)

**సాత్యముగ్రిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**సాత్యముగ్రిగోత్రము:—**
[ముద్గలఉపగణముఁ జూడుఁడు].

**సాత్యముగ్రికగోత్రము:—**
[ఔతథ్యఉపగణము చూడుఁడు.]

**సాత్వతి [వృత్తి]:—**
[లక్షణ చూడుఁడు].

**సాత్వతి (శ్రుతశ్రవ):—** యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడగు శూరునికుమార్తె. వసుదేవుని చెలియలు. చేదిదేశఁపుభూపతియగు దమఘోషునిభార్య. శిశుపాలుఁడు, సాల్వుఁడు కుమాళ్లు. ఈమెకు శ్రుతశ్రవయని నామాంతరము గలదు.

**సాత్వతుఁడు (సత్యశ్రుతుఁడు):—** యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి పురుహోత్రుఁడు. పితామహుఁడు డనూరథుఁడు.
కుమాళ్ళు:—౧ మహాభోజుఁడు లేక కుంతిభోజుఁడు, ౨ అంధకుఁడు, ౩ దేవావృధుఁడు,

౪ వృష్ణి, ౫ దివ్యుఁడు, ౬ భజి, ౭ భజమానుఁడు. మరియు విష్ణుపరిచరులలో నొకసాత్వతుఁడు గలఁడట.

## సాత్వలాయనగోత్రము:—

[వసిష్ఠగణముఁ జూడుఁడు].

## సాతాని జుట్టుకు, సన్యాసి జందెముకు ముడిపెట్టేవాఁడు:—

[ఇరువురకును లేనివి, మాయకాఁడనియర్థము].

## సాత్యాయనిగోత్రము:—

[గర్గఉపగణము చూడుఁడు.]

## సాత్వికగోత్రము:—

[విష్ణువృద్ధ ఉపగణముఁ జూడుఁడు].

## సాత్వికభావము లెన్మిది:— భరత [నాట్య] శాస్త్రమున, ౧ స్వేదము [చెమట], ౨ స్తంభము [నిశ్చేష్టితులౌట], ౩ రోమాంచలము [గగుర్పాటు], ౪ స్వరభేదము [కంఠధ్వని మాఱుట], ౫ వేపథు [గద్గదము], ౬ వైవర్ణ్యము [తెల్లపోవుట మొదలగు వివర్ణ్యము], ౭ అశ్రువు [కన్నీరు], ౮ ప్రళయము [మూర్ఛ మొదలగునవి]. ఇవి యష్టసాత్వికభావములని చెప్పంబడినవి.

(భరతశాస్త్రము చూడుఁడు. హస్తాభినయము చూడుఁడు.)

## సాదాఖ్యపంచకము:—

[పంచసాదాఖ్యములుఁ జూడుఁడు].

## సాధనచతుష్టయము:— దీనికే చతుర్విధశాంతములనియుఁ బేరు. సాధనమన సాధించి పొందుట కర్తవ్యవిధానమని యచటి యర్థము. మోక్షసాధనమని భావము.

౧ ఆత్మానాత్మ లేక నిత్యానిత్యవివేకము:— నశింపనివి, నశించునవి యగు పదార్థములఁ గూర్చిన జ్ఞానము. ఇట నాత్మకు [జీవాత్మగాని పరమాత్మగాని] నశింపదనియు, నిత్యమనియు భావము. ఇంక జగద్వస్తువులు, నామరూపములు మార్పుఁజెందునే [నశించునవి] గాని యావస్తువు పరబ్రహ్మపదార్థమేయగుట నశింపదనియు నెఱుంగుట యిచటి భావము.

౨ ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము:— ఇహలోక సంబంధములు, పరలోకసంబంధములు నగు పదార్థముల ననుభవించుకోర్కె మరలి విరాగము గలుగుట.

౩ శమదమాదిషట్కసంపద:—

౧ శమము— అంతరింద్రియనిగ్రహము.

౨ దమము— బాహ్యేంద్రియనిగ్రహము.

౩ ఉపరతి— అర్హములగు నాచారధర్మముల నొక్కొకటిగ విడిచిపెట్టుచు, జ్ఞానపూర్ణత నందుచుండుట.

౪ తితీక్ష— ఖేద మోదముల నొకేరీతిని సహింపఁ గల్గినస్థితిం గల్గియుండుట.

౫ శ్రద్ధ— బాధ్యతం గల్గియుండుట.

౬ సమాధానము— ధర్మములను బోధపఱచుకొనుట.

౪ ముముక్షుత్వము— మోక్షచింత గల్గియుండుట.

## సాధనత్రయము:— జైన [ఆర్హత] మతధర్మమున క్రియబుద్ధి, క్రియజ్ఞానము, క్రియ సాధనములను సాధనత్రయ మనియు, రత్నత్రయ మనియు నందురు.

## సాధనోపాయసిద్ధి:—

[లోకనీతిసిద్ధులు చూడుఁడు].

**సాధ్య:—** ధర్మునిభార్యలలో నొకతె. ఈ మెసంతానమును సాధ్యులందురు. వీరు దేవతలలో నొకశాఖవారు. సిద్ధిఁ గలవా రనిభావము. వీరు పన్నిద్దరు.

**సాధ్యగణము:—** ధర్మునకు సాధ్యయందుఁగల్గిన పుత్రులు. సిద్ధిఁ గలవా రనియర్థము. ధర్ముఁడు, మనువు. ఈయన భార్యలు కీర్తి, లక్ష్మి, ధృతి, మేధ, లజ్జ, సాధ్య మొదలగువారు.

సాధ్యులు నవదేవతాగణములలోనివారు.

**సాధ్యగోత్రము:—**
[లౌగాక్షిగణము జూడుఁడు].

**సాన్ డోమింగో యందలి ప్రభుత్వములు (San Domingo):—** ఒకభాగమున డొమినికన్‌ప్రజాప్రభుత్వమును నొకభాగమున హైతి [Haiti] ప్రజాప్రభుత్వమును గలవు.

డొమినికన్‌ప్రజాప్రభుత్వఖండము పందొమ్మిదివేల మూఁడువందల చతురఁపుమైళ్ళ వైశాల్యమును, పదిలక్షల యిరువదివేల జనసంఖ్యయుఁ గల్గియున్నది.

హైతిప్రజాప్రభుత్వఖండము పదివేలరెండువందల చతురఁపుమైళ్ళ వైశాల్యముఁ గలది. దీనిజనసంఖ్య యిరువదిమూఁడులక్షలు.

**సానగగణము:—** ఇది విశ్వబ్రాహ్మణులం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి. (ఋక్శాఖ విశ్వబ్రాహ్మణులుచూడుఁడు.)

౧ సానగర్షిగోత్రము:—మను, విశ్వదేవ, సానగ యను త్రయార్షేయప్రవర.

౨ విభ్రాజర్షిగోత్రము:— సానగ, మనిశ్చ, కర్మహర, జయదేవ,విభ్రాజయన, పంచార్షేయప్రవర.

౩ కశ్యపర్షిగోత్రము:— కశ్యప, హయోచ్చార్య, వైధృవ యను త్రయార్షేయప్రవర.

౪ మనువిశ్వకర్మర్షి గోత్రము:— మను, సానగ, విశ్వాత్మయను త్రయార్షేయప్రవర.

౫ విశ్వాత్మకర్షి గోత్రము:—విశ్వాత్మక, కర్మహర, జయదేవ, కాశ్యప, హయోచ్చార్య యను పంచార్షేయప్రవర.

**సాన్కగోత్రము:—**
[జమదగ్నివత్స ఉపగణముఁ జూడుఁడు]

**సానయుగోత్రము:—**
[వాధ్ర్యశ్వ లేక మిత్రియువగణముఁ జూడుఁడు].

**సాని:—** దీని కాంగ్లమున సరియగుపదము 'Lady' యై యున్నది. పెక్కండ్రికు స్ఫురించి యర్థమగుచున్నట్లుల వేశ్య యని యర్థము కాదు. గొప్పగొప్పస్త్రీల కీపేరు వర్తించును. తొల్లింట రెడ్లప్రభుత్వకాలమున వారియందు స్త్రీలకు సానులనుపేరు లుండెడివి. ఆంధ్రదేశమున చలసాని, పెమ్మసాని మొదలగుగ్రామనామములు, కామారెడ్డి, జంగారెడ్డి, మొదలగుగ్రామనామముల వలెనే గొప్పవారి పేరంబరఁగు గ్రామనామములై యున్నవి. లోకవ్యవహారమున సాని యన వేశ్యయనియు, సారస్వతమున సాని యన యజమానురాలు లేక భార్యయనియు, సర్వసామాన్యముగ సానియన స్త్రీయనియు లోకవిదితము.

**సానుశ్రుతగోత్రము:—**
(నిధ్రువగణము చూడుఁడు.)

**సాన్సు రీ కోర్సు:—**ఇది వాణిజ్యసంబంధపరిభాషాపదము. దీనికి 'without recourse' అనియర్థము. ఇది హుండీలపై నిండార్సు చేయువారిచే వ్రాయఁబడురిమార్కు.

**సానుష్టిగోత్రము:—**
(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**సాపరివారగోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు.)

**సాప్తకర్ణిగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**సాపిండినగోత్రము:—**
(వాధ్ర్యస్వ లేక మిత్రయువగణము చూడుఁడు.)

**సాప్ [Sap వృక్షరసము]:—** చెట్ల యందుండు రసమునకు 'sap' అందురు. చెట్టు యొక్క వేళ్ళనుండి చెట్టుపీల్చుకొని కడనున్న యాకులవఱకును పంపురసమునకు 'ascending sap' అని పేరిడియున్నారు. ఇం దుదకమును, నీటఁ గరఁగినకొన్ని లవణములు (salts) ను గలవు. ఇది చెట్టుయొక్క పైపట్ట (Bark) నుండి జనుచుండును. మఱియు నది యాకులఁజేరి యట నావిరియైపోవుటతో గాలినుండి కార్బనును జెట్టు పీల్చుకొనుచుండును. ఆకార్బనుతోఁ గూడిన మిగిలినరసము కొంత చెట్లనడుమనుండు 'tissue' లనుండి క్రిందికి దిగును. దీనికి 'decending sap' అనిపేరు. ఇది దిగుతరి చెట్టుయొక్క భాగము లన్నిటికిఁ బ్రాకి, వానిని బలపఱచి పెఱుగఁజేయుచుండును. గానసే చెట్టకు మొదట నుదకమును, కడ నాకులకడ నెండయుఁ జెట్టునకం తకును గాలియు నత్యవసరము లై యుండును.

**సాప్రోఫైటిస్ జాతి వృక్షములు, లతలు:—** ఇందుఁ బలుభేదజాతులు గలవు. కొన్ని బేక్టేరియాజాతులు, కొన్ని ఫంగస్‌జాతులు. బ్రతికియున్న చెట్లయం దాకులు మొదలగు నవయవములనుండి తమయాహారమును దీసికొనుచు బ్రతుకుచుండును. ఇందుఁ గొన్ని యరుదుగ జీవజంతువులపై నేర్పడి వానినుండి యాహార ముఁ గైకొనునవియుండుట విచిత్రము. కాని నిజమగు సేప్రోఫైటిస్‌జాతులు చచ్చి కుళ్ళు చున్న వృక్షపదార్థములనుండి యాహారముం గై కొనుచు బ్రతుకునవి కలవు. వానికి గ్రీన్‌స్టఫ్ అక్కఱయుండదు. ఇవి భూమిని శుభ్రపఱచునని చెప్పఁబడియున్నది. ఇవి యొకజాతిచెట్లకుఁ జెంది నవి కావందురు. వీనికి ముక్కిన కూరపదార్థ (Rotten Vegetable matter) మాధార మట. వీని పువ్వులు బలమైనవి. అందు 'Rafflesia' అని పేరిడంబడిన సేప్రోఫైటీసుజాతిచెట్ల పూవుల యడ్డుకొలత యడుగులపొడవున కధికమై యుండును. ఈజాతులు వేఁడిప్రదేశపు టడవు లందుఁ గాననగుచున్నవి. ఇంక నొకవృక్షముపై మొలచి యల్లుకొని (చుట్టుకుని) పెరిగి దానిశరీర మునుండి యాహారముఁగైకొనుచు సూర్యరశ్మిని, గాలిని మాత్రము ప్రత్యేకముగ నెండనుండియు, వాతావరణమునుండియు నందుకొను జువ్వి, బద నిక మొదలగుచెట్లంగూర్చి యెల్ల రెఱిఁగినదే.

**సాఫ్ఫోగోళము:—** పాశ్చాత్యఖగోళ శాస్త్రమున సూర్యునిఁజుట్టి తిరుగుచుండు నొక చిన్నగోళము. క్రీ. వె. ౧౮౬౮ లోఁ గన్గొనఁ బడినది. సూర్యునుండి ౨౭౩౦౦౦౦౦౦ మైళ్ళ దూరముండునట.

**సాబేయిజమ్ (Sabaism):—** నక్షత్ర ములను విగ్రహరూపమున నారాధించు విధా నము. హిబ్రూపదజనితము. [F Sabeisme] From Heb. Saba host (of heancn) and ism.

**సాభారగోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు.)

**సామంతకూటము (Adam's Peak):-** ఇది సింహళద్వీపమంతటను జేరందిన యాత్రాపర్వతశిఖరము. సుప్రసిద్ధస్థలము. సముద్రమున నోడలలో నరుగువారికిఁ బెక్కుమైళ్ళ దూరము దనుక నొకగురుతుగఁ గన్పట్టుచుండును. ఇది సముద్రఁపు నీటిమట్టముపై ౭౩౬౦ అడుగులు యెత్తుఁగలది. ఈద్వీపమున నెక్కువయెత్తుగల పర్వతశిఖరము. పెడ్రోతలగల యిది సముద్రఁపు నీటిపై ౮౨౯౦ అడుగులు యెత్తుఁగలది. తరువాత జెప్పందగిన దీసామంతకూటమే. అనాదిగఁ బేరందిన యాత్రాస్థలమై యున్నది.

సామంతకూటపర్వతముఁ జుట్టియేగాక పరిసర పర్వతములందు సహా దట్టమగు పొగమంచులు చేరి కూడి దృశ్యమును మరుగుపర్చుచు బలమగు సముద్రఁపుగాలులచే నది తరుమబడుచుంటఁ దిరుగ దృశ్యములం గన్పడఁజేయుచు దూరమునుండి మోటారుబండ్లలో నరుగుచున్నవారికి దాగుడుమూఁత లాడుచున్నట్లుగా నగుచుండును. దీని నెక్కుటకు ౧ రత్నపురిమార్గము, ౨ హేటన్-మాస్కేలియామార్గము నను రెండు ముఖ్యమార్గములు గలవు.

రత్నపురిమార్గము:— ఇరువదిమైళ్ళదూర ముండును. కష్టతరమైనది, దారియం దొక్కొకతావున నినుపనిచ్చెనలపై నెక్కుచు వ్రేలాడఁదీయంబడిన గొలుసులం బట్టుకొని పోవలసియుండును. అలగ్జాండరు ది గ్రేటు కాలమున వేయఁబడిన యినుపగొలుసులు త్రుప్పుపట్టినట్టుఁ జూపుచుందురు. మార్గమున నీటిదారులు, గండశిలలు, అడవితుప్పలు, రాళ్ళకడలనుండి యెక్కి నడచుదారులు, ననేకములు కష్టముగ నుండెడిని. కడపటి కొన్ని వందలయడుగు లెక్కుట మిక్కిలి యాయాసకరమై దనరెడిని. గొలుసులఁ బట్టుకొని మధ్యమధ్యనాగి యలసటఁ బాపుకొనుచు నిలుచుండియే సేదఁదీర్చుకొనుచు నరుగవలసియుండును. పైభాగములనుండి క్రిందికిఁ జూచుట భయంకరముగ నుండుఁ గాన రాత్రులం దీకొండ నెక్కుచుందురు. మేఘములు దమకుఁ గ్రిందిభాగములనుంటఁ బగ లెక్కువారలకుఁ గానసగును. మార్గమున నొకతావున కొండప్రక్కనున్న పగులును (బీటను) బుద్ధభగవానుఁ డాదిని తనకట్టుబట్టలఁ గుట్టుకొనుచు నాసూదితో నేలంగీచినయానవా లందురు. దీనిని దాటి భూతపిశాచాదులు ముందునకుఁ బోఁజాలవందురు. ఇటులనే మార్గమందున్న నీటిదారులు, సెలయేండ్లు మొదలగువాటికి కథ లనేకములఁ దెల్పుచున్నారు. ఇవి యన్నియు బౌద్ధమతసంబంధములుగనే యున్నవి. ఇదియే యాదికాలమునుండి యుండిన మార్గముగాన పవిత్రవంతమందురు. ఇట వెడలుపులేని యిరుకుమార్గముగ నున్నది. సంవత్సరము పొడవునను నీమార్గమునుండి యాత్రస్థులు నడచుచుందురు. ఇక్లేగుట యధికఫలప్రదమను బౌద్ధభిక్షువులును గలరు.

రెండవదియగు హేటన్ మాస్కేలియామార్గ మతికష్ట మనిపించదు. కొండదరికిఁ జేరు దనుక మోటారులు పోవుబాట కలదు. ఈమార్గమునం దేటేట స్ప్రెల్ మే మాసములం దధికముగ యాత్రస్థు లరుగుచుందురు. ముఖ్యముగ వర్షములులేని కాలమం దీమార్గ మధికముగ వాడుకయం దుండును. రాత్రియందు భోజనములై నపిదప లాంతరులతో బయలువెడలి తెల్లవారు వరకుఁ గొండపై కెక్కుదురు. హేటన్ మాస్కేలియాబాట కొండదరికిఁ జేర పదునాల్గుమైళ్ళుండును. పర్వత పరిసరారణ్యమునకు Peak wilderness అని వాడుచున్నారు. యాత్రస్థులు

స్త్రీలు, బాలురు, వృద్ధులుకూడ పురుషులతో నుండి యుత్సాహపూరితులై సాధు సాధని యరచుచుంట వినోదముగ నుండెడిని.

సామంతకూటమును హిందువులు, బౌద్ధులు, మహమ్మదీయులు, క్రైస్తవులుగూడ పవిత్రస్థలిగా నెంచుదురు. ఇది బౌద్ధభిక్షువుల వశమందున్న పవిత్రక్షేత్రము. పర్వతశిఖరమున నొక పెద్దగండశిలపై నాలుగడుగులపొడవున మనుష్యపాదముంబోలి యించుక పల్లమగు నానవాలు గలదు. దానికి శ్రీపాద మనిపేరు. దీనిపై నొకపాటి గృహము గలదు. ఇదియే యచటి దేవస్థానముగ నున్నది. దానినే బుద్ధపాదమని బౌద్ధులును, శివపాదమని హిందువులగు నరవలును నాదిపురుషుఁడగు 'ఆదము' పాదమని మహమ్మదీయులును, సెంటుపీటరుపాదమని క్రైస్తవులును భక్తితో గారవించుచున్నారు. బౌద్ధులగు సింహళులు, సయాందేశస్థులు, బర్మావారు, టిబేటుదేశస్థులోకేమాటగ నిది బుద్ధపాదమనియుఁ బవిత్రస్థలి యనియు నందురు. వారే శ్రీపాదమని పేరిడి యుందురు. హిందువులగు నరవలు శివపాదపవిత్రస్థలి యందురు. మహమ్మదీయులెల్ల తెగలవారును 'స్వర్గమందలి తోటనుండి యాదాము హవ్వలు వేరుసేయఁబడి తరిమివేయఁబడినతరి నాదామిటఁజేరి యొకేపాదమున నిలచి వందలకొలఁదిగ వత్సరము లిటఁదపంబొనర్ప జిబ్రేలుమహాప్రమథుఁడు గనికరించి కల్గించుకొని యాదము నోదార్చి సింహళము నాతని కొసఁగఁజేసెననియు, తపమొనర్చినాటి యాతనిపాదము జాడయే యీపవిత్రస్థలి యనియు' నందురు. క్రైస్తవులు సెంటుతోమాసు బోధకుని పాదమందురు.

ఈ సామంతకూటపర్వతపరిసరములు తేయాకు సీమయం దున్నది. ఇచ్చటి తేయాకు మిగుల రుచికరమని పేరందియున్నది. పర్వతపరిసరప్రాంత మంతయు వర్షమధికముగ గురియు సీమయైయున్నది. ఏటేట రెండువందల యంగుళములకుఁ బైగానిట వానగురియుచుండునని లెక్కించియున్నారు. చెట్లు చేమ లధికముగఁ బెఱిగియున్నవి. పర్వతజలధారలు, సెలయేండ్లు, జలపాతములు, లెక్కకు మీఱి యున్నవి. పర్వతపరిసరసీమలు పల్లఁపుఁబ్రదేశములు. ఇట నీటియావిరి యధికము. అది దట్టమై పొగమంచుగ నేర్పడి సూర్యోదయకాలమునఁ బశ్చిమదిశను మంచుపై సామంతకూటశిఖరఁపునీడ స్పష్టముగ గన్పట్టుచుఁ బండ్రెండు నిముసములలోఁ బలచఁబడినట్లు మాయమై తిరుగ నచిరకాలముననే సూర్యబింబ మించుకఁ బైకిరాఁ బర్వతపంక్తినీడ స్పష్టమై గన్పట్టి తిరుగ నచిరకాలముననే యదృశ్యమయ్యెడిని. ఇత్తఱిఁ బర్వతపంక్తినీడ యొకటిగను, శిఖరచ్ఛాయ వేఱొకటిగను రెండు దృశ్యములని యెఱుంగునది.

## సామంతకూటము:—

[ఏడమ్సుపీక్ చూడుఁడు].

**సామంతపంచకము**:— కడపటి రాయబారముల యుధిష్ఠిరమహారాజు దుర్యోధనునికడ కైదు ప్రస్థములైన నిమ్మనికోరి పుత్తెంచెను. వానికి సామంతపంచక మనిపేరు.

౧ ఇంద్రప్రస్థము— దీనికి ఖాండవప్రస్థ మనియు, బృహస్థలియనియు నామాంతరములు వాడఁబడినవి. [ఇప్పటిఢిల్లీ].

౨ పానిప్రస్థము— దీనికిఁ గుశస్థలియనియు, కుశప్రస్థమనియు నామాంతరములు వాడఁబడినవి. [ఇప్పటి పానిపాట్.]

౩ శోణప్రస్థము—దీనికి వృకప్రస్థమనియు, వృకస్థలి యనియు నామాంతరములు వాడఁబడినవి. [హస్తినాపుర దక్షిణభాగమునఁ గొంచము దూరమునఁ గలదు.]

౪ తిలప్రస్థము— దీనికి వారణావతమనియు, అభిస్థలియనియు నామాంతరములు వాడఁబడినవి. [ఢిల్లీకడ కుతుబ్ మినార్‌న కాగ్నేయమున పదిమైళ్ళలోఁగల తిల్పాట్.]

౫ భాగప్రస్థము— దీనికి జయంత మనియు, మాకందియనియునామాంతరములు వాడఁబడినవి. [మీరట్పురమునకుఁ బశ్చిమముగా ౩౦ మైళ్ళ దూరమునఁగల 'బాగ్పాట్' అనఁబడుచున్న గ్రామము. యమునాతీరము.

**సామంతభూపతులు గాలికివిరిగిన [Windfall Trees] చెట్లు:—** ఆదికాలమున నొకప్పు డాంగ్లదేశపు టడవులందలి చెట్లు ప్రభుత్వనౌకానిర్మాణార్థము ప్రభుత్వమువారిచే నాంకి [ఉత్తరువు] ల క్రింద నుంచఁ బడెనఁట. అత్తరి సామంతులగు లార్డ్సు తమ చెట్లనుగూడ నఱుక వీలులేకుండెనట గాని, గాలికి ప్రమాదమునఁ బడిపోయినచెట్లు దురదృష్టకములని నౌకానిర్మాణశాఖోద్యోగులు వాడనొల్లమి సామంత భూపతులకు వశమగుచుండె నట. అట్టిస్థితియందాంగ్లదేశపులార్డ్సు గాలికిఁ బ్రమాదమున చెట్లు పడిపోవుటనే కోరుచుండ మొదలిడిరట.

నాఁడాదిగ 'windfall' ఉక్తి యేర్పడి నేఁటికి నవర్హులకు, బీదలకు దొరకిన యదృష్టముం గూర్చి వాడుచున్నారు.

**సామము:—**
[ఉపాయములు చూడుఁడు].

**సామర్థ్యయోగన్యాయము:—** సమర్థత గల్గియుండిన కార్యసిద్ధిగల్గుననుట కీన్యాయము వాడుచుందురు.

**సామలోమకిగోత్రము:—**
[ఔతథ్య ఉపగణముఁ జూడుఁడు].

**సామవేదము:—** వ్యాసమహర్షి సామవేదమును శిష్యుఁడగు జైమినికొసంగి వ్యాఖ్యను శాసించెను. ఆతఁడును తనపుత్రుఁడగు సుమంత్రికిని, మనుమఁడగు సుత్వనకును బిదప నొసఁగి విధించెను. అందు సుత్వుఁడు తనపుత్రుండగు సుకర్మర్షి కొసంగి వ్యాఖ్యను గల్పించెను. అట్లే సుకర్మయు తనశిష్యులగు పౌష్పిజయ హిరణ్యనాభులకు విధించెను. ఆ పౌష్పిజయర్షి శిష్యులగు కక్షీవంత లాంగల లోకాక్షి కౌథుమర్షులును, హిరణ్యనాభశిష్యులగు కృతర్షియు ౫౦౦ ప్రాచ్యసామగులును ౫౦౦ ఉదీచ్యసామగులును స్ఫురించి ప్రాప్తిఁజేసి ముగించిరి.

సామవేదమునందలి మంత్రభాగమునఁ గేవల సామశాఖలు ౯౭౭ కలవు. వాలఖిల్యశాఖలు ౭౯౦ కలవు. ఇంకను ౧ రణానీయ, ౨ శాట్యముగ్య, ౩ కాపోల, ౪ మహాకాలీ, ౫ లాంగలాయన, ౬ శార్దూలులను నాలుశాఖలును, కౌథుశాఖ లేఁడునుగలవు. అవికౌథుమలు, నైగేయులు, ప్రాచీనయోగ్యులు, ద్వైతభృతులు, ప్రాక్షలీలు, వాతాయనులు ననురాయణులు ననునవి. ఈ పదమూడుశాఖలును రణానీయశాఖలని యనుటయుఁ గలదు. ఇంకనుసౌర్యులు, అరణ్యకులు, ప్రేంఖులు, సుపర్ణకులను నాల్గు వేరుశాఖలును గలవు. ఈ శాఖలన్నియు మంత్రభాగములోనివే.

సామవేదబ్రాహ్మణము లెన్మిది తెరఁగులు. అవి ౧ తాండ్యబ్రాహ్మణము, ౨ షడ్వింశబ్రా

హ్మణము, 3 సామవిధానబ్రాహ్మణము, ౪ వంశ బ్రాహ్మణము, ౫ ఆర్షేయబ్రాహ్మణము, ౬ దేవ తాధ్యాయబ్రాహ్మణము, ౭ సంహితబ్రాహ్మణము, ౮ ఉపనిషద్బ్రాహ్మణము అనునవి. ఈయష్టవిధ బ్రాహ్మణములు విధి, అర్థవాదము నని ద్వివిధ ముగ నుండును. సామవేదమునం దుపనిషత్తులు వేయి కలిగెను.

సామవేదమున వేయిసంహితలు గలవు. ఈ సంహితాభాగము పూర్వార్చికమనియు నుత్తరా రార్చికమనియు రెండుభాగములుగ నున్నది. పూ ర్వార్చిక మారుప్రపాఠకములుగను నుత్తరార్చి కము తొమ్మిదిప్రపాఠకములుగను విభజింపఁబడి నది. ఇటుల సామవేదసంహితలు వేయియు పది హేను ప్రపాఠకములుగ విభజింపఁబడినవి. సంహి తలకుఁ బిదప నీవేదమున ౧౫౮౯ గానములును, ౮౧౮ సామములును గానసగును. ఇవికాక నీవే దమునందుగల్గిన యుపనిషత్తులు వేయిగ నెఱుంగు నది.

సామవేదము సూర్యుంబోలిన శరీరవర్ణమని యు, హస్తమున శమీదండమనియు, భిడియము గల నేత్రములనియు, భారద్వాజస గోత్రమనియు, రుద్రుఁడు దేవతయనియు, జగతీఛందమనియు చెప్పఁబడినది. గోభిల, లాట్యాయన, ద్రాహ్యా యనసూత్రములు సామవేదసంబంధములు.

## సామశాఖ విశ్వబ్రాహ్మణులు:—

వీరు విశ్వకర్మసంతతిలోని యభువనర్షి సంతతివా రని చెప్పఁబడినది. సామశాఖవారి మతధర్మగ్రం థమున కభువనసూత్ర మని పేరు. వీరియందు వైశ్యవర్ణమనియు నయస్కార లేక కాంశ్యవర్ణ మనియు రెండువర్ణములు చెప్పఁబడినవి. (విశ్వ బ్రాహ్మణులు చూడుఁడు.)

వైశ్యవిశ్వబ్రాహ్మణులు పర్యాయవృత్తివా రనియు, బ్రహ్మసంతతియనియు, సరస్వతీపీఠమ నియు చెప్పఁబడినది. వీరియం దొక్కలోకేశమను గణమును నం దైదుగోత్రములును గలవు.

అయస్కార లేక కాంస్యవర్ణమువా రాదివృ త్తివారనియు,వీరిది యిచ్ఛాశక్తిపీఠమనియు, త్వష్ట్ర సంతతివారనియు, ఈతండే శాస్త్రమును రచించె ననియు, మరియు నీతఁడె నక్షత్రముర కధిదేవత యనియు వీర నెదరు. వీరియం దభువనగణము, సంవర్తగణము, బోధాయనగణము, ప్రభోన్నత గణము నను నాల్గుగణములును, అందిరువది గోత్ర ములును గలవని చెప్పఁబడినది.

## సామశిగోత్రము:—

(నిధ్రువగణము చూడుఁడు).

## సామస్తవిగోత్రము:—

(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

## సామాన్యవిధిరస్పష్టః ఇతిన్యాయ ము:—

సామాన్యవిధి ప్రత్యేకవిధియంత బల ముగలది కాదని భావము.

## సాక్రమాకిగోత్రము:—

(లౌగాక్షిగణము చూడుఁడు).

## సామ్రాజ్యము [Fmpire]:—

అనేక రాజ్యము లొకపరిపాలనకు లోఁబడియుండిన దానిని Empire అనెదరు. సామ్రాజ్య మేలువానిని సామ్రాట్టనియు, చక్రవర్తి యనియు, రాజాధి రాజు లేక రారాజనియు పిలచెదరు.

వేర్వేరుదేశములకు వేర్వేరువిధముల పరిపా లనావిధానము లున్నను రక్షణకొరకు నన్యోన్యసహా య మపేక్షించి యొకేసామ్రాజ్యమున భాగస్థు

లుగ నైక్యముఁ జెందుతరి దానిని 'Empire' అనెదరు.

**సాముచిగోత్రము:—**
[లౌగాక్షిగణముఁ జూడుఁడు].

**సాముద్రికశాస్త్రము:—** పురుషుల యొక్కయు, స్త్రీలయొక్కయు శరీరావయవపరిమాణలక్షణములను, వానియందుగల రేఖలును మొదలగు చిహ్నములంబట్టి ఫలయోగముల నెరింగించువిద్యకు సాముద్రికమని పేరు. ఇది పురుషులనుగూర్చి తెలుపునది పురుషసాముద్రిక మనియు, స్త్రీలంగూర్చి తెల్పునది స్త్రీసాముద్రిక మనియు ద్వివిధముగ నున్నది. వానిని వేర్వేరుతావులందుఁ గననగును.

నారదుఁడు, ప్రహ్లాదుఁడు, కాత్యాయనుఁడు, వరాహమిహిరుఁడు, వరరుచి సాముద్రికశాస్త్రగ్రంథముల రచించినవారు. ఇంకను బ్రహ్మాండపురాణము, బ్రహ్మపురాణము, వాల్మీకిరామాయణము, స్కాందపురాణములం దచ్చటచ్చట సాముద్రికలక్షణములఁ దెల్పునుక్తులు గలవు.

పురుషులకు దక్షిణభాగమును, స్త్రీలకువామభాగమును నీశాస్త్రపరిశోధనల కర్హపక్షములని గమనింపఁబడినది. శరీరావయవములందుఁ బురుషసాముద్రికమున నేబదియంగుళములును, స్త్రీసాముద్రికమున నేబది యంగుళములును పరిమాణములుగ నైకొని యున్నారు. [పురుషసాముద్రికము, స్త్రీసాముద్రికమును చూడుఁడు.]

**సామోస్ద్వీపములు:—**
(ఏష్యామైనరు చూడుఁడు.)

**సాయనగోత్రము:—**
(వసిష్ఠగణము చూడుఁడు.)

**సాయప వెంకటపతి:—** ఈతఁడు క్రీ. శ. ౧౬౨౦ సంవత్సరప్రాంతముల నాంధ్రదేశ ప్రసిద్ధమైన గండికోటనేలిన ప్రభువు. పెమ్మసాని చినతిమ్మభూపతి కల్లుఁడనియుఁ గులము కమ్మవారేమో ననిపించెడిని. మహావిష్ణుభక్తుఁడు. రామానుజీయవైష్ణవ మీతని మతము.

రచించినది 'సకలజనసంజీవని' యను పద్యకావ్యము. ఇది రామానుజదేశికుల చరిత్రము. దీనియందు ముకుందమాలాస్తోత్రములోని భావములు, తిరుప్పావను ద్రవిడప్రబంధములోని విశేషములు, నర్మసందర్భములు నర్మరీతిని బొందుపరుపఁబడి భక్తిరస మొలుకుచుంటఁ గాంచిన వేంకటపతి నృపతి రామానుజీయ ద్రవిడవేదమున నసాధారణపాండిత్యముఁగలవాఁడని తోపకపోదు. నిరర్గళధారగానున్న కవిత్వ మంతమనోహరమగు శైలికాదని తలంపఁబడుచున్నది. ఇది విష్ణుభక్తి ప్రధానముగాగల మహాగ్రంథముగాన శృంగారమున కలవాటుపడిన పరిశీలకుల చెవులకు రుచింపకపోయినను రసవంతమైనదని యొప్పుకొనవలసియుండును. చాల పెద్దగ్రంథము. ఐదాశ్వాసములు కలది.

**సాయస్వగోత్రము:—**
(నిధృవగణముఁ జూడుఁడు).

**సాయుఁడు:—**
(ధాతకు, కుహూదేవియందు జనించిన కుమారుఁడు.)

**సాయుధోదారిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణముఁ జూడుఁడు.)

**సారకంద (సారెకంద లేక సారెచేమ) దుంపలచెట్టు:—** లా. Dioscorea Gloseosa. ఓషధి. సారూ.

సారకంద భోజనశాకపదార్థము. ఉత్కలదేశ భాగములందు సారువాశాఖపండాలచే నీసైరు చేయఁబడును. ఆశాఖపండాలు విస్తారముగనున్న యనకాపల్లి, లక్ష్మీనర్సుపేట, గుణుపురము మొదలగుచోట్ల నీవ్యవసాయము జరుగుచుండును. 'సారువా' యనుపదమునుండి సారువాకంద యను పే రీదుంపలకుఁ గల్గి, రానురాను సారకంద లేక సారెకందగా మాఱియుండనోపు. ఇది రుచికరమైనశాకము. దొరకనిచోట నసలే లేకపోయినను, దొరకెడితావులందుఁ జౌకగనే లభించెడిశాకము. ఇది వాతమును, శ్లేష్మమును జేయును. చేమదుంపలగుణములఁ గల్గియుండును. దీనియాకులు రోగులకపథ్యము. వీనిని భోజనపదార్థముగఁ గొందరు వాడుటయుఁ గలదు. వీనిని పులుసులో వైచుటయు, చేమాకుబజ్జి, చేమాకులయట్లు మొదలగు వంటకములుగాఁ జేయుదురు. ఆకులందుఁ జిన్నపిల్లలు చల్ది భుజింతురు. సారకందకుఁ బెల్లము, తమలపాకులు, విఱుగుడులని చెప్పఁబడినది.

## సారంగు తమ్మనకవి:—

ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రి నరసింహము. తల్లి అక్కమాంబ.

ఈతఁడు గోల్కొండకరణము. ఈతనికాలమున మహమ్మదుశాహియను నవాబు పాలనమట. గాన క్రీ. శ. ౧౫౮౧ — ౧౬౧౧ ల మధ్యకాల మీకవికాలముగా నుండనోపు.

ఈతఁడు రచించినది తొండరడిప్పొడియాళ్వారుచరిత్రమనెడి విప్రనారాయణ చరిత్రమను ప్రబంధము. దీనియసలుపేరు 'వైజయంతీ విలాసము'.

## సారగ్రీవిగోత్రము:

(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

## సారణుఁడు:—

అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి వసుదేవుఁడు. తల్లి రోహిణి.

ఇంకను రావణుని చారులలో నొకఁ డీపేరు గలవాఁడు గలడు.

## సారధ్వజిగోత్రము:—

[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.]

## సారనాథము:—

దీని నిప్పుడు 'సార్‌నాథ్' అనుచున్నారు. బనారస్‌పట్టణములనుండి ౮ మైళ్ళదూరమునం దున్నది. తొల్లింటి పేరు సారంగధావము మారి సారనాథ మయ్యెనట. ఇంకను మృగధావమనియుం బేరుకలదు. ఒకప్పుడు ఋషిపురి. బుద్ధుఁడు బుద్ధగయయందు బోధివృక్షముక్రింద జ్ఞాని (బుద్ధుడు) యైనకతన మొట్టమొదట బౌద్ధధర్మజ్ఞానములను బోధించినతావు. ఆపవిత్రస్థలియం దొకస్థూపము (ఇప్పటిధమెక్) నశోకచక్రవర్తినిర్మించెనఁట. దానిందిరుగఁ గట్టిరి. అది పాడగుచు గాననగును. దానివెన్కనే యీయన మొదటిశిష్యులు కౌండిన్యుఁడు, అశ్వజిత్తు, వాష్పుఁడు, మహానాముఁడు, భద్రికుఁడు నఁట నాయనబోధ విని శిష్యులై బౌద్ధసంస్కారమందిన తావున నొకవిహారము కట్టఁబడి పాడై యున్నది. బౌద్ధగ్రంథములందు బుద్ధభగవానుఁడు ధర్మచక్రముం ద్రిప్పనారంభించినతా వని చెప్పఁబడినది.

అట నొకస్తంభముకలదు. అది చక్కగ నున్నుచేయఁబడి యద్దమువలెనే నీడఁ బ్రతిఫలించునది. అత్తావున కాయైదుగురుశిష్యులును గలసిరట. అట నిప్పు డక్బరుచే నిర్మింపఁబడిన హుమ

యూన్ స్తంభముగలదు. (హుయనుయా నత్సాఁగ దర్శించిన యానవాలు.)

ధర్మచక్రము ద్రిప్పనారంభించినతావు (ధమేక్) న కుత్తరముగ భగవానుఁడు తనకుఁ బిదప రాగల బుద్ధుఁడగు మైత్రేయుంగూర్చిన సంగతులు వివరించినతావునగూడ నొకస్తూపము నిర్మింపఁబడినది.

అశీనదీతీరమున నటకు సమీపమునసేగల యొకతావును బుద్ధభగవానుఁడు యాస, పూర్ణ్ణ, విమల, గవాంపతి, సుబాహుల బౌద్ధులుగ నొనర్చిన తావని చూపుచున్నారు. బౌద్ధులు బుద్ధభగవానుఁడు తొలుత బోధించెననుటను, ధర్మచక్రముఁ ద్రిప్పుటకు ప్రారంభించెనని వాడుచుందురు.

**సారమ్భురి గోత్రము:—**
(లౌగాక్షిగణము చూడుఁడు.)

**సారమేయుఁడు:—** యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి శ్వఫల్కుఁడు. సోదరు లక్రూరుఁడు మొదలగువారు.

**సారల్యం సరలే కుర్యాత్ శఠే శాఠ్యం సమాచరేత్:—** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. సరళప్రవర్తనగల వారితో సరళముగానే ప్రవర్తించవలెను గాని శఠులతో (అనఁగా మూర్ఖులతో దుష్టప్రవర్తన (మూర్ఖప్రవర్తన) నడుపవలసియుండును.

**సారస్వతపురము:—** హస్తినాపురము (ఇప్పటి మేరత్ నగరమునకు సమీపము) నకు వాయవ్యదిశగ సారస్వతపుర ముండినదనియు, నది జైమినీభారతము ౪౭ అధ్యాయమునఁ జెప్పఁబడిన వైరవర్మకు రాజధానియనియుఁ దెలియుచున్నది.

**సారస్వత బ్రాహ్మణులు:—** పంచగౌడ శాఖలలో నొకశాఖవారు. [బ్రాహ్మణులు చూడుఁడు]. వీరు సరస్వతీనదీతీరవాసులగుట సారస్వతులని పేరందినవారు. వీరినిగూర్చి సరిగాఁ దెలియరాకున్నది. వీరియందు నేఁటికిని ముప్పది మూఁడంతశ్శాఖలు గలవు. వీరు పెక్కుదేశములకు వ్యాపించిరి. కాశ్మీరపండితులు సారస్వతులే. కొంకణదేశమున వీరు కొంకణబ్రాహ్మణులనఁబడుచున్నారు. సింధుదేశమునను సారస్వతులు పెక్కుమంది కలరు. రాజపుత్రస్థానమున [illegible] నున్నారు. కాశ్మీరమున [illegible] యు కొంకణమునఁ [illegible] ము, [illegible] మున నాయాదేశభాగభాషలును, రాజపుత్రస్థానమున హిందీభాషయు వీరికి స్వభాష[illegible].

వీరి యంతశ్శాఖలనుగూర్చి సరిగా [illegible] కున్నది. ౧ [illegible]శాఖ, ౨ [illegible]శాఖ, ౩ కాలిగోత్రశాఖ, ౪ [illegible]శాఖ, ౫ [illegible] శాఖ, ౬ [illegible]శాఖ, ౭ [illegible]శాఖ, ౮ [illegible]శాఖ, ౯ [illegible]శాఖ, ౧౦ [illegible]శాఖ, ౧౧ పండితశాఖ, ౧౨ [illegible]శాఖ, ౧౩ [illegible]శాఖ, ౧౪ [illegible]శాఖ, ౧౫ [illegible]శాఖ, ౧౬ [illegible]శాఖ, ౧౭ [illegible] ౧౮ [illegible]శాఖ, ౧౯ [illegible]శాఖ, [illegible]శాఖ, ౨౧ భరద్వాజశాఖ, [illegible]శాఖ, ౨౪ మోహనశాఖ, ౨౫ [illegible]శాఖ, ౨౬ [illegible]శాఖ, ౨౭ [illegible]శాఖ, ౨౮ [illegible]శాఖ, ౨౯ సింధుపురోహితశాఖ, ౩౦ [illegible]శాఖ, ౩౧ సాగిశాఖ, ౩౨ [illegible]శాఖ, ౩౩ [illegible]శాఖ. [illegible] గూర్చి యితరాంశములు సరిగఁ [illegible].

**సారస్వతము:** [illegible] సారస్వతము. సాధారణముగ భాషను సారస్వతమందురు.

ఉ. ఆంధ్రసారస్వతము — సంస్కృతసారస్వతము మొదలగునవి.

మఱియు సంస్కృతసంధులం గూర్చి తెలుపు వ్యాకరణమొకటి సారస్వతమను పేరంబరగునది కలదు.

ఇంకను సరస్వతీనదీతీర దేశభాగమును సారస్వతమనియు నాదేశవాసులను సారస్వతులనియు వాడియున్నారు. గౌడబ్రాహ్మణులలో సారస్వత బ్రాహ్మణులనువారు గలరు.

**సారస్వతసరస్సు:—** అజిమీరుపట్టణ ముకడనున్న పురష్కరసరస్సు (ఇప్పటిపుఖార్) నకు సారస్వతసరస్సని పేరుకలదని వరాహపురాణ ౧౧౧ అధ్యాయమున గలదు.

**సారస్వతుఁడు:—** ఋషి. దధీచిమహర్షి తేజమున సరస్వతీనదియందు జనించినవాఁడు. తైత్తిరీయబ్రాహ్మణమున సారస్వతాధ్యాయములు కొన్ని గాన్పించుచున్నవి. అవి కేవలమును సౌత్రామణి క్రతుసంబంధములు. వివాహకార్యముల సదస్యసమయమున వానిని వాడుచుందురు.

**సారస్వతులు:—** గౌడశాఖలలో నొకశాఖ. సరస్వతీనదీతీరదేశవాసులని భావము. (పంచగౌడలు, దశవిధబ్రాహ్మణులు చూడుఁడు.)

**సార్వగోత్రము:—**
[ఔతథ్యఉపగణము చూడుఁడు.]

**సార్వభౌముఁడు:—** కురుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి విదూరథుఁడు.

**సారాధ్యగోత్రము:—**
[కథ లేక కథ్యగణముఁ జూడుఁడు].

**సారాపగగోత్రము:—**
[అత్రేయగణముఁ జూడుఁడు].

**సారాయణగోత్రము:—**
[ఉపమన్యుగణముఁ జూడుడు].

**సారావరిగోత్రము:—**
[భరద్వాజ ఉపగణము చూడుఁడు].

**సార్ష్రిగోత్రము:—**
(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు).

**సార్డీనియాదేశము:—** ఇది యైరోపాఖండములోని యిటలీదేశమునం దొకప్రోవిన్సుగానున్నది. తొల్లింట నొకదేశముగ నుండెను. సార్డీనీయాభూపతిని గారిబల్డీసేనాని యిటలీ భూపతిగఁ జేసెను. (ఇటలీదేశము, సార్డీనీయాప్రోవిన్సు చూడుఁడు). శిలాతలమయమైనదేశము. ఇందు గొప్ప అరణ్యములు గలవు. కాల్యారిపురము (Cageiari) ముఖ్యపట్టణము. సార్డీనియా మధ్యధరాసముద్రమునందలి ద్వీపములలోఁ బెద్దది. కోర్సికాద్వీపమునకు దక్షిణముగా నున్నది. ఇట దొరకు చేపలు సుప్రసిద్ధములు.

**సార్డోనిక్ స్మైల్:—**Sardonic Smile విషపునవ్వు లేక హేళనవవ్వున కీయుక్తిని వాడుచున్నారు. సార్డీనియాయం దొక వనౌషధి యుండెడిదట. దాని నాస్వాదించిన నవ్వువచ్చెడిదట. దానినుండి యీయుక్తి తొలుత నేర్పాటై కొంతయర్థము మారినది.

**సాలకటంకట:—** ఈమె విద్యుత్కేశుని భార్య. కుమారుఁడు సుకేశుఁడు. ఈమె సంతతివారిని సాలకటంకటేయు లని యొకప్పుడు వాడిరి.

**సాలగ్రామములు:**— హిమవన్న గోపరి భాగమున నేపాలదేశమునకును, టిబెట్టు దేశమునకు ను సరిహద్దుసీమలందు సాలగ్రామ మనుపేరుగల పర్వతము గలదు. సాలానాం (వృక్షాణాం) గ్రామః (సమూహః) అనగా వృక్షములసముదాయమని యర్థము. ఇటులఁ బేరందిన యీపర్వతము నుండియే శిలలు (రాళ్ళు) విడఁబడి కాకవేణీనదీ జలములతోను, గండకీనదీజలములతోను రాళ్ల పైఁ బొరలుచు గుండ్రిగను, నునుపుగను సరిగి యీావలకువచ్చి దొరకుట మనకు సాలగ్రామములు లభించుచున్నవి గాన నానదులయాయాభాగములకు 'సాలగ్రామినది' యనుపేరును వాడుచున్నారు.

సాలగ్రామపర్వతమునుండి యేర్పడిన శిలలకు సాలగ్రామశిలలని పేరుగల్గి క్రమముగ శిలయను మాటనువీడి సాలగ్రామములని వాడుట యగుచుండెను. ఇంకను నాంధ్రదేశమునఁ బెక్కండ్రు సాలిగ్రామమనికూడ వాడుచున్నారు. గ్రంథములందు సాలగ్రామమని గన్పించుచున్నది. శబ్దరత్నాకరకర్తలగు శ్రీమాన్బహుజనపల్లి సీతారామాచార్యులవారుకూడ సాలగ్రామమని తమ నిఘంటునందు వాడియున్నారు. (సాలగ్రామముల యుత్పత్తింగూర్చి సాలగ్రామక్షేత్రము, గండకీనది, నేపాలదేశము చూడుఁడు).

సాలగ్రామములలోనికిం జొచ్చుకొనియుండు బిలములం దగుపడు విగ్రహాకారములు శంఖ, చక్ర, వనమాల, పద్మాదుల యాకృతులంబట్టియు, రేఖలఁబట్టియు వానికి నామము లేర్పడియున్నవి. అట్టిభేదములే వాటియందుగల జాతిభేదములుగఁ జెప్పఁబడినవి. సాలగ్రామములందుఁ గొన్ని దోషయుక్తములుగ నిరసింపంబడినవి. వానిరంగు లక్షణములు వానిని దోషవంతములుగను, గుణవంతములుగను నిరూపించెడిని. అట్టివన్నియు సాలగ్రామపరీక్షయందు వివరింపఁబడినవి.

సాలగ్రామభేదము లేబదియెన్మిది చెప్పఁబడినవి. అందు నలువదియెనిమిది విష్ణుదేవుని చిహ్నములుగ వివరింపంబడినవి. మఱియు నందు పదమూఁడుసాలగ్రామములు ద్వివిధలక్షణములతో నొకపేరునఁ బరగునవిగఁ జెప్పంబడియున్నవి. పిదప నెనిమిదిసాలగ్రామభేదములు శివసంబంధ చిహ్నములతోఁ దనరుట శివసంబంధములుగను, రెండు శాక్తేయసంబంధములుగను వివరింపఁబడినవి. శివసంబంధములగు వానికి బిలముండదని కొందరందురు.

విష్ణుచిహ్నములు గలవి ౪౮.

౧ అనంతసాలగ్రామము. ఇది ద్వివిధలక్షణములతో నున్నది.

౨ అనిరుద్ధము. ఇది ద్వివిధలక్షణములతో చెప్పఁబడినది.

౩ కపిలనారసింహము.

౪ కూర్మము.

౫ కృష్ణసాలగ్రామము. దీనినే గోపాలమని యందురు.

౬ కేశవసాలగ్రామము.

౭ గరుడము.

౮ చతుర్ముఖము.

౯ జనార్దనము.

౧౦ త్రివిక్రమము.

౧౧ దధివామనము. ఇది ద్వివిధలక్షణయుక్తము.

౧౨ దామోదరము. ఇది ద్వివిధలక్షణయుతము.

౧౩ నారసింహము. ఇది ద్వివిధలక్షణయుతము.

౧౪ నారాయణము.

౧౫ పద్మనాభము.

౧౬ ప్రద్యుమ్నము. ఇది ద్వివిధలక్షణయుతము.

౧౭ పరమేష్ఠి.

౧౮ పురుషోత్తమము.

౧౯ పృథ్వీవరాహము.

౨౦ బలరామము.

౨౧ మత్స్యము.

౨౨ మధుసూదనము.

౨౩ మహానృసింహము.

౨౪ యోగీశ్వరము.

౨౫ రఘునాథము.

౨౬ రశ్మిజాలము.

౨౭ రాజరాజేశ్వరము.

౨౮ రాధాదామోదరము.

౨౯ లక్ష్మీజనార్దనము.

౩౦ లక్ష్మీనృసింహము. ఇది ద్వివిధలక్షణయుతము.

౩౧ లక్ష్మీనారాయణము. ఇది ద్వివిధలక్షణయుతము.

౩౨ లక్ష్మీహరి సాలగ్రామము. ఇది ద్వివిధలక్షణయుతము.

౩౩ వరాహము.

౩౪ వామనము.

౩౫ వాసుదేవము. ఇవి ద్వివిధలక్షణయుతము.

౩౬ విష్ణుసాలగ్రామము.

౩౭ వైకుంఠము.

౩౮ శిలాకూర్మము.

౩౯ శ్రీధరము. ఇది ద్వివిధలక్షణయుతము.

౪౦ సంకర్షణము. ఇది ద్వివిధలక్షణయుతము.

౪౧ సహస్రార్జునము.

౪౨ సుదర్శనము.

౪౩ స్థూలదామోదరము.

౪౪ సౌమ్యహయగ్రీవము.

౪౫ హయగ్రీవము. ఇది ద్వివిధలక్షణయుతము.

౪౬ హయశీర్షము.

౪౭ హరిరూపము.

౪౮ హృషీకేశము.

శివచిహ్నములుగల శైవసాలగ్రామము లెన్మిది.

౧ ఈశ్వరసాలగ్రామము.

౨ చంద్రశేఖరము.

౩ త్ర్యంబకసాలగ్రామము.

౪ ధూర్జటిసాలగ్రామము.

౫ మృత్యుంజయము.

౬ రుద్రము.

౭ శంభుసాలగ్రామము.

౮ శివనాభము.

శక్తిచిహ్నములుగల శాక్తేయసాలగ్రామములు రెండు.

౧ మహాకాళీసాలగ్రామము.

౨ శ్రీవిద్యాసాలగ్రామము.

**సాలగ్రామక్షేత్రము:—** నేపాలదేశము టిబెట్టుదేశముల సరిహద్దు ప్రదేశములలో గండకీనదిజన్మస్థానముకడ భరతాశ్రమము పులహాశ్రమములును, ముక్తినాథక్షేత్రమును, దామోదరకుండమును గలవు.

ముక్తినాథము:— ఇది ముక్తినాథనారాయణస్వామి దేవస్థానము. ఇది సప్తగండకీపర్వతప్రాంతము. ముక్తినాథమునుండి మూడుమకాములదూరమున దామోదరకుండమను పేరుగల కొండలమధ్య పల్లపుతోవలయందు జలమును మంచును గలసియుండుటకు నైసర్గికముగనేర్పడిన సరస్సు కలదు.

అందే గండకీనది జన్మించును. అటనే సాలిగ్రామములేర్పాటయ్యెడిని. ఈసరస్సున కుత్తరముగ టిబెట్టువైపున నుండివచ్చి గుండములోనికిఁజేరు నొకనదినుండియీసాలగ్రామము లీదామోదరకుండములోనికిఁ జేరునని కనిపెట్టబడినది. ఆనదీజలములు క్రిందినుండి ప్రవహించుచుండ, పైభాగ దట్టమగు మంచుచేఁ గప్పఁబడి యుండునఁట.

ఆనదికి 'కాకవేణి' యనిపేరనియు, నట రేడిగ్రామమని పేరుగలతావున కుత్తరదిశను జడభరతుని యాశ్రమస్థలమున్నదనియుఁ దెలిసెడిని. దామోదరకుండమున గండకీనది జన్మించుటాదిగ ముక్తినాథమును దాటి యొకమైలుదూరమేగువరకును గండకీనదికి సాలిగ్రామీనదియనిపేరు. ఈమధ్యనే సాలగ్రామము లానదియందు దొరకెడిని. ఈతావులందే రేడిగ్రామమునఁ బోల్లింటి పులహర్షి యాశ్రమస్థలము గలదు. ఇటనే పులహుఁడు భరతుఁడు తపమాచరించిరని పద్మపురాణ పాతాళఖండ ౭౮ అధ్యాయమునను భాగవతము పంచమస్కంధము ౭ అధ్యాయమునను గలదు. మరియు నిది మార్కండేయర్షి జన్మస్థలముగ బృహన్నారదీయపురాణము ౫ అధ్యాయమునఁ జెప్పఁబడినది. ఇంకను సాలగ్రామప్రశంస వరాహపురాణము ౧౪౩ అధ్యాయమునఁ గలదు. (గండకీనది, సాలిగ్రామములు చూడుఁడు.)

## సాలగ్రామీనది (శిలానది):-

[ముక్తినాథము చూడుఁడు — సాలగ్రామక్షేత్రము — గండకీనది చూడుఁడు — కాకవేణీనది చూడుఁడు].

**సాలపోతకుఁడు:—** ఒక నాగరాజు. కుమార్తె నంద యనునామె. తండ్రిశాపమువలన మూకత్వము (మూఁగి) రాఁగా సుశర్మ సారస్వతమగు నిష్టింగావించి యామూకత్వముఁ బోఁగొట్టుకొనెనని చెప్పఁబడినది.

## సాలహిగోత్రము:—

[భరద్వాజ ఉపగణము చూడుఁడు].

**సాల్వటారు దేశప్రభుత్వము (Salvator):—** ఇది మధ్య యమెరికాఖండము నందలి ప్రజాపరిపాలనాదేశము. పదమూఁడువేల నూటయెనుబదిమూఁడు చతురపుమైళ్ళవై శాల్య మనియు, పదునేడులక్షలు జనసంఖ్యయనియుఁ జెప్పఁబడినది.

**సాల్వడోర్ ప్రజాపరిపాలనాదేశము (Salvador republic):—** ఇది మధ్యయమెరికాయందలి ప్రజాస్వపరిపాలనదేశము. ౭౩౫౫ చతురపుమైళ్ళ వైశాల్యముగలది. ఇం దించుమించు ౧౦౦౬౦౦౦ జనులు వసించుచున్నారు. సాల్వడోర్పురము ప్రభుత్వస్థాన మున్నతావు. (మధ్యయమెరికా చూడుఁడు).

**సాల్వదేశము (మార్తికా వతము - మృత్తికావతము ఆల్వారురాజ్యము):-** ఇది తొల్లి యొకప్పుడు జాపూరు (జ్యోతిపురసంస్థానము) రాజ్యములోని కొంతభాగము పూరుసంస్థానములోని కొంతభాగ మాల్వారుసంస్థానముఁ గల్పుకొని యొకప్రత్యేకరాజ్యమై సాల్వదేశమనుపేరం బరగెను. మహాభారతము సభాసలపర్వము ౭ యందీదేశము కురుక్షేత్రముకడ నుండినదనియు, విష్ణుపురాణము ౪-౧౩ యందిది మార్తికావతముకడననియుఁ జెప్పఁబడినది. ఈదేశము సావిత్రిభర్తయగు సత్యవంతుఁ డేలినదిగ మహాభారతము వనపర్వము ౨౮౨ యందుఁ గలదు.

సాల్వనరపతి ద్వారవతిపై దాడివెడలి శ్రీకృష్ణునిచే నిహతుఁడైనవాఁడు.

అప్పటి రాజధానియగు సాళ్వపుర మిప్పుడాల్వారనుపేరఁ బరగుచు నిప్పటియాళ్వారుసంస్థానపు రాజధానిగ నున్నది. ఈసాల్వపురప్రశంస మత్స్యపురాణము ౧౧౩ యందును, హరివంశము ౫౮ యందును గలదు. దీనికిఁ దొల్లి సౌభాగ్య నగరమనియో, శుభనగరమనియో వాడుకపేరుండెనట. ఇది వర్ణాశానదీ (ఇప్పటి బనాస్నదీ) తీరము.

పిదప నీదేశమున మార్తికావతము పెద్దపట్టణము. ఒకప్పుడు రాజధానిగఁగూడ నుండుకతన నీదేశమునకు మార్తికావతదేశము లేక మృత్తికావతదేశమనిగూడఁ బేరయ్యెనందురు. అజ్మీరుపురమునకు వాయవ్యదిశగా ౩౬ మైళ్లదూరమున మార్తపురము (తొల్లింటి మార్తికావతము) గలదు. దీని నిప్పుడు మార్వార్ దేశమని కూడ ననుచున్నారు. మార్తపురమునఁ బెక్కు దేవస్థానములు గలవు.

## సాల్వపురము (ఇప్పటి యాల్వార్ పురము):—

(సాల్వదేశము చూడుఁడు)

## సాలామిశిరీ (సాలామిశ్రి):—

లా. Orchis mascula. ఆంగ్ల. Salep orchid. ఇవి దుంపలు. ఇవి విదేశములనుండి రప్పింపఁబడినవి. జిగురుగల దుంపలు. ఎండిన చాల గట్టిగ నుండును. గాని వీనిని బియ్యములోఁగుక్కి కొన్నిదినము లుండనిచ్చిన నవి పిండియగును. దేహపుష్టి, బలము, వీర్యపుష్టిఁ గల్గించుటయందసమానశక్తిగలవి.

పచ్చిసాలామిశ్రిగుం జుప్పునీటం గల్పిన నవి మంచితియ్యనినీ రగునని వాడుక గలదు.

## సాలారు జంగు బహద్దరు (సర్):—

ఈయనకు నవాబ్ సర్ సాలారుజంగు బహద్దరని పేరుకలదు. పందొమ్మిదవశతాబ్దమునాటివాఁడు. గొప్పరాజనీతిజ్ఞుఁడు. క్రీ. శ. ౧౮౫౩ మొదలు ౧౮౮౩ వఱకు నైజాముదాజ్యమునకు మంత్రిత్వమువహించి రాజ్యాదాయ మభివృద్ధిపఱచి, విద్యాలయములు, వైద్యశాలలు, న్యాయస్థానములు మొదలగురాజ్యాంగముల నాంగ్లపరిపాలనవిధానముననే నెలకొల్పి పేర్వడసిన రాజ్యతంత్ర (రాజ్యధర్మ) విశారదుఁడు. సత్యప్రియుఁడనియు, స్వాతంత్ర్యప్రియుఁడనియు, దూరదృష్టియు, న్యాయవ్రతమును గలవాఁడనియునందురు. ౧౮౮౩ లో విషూచిజాడ్యమువలన నకాలమృతికిఁ బాలైనవాఁడని చెప్పఁబడినది.

## సాల్టుకలర్సు (Salt colours) రంగులు:— (రంగులు చూడుఁడు.)

## సాల్వుఁడు:—

సాల్వుఁడనినంతనే మార్తికావత దేశాధిపతియని సర్వసాధారణముగ మహాభారతముఁ జదివిన తెలియఁగలదు. కాని సాల్వులంగూర్చి పరిశీలించిన నిర్వురో లేక ముగ్గురో సాల్వులు గలరని తోఁచకపోదు.

మహాభారతారణ్యపర్వమునను, బప్పనభాగవత దశమస్కంధమునను నొకసాల్వుఁడు మార్తికావతదేశప్రభువుగఁ జెప్పఁబడెను. ఈతనితండ్రి దమఘోషుఁడు. తల్లిపేరు సాత్వతి. ఈమెను శ్రుతశ్రవ యనియు వాడుక గలదు. ఈమె చంద్రవంశపు యదుసంతతి క్షత్రియుండగు శూరుని కొమరితయు, శ్రీకృష్ణుని తండ్రియగు వసుదేవుని

సోదరిగను చెప్పఁబడినది. ఈ సాల్వునిసోదరుఁడగు శిశుపాలుఁడు శ్రీకృష్ణునితోఁ గలహించుచు నాయనచేత నిహతుఁడైనవాఁడు. ఈసాల్వుఁడు తపంబొనరించి పరమేశ్వరుని మెప్పించి, సౌంభక మను విమానముం బడసి, యాకాశగమన మొనర్చుచుండెడివాఁడని చెప్పఁబడినది.

మహాభారతమున నాదిపర్వము, ఉద్యోగపర్వములందుఁ దెలియనగు వేఱొకసాల్వుఁ డంబను బొల్లి వివాహమాడ నంగీకరించియుఁ బిదప కారణాంతరములచే నామెను నిరాకరించి, యదేకారణముగ భీష్మునితోఁ బోరినవాఁడు.

ఒకసాల్వుఁడు మ్లేచ్ఛసైన్యాధిపతి. ఈతఁడు మహాభారతయుద్ధమున కౌరవపక్ష మవలంబించి పోరి సాత్యకి దృష్టద్యుమ్నులచే నిహతుండైన వాఁడు. ఇం దెవ్వరోకాని కాకున్న వేరెవ్వరో కాని యొకసాల్వుఁడు యదుసంతతియందే శ్రీకృష్ణునిపినతండ్రియగు వృకుని మూఁడవసుతుఁడు సాల్వుఁడనువాఁడు గలఁడు.

**సాలెపురుగు:**— తా నల్లుకొనిన గూటియందున్న సాలెపురుగు నాగూటియందుఁ బట్టుకొనఁజాలరు. సాలెపురుగు తనగూటిని తానే నిర్మించుకొని యందొక క్షేమకరమగుతావుననే తానెల్లప్పుడు నివసించుచుండును. దానికిఁ దన గూటియందలి ప్రతిమర్మమును జక్కఁగఁ దెలియుననియుఁ జక్కఁగ జ్ఞాపకముంచుకొనఁగల్గుననియుఁ బరిశీలకులు గన్పెట్టియున్నారు.

తన గూటికడకువచ్చిన దోమలు నీగలు మొదలగు చిన్నజంతువులను కదలనీయక మ్రింగివేయఁగలదు. అట్టితెరి తనపట్టు (గూడు) ఎచటనైన ఛిద్రమగునేని దానినప్పుడే మరమ్మతు చేసుకొనును. బల్లివంటి తనకన్న బలాఢ్యము లగునవి యేతెంచెనేని తాను తప్పించుకొని దొరకక పారిపోవననుకూలమగు తావుననే అది వేచియుండును. తనగూటిదారముల నది తప్పించుకొని పారిపోవు నేర్పు కడుచిత్రము. ఒకసెకెండుకాలమున తన గూటినొసరమగుతరి శిధిలపరచుటకును నొకమినిటుకాలమునఁ దిరిగి బాగుఁ జేసుకొనుటకు దానికి నేర్పుకలదని పరిశీలకులు కనిపెట్టిరి. ఏవైపునుండి శత్రువేతెంచినను రెండవమారమున తప్పించుకొని యవ్వలికిఁ బారిపోవుటయం దది నేర్పరి. ఇంకను తానురచించిన దారమునుండియే యది వ్రేలాడుచుండగలదు. దానినే యెక్కుచుఁ బైకేగగలదు. ఇట్టి శక్తులు సాలెపురుగు (Spider) నందుఁ గన్పట్టెడిని.

**సాలెపురుగు, పట్టు:**-(Spiders web) పెక్కండ్రు పొరఁబడితలంచునటుల సాలెపురుగులు తమపట్లల్లుట నిరర్థకకార్యముగాదు. ఆపట్టంతయు నఖండమగు నొకేతంతువని మనస్సునం దుంచుకొనవలసి యుండును. ఆపల్లియం దనుదినము నీగలు, దోమలు మొదలగు పలుజంతువులు దగుల్కొని కదలలేకఁ జిక్కుకొనుచుండును. వాటి నా సాలెపురుగులు తినవేయుచుండును. కొంత నియమితకాలమైనపిదప నాగూటిదారముతో నాసాలెపురుగే తాగూటి (cocoon) నల్లుకొని యందు గుడ్లు పెట్టుకొని, పిదప క్రొత్తపట్టు నల్లుకొనుచుండును. ఈసందర్భమునఁబరిశీలనలనుండి బయల్పడిన యొక్కసంగతినిట వివరించుట సమంజసము. సాలెపురుగులపట్లన్నియు నొకేరీతి నల్లఁబడక బలువిధములుగనుండునని వివరించుట విచిత్రమనిపించెడిని.

బాగుగముదిరిన సాలెపురుగుపట్టొకడ్రాచమ్ కన్న బరు వధిక ముండదనియు, దానిని జాగ్రతగ విప్పి కొలచిన 350 మైళ్ళపొడ వుండుననియు

నొక యమెరికా దేశపుఁ బరిశీలకుఁ డనుచున్నాఁడు. ఇందు నిజమెంతవరకోగాని యిది యారు లక్షల పదునారువేల గజము లగును. పదునెన్మిది లక్షల నలుబదియెన్మిదివేల యడుగు లగును.

**సాల్వెన్సీ** [Solvency]:— (వాణిజ్య సంబంధ పరిభాషాపదము.)

ఋణములఁ దీర్చివేయుట కాస్తులుండుటకును, బాధ్యతలను నిర్వహించగల సమర్థతఁ గల్గియుండుటకును నీపేరు వర్తించును. కల్గియున్నవానిని 'solvent' అనియెదరు. లేనివానిని insolvent అనియెదరు.

**సాల్సెటీద్వీపము**:— బొంబై నగరమున్న ద్వీపమున కుత్తరముగనున్న ద్వీపము. రెంటికిని వంతెన కలదు. ౨౪౧ చతురఁపుమైళ్ల వైశాల్యము. ౧౨౫౦౦౦ జనులు నివసించుచున్నారు. తానా ప్రధానపురము. ఇట బౌద్ధవిగ్రహములున్న గృహాలు గలవు.

**సాల్వేషన్ఆర్మీ** (Salvation army):— క్రైస్తవమతసంస్థ. 'william booth' అను నాంగ్లేయుఁడు స్థాపించెను. ఇది London East End revival' సొసైటీయొక్క పరిణామ మని చెప్పఁబడినది. క్రీ. వె. ౧౮౬౫ లో స్థాపింపఁబడి ౧౮౭౭ లో సేల్వేషన్ఆర్మీయని పేరందినది. అధిపతి 'జనరల్ బూత్' అనియు నీతనికిక్రింద కలన లుద్యోగులు అడ్జుటెంటలు కార్పోరల ఉద్యోగులు మొదలగువారు గలరు. భరతదేశమునకు ౧౮౮౨ లో తేఁబడినది. ఇండియాయందుద్యోగులు స్వదేశస్థులవలె దుస్తులంధరింప నారంభించిరి. వీరియుద్దేశము బీదలకును నాదరణలేని ప్రజలకును సహాయపడుటయని వారుచెప్పుకొనుచున్నారు.

క్రీ. వె. ౧౯౧౨ న బూత్ గారికుమారుఁడధిపత్యమునకు రానయ్యెను. ఆయనపేరు william Bram well. ఈయన పెద్దకుమారుఁడట. మతస్థులు ౧౯౨౯ లో నాయనను నిరాకరించి తొలగించి E. J. Hggins అనువారి నధిపతిఁగ జేసిరి. వీ రొకవార్తాపత్రికను 'war Cry' అను పేరునఁ బ్రకటించుచున్నారు. ఇది వారపత్రిక. ఇంకఁ గొన్ని పుస్తకములు గూడ ప్రకటించిరట. 'All the word' అను పేరుగల యొకమాస పత్రికనుగూడ వీరు ప్రకటింతురట.

**సాళువవంశ క్షత్రియప్రభువులు**:— వీరు సంగమరాజులకుఁ బిదప నాంధ్రకర్ణాటక సామ్రాజ్యమును విజయనగరము రాజధానిగ నేలినవారు. వీరిర్వురు.

౧ నర్సింగరాయ ఒడయర్— ౧౪౭౮ మొదలు క్రీ. వె. ౧౪౯౩ వరకు.

౨ ఇమ్మడి నర్సింగరాయ ఒడయర్— క్రీ. వె. ౧౪౯౩ మొదలు ౧౪౯౬ వరకు. రెండవ నృపుఁడు తనసైన్యాధిపతిచే నిహతుఁ డయ్యెనని ప్రతీతి.

[విజయనగరసామ్రాజ్యము చూడుఁడు].

**సావంతవాడీస్టేటు**:— బొంబై రాజధాని ప్రభుత్వపు టధికారమునకు లోబడిన స్వదేశసంస్థానము. మహారాష్ట్రదేశములోనిది. రాజధాని సామంతవా డీపురము.

**సావకగోత్రము**:—

(వశిష్ఠగణముఁ జూడుఁడు).

**సావనమానమాసము**:—

(మాసములు చూడుఁడు.)

**సావర్ణి:—** ఒకపౌరాణికుఁడు.

**సావర్ణిగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణముఁ జూడుఁడు.)

**సావర్ణిగోత్రము:—**
(వీతహవ్య లేక యాసచగణముఁ జూడుఁడు.)

**సావసగోత్రము:—**
(శండిలగణముఁ జూడుఁడు).

**సావస్యాయనగోత్రము:—**
(కపి ఉపగణముఁ జూడుఁడు.)

**సావిగోత్రము:—**
(నిధృవగణముఁ జూడుఁడు.)

**సావిత్రి:—** ఈమె మహాపతివ్రత. తండ్రి అశ్వపతి. తల్లి మాళవి. సాళ్వపతియగు ద్యుమత్సేనుని కుమారుఁడగు సత్యవంతుని మోహించి వరించినది.

ద్యుమత్సేనుఁడంధుఁడై తనవైరులచే రాజ్యముఁ గోల్పోయి యడవికేగి యట భార్యాపుత్రులతో మునివృత్తిని కాలముఁ గడపుచుండెనట. మరియుఁ బరిణయమైన సంవత్సరమునకు మృతుఁడగునని సత్యవంతునిగూర్చి, సావిత్రికిని, ఆమెతలిదండ్రులకునుమాత్రము జ్యోతిషవేత్త లెరింగించియుండిరట. ఇటులయ్యు సావిత్రి యన్యులనొల్లక నాతనిం బరిణయమై యటులనే సంవత్సరమునకు సత్యవంతుఁడు మృతుఁడుగాఁగా దనపాతివ్రత్యమహిమచే యముని మెప్పించి తనభర్త పునర్జీవితుఁడగునటులను, తనమామలబ్ధచక్షుఁడగునటులను, వైరులచే నపహృతమైన రాజ్యాధిపత్యము మామకాస్తగతమగునటులను వరంబుల వడసి మన్ననలందిన మహాసాధ్వీరత్నము.

ఇంతియేగాక తనతండ్రియగు నశ్వపతి పుత్రశతము౦బడయునటుల వరముఁగల్గించిన దీ సావిత్రియే యని చెప్పఁబడినది.

**సాసవిసల్లిగోత్రము:—**
(కపి ఉపగణముఁ జూడుఁడు.)

**సాసిసగోత్రము:—**
(నిధృవగణముఁ జూడుఁడు.)

**సాష్టాంగనమస్కారము:—** ౧ వక్షము, ౨శిరము, ౩కన్ను, ౪పాదములు, ౫చేతులు, ౬చెవులు, ౭మనస్సు, ౮వాక్కు, [మాటలు] వీని నేకీభవింపఁజేసి నమస్కరించుటకు సాష్టాంగమనిపేరు.

**సాహరిగోత్రము: —**
(గర్గ ఉపగణముఁ జూడుఁడు.)

**సాహ్యాపత్యగోత్రము:—**
(ఉపమన్యుగణముఁ జూడుఁడు.)

**సాహిణిమారుఁడు:—** సాహిణియనఁ నశ్వదళాధ్యక్షాధికారి. (మారయ్యసాహిణి) తండ్రి పేరుబుద్ధారెడ్డి. తల్లి కాచమాంబ. భాస్కరరామాయణమును కృతినందినవాఁడు. (త్రిలింగకాకతీయ సామ్రాజ్యముఁ జూడుఁడు.)

**సాహిత్యరత్నాకరము**
అలంకారశాస్త్రగ్రంథము. కర్త ధర్మసూరి.

**సాహంతగోత్రము:—**
(రథితర ఉపగణముఁ జూడుఁడు.)

**సాహులగణము:—** విశ్వామిత్ర మహర్షి సంతతిలోని యొకగణము. ఇందు ౧౨ గోత్రములు గలవు.

౧ జైమిల, ౨ జైహల, ౩ కాహులు, ౪ కోహల, ౫ కోమశాయన, ౬ జాతవి, ౭ పాతవి, ౮ పాగుల, ౯ మాహులు, ౧౦ రాహులు, ౧౧ శాతాతప, ౧౨ సాహులు.

ఈసాహులగణమునందలి ౧౨ గోత్రములకును ప్రవర యొక్కటియే కలదు. అది విశ్వామిత్ర సాహుల మాహుల త్రియార్షేయప్రవర.

## సాహులగోత్రము:—

(సాహులగణము చూడుఁడు)

## "సాక్షః, పురుషః, పరేణ చేన్నియతే నానమక్షిభ్యాం నపశ్యతి" ఇతి న్యాయము:—

నేత్రములున్నవాఁ డితరులచే నడపఁబడుటఁ గాంచిన నానేత్రము లగుపడనివిగ నెరుంగఁదగును.

అనగా స్వతన్త్రతలేని నిర్భాగ్యుఁ డీనునకు గల పరాధీనజీవనము నేత్రము లుండియు లేనట్టివియె యనిభావము.

## సాక్షిగోత్రము:—

[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.]

## సాక్షిగోపాల [క్షేత్ర] ము:—

శ్రీజగన్నాథమునుండి పదిమైళ్ళదూరమునందున్న విష్ణుక్షేత్రము. గోపాలవిగ్రహము వ్రజమండలమున నొకదేవాలయమునం దుండినది. ఇటకు సత్యముం దెల్పి సాక్ష్యము వల్కుటకుఁ దేఁబడినదట. ఇక్కాలమున జగన్నాథయాత్రచేశినవారు తమ్ముంగూర్చి సాక్ష్యమిచ్చుట కటకేగి దర్శింతురట. ఇది పండాల పన్నాగమువలె తోఁచినను ననేకు లుత్కలులు దర్శించుచుందురు. ఇచట కొబ్బరికాయలవర్తకము హెచ్చుగ జరుగుచుండును.

## సాక్షితగోత్రము:—

[వాధ్ర్యశ్వ లేక మిత్రయువగణము చూడుఁడు.]

## సాక్షిసర్వర్:—

ఇది మహమ్మదీయ యాత్రాస్థలము. పంజాబుదేశమున నార్తువెస్ట్రన్ రెయిల్వేపై నున్న ఘాజిఘాటుస్టేషనుకడ నున్నతావు. డెరాఘాజిఖాన్ మండలములోనిది. సులైమాన్ పర్వత పాదమున నున్నతావు.

"సైదీఅహమన్" అనుభక్తునకు 'సాఖిగిసర్వర్' అను వాడుకనామ ముండెనఁట. ఈయన తండ్రి బాగ్దాదునుండివచ్చి సయాల్కోటలోఁ గాపురముండినవాఁడట. సాక్షిసర్వరునకు డిల్లీ చక్రవర్తి చాలద్రవ్యమొసంగి బహూకరింప నాథనమున నీకట్టడములు గట్టుకొనెనఁట. అం దామహాత్ముని గోరీకలదు. మరియు నిట సిక్కులదేవస్థానమును గలదు. ఈ రెండుతెగలవారికిని నిది యాత్రాస్థానమై యున్నది.

## స్కాందగోత్రము:—

[ఔతథ్య ఉపగణము చూడుఁడు.]

## స్కాందపురాణము:—

లింగపురాణమున పదునేడవదిగను, దేవీభాగవతమున పదునెన్మిదవదిగను, తక్కినపురాణములందు ౧౩ వ దిగను చెప్పఁబడిన పురాణము. ఇది చాలపెద్దపురాణము. స్కన్ద [కుమారస్వామి] ప్రోక్తము. భాగవత, నారదీయ, బ్రహ్మవైవర్త, మాత్స్య, దేవీభాగవతములందు గ్రంథసంఖ్య ౮౧౦౦౦ గను, శివపురాణమున ౮౪౦౦౦ వేలుగను జెప్పఁబడినను లక్షగ్రంథసంఖ్యగలదిగ నెల్లరచేఁ దలంపఁబడుచున్న మహాపురాణము. స్కంధమను వేరొక యుపపురాణమును గలదు.

## స్కాంబాయనగోత్రము:-

[ఉపమన్యుగణము చూడుఁడు.]

**స్కాట్లాండుదేశపుఁగౌంటీలు:—** తొల్లి యొకప్పుడు స్కాట్లాండుదేశము 'కౌంటులు' అను నుద్యోగబిరుదనామముగల సామంతభూపతులచేఁ బాలింపఁబడుచుండినది. ఒకకౌంటు పాలించినదేశభాగమునకుఁ గౌంటీయనియు లేక షైరనియుఁ బేరయ్యెను. నేటికిని నవి పరిపాలనావిభాగములుగనై మనదేశపుజిల్లాలం బోలియున్నవి. స్కాట్లాండుదేశమున నిట్టికౌంటీలు ౩౨ కలవు. [స్కాట్లాండుదేశము చూడుఁడు.]

[దక్షిణపుఁ బల్లపుభూములందు ౧౩]

విగ్టన్‌షైరు, కర్కూడ్బ్రైటుషైరు, డమ్ఫ్రీజుషైరు, రాక్సుబర్గుషైరు, అయ్ర్‌షైరు, రెన్ఫ్రూషైరు, లేనార్కుషైరు, పీబిల్సుషైరు; సెల్కర్కుషైరు, బెర్విక్కుషైరు, లిల్లిత్గోషైరు, ఎడింబరోషైరు, హేడింగ్టన్‌షైరు.

[ఉత్తరపులోలాండ్సు కౌంటీలు ౭.]

డంబార్టన్‌షైరు, స్టర్లింగుషైరు, క్లాక్‌మేన్‌షైరు, కిల్లిన్రాతుషైరు, ఫైఫ్‌షైరు, ఫరఫెర్‌షైరు. కిన్కార్టయిన్‌షైరు.

[దక్షిణ హైలాండు కౌంటీలు ౩.]

ఆర్గైలుషైరు, బ్యూటుషైరు, పెర్తుషైరు.

[ఉత్తర హైలాండు కౌంటీలు ౯.]

ఇన్వర్నెస్‌షైరు, నైరన్‌షైరు, ఎల్జిన్‌షైరు, బెనిఫ్‌షైరు, అబ్బర్డీన్‌షైరు, రాస్‌షైరు, సదర్లాండుషైరు, కయిత్నెస్‌షైర్, ఆర్క్నీ అండు సెట్లాండుషైరు.

మొత్తము ముప్పదిరెండు షైరులు.

**స్కాట్లాండుదేశపుఁబ్రభుత్వము (Scotland):—** ఐరోపాఖండమునకుఁ జెందిన గ్రేటుబ్రిటన్‌ద్వీప ముత్తరభాగము. బ్రిటీషుప్రభుత్వములోఁ గల్పఁబడి యించుకభేదముగల ప్రభుత్వవిధానముగల దేశము.

ముప్పదివేల నాల్గువందల చతురపుమైళ్ళ వైశాల్యమనియు, నలుబదియెన్మిదిలక్షలయెనుబది రెండువేల నాల్గువందలతొంబది జనసంఖ్యయనియుఁ జెప్పఁబడినది. ఎడింబరో ప్రధాననగరము.

**స్కాట్లాండుదేశము (Scotland):—** ఐరోపాఖండమున గ్రేటుబ్రిటన్‌ద్వీపమునం దింగ్లాండుదేశమున కుత్తరముగానున్న దేశము. ఇంచుమించు ౩౦౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యముగల దేశము. (ఐరోపాఖండము చూడుఁడు.)

ఈదేశమున సముద్రతీరములు భూమిలో గాల్వేలవలె లోతునకుఁ జొచ్చుకొనిపోయియుండుట తరుచు గానవగును. వానికి Firths అని పేరు. అవి యెక్కువవెడలుపుగానుండిన 'Lough or Lock లోక్' అనియెదరు. అట్టివానిలో ముఖ్యములు తూర్పున ఫిర్తాఫ్‌ఫోర్తు, ఫిర్తాఫ్‌టే, మోరేఫిర్తు అనునవియు నుత్తరమున పెంట్లాండుఫిర్తును, పశ్చిమమున లోక్‌లైన్, ఫిర్తాఫ్‌క్లైడ్, సోల్వేఫిర్తు. ఇందు సోల్వేఫిర్తు మరకక్కయినది. ఇందుఁ బోటుప్రవాహము హెచ్చుగనుండును. తూర్పుతీరపు సముద్రమునుండి పశ్చిమతీరపు సముద్రముతోఁ గల్పుటకు (పెద్దవాగయోడలు నడువఁదగిన Fourth and Clyde Cannal త్రవ్వి కల్పియున్నారు. ఈఫిర్తులవలన స్కాట్లాండు మూఁడుభాగములుగ నున్నది. ఈదేశమునకుఁ జెంది యుత్తరమున షెట్లాండుద్వీపము నార్క్నీ ద్వీపములు, పశ్చిమమున హెబ్రిడీస్ (పశ్చిమ) ద్వీపములు, నైరుతిదిశగా బ్యూటుద్వీపము, అర్రాన్ ద్వీపమును ముఖ్యములు. ఇంకననేకద్వీపములుగలవు. అన్నియు నించుమించు జననివాసముగలవిగ నున్నవి. ఇయోనాద్వీపము పశ్చిమదిశయందున్న

చిన్నద్వీపము. విద్యాసంస్థలకుఁ జేరందినది. ఇందు స్కాట్లండుభూపతుల సమాధులు చాలగలవు. అద్వీపమున కుత్తరమున స్టాఫాద్వీపము కలదు. అందు గుహాలును Basaltic columus ను జూడఁ దగినవి కలవు. స్కాట్లాండు తూర్పుతీరమున ద్వీపములు

ఈదేశఁపు టుత్తరభాగమును 'High lands' అనెదరు. మధ్యప్రదేశమున సారవంతమైన సమతలభూమి యున్నది. దక్షిణభాగఁపు మెరకభూములెత్తైనవి కలవు. మూఁడుపర్వతపంక్తులు నైరుతి దిశనుఁడి యీశాన్యదిశ కీదేశమున వ్యాపించి యుండును. ఉత్తరమునుండి దేశమధ్యభాగమునకు గ్రాంపియన్ రేంజిపర్వతములు గలవు. దేశము యొక్క దక్షిణహద్దున ఛేతియట్పర్వతములు వ్యాపించియున్నవి. గ్రాంపియన్‌పర్వతములందున్న బెన్నెవిస్‌శిఖరము సముద్రఁపు నీటిమట్టముపై ౪౪౦౬ అడుగులయెత్తుకలది. బెన్మెక్డూల్‌శిఖరము నించుమించంతయెత్తు కలదియె. ఇంగ్లాండు స్కాట్లాండుదేశముల సరిహద్దున ట్వీడ్‌నది కలదు. ఫోర్తునది ఫిర్తు ఆఫ్ ఫోర్తునందుఁ జేరుకొనును. టేనది (౧౦౫ మైళ్ళుపొడవు) ఫిర్తాఫ్ టేయందు సంగమించెడిని. స్పేనది మోరేఫిర్తుకడ సముద్రగామి యగుచున్నది. ఇది చాల వడిగలనది. క్లైడునది ఫిర్తాఫు క్లైడునందు సంగమించును. ఇందోడలు, నావలు, పడవలు నధికముగ నుండును. దీనియందుఁ బ్రపంచమున నావికానిర్మాణ మధికముగ జరుగుచుండునని చెప్పఁబడినది. ఇంక నీనదియు, డాన్‌నదియు అబ్బరిడీన్‌పురముకడ సాగరసంగమ మగుచున్నవి. ఫిరతాఫ్‌ఫోర్తుపై నిన్నీ, ఫిరతాఫ్‌టైపై నిన్నీ వానిని దాటుటకు గొప్పవంతెనలు గలవు. అవి లోకప్రసిద్ధములు. స్కాట్లాండుదేశమున సరస్సు లెక్కువ కలవు. అవి కడు సౌందర్యవంతములని చెప్పఁబడుచున్నవి. వానియందు Loch Lomond అను పేరుగలదియు, Loch katrine అనఁబడునదియు సుప్రసిద్ధములు. స్కాట్లాండు యింగ్లాండునకంటె చలిదేశము.

ఫోర్తునది క్లైటునదుల ప్రాంతముల నినుము, రాక్షసబొగ్గు విస్తారము దొరకును. లౌతర్పర్వతశాఖయగు లెడ్హిల్సునందు సీసము దొరకుచున్నది. ఉన్ని పత్తి బట్టలు విస్తారముగ నేయఁబడుచున్నవి. ఇనుము బొగ్గు నధికముగానుంట నినుపపనులు బాగుగనే కలవు. మెరకదేశములవారు గేల్సుజాతివారని, వారుసెల్టుసుజాతివారని చెప్పఁబడినది. వారిని హైలేండర్సుఅనియు నందురు. పల్లఁపు సీమలవా రాంగ్లజాతివారే నందురు. స్కాట్లాండుదేశస్థు లోపిక, జాగ్రత గలవారు. స్వదేశమునందు ప్రేమాభిమానములు గలవారు. అన్యదేశములకేగుట ద్రవ్యార్జనమునకేగాని స్వదేశమును వీడనొల్లరు. విద్య చక్కగ వ్యాపించియున్నది.

స్కాట్లాండుదేశమునకుఁ దొల్లింట కలెడోనియాయనియు, ప్రజలకు పిక్టులనియు రోమనుల ప్రాబల్యకాలమునాటి పేళ్ళు. క్రీస్తు వెనుక 300 ప్రాంతమున నైర్లాండునుండి స్కాట్సును సెల్టుజాతిప్రజ లిటకు వలసవచ్చి పిక్టులంజయించి స్థిరపడిరి. నాడాదిగ స్కాట్లాండనుపేరు గల్గెను. ద్వీపములందు స్కాండినేవియాజాతులవారు వసించుచున్నారు. క్రీ. వె. ౧౬౦౩ లో స్కాట్లాండు భూపతియగు నారమజే మ్సింగ్లాండు భూపతి యగుతరి రెండుపార్లమెంటుసభలును గలిసిపోయి యేకదేశమైపోయెను. క్రీ. వె. ౧౭౦౭ లో ఐక్యత స్థిరపడెను. చతురఁపుమైలున కీదేశమున సగటున ౧౩౫ గురు వసించుచున్నారని చెప్పఁబడినది. ప్రజలు ప్రొటస్టాంటుక్రైస్తవులు. చర్చిపాలన

ప్రెస్బిటీరియన్ విధానము. అందరు మతాచార్యులును సమానులేకాని హెచ్చుతక్కువలు లేవు. ఇంగ్లాండునందువలె నీదేశమున బిషప్పులు, ఆర్చిబిషప్పులు లేరు. ఇంగ్లాండునందువలెనే నీదేశమున 33 కౌంటీలు లేక షైర్లును గలవు. (ఇంగ్లాండు దేశము చూడుఁడు).

ఫిర్తాప్ ఫోర్తుకడ నున్న యెడింబరోనగరము స్కాట్లాండు దేశమునఁ బ్రధాననగరము. కడుసుందరవంతమైన పురము. 3,20000 జనులకు నివాసము. ఇచటిదుర్గ మెత్తగు శిలాతలమం దున్నది.

'ఎడ్విన్' అనుపేరుగల యొకనార్తంబ్రియా భూపతినుండి పేరందిన నగరము. ఆయన యీ దుర్గమునందు క్రీ. వె. నేఁడవశతాబ్దకాలమున నివశించెను. ఇందు హోలీరూదను పేరుగల రాజనివాసభవనము గలదు. క్రీ. వె. ౧౮౩౭ లో రాజధాని యయ్యెను. దీనిరేవుస్థానము లీత్ పురము. ఫర్తాప్ ఫోర్తుపై నున్నది.

గ్లాసోనగరము క్లైడునదిపై నున్నది. ౭౮౦౦౦౦. ఇది గొప్పవర్తకస్థలము. చేతిపనుల కర్మాగారములనేకము లున్నవి. ఓడలనిర్మాణ మిట నధికము. ఇట నావిరియంత్రములు, నోడలుఁ జేయఁబడుచున్నవి. రాతిసబొగ్గును నినుమును విస్తారముగ దొరకుసీమ నడుమనున్నది. దీనికిఁ బశ్చిమమున నేఁడుమైళ్ళలోగల పెస్లీపురము శాలువలు నేయు దారమునకుఁ బ్రసిద్ధినొందినది. క్లైడుముఖద్వారమునగల గ్రీనాకుపురము సుప్రసిద్ధమగు రేవు. తూర్పుతీరముననున్న అబ్బర్డీన్ పురము వర్తకస్థానము. ఇట నొక విశ్వవిద్యాలయము గలదు. డండీపురము పిర్తాపుఱేపై నున్నది. ఇది లీనెన్ బట్ట, నారబట్ట నేయు ప్రధానస్థానము. ఉత్తర హైలాండులం 'దిన్వర్నెస్ పురము' ముఖ్యమైనది.

పీటర్హెడ్ పురము తిమింగలముల వర్తకస్థానము. బాల్మోరాల్ బ్రిటీషుభూపతుల స్కాచినివాసము, నబ్బర్డీన్ కడనున్నది. ఫోర్తునది పైనున్న స్టెర్లింగుపురము స్కాచిభూపతులకు వినోదకర నివాసస్థానముగ నుండెను. టేనదిపైనున్న పెర్తుపుర మొకప్పుడు స్కాట్లాండు రాజధానియై యుండినది. పెర్తుపరిసరముల గలస్కోనునందు స్కాచిభూపతులు పట్టాభిషేక మొందుచుండు వారు. ఆశిలాసన (రాతిఫలక) మిప్పుడు వెస్టుమినిష్టరు అబ్బెయందుంచఁబడియున్నది. బ్రిటీషు చక్రవర్తులు దానిపయింగూర్చునియే పట్టాభిషేకోత్సవముం గొనుచున్నారు. స్కాట్లాండు బ్రిటీషుసామ్రాజ్యపాలమునం దైక్యమైయున్నది.

**స్కాటిజమ్** (Scotism) 'John Duns Scouts' అను పండితుని తత్త్వశాస్త్రవిమియకసిద్ధాంతములు క్రీ. శ. ౧౩౦౦లో స్కాటుదేశపుఁ దత్త్వశాస్త్రమునుటకుఁగూడ న[illegible]చెను.

**స్కాటిసిజమ్** (Scotticism) స్కాట్లాండుదేశ సాంప్రదాయములను [illegible]లంకారములను, (భాషీయము) ననుకరించు వాక్యయరచనావిధానము.

**స్కారబ్ మణి:**- ఇది పేడపురుగుబోలియుండు రత్నము. పూర్వకాలమున నీజిప్టుదేశమున దీనిని వాడుచుండిరట. పిదప దీనిగౌరవము తగ్గిపోయి దీనితో సీల్సు (Seals) చేయుచుండిరట. ఇప్పుడు దీనివాడుక గానరాకున్నది.

**స్టాక్ అప్ ఎక్స్చేంజి**(Stock of Exchange):— ఈవ్యాసనందర్భమున స్టాకనిన

వర్తకసంఘములు, కర్మాగారములు, గనులద్రవ్య సంస్థలు మొదలగు లాభము నేటేటం గూర్చు చుండగల వాటాలనియు, ఎక్స్చేంజియనిన మార్పు నియు నర్థములు. ఈమార్పు లొకరినుండి వేరొక రికి వశమగునట్టి కొనుగోలు. ఈక్రయవిక్రయముల కొకప్రత్యేకగృహమును నిర్మించి యాభవనమున కీపేరిడి వాడుచుందురు. గాన నిత్తరుణయున స్టాకాప్ ఎక్స్చేంజివ్యవహారములని యర్థము నాపాదించుట సమంజసము.

ఈసంస్థయందు Shares, Stocks, మొద లగు Nigotiable securities క్రయవిక్ర యము లందరును నడుప వీలుండదు. అందలి సభ్యుల పరిముఖముననే జరుపఁబడ వలసి యుండును.

ఇట్టిసంస్థలు వర్తకము జక్కఁగ జరుగుచుండు లండన్, గ్లాస్గో, మాంచెస్టరు, న్యూయార్కు, మాంట్రీల్, సిడ్నీ, జోహాన్సుబర్గు మొదలగు నగరములందుఁ గలవు. బోస్టనునగరమునందు, న్యూయార్కునగరమునందు, లండనునగరమునం దున్న సంస్థలు కడుముఖ్యములని పేరందినవి. ఫ్రెంచిభాషయం దిట్టిసంస్థలకు 'Bourse' అం దురు. ఇట్టి సంస్థలందుఁ బరిపాలనపద్ధతులందు భేదములున్నను కార్యక్రమ మొక్కటిగనే యుం డును. వీనికన్నింటికిని ధరవరలం గూర్చి తంతివా ర్తలు నడచుచునే యుండెడిని.

వీనియందు సభ్యులుగనుండువా రందలి వా టాదార్లుగఁగూడ నుందురు. వాటాలం గల్గియు సభ్యులుగ నుండనివా రుండరు. ఇందలి సభ్యులు బ్రోకరులనియు, జోబరులనియు ద్వివిధములుగ నుందురు. తక్కినవా రిందలియుద్యోగులే. అమ్ము వా రిందలి బ్రోకరు (Broker) సభ్యులద్వారా నమ్మవలయును. దానికి వారికి రుసు మీయవలసి యుండును. అంతల కాతఁ డీపనియం దెల్లపను లును నెరవేర్చువాఁడు. అమ్మువారిని వీరు తమ Clicnts అనియెదరు. ఇంక జోబరు (Jobber) సభ్యులు వేర్వేరుజాతుల స్టాకులం గొనువారు. వారు వేర్వేరుతావులం దీభవనమునందే యుండి కార్యముల నెరపుచుందురు. వారు సర్వదా బ్రో కరుసభ్యులనుండి కొనుటకు సంసిద్ధులుగనే యుండి వానిధరలను తెలుపుచు బేరము లాడుచుందురు. బ్రోక రొకస్టా కమ్మఁజూపినతఁడ దానిని తాఁగొను తటి యివ్వగల మూల్యమును తాఁ దాని నమ్మచో రాబట్టఁదగిన మూల్యమునుగూడఁ దెల్పి రెంటికిం గల భేదము తనకు లాభముగఁ గైగొనుచుం డును. ఇట్టి వ్యవహారములందు బ్రోకరు జోబరు లకు బేరములు జరగుటయుఁ గలదు. కుదిరిన తోడనే పుస్తకములందు సంతకములం జేసుకొని యమ్మకల్లయింటునకుఁ దెలిపి మూఁడుదినములలో వ్యవహారమును ముగించు కొనియెదరు. అందు మొదటిదినమునకు Contango యనిపేరు. మొదటి వ్యవహార మీదినమునని యేర్పాటులు చేసికొనియెదరు. రెండవదినము Ticket day యని పేరు. ఇందు తనిఖీలు, యోచనలు మొద లగుపనులు నడచును. మూడవదినమునకు Pay Day యనియు, Settlement day యనియు నందురు. ఇందు సొమ్మిచ్చివేసి వాటాలం గైకొ ను పనులు నడచును.

ఇట్టి కొనుగోలు నడచు security లు మూఁడుపేర్లం బరగెడిని. Bearer సెక్యూరిటీలు నమ్మునాతఁడు బ్రోకరుద్వారానే నడుపును. Ius- cribed సెక్యూరిటీలు అమ్మునాతఁడు వచ్చి బ్రోకరుసభ్యునిచే పోల్పంబడి పుస్తకములో సంత

కము చేయవలసి యుండును. Registered సెక్యూరిటీ యగునేని యమ్మువారు కొనువారును కలసి ట్రాన్సుఫరుపత్రమునందు సంతకములు చేయవలయును. ఈ శ్రమ లన్నిటిని బ్రోకరు సభ్యుడే వహించెడివాడు. ఏకంపెనీలో వాటా కొనబడినో యాకంపెనీనుండి హక్కుపత్రముం గూడ గొని వారి కందజేయంబడును.

వాటాలకొనుగోలునం దొకచిత్రమైన వ్యాపారము గలదు. ఇది Bulls & Bears వ్యాపారమనియు, speculation అనియు ననెదరు. కొనువానిని బుల్ అనియు అమ్మువానిని బేరు అనియు వాడుదురు. లేనివాటాల నమ్ముటయు లాభముసకుగాను వానిం గొనుచుం దిరుగనమ్మి వేరొకరి కంటగట్టుచుంటయు నిటుల లాభము నకై దూకుడుం గల్గించుచుంటయె యిందలి వ్యాపారము. ఇది కంటెంగోస్థితిం దాటును. లాభముల నందుటయెగాని మూల్యము నొసంగుటయె యించుండంజాలదు. వీటియందు మూల్యము చెల్లించని defaulter నకు Hammered అనియె దరు. ఆటులం బ్రకటించు నుద్యోగి walter అనం బరగెడిని.

స్టాగ్ (stag):— ఒక క్రొత్త కంపెనీ వాటాలంగొని వాటిప్రీమియమ్ చెల్లుకాలమునకు, అమ్మివేయు వర్తకున కీపేరు వాడుచున్నారు.

స్టాటిక్సు కళ (statics):— ఈవిద్య architict లకును, Engineer లకును, Builder లకును నావసరమగు strains & stresses అనువిద్య యీస్టాటిక్సునందలి భాగము. మఱియు నిది machanics లోని భాగముగ నున్నది. ఇందు 'Bodies and forces at rest or equilibrium' అనుదానిం గూర్చి వివరింపంబడుంగాన Dynamics అనుదానికి వ్యతిరేక ధర్మములను దెల్పునదిగా నెన్నంబడినది.

స్టాటిస్టిక్సు (Statistics) (ప్రెంచిజ న్యము) Statistiqwe:— ఆదాయవ్యయ ములు, జనులు, వృత్తులు, భూములు, మొదలగు వివరములు విషయవిభాగము ననుసరించియు, సంఖ్యాక్రమము ననుసరించియు పట్టీలుగ తయారు చేయు విధానము.

స్టాటిస్టిక్స్ (Statistics):— ఏవిషయ మునుగూర్చియేనియుం జేయంబడిన మూలసిద్ధాంతముల (Data) నాధారముగం జేసుకొని వేర్వేరు కాలములందు సంగ్రహింపంబడిన గుణితాంకవివరణములను సంప్రతించి సరిచూచుకొను నొకరక మగు గణితశాఖకు 'స్టాటిస్టిక్సు' అనిపేరు.

అట్లు సంప్రతించుకొనుటయందలి యుద్దేశము మూలసిద్ధాంతములం (అనగా Data) దు, అప్పుడప్పుడు గల్గుచుండుమార్పులవలనగాని, భేదముల వలనగాని కల్గుచుండు పర్యవసానములను సహేతుకముగం దెలుసుకొని కాలమునకుం దగినట్లు సమ ర్థించుకొనుచు సవరించుకొనుటకైయు యున్నది. అట్లే దత్తాంశములను సంగ్రహించుచుండుట యేవిష యమునుగూర్చియైనను కాలానుగుణ్యముగంజెందు మార్పులంబట్టియెగాక నా మూలసిద్ధాంతములం దిమిడియున్న వివిధకారణ పర్యవసానములకుం గల యంతర్విషయసంబంధముల ననుసరించియుంగూడ సంగ్రహించుట కవకాశముగూడ గలదు.

దికర్సూచనగ ముందు మార్గప్రదర్శన మొనర్ప నావశ్యకములగు నంచనాల (Estimates) నించుమించుగ నిరూపించుకొనుటలో నగత్యములగు (statistics) ను గూర్చిన సిద్ధాంతములను

•బ్రయోగించుటకువలయు ముఖ్యములగు నవసరములు, మూలమాత్రములు (Data) సరియైనవిగాను, సంపూర్ణమైనవిగాను, గణించుకొనినవిగాను నుండునట్లు చూడవలశియుండును. లెక్కలు సజాతీయములగు (homogenions) విషయములకు మాత్రమే చెందియుండవలయునుగాని యన్యసంబంధముగలవిగ నుండరాదు. ఉదాహరణము పనివాండ్రు కీయఁబడు మూల్యము (wages) లఁ గూర్చిన లెక్కలు కావలసియున్నప్పు డొకేతరము పనివాండ్రకేర్పర్చబడురేట్లనే సంగ్రహించుటకు వలయు జాగ్రతఁ గొనియుండవలయును. అట్టి రేట్లు (wages) పురుషులకో, స్త్రీలకో, పని చేయుటయందు నేర్పుగలవారికో, నేర్పుచాలని వారికో మొదలగు విషయములం దూహాసిద్ధాంతములను (statisticul inferences) సరిగఁజేసి వ్రాసియుండవలయును. అట్టి సరియగు నంకెలను మనసునం దిడికొని పనిఁజేసినచో లెక్కలయందు దోషఫలితములుఁ గలుగకుండెడిని.

ఇటులనే రెండుకర్మాగారము (factorys) లందు, తారతమ్యపరిజ్ఞానముఁ గావలయునేని యీ రెంటియందును బనిచేయఁబడినదినములం దెన్ని గంటలకాలము పనిచేయఁబడుచున్నదో యావైనము ముఖ్యముగఁ గావలసియుండును. మరియు నాకర్మాగారములందుఁ జేయఁబడువాని మచ్చు పరిశోధనలు తెలుపం బడుచుండవలసియుండును.

మచ్చులంగైకొని గుణాగుణముల నిర్ణయించుటసాధ్యముగాన రకమునకుఁ గొన్నిటినే మచ్చున కేరితీసి యేదేనియొకపద్ధతిని వానిని బరిశోధించుట సమంజసము. ఈపద్ధతియే ప్రకృతిశాస్త్రపరిశోధనల (scientific observations) యందును, భీమా కంపెనీల పరిశీలనలందు నాచరణయందున్నది. ఈ data వానివానిగుణముల నేర్పరింప తరంవారీగా విభజింపఁబడుచుండును. దానింబట్టి లెక్కలు సరిచూచుకొనవలసియుండును.

ప్రత్యేకాంశములఁగూర్చి యొసంగఁబడిన సంఖ్యలు లేక లెక్కలంబట్టి యనుభవమునం దాచరింపందగిన ప్రధానాంశములను స్పష్టపర్చుటయె [science of statistics] నకు ముఖ్యధర్మము. అనగా దేశమందలి శీతోష్ణస్థితి, ధరవరలు నచటి [wages] యొక్క పరిమితులు, దేశమందలి వ్యాపారస్థితులు, ఎగుమతి దిగుమతులపరిస్థితులు, చుట్టుపట్లపండు పంటలపరిమితి వీనినిఁ జక్కఁగ నారయుచుండవలయును. (Data) తరముల వారిని విభజన (Tabuetate) చేసిన పిదప నొక (graph) రూపముగఁ జేయఁబడుట సామాన్యాచారము. ఇది చూచినంతనే సులభముగ నభిప్రాయ మేర్పర్చుకొన వీలగుచుండును.

డేటాలయందలి విషయముల పరస్పరసంబంధము [mutual relationship] అనగా ధరవరలు, కూలులు (wages), కొలతలు, పిల్లల వయస్సు, సంవత్సరఁపుదినములు, వాటియందలి [temparatures] మొదలగునవి పరిశీలించుకొనుచుండవలయును.

[Statistical calculation] లోని విధానములలో ముఖ్యమైనదియు, వాడుకయందున్నదియు సామాన్య (average) విధానమే. దీనిని జాగ్రతతో నుపయోగించినచోఁ బెద్ద [statistics] గ్రూపులందుఁ గూడ నిష్కర్షయై నమ్మఁదగినఫలితములు లభింపఁగలవని తేలుచున్నది. వేర్వేరు గ్రూపులకును [classes] కును గల తారతమ్యము గ్రాహ్యమగును. జాతి, తరములకుఁ జెందిన పదార్థపరస్పరసంబంధముఁ గూర్చి

నిష్కర్షగా నీయావరేజివిధానమే యనుకూలించె డిని. ఇం దింకను [moving avarage] అను వేరొకవిధానమునుఁ గలదు. [moving avarage] యన డేటాకుసంబంధించిన కొన్నిసంవత్సరములలెక్కలు సగటున [average] తీయుట యనియర్థము. ఈపద్ధతిమేరకు గుణించుటవలన ధరలు, కూలు [wages] లయొక్క కొన్నిదశలు [decades] లెక్కలంగుడించి యేవరేజిఁ జూచి నచో ధరలు, కూలులు నెట్లు మారుచున్నదియుఁ దెలియగలను.

median అన state stics నందలి యొక్క పరిభాషాపదము. సజాతీయము homogenions లగు వస్తువ లనేకము లొకదానిప్రక్క నొకటిగఁ బెద్దచిన్నవరుసల నుంపఁబడినపుడు నట్టనడుమ నుండు దానికే median అందురు. ఇంక mode అనిన నన్నివిధములగు డేటాలలోఁ బ్రకృతిపరిణామ (phycicial phinomina)సంబంధమున data లను పెద్దచిన్నవరుసలనేర్పర్చి వాటిలో నొక గణముఁ దక్కినవానికన్నఁ బ్రాముఖ్యముగ నున్న టులగోచరించెనేని దానిగణములకుఁ బేరు. మరియు దీనికి Norm అనియు వాడుకనామము గలదు. ఈనిర్దిష్టము కేవలసంఖ్యాంబట్టియేగాక Density (సాంద్రతం) బట్టియుఁగూడ నుండెడిని.

అనఁగాఁ గొన్నిపరిమాణములుగల యొకేజాతి వస్తువులను పెద్దచిన్నవరుసల నేర్పర్చుతరి నధిక సంఖ్యగల సమానపరిమితిగలదానికి (దానిపరిమాణములకు) 'mode' లేక 'Narm' అని పేరని యెరుంగవలయును.

ఇంక సహసంబంధ (co-relation) మన రెండు లేక నంతకధికముగనున్న గణములు, తర ములు, రకములయొక్క డేటాలకు స్పష్టమైనసం బంధ ముండెనేని దానికిఁగలసంబంధమని పరిభాషా నామ మిడియున్నారు. ఈ 'co-relation' ఒక్కొ కతరి సక్రమము (dirrect) గను, వేరొకప్పుడు క్రమవిరుద్ధము (reverse)గ నుండెడిని. ఈసం బంధము సామానులురకము ధరలకుసంబంధము గల్గియున్నది. అనఁగా రకము శ్రేష్ఠముగుతరి ధర నెచ్చుగనుంటయు, రకము క్షీణించిన ధర తగ్గు టయు dirrect సంబంధముగను, పనిచేయు దిన ములందు గంటలందగ్గించిన నెక్కువదినములు పనిచేయవలసియుంట 'reverse' అనియు నెఱుం గునది.

ధరవరలు మందగించుచుంటయు, చురుకగు చుంటయు తఱుచుగ సంభవించుచుండును. ఈ వ్యత్యాసములకు నిజకారణము లరయుచు [illegible] వ్యాపారసుల కవసరము. అట్టికారణముల నెరిఁ వానిసంబంధముగు [illegible] నాధారముగ వ్రాయుస్టాటిస్టిక్సునకు ఇండెక్సు (Indox) అని పేరు. ఒకకాలమునాటి సగటు (యవరేజి) ధరలను [illegible] కొని వ్రాయుచుంటనో యిందని [illegible] ముగ నున్నది.

ప్రత్యేక కాలమునందు ప్రత్యేకములగు వేర్వేరుదినుసులధరల యేవరేజిలెక్కలను గ్రోడీక రించి చూపఁబడిన యేవరేజి మొత్తములకు 'medices' అనిపేరు.

## స్టాట్యూట్ బార్డు (Statute Barred):—

తిరిగి పద్ధతులమేరకు రాబట్టుకొన హ ద్దునుమీరిన (అప్పు) మొదలగునవి. (వాణిజ్య సంబంధపరిభాషాపదము.)

## స్టాట్యూటరీ మీటింగ్ (Statutory meetinn):—

ఒకకంపెనీసభ్యుల సాధారణ సభ. (వాణిజ్యసంబంధ పరిభాషాపదము.)

**స్టాటోస్కోప్** (Statoscope):— గాలి యొక్క యత్యాన్నత్యపరిణామములను దెలుపు పరికరము.

**స్టాండర్డుగోల్డు** (Standard Gold):— ఇరువది రెండుభాగము లసలుబంగారమును, రెండు పాళ్లు రాగిపాలు (alloy) ను చేర్చి కలిపిన బంగారమున కీపేరు వర్తించెడిని. ఇటులనే ముప్పది యేడుపాళ్లు వెండియు, మూడుపాళ్లు రాగి (alloy) ని కల్పినదానికి 'Standard silver' అనియెదరు. దానిలోనున్న యసలులోహము ననుసరించి నాణ్యములకు గట్టినవిలువకు 'Standard money' అనియెదరు. అట్టు లసలులోహముంగూర్చి చేసిన లెక్కగట్టుటకు 'standarding' అనుచున్నారు.

**స్టాండర్డుటైము** (Standard time):— కాలము నైసర్గికము. ఇది సూర్యోదయాదిగ భరతదేశమునందు బరిగణింపంబడు చుండునది. న్యాయమునం బ్రపంచమం దంతటను ప్రనగరమున పట్టణమున, పల్లెలందు సూర్యోదయాదిగ లెక్కింపంబడుచుంట సహజము. అట్టికాల మాస్థలమునకైన కాలముగాన నాంగ్లభాషావిదులు దానికి Local time అని వాడుచున్నారు. (కాలముచూడుఁడు, కాలవిభజనముచూడుఁడు, కాలవిధానము చూడుఁడు, కాలమానముచూడుఁడు, సీజన్సుచూడుఁడు). ఇట్టి కాలమున నపరాహ్ణమున [అనఁగా మధ్యాహ్నమున] సరిగా సూర్యబింబమెగువను తలకుఁదిన్నగా నాకాశమధ్యమునం గాన్పించెడిని. ఇట్టి లోకల్ టైములు జాతకములువ్రాయుట గ్రహపరీక్షలు ముహూర్తనిర్ణయములు మొదలగు జ్యోతిశ్శాస్త్రసంబంధకార్యములకు భరతదేశమునందు వాడంబడుచున్నవి. హిందువుల మతకార్యముల కిదియే కాలము.

కాని యిరుపదారులు, తంతీవార్తా [టెలిగ్రాపు] స్థానములు, రేడియో, ఏరోప్లేన్ [వాయువిమాన] ప్రయాణాదినూతనోత్పన్న సంస్థానకార్యములకుం గుదురకున్నది. రెయిల్వేప్రయాణికులం దనేక లోకల్ టైములుండు పెక్కుతావులనుండి ప్రయాణము చేయుటయందును, తంతీవార్తలంబల్కించు తావులందును మొదలగుకార్యస్థానముల నెల్ల చోట్లను నొకేరీతినుండుకాల ముండనిచో వీలుండదు గాన దేశప్రభుత్వములు సగటున దామాషాయిగా నొకకాలము నేర్పరిచి శాసించుచున్నారు. అట్టికాలమును స్టాండర్డుటైము (Standard time) మందురు. ఇది యొక్కొకదేశమునం దొక్కొకరీతి నమరెడిని.

భరతదేశమునం దీద్వివిధకాలము లెట్లున్నవో గమనించుట యాంధ్రవిజ్ఞానమునకు సమంజసము. "One country one Standard Time" అను నార్యోక్తి వినుట కనుకూలముగానున్నను స్టాండర్డు టైము మెరిడియన్ నుండి దూరమున నుండుతావులవారికిఁ గొంతవరకు నష్టకష్టములం గల్గించెడిని. భరతదేశము 'ఆసాంతూర్పుకడనుండి బెలూచిస్థానంపుం బడమటికడ వ్యాపించియున్న దేశముగాని చిన్న దేశముకాదు. బెలూచిస్థానంపు గ్వాదూరున నపరాహ్ణ [మధ్యాహ్నము ౧౨ గంటలకాలము] మగుతరి నాసాంలోని యప్పర్ డె కింగ్ వేలీలో మధ్యాహ్నము రెండుగంటల పదునేను మినిటగును. అట్లే ఆసామున స్టాండర్డుటైముగడియారము పగలు 12 గంటలు చూపుతరి లోకల్ టై మొకగంటా దినిమిషము లగును. అత్తరినే బెలూచిస్థానమున స్టాండర్డుటైము పగలు ౧౦ గంటల యేబది మినిట్లయ్యెడిని.

ప్రొద్దుతోఁ గాలమునుబుచ్చుచుఁ బనులొనర్చు వ్యవసాయ మొనర్చువారి కిది బాధింపకున్నను

యంత్రాగారములందుఁ బనిచేయుట, కచేరీలయం దుద్యోగములు చేయుట గలవారలకు నాటక తీరదు. ఒకతావున స్టాండర్డుటై మపరాహ్ణ[noon] మగుతఱి లోకల్ టైమొంటిగంటయగునేని వారికిఁ బగటికాల మొకగంట దాటిపోయినదని స్పష్టము. ఏలనన నారుగంటలకు సాయంత్రమగుకాలమున నైదుగంటలకే సాయంత్రమై యారగువఱకు నొక గంటరాత్రి గడచిపోయి యుండును.

కలకత్తా, డక్కా బొంబై కరాచీమొదలగు నగరములు లోకల్ టైమునే పాటించుచున్నవి. స్టాండర్డుటైము వాటియందు గవర్నమెంటు, పోస్టు టెలిగ్రాపు, రెయిల్వేమొదలగు కార్యస్థానములు వాడుచున్నవి. కలకత్తాయందు స్టాండర్డు టై మపరాహ్ణమగువఱకు లోకల్ టైము ౧౨-౨౩-౨౦ సెకెండ్లగును. అట్లె బొంబై నగరమున స్టాండర్డు టై మపరాహ్ణమగుతఱి లోకల్ టైము ౧౧—౨౧ A. M అగుచున్నది.

ఇట్టిపరిస్థితులయం దింకొక రహస్యసందర్భము గమనింపందగినది కలదు. తపాలు, తంతీవార్తలు, రెయిల్వేయావరణలు, స్టాండర్డుటైమును గారవించునుగాన వీనిపై నాధారపడు టధికముగా గల బొంబై కరాచీనగరములందుఁ [సర్వసాధారణముగ పగలు పదిగంటలనుండి మధ్యాహ్నము మూఁడుగంటలదనుకను] బనిచేయు బేంకులు పగలు పదునొకండుగంటలనుండియు నాల్గుగంటల వఱకును బనిచేయునట్లు మార్పునందియున్నవి. ఇది ప్రజలసౌకర్యార్థము లోకల్ టైము ననుసరించునటుల నించుక వెనుకకు నడుపంబడిన సంస్కారఁపుమార్పుగాని వేరుకాదు.

దీని నిటుల విడచి విదేశములందీస్టాండర్డుటైము యేర్పాటు లెటులనున్నవో యోచింతుముగాక. అమెరికాయందలి బ్రెజిల్ దేశమున తూర్పు పడమరలకు ౩౮ డిగ్రీల లాంగిట్యూడుగల ప్రదేశముగనున్నది. దీనిని మూఁడుగ విభజించి యొకటి కన్ననొకటి యొకగంటకాలము తక్కువగ నుండునటుల మూఁడుటైముజోనులుగ మూఁడుస్టాండర్డు టైముల నేర్పరిచియున్నారు. తూర్పుజోనున నపరాహ్ణము [noon] అగుతఱి మధ్యజోనున పదకొండుగంటలును, పడమటిజోనున పదిగంటలును నగునది స్టాండర్డుటైముగ నున్నది.

ఇంక నాఖండమునందలి కనడాదేశము, అమెరికాసంయుక్తరాష్ట్రములందు [గొప్ప దేశముగాను] ముప్పదిడిగ్రీల లాంగిట్యూడుప్రదేశమును ౧ అట్లాంటిక్కుజోను, ౨ ఈస్టరన్జోను, ౩ సెంట్రల్ జోను, ౪ మౌంటెన్జోను, ౫ పసిఫిక్కుజోను నను నైదుటైముజోనులుగ నేర్పరిచి యొకటికన్ననొకటి గంటకాలము తక్కువయుండునటుల నచటిస్టాండర్డు టైములు కుదర్పంబడియున్నవి. ఇట్టిరుదేశములందును నొకేయేర్పాటు చేయంబడియున్నది.

పిదపం జెప్పందగినది ప్రపంచమునఁ బెద్దదేశమనదగిన రష్యాదేశము. ఇది ౧౭౦ లాంగిట్యూడు డిగ్రీల వెడలుపుఁగల్గినది. ఇది పదునొకండుటైము జోనులుగ విభజింపంబడి యొకటికన్న నొకటి యొక్కొకగంట తక్కువగ స్టాండర్డుటైము నిర్ణయింపబడియున్నది ఈమహాభూమి యందుఁ దూర్పున సూర్యోదయ మగుపడినపిదపఁ బదిగంటలకుఁగాని పశ్చిమమునఁ గన్పట్టదఁట. మఱియు నీదేశమున విపరీతవిచిత్రపు టేర్పాటు 'All the year round summer time' అనంబడునది. క్రీ. శె. 1930 సంవత్సరఁపు డిక్రీమేర కా దేశఁపుఁబ్రభుత్వము గడియారము లన్నియు నొక గంటముందునకు నడుపఁబడి స్థిరపర్పంబడినవి. దీని

నుండి పదునొకండుటైముజోనుల స్టాండర్డుటైములందు నిజమైన యపరాహ్ణమునకెక్కడను పగలు పండ్రెండుగంట లుండనేరదు. ప్రపంచమందలి దేశములలో నీరష్యాదేశ మొక్కటియే యిందునకుఁ జేరందినది. తమ క్రైస్తవమతమును సైతము నిరసించినరష్యా యిట్టివిపరీతపద్ధతి నవలంబించుట వింతకాదు.

ఇంక భరతదేశమున స్టాండర్డుటైము సెనుబదిరెండున్నర [east] డిగ్రీల ప్రదేశమును మెరిడియనుగా నేర్పర్చి దానిని సూర్యబింబము గడచుతఱి నపరాహ్ణము [noon] గా నేర్పర్చియున్నారు. అలాటిట్యూడు నిల్వుగీతపైనున్న తావులలో నిది ముఖ్యమైనది. మధ్యరాష్ట్రము లందలి బిలాసపూరుజిల్లాలోని బలోడాయను పేరుగల చిన్నపట్టణ మామెరిడియన్‌పైనే యుంట నిట లోకల్‌టైమును, స్టాండర్డుటైమును నొక్కటియే. మఱియు నీనిల్వుగీత కిరుదెసలను దగ్గిరగనేయున్న నగరము లుత్తరమున బనారస్ మొదలగునవియు, దక్షిణమున చెన్నపట్టణము బెజవాడ మొదలగునవియునై యున్నవి. వీటి లోకల్‌టైములు స్టాండర్డుటైముతో స్వల్పపు భేదము గల్గియుండెడివి.

ఈ స్టాండర్డుటైము యేర్పాటునిమిత్తము ప్రపంచమంతయు పదునేడేసిడిగ్రీలు [నిల్వుగీతలు] గల లాటిట్యూడుభాగము లిరువదినాల్గుగ విభజించి వానికి స్టాండర్డుటైములోనని పేరిడియున్నారు. ఈ యిరువదినాల్గు టైముజోనులకుఁ బ్రారంభస్థానముగ నింగ్లాండుదేశపు లండన్‌దరినున్న గ్రీనిచ్చి లోకల్‌టైము [local time] నొకటిగ గైకొని యటనుండి లెక్కించుచున్నారు. ఇది జగమంతయు వ్యాపించఁజేయు ప్రయత్నములు జరిగినవి కాని పూర్తిగ సాగలేదు. అమెరికా తనస్వంత యేర్పాటులను వేరువిధముగఁ జేసికొనియెను. ఐరోపాదేశములలోఁగొన్ని తమస్వంతవిధానము నవలంబించెంగాని యీపద్ధతికి రాలేదు. సముద్రమున నడచు నోడలుమాత్ర మిరాయిరువదినాల్గు స్టాండర్డుటైముజోనులపద్ధతి నవలంబించి నడపుచున్నది. లోకల్‌టైము లెచటి వచటనేగాని యితరప్రదేశముల కనుకూలింపదుగాన నీస్టాండర్డుటైమింత చిక్కుం గల్గించియు ముఖ్యత నొందియున్నది.

**స్టాపింగ్ (Stopping):** వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఆపించుటయని యర్థము. ఒకచెక్కుగాని, యొకనోటుగాని చోరీపోయినతరి దానిసంఖ్య, తేదులు మొదలు వివరములను బాంకులు మొదలగు తావులకుం దెలిపి సొమ్మీయఁబడకుండ నాపించుట కిది యర్థమగును. ఒకరి యార్డరుమేరకు కొనినసరకు కాతనికి delivery చేయఁ బంపియు, చేరకపూర్వమే యార్డ రిచ్చిన యాతఁడు solvent కాఁడని తెలియవచ్చెనేని సరుకు delivery చేయఁబడకుండ పంపినవారాపించుటకు stoppage in transius అని పేరు.

**స్టార్‌క్లష్టర్సు (Star Clusters) నక్షత్రములగుర్తు:—** Mr moundr పరిశీలకుఁడు వీనిని తేనెటీగలపట్టునలెనుండు నక్షత్రసముదాయములని నుడివియున్నాఁడు. వీటినడుమగా confused bright light ఉండుననియు నది సమీపముగ క్రిక్కిరిసియుండున ట్లగుపడు నక్షత్రములనుండి కల్గినదియేయనియుఁ జెప్పఁబడినది. వీటియం దగ్రగణ్యమని చెప్పఁదగినది omega contaure యనంబడునది. అందు 50 మినిట్ల డయామీటరుప్రదేశమున 6000 నక్షత్రములు కదిసియుంట నేత్రములకే యగుపడును. ఈప్రదేశము చంద్రపరిమాణమునకు రెట్టింపని చెప్పఁ

బడినది. ఇంతకు చిన్నవియగు క్లష్టరులు పెక్కులు కనిపెట్టఁబడినవి. Dr gould పండితుఁడు మొదలగు కొందరుపరిశీలకులు solar system నందలి సూర్యుఁడును నిట్టి cluster నక్షత్రములలో నొకటియనియే తలంచుచుండిరట.

క్లష్టరునక్షత్రము లన్నో కలసితిరుగుచుంటయు కొన్నింటిపరిమాణములు 120 లైటియరస్సు ప్రదేశముగ నుంటయు కనిపెట్టిరు. Plciades అను పేరుగల క్లష్టరునం దారునక్షత్రములు నేత్రగోచరము లగుచుండును. అవి వెలుతురు నధికముగనుండు క్రమముగ 1. Alcyone, 2. Atdas, 3. Electra, 4. Maia, 5. Taygeta, 6. Merogoe అనుపేర్లు వహించినవి. దృష్టిబలముగల కొంద రిందు పదునాల్గు నక్షత్రములను గూడ చూచిరట. ఇందు వందలకొలది కలవని తేలినది. ఇవి సంయుక్తముగ 5½ డిగ్రీలు 100 సంవత్సరములలో గడచునని చెప్పంబడినది. దీని డయామీటరు నాల్గు light years అని యొకటి లరచుగ Half light year అనియు నను చున్నారు. ఇంక నిందలి యారు పెద్దనక్షత్రములు సూర్యునికన్న నూరురెట్లధిక కాంతిని గలవట. B లేక Helium Type అనియు, వాటిభారము చాలతక్కువగా నుండుననియు పోల్పఁబడినది. స్వప్రకాశవంతములగు సూర్యులం దింకను co-coors వదలిపోలేదని (along narrow nebu lons streak) వదలలేదని కన్పించెడిని. ఇందు నుండి యివి నెబ్యులైజన్యములని స్ఫురింపకపోదు. వీటిపరిసరములం దంపమైన వంకరలుగల నక్షత్రవితతి కలదు. ఇందలినక్షత్రము లన్యోన్యసంబంధములు గల్గియుండునని తేలుచున్నది. క్లష్టరునక్షత్రములు మధ్యగా కేంద్రీకరించియుండునని పరిశీలకు లందురు. Proffssor see గారు కొబ్బట్టి యే యవి యాకర్షణములవలన దగ్గరగాఁజేరుకొనుట జరుగుచున్నదనియు ననుమానించెను. అగునేనిగొప్పగోళముగఁ గలసిపోవుట సంభవించు ననెను. canopus గోళ మిటులనే యైయుండు ననియెను. మరికొంద రిందుకు వ్యతిరేకముగ నివి విడిపోవుచున్నవిగాని సమీపించుటలే దనుచుందురు.

**స్థానేశ్వరసంస్థానము:**—స్థానేశ్వరము ఆంగ్లమున Thaneswar అనఁబడుచున్న కురుక్షేత్రమున యాత్రాస్థానముగ నున్నది. స్థానేశ్వర సాగరము హిందువుల పవిత్రతీర్థము. ఈసంస్థానఁపుఁ జుట్టుకొలత ౧౧౬౭ మైళ్లుండునని హుయాన్త్సాంగు వ్రాయుచు నిది కనూజభూపతియగు హర్షవర్ధనునికి సామంతరాజర్కమని వివరించెను. కురుక్షేత్రముఁ జూడుఁడు.

**స్థానదేశము:**— దీనిప్రశంస గరుడపురాణమున ౧౪౫ యందుఁ గలదు. దీనిని కుస్థానముగఁ బోల్చుచున్నారు. తూర్పు టర్కిస్థానఁపుభూమి లేక చీనాటర్కిస్థానఁపుభూమి యని పోల్చుచున్నారు. ఇందు జేడ్ (Jade) అనంబడు రాతిగనులు కలవు. వానిని చైనావారు కసతానా యందురు. ఈదేశమును ఫాహియానును, హుయాన్త్సాంగునుకూడ దర్శించినటులఁ జెప్పఁబడినది. అనగా వారికాలమున నీదేశ ముండియుండవలెను.

ఇప్పటి ఖోతాన్పురమునకుఁ గొంతపశ్చిమముగా నున్న 'యోత్కాన్' అనఁబడుచున్న పురము. తొల్లింటిరాజధానిగనుండిన స్థానపురమని పోల్చుదురు. స్థానపురము కుస్తనకము, కోతనమై యోత్కాననఁ బరగుచున్న దందురు.

డాక్టరు స్టెయిన్పండితుఁడు క్రీ. ము. రెండవ శతాబ్దకాలమున తక్షశిలనుండి ప్రజలు నివాస ముగ నేర్పరుచుకొనియు, ఒకప్పు డాక్రమించియు నిటులజయింపఁబడి యుండెనదని యభిప్రాయపడి యున్నాఁడు. ఇచట బ్రిహామినీలిపియందు, కారో ష్ఠిలిపియందు నేలియో శాసనములు గలవు.

**స్థానేశ్వరము:**-ఇది మహాభారతయుద్ధము నడచినతావు. ఢిల్లీకుత్తరమున ౭౬ మైళ్ళదూర మునఁగలదు. నార్తువెస్ట్రన్ రెయిల్వేయందు, కురు క్షేత్రస్టేషను కలదు. ఇది స్థానేశ్వరము కడనే యున్నది. పంజాబుదేశములోని, అంబల్లాజిల్లాలో, చేరినది. స్థానేశ్వర మొకప్పుడు ౧౧౬౭ మైళ్ళ వైశాల్యముగల రాజ్యమునకు రాజధానిగ నుం డెను. ఇప్పుడు యాత్రస్థలము మాత్రమైయున్నది. కురుక్షేత్రము డెబ్బదిమైళ్ళపొడవును నిరువదిమైళ్ల వెడలుపును గలప్రదేశము. ఇందు దేవస్థానములు గలవు. అందుప్రధానములు స్థానేశ్వరమునందును. పృదుదాక (ఇప్పటి పీహోవాయందును) గలవు.

స్థానేశ్వరమనంబడు పుణ్యసరోవరము మైలు పొడవును, రెండుఫర్లాంగుల వెడలుపును గలది. ఇందు దీనికీశాన్యదిక్కునను, దక్షిణమునను స్నాన ఘట్టములు, దేవాలయములును గలవు. పశ్చిమ తీర్థమున పాడుపడిన కట్టడము బలసినతుప్పలు, డొంకలచే నావరింపఁబడియున్నది. స్థానేశ్వరము నడుమ పవిత్రదేవస్థానము గలదు. కురుక్షేత్రము సరస్వతీదృషద్వతీ నదులమధ్య ప్రదేశమనియు, బ్రహ్మావర్తమని తొల్లింట పేరనియుఁ జెప్పఁబడి యున్నది.

అచటివారు గర్వముతోఁ దమబ్రహ్మావర్తము నైవకల్పితమై బ్రహ్మాక్రాంతమైన పుణ్యప్రదేశ మని చెప్పుచుందురు. కురుక్షేత్రము చూడుఁడు.

**స్థావరజంగమవిషన్యాయము:—** ఆయుర్వేదవైద్యమున విషములు స్థావరములని యు, జంగమములనియు ద్వివిధముగఁ జెప్పఁబడి నవి. అందు స్థావరవిషములు జంగమవిషములను హరించుననియు, జంగమవిషములు స్థావరవిషము లను హరించుననియుఁ జెప్పఁబడినది. అన్యోన్య మును విరోధభావముగల్గి యుండిన బలాఢ్యులగు నిర్వురు దుర్మార్గులను గూర్చి తెల్పుతరి నీన్యాయ మును వాడుదురు.

**స్థావరవిషములు:—**పాషాణము, మైల తుత్థము, గంధకము, మణిశిల, నాభి, పొత్తి దుంప, గన్నేరువేళ్ళు, నల్లమందు మొదలగు ఖనిజములు, మూలికలు నితరవిషములు స్థావర విషము లనఁబడును.

**స్థాలీపాకము:—**వివాహములందు స్థాలీ= పాత్రియందు, పాకము=వండినది. స్థాలీపాకహోమ మునకై వండినవంట కీపేరు వర్తించును. అనగా వివాహములందుఁ జేయు పిత్రర్చనకై వండఁబడిన సామగ్రిలు (భోజ్యములు) భాండములందు వండక స్థాలీపాకముఁ జేయఁబడును.

**స్థాలీపులాకన్యాయము:—** అన్నము వండుచుండు గిన్నెయం దన్ని మెతుకులును పట్టి చూడనక్కరలేదు. ఒక్కమెతు కుడికినట్లు తెలిసిన నన్ని మంతయు నుడికినట్లే భావింపనగునని భావము. ఒక్కటింబట్టి యన్నిటిని గ్రహింపగల్గు పరిస్థితులం దీన్యాయము వర్తించును

స్నానమన సర్వసాధారణ ముగ జలములందు మునుంగుట లేక జలకము లాడుటయని తలంచుచుందురు. నిజమునఁ జక్కగ బరిశీలించిన స్నానములు పెక్కులు గాననయ్యెడిని. పెక్కుమతములందు, పుణ్యనదీతీర్థముల స్నానము

పవిత్రతను గల్గించునని తలంపఁబడుచున్నది. ఇది యేూష మతములం దధికబలవత్తరమై యున్నది. మహమ్మదీయులందు మక్కానగరమునందలి 'జెం జెం' బావియందలి జలములు పవిత్రవంతము లనియు,క్రైస్తవులందు జార్డనునదీజలములు పూత ములనియుఁ జెప్పఁబడుట సుప్రసిద్ధము. ఇటులనే యితరమతములందును గలదు.

పాశ్చాత్యవైద్యవిధానమున శరీరబలము చక్క గనున్నవారికి చన్నీళ్ళస్నాన మారోగ్యాభివృద్ధిం గల్గించునని చెప్పఁబడినది. మరియు నందే బలహీన మగు గుండెగలవారికి, శరీరమున రక్తస్రావము సరిగాలేనివారికి నుష్ణాదిశరీరదోషములు వాతరోగ ములు గలవారికిని యుష్ణోదకస్నాన మారోగ్య ప్రదముగఁ జెప్పఁబడినది. ఇంకను కొన్నిజబ్బు లందు Sponge bath విధింపఁబడిన జలస్నాన ము దేహపరిశుభ్రతకు మూలకారణముగఁ జెప్పఁ బడినది.

పాశ్చాత్యవైద్యవిద్యాధికులు పెక్కురోగముల కనేకస్నానములను విధింతురు. వీనికి medicinal baths అనిపేరు. Trukish bath అని యు, Vapour bath అనియు, Mud bath అనియు, Brine bath అనియు, Sulphur bath అనియు, ఇంక నెన్నెన్నియోరకముల స్నాన ములు వేర్వేరురోగములను పరిహరించునని కని పెట్టియున్నారు. వర్షమునందు స్నానమొనర్చుట శరీరసౌందర్యమును, కోమలతను పెంపొందంజేయు నని పరిశీలనలవలన తేలినది. చలిబాధలేనియెడ నున నిర్మలమగుగాలికి శరీరమంతయు బహిరంగ పరచి వాయుస్నానమొనర్చుటంగూర్చి వ్రాయుచు నొకసుప్రసిద్ధపాశ్చాత్య వైద్యవిద్యావిశారదుఁడు 'Fresh air is the skins natural Tonic' అని తెల్పియున్నాఁడు.

ఇటీవల పరిశోధనలవలన Sun bath ఎండంగ్రా గు టారోగ్యప్రదమని పాశ్చాత్యులెరిగిరి. సూర్య రశ్మి యనేకములగు రోగములజరమ్మును నిర్మూ లించునని పాశ్చాత్యవైద్యులనుట యందరెరింగి నదే. 'డాక్టరు ముత్తు' అనఁబరగు వైద్యవిద్యావి శారదుఁ డెండ యుబ్బసఁపుక్షయవ్యాధికి Tubercloises విరోధియని నుడివియున్నాఁడు. ఇట్టి యెండకు శరీరమును బహిరంగపర్చు Sun bath పరిస్థితు లాంధ్రులకు నైసర్గికముగ నలవాటునందే గలవు.

**స్నానాంగములు:**— ౧ సంకల్పము, ౨ మార్జనము, ౩ వరుణసూక్తము, ౪ అఘమ ర్షణము, ౫ స్నానాంగతర్పణము.

**స్పాంజోలజీ** (Spongology):—స్పాంజి అనఁబడు సముద్రఁపుఁబాచికి సంబంధించినవిద్య.

**స్పా** (Spa) Watering place:—ఇదిని బెల్జియముదేశమున నొకవాటరింగుప్లేసున కీపేరు వాడఁబడుచుండెను. అందు 'Salts of iron' ఉండెనట. వానిని 'Chaly beat springs' అనుచుండిరట. రానురా నీపేరు వాడుకలో నితర దేశములకుఁగూడ వ్యాపించినదందురు.

ఇంగ్లాండునందలి Challes (savoy) కడ నున్నట్టియు, Harro gate కడ నున్నట్టియు Sulphur springs ఫ్రాన్సుదేశములోని Aix-les bains కడనున్న Hot sulphur springs బవేరియాలోని కిస్సింజెన్ ఉప్పునూతులు మొదలగునట్టి watering places అన్నియు నిక్కాలమున స్పా లనఁబడుచునేయున్నవి. కొన్ని టినుండి జలములను సీసాలంబట్టి విక్రయించు చున్నారు. Vichy water, Apollynaris

water: Seltyer water, Carlsbad mineral waters మొదలగున విట్టివే.

**స్పాట్ గుడ్సు** (spot goods):—వాణిజ్యపరిభాషయందుఁ దక్షణమునవే delivery చేయ సిద్ధముగానున్న సరుకుల కీపేరు వర్తించును.

**స్పానియాదేశము:**—ఐరోపాఖండము నందు ఐబీరియన్ పెనిన్సులాలోని పెద్దదేశము. దీని నాంగ్లమున స్పానియాదేశ మందురు. వైశాల్యము ౧౯౫౦౦౦ చతురఁపుమైళ్ళుగాఁ జెప్పఁబడినది. దేశముయొక్క మధ్యప్రదేశము పీఠభూమి. ఇందు 'sierras' అనుపేరుగల పర్వతపఙ్క్తులు గలవు. ఫ్రాన్సుదేశస్థులచే పైరినీస్‌పర్వతపంక్తి యని చెప్పఁబడుచు నాయాదేశములకు హద్దుగానున్న పర్వతపంక్తి నీస్పానియాదేశస్థులు కంటాబ్రియను పర్వతములనియెదరు. దేశమందలి దక్షిణప్రదేశములును నాగ్నేయదిక్ప్రేమలును సారవంతమై ఫలవంతములగు బయళ్ళంగల్గియున్నవి. పీఠభూమి సముద్రఁపునీటిమట్టముపై రెండువేల యడుగుల యెత్తుగ నున్నది. ఇందుగుండా ౧ Castillan పంక్తి, ౨ Sierra tole do పంక్తి, ౩ Sierra morena పర్వతపంక్తి, ౪ Sierra Nevada పంక్తి యను నాల్గుపర్వతపంక్తులు కలవు. సిర్రానివేడాపర్వతములందే దేశమం దెక్కువయెత్తైన సిర్రానివేడాశిఖర మున్నది. దేశమునందు నాల్గు నదుల లోవలకు నిరుడైన లాపర్వతములైదు కలవని చెప్పఁబడినది. Douro నది, Tagus నది, Guadiana నది, Guadal quiver నది ముఖ్యములగు నదులు. ఇవియట్లాంటిక్కుమహాసముద్రమునను, Ebro నది దక్షిణవాహినియై మధ్యధరాసముద్రమునను గలియుచున్నది.

నదులు లోతులేనివి. వీటియం దనేకగండశిలలం గల్గినవి. వేసవికాలమున తగ్గిపోవునవి. అత్తరిజడలసబురుల కనర్హములుగ నుండును. స్పానియా మెరక దేశమని చెప్పఁదగును. మధ్యపీఠభూమియందు శీతోష్ణములు వాట్లకాలములం దధికములై యుండును.

ఉత్తరమువైపు సముద్రప్రాంతసీమల వర్షము లధికముగఁగురియును. మధ్యధరాసముద్రమువైపు సీమలు సమశీతోష్ణములంగల్గి సౌఖ్యప్రదములుగ నుండును. అప్పటప్పట సోలానోప్రచండవాయువు వీచి బాధంగల్గించుచుండును. (సోలానోచూడుఁడు.) స్పానియాదేశఁపు టాదిమనివాసులంగూర్చి సరిగాఁ దెలియదు. తరువాత నాసియాఖండము నుండి యీదేశమునకుఁ జేరి కాపురము కుదిరిన బస్క్వెస్ తెగవారి నాదిమనివాసు లనుచున్నారు. వీరు తక్కిన యిప్పటి స్పానియర్డ్సుతోఁ బోలికలేక యించుక భేదలక్షణములు గలవారు. అసలు స్పానియడ్సు ఐరోపాలోని యితరులనుండి భేదమగు తెగవారని చెప్పుటయుం గలదు. స్పానియాదేశవాసులు వినోదప్రియులు. నృత్యములం దారితేరినవారు. Bull fights వీరిదేశమున ముఖ్యవినోదములు. వీరికిఁ దలవెండ్రుకలు చాల నల్లగా నుండును. ఉత్తరదేశములప్రజలకన్న నించుక నల్లనిశరీరచ్ఛాయఁగల్గినవారు. (ఐబీరియా ద్వీపకల్పము చూడుఁడు). వీరికింబిదప గాల్సునుండి సెల్ట్సు తెగవారీదేశమునఁ గాపురముఁగుదిరిరి. దేశము కొంతకాలమున రోమనులపాలనయందును, 'విశిగోత్సు' అనువారిపాలనయందునను, దేశమందుఁ గొంతభాగము మూరుజాతిమహమ్మదీయపాలనమందుననునుండెను. ఒకప్పు డనేకచిన్నచిన్నరాష్ట్రములక్రింద విభజింపఁబడియుండెను. మూరులు దేశమునం దధికభాగము నేఁడువందలసంవత్సరము

లేలిరని చెప్పఁబడినది. మూర్సు క్రీ. వె. ౧౪౯౧ ఫెర్డినాండుభూపతి (ఇజబెల్లారాజ్ఞి) పాలనకాలమున దేశమునుండి తరిమివేయఁబడిరి. ఈజాతుల ప్రజలు కొద్దిగనో, గొప్పగనో యిప్పటి జనాభా యందుఁ గాననగుచున్నారు. భాషయు లాటిన్సంబంధమే యందురు.

దేశమున గిప్సెజాతివారు విస్తారముగనే కలరు. వీరిని 'గితానోస్' అనియు ననుచుందురు. వీరు గాన, నాట్యకళలయం దారితేరినవారు. వీరిభాష యందు హంగేరీభాషాపదములు కలసియుండును. (హంగేరీదేశము చూడుఁడు). తొల్లింట స్పానియాదేశమున వెండిగనులుండినవిగాని యిప్పు డంతరించినవి. రాగి, యినుము, సీసము, పాదరసము దొరకుచున్నగను లిప్పుడు కలవు. ఇవి విస్తారముగనే దొరకుచున్నవి. Almaden పాదరసఁపుగని సుప్రసిద్ధమైనది. వ్యవసాయ మించుక వెనుకఁబడినదని చెప్పఁబడినది. ఎక్కువభూమి గోగ్రాసమునకు వాడఁబడుచున్నది. తొల్లింటి మూరులనాటి నీటివసతులు చెడినవట. ఐనను గోధుమలధాన్యములు పండించుచున్నారు. ద్రాక్షతోఁటలు, ఆలివుతోఁటలు, నారింజతోఁటలు, నిమ్మతోఁటలు, విస్తారముగాఁ బెంచఁబడుచున్నవి. పట్టుపురుగులకై మల్బెరీవనము లపరిమితముగాఁ గలవు. xeres అనుతావునఁ జేయంబడు సారాయములు చాలశ్రేష్టములని యనుచుందురు. ఇది కెడిజ్ పురముకడ నున్నది. దీనికి షెర్రీ యనిపేరు. కార్కు (cork) చెట్లు, చెస్టునట్సుచెట్లు దేశమున నపరిమితముగాఁ గలవు. చెస్టునట్సు ముఖ్యభోజనపదార్థమని కొందఱనుచున్నారు. ప్రత్తిపంటయు, చెఱకుపంటయు విస్తారముగ పైరుచేయఁబడుచున్నది.

గుఱ్ఱములు, వేసడములు, గార్దభములు, స్పానియాదేశమున పెద్దజాతి వెక్కువ యుపయోగకరములుగ నున్నవి. మెరినో యనంబడు నొక జాతిగొఱ్ఱెలు యున్ని విస్తార మిచ్చుచున్నవి. పట్టుపని బాగుగ జరుగుచున్నది. దేశమున నేఁడు వేలమై ళ్ళినుపదారులు కలవు. ప్రజలు క్రైస్తవ మతస్థులు. ప్రభుత్వ మిటీవల రిపబ్లిక్కుగాఁ జేయఁబడినది.

మధ్యపీఠభూమియందున్న మాడ్రిడ్నగరము ప్రధాననగరము. ఇది టేగస్నదియొక్క శాఖానది యగు మంజానారీసునదిపై నున్నది. చాల గొప్ప పట్టణము. వర్తకస్థలము. ఇందు సుప్రసిద్ధచిత్రకలాప్రదర్శనశాల యొకటి కలదు. ఇచటికి వాయువ్యదిశగా నిరువదిమైళ్ళదూరమున తొల్లింటిరాజ నివాసమగు ప్రసాదము 'Escurial' అనునది కలదు. బార్సిలోనానగర మీశాన్యదిశగా సముద్రతీరమున గొప్పవర్తకస్థలమగు రేవు. ఇచటచేతిపను లధికము. ఆలికాంటుపురమును, మలాగాపురమును మధ్యధరాసముద్రతీరఁపు రేవుపట్టణములు. వలెన్సియాపురము పట్టుబట్టలనేతలకుఁ బ్రధాన స్థానము. కెడిజ్పురము [Cadiz] అట్లాంటిక్కు మహాసముద్రతీరమున రేవు. ఇచట చాల బలమైనదుర్గము కలదు. సివెల్లిపురము పొగాకు, నారింజపండ్లవర్తకమునకుఁ బేరందినది. అండలూశియాయందలి గువాడల్క్వివర్నదీతీరమున నున్న కార్డోవాపురము తొల్లింట మూరులరాజధాని. ఇట వారినాటిమశీ దిప్పుడు క్రైస్తవదేవాలయముగఁ జేయఁబడియున్నది. గొప్పభవనము. ఇది తోలుపనులకుఁ బేరందినపురము. పదియవశతాబ్దమున నిది గొప్పధనవంతము, విద్యావంతము నగు గొప్పనగరమై యుండెను. గ్రనడాపురము చాల సౌందర్యవంతమగు పట్టణము. మూరులకాలమున నిది ప్రధాననగరములలో నొకటియై యుండెను. ఈపరిసరములనే యరేబియన్నైట్సు కథలందుఁ బ్రసిద్ధమగు (అల్లాయుద్దీన్సంబంధమగు) అల్హాం

బారా దివ్యభవనము కలదు. [అల్హాంబారా చూడుఁడు].

టేగస్నదిపైనున్న టోలెడోపుర మొకప్పుడు రాజధానిగనుండినపురము. ఇచట కత్తులు, అలుగులు చాల పేరందినవి. సెలామాన్కాపురము విశ్వవిద్యాలయముండిన తావు. వల్లాడోలిడ్పురమును విశ్వవిద్యాలయముండిన తావు. కొరున్నాపురము, సంతందేర్పురము, బిల్బావోపురము, అట్లాంటిక్కు సముద్రతీరమున నొకపాటి రేవుపట్టణములు.

పెరోల్పురము ప్రభుత్వసౌకాస్థానమును, ఆర్సెనాలున్న తావును నైయున్నవి. ఇది కార్తేజినియనులు నిర్మించినది. దేశమున కడుపురాతన పట్టణము. స్పానియాదేశసంబంధమగునవి మజోర్కాద్వీపము, (పెద్దద్వీపము), మినోర్కాద్వీపము (చిన్నద్వీపము) నను రెండు నిందుఁజేరియేయున్నవి. ఇవి మధ్యధరాసముద్రమునందున్నవి. వీటికిఁ దొల్లింట బలియారిక్కు ద్వీపములని పేరుండెను. అనఁగా నొడిశెవిసరులద్వీపము లని యర్థము. ఇందలిప్రజ లావిద్యయందుఁ బేరందినవారు. ఇట సారాయము, పండ్లు విస్తారముగఁ దయారగుచున్నవి. వీటియందు పాల్మాపురము ప్రధానస్థానము. (జిబ్రాల్టరు చూడుఁడు).

## స్పానియాదేశము, ప్రభుత్వము

(Spain):— ఐరోపాఖండమునందలి ప్రజాప్రభుత్వదేశము. ఒకలక్షతొంబదినాల్గువేల చతురఁపుమైళ్ళ వైశాల్యమనియు, రెండుకోట్ల యిరువదియెన్మిదిలక్షల జనసంఖ్యయనియుఁ జెప్పఁబడినది. మాడ్రిడ్నగరము ప్రభుత్వప్రధానస్థానము.

## స్పానియాదేశఁపుఫారెన్పొజిషన్సు:—

తొల్లి మూఁడుశతాబ్దములకాల మించు మించు దక్షిణఅమెరికాయంతయు స్పానియాదేశమునకుఁ జెందియుండెను. దుష్పరిపాలనమున నొకటితర్వాత నొకటి ప్రజాప్రభుత్వములై పోవుచుండ కారోలినీస్ద్వీపములును, లాడ్రోనీసుద్వీపములును, జర్మనీవారి కమ్మివేయఁబడినవి. ౧౮౯౮ సంగరమున క్యూబా వదలిపోయెను. ఇప్పు డట్లాంటిక్కుమహాసముద్రమున కన్నరీద్వీపములును, దక్షిణఆఫ్రికా వాయువ్యదిశ నొకచిన్నరక్షకసంస్థానమును మాత్రము నిలచియున్నవి.

## స్పానియాదేశఁపుసామెతలు:—

అందరికి స్నేహితుఁడైనట్లు తిరిగేవాఁ డెవ్వరికీ మిత్రుఁడు గాఁడు.

అందరికి కావసినపనియం దెవ్వరికి శ్రద్ధయుండదు.

అందరినీ సంతసింపఁజేయుపని అంతాయింతా యనరానిది.

అనుమానమే లేనివాఁ డసలేయెరుఁగనివాఁడు.

అస్తమానం అరిచేపిల్లి ఎలుకలంబట్టేది కాదు.

ఆడతోఁడే లేంచేస్తే మగతోఁడేలు కదే సమాధానము.

ఎంతముస్తాబుచేసినా కోఁతికోఁతే.

ఒక్కకన్నమేగల యెలుక వేగం దొరకిపోతుంది.

కోడిపెట్ట యెక్కడనున్నా గుడ్లమీదనే దాని ధ్యానము.

గ్రుడ్డివానికన్న యేకాక్షి నయం.

చప్పుడుచేసే గుర్రఁపులాడముకు మరివకమేకు బిగించడమే మందు.

చెప్పడమునకు, చేయడమునకు చాలదూరము.

త్రాగడంప్రారంభమైతే ధర్మం ప్రయాణమౌతుంది.

తియ్యనిమాటలు కడకు కారముగా పరిణమిస్తవి.

దావాలపై వ్యామోహము, ధనవ్యయము, దండుగ.

దొంగకు కనిపించేవాళ్ళంతా రక్షకభటులే.
ధనము ధనమునే చేరుస్తుంది.
నీసోదరుఁడేయని నమ్మియుండి యేమరకు.
నీళ్ళలోనూనెవలె నిజం బయటికి తేలుతుంది.
నేరంచేసి దొరకినవాఁడు నెపం యెఱుఁగక పోతాఁడా?
పట్టబోయి పట్టుఁబడినట్లు.
పదిసార్లు స్థలంపిరాయించినచెట్టు కాయదు.
పిట్టచిన్నదైతే గూడూ చిన్నదే ఉండాలె.
పెద్దగంతు పెద్దపాటునకే.
ప్రేమగలవాఁడే పెద్దబోధకుఁడు.
పైకిలియ్యడమెగాని లోపలికివెయ్యడం లేకపోతే యొక్కనూతికిఁదప్ప తక్కినవన్నియు నడుగు బయలుపడవలసినవే.
బద్ధకించినపని పదిసార్లు తిరిగిచేయవలసివచ్చును.
బుద్ధిశాలియైనవాఁడు నాల్కలుచెప్పినట్లు చేయఁడు గాని, హృదయముచెప్పినట్లుచేయకమానఁడు.
బురదలోఁబడి పైకిరాలేనివాఁడు మరినలుగురుని దింప ప్రియత్నిస్తాఁడు.
మంచిబట్టతో మంచిదుసులు.
విననిచ్ఛగింపనివాని కన్న నెక్కువ చెవిటివా రుండరు.
వేలంలోకి వెళ్ళవద్దు వెళ్ళినా నోరు తెరువవలదు.
స్నేహంచెడితే కలువవచ్చునుగాని, అంతరంగము జాగ్రతగానే వుంటుంది.

**స్పానిష్ వెస్టాఫ్రికా:—** ఆఫ్రికాఖండమున పశ్చిమాఫ్రికాయందున్న స్పెయిన్‌దేశపు టెరిటరీ మొరాకోదేశఁపుహద్దుమొదలుకొని కేప్ బ్లాంకో అగ్రముదనుకఁ గల పశ్చిమసముద్రతీర ప్రాంతమును, దానినుండి దేశములోనికి సహరా యెడారివఱకుఁగల ప్రదేశమంతయు స్పానియాప్రభుత్వమువారి దందురు.

**స్పాన్ (span):—**
(వంతెనలు చూడుఁడు.)

**స్పారణాదిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**స్లాండర్సు (slanders):-** వాణిజ్యాః రిభాషయందు మాననష్టకరమని యర్థము. ఈసరకులు వీనివికావనుటకు 'slander of goods' అనియెదరు.

**స్లాబ్‌ఫౌండేషన్ (Slab foundation):—** (పునాది చూడుఁడు).

**స్యానయానిగోత్రము:—**
(పరాశరగణము చూడుఁడు.)

**స్యామేయగోత్రము:—**
(పరాశరగణము చూడుఁడు.)

**స్రాహతగోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు.)

**స్ట్రాన్షియము:—** క్షారలవణములను నీటం గరగించి బలమగు విద్యుత్ప్రవాహమునందు నెరపి భేదించుటచే బయల్పడిన ధాతువులలో నొకటి. పరిశీలకుఁడు సర్ హంఫ్రీ డేవీపండితుఁడు (హంఫ్రీడేవీపరిశీలకుఁడు చూడుఁడు). ఇది క్షార ధాతువు. పగఁడపురంగుఁగలది. ఎఱ్ఱమతాబాలలో దీనిని పాలుగఁ గల్పుచుందురు.

**స్వాంగం స్వవ్యవధాయకం నభవతీతిన్యాయము:—** తనస్వశరీరమే తనకడ్డ మెప్పుడునుకాదని భావము. తన స్వవాదము తనను ఖండింపదనుటయం దీన్యాయము వాడుదురు.

**స్వాతంత్ర్యము (Liberty):—** ఒకరి నిర్బంధములేక తను స్వేచ్ఛగావర్తించుటకుఁగల స్వాతంత్ర్యమున కాంగ్లమున liberty యందురు. రాజకీయవేత్తలు స్వాతంత్ర్యము నేడువిధము లందురు.

౧ Civil liberty— ఒకదేశస్థుఁడు తనస్వదేశమున నన్యులస్వాతంత్ర్యము నాక్రమించకుండను, చెడునట్లుబాధించకుండను, తనదేశఁపు ధర్మవిధులను దాటి నేరస్థుఁడుకాకుండను, దేశకాల పాత్రోచితయోగ్యతలను వీడకుండను తక్కినవాటియందు స్వతంత్రప్రవర్తనను గల్గియుండుట కే యాటంకమును లేకుండుటకు సివిల్ లిబరిటీ యనిపేరు.

౨ Moral liberty— శాఁజేశిన లేక చేయక మానిన కార్యములకు తానుబద్ధుఁడై యుండుటతో నన్యుల సమానబాధ్యతాయుతవర్తనపై దాడివెడలకుండ సత్ప్రవర్తనగల్గి వర్తించు స్వతంత్రముఁ గల్గియుండుట కేయాటంకమును లేకుండుటకు moral liberty యనిపేరు.

౩ National liberty— తమ చట్టములను తామేర్పఱచుకొనుటయు తమ కార్యనిర్వాహకోద్యోగులను తామే యేర్పఱచుకొనుచు నిర్వహించుకొనుచు నుండుటకు వలశినస్వాతంత్ర్యము నొకజాతిప్రజలు కల్గియుండుటకు నేషనల్ లిబరిటీ యనిపేరు.

౪ Natural liberty— అర్హస్థలములందుఁ జేయు ప్రతినైసర్గిక కార్యములను నిర్బంధము లేక నెరపుటకుగల స్వాతంత్ర్యమునకుఁ బేరు.

౫ Personal liberty— ఒకశిక్షవలన సంభవించినబాధగాక తన యిష్టానుసార మిష్టము వచ్చినతావులకరుగుటకు, తిరిగివచ్చుటకు గల స్వాతంత్ర్యమునకుఁ బేరు.

Political liberty— తా నేప్రభుత్వము నందు మనుచున్నాఁడో యాప్రభుత్వపరిపాలనా విధానములందు, కార్యములందు తాను Voice కల్గియుండుట, తనయభిప్రాయముల నన్యులకు వెల్లడించిరస్వాతంత్ర్యము కల్గియుండుట, ప్రజాప్రతినిధులుగ తనయిష్టమువచ్చినవారి నెన్నుకొన స్వతంత్రము గల్గియుండుట పొలిటికల్ లిబర్టీ యని చెప్పఁబడుచున్నది.

౬ Religious liberty— మతాభిప్రాయమునను, తనపూజావిధానమునను తనమత కార్యనిర్వహణమునను, అన్యమతమువారినినొప్పింపకను, బాధింపకను నుండుపద్ధతిమేరకు మతస్వాతంత్ర్యము గల్గియుండుటకుఁ బేరు.

౭ Commercial liberty— వర్తకవ్యాపారమున కనుకూలించునట్లు స్వదేశస్థులతోగాని విదేశములందలివారితోగాని వాణిజ్యమునడపుటకు నిర్బంధములు ఆటంకములేకుండు స్వాతంత్ర్యమునకుఁ బేరు.

ఇం కెగుమతి దిగుమతి సుంకములు నిర్ణయించుకొను ప్రభుత్వవిధానమునందు Voice కల్గియుండుట కీస్వతంత్రనామము వర్తించెడిని.

## స్వాతి లేక శ్వాతిగోత్రము:—

(పరాశరగణముఁ చూడుఁడు.)

## స్వాతిగోత్రము:—

(కుండినగణముఁ జూడుఁడు.)

## స్వాతివానకు ముత్యపుఁజిప్పలు ఎదురుచూచుచున్నట్లు:—

(ఆంధ్రలోకోక్తి.)

**స్వాతీనక్షత్రము:—** ఇది మాణిక్యఁపు రంగుతోఁగన్పించు నేకనక్షత్రము. దీని కింకను 'అనిలః, పవనః, మరుత్తు, వాయుః, సమీరణః' అను పర్యాయపదంబులు గలవు. దీనికి వాయు వధిదేవత. దేవగణనక్షత్రము. తిర్యఙ్ముఖము. స్త్రీ స్వభావము. గేదె, గరుడపక్షి, బొద్దిచెట్టును నక్షత్రసంబంధములనియు, ప్రవేశించినపదునాల్గు ఘడియలపై త్యాజ్యమనియు, ముప్పదియెన్మిదిఘడియలపై యమృతఁపుఘటికలనియు, చరస్వాభావ నక్షత్రమనియుఁ జెప్పఁబడినది. (త్యాజ్యమన విష ఘటికలని భావము). ఈస్వాతికార్తియందు సముద్రమున ముత్యఁపుఁజిప్పలందుఁబడిన చినుకులు ముత్యములగునని చెప్పంబడినది.

**స్వాధిష్ఠానచక్రము:—** యిఁ౯౮ ప్రముఁ జెప్పఁబడిన శరీరమందలి షట్చక్రములలో నొకటి. స్వాధిష్ఠానచక్రము. ఇది మర్మస్థానమందుండుననియు, రక్తవర్ణము నూర్ధ్వముఖముననిచెప్పఁబడినది. ఇట 'వం' అనునది బీజము. బ్రహ్మ దీని కధిపతి. ఇం దారుదళములును, వానిపై వరుసగ బ, భ, మ, య, ర, ల యను నా రక్షరములు దళమున కొక్కటిచొప్పున నుండుననియుఁ జెప్పఁబడినది. ఈచక్రమునందలి జపదినమున కారువేలు జరగుచుండునని చెప్పఁబడినది.

**స్వాపగోత్రము:-**
(నిధ్రువగణముఁ జూడుఁడు.)

**స్వాపశాన్తగోత్రము:**
(నిధ్రువగణముఁ జూడుఁడు.)

**స్వామిభృత్యన్యాయము:-** ఉద్యోగమిచ్చినయాతఁడును నుద్యోగియు, సేవఁజేయించుగొనునాతఁడును, శేవకుఁడును, నన్నమిడి రక్షించువాఁడును, నన్నముఁగొని రక్షణనందువాఁడును, మొదలగువారు స్వామి భృత్యు లనఁబడుదురు. అట్టివారి కన్యోన్యముగల సంబంధములనిభావము. అట్టివి వివరించుతరి నీన్యాయము నుపయోగించుచుందురు.

**స్వాయంభువ మనువు:—** ఈతని జ్యేష్ఠపుత్త్రినకు జంబూద్వీపమును స్వాయంభువొసంగెనని చెప్పఁబడినది. అతనిపే రగ్నీధ్రుఁడు. ఆతఁడు తన తొమ్మండుగురుపుత్త్రులకు జంబూద్వీపమును పంచియిచ్చెనట. అం దిప్పుడు భరతఖండమని చెప్పఁబడుచున్న భాగమును నాభియనిపేరుగల సుతున కిచ్చెనట. (నాభిమహారాజుఁ జూడుఁడు.)

**౧ స్వాయంభువు మనువు:-** తండ్రి బ్రహ్మ. తల్లి గాయత్రి. భార్య శతరూప. శివభక్తుడు. పుత్రులు ౧ ప్రియవ్రతుడు, ౨ ఉత్తానపాదుఁడు ననియును కుమార్తెలు సూతి (ఆకూతి), ప్రసూతి, దేవహూతి యనియును, మార్కండేయపురాణమునఁ జెప్పఁబడినది. ఇంకను అగ్నీధ్రుఁడు, అగ్నిబాహువు, రిప్వుఁడు, సవలుఁడు, జ్యోతిష్మన్తుఁడు, ద్యుతిమన్తుఁడు, హవ్యుఁడు, మేధావి, మేధాతిథి, వసువు ననువారలని యితర గ్రంథముల గానవచ్చెడిని. ఈతని మన్వంతరమున నింద్రత్వ మెవరు వహించిరో తెలియదు. ౧ మరీచి, ౨ అత్రి, 3 ఆంగీరసుఁడు, ౪ పులస్త్యుఁడు, ౫ పులహుఁడు, ౬ క్రతువు, ౭ వశిష్ఠుననువార లేర్వురు మహర్షులుగ నుండిరి. మాత్స్య పురాణమున నీచరిత్రము గాననగును. కార్తీక శుద్ధ యేకాదశి స్వాయంభువుమన్వాది.

**౨ స్వారోచిషమనువు:—** తండ్రి సరోచియను గంధర్వుఁడు. తల్లి గంధర్వియగు వరూధిని. గాన నీతఁడును గంధర్వుఁడు. భార్య

మనోరమ. విష్ణుభక్తుఁడు. కుమారులు నభుఁడు, నభస్యుఁడు, ప్రశ్రుతి, భావనుఁడు. ఈతని మన్వంతరమున విపశ్చితుఁడనువా డింద్రత్వము వహించెను. ౧ ఊర్జర్షి, ౨ స్తంభర్షి, ౩ ప్రాణర్షి, ౪ దత్తోళిర్షి, ౫ ఋషభర్షి, ౬ నీవారర్షి, ౭ అరివంతర్షి సప్తమహర్షులు.

## స్వానుమతి గోత్రము:—

(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

## సింకింగ్ఫండు (Sinking Fund):—

ఒకవ్యాపారసంస్థయందు, కొంతసొమ్మును వేరుతావున వృద్ధియగునటుల నిల్వయుంచి, దానియసలువృద్ధులం బెరుగనిచ్చి, ఏదేని యొక్కకార్యముం జేయుటకుఁగాని, ఒకఋణముం దీర్పనుగాని యుపయోగింతురు. దానికి 'సింకింగ్ఫండు' అనిపేరు. ఇంకను చక్కఁగ లాభించుచున్న మంచి కాలమున కొంతసొమ్ము నేర్పఱచి నిల్వచేసి, లాభించని కష్టకాలమున నుపయోగించుకొనుటకుఁగాను చేసిన యేర్పాటుమూల్యమును సైతమీపేరుననే వాడుచుందురు. ఇక్కాలమున నిది యార్థికశాస్త్రసంబంధపదముగా నున్నది. దీని నాదిని బ్రిటీషుదేశమునకుఁ దెచ్చినది విలియమ్ పిట్ గారు. ఇక్కాలమున ఋణములం దీర్చుసందర్భమున నిష్కర్షగ నేఁటేఁట నింతద్రవ్యము వడ్డికిందను, ఇంతద్రవ్య మసలుకిందను తీర్చుచుంట కేర్పాటుచేసుకొని యటుల వ్యయములుపోను మిగులుమూల్యమున కీపేరు వాడుచున్నారు.

## సింగన్నకవి:—

ఈతనింగూర్చి యేమియుం దెలియరాకున్నది. ఈతఁడు త్రైశంక్వోపాఖ్యానము రచించిన ట్లప్పకవీయమునం దున్నది. ఇంతకన్న నేపరికరములుగాని, యేగ్రంథముగాని గానరాకున్నది.

## సింగపూరు సెటిల్మెంటు:-

స్ట్రెయిటుసెటిల్మెంటులలో నొకటి (చూడుఁడు.)

## సింగాడిదుంపలు [నామదుంపలు]:-

లా. Rumex Aponogeton.

సింగాడిదుంపలను నామదుంప లనియు నందురు. దీనిదుంపలు, కాయలు, జఠరదీప్తి నిచ్చి వీర్యవృద్ధి గలిగించుననియు, మేహశాంతి, పైత్యశాంతి నొనర్చి, కఫము నడంచుననియుఁ జెప్పుదురు. తుంగముస్తలు దీనికిఁ బరిహారమందురు.

## సింగినాదము:—

ఇది సింగనాదమని (సింహనాదము) యుండఁదగినపదము. ఊది ధ్వని యొనర్చునట్టి పరికరము. ఊమనట్టి బాకా, సొన్నయి మొదలగువాట్లఁబోలి పెద్దదిగా నుండెడిని. రామానుజీయ వైష్ణవమతగురువు (జియ్యంగారు మొదలగువారు) లకు గౌరవసూచకముగ వారి రాకం దెల్పుటకు వాడఁబడుచున్నది. (ఈమాట యన్యుల వ్యర్థపదసంభాషణను నిరసింప వాడఁబడుచుండును.)

## సింగినాదము, జీలకఱ్ఱ:—

ఇది యేదేని కలతం గల్గించు ప్రసంగమున వెఱపుఁగల్గించు కబురు లెవ్వరేని చెప్పినచో నిర్భయమును సూచించుటకు ప్రత్యుత్తరముగ కిఁ జెప్పుచుందురు. దీనింగూర్చిన పూర్వగాథ యొకటి కలదు.

ఆదికాలమున నాంధ్రదేశమునకు వర్తకులుగ వచ్చిన మహమ్మదీయు లూరిబయట తమకార్వానాతో నిలిచి పెద్దయెనుముకొమ్ముల నూది ధ్వని యొనర్చువారఁట. దానిని విని గ్రామవాస్తు లటకుంజని కావలసినజీలకఱ్ఱ మొదలగు సరకులం గొనుచుండిరఁట. వర్తకులును తమదారింబట్టి ముందుగ్రామములకుం జనుచుండిరఁట.

అత్తరి దోపిడిగాండ్రును నల్లే యూరిబయట కొమ్ములనూది ధ్వనియొనర్చి, గ్రామములందలివ గవారిని బయటరారా బిలిచి, యిండ్లం జొరబడి దోచుకొనుట కారంభించిరట. ఇటుల శృంగినాధ మున నమ్మకము తప్పి, భీతిల్లినప్రజలకుఁ జూచి వచ్చినవారు శృంగినాదము జీలకఱ్ఱనమ్ము కొర్పా నావారిదని తెలుపుట జరగుచుండి, నానాఁటికి శృంగినాదము సింగినాదముగనై నిర్భయత నిర్ల క్ష్యముఁదెల్పు నుక్తిగనై నిలచియున్నది.

**సింగిల్‌టాక్సు మతము:**—ఇది రాజ కీయాభిప్రాయమతము. భూమిపై నొకపన్నుతప్ప వేర్వేఱుపన్నులు విధింపరాదను నభిప్రాయముతము. ఇది యమెరికాదేశమునఁ గొందఱకుఁ గలదు.

**సిండర్సు (Cinders):**— కాల్పఁబడిన రొయ్యి, బూడిద సాధారణముగ నగ్నిపర్వతరంధ్ర మునుండి పైకి వెడలఁగొట్టఁబడిన కాలిపోయిన మెతకబొగ్గును అనెదరు.

(Mountains చూడుఁడు.)

**సిండాక్షత్రియులు:**—

(క్షత్రియకులము చూడుఁడు.)

**సిండికేలిజమ్ (Syndicalism) ఫ్రెంచిభాషాజన్యము:**— సిండిక్ (Syndic) అనఁగా నొకప్రజాసంఘముచే నెన్నుకొనఁబడి బాధ్యత వహించినసభ్యుడు. ఏదేని యొకసాంఘిక వ్యవస్థను పరిపాలించుట కేర్పడినపాలకవర్గసభ లకు సంబంధించిన సిద్ధాంతము.

**సింతెటిక్ఇండిగో (Synthetic Indigo)**- కొన్నిపదార్థముల కూడికవలన తయారైన నీలి మందునకు 'Synthetic Indigo' అనిపేరు.

ఆయాపదార్థముల సంయోగముచేసి నీలిమం దు తయారుచేయు మార్గము లనేకములు కని పెట్టఁబడినవి. ఆమార్గము లన్నిటియందును 'ఫిన్ లిగ్లిసెన్ ఓ కార్బొక్సిలిక్' (Phenlglycine-o-Carboxylic) ఆసిడ్‌విధానమే శ్రేష్ఠమయినదని చాలఫాక్టరీలలో నామోదింపఁబడి జయప్రద ముగా నుపకరించుచున్నది. ఆవిధాన మీాదిగువ కుప పఱుపఁబడినది.

ఇందలి ప్రారంభవిధాన మేమన 'నెప్తలెన్' అనుపదార్థమునుండి సులభముగాను, చౌకగాను, నధికముగాను, సంగ్రహింపఁబడు 'అన్త్రానిలిక్ ఆసిడ్' [Anthranilic Acid] జాగ్రత్త పెట్ట వలయును. గంధకధృతి [Sulphuric acid] తో పాదరసము చేర్చి నెప్తలెను నుడికించి యం దునుండి 'దాలిక్ అంతిడ్రైడ్' అనుపదార్థమును సంగ్రహించి అమ్మోనియాతోఁ గలిపి యుడికిం చినయెడల దాల్మెయిడ్ [Phthlimide] అను రసాయనపదార్థము లభించును. దానిలో బ్లీచింగ్ పౌడరు (Bleeching powder) చేర్చినయెడల 'ఆత్రానిలిక్ ఆసిడ్' [Anthrani lic Acid] లభించును. ఈయాసిడ్‌లో క్లోరేసిటిక్ [Chloracetic Acid] ఆసిడ్ కలిపినయెడల పై నుద హరించిన ఫిన్‌లిగ్లిసెన్ ఓ కార్బోక్సిలిక్ ఆసిడ్ తయారగును. దీనిని ఆక్సిడైజ్ [Oxydise] చేసినచో ఇండోక్సిల్ [Indoxyl] అనుపదార్థ ము వచ్చును. దానిని నీటిలోఁ గలిపి ఆక్సిడైజ్ అగుటకు గాలిపంపు చేసినయెడల నీరకపు నీలి మందు లభించును.

**సింధవగోత్రము:**—

(భరద్వాజఉపగణము చూడుఁడు.)

**సింధంతాం పితరః:—** ఆంధ్రభాషా సాంప్రదాయార్థపదము. దుష్టుని దండించుటకు వాడుచుందురు.

## సింధిల్ శాఖక్షత్రియులు:—

(పురహరశాఖక్షత్రియులు చూడుఁడు.)

## సింధుగోత్రము:—

(భరద్వాజఉపగణము చూడుఁడు.)

**సింధుద్వీపుఁడు:—** ఇక్ష్వాకు సంతతి సూర్యవంశక్షత్రియుఁడు. కుమారుఁ డాయు తాయువు.

**సింధునదము:—** కాశ్మీరదేశపుఁబశ్చిమ ప్రాంతమున బ్రహ్మపుత్ర, శతధృ, గోగ్రా నదుల జన్మస్థానముల కనతిదూరమున నొక గ్లేసియరునం దుత్పన్నమై వాయవ్యదిశగాఁ బోలుతను, పిదప పశ్చిమమునకును బ్రవహించుచుఁ గొండలలోనే నడచుచు, 'షయో' కని స్వదేశస్థులచేఁ బిలువం బడునదిని గలుపుకొని బలపడును. షయోక్నది కారకోరమ్పర్వతముల దక్షిణభాగములనుండి వచ్చుచుండునది. పిదప నచిరకాలమున నేగి ల్గిట్నదిం జేర్చుకొని నైరుతిదిశకు మరలి పర్వతములం భేదించుకొనిన ట్లొక కనుమమార్గమున సమతలప్రదేశమునకుఁ జేరి పాంచాలముగుండా దక్షిణాభిముఖమై, వితస్థ (జీలమ్), శతధృ [సట్లెజ్], రవి [రావి], విపాశ [బీయాస్], చీనాబు లేక ఐరావతీ, నదులం జేర్చుకొని నైరుతిదిశకుఁ దిరిగి సింధుదేశముగుండా కరాచీనగరముకడనుండి యాగ్నేయముగనున్న దానిడెల్టాలగుండా ననేకపాయలై, పశ్చిమసముద్రమున సంగమించును. పొడ ౧౭౦౦ మైళ్ళు. ఇది 3౭౦౦౦౦ చౌకపు మైళ్ల ప్రదేశపువర్షముల నీటిం బ్రవహింపఁజేయుట చాల వెడలుపుఁగల్గి సముద్రమువలెనే యుండునది. సింధుదేశమున సుక్కూరుకడ దీని కడ్డముగ బారేజికట్టి నీటిని వ్యవసాయపుఁబొలముల కిచ్చు గొప్పపనులు కలవు. [లోయడ్బారేజిచూడుఁడు.] ఒకప్పు డీనదీశాఖ యొకటి రాన్ ఆఫ్ కచ్చి కి పోవుచుండెంగాని రెండువందల సంవత్సరముల నుండి యది భూమిఁ గలసిపోయినది.

**సింధుదేశపు ఓంమండలి:—** సింధుదేశమున కరాచీనగరము ప్రధానపురముగ నిటీవల బ్రిటీషుప్రభుత్వమువారు మార్చువఱకు హైదరాబాదుపురము ప్రధానమైనదిగా నుండెను. ఇప్పుడు దానిప్రాముఖ్యత కొంత తగ్గినను, వర్తకస్థానముగ నలరారుచున్నది. ఇట మునల్మానులును, 'సిందే' లనంబడు హిందువులు, వసించుచున్నారు. హిందువులను సర్వసాధారణముగ 'లోహను' లని యెదరు. వీరియందు 'అమిల' తెగవారు, భాయిబందా తెగవారు నను నిరుతెగలుగ నున్నారు. ఇరుతెగలవారును 'లోహను' లనంబడు సంఘముగ నుందురు. అమిలశాఖవా రుద్యోగులుగను, వృత్తిజీవనము లొనర్చువారుగను నుంట దేశమును వీడనివారగుట నమిలు లనంబడు నొకశాఖగ వేరైరి. భాయిబందు లర్హావయస్సు గలుగఁగనే విదేశముల కరిగి వర్తకమొనర్చి తిరుగ రెండుమూఁడేండ్లకొకసారిగ నిలుసేరి, రెండు లేక మూఁడుమాసము లాడుబిడ్డలకడం గడపి, తిరుగ వర్తకమునకై విదేశముల కరుగుచుందురు. ఈ రేడిదర్శనం దీపద్ధతి పరిపాటియై కులాచారమై నానాఁటికి స్థిరపడియున్నది. వీరి నాంగ్లులు 'సింధువర్కు మెర్చంట్సు' అనియెదరు. ఈతెగవారియందిక్కాలమున దాదాలేఖరాజుగా రనువా రధికధనవంతులు. భాయిబంధు తెగవారు. వృత్తిని విరమించుకొని సింధుహైదరాబాదుపురమున వసించు

చున్నారు. తమశాఖవారగు భాయిబంధువర్తకులు విదేశములకరిగి దీర్ఘకాల మిల్లుచేరని తరి యొంటిగనుండు వారిభార్యలు సంసారక్రియల కలవాటు చెడి వారు ఇలుచేరి రెండుమూఁడు మాసములో కేరీతిసి విధివిరామములేక భార్యలతో సంసారసాంగత్య మొనర్చుచుంట బాధకరముగ నుండియు, విధిలేక సహించుచుంటయు, దాదాలేఖరాజుగారెఱింగి 'ఓంమండలి' యను సంస్థను స్థాపించి, దానిపోషణకుఁ గొన్నిలక్షలధన మొసంగి నిర్వహించుచున్నారు.

ఇందు స్త్రీలే సభ్యురాండ్రు. వివాహమైనవారును, నవివాహితలును గూడఁ జేరనగును. వారు పురుషసంగమాదులను వర్జించి పరిశోధ్ధజీవనము సల్పుచు దైవచింతనతో నుండవలసి యుండును. వీరికూటములకు, సభలకు 'సత్సంగము' లని పేరు. ఓంమండలియుండు గృహమునకు 'ఓం నివాస' మని పేరు. ఇందు నూర్గురు భుజించుట కేర్పాటులు కలవు. కొందరిందే వసించుచుందురు. మరికొందరు సభ్యురాండ్రు తమతమ యిండ్లలో నుండుచు, సత్సంగముల (ఓంనివాసమున) కరుగుచుంటయుం గలదు. వీరిలో నగారిసనాధిపురాలు మొదలగు ప్రధానస్త్రీలకు తమపేరులకు ముందు 'ఓం' అని చేర్చుచున్నారు. వారిధర్మములందీయోంకారమున కాత్మజ్ఞాన మని పరిభాషార్థము.

ఇంక వీరు [హిందువుల] భక్తిమార్గమును గాని, కర్మమార్గమునుగాని విశ్వసింపరు. స్త్రీలు ప్రయత్నములవలన తమకుఁ దా మాత్మజ్ఞానులుగ నగుటయే గాక పురుషులంగూడ నాత్మజ్ఞానులుగఁ జేయుశక్తి (నధికముగ) గల్గియున్నారు. ఇక్కాలమున పురుషులు సర్వసాధారణముగ గృహకృత్యములసందర్భమున స్త్రీలకు వశులయి, భోగలాలసచిత్తులై యుంటయు, రాజకీయములందుఁ దగుల్కొనినవారు నిరర్థకకక్షలకు దాసులై వృథాజీవనము నధికారవాంఛలతోఁ గడపుచుంటయు, వ్యాపారములందుఁ దగుల్కొనినవారు ద్రవ్యార్జనపరాయణులై యుంటయు నెఱుంగఁదగిన రహస్యములందురు. స్త్రీ లటులఁగాక స్వప్రయత్నపూర్వకముగ పురుషసంగమాదుల మాని, ఆత్మజ్ఞాన మంది, పురుషులంగూడ నాత్మజ్ఞానులుగ నొనర్చి యుద్ధరింపఁ గల్గుదురని వీ రనెదరు. స్త్రీలకు స్వార్థరాహిత్యశక్తియు, బోధనాశక్తియు, మానవసేవాశక్తియు, నధికముగ నుండెడినని వీరితలంపు. దేవుఁ డనునది యెవ్వరికి వారియందే కలదని వీరిభావము. ఇటుల పురుషులం బూతులుగ నొనర్చుటకు స్త్రీల నుద్ధరించుట యవసరమని వీరి మతధర్మము.

వీరికి రామకృష్ణపరమహంసస్వామివారి, రామతీర్థస్వాములవారి యుపదేశధర్మములు మతధర్మములుగ నున్నవి. భగవద్గీతకు వీరికి వలయు ప్రత్యేకార్థములు వేరుగఁ గలవు. ఓంమండలిసభ్యురాం డ్రిండ్లయందు భర్తల కుపచారాదులు, పరిచర్యలు నొనర్పవచ్చునుగాని, సంగమాదుల కుపచరింపరాదు అని నియమ మేర్పడియున్నది. సత్సంగములకు సభ్యురాండ్రను రాకుండఁ జేసి ఓంమండలి నడఁచివేయుటకు భాయిబంధుశాఖపురుషు లీనడుమ బోధనాదులు, సత్యాగ్రహము నెరపిరి గాని యాగదయ్యెను. ఇటీవలఁ గొందఱు న్యాయస్థానములందు తమభార్యలు మొదలగువారిపై Restitution of Conjugal rights నర్థించుచు, వ్యాజ్యములంగూడ వైచిరనియు, కొన్నివ్యాజ్యములందు భర్తతో నివసించుచుండుటకు న్యాయస్థానమువారు తాత్కాలికపు టుత్తరువు లొసంగిరనియు విను చున్నారము.

దాదాలేఖరాజుగారికి భార్యాపిల్లలు గలరు. వారందఱు ఓంమండలివారే నట. వారికొమరిత నొకబీదవాని కిచ్చి పెండ్లిచేసియున్నారట. ఆయన యాత్మజ్ఞానియని దాదాగా రనిరట.

**సింధునది:—** కాశ్మీరదేశమందలి లడక్పర్వతములందు చిన్ననదియై సింధునది జన్మించి తనమార్గమును గోసి కొనుచు వాయువ్యముగ నడువనారంభించి కతిపయదూరముననే రెండు ప్రవాహములుగలసిన వేరుప్రవాహముం గలుపుకొని యదేదిశగఁ బ్రవహించుచుఁ గొండలనడుమ మడఁతయగు జోజిలామార్గమునఁబడి బల్తాల్ గ్రామముందాఁక చిన్నచిన్నప్రవాహములం గలుపుకొనుచుఁ గైలాసపర్వతపంక్తి యనంబడు పర్వతపంక్తినంటియే లడకుగుండా వాయువ్యదిశకే ప్రవహించుచు సోనామార్గపీఠముప్రక్కంబడి లడకునందలి లేపట్టణముప్రక్కంబడి కలూత్‌జాయి కర్తాక్షోపురములకడనుండి నడచి పర్వతపంక్తి దాఁటగనే యాపర్వతపంక్తి కవ్వలినుండి యేతెంచిన షియాకునది యిందుఁజేరెడిని. తోడనే సింధు కొంత పెద్దప్రవాహమై దనరెడిని. ఇంతదనుక నీనది ప్రవహించు మార్గమునఁ జక్కని పచ్చికబయళ్ళును, వింతవింతపూవులపొదలును దగులుంగాని మనుష్యనివాసము లంతగాఁ గానరాకుండును.

షియాకునదీసంగమమునుండి కొన్నివంకరలు తిరుగ మొదలిడినను యాదిసింధు వింకఁగొంత దూరము వాయువ్యదిశకే నడచుచుండును. పిదప స్కార్డోగ్రామమును జేరువఱ కొకనదీప్రవాహ ముత్తరమునుండి దొరలుచువచ్చి యిందుఁ జేరెడిని. పిదప రొండూరుపురముంగడచి కొంతదవ్వేగి నైరుతిదిక్కునకుఁ బ్రవాహ మత్తుఁ మరలి గిల్గిట్ (సైన్యస్థానము) నుండి యేతెంచెడి యొక పాటి పెద్దప్రవాహముం గలుపుకొని, బుంజీదరుము పురములప్రక్కంబడి కొన్నివంకరలుగ ప్రవహించుచుఁ బశ్చిమవాహినియై, కాశ్మీరదేశంపుఁ బశ్చిమసరిహద్దుంజేరి తోడనే దక్షిణములకు మరలి కొంతదూర మాహద్దుననే ప్రవహించితిరుగ నైరుతిదిశగాఁ బ్రవాహముమరలి బ్రిటిషిండియాలోని పశ్చిమోత్తర సరిహద్దుపరగణాలలోనికిం జొచ్చి తిరుగఁ గొన్నిజలప్రవాహములం గలుపుకొనుచు దక్షిణ వాహినియై, ఉదఖండముంగడచి యులక్పట్టణముంజేరి యట కుభా (కాబుల్) సువస్తు (స్వాత్) నదులు కలిసిన జలప్రవాహంపుఁ గాబూల్నదిం గల్పుకొని ముందునకు దక్షిణమునకే జనుచుఁ బాంచాలదేశమున నడచుచుండును.

ఇంక పంజాబునందు వితస్తా [జీలమ్] నది చంద్రభాగ [అశక్ని లేక యిప్పటిపేరు చీనాబ్] నదియందుఁజేరి దక్షిణమునకే జనుచుండును. అంతట శతద్రు [ఇప్పటి శెట్లెజ్] నదియు, విపాశా (ఇప్పటి బీయాస్) నదియు తమసవనముకడఁ గలసి యుభయజలము లేకమై నైరుతిదిశగా నడచుచుఁ బైఁజెప్పఁబడిన వితస్త, ఐరావతి, అశక్నినదులు కలసిన జలప్రవాహములం గలసి, యైదునదుల జలములు గలసిన ప్రవాహము దక్షిణవాహినియై కొంతదవ్వేగి సింధునదియందు సంగమించెడిని.

ఈయైదునదులు సింధునదియందుఁజేరుకొను వరకు సింధునది కాదిసింధువని పేరు. కలసిన పిదప సింధువని పేరున్నను, పంచనద మని ప్రబలమగువాడుకకు లోఁబడి నైరుతిదిశగాఁ బ్రవహించుచుండును, ఇక్కడికే సింధునది చాల వెడలుపు, లోతు గల్గి గంభీరమగునదియై గాన నయ్యెడిని.

ఇటుల ఆరోర్పురముదనుక పంచనదంబగుసింధునది జనువరకు తిరుగ వాడుకపేరు మారి 'మిహ్రాన్' అనంబడు సింధునదియై సుక్కూరు బుక్కూరులనడుమనుండి జనుచు తొల్లింటి శివిస్థానమును నిప్పటి సింధుహైదరాబాదుపురములను, పురాతనపాటలముంగడచి పలుశాఖలుగఁ జేరి 'మిహ్రాన్' అనంబడు సింధునది యరేబియా (బశ్చిమ) సముద్రమున సంగమించెడిని. ఇది సింధునదప్రవాహచరితము.

ఇంక మాళవదేశమున కాళీసింధునదికి దక్షిణ సింధునది యనియు, మహాభారతము వనపర్వము ౮౨ అధ్యాయమునఁ బ్రశంసింపఁ బడినది. మేఘసందేశము ౧ భాగము ౩౦ శ్లోకమున మహాకవి కాళిదాసు నుడివిన సింధునది యీకాళీసింధునదికే సరిపోవుచున్నది. మత్స్యపురాణము ౧౧౩ అధ్యాయమునను దీనిప్రశంస కలదు.

మఱియు మాళవదేశముననే రాజఘర్‌సంస్థానమున శిలోంజనుతావుకడ జన్మించి యుత్తరవాహినియై జలాన్పురముకడ యమునానదియందు సంగమించు నొకపాటినదికిని సింధునదియని పేరు కలదు. దీనిని పూర్వసింధువని మాలతీమాధవ నాటకమునఁ జతుర్థాంకమునను, నవమాంకమునను జెప్పఁబడినది. దీనింగూర్చిన ప్రశంస దేవీ పురాణము ౩౮ అధ్యాయమునఁ గలదు.

సింధువు నది కాదనియు, నద మనియుఁ జెప్పఁబడినది. సాధారణముగ సింధువనిన సముద్రమున కర్థము. ఇది గొప్పగంభీరనదమగుట సింధునామము తొల్లింటినుండియుం గల్గియుండనోవు. తొల్లింటి సింధుదేశ మాదిసింధువు నంటియే యుండెను.

## సింధునది బారేజి:—

[లోయడ్బారేజి చూడుఁడు.]

## సింధు లేక సైంధవదేశము:—

ఈపేరు గలదేశ ముండినదిగఁ దెలియుటకన్న దీనింగూర్చి యేమియుం దెలియకున్నది.

భారతప్రసిద్ధుఁడు సైంధవుఁ డీదేశసంబంధి యనియు, సైంధవలవణ మీదేశమున లభించినదె యనియుఁ దలంపఁబడుచున్నది. దీనికై న నకారణముగ నశ్వదగులువానిం గూర్చి 'సైంధవలద్దువలె' నని సామెతగా వల్కుచుందురు.

తొల్లింటికాలమున సింధుదేశమునకు 'అరోరనంబడుచున్న తావున రాజధానిపుర ముండినదట. అది సింధుదక్షిణభాగమున షికార్పూర్ జిల్లాయందు రోహ్రిపట్టణమున కాగ్నేయదిశగానైదు మైళ్ళదూరమున పల్లెగ్రామమై యున్నది. దీని పూర్వపుఁ బేరేమో తెలియరాదు. ఆనాఁటి కాళికాదేవీదేవస్థానమును జూపుచున్నారు. మహమ్మదీయాక్రాంతమైనపిదప షేక్పదుద్దీన్షా యనుపేరు గల భక్తునిగోరీ యాప్రాంతముల నేర్పడినది. ఆ మహాత్ముఁడు బుగ్గిని పంచదారగఁ జేసినవాఁడట.

## సింధువులు ౭ (సప్తసింధువులు):—

౧ ఐరావతి [రవి] రావినది, ౨ చంద్రభాగ (అశక్ని) చీనాబ్‌నది, ౩ వితస్థ (జ) జీలమ్‌నది, ౪ విపాశ- బీయాస్‌నది, ౫ శతధృ- శెట్లెజ్‌నది, ౬ సింధు-ఆదిసింధునది, ౭ సరస్వతి-కాబూల్‌నది, కుభానది.

ఆఱునదులు నాదిసింధువులోఁ గలిసి సింధు (ఇండస్‌నది)నది యగును. ఇందు మొదటియైదును బ్రవహించుటంజేసి పాంచాలదేశమని పేరుగల్గెను.

**సింప్లిఫైడ్ స్పెల్లింగ్ సొసైటీ (సంఘము)**:— ఇది బ్రిటీషుదేశమం దేర్పాటైన సంఘము. లండనునగరమున గ్రేటురుస్సెల్ వీధిని ౪౪ సంఖ్యగల గృహమున దీనికార్యాలయము స్థాపింపఁబడినది. ఈసంఘ మెప్పుడేర్పడినది సరిగాఁ దెలియదు. కాని ౧౯౦౫ నుండి దీనిపత్రికములు వెలువడుచున్నవి.

ఆంగ్లభాషాపదములకు వర్ణక్రమము, ఉచ్చారణమేరకు నిబద్ధము గాక కొన్ని యనవసరవర్ణములను గల్గియు, కొన్నివర్ణములకు రెండుమూఁడు రకముల యుచ్చారణలుండి యేదోయొక యుచ్చారణమునే యొక్కొకపదమందుఁ గల్గియుండుటయు మొదలగుచిక్కులం గల్గి, ప్రతిమాటకు సాంప్రదాయముగ వాడఁబడుచున్న వర్ణక్రమమును ప్రతివారును హృత్కవిలిగ నేర్వవలసి యుంట నీచిక్కుదొలఁగించి, యాంగ్లభాషాపదముల కుచ్చారణ ననుసరించియే వర్ణములు వ్రాయంబడునట్లు పనిచేసి, యట్టి విధానమును వ్యాపకమునకుం దెచ్చుట కీసంఘ మేర్పడినది.

ఇట్లొనర్చుటవలన భాషను నేర్చుకొనువారికి సౌకర్య మలవడ భాష విస్తారము వ్యాపించునని వీరియభిమతము. ౧౯౧౦ లో వీరి మొదటిపుస్తకము వెలువడినది. పిదప ౧౯౧౨ మొదలు ౧౯౧౭ మధ్య మఱికొన్ని వీరియేర్పాటులు మొదలగునవి వెలువడినవి. వీరిపద్ధతులమేరకు వీరిసంఘమునకు పేరును వీరు 'Simplified spelling society' అని వ్రాసెదరు.

**సింప్లన్ టన్నెలు** (Simplon tunnel):—ఇది ప్రపంచమందలి టన్నెలులలో నగ్రగణ్యము. దీనిగుండా యినుపబాట పోవును. స్విజర్లాండు దేశములోని వలాయిస్ కెంటనునుండి యిటలీలోని డోమోడోసోలా గ్రామము కరుగు బాట. పంద్రెండుమైళ్ల రెండుఫర్లాంగుల యెను బదిగజముల పొడవుగల గొప్పటన్నెలు. ఇందు పర్వతమునుండి తొలువంబడినది. ఇది వంకరలు లేక తిన్నగనున్నమార్గము. ఈటన్నెలుపైన నేఁడు వేలయడుగులయెత్తుగఁ గూడ నీపర్వత మున్నది. దీనియందు ఫారన్హీటు తెర్మామీటరు తొంబది డిగ్రీలకెంపరేచరు చూపునంతటివేఁడి యుండును. అనఁగా టన్నెలుబయటను, ఈప్రాంతదేశములందు మండువేసవియందు సైతము నీడ నంత టెంపరేచరుండుట గొప్పవేఁడిగనే పరిగణింపఁబడెడిని.

సగటున నీయినుపదారియందు loops, spirals అధికముగఁ గలవు. ఎత్తునెక్కుతఱి నుత్తరఁపుఁబ్రక్కను మూఁడు, దిగుతఱి దక్షిణఁపుఁబ్రక్కను నాల్గును టన్నెల్సు పెద్దవి తగిలెడిని. మొత్తమునచిన్నవి పెద్దవి యెనుబదిటన్నెల్సు (అందు ౨౭ న్నరమైళ్ళు) కలవు. వంతెనలు మున్నూటయిరువదినాలు గినుపబాటభాగమున లెక్కింపఁబడినవి.

ఉత్తరభాగమున నరణ్యముగుండా నడచుతఱి లూసరన్ సరస్సునందు సంగమించు రియూస్ నది నంటియే నీయినుపబాట నడచును. అట వింత గొలుపునటుల పామునడకంబోలి మెలికలం దిరుగుచు నడచి కడ కిటలీదేశములోని లోంబార్డీ సీమకుఁ జేరుకొని రోముదెస కరుగును.

**సింప్టొమేటొలజీ** (Simptomatology):— రోగియొక్క శరీరగుణములనుబట్టి రోగ నిదానముచేయు విధానము.

**సింబోలిజమ్ (Symbolism) ఫ్రెంచి భాషాజన్యము:—** మతసిద్ధాంతముల యొక్కయు, నేవేని యాచారములు, కర్మలు మొదలగువానియొక్కయు రహస్యజ్ఞానమును బరిశీలించు విధానము. ఇందు నిపుణుఁడగు వానిని 'సింబాలిష్టు' అందురు.

**సింహగోత్రము:—**
భృగుసంతతి - (ఆర్ష్టిషేణగణము చూడుఁడు.)

**సింహనందనతాళము:—**
[తాళములు చూడుఁడు.]

**సింహనాధతాళము:—**
(తాళములు చూడుఁడు.)

**సింహబలుఁడు:—** విరటాజు (మత్స్య దేశాధీశుఁడు). బావమఱఁది వీరు నూర్గురు సోదరులు. అందఱు కీచకు లనంబడువారు. విరటాజుభార్యయగు సుధేష్ణ వీరితోఁబుట్టువు.

పాండవులు విరటాజుకడ నజ్ఞాతవాసకాలముఁ గడపుచుండుతరి రంధ్రియని మాఱుపేరం బరఁగుచున్న ద్రౌపదిని సింహబలుఁడు మోహించి బలాత్కరింపఁజూచె ననియు, భీమసేనుండు వీరి నూర్గురుసోదరులం బరిమార్చెననియుఁ జెప్పఁబడినది.

**సింహముఖహస్తము:-**
(హస్తాభినయము చూడుఁడు, భరతశాస్త్రము చూడుఁడు.)

**సింహములు:—** సింహమునకు మృగరాజని బిరుదముఁ గలదు. తొల్లింట భరతదేశమున నుండెనట గాని యిప్పుడు నశించిపోయినవి. ఆఫ్రికాఖండమునఁ గొన్నిసీమలందుననుమఱి కొన్ని తావులను నిప్పుడు కానఁబడుచున్నవి.

తలమొదలు తోఁకకడవఱకుఁ దొమ్మిదడుగు లుండునందురు. సింహమునడుముచాల సన్నముగ నుండుంగాన నడుమున కుపమానముగఁ జెప్పిరి. సింహము క్రూరమృగమైనను, ఆకలిలేనితరి సాధువై యుండుటయు, దానికిం గలసినయాఁడుసింగము నొకేభార్యగఁ గల్గియుంటయు సుప్రసిద్ధములు. ముందువెన్కలం జూచుకొనుటయుందు నేర్పరి గాన ముందువెన్కల నంతయుం జక్కఁగఁ బరిశీలించుకొనుటకు 'సింహావలోకన' మని వాడుకఁగలదు. కత్తియవాడసీమయందుఁ గొన్నిసింహములను రక్షించి నిలిపియుంచు నరణ్యము లేర్పఱుపఁబడినవిగ వినుము. ఈతకు రెండు లేక మూఁడు పిల్లలను సింహము పెట్టుచుండును.

**సింహరాశి (అధిపతిసూర్యుఁడు):-** ఇది మఖానక్షత్రమునందలి ౧-౨-౩-౪ పాదములును, పుబ్బానక్షత్రమునందలి ౧-౨-౩-౪ పాదములును, ఉత్తరానక్షత్ర ప్రథమపాదమును కలసియైన తొమ్మిదిపాదములరాశి ప్రమాణము. ఘడియలు ౫-30 లేక గంటలు ౨. పండ్రెండు మినిట్లకాలము.

సింహము - క్రూరరాశి - స్థిరస్వభావరాశి - క్షత్రియవర్ణరాశి - పురుషస్వభావరాశి - ధూమ్రవర్ణము - అర్ధజలరాశి - ప్రాగ్దిగ్రాశి - శీర్షోదయరాశి - పగలు బలమధికము. కడుపు బలము - అని చెప్పఁబడినది.

సింహరాశి స్వక్షేత్రము రవికి. మూలత్రికోణమురవికి. ఉచ్చనీచ లెవ్వరికి గాదు. మిత్రక్షేత్రము, చంద్ర, కుజ, బుధ గురులకు శత్రుక్షేత్రము

శుక్ర శనులకు. సమక్షేత్రి మెవ్వరికిం గాదు. సింహము లగ్నమగుచో రవి లగ్నాధిపతియు, చంద్రుఁడు ద్వాదశస్థానాధిపతియు నగుదురు. కుజుఁడు చతుర్థనవమాధిపతిగను, బుధుఁడు ద్వితీయ, ఏకాదశస్థానములకును, గురుఁడు పంచమాష్టమస్థానములకును, శుక్రుఁడు తృతీయదశమస్థానములకును, శని షష్టమ సప్తమస్థానములకును నధిపతులై యుందురు.

**సింహలఘువు:—** సంగీతశాస్త్రమున జాతి (కల) ప్రాణమునందుఁ జెప్పఁబడిన దశలఘువులలో నొకటి. ఎన్మిదక్షరముల కాలము.

(జాతి (లయ) ప్రాణము చూడుఁడు.)

**సింహలద్వీపదేశము:—**

(లంకారాజ్యము చూడుఁడు.)

**సింహలద్వీపము [లంకారాజ్యము]:-** ఇది యాసియాఖండమునకుఁ జెందిన హిందూమహాసముద్రమున భరతదేశమునకు దక్షిణదిశగానున్న పెద్ద ము. నైసర్గికముగ నించుమించిది భూమిచేఁ గలసి యున్నది. మున్నొకప్పుడు పూర్తిగాఁ గలసియుండె నని తలంపఁబడుచున్నది. రెంటికి నడుమనున్న సముద్రమున నుత్తరమున రామేశ్వరద్వీపమును, దక్షిణమున మన్నారుద్వీపమును, రెంటికినడుమ హిందువులచే సేతువనియు, నన్యులచే 'ఏడమ్సుబ్రిడ్జి' యనియుఁ జెప్పఁబడు నిసుకగట్టును గలదు. దీనిని శ్రీరాముఁడు లంకపై దండయాత్రకేగ వేయించినదిగ శ్రీమద్రామాయణమునఁ జెప్పఁబడినది. ఇట హిందువులొక బాణము నర్పించి, శ్రీరాముం దలంచి, శ్రీరామసేతువుకడ స్నానము లొనర్తురు. భరతదేశమునకును, రామేశ్వరద్వీపమునకును నడుమఁగల జలసంధికి 'పాకునుజలసంధి' యనియు, మన్నారుద్వీపమునకును, సింహళమునకును నడుమనుండు జలసంధికి 'మన్నారు సంయుక్తాగ్రిగుడ' మనియుఁ జేర్లిడి యున్నారు. శ్రీరామసేతువగు నిసుకగట్టునకు 'ఏడమ్సుబ్రిడ్జి' యని పేరిడిరి. సింహళద్వీపము ౨౫,౩౦౦ చతురపుమైళ్ళ వైశాల్యముఁ గలది.

సముద్రతీరములును, ద్వీపమున నుత్తరార్థమును నించుకపల్లపుఁబ్రదేశములుగను, నడుమ కొండలమయమై మధ్యను పీఠభూములు, నరణ్యములు గలదిగను నున్నది. పీఠభూము లారువేలయడుగుల యెత్తువరకుంగూడ నున్నవికలవు. పెడ్రోతలగలా యను పర్వతశిఖరము ౮,౨౯౫ అడుగుల యెత్తు కలది. 'ఆడంమ్సుపీక్' అనంబడుచున్న శ్రీపాదశిఖరము ౭౩౫౨ అడుగులయెత్తు. దీనిపై శ్రీపాదమనంబడు పాదము నేలనానినట్టి చిహ్నము గలదు. దీనిని హిందువులు శివపాద మనియు, బౌద్ధులు బుద్ధపాద మనియు, మహమ్మదీయులు ఆదమ్‌పాద మనియు నీక్షేత్రమును గౌరవించుచుందురుగాని క్రైస్తవులు నిరసించుచుందురు. ఈక్షేత్రము బౌద్ధులహస్తగతమై యున్నది. మహావళీగంగ ద్వీపమున పెద్దనదియై యున్నది. ఇది ౧౫౦ మైళ్ళపొడవైనది. కలనీగంగ, కాలూగంగ, వలెవెగంగా యనుపేరుగలనదులు నించుమించు డెబ్బది లేక యెన్బదిమైళ్ళ పొడవున నుండును. మహావళీగంగ పుణ్యనదిగా నెంచఁబడుచున్నది. పెద్దయోడల నబురుల కెవ్వియు తగినలోతుగలవి కావు. ద్వీపముయొక్క యీశాన్యదిక్తీరములు కర్ణాటకసముద్రతీరములంబోలియు, నైఋతిదిగ్భాగతీరములు మళయాళపుఁదీరములం బోలియు, శీతోష్ణములం గలిగి యుండుననియు, నగటున దక్షిణహిందూదేశమంత వేఁడిగ నుండవనియుఁ జెప్పఁబడినది. కొండపై యెత్తగు ప్రదేశముల

చల్లఁగనుండును. శీతకాలమునం దొక్కొకప్పుడు నీరు ఘనీభవించుటయుం గలదు.

సింహాలము రత్నములగనులకుఁ బేరందినది. రత్నపురప్రాంతములందు గనులు సుప్రసిద్ధములు. సముద్రములందు ముత్యాలసలాపము కలదు. ప్లొంబగో (గ్రాపైటు పెన్సులు లోహము) గనులందు దొరకుచున్నది. ధాన్యము పైరగుచున్నది. కాపీతోఁటలు, తేయాకుతోఁటలు, రబ్బరుతోఁటలు, కొబ్బరితోఁటలు, పోఁకతోఁటలు, బింకోనాతోఁటలు, లవంగములతోఁటలు విస్తారము పెంచఁబడుచున్నవి. అడవులందు కలప విస్తారము లభించుచున్నది. శ్రీతాళ మనంబడు పెద్దదియు, వెడలుపునుగలయాకులతాటిచెట్లు విస్తారముకలవు. ఏనుఁగు లడవులందు దొరకును.

దేశమునం దాదిమనివాసులు రక్కసు లని శ్రీమద్రామాయణమునఁ జెప్పఁబడినది. ఇది త్రేతాయుగమునాఁటి సంగతిగ మహాకవి వాల్మీకి మహర్షి వ్రాసియున్నాఁడు. వారికి రావణభూపతి భూపతియని చెప్పఁబడినది. ఆయన రాజధానిలంకా పట్టణము. మగమగంగ, కతరగంగ, యనంబడు నదులముఖద్వారముల కెదురగ సముద్రమున మునింగియున్న శిలాతలములుగఁ జెప్పుచున్నారు. ఆ ప్రదేశముల నిప్పుడు 'గ్రేటుబేసిస్' అనుచున్నారు. రావణభూపతి శ్రీరామునిచే సంగరమున నిహతుం డాయెను. పిదప నాయనసోదరుండు లంకారాజ్యమేలెనని శ్రీమద్రామాయణమునఁ గలదు.

తరువాతచరిత్ర చాలా కాలమువరకుఁ దెలియదు. ఇప్పుడున్న ప్రజలలో నాదిమనివాసులు వెడ్డాజాతివారు. వారు కొండలందు వసింతురు. వెడ్డా లనిన వేఁడకాండ్రని యర్థమఁట. సింహళులు దక్షిణభాగములందునను, మధ్యప్రదేశములందునను, వసించుచున్నారు. అరవలు తొల్లింట దక్షిణహిందూదేశనివాసులు. వారు ద్వీపమున ముఖ్యముగా నుత్తరమునను తూర్పునను, తక్కువగా తక్కినభాగములను వసించుచున్నారు. మహమ్మదీయులగు మూరు లంతటను వసించుచు వర్తకులుగా నున్నారు. నాటుకోటిచెట్లు వర్తకులుగ నున్నారు. సింహళులు బౌద్ధులు. అరవలు, హిందువులు, మూరులు, మహమ్మదీయులు, హిందువులు, బౌద్ధులు నగుస్వదేశభూపతులు పెక్కండ్రు పాలించిరి. క్రీ. శ. ౧౫౧౮ పోర్చుగీసువారిహస్తగతమై ౧౬౫౬ లో డచ్చివారిపాలంబడి ౧౭౯౬ లో బ్రిటీషువారిహస్తగతమై క్రీ. శ. ౧౮౧౫ లో బ్రిటీషువారికాలనీగాఁ జేయఁబడి, యిప్పు డొకగవర్నరుపాలనయం దున్నది. ఇది తొమ్మిదిప్రోవిన్సులుగ విభజింపఁబడినది.

౧ పశ్చిమప్రోవిన్సు — ఇందు దేశమున ముఖ్యపట్టణమగు 'కొలంబో' నగరము కలదు. ఇది తేయాకు, కాఫిగింజలు, పోకచెక్కలు, నూనెలు, లవంగములు ఎగుమతిచేయు గొప్పరేవు. లక్షాయేబదివేల జనసంఖ్య. చైనాఆస్ట్రేలియా ఇంగ్లాండు, ఓడలిట నిలచును. ఇనుపదారులకు గూడలిస్థానము. నాగొంబోకలు తారాపురము లితరపట్టణములు.

౨ సబరగమూవాప్రోవిన్సు— ఇందు రత్నపురము ప్రధానస్థానము.

3 దక్షిణప్రోవిన్సు— గాలీపట్టణము ప్రధానస్థానము. ఇది రేవుపట్టణము. మతారాపురము వేరొక పట్టణము. రావణభూపతినాఁటి కోటి శివలింగములు దొండ్రాదగ్గర నున్నవి చూపుదురు.

४ తూర్పుపోవిన్సు— బట్టికాలోవా ప్రధాన పురము. త్ర్యంకోమలి రేవుపట్టణము. ఇది రావణభూపతినాఁటి త్ర్యయంకోమలి దేవస్థానమును పోర్చుగీసువారు పడఁగొట్టి హార్బరు నిర్మించిరఁట.

౫ ఉత్తరఁపుప్రోవిన్సు— ఇందు జాఫ్నాపురము ముఖ్యపట్టణము. (జాఫ్నాపురము)

౬ వాయవ్యఁపు ప్రోవిన్సు— ఇందు కురునేగాలా పురము ముఖ్యపట్టణము.

౭ మధ్యనున్న ప్రోవిన్సు— ఇందు కేండీపురము ముఖ్యపట్టణము. తొల్లింట నీప్రాంతదేశమునకు ఖండదేశ మనియు, దీనికి ఖండపుర మనియు పేరుండెను. ఇట బుద్ధభగవానుని నోటిపన్నొకటి దేవాలయమున, పూజింపంబడుచున్నది. బౌద్ధులయాత్రాస్థలమై యున్నది. నువారాఎలియాయనునది కొండలపై నున్న సమశీతోష్ణప్రదేశము. వేసవి నివాసస్థలము. (Saniteerium).

౮ ఉవా ప్రోవిన్సు— ఇందు బాదుల్లాపురము ముఖ్యపట్టణము.

౯ నార్తుసెంట్రల్ప్రోవిన్సు— అనూరాధపురము ముఖ్యపట్టణము. ప్రాచీనస్థలము. తొల్లింటి బౌద్ధరాజుల రాజధానిగ నుండెను. అశోకచక్రవర్తిసుతబోధివృక్షము కలదు. బౌద్ధుల యాత్రాస్థలముగ నున్నది.

లక్షద్వీపములు— మాల్దీవపములు, అత్తోల్ద్వీపములు, సింహాలప్రభుత్వమునకుం జెందినద్వీపములు. (ఆసియా చూడుఁడు).

సింహాలద్వీపపు సంవత్సరాదిపండుగ:—దీని నాద్వీపవాసులు తమదేశభాష యందు 'పునవర్ష' మనియెదరు. దీని నాచరించుటయందు హిందువులు,క్రైస్తవులుఁ గూడఁ బాల్గొనుచున్నారు. ఈపండుగ నాచరించుటయందు ద్వీపమంతటను సర్వసాధారణమే యైయున్నను ప్రాక్తీరమునందున్న బట్టికాలోవాపట్టణ మింద గ్రగణ్యమని చెప్పనగును. అఱువదిసంవత్సరముల క్రితమువఱకు నీపండుగ వారముదినములువఱకు నాచరింపఁబడుచుండెడిదట. ఈపండుగకు ముందు కొన్నిదినములుగఁ గుట్టుపనివాండ్రు, జోళ్ళుంగుట్టు పనివాండ్రు, బంగారునగలం జేయువాండ్రు, తాటియాకులతోఁగాని, పూన్‌గడ్డి (తుంగ) తోఁగాని చాపలు, జంగిడలు, పెట్టెలం జేయుపనివాండ్రు నితరపనిపాటులం జేయుపనివాండ్రు తీరికలేక (ఇవి విస్తారముగ నమ్ముడుఁబోవుంగాన) పనులం జేయుచుందురు. పాలకరములను పిండివంట లింటింటఁ జేయఁబడుట, పిండివిసరుటకుఁ జుట్టుపట్ల పల్లెల నుండి పట్టణములకుఁ గూలినాలులకై జను లరుదెంచుచుందురు. ఈపండుగయం దుపయోగింపఁబడుపిండివంటలకు మురుక్కు, తోడు, అరియతరేములు నని పేరు. అందుఁ గొన్ని కొబ్బరిపాలతోఁ బిండిగల్పి చేయుటయుం గలదు. ఇంకఁ గొన్నితావుల బ్రంథేరులు బిసకోత్తుల నుపయోగించుచున్నారు. పాలకరము లధికముగా వాడఁబడుచుండెడిని. పీట్లను బంచదారపాకమున ముంచెదరు. స్త్రీ లింద్రధనస్సునందలి యన్నిరంగుల చీరలం గట్టి తమకుఁగల నగలనన్నిటిం ధరించెదరు. క్రైస్తవులు చర్చి కరిగి ప్రార్థన లొనర్చి, క్రొత్తవత్సరముం దెచ్చితిమనెదరు. అర్ధరాత్రమునుండి యెల్లరు పటాసులం గాల్చెదరు. సంవత్సరాదినాటి యుదయకాలముననే సంగీతముం బాడువాండ్రు మద్దెల తాళములు, ఫిడేల్లు మొదలగువాట్లంగొని, యింటింటి కరిగి పాడనారంభింప వారికిఁ దాంబూలములో నేఁబదిసెంట్లు నిడి యిచ్చుచుందురు.

తోడనే డోలువాయించువాండ్రును విస్తారము ధ్వనింజేయుచు బయలుదేఱుదురు. వారికిఁ బిదప మహమ్మదీయఫకీరులు చిఱుడప్పుల వాయించుచుం బాడుచు వెడలుదురు. వారికింబిదప మొగ్గలను, గుస్తీలను, మల్లవిద్యల నొనర్చుకోడెకాండ్ర జట్లు బయలుదేరును. వీరి వెంటనంటియే జ్యోతిష్కులు మంచిదుస్తులం ధరించి క్రొత్త సంవత్సరఫలములం దెలుప నరుదెంచుదురు. పిదపఁ జాకళ్ళు, మంగళ్ళు, వెనుకటిసేవకులు, ఈనాములం గోరుచు నరుదెంచి నమస్కరించెదరు. వీరికిం దోడనే నిమ్మకాయం జేఁబూని పరిచయముఁగల వారరుదెంచెదరు. పిదపఁ బిచ్చమునకై ముష్టివాండ్రురుదెంచి యింటింట నాగుచుందురు. తరువాతఁ బాములవాండ్రు, కడకుఁ బగటివేషగాండ్రు నేతెంచి సంవత్సరాదిసందడులం జేయుచుందురు. పగటివేషముల ప్రదర్శననాటకముల కీనాములు బాగుగనే దొరకెడివి. పులివేషములుగూడ వీధుల వెంబడిఁ బోవుచుండెడివి. పోర్చుగీసు లష్కరుల వేషములు, పాటలు నడుమనడుమఁ గన్పించెడివి.

ఇంక గృహస్థులు మిత్రులకుటుంబముల కరటిపండ్లు, కొబ్బరికాయలు, పిండివంటలం బంచిపెట్టుదురు. విందులును జరుగును.

**సింహలద్వీపములోని కతార్గామా సుబ్రహ్మణ్యక్షేత్రము:—** (కతార్గామా చూడుఁడు. మాణిక్యగంగానదీతీరము)

**సింహలదేశపుశయన బౌద్ధవిగ్రహము:—** ఇది సింహలద్వీపమున పోలోన్నారువాయం దున్నది. నలుబదియాఱుగుల పొడవున నొకేనల్లరాతి చరియప్రక్కను దానినంటియుండు నటుల బుద్ధభగవానుఁడు పరుండి నిద్రించుచున్నటులఁ జెక్కఁబడినది. యాత్రాస్థలముగ బౌద్ధులు పాటించుచున్నారు.

**సింహలమున రావణునిచే నిర్బంధింపఁబడినతరి సీతాదేవి వసించినతావు:—** రామాయణమునందు సీతాదేవి రావణునిచే నపహృతయై లంకయందు నిర్బంధింపఁబడుటయు, నత్తరి నాంజనేయుం డామెను వెదకి శ్రీరామముద్రికం జూపి లంకాపురిం గాల్చి, యావార్త శ్రీరామున కెఱుకపఱచి యుద్ధమున కరిగినకథ సుప్రసిద్ధము. ఆమె వసించినతావిప్పుడు సీతాలియా యనంబరఁగుచున్నది. సింహలము నందలి నూవారాఎలియా యనంబడు తావునకు నాల్గుమైళ్ళ దూరమున సుప్రసిద్ధమగు హగల్లా యుద్యానవనము కలదచటికిం గతిపయదూరము ననే యొకపాటిగుట్టపై నొక సీతాదేవిదేవళమును, ఆప్రక్కనే యొక జలబుద్బుదమును గలవు. అందుండియే యొకచిన్నసెలయేరు క్రిందికిం బ్రవహించెడిని. అటనే సీతాదేవి వసించె నందురు. అటకే యాంజనేయుం డరిగి శ్రీరామముద్రిక నానవాలుం జూపెనట. అదియే సీతాలియా.

**సింహలీలతాళము:—**
(తాళములు చూడుఁడు).

**సింహవిక్రమతాళము:—**
(తాళములు చూడుఁడు).

**సింహవిక్రీడితతాళము:—**
(తాళములు చూడుఁడు).

**సింహళులు [దమ్మిళులు]:—** క్రీస్తుమునుపు ౫౪౩ సంవత్సరములనాఁడు బుద్ధభగవానుని నిర్వాణవత్సరముననే భరతదేశము నందలి గంగానదీతీరమునుండి యొక సంస్థానపు రాకొమ

రుఁడు విజయుం డనుపేరుగలవాఁడు తండ్రితోఁ గలహించి కొంద ఱాప్తబాంధవులు వెంటరా ననూరాధుం డను పేరుగల మంత్రిసుతుండగు చెలికాఁడును, బలమగు సైన్యమును నడిపించుచుఁ దోడనుండ విశేషధనముతో నిలువెడలి సింహల ద్వీపమునం జేరెనట. ఆతనితోఁ బాండువాసుదేవుం డను మేనల్లుం డొకఁడును, వేఱొకయనూరాధుం డనునాతనితండ్రియుఁ (బావమఱఁది) గూడ నుండిరట. విజయునితల్లిపేరు పుష్పాదేవి యనియు, నామె వంగదేశపు భూపతిసుత యనియు, మాత్రముఁ జెప్పఁబడినది గాని యితరసంగతు లెవ్వియుం దెలియరాకున్నవి. విజయుండు సింహలమున నొక వెడ్డా (లేక యాఖ్కో) జాతి సామంత భూపతిసుతం బరిణయమాయెనని చెప్పఁబడుటయె గాని, యామెవలన సంతానము గలుగలేదఁట. వీరి ననూయతగా నితరవెడ్డాజాతిప్రముఖులు విరోధభావముననే బాధింపసాఁగిరటఁ గాని యాదరింపలేదట. విజయుండును జేయునదిలేక యొకరితరువాతనొకరుగ వెడ్డాలం దునుమాడుచుఁ దరుమ మొదలిడెనఁట. వా రాతనిబలపరాక్రముల కెదుట నిలువంజాలక పర్వతములలోనికిం బాఱిపోయి నిలచి పగఁబూనియుండిరట.

విజయుఁడు సింహలమున నోడఁదిగుట యిప్పటి పుత్తాలముకడనని కొందరును, యిప్పటి త్రికోమలి రేవున నని కొందరును బరిశీలకు లనుచున్నారు. ఆయనకుఁ బిదప మేనల్లుఁడును (పాండువాసుదేవుఁడు), నాయనకుం బిదప నతని సుతుండగు పాండుకాభయుండును, సింహాసనమెక్కి రట. పాండుకాభయునికాలముననే యనూరాధపురము (క్రీ. పూ. ౪౩౭ — ౩౬౭ నడుమ) నిర్మింపఁబడినదట. అంతదనుక వీరిరాజధాని యిప్పుడు యనూరాధపురంపుఁబొడున కుత్తరముగా నిరువది మైళ్ళదూరమున మాల్వతు ఓయానదితీరమం దని చెప్పఁబడుటయేగాని, యాతావు మాసిపోయి యానవాళ్లే తెలియుటలేదు. దానిపేరు 'ఉపతిస్సాగామ' యనియుండె నఁట.

పాండూకాభయున్నపతికడ విజయునితో నరుదెంచిన మంత్రికుమారుఁ డనూరాధుం డింతదనుక రాజ్యనిర్మాణ మొనర్చి నడపుచు మంత్రిపదవియందె వృద్ధుండయ్యె నుండెనట. ఇంకను విజయునిబావమఱఁది యగు ననూరాధుఁడు జీవించి యుండినతరి నుపతిస్సాగామకు బదులు వేఱొక రాజధానిపురము బలమగుదుర్గముతో సహా నిర్మింపఁ బ్రోత్సహించుచుండెనఁట. ఇప్పటికిఁ బ్రయత్నములు పూర్తియై పరిస్థితు లనుకూలింప రాజధానీనగరనిర్మాణమున కనూరాధానక్షత్రముననే కుదిరెనఁట. అత్తరి నావృద్ధమంత్రిపేరిట నీనవీన పురమున 'కనూరాధపుర' మని పేరిడ భూపతి యాజ్ఞనొసంగెనట. ఈనూతనరాజధాని యనూరాధపురము. పిదప పదునేనువందలసంవత్సరముల దనుక నఁగా క్రీ. వె. ౧౧౦౦ సంవత్సరము దనుక రాజధానియై వైభవగౌరవముల నందుచుండెనఁట. సగటున సింహళులు ౧౬౫ గురు ప్రభువులు సింహలద్వీపలంకారాజ్యమును క్రీ. పూ. ౫౦౦ మొదలు, క్రీ. వె. ౩౦౦ వఱకు నఁగా నెన్మిదివందల సంవత్సరములు పాలించియుండిరి. వారిలాంఛనమగు బావుటా (జండాపై) సింహము గుర్తుగ నుండెను. ఇది ప్రథముండగు విజయుని నాఁటినుండియు నొకేవిధముగ నుండినదిగాననే వీరినెల్లరు 'సింహలు' లని వాడుచుండిరి. ఆపేరే వారికి నేఁటికిని గల్గియుండినది. ఇంతియేగాక వారి నుండియే వారిపాలనయందుండిన లంకారాజ్యము సింహలరాజ్యమని పేరంది నేఁటికి సైతమాలంకా

ద్వీప మంతయుఁ గూడ సింహాలద్వీపమని వాడఁబడుచున్నది.

సింహాలులంగూర్చి మన కెఱింగించు చరిత్రగ్రంథములలోఁ బ్రధానమైనది 'మహావంశ' మను బౌద్ధమతగ్రంథ మొకటి. ఇందు వీరిది 'మహావంశ' మనియు, వీరిపై దాడివెడలుచు సింహాలమునకుంజేరి యట కాపురము కుదురుచుండిన వీరి వైరులగు నఱవలది 'సుళువంశ' మనియుఁ జెప్పఁబడియున్నది. వీరియందు, చోళులు, పాండ్యులు, కొంగుదేశఁపుటఱవలుఁ గూడఁ జేరియున్నవారు. మహావంశము ౫౩ శతాబ్దమున గ్రంథముగనున్నది. అత్యుక్తు లిందు నిండియున్నవని కొందఱు పరిశీలకు లనెదరు గాని, శిలాశాసనములు, త్రొల్లింటియానవాళ్లు, నాణెఁపురూకలు, మహావంశఁపుఁ గథనమును, నిజమేయని ధ్రువపఱచుచునే యున్నవి. ఆగ్రంథమునందే వెడ్డాజాతివారిని లోంగఁదీసి వశపఱచుకొనుటకు రెండువందల సంవత్సరములు మహావంశమువారగు సింహాళులకుం బట్టెనని చెప్పఁబడిన సంగతులనుండి తేలుచున్నది. ఈసింహాల దమ్మిళకలహము లుభయుల బలమును తగ్గించి పోర్చుగీసు, డచ్చివారలకు రాజ్యమును వశపఱచెను.

ఇంక నీసింహాళులంగూర్చి తెలియఁ దగినసంగతి యొక్కటి కలదు. వీ రీలంకారాజ్యద్వీపమునకుఁ జేరినపిదపఁ గూడ క్రీస్తునుపు ౨౪౪ సంవత్సరముదనుక భరతదేశఁపు టార్ష మతస్థులుగనే యుండిరఁట. అప్పుడీ తిస్సా (త్రిభువనాశ్రియ) మహాపాలుఁడు ప్రభువుగ నుండెనఁట. అప్పుడు భరతభూమినుండి యశోకచక్రవర్తి తనయుండగు మహిందో (మహేంద్రుఁడు) తండ్రికిఁ బిదప సామ్రాజ్యసింహాసన మొల్లక బౌద్ధభిక్షువుగనై మతబోధ లొనర్చుచు సింహాలమునకు శిష్యజనసహితుఁడై యరుదెంచి, మిస్సా (ఇప్పటి మహితల్) కొండచరియలపై విశ్రమించియుండ, నటకు వేఁట కరుదెంచిన తిస్సామహీపాలుంగాంచి, పిలిచి, రావించి, తనశక్తిపాతవశమున బుద్ధబోధల నెఱపి, వశపఱచుకొని బౌద్ధునిగా నొనర్చెనట. నాఁడాదిగ పెక్కండ్రు బుద్ధులగుచుఁ గడకు సింహాలు లందరు బౌద్ధులుగనైరి. (మహింతల్ చూడుఁడు). తిస్సామహీపాలుండు గొప్ప బౌద్ధమతభక్తుండగుట ప్రజ లాయనను దేవనాహింపియా (దేవానాం ప్రియ) తిస్సామహాపాలుఁ డని యాయనను వాడుచుండిరఁట.

**సింహాచలక్షేత్రము:—** విశాఖపట్టణమునుండి పదిమైళ్ళదూరమున సింహగిరి లేక సింహాచల మనఁబడినకొండపై సగముదూరమున నొకమడతలోనున్న దేవస్థానము. సముద్రఁపునీటిమట్టముపై ౮౦౦ అడుగులయెత్తుననున్న తావు. దేవుని వరాహలక్ష్మీనృసింహస్వామి యనియు, వరాహనృసింహస్వామియనియు నందురు. పామరులు సింహాద్రి అప్పన్న యనెదరు. ఈప్రాంతసీమలందలి అప్పయ్య, అప్పారావు, అప్పన్న, అప్పలనర్సయ్య మొదలగుపేరు లన్నియు నీదేవస్థానసంబంధములే. ఈదేవస్థానము సుప్రసిద్ధమై ధనవంతమై దనరెడిని. యాత్రస్థు లనుదిన మేతెంచుచునే యుందురు. ఉత్సవసమయముల నధికముగ వత్తురు. నాటుబండ్లపై నూరుమైళ్ళదూరమునుండి కూడ వచ్చుచుందురని విందుము.

కొండదిగువను 'అడివివర' మనుగ్రామము కలదు. అది దేవస్థానమునకుఁ జెందినగ్రామమే. అటనే దేవస్థానఁపుటుద్యోగులు, నౌకర్లు వసించుచుందురు. కొండపై నించుకమన్యఁపులక్షణములు కలవని ప్రతితి కలదు. కొండలనెక్కుటకుఁ బదు

నొకండువందల సోపానములు కలవు. కొండపై జలపాతము కలదు. అది స్నానతీర్థముగ 'గంగధార' యనుపేరం బరఁగుచున్నది. దానిజలములవలన కొండప్రక్కలను క్రిందను పెక్కుతోఁటలు ఫలవంతములై వర్ధిల్లుచున్నవి. చక్కనిగులాబీతోఁట యొకటి కలదు. పూవులనుండి ఫలములనుండి దేవస్థానమునకు మంచిరాఁబడి కలదట. తొల్లి దేవాలయముంజుట్టి కోటయుండెనట. ఇప్పు డాన వాళ్ళు మాత్రము గానన గును. దేవాలయము మంచిపనితనము గలది. శ్రీకృష్ణరాయ సార్వభౌముం డిట నొకజయస్తంభము వేయించి శాసనము చెక్కించెను. అల్లసాని పెద్దనామాత్యుఁడుతన చాటుధారయందు 'సంపతినరపాలసార్వభౌముఁడు వచ్చి సింహాద్రి జయశిలఁ జేర్చినాఁడు' అని చెప్పిన దీసింహాచలమే. ఈశాసనము క్రీ. వె. ౧౫౧౬ సంవత్సరపుది. ఇంక ననేకశాసనములు కలవుగాని యంతప్రాముఖ్యమైనవి కావు. దేవస్థానమునకు మంచిభూస్థితియు, రాబడియుఁ గలదందురు. ఇంక నీదేవస్థానమునకుం జెందిన మాధవధార యనంబడు వేరుధారయు, అట మాధవస్వామి దేవస్థానమును గ్రామము, తోఁటలును గలవు. (విశాఖపట్టణముజిల్లా చూడుఁడు.)

తొల్లింట నిది శివక్షేత్రమైయుండి రామానుజులవారినాడు విష్ణుక్షేత్రమైనదని ప్రతీతికలదు. ఎక్కుమార్గమున ధారలు, జలపాతములు గలవు. గొప్పవిష్ణుక్షేత్రమైయున్నది. విజయనగర సంస్థానమువారి పరిపాలనయం దున్నది. దీని రాబడినుండి యొకగొప్ప సంస్కృతపాఠశాల నడుపుచున్నారు.

**సింహాద్రివేంకటాచార్యకవి:**— ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ జేర్పంబడినవాఁడు. శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. గౌతమసగోత్రుఁడు. తండ్రిపేరు తిరుమలాచార్యులు. పితామహుఁడు కేశవాచార్యులు. ఈతనినివాసము సరిగాఁ దెలియదు. ఇతనిగ్రంథములయం దేమియుఁ జెప్పఁబడలేదు. కాని యీతనికిష్టదైవము భద్రాచల రామస్వామి యైయుంట వారు గోదావరీమండలవాసియే యని రా. బ. కం. వీరేశలింగంపంతులు వారు సంశయాభిప్రాయమును వెల్లడించిరి. ఇది వారిస్వదేశాభిమాన పురస్సరమై యుండనోపు. ఆధారములు గాన్పింపవు. క్రీ. వె. ౧౬౩౦ ౧౬౪౦ ప్రాంతమునందుండినవాఁడఁట.

ఈకవి రచించినది లక్షణాపరిణయ మనఁబడిన చమత్కారమంజరి. దీనిని రామానుజజగద్దేశికున కంకితమరించెను.

**సింహాప్రభువు:**— ఈమహోదయుని సిన్హాప్రభువని వాడుటయుం గలదు. తొల్లింటి పేరు బాబు సత్యేంద్రప్రసన్నసింహా. పిదప సర్ సత్యేంద్రప్రసన్నసింహా యయి కడకు 'లార్డు సింహా ఆఫ్ రాయపూర్' అనంబడినవాఁడు.

బంగాళారాజ్యములోని వీరభూమి (బీర్భూమ్) మండలములోని రాయపూర్ గ్రామమున సీతాకాంతసింహాయనంబడు జమీందారునకు నాల్గవ సుతుఁడుగ కాయస్థక్షత్రియకుటుంబమున క్రీ. వె. ౧౮౬౪ సంవత్సరము మార్చి ౨౪ తేదిని జన్మించిరి. వీరు భూస్వాములు, జమీందారులు. వీరి రెండవసంవత్సరమున తండ్రిగారు స్వర్గస్థులైరి గాన తల్లిగారు, జ్యేష్ఠసోదరుఁడు వీరిం బెంచి పెద్దజేసిరి.

వీరి జ్యేష్ఠసోదరుఁడు బాబూ రామప్రసన్న సింహాగారు బీర్భంజిల్లాకోర్టులో ప్రభుత్వపు న్యాయవాదిగ నుండెను. రెండవసోదరుఁడు తమ జమీందారీవ్యవహారములం జక్కబఱచుకొనుచుం

ము వాఁడు. మూఁడవసోదరుండగు బాబు N. P. సింహాగారును, నాల్గవసోదరుఁడగు సత్యేంద్ర ప్రసన్నసింహాగారును గలసి తండ్రి నిల్వయుంచిన పదివేలరూప్యములం గైకొని యింగ్లాండున కేగి విద్యాభ్యాస మొనర్చిరి. మూఁడవవారు మేజర్ N. P. సింహా ఐ. ఎమ్. ఎస్ పరీక్షను జదివి, జిల్లాసర్జనుపదవి నందెను. నాల్గవవాఁడగు మన సత్యేంద్రుఁడు బారిష్టరుపరీక్షకుం జదివి, లింకన్సు ఇన్ నకుంజేరిన న్యాయవాదియై కలకత్తా హైకోర్టు నందు క్రీ. వె. ౧౮౮౬ సం॥ నవంబరులో వృత్తి ధర్మము నవలంబించెను.

వీరివిద్య బాల్యమున రాయపూరుబడియందు నను, పిదప బీర్భమ్ పాఠశాలయందు మెట్రిక్యులేషను పరీక్షయు, ఎఫ్. ఏ. పరీక్ష కలకత్తాప్రెసిడెన్సీ కళాశాలయందునను నడచెను. వీరికి ౧౮౮౦ సం॥ర మొకజమీందారుగారి పుత్రిక వివాహముచేయఁబడెను. ఇంగ్లాండునందుఁ జదివిన బారిస్టరుపరీక్షయందు వీరికింగల లాటిన్ భాషా ప్రావీణ్యత రోమన్ లాయందు నిపుణులుగా నొనర్చె నఁట. వీరితెల్వితేటకు మెచ్చి యింగ్లాండులోఁ జదువుచున్నప్పు డయిదువందలపౌనుల విద్యార్థి వేతనము వీరి కీయఁబడెనఁట.

సింహాగారు కలకత్తాహైకోర్టునందు న్యాయవాదిగఁ బ్రవేశించిన యెన్మిదేండ్లకు ననఁగా ౧౮౯౪ నుండి మంచిరాబడి ప్రారంభమై ౧౯౦౬ సంవత్సరమున ప్రభుత్వన్యాయవాదియై, ౧౯౦౮ ఖాయమగు నడ్వొకేటుజనరల్ పదవి లభించెను. భరతదేశమున మొదటి యడ్వకేటుజనరలయిన భారతీయుఁ డీసింహాగారే. కాని వీరు చాలకాల మటనుండలేదు. అచిరకాలముననే వైస్‌రాయి గారియాలోచనసభయందు లామెంబరుగా వీరిం గైకొనిరి. అందొక సంవత్సర మాఱుమాసముల కాల ముండి, దానికి క్రీ. వె. ౧౯౧౦ లో రాజీనామా నిచ్చిరి. ఈపదవియందునను ప్రథమభారతీయుఁ డీసింహాగారే.

సింహాగారు క్రీ. వె. ౧౯౧౫ డిశంబరు ౨౭ తేదీని బొంబాయందుజరగిన దేశీయమహాజన సభ కధ్యక్షతవహించిరి. క్రీ. వె. ౧౯౧౬ లో తిరిగి కలకత్తాహైకోర్టునం దడ్వకేటుజనరల్ పదవినంది, ఆసంవత్సరమే సెప్టెంబరు ౨౦ తేదీని బంగాళా గవర్నరుగారి యాలోచనసభయందు (Executive council) సభ్యులైరి.

వీరికి సర్ బిరుద మొసంగఁబడినది. కింగ్సు కౌన్సిల్ బిరుదమును చక్రవర్తిగారే స్వయముగ ౧౯౧౮ జూనునం దింగ్లాండునం దొసంగియుండిరి. వీరు యుద్ధసంధిసభ మొదలగు పెక్కుసభలయం దిండియాప్రతినిధిగ నుండి పనిచేసిరి.

వీ రింగ్లాండునందు లార్డుసింహా ఆఫ్ రాయపూరుపదవి నంది, ప్రభువులసభలో సభ్యులగుటయేగాక, అండరుసెక్రటరీ టుది సెక్రటరీ ఆఫ్ స్టేటు ఫర్ ఇండియాపదవి నందియు, ప్రివీకౌన్సిలరు పదవిని, కింగ్సు కౌన్సిల్ పదవిని నంది, కడకు బీహారు ఒరిస్సా సంయుక్తపరగణాలకు గవర్నరుపదవినంది, పాట్నా (తొల్లింటి పాటలీపుత్రము) రాజధానిగ నారాష్ట్రప్రభుత్వమును నడపిరి.

ఇట్టి గౌరవపరంపరలను మహోన్నతోద్యోగ పదవులను నందిన భారతీయుఁ డీమహనీయుఁ డొక్కఁడే.

సింహాప్రభువుగారి తండ్రిపేరు సితికాంతసింహా. వీరింగ్లాండునందు లింకన్సు ఇన్ నందుఁజేరి బారిష్టరు పరీక్షకుఁ జదివినది క్రీ. వె. ౧౮౮౧–౧౮౮౬ అనియు, అడ్వొకేటు జనరలుగా నుండినది కలక

త్రాలో ౧౮౦౭-౧౮౦౭ అనియు, సర్ బిరుద మందినది ౧౮౧౫ అనియు, వార్ కాన్ఫరెన్సు సభలో భరతదేశపు బ్రతినిధిగా నుండినది ౧౮౧౭-౧౮ అనియు, పీస్ కాన్ఫరెన్సుసభలో భరతదేశపు బ్రతినిధిగా నుండినది ౧౮౧౮ అనియు, భరతదేశపు అండర్ సెక్రటరీ ఆఫ్ స్టేటుగ నుండినది ౧౮౨౦ అనియు, బీహారు ఒరిస్సాలకు గవర్నరుగానుండినది ౧౮౨౦-౧౮౨౧ అనియుఁ దెలియుచున్నది.

## సింహాయము:—

(అష్టవిధాయములు చూడుఁడు).

## సింహావలోకనన్యాయము:—

సింహము ముందువెన్కలం జక్కఁగఁ జూచుకొని మరి యేకార్యమైనఁ జేయునని ప్రతీతి కలదు.

పరిస్థితులం జక్కఁగఁ బరిశీలించుకొనుట కీ న్యాయము వర్తించును. ముందువెన్కలు, పూర్వోత్తరములు, సాధకబాధకములు, జక్కఁగ తిరుగఁ బరిశీలించుకొనుటకు సింహావలోకన మందురు.

## సింహాసనము:—

రాజసభలందుఁ బ్రభువులు గూర్చుండు నున్నతాసనమునకు సింహాసనమని పేరు. తఱుచుగ దీని నాల్గుకోళ్లు సింహములుగ రచింపఁబడి వాటిపైఁ గూర్చుండుస్థాన మమర్పంబడుట సింహాసనమని పేరయ్యెనట. ఇది భరతదేశమున ననాదిగ వచ్చుచుండు సాంప్రదాయాచారము. ఇది తక్కిన యాసనములకన్న నెత్తుగనుండుట నధికారగరిమను సూచించును.

## సింహాసనము (యోగాసనము):—

యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. గుదస్థానమునకును నండములకు నడుమ భాగము 'సీవని' యనంబడును. ఆసీవనికి కుడి భాగమున నెడమమడమయు, నెడమభాగమునఁ కుడిమడమయు, నుండునటుల మడమలువైచుకొని కూర్చుండి, యఱచేతులనుమోఁకాళ్ళపై నానించి కూర్చుండి, పైకి నిగిడి నోరు తెఱచి నాల్కచాచి జాలంధరబంధము వైచి భ్రూమధ్యమున దృష్టినిలుపుట 'సింహాసన' మనంబడును. దీని యభ్యాసమున జఠరాగ్ని బలపడి శరీరబల మతిశయించి, బంధత్రయాభ్యాస (జాలంధర ఉడ్డియాణ మూలబంధములు) సిద్ధి యగునని చెప్పఁబడినది.

## సి- అక్షరమునకుజెందిన క్రైస్తవ పురుషనామములు:—

Cadell వెల్షునామము- యుద్ధమున defence అని యర్థము.

Cadogan స్కెల్టిక్కునామము- యుద్ధమున కర్థము. ఇందలి ముద్దుపేరు kadugan అని యందురు.

Cadwaladyr, Cadwaladr, Cadwallader వెల్షునామము- యుద్ధముం గుమర్చువాఁడని యర్థము.

Caesar లాటిన్ నామము- ఒకగొప్పరోమనుచక్రవర్తి పేరు. hairy అని యర్థము.

Cahir ఐరిషునామము- Battle slaughter అని యర్థము.

Cain హిబ్రూనామము- తొలిసృష్టి. ఆదాము ఈవుల తొలికాన్పు కుమారుని పేరు. possession అని యర్థము.

Caius లాటినుపేరు- (pror keys) Rejoiced in అని యర్థము.

Calder నవీనకల్పితనామము.

Caleb హిబ్రూనామము- శునకమున కర్థము. విశ్వాసమని భావము.

Callis నవీన కల్పితనామము.

Callum స్కాటిషునామము- 'dove' అని యర్థము.

Calvin నవీనకల్పితనామము.

Cambermere నవీనకల్పితనామము.

Campbell నవీనకల్పితనామము- స్కాట్లాండు నం దెక్కువవ్యాపకము గాంచినది.

Cannan నవీనకల్పితనామము.

Canute, Canutus ట్యూటోనిక్కునామము. సాధారణముగ నాంగ్లసీమల నేలిన యొకభూపాలుని పేరుగ నిడుచుండిరి. పర్వతమున కర్థము.

Caradoc, Caractacus సెల్టిక్కునామము- తొల్లింటి కాలమున బ్రిటనుల నేలిన యొక రాజుపే రనెదరు. Beloved అని యర్థము.

Carl ట్యూటోనిక్కునామము- ఆంగ్లశబ్దమగు Charles నకు Danish రూపము. ఒక చక్రవర్తిపేరని వాడుచున్నారు. మానవత్వ మున కర్థము.

Carlyon ఇది Carl నుండి కల్గిన విశేషరూప మందురు. నవీనకల్పితము.

Carmichael స్కాచినామము. మైకేలు మిత్రుండని యర్థము.

Carteret నవీనకల్పితము.

Casimir ఫ్రెంచినామము- Show forth peace అని యర్థము.

Carpar ఇది Gasper యొక్కవికారరూపము.

Cathcart నవీన కల్పితనామము.

Cato Caton లాటిన్‌నామము - Cautious అని యర్థము.

Cavendish, Cawthorne, Cayley నవీన కల్పితనామములు.

Cecil లాటినునామము.

Chaloner, Champneys, Chandler (Shandler pro) నవీనకల్పితనామములు.

Charles, Charters, Carl ట్యూటోనిక్కునామములు - మనుష్యున కర్థము. దీనినుండి గల్గిన ముద్దుపేరులు Charlie, Charley.

Charlemagne ట్యూటోనిక్కు నామము - Charles the Great అనుదానికి భాషాంతరము.

Chesney నవీనకల్పితనామము.

Cholmondeley (Pro. Chumly) నవీన కల్పితనామము.

Christian, Christiern గ్రీకునామము - ఒకగొప్పభూపాలుని నామముగ వాడుదురు.

Christopher, Christoph గ్రీకునామము - క్రీస్తును మోయు అనియర్థము. దీనినుండి గల్గిన ముద్దుపేర్లు Chrys, Chris, Kester Kit, Kitty అను మాటలు.

Churchill నవీనకల్పితనామము.

Cicero లాటిన్‌నామము - Pro. Sis-si-ro.

Ciprian, Cyprian, Cyprien లాటినునామము - Belonging to Cyprus అని యర్థము.

Ctairలాటినునామము. ప్రసిద్ధిగల యనియర్థము.

Clarence నవీనకల్పితనామము.

Claud, Claude, Claudius లాటినునామము lame అని యర్థము.

Clement లాటినునామము - రోముదేశమును పదునేడుగురు పోపుగురుస్వాము లీనామమే కలవారు.

Clifford Clive నవీనకల్పితములు.

Cock burn, Cochrane నవీనకల్పిత నామములు.

Colbrand ట్యూటోనిక్కు నామము - చల్లని ఖడ్గమని యర్థము.

Colborn ట్యూటోనిక్కు నామము . నల్లమెలుగుగోడ్డని యర్థము.

Colin స్కాటిషునామము - Dove అని యర్థము.

Colquhoun నవీన కల్పితనామము - (Kohoon).

Colum ఐరిషునామము - Dove అనియర్థము.

Colville (pro colvil) నవీనకల్పితనామము.

Compton } నవీనకల్పిత నామములు.
Comyns

Conan, Con, Conn ఐరిషునామములు- బుద్ధికర్థము.

Connor ఐరిషునామము- hound of Slaughtor అని యర్థము.

Conard ట్యూటోనిక్కు-నామము- Good speaker అని యర్థము.

Constant, Constantive లాటిన్‌నామము- గొప్పరోమకచక్రవర్తులు కొంద రీపేరింటివారుండిరి. Firm Celibrity అనియర్థము.

Cooper | నవీనకల్పితనామములు.
Corbet |

Cormac, Cormick ఐరిషునామము- Son of a Chariot అని యర్థము.

Cornelius లాటినుపేరు. horn అని యర్థము.

Cornwallis
Corrie } నవీనకల్పితనామములు.
Cosby

Cosmo గ్రీకునామము- Order అనియర్థము.

Cospatrick స్కాటిషునామము- Boy of Patrick అని యర్థము.

Courtenay
Courtce
Coverdale } నవీన కల్పితనామములు- ఇందు Cranmer అనుపేరు Canterbury arch Bishop స్వామిపేరు.
Cranmer
Crawford

Crescent లాటిన్‌నామము- వృద్ధినందుచున్న

Crispian, Crispin, Crispns లాటిన్‌పేరు- ఇది జోళ్ళుకుట్టుపనివాళ్ళ రక్షకుండగు ఋషి (patron saint) పేరు. (౨౫ అక్టోబరు ఈయన దినము). ఉంగరములజుత్తు (కుటిలాలకుఁడు) గలవాఁడని యర్థము.

Cromer
Crosbie } నవీనకల్పితనామములు.
Curtis

Cuthbert ట్యూటోనిక్కు-నామము- ఇది Northumbrian Saint అగు నొకస్వామి పేరు. ఈయనసమాధి Durham నందుఁ గలదు. well known splendour అని యర్థము.

Cutler నవీనకల్పితనామము.

Cyprian సైప్రెసుసంబంధుఁడని యర్థము. లాటిన్‌నామము.

Cyr గ్రీకునామము. ఆదివారము (సబ్బాతు) పుత్రుఁడని యర్థము.

Cyril Cyrill గ్రీకునామము- ఇది గొప్పతత్వవేత్తయగు St. Cyril- ఋషియొక్క పేరు. Loardly అని యర్థము.

Cyrus పెర్షియన్‌నామము- పారశీకసామ్రాజ్యస్థాపకుఁడగు Cyrus the Great Emperor of Persia పేరు. సూర్యునకర్థమగు పేరు(ఈచక్రవర్తి క్రీ. పూ. 529 లో చనిపోయెను).

## సి. అక్షరమునకుం జెందిన క్రైస్తవ స్త్రీలనామములు:

Calphurnia ఈపేరుం గూర్చి యేమియుం దెలియదు. వాడుకయందును లేదు.

Camilla, Camille లాటిన్పదము- ఒకబలి యం దుపచరించునది యనియర్థము.

Camiro లాటిన్పదము- ఒకబలియం దుపచరించు నదియని యర్థము.

Candida, Candide లాటిన్పదము- తెల్లని స్వచ్ఛత యనియర్థములు.

Carmen, Carmela, Carmira హిబ్రూ పదములు- ద్రాక్షవనమని యర్థము. ఈపే రిటలీదేశమున నెక్కువప్రచార మందియుం డును.

Carnation లాటిన్పదము- అవతారమని యర్థ ము. పట్టాభిషేకమునకు నుపయోగించెదరు.

Caroline, Carolen, Carolin, Carolina, Carlina ట్యూటోనిక్కుపదము- విశాలహృదయ శూరత్వమని యర్థము. దీని నుండి గల్గినముద్దుపేరు Carrie.

Cassindra, Cassandra గ్రీకు పదములు- ప్రేమతోఁ బ్రజ్వలింపఁజేయునది యని యర్థ ము.దీనినుండి గల్గినముద్దుపేరు Cassandra.

Catalina, Caterina స్పానియాపదములు పరిశుభ్రతయర్థము.

Catherine, Catherina, Catharine, Katherine, Katherine, Katharine, Katharina, Kathleen గ్రీకుపదము- పరి శుభ్రతయని యర్థము. దీనినుండికల్గిన ముద్దు పేరులు Kate, Katie, Kit, Kitty, Katty, Casy,Cathie.

Cecil, Cecile, Cecilia,Cecily, Cicily, Caeclia, Cecilie, Cicely, Cecilla లాటిన్పదములు- గుడ్డి యని యర్థము. దీనినుండికల్గిన ముద్దుపేరులు Cis Cessy, Sis, Siosy.

Celeste, Celesline, Celestina, Celia, Celie, Celine లాటిన్పదములు.

Ceres లాటిన్పదము- భూమాత యనియర్థము.

Cessarina, Cesarina లాటిన్పదము. వెం డ్రుకలుగల యనియర్థము. Caesar యొక్క స్త్రీవాచకపదము.

Charity, Charissa, Cherry గ్రీకుపదము. ప్రేమ, సంతోషమని యర్థము.

Charlotte జర్మనుపదము- విశాలహృదయమని యర్థము. ఇదియును Caroline వలెనే Chareles పదమునకు స్త్రీవాచకపదము. దీనియొక్క స్పానిషురూపము 'Carlota' ఇటాలియనురూపము 'Carlotta' అని.

Charmian, Charmion గ్రీకుపదము- రమ్య మగునని యర్థము.

Chloe గ్రీకుపదము- పూవులు బూచినయని యర్థము.

Christabel ఆంగ్లపదము- మంచిక్రైస్తవమని యర్థము.

Christian, Chrisliana, Christiane, Christina, Christine, Christine, Christina గ్రీకుపదము- క్రైస్తవత్వమని యర్థము. దీనినుండిగల్గిన ముద్దుపేరులు Chrissie, Teenie, Tina.

Christophera, Christophine గ్రీకుపద ము- క్రీస్తునువహించిన దని యర్థము. Christopher యొక్క స్త్రీవాచకపదము.

Chrystal, Christal గ్రీకుపదము- క్రైస్తవ మును వహించినదనియర్థము.

Clara, Clare, Clarina, Clarice, Clarimond, Clarinda, Claribel, Clarissa, Clarisse, Claire, Klara లాటిన్పదము- ప్రసిద్ధిగల స్పష్టమైన స్వచ్ఛ మైన యని యర్థము.

Clande, Clandia, Clandie, Clandina, Clandine లాటిన్పదము- కుంటియనియో లేక మందగమనముగల యనియో యర్థము.

Clementine, Clementina, Clementia, Clemency, Clemence, Clemenza. లాటిన్పదము-దయార్ద్రహృదయమనియర్థము లేక దయామయమని యర్థము.

Cleopatra గ్రీకుపదము- విఖ్యాతుఁడగు జనకునిపుత్రిక యని యర్థము.

Clotilda, Clotilde ట్యూటోనిక్కుపదము- ప్రసిద్ధసంగర- నారి యనియర్థము ఒకయోగిని పేరు. (ఆమెదినము జూన్ నెల 3 తేది)

Columbine లాటిన్పదము- గువ్వ (పక్షి) యని యర్థము.

Constance, Constancia లాటిన్పదము- భద్రతయని యర్థము. దీనినుండి గల్గినముద్దు పేరు Connie.

Consuelo స్పానియాపదము- 'ఓదార్పు' అని యర్థము. అమెరికాయం దీపేరెక్కువ ప్రచారమంది యున్నది.

Cora, Corinna, Corinne గ్రీకుపదము. 'పడుచు' అని యర్థము.

Coralie ఫ్రెంచిపదము- 'పవడము' అనియర్థము.

Cordelia, Cordelie సెల్టిక్కుపదము- సాగరాభరణమని యర్థము. ఇదియె లాటిన్పదముగ బాధ్యతగల యనియర్థము.

Cornelia, Cornelie లాటిన్పదము- ప్రేమానుబంధయుత మని యర్థము.

Crescencia, Crescentia లాటిన్పదము. వృద్ధియగుచున్నయని యర్థము.

Cressida దీనింగూర్చి యేమియుం దెలియదు.

Cyllene దీనింగూర్చి యేమియుం దెలియదు.

Cymbeline లాటిన్పదము- సూర్యసంబంధమగు యువతి యని యర్థము.

Cynthia గ్రీకుపదము- అర్థము తెలియదు.

Cyrilla గ్రీకుపదము- ప్రభుత్వలక్షణములుగల యని యర్థము.

## సికతాకూపవత్న్యాయము:—

ఇసుకలో నూయిత్రవ్వడమని యర్థము. అంచులు ప్రక్కలు కూలిపోవుచుండును గాన నిండిపని యనియర్థము.

దుస్సాధ్యమనియు నాటంకములు తోడుగా నుండుపని యనియు భావము.

## సిక్కిమ్ పేపబెత్తపు వంతెన:—

త్రాటివంతెన తెలుంగనియాంధ్రుల కిది వింత గొల్పకపోదు. ఇదిత్రాటివంతెనఁ(Rope bridge) బోలినవంతెనయే. త్రాటితోఁజేయుటకు బదులు పేపబెత్తములను వెదురుకఱ్ఱలను వీటినిర్మాణమందుపయోగించెదరు.

త్రాటివంతెనలు, కఱ్ఱవంతెనలు, బెత్తపువంతెలు, భరతదేశఁపు టుత్తరపుకొల్లలయం దెల్లెడలఁ గాననగుచుండును. సిక్కింవద్ద టీస్థా (త్రిస్థా) నదిపై నున్న బెత్తపువంతెన సుప్రసిద్ధమైనది. మూడు వందల యేఁబదియడుగులపొడవుగల వంతెన లీప్రాంతమున నొకయబ్బురము కాదు. (వంతెనలు— త్రాటివంతెనలు చూడుఁడు).

## సిక్కిమ్ సంస్థానము:—

ఇది నేపాళము భూటానుల నడుమనున్న చిన్నరాజ్యము. కొండలమయమైనది. బ్రిటీషువారి రక్షణమందున్న స్వదేశసంస్థానము. సిక్కింపురము రాజధాని.

**సిక్కు [క్రీడాబ్రహ్మవాద] మత నిషేధములు:—** మతగురువులు పదిమంది పట్ల గురుభక్తి లేకుండుటయు, నిత్యాయుధమగు కృపాణమును ధరింపకుండుటయు, శిఖ, గడ్డము, పాగయు శిష్యలాంఛనములుగఁ బాటింపకుండుట, హరిభక్తిలేకుండుట, మతరక్షణసంగరము గల్గుతరి వెనుదీయుట, దర్బారుసాహెబు గ్రంథసాహేబు లందు భక్తి, నమ్మకము లేకుండుటయు, ప్రపంచ నటనలు పరమేశ్వరక్రీడలను సిద్ధాంతమున నమ్మక ముతగ్గుట, పరమేశ్వరుని విగ్రహములుగఁ జేయుటయు, మనుష్యులు పరమేశ్వరుని క్రీడామృగములను సిద్ధాంతమునందు నమ్మకము లేకుండుటయు, ఇవి 'అష్టనిషేధకార్యము' లని చెప్పఁబడినది.

**సిక్కులమతగ్రంథము:—** (గ్రంథసాహేబు చూడుఁడు).

**సిక్రోపు భూపతి (Cecroos):—** చరిత్రాత్మకమైన నిదర్శనము లేకున్నను గ్రీకుదేశపుపాటలం దీతఁడు అట్టికాపురాధిపతి యనియు, సుప్రసిద్ధమగు అతెన్సునగరనిర్మాత యనియుఁ దెలిసెడిని.

**సిగరెట్లుచేయుపరిశ్రమ:—** హిందూదేశమునందు సిగరెట్లుపయోగించువారు దినదినాభివృద్ధిఁ జెందుచున్నారు. అయినను నన్యదేశఁపుసరకుమీఁదనే యింకను నాధారపడియున్నారు.

ఎట్టిపొగాకిందు కుపయుక్తమగునో జాగ్రత్తగాఁ బరిశోధనలు సలిపి చూచినచో హిందూదేశమునందు పైరుచేయఁబడు పొగాకులో మూఁడువంతులు సిగరెట్లుచేయుటకు ముఖ్యముగా నుపకరించునని చెప్పవచ్చును.

ఇప్పుడు హిందూదేశములో పొగాకుపైరున కుపయోగింపఁబడుభూమి సుమారు 1,362,000 యకరములు. దీనివలన వచ్చు పొగాకు పరిమితి 486,428 టన్నులు. ఇందులో నొకలక్ష యకరముల భూమి మేలురకపు పొగాకు పైరుచేయుట కుపయోగింపఁబడుచున్నది. ఈరకపుఁ బొగాకమెరికాలోని వెర్జీలియాబొగ్రిందున కెంతమాత్రము తీసిపోదు.

దరిమిలాను సిగరెట్టుపరిశ్రమ చాలమంది పెట్టుబడిదారుల దృష్టి నాకర్షించినది. తక్కిన సరకులకు ధరలు మందగిల్లి వ్యాపారము క్షీణించిపోవుచున్నను, హిందూదేశమునందు ముఖ్యముగా బొంబాయిరాష్ట్రమునందు క్రొత్తగా ననేకములగు సిగరెట్టుఫ్యాక్టరీలు లేచినవి.

హిందూదేశఁపు సిగరెట్టుఫ్యాక్టరీలలో తయారుచేయఁబడు సరకువిలువ 1932-33 సంIIలలో నీదేశమునకు దిగుమతి చేయఁబడిన ముప్పదిరెండు లక్షలలో మూఁడవవంతుండును. ఇది దినదినాభివృద్ధిజెందుచు విదేశఁపు దిగుమతిని తగ్గించుచున్నది.

**సిగ్నోర్ ముస్సులోనీ (డూస్‌డిక్టేటరు):—** వీ రిటలీదేశపుఁ టుత్తరభాగమున ప్రెడాపియోపురనివాసులుగ నుండినవారు. ఇటలీదేశమున నియామకపదవి (డిక్టేటరు) నందినదాదిగ రోమకపురియందు మప్పాముండీస్క్వేరునం దున్న Palazzodi Venezia భవనమున వసించుచున్నారు. వీరిపదవియొక్క రాజ్యకార్యనిర్వహణ స్థల మీభవనపుఁగ్రింది (మొదటి) యంతస్తునందున్న విశాలమైన మప్పాముండీహాలుగ నున్నది. ఇది ౬౦ × ౪౦ × ౪౦ అడుగులనైశాల్యముగలది. మప్పాముండి యన ప్రపంచగోళము (గ్లోబు) న

న కర్థము. ఆది నీతావుర నట్టిగోళమును నిర్మించి నిలిపియుండిరట. ఆవే రిప్పటికి నా ప్రాంతమునకుఁ గలవు. ఈమప్పాముండినిర్మాణము క్రీ. వె. పదు నేనవశతాబ్దంపు మధ్యకాలమునం దనెదరు. వీరి యనంగుసహధర్మచారిణి సిగ్నోరారాఘేలు అమ్మగా రిప్పటికిని (భర్త డిక్టేటరైనపిదప) డోన్నా రాఘేలని చెప్పఁబడుచు బ్రెడాపియోపురము నందే నివసించుచున్నారు. వీరు సామాన్యగృహస్థులవలె జీవించుచున్నారు. వీరియం దేరాజసను గానరాదు. అంగడి కరిగి సామానులంగొనుచుంటయు, వంట నొక్కొక్కప్పుడు చేసుకొనుచుంటయు, చర్చిదేవాలయమున కరగుట, తమపిల్లల సంరక్షణం జేసికొనుటయు వీరి నిత్యములుగ నున్నవట. వీరికి హోదా యనినను, బిరుదములనినను, నిరాదరణము. వీరిబంధువులు, నల్లుళ్లు, మామగారు మొదలగు వారందఱు నేదోవృజీవనముం జరుపుకొనుచున్నారు. ముసులోనీగారి తండ్రిగారు బ్రెడాపియోయం దినుపపని కేయు చుండువారట. ఇప్పు డొకపాటి వర్తకులుగ నున్నారని వినదుము. ఈప్రాంతముననే గల 'కటోలికా' యనంబడు సముశీతోష్ణప్రదేశమున ముసులోనీగారి కొకపాటియిల్లు కలదట. వేసవియందు వీరికుటుంబ మట వసించుచుండునట. ఈదంపతుల కనురాగము మెండని చెప్పఁబడినది. ఆ యిల్లాలు స్వప్నమందైనను తనభర్త నన్యులాతిగఁజూడ సహింపదు. తానాయనకు వ్యతిరేకవర్తన మొనర్చునదియే కాదు. వీరిసుతుం డొకఁ డిటలీస్సైనికదళమునందు క్కెప్టనుపదవియం దున్నాడు. డోన్నారాఘేలమ్మగారి కోర్పు, శాంతము, సహనము, సహజలక్షణములని యనుచుందురు.

ముసులోనిగారిసంపూర్ణనామము బెనిటోముసులోనీగారు .వీరు గొప్పవర్తకులు. మాట్లాడుతరి తొలుత నెమ్మదిగనుండి రానురాను పట్టలేనంత వడితో శబ్దజాలము నగ్నివర్షమో యనునట్లు తగతిని మాట్లాడువాఁడు. గొప్ప జ్ఞాపకశక్తి గల్గినవాఁడు. దేనికేని వెతకికొనుట, పుస్తకము లంజూచుట, యాయన యెఱుఁగడు. విశ్రాంతిఁ గొననొల్లఁడు. సదా కార్యనిర్వహణ మాయన దీక్ష. ఇటలీదేశముయొక్క యభివృద్ధి యాయన కోర్కెయని వార్తాపత్రికలు పొగడుచుండును.

అధికారదశయం దున్నతరి నాయనను పొగడుచుంటగాక గొప్పరాజకీయవేత్తయనియు, వ్యక్తిత్వమధికముగఁ గలవాఁ డనియు, నందరితోఁ గలియుట తనయౌన్నత్యమున కొక కొరంతగాఁ దలంచువాఁడు కాఁడనియు, జర్మను, ఇంగ్లీషు ఫ్రెంచి భాషలం జక్కఁగ నేర్చినవాఁడనియుఁ, గార్యములం దాలసింపనివాఁ డనియు, పాలుమాలని కార్యదీక్షం గలవాఁడనియు, నట్లని తొందరపడి కార్యము నెట్లో ముగింపక దూరాలోచన సల్పువాఁ డనియు, నిటలీదేశము నభివృద్ధిపఱచి ధనవంతముగ నొనర్చి, గొప్పదిగాఁ జేయుటకు దైవముచేఁ దాను నియమింపఁబడితి నని తలంచుచుండునని యనుచుండువాఁడనియుఁ జెప్పఁబడినది.

**సిజమోలజీ** (Seismolegy):—భూమియొక్క పైభాగము గట్టిపడుటనుగురించియు, భూకంపములనుగురించియు, భౌతికతత్వపరిణామములను దెలుపుశాస్త్రము.

**సిట్టింగిన్కేమరా** (Sitting in Camera) బ్రిటిషుధర్మమున న్యాయపరిపాలనము నిష్పక్షపాతముగ నుండువిధి కలది. ఈనిష్పక్షపాతవిధి యెల్లర యెదుటఁ దెఱచియుంచఁబడిన న్యాయస్థానమున విమర్శించఁబడి తీర్మానించఁబడ

వలయునని నియతి కలదు. గాన నెల్లరు న్యాయ స్థానములకేగి యచట జరుగు నిష్పక్షపాతవిమర్శనను వినుటకు హక్కుగలదు. ఇట్లయ్యు నొక్కొక వ్యవహారమున సాక్ష్యమును, వాదప్రతివాదములును, నెల్లరు వినుట యపాయకరమనియో, వినరానిమాటలు నడుచుసందర్భము కలదనియో, న్యాయాధిపతికి నచ్చినచో బహిరంగమగున్యాయ స్థానమునందుఁ గాక ప్రత్యేకరహస్యముగ వినుట కేర్పాటు లొనరింపఁగలఁడు. దానికి 'Sitting in Camera' అనిపేరు.

**సిట్రిక్ ఆసిడ్ పరిశ్రమ** (Citric Acid):— 'సిట్రిక్ ఆసిడ్' అనునది నిమ్మ మొదలగు నీజాతిపండ్లరసమునుండి సంగ్రహింపఁబడు నొకవిధమగు 'ఆసిడ్' పదార్థము. నిమ్మపండ్లను గాని గజనిమ్మపండ్లను తొక్కయొలచివైచి నలగఁగొట్టి తొనలముక్కలను కొబ్బరినారసంచులలో వేసి ఒక press లోఁబెట్టివేయుదురు. మొట్టమొదట నారసము మష్టికలిగియుండి జింకవలె నంటుకొనుచుండును. కొంతకాలము పులియఁబెట్టి తేరనిచ్చినచో నందలిమష్టుతోఁ గలిసియుండిన Albumenoid పదార్థమంతయు నడుగునకు దిగిపోవును. పై తేటనంతను తేర్చి తీసివేసి మష్టుగానున్నదానిని వడియగట్టవలయును. అట్లు తయారుచేయఁబడినరసములో లిట్టరు 1కి 50 గ్రెయినులు సిట్రిక్ ఆసిడుండును. ఈద్రావకపదార్థము వేడిచేసి దానిలో సున్నపుకలిపినయెడల సైట్రేటు (Citratae)వచ్చును. ద్రావకము వేడిగానుండు నప్పుడే Precipitation జరుగవలయును. ఎందుకనఁగా సైట్రేటు చలినీటిలో కరుగుఁగాని ఉడుకునీటిలోఁ గరుగనేరదు. Precipitation కర్రతొట్టిలో జరుగఁబడవలయును. ఆకర్రతొట్టెకొక agitator ను, ఆవిరిగొట్టమును అమర్పఁబడియుండును. రసమంతయు నాతొట్టెలోఁ జేర్పఁబడినతరువాత నావిరిగొట్టముసహాయమున దానిని మరుగునట్లు చేయుదురు. పొంగు విశేషముగానున్న పొంగుకట్టుటకు మెత్తనిచూర్ణము నందులోఁ గలుపుదురు. కొంతమంది సుద్దపొడికి మారుగా సున్నపుఁబొడి (ముగ్గు) వేయుదురు. ముగ్గువేసి తయారుచేసిన Citrate అంత పరిశుభ్రముగా నుండదు. అందులో Alumina కాంపౌండులును, Phosphate లును ఉండవచ్చును. అవి alkali వలన క్రిందికి దిగిపోయి, Citrate తోఁ గలిసిపోయి యెండఁబెట్టుటగాని నిలువచేయుటగాని కష్టమగునట్లుచేయును. Precipitate ను వేఁడినీటితో శుభ్రపఱచి తడియార్చి స్టౌవు వలన నెండునట్లు చేయుదురు.

సిట్రిక్ ఆసిడ్ తయారుచేయుట కిట్లు లభించిన Calicium Citrate చల్లని నీటిలో dissolve చేయుదురు. మరి precipation జరుగకుండ నందులో జలము కలిపిన Sulphuric Acid పోయుదురు. అప్పుడు Calicium sulphate ఏర్పడి అడుగునకు దిగిపోవును. దానిని వడియఁగట్టి యచ్చులుగాఁజేసి యమ్మకమునకు సిద్ధముచేయుదురు.

(city):— పెద్దపట్టణముల కాంగ్లమున 'సిటీ' యనెదరు. భరతదేశప్రభుత్వమువారి లెక్కమేర కేఁబదివేల జనులుగాని, అంతకధికముగ జనులువసించుతావునకు సిటీ యనిచెప్పఁబడినది. హైదరాబాదు మొదలగు కొన్నినగరములందు తొల్లింటి యసలుపురమును మాత్రము 'సిటీ' యనియు, తక్కినపేటలను వేర్వేఱుభాగములనియు వాడుచున్నారు. అమెరికాసంయుక్తరాష్ట్రములం దీపద్ధతులం బాటింపక కొన్నిపల్లెలను సహా సిటీ లనుచున్నారు.

**సితధ్వజుఁడు:-** మిథిలసంతతి సూర్య వంశక్షత్రియుఁడు. తండ్రి యజుఁడు.

**సిద్ధతిథులు:—**
(విద్ధతిథులు చూడుఁడు.)

**సిద్ధనాథ శివక్షేత్రము:—** ఇది గౌత మీ (గోదావరీ) నదీతీరమునందున్న సుప్రసిద్ధ శివక్షేత్రము. నాశికా త్రియంబకములకుం గొంత సమీపసీమలందున్న మహాక్షేత్రము. ఇట పెక్కండ్రు తపము లాచరించి యోగసిద్ధి, మంత్రసిద్ధి, కాయసిద్ధిలం బడయుచుందురని యీప్రాంతముల బలమగుప్రతీతి కలదు. గోదావరినది యిట వేసవికాలమునం డెండిపోయి, చిన్నకాలువవలె రాళ్ళ నడుమనుండియు, రాతి గోడలనడుమనుండియు, ప్రవహించుచు చూడ ముచ్చటగను, పవిత్రతం బ్రదర్శించుచును గన్పట్టెడిని. ఈ తీర్థమున పెద్దపెద్దతాబేళ్లు, చేపలు, అడవిసెమల్లు నిర్బాధకరములై, స్వేచ్ఛగా సంచరించుచు, మచ్చికపడియుండును. పెక్కుదేవళములుగల తావు. ప్రధానదేవళమున సిద్ధనాథశివలింగ మున్నది. యాత్రికులకు గొప్ప విశాలమైన ధర్మశాల కలదు. ప్రశాంతవాతావరణముం గల్గిన తపస్థలముగి దోఁచెడిని. బజారు, అంగడులు, కలవు. పండాలు (బట్జీలు) కలరుగాని, వారినుండి యాత్రికుల కొత్తిడిలేదు.

**సిద్ధవైద్యము:—**
(అగస్త్యసాంప్రదాయవైద్యము చూడుఁడు).

**సిద్ధాంతాగమములు:—**
(ఆగమములు చూడుఁడు.)

**సిద్ధాంతన్యాయము:—** సిద్ధాంతమన పరిపూర్ణత లేక నిస్సంశయతనందినసత్య మని యర్థము. ఈసిద్ధాంతములు చతుర్విధములుగ నుండును.

౧ సర్వతంత్రసిద్ధాంతము— దీనిని సర్వమతసిద్ధాంతమనియు నందురు. ఇది యన్నిటికి సామ దాయకముగఁ బనికివచ్చు సిద్ధాంతము

౨ ప్రతితంత్రసిద్ధాంతము— దీనిని ప్రత్యేకమత సిద్ధాంతమనియు నందురు. ఇది కొన్నిమతములకో లేక యొక్కొకమతమునకో పనికివచ్చునది.

౩ అభ్యుపగమసిద్ధాంతము— ఇది భావితయోజనా సిద్ధాంతము.

౪ అధికరణసిద్ధాంతము— ఇది గర్భితసిద్ధాంత మనియు, నుపసిద్ధాంత మనియు ననంబడును. సూత్రకారునివలన ాద యనవసరమని నిస్సంశయపఱుపఁ బడినది. ఈనాల్గుసిద్ధాంతములు నాల్గున్యాయములుగఁ దగ రెడిని.

**సిద్ధార్థుఁడు సన్యసించిన స్థలము:-** బెంగాల్ నార్తువెస్ట్రిన్ రెయిల్వే (B.N.W.R) మాఘూర్ స్టేషనునుండి రెండున్నరమైళ్ళదూరమున నున్న మహాతాన్దియా యనంబడుగ్రామముకడను బుద్ధభగవానుని పూర్వాశ్రమనామమగు యువరాజసిద్ధార్థుఁడు సన్యసించిన తావు గలదు ఇది కలీలాబాద్ రైల్వేస్టేషనునుండి మంచిబాట నైదుమైళ్లదూరమునఁ గల తామేశ్వరమనంబడు శివక్షేత్రమునుండి యీశాన్యదిశగా మైలుదూర నందుఁగల యొక నిమ్నోన్నతప్రదేశమం దున్నది. ఈసమతలప్రదేశ మొకమైలుపొడవును, ముప్పది యడుగుల యెత్తును గల్గియున్నది. తామేశ్వర

దేవస్థానమునుండి యీశాన్యదిశగా నొకమైలు దూరమున కుడ్వానది యనంబడు చిన్నప్రవాహము కలదు. (కుడ్వా యనిన దాటఁబడినదని యర్థమట). యువరాజసిద్ధార్థి గుఱ్ఱముపై స్వారి చేయుచువచ్చి యట నీనదిని గుఱ్ఱముపైనుండి కుప్పించి గెంతించి దాఁటెనట.

ఈనది కర్కాలమున 'అనోమానది' యని పేరుండెనట. దానినే సిద్ధార్థి కపిలవస్తునుండి గుఱ్ఱముపై నెక్కి ఛండకుఁడనుసేవకునితో వచ్చి యేరుఁ దాటి, సన్యాసముఁ గైకొనెనట. అత్తావులందశోకచక్రవర్తిచేఁ గట్టఁబడిన బౌద్ధస్థూపములు మూఁడుండెను. అందొకటి యాయన శిఖాయజ్ఞోపవీతములం దీసివైచినతావును, మఱియొకటి యాయన సన్యాసదుస్తులం ధరించినతావును, వేఱొకటి ఛండకుని గుఱ్ఱముం దీసికొని కపిలవస్తుపురమునకుఁ దిరుగఁ బొమ్మనినతావును బోల్చి స్థూపములు నిర్మింపఁబడినవఁట. ఇంతటినుండి సిద్ధార్థి సన్యాసియై బుద్ధభగవానుఁడుగాఁ దపమొనర్ప నారంభించెను.

**సిద్ధాసనము:—** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి.

కంఠమును గుదించి, గడ్డమును కంఠమునకు నాల్గంగుళముల దిగువగా వక్షస్థలమున కానించి, (జాలంధరబంధము) యెడమకాలిమడమను సీవని (గుదస్థానమునకు, నండములకు మధ్యప్రదేశము) యం దానించి, కుడికాలిమడమను లింగస్థానముపై నుంచి, భ్రూమధ్యమున దృష్టులనిల్పి, యరగంటిచూపున నాభికడ తిరుగవైచిన యెడమయఱచేతిని, దానిపైని కుడిచేతిహస్తమును నుంచి తక్కినశరీరమును దృఢముగ నిలచునట్లుంచి స్థిరచిత్తముతోఁ గూర్చుండుట 'సిద్ధాసన' మని చెప్పఁబడినది. దీని కవాంతరభేదములై దీనిసంబంధాసనము లింకను మూఁడుకలవు. అవి ౧ వజ్రాసనము, ౨ గుప్తాసనము, ౩ ముక్తాసనము ననంబడునవి. (చూడుఁడు).

ఈయభ్యాసమువలన నుచ్ఛ్వాసనిశ్వాసలు తిన్నగా జరగుచుఁ గ్రమముగా మందగించుటయు, వృత్తి స్థిరతనొందుటయు, నాయాసములేకుండ విస్తారకాలము కూర్చుండఁ గల్గుటయు, శరీరమంతటను రక్తము ప్రవహించి, యారోగ్యము బలపడుటయుఁ, గ్రమముగ మూల, జాలంధర, ఉడ్డియాణము లనెడి మూఁడుబంధములు సిద్ధించుటయు సంభవించునని చెప్పఁబడినది.

**సిధియాదేశము:—**

(శతద్వీపదేశముఁ జూడుఁడు).

**సిద్ధి - సిద్ధులు - [అణిమాద్యష్టసిద్ధులు - అష్టసిద్ధులు]:—** సిద్ధి యనఁ జేకూరుట యని యర్థము. ఇట్టి చేకూరుటలు (సిద్ధించుటలు) ఎన్మిది సుప్రసిద్ధములు. వాటి కష్టసిద్ధులని వాడుక గలదు.

౧ అణిమాసిద్ధి— తాను చిన్నవానివలె నితరులకు సులభసాధ్యుఁడై యుండుట.

౨ మహిమాసిద్ధి— తాను గొప్పవాఁడుగ నితరులచే సన్మానింపఁ బడుచుండుట.

౩ లఘిమాసిద్ధి— తా నితరులవనఁ బోల్పఁబడక వేఱొకరీతి నగుపడుచుఁ బ్రచ్ఛన్నతం బాటింపఁ బడనుండుట.

౪ గరిమాసిద్ధి— గురుతుల్యుఁడై యెల్లరకు మాన్యుఁడై యుండుట.

౫ ఈశిత్వసిద్ధి— తా నధినాథుఁడుగనో, నాయకుఁ గనో దనరుచు నుండుట.

. తానెల్లరను వశవర్తులనుగా నొనర్చుకొనియుండుట.

౭ ప్రాప్తిసిద్ధి— తనకుఁగల్గిన కోర్కెలు [నిరాటంకముగ] సిద్ధించుచుండుట.

౮ ప్రాకామ్యసిద్ధి— ఔన్నత్యము, నతిశయస్థితి, మాన్యతలం గల్గియుండుట.

**సిద్ధుఁడు - సిద్ధులు - (సిద్ధినందినవారు) (నవసిద్ధులు)**:— సిద్ధినందినవారు సిద్ధు లనంబడుదురు. వీరు తొమ్మండుగురగుట నవసిద్ధు లనంబడిరి. ౧ సత్యనాథసిద్ధుఁడు, ౨ సదాయోగనాథ సిద్ధుఁడు, ౩ ఆదినాథ సిద్ధుఁడు, ౪ అనాదినాథసిద్ధుఁడు, ౫ వకుళనాథసిద్ధుఁడు, ౬ మతంగనాదసిద్ధుఁడు, ౭ మచ్ఛేంద్రనాథసిద్ధుఁడు [నేపాలదేశము], ౮ ఘటేంద్ర సిద్ధుఁడు, ౯ గోరక్షకనాథసిద్ధుఁడు. వీరు సుప్రసిద్ధులు.

ఇంకను వృషభరాజుకుమారులు నూర్గురిలో నెనుబదియొక్కండ్రు తపంబులొనర్చి బ్రాహ్మణులు [ఋషు] లైరనియు, తొమ్మండుగురు నవఖండాధిపతులగు ప్రభువులైరనియు, నొక్కండు రారాజై చక్రవర్తియాయె ననియు, తక్కిన తొమ్మండుగురు సిద్ధులై రనియుఁ జెప్పఁబడినది. వారిపేర్లు:— ౧ హరిసిద్ధుఁడు, ౨ కవిసిద్ధుఁడు, ౩ అంతరిక్షసిద్ధుఁడు, ౪ ప్రబుద్ధసిద్ధుఁడు, ౫ పిప్పలసిద్ధుఁడు (పిప్పలుఁడు), ౬ హవిర్హోత్రసిద్ధుఁడు, ౭ ధ్రమీడసిద్ధుఁడు (ధ్రమీడుఁడు), ౮ చమసనసిద్ధుఁడు, ౯ కరభాజనసిద్ధుఁడు ననియు. వీరిప్రసంగములే మిథిలాధినాథుఁడగు జనకమహారాజును జ్ఞానవంతునిగ నొనర్చెననియు, భాగవత, ఏకాదశస్కంధ (విదేహసార్ధభసంవాద) మునఁ జెప్పఁబడినది. మఱియు బౌద్ధుఁడగు నాగార్జునుఁడు దః రసవాదగ్రంథముల రచించినవాఁడు సిద్ధుఁ డని చెప్పఁబడినది.

**సిద్ధులు (జాతి)**:— కశ్యపునకు దక్షప్రజాపతికొమార్తెయగు ననాయువు లేక 'అనుగ' యనంబడు భార్యయందుఁ గలిగిన సంతతి. అణిమాద్యష్టసిద్ధులుఁ గలవారని యర్థము.

**సినీవాలి**:-
ధాతభార్యలలో నొకతె.

**సినెక్యూరిజమ్** (Sinecurism):— పనిచేయకుండ (కర్మత్యాగము) నాత్మశోధన చేయువిధానము. కర్మతో సంబంధము వదలుకొనుటయు, భుక్తికొఱకునైన పనిచేయకుండుటయు, నాత్మచింతన చేయుటయుగన్క ఇట్టివారిని క్రైస్తవమతమునందు 'Sinekurists' అనెడువారు. వీరిని మతసంబంధమగు ధనము నొసంగి పోషించెడువారు. క్రీ. శ. 1840 సంస్కరణ విధానము ననుసరించి యీపద్ధతి తొలఁగింపఁబడినది.

**సినోలజీ** (Sinology)—చైనాదేశీయుల భాష, వాఙ్మయ, రాజకీయచరిత్రములకు సంబంధించిన విజ్ఞానము.

**సిన్ - ఈటింగ్ [పాపవిమోచన భుక్తి]**:— చనిపోయినవానిపాపములను తాగైకొని వారిని విముక్తినందించుటకుఁ జేయుభోజనప్రక్రియ యనిభావము. తొల్లింటికాలమున గ్రేటు బ్రిటను నందలి వేల్సుదేశమునందిట్టి యాచారముండెడిది. కొన్నిగ్రామములందు sin eater పదవినందినవాఁ డుండెడివాడు. ఆతఁడు చనిపోయిన వారియింటికరిగి చనిపోయినవాని పాపము

లను తాగి కొనుట కోకరొట్టెను, ఒకగిన్నెడు ఏలుసారాయమునుగాని, పాలుగాని పీనుగుపై నుండి గైకొనునట. వారికి దక్షిణయు నొసంగు చుండెనట.

## సిన్‌క్లైను ఏంటిక్లైను:—

భూమియం దలిపొరలు, వేర్వేరు కారణములు సంభవించి నొత్తంబడి, యడగిపోయి నడుమ పల్లమగును. దీనికి సిన్-క్లైనం (Syncline) దురు. ఇటులనే క్రిందినుండి పైకిం దొ్రయబడి (నెట్టంబడి) నడుమ నుబ్బెత్తుగనైన భూమి, దానిపొరలు గలదానిని, ఏంటిక్లైనం (Anticline) దురు. సిన్‌క్లైను కణగుతరి క్రిందనుండి కొంతఎదురోక్కులు (resistence) ఉండును. గాన నట్లయిన భూమిపొరలు గట్టిపడి దట్టమై చిరకాలము నిలబడియుండెడిని. ఏంటిక్లైను కట్టియెదురోక్కులుఒత్తడి యుండదుగాన దట్టనకాటు గట్టిపడుట యుండదుగాన నచిరకాలముననే కృంగిపోవుచుండుట కలదు.

## సిమితార్ తల్వారు కత్తులు:—

సిమితార్ లేక సిమిటార్ కత్తులు.

౧ టర్కీదేశపుసిమిటారు

౨ పారసీకదేశపు సిమిటారు.

3 ఉత్తరహిందూస్థానీదేశపుతల్వారు.




ఇది యొకటికన్న నొకటి యెక్కువ వంకరలు తిరిగి యుండును.

## సిమ్లానగరము (Simla):—

హిమవన్నగముపై నున్న సమశీతోష్ణప్రదేశము. ఇండియాప్రభుత్వమువారి వేసవినివాసస్థలము. సముద్రపు నీటిమట్టముపై ౭౧౫౬ అడుగులయెత్తున నున్నది.

దీనిచరిత్ర మొదటినుండియు సరిగాఁ దెలియదు. క్రీ. శ, ౧౮౧౪–౧౮౧౬ లనాడు ఈస్టిండియాకంపెనీవారికి నేపాలమువారితో నడచినకలహములందు, నేపాలమువారిచే కంపెనీవారికి వశమైన తావు. అత్తఱి కంపెనీవారికి తోడైన హిల్ సంస్థానములవారికి చాలభాగము వశపర్చంబడినదట. కాని కియోన్తాల్‌ర్ణాగారును. పాటియాలామహారాజుగారును, కొంద రైరోపాయంగవికలులగు యుద్ధభటులకు సర్వదుంబాలాగా నిందలితావు లొసంగినటుల నానసంస్థానముల ప్రాతరికార్డులందు కలదు.

క్రీ. శ. ౧౮౧౯ లో పొలిటికల్ యేజంటుగ నుండిన లెఫ్టినెంటు రాస్‌గా రిట నొకకఱ్ఱయిల్లు గట్టి అందు వేసవియందు వసించుచుండెనని నిదర్శనములు కలవు. ౧౮౨౭ లో పొలిటికల్ యేజంటుగ నుండిన మేజర్ కన్నెడీగారితో నప్పటి గవర్నరు జనరల్‌గారగు అంహర్స్టు ప్రభు వాయింటియందే కెన్నెడీగారితో వేసవిఁ గడపిరని చెప్పఁబడినది. ౧౮3౦ లో నిండియాప్రభుత్వమువారి కోర్కెమేరకు కియోంతాల్‌రాణాగారినుండియు, పాటియాలా మహారాజుగారినుండియు నిప్పటి సిమ్లాప్రదేశముం గొని సంపాదించెనట. ౧౮3౧ లో M.Victor jacqnemont అను ఫ్రెంచి దేశస్థుడీసిమ్లా కరిగి, దానిని భాగ్యవంతులకు,

బద్ధకులకు, రోగులకు తావని వ్రాసియున్నాడు. మేజరు కెన్నెడీగారికాలమున కొన్నియిం గ్లాపరి సరముల నిర్మింపఁబడినవఁట. వారికాలమున కడ కటువది యిండ్లయినవఁట.

బెంటికుప్రభువు గవర్నరుజనరల్‌గారే యట నొక ఆస్పత్రిని దన సొంతద్రవ్యముచేఁ గట్టించి రనియు, వారి ధర్మపత్ని యొకబిలియర్డురూ మి ప్పించెననియుఁ జెప్పఁబడినది. ౧౮౩౭ లో గవర్న రుజనరల్‌గారును, కమేండరు ఇన్ చీఫ్‌గారును నట వసింప మొదలిడిరఁట. తరువాతవారగు ఆక్లండుప్రభువుగా రాక్లండుహౌసునందు వసించు చుండిరట. నాఁడాదిగ దానిని గవర్నమెంటుహౌస్ అని వాడదొడఁగిరట. ౧౮౬౪ సిమ్లా ప్రభుత్వఁపు వేసవినివాసముగ స్థిరపఱుపఁబడినదట. Aiex-anderis East India magazine అనుపత్రిక యొక్క ఆసంవత్సరఁపు సంచికల వ్యాసములనుండి యెక్కువజను లాసంవత్సరఁపు వేసవియం దటకుఁ జేరిరని తెలియుచున్నది. బజారు లత్తరి నిర్మింపఁ బడెనట.

ఆకాలఁపు టిండ్లబాడుగు లట ౭౦౦ మొదలు ౮౦౦ దనుక నుండెననియు, ఒక్క ఎబ్బెవిల్లీ యను గృహమునకు మాత్రము ౧౫౦౦ లుండెననియుఁ దెలిసెడిని.

ఆసంవత్సరమే మే ౭ తేది మహారాజా రంజ త్సింగుగారి రాయబారము గవర్నరుజనరల్‌గారిని దర్శించెను. మే ఎన్మిదవతేదీని హిల్‌సంస్థానఁపు ప్రభువులను రావించి దర్బారు జరపిరట. మే ౨౪ తేదీ విక్టోరియామహారాణిగారి జన్మోత్సవమును కడు వైభవముతో జరపిరట. ఆఫ్ఘన్‌యుద్ధసంబం ధమున స్పెనిష్ సిమ్లా మేనిఫెస్టో పత్రము ఆక్లాం డుహౌస్ ప్రక్కనేయున్న సెక్రిటరీలాడ్జినుండి ౧౮౩౮ అక్టోబరు ౧ తేదీని వెలువడెనట.

అక్కాలమున జక్కూశిఖరమును, అక్కాల మున పాశ్చాత్యాయఁకాలములం దెల్లరు జేరుకొను చుండుతావుగను, ఆనండేలు అల్పాహారవిందుల తావుగను నుండెనట. ఇప్పు డెన్మిదినెలలు ఇండి యాప్రభుత్వనిలయమై కాల్కానుండి ప్రత్యేకఁపు (నన్నఁపు) టినుపబాటఁ గల్గి యనుదినము కల కత్తా మెయిలు గొనుచున్న మహానగరమై యు న్నది. ఇందు రిక్షాబండ్లే వీధిపయనముల కాధా రము. గుఱ్ఱఁపుఁబండ్లుగాని, మోటారులుగాని యట వాడ వీలుకాదు. ఉత్సవముల కొరకు వైస్రాయిగారికిని, పంజాబుగవర్నరుగారికిని మా త్రము కొంతదూరమే నడుచు గుఱ్ఱఁపుబండ్లు కలవు.

**సిమోస్కోప్** (Cymoscope):—wire-less teligraphy యందుఁగాని, teliphoney యందుఁగాని యుపయోగించిన eheric waves ను కనిపెట్టుటకై నపరికరము. దీనిని Dectector అనియు వాడెదరు.

**సియానిక్ఆసిడ్**(Cyanic acid):— ఇదియావిరిఘాటులం గల్గించును. అందువలన కండ్ల వెంట నీరుకారును.

**సియానోమీటర్** [Cyanometer]:— ఇది యాకాశఁపురంగు దట్టమును వివరించుపరిక రము. meleorogical instrunent గఁపరిగ్ర హింపఁబడియున్నది.

**సియ్యర్రీలియోన్**:— ఆఫ్రికాఖండమున నాఫ్రికాపశ్చిమభాగమున నప్పర్గినియాయందున్న సెటల్‌మెంటుస్టేషను—క్రీ. వె. ౧౬౮౭ లోఁ దొలు

తబానిసవ ర్తకము నాఁపుట కేర్పాటుచేయఁబడి నది. ఫ్రీటౌన్ దీనికిఁబ్రిధానస్థానము (అప్పర్గినియా దేశము చూడుఁడు.)

**సిరా పరిశ్రమ:—** దీని కాంగ్లమున 'writing fluid' అనెదరు. ఇది యనేకరంగు లుగ నున్నను, నలుపు, ఎఱుపు, ఆకుపచ్చరంగుల సిరాలు భరతదేశమున నాదినుండియు వాడుక యం దుండినవి. కరక్కాయలతోఁ జేయఁబడిన సిరాయు, చోళ్ళు మాడ్చి చేసినసిరాయు, నాంధ్ర దేశమున సుత్రిసిద్ధములై యుండెను. ఇప్పు డా పరిశ్రిమలు క్షీణించినవి.

పాశ్చాత్యులందు 'Blue-black writing fluid' అనియు, 'Red ink' అనియు, 'Green ink' అనియు, మూడు రంగుల సిరా పరిశ్రిమలును, 'Blue-Red లేక Violet ink' పరిశ్రిమయుఁ గలవు.

Blu-blabk writing fluid పరిశ్రిమ యందు—

| | |
|---|---|
| Powdered galls | 15 భాగములు |
| Ferrus sulphate culcined | 5 భాగములు |
| Iron filings free from rust | 4 భాగములు |
| Indigo | ½ భాగము |
| Sulphuric acid Sp. gr 1. 84 | 3 భాగములు |
| Distilled water (శుద్ధజలము) | 200 గాలనులు |

Galls ఇనుపపాత్రి లేక రాగిపాత్రియందు నీటితో నుడుకబెట్టి, వడకట్టుదురు. మఱికొంత నీటియందు Ferrous sulpaate ను sulphuric acid నందు Indigo యును కరగించుదురు. ఆనీలియందు కలపిన sulphuric acid నందు iron solution కల్పి యందు ఉక్కుపొడుముజేర్చి, (ఇంనువలన) excess of acid neutralise అకౌన ట్లొకవారము లేక పదిదినములు వదలుదురు. Litmus paper తో దానింబరీక్షించి, neutral అయినట్లు తృప్తికరముగఁ గల్పించినపిదప solution of galls అందు చేర్చిన, నల్లఊదాసిరా యగును.

Red ink (ఎఱ్ఱసిరా) చేయుటకు—

| | |
|---|---|
| Erythrosine | 2 భాగములు |
| Green Arabic | 2 భాగములు |
| Boric acid | 2 భాగములు |
| Distilled water | 198 భాగములు |

ఏసిడ్ (acid) తప్ప తక్కినవన్నియుఁ గల్పి యుడికించి, పిదప acid చేర్చుదురు. ఇది ఎఱ్ఱ యగును.

ఇంక నెఱ్ఱవూదాసిరా తఱచుగ రబ్బరుస్టాంపు ముద్రిలకు వాడుదురు. అందు రంగు వేడినీటఁ గఁగించుటవలననే యగును. ఇది చాలయరుదు.

**సిరికొలఁదీ చిన్నెలు మగనికొలఁదీ వన్నెలు:—**

(ఆంధ్రలోకోక్తి.)

**సిరిప్రెగ్గడ ధర్మనామాత్యకవి:—** ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడిన వాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. హారితసగోత్రము. తండ్రిపేరు తిప్పరాజు. గోదావరీ, కృష్ణామండలప్రాంతదేశవాసుఁడని (అనఁగా ఇందుర్తిసీమ నివాసి యని) యు మేనమామ పే రూరునివాసి యనియుఁ జెప్పఁబడినది.

రచించినది నలచరిత్రము. దీనిని శ్రీవేంకటేశ్వరస్వామికిం గృతిసమర్పించెను.

**సిరియస్ (Sirius) గోళము:—** ఆకాశమునఁగల గోళములలో నెక్కువప్రకాశము సూర్యునకుఁ బిదపఁ గల్గినదనియు, magnitude 1·4 అనియు దీనికి alpha cunis majoris అనియు, Dog star అనియు వాడుకగూడ గలదనియు, double star అనియు క్రీ. శ. 1862 కన్గొనఁబడినదనియుఁ జెప్పఁబడినది.

**సిరియాదేశము:—** ఆసియాఖండమున యూఫ్రటీసునదికిని, మధ్యధరాసముద్రమునకును నడుమనున్న దేశము. ఉత్తరమున టారస్పర్వతపంక్తియు, దక్షిణమున నరేబియాదేశమును ఎల్లలు. దీనితూర్పుభాగము సమతలము. లెబనాన్పర్వతపంక్తులు రెండువరుసలుగ సారవంతమైనప్రదేశమగు కొయిలీసిరియాను జుట్టుకొని యుత్తరదక్షిణములకు వ్యాపించియున్నవి. ఓరొంటీసునది యుత్తరవాహినిగను, లియోంటీసునది లెబనాన్పర్వత దక్షిణఁపు టేటవాలునను ప్రవహించుచున్నవి. వేసవియం దెండలు చాల తీక్ష్ణముగా నుండును.

సిరియా తూర్పుభాగమున నిసుకయెడారులు కలవు. సముద్రతీరములు కోయెల్సిరియావలెనే సారవంతములుగ ఫలవంతములై యున్నవి. ధాన్యములు, పత్తి, పొగాకు పైరు చేయఁబడుచున్నవి. పండ్లు సమృద్ధిగఁ బండుతోఁటలు కలవు. ద్రాక్షతోఁటలు చక్కఁగాఁ బైరగుచున్నవి. పట్టుపురుగులనుండి పట్టు విస్తారము చేయఁబడుచున్నది. ఆదికాలమున సిరియాదేశములోని లెబనాన్ అడవులు సీడరుకఱ్ఱకుఁ బేరందియుండెఁగాని, యిప్పుడు చాల క్షీణించి లెక్క చెట్లుమాత్రి మున్నవి. ద్రాక్షలంగూర్చి బైబిలునందు, చాల నతిశయముగఁ జెప్పఁబడినది. జహ్వాదేవుఁడు 'milk & honey Land' అని చెప్పిన దేశ మిదియే.

ఇది టర్కిప్రభుత్వమునకు లోఁబడినదేశమగుట తురుష్క లీదేశమున నధికారముగల ప్రజలుగ నున్నారు. ఆదిమనివాసులగు సిరియనులు సేద్యగాండ్రుగ నున్నారు. లెబనాన్పర్వతసీమలందు మారోనెటీతెగవారు, డ్రూసీతెగవారు వసించుచున్నారు. మారోనెటీ లొకవిధమగు క్రైస్తవులు, డ్రూసీలు రణశూరులు. మహమ్మదీయ మతమునుండి విడిపోయి యొకవింతయగు ప్రత్యేకమతస్థులుగ నున్నారు. వారు స్వతంత్రులు గాని పరతంత్రులు గారు.

అలెప్పోపుర ముత్తరసిరియాయందు ముఖ్యపట్టణము, వర్తకస్థానమునై యున్నది. ఇది యూఫ్రటీసునదికిని, మధ్యధరాసముద్రమునకును, మధ్యగా నున్నది. అలెగ్జాండ్రెట్టా లేక స్కాండెరూన్పురము దీనికి రేవుపట్టణము. ఇది యలగ్జాండరు దిగ్రేటుగారు నిర్మించినదట. తొల్లింటి పేంటియోచిపుర మిప్పుడు 'అంటాకియా' యనంబరఁగుచు నొకమతాధ్యక్షుని నివాసమై యున్నది. లటాకియాపురము పొగాకువర్తకమునకును, బాల్బెక్కపురమును, తొల్లింటి కప్పడములపాడులకు పేరందియున్నవి. దమస్కసుపురము వర్తకస్థలము. ఇది కడుపురాతనపట్టణములలో నొకటిగఁ జెప్పఁబడినది. దీని పరిసరప్రాంతములు జలసమృద్ధిఁగల సారవంతమైనభూములు. గులాబీపూలకు, నత్తరు, పన్నీరులకు, కత్తులకు, నలుగులకు దమ్మషు లేక 'డమస్కు' అనంబడు వన్నెలబట్టనేతలకుఁ బ్రసిద్ధి వహించియున్నది. బైరూట్పురము సిరియాసముద్రతీరమునఁ దమస్కసుపురమునకు రేవుపట్టణము. పెద్దపట్టణము.

**సిరోకో:—** [హర్మాలమ్ ప్రచండవాయువు చూడుఁడు.]

**సిరోహీసంస్థానము:—** ఇండియాదేశ మునందలి రాజపుటానా యేజన్సీలోని బ్రిటీషు రక్షితసంస్థానము లిరువదింటిలో నొకరాజపుత్రసంస్థానము. [రాజపుటానా యేజన్సీ చూడుఁడు.]

సిరోహీపురము రాజధాని. జైనుల సుప్రసిద్ధ యాత్రాస్థలమును, సానిటేరియమునునగు అర్బుద (ఇప్పటి ఆబూ) పర్వతశిఖరస్థల మీరాజ్యము లోనిది.

**స్లిర్లోయిన్ (Sirloin):—** తొడ, పిరుదులు కలిసినశరీరభాగము. ఇంగ్లాండుదేశ మేలిన రెండవ ఛార్లెస్ నరపతి యొకప్పుడు భుజింపుచుండుతరి నొకగొడ్డుమాంసఁపుఁజట్ట యాయన నోటికి మిగుల రుచికరమైతోఁప దానిపై ననుగ్రహము వోడమి నాఁడాదిగ గొడ్డుమాంసఁపుఁజట్టల కంతటినుండి Knight పదవి గలుగ నుత్తరు విచ్చెనట. (Knight) బిరుదముకలవారి నామములకు ముందు Sir అనుపదము చేర్చుదురు. గాన నాఁడాదిగ 'Sirloin' అని వాడుక గల్గెనట.

**సిలండర్ ప్రింటింగ్ (Cylender Printing):—** పుస్తకముద్రణాలయముల నుపయోగించు యంత్రపరికరము.

(కలంకారి పరిశ్రమ చూడుఁడు).

**సిలికా (Silica):—** గాజు తయారుచేయుట కావశ్యకమగు నొకవిధమగు నిసుకపదార్థము. సికత, సైకతశబ్దసంబంధముగల శబ్దమే యీసిలికాయనునదియును అని శాబ్దికు లందురు. వస్తుతత్త్వమును అట్టిదే.

(కాచకుంభకారి పరిశ్రమలు చూడుఁడు.)

**సిలిషియన్గేట్సు:—** ఇది ఏష్యామైనరులోని టార్సస్సుపురముకడనున్న యొకకొండ లోయ మార్గము. (ఏష్యామైనరు చూడుఁడు).

**సిలిషియాదేశము:—**

(ఆస్ట్రియాదేశము చూడుఁడు).

**సిలువ (Cross):—** ఏసుక్రీస్తుప్రభువు సిలువపై మేకులంగొట్టఁబడి మరణించుట బైబిలునందు వివరింపఁబడినది. నాఁడాదిగ క్రైస్తవమతస్థులకు సిలువ పవిత్రమతచిహ్నముగఁ గైకొనఁబడియున్నది. ఆయనమృతికిమునుపే సిలువ పవిత్రచిహ్నముగ వారియందుఁ దలంపఁబడుచుండెనట. ఆకాలమునాఁడు స్వస్తికము క్రాసుగఁ దలంపఁబడుచుండినదని చెప్పఁబడినది.

భరతదేశమునందునను, చీనాదేశమందునను, స్వస్తికము చిహ్నముగ వాడుకనందియుంట కృతయుగమునుండి కలదు. హిందువు లిప్పుడు స్వస్తికమును బసవనిగద్దె (బసవేశ్వరుని భద్రాసనము) యనుచుందురు.

క్రీస్తుప్రభుని Latin cross అనుసిలువపై మేకులంగొట్టి మరణింపఁజేసిరట. ఆయనను మేకులంగొట్టినసిలువ పాలస్తినాదేశమున S. Helena అనువారికిఁ ద్రవ్వఁగా దొరికినదట. అది మొదలు నిజముగుసిలువ దొరకి యుత్సవము మేనెల 3 తేదిని జరపుచున్నారని విందుము.

**సిలువలు (Crosses)**

స్వస్తికము.
ఇదియొక సిలువగ
తలంపఁబడుచున్నది.



పాపాల్ క్రాస్.
పోపుగురుని చిహ్నము.



Potent Cross
పోటెంటుక్రాసు.



Trefoil Cross.



Anchor Cross.



Tau Cross.



Latin Cross.
క్రీస్తుప్రభువు సిలువవేయఁబడిన చిహ్నము.



Maltese Cross.



St. Andrew's Cross.



Greek Cross.





Cross in Heraldry.

Pattee Cross.



a. Larraine Cross.
b. Celtic Cross.
c. Ansated Cross.









**సిలోజిజమ్ (Syllogism) ప్రాచీన ఫ్రెంచిభాషాజన్యము:**—మూఁడువిధములగు పద్ధతులపై నాధారపడియుండు తార్కిక వాదము. మూఁడవసిద్ధాంతము మొదటిరెండింటిపై నాధారపడియుండును.

ఉదా:—

1 మనుష్యు లందరు చనిపోదురు. (Major)

2 చక్రవర్తియు మనుష్యుఁడే.

3 అందువల్ల చక్రవర్తియు చనిపోవును. దీనిని భారతీయ తర్కశాస్త్రమున—

I అనుమానప్రమానము—ఏలయనఁగా మనుష్యులు ప్రాయశః కొంతకాలమునకు, చనిపోవుట జరుగుచున్నదే కాని యెటుల చనిపోవునో యెపుడు చనిపోవునో, ఇంద్రియగోచరమగుట లేదు.

II ప్రత్యక్షము— చక్రవర్తి మనుష్యుఁడేయని మన యింద్రియములచే గుర్తించితిమి.

III పై రెండుకారణములచే, చక్రవర్తియు మానవులందరివలెనే మరణించు ననుట సాధ్యము.

**సివిల్ ఇయర్ (Civil year) వత్సరము:**—

(కాలవిభజనము చూడుఁడు).

**సివిల్ సర్వీసు ఉద్యోగములు:**—

తొల్లింట ప్రభువులు సర్వతంత్రస్వతంత్రులై యుండుతరి నన్నియుద్యోగములు, నుద్యోగస్థుల జీతములు, నరపాలుండగు రాజునాజ్ఞమేరకే జరుగుచుండునవి. రానురాను ప్రజాస్వాతంత్ర్య ముదయించుకొలంది ప్రజాభిప్రాయసంస్థ లేర్పడి కొన్ని

కొన్ని యుద్యోగశాఖలను వశపఱచుకొనినవి. అట్లే సైన్యములు, నావికాదళములు, నృపాలుని వశమునుండి ప్రజాభిప్రాయసంస్థకు వశమయ్యెను. మిలిటరీనుండి వేరైన వరిపాలనశాఖకు 'సివిల్' అని పేరై ఆశాఖోద్యోగులకు 'సివిల్ సర్వీస' సని వాడుక గల్గెను.

పిదప కొంతకాలమున కీశాఖయు ప్రజాభిప్రాయవశమయ్యెను. నరపతియందు కేవలాధిపత్యమును ప్రజాభిప్రాయము మేరకు పాలనశాసనములను శాసించు నధికారమును స్థిరపఱుపఁబడి యున్నిశాఖలతోఁబాటు సివిల్ సర్వీసుఉద్యోగశాఖయు ప్రజాభిప్రాయసంస్థకు వశపఱుపఁబడిన ప్రభుత్వమునకు స్వాధీనమై యట్లే యున్నది.

సివిల్ సర్వీసుఉద్యోగులు ప్రభువునకే సేవకులని వాడఁబడుదురు. వారు ప్రభువుశాసించు ప్రభుత్వమునందలి యుద్యోగులని భావము.

## సిస్టర్సియనున్ (Cistercians):—

ఈక్రైస్తవసంఘమును S. Robert అనుపేరుగల ఒక అబ్బాటుగురుఁడు ఫ్రాన్సుదేశమున క్రీ. శ. ౧౦౯౮ లో స్థాపించెననియు, పదునెన్మిదవశతాబ్దాంతకాలమున నిదియడఁచివేయఁబడినదనియు, పందొమ్మిదవశతాబ్దాంతకాలమున పునరుద్ధరింపఁబడినదనియుఁ జెప్పుదురు.

## సిసిరోన్ డిస్క్రిప్షన్ (Cicerone description):-

అతిగంభీరవచనములములతో వివరింపఁబడు వర్ణనల (description) పేరున వాడుచున్నారు. తొల్లి Cicero అట్లువర్ణించుచు తానితరులకుఁ జూపుచుండువాఁడట.

## సిసిలీద్వీపము:—

ఐరోపాఖండమున నిటలీదేశమునకుఁజెంది దానికి దక్షిణముగా మధ్యధరాసముద్రమందున్న యొక పెద్దద్వీపము. దీనినేల సారవంతమై పంట లధికముగానుంట సిసిలీద్వీపమును 'Granary of Italy' అనుదురు. (ఇటలీదేశము చూడుఁడు.) ఇందు 'ఎట్నా' యగ్నిపర్వతశిఖరము సుప్రసిద్ధము. పాలెర్మోపురము ముఖ్యపట్టణము. సౌందర్యవంతమగు పట్టణము. విశ్వవిద్యాలయస్థానము. మెస్సీనాజలసంధితీరముననున్న మెస్సినాపురము వర్తకస్థానము. సైరాకుసీపురము తొల్లింటి రాజధాని. గిర్గెంటీపుర మిచటిగనులందు దొరకిన గంధకమును విస్తారమెగుమతిచేయుచుండు రేవు. కెటానియాపురము ఎట్నాఅగ్నిపర్వతపాదమునందున్న పురము. మెస్సీనాజలసంధికి సిసిలీవైపు charybdis అనిపిలువంబడు eddy శిలాతలమును, ఇటలీవైపు Scylla అనిపిలువంబడు శిలాతలమును గలవు. ఈరెండును నోడల కపాయకరములే. అనేకయోడలిటం బగిలిపోయినవి.

## సిస్మోలోజీ:—

భూకంపములంగూర్చినకళ.

## స్కిప్పింగ్ (Skipping):—

వాణిజ్యపరిభాషయం దొకపేకేజినుండి వేఱొకపేకేజీలోనికి సరకులను తాత్కాలికముగ మార్చుట, తారు మొదలగువవి పూయించుట మొదలగుపనులకీపేరు వర్తించెడిని.

## స్కిమ్మిల్కు (Skim milk):—

(Condenced milk చూడుఁడు.)

## స్కియోద్వీపము:—

తొల్లింటిపేరు కియోస్. (ఏష్యామైనరు చూడుఁడు)

## స్క్రిప్ (Scrip)—

వాణిజ్య పరిభాషయందు [illegible]ముల షేరుసర్టిఫికేటున కీపేరు గలదు.

**స్క్రివెనర్ (Scrivener):—** కమీషన్ లాభము తీసుకొని యప్పు కుదుర్చువాని కీపేరు వాడుచున్నారు.

**స్కియాగ్రాఫీ (Skiagraphy):—** చిత్రకళయందు ఛాయలు, నీడలు (Shadows) మొదలగువానియొక్క భావములకు సంబంధించిన కళ.

**స్టిగ్మాటా గురుతులు:—** రోమన్కాత లిక్కు క్రైస్తవధర్మమున ప్రభువగు ఏసుక్రీస్తు సిలువవేయఁబడినతరి వారిశరీరమున నేర్పడిన గాయముల యానవాలుగుర్తుల కీపేరు ఆమతగ్రంథరచయితలు వాడియున్నారు.

**స్టిఫెనింగ్ ఆర్డరు(Stiffening order):-** వాణిజ్యసంబంధపరిభాషాపదము. దిగుమతిసరకును పూర్తిగ దింపకమునుపే యొకఓడ తన Ballast గాని బరువుసరకులుగాని (దాని steady or due weight) తీసికొనుటకు custom ఉద్యోగుల అనుమతిపత్రము.

**స్ట్రిప్స్ండుస్టార్సు (Strips and stars):—** అమెరికాసంయుక్తరాష్ట్రముల జాతీయ పతాకము (జండా) పై ఏడుఎఱ్ఱరంగు లడ్డగీతలును, ఆరుతెల్లగీతలును, నలుబదియెన్మిది నక్షత్రములగురుతులును వేయఁబడియుండును. అడ్డగీతలు పదమూడును సంయుక్తములైన పదమూడు Statesను, నక్షత్రములు పెద్దవగునీ యూనియనుకుచేరిన నలువదియెన్మిది statesను, దెల్పుగురుతులై యున్నవి. Declaration of independence నందుఁజేరిన పదమూడు States అనియెఱుంగునది.

గాన విదేశస్థు లమెరికాసంయుక్తరాష్ట్రములను 'Land of streps and stars' అని వాడుచుండుటయుం గలదు.

**స్థిరజీవులు (చిరంజీవులు దీర్ఘాయుష్మంతులు) ఎనమండుగురు:—**

౧ అశ్వత్థామ— ద్రోణాచార్యుని కుమారుఁడు. తల్లి కృపీదేవి. బ్రాహ్మణుఁడు.

౨ బలిచక్రవర్తి— ప్రహ్లాదుని కుమారుఁడగు విరోచనునికొమారుఁడు. విష్ణుదేవుఁడు వామనావతారమున మూఁడడుగులభూమి యడుగ దానమొసర్చినవాఁడు.

3 వ్యాసమహర్షి— కృష్ణద్వైపాయనుఁడు. పరాశరమునికిని సత్యవతీదేవికిని కుమారుఁడు. మహాభారతమును, పురాణములను రచించిన కవి. బ్రహ్మసూత్రములను రచించెను. వేదములను విభజించినవాఁడు.

౪ ఆంజనేయుఁడు (హనుమంతుఁడు లేక మహావీరుఁడు)— సుగ్రీవునకు మంత్రియైయుండెను. పుంజికస్థల యను నప్సరస శాపమువలన నంజనయై వానరరూపమున నుండుతరి నామెగర్భమున వాయ్వంశమునఁ బుట్టినవాఁడు. శ్రీరామభక్తుఁడు.

౫ విభీషణుఁడు— విశ్రవసునకు కైకసియందుఁ బుట్టి మూఁడవ కుమారుఁడు. రావణుని తమ్ముఁడు. అతనియనంతరము లంకారాజ్యమేలినవాఁడు.

కృపాచార్యుఁడు— సత్యధృతుని కొమారుఁడు. అశ్వత్థామకు మేనమామ.

౭ పరశురాముఁడు— జమదగ్నికిని రేణుకాదేవికిని కుమారుఁడు. విష్ణుదేవుని దశావతారములలో నొకటిగ నెన్నుదురు.

౮ మార్కండేయర్షి— మృకండమహర్షి కొమారుఁడు. ప్రసిద్ధుఁడు.

**స్థిరాసనము:—** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి.

మతముపై చుకొని కూర్చుండి భ్రూమిమధ్యమున లక్ష్యమునిల్పుట స్థిరాసనమనంబడి శ్రమను నివారించి విశ్రాంతి గల్గించునని చెప్పఁబడినది.

**స్పింథారిస్కోప్ (Spinthariscope):-** గ్రీకుపదజన్యము. రేడియమ్‌నుండి వెడలిన కిరణములకు ప్రత్యక్షతంగల్గించు నొకపనిముట్టు (యంత్రము). ఇది సర్విలియంకూృక్సు పండితుఁడు కనిపెట్టెను.

**స్పినిక్సు చిత్రప్రశ్న (Riddle of the Sphinx):—** 'స్పినిక్సు' అన గ్రీకుభాషయందు బలాత్కారముగఁ జంపునది యని భావము. గ్రీకుదేశస్థులయం దీకథ వారిపూర్వులనాఁటినుండియు జ్ఞాపకపరంపరచేఁ బోషింపఁ బడుచున్నది.

ఈజిప్టుదేశమున నొకబాటప్రక్క నొకరాతి బండపై కూర్చినమార్గమున నడుచువారిం బ్రశ్నించుచుండెడిదఁట. సదుత్తర మీయలేకుండినప్పుడే మరణమువాతఁబడుట తప్పనివిధియఁట. స్పినిక్సు రెక్కలుగలసింహమునకు మనుష్య స్త్రీముఖ మమరిన ట్లుండెడిదఁట. ఆప్రశ్నకు ప్రత్యుత్తరమీయ నెవ్వరికి చేతఁగాక అందఱు మరణించుచుండుటంజేసి యాప్రశ్న యేదియో నెవ్వరెఱుంగఁ జాలకుండిరఁట. ఆమెయనిన చుట్టుపట్లవారి కందరికి భయమే.

ఒకతరి నొకరాకొమరుం డామార్గమున నేగుచు ఆమెచే నిట్లు ప్రశ్నింపఁబడెనట. తనయుదయకాలమున నాల్గుకాళ్ళును, మధ్యాహ్నమున రెండుకాళ్ళును, సాయంత్రమున మూడుకాళ్ళను నడుచునదియును, మఱియుం దానెక్కువ కాళ్ల నడచుతరి నెక్కువబలహీనముగ నుండునదియు నొకటికల దేదియన నారాకొమరుండు మనుష్యుఁడే యని ప్రత్యుత్తర మిచ్చెనట. ఆమె తోడనే యాతనికడకేగి వినయముగ మ్రొక్కి యారాకొమరుని వరించి తనరాజ్యము నాతని వశమొనర్చి యాతని దేవియై యుండెనఁట.

ఈజిప్టుదేశమున రోపట్టణమునకుఁ గతిపయదూరమునంగల 'స్పినిక్సు' [Sphnix] నిదిగాఁ జెప్పెదరుగాని పోలికయందుఁ గొంతిభేదము కలదు. రెక్కలు లేకుండుటయు ముఖము పురుషాకృతి నుండియుంట నాకథకును, ఈవిగ్రహమునకును సంబంధముండునా యని సంశయము దోఁచెడిని.

**స్పినిస్టర్ (Spinster):-** పెండ్లిగాని కన్యకు వాడుఁక . నూలు ఒడుకుట చేతఁగానిది యైరోపాదేశములందు పెండ్లికాకుండెడిదఁట గాని పెండ్లిగానిస్త్రీలకు spinster (నేయుచుండునది) యనిపేరును, పెండ్లియైన పిదప wife (weave అన నేతయని యర్థము) అనియు పేరులు. నేత కత్తె లేక నేతనేర్చినది యనిభావము.

**స్పినోజిజమ్ (Spinozism):—** డచ్చిదేశపు యూదుమతస్థుఁడగు స్పినోజాయొక్క సిద్ధాంతము. ప్రకృతికిని భగవంతునకును భేదము లేదనియుఁ, బ్రతిరూపమును భగవానునియంశమే యనియు నితని సిద్ధాంతము.

**స్పిరిచ్యుఆలిజమ్(spiritwalism):—** చనిపోయినవారిప్రాణము (spirits) లతో సంభాషించువిధాన కల యని పాశ్చాత్యులందు వాడఁబడుచున్నది. ఇది కేవలము నమ్మకమే యనియు, మాధ్యస్తత వహించియున్న con-

trols ద్వారా నడువవలసిన దనియుఁ జెప్పఁబడి నది. అవి 'spirits' అని యెఱుంగవలయును.

**స్పిరిట్యుయాలిజమ్ (Spiritualism):-** ఫ్రెంచిభాషాజన్యము. మరణించినమానవులయొక్క అదృశ్యశక్తులకును, జీవించియున్నవారికిని (శక్తులకును) గల సంబంధించినతత్త్వమును దెల్పువిద్య. పదార్థమునకును (Spirit) శక్తికిని నననఁగా నాత్మకును సంబంధములేదనియు, ఆత్మ మరణించుట లేదనియును, అందువలన మరణించినవారియొక్క శరీరమునందుండిన యాత్మతో జీవించువారి యాత్మ ననుసంధానము చేయవచ్చుననియు నీ సిద్ధాంతము.

**స్పిరోగ్రాఫీ (Spirography) :-** ఉచ్ఛ్వాసనిశ్వాసములను లెక్కించుట కుపయోగపడు పరికరమునకు 'స్పిరోగ్రాఫ్' అనిపేరు. దీనినే 'స్పిరోమీటర్' అనియు నందురు. ఈవిధానముం దెల్పు విద్యకు 'స్పిరోగ్రాఫీ' అనిపేరు.

**స్ఫినిక్సు కాలము కర్త:—** ఈజిప్టుదేశమునందు కైరో (తొల్లింటి ఆల్కహిరా) పట్టణమున కైదుమైళ్ళదూరమున నున్న పిరామిడ్సున కవ్వలపక్కను స్ఫినిక్సు (ఏకశిలావిగ్రహచిత్రము) కలదని యెల్లరెఱింగినదే. ఇది మనుష్యముఖము. చాలపెద్దచిత్రము. అనేకులు దర్శించిపోవుచుందురు.

ఇది క్రీ. మునుపు ౩౭౩౦ సంవత్సరములనాఁడైగుప్తుదేశ మేలుచుండిన ఖాఫ్రా (ఫరో) చక్రవర్తి నిర్మింపఁ జేసెనని తేలుచున్నది. ఈభూనాథుని సమాధి జగత్ప్రసిద్ధమైన (కుఫూ, కాఫ్రా, మేంకారా [ఫరోల] మూడు పిరామిడులలో నొకటి. [పిరామిడ్సు చూడుఁడు - ఐగుప్తుదేశము చూడుఁడు - కైరోనగరము చూడుఁడు.]

**స్లింగింగ్ (Slinging):-** వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఓడలోని కెత్తుకొనుటకు రేవున దరినేర్పఱచిన సరకులజుచ్చి గొలుసులతోఁగట్టుటకీ పేరు వర్తించును. ఓడలోసరకులవేయుచువారే యిది చేయింతురు.

**స్విజర్లాండుదేశము:—** ఐరోపాఖండమునందలిదేశము. దీని కేసముద్రము తగులుటలేదు. ఉత్తరమున జర్మనుదేశము. తూర్పున నాస్ట్రియా దేశము. దక్షిణమున నిటలీదేశము. ౧౬౦౦౦ చతురపుమైళ్లు.

ఐరోపాఖండమున స్విజర్లాండు ఎక్కువయెత్తైన దేశమని చెప్పఁబడినది. పర్వతమయమైనది. జూరాపర్వతములు ఫ్రాన్సుదేశఁపు సరిహద్దున నున్నవి. ఆల్ప్సుపర్వతములు దేశమంతటను గలవంతయేగాక, ఇటలీ సరిహద్దును వీటినుండియే వేఱగుచున్నది. జూరాపర్వతమున నడవులుకలవు. ఆల్ప్సుపర్వతములందు దక్షిణపుహద్దున మోంటురోసాశిఖరము దేశమందలిశిఖరములలో నెత్తైనది. దానికన్న నెత్తగు మోంటుబ్లాంకుశిఖరము ఫ్రాన్సుదేశమున నున్నది. దక్షిణపుఆల్పుపర్వతపంక్తితో పైనరుసను బెర్నీస్ ఓబరులాండుపర్వతములపంక్తియు రెంటికిని నడుమ రైనునదిపై లోవయుం గలవు. ఓబరులాండు స్విస్భాషాపదమున కాంగ్లభాషయందు 'Over land' అని యర్థము. అనఁగా 'Upper land' అనిభావము. ఇందలి Finstera arhorn అనుశిఖరముగలదు. అందు ఆర్‌నది జన్మస్థానముగలదు. పర్వతోపరిభాగములం దెప్పుడు కరఁగనిమంచుశిఖరములు వింతసౌందర్యముం జూపుచుండును. వీట్లయందున్న Glaciers నుండి యొక్కొకతరి మంచుజారి క్రింది లోవలందుఁ జేరుకొని దారియందుండుసర్వమునకు

నష్టముం గల్గించుచుండును. వీటికి 'Avalches' అనిపేరు. లోవలక్రిందిభాగమున సరస్సులు కలవు.

మంచుభాగములకు దిగువను క్రిందుగనున్న చెట్లువఱకుం గలప్రదేశములు గొప్పపచ్చికబయళ్ళుగ నున్నవి. అందు చాలయెత్తునకు పెరుగు నొకజాతి శ్రేష్ఠమగుగడ్డికలదు. దానిలోనికి క్రింది భాగములరైతులు మొదలగువారు తమయాల పశువులం దోలుకొనిపోయి మేపుదురు. ఇందు మేయునావు లతిత్వరితముగ బలసి విస్తారముపాల నిచ్చుచుండును. వాటిని డబ్బాలందునింపి దేశదేశముల కెగుమతి చేయుదురు. ఇంకను cheese గంగూడఁ జేతురు. ఇచటి పచ్చిక పటవాలుప్రదేశములు క్రిందిప్రజలచే 'ఆల్ప్సు' అనంబడును. ఇట్టి గోగ్రాసంపుటాల్ప్సు ప్రతిగ్రామమునకుం గొంత గొంతగ నేర్పడియుండియాగ్రామంపుంబశువులందు మేయుచుండును. ఆల్ప్సు పర్వతములపైనుండి యవ్వలిదేశములకేగు కొండదారులు గలవు. వాటికి 'Pass' అనియెదరు. అట్టిమార్గములందు St. barnard pass ముఖ్యమైనది. అందుఁ గొందరు సన్యాసులును, కొన్ని యాప్రదేశంపుఁ గుక్కలును నుండి మంచుయందుఁ దగుల్కొనిన మార్గస్థులను రక్షించుచు సహాయమొనర్చుచుందురు. ఆకుక్కలకు 'సెంటుబార్నార్డుకుక్క' లని యొకజాతిగ నేర్పడినది. ఇంక నిట్టికొండమార్గములనేకములు కలవు. ఇటీవల నిటలీదేశమువైపున కొండయందు రంధ్రములం (Tunnels) బొడిచి యిరుపబాట నివ్వలకవ్వలకుం గల్పియున్నారు. వీటి యందు సెంటుగోతర్డు pass ను, Simplon pass ను ముఖ్యములు. ఇవి చూడఁదగినవింతలు.

రైనునది యుత్తరముగ కాన్సన్సు సరస్సుగుండా నడచును. అర్నది రైనునదియందు సంగమించును. హ్రోనునది జెనివాసరస్సుగుండా నడచి యవ్వలకుంజనును. జెనీవాసరస్సును లెమాన్సరస్సనియందురు. ఇన్‌నది యీదేశముగుండా ప్రవహించి డాన్యూబునదియందు సంగమించును. ఈ దేశమున సెంటిగోతర్డుశిఖరమున రైనునది, హ్రోను నది జన్మస్థానములు కలవు.

ఈదేశమం దింకను కోమోసరస్సు, న్యూఛాటెల్ సరస్సు, జూరిచ్ సరస్సు మొదలగుసరస్సులు సుప్రసిద్ధములు. కొండలక్రిందిభాగములు వేడిగను, మధ్యభాగములు సమశీతలములుగను పైభాగము లతిశీతలములుగను, నుండుట సహజము. ౬౦౦౦ అడుగులపైన కరుగనిమంచు గప్పియుండెడిని. వేఁడిగల క్రిందిప్రదేశములందుఁ గొంచముగ పంటలు పెట్టఁగల్గినను, సగటున స్విజర్లాండుదేశము వ్యవసాయదేశముగాదని గోగ్రాసదేశముగఁ జెప్పఁబడినది.పర్వతో పరిభాగములందు chamois జాతి మృగముల మెత్తనిదర్మములకై వేఁటాడుదురు.

స్విస్ప్రజలు కడుధైర్యవంతులు. గొప్పసాహసముగలవారయ్యు తా మొకరిజోలికిఁబోక యొకరి సొత్తున కాశింపక నుండుటయు, తమసొత్తుకాశించిన వైరులను వెనుదీయక చావునకైనను తెగించి పోరాడి పాఱఁదోలవలెనను పద్ధతిఁగలవారు. గొప్పస్వదేశాభిమానము, తృప్తిగలవారు. వీరంద రొకజాతివారు. గారు మూఁడింట రెండువంతుల వారు ట్యూటన్ తెగవారు. వీరు మాట్లాడుకొను నది జర్మనుభాష. నాల్గవవంతు ప్రెంచిజాతుల సంతతివారు. వీరు ప్రెంచిభాష మాట్లాడుకొందురు. పశ్చిమమున నుందురు. దక్షిణమున నిటాలియన్‌జాతిసంతతివారు కలరు. వా రిటలీభాషలను వాడుదురు. ప్రొటస్టాంటులు, రోమన్కాతలిక్కులు వీరియందుఁ గలరు. అందరు నైకమత్యముతో నుందురు. దేశమున నాల్గుయూనివర్సిటీలు కలవు. ప్రారంభవిద్య యుచితము, నిర్బంధముగ

trols ద్వారా నడువవలసిన దని యుఁ జెప్పఁబడె నది. అవి 'spirits' అని యెఱుంగవలయును.

స్పిరిట్యుయాలిజమ్ (Spiritualism):- ఫ్రెంచిభాషాజన్యము. మరణించినమానవులయొక్క అదృశ్యశక్తులకును, జీవించియున్నవారికిని (శక్తుల కును) గల సంబంధించినతత్త్వమును దెల్పువిద్య. పదార్థమునకును (Spirit) శక్తికిని ననఁగా నాత్మ కును సంబంధములేదనియు, ఆత్మ మరణించుట లేదనియును, అందువలన మరణించినవారియొక్క శరీరమునందుండిన యాత్మతో జీవించువారి యాత్మ ననుసంధానము చేయవచ్చుననియు నీ సిద్ధాంతము.

స్పిరోగ్రాఫీ (Spirography) :—ఉచ్ఛ్వా సనిశ్వాసములను లెక్కించుట కుపయోగపడు పరి కరమునకు 'స్పిరోగ్రాప్' అనిపేరు. దీనినే 'స్పిరో మీటర్' అనియు నందురు. ఈవిధానముం దెల్పు విద్యకు 'స్పిరోగ్రాఫీ' అనిపేరు.

స్ఫినిక్సు కాలము కర్త:— ఈజిప్టుదేశ మునందు కైరో (తొల్లింటి ఆల్కాహిరా) పట్టణ మున కైదుమైళ్ళదూరమున నున్న పిరామిడ్సున కవ్వలపక్కను స్ఫినిక్సు (ఏకశిలావిగ్రహచిత్రము) కలదని యెల్లరెఱింగినదే. ఇది మనుష్యముఖము. చాలపెద్దచిత్రము. అనేకులు దర్శించిపోవుచుం దురు.

ఇది క్రీ. మునుపు ౭౨౫౦ సంవత్సరములనాఁ డైగుప్తుదేశ మేలుచుండిన ఖాఫ్రా (ఫరో) చక్ర వర్తి నిర్మింపఁ జేసెనని తేలుచున్నది. ఈభూనాథుని సమాధి జగత్ప్రసిద్ధమైన (కుఫూ, కాఫ్రా, మేం కారా [ఫరోల] మూడు పిరామిడులలో నొకటి. [పిరామిడ్సు చూడుఁడు - ఐగుప్తుదేశము చూ డుఁడు - కైరోనగరము చూడుఁడు.]

స్లింగింగ్ (Slinging):—వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఓడలోని కెత్తుకొనుటకు రేవున దరిచేర్చిన సరకులజుచ్చి గొలుసులతోఁగట్టుటకీ పేరు వర్తించును. ఓడలోసరకులవేయుచువారే యిది చేయింతురు.

స్విజర్లాండుదేశము:—ఐరోపాఖండము నందలిదేశము. దీని కేసముద్రము తగులుటలేదు. ఉత్తరమున జర్మనుదేశము. తూర్పున నాస్ట్రియా దేశము. దక్షిణమున నిటలీదేశము. ౧౬,౦౦౦ చతురపుమైళ్లు.

ఐరోపాఖండమున స్విజర్లాండు ఎక్కువయెత్తైన దేశమని చెప్పఁబడినది. పర్వతమయమైనది. జూరాపర్వతములు ఫ్రాన్సుదేశఁపు సరిహద్దున నున్నవి. ఆల్ప్సుపర్వతములు దేశమంతటను గల వంతయేగాక, ఇటలీ సరిహద్దును వీటినుండియే వేఱగుచున్నది. జూరాపర్వతమున నడవులుకలవు. ఆల్ప్సుపర్వతములందు దక్షిణపుహద్దున మోంటు రోసాశిఖరము దేశమందలిశిఖరములలో నెత్తైనది. దానికన్న నెత్తగు మోంటుబ్లాకుశిఖరము ఫ్రాన్సు దేశమున నున్నది. దక్షిణపుఆల్ప్సుపర్వతపంక్తితో పై నరుసను బెర్నీస్ ఓబరులాండుపర్వతములపంక్తి యు రెంటికిని నడుమ రైనునదిపై లోవయుం గలవు. ఓబరులాండు స్విస్సుభాషాపదమున కాంగ్ల భాషయందు 'Over land' అని యర్థము. అనఁగా 'Upper land' అనిభావము. ఇందలి Finstera arhorn అనుశిఖరముగలదు. అందు ఆర్‌నది జన్మస్థానముగలదు. పర్వతోపరిభాగము లం దెప్పుడు కరఁగనిమంచుశిఖరములు వింతసౌంద ర్యముం జూపుచుండును. వీట్లయందున్న Gla- ciers నుండి యొక్కొకతరి మంచుజారి క్రింది లోవలందుఁ జేరుకొని దారియందుండుసర్వమునకు

నష్టమును గల్గించుచుండును. వీటికి 'Avalches' అనిపేరు. లోవలక్రిందిభాగమున సరస్సులు కలవు.

మంచుభాగములకు దిగువను క్రిందుగనున్న చెట్లవఱకుం గలప్రదేశములు గొప్పపచ్చికబయళ్ళుగ నున్నవి. అందు చాలయెత్తునకు పెరుగు నొకజాతి శ్రేష్ఠమగుగడ్డికలదు. దానిలోనికి క్రింది భాగములరైతులు మొదలగువారు తమయాలపశువులం దోలుకొనిపోయి మేపుదురు. ఇందు మేయునావు లతిత్వరితముగ బలసి విస్తారముపాల నిచ్చుచుండును. వాటిని డబ్బాలందునింపి దేశదేశముల కెగుమతి చేయుదురు. ఇంకను cheese గంగూడం జేతురు. ఇచటి పచ్చిక పేటవాలుప్రదేశములు క్రిందిప్రజలచే 'ఆల్ప్సు' అనంబడును. ఇట్టి గోగ్రాసంపుటాల్ప్సు ప్రతిగ్రామమునకుం గొంత గొంతగ నేర్పడియుండియాగ్రామంపుంబశువులందు మేయుచుండును. ఆల్ప్సు పర్వతములపై నుండి యవ్వలిదేశములకేగు కొండదారులు గలవు. వాటికి 'Pass' అనియెదరు. అట్టిమార్గములందు St. barnard pass ముఖ్యమైనది. అందుం గొందరు సన్యాసులును, కొన్ని యాప్రదేశంపుం గుక్కలును నుండి మంచుయందుం దగుల్కొనిన మార్గస్థులను రక్షించుచు సహాయమొనర్చుచుందురు. ఆకుక్కలకు 'సెంటుబొర్నార్డుకుక్క' లని యొకజాతిగ నేర్పడినది. ఇంక నిట్టికొండమార్గములనేకములు కలవు. ఇటీవల నిటలీదేశమువైపున కొండయందు రంధ్రములం (Tunnels) బొడిచి యినుపబాట నివ్వలకవ్వలకుం గల్పియున్నారు. వీటియందు సెంటుగోతర్డు pass ను, Simplon pass ను ముఖ్యములు. ఇవి చూడందగినవింతలు.

రైనునది యుత్తరముగ కాన్సన్సు సరస్సుగుండా నడచును. ఆర్నది రైనునదియందు సంగమించును. హ్రోనునది జెనివాసరస్సుగుండా నడచియవ్వలకుంజనును. జెనీవాసరస్సును లెమాన్సరస్సనియందురు. ఇన్నది యీదేశముగుండా ప్రవహించి డాన్యూబునదియందు సంగమించును. ఈ దేశమున సెంటిగోతర్డుశిఖరమున రైనునది, హ్రోను నది జన్మస్థానములు కలవు.

ఈదేశమం దింకను కోమోసరస్సు, న్యూఛాటెల్ సరస్సు, జూరిచ్ సరస్సు మొదలగుసరస్సులు సుప్రసిద్ధములు. కొండలక్రిందిభాగములు వేడిగను, మధ్యభాగములు సమశీతలములుగను పైభాగము లతిశీతలములుగను, నుండుట సహజము. ౬000 అడుగులపైన కరుగనిమంచు గప్పియుండెడిని. వేండిగల క్రిందిప్రదేశములందుం గొంచముగ పంటలు పెట్టంగల్గినను, సగటున స్విజర్లాండుదేశము వ్యవసాయదేశముగాదని గోగ్రాసదేశముగం జెప్పంబడినది.పర్వతో పరిభాగములందు chamois జాతి మృగముల మెత్తనిదర్మములకై వేటాడుదురు.

స్విస్ప్రజలు కడుధైర్యవంతులు. గొప్పసాహసముగలవారయ్యు తా మొకరిజోలికింబోక యొకరి సొత్తున కాశింపక నుండుటయు, తమసొత్తుకాశించిన వైరులను వెనుదీయక చావునకైనను తెగించి పోరాడి పాఱందోలవలెనను పద్ధతింగలవారు. గొప్పస్వదేశాభిమానము, తృప్తిగలవారు. వీరంద రొకజాతివారు. గారు మూండింట రెండువంతుల వారు ట్యూటన్ తెగవారు. వీరు మాట్లాడుకొను నది జర్మనుభాష. నాల్గవవంతు ఫ్రెంచిజాతుల సంతతివారు. వీరు ఫ్రెంచిభాష మాట్లాడుకొందురు. పశ్చిమమున నుందురు. దక్షిణమున నిటాలియన్ జాతిసంతతివారు కలరు. వా రిటలీభాషలను వాడుదురు. ప్రొటస్టాంటులు, రోమన్కాతలిక్కులు వీరియందుం గలరు. అందరు నైకమత్యముతో నుందురు. దేశమున నాల్గుయూనివర్సిటీలు కలవు. ప్రారంభవిద్య యుచితము, నిర్బంధముగ

నై యున్నది. ఇప్పుడు ప్రజాప్రభుత్వము. దీనిని వీరు సంపాదించుటకుఁ గొన్నిశ్రమ లనుభవింపక పోలేదు. ఈదేశ మెప్పుడు స్వదేశస్థులగు భూపతులచేఁ బాలింపఁబడిన ట్లగుపడదు. రోమనుల కాలమున సీజరుచక్రవర్తి యీదేశ మాక్రమించెననియు, వారికిఁబిదపనాస్ట్రియనుల హస్తగతమాయెననియుఁ దెలియుచున్నది. వారినుండి తప్పించుకొనుట కాస్ట్రియనులతో నాల్గుయుద్ధములు జరిగెననియుఁ జెప్పఁబడినది. ఆస్ట్రియనులు వీరిం గారవింపక నధికారిగరిమంజూపుచు నొత్తిడింగల్గించుచుండిరట. ఆనురవస్థకు సమీపింపని స్విస్సు జనులు తిరుగుబాటొనర్ప నిశ్చయించిరి.

క్రీ. వె. ౧౩౦౦ సంవత్సరములప్రాంతమున స్విజర్లాండుదేశ మాస్ట్రియావారిపరిపాలన క్రింద నుండిన దినములందు గెస్ల రనుపేరుగల గవర్నరు దేశాధిపతిగ నుండువాఁడు. అధికారప్రియుఁడు, క్రూరుఁడు నై యుండెను. ఆయనయొనర్చినవంచనలను భరింపఁజాలక విల్లియంటె ల్లనుధనుర్విద్యానిపుణుఁ డాయనం జంపెను. ఇది మూలకారణముగ యుద్ధములు ప్రారంభమై నాల్గు యుద్ధములు జరిగెను. (విలియమ్‌టెల్ ధనుర్విద్యానైపుణ్యము చూడుఁడు).

లేకులూసెర న్సరస్సుతీరమున నాల్గుపట్టణములు తిరుగుబాటొనర్చి, ఆస్ట్రియావారిప్రభుత్వమంతమొందించుట యందు ముందడుగువైచుట నానాల్గుపురములను నాల్గు cantons అనిపేరంది యున్నవి. అందు మూఁడుకేంటన్సు ఫారెస్టుకేంటన్సనఁ బరఁగుచున్నవి. అవి Schwyz - Uri - Unterwalden అనంబడునవి. ఇవి యటవీప్రదేశములుగ పేరందినవి. ఇవి తొలుత నేకమనస్సుతో యుద్ధసన్నద్ధ మయ్యెను. డ్యూకులియోపాల్డు తన సైన్యములతో వచ్చెను. ఈయన ఆస్ట్రియాభూపతికి సోదరుఁడై సైన్యాధిపతిగఁగూడ నుండినవాఁడు. మార్గార్టెన్కొండ ఏటవాలుప్రదేశమున యుద్ధముజరిగి, కొండపైనుండి దొరలింపఁబడిన రాళ్ళ దెబ్బలకునిహతులై ఆస్ట్రియను లోడిపోయిరి. ఇది క్రీ.వె.౧౩౧౫ నవంబరు ౧౫ వ తేది. ఆప్రదేశము నేటికిని మార్గార్టెన్ఫీల్డనుపేరున యాత్రాస్థలమై యున్నది.

మఱియొకతరి లూసెరన్ కాపురస్థుం డగు Jeande Malters అనుపేరుగల స్విజర్లాండుదేశస్థుఁ డాస్ట్రియను ప్రభుత్వమువారికి లోనై యొకరహస్యగుహామార్గమున పురమునడుమను సైన్యములం దాచెనట. వారు Bailiff of Rothenbourg అనంబడు నధికారిక్రింద నుండిరట. లూసెరస్పురనివాసియగు నొకబాలుం డిది గనిపెట్టి జనుల కెఱింగింప వారు యుద్ధసన్నద్ధులై నాఁటిరాత్రియే సంగరముజరిగి, ఆస్ట్రియను లోడిపోయిరని చెప్పఁబడినది.

మఱియొకతరి సొవేయూరను పట్టణమును డ్యూకులియోపాల్డు సైన్యములతో ముట్టడించి, యటనున్ననదిపై కఱ్ఱవంతెనను నిర్మించి దానిపై సైనికుల కావలియుంచెనట. దురదృష్టవశమున నావంతెన నీటంగూలఁబడె నట. తోడనే స్విజర్లాండువారేట దుమికి, ఆస్ట్రియావారిని దరికిఁజేర్చి యాదరించి రక్షించి యుపచారములొనర్చుటఁగాంచిన సైన్యాధిపతి డ్యూక్యుగారు ఖిన్నుండై యికఁ నాయూరిని ముట్టడింపనని నాయూరిలోనికింజని జండా బహుమాన మొసంగి వదలివైచి మరలిపోయెనట. అదిమొదలుగ నాస్ట్రియాప్రభుత్వ మట జరుగలేదని చెప్పఁబడినది. తర్వాత జగిరినది కడవరిసెంపాచియుద్ధము. ఇట సంగరమున (క్రీ. వె. ౧౩౮౬) Arnold of winkelried అనువతను నిరాయుధుఁడుగనై శత్రులకెదురుగ

నిలిచి తనయాలుబిడ్డలఁ గాచుఁడని తనదేశపు వారితో నరచెనట. ఆస్ట్రియనసైనికులు వాని పైఁబడి వధియింప మార్గమేర్పడి స్విజర్లాండు వారు వారిమధ్యకుంజొచ్చి చెదరఁగొట్టి జయించి రఁట. అందు సైన్యాధిపతియగు డ్యూకు లియో పాల్డును మడిసెను. పిదప స్విజర్లాండుదేశమున ప్రజాప్రభుత్వము నేర్పఱచుకొనిరి.

స్విజర్లాండు దేశప్రభుత్వము మొత్తమున ఫెడరల్‌రిపబ్లిక్కుగా నేర్పడినది. ఇందు ౨౨ కేంటనులు కలవు. అవి యైక్యమై ప్రజాప్రభుత్వ మేర్పడినది. దేనిపరిపాలన నదియే నెఱపుకొనును. రెండు సభలు గలవు. ప్రజాప్రతినిధిసభ ప్రజలచే నెన్నుకొనఁబడునది. స్టేటుసభ కెంటను లెన్నుకొనునది.

బెర్నీనగరము ప్రధానరాచకార్యస్థానము. ఇది ఆర్‌నదీతీరము. ఇందు ౬౦ వేల జనులు వసించుచున్నారు. జెనీవానగరము పెద్దపట్టణము. ఇది జెనీవాసరస్సుకడ నున్నది. ఇందు జేబుగడియారములు చేయఁబడుగొప్పసంస్థలు కలవు. వర్తకస్థలము. ఇందు ౧,౧౧,౦౦౦ జనులు కలరు. బేసిల్పురము (రైనునదీతీరము). గొప్పవర్తకస్థలము. జూరిచ్చురమున పట్టునూలు, బట్టలునేయు గొప్ప యంత్రశాలలు కలవు.

సగటున స్విజర్లాండుదేశము Play ground of Europ అనంబడుచు విదేశస్థుల నాకర్షించుచు వారిదేశమున వ్యయపఱచుధనముచే గొప్ప దశ నందుచున్నదని యనెదరు. ఆల్ప్సుపర్వతముపై మంచుపై విహరించుట, వింతలనారయుట గొప్పయాసక్తి నెల్లదేశముల ప్రజ లిటకు వినోదార్థము లక్షలకొలఁది నేతెంచుచుందురు. హోటేళ్లవృత్తి పెక్కండ్రిం బోషించుచున్నది. కీబుగడియారములపని యధికము. (ఐరోపాఖండము చూడుఁడు.)

## స్విజర్లాండు దేశపుటాల్ప్సునందు స్కీయింగు కళ (Skiing):—

ఐరోపాఖండమున స్విజర్లాండుదేశము చిన్నదేశము. నిరర్థకమగు పంటలు చాలనిభూములు గలిగి యించుమించు దేశమంతయు ఆల్ప్సుపర్వతములచే నాక్రమింపఁబడినది పర్వతోపరిభాగములు మంచుచేఁ గప్పఁబడియుండును. ఇట్టిస్థితియయ్యు నిది ధనవంతమై, వినోదములకాటపట్టయి ఐరోపాఖండమునం దాటలపట్టదేశమని [Play ground of Europe] అనఁబరఁగుచున్నది.

ఐరోపాదేశములం దెల్లెడల దుర్భరమైన చలికాలము (winter) స్విజర్లాండుదేశపుటాల్ప్సునకు ప్రపంచమంతటినుండియు యాత్రస్థులగు చూపరులను ఆటకాండ్రను రావించి యేటేట ధనవంతముగ నొనర్చుచున్నది. ఈపర్వతోపరిహిమములందు సూర్యరశ్మి వేడిగను, వెలుఁగుగను నుండుట కొందఱకు వింతగనుండెడిని. ఆరుబయటనుండుట తిరుగుట ఆహ్లాదకరముగను, నారోగ్యకరముగను నుండునుగాని యన్యథా శ్రమ యనిపించదు. తెర్మామీటరునందు నీరు ఘనీభవించు [Freezing point] గురుతుకు దిగువ నెన్నోడిగ్రీలు శీతలముండ, వెచ్చనగు సూర్యరశ్మి మంచును గరగింపఁ జాలకుండియు వేడినిచ్చు దుస్తులు లేకుండ నారుబయట నాటలాడుట రుచికరమై యుండెడిని. అలసటయుఁ జాల తక్కువగ నుండెడిని. గాన నిట మంచుపై నాడునాట లధికముగ నాడఁబడుచుండును.

ఇచటియాటలలోఁ దొలుత జెప్పఁదగినది 'స్కీయింగు'. దీనినాడుటకు దేశదేశములనుండి

యుట కరుదెంచుచుందురు. వారికొఱకు పర్వతము లందు వేర్వేరుఎత్తుప్రదేశములకు బాటలు, ఇనుప దారులు నిర్మింపబడియున్నవి. ఆటల కనుకూలించు తావునందు సమస్త సదుపాయములతో హోటేలుభవనములు నిర్మింపబడి నడుపబడుచున్నవి. హోటేలువ్యాపారమే నిత్యవృత్తి గాఁగల కొందరు వర్తకులకు క్రిందిప్రదేశముల (Country) నొక హోటేలును, కొంతయెత్తున సమశీతోష్ణప్రదేశముల నొకటియు, మంచునం దొకటియు, హోటేళ్ళుంట నైరోపాదేశములందు 'A swis host is one who sells seasons' అను ఉక్తిని సామెతగా వాడుచున్నారు. ఈసంస్థలు వేసవియందు వాడఁబడునవి కొన్నియు, శీతకాలమున వాడుకకుఁ గొన్నియు, నాల్బ్ స్ అంతటను మితిమీఱియుంటఁ గాననయ్యెడిని. ఇటుల పెక్కండ్రకు జీవనోపాధి గల్గుచున్నది.

స్కీయింగువిద్య నేర్చుటకుఁ బెక్కుతావులందుఁ బాఠశాలలు కలవు. ఈవిద్యాసంస్థలసంఘ మొకటియేర్పడి విద్యయం దారితేరిన నేర్పరులకు జయపత్రముల నొసంగుచుందురు. అట్టివారినుండియే పాఠశాలలం దుపాధ్యాయ లుద్యోగముల నందుచు, నధ్యాపకత్వము నెఱపుచు, నాసంఘమువారి పరిపాలనకు లోబడి, విద్యనేర్పుచుందురు. విద్యయం దొకేవిధాన మంగీకరింపఁబడియుంటయు, బోధించుటకుఁ గూడ నొకేవిధానమున విధులేర్పడియుంటయు, స్కీయింగువిద్య చక్కనిమార్గమున నెల్లపాఠశాలలం దొకేరీతిని బోధింపఁబడుచుంట వింతఁ గొల్పకపోదు. తీసికొను రుసుములందు భోజన నివాసాదిసౌకర్యములు విద్యార్థులకుఁ గల్గియుండెడిని. ఈరుసుములు లాభము నాశించునవి కావు. విద్యావ్యాపకముతో దేశము ధనవంతమగుచుండగా హోటేళ్ళసంఘము, బాటలు, ఇనుప దారులు పక్షమున ప్రభుత్వమువారు కలసి వీలగునంత చౌకగ నేర్పఱిచిరట. ఉదయకాలముల విద్యాభ్యాసవిధానము, మధ్యాహ్నములం దభ్యాసములందలినేర్పు పాఠములుగ నుండును.

తొలుత స్కీకఱ్ఱలు గాళులకుం గట్టుకొని నడుచుట నేర్పఁబడును. ఇట్టినడక లనేకములు గలవు. ఆభేదగమనములు నడచు ప్రదేశములంబట్టి యుండును. పిదపనేర్పంబడునవి. Side step-Herring bone step- Turning to sides-Adjustment of body for a down hill run మొదలగు నేర్పు లిందుఁ గడపటిది పర్వతపార్శ్వమునందలి యేటవాలుంబట్టియు నందునిలచియు మంచుయొక్క లోతుంబట్టియు నుండును. పిదప Steinming నేర్పఁబడును. ఇది కష్టతరముగ నుండుంగాని దీనిప్రారంభముతో నేర్చుకొనువారియుత్సాహము నినుమడించెడిని. ఇటుల మొదటివారము లేక పక్షముదినములలో మొదటి పరీక్షయం దుత్తీర్ణులగుటయు, నాటలాడుట కర్హతగల్గుటయు నేర్పడి సర్వసాధారణపు స్కీనేర్పరియగును. తక్కిన విద్య ఆరిందాతనమునకే. దాని నొకయాంగ్లపండితుఁడు 'Initiation in to the secrets of pulling turns and swings taking obstacles over the run అని నిర్వచించియున్నాఁడు. ఆదేశమున నేఁటట నీవిద్యయందు రెండు గొప్పపోటీపందెములు జరుగుచుండును. వాటికి 'ఆరల్బెర్గుకాందాహారుపందె' మనియు, 'ఫ్రెసెన్ పందె' మనియుఁ బేరులు. రెండవది 'ఇంటర్నేషనల్ పందె' మని చెప్పఁబడినది.

ఈవిద్యయందు ౧ దూరప్రయాణము, ౨ సాధారణపుటేటవాలునందు జాఱుట, 3 అపా

యకరమగు నేటవాలునందు జాఋట, ర ఏ.రి



పడుట (Jump) యని చతుర్విధ విద్యావిశారదత్వ ములు చెప్పఁబడినవి. మొద టినేర్పునందు స్కాండినేవి యను లధికులనితలంపఁబడు చున్నది. రెండవ, మూఁడవ నేర్పులందు స్విజర్లం డువారే నేర్పరులు. నాల్గవనేర్పునం దుభయులు సమానులందురు. ఇంతవఱకెరిఁగిన నాల్గవనేర్పు ౨౫౦ అడుగులు 'జంపని' చెప్పఁబడినది. (స్విజ ర్లాండుదేశము చూడుఁడు. ఆల్పుస చూడుఁడు).

## స్విమింగ్:టబ్ [Swimming Tub]:-

అద్దకఁపుఁబనిలో నుపయోగించు నొకవిధమగు తొట్టె. [కలంకారి పరిశ్రమచూడుఁడు.]

## సీ ఐలెండు ప్రత్తి వ్యవసాయము:-

ఇది యమెరికాదేశఁపుదరినున్న ద్వీపమందలి ప్రత్తి జాతి. దీనికి వారమునకొకతడి గాని యప్పుడప్పుడు వాడఁబారినతరి నొకతడిగాని తగులుచుండవలసిన జాతి. ప్రత్తిగింజల నాడి నూనెతీసిన చినపిండియే దీని కెరువని చెప్పఁబడినది. గజమునూరమున కొకటిగ మొక్కలను నాటవలయుననియు, మొ క్కల కవసరమగుతరి నీరు గట్టుచుండవలసినజాతి యనియు, ఈచెట్లు మూఁడుసంవత్సరములు జీవిం చియుండుంగాని యొకసంవత్సరమునకుఁ బిదప జంటలందు పత్తి Quality చెడి హీనతనందుచుం డు ననియు, నాల్గునెలలలోఁ గాపుపట్టు ననియు, చెట్లు 30 మొదలు 70 వఱకు కాయలంగాచు ననియుఁ జెప్పఁబడినది.

దీనితొలిపంటకాపు మిక్కిలి శ్రేష్ఠమైనప్రత్తి నిచ్చుచుండునదిగ నమెరికావా రందురు. భరత దేశమునం దంతగా నిది యమరినదికాదు.

## సీజన్సు - కాలములమార్పులు:-

ఉత్తరధ్రువమునుండి భూమినడుమగుండా దక్షిణ ధ్రువముదనుక భావింపఁబడినరేఖ కాంగ్లమున 'axis of the earth' అనిపేరు. అది ఉత్తర ధ్రువమున orbit [భూమినడచుమార్గము]పై పున కొరగియుండును. [చిత్రపటము చూడుఁడు.] అట్లు వంకరగా భూమి సూర్యునింజుట్టి తిరుగుచో కుడిపై పుకడను, ఎడమపై పుకడను, పైగా నడుమ ను, క్రిందుగా నడుమను కాలములభేదములు తెలి య నయ్యెడిని. ఆమార్గ మించుక Oval గా వృ త్తాకారమున నుండి సూర్యుని మధ్యం గల్గియుం డును.

ఎస్ట్రొనొమిశాస్త్రమున Vernal Equi-nox Autumnal Equinox కాలములం దునను, భూమధ్యరేఖపై నుండు ప్రదేశముల సంవత్సరముపొడవునను పగలు, రాత్రి సమములు గనే యుండెడిని.

Winter solstices కాలమున భూమధ్య రేఖ కుత్తరమున పగలు తక్కువగుచు, రాత్రికాల మెక్కువయగుచు, కడకు ఉత్తరధ్రువప్రదేశ మున కేవల మారునెల లొకేరాత్రిగ నుండును. దక్షిణమున పగ లెక్కువగుచు, రాత్రికాలము తక్కువగుచు కడకు దక్షిణధ్రువప్రదేశమున కేవల మాఱునెల లొకేపగలుగ నుండును. ఇంక Summer solstices కాలమున భూమ ధ్యరేఖ కుత్తరమున పగ లెక్కువయగుచు, రాత్రి కాలము తక్కువయగుచు, కడకు ఉత్తరధ్రువ ప్రదేశమున కేవల మాఱునెల లొకేపగలుగ నుండును. దక్షిణమున పగలు తక్కువగుచు, రాత్రికాల మెక్కువగుచు, కడకు దక్షిణధ్రువ ప్రదేశమున కేవల మాఱునెల లొకే రాత్రిగ

Vernal Equinox MAR. 20




Summer Solstices JUNE 21

Autumnal Equinox SEP. 23

నుండును. ఇందువల్ల నుత్తరపరిస్థితికి దక్షిణపరిస్థితి వ్యతిరేకముగ నుండునని తెలియఁగలదు.

శీతోష్ణము లధికమగుటయు, తగ్గిపోవుటయు వేర్వేరుదేశములందు వేర్వేరు కారణములచే పలు విధములుగ నుండుననియు, వర్షములు moon-soon winds ప్రవహించుట మొదలగు కారణములంబట్టి యుండుననియుఁ జెప్పఁబడినది. ఆసాముదేశపుఁ జిర్రాపుంజీయందు సంవత్సరము పొడవునను వర్షమే యుండును. అరేబియాయందు వర్షమే కురియదు.

(ఎస్ట్రోనొమీ చూడుఁడు, కాలవిధానము చూడుఁడు, సీజన్సు చూడుఁడు).

**సీజన్సు (గాలములు)**:— ఇట కాలమనఁగా కాలమాన మర్థము గాదు. కాలములనిన వేసవికాలము, వర్షకాలము, శీతకాలము మొదలగుకాలములని భావము. సీజన్సను నాంగ్ల పదమున కిదియే యర్థము.

ఇట్టికాలభేదములు ప్రపంచమందలి వేర్వేరు దేశములందు వేర్వేరై యుండును. సంవత్సరమున ప్రపంచమున నాదేశముండిన స్థలోచితముగ కాలములసంఖ్య, ఆయాప్రదేశములందు మారుచునుంటయుం గలదు.

భూమధ్యరేఖపై శీతోష్ణస్థితి సంవత్సరము పొడవునను నొకేభేదముం గల్గియుండును గాన వేసవికాలము, వర్షకాలము నను రెండే సీజన్సు కలవు. 'టెంపరేటు లేటిట్యూడ్సు' అనంబడుచున్నప్రదేశములందు వేసవి వర్షాకాలములే గాక Antumn-Spring అను నాల్గుసీజన్సు కలవు మరియు నాంగ్లసీమలందు వర్షకాలమును 'రైనీ సీజన్' అనక 'Winter' అనియెదరు. ఈపదమున కొకవిధమున శీతకాలమని యర్థము చెప్పఁదగును.

భరతదేశము నందలి యాంధ్రభూమి యం దచ్చటచ్చట వర్షకాలము మాఱియుంట గాన నయ్యెడిని. ఇట్లయ్యు సాధారణముగ నాంధ్రదేశమున వేసవికాలము, వర్షకాలము, శీతకాలము నని మూఁడుకాలములు (సీజన్సు) చెప్పఁబడు చున్నవి. ఇటులనే వేర్వేరుతావులందు వేర్వేరుగ నుండెడిని.

భూమియొక్క కడలు వంగియుంట అనఁగా భూమి గుండ్రముగానుంట, భూమధ్యరేఖ కుత్తరముగనో, దక్షిణముగనో లేక సమకాలమున దానిపైననో, అపరాహ్ణకాలమున గన్పించుసూర్య బింబము వేర్వేరుసీజన్సునందు వేర్వేరుదూరముల నుంట పరిశీలించినఁ దెలియఁగలము. జూను ౨౧ తేదీప్రాంతమున భూమధ్యరేఖ కుత్తరదిశగా సూర్యుఁ డించుకదూరమునఁ గానంబడుచుండుఁ గాన భూమియొక్క యుత్తరధ్రువ ప్రదేశము సూర్యుని కెదురుగ నొకింత యుండుటయు, సెప్టెంబరు ౨౩ ప్రాంతమున నపరాహ్ణమున భూమధ్యరేఖపై సరిగాఁగానఁబడుచుంట నాపాంతము సూర్యున కెదురై యుంటయు, డిశంబరు ౨౧ తేదీప్రాంతమున భూమి సూర్యునిం జుట్టి తిరుగుటలో భూమధ్యరేఖకు దక్షిణమున దూరముగ సూర్యుఁ డగుపడుచుంట దక్షిణధ్రువప్రదేశ మించుక సూర్యునిదెసకుం దిరుగుటయు, నుత్తర ధ్రువము సూర్యునుండి మఱుఁగుపడుటయు సంభవించెడిని.

సూర్యున కెదురుగనున్న భూభాగమునకు వేఁడి చక్కఁగ తగిలి వేసవికాలముగ నుంటయు, మరుగుపడిన సూర్యునికాంతి వేఁడి చక్కఁగఁ దగు లనిప్రదేశమున శీతల మతిశయించి చలి యధికమగుటయు, సిత్తరుణమున నెఱుంగదఁగిన సంగతులై యున్నవి.

ఇంక భూమిపై వర్షములుపడుట మాన్సూను శీతలవాయువులకార్యము గాన భూమియొక్క వేర్వేరుప్రదేశములం దామాన్సూనుగాలులంబట్టి వర్షకాలము లేర్పడియుండునని స్పష్టముగుచునే యున్నది. (ఈక్వినోక్సు చూడుఁడు. మాన్సూనులు చూడుఁడు. వర్షపాతము చూడుఁడు.) ఇవియే సీజన్సు లేర్పడుటకుఁ గారణములు.

భరతదేశఁపుఁ బూర్వఁపువిద్వాంసు లింకను గొంచె మెక్కువ పరిశీలనచేసి సీజన్సు ఆరుగ వివరించి వాట్లను 'షడృతువు' లనిరి. అటుల చాంద్రమానవత్సరమందలి చైత్ర వైశాఖమాసములు వసంతఋతువుగను, జ్యేష్ఠ ఆషాఢమాసములు గ్రీష్మఋతువుగను, శ్రావణ, భాద్రపద మాసములు వర్షఋతువుగను, ఆశ్వయుజకార్తికములు శరదృతువుగను, మార్గశిర పుష్యమాసములు హిమవంతఋతువుగను, మాఘ ఫాల్గుణములు (శిశిరచంద్రిక) ఋతువుగను సీజన్సు (ఋతువులు) వివరింపఁబడినవి.

(ఎస్ట్రోనోమీ చూడుఁడు. కాలవిధానము చూడుఁడు. సీజన్సు కాలములమార్పులు చూడుఁడు.)

**సీజనల్ విండుః** (Seasonal winds):- వేసవియం దొకదెసనుండి వీచుచుండిన గాలి వర్షములకు దాని కెదురుదెసనుండి వీచును. దీనికి 'moonsoon winds' అనియు ననెదరు. ఇవియే 'seasonal winds' అనంబడును. [వాయువు చూడుఁడు].

**సీజరు ఆగస్టస్ చక్రవర్తి:-** ఈభూపతి యాదిని రోమకసామ్రాజ్యమును స్థాపించిన వాఁడు. అంతకుఁ బూర్వ మీాయనపేరు Caius

Octavius అనియుండె నందురు. చక్రవర్తి గాకమునుపు వీరి నివాసస్థానము రోమకపురి పరిసరములనున్న వెల్లెట్రిగ్రామమున నొక 'విల్లా' యనియు, వీరితండ్రిగారినాఁడు 'నోలా' యనం బడు గ్రామమున నీకుటుంబము వసించుచుండె ననియు, నందే యీయన మృతిఁ జెందెననియు, వీరి జన్మస్థానము పేలంటైన్‌హిల్‌పై నుండెనని యుఁ బరిశీలకు లనుచున్నారు.

క్రీ. ము. ౬౩ సంవత్సరము సెప్టెంబరు ౨౩ తేదీని జన్మించిరఁట. ఇప్పుడు రోమక నవీన సామ్రాజ్యస్థాపకులుగఁ జెప్పఁబడుచున్న సిగ్నోరు ముసోలినీ మహాశయుఁడు మొదటి సామ్రాజ్య స్థాపనమాదిగ రెండువేల సంవత్సరము లగుతరి సెప్టెంబరు ౨౩ తేదీని పవిత్రదినముగ స్వభావించి గొప్పవినోదముల నెఱపించి యాకీర్తిశేషుని గౌరవింప నున్నారని వార్తాపత్రికలు నుడువుచున్నవి.

**సీజూర్‌నోటు (Seizure Note):—** ఒకకస్టం ఉద్యోగి తమ గొడౌన్ లేక వేరుహౌస్ నందున్న సరకులలో దురుద్దేశ్యసంబంధము లేక తప్పుడుగురుతులు వేయఁబడిన నపాయకరమై పంపరాని అబద్ధపుపేర్లలో నున్నవియగు సరకులను స్వాధీనపఱచుకొనినట్లు యిచ్చినపత్రిమున కీపేరు వర్తించును. వాణిజ్యసంబంధపరిభాషాపదము.

**సీడర్సు ఆఫ్ లెబనాన్:—** బైబిలునందుఁ జెప్పంబడిన జహ్వాదేవళమునం దధికముగా వాడఁబడిన సీడరు కలపం గూర్చి పెక్కండ్రకుఁ దెలియకపోవచ్చును. క్రైస్తవమతస్థులకు, యూదులకు నిది తెలియనగునది. లెబనాన్‌సీమ సిరియాదేశమునకుఁ జెందినది. అందు లెబనాన్‌పర్వతపుఁ బ్రక్కల నేటవాలుప్రదేశమున నీసీడరు వృక్షములు పెరిగెడిని. ఇది Fir Family వృక్షమనియు, 'Cone bearing tree' యనియు వృక్షశాస్త్రవిదు లనెదరు. బైబిలునం దభిమానముగలవారు వీటిని 'Glory of Lebanon' అని వాడుచుండిరి. ఆదేశమేలిన సుప్రసిద్ధభూపతియు, జహ్వా (క్రైస్తవుల జహోవా) దేవుని యాలయనిర్మాతయు నగు సోలోమన్నరపాలుఁ డాదేవాలయ నిర్మాణమునను, తన ప్రాసాదనిర్మాణమునను నీసీడరుకలప విస్తారముగ నుపయోగించినకతన నింత ప్రసిద్ధి గల్గినదఁట. ఆసుప్రసిద్ధస్థలము బేయిరౌటన్ పురమునుండి రెండుదినముల ప్రయాణదూరమున గలదు. ఆ పర్వతపు ఏటవాలుప్రదేశములం దాయడవి యుండెనట. అందు వేలకొలఁది చెట్లుండెనట. కాని యిక్కాలమున నాయడవిచుట్టుకొలత యర మైలుకన్న నెక్కువయుండ దందురు. అందు నాల్గువందల చెట్లుండునందురు. అందుఁ గొన్ని ౨౫౦౦ సంవత్సరములు వయస్సుగలవి యందురు. ఆయటవీప్రదేశము సముద్రపు నీటిమట్టముపై ౬౦౦౦ అడుగుల యెత్తనియు, పర్వతాగ్రము నుండి దిగునకు ౩౦౦ అడుగులదనుక వ్యాపించి యుండెననియుఁ దెలిసెడిని. సిరియాదేశపు టితర ప్రదేశములందును, ఆసియామైనరునందునను, ఈ చెట్లింకను గలవుగాని యాయరణ్యమునందలి చెట్ల కలపవలె నాణ్యముకాదందురు.

**సీతపుట్టుట లంకకుఁజేటుమూడుటకే:—**

(ఆంధ్రలోకోక్తి).

**సీతాఎలియా:—** హిందువులకుఁ బవిత్రసీమ - ఎలియా యన ప్రదేశమని యర్థము. ఆంగ్లేయు లీప్రాంతమునకు 'Elk doçms' అని పేరిడియున్నారు. ఇది యంతయు నల్లనిభూమి.

ఆంజనేయుం డిటఁగల సర్వమ్ముం గాల్చినకతన మాడి నల్లఁబడినదని యచటివా రనెదరు. దీని కడను రావణభూపతి భరతదేశఁపు నాసికాత్రి యంబకమున కవ్వలితీరమందున్న పంచవటీ పర్ణశాలనుండి సీతాదేవిం జెఱఁదెచ్చి నిర్బంధించి యుండినతావని చెప్పఁబడుచోట నొక చిన్న యింట సీతాదేవి దేవస్థాన మేర్పాటుచేయంబడి యొకతెల్లజండా నొక గడకుం గట్టియున్నారు. ఇది యిట యాత్రాస్థలమై యున్నది. అప్రక్కన దొరలుచుఁ బాఱుచుండు చిన్నజలప్రవాహము శీతలోదకములంగల్గి 'సీతావాక' యనంబడుచున్న స్నానతీర్థమైయున్నది. అది యామె కక్కాలమున దాహోదకమందురు. ఈతావు నూవారాఎలియా పీఠభూమికిం దిగువ చీనాతేయాకుతోట పరిసరము లనే యున్నది. కొందరుపరిశీలకుల మనువారు, సింహలము , లంకారాజ్యమే కాదను వారును, నింకఁ గొందరు రామాయణకథనే యబద్ధమను వారును గలరని యెల్ల రెఱింగినదే. అట్టివా రీస్థలమును నిరసింతురురేమో కాని నేఁటికి నిది దేవస్థానముగ యాత్రాస్థలియై యున్నది. ఇది సింహళద్వీపమందుఁ జూడఁదగినతావులలో నొక టిగా నెన్నంబడుచున్నది. (సింహలద్వీపము, రావణాసురుఁడు చూడుఁడు.)

**సీతాకోకచిలుకలు:**—ఇవి చిన్నపురుగుజాతి. వీటిరెక్కలపై నుండు రంగులు వన్నెలవలన సీతాదేవి కోక యనియు, తద్ద్వార



వానుగుణముగఁ జిలుక యనియు, దీనిపే రబ్బి యుండనోపుఁ గాని నిజమున చిలుకజాతిలో నీ పురుగున కేసంబంధమును లేదు.

ఇది చిమ్మెటపురుగుల వంటిజాతి. ఆంగ్లులు వీటిని Lepidoptera తెగకుఁ జెందినజాతిగ నెంచిరి. వెన్నరంగురెక్కలున్న 'Brimstone' అను సీతాకోకచిలుకకుఁ దొలుత నాంగ్లులు 'Butter fly' అని పేరిడిరట. వానురా నీజాతికంతకు నదే పేరయ్యెనట. వీటి రెక్కలపై చిత్రవిచిత్రములగు రంగులు, గీతలు పొల్కలుండును.

సీతాకోకచిలుకలందు వేలకొలఁది జాతులుండు నందురు. మఱికొంద రింకను వీటి రెక్కల రంగులు మాఱుచుండు ననుచున్నారు. వీటికి నాల్గు రెక్కలును, ఆరుకాళ్లు, రమారమి కలసియుండినట్లుండు రెండు నేత్రములుండును. తలవద్దనుండి రెండుకాడలు ముందునకు వచ్చి వాటికడ నొక్కొక చిన్నయుండలవంటి గుబ్బ లుండును. వీటియం దొకజాతి వైదు లేక యాఱు నెలలు జీవించును. తక్కిన జాతు లన్నియుఁ గొన్నిదినములు మాత్ర మాయుఃప్రమాణము గల్గియుండెడిని. ఇవి గ్రుడ్లుపెట్టుకాలమున ననుకూలమగు నేదో యొకజాతిమొక్కలను మాత్ర మాహారముగఁ దినునని చెప్పఁబడినది.

మఱియు నీపురుగుల రెక్కలు విప్పినతరి నొక రెక్కకడవఱకు నడ్డముగాఁ గొలిచినకొలత లంగుళములుగా వివరింపఁబడుచున్నవి.

Actias Selene- దీనిని 'moon mooth అని యందురు. ఇది యాసాం దేశమునం దుండును. అడ్డుకొలత యా అంగుళము లుండును.

A garista A gricola- ఇవి బిస్బేనునందు కానవగును. అడ్డుకొలత 3 అంగుళములు.

Agrias Lugens- ఇవి పెరూ దేశమునఁ గలవు. అడ్డుకొలత 4 అంగుళములు.

Attacus Atlas- ఇవి హిమాలయము పైఁ గలవు. అడ్డుకొలత 11 అంగుళములు.

Arctia Hebe- ఇవి యూరోపాఖండపు జాతిది. అడ్డుకొలత 2 అంగుళములు.

Argema Mittrei- ఇది చాల యాశ్చర్యముం గల్గించు రూపముగల పురుగుగఁ జెప్పఁబడుచున్నది. మెడగాస్కరుద్వీపమునం దుండును. పురుగుపొడవు 8 అంగుళములును, అడ్డుకొలత తొమ్మిదిన్నర యంగుళములు.

Armandia Thaidina- చీనాదేశఁపు పురుగు. అడ్డుకొలత 4 అంగుళములు.

Cathiea Depuiaeti-ఇవి పేరూదేశఁపువి. అడ్డుకొలత రెండున్నర అంగుళములు.

Callithea Hewitsoni-ఇవి కొలంబియాదేశఁపువి. అడ్డుకొలత రెండున్నర అంగుళములు.

Caupylotes Histrionicus- ఉత్తరహిందూస్థానఁపువి. అడ్డుకొలత 3 అంగుళములు.

Catagramma Excelsisslma-ఇవి పేరుదేశఁపువి. అడ్డుకొలఁత రెండున్న రంగుళములు.

Casagramma Pitheas- ఇవి కొలంబియాదేశఁపువి. అడ్డుకొలత రెండుంబావు అంగుళములు.

Cethssia Myrma- ఇది సెలిబీస్‌ద్వీపమునందుఁ గలవు. అడ్డుకొలత నాలుగంగుళములు.

Citherias Menander- దీనిని Clear-wing Aurora అనియు నందురు. కొలంబియాదేశమునగలజాతి. అడ్డుకొలత రెండున్నర యంగుళము లుండును.

Charaxes Jasiuo- ఐరోపాజాతి. అడ్డుకొలత నాలుగంగుళములు.

Clearwing Aurora-దీనిని 'Citherias menander' అనియు నందురు. కొలంబియాదేశఁపుజాతి. అడ్డుకొలత రెండున్నర అంగుళములు.

Delias Niepetti- న్యూగినియా దేశఁపు జాతి. అడ్డు రెండున్నర యంగుళములు.

Dercas Golrias- సుమిత్రాద్వీపమునఁగల జాతి. అడ్డు రెండుముప్పాతిక అంగుళములు.

Erasmia Pulchella- ఆసాముదేశఁపుజాతి. అడ్డు నాలుగంగుళములు.

Euripus Charnda- ఇది జపానుదేశఁపు జాతి. అడ్డు నాలుగున్నరయంగుళములు.

Graeiloia Jsabellae- స్పానియాదేశఁపు జాతి. అడ్డు కొలత నాలుగంగుళము లుండునది.

Hebomsia Celebensio-సెలిబిస్‌ద్వీపఁపు జాతి. అడ్డు నాలుగున్నర అంగుళములు.

Jumonia Orithya- మనదేశఁపు జాతి. అడ్డు రెండున్నరయంగుళములు.

Lepto Circns Curiuo- ఆసాముదేశఁపు జాతి. అడ్డు రెండంగుళములు.

Leto Venus- దక్షిణాఫ్రికాయందుఁ గల జాతి. అడ్డు ఆరంగుళములుండును.

Moon mooth- దీనిని Actias Selene అనియు నందురు. ఆసాముదేశఁపుజాతి. రెక్కల యడ్డుకొలత యారంగుళము లుండును.

Moropho Cyprio- ఇవి కొలఁబియాదేశమున గలవు. అడ్డుకొలత యైదంగుళములన్నర యుండెడివి.

Morpho Deklamia- ఇవి ఫ్రెంచిగినియాదేశమునఁ గలవు. అడ్డుకొలత ఆఱనగుళము లుండెడివి.

Morpho Rhetenor- ఇది గినియాదేశఁపు జాతిపురుగు. అడ్డుకొలత అయిదున్నర యంగుళము లుండును.

Ornithoptera Brookeana- ఇవి బొర్నియోద్వీపమునఁ గలవు. రెక్కల యడ్డుకొలత యేఁడంగుళములు.

Ornithoptera Cassandra- ఇవి క్వీన్సు లాండు ఉత్తరభాగమునఁ గలవు. రెక్కల యడ్డు కొలఁత యాఱున్నరయంగుళము లుండును.

Ornithoptera Croesus- ఇవి మొలక్కసుదీవులు, ఈస్టు ఇండియన్ ఆర్చిపెలెగో ద్వీపము లందుఁ గలజాతి. అడ్డుకొలత యేఁడంగుళము లుండును.

Ornithoptera Flavicollis- ఈస్టిండీసు దీవులందుఁ గలవు. అడ్డుకొలత రెక్కలవద్ద అయిదున్నర యంగుళము లుండును.

Ornithoptera Paradisea-న్యూగినియా జాతి. అడ్డుకొలత ఆరంగుళము లుండును.

Ornithoptera Vietoriae- ఇది సోలోమోన్ద్వీపములందుఁగలజాతి. రెక్కలవద్ద అడ్డుకొలత ఏఁడంగుళము లుండును.

Papilio Antimachus- దీనిని Stanly pool అనియు నందురు. కాంగోదేశమునఁగల జాతిపురుగు. అడ్డుకొలత యెన్మిదిన్నర యంగుళము లుండును.

Papilio Blumei- సెలిబీసుద్వీపమునఁగల జాతి. అడ్డుకొలత ఐదున్నర యంగుళములు.

Papilio Euchenor-న్యూగినియాదేశఁపు జాతి. అడ్డుకొలత ఐదంగుళములు.

Papilio Homerus- ఇవి ట్రినిడాడ్నందుఁ గలవు. అడ్డుకొలత ఆరంగుళము లుండును.

Papilio memnon- ఇవి యూసాముదేశఁపుజాతి. అడ్డుకొలత ఆరంగుళము లుండును.

Papilio Thoas-యునైటెడ్స్టేట్సు మధ్య అమెరికాలందుఁ గలవు. అడ్డుకొలత ఐదంగుళము లుండును.

Papilio Ulysses- ఇవి మలెఆర్చిపిలెగో ద్వీపసముదాయమునందు గలజాతి. అడ్డుకొలత రెక్కలకడ ఐదున్నర యంగుళము లుండును.

Papilio weiskei- న్యూగినియా దేశఁపు జాతి. అడ్డుకొల్త మూఁడున్నర యంగుళములు.

Parnassius Apollo- ఐరోపాఖండఁపు ఆల్ప్సుపర్వతములపై నుండుజాతి. రెక్కలకడవాటి గల్పికొలిచిన యడ్డుకొలత మూఁడంగులము లుండును.

Saturnia Pyri- ఫ్రాన్సుదేశఁపు దక్షిణ సీమలందుగలజాతి. అడ్డు ఐదున్నరయంగులములు.

Stanly Pool- దీనిని 'Papilio antimachus' అనియు నందురు. అడ్డుకొలత రెక్కలంగల్పుకొని యెన్మిదిన్న రంగులము లుండును.

Stichophthalma Howqna- ఇది చీనా దేశఁపుజాతిపురుగు. చీనాదేశమందేకలదు. రెక్కల కడయడ్డుకొలత యైదున్నరయంగులములుండును.

Teinopalpus Imperialis- డార్జిలింగు ప్రాంతముఁలఁగలజాతి. అడ్డుకొలత రెక్కలకడ మూఁడున్నర యంగులము లుండును.

Tenaris Catops- న్యూగినియా యందుఁ గలజాతి. అడ్డు మూఁడున్నర యంగులములు.

Terinos Clarissa- న్యూగినియా జాతి. అడ్డుకొలత మూఁడున్నర యంగుళములు.

Thecla Imperialis- దక్షిణ అమెరికా జాతి. అడ్డుకొలత ఒకటిన్నర యంగులములు.

Troides Alexandrae- న్యూగినియా జాతి. ఇందు మగది యెన్మిదిన్నర యంగులము లును, ఆఁడుపురుగు పది లేక పండ్రెండంగుళము లును రెక్కలకడ వెడలుపుండును. ఇది చాల పెద్దజాతియని తలంపఁబడుచున్నది.

Vrania Riphoeus- మెడగాస్కరునం దున్నజాతి. అడ్డు నాలుగున్నర యంగుళములు.

Vrania Sloanus- ఇది జమైకాదేశపు జాతి. అడ్డు మూఁడంగుళములు.

ఇంకను బ్రిటీషుదీవులందు 'Swallow tail' అనుజాతి సీతాకోకచిలుక చాల యందమైనదని చెప్పుచున్నారు. అది చాల యరుదుగ నుండు నట.

ఇంకను 'monarch' జాతి సీతాకోకచిలుక యు, Painted lady అనఁబడు సీతాకోకచిలుకయు, చిరకాలము జీవించుననియు, చాలదూర ముప్రయాణము లొనర్చుచుండుననియు, నాంగ్ల పరిశోధకు లనుచున్నారు. ఇవి సముద్రముపైఁ బ్రయాణమొనర్చుతరి నలసిపోయినచో నీటిపై వ్రాలిగూడ విశ్రమించి, తిరుగఁ బ్రయాణము సాగించుచుండునని కనిపెట్టిరట. చెఱువులలోఁ బ్రయాణమున కిది యనుకూలించునేమో కాని, యలలుగలసముద్రమున నెట్లు వీలగునో తెలియ రాకున్నది. ఈమూఁడుజాతుల పురుగులు చలిదేశ ములం దంతటను గలవఁట.

**సీతాదేవి:**—ఈమె మిథిలాధీశుఁడు ధర్మ ధ్వజుఁడను బిరుదనామమును, సీరధ్వజుఁడని నామాంతరముగలజనకమహారాజు పెంపుడుకుమార్తె. ఈమెపేరు సీతాదేవి యనియుండియు, ప్రసిద్ధుఁడగు జనకమహారాజునుండి జానకి యని వాడుక నామము గల్గెను. సీతాదేవి పుత్రకామేష్టిసలుప జనకుఁడుచేయు ప్రయత్నసందర్భమున నాగటి చాలున దొరకిన బాలికగాఁ జెప్పఁబడినది. మఱియు నీమె విష్ణుదేవునిశక్తి యగు లక్ష్మీదేవియంశగ నుడువఁబడినది. మహాపతివ్రత. నిరుపమానగుణ శీల. సచ్చరిత్రలఖని. యోగ్యతలరాశి. పెంపుడుతండ్రి జనకమహారాజు. పితామహుఁడు హ్రస్వరోముఁడు. పినతండ్రి కుశధ్వజుఁడు. సోదరి యూర్మిళాదేవి. భర్త శ్రీరాముఁడు. సుతులు కుశలవులు. మఱఁదులు లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు.

రుద్రధనుస్సను బలమగుబాణ మొకటి జనక మహారాజుకడ నుండెను. దానినెక్కుబెట్టి విఱిచిన వారికి సీతనిచ్చి పరిణయమొనర్తునని జనకుఁ డేర్పఱచుకొనెను. శ్రీరాముఁడు దానిని విఱచేఁగాన సీతనాతనికిచ్చి పరిణయమొనర్చెను. మరియు జనక మహారాజు కన్నకొమరితయగు నూర్మిళాదేవిని లక్ష్మణునకును, జనకునిసోదరుఁడగు కుశధ్వజుని కుమార్తెలగు మాండవిని భరతునకును, శృతకీర్తిని శత్రుఘ్ననకును నిచ్చిపరిణయము లొనర్చిరి.

ఇంక సీతాదేవిచరితమునఁ జెప్పవలసిన యితర సంగతులు. కారణాంతరమున శ్రీరాముం డరణ్యావాసమున కేగవలసివచ్చినతరి సీతాదేవి తానును భర్తతో నరణ్యావాసమున కేగుటయు దారియందత్రిమహర్షి యాశ్రమమున విడసియుండుతరి ననసూయాదేవి యామెకుఁ బతివ్రతాధర్మములన్నిటిని సుబోధ గావించుటయు, దండకారణ్యము నందలి జనస్థానమున గోదావరీనదీతీరమందుఁ బంచవటికడ వీరు నివాస మేర్పఱచుకొనియుంటయు, నత్తరి రావణుం డీమెనెత్తుకపోవుటయు, శ్రీరాముండు లంకపై దండెత్తిపోయి యుద్ధమొనర్చి రావణుంజంపి సీతందెచ్చుటయు, రామేశ్వరమున దంపతు లుభయులు రామనాథశివలింగముం బ్రతిష్ఠించి యర్చించుటయు, ప్రయాగకడ భరద్వాజాశ్రమమున వీరు విందారగించుటయు, నయోధ్యకేగి పట్టాభిషేకమై రాజ్యమేలుటయు, సీత గర్భవతియై యుండ నామెను శ్రీరాముండు వాల్మీకి ఆశ్రమమున కనుపుటయు, నటఁ గుశలవులు జన్మిం

చుటయు, వారలకు వాల్మీకిమహర్షియే విద్యా బుద్ధులుగరపి పెద్దవారింజేసి రామాయణమంత యుఁ జెప్పుటయు, దానినివిని శ్రీరాముండు శతుఘ్నునంపి సీతాదేవిని, వాల్మీకిమహర్షిని, నయోధ్యకు రప్పించుకొనుటయు, సభయందు వాల్మీకి సీతాదేవి పాతివ్రత్యమహిమ వర్ణించి, పరిశుద్ధురా లనుటయు, శ్రీరాముం డామెయే శపథమొనర్చుగాక యనివల్కుటయు, సీతాదేవి ముందునకుంజని తాను శ్రీరాముందప్ప నన్యుల నెరుఁగకుండినమాట సత్యమని లోకుల కెఱుంగఁ జేయ భూమి తనను చోటిచ్చి గైకొనుగాక యని వల్కుటయు, తోడనే యట భూమిపగిలి సీతను లోనికింగ్రహించుటయు నై యున్నవి.

**సీతాదేవి జనకమహారాజునకు దొరకినతావు:—** మిథిలదేశాధీశుండగు జనకమహా రాజు సంతానార్థియై పుత్రికామేష్టిక్రతువు చేయ నెంచి భూమిందున్నతరి సీతాదేవి దొరకినదని చెప్పఁబడినది. ఆతావును బీహారుదేశమున ముజా ఫర్‌పూరుజిల్లాలోని సీతామర్హియను పురము నఁ జూపుచున్నారు. లఖండై పశ్చిమతీరమున నొక యావరణమున నైదును, బయట నాల్గును దేవా లయములు నిర్మింపఁబడినవి. ఆవరణమున సీత దొరకినతావున దేవస్థానము నిర్మింపఁబడిన దం దురు. ఇది దర్భాంగపురమునుండి ౪౨ మైళ్ళ దూరము. ఇట శ్రీరామనవమియుత్సవము గొప్ప వైభవోపేతముగ జరుగును.

(మిథిలదేశముఁ జూడుఁడు).

**సీతాఫలముఁజెట్టు:—** ఇది రామాఫల లక్ష్మణఫలములకు మూఁడవది. అరణ్యవాసమున సంచరించుతరి సీతాదేవి యీపండును గారవించె నని వాడుకగలదు.

లా. Anona Squamosa. ఆంగ్ల. White Custard apple tree. సం. అతృప్యం.

ఇది ప్రసిద్ధమైనఫలవృక్షము. ఎక్కువ కష్టము లేక పెరుగుచెట్టు. ఇందు పెద్దకాయలు గాచునది శ్రేష్ఠజాతి. నీరు సమృద్ధిగనుండినతావులం దిది విస్తారముగ నమరును. లేకున్నను సిద్ధపడుంగాని యంతశ్రేష్ఠమగుకాయలం గాయఁజాలకుండును.

సీతాఫలపుఆకు నూరి పైనవేసికట్టిన గడ్డలు మెత్తబడి పగిలిమానును. నారికురుపులలోని పురు గులు బైటికివచ్చును. విత్తులునూరి తలకుఁబట్టిం చిన తలపేలు చచ్చును. వేరు గాఢవిరేచనకారి, వేరు వర్ణావాలు, నూరి లోనికిచ్చిన స్త్రీలసూతి కావాత మెంతప్రబలముగ నున్నను తగ్గి ప్రాణ మునిలువఁబడును. విత్తులు, ఆకులు, పచ్చికాయ లు, పురుగులంజంపు గుణము గలవిగఁ జెప్పఁ బడినవి.

పండుగుంజు పైనవైచి కట్టిన శగగడ్డలుబాధ తగ్గి యడఁగిపోవును. లోనికిచ్చిన చలవజేసి యిం చుక శ్లేష్మమునుబెంచి యజీర్తిగలవారికి జ్వరము గూడఁ దెచ్చును. సీతాఫలపండుకుఁ బరిహారము మంచినీళ్లుద్రాగుట యందురు.

**సీతావనము:—**

కురుక్షేత్రవనములలో నొకటి.

**సీనామెటోగ్రాఫీ (Cinamato graphy):—**దీనిని 'Kinamito graphy' అనియం దురు. (కైనామెటోగ్రాఫీ చూడుఁడు.)

**సీనాయిపర్వతముపైనున్న సెంటు కేతరైన్ మఠము:—** ఇది క్రైస్తవమతస్థు లకుఁ బవిత్రయాత్రాస్థానము. సీనాయిపర్వతము సూయజుసంయుక్తాగ్ర గుడమునకును, అకబాసం

యుక్తాగ్రిగుడమునకును నడుమ నున్నది. ఆ ప్రదేశ మొకద్వీపకల్పముగ నెఱ్ఱసముద్రము (Red sea) లోనికింజొచ్చుకొని యుండునది. సీనాయి దక్షిణభాగముగ నెలుంగునది. యాత్రాస్థలమగు మఠము. సూయజు పురమునుండి ౧౫౦ మైళ్ళుండును. మార్గము రాతిగుట్టలమయమగు నెడారింబోలిన నిర్జలప్రదేశము. తొల్లి ప్రయాణమున కేఁడెనిమిదిదినములొంటెలపై నెక్కి చననగుచుండెఁగాని, యిటీవల మోటారుబస్సుల ప్రయాణము లేర్పడి యొకదినమున నటకుఁ బోనగుచున్నది.

ఈ మఠమునందలి పుస్తకభాండాగారమున క్రీ. వె. ౧౮౫౯ లో Tischendary అనుపేరుగల రష్యాదేశస్థుఁడు బైబిలు (క్రొత్తనిబంధన గ్రంథఁపు) కడుంగడు పురాతనఁపువ్రాఁతప్రతి యొకటియుండఁ గన్గొనియెనట. తదాదిగ క్రైస్తవయాత్రిస్థులు దీనిందర్శించుట యధికమయ్యెనట- ౧౮౭౧ లో Cunningham Graham గారును, ౧౮౭౬లో Charles. M. Dongh-ty గారును, ౧౮౯౪ లో Pierre Loti గారును, ౧౯౧౭ లో మహాసంగ్రామ సందర్భమున పాలస్తినాదేశ మాక్రమింపఁగల్గిన శూరశేఖరుఁడు Allenby ప్రభువును, ఈమఠమునకు యాత్రిసలుపుట నిది గొప్పయాత్రాస్థల మని పేరంది నేటికిని వేలకొలఁదిగఁగాకున్నను వందలాదిగ యాత్రిస్థులేటేట నిట కరుదెంచుచు యాత్రసల్పుచున్నారు. ఈమఠమున రెండురాత్రములు గడపుట యాచారమై యున్నది.

ఈమఠముం గూర్చిన కథనము గాకున్నను యాత్రిస్థలప్రాముఖ్యత గూర్చిన కథనము నిట వివరించుట యసమంజసము గానేరదు. ఆదికాలమున నీజిప్టుదేశమును మూసా నాయకుని యదుపాజ్ఞలలో నిశ్రాయేలీయులు వదలి తమకు యెహోవాదేవునిచే వాగ్దత్తముచేయఁబడిన పాలస్తినాదేశముం జేరవెడలినతరి పెక్కేండ్లీసీనాయి పర్వతసీమలందే గడచెనఁట. అత్తరినే యొక తుపానుకాలమున మూసా (moses) ప్రవక్తకు నిక్కాలమున జెబెల్ మూసా యనంబడు పర్వత శిఖరమున యెహోవాదేవుఁడు ప్రసన్నుఁడై పది యాజ్ఞలు (Ten Commandments) చెక్కఁబడిన శిలాఫలకముల నొసంగెనట. అదియే యీ పవిత్రస్థలి. ఆ పదియాజ్ఞలు బైబిలుప్రాత నిబంధనయందు వివరింపఁబడియుంట నింనుమిం చెల్లరెఱింగినది.

ఇంక నిక్కథనమును, బైబిలును, ఇస్రాయేలీయులను వదలి దీనింజేరుట కిక్కాలమునఁ గల మార్గముంగూర్చి వివరింతుము గాక. ఈమార్గముంగూర్చినసంగతులను H. V. morton పండితుఁడుగారు తన 'Through Lands of the Bible' అనుగ్రంథమున వివరించెను. సాధారణముగ మోటారుబస్సు లద్దెకుం గుదురును. అవి యుదయముననే సూయజుపురమునుండి బయలుదేరి యించుక నడచి సూయజుకాలువకు సమీపముననేయున్న యొకరేవుగుండా గొలుసు బల్లకట్టుపై దాఁటి, కాలువ తూర్పుతీరముం జేరి, దక్షిణముగా పయనమును సాఁగించి సూయజు సంయుక్తాగ్రిగుడఁపు తూర్పుతీరమున బాటల సంధివర కరిగెడిని. అట నీశాన్యదిశ కరుగుబాట జరూసలెంపురమునకును, ఆగ్నేయదిశ కరుగు బాట సెం. కెతరైన్ మోనాస్ట్రికిని చేర్చును.

రెండవమార్గమందరిగిన నించుక మెరకకెక్కు మార్గములగుండా జననయ్యెడిని. ఉత్తరముపైపు గన్పట్టుకొండలు నీలి ఊదారంగున నుదయమున నగుపడుచు పోనుపోను పసుపుపచ్చరంగుకు మారి

పోవును. ఇది మధ్యాహ్నకాలమున కొకగంట లోపుననే సూయజు సంయుక్తాగ్రగుడసముద్రపు దరినున్న యొకరెస్టుహౌసునందు యాత్రస్థులు తరుచుగ విడిసెదరు. ఇది ప్రభుత్వమువా రేర్పఱచిన విశ్రాంతిగృహమట. ఇటకుఁ గడుసమీపముననె యొకచిన్నగ్రామమును, అటనేసముద్రపు రేవును గలవు. పై నెక్కడనో యినుపగనులు కలవట. అటనుండి యారేవున కినుపబాట గలదు. తీరమున చిత్రవిచిత్రాకారములు, రంగులు గల సముద్రపుఁజిప్పలు దొరకెడిని. మరునా డుదయముననే పయనము సాగించి, పర్వతమునుండి సూర్యోదయ సౌందర్యముం గాంచెదరు. ఇచటికి సఖముమార్గము గడచితిమని యచటివా రనిరి. ఇచటినుండి యెక్కుడు తగులుం గాన నించుకకష్ట మనిపించును. మార్గదృశ్యములు వినోదకరములు గనే యుండెడిని. మార్గమున కొన్ని లొటిపిటల వరుసలు (కేరవానులు) కన్పించుచుండెడిని. ఉదయము బయలుదేరిన విశ్రాంతిగృహమునుండి నలువదిమైళ్ళదూరమున 'ఫెయిరాన్' అనుపేరుగల 'ఒయాసిస్' బ్రదేశము కలదు. యిది యాప్రాంతనిర్జలభూమియందు చల్లగా స్వర్గముంబోలి యున్నది. అచట కొందరు అరబ్బు బెడోయినులు వసించు కుగ్రామ మున్నది. మరియు నట నొక గ్రీసుదేశపు సాధువు (monk) ను కొందరు పరివారమును నుండెదరు. అది వారి సెంటుకెతరైన్‌మోనాస్ట్రీయొక్క out post అని దెల్పిరి. పయనమునింకను సాగించుచు మధ్యాహ్నము 3 లేక నాల్గుగంటల కామఠమునకే చేరెదరు.

యాత్రిస్థులకుట్టమఠావరణముననే విడిదికి వసతులుకలవు. ఒకకొండంజుట్టినటుల నిర్మింపఁబడిన మఠము పై కొకదుర్గమువలెను, లోననొక చిన్న పురాతనఁపుఁబట్టణమువలెను వంకరలుగల యెగుదిగుడు మెరకపల్లములు గల వీథులతో నిరుకుగ నుండెడిని. దీనిపునాది క్రీ. శ. ౫౦౦ సంవత్సరములప్రాంతములనాడు కేదర్రైను చక్రవర్తినిగారి కిం జెందినదనియు, పిదప నొకశతాబ్దాంతమున జస్టీనియన్‌చక్రవర్తి మఠమ్మతులం జేయించియు, విరివిగఁగట్టించియు బలపఱచెననియు, లోని సాధుగణము నేలం బాగుజేసి తోఁటల నేర్పఱచిరనియు నచటివా రనెదరు. ఇటంగల క్రైస్తవాలయమునకు Transfiguration చర్చియనియు, (ట్రాన్సుఫిగరేషన్ చర్చి) దేవస్థానమునకు Burning bush Chapel అనియుం బేరులు చెప్పఁబడినవి. జేబిల్ మూసా (mount moses) శిఖరమున జహోవాదేవుఁడు మూసాప్రవక్తకు పదియాజ్ఞలుగల శిలాఫలకమునొసంగెనట. ఆశిఖరమెక్క 3000 మెట్లు కట్టబడినవి. అదియే నిజపవిత్రస్థలి.

ఇంక నిట నొక మోటుతనఁపుఁ బనిఁగల చిన్న మశీదు కలదు. అది మహమ్మదీయులవశమునం దున్నది. మహమ్మదుజగద్దేశికుం డీమఠమున నతిథిగా నుండెననియు, నాయన రక్షణక్రింద నీమఠమున్నదనియు, మహమ్మదీయులగు నరబ్బీవారనెదరు. మరియు వారు వీనింగూర్చి పెక్కు కథలం జెప్పుదురు.

**సీనియర్ సర్వీస్:—**
(ఆంగ్లదేశములందు నావికాదళ సైన్యముఁ జూడుఁడు)

**సీనోగ్రాఫీ (Seenography):—** ఏవేని దృశ్యముల నున్నది యున్నట్లుగా, ప్రతిరూపముల నొక తెరమీఁదఁ జిత్రించుటను గూర్చినకళ.

**సీప్లేనులు:—**
(హైడ్రోపరోప్లేనులు చూడుఁడు).

**సీమగోరింతచెట్టు:—** లా. Paganum Harmala. ఆంగ్ల Syrian Rue.

ఈచెట్టుగింజలకు సీమగోరింతగింజలు లేక విత్తులను పేరున సంగడులందు లభించును. గాని చెట్లు మనదేశమున గానరావు. లోనికిచ్చిన నించుకనిషా చేయును. వీర్యవృద్ధింగల్గించుననియు, నొప్పులు తీరుననియు నందురు. ఆకులకషాయము మేహ వాతంపునొప్పుల నివారించుననియు స్త్రీల ఋతు రక్తమును వెడలించుననియు, గర్భిణీస్త్రీల కీయ రాదనియు, నిద్రపట్టించుననియు, విత్తులకషాయ ముబ్బసంపుదగ్గు నడంచునినియు, గింజలపోగు దుర్వాసనలం దొలగించి శుభ్రపరచుననియుఁ జెప్ప బడినది. రోగుల గదులం దీగింజలపొగ వైచు చుందురు.

**సీమబాదాము:—**

(బాదము చూడుఁడు).

**సీమసుద్దకణికెలు పరిశ్రమ** [Chalk Crayons]:— సీమసుద్ద లేక సీమసున్నమును కోలనికణికెలుగఁ జేసి వాడుట పాఠశాలలు పరిచయముగలవా రంద రెఱింగినదే. (సీమసుద్ద చూడుఁడు). ఇది తెల్లనిరంగు. కొన్నితావులందు పెన్సలునందలి పై కప్పువలెనే పరిశుద్ధ పఱుపఁబడిన చక్కని సీమసుద్దకణికలపై కఱ్ఱకప్పు నమర్చుటయుం గలదు. ఈ క్రేనులతోఁ జిత్రములను వ్రాయుచుందురు. గాన వీటిని రంగులతో రచించుటయుం గలదు. ఈపరిశ్రమయందు రంగులతోఁ గల్పిరచించుభాగములు సాధారణముగ నీక్రింద వివరింపఁబడిన పద్ధతిని మీాఱకుండునటుల నించుకభేదములతో వేర్వేరురీతులుగా నుండును. ఇవి సర్వసాధారణముగ నెఱుపు, నలుపు, పసుపుపచ్చ, ఆకుపచ్చ, ఊదా రంగులందుఁ జేయఁబడుచుండును.

ఎఱుపురంగు క్రెయినులు:—

| | | |
|---|---|---|
| Whiting | 14 | పౌనులు |
| Soap stone | 28 | ,, |
| Pipe clay | 10 | ,, |
| Indian Red | 7 | ,, |
| Venetian Red | 1½ | ,, |

నలుపురంగు క్రెయినులు:—

| | | |
|---|---|---|
| Soap stone | 28 | పౌనులు |
| Gypsum | 20 | ,, |
| Bone black | 8 | ,, |

పసుపుపచ్చరంగు క్రెయినులు:—

| | | |
|---|---|---|
| Chalk | 28 | పౌనులు |
| Soap stone | 18 | ,, |
| Pipe clay | 10 | ,, |
| Yellow ochre | 6¾ | ,, |
| Medium Lemon chrome | 1½ | , |

ఆకుపచ్చరంగు క్రెయినులు:—

| | | |
|---|---|---|
| Gypsum | 35 | పౌనులు |
| Soap stone | 25 | ,, |
| Pipe clay | 30 | ,, |
| Lemon crome yellow | 7 | ,, |
| Chinese blue | 6 | ,, |

ఊదారంగు క్రెయినులు:—

| | | |
|---|---|---|
| Soap stone | 15 | పౌనులు |
| Gypsum | 15 | ,, |
| Chinese blue | 1½ | ,, |

వీట్లను సర్వసాధారణముముగ మెత్తనిగుండులుగ జేసి పలుచని glue or gum తోఁ జేర్చి ముద్దగఁజేసి యచ్చులందు బిగించి యారనిత్తురు. కణికెలు గట్టిగ నుండవలయును.

**సీమసుద్ద [సీమసున్నము]:—**
(సుద్దమట్టి చూడుఁడు).

**సీరధ్వజుఁడు:—**
(జనకచక్రవర్తి చూడుఁడు).

**సీరి [సంకర్షణుఁడు]:—**
(బలరాముఁడు చూడుఁడు).

**సీ లెవెల్:—**
(సముద్రఁపు నీటిమట్టము చూడుఁడు).

**సీల్డు ఆర్డర్సు:-** ఒకస్టీమ రెటకరుగు చున్నది తెలియఁగూడని పరిస్థితులందు ముఖ్యముగ యుద్ధకాలములందు నోడ కప్తానుకు ఓడ చేయవలసిన సబురులంగూర్చిన యుత్తరువులు సీలుచేయఁబడినకవరునం దుంచి, యాయన కందఁ జేయఁబడును. అత్తరి నాకవరు నాకప్తాను సముద్రమున నేదోయొకతావు విధింపఁబడి యటకరుగుదనుక విప్పరాదని నిషేధఁపుటాజ్ఞయు నటనే యుండును. ఆయోడ సబురుచేయుట "under seald orders" అనంబడును.

**సీవర్ధీ** (Sea worthy):— వాణిజ్యసంబంధమున పరిభాషయందు ఒకఓడ సముద్రప్రయాణము (సబురు) చేయ నర్హస్థితి.

ఓడ సముద్రమున సబురుచేయఁగల స్థితియందు లేకపోవుటను 'Un sea worthy' అనియెదరు.

**సీసము (నాగము):—** లా. Plumbum. ఆంగ్ల. Lead. ఫ్రెంచి. Plomb. డచ్చి. Lood. జర్మ. Lot. స్వీడిషు. Lod. సం. నాగం - నాగనామకం - సీసం.

సీసము సాధారణలోహ సముదాయమున చేరునైనది. ఇది నీటికన్న పదునొకండున్నర రెట్లు బరువుండును. ఇది 3౨౭ డిగ్రీల (సెంటిగ్రేడుతెర్మో) వేఁడియందు కరఁగును. ఇది ఱేఁగసాగులోహము.

కొన్ని దేశములందు సీసపురేకుల నింటిపై కప్పుగ వాడుదురని తెలిసెడిని. సీసము రంగులందుఁ జేర్చఁబడుచున్నది. అందు 'Red Lead' అను ఎఱుపురంగు, 'White Lead' అను తెలుపు రంగు మొదలగు నైదురంగులు సుప్రసిద్ధములు. ఇందు ఆక్సిజెన్ చేరును.

సీసము గనులనుండి త్రవ్వి యెత్తంబడుతరి 'Lead glance' అనియు, 'Galena' అనియు నందురు. అది 'Sulphiae of Lead' అయి యుండును. తొల్లింటికాలమున సీసఁపు దువ్వెనలతోఁ దెల్లవెండ్రుకలను నల్లఁబడునటులఁ జేయుటకు తలదువ్వుకొనువా రట. మఱియు పూర్వకాలమున సీసముకణికలు 'పెన్సలుల' వలె నుపయోగింపఁబడుచుండెనట. ఇక్కాలమున సీసఁపు వికారమని కొందరును, ఆక్సిజెన్ పరిణామ మని కొందరును, దలంచుచున్న Plumbago లేక Graphite తో పెన్సలు చేయఁబడుటయే గాని సీసముసంబంధము బొత్తిగా మానిరి.

ఆయుర్వేదవైద్యశాస్త్రోక్తమున సీసమును శుద్ధిచేసి భస్మమొనర్చుదురు. ఇది యనేకరోగములం గుదిర్చి, మేహశాంతి, చలవఁజేసి వీర్యపుష్టి, బలముఁ గల్గించునని చెప్పఁబడినది. సరిగా శుద్ధి కానిచోఁ బెక్కురోగములుం గల్గించు నందురు. ముఖ్యముగ పక్షవాతముం దెచ్చునందురు.

**సీస్తాన్‌సీమ (ప్రదేశము):—** ఇప్పుడిది యాఫ్ఘనుస్థానము, పారశీకదేశములలోఁ

జేరినదేశమైయున్నది. హామూన్‌సరస్సు (ముంపు చంతంపర యొక్క తూర్పుతీరమునం దున్నది. ఎల్లలు సరిగాఁ దెలియవనియు, విస్తీర్ణము ౨౦౦౦ చతురఁపుమైళ్ళప్రదేశముండు ననియుఁ జెప్పఁబడి నది. ఇం దధికభాగ మాఫ్ఘనురాజ్యములో నున్నది. ఇందు ప్రధానపురము 'నస్రెతాబాద్' అనియు, దాని నిప్పుడు 'నసీరాబా' దని యను చున్నారనియు, దేశము ఫలవంతమై యప్పట ప్పట నీటిముంపులకు లోనగు చుండుననియుఁ జెప్పఁబడినది.

పారశీకదేశముయొక్కయు, నాఫ్ఘనురాజ్యము యొక్కయు, సీస్థానఁపుసరిహద్దు పారశీకప్రభుత్వ మువారికొక్కమేర కిండియాప్రభుత్వమువా రొక కమీషన్‌ద్వారా క్రి. వె. ౧౮౭౨ లో సర్వే చేయించియున్నారు. సీస్తానునందు ౨,౫౦,౦౦౦ ప్రజ లుందురని యంచనా వేయఁబడినది. హెల్మండునది హామూన్‌తంపరలో చేరును. (ఆఫ్ఘనుస్థానము చూడుఁడు.)

## స్కీయింగు స్కేటింగు విద్యాశాలలు:—

పాదముల కినుప పరికరములం గట్టుకొని పర్వతముల ప్రక్కలం దేటవాలుగఁ జేరి నిలువయైనమంచుపై జాఱుచుం బోవుటయు కొంచె మెచ్చుతక్కువలతో నొకరీతి సమతల ముగనున్న మంచుపైఁ జేయాఁకలతోఁ ద్వరిత ముగ నేగుటయు, పై విద్యలుగఁ దలంపఁబడు చుండును. ఇక్కాలమున నీవిద్య లధికముగ నార్వే స్వీడను దేశములందు వాడఁబడుచుంట పెక్కండ్రివి స్కాండినేవియాద్వీపకల్పమున నుత్పన్నమైనట్లు పొరఁబడి తలంచుచున్నారు గాని నిజముఁ బరిశీలించిన నివి ఆస్ట్రియాదేశమున నాది కాలమున జనించినవిద్య లనిపించకపోదు. దీని నెవ్వా రాదిని కల్గించిరో యేకాలముననో యను రెండు సంగతులును స్పష్టముగఁ దెలియఁదగిన సాధనములు లేకున్నను, క్రీ. వె. ౧౬౮౯ లో Valvasor అను పేరుగల గ్రంథకర్త యీవిద్యల నైపుణ్యాతంగూర్చి వ్రాసియున్నాఁడు. పిదప కొందరిమూలమున నార్వే స్వీడనుదేశములందుఁ జేరి యెక్కువగ వ్యాపించినవి. ఆస్ట్రియాదేశమునందు కొలదిమందిచే నీవిద్యలు Lilienfeld అను పేరున నాస్ట్రియాదేశఁపు రాజధానియగు వియన్నానగరప్రాంతముల నాపేరనే బరఁగుచావునుండి పేరంది, వినోదార్థపు టారిందాతనపు అభ్యాసముగా వాడఁబడుచుండె నఁట. ఐరోపామహాసంగ్రామముతో దేశము బలహీనమై మార్పులంజెందు కాలమున Hannes Schneider అను నొక ఆలింపియా ఆటకాడు తలయెత్తించెను. ఆయన తొలుత పటాలపు స్కీయరులను తరిబీయ తిచ్చి యీవిద్యావ్యాసంగమునకుఁ బని చేసెనఁట. మరియు నామహనీయుఁడే యీవిద్యలం దారితేరినవారికి యోగ్యతాపత్రము లీయ మొదలిడెనట.

రానురానీవిద్యలు రెండును యౌవనులదృష్టుల నాకర్షింపమొదలిడఁ దొలుత నిట్టి పర్వతభాగము లధికముగాఁగల టైరోల్పరగణాయం దొకవిద్యాభ్యాసపుశేర్పా టుండుట సమంజసమని తలంపఁ బడెనట. తొలుదొల్త St. Anton పురమున ప్రారంభింపఁబడి యటకుఁ గతిపయదూరమున నున్న Arlberg కొండలయం దీవిద్యనేర్పఁ బడుట ప్రారంభమగుట నీవిద్యకు 'Arlberg school' అనియు, పిదప నీవిద్యలకు ఆరల్బర్గు టెక్నిక్కు (Arlberg Technique) ని పేరు లోకమంతటా వాడఁబడుచు ప్రసిద్ధంబయ్యెను. నేఁటికిని ఆస్ట్రియాదేశస్థులు "Nature gave

us the mountais. The war which took so much from us, gave us skis- and Sehneider has tought us, how to use them" అని సుప్రసిద్ధోక్తిగ వాడుచున్నారు. పిమ్మట సెంటిఏంటన్నివిద్యాసంస్థకు పోటీగా Kitz berehel అను చిన్నపట్టణమున నీవిద్యలం గఱపి నేర్పు వేఱొకపాఠశాలాసంస్థ యేర్పడి పనిఁ జేయ మొదలిడెను. ఇటుల నీవిద్యలవిధాన మొక పద్ధతికి నిలుపఁబడెనని (Standardised) చెప్పుదురు.

ఇటుల వ్యాపింపనారంభించిన యంతర్జాతీయ కాలవిద్యాసంస్థ లాగలేము. క్రీస్టోఫ్ అనంబడు తావునను, ఇన్సుబ్రూ కనంబడుచోటను, సీఫీల్డు అనంబడుప్రదేశమునను, ఇగ్లిస్ అనంబడు గ్రామ పరిసరములను, ఈవిద్యాసంస్థ లేర్పడి పెక్కండ్ర కీవిద్యలంగఱపి, నేర్పరులంజేసి యోగ్యతాపత్రి ముల నొసంగుచున్నవి. ఇందు సెంటిక్రిస్టోఫ్‌గ్రామమునుండి విద్యనేర్చుకొను కొండలకడకు విద్యార్థులం దీసికొనిపోవు 'Caterpillar cars' అనంబడుబండ్లును, సెంటిఏంటనుపాఠశాలకొక Cable railway (కొండపైకిఁ గొంపోవు తీఁగబండ్ల బాట సాధనఁపుబండ్లవరుసలును, ఇన్సుబ్రూకు మొదలగు తక్కినపాఠశాలలనుండి కొండలపైకి విద్యార్థులంగొంపోవు కేబిలులైన్నును, ఈవిద్యల వైభవములం దెల్పుచుండును.)

దేశమందలి ప్రధాననగరమగు వియన్నానగరము తన సరిహద్దులలోననే యిట్టి విద్యావినోద స్థానములం గల్గియుంట నానగరనివాసులలో నాలుగవవంతుప్రజలు శీతకాలమున నీవిద్యావినోదకాలయాపనా నిమగ్నులై యుందురని తెలిసెడిని.

## స్టీమరులు:—

(ఓడలు చూడుఁడు).

## స్టీరిక్ ఆసిడ్ (Stearic acid):—

ఇది క్రొవ్వుసంబంధమగుఆసిడ్. జంతువులందు లభించునదియనియుఁ జెప్పఁబడినది.

## స్పీకర్ ఉద్యోగము:—

బ్రిటీషుపార్లమెంటునందు కామన్సుసభ కగ్రాసనా ము వహించిన ఉద్యోగి. సంవత్సరమున కైదువేల రూప్యములజీతము. ఉద్యోగకాలమున నివాస గృహ మీయఁబడును. ఈయన సభ్యులయభిప్రాయములను భూపతికి నివేదించుఁగాన నట్టిపేరం దినవాఁడు. ఉద్యోగానంతరము వైకాంటుపదవి కర్హుఁడగునట. ఈయనపదవికి కామన్సుసభాసభ్యులచే నెన్నుకొనఁ బడుచుండును. House of Lords యం దధ్యక్షతవహించు నాతనికి 'Lord chancelar' అనిపేరు. స్పీకరునకు రాజకీయోపన్యాసము లొసంగుటకుఁగాని, తన యభిప్రాయ మిచ్చుటకుఁ గాని యవకాశములు చాలవు. ఈయన యేకక్షకుఁ జెందనివాఁడై యుండున ట్లుండవలయును. ఈయన కామన్సు సభాసభ్యులకు ప్రవర్తనలయందు, మర్యాదల యందు నాయకుఁడై మెలఁగవలయును. ఇతర యుద్యోగవ్యాపారములు తగవు. హౌసాఫ్‌లార్డ్సు నందగ్రాసనాధిపత్యము వహించు లార్డు ఛాన్సల రుపన్యాసము లీయవచ్చును.

## స్పీడువే (Speed way):—

మోటార్లు, సైకిళ్లు మొదలగునవి పరుగిడుటకు, పందెములు నడపుటకు వేయఁబడినప్రత్యేకఁపుబాట. ఇది కంకర తోఁగట్టిగ వేయఁబడక, బుగ్గి చెత్త చెట్లపట్ట మొదలగువాటితో వేయఁబడి యనుకూలమగు నటుల మెత్తగ నుండును.

**స్పీడోమీటర్:**— పరుగిడు మోటారుబండ్లు స్టీమరు మొదలగువాటియందమర్పఁబడి వాటిపరుగును లెక్కించి వివరించు యంత్రపరికరము. ఇది దూరమును దెల్పును.

**స్పీసీ (Specie):**— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. రూపాయలు మొదలగు లోహములతోఁ జేయఁబడిన ద్రవ్యమని యర్థము. ఇందు నోట్లు, బిల్లు, చెక్కులు మొదలగునవి చేరవు. 'Specie point' అన రూకల విలువయని యర్థము.

**స్లీటుమంచు (Sleet):**— వర్షకాలమున (winter) చలిదేశములందు Freezing point నకుఁగూడ దిగువను ఘనీభవించిన నీటియావిరి నీటితేమ లేక వర్షమునకు 'స్లీ' టనియెదరు. అది భూమిపైఁబడి నిలచియుండుతరి దానిని 'Hoar frost' అనియు ననెదరు. ఇవి శీతలదేశములందుమాత్రమే సంభవించుచుండును.

(మీటియారోలోజీ ఉదకము, దానికార్యములు చూడుఁడు.)

**స్వీడన్దేశము:**— ఐరోపాఖండమునందలి స్కాండినేవియా ద్వీపకల్పమునందు దక్షిణభాగపుదేశము. దీనిని స్వదేశస్థులు 'సర్గె' యనెదరు. మనము వాడుచున్న 'స్వీడన్' అనునది యాంగ్లేయు లిడినపేరు. ౧౭౩౦౦౦ చతురఁపు మైళ్ళవైశాల్యము. సముద్రతీరము సమతలముగను లోనికేగినకొలది నెత్తు అంతరములుగ నగుచు పర్వతములం గలసిపోవుచున్నది. నార్వే స్వీడనుదేశముల నడుమను సరిహద్దుగా పర్వతపంక్తి కలదు. (నార్వేదేశము చూడుఁడు).

స్వీడనుదేశమునకుం జెందినద్వీపములలో ముఖ్యములు గోత్లాండుద్వీపము, నీలాండుద్వీపము పెద్దవి కలవు. ఇవిబాల్టిక్కుసముద్రమునం దున్నవి. ఈదేశపునదులు మెరకపల్లములగుండా నడచుటంజేసి ఒడిదుడుకుగా నుండును. పెద్దదిగాఁ జెప్పఁదగిన గోయనది కాట్టుగాటునందు సంగమించును. టోర్నియానది బోత్నియాసంయుక్తాగ్రగుడములోఁ గలియుచున్నది. ఇది స్వీడనురష్యాల నడుమగా హద్దున నున్నది. స్వీడనుదేశమున సరస్సు లధికముగాఁ గలవు. అందు వెన్నర్సరస్సు వెట్టర్సరస్సు, మాలర్సరస్సు పెద్దవి. గోతాకెనాల్ వెనర్వెట్టరు సరస్సులగుండా బాల్టిక్కుసముద్రమునుండి కాట్టుగాటువరకుం ద్రవ్వఁబడిన పిప్పు కెనాలు. శీతోష్ణస్థితి నార్వేవలెనే యుండుంగాని వర్షము లిందు తక్కువగాఁ గురియుచుండును.

స్వీడనుదేశమున లోకప్రసిద్ధమైన యుత్తమజాతి యినుము గనులందు దొరకుచున్నది. పైను కలపగల యడవులు దట్టముగాఁ గలవు. కలపవర్తకమును, ఇనుపచేతిపనులును మెండుగాఁ గాననగుచుండును. బారలీ, ఓట్సు ముఖ్యమగు పంటలైనను దక్షిణమున గోధుమ కొంత పైరుచేయఁబడుచుండును.

చలిదేశమగుట స్వీడనుదేశము వ్యవసాయదేశము కాదని చెప్పఁదగును. స్వీడులు విద్యాధికులు. పనిపాటలం దెక్కువశ్రద్ధగలవారు. ప్రోటస్టాంటుక్రైస్తవమతము దేశమున వ్యాపించియున్నది. జనాభా చాల తక్కువ. ఉత్తరభాగములందు లాప్ జాతివారును, (లాప్లాండర్లు), దక్షిణమున ఫిన్ జాతివారును కొంతమంది వసించుచున్నారు.

మాలారుసరస్సు బాల్టిక్కు-సముద్రముల సంధి యందున్న స్టాకుహోమునగరము రాజధాని. పరిపాలన లిమిటెడ్ మోనార్కీ. తొల్లింట నిటకు వలసవచ్చినవా రొక కట్టెనుంగను పూజించి యభిమంత్రించి నీటను వదలిరట. అది భూమి నంటిన తావున దిగి కాపురము కుదిరిరట. స్టాకనిన కట్టెముంగయనియు, హింలమ్ అనిన రేవ నియు నర్థములు. ఇట రేవునకు 'రిడ్డర్హోలమ్' అని పేరు.

గోతానదిపై నున్న గోతెన్బర్గు వర్తకస్థలము, రేవుపట్టణము నై యున్నది. ఉపశాల తొల్లింటి కాలఁపు రాజధానిగా నుండినపురము. ఇట విశ్వ విద్యాలయము సుప్రసిద్ధమైనది. డన్నిమోరాపుర ముకడ సుప్రసిద్ధమైన యినుపగని కలదు. కారల్స క్రోనాపురము ప్రభుత్వనావికాస్థానము.

ఈదేశఁపుఁ బ్రజాసభకు డయ్యెట్టనిపేరు. శాస నసభకు స్టోర్టింగని పేరు. వారును ప్రజాప్రతిని ధులే. స్వీడను నార్వేలు వేరుదేశములుగనే యుం డి రెండుప్రభుత్వము లొకతరి కాలవశమున డెన్మార్కు-ప్రభుత్వమునకు లోనై యుండి క్రీ. వె. ౧౫౨౩ లో స్వతంత్రములై రెండుదేశముల ప్రభుత్వములు నొకేభూపతిచే నడపఁబడుచుండి క్రీ. వె. ౧౯౦ దే వేర్వేరుభూపతులక్రింద నేర్పాటై, వేరుపడినది. (నార్వేదేశము-ఐరోపా చూడుఁడు.) లాప్లాండు చాలదేశములు ఉత్తర భాగములందు వ్యాపించియున్నది. (చూడుఁడు.)

**స్వీడనుబర్గేనిజమ్** [Swedenborgainism]:—'స్వీడనుబర్గు' అను తత్వశాస్త్రజ్ఞుని మతప్రబోధములు, సిద్ధాంతములు, దైవము పం (క్రీ. శ. 1688—1722) పినందువల్ల తాను వచ్చితిననియు, సృష్టియొక్కయు, నాత్మయొక్కయు, విజ్ఞానమును చెప్పుచుంటిననియు, తనంత తానే స్వర్గనరకములసంచరించుననియుఁ జెప్పెడువాఁడు.

**స్త్రీదీర్ఘకూటము** [స్త్రీదీర్ఘపొంతనము]:— జ్యోతిష శాస్త్రమునందు వధూవరులయెన్నికలంగూర్చి వివరింపఁబడిన పండ్రెండు కూటములలో నొకటి. (ద్వాదశకూటములు చూడుఁడు).

స్త్రీనక్షత్రము మొదలుకొని పురుషనక్షత్రము వరకు, తొమ్మిదితొమ్మిదిగా లెక్కించిన మొదటి నవకము (తొమ్మిది) యందుండిన స్త్రీ దీర్ఘకూట మనంబడును. ఇది వైశ్యులకు శ్రేయము. తక్కిన వారి క్శ్రేయము. రెండవనవక మగునేని ఎల్లరకు మధ్యమము. మూడవనవకము శ్రేయమని చెప్పఁబడినది.

**స్త్రీప్రథమరజస్వల అయిన తిథులు, నక్షత్రములు, వాని గుణదోషములు**:— తిథులు: పాడ్యమియందు మహాపాపిని యును, విదియయందు పుత్రవతియును, తదియ యందు సౌఖ్యవతియును, చవితియందు వృషలి యును, పంచమియందు శుభప్రియురాలును, షష్ఠి యందు వికృతసంచారిణియును, సప్తమియందు శుభప్రదురాలును, అష్టమియందువికృతసంచారిణి యును, సప్తమియందు శుభప్రియురాలును, అష్టమియందు వికృతసంచారిణియును, నవమియందు విశేషకష్టయును, దశమియందు పుత్రవతియును, ఏకాదశియందు శుచిగలదియును, ద్వాదశియందు పరులను పోషించునదియును, త్రయోదశియందు పుత్రవతియును, చతుర్దశియందు కోపనయును, పూర్ణిమామావాస్యలందు దుష్టచారిణియును నగును.

నక్షత్రములు:-భరణి, ఆశ్లేష, పుబ్బ, పూషా, పూభా యీనక్షత్రముల 1-వ పాదము భర్తృనాశనమును, 2-వ పాదము పుత్రనాశనమును, 3-వ పాదము ధననాశనమును, 4-వ పాదము మశుభమును గలిగించును. మరియు కృత్తిక, ఆర్ద్ర, పున, మఘ, జ్యేష్ఠ యీనక్షత్రముల యొక్క 1-వ పాదము మంగళమును గలిగించును, రెండపాదమునన్నైన 25 గురకు భోజనము పెట్టవలెను. 3,4 పాదములను, ఆది, మంగళ, శని వారములయందును, దుష్టకాలములయందును, దుష్టతిథులయందును, దుష్టయోగములయందును, రజస్వల యయినయెడల యథావిధి శాంతి చేయ వలెను.

**స్త్రీరాజ్యము:**— ఇప్పటి గడవాల్ రాజ్యము కుమాన్ డివిజను గలసిన యాప్రాంతసీమ కొకప్పుడు స్త్రీరాజ్యమని పేరుండెనని తలంపఁబడుచున్నది. హ్యూనచ్వాంగు హిమాలయభూముల లో శతధృలోవలందు ఎమజోనియనుల రాజ్యమున్నటుల వ్రాసియున్నాఁడు. మఱియు నాతఁడే తూర్పుటిబెట్టువారగు నూవాంగు తెగ్రవజ లాతావున పింజర్చియు నను శ్రీపాలనమున మనుచున్నారని వ్రాసెను. ఆప్రజలు వరుసగ నొకరితర్వాత నొకరినిగ స్త్రీలనే యేలికలుగ నెన్నుకొనుచుండిరని తెలియుచున్నది.

ప్రజలకు 'అమజోను' లనంబడువారనియు, వారియేలిక ప్రమిలాదేవియనియు, నామె యర్జునునితో యుద్ధమొనర్చెననియు జైమినిభారతము ౨౨ యందుఁ జెప్పఁబడినది. గరుడపురాణము ౫౫ యందు దీనిప్రశంస కలదు. విక్రమాంకదేవ చరిత్రము ౧౮—౫౭ యందు సువర్ణగోత్రమని (బంగారుకొండ) ప్రశంసింపఁబడినది.

**స్త్రీరేఖ:**—
(పురుషసాముద్రికము చూడుఁడు. స్త్రీసాముద్రికము చూడుఁడు.)

**స్త్రీలు కడుపుతోనున్న కాలము:**—
ఆంధ్రదేశమున స్త్రీలు కడుపుతోనున్న కాలము నవమాసములని వాడుకొందురు. ఇది సాధారణఁపువాడుకగా నున్నది. ఆంగ్లవైద్యులు దీనిని from conception to child birth ౨౮౦ దామాషాయి దినములని నిర్వచించిరి.

స్త్రీలు కడనుంట యాగిపోవుట గర్భసూచనగా నెంచుచుందురు. వేవిళ్ళు సాధారణముగ రెండవమాసమునం దగుపడి, మూఁడవనెలయందు బలపడి, నాలుగయిదు నెలలయందుఁ గూడ గానగఁచుండును. రెండవనెలనుండి గుండె లతిశయించుట ప్రారంభించును. క్రొత్తక్రొత్త రక్తనాళములు పెకఁ గన్పట్టుచుండును. మూఁడవ నెలయందుఁ బొలుపడును. నాల్గవనెలయందు పిల్ల తిరుగుట కారంభమగును. కొందరి కైదవనెలయం దారంభమగును. ఇది తొలుత తల్లికిమాత్రము తెలిసెడిని.

కడుపు పెద్దదియగుట, రెండు లేక మూఁడవ నెలనుండి ప్రారంభమయ్యెడిని. ఐదవనెలనుండియు Stethoscope యంత్రపరికరముగుండా పిల్ల హృదయనాడి తెలియుట కారంభమగును. గర్భధారణము నైసర్గికలక్షణము గానిరోగకారణము గాదని కన్గొనఁబడినది. గాన నారోగ్యముగ నదివఱకుండిన గర్భిణీస్త్రీలు గర్భధారణకాలమున రోగులుగ నుందురని తలంపరాదు. కాని యొక విధముగు నధికశ్రమయు వారి కనర్హము గాని వీలగునంతవఱకు నడక మొదలగు నర్హపరిశ్రమలును, పరిశుభ్రమగుగాలియు వారి కవసరములు.

సులభముగఁ జీర్ణమగు తాజాపదార్థముల భోజనము శరీరమునకు బలకరమగు పదార్థములు వీరికర్తవ్యములు. కాలభోజన మవసరమని పెక్కండ్రెనెదరు. ఆపద, అత్యాశ్చర్యము, విచారము, దుఃఖము వీరికపాయకరములు కావచ్చునందురు.

మతిభ్రమ, మూర్ఛరోగము గలస్త్రీలకు గర్భధారణమునం దత్యాసక్తి గాని, అతిభయము గాని గల్గియుండిరేని, ఒక్కొకతరి మాయగర్భము సంప్రాప్తమగుటయు నన్నిలక్షణము లగుపడునట్లుంటయె పిల్లతిరుగుటకూడ తల్లికిఁ దోచుచుండునట. అట్టితరి తనశరీరఁపు నిజస్థితి తల్లికిం జెల్పి బోధించిన నవియన్నియుం దొలఁగునని చెప్పుచున్నారు. అత్తరి పెరిగినగర్భమున గాలి యుండునట.

## స్త్రీసాముద్రికము:—
(సాముద్రికము చూడుఁడు.)

౧ పాదరేఖలు— చక్రరేఖయు, తోరణరేఖయు, ధ్వజరేఖయు, పద్మరేఖయు, మకరరేఖయు, వజ్రరేఖయు, వర్థమానరేఖయు, ఇందన్నిగాని కొన్నిగాని పాదములందున్నయువతి రాజపత్ని యగునని చెప్పఁబడినది. అంకుశరేఖ, కుండలరేఖ, మాలికారేఖలు పాదములందున్నయువతి ధనికులు, భూపాలతుల్యులు నగుపుత్రులకు మాతయగును.

౨ పాదలతల (అఱకాళ్లు) ములు— కమలములవలెనెఱ్ఱనై యుంట ప్రభుత్వలక్షణము. పాదమంతయు భూమినంటిమోసిన సప్తసంతతులొనర్చిన యోగ్యజీవనముగలదియై పతిచేత మన్ననలందునది యగును. చిత్రములయిన పాదములు గలయువతి సంతానవంతురాలై సుఖజీవనములేని దగును. పాదమంతయు నేల మోయకుండిన సుఖవంతురాలు కాకుండును. పాదములు కుఱుచలైన పతి దుఃఖమనుభవించునది యగును. పాదమున చమటలు, గుంటలు, పగుళ్లు గల్గి మృదువులేకుండిన సేవకురాలగునని చెప్పఁబడినది. వంకరలు తిరిగిన పాదములు గలనాతి దరిద్రురా లగును.

౩ పాదనఖములు (కాలిగోళ్ళు)— ఇవి పెసరకాయలం బోలియున్న భాగ్యవంతురా లగుననియు, మృదువులయిన సుఖవంతురా లగుననియుఁ జెప్పఁబడినది.

౪ కాలివ్రేళ్లు— బొటనవ్రేలు పొడవుగనున్న విధవయు, జారిణియు నగుననియు, మూఁడవవ్రేలు పొడవై యున్న దుశ్శీలురాలు, దౌర్భాగ్యురాలు నగుననియు, కృపణురాలగుననియు, నాల్గవ వ్రేలు కుఱుచయగునేని కలహప్రియురా లగుననియు, చిటికెనవ్రేలే యెత్తుగనుండి భూమి కానకుండ నుండిన విధవగనో, దరిద్రురాలు గనోయుండి జీవనముజరుగని యసౌఖ్యమనుభవింపుచుండుటయు, జారిణియగుటయు సంభవించునని చెప్పఁబడినది.

౫ ప్రపదములు (మీఁగాళ్ళు)—నిండుగను, మెత్తగనుండిన భాగ్యవతి యగును.

మడమలు— మఱ్ఱిపండ్లవలెను, పగడమువలెను రంగుగల్గిన పుత్రవతియగును.

౭ చీలమండలు— సమముగనున్న భాగ్యవతియనియు, హెచ్చుతక్కువలుగ నున్న దరిద్రురాలనియుఁ జెప్పవలయును.

౮ గతి [నడక]— హంస, ఏనుఁగుం బోలి నిధానగమనము ఐశ్వర్యలక్షణము, దుడుకునడక

దరిద్రలక్షణము భూమియదరునట్లు నడచెడి నాతి సర్వజనవిరోధియు, లోక కంటకురాలిగ నుండునదిగాఁ జెప్పఁబడినది.

౯ పిక్కలు— లేడింబోలిన రాకుమార్తెయనియు, కాహళ (కోడి), గజము, వీట్లంబోలిన సుఖవంతురా లనియు, పిక్కలు కుఱుచలయిన నుత్తమురాలనియు, అంబులపొదివలెను, వరి పొట్టవలెను, మొసలి, పంది వీట్లముట్టివలెను, పిక్కలుండిన నాతి పతివ్రతయగుననియుఁ జెప్పఁబడినది. మఱియుఁ బిక్కలు స్థూలములైన విధవయగుననియు, సుళ్ళుగల్గిన ద్రవ్యముం బాడుఁజేయునది యనియు, దీర్ఘరోమము లుండిన విధవయు, దాసిగను జీవించునది యనియుఁ జెప్పఁబడినది.

౧౦ రోమములు— సూక్ష్మములయిన సుఖవతి యగును. రూక్షములైన (కరుకైన) ప్రేమ లేనిది, కఠినురాలు నని చెప్పవలయును.

౧౧ జానువులు (మోకాళ్ళు)— గుండ్రముగనుండ పుత్రవతి యనియు, ముడుసులు దేరియుంట వంధ్యయనియు, నయోగ్యురాలనియుఁ జెప్పఁబడినది.

౧౨ తొడలు—అరఁటికంబములంబోలి రోమరహితములుగనుండిన సౌఖ్యజీవనమును, ఎండియు, సన్నములై యును రోమసహితములుగ నున్న విధవగనో, దరిద్రరాలుగనో, కష్టజీవిగనో యుండునని చెప్పఁబడినది.

౧౩ భగము (మర్మావయవము)— దీనిలక్షణములు చెప్పఁబడినవిగాని పరిశీలనార్హములగుట వ్రాయనవసరము లేదు.

౧౪ కటి (మొల)— మచ్చయున్న వృద్ధియనియు, కుడిసుడి పాతివ్రత్యతను, ఎడమసుడి జారత్వమును సూచించునని చెప్పఁబడినది.

౧౫ జఘనము—విస్తారమైయున్న పూజ్యురాలు.

౧౬ పార్శ్వములు (ప్రక్కలు)— ఎండియున్న భర్తకుఁగీడు గల్గించునదిగఁ జెప్పఁబడినది.

౧౭ నాభి—లోతుగనున్ననాతి పుణ్యచరిత్ర యనియు, ఏటిసుడివలె దక్షిణావర్తనాభిం గల్గియున్న యువతి రాజపత్నింబోలిన యైశ్వర్యవంతురాలనియు, లేక పుత్రవతి లేక భోగములనుభవించునది యనియు, ఎడమసుడియున్న మృతవంధ్యయో (పిల్లలుచనిపోవుటవలన సంతానవతి) లేక కాకవంధ్య (ఒకేపిల్ల నిలచి తక్కినకల్గిన సంతానమంతయు మృతిచెందుట) యో, యగుననియు, నాభికిందిగువను పద్మసమానమగు నెట్టునిచిహ్నముండిననాతి భూపాలన మొనర్చునదిగ నుండుననియుం జెప్పఁబడినది.

౧౮ కడుపు— మృగోదరము రాజస్త్రీలక్షణము. కృశోదరము ,తలోదరము గల్గియుంట పూజ్యురాలయియుంటయు, గుణవంతులగు సుతులకు మాతయగుటయుఁ జెప్పఁబడినది. కడుపున రోమములు స్వల్పములుగనున్న జారత్వమును, దీర్ఘములుగనున్న వైధవ్యములును లక్షణములు. కడుపు కుండంబోలియున్న దౌర్భాగ్యురాలగునని చెప్పఁబడినది.

౧౯ నడుము— సింహముంబోలిన ప్రభుత్వలక్షణము. నడుమున మచ్చయున్న సంతానము నశించుననియు, సుడియున్న దుఃఖరతియగుననియుం జెప్పఁబడినది.

౨౦ వక్షము— రోమములుండిన వైధవ్యము, మచ్చయున్న పుత్రనాశనముఁ జెప్పఁబడినది.

౨౧ స్తనములు— వీట్ల లక్షణములు చెప్పఁబడినవి గాని పరిశీలనానర్హములౌట వ్రాయఁదగినవి కానేరవు.

౨౨ జతుగ్రీవ (మూపునకు కంఠమునకు నడుమ ప్రదేశము)—గూఢములై నరములు గానరాకున్న పుణ్యాచరిత్ర యగును.

౨౩ స్కంధములు (మూఁపులు)— కుడినుడియున్న పుత్రసంతతియు, రోమములున్న నమంగళ ప్రదవతియనియుం జెప్పఁబడినది.

౨౪ భుజములు— తామరతూండ్లం బోలియున్న సుఖవంతురాలుగను, దక్షిణావర్తమున పతివ్రతగను, వామావర్తమైయున్న దారిద్ర్య మనుభవించినదిగను, రోమరహితములై యున్న సౌఖ్యజీవిగను, రోమసహితములై యున్న భుజములంగల్గియున్న స్త్రీ భర్తకపాయముఁగలించునదిగను జెప్పఁబడినది.

౨౫ కక్షములు (చంకలు)— ఉన్నతములైన యదృష్టవతి. పల్లములైన దరిద్రురా లనియుఁ జెప్పఁబడినది.

౨౬ మణిబంధములు— లావుగనుండిన వైధవ్య లక్షణము.

౨౭ కరపృష్ఠములు— లావుగను, ఎత్తుగనుసుండిన వైధవ్యము, దుశ్శీలత.

౨౮ అరచేతులు— కోమలములైయుంట భాగ్య లక్షణము. పద్మములఁబోలి మెత్తనైయున్న సుఖజీవి. కడుపెద్దవియైన దరిద్రలక్షణము. అతిపొడవుగనుంట దుఃఖలక్షణమనియు నతి వలముగనుంట వైధవ్యలక్షణముగను జెప్పఁబడినది.

హస్తమునం దంకుశరేఖయున్న రాజమాత యగుననియు, తోరణరేఖ, స్వస్తికరేఖ, చక్రరేఖ, పద్మరేఖ, మకరరేఖ యుండెనేని స్త్రీలలో నుత్తమురా లనిపించుకొనును. కుండలరేఖ యరచేతియందున్న భూపతికి మాతయై మాన్యయగును. తక్కినలక్షణములు పురుష సాముద్రికమునందువలెనే దెలియునది.

౨౯ కరాంగుళములు (చేతివేళ్ళు)— గూఢములైన సౌఖ్యజీవి యగుననియు, సందులు లేక యుండిన రాజ్యలక్షణమనియు చెప్పఁబడినది. వ్యత్యయాంగుళములు కలహప్రియత్వమునకును, వంకరవేళ్లు వైధవ్యమునకును లక్షణములని చెప్పఁబడినది.

౩౦ కరనఖములు (చేతివ్రేళ్ళయందలిగోళ్లు)—ఎఱుపురంగుగలిగి వర్తులముగనున్న సుఖములనందుననియు, తెల్లరంగుగను, మొద్దుబారి వెలుతులంగల్గి వికారముగనున్న దరిద్రురా లగుననియుం జెప్పఁబడినది.

౩౧ వీపు— మాంసయుక్తము, రోమహీతము, అరటియాకువంటి యాకారము గల్గినయువతి ధనవంతురాలనియు, రోమములున్న నశుభప్రదయు, దారిద్ర్య మనుభవించునదిగఁగాని, వైధవ్య మనుభవించునదిగఁగాని యుండుననిచెప్పఁబడినది.

౩౨ కంఠము— గళమున మూఁడురేఖలుంటయు, శంఖాకారముగ నుంటయు రాజపత్నిలక్షణములు. ఏనుఁగు, గుజ్జము వీట్లమెడంబోలిన మెడఁ గలనాతి కులవర్ధని యగుననియు, మచ్చ

యున్న సుఖవతి, పుత్రవతి యగుననియు, కుఱుచగనున్న మెడగలనాతి దరిద్రురాలగునని యు, నతిదీర్ఘకంఠముగల యువతి కులనాశకర మగు ఘోరవనిత యనియు, కుడివైపునసుడి యున్న సౌభాగ్యవతియనియు, ఎడమవైపున సుడియున్న గొడ్రాలనియు, మేకమెడవలె నున్న దాస్యజీవనమునకు లక్షణమనియుం జెప్పఁబడినది.

33 ముఖము— పూర్ణచంద్రునివలెనుంట ప్రభుత్వ లక్షణము. రక్తిమంగల్గియుంట భాగ్యలక్ష ణము. పద్మసమముగనుంట సౌఖ్యవతీలక్ష ణము. వికృతము, ఎండియుండుట వైధవ్యలక్ష ణము. చక్రమువంటియాకృతి గుర్రపుమొగ మువంటి యాకృతి,దుర్గంధము కల్గియుంటయు, దారిద్ర్యలక్షణములు. పెద్దపులి మొదలగు క్రూరమృగాకృతి, పురుషాకృతి, రోమము లెక్కువయుండుట, దుర్లక్షణములు. నోరు పెద్దదియగుట యశుభలక్షణము.

34 గడ్డము— గడ్డమున సుడియుంట శుభలక్షణ మని కొందరనిరి. మచ్చయున్న గొడ్రాలని యు, రోమములున్న మగనితో నంతరంగ ప్రేమ లేకుండునదియనియుఁ జెప్పఁబడినది.

35 అధరము— తామరపూవురంగుగనుంటయు, చిగురువలెనుంటయు ప్రభుత్వలక్షణములు. దొండపండువలెనుంట సుఖవతీలక్షణము. కల్మ షపూరితమున నగుపడుట దుర్లక్షణము.

36 దంతములు— తెల్లనై సమములుగ నుంట యోగ్యతకు లక్షణములు. దాడిమబీజము (దానిమ్మగింజలు) లవంటి పండ్లుగల్గిన యైశ్వ ర్యలక్షణము. విషమదంతములుగల నాతి దొంగయగును. స్థూలదంతములుగల్గిన దుఃఖ మనుభవించు నాతికి లక్షణము. కాలినట్లుండు దంతములు మగని విడచిపోవు నాతికి లక్షణ ము. ఎడమెడముగను, గొగ్గిపండ్లు, అపరిశుభ్ర దంతములు నిర్భాగ్యురాలి లక్షణము.

37 స్వరము— తీక్ష్ణము, అతిగంభీరధ్వని, వంధ్య త్వము, వైధవ్యముఁ గలస్త్రీ లక్షణము. మృ దుస్వరము పుత్రవతియగు స్త్రీ లక్షణము. కోకిల, హంస, వీణలస్వరముంబోలిన ధ్వని యైశ్వర్యలక్షణము. గార్దభస్వరము, శ్రుతి కటువుగనుండుస్వరము, పతిసుత విహీనలక్ష ణము.

38 నాలుక— రక్తవర్ణము సుఖవతిలక్షణము. తెల్లనిరంగుగలనాల్క— మృత్యుప్రదలక్షణము. మలినపురంగు సర్వనాశనప్రదలక్షణము. నల్ల రంగు లీనెడినాల్క— కలహప్రియలక్షణము. లొట్టియనాల్కం బోలిన నాలుక వంధ్యా లక్షణము.

39 బుగ్గలు—ఎఱుపురంగు శుభప్రద లక్షణము. అదృష్టవంతురాలగునని చెప్పఁబడినది. నల్ల రంగు దరిద్రురాలగుననియు తెల్లరంగు సేవకా వృత్తిచే (పరాధీనవృత్తిచే) జీవించునది యని యుం జెప్పఁబడినది.

బుగ్గలయందు రోమములున్న అమంగళ వ్రతయగు స్త్రీలక్షణము. స్వేచ్ఛావిహార మశీల యగునని చెప్పఁబడినది.

బలసి యద్దమువలెనున్న బుగ్గలుగలయువతి పూజ్యురా లనిపించుకొనును. కుడిసుడియున్న సుఖ జీవనముగలది యగును. గుంటలుపడి లొట్టలయిన వైధవ్యలక్షణము.

40 ఉత్తరోష్ఠము— (పై పెదవి) వ్రేలాడుచుండు ట దరిద్రలక్షణము.

౪౧ నవ్వు (దరహాసము)— జారిణీలక్షణమని చెప్పఁబడినది. నవ్వు అసలే లేనినాతి క్రూరహృదయయు, కఠినురాలనియుఁ ప్పఁబడినది.

౪౨ నాసికము (ముక్కు)—నువ్వుపూవు, సంపంగిపూవు, నాకారమున నాసికముండిన సుఖవతియనియు, యోగ్యురాలనియుఁ జెప్పఁబడినది. పై కెత్తుగనున్నను, హ్రస్వమైనను దాస్యజీవనముగలది యగును. పొడవెక్కువయైనముక్కు ముక్కోపముగల స్త్రీలక్షణము. వలమగు ముక్కు అప్రశస్తురాలనిపించుకొనునాతికి లక్షణము. చట్టిముక్కు వైధవ్యలక్షణము. ముక్కురంధ్రములందు వెండ్రుకలున్న నింద్యయగును. స్త్రీలకు మీసములుంట వైధవ్యలక్షణము.

౪౩ నేత్రములు—వేఁడికన్నులంబోలిన నేత్రములు ప్రభుత్వలక్షణము. విశాలనేత్రములు సుఖవతీలక్షణము. కాటుకకండ్లు భాగ్యలక్షణము. చంచలనేత్రములు జారిణీలక్షణములు. పింగళనేత్రములు వంధ్య, దుశ్శీల, విధవలక్షణములు. గుండ్రనికండ్లు రాక్షసియనందగిన దుశ్చరితాలక్షణము. గుడ్లగూబ, పిల్లి పీట్లవంటినేత్రములు క్రూరకర్మురాలగు దుశ్చరిత్రకు లక్షణములు.

౪౪ కనుబొమలు— నీలచంద్రునివలె వంగియుంట ధనవంతురాలి లక్షణము. చంద్రార్ధము పోల్కినుండుట సుఖవంతురాలగుటకు చిహ్నము. కనుబొమలలో మచ్చయున్న పుత్రనాశనము. మధ్యసుడియుండుట జారిణీలక్షణము. కనుబొమలు రెండును కలసి యుండుట దారిద్ర్యవైధవ్యములకు చిహ్నమని చెప్పఁబడినది.

౪౫ కర్ణములు (చెవులు)— శ్రీకారమువలెనున్న పుత్రవతి, యైశ్వర్యవతి యగును. రోమములు లేకయుండిన భోగములుగలది యగునవియు, నల్లనిమచ్చయుండిన పుత్రులతో సుఖించునదియు నగునని చెప్పఁబడినది. రోమములుండిన కలహప్రియ యగును. అతిస్థూలపుఁగర్ణములు గలయువతి మగని కయిష్టురాలయి మనును.

౪౬ లలాటము— అష్టమిచంద్రునివంటి లలాటము (నుదురు) గల్గియుండినాతి ప్రభుత్వమొనర్చును. నుదుట పెయ్యనాకుడువంటిది యున్న వైధవ్యలక్షణము.

౪౭ శిరము— శిరముమధ్య సుడియున్న వైధవ్యలక్షణము. శిరము విరివిగనున్న నల్పాయువు.

౪౮ తలవెండ్రుకలు— వంకరలులేక పొడవుగనున్న నల్లవెండ్రుకలు పూజ్యురాలికి లక్షణము. దట్టముగనుండి పొడవై యింద్రనీలములంబోలిన వెండ్రుకలు యోగ్యతకు లక్షణములు. ఊర్ధ్వగతిగలతుప్పజుత్తును, ఎర్రనిధాతువగల వెంట్రుకలును, దరిద్రలక్షణము. కపిలవర్ణపువెండ్రుకలు అప్రశస్తురాలుగను, లంబములయిన వెండ్రుకలు దుఃఖవతిగను, కుటిలములగు వెండ్రుకలు మనోచాంచల్యము, కాముకత్వమును భ్రమగల్గియుండుటం దెలుపునవిగఁ జెప్పఁబడినవి.

౪౯ దేహవర్ణము— రక్తవర్ణ మైశ్వర్యసూచకమనియు, ప్రశస్తమనియు, కలువపువ్వు కాంతియు, మెరుఁగును గలిగినదేహవర్ణము సుఖవతికి లక్షణమనియు, మేఘవర్ణము పుణ్యవతికి లక్షణమనియు, గృహమున కట్టిస్త్రీ మంగళప్రదురాలగుననియుం జెప్పఁబడినది.

౫.౦ దేహగంధము (శరీరవాసన)— సంపెగ, కలిగొట్టిపువ్వులయొక్క వాసనగలశరీరము సౌభాగ్యములంగల్గి పతికి వశయై సుఖంబున మెలగు స్త్రీలక్షణము. పాలవాసన గాని, వగరువాసన గాని శరీరముగలస్త్రీ దుఃఖము లనుభవించుచుచు సుఖజీవనముంగడపునది యగును. వేపగంధఁపువాసనయు, గోమూత్రఁపువాసనయు, దుర్గంధము, చేఁపలవాసనయుఁ గలస్త్రీ యశుభప్రదురాలును నయోగ్యురాలును ననిచెప్పఁబడినది.

## సుంకము:—

(డ్యూటీస్ చూడుఁడు).

## సుండాద్వీపములు (సుమత్రా ద్వీపము):—

ఇవి ఓసీనియాయందలి ద్వీపములలో మలేసియాద్వీపసమూహమునకుఁజెంది పసిఫిక్కుమహాసముద్రమునం దున్నవి. (ఓసీనియా చూడుఁడు, మలేసియా చూడుఁడు).

ఇందు సుమత్రాద్వీపము, జావాద్వీపము, వాటిప్రాంతములంగల కొన్ని చిన్నద్వీపములుఁ గలసి యీపేరఁబరఁగుచున్నవి. సుమత్రాద్వీపము గుండా భూమధ్యరేఖ యుండును. మలాకాజలసంధి దీనికిని, మలేసియాకును నడుమఁ గలదు. సుమత్రాద్వీపము ౧,౬౧,౦౦౦ చతురఁపుమైళ్ళ వైశాల్యముఁగలది. పర్వతమయమైనది. వీటియందలి Mount Ophir శిఖరము భూమధ్యరేఖ నంటియే యున్నది.

సుమత్రామధ్యభాగమున కొండలలో బట్టా జాతిప్రజలు వసించుచున్నారు. వారు నరమాంసభక్షకులుగ నుండిరని వదంతి కలదు. ద్వీపముయొక్క యుత్తరభాగమున వారివారి తెగల సామంతభూపతులచేఁ బాలించఁబడు మహమ్మదీయజాతులు వసించుచున్నారు. వారిపై 'అబీన్' జాతిసుల్తాన్ అధిపతి యందురు. ఇందు డచ్చివారికిఁ గొన్నిస్వాస్త్యములు కలవు. పశ్చిమతీరమున పడాంగు, బెంకూలిన్, అనునవియును, తూర్పుతీరమున 'పాలెంబాంగు' అనంబడునదియును డచ్చి స్వాస్త్యములై యున్నవి. మిరియములు సుమత్రానుండి యెగుమతిచేయఁబడుచున్నవి. బంకాద్వీపమాగ్నేయదిశ నున్నది. డచ్చివారిది. అందు తగరఁపుగనులు కలవు.

## సుందరవనము (Sundarbans):—



బంగాళ (వంగ) దేశమున సముద్రతీరఁపుదక్షిణఁపుభాగములు గంగాబ్రహ్మపుత్రానదుల డెల్టాయొక్క దక్షిణఁపు భాగములను 'సుందర్బన్సు' అనెదరు. ఇది యెనుమవేల చతురఁపుమైళ్ళ ప్రదేశము. అరణ్యము. దీనిసముద్రతీరము ౧౬౫ మైళ్ళుండు నందురు. నదీప్రవాహజలపూరితములగు చీలిక పాయలు, కాలువలవలె నెటఁగన్న నట వంకరలు తిరుగుచు మితిమీరిన వీసుందరవనమునఁ గలవు. భూభాగమంతయు నరణ్యమయము. అందు పులులు లెక్కకు మితిమీఱియున్నవని ప్రతీతి బలముగ నున్నది. భూమియంతయు బురదనేల గాన నిట వసించుజనులు పడవలందు వసింతురు. వారిజీవనము చేపలంబట్టుటయు, వేటయునై యున్నది. హుగ్లీనదియు దీనిలోని ప్రవాహములలో నొకటియై పోవును.

గంగాసాగరసంగమతీర్థమగు కపిలాశ్రమమిందే యున్నది. 'సుందరవన' మను పేరు వనముయొక్క సౌందర్యమునుండి కల్గినదికాదు. ఇందుండు నడవిచెట్లకు సుందరవృక్షములని పేరు. ముదిరినపిదప దీనికఱ్ఱచాల గట్టిది. పడవలకు, కుర్చీలు మొదలగు

సామానులకు, వాసములకు నుపచరించునది. వాటినుండియే సుందరవనమను పేరు కల్గినది.

## సుందోపసుందన్యాయము:—

సుందుఁడు నుపసుందుఁడు ననువా రిర్వురు రాక్షసులు, మహాబలాఢ్యులు. త్రిలోకవిజయులై వారి నెదిరించువారు లేకుండిరని భావము. అట్టివా రిర్వురుఁ దిలోత్తమ యనంబడు నప్సరసుందరికై యన్యోన్యముఁ గలహించి యిరువురు మడసిరి.

అజేయులగు నిర్వురు బలాఢ్యుల యన్యోన్య కలహమును, మరణమును వివరించుటయం దీన్యాయమును వాడుచుందురు.

## సుకన్య:—

వైవస్వతమనువుకుమారుఁడగు శర్యాతికుమార్తె. చ్యవనమహర్షి భార్య. కుమారునిపేరు ప్రమతి.

చ్యవనర్షి గొప్పతపస్వియు గొప్పయాగమొన ర్చినవాఁడనియు, సోమపానముఁ గల్పించినదీతఁడే యనియు, గొప్పప్రభావసంపన్నుఁడనియుఁ జెప్పఁ బడినది.

సుకన్యపాతివ్రత్యము శోధింప నశ్వినీదేవతలు గడంగి యామెనుమెచ్చి 'చ్యవనప్రాశ'మను నౌషధముం గల్పించి యొసంగిరని చెప్పఁబడినది.

(చ్యవనప్రాశము చూడుఁడు, చ్యవనమహాముని చూడుఁడు).

## సుకన్యక:—

మరీచిసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి శర్యాతి. పితామహుఁడు వైవస్వతమనువు. సోదరులుత్తానబర్హి, అనర్తుఁడు, భూరిసేనుఁడు.

## సుకర్ముఁడు:—

ఋషి. తండ్రి సుమంతుఁడు. పితామహుఁడు. జైమిని ఋషి.

436

## సుకలాపకారిగోత్రము:—

(అగస్త్య ఉపగణము చూడుఁడు).

## సుకాల్లకులగోత్రము:—

(శాలకుల చూడుఁడు).

## సుక్రీనకుఁడు:—

బార్హద్రథవంశజుఁడగు రిపుంజయుని (ఈవంశముఁ కడటిరాజు మగధ) కడ మంత్రిగనుండి యాతని జంపి, తనసుతుండగు ప్రద్యోతనునకు రాజ్యముఁ గట్టినవాఁడు.

## సుకుమారుఁడు:—

కాస్యునిసంతతి. తండ్రి సువిభువు. కుమారుఁడు ధృష్టకేతువు.

## సుకూరుబారేజి:—

(లాయడ్బారేజి చూడుఁడు).

## సుకృతి:—

బృహదిషునిసంతతి. క్షత్రియుఁడు. తండ్రి పృథువు.

## సుకృతిగోత్రము:—

(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

## సుకేతుగోత్రము:—

(శండిలగణము చూడుఁడు).

## సుకేతువు:—

మరీచి ఇక్ష్వాకు నిమిసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి నందివర్ధన మహారాజు. పితామహుఁ డుదావసువు. కుమారుఁడు దేవరాతుఁడు.

మఱియు క్షేమునిసుతుం డొకసుకేతువు కలఁడు.

## సుక్షివలుఁడు:—

పాండవసంతతి క్షత్రియుడు. తండ్రి నృచక్షుఁడు. పితామహుఁడు సునీతుఁడు, పరిప్లవుఁడు.

**సుగంధిచెట్టు:—** సుగంధి, పాలసుగంధి, కారుసుగంధి యని ద్వివిధము. కారుసుగంధి యధమఁపుజాతి. పాలసుగంధిని సుగంధిపాల యని యందురు. ఇది ఆలసుగంధి, గేదెసుగంధియని ద్వివిధభేదములుగలది. ఇందు ఆలసుగంధిశ్రేష్ఠము.

లా. Hemidesmus Indicus అనియు, Asclepias Psendosarsa అనియు. ఆంగ్ల. Sarasaparilla. సం. అనంతా, కాష్ఠసారివా, సుగన్ధి, సుగన్ధికా, గోపసుతా, గోపాంగనా యను పదములు ఆలసుగంధికిని, గోపకన్యా, గోపత్నీ, గోపబధూః- గోపవధుః- గోపవల్లీ-గోపా- గోపాలః- గోపికా- అనుపదములు గేదెసుగంధి లేక నల్లసుగంధికిని, వనగోపినీ- గోపీభద్రా అను పదము కారుసుగంధికిని చెప్పఁబడినది. ఆలసుగంధి తెల్లసుగంధియనియు, గేదెసుగంధి నల్లసుగంధి యనియు నెరుంగునది.

సుగంధి వేళ్ళ రస కషాయ చూర్ణములు లోని కిచ్చిన మేహశాంతి, పైత్యశాంతిఁ గల్గించి సముధాతువు నేర్పడఁజేయుననియు, ముఖ్యముగ రక్తము నందలి సమస్త దోషములం బరిహరించి శుభ్రపఱచిరక్తమును వృద్ధిపఱచుననియు, మూత్రనిరోధము నాపుననియు, స్త్రీలబుతురక్తనిరోధముఁ బాపి చక్కఁగ వెడలఁజేయుననియు, శూలల నివారించి యాపుననియు, మేహవాతఁపునొప్పుల నాపివేయుననియు, శరీరఁపునిక్కాకల నడంచుననియు, లోనికిచ్చుచు పైకిఁగూడ వ్రాయుటవలన గజ్జి, చిడుము, సర్పి, తామర, తీట మొదలగు సమస్త చర్మవ్యాధుల నివారించుననియుఁ జెప్పఁబడినది.

కారుసుగంధియందునను నీగుణములు బలహీనమై యుండును.

**సుగన్ధివర్తి లేక వేణుగ్రామము (బెల్గామ్):—** ఇటఁ గొందరు సామంతరాజులు వసించినత్రావు. వెదురుపొదలు విస్తారముగనుండుట వేణుగ్రామ మనియుఁ బేరుండెనఁట. సుగంధవర్తి కాలానుగతమై మారి సుంద త్తియాయెనట. వేణుగ్రామము వేలుగ్రామమై, బేలుగ్రామమై, బెల్గాముగ నేఁటికి నిలచియున్న దఁట. బొంబై రాజధాని బెల్గామ్‌పురము.

**సుగ్రీవాజ్ఞ:—** రావణసంహార కార్యము నందును, సీతాన్వేషణమునందును శ్రీరామునకుఁ జేదోఁడువాఁదోఁడుగా మెలంగినవాఁడు సుగ్రీవుఁడను వానరరాజు. ఇతనిప్రభుత్వకాలమున వానరులందఱు నెట్టికష్టతరమగు కార్యముచేయుటకుఁ దమప్రభు వాజ్ఞాపించినను తిరుగులేక చేయుచుండువారు. ఇతనిమధువనము కేవలము ఫలములే యాహారము గాఁగలవానరులచే సంరక్షింపఁబడుచున్నను నందలిఫలమొకటి యైనను నతనియాజ్ఞ లేక వినియోగింపఁబడకుండ నుండెడిది. సీతాదేవి యుదంతముల నెఱింగివచ్చిన మహాత్కార్యము సాధించివచ్చినవారైనను దీనిని ముట్టుట కంగదాదులు మొదట సంకోచించిరి.

తనశాసనమునకు మారులేకుండఁ జెల్లుబడ్లు చేయుప్రభుత్వగలవారి యాజ్ఞకు సుగ్రీవాజ్ఞయను లోకోక్తి వాడుకలోనికి వచ్చెను.

**సుగ్రీవుఁడు:—** వానరుఁడు. లంకా యుద్ధమున శ్రీరామపక్ష మవలంబించినవాఁడు. కిష్కింధారపుమేలినప్రభువు. వాలికిఁ గనిష్ఠసోదరుడు. వాలిసుగ్రీవుల పూర్వోత్తరము మూఁడువిధములుగఁ జెప్పఁబడియున్నది.

విచిత్రరామాయణమున గౌతమమహర్షి భార్య యగు యహల్య లావణ్యాతిశయములం గాంచి యొకప్పు డింద్రుఁడును, సూర్యుఁడును మోహ పరవశులై యేతెంచిరట. సూర్యతేజమున కహల్య వారెవ్వరో యెఱుంగఁజాలక (చూడలేకపోయి) నిర్విణ్ణయయ్యెనట. అత్తరి నిర్వు రామెతో రమిం ప నింద్రునకు వాలియు, సూర్యునకు సుగ్రీవుఁ డును జన్మించిరట. అహల్యయు నీసంగతి గౌత మునకుఁ జెప్పవెఱచి యూరకుండెనట. ఆయిర్వు రుబాలురను తనసుతులేయని గౌతముం డూరకుం డెనట. గౌతముని కుమార్తెయగు నంజన వీరు నీకు జనించినవారు కారని తండ్రికి బయల్పఱచె నట. గౌతముం డలిగి యట్లగునేని వానరముఖు లై పొండని వారిని శపించి యటఁ బొఱవై చెనట. అంత వారును వానరులైరట. ఆబాలురను ఋక్ష విరజుఁడను కోఁతి పెంచుకొనెనట. ఇద్దరు నొకే రూపము, బలము, పరాక్రమముఁ గలవారైరట. మందరపర్వతమున తార వాలింజూచి మోహించి వాలిం బరిణయమయ్యెనట. అట నహల్య త గుట్టు బయటఁబెట్టిన కుమార్తెయగు నంజనపై కినుకఁబూని వానరమునకు భార్యవై వానరుని సు తునిగ బడసెదవని శపించెనట.

ఇంకను వేఱొకచోట ఋక్షవిరజుఁడనువానరుఁ డొకతరి కారణాంతరమున స్త్రీ యయ్యెననియు, ఆస్త్రీయందు సుగ్రీవుఁడు సూర్యునకుఁ గల్గిన సుతుండనియుఁ జెప్పఁబడియున్నది.

మఱియు వేఱొకచోట సుగ్రీవునకు, తండ్రి ఋక్షవిరజుఁడనియు, తల్లి గుమ యనియుఁగూడఁ జెప్పఁబడినది. వేరొకచోట ఋక్షవిరజుఁడను వాన రుఁడు శపింపఁబడిన యొకసాగరమున నీటిలోని తననీడంజూచి వేరుకోతియని భ్రమించి కలహిం చుచు దానిలోని కురికి, తాను నాఁడుకోతియై యాప్రాంతవనమునఁ దిరుగుచుండ సూర్యుఁడును, నింద్రుఁడును దానింజూచి మోహించి రమింప నింద్రునకు వాలియు, సూర్యునకు సుగ్రీవుఁడును జనించిరని చెప్పఁబడినది. ఇంద్రుఁడు సుతుఁడగు వాలి కొకకంఠాభరణముగ నొకదామునిచ్చి యెదురుగపోరిన శత్రుల కజేయుఁడగునట్లు వర మిచ్చెననియుఁ జెప్పఁబడినది.

వాలి జ్యేష్ఠుఁడు. కిష్కింధకు భూపతియయ్యె ను. సుగ్రీవునితో నొకతరి వాలికి వైరము సంభ వించెనట. సుగ్రీవుఁడు వాలియెదుటంబడి పోర వెఱచి ఋష్యమూకపర్వతముపై నుండెనట. అటకు వాలి రాకుండునటుల మతంగమహర్షి భద్రిపఱచెనట. మేనల్లుండగు (అంజనాదేవిసుతుఁ డు) ఆంజనేయుఁడు లేక హనుమంతుఁడు సుగ్రీ వున కుపచర్య సలుపుచుండువాఁ డట. శ్రీరాముఁడు సీతనువెతకుచు ఋష్యమూకపర్వ తముపై కేగ సుగ్రీవుఁడు శ్రీరామునకు మిత్రుఁ డై లంకాయుద్ధమునకు సైన్యముంగూర్ప నొప్పు కొనెనట. శ్రీరాముండును వాలింజంపి కిష్కిం ధను సుగ్రీవున కొసంగెనట. అట్టితరి శ్రీరాముండు చాటు నుండియే వాలిపై శరము వదలెనని చెప్పఁ బడినది.

పిదప రాజ్యాధిపత్యముతో సుగ్రీవునకు వాలి భార్యయగుతారయు భార్యయయ్యెనట. వాలి శ్మశానము ఋష్యమూకపర్వతము. ఆనెగొంది (తొల్లింటి కిష్కింధ) కడ నేఁటికిం గలదు.

సుగ్రీవుఁడు లంకాయుద్ధమున శ్రీరామపక్ష మవలంబించెను. వానరసైన్యముం గూర్చుకొని యేగినవాఁడు. నల్లముఖములు, పొడుగుతోఁకలు గల కొండముచ్చులను వాలిపక్షపు వానరము లనియు, ఎఱ్ఱముఖములు, పొట్టితోఁకలు గల

కోతులను సుగ్రీవపక్షపువానరములనియు, కిష్కింధ (ఇప్పటి ఆగొంది) ప్రాంతవాసు లనియెదరు. (బళ్లారిలోని జీర్ణవిజయనగరప్రాంతము.)

**సుగుణాండు**— చంద్రవంశక్షత్రియుడు. పాండవమధ్యముండగు భీమసేనునకు జలధర లేక జలంధర యనుభార్యయందుఁ గల్గినసుతుఁడు.

**సుగోవమాక్షిగోత్రము:—**
(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**సుచారుఁడు:**—అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి శ్రీకృష్ణుఁడు. తల్లి రుక్మిణీదేవి. సోదరులు ప్రద్యుమ్నాదులు. (శ్రీకృష్ణుఁడు చూడుఁడు.)

**సుజన్మకృతుఁడు:**— పాంచాలదేశాధిపతి. తండ్రి సోమకుఁడు. కుమారుఁడు పృషదుఁడు.

**సుజాత:**—భర్త ఏకపాదుఁడు. కుమారుఁడు అష్టావక్రుఁడు.

**సుజాతిపూర్వగోత్రము:—**
(శండిల గణము చూడుఁడు.)

**సుతగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**సుతపగోత్రము:—**
(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**సుతపుఁడు:**—అణురాజవంశము. తండ్రి హేముఁడు. కుమారుఁడు బలి.

**సుతీక్ష్ణుఁడు:**— సుతీక్ష్ణఋష్యాశ్రమ మిప్పటి నాగపూర్ ప్రాంతమున 'రామటెక్' అనంబడు తావుగఁ బోల్చియున్నారు. శ్రీరాముం డరణ్యవాసమున నటఁ గొంతకాలము వసించి, యట నుండియే యగస్త్యాశ్రమమున కేగెను. రామటెక్ పర్వతముపై నివసించిన యానవాళ్లు పెక్కు గాన నయ్యెడిని.

**సుత్యగోత్రము.—**
(విష్ణువృద్ధఉపగణము చూడుఁడు.)

**సుదర్శన:**— మనువంశస్థుఁడగు దుర్యోధనుఁడనుభూపతి. తల్లిపేరు నర్మద. ఈమె నగ్నిదేవుఁడు మోహించి పరిణయమయ్యెను. కుమారుఁడు సుదర్శనుఁడు. (అనుపేరుగల అగ్ని). (సుదర్శనుఁడు చూడుఁడు.)

**సుదర్శనసార (లేక సాగర) ము:-**
జూనగడ్ సంస్థానమున [కతియవాడ్] గిరినార్ పర్వతముచుట్టు త్రవ్వబడినసాగరము. ఒకనది కడ్డముకట్టి నీరుమరలించి యిందు నింపుదురు. మౌర్యచంద్రగుప్తునిపాలనమున నాతని పరిపాలకుండగు పుష్యగుప్తునివలన త్రవ్వఁబడినది.

సౌరాష్ట్రపాలకుఁడు (Governer) గనుండిన పర్ణదత్తునికుమారుఁడగు చక్రపాలితుఁడు (స్కందగుప్తమహారాజు పాలనమున) గుప్తశకము ౧౩౭ సం॥న దీనిమరమ్మతు చేయించెనని శాసనము గలదు.

**సుదర్శనుఁడు [మహారాజు]:-**
ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి శంఖణుఁడు. పితామహుఁడు రఘుమహారాజు. తల్లి సుదర్శనాదేవి. అయోధ్య రాజధాని.

ఇతనిమందిరమునకు ధర్మదేవత యతిథియై వచ్చెనని చెప్పఁబడినది. మఱియు నొకవిద్యాధరుఁడు సుదర్శనుఁడనుపేరుగలవాఁ డంగిరసునిం

గేలిచేసి కృపమగునటుల శపింపఁబడి సర్పమై శ్రీకృష్ణుని పాదస్పర్శనమునశాపవిముక్తి నందినవాఁడు.

ఇంకను వేరొకసుదర్శనుఁ డనంబడిన భూపతి. తల్లి సుదర్శన. (ఈమె మనువంశస్థుండగు దుర్యోధనునికుమార్తె. తల్లి నర్మద) తండ్రి అగ్నిదేవుఁడు. ఈతనిగృహమునకు ధర్మదేవత యతిథియైవచ్చి గారవించెనని చెప్పఁబడినది.

**సుదర్శనుఁడు:—**
(అగ్నివర్ణుఁడు చూడుఁడు).

**సుదహరితగోత్రము:—**
[వశిష్ఠగణము చూడుఁడు].

**సుదక్షిణ:-**
దిలీపచక్రవర్తిభార్య. కుమారుఁడు రఘుమహారాజు.

**సుదక్షిణుఁడు:—** పౌండ్రికవాసుదేవుని కుమారుఁడు. తనతండ్రిని శ్రీకృష్ణుఁడు చంపెనని పగఁబూని తపమాచరించి శ్రీకృష్ణుంబరిమార్చుట కభిచారహోమముసల్పి శ్రీకృష్ణునిపై కృత్తియనెడి శక్తిం బంపి ద్వారకాపురము నల్లకల్లోలమొనర్చినవాఁడు. తుదకు శ్రీకృష్ణునిచే నిహతుఁడైనవాఁడు.

**సుదామని:—** వసుదేవుని సోదరుఁడగు ననీకునిభార్య. (యదుసంతతి. చంద్రవంశము.)

**సుదామపురము:—** గుజరాతులోని పోర్బందరునకు తొల్లింట సుదామపురమని పేరు. భాగవతము దశమస్కంధము ౮౦ అధ్యాయమునఁ జెప్పఁబడిన సుదాముఁడు లేక శ్రీదాముఁ డిట వసించినవాఁడు. ఇది చేయపురమునకు రేవు.

**సుదాసుఁడు:-** ఈపేరుగలవా రిర్వురు గలరు. తండ్రి చ్యవనుఁడు. పితామహుఁడు మిత్రాయువు. సుతుఁడు సహదేవుఁడు. ఈతఁ డొకసుదాసుఁడు.

మఱియు నిక్ష్వాకుసంతతియం దొకసుదాసుఁడు గలఁ డీతని సుతుఁడు కల్మాషపాదుఁడు. ఇంకను పాండవసంతతి క్షత్రియుఁడగు రెండవబృహద్రథుని కుమారుఁ డొకసుదాసుఁడు కలఁడు. ఇతని పితామహునిపేరు తిమి. పుత్రుఁడు రెండవ శతానీకుఁడు.

**సుద్దమట్టి లేక సుద్ద, జేగురు, గోపీచందనము, సీమసుద్ద:—** ఇది తెల్లని రంగుగలది సుద్ద యనియు, ఎఱ్ఱనిరంగుగలదానిని జేగు రనియు, పసుపుపచ్చరంగుగలదానిని గోపీచందన మనియు నందురు. ఈమూఁడును వేర్వేరు రంగులతోఁ దనరు వేర్వేరు జాతిపదార్థములుగఁ దోఁచినను నుత్పత్తి యొకటియే యని తేలుచున్నది. తెల్లసుద్ద భూమియందు లోతున తఱుచుగ నుపరిభాగమున నరుదుగను దొరకెడిని. పచ్చసుద్దయగు గోపీచందనమును నట్టిదియె. ఇంక నెఱ్ఱసుద్దయగు జేగురు కొండలలో దొరకును. తెల్లసుద్దను శ్రీవైష్ణవమతస్థులు చక్కఁగ శుభ్రపఱచి పఱకట్టి కణికలుగఁజేసి ముఖమున నామములుగ ధరింతురు. దీనికి వైష్ణవమతగ్రంథములందు 'తిరుమణి' యని పేరిడఁబడినది. (తిరుమణి చూడుఁడు). కొన్నిచోట్ల తెల్లసుద్దతో గోడలను వెల వెచెదరు.

అట్లే ద్వైతవైష్ణవులు (మాధ్వులు) గోపీచందనమును పరిశుభ్రపఱచి ముద్రధారణమునకై యుపయోగించుచున్నారు. దానికి గోపీచందనమని వారి మతసంబంధనామము. (గోపీచందనము చూడుఁడు).

ఇంక నెర్రిసుద్దయగు జేగురు రంగుగను, రంగులందు కల్పుటకును, నుపయోగపడుచున్నది. హిందూసన్యాసులు తమబట్టలకు, కాషాయవర్ణమీజేగురువలననే గలింతురు.

ఐరోపాదేశములందు సీమసుద్ద లేక సీమసున్నమని వేరొక తెల్లనిపదార్థము గలదు. అది యింగ్లాండునందు 'Chalk cliffs' అనంబడు మ కొండవలె నుండును. ఫ్రెంచిదేశపు సీమసుద్ద 'French chalk' అనంబడును. ఇది సముద్రపు పురుగుల గుల్ల లొకరాశిగఁ జేర్పఁబడి యలల వేగమున నొక్కఁబడి యిటుల పరిణమించి సీమసున్నమైనదని పరిశీలనలవలన తేలినది. గాన నిది తెల్లసుద్దతో నేసంబంధము కలది గాదు. స్వచ్ఛమైన సున్నముయొక్క పరిణామము. దీనికి 'Compact Carbonete of Line' అనియు నందురు. ఇది యసంఖ్యాకములగు సముద్రపుపురుగులగుల్లల పరిణామమని మున్ను వ్రాసియుంటిని. ఇంగ్లాండునందు సీమసున్న మేటేట నేఁబదిలక్షల టన్నులువఱకు త్రవ్వి యెత్తఁబడుచున్నది. దీని కింకను రంగులుగూడ వైచి కణికలుగఁజేసి దేశదేశముల కెగుమతి యొనర్తురు. ఈజాతివేయని పలువురచేఁ దలంపఁబడు 'Soap stone' అనునది నిజమున సీమసుద్ద కానేరదని గ్రహింపఁబడినది.

సీమసుద్దయం దెర్రిజాతియొకటి కలదనియు, దానిని 'Peroxide of iron' అని పేరుగలదనియు, నింకను దానిని Reddle లేక Reeddle అనియు వాడుదురని తెలియుచున్నది. ఈసీమసుద్దయం దచట నచట నూదంటురాళ్లుగూడ బయలువెడలుటయుం గలదు. సీమసుద్దంగాల్చి యిండ్లు గట్టుటకు సున్నముగను గోడలకువేయు వెల్లగను గూడ నుపయోగింతురట. పరిశుద్ధపఱచిన సీమసున్నమును కొన్ని నూనెలయందు కల్పి నూరి 'పుట్టి' యనంబడురంగుం జేతురట. బైబిలునందు సీమసున్నమునకు 'Chalk Stone' అని పేరు వాడఁబడినది. శరీరము సుద్దంబోలిన పదార్థము కీళ్ళయందుఁ జేరినకతన నొప్పులు మొదలగునవి కల్గురు. సీమసున్నమును 'white calcareous fine graimed roek consisting almost entirely of the shells of minute marine organisuns' అని యాంగ్లశాస్త్రవేత్తలగు పరిశీలకులు తలంచుచున్నారు. తొల్లింటికాలమున నిది సముద్రపు నీటిమట్టమునకుం దిగువగ నుండెననియు, పిదప బయటఁ బడెననియుఁ బరిశీలకు లందురు.

ఆంగ్లసీమలందు సీమసున్నము మూఁడుపొరలుగ భూమియం దుండుననియు, తరుచుగ పైపొర తెల్లరంగు, మధ్యపొర పసుపురంగు, అడుగుపొర యించుక యెఱుపుధాతువులం గల్గియుండుననియు, దీనికి Chalk marl అందురనియు వింటిమి. ఆదేశమున Portland Cement నందు కొన్నిరంగులందుఁగూడ సుద్ద కలియునట.

**సుధృతి (సత్యధృతి):—** ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి ధృతిమంతుఁడు. పితామహుఁడు మహావీరుఁడు. కుమారుఁడు ధృష్టకేతుఁడు.

**సుదేవుఁడు:—** ఈపేరుగలవా రిర్వురు గలరు. యదుసంతతి చంద్రవంశక్షత్రియులలో దేవకుని కుమారుఁడొకఁడు సుదేవుఁడు. సోదరి దేవకీదేవి [వసుదేవునిభార్య].

మఱియు నిక్ష్వాకు సంతతి సూర్యవంశక్షత్రియులలో చంపునికుమారుఁ డొకసుదేవుఁడు. ఈతని సుతుఁడు విజయుఁడు.

## సుధన్వదేశము:—
(అంబరీషపుర రాజ్యముఁ జూడుఁడు).

**సుధన్వానుఁడు:**— అత్రి చంద్ర యాదవక్షత్రియుఁడు. తండ్రి వసుదేవుఁడు. తల్లి శ్రీదేవి. సోదరులు శ్రీకృష్ణాదులు.

**సుధనుస్సు:**— అత్రి, చంద్రి, యదు కురు సంతతి క్షత్రియుఁడు. కురుమహారాజు రెండవకుమారుఁడు. సోదరులు పరీక్షిత్తు, నిషధుఁడు, జహ్నువు. కుమారుఁ డుపరిచరవసువు.

**సుధన్వుఁడు:**— నల్వురు లోకపాలకులలో నొకఁడు (లోకపాలకులు చూడుఁడు). మఱియుం దిగ్గర్తదేశాధీశుఁ డొక సుధన్వుఁడు కలఁ డీతనిసుతుఁడు సుశర్మ.

**సుధర్మ:**— ఇది యింద్రుని సభకుఁ బేరు. సుధర్మదేవసభ యని యమరమునఁ జెప్పఁబడినది.

**సుధర్మస్వామి:**— జైతనస్వామి. మహావీరస్వామి శిష్యుఁడు.
[అంగదేశము చూడుఁడు.]

## సుధారకగోత్రము:—
[వశిష్ఠగణము చూడుఁడు].

**సుధేష్ణ:**— విరటారాజుభార్య యొకసుదేష్ణ. ఈమె కీచకులునూర్వురకు [జ్యేష్ఠుఁడు సింహబలుఁడు] సోదరి. కేకయదేశపురాట్పుత్రిక. మఱియొకసుధేష్ణ అణువుసంతతిలోని బలియొక్క భార్య.

**సునంద:**— భరతునిభార్య. (భరతుని తండ్రి దుష్యంతమహారాజు).

**సునందుఁడు:**— విష్ణుదేవుని పరిచరులలో నొకఁడు.

**సునయుఁడు:**— పాండవసంతతి క్షత్రియుఁడు. తండ్రి పరిప్లవుఁడు. పితామహుఁడు సుఖీవలుఁడు. కుమారుఁడు మేధావి.

## సునాముఖి (సీమతంగేడు) చెట్టు:-
లా. Cassea Lenceolate- ఆంగ్ల Indian Senna అనియు Tinnevelly Senna.

చెట్టును సీమతంగేడుచెట్టనియు, దానియాకు కోసి యమ్మకమునకు సిద్ధపఱచుట నుండి సునాముఖియాకనియు పేర్లంబరఁగెడిని. దీనిని విరేచనముల యౌషధముగఁ గషాయముఁ జేసి లోని కిత్తురు. మఱియు సునాముఖియాకు చారుగా చెదరు. అదియును విరేచనకారియే. విరేచనకారిగనే యీసునాముఖి విలువఁగల్గియున్నది. ఇంకను సునాముఖయం దీగుణములు కలవని చెప్పఁబడినది.

౧ అల్లపురసముతో సునాముఖచూర్ణము లోని కిచ్చిన పైత్యము నివారణమగుననియు,

౨ ఆవుపాలతో లోనికిచ్చిన శరీరకాంతి వృద్ధియగు ననియు,

3 ఉసిరికాయ రసముతోనిచ్చిన యారోగ్యము బలపడుననియు,

౪ కర్జూరపుకాయతో నిచ్చిన లోనిదుర్వాసనలు నివారణమగుననియు,

౫ గుంటకలగరఆకుపసరుతో నిచ్చిన తెల్లవెంట్రుకలుసైతము నల్లఁబడుననియు,

౬ చనుబాలతో నిచ్చిన యౌవనమునిలచి బల పడుననియు,

౭ జాజికాయతోనిచ్చిన దుర్గంధములు నివారణ మగుననియు,

౮ తేనెతోనిచ్చిన ధాతుపుష్టి, బలము గల్గించు ననియు,

౯ ద్రాక్షపండ్లరసముతో నిచ్చిన నేత్రదృష్టి బలపడుననియు,

౧౦ దానిమ్మకాయరసముతో నిచ్చిన మలబద్ధము నివారణమై యధికవిరేచనములు గాకుండ ప్రవృత్తి బాగుండుననియు,

౧౧ నిమ్మకాయరసముతో నిచ్చిన కడుపునొప్పి మానుననియు,

౧౨ నేతితోనిచ్చిన సర్వరుగ్మతలు శమించుననియు

౧౩ పంచదారతో నిచ్చిన వాతముల నివారించు ననియు

౧౪ ప్రాతబెల్లముతోనిచ్చిన జలుబు నిర్గమించు ననియు,

౧౫ పెరుగుతోనిచ్చిన విషదోషముల నడంచు ననియు,

౧౬ బెల్లముతోనిచ్చిన శరీరారోగ్యము బాగు పడుననియు,

౧౭ మంచినీళ్ళతోనిచ్చిన గుండెనొప్పి నివారించు ననియు,

౧౮ మేకపాలతోనిచ్చిన శరీరబల మభివృద్ధియగు ననియు,

౧౯ రాత్రి మంచులోనిల్వయుంచిన నీళ్ళతో నిచ్చిన గజ్జి, చిడుము మొదలగు చర్మవ్యా ధులు మానుననియు,

౨౦ వెన్నతోనిచ్చిన మెదడునకు బలము గల్గు ననియు,

౨౧ వేడిపాలతోఁ బుచ్చికొనిన శరీరబలము బుద్ధి, బలము నధికమగుననియుఁ జెప్పఁబడి నది. గర్భిణి కల్గియున్నవారలకు సునాముఖి యీయరాదని నిషేధింపఁబడినది.

**సునాముఁడు:—** యదుసంతతి. చంద్ర వంశక్షత్రియుఁడు. కంసునిసోదరుఁడు.

**సునాశ్వగోత్రము:—**
[వశిష్ఠగణము చూడుఁడు].

**సునీతి:—**
ఉత్తానపాదునిజ్యేష్ఠపత్ని. ధ్రువునితల్లి.

**సునీతుఁడు:—** పాండవసంతతి క్షత్రి యుఁడు. తండ్రి సుసేనుఁడు. పితామహుఁడు వృష్టిమంతుఁడు. నృచక్షుఁడు.

వేఱొకసునీతుఁడు కాస్యునిసంతతియం దల ర్కుని మనుమఁడును, సన్నతికిం గుమారుండగు వాఁడు. ఈతనిసుతునిపేరు క్షేముఁడు.

**సునీథ:—** అంగునిభార్య. మృత్యువుపెద్ద కుమార్తె. కుమారుఁడు వేనుఁడు.

**సునీథుఁడు:—** అత్రి, చంద్ర, యాదవ, క్షత్రియుఁడు. తండ్రి శ్రీకృష్ణుఁడు. తల్లి నాగ్న జితీదేవి. సోదరులు ప్రద్యుమ్నాదులు. (శ్రీకృ ష్ణుఁడు చూడుఁడు). మఱియు శిశుపాలుని సేనా నాయకునకు సునీథుఁడనియుం బేరు కలదు.

వేఱొకసునీథుఁడు మగధ బార్హద్రథ సంతతి క్షత్రియుఁ డగు సుబలుని కుమారుఁడు. (పితా మహునిపేరు సుమతి. పుత్రునిపేరు సత్యజిత్తు.)

**సున్న(పుంగాయ:—** ఆంధ్రభాషాసాం ప్రదాయార్థపదము. సువర్ణ(పుంగాయ. డబ్బులు,

చిల్లర, కొంచెము రూకలను లోనునుంచు కొని మొలనుదోపుకొను యిత్తడి లేక వెండి డబ్బి. ఇది యుండవలె గుండ్రముగా నిమ్మకాయంత యుండును. దీనికి సున్నముతో నేసంబంధము లేదు.

సాధారణముగా నిది స్త్రీలు తమ మొలలో నుంచుకొందురు. 'మగనిని స్వాధీనపఱచుకొను నామె' యనునర్థమున నీసున్నఁపుకాయ నుపమానముగా వాడుచుందురు.

**సున్నఁపుఁబిడత:-** సున్నమిడిన కుండ లేక పిడత యని యర్థము. ఇట్టిది యపశకునము నను కలహప్రియుఁడై కార్యముఁ జెఱుచుకొను వానికి చిహ్నముగ నెంచి వాడుచున్నారు. సున్నఁపుఁబిడత యెదురగుట కార్యనాశనమని తలంతురు. వాజ్మాధుర్యములేక కలహమునకుఁ గాలుదువ్వుచు, స్వకార్యభంగముఁ గల్గించుకొనుచుండు మూర్ఖుని సున్నఁపుఁబిడతయని యనుచుందురు.

**సున్నము:—** సున్నమున కాంగ్లమున 'Lime' అనియు ఫ్రెంచిభాషను Chaux అనియుం బేరులు. దీని సాధారణధర్మము రాతిం గాల్చిన సున్నమగును గాని కొన్నిజాతులరాళ్ళు యెక్కువవేడికిఁగాని సున్నముగఁ గాలవు. సున్నఁపురాయి యనంబడుజాతిరాయి కొంత మితమగు వేఁడి సున్నమగుం గాన నది వాడుకయందున్నది.

రసాయనశాస్త్రముమేరకు సున్నమునకు 'calcium oxide' అని సామాన్యనామము (Ca O.) బహుశః Oxide అను నామము కాల్చి నీరు జల్లి పేల్చిన సున్నమునకు వర్తించెడిని. దీనికి Qucklime అనియు వాడుకనామము కలదు. కాల్చినసున్నఁపురాతిపై నీళుబోసిన దానికి Hydroxide అనఁబరఁగెడిని.

దక్షిణదేశమున రామేశ్వరప్రాంతముల దొరకెడిరాతిని రాయిగను, దానిం గాల్చిన సున్నముగను గూడ వాడుచున్నారు. చెన్నపట్టణము మొదలగు సముద్రతీరముల సముద్రఁపు గుల్లలం గాల్చి సున్నముం జేతురు. దీనికి గుల్లసున్న మని పేరు. ఇవి ప్రధానములగు సున్నఁపురకములు. పగడఁపుసంబంధములగు రాళ్ళుదొరకు సముద్రతీరప్రాంతముల నారాతిం గాల్చి సున్నముగ జేసికొందురు.

సున్నమున కిసుకంజేర్చి మెత్తగదంచి, యిండ్లు కట్టుట కుపయోగించుట దీని ముఖ్యోపయోగము. తెల్లనిసున్నఁపునీటిని గోడలకు వెల్లవేయుదురు. పొలములు ఫంగస్‌పురుగులంబట్టి పోయినతావులందు సున్నముం జల్లి దున్నుదురు. సున్నపునీరు కఠినమగు నుప్పునీటిని సౌమ్యపఱచును. సున్న మౌషధములందు కలిసెడిని. సున్నఁపురాతింగాల్చు కట్టడములకు సున్నఁపుబట్టీలనియు, (Lime Kilns) సున్నమును దంచుతావునకు సున్నఁపుగానుగ మెరుపుగ వేతురట. అద్దములచేయుటయందు, కాస్టిక్‌సోడా చేయుటయందు సున్న ముపయోగించుదురు. ఇంకను wood-pulp చేయుటయందు, నమోనియాయనుదానిం జేయుటయందు సున్నము పనికివచ్చును.

ఆయుర్వేద వైద్యశాస్త్రమున గుల్లసున్నము మిక్కిలివేఁడిచేసి విరేచనముచేయుననియు, శ్లేష్మమును హరించుననియు, రాసున్నము, మేహశాంతింగల్గించి వాతపైత్యశూలలు, ఋతుశూలలం గట్టుననియు దంతములకు దార్ఢ్యమిచ్చునని

యు నధికమై పలుచనిచర్మముం గొఱికివైచి పుం డుచేయుననియుఁ జెప్పఁబడినది. సున్నము తాం బూలమునం దాకులకు రాచి భుజించెదరు. గొప్ప భాగ్యవంతులు ముత్యఁపుసున్నమును, ముత్యఁపు చిప్పసున్నమును, తాంబూలముతో వాడుదురు.

ఈముత్తెఁపుసున్నముంచుపాత్ర లేక సున్నఁపు కాయంగూర్చి యీయాయుర్వేదవైద్యమునం దిట్లు చెప్పఁబడినది. ఇనుపపాత్రయం దుంచినసున్నము చలవజేసి పైత్యమునడంచి, సమధాతువుం గల్గిం చుననియు, రాగి లేక యిత్తడిపాత్రలోనుంచిన సున్నము పైత్యము చర్ది మొదలగుదోషములం బుట్టించుననియు, కంచుపాత్రలోనుంచిన ముత్తెఁపు సున్నము పైత్యము నుద్రేకించి తాపముం గల్గిం చుననియు, వెండిపాత్రలో నుంచిన ముత్యఁపు సున్నము కఫోద్రేకము నడంచుననియు, బంగారు పాత్రలోనుంచినముత్యఁపుసున్నము త్రిదోషములు హరించి, గుల్మము, శగరోగములు, కుష్ఠురోగ ములను రాకుండ నాపుననియుఁ జెప్పఁబడినది.

## సున్నీలు:—

(షియా తెగ మహమ్మదీయులు చూడుఁడు).

## సుపత్రిగోత్రము:—

(వశిష్ఠగణము చూడుఁడు).

**సుపర్ణగణము:—** ఇది విశ్వబ్రాహ్మ ణులయం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి.

(ప్రణవశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు).

౧ సుపర్ణగోత్రము- విశ్వజ్ఞి, అర్క, సుపర్ణ (త్ర యార్షేయప్రవర).

౨ విశ్వజ్ఞగోత్రము- విశ్వజ్ఞ, కర్మసాక్షి, కనకా సన (త్రైయార్షేయప్రవర)

3 కర్మసాక్షిగోత్రము- కర్మసాక్షి, కనకాసన, కళాఖ్యాతి, సౌనసేన, పరిత (పంచార్షేయ ప్రవర.)

౪ సౌరసేనగోత్రము- ౧ సౌరసేన, పరత, పరిషం గత (త్ర్యార్షేయప్రవర).

౫ సాంఖ్యాయనసగోత్రము- పరీత, పరిషంగ, సాత్వీక, సత్యక, సాంఖ్యాయన (పంచార్షేయ ప్రవర).

## సుపాచిగోత్రము:—

(వశిష్ఠగణము చూడుఁడు).

**సుపార్శ్వనాధుఁడు:—** జైనతీర్థకరుల లో నొకఁడు. (తీర్థకరులు చూడుఁడు). చిహ్నము స్వస్థికము. ఇక్ష్వాకువంశక్షత్రియుఁడు. తండ్రిపేరు సుప్రతిష్ఠరాజు. తల్లిపేరు పృథ్వీదేవి. జన్మస్థలము కాశీపట్టణము [బనారస్]. పొడవు ౨౦౦ ధను స్సులు. [ధనుస్సు మూఁడున్నమూర] వర్ణము నీల వర్ణచ్ఛాయ. ఆయువు ౨౦ లక్షలు.

గణధర్ సంఖ్య ౯౫. నిర్వాణస్థలము సుమేరు శిఖరము. తొమ్మిదివందలకోట్ల సాగర్.

**సుపార్శ్వుఁడు:—** ఈపేరుగలవారు మువ్వురు గలరు.

పూరుసంతతి చంద్రవంశక్షత్రియులలో ద్వి మీఢుని సంతతివారగు దృఢనేమి కుమారుఁ డొకసుపార్శ్వుఁడు కలఁ డీతనిసుతుఁడు సుమతి.

సంపాతికుమారుఁ డొకసుపార్శ్వుఁడు.

సుమాలి యను రాక్షసునిసుతుఁ డొక సుపా ర్శ్వుఁడు.

**సుపీరియర్ ప్లానెట్సు (Superior planets):—** ఎస్ట్రోనామీ శాస్త్రమున సూర్యు నుండి భూమికన్న దూరముగఁ దిరుగుగోళముల కుఁ బేరు. మెర్క్యురీ వెనస్సులకన్న తక్కినవి సుపీరియర్ తెగకుం జెందినవే.

(ఇన్ఫీరియర్ ప్లానెట్సు చూడుఁడు.)

**సుపుష్పిగోత్రము:—**
[ఆత్రేయగణము చూడుఁడు].

**సుప్రతీకుఁడు విభావసుఁడు(సోదరులు):—** వీరిద్దరు బ్రాహ్మణకుమారులు. పైతృకధనమునకై నొకరితోనొకరు కలహించుచు నొకరినొకరు శపించుకొని, జ్యేష్ఠుఁడగు విభావసుఁడు కచ్ఛపము (తాఁబేలు) గను, సుప్రతీకుఁడు గజము (ఏనుఁగు) గను నయి తిరిగి యెడతెగనిపోరు సల్పుచుండిరి. (నేఁటికిని ఎడతెగని పోరునకు 'గజకచ్ఛపకలహ' మని సామెతగా వల్కుచుందురు). వీరిని గరుడుఁడు భక్షించి వీరి పోరుమాన్పెనని చెప్పఁబడినది.

**సుప్రభ:—** వైశ్యస్త్రీ. నాభాగునిభార్య. నాభాగునితండ్రి దిష్టుఁడు. పెదతండ్రి యిక్ష్వాకు మహారాజు (సూర్యవంశక్షత్రియుఁడు). నాభాగుని కీసుప్రభ రెండవభార్య. ఈమెఁ బరిణయమై నాభాగుఁడును, అతని సంతతివారును, వైశ్యులలోఁ జేరిపోయిరి. నాభాగుని మొదటిభార్య (క్షత్రియస్త్రీ) వలనఁ గల్గినసుతుఁడగు బలంధనుఁడు క్షత్రియుఁడుగనే యుండి, రాజర్షి యయ్యెను. మఱియు బలంధనుఁడే విష్ణుపురాణ వ్యాఖ్యానకర్త.

**సుప్తప్రబుద్ధన్యాయము:—** నిద్రించి మేల్కొనిన ట్లని యర్థము. నిద్రయందుఁ గొన్నిసంగతులు మరపు గల్గినను, మేల్కొనినంతనే జ్ఞాపకముగల్గి జాగ్రతఁ గల్గినట్లని భావము.

**సుబంధుఁడు:—** విక్రమార్కుని కాలమున నుండిన సంస్కృతకవి, వాసవదత్త యను గద్యకావ్యము రచించినవాఁడు.

**సుబధ్యగోత్రము.—**
(ఔశనస ఉపగణము చూడుడు).

**సుబధ్యగోత్రము:—**
(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

**సుబలుఁడు:—** గాంధారదేశ మేలిన నృపతి. కుమారుఁడు శకుని. (దుర్యోధనుని మేన మామ). కుమార్తె గాంధారి. (ధృతరాష్ట్రుని భార్య, దుర్యోధనాదులగు కౌరవుల తల్లి).

వేఱొక సుబలుఁడు మగధబార్హద్రథసంతతి క్షత్రియుఁడు. తండ్రి సుమతి. పితామహుఁడు దృఢసేనుఁడు. పుత్రుఁడు సునీథుఁడు.

**సుబాహువు:** ఈపేరుగలవారు పెక్కండ్రుకలరు.

చేదిదేశాధిపతియగు వీరబాహునిసుతుఁ డొక సుబాహువు. ఈతనిసోదరి సునంద.

యదుసంతతియందు శ్రీకృష్ణునివంశస్థుఁడగు ప్రతిబాహువుసుతుఁ డొకసుబాహువు.

శ్రీరాముని సోదరుఁడగు శత్రుఘ్నుని జ్యేష్ఠ పుత్రుఁ డొకసుబాహువు.

తాటకయొక్క సుతులు మారీచసుబాహువు లలో నొకఁడు. ఈతఁడు విశ్వామిత్రయాగకాలమున శ్రీరామునిచే నిహతుఁడైనవాఁడు.

**సుబ్రహ్మణ్యషష్ఠి:**—కార్తికశుద్ధషష్ఠి. దక్షిణదేశమునను, మళయాళమునను, అందు ముఖ్యముగ పళనిక్షేత్రముల సుబ్రహ్మణ్యపూజ లధికముగ జరుపుదురు. (పండుగలు చూడుఁడు.)

**సుబ్రహ్మణ్యషష్ఠి** ;యికా న్యాయము:— పిల్ల నాడించు దాది (రక్షకురాలు) బాలు నూఅడించి యాడించుట కెన్నియో కథలం జెప్పుచుండును. అం దెన్ని యసందర్భపు కథలు చెప్పినను బాల యూకొట్టుచునే యుండుం గాని లేశము నర్థముం గ్రహింపలేదు.

ఇట్టిస్థితిం దెల్పుట కీన్యాయము వాడుచుందురు

**సుభద్ర:**—వసుదేవుని కుమార్తె. తల్లి పౌరవి. శ్రీకృష్ణుని చెలియలు. భర్త యర్జునుఁడు. కుమారుఁ డభిమన్యుఁడు.

**సుభద్రుఁడు:**— యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి వసుదేవుఁడు. తల్లి పౌరవి. సోదరులు శ్రీకృష్ణుఁడు మొదలగువారు.

**సుభువు:**— కంసుని సోదరుఁడు. (యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు).

**సుమంగలగోత్రము:**— (ముద్గలగణము చూడుఁడు).

**సుమంతుఁడు:**—అత్రి సంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. జహ్నుపుకుమారుఁడు. అజకుని తండ్రి.

ఇంకను నితఁడు వ్యాసశిష్యుఁడనియు నథర్వణ వేదాధ్యేతయనియుం దెలియుచున్నది.

మఱియు వ్యాసశిష్యుండగు జైమినిసుతున కీపేరు గలదందురు.

**సుమంత్రుఁడు:**—ఈపేరుగలవా రిద్దరుగాన నగుచున్నారు. పురూరవునిసంతతి యందు జహ్నునికుమారుఁ డొకసుమంత్రుఁడు.

మఱియు దశరథమహారాజు (శ్రీరామునితండ్రి) కడ ముఖ్యమంత్రిగ నుండిన సుమంత్రుఁడొకఁడు కలఁడు. ఈతఁడొకతఱి సారథిగఁ గూడ నుండిన వాఁడట.

**సుమత్రాద్వీపము:**— హిందూమహాసముద్రమున మలేఆర్కిపిలెగోనందు డచ్చియీస్టిండీసులోనిది. మలాకాప్యాసేజి యొకవైపునను, సుండాస్ట్రెయిటు వేఱొకవైపునను దీనిని మలయాద్వీపకల్పమునుండియు, జావానుండియు, వేఱుచేయుచుండును. ఇది యెన్మిదిజిల్లాలుగ విభజింపఁబడినది. ౧,౬౩,౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యముగలది. జనాభా యించుమించు ౬౦,౦౦,౦౦౦ లని యంచనా వేయఁబడినది.

**సుమతి:**— అత్రి, చంద్ర, పూరువుసంతతి క్షత్రియుఁడు. తండ్రి అంత [మతి] నారుఁడు. సోదరులు ధ్రువుఁడు, అప్రతిరథుఁడు. పుత్రుఁడు దుష్యంతుఁడు. (శకుంతలభర్త) సుమతికి రైభ్యుఁడను వేఱొకపుత్రుఁడుండె నని తెలియుచున్నది. మఱియు నీసుమతి కీళిన మహారాజనియుం బేరుండెనఁట.

ఇక్ష్వాకునితమ్ముఁడగు నృగునిసుతుఁడు సుమతియను పేరుగలవాఁడే. ఋషభునిపుత్రుఁడగు భరతునిసుతుఁడు సుమతియను పేరుగలవాఁడే. పూరువంశమునందే ద్విమీఢునిసంతతిలో సంపార్శ్వఁడనువానిసుతుఁ డొకఁడు [సన్నతమంతుని తండ్రి]

సుమతియని పేరుగలవాఁ డని తెలిసెడింగాని తక్కినవారి పేర్లు తెలియరాకున్నవి.

ఒక బ్రాహ్మణుని పుత్రుఁడు సకలవేదశాస్త్ర పారంగతుఁడు సుమతియని పేరుగలవాఁడు సంసారమొల్లక తపస్వియాటతో నాగక తండ్రికిఁ గూడ తత్త్వోపదేశ మొనర్చెను. దానికి 'పితాపుత్రసంవాద' మనిపేరు.

అరిష్టనేమి కూఁతురునకు సుమతి యనిపేరు. ఈమె సగరచక్రవర్తి రెండవభార్య. ఈమెయం దఱువదివేవురు పుత్రులు గల్గిరి. వారందఱుఁ గపిలునికోపమునకు గురియై భస్మీభూతులై, సగరునిముమ్మనుమఁడు భగీరథుఁడు తపంబొనర్చి గంగను దెచ్చినది వీరికి గతులు గల్గించుటకే.

వేఱొకసుమతి మగధబార్హద్రథసంతతి క్షత్రియుఁడగు దృఢసేనునికుమారుఁడు. పితామహుఁడు సముఁడు, పుత్రుఁడు సుబలుఁడు.

**సుమదుఁడు:**— విశ్వామిత్రునిసుతుఁడు. (విశ్వామిత్రుఁడు చూడుఁడు.)

**సుమనసుఁడు:**— ఉల్ముకుని కుమారుఁ డొకసుమనసుఁడు. ఈతనిజ్యేష్ఠసోదరుఁ డంగుఁడు.

మఱియొక సుమనసుఁడు సంభూతియని నామాంతరముఁ గలవాఁడు. ఇక్ష్వాకుసంతతి. తండ్రి హర్యశ్వుఁడు. కుమారుఁడు త్రిధన్వుఁడు.

**సుమహాదేశము లేక తామ్రలిప్తి దేశము, దామలిప్తిదేశము:**— ఈదేశము బంగాళములో రూపనారాయణనదీతీరమున నున్న తామ్రలిప్తిపురము రాజధానిగఁ గల్గినకతన తామ్రలిప్తి దేశ మనియు, మొదట సుమహాదేశమనియు, పేర్లుగలదేశము. శిలావతీనదియు (ఇప్పటి శిలైనది) ద్వారకేశ్వరీనదియు (ఇప్పటి దల్కిసోర్) కలిసి రూపనారాయణీనది యనంబరఁగి గంగానదిశాఖయగు హూగ్లీయందుఁ జేరుకొనును. మఱియు నీదేశమునకు దామలిప్త మనియు వాడుకయుండెనట. తామ్రలిప్తపురము తామ్రలిప్తిక, తామ్రలిక, తమోలుప్త మొదలగు నానావికారరూపములుగ మారుచు నేటి కాంగ్లలనాఁడు తామ్లూకై బరఁగుచున్నది. బ్రహ్మపురాణము తమోలుప్తమాహాత్మ్యమున వివరింపఁబడిన భర్గభీమదేవస్థానము నేఁటికి నిచట కలదు. ఇది తొల్లింట హ్యూయనచ్వాంగు దీనిందర్శించుతరి నాయన వర్ణించినపురాతనఁపు విహారముగ పోల్చుచున్నారు. ఇందలిశక్తివిగ్రహము కడుపురాతనమైనది. ఆరవశతాబ్దమువాఁడగు దండిమహాకవి తనదశకుమారచరిత్రమున ౯౬ యందు బిందువాసినీదేవియాలయ మిట గలదని వివరించియున్నాఁడు. పురాతనమగు నర్జున కృష్ణుల దేవస్థానఁపుఁదావునఁ గట్టఁబడినదేవాలయమునవీనఁపుఁబని. జైమినీభారతమున దీనికి రత్నపురమ పేరిడఁబడియున్నది.

జైమినిభారతమున నీదేశమేలిన భూపతులు మయూరధ్వజుఁడు, అతని సుతుండగు తమోర్ధ్వజుఁడు పేర్కొనంబడిరి. తమోర్ధ్వజుఁడనునృపతి పాండవులకు సమకాలికుఁడట. ఈతఁడు విష్ణుభక్తుండును, మహాప్రభాసంపన్నుఁడు నట. యుధిష్ఠిరుఁ డశ్వమేధయాగ మొనర్ప శ్యామకర్ణాశ్వమును వదలి యర్జున శ్రీకృష్ణులను దాని రక్షణ కంపెనట. అద్దానిని తమోర్ధ్వజపుత్రులు కట్టివై చిరట. దానికై యర్జునునకును వారికిని గలహము నడచెనట. అర్జునుఁడు బలహీనుఁడై చేయునదిలేక శ్రీకృష్ణుం బ్రార్థింప నాతం డానృపతి విష్ణుభక్తుం డజేయుం డనిదెల్పి యాతనికడ కర్జునుం గొంపోవ తమోర్ధ్వజుఁడు శ్రీకృష్ణుని విను

తించి ప్రార్థించియు, యర్జునుని గారవించియు, నెల్లకాల మెల్లర కీటులనె దర్శనమనుగ్రహింపు చుండుమని ప్రార్థించెనట. అది నేటికిని దేవస్థానమై యున్నది. ఈదేశము క్రీ. పె. ఆరవశతాబ్దమునఁగూడ స్వతంత్రదేశమై యుండెననియు, మగధమౌర్యులకాలమున వారికి లోఁబడిన దేశమయ్యెననియుఁ జెప్పఁబడినది. (రాఢాదేశము చూడుఁడు.)

## సుమాగధీనది, శోణభద్రానది:—

[మగధరాజ్యము చూడుఁడు].

## సుమిత్ర:— దశరథమహారాజు రెండవ భార్య. కుమాళ్ళు లక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు.

## సుమిత్రుఁడు:— ఈపేరుఁగలవారు ముగ్గురు గానఁగుచున్నారు.

ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. [కడపటిభూపాలుఁడు]. బృహద్బలునినుండి ముప్పదియవభూపాలుఁడు. బృహద్బలుఁడు భారతయుద్ధమున కౌరవపక్షమున యుద్ధమొనర్చి యభిమన్యునిచేఁ జంపఁబడినవాఁడు.

మఱియు యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. వృష్ణికుమారుఁడు. పితామహుఁడు భజమానుఁడు. ఇంకను యదు వసుదేవునితమ్ముఁడగు ననీకునిసుతుఁడొక సుమిత్రుఁడు.

## సుమేదగోత్రము:—

[శాండిల్యగణము చూడుఁడు].

## సుమేరియనుల ఉర్వీపురము (Vrofchaldees):—

కాలవశముకన్న వింత గానరాదు. అది యెంతటిమార్పులనైనం జేయఁగల్గును. కంఠ్లారఁ జూచినవారికి సుమేరియనుజాతివారు 'ఛాల్డీస్' అనంబడుటకు, ఉర్వీపురము 'ఉర్' అనంబడు క్లుప్తరూప మగుటకు నాపురమే యడుఁగంటి మట్టిదిబ్బలై తిరుగ ద్రవ్వంబడి కన్గొనఁబడుటకన్న నేమివిచిత్రము గావలయును? (ఆర్కియాలోజీ చూడుఁడు).

ఈసుమేరియను (ఛాల్డీస్) లేజాతివారో యేదేశస్థులైయుండి యిట కేతెంచిరో తెలియరాకున్నను వీరి సుమేరుశబ్దము భరతదేశఁపు హిమాలయ ప్రాంతముల సూచించెడిని. ఉర్ పట్టణము బయల్పడినతా విప్పుడు మెసపొటేమియాదక్షిణభాగమునం దున్నది. ఈదేశమున కిప్పుడు 'ఇరాక్' అను నామమిడి వాడుచున్నారు. ఛాల్డీస్ (సుమేరియనులు) అస్సీరియనులకన్నను, బేబిలోనియనులకన్నను, పూర్వ మీదేశమున వసించిరని తెలియున్నది. ఈఉర్‌పురపుపాటం ద్రవ్వి బయలు దేరఁదీసిన ప్రముఖుఁడు ఆర్కియాలోజికల్ శాఖ ఉద్యోగులు Sir Leonard Woolley గారును, వారి సహోద్యోగి J. Cruickshank Rose గారును నేకాభిప్రాయులై, యిప్పుడు మెసపొటేమియా [ఇరాక్] అని పిలువంబడు దేశము భూ సముద్రముల యాంవళ్ళ మేర కాదిని పారశీకసంయుక్తాగ్రగుడము [Persian Gulf] తా వదలివేసి మరలిపోయిన సముద్రభాగమై యుండెననియు, నట్లు మేట వేయంబడిన ఆసముద్రభాగము రాను రాను ఆరఁగట్టఁబడి నేలయై యుండ సారవంతమై పంటల కనువగు ప్రదేశముగఁ దోఁచుకతనఁ బ్రజ ఉత్తర దిశనుండియు, తూర్పు పడమరదిక్కులనుండియు, సముద్రముపై నోడల మీఁదుగా దక్షిణదిశనుండియు, వచ్చిచేరుచుఁ గాపురములు గుదిరియుందు రనియు, నిటుల

పై గ్రీస్ యూఫ్రటీస్ నందలి యుభయతీరముల సారవంతములగు భూప్రదేశము లొక్కొక్కకాలమున నొక్కొక్కపేరు బరఁగుచుఁ గడకు 'ఇరాకు, మెసపొటేమియా యను పేరుల నందెననియు, నటుల నొకప్పుడు సుమేరులనుండి సుమేరియా యను నామముం బడసియుండెననియు, నదియుఁ దక్కినవాటివలె మాఱియుండుననియు, సుమేరియనులనాడు రెల్లుగుడిసెలు, పూరిపాకలు, మట్టిగోడలు, నిటుకకట్టడములుగ పెరిఁగి పల్లెలు పెద్ద గ్రామములై, పట్టణములై, యుర్వీపురము రాజధానిగ నేర్పడెననియు, నది క్రీస్తునకు పు కొన్ని వేలసంవత్సరములకుఁ బూర్వఁపుఁగాలమైయుండు ననియు, క్రీ. ము. నాల్గువందలసంవత్సరమునాఁ డీపురి కేవలము వదలివేయఁబడి యుండుననియు, సుమేరియనులు యుద్ధములొనర్చినవారే యనియు, వీరికిఁ బిదప నస్సీరియనులు, బేబిలోనియనియులు ఈదేశమున వసించిరనియు, వారిరాజధానులు పట్టణములు పల్లెలు వేఱుగ నుండెననియు నభిప్రాయపడియున్నారు.

ఉర్ పట్టణఁపు పాటిదిబ్బలం ద్రవ్వప్రయత్నములు క్రీ. వె. ౧౮౫౪ నుండియు జరుగనారంభినను, సమృద్ధిగ ద్రవ్య మెరోపామహాసంగ్రామానంతర మొనంగంబడి పనులు నడచినవి. వీరు త్రవ్వితీసినవస్తువులలో ముఖ్యములు సుమేరియనులసమాధియందు దొరకిన వారినాటి వీణయొకటియు, నొకబంగారునందియు, నొకసుమేరియను రాకొమరితశిరస్సు (చెక్కఁబడిన చిత్రఁపుబొమ్మ)ను, బంగారురేకు సాగఁగొట్టఁబడిన యొకశిరోవేష్ట అందు తలవెంట్రుకల యాకారము చక్కఁగఁ జెక్కఁబడియున్నది. సుమేరియనుల దేవాలయము మొదలగునవి పెక్కు లున్నవి. సుమేరియనుల సమాధిస్థలములును బయల్పడినవి. అందు ప్రజల యొక్కయు భూపతులయొక్కయు సమాధులు పోల్పఁబడినవి. అందొక రాజసమాధి స్థితులబట్టి యది ౫౦౦౦ సంవత్సరముల క్రిందటి దనెదరు. దేవస్థానము పురమధ్యమునం దుండెను. పురిం జుట్టిన గోడలవెలుపలనే యూఫ్రటీస్నది ప్రవహించుచుండెను. పురపాఠశాలయు నందు బాలుర Excersise పుస్తకములు పోల్పఁబడినవి. పట్టణమునఁ బ్రజానివాసభాగము పోల్పఁబడినది.

బైబిలు ప్రాచీనిబంధనగ్రంథమున జెనిసిస్ నందీదేశముగుండానే పాలస్తీనాదేశమునకు బ్రహాము ప్రవక్త యూమలు నడిపించుకొనిపోయెనని చెప్పఁబడినది. ఆయననాఁటికే యిది ప్రాతపట్టణముగాను, ఇటుకకట్టడములు గలదిగను నుండెనట. మఱియు జెనిసిస్ గ్రంథమునఁ జెప్పఁబడియున్న "Model of ram caught thicketina" ఉర్ పట్టణఁపు పాడుంద్రవ్వతకె నిటీవల యొకతావున దొరకినదనియు, నది 'lapis lazull' అనుశిలతోను, బంగారంతోను జేయఁబడినదనియు క్రైస్తవు లనెదరు. దీనింగూర్చి యింకను దెలియవలసి యుండెడిని.

## సుమేరుశిఖరము (శిఖరీజీ):—

(గిరిపంచకముఁ జూడుఁడు.)

**సుయజ్ఞుఁడు:**— ఉశీనరదేశాధిపతి యొక సుయజ్ఞుఁడు. ఇతఁడు యుద్ధమున శత్రువులచే నిహతుఁడుకాఁగా బంధువర్గము దుఃఖితులై యుండ యముఁ డేతెంచి వారికిఁ దత్త్వోపదేశము జేసి దుఃఖముబాపెనట. దానిపేరు ప్రేతబంధుయమసంవాదము.

మఱి యొకసుయజ్ఞుఁడు దశరథమహారాజుచే పుత్రకామేష్టిచేయించిన ఋత్విక్కులలో నొకఁడు.

**సురధుఁడు:—** విదర్భదేశాధీశుఁడగు శ్వేతునికిఁ గనిష్ఠసోదరుఁడు. ఆతనికిఁ బిదప భూపాలుఁడైనవాఁడు.

వేఱొకసురధుఁడు కురుసంతతిలోని జహ్నుని కుమారుఁడు.

**సురనందని:—** తండ్రి వరుణుఁడు. తల్లి జ్యేష్ఠాదేవి. సోదరుఁ డధర్ముఁడు.

**సురభి, కామధేనువు:—** కామధేనువు కోరినకోర్కెలసిద్ధికిఁ గారణమని చెప్పఁబడినది. కామధేనువునకుఁ గపిల యనియుం బేరుండెనట.

**సురభితయగోత్రము:—**
[వార్ధ్యస్థ లేక మిత్రియువగణము చూడుఁడు.]

**సురభువు:—** ఉగ్రసేనుని నాల్గవకుమార్తె. శ్యామకునిభార్య.

**సుర లేక సురేభగోత్రము:—**
[నిధృవగణము చూడుఁడు.]

**సురస:—** తండ్రి దక్షప్రజాపతి. భర్త కశ్యపమహర్షి. ఈమెసంతతివారు యక్షరాక్షసులనంబడిరి. దక్షప్రజాపతి కుమార్తె కశ్యపుని భార్య.

వేఱొకసురస నాగులకుఁదల్లి. ఈమె యాంజనేయుఁడు సీతాదేవిని వెదకుటకు లంకకేగుతరిసముద్రమధ్యమున దారిలో నడ్డగించినదట.

**సురక్షతుఁడు:—** మగధ బార్హద్రథ సంతతిక్షత్రియుఁడు. తండ్రి నిరమిత్రుఁడు. పితామహుఁడైతాయువు. కుమారుఁడు బృహచ్ఛేనుఁడు.

**సురాట్పురము (సౌరాష్ట్ర పురము) సూరత్‌పురము:—**
(సురాష్ట్రము చూడుఁడు.)

**సురాష్ట్రము - సౌరాష్ట్రదేశము - సౌరాజ్యము:—** గుజరాతు, కచ్ఛి, కతియవాఁడు, కలిపినద్వీపకల్పము నీదేశముండిన తావని పోల్చుచున్నారు. మహాభారతము వనపర్వము ౮౮ యందు సింధునదిమొదలలు బరోచివఱకు సౌరాష్ట్రమని చెప్పఁబడినది. రామాయణము ఆది ౧౩ యందు సౌరాజ్యమని పేరుకలదు.

రాజధాని సూర్యపుర మనియు, దానికే కాలమువెంబడి సౌరాష్ట్రపుర మనియు, సురాట్పుర మనియు పేర్లు వాడుకయై నేటికి సూరట్‌గా మారెనని తలంచుచున్నారు. ఈసూరట్పురమునకు సమీపముననే తపతీనదిపై పట్వారాయను పవిత్రస్థలి కలదు. అట శంకరభగవత్పాదులు దశోపనిషద్భాష్యము రచించిరని ప్రతీతికలదు. పెక్కండ్రు సన్యాసులు దూరదేశయాత్రస్థు లేగుచుండు యాత్రాస్థలము.

వలభీనగరము రాజధానిగ దశకుమారచరిత్ర ౬ యందు చెప్పఁబడినది. వల, వల్లీ యన పశ్చిమసముద్రతీరమున కర్థమట. కథియవాడులో భావానగరునకు వాయవ్యముగ ౧౮ మైళ్ళదూరముననున్నది. అచటివారు దీనిని వమిలాపుర మనివాడుచుందురట. ఇది వలభీ, వల్లీలనుండి కల్గినమార్పుగానోపు.

వలభీనగరము రాజధానిగనుండిన పేరేగాక బౌద్ధమతవిద్య, విజ్ఞానములకుం బేరందిందినదనియు, క్రీ. వె. ఏఁడవశతాబ్దకాలమునఁ జెప్పఁబడినది.

సౌరాష్ట్రదేశమునకు భటార్కుఁడు, ఒకటవ శ్రీధరసేనుఁడు, రెండవధ్రువసేనుఁడు, ఏఁడవశైలాదిత్యుఁడు, నింక మఱిముప్పదిరెండుగురి పేర్లు తెలియవు గాని యేడ్గురురాజులు పాలించిరని చెప్పఁబడినది. ఆ యేఁడవశైలాదిత్యుఁడే కడపటివాఁడట. ఇక్కాలము క్రీ. శ. ౪౬౫ సం. మొదలు క్రీ. శ. ౭౬౬ అని చెప్పఁబడినది. భట్టికావ్యకర్త యొకటవశ్రీధరసేనునియాస్థానపండితుఁ డనియు, కల్పసూత్రకర్త భద్రబాహుస్వామి రెండవధ్రువసేనుని యాస్థానపండితుఁ డనియుఁ దలంచుచున్నారు.

ఇంక వలభీనగరము రాజధానిగ మహ్యులకు లోఁబడిన సత్రపులును పాలించిరనియుఁ జెప్పఁబడినది. క్రీ. పూ. ౧ వ శతాబ్దము మొదలు క్రీ. శ. ౪ వ శతాబ్దకాలము వఱకు షాహప్రభువు లీదేశమేలిరట. పిదప వామస్థలి (ఇప్పటి బాంథాలీపురము) రాజధానిగ శానాపతిసరపాలురు కనూజగు ప్రభూపతులకు లోబడి సౌరాష్ట్ర మేలిరనియుఁ పిదప తిరిగి వలాభి రాజధాని యయ్యెననియుఁ దెలుచున్నది.

కతియవాడురాజ్యములోని మాధవపూ రనం బడుపురము. శ్రీకృష్ణుండు రుక్మిణీదేవిం బరిణయమైనతావనియు, విరావల్ పట్టణముకడ నున్న దేవీపట్టణము (సోమనాథక్షేత్రసమీపము) శ్రీకృష్ణనిర్యాణస్థల మనియు, యాత్రాస్థలములుగఁ దెల్పుచున్నారు.
[బలభీపురముంగూర్చిన శాసనముఁ జూడుఁడు].

**సురాష్ట్రుఁడు:**— తామసమనువుయొక్క తండ్రి యొకసురాష్ట్రుఁడు.

మఱియొకసురాష్ట్రుఁడు కాస్యునికుమారుఁడు. ఈతని సుతుఁడు దీర్ఘతముఁడు.



**సురాక్షగోత్రము:**—
(ఉపమన్యుగణము చూడుఁడు.)

**సురుగుడుచెట్టు:**— దీనిం గూర్చి సరిగాఁ దెలియదు. దీని కాంగ్లమున 'Vayambadam tree' అని పేరనియు, దీనిచెక్క చూర్ణము నూనెతోఁ గైకిపూసిన చర్మవ్యాధులు మానునవియు నందురు.

**సురుచి:**— ఉత్తానపాదుని కనిష్టభార్య. కుమారుఁ డుత్తముఁడు.

**సురాపాక్ష్యగోత్రము:**—
(ఔశనసఉపగణము చూడుఁడు.)

**సురాపాక్షిగోత్రము:**—
(ఔతథ్యఉపగణము చూడుఁడు.]

**సురేకారము (సురాకారము):**— లా. Polassi Nitras, ఆంగ్ల Saltpetre - ఫ్రెంచి Salpertre.

దీనికి పెల్లుప్పనియు నందురు. రసాయనశాస్త్రవేత్తలు దీనిని 'Crude Potassium nitrate' అనెదరు. ఇది భరతదేశము, ఉత్తరఅమెరికా, స్పానియాదేశములందు భూమియొక్కయుపగభాగమునే దొరకునట్టియుప్పు. ఇంకను దక్షిణఅమెరికాదేశములందు విస్తారము కలదని తెలిసెడిని. (Na.No) Calcium nitrate (Ca. No) wall saltpetre - Lime saltpetre-Cubic saltpetre అని వాడుక నామములును గలవు. దక్షిణఅమెరికాలోని ఛిలీదేశమున విస్తారముగ దొరకుసురేకారమునకు 'Sodium nitrate' అనియు, 'Caliche' అనియు రసాయనశాస్త్రసంబంధమున వాడుక

నామములు. దీనిని ఎరువులు చేయుటయందు, తుపాకీమందులలోను, బాణసంచాలలోను గలుపుదురు.

సురేకారము చలువచేయునది. అతికాకను తగ్గించి, మూత్రమును వెడలించుగుణము కలది. విదాహ మడంచును. రక్తప్రవాహ వేగమును తగ్గించును. స్త్రీల కుసుమరోగోద్ధృతము నాపును. సురేకారంపుద్రావకమునకు Nitric acid అని యందురు. ఇది శరీరముపై రాచిన పుండగును. మఱియు నది పెక్కులోహములం గొఱుకు శక్తి గలది.

**సురేశ్వరాచార్యులు:—** ఈమహాసీయుఁడు శంకరాచార్య శిష్యుఁడగు సద్వైతి. పూర్వాశ్రమమున వీరిపేరు మండనమిశ్రుఁడు. ఈయనను బ్రహ్మదేవునియవతారముగఁ జెప్పుదురు. మండనమిశ్రుఁడు భట్టపాదులకుఁ గుమారిలభట్టునకు శిష్యుండై, కర్మవాద (జైమిని) మతము ననుష్ఠించు చుండువాఁడు. గొప్పశాస్త్ర పాండిత్యములుగల విద్వాంసుఁడు. (భట్టపాదులు-నాస్తికమతమునకు వైరియై కర్మమతమును వ్యాపింపఁజేసినవాఁడు. కుమారిలభట్టు షణ్ముఖుండగు కుమారస్వామి యవతారముగఁ జెప్పఁబడిన వాఁడు.) మండనమిశ్రుఁడు శంకరులచే శాస్త్ర వాదమునఁ దోడివారికి శిష్యుఁడై వారికడనే సన్న్యాసముఁగైకొని సురేశ్వరాచార్యుం డనిపేరం దె నని చెప్పఁబడినది. శంకరభగవత్పాదులకుఁ బిదప గురుపీఠమగు వ్యాఖ్యాసన మధిష్ఠించిన వారని చెప్పఁబడినది. శంకరులే వీరికి లోకాచార్యాభిషేక మొనర్చి వారి కడదినములు గడపుడకు హిమవన్నగమండల బదరికాశ్రమమున కేగిరట. సురేశ్వరాచార్యులకు విశ్వరూపాచార్య లనియు, వివరణాచార్యు లనియు వారుక నామములు కలవు.

**సురైషిణగోత్రము:—**
(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**సుర్పారకపురము:—** ఇది తొల్లింట అపరాంతదేశమున ప్రధాననగరముగ నుండెను.
(అపరాంతక చూడుఁడు.)

సుర్పారకపుర మిక్కాలమున 'సుపర' యను పేరఁబరఁగుచు బొంబై రాజధాని బేసిన్పణమునకు సమీపమున నున్నది.

**సుర్మారాయి:—**
(సౌవీరాంజనము చూడుఁడు.)

**సులభ:—** తత్త్వజ్ఞానురాలగు మహానుభావురాలు. జనకులలో నొకఁడగు విమలయోగ ధర్మలంపటునితో నీమె సంవాదమొనర్చి యీాయనను బరీక్షించినటులఁ జెప్పఁబడినది.

**సులాలశాఖక్షత్రియులు:—**
(క్షత్రియకులము చూడుఁడు).

**సులోచనములు:—**
[అద్దకన్ను చూడుఁడు].

**సుల్తానాపండ్లు:—** ఇవి వేఱుజాతిపండ్లు కావు. ద్రాక్షపండ్లు, కిశిమిశిపండ్లు మొదలగు వాటి నెండించి చెడకుండఁ జేసినవి. ఆసియామైనరుదేశమందు, స్మైర్నాయందు, పాలస్తీనాదేశమున నిట్టిపండ్లు విస్తారముగ నాయత్తపఱుపంబడుచున్నవి.

**సువర్ణముఖరీనది:—** అచ్చటివా రసాధారణముగ 'స్వర్ణముఖి'యనుచున్నారు. చిత్తూరు

జిల్లాలోనికొండలలోఁబుట్టి శ్రీకాళహస్తిప్రక్కగఁ బ్రవహించుచు నెల్లూరుమండలములోని నాయడుపేటకు సమీపమున బంగాళాఖాతమున సంగమించును.

దీనిప్రశంస శివపురాణము ౨-౧౦ యందుఁగలదు.

**సువర్ణరేఖ:—** ఉత్కలదేశమున 'సువర్ణరేఖ' యనునది కలదు. మఱియు జూనగడ్ సంస్థానమున గిరినార్ పర్వతము ప్రక్కనుండి ప్రవహించునదికి 'సువర్ణరేఖ' యని పేరుకలదు.

**సువర్ణరేతసగోత్రము:—** ఇది విశ్వామిత్రసంతతియందలి సువర్ణరేతసగణముగఁ జెప్పఁబడినగోత్రము. దీనికి విశ్వామిత్ర, కౌపాతరస, అనియు,విశ్వామిత్ర, ఘృతకౌశిక, అనియు, విశ్వామిత్ర, సౌవర్ణరేతస అనియు, మూఁడు ద్వ్యార్షేయప్రవర రూపములు కలవు.

**సువస్తునది స్వాత్:—** దీని కిక్కాలమున 'స్వాత్' అనియు, సిహోన్స్రెడా యనియు ననుచున్నారు. దీనిప్రశంస మహాభారతము, భీష్మపర్వము, ౯ అధ్యాయమునఁ గలదు. దీనిని హ్యూయనచ్వాంగు 'శుభవస్తునది' యని వ్రాసెను. దీనియందు గౌరీనది (ఇప్పటిపేరు పంజ్కోరానది) సంగమించును. ఉభయోదకములు కలిసినప్రవాహమునకు 'లాండోయినది' యనుచున్నారు. అది శుభా (ఇప్పటిపేరు కాబూల్నది) నదిలో సంగమించును. ఆసంగమితతావుననే తొల్లింట గాంధారదేశఁపు రాజధానిగనుండి పుష్కరావతి లేక పుష్కలావతీపురము కలదు.

సువస్తునది 'నాగాపలాల' మను జలబుద్బుదమున జనించును.

**సువ్రతుఁడు:—** మగధబార్హద్రథ సంతతి క్షత్రియుఁడు. తండ్రి క్షేముఁడు. పితామహుఁడు శుచి. పుత్రుఁడు ధర్మసూత్రుఁడు.

వేఱొకసువ్రతుఁ డత్రిసంతతి, చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి యుశీనరుఁడు. సోదరులు శిబి, నృగుఁడు, నవుఁడు, క్రిమి యనువారలు.

**సువిషిగోత్రము:**
(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.)

**సువీరుఁడు:—** అత్రిసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి శిబిచక్రవర్తి. ఈతనినుండి యీతఁడేలినదేశమునకు సౌవీరదేశమనిపేరయ్యెను.

సోదరులు వృషదర్భుఁడు, కేకయుఁడు, మద్రుఁడు. మఱియు యదుమహారాజసంతతియందు వసుదేవుని తమ్ముఁడగు దేవశ్రవసుని సుతుఁడొకఁడు సువీరుఁడు కలఁడు. ఇంకను క్షేమ్యునికుమారునకును నిదేపేరు.

**సువేలము:—** లంకాద్వీపమునం దుండిన యొకకొండ. దీనిచరియలయందు శ్రీరాముని వానరసైన్యము విడిసెనని చెప్పఁబడినది.

**సుశర్మ—** ఈపేరుగలవారు పెక్కండ్రు గాననగుచున్నారు.

త్రిగర్తదేశాధిపతియగు నొకనృపాలుఁ డితఁడు సుధన్వుని కుమారుఁడు.

బ్రాహ్మణుఁడు సుశర్మ యనుపేరుగలవాఁడు కలఁ డీతనిభార్యను బలాకుఁడను రాక్షసుఁ డెత్తుకొనిపోవ నుత్తానపాదునిపుత్రుఁ డుత్తముఁడు విడిపించి యిచ్చెనని చెప్పఁబడినది.

మఱియు గర్గుని (అంగభూపతి) సుతుఁ డొకఁ సుశర్మ. ఈతఁడు భారతయుద్ధమున నకులునిచే నిహతుఁడైనవాఁడు.

ఇతను మగధభూపతులలో కడపటివాఁడు. ఈతఁడు కాణ్వాయనులలో నివాఁడు. ఈతఁడు ఆంధ్రభృత్యుఁడగు శూద్రకునిచేఁ జంపఁబడినవాఁడు. ఈతనికిఁ బిదప, ఆంధ్రభృత్యులు మగధరాజ్యమేలిరి.

**సుకాంతి:**— పూరువుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి భరద్వాజుఁడు. పితామహుఁడు [illegible]. ప్రపితామహుఁడు [illegible].

**సుశాలకులగోత్రము:**—ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములను చూడుఁడు.)

సుశాలకులగోత్రము—ఏకాన్నేయ (౯౫) గోత్రము. దీనిని సుసౌశ్యకుల - సుపాలకుల - సుపాళ్ళకులగోత్రమనియు నందురు. సంస్కృతిగోత్రము సౌవర్ణస - సువర్ణగణము. అంగిరర్షి - ఆపస్తంబ యజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాధ్య ప్రవరఖండ. సమానగోత్రములు ఆంగిరస. జగదీశుఁడు దేవత. జలూకాంబ భార్య. నర్మదాతీరము తపస్థానము. జలూకసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౫౦. క్షేత్రసంఖ్య ౨౫. స్వర్ణపాత్రదానము. పాటలపుష్పము వర్జనీయము.

**సుశ్రుతుఁడు:**—
మిథిలాధిపతి. కుమారుఁడు జయుఁడు.

**సుశోభ:**— తండ్రి మండూకరాజనియు, అయోధ్యనేలుచుండిన సూర్యవంశక్షత్రియుం డగు పరీక్షిత్తు వేటాడఁబోయి యీమెంజూచి మోహించి పరిణయమయ్యెననియు, నీమెకు ముగ్గురు సుతులనియు, నీమె దుష్టప్రవర్తనగలది యనియు, ఏమె సుతులు శపింపఁబడిరనియుం జెప్పఁబడినది.

**సుషుప్త్యవస్థ:**—
(అవస్థాత్రయము చూడుఁడు.)

**సుషుమ్నానాడి:**—
(అష్టాంగయోగములు చూడుఁడు.)

**సుషేణుఁడు:**— పాండవసంతతి క్షత్రియుఁడు. తండ్రి వృష్టిమంతుఁడు. పితామహుఁడు [illegible]. కుమారుఁడు సునీతుఁడు.

అంగరాజగు కర్ణునికుమారుఁడు సుషేణుఁడు. సాత్యకిచే నిహతుఁడైన వాఁ డొకఁడు కలఁడు.

ఇంకను కృష్ణునికి రుక్మిణీదేవియందుఁ గల్గిన సుతులలో నొక్కఁడు సుషేణుఁడు. సుగ్రీవునిమామ (రుమాదేవి తండ్రి) గారును సుషేణుఁడే. ఇతఁడు వరుణునివలన జన్మించినవాఁడు. మఱియు వసుదేవునిసంతతి కుమారుఁ డొకఁడు సుషేణుఁడు కలఁడు. ఇతనిని గంసుఁడు చంపెను.

సుషేణుండను గొప్పవైద్యశాస్త్రవేత్త యొకఁడుండువాఁడు. (అగస్త్య సాంప్రదాయవైద్యము చూడుఁడు.)

**సుసంధి:**— ఇక్ష్వాకుసంతతి సూర్యవంశ క్షత్రియుడు. తండ్రి మాంధాత. తల్లి బిందుమతి. సోదరులు ధృవసంధి, ప్రసేనచిత్తుఁడు, అంబరీషుఁడు.

**సుసరామనగరము:**—
[త్రిగర్తదేశము చూడుఁడు].

**సుసర్తునది:**— ఋగ్వేదమున నదీస్తుతియందు దీనిపేరు గానఁబడుచున్నది. సింధునదిలో సంగమించునది.

**సుసాలకులగోత్రము:—**
[సుశాలకుల చూడుఁడు.]

**సుసోళ్లకులగోత్రము:—**
[సుశాలకుల చూడుఁడు.]

**సుహోకగోత్రము:—**
(ఉపమన్యుగణము చూడుఁడు).

**సుహోత్రమహారాజు:—**
షోడశమహారాజులలో నొకఁడు.
(మహారాజులు చూడుఁడు).

**సుహోత్రుఁడు:—** అత్రి, చంద్ర, పూరుసంతతిక్షత్రియుఁడు. తండ్రి బృహత్క్షత్రుఁడు. కుమారుఁడు హస్తి మహారాజు. ఈతఁడు హస్తినాపురనిర్మాత.

మఱియు పూరువంశముననే క్షత్రవృద్ధుని జ్యేష్ఠపుత్రుఁడు సుహోత్రుఁడు. ఈతనికి కాశ్యుఁడు, కుశుఁడు, కృత్స్నమదుఁడు ననుమువ్వురుపుత్రులు.

మఱియు కురుసంతతిలోని సుమనస్సుకుమారునకును, ఇక్ష్వాకుసంతతియందలి భగీరథుని కుమారు (శ్రుతుఁడను) నకును, పురూరవుని పౌత్రుఁడగు భీముని పౌత్రునకును (జహ్నునితండ్రి) సుహోత్రుఁడనియే పేరులు.

ఇంకను సహదేవునకు (పాండవ కనిష్ఠుఁడు) విజయ యను భార్యయందుఁ గల్గినసంతునకును, సుహోత్రుఁడనియే పేరుకలదు.

**సుహ్మఁడు (సుబ్రహ్మఁడు):—** అత్రిసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి బలి. ఈతనికి సుబ్రహ్మ డనియుఁ బేరు కలదు.



వేఱొకసుహ్మఁ డీసంతతి. బలికడపటి కుమారుఁడు సుహ్మఁడు. ఈతండే సౌహ్మనగర నిర్మాతయని చెప్పఁబడినది.

**స్నుష:—** విదర్భునిభార్య. (జ్యామఘుని సుతుఁడు విదర్భుఁడు).

**స్పృజిత దోషము:—** జ్యోతిషశాస్త్రమున ముహూర్త భాగమునం దుపనయనముహూర్తముంగూర్చి చెప్పఁబడినదోషములలో నొకటి. లగ్నాదికేంద్రములందు సూర్యుఁడుండిన స్పృజిత దోషము. ఇది యాచార్యశిష్యులకుంగూడఁ గీడని చెప్పఁబడినది.

**సృంజయుఁడు:—** అత్రిసంతతి చంద్ర వంశక్షత్రియుఁడు. తండ్రి కాలానలుఁడు. పుత్రుఁడు పురంజయుఁడు.

మరియు యదుసంతతియందు వసుదేవునిసోదరులలో నొకఁడు సృంజయుఁడు గలఁడు. భర్మ్యాశ్వునికుమారుఁడును, సువర్ణష్ఠీవితండ్రియు నగు వాఁడును సృంజయనాముఁడే. ఈసృంజయుఁడు సువర్ణష్ఠీవిని నారదునికటాక్షమున సుతునిగఁ బడసినవాఁడు. మరియుఁ జోరులీతనియందు సువర్ణముగలదని యాబాలునిం జంపఁ దిరుగ నారదుఁడే యాబాలుని (సువర్ణష్ఠీవి) బ్రతికించెనని చెప్పఁబడినది.

**స్పృక్క-మొగ్గలు లేక స్ప్రుక్క-మొగ్గలు:—** ఇవి యొకచెట్టుమొగ్గలని తలంపఁబడుచున్నది. వీటిని నీటితోనూరి తీసినరసము గాని, కషాయము గాని, వీటిచూర్ణము గాని, లోని కిచ్చిన నుబ్బుజాడ్యము, గుల్మరోగము, తాపము, నాభిలోఁబుట్టెడిపుండు (విద్రధి), వాతజ్వరములు, విదాహము నివారణమగునని చెప్పుదురు.

**సృగాలవాసుదేవుఁడు:**— వ్రజమండలమునందలి మధురాపురమునకుఁ గొంతదూరము నందుండి కరవీరపురము నేలుభూపతి శ్రీకృష్ణునిపై మత్సరము గల్గినవాఁడు. శ్రీకృష్ణుఁడితనిం జంపి యాతనిసుతునకు రాజ్యమిచ్చెను.

**సృపిగోత్రము:**—

(గవిష్ఠిరగణము చూడుఁడు).

**సృష్టి:**- విరాట్స్వరూపుఁడగు పరమేశ్వరుని నుండి సృష్టి నాల్గువిధములుగఁ గల్గెను.

౧ తమస్సృష్టి— ఇందుండి ౧ తమస్సు, ౨ మోహము, ౩ మహామోహము, ౪ తమిశ్రము, ౫ అంధతమిస్రమునునవియేర్పడి వాట్లసాము దాయికముగ నచేతనమగు స్థావరసృష్టి యేర్పడెను.

౨ తిర్యక్సృష్టి— పిదపఁ బశుపక్ష్యాది తిర్యగ్జంతు సృష్టి కలిగెను.

౩ అర్వాక్సృష్టి— తమోద్రేకత దుఃఖబహుళపరివృతులై కర్మశీలులు, సంచితకర్మ దక్షులు నగుమానవులు గలుగుట.

౪ దేవసృష్టి— తుష్టాత్ములు, నిత్యానందులు, సాత్వికులు, నగువారు కల్గుట.

౫ అనుగ్రహసృష్టి— ఇది సాత్వికతామసమిశ్రగుణంబులుగల జంతుజాలసృష్టి.

౬ కౌమారసృష్టి— ఇది ప్రాకృతము, వైకృతము నని ద్వివిధము.

సనత్కుమారాదు లీసృష్టివారేయని చెప్పఁబడినది. మరియు నీషడ్విధసృష్టికి ౧ మహత్సృష్టి, ౨ పంచతన్మాత్రసృష్టి, ౩ పంచభూతేంద్రియసృష్టి ననుత్రివిధసృష్టులు కల్పి నవవిధసృష్టులని చెప్పఁబడినది.

**స్క్రూటినైజు (Scrutinize):**— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. కూడుట, తనఖీ చేసుకొనుట, కూడుట లేక చూచుకొనుటకు 'Scrutiny' అనియు, నట్లుచేయువానికి 'Scrutineer' అనియుం బేరులు.

**స్మృతి, స్మృతులు, ఉపస్మృతులు:**— ఋషిప్రోక్తములై ఋషిసత్తములచే శ్లోకరూపమునను, సూత్రరూపమునను, వారివారి (ఋషుల) చే రచింపఁబడిన ధర్మసముదాయములఁ దెలుపు గ్రంథములు.

మహాస్మృతులు:— ౧ మనుస్మృతి, ౨ బృహస్పతిస్మృతి, ౩ దక్షస్మృతి, ౪ గౌతమస్మృతి, ౫ యమస్మృతి, ౬ అంగీరసస్మృతి, ౭ యాజ్ఞవల్క్యస్మృతి, ౮ ప్రచేత (వరుణ) స్మృతి, ౯ శాతాతపస్మృతి, ౧౦ పరాశరస్మృతి, ౧౧ సంవర్తస్మృతి, ౧౨ ఔశన (శుక్ర) సస్మృతి, ౧౩ శంఖస్మృతి, ౧౪ లిఖితస్మృతి, ౧౫ ఆత్రేయస్మృతి, ౧౬ విష్ణుస్మృతి, ౧౭ ఆపస్తంబస్మృతి. ౧౮ హారీతస్మృతి.

ఉపస్మృతులు౧౮:— ౧ జాబాలస్మృతి, ౨ నాచికేతస్మృతి, ౩ స్కన్దస్మృతి, ౪ లౌగాక్షిస్మృతి, ౫ కాశ్యపస్మృతి, ౬ వ్యాసస్మృతి, ౭ సనత్కుమారస్మృతి, ౮ శంతనస్మృతి, ౯ జనకస్మృతి, ౧౦ క్రతుస్మృతి, ౧౧ కాత్యాయనస్మృతి, ౧౨ జాతుకర్ణ్యస్మృతి, ౧౩ కపింజలస్మృతి, ౧౪ బోధాయనస్మృతి, ౧౫ కాణాదస్మృతి, ౧౬ విశ్వామిత్రస్మృతి, ౧౭ పైఠీనసిస్మృతి, ౧౮ గోభిలస్మృతి.

ఇంకను కణ్వస్మృతి, కపిలస్మృతి, లోహితస్మృతి, దేవలస్మృతి, కాత్యాయనస్మృతి, లౌగాక్షి

స్మృతి, బుధస్మృతి, శాతాతపస్మృతి, అత్రిస్మృతి, ప్రచేతస్మృతి, దక్షస్మృతి, విష్ణుస్మృతి, వృద్ధవిష్ణు స్మృతి, శౌమ్యస్మృతి, నారదస్మృతి, పౌలస్త్య స్మృతి, ఉత్తరాంగిరసస్మృతి, మొదలగు పెక్కు స్మృతులు కానవచ్చుచున్నవి. స్మృతులు నూఱు గలవందురు.

**స్మృతి [శ్రద్ధ లేక శివ]:—** దక్షపుత్రిక. ఆంగీరసుఁ డగ్నియనుపిదప భార్య. సుతులు, కుమార్తెలు, పదునలువురు. (అగ్ని చూడుఁడు.)

**సూకరక్షేత్రము:—** సంయుక్తరాష్ట్రములలోని 'ఇటా' పట్టణమున కీశాన్యదిశగా ౨౭ మైళ్ళదూరమున గంగానదీతీరమున సోరోస్ అనం బడుతావును, ఆదివిష్ణువు వరాహావతారమున కాశ్మీరములోని చాలామూలా (తొల్లింట వరాహమూలపురము) కడ జన్మించి హిరణ్యాక్షుఁ డను రక్కసుం దరుముకొనివచ్చి యిట వధించిన తావుగఁ జెప్పుచున్నారు. ఇట వరాహనాథ - లక్ష్మీదేవి - విష్ణుదేవస్థానము కలదు. అచటి గంగానదీశాఖకు వృద్ధగంగ యనిపేరు. దీని ప్రశంస వరాహపురాణము ౧౩౭ అధ్యాయమునఁ గలదు. హిందీరామాయణమును రచించిన తులసీ దాసు మహాకవిబాల్య మిటనే గడిపినవాఁడు. బాల్యమునం దాయనను బెంచినది నరిసింహదాసను సన్యాసి. (తలిదండ్రు లాయనను రాజపురి యందు వదలివేసిరట). రాజపురి బాందాజిల్లా లోనిది.

**సూకలతీర్థము (హుంకారేశ్వరతీర్థము - రవితీర్థము):—** గుజరాతు దేశము లోని బరోచిపురమున కీశాన్యదిశగాఁ బదిమైళ్ళ దూరము. ఇట హుంకారేశ్వరతీర్థము, రవితీర్థముఁ గూడఁ గలవు. ఇవి యన్నియుఁ బ్రసిద్ధములే. అన్నియు నర్మదానదిసంబంధములే. నర్మదానది బరోచిపురముకడనే కాంబేసంయుక్తాగ్రగుడము నందుఁ బశ్చిమసముద్రమున సంగమించును.

సూకలతీర్థమునఁ గడుపురాతనంపు మఱ్ఱిచెట్టు కలదు. మౌర్యచంద్రగుప్తునిమంత్రియగు ప్రసిద్ధి వడసిన చాణక్యుఁ డీసూకలనివాసియేయని చెప్పఁ బడినది. మఱియు నీక్షేత్రప్రశంస పద్మపురాణము స్వర్గఖండము ౯ అధ్యాయమునఁ గలదు.

**సూచీకటాహన్యాయము:—** సూది చాలచిన్నది, కటాహము చాలగొప్పది. కేవలాసమానమగుపోల్కి. ఇట్టిస్థితిం దెల్పున్యాయము.

**సూచీముఖాగ్రము:—**
సూచీయనినసూది. (బాణాగ్రములుచూడుఁడు).

**సూచీహస్తము:—**
(హస్తాభినయము చూడుఁడు, భరతశాస్త్రము చూడుఁడు).

**సూడానుదేశము:—** ఆఫ్రికాఖండమున నున్న దేశము. ఇందుఁ దొల్లింటి న్యూబియా దేశము, కోర్డోఫాన్ పరగణా, బహేరల్గజాల్, డర్ఫూర్ లు చేరినవి. తూర్పున అబీసీనియామొదలు పశ్చిమమున వాడై, ఫ్రెంచి ఉబంగీలవఱకు బ్రిటీషువారికిఁ జెందిన ప్రదేశమై యున్నది.

ఇది చాల పెద్దప్రదేశము. ఐనను శిలామయమై యిసుకప్రదేశముగను, నెడారిప్రదేశముగను నుండును. ఇం దొక చిన్నప్రదేశముమాత్రము నైలునదిచేతఁ దడుపబడినది ఫలవంతమైయున్నది. కొన్ని చిన్నచిన్నప్రదేశములు మెట్టపంటలకుఁ బనికివచ్చునవి యచ్చటచ్చటఁ గలవు. వాటియందు జొన్నలు, ప్రత్తి, బార్లీధాన్యము,

పొగాకు, నీలిమందు పైరుచేయఁబడుచున్నవి. దేశము నిర్జలవంతముగను, వేఁడిగను నుండును. ఏనుఁగులు, సింహములు, కణుజులు, గిరాఫీమృగములు, రెయినాసరోసులు, మొసల్లా విస్తారముగ గలవు. ఏనుఁగుదంతములు దొరకును. బెర్బర భాష దేశభాష. ప్రజలు విస్తారము న్యూబియనులు. వీరు బలాఢ్యులు. పనిపాటలందు శ్రద్ధఁగలవారు. వీరు తొల్లి ఈజిప్టుదేశస్థుల కోడిపోయి లొంగియుండిరి. ఒకతరి దేశము బలహీనముగ నుండుసందర్భమునఁ బరిపాలన లోపముచేఁ దిరుగబాటు కల్గెను.

దేశ మల్లకల్లోల మగుచుండుతరి పన్ను లధికముగా నుండుటఁ బ్రజలు నిరాశపాలై తిరుగుబాటొనర్చుచుండిరి. ఈతరుణమున క్రీ. వె. ౧౮౮౩ లో మహదీ యనుప్రజానాయకుఁడు ప్రజలను మరింత తిరుగుబాటునకు రేపి, యుద్రేకముఁ గల్గించి యుద్ధమునకు సంసిద్ధుఁ డయ్యెను. మహదీ పుత్రుఁడు ఖలీఫాయని ప్రకటించుకొనియెను. ౧౮౮౫ లో General Gorden అను నాంగ్ల సేనాని ఖార్టూమునందు నిహతుఁడయ్యెను. బ్రిటీషువారి సహాయమున కిచనర్ సేనాని తిరుగుబాటణచివైచి ఖలీఫుపరిపాలన మీజిప్టుదేశమున స్థిరపఱచెను. బ్రిటీషువారి కీదేశ మొసంగఁబడుటకు క్రీ. వె. ౧౮౯౯ లో నొకకన్వెన్షను జరగెను. నాఁటినుండియు నీదేశములన్నియుం గలిసి 'Anglo Egyptan Soudan' అనఁబరఁగెను. ఆయుద్ధమునకు ౧౮౯౮ వ సంవత్సరఁపు 'ఓమ్దుర్మానుయుద్ధ' మనిపేరు.

ఈదేశమునఁ బ్రధానరాజ్యకార్యస్థానము లున్నది ఖార్టూమ్పురము. ఈఖార్టూంపరగణాను కిచనరుప్రభువునకు జాగీరుగ నిచ్చియుండిరి. ఖార్టూమ్పురము తెల్లనైలునందు బ్లూనైలు సంగమించు తావున నున్నది. కైరోనుండి యిట కినుపదారిబాట కలదు. నీలానదిపై పొగయోడలలోఁ బయనము సేయనగును.

ఓమ్దుర్మానుపురము మహదీకి నివాసమును, ముఖ్యకార్యస్థానము నై యుండెను. ఇది ఖార్టూమునకు సమీపమునఁ గలదు. ఇప్పుడు హీనదశయం దున్నది. సెన్నారుపురము తొల్లింటఁ నొక స్వతంత్రరాజ్యమునకు రాజధానిగ నుండినది. అది బ్లూనైలునదీతీరము. ఇప్పుడు పాడగుచున్నతావు. పాషోడాపట్టణము వేఱొకపురము.

**సూడిదలు:**—సూడిద లన పిండివంటలు, మిఠాయిలు మొదలగు భక్ష్యములు. ఈసూడిద పదప్రయోగము గర్భిణీస్త్రీలకుఁ బ్రియములుగ నుండునటులఁ జేసి యిడంబడినవిగ వాడుచున్నారు.

**సూతకము లయిదు:**—సూతక మన మైల, అశుచి యని భావము.

౧ జాతసూతకము— (పురుడు, జన్మసూతకము జాతాశౌచము).

౨ మృతసూతకము— (మైల- మృతాశౌచము).

౩ రజస్సూతకము—(కడకుఁ బోవుట స్త్రీలకును, అప్పుడు పితృకర్మలందు భోక్తలుగానుండ వారిభర్త లనర్హులగుటయును).

౪ జాతిసూతకము.

౫ ఉచ్ఛిష్టసూతకము.

ఇంకను మఱియొకవిధమున,

౧ మధుపానసూతకము—[illegible] (మత్తత వదలినపిదప స్నాతుఁడగుదనుక).

౨ అనృతవచనసూతకము- సచేలస్నానపర్యంతము.

౩ దేవలకస్పర్శసూతకము— [దేవదర్శనపర్యంతము].

౪ యూపస్తంభ స్పర్శసూతకము [స్నానపర్యంతము].
౫ శవదర్శనసూతకము— [స్నానపర్యంతము].
వీట్లను పంచాశౌచము లనియు, పంచసూతకము లనియు వాడియున్నారు.

## సూతవ్యగోత్రము:—
(సంకృతిఉపగణము చూడుఁడు.)

**సూత్రములు ౫**:-ఋగ్వేదుల కాశ్వలాయనసూత్రము. కృష్ణయజుర్వేదుల కాపస్తంభ సూత్రము. బోధాయనసూత్రము శుక్లయజుర్వేదులకు. కాత్యాయనీయము, బోధాయనసూత్రము సామవేదులకు. ద్రాహ్యాయనసూత్రము. అథర్వణవేదులకు సాంఖ్యాయనసూత్రము. వైఖానసులకు విఖనససూత్రము. విశ్వబ్రాహ్మణులకు సూత్రపంచకము— ౧ అభువన, ౨ ప్రత్నస, ౩ సానగ, ౪ సనాతన, ౫ సువర్ణ సూత్రములైదు.

**సూత్రములు ౧౮ [అష్టాదశసూత్రములు**:—౧ అగస్త్యశాకల్యము, ౨ అగ్నివైశ్యము, ౩ ఆపస్తంబము, ౪ ఆశ్వలాయనము, ౫ కాత్యాయనము, ౬ కౌండిన్యసూత్రము, ౭ కౌషీతకము, ౮ జైమినీయము, ౯ ద్రాహ్యాయనము, ౧౦ బోధాయనసూత్రము, ౧౧ భారద్వాజసూత్రము, ౧౨ మాధ్యందినసూత్రము, ౧౩ వాధూలము, ౧౪ వైఖానససూత్రము, ౧౫ శాంభవీయము, ౧౬ శౌనకీయసూత్రము, ౧౭ సత్యాషాఢిసూత్రము, ౧౮ హిరణ్యకేశిసూత్రము.

**సూత్రలక్షణము**:—సూత్రమునఁదొల్లింటికాలమున వ్యాకరణాది శాస్త్రవిధులు సూత్రములుగ విద్వాంసులగు మహర్షులచే రచింపఁబడియుంట భరతదేశమున నెల్లరెఱింగినదే. అట్టి సూత్రము లెట్లుండవలెనో యాలక్షణమునకు సూత్రలక్షణమని పేరు వాడుకయయ్యెను.

శ్లో॥ అల్పాక్షర మసందిగ్ధం విధివద్విశ్వతోముఖం।
అస్తోభ మనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః॥

అని చెప్పఁబడియుంట సూత్రమునం దక్షరములసంఖ్య తక్కువగను, సందిగ్ధము (సంశయములు) లేకుండగను, విధించినటుల జగమునఁ జాటునటులను, నిరర్థకపదరాహిత్యముగను, నిర్దుష్టముగను నుండునది సూత్రమని సూత్రవేత్తలనిరి.

**సూతుఁడు**:— ఋషి. వ్యాసశిష్యుఁడు. సకలపురాణములు శౌనకాదిమహర్షుల కెఱుగఁజేసినవాఁడు. తొల్లింట సూతకులజుఁడగుట నిటుల పేరందెను. ఋగ్వేదాధ్యేత.

పాండవు లీతనియాశ్రమమునఁ గొంతకాల మరణ్యావాసకాలముఁ గడపిరి.

## సూదంటురాయి అరుగుట- పెర్మెనెంటుమేగ్నెట్ అరగకుండుట:—

సూదంటురాయి యినుము మొదలగువాటి నాకర్షించుతరి నందలి మొలక్యూల్సు [Molecules] తిరుగ క్రిందుమీద నగుచు [rearrangement] మార్పునందుచుండును. అందువలన దానియందుండుశక్తి యించుక తగ్గుచుండుట, నరుగుదల నందునని తలంపఁబడుచున్నది. దీనినిక్కాలమున పెర్మెనెంటుమేగ్నెట్ [permanent magnet] గాఁజేయఁగనిపట్టియున్నారు. దీనిశక్తి నొకయినుప కమ్మిపై నెక్కించి దానిరెండుకడలం దుక్కుకాడల నుంచుదురు. అందుండి అది శక్తింగోల్పోదట. వాటికి "armature" అని పేరిడిరి. దీనిని రెండుకడలనడుమ నమర్పఁబడిన వారధియందురు.

[Bridge]. దీనికి [closed magnet] అని సాంకేతికనామ మిడి వాడుచున్నారు.

సూనిగోత్రము:—
(ముద్గలయుపగణముం జూడుండు.)

సూపగోత్రము:—
(పీతహవ్య లేక యాస్కగణము చూడుండు.)

సూపగోత్రము:—
(నిధ్రువగణముం జూడుండు.)

**సూపర్‌నేచరాలిజమ్** (Supernaturalism):— ప్రకృతిస్వభావముల కతీతములగు శక్తులు పెంపొందింపఁజేయువిధానము, సిద్ధాంతము.

**సూయజ్ కెనాల్**:—ఇది షిప్ కెనాల్. (షిప్ కెనాల్ చూడుండు.) మధ్యధరాసముద్రము, ఎఱ్ఱసముద్రములం గల్పునది. ఇందు లాకులు లేవు. ఇది బాలాసరస్సు, తిమ్మాసరస్సు, Two Better Lakes సరస్సులగుండా త్రవ్వఁబడిన కాల్వ. ౧౦౦ మైళ్ళుపొడవుగలది. 33 అడుగులకు తగ్గనిలోతును, ౧౯౮ అడుగులకు తగ్గనివెడల్పును, గలకాలువ. స్టీమర్లు దీనిగుండా పోవుటకు ౧౫ గంటలకాలము పట్టుచున్నది. పొడుగున విద్యుచ్ఛక్తి దీపములు గలవు.

ఫ్రెంచియింజనీరు లెసెప్సి అనునాతనిక్రింద పని క్రీ. శ. ౧౮౫౯ లోఁ బ్రారంభింపఁబడి ౧౮౬౯ నవంబరు ౧౭ తేదిని ఇస్మైలుపాతా వలనఁ దెరువఁబడినది. పారిస్‌నగరమునఁ గూడు చుండు నొక కమిటీవారి మేనేజిమెంటుక్రింద నున్నది.

బ్రిటీషుప్రభుత్వవారి నావికాదళము దీనియుత్తరపుఁగోనను రక్షించుటకు వలయునంత మధ్యధరాసముద్రమునందే కలదని యన్యదేశములందు వాదుకలు గలవు. కాని యీసందర్భమున గమనింపఁదగినది వేఱొకటి కలదు. బ్రిటీషుప్రభుత్వము వారి ప్రకటనమున—

"The presence of troops in Egyp t do not threaten the freedom of the cannal in as much as. The connention of constantinople (Present Istambod) has stipulated that the cannal shall be free and open to navigation in war and place to warships as well as merchantmen" నుండుట యధికప్రాముఖ్యమైనసంగతి. రాజకీయావసరముల నటువదలి వాణిజ్యసందర్భము, గమనసౌకర్యములను లెక్కించిన నది యొక్క బ్రిటీషువారికేగాక తూర్పుతో సంబంధము, వర్తకములుగల పశ్చిమయూరోపాదేశములవారికి ముఖ్యమైనదే యున్నది.

ఈకాల్వను "Busiest water way in the world" అనియెదరు. ఈకాలువకంపెనీయందు నూటియందు ౪౪ వాటాలు బ్రిటీషుప్రభుత్వమునకుఁ గలవు. కాని యెక్కువవాటాలు ఫ్రెంచివారివి గాన దీని కార్యాలయము పారిస్ నగరమునం దుంచఁబడియున్నది. దీనిపాలనయందిద్దరీజిప్టుదేశఁపు డైరక్టరులు, నొకనెదర్లాండు డైరక్టరుఁ గూడ నుందురు. ఈకెనాల్‌కంపెనీ ఆదాయమున బ్రిటనుదేశము నూటియందు ౪౭ పాళ్లు, ఇటలీదేశము ౧౬ పాళ్ళు, జర్మనీదేశము ౯ పాళ్లు, నెదర్లాండ్సుప్రభుత్వదేశము ౭ పాళ్ళు, [నూటికి] చెల్లించుచున్నట్లు తెలుచున్నది.

సూయజుకాలువ రెండుగట్టులపైని యినుపబాటయు, రోడ్డును గలవు. ప్రక్కలప్రదేశము

యండలవసరు flare] అధికముగనుంట ఓడల లోనివారు చూడఁ గష్టపడుచుందురు.

### సూరశిష్టగోత్రము:—

(సూరిశిష్ట చూడుఁడు).

### సూర్యకళలు:—

(కళలు చూడుఁడు).

### సూర్యకాంతమణి (Sunstone):—

ఇది A form of translucent felspar' అని చెప్పఁబడినరత్నము. కాంతిగల ఎఱ్ఱనితళుకులను ప్రజ్వలించును. ఇంచుక లోహధాతువుఁ గల్గియుండును. భూమియందు గనులలో దొరకెడిని.

### సూర్యకిరణచికిత్స:—

(సూర్యాగ్రికిరణచికిత్స చూడుఁడు.)

### సూర్యగ్రహణము:—

(గ్రహణములు చూడుఁడు).

### సూర్యగోత్రము:—

(విధృవగణము చూడుఁడు).

### సూర్యగోళము, దానిశరీరతత్త్వము:—

ఇటీవలిపరిశీలనలు జ్యూపిటరుగోళము మన్ను, ఇసుక, రాళ్ళు, సముద్రము మొదలగువాటితోఁ జేయఁబడిలేదనియు, గాలులు [gases] తోఁ జేయఁబడినదనియు, బయటఁబెట్టినవి. అనఁగా solid కాదనియు, gascous అనియు, భావము. ఇందింకను Liquids కూడ నుండునని కొందరు పరిశీలకు లనుచున్నారు. తర్వాతపరిశీలనలు సూర్యగోళముగూడ నిట్టిదేయని యనుమానములం గల్గించినవి. స్పెక్ట్రోస్కోపుగుండా పరిశీలించిన సూర్యగోళమునం దగుపడుమచ్చలు మాఱిపోవు చుండుట నిదివఱకెఱిగియున్నారు. అవి తిరుగ పదునొకండు సంవత్సరములనాటి కట్లే కన్పించుచుండుటయు, నొకేవరుసనుండుమచ్చ లొకేతరి గన్పించుచు నొకేతరి మాఱిపోవుచుంటయు జరుగక, వేర్వేరుమచ్చలు వేర్వేరుకాలములం గనుపడుట, మాఱిపోవుచుండుట మొదలగు నొక పద్ధతిలేని తిరుగుచుండుస్థితినియోచించిన సూర్యుని యందలి వేర్వేరుభాగములు వేర్వేరువిధములుగ చలనము నందుచున్నవని తోఁచెడిని. కాని పదునొకండుసంవత్సరముల కదేమచ్చలు తిరుగ నత్తావులందే గన్పట్టుట, ఏయేభాగము లెట్లు తిరుగుచున్నను దానికిని నొకవిధానము కలదనియె స్ఫురించెడిని. ఇట్లే జ్యూపిటర్‌గోళమునందును జరుగుచున్నది. దీనింబట్టి చక్కఁగ నాలోచించిన సూర్య శరీరము gascous గాని solid గాదని తోఁపక పోదు. ఈస్పాట్సునందు చిన్నవి, పెద్దవి, యెక్కువ నల్లనివి, కొంతకొంత తక్కువనల్లనివి గూడఁ గలవు. కొన్ని యధికతేజోవంతములు, కొన్ని తక్కువప్రకాశమానములుఁ గాఁగూడ నుంట సూర్యునితేజము దానిపై నెల్లప్పుడు మండుచుండుమంటలనుండి కల్గుచున్నదని తలంచియున్నారు. పరిశీలకులు నల్లమచ్చలను 'Whirling up rushes of gas from deeper parts of the sun' అని నిర్వచించిరి. ఈమచ్చలందు భూమివంటిగోళములు రెండు లేక మూఁడు చొప్పింపనగునందురు.

ఈమచ్చలమార్పు నక్షత్రశాలలందు సూదంటురాతిసూదులుగల యంత్రములచేఁ జూపఁబడుచుండును. వాటిని వ్రాసి పరిశీలించుచుందురు. అయస్కాంతమునకు, వీటిచలనమునకు నెట్టిసంబంధము కలదో యింకను స్పష్టమగుట లేదు. ఇట్టి పరిశీలనలు గతమున్నూరువత్సరములనుండి చేయు

చున్నది. ఈ పదునొకండు సంవత్సరముల కొకసారి తిరుగ నగ్గుచునుండుటయు, కారణము స్పష్టముగాఁ జెప్ప వీలుగాకున్నది. దీనికి 'Eleven year cycle' అని వాడుచున్నారు. ఇంకను 'అరోరాబోరియా లిస్' అనంబడు northern light ప్రకాశమున కీస్పాట్సుతో సంబంధముగలదని యిదివఱకే స్థిరపడియున్నది.

**సూర్యగోళములు:—** జగత్తునందు సూర్యుఁ డొక్కఁడే యని పెక్కండ్రు తలంతురు. సూర్యుఁడన స్వప్రకాశవంతుఁడు తన్నాశ్రయించు నటుల తన్నుఁజుట్టి తిరుగుచుండు నుపగోళములకు వేడియు, వెలుతురును నొసంగుచుండు మహాగోళమని భావము. భూమిపై వారల కగుపడుచుండు సోలార్సిస్టమునందలి సూర్యుఁ డొక్కఁడే గాక ఇట్టిసిస్టము లనేకములు కలవనియు, వాటియం దిట్టివేయగు స్వప్రకాశమానములగు సూర్యగోళము లనేకములున్నవనియు, ఎస్ట్రొనొమీశాస్త్రమునందుఁజెప్పఁబడినది.

'Alpha centauri' యనంబడు double star రెండుసూర్యగోళము లనియు, దూరమందుంట నేకనక్షత్రముగ నగుపడుచున్నదనియు, నవి యొకటినొకటిం జుట్టి తిరుగుచుండుననియు, నందొకటి చిన్నదిగను, నొకటి పెద్దదిగను గూడ నుంటయు, చిన్నది సోలార్సిస్టమునందలి సూర్యుఁడంతగను, రెండవది చాలపెద్దదిగను నుండుననియు బయల్పడినది.

Orion కాన్స్టలేషనునందలి Regel నక్షత్రమును, Argo కాన్స్టలేషనునందలి Canopus నక్షత్రమును, Swan కాన్స్టలేషను నందలి Arided నక్షత్రమును, లెక్కింప శక్యముగాని దూరమునం దున్న సూర్యులేయనియు, నెన్నో వేలరెట్లధికప్రకాశము గలవనియుఁ బరిశీలకు లనుచున్నారు.

భూమినుండి యగణ్యమగుదూరమం దున్నటులఁజెప్పంబడిన Arcturus నక్షత్రము సూర్యుఁడేయని స్వప్రకాశముగల్గినదియు సోలార్సిస్టమునందలి సూర్యునికన్న వేయిరె ట్లధికమగుప్రకాశమును గల్గినదనియు, నందలి కెంపరేచ రింతతీక్ష్ణమైనది కాదనియు, దానిడయామీటరు సోలారుశిష్టమునందలి సూర్యుని డయామీటరుకన్న పదిరెట్లెక్కువగా నుండుననియుఁ, గాన శరీరపుష్టి వేయిరె ట్లధికమైయుండనోపు ననియుఁ జెప్పంబడినది.

(ఎస్ట్రొనోమీశాస్త్రముఁ జూడుఁడు. కాన్స్టలేషనులు చూడుఁడు.)

**సూర్యచంద్రగ్రహణములు** (Solar & Lunar Eclipses):— మన హిందువుల వేదశాస్త్రములందు సూర్యచంద్రగ్రహణములనుగూర్చి చెప్పఁబడిన విషయము లీక్రింద సంగ్రహముగాఁ బొందుపఱుపఁబడినవి.

చంద్రబింబ మమృత (జల) మయమనియు, నమృతవికారమనియు, మనశాస్త్రములు చెప్పుచున్నవి. కాని కేవల జడరూపమని చెప్పుటలేదు. కాఁబట్టి చంద్రబింబము మంచుకరడు, వడగలి మొదలగువాని జాతిలోఁ జేరినదని తలంపవలయును.

'సలిలమయే శశినిరవేర్దీధితమయో మూర్ఛితాః నైశం తమః। క్షపయంతి దర్పణోదరవద్గృహోదరధరాంతమ్॥'

అని వరాహసంహితయందును,

'పూర్వాహ్ణే విశతేచారం మధ్యాహ్నేతు వసస్పతిం। అపరాహ్ణే విశత్యృష్ణు స్వయోనివాశిసంభవః॥'

అని దేవీపురాణమందును జెప్పఁబడియుండుటచేతఁ దన కుపాదానమగు జలమునఁ జంద్రుని యుత్పత్తి సూచింపఁబడుచున్నది.

మఱియునుజంద్రుఁడు జలమయుఁడని.

"పిబం త్యంబుమయం దేహః పితరశ్చ స్వధామృతం॥"

అనియు నందే చెప్పఁబడియున్నది. కొన్ని చోట్ల చంద్రునికి మంచుముద్దయందువర్తించు 'జడ' శబ్దము ప్రయోగింపఁబడియున్నది. అచ్చట శబ్దశ్లేష్మవలన 'జడయోరభేదా' యను న్యాయముచే జలమనియుఁ జెప్పవచ్చును.

"కి మసుభి ర్గ్లపితై ర్జడమన్యసే" అను నైషధ ప్రయోగము మొదలగునవి పెక్కులు గలవు. కాఁబట్టి యంతరిక్షమునందు స్ఫటికాకృతి గలిగి యెన్నో యోజనములు వైశాల్యముతో నున్న కరకా (వడగలి) జాతియగు చంద్రబింబమునుండి జలజలరాలు జలబిందువులు సమీరవశంబునఁ దుంపరతుంపరులయి కొంతవడికి పరమాణుస్వరూపము ధరించి ధరణికిఁ బ్రసరించుటవలన శిశిరములగుకిరణములు మనకుఁ దగులుటంజేసి చంద్రుని 'హిమకరుఁ' డనియు, 'అమృతకిరణుఁ' డనియు వ్యవహరించుచున్నాము. (అమరేశ్వరము చూడుఁడు.)

చంద్రుఁడు జలమయుఁ డగుటచేతనే యతని యందలి భూచ్ఛాయకుఁ 'గళంక' మని వ్యవహరించుచున్నాము.

"ఛాయాహి భూమేః శశినోమలత్వే నిమజ్జితః శుద్ధిమతః ప్రజాభిః॥"

అని రఘువంశమునఁ గాళిదాసును,

"అంకం కేపిచ శంకిరే జలనిధేః పంకం పరే మేనిరే సారంగం కతిచిజ్జనా జగదిరే భూచ్ఛాయ మైచ్ఛన్ పరే॥"

అని కొందఱుచో మరియొకరును జెప్పియున్నారు.

సూర్యబింబము మహాతేజోరాశి యని సమస్త శాస్త్రములయందును గనంబడుటయే గాక లోకమునకుఁ బ్రత్యక్షప్రమాణముగానుండుటవలన నీవిషయమునకుఁ బ్రమాణాంతరము లక్కఱలేదు.

చంద్రబింబమున కడ్డముగా భూమియొక్క ఛాయ వచ్చునపుడుచంద్రగ్రహణమును, భూచ్ఛాయచేఁ గప్పఁబడినచంద్రుఁడు సూర్యునికడ్డముగా వచ్చునపుడు సూర్యగ్రహణమును సంభవించునని సిద్ధాంతము. కాఁబట్టి సూర్యగ్రహణము సంభవించునపుడెల్ల చంద్రగ్రహణమును సంభవించుచునే యుండుననియు, పగ లగుటవలన చంద్రగ్రహణము కనఁబడకుండుననియు నెఱుంగవలయును. ఈవిషయము మలమాసతత్వమునందు స్పష్టముగానున్నది.

సూర్యసిద్ధాంతమునందు—

'ఛాదకో భాస్కరస్యేందు రథస్థోఘనవద్భవేత్। భూచ్ఛాయాం ప్రముఖశ్చంద్రో విశత్యర్థో భవే దసౌ॥"

అనిచెప్పఁబడియున్నది. చంద్రుఁడు ముందుగా భూచ్ఛాయచేఁ గప్పఁబడి తచ్ఛాయాయుకుఁ డగుచు సూర్యునికిఁ గ్రిందుగా వచ్చి మేఘమువలె నాతనిని గప్పునని దీనితాత్పర్యము.

మఱియును గ్రహణకాలమును గూర్చి జ్యోతిశ్శాస్త్రమునందు రాహువుయొక్కగాని, కేతువుయొక్కగాని నక్షత్రమునకుఁ ద్రిపాదాంతరమున సూర్యుఁడున్నను, చతుష్పాదాంతరమునఁ జంద్రుఁడున్నను, గ్రహణము సంభవించుననియును, సూర్యుఁడున్న నక్షత్రమునకుఁ బదునాల్గవదాని యందుఁ జంద్రుఁ డున్నచో పూర్ణిమాప్రతిపత్సంధియందుఁ జంద్రుని రాహువు గ్రసించు ననియు, బహుళపక్షతృతీయ యందు మాసనక్షత్రమయినచో దానికిఁ బదమూఁడవదాని యందు సూర్యుఁడున్నయెడల రాహువు సూర్యుని గ్రసించుననియుఁ జెప్పఁబడియున్నది.

విష్ణుధర్మోత్తరమునందు—

'పర్వకాలేతు సంప్రాప్తే చంద్రార్కౌ ఛాదయిష్యసి। భూమిచ్ఛాయాగత శ్చంద్రంచంద్రగోఽర్కంకదాచన॥'

అని చెప్పఁబడియున్నది. 'ఓరాహూ! పర్వకాలము సంప్రాప్తమగునపుడు చంద్రసూర్యులను గప్పుము. భూమిచ్ఛాయాగతుఁడవయి చంద్రుని (ఒకానొకప్పుడు) చంద్రగతుఁడవయి సూర్యుని నీవు కప్పుము. అని దీని తాత్పర్యము. ఇది రాహువునుగూర్చి చెప్పఁబడిన బ్రహ్మవాక్యము.

మఱియు శుద్ధిచింతామణియందు వాచస్పతిమిశ్రుఁడును, మలమాసతత్వమునందు రఘునందుండును, గ్రహణమునకు జగచ్ఛాయ యని నామాంతరముఁ జెప్పి గజచ్ఛాయాశ్రాద్ధమును విధించిరి. గజచ్ఛాయయే గజచ్ఛాయ. ఈవిషయమున బృహస్పతి మలమాసమున నిత్యనైమిత్తికముల శ్రద్ధతోఁ జేయవలయును. తీర్థస్నానమును, గజచ్ఛాయయను, ప్రేతశ్రాద్ధమును నట్లేచేయవలయునని చెప్పియున్నాడు.

వరాహమిహిరాచార్యుఁడు—

'సైంహికేయో యథా భానుం గ్రసతే పర్వసంధిషు। గజచ్ఛాయాతు సాప్రోక్తా తత్ర శ్రాద్ధం ప్రకల్పయేత్॥'

అని చెప్పియున్నాఁడు. పర్వసంధులయందు సూర్యునిరాహువు గ్రసించునేని దానికి 'గజచ్ఛాయ' యనిపేరు. అప్పుడు శ్రాద్ధము సేయవలయునని దీనితాత్పర్యము.

గ్రహణమునకు గజచ్ఛాయ యని పేరుగలుగుటకు మూలాధారము వేదమే. అందు—

'రాహుర్వై హస్తీ భూత్వా చంద్రమసం గ్రసతి.'

అనియున్నది. రాహువు గజరూపమును దాల్చి చంద్రుని గ్రసించునని దీనితాత్పర్యము. భూచ్ఛాయయొక్క ఆకారాదిసాదృశ్యమును బట్టి యేనుఁగుతోఁ బోల్చి యీశ్రుతియందు రాహు వేనుఁగురూపమును దాల్చునని వర్ణింపఁబడినది. కాని రాహువే యేనుఁగగునని తలంపరాదు.

శతబ్రాహ్మణమునందు సూర్యగ్రహణ విషయమునఁగూడ—

'హస్తీ వై భూత్వా స్వర్భానురంశుభి రాదిత్యం। తమసా పిదధాతి॥'

అనియున్నది. రాహు వేనుంగు రూపమును దాల్చి కిరణములుగల సూర్యుని జీకఁటితోఁ గప్పునని చెప్పఁబడినది.

ఇందుఁగూడఁ బైశ్రుతియందువలెనే సాదృశ్యమునుబట్టి వర్ణింపఁబడినది.

**సూర్యపాకము:—** సూర్యకిరణముల వేఁడిమిచే వంటచేయుట. సూర్యకిరణముల వేఁడిమిచే నంటచేయు నేర్పు ద్వివిధము.

1 సూర్యకిరణములచే నత్యుగ్రమైన వేఁడిమి నొందిన యిసుకలో నొకపాత్రమునఁ బచనము గావలసిన పదార్థముల నుంచి యాపాత్ర నాయిసుకయం దుంచుట. ఇంచుచే నాపదార్థము పచనమై భోజ్య మగును. ఈప్రక్రియయందుఁ బచనము కావలసిన పదార్థమును పచనము సేయుటకు medium అగు యిసుక యను పదార్థ మొకటి యావశ్యక మగుచున్నది.

2 ఇఁక రెండవమార్గము— పచనము కావలసిన పదార్థములపైఁ బ్రత్యక్షముగనే సూర్యకిరణములను బ్రసరింపఁజేసి తన్మూలమున వంటకములను సిద్ధముసేయుట.

పాశ్చాత్యు లీరెండుమార్గముల నెఱుంగుదురు. అం దీరెండవమార్గము అనఁగా సూర్యకిరణములను బ్రత్యక్షముగా (Apply చేసి) ప్రసరింపఁజేసి వంటకములను సిద్ధము చేయునేర్పు తొల్లి క్రీ. శ. ౧౮౯౬ లో జర్మనీవైద్యుఁ డొకఁడు కనిపెట్టెనని తెలియుచున్నది.

కాని మున్నెన్నఁడో ఋషులచే రచియింపఁబడిన సంస్కృతస్కాందపురాణమున వివరించిన యీసూర్యకిరణపాక విషయమునే ౧౫ వ శతాబ్దమునాఁటివాఁడగు శ్రీనాథుఁడు తన కాశీఖండమున నిట్లుదాహరించుటను జూడ జర్మనీవైద్యుఁ డీ (పండితుఁడు) నేర్పును జూపకపూర్వమే హిందువు లీసూర్యపాక విధాన మెఱింగియుండుటే గాక యీవిద్యయం దారితేరి యుండినవారనియుంగూడఁ దెలిసెడిని. ఈక్రిందిపద్యములే యిందులకుఁ దార్కాణము.

ఉ. అంబుజబాంధవుం డ్వయ కృపాగ్రిణి
బోనము నేఁడు సూర్యుఁ
కంబున నాయితంబయిన కజ్జము
భోజనశాలలోనఁ బ
శ్యం బిడినారు, పంకజదళాక్షులు
రెండవజాముగంట వే
యంబడె నారగింప సమయంబని
చెచ్చెర విన్నవించినన్.

ఆ.వె. వేల్పు లొనరించినట్టి దుర్వృత్తి యగుట
నెఱిఁగి యింతియు కాక యొండేమి యనుచు
నారగించె దివోదాసుఁ డర్కకిరణ
తాపపక్వంబు లగుపదార్థంబు లెలమి.
(శ్రీనాథుఁడు-కాశీఖండము ౫ ఆ)

**సూర్యబింబము:—** సూర్యమండలము మాకాశమునందలి గోళములలో 'Solar system' అనంబడుగోళములలోఁ బ్రధానమైనది. (ప్రపంచము చూడుఁడు). అందొక గొప్పశక్తి యున్నటులఁజెప్పఁబడినది. ఆశక్తి తక్కినగోళముల నాకర్షించుచుఁ దనచుట్టుం దిప్పుకొనుటయే గాక వేఁడిమియు, వెలుతురును, వెలుపలికి వెదఁజల్లుచుండును. ఇటులఁ చేయుటయందు విశ్రాంతి లేక యెల్లకాలముల నొకేరీతిని వెదజల్లు శక్తిఁగలది. ఈ energy శక్తినిగూర్చి యంత్రసాహాయ్యమునను, పరిశీలనలమూలమునను, నేర్చినవిజ్ఞానము మనకు సూర్యబింబముంగూర్చిన కొన్నిసంగతులం దెల్పెడిని.

వెలుతురును విభజించి పరిశీలనలకు సావకాశమొసంగునది 'Spectroscope' యనంబడు యంత్రము. ఇంక బలముగుదూరదర్శినీ (Telyscope) మూలమునఁ గొంతయును, సూర్యగ్రహణకాలముచేసినపరిశీలనమూలమునఁ గొంత

యును, సూర్యునిగూర్చి మనకుఁదెలియనగు చున్నది. అందు స్పెక్ట్రోస్కోపుపరిశీలనలు మూల కారణ మనందగును. ఇందుమూలమున మనకు సూర్యునుండి వచ్చుచున్నవెలుతురునం దెన్నిరం గులవెలుతురులు కలవో యెఱింగిన ట్లకారణ ము లూహించ వీలగుచున్నది.

సూర్యబింబముమధ్యభాగమున నొకవైపు నుండి రెండవవైపునకు రంధ్రముచేసిన నారంధ్రఁ పుఁ గొలత (diameuter) ఎనిమిదిలక్షలయఱువది యాఱువేలమైళ్లుండు ననియు, నట్టిసూర్యబింబము గుండ్రనిబంతివలె నుండుననియు, మఱియు నా సూర్యబింబముయొక్క శరీరము పొరలుపొరలుగ నుండుననియుఁ దెలియఁగలదు. వెలుపలి రెండు పొరలను లోపలనుండు భాగముంగూర్చి మనకంత గ దెలియదు. దానికే మనయాంగ్లజ్యోతిషవేత్తలు 'Photosphere' అని పేరిడియున్నారు. అం దగ్ని కలదని తలంచెదరు. అందు లెక్కించఁ జాలనివేఁడి కలదని వార నెదరు.

దానింజుట్టి పైనుండుపొరకు 'Reversing layer' అనియుఁ బలుపఁబడుచున్నది. దీనిదళసరి వెయ్యి మైళ్ళుండునని కొందరును, ఐదువందల మైళ్లే యుండునని కొందరును దలంచున్నారు. ఇది లోపలి Photosphere కన్న ప్రాంతవేఁ డిమి తగ్గియుండునదిగ నూహింపఁ బడుచున్నది. దీనియందు పొగయును, కొన్ని గాలులును, నుండి యుండనోపునని యూహింపఁబడెడిని.

దానింజుట్టియున్న పైపొరకు 'Chromosphere' అని పేరిడియున్నారు. మఱియు నద్దాని దళసరి యయిదువేలమైళ్ళ కెక్కువగను, పదివేల మైళ్లవఱకుఁ గలిగియుండునని తలంపఁబడుచు న్నది. ఇది యగ్నిజ్వాలలమయము. ఇందు ముఖ్య ముగ వ్యాపించియుండియు మండుచుండునది 'Vapour of Hydrogen' అని తేలుచున్నది. దీని క్రిందిగనుండు పొరలనుండి తప్పించుకొని పైకి మండుచు వెలువడు తెల్లనిరంగు వేఁడియొ క్కప్రకాశము. ఈపొరపై నావరించియుండు నెఱ్ఱనిమంటలగుండా ప్రసరించుచుఁ బ్రకాశించి వ్యాప్తినందుచుండును.

సూర్యబింబముయొక్క పైపొరయగు 'క్రోమోస్ఫియర్' అనంబడుదానినుండి గొప్పమంటలు పైకిలేచి యన్నివైపులకు విజృంభించుచుండునట. సూర్యగ్రహణకాలములందు భూమికిని, సూర్యు నకును, నడుమ నడ్డమువచ్చిన చంద్రబింబము చాటునుండి దూరదర్శినీయంత్రముగుండా చూ చుచుఁ జేసినపరిశీలనలనుండి తెలియఁబడును. పెక్కండ్రు పరిశోధకులు చేసిన పరిశోధన లీసంగ తిని స్థిరపఱుచుచున్నవి. ఇవి సూర్యునివెలుఁగు కన్నులకు మిఱుమిట్లుగొల్పుం గాన యంత్రసహా యములేని మానవనేత్రములతోఁ జూచుట దుస్త రము. కాని యిటీవల స్పెక్ట్రోస్కోపుగుండా గ్ర హణములేనికాలములందు సహా చూచి యెఱుం గనగునని కనిపెట్టఁబడినది.

క్రోమోస్ఫియరునుండి వెలువడుజ్వాల లొ క్కొకతరి విస్తారమగుచుండునట. ప్రొఫెసర్ యంగు అనువిద్వాంసుఁడు క్రీ. వె. ౧౮౭౧ సం వత్సరము ౭-౮ తేదులను స్పెక్ట్రోస్కోపుయం త్రమూలమునఁ బరిశీలన మొనర్చిరట. ౭ వ తేదీ మధ్యాహ్న మారంభమగు నుద్ధృత మెన్మిదవ తేదీమధ్యాహ్నమువఱకు గొప్పజ్వాల ప్రబలెనని యాయన వ్రాసియున్నాఁడు. అం దాయన యా జ్వాలనుండి యెగిరినట్లు వ్రాసినధూళి లక్షమైళ్ల వఱ కందియుండునని తెలిపెను. మఱియు రోమక పురి నివాసుండగు ప్రొఫెసర్ Tacchini పండి

తుండు క్రీ. శె. ౧౮౮౫ జనవరి ౩౦ వ తేదీని పరిశీలించుచు నాటియుద్ధృతము లక్షానలుబడి రెండువేలమైళ్లవఱకు జ్వాలలు వ్యాపించినటుల వాసియున్నాఁడు.

ఇట్టి యుద్ధృతజ్వాల లందు మండుచుండు హైడ్రోజన్ కేల్సియమ్ (Hydrogen calcium) కలదని యూహింపఁబడుచున్నది. ఇంకను సూర్యునందలి యగ్నిజ్వాలల నడుమనడుమ నల్లనిమచ్చలవలెఁ గాననగుచుండును. ఇవి మచ్చలుకావనియు సిల్వమై కాలకుండ నండిపోయిన గాలులనియుఁ దలంచుచున్నారు. ఇవి పదునొకండుసంవత్సరములకాలమున యథాస్థానముల నొకప్పు డభివృద్ధినందుచు, పెక్కులు గానంబడుచు నొకప్పుడు క్షీణించుచుఁ దమ యథాస్థానముల యావరణమునఁ గానఁ బడుచుండుననియుఁ, బరిశోధనలవలనఁ దెలియున్నది.

సూర్యునియందలి వేఁడిమి నపరిమితమని చెప్పుటకన్న నింతయని చెప్పఁబూనుట సాహసము. ఐనను కొంద రాంగ్లవిదులు పోటోస్పెరు నందు ౫౦౦౦ మొదలు ౭౦౦౦ వఱకు డిగ్రీలవేఁడిమి యుండునందురు.

సూర్యునియందు Sodium, Copper, magnesium, Zinc, Iron మొదలగునవి కలవని కొందరు పాశ్చాత్యపండితులును, భూమియందుండు నెల్లలోహములు, రసాయనములు కలవని మఱికొందరు పాశ్చాత్యపండితులును దలంచుచున్నారు.

ఇంక సూర్యునిం జుట్టియుండు గోళములం గూర్చి ప్రపంచకము చూడుఁడు.

**సూర్యభేదకుంభకము:—** ఇది మూలబంధపూర్వకమైన యాసనమునఁ గూర్చుండి, కుడిముక్కురంధ్రమున పింగళానాడిచే వాయువుఁ బూరింపఁబడినవాయువును జాలంధరబంధముచే లోన నిరోధించి కుంభించుట. దీనివలన కుండలినీప్రబోధమగునని చెప్పఁబడినది. (కుంభకము చూడుఁడు. అష్టాంగయోగములు చూడుఁడు.)

**సూర్యమండలము** (Solar System):— లాటిన్‌భాషయందు 'Sol' అనిన సూర్యున కర్థము. సూర్యబింబ మాకాశ మందలి గోళములలో బహుశః పెద్దదియని తలంచఁబడుచున్నదనియు ఐనను గాకున్నను, సూర్యమండలమందలి గోళములన్నిటిలోఁ బెద్దదని సినలుగాఁ జెప్పవచ్చుననియు, పశ్చిమశాస్త్రవేత్తలు తెల్పెదరు. మఱియుఁ గన్పించుచున్న సూర్యబింబము యొక్క యడ్డుకొలత (diameter) ౮౬౭౦౦౦ మైళ్ళుండుననియు, భూమికన్న ౧౩౦౦౦౦౦ రెట్లు పెద్దగనుండు ననియు నంచనావేసియున్నారు.

సూర్యబింబము పైభాగమున గొప్పమంటలు కలవనియు, నవి కొన్నిమైళ్ళ యెత్తునకు మండుచుండునని కొందరును, కొన్నివేలమైళ్ళ యెత్తునకు మండుచుండునని మఱికొందరును నభిప్రాయపడెదరు. ఎటులైన నన్నిదిక్కులకు తనవేఁడిని వెలుగును బ్రసరింపఁజేయుచు, తన్నావరించియుండు నెల్లగోళములకుఁ గాంతుల నిచ్చుచున్నది. వెదఁజల్లుకాంతులలో ౨౨౭౦౦౦౦౦౦ వంతు కిరణములు భూమికిఁ దక్కుచున్నవని యంచనా వేయఁబడినది.

సూర్యునిఁ బరివేష్టించి చుట్టు తిరుగుచుండు గోళములకు 'Planets' అనిపేరు. జర్మనుభాషయందు 'Planetes' అన తిరుగుచుండినది యని యర్థము. వీట్లలో జూపిటర్ (Jupeter) అనునది పెద్దదనియు, నది భూపరిమాణమున కన్న

గలవు. కొన్ని పెద్దవియుఁ గలవు. సూర్యుని చుట్టు తిరుగు గోళములందు ముఖ్యమగునవి భూమియు mars, Uranus, saturn అనునవియునై భూమి కన్నఁ బెద్దదగు గోళములు. Mercury, Venus అను రెండుగోళముల యందు 'mercurey' అనునది సూర్యునకు ౩౬౦౦౦౦౦౦ మైళ్ళ దూరమున తక్కినగోళములకన్న సమీపమునఁ దిరుగు చుండుననియెంచఁబడుచున్నది. సూర్యున కెక్కువ దూరముగాఁ దిరుగునది Neptune. ఇది ౨,౭౯,౪౦,౦౦,౦౦౦ మైళ్ళదూరమున నుండి దిరుగునట. ఇవి గాక ఇంకను మరినాల్గునూరులు చిన్నచిన్నగోళములు సూర్యునిఁ జుట్టితిరుగుచుండు నట. వాటికి 'asteroids' అనిపేరు. జర్మనుభాష యందు 'aster' అన నక్షత్రమనియు, 'eidos' అన నాకారమనియు నర్థము.

సూర్యుంజుట్టి తిరుగు ప్రధానగోళములగు జూపిటర్ - భూమి, మార్సు, ఊరెనస్ - శాటర్న - అనునైదింటికి 'Satellites' అని పేరిడిరి. లాటిన్‌భాషయందు 'Satelles' అన వదలక వెంటనంటియుండునదని యర్థము. ఇంక నీయైదిం టింజుట్టి మఱికొన్ని చిన్నగోళములు పరివేష్టించి తిరుగుచుండును. ఇట్టిది భూమింజుట్టి తిరుగు చంద్రునివంటివని యెఱుంగునది. నీయైదుగోళములు తమ్మాశ్రయించియుండు కొన్ని చిన్నగోళములు తమచుట్టుం దిరుగుచుండ వాట్లతోసహా తాము సూర్యుంజుట్టి తిరుగుచుండుం గాన ప్రధానగోళమగు సూర్యుని మధ్యవర్తి (ప్రధానుని) గాఁ జెప్పి యీగోళసముదాయమున కంతకును సూర్యమండలమని వాడెదరు.

ఇట్టి సూర్యమండలములం బోలినమండలములు వేనవేలుగ నాకాశస్థలియందుఁ గలవనియు, వాట్ల యందుగల సమునుండు నొక్కొక ప్రధాన గోళము తన్ను పరివేష్టించియుండు Satellites గోళములకు వెలుతురు, వేఁడి నొసంగుచుండు ననియు, కనిపెట్టఁబడినది. గాన సూర్యమండల మాకాశమునందుఁగల వేలసంఖ్యల మండలము లలో నొకమండలమాత్ర మని తేలుచున్నది.

భూమియొక్క నైసర్గికవిభాగములు.

Zones - Circles - Tropica - Poles.

భూమియొక్క మధ్యభాగమున సరిగా తూర్పు పడమరల నొకరేఖను భావించుదుమేని దానికి 'భూమధ్యరేఖ' (Equator) అని పేరు. ఇది భూచలనమున సూర్యునికెదురుగ నుండునట్లు తిరుగుచుండును. ఈప్రాంతము చాల వేఁడిగ నుండును. భూమధ్యరేఖ (అనఁగా భూమియొక్క యీప్రాంతపుఁజుట్టుకొలత) ౨౪,౯౦౦౦ మైళ్ళుం డునని శాస్త్రజ్ఞులు లెక్కించియున్నారు.

భూమధ్యరేఖ కుత్తర దక్షిణముల నిరువది యారున్నర డిగ్రీలప్రదేశములందు భూమింజుట్టి భూమధ్యరేఖ ననుసరించియే (Paralel to Equator) రెండు రేఖలం భావించుదుమేని వాట్ల యుత్తరపురేఖకు 'Tropic of Cancer' అనియును, దక్షిణపురేఖకు 'Tropic of Capricorn' అనియును బేర్లు.

ఇంక నీరెండుట్రోపిక్‌రేఖల కుత్తరదక్షిణములగ నిరువదిమూఁడున్నర డిగ్రీలదూరమున రెండు రేఖల నట్లు భావింతుమేని ఉత్తరపురేఖకు 'Arctic circle' అనియును, దక్షిణపురేఖకు Antarctic circle' అనియునుఁ బేర్లు. మఱియు నీరేఖలు భూమింజుట్టి వచ్చుచో వరుసగ నుత్తరధ్రువమునుండి 'Arctic circle' ను, దక్షిణధ్రువమునుండి Antarctic

circle ను నిరువదిమూఁడున్నర డిగ్రీలదూరమే యుండును.

ఉత్తరధృవమునుండి ఆర్క్టిక్ సర్కిల్ వఱకుం గల ప్రదేశమునకు 'North Frigid Zone' అనిపేరు. పిదప ఆర్కిటిక్ సర్కిల్ మొదలు Tropic of caucer రేఖవఱకుంగల భూమిం జుట్టియుండు ప్రదేశమునకు నార్తుటెంపరేట్ జోన్ (North Temperate Zone) అని పేరు.

ట్రోపిక్ ఆప్ కాన్సర్ మొదలు దక్షిణముగ ట్రోపిక్ ఆప్ కేప్రికోరన్ రేఖ వఱకుంగల ప్రదేశమునకు 'Torrid Zone' అనిపేరు. మఱియు భూమధ్యరేఖ దీనిమధ్యభాగమునఁ దనరుచు దీని నుత్తరదక్షిణభాగములుగ (North Torrid Zone and South Torrid Zone) విభజించు చుందురు.

అటులనే Tropic of Capricorn రేఖకు దక్షిణముగ నంటార్టిక్ circle వఱకుఁగల ప్రదేశమునకు 'South Temerate Zone' అని పేరు. మఱియు నా antarctic circle నుండి దక్షిణధ్రువము South Pole వఱకుంగల దక్కినప్రదేశమునకు 'South Frigid Zone' అనిపేరు.

సూర్యరశ్మి :- సూర్యశరీరమునందలి పై భాగము మంటలచే నాక్రమింపఁబడినదని యెల్లరెఱింగినదే. లోపలిభాగ మింకను వేఁడిగల్గిఁ ప్రాణులకు నివాసానర్హ్మమని వేఱుగ. జెప్పనక్కఱయుండదు. సూర్యశరీరము ఘనపదార్థము గాని, ద్రవపదార్థముగాని గాక 'Gas' అని తలంపఁబడుచు, ఎస్ట్రోనామీ శాస్త్రవిదులచే 'Gas in a state which could not be reprodued experimentally' అనియు, 'A kind of thick treacly fluid denser yet with the elastic properties of a gas' అనియు, వివరింపఁబడుచున్నది. లోన వేఁడిగాఘుపులప్రవాహములు (hot currents) అదేపనిగ నుద్భూతమంచుచు బయలుదేరుచుండునని యందురు.

జర్మనుదేశమున Science శాస్త్రవిదుండని గొప్పపేరందిన Helmholtz అను పరిశీలకుఁడు సూర్యశరీరము సంకోచస్థితి (అనఁగా ముడుచుకొనుచుండునట్టి) యందుండుటఁ గనిపెట్టితినని తెల్పియున్నాఁడు. సూర్యునిగమనమునుండి energy పర్పడుచున్న దనియు, 'Energycould cold notbe host' అను సిద్ధాంతముమేర కది నశింపక మార్పునందుచు వేఁడిగనగుచు, చెదరి వ్యాపించుచుండునని యుఁ దెల్పియున్నాఁడు. ఇట్లే యగుతరి వేయిసంవత్సరములలో సూర్యశరీరము ముడుచుకొనుటవలననో. త్రసరేణువులు రాలిపోవుచుంటవలననో చుట్టుకొలతయందు నలువదిమైళ్ళు నష్టపడవలసియుండవలయుననియు, ఆకర్షణశక్తి వలనఁ దిరుగ నానష్టము సూర్యునింజేరుకొనుచుంటయే గాక వేఁడిగూడ నటకే చేరుకొనుచుండవలయుననియు సిద్ధాంతము 'హోమ్హోల్టుజ్ సిద్ధాంత' మని కొంతవఱకు వాడుక నందియున్నది.

ఇదియే నిజమగుతరి భూమివిషయమునఁగూడ నిట్టిధర్మమే యేలవర్తింపకుండునని పెక్కండ్రు ఎస్ట్రోనామీ శాస్త్రవిదులకు స్ఫురించుట సహజమే. అట్లే జయగుచున్న దనఁకొనిన గత ౨౦, ౦౦, ౦౦, ౦౦, ౦౦౦ సంవత్సరములు భూమి యొక్క వయస్సని తెల్పు Geology శాస్త్రవిదుల లెక్కయగు ౧౦, ౦౦, ౦౦, ౦౦౦ భూపరిమాణమునకును, పై విధానఁపు ఎస్ట్రోనామీ

శాస్త్రములుగణితమునకును సరిపోవకున్నవి. గాన నీసిద్ధాంతమటే నిలచిపోయెను.

ఇంక నీసందర్భమున Constitution of the matter యొక్క శాస్త్రాభిప్రాయములు గూడా మారి కొన్ని క్రొత్తవి యేర్పడియుంటయు, రేడియమ్ - రేడియోయాక్టివ్ Radium & Radio active substans వల్ల గల్గుచున్న ఫలితములం గూర్చియు నెఱింగినవారికి 'Atoms of matter contains stores of energy' అను సిద్ధాంతమును, అట్టి energy కొన్నింటి యందు బంధింపఁబడియుంటయుఁ గొన్నింటినుండి తపించుకొనుచు వెలువడుచుంటయు, నవి వేఁడిని (heat) కల్గించుచుఁ బెక్కు electrical actions చేయుచుంటయు, స్ఫురించుతరి దీని కెంత వఱకు సంబంధముండునా యనిపించకపోదు. ఇట్టి radio active bodies భూమియొక్క యుపరి భాగములం దణురూపమునఁ గడుంగడు చిన్నవిగా నుండును.

Strutt పండితుఁడు భూమిలోపలిభాగమునం దధికముగనుండు రేడియమ్, భూమిలో బంధింపఁబడి వేఁడిని బయలుపరుపఁజాలమి భూమి యిప్పుడున్నరీతి నున్నదికాని, లేకుండిన నింకను వేఁడి యధికమైయుండు ననెను. ఈసందర్భమున Newall పండితుని వేఱొకసిద్ధాంత మిటవివరింప వలయును.

సూర్యుని యాకర్షణశక్తివలన సూర్యశరీరమునకు ౪, ౦౦, ౦౦, ౦౦, ౦౦౦ టన్నుల త్రసరేణువు లేటేటఁ జేరుచుండుననియు, నవి యన్నిగోళముల నుండియో, కొన్నిగోళముల నుండియోయరగుచు సూర్యశరీర మధికమగుచుండు[illegible]కతన గమన కాలము తగ్గి భూమిపై వారలకు[illegible]సంవత్సరమున సెకండునందు వెయ్యవభాగ మించుమించు కాలము మిగులుచుండుననియు నిది కడుస్వల్పమగుట కేఁబదివేలసంవత్సరములకుఁ గాని తెలియఁబడం జాలనంత లఘుతరమని యున్నాఁడు.

ఇంక సూర్యబింబమందలి మచ్చ (Sun spots) లా గోళమందలి activity ని తెల్పుచు కల్గుకార్యములను సూచించెడిని. అవి యనునిత్యము మార్పుఁ జెందినవి యైనను, పదునొకండు వత్సరములలోఁబూర్తిగా మార్పునందుచుండును. (సూర్యగోళము చూడుఁడు.) ఉత్తరధ్రువప్రదేశముఁ గన్పడు నరోరా ప్రకాశములును, magnetic Compass నందలి ముల్లిటు నటు కొనుచు magnetic storm దెల్పుటయు, భూమిపై టెలిగ్రాపుతంతులు Electric city Currents వలన interrupt అగుచుంటయు, నీసూర్యునియందలి నల్లమచ్చ (sun spots) లధికమగుతరి కల్గుచుంటయు తగ్గిపోవుతరి శాంతి గల్గుచుంటయు, సంభవించుచుండువని పోల్పఁబడినది.

### సూ _ _ అగ్నిహోత్రము:—

సూర్యరశ్మి గాఢమైయుండుతరి నెండలో నగ్ని రాజుటగాని, యగ్నిపుల్ల వెలుగుగాని, దీపము మండుటగాని, సరిగానుండదు. ఇట్లనుటయుం దది చక్కఁగా వెల్గి ప్రకాశముగానుండదని భావము గాని యగ్నికి సూర్యరశ్మి వైరి యనిభావము కానేరదు. వేఁడిం జల్లపఱచునదియు గాదు. పెద్ద బలమగువెలుతురునందు బలహీనమగు చిన్న వెలుతురప్రకాశముగఁ గన్పట్టుంగాని దాని నిజతత్వ మెంతమాత్రము తగ్గినకారణము గాదని భావము.

ఎండదనరున రాక్షసబొగ్గుం గాల్చి యగ్నిం బ్రజ్వలింపఁజేసిన మంటయం దెట్టిధాతువుఁ గస్పించదు. అనిప్పే నీడంజేర్చిన నందలి యెట్టిధాతువుఁ

గన్పించెడిని. ఎండయం దవి నల్లధాతువులు దాని పైఁ బడి యెఱ్ఱరంగును మరుగుపర్చుటయు, తక్కినధాతువులు reflect చేయుటయు సంభవించుటయు రాక్షసబొగ్గగ్నియందలి ఎర్రిధాతువులు తగ్గి యగుపడునట్లగుంగాని నిజమున తగ్గిపోవుట గానేరదు.

## సూర్యరశ్మి - కొన్నిరంగులం బాడు చేయుట:

— తొలుత రంగుంగూర్చి యోచింతము. ఇవి యనేకములు. కొందరు పండితు లేడు రంగులుగలిసి మనకు సాధారణముగ నగుపడు తెల్లరం గగుచున్నదని పోల్చిరి. అనఁగా నందు ముఖ్యముగాఁ బోల్పఁదగినరంగు లేడనియు, నింకను ననేకములు లెక్కించ వీలుగాకను, పోలిక సరిగా దొరకకును వదలివేయఁబడినదని భావము. ఎఱుపుమొద లూదావఱ కీరంగు లసంఖ్యాకములుగ నున్నవి. ఇంక సూర్యరశ్మియందును ననేకరంగులుంటయే గాక వేర్వేరురకములకిరణము లున్నవని పోల్చఁబడినది. అం దొకవిధమగు కిరణమునకు 'ఏక్టినిక్ రేస్' (actinic rays) అని పేరిడియున్నారు. ఈకిరణము చాలరంగులను గాల్చి మార్పునొందించునది. ఇట్టిమార్పులకు 'కెమికల్ ఛేంజి' (Chemical change) అనెదరు.

సూర్యకిరణములందుండు ఈఏక్టినిక్ కిరణములే పూర్తిగా నెండకుఁబొల్పడిన ఫోటోగ్రాపులను పాడుచేయునది. అదియే పువ్వులరంగులనుగూడ మార్పుఁజెందించునది.

శాస్త్రజ్ఞు లీపాడుచేయుటకు (కాల్చి రంగు మార్పుఁ జెందించుటను)'ఆక్సియాడైజు' (oxidised) అనెదరు.

## సూర్యరశ్మియందలివేఁడి - అగ్నియందలివేఁడి:

—వేఁడి యెటులఁగల్గినను నొకటియేయని పెక్కండ్రు పొరఁబడుచుందురు. సూర్యరశ్మియందలివేఁడికి భూమి యాకర్షణయగు గ్రావిటేషనుపుల్‌తో సంబంధము గలదు. దానికి లోబడుచుండునది. అది కల్గించువెలుతురు 'calcium carbon ల సంబంధము. ఇంకను నందు Radium సంబంధ ముండునందురు. Helium సంబంధఁపుఁ బరమాణువు లెనుబోనుటవలనఁ గల్గుపనులందుఁ గలవనియుం జెప్పఁబడినది.

అగ్నియందలి వేఁడి యటులఁ గాక ఆక్సిజెను, కార్బను, హైడ్రోజెనుల కెమికల్ కాంబినేషను నుండి కల్గింపఁబడినది. ఇవి కలుసుకొనుతరి హత్తుకొనుచు వేఁడి గల్గించెడిని.

వేఁడియం దిటుల భేదములున్నను, వేఁడితరంగములయం దితరవ్యవహారము లొకేరీతి నుండెడిని. ఎఱ్ఱరంగు (Red waves) ulterared waves యందు రెండువిధములవేఁడికి భేదము గానరాదు.

## సూర్యరశ్మి రంగులంజెఱుపుట:

— సూర్యరశ్మి రంగులందినునని ఉక్తి కలదు. అనఁగా వెలుతురునం దనేకరంగు లుండి, యవియన్నియుం గలసి మానవనేత్రముల కగుపడురంగగుపడుచుంటయుఁ, గొన్నికారణములచే నగుపడు కొన్నికొన్ని రంగులపై సూర్యరశ్మి వేఁడితోఁగలసి ప్రసరించుటతో నారంగులు తగ్గిపోవుననియు, పరిశీలనలనుండి యెఱిఁగియున్నారు. మన కగుపడు రీతిని సూర్యబింబమును రంగులతోఁ జిత్రించుటయు, నిజమగురంగుతోఁ జిత్రించితిమనుచు వేరు రంగుతోఁ జిత్రించుటయు రెండుసాంప్రదాయములుగఁ జిత్రకళావిద్యయం దేర్పడియున్నవి. ఇందు నిజమెద్దియో నిర్ణయించుట దుస్సాధ్యము. వర్షము గురిసినపిదప నుదయమున పచ్చిగడ్డి గాఢ

ముగు నారింజపండురంగు నగుపడి యొండె ప్రసరింపజేసిన సింధూరరంగుల్గా యగుపడుచుంట మొదలగువాటినుండి సూర్యరశ్మి రంగులందెలుపు నని ఉక్తమేర్పడియున్నది. నిజ మేరంగైనను సూర్యరశ్మి మననేత్రములకు గుపడఁజేయుటంబట్టి రంగుల మార్పుగలుగదని చెప్పుటయం దతిశయోక్తి యుండదు.

## సూర్యవనము:—

కురుక్షేత్రవనములలో నొకటి.

## సూర్యశాఖక్షత్రియులు:—

(క్షత్రియకులము చూడుఁడు.)

**సూర్యషష్టి:**— శ్రావణశుద్ధషష్టి, శ్రావణబహుళషష్టి తిథుల కీపేరు కలదు. పర్వతిథి. సూర్యుని పూజింతురు. [పండుగలు—పర్వతిథులు వ్రతదినములు— చూడుఁడు].

## సూర్యస్తంభగోత్రము:—

[భరద్వాజ ఉపగణము చూడుఁడు.]

**సూర్యసావర్ణికమనువు:**— తండ్రి సూర్యుఁడు. తల్లి ఛాయాదేవి. కుమారులు ధృతి, వరీయాన్, యవసి, సువర్ణ, వృష్టి, చరిష్ణ, ఈఢ్య, సుమతి, వసు, శుభ్రు లనువారలు.

ఈతని మన్వన్తరకాలమున ఇంద్రుఁడు, గాలవ, దీప్తివంత, పరశురామ, అశ్వత్థామ, కృపాచార్య, ఋష్యశృంగ, వ్యాసులనంబడువారు మహర్షులు. భాద్రపదబహుళ సప్తమి సూర్యసావర్ణికమన్వాది.

**సూర్యసిద్ధాంతము:**— జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతములలో నొకటి. అందు ప్రధానమైనదిగఁ జెప్పఁబడుచున్నది. సూర్యసిద్ధాంత మన్నిసిద్ధాంతములలో నగ్రగణ్యమని బాదరాయణుఁడు చెప్పియున్నాఁడు. సూర్యసిద్ధాంతము, పితామహసిద్ధాంతము, పులిశసిద్ధాంతము, వ్యాససిద్ధాంతము, రోమశసిద్ధాంతము ననునవి పంచసిద్ధాంతము లనంబడుచున్నవి.

విక్రమాదిత్యమహారాజ సభాస్థానవిద్వాంసుఁడైన వరాహమిహిరాచార్యుఁడు పైయైదుసిద్ధాంతములం జేర్చి పంచసిద్ధాన్తిక మనుగ్రంథమును రచించియున్నాఁడు. దీనికిఁ బూర్వ మార్యభట్టను జ్యోతిషవేత్త సూర్యసిద్ధాంతానుసారముగఁ గొన్ని సవరణలతో 'ఆర్యభట్టీయ' మను సిద్ధాంతగ్రంథమును రచించెను. అంతకుఁ బూర్వ మనఁగాఁ ద్రేతాయుగారంభమున సూర్యాంశసంభూతుఁడగు నొకమహాపురుషుఁ డొకఁడు సూర్యసిద్ధాంతమును మయున కుపదేశించెనట.

జ్యోతిషశాస్త్రము స్కన్ధత్రయాత్మక మని యందురు. అవి గణితము లేక సిద్ధాంతము, ఫలభాగము, ప్రశ్నభాగము నని కాని యింకను నిందే యిమిడియున్న ముహూర్తశాంతిభాగములు రెండును వేర్వేరనియే తలంపఁ దగియున్నవి. గాన జ్యోతిష మైదుభాగములని చెప్పుటయే సమంజసముగ నుండును. అందు గణితము లేక సిద్ధాంతములు పదునెన్మిది కలవందురు. గాని సూర్యసిద్ధాంతమే ప్రధానమని బాదరాయణుఁడు స్పష్టపఱచెను.

ఇవి యిటుండ భాస్కరాచార్యకృతములగు గోళాధ్యాయము, బీజగణితము, లీలావతి, సిద్ధాంతశిరోమణియనుగ్రంథములును, గణేశదైవజ్ఞుండను మహనీయుం డక్కాలఁపు గ్రహసంచారములను గణితవ్యత్యాసముల నెల్ల సవరించుచు సంస్కరించి వ్రాసిన గ్రహలాఘవ మనంబడు

## సూర్యవంశము — ఇక్ష్వాకు సంతతి — హరిశ్చంద్రమహారాజు, రఘుమహారాజు వంశావళులు.

రఘు మహారాజు వంశావళి.

భగీరథమహారాజు — సగరచక్రవర్తి — కుక్షిమహారాజు — హరిశ్చంద్రమహారాజు — ఇక్ష్వాకుమహారాజు సంతతి.

వీరిది సూర్యవంశము — మరీచి సంతతి.



గ్రంథమును నీసందర్భమునఁ బేర్కొనఁబడఁ దగిన గ్రంథములు.

వరాహమిహిరాచార్యునకును, ఆదిభట్టునకును, మయునకును గూడ పూర్వము జ్యోతిషము లేదనరాదు. నారదుఁడు, వశిష్ఠుఁడు, పరాశరుఁడు, గర్గి, వ్యాసుఁడు మొదలగు కొందరు సిద్ధాంతగ్రంథములను వ్రాసియే యున్నారు. వీరిగ్రంథములందు సిద్ధాంతభాగము మాత్రమే గాక ఫలభాగముగూడ విపులముగనే వ్రాయఁబడుట గాననగును. వరాహమిహిరుఁడు, సత్యాచార్యుఁడు, చాణుక్యుఁడు వ్రాసిన గ్రంథములందు వృద్ధయవనుఁ డనంబడు జ్యోతిషవేత్తను ప్రశంసించి యుంటఁ గాననగును.

గ్రీకుదేశమునందలి అయోనియన్ ద్వీపవాసులకు 'యవను' లనుపేరు వాడుకఁగలదు. పారసీకులకు యవనులనియుం బేరు కలదు. అరబ్బీదేశస్థులకు యవనులనుపేరు సుప్రసిద్ధము. జావాద్వీపవాసులకు జావనులు, యవనులు అను పేరు కొంతవఱ కొకప్పుడు వాడుక నందియుండెను. ఇందు మన వృద్ధయవనసిద్ధాంతి యెక్కడివాఁడో లేక పేరే యట్టిదో పరిశీలనలు జరుగవలయునని మా తలంపు. కొంద రింకను వృద్ధయవను లనువారొక తెగవారని తలంచుచున్నారు.

## సూర్యాక్షత్రియులు:—

(శిశోదియాశాఖక్షత్రియులు చూడుఁడు).

**సూర్యాగ్రకిరణచికిత్స** (Ultra Violet Rays):— దీనికి సరియగుపేరిదేయైనను దీనిని సూర్యకిరణచికిత్సయనియు, Ultra Violet rays చికిత్స యనియుఁగూడ పేరులు కలవు. సూర్యకిరణములవెలుతురునం దేడురంగు లున్నవి. అందు మొదటిది 'ఊదా' యనియు, చివరది యెఱుపనియుఁ జెప్పఁబడినది. వీటి కత్యగ్రకిరణము లందురు. ఆంగ్లమున 'Ultra Violet and ultrared rays' అనెదరు. అత్యగ్రమగు నూదాకిరణమునం దత్యద్భుతగుణము కలదనియు, పాదరసము [mercury quartz lamp] అను పారదసహాయమున వెలుఁగునట్టి దీపసాధనముచే వేఱుపఱచి ప్రసరింపఁజేసి యుపయోగించుచున్నారు. ఈకిరణములను కొన్నియాహారపదార్థములపై బ్రసరింపఁజేసినచో నాపదార్థములందలి విటమినుల సంఖ్య యధికమై యెక్కువశక్తి గలవిగ నగును. ఆతపస్నానము (Sun Bath) అనఁగా నెండలో దిగంబరులై యుండుట వలన, నీకిరణప్రసారము వలన విటమినులు వృద్ధియగుటయే ఫలితముగఁ జెప్పఁబడినది. ఈకిరణప్రసారము గల్గించి, యనేక పదార్థములందు విటమినుశక్తిని వృద్ధిపఱచి మందులుగ విక్రయించుచున్నారు. రికెట్సువ్యాధిని నిరోధించుశక్తి యీకిరణములందు బాగుగఁగలదని చెప్పఁబడినది. [విటమినులు చూడుఁడు— ఆతపస్నానము చూడుడు).

**సూర్యారణ్యుఁడు- త్రయారుణ్యుఁడు:**— మరీచి, ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి త్రిధన్వుఁడనుపృధువు. సోదరుడు విశ్వగంధుఁడు. యువనాశ్వుఁడు కుమారుఁడు. సత్యవ్రతుఁడను నామాంతరముగల త్రిశంకువు.

**సూరిశిష్టకులగోత్రము:**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.) సూరిశిష్ట (లేక సూరశిష్ట) కుల గోత్రము. ఏకార్షేయ (౧) గోత్రము. జాబాల గణము. సంస్కృతగోత్రము. జాబాలస. సనత్కుమారర్షి. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ. సమానగోత్రము సనత్కు-

మారస. సువర్ణేశుఁడు దేవత. శృంగాంబభార్య. నర్మదాతీరము తపస్థానము. శృంగిసరస్సు తటాకము. జపము కోటి. దీపములు ౨౫. క్షేత్రసంఖ్య ౭౦. స్వర్ణదానము. దొండపండు వర్జనీయము.

**సూర్యునికుటుంబము**:—ఇట సూర్యుఁడనిన సూర్యగోళము. దానికుటుంబ మనిన ౧ మెర్క్యూరీ, ౨ వీనస్, ౩ భూమి, ౪ మార్సు, ౫ జూపిటర్, ౬ శాటరన్, ౭ ఉరేనస్, ౮ నెప్ట్యూన్ అను పేరులుగల గోళములు. ఇవి సూర్యు నాశ్రయించి తిరుగుచుండు నాశ్రితగోళములు. ఇందు మెర్క్యూరీ, వేనస్ గోళముల నాశ్రయించి తిరుగు నుపగోళములు లేవు. అట్టివాని నీసందర్భమున చంద్రిలనెదము గాక.

౩ భూమి—దీని కుపగోళ మొకచంద్రుఁడు. ఇది చల్లబడినగోళము. సూర్యునుండి ౯౩౦౦౦౦౦౦ మైళ్ళదూరమున దానిఁజుట్టి తిరుగుచుండు నది. భూమిపై సంవత్సరమునకు ౩౬౫ దినములు ౬ గంటల నలువదియైదు మినిట్లు ౪౫ సెకండ్లకాల మించుమించుగ నుండును.

౪ మార్సుగోళము— దీని కుపగోళములు - రెండు చంద్రిలు - సూర్యునుండి ౧౪౦౦౦౦౦౦౦ మైళ్ళదూరమున దానింజుట్టి తిరుగుచుండునది. మార్సుగోళముపై సంవత్సరమునకు ౩౬౫ దినము లుండును.

౫ జ్యూపిటర్ గోళము—దీనికుపగోళములు తొమ్మిది చంద్రిలు. సూర్యునుంన ౪౮౩౦౦౦౦౦౦ మైళ్ళ దూరమున దానింజుట్టి తిరుగుచుండునది. జూపిటర్ గోళమున నొక సంవత్సరమగుటకు భూమిపై సంవత్సరములు పండ్రెండు కావలయును.

౬ శారటన్ గోళము—దీని కుపగోళములు పది. చంద్రులు సూర్యునుండి ౮౭౦౦౦౦౦౦౦ మైళ్ళ దూరమున దానింజుట్టి తిరుగుచుండునది. శాటరన్గోళమున నొక సంవత్సర మగుటకు భూమిపై సిరువదితొమ్మిదిన్నర వత్సరముల కాలము పట్టును.

౭ యూరేనస్ గోళము— దీని కుపగోళములుగ నాల్గు చంద్రిలు కలరు. సూర్యగోళము నుండి ౧౭౫౪౦౦౦౦౦౦ మైళ్ళదూరమున దానింజుట్టి తిరుగుచుండునది. యూరేనస్పై నొకసంవత్సరకాల మగుటకు భూమిపై నెనుబదిమూఁడువత్సరములకాలము పట్టును.

౮ నెప్ట్యూన్ గోళము— దీని కుపగోళముగ నొక చంద్రుఁడు కలఁడు. సూర్యగోళమునుండి ౨౭౫౧౦౦౦౦౦౦ మైళ్ళదూరమున దానింజుట్టి తిరుగుచుండునది. నెప్ట్యూనుగోళముపై నొక సంవత్సరకాలమగుటకు భూమిపై ౧౬౫ సంవత్సరములకాలము పట్టును.

ఇంకను మెర్క్యూరీ సూర్యగోళమునుండి ౩౫౦౦౦౦౦౦ మైళ్ళదూరమున దానింజుట్టి తిరుగుచుండుననియు, దీనియం దొకసంవత్సరకాలమగుటకు భూమియం దెనుబదియెన్మిదిదినములు మాత్రము పట్టుననియు, తక్కిన వీనసుగోళము సూర్యునుండి ౬౬౦౦౦౦౦౦ మైళ్ళదూరమున దానింజుట్టి తిరుగుచుండునదియనియు, దానిపై నొక సంవత్సరకాలమగుటకు భూమిపై రెండువందలయిరువదినాల్గుదినముల కాలముమాత్రము పట్టుననియు లెక్కింపఁబడినది. మఱియు సంవత్సరకాలమనఁ దనకు తానై గిరగిరతిరుగు సూర్యగోళముం జుట్టి యొకసారి తిరిగి వచ్చుటయని యెల్లరెఱింగినదే.

**సూర్యునిచుట్టియుండు కరోనామంటలు** (Ring of flames round the Sun):— ఇది లాటిన్ భాషలోనిపదము. 'శిరోవేష్టు' యని దీనికర్థము. దీనినొక ఎలిమెంటుగా నెంచి యాంగ్ల ఖగోళశాస్త్రవిదుఁడగు Sir Norman Lockyer పండితుఁడు 'కరోనియమ్' (coronium) అని పేరిడెను. ఇందు Hydrogen calcium, magnesium, sodium, Iron ఇంక ననేకలోహములు గలవని యాయన వోల్చెను. ఇవి సూర్యగోళము నందుఁ గలవనియు, అది చల్లఁబడుచున్నదనియు, వెలుతురు తెల్లగనుండునని యాపరిశీలకుని యభిప్రాయమట. అట్టిది సిరియస్ నక్షత్రగోళమట. తగ్గినకొలఁది నెఱుపుఁ బిదప పసుపురంగులుగాననగునట.

**సూర్యునియందలివేఁడిమి:—** సూర్యగోళమునందు వేఁడిమికలదని యెల్లరెఱుఁగుదురు. ఇదియే పగటియందలి వెలుఁగునకును, రాత్రియందలి వెన్నెలకాంతికిని గారణము. శాస్త్రజ్ఞులు యీపరిశీలించి వేఁడిమి సూర్యునికిఁ గల్గుచున్నదాని కన్న నించుక యధికముగా సూర్యునుండి జాఱిపోవుచున్నటుల నిటీవలఁ గన్పట్టెరి. ఇట్లగునేని సూర్యుఁడు కొంతకాలమునకు భూమివలెను, చంద్రునివలెను జల్లఁబడిపోయి యుండవలసివచ్చును. అత్తరి నందలి 'గేస్' [gas] లు కొంతవఱకు ద్రవపదార్థములుగను, గొంతవఱకు ఘనపదార్థములుగను మార్పునందుచు భారముఁ గలవిగ నేర్పడును.

స్పెక్ట్రోస్కోపుపరిశీలన లిట్లారి చల్లారిన సూర్యగోళము లిదివఱకే యున్నటులఁ దెల్పుచున్నవి. వాటినుండి యినుము మొదలగు పలులోహము లేర్పడియున్నవి. ఇట్లు చల్లారుటయందు సూర్యుని యవస్థలను స్పెక్ట్రొస్కోపుశాస్త్రవిదులు మూఁడుగ విభజించి పేరిడియున్నారు. 1 Giant sun- in Cloudy stage, 2 Dwarf sun- in condensed stage, 3 Dead dark sun in cooled down stage, ఇంకను గొందఱు శాస్త్రజ్ఞులు సంకోచావస్థ [condensing stage] యందు వొక్కొకతరి వ్రేలి కొంతయూడి వేఱొకచిన్నగోళ మీతరునం దేర్పడుచుండు నని యు, మనముండు భూమియు నట్లొకప్పుడు సూర్యగోళమునుండి యేర్పడినదేయనియుఁ గూడ నను చున్నారు. ఇట్లగునేని భూమియు, శిలలు, సముద్రములు, జంతువులు మొదలగునవన్నియు హైడ్రోజను హేలియములు గల్గించినకృత్యములుగఁ జెప్పవలసియుండును.

**సూర్యునియందుండు ప్రోమినెన్సు-వేఁడిగాలులు** [Hot prominence gases of the sun]:— సూర్యగోళమునుండి వేఁడిగాలులు విచిత్రవర్ణములుగలవని యిదివరకే కన్గొనఁబడియున్నది. వీటికి ప్రోమినెన్సు వేఁడిగాలు లందురు. సూర్యరశ్మితేజమునం దివి కానఁబడవు. గాని సంపూర్ణ చంద్రగ్రహణకాలమున చంద్రబింబము సూర్యబింబమున కడ్డమువచ్చి పూర్తిగ మఱుగుపఱచిన కొన్నిలిప్తలకాలము లందు సూర్యబింబఁపుఁ గొన్ని దెసలందు బయల్పడలుటఁ గాననయ్యెడిని. వీటింగూర్చి పరిశీలన లొనర్చిన Sir Norman Lockyer అను పేరుగల యాంగ్లఖగోళశాస్త్రపండితుఁడు గ్రహణములేని కాలములందుఁగూడ వీటింజూడనిచ్చి మెఱుఁగంజేయు నొకయంత్రముం గన్పెట్టి నిర్మించియున్నాఁడు. దానిగుండా పరిశీలించితిమేని యది సూర్యరశ్మికన్న వేరగు వెలుతురులను గన్పఱచును. అవి యచ్చ టచ్చట నుండును. ఆయంత్ర

ము సూర్యరశ్మిని నేత్రదృష్టినుండి పూర్తిగ మరు గుపఱచి ప్రోమినెన్సు వెలుతురుం గనపఱచును. అవి మెఱుపురంగుగలవై చాల పెద్దవిగనుండును.

**సూలాద్వీపము:—** ఇవి ఓసీనియా యందలి మలేశియాద్వీపసమూహమునకుం జెంది, యందలి లుండాద్వీపములలోనివై యున్నవి. ఫిలిప్పైన్ ద్వీపములకు దక్షిణదిశగాం గొంతదూరమున నున్నవి. ఇవి చాలా చిన్నద్వీపములు. ప్రజలు మహమ్మదీయమతస్థులు. ఈప్రాంతమున ముత్యములసలాపము కలదనుటకన్న వీటింగూర్చి యేమియుం దెలియదు.

**సూషిభిగోత్రము:—**
(సాంకృతియుపగణము చూడుండు).

**సూక్ష్మజీవులు:—** జెరమ్సును (Germs) వోరమ్సు (Worms) లోని కొన్నిచిన్నజాతి పురుగులును సూక్ష్మజీవులుగాం జెప్పంబడినవి. ఇవి ప్రాణముం గల్గియుండవలెను. (జెరమ్సు చూడుండు. అంటువ్యాధులు చూడుండు.)

**స్థూణగోత్రము:—**
(నిధృవగణము చూడుండు.)

**స్థూణానిఖననన్యాయము:—** స్తంభమును పాతి లోనికి దిగంగొట్టుట వలన బలపఱచినట్లే కొన్ని యితరవాదనలచేం దనప్రధాన వాదమును బలపఱచుట కీన్యాయము వర్తించును.

**స్థూలకేశుండు:—**
ఋషి. ప్రమద్వరను పెంచినవాండు.

**స్థూలబిందుగోత్రము:—**
(నిధృవగణము చూడుండు).

**స్థూలశిరస్సు (స్థూలశిరస్కుండు):—**
ఋషి. కబంధునకు శాప మిచ్చినవాండు. (కబంధుండు చూడుండు).

**స్థూలాశిరగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుండు).

**స్నూకరు ఆట [Snookar]:—** ఇది పై రామిడ్సు పూల్ ఆటల ధర్మములం గల్పిన యాటగా నెంచుచున్నారు. దీనిని ఆరు ఎఱ్ఱబంతులు, ఆరు ఇతరరంగుల బంతులతో నాడుచున్నారు. ఇద్దరుగాని, యెక్కువమందిగాని యాడుదురు. ప్రతియాటగాండును నొకయఱ్ఱబంతిని, నొక యితరరంగుబంతిని గుంటయందు త్రోయుచుండవలెను. ఇది యొకరంగు తర్వాత వేరొక జాతిరంగు బంతిం ద్రోయుచుండుట యాచారమై యున్నది. దీనికి 'To pol the ball' అనియెదరు. ఎవ్వరే నెఱ్ఱబంతిం బడద్రోయం బ్రయత్నించుచో దానిం దప్పి యితరరంగుబంతిని గుంటం ద్రోసెనేని దానివిలువ నతనికి నష్టముగా లెక్కింపంబడు చుండును.

**స్టూండిజమ్ (Stundizm) గ్రీకుభాషాజన్యము:—** ప్రాచీనక్రైస్తవసిద్ధాంతములలోం గొన్నివిషయములందు వ్యతిరేకసిద్ధాంతములతోం బ్రతిపాదింపబడిన యొకమత సంఘము. ఇది దక్షిణరషియాదేశమున క్రీ. వె. పందొమ్మిదవ శతాబ్దమున బయలుదేఱినది.

**స్పూణగోత్రము:—**
(వశిష్ఠగణము చూడుండు).

**స్పూనెరిజమ్ (Spoonerism):—**
మాటలయొక్క మొదటియక్షరములను తాఱు

మాఱుచేసి వ్రాయుపద్ధతి. దీనికి స్పూనరను నాంగ్లేయుఁడు 1844 లో దారితీసెను.

'A half warmed fish (half farmed wish)' 'కోముని రాయుము' (రాముని కోయుము).

## స్యూపర్ పాసేజి (Super passage):

Irrigation (పంటకాల్వల) engineering నందు వివరింపఁబడిన యొకనిర్మాణము నకుఁ బేరు. (ఇరిగేషన్ చూడుఁడు.)

అక్విడక్టు నిర్మాణమునంటిదే యై క్రిందుగా నున్న కాల్వను పైగా drainage ప్రవాహము దాఁటవలసి వచ్చినతఱి నాకట్టడ నిర్మాణములకు 'స్యూపర్పాసేజి' యని పేరు. (అక్విడక్టు చూడుఁడు, సైఫన్ చూడుఁడు.)

## సెంటరాఫ్ గ్రావిటీ (Centre of Gravity):

— ఇది యాంగ్లకల. దీనిని బరిశీలకులు 'Problem of eqnilibium' అనియు, 'Problem of balance' అనియుఁ నందురు.

ప్రతిపదార్థమునందు దానియొక్క యన్నివైపులనుండు దానిభాగములు సమముగఁ దులతూఁగంగల ప్రదేశమొకటి యుండును. అనఁగా నా ప్రదేశము (point) నొకసూదియగు స్తంభము పై తిన్నగ నిలువఁ బెట్టిన నది సరిగా నిలుచునని భావము. అట్టిప్రదేశమునందు దేనినైన గ్రుచ్చి వ్రేలాడఁదీసిన సరిగా వ్రేలాడుంగాని యేప్రక్కకైన నొరగక యట్లేయుండును. ఆప్రదేశమును సెంటరాఫ్గా యనెదరు.

ఇందువలన సెంటరాఫ్గ్రావిటీ యన నొక వస్తువుయొక్క బరువునకు సమముగు మధ్యభాగమని తేలినది. అనఁగా కేంద్రస్థానమువంటిదని భావము. ఇట్టి గ్రావిటీసెంటరు స్థానములు ప్రతి వస్తువునకుఁ గలవు. పొడవైన గొప్పగొప్ప కట్టడముల నిర్మాణములందు వాటికి రాఁగల సెంటరాఫ్ గ్రావిటీతావు నెఱింగి, దానిననుసరించియే పునాదులు మొదలు శిఖరమువఱకు దాని సూత్రము, లైను ననుసరించుచు నిర్మింతురు. లేకున్న భంగము వాటిల్లును. పైకి నిలువఁబడియున్న ప్రతివస్తువును గ్రావిటీసెంటరునుండి యన్నిదెసల సమముగా నుండవలసియుండు ననియు నిందు భూమిలోని పాతఁబడినపట్టును, దానిబలమును చేరియుండును.

## సెంట్రల్ ఆఫ్రికా:

—దక్షిణఆఫ్రికాయందున్నది.

(బ్రిటీషు సెంట్రల్ఆఫ్రికా చూడుడు.)

## సెంట్రల్ ఏషియా:

—

(తురుష్కస్థానము చూడుఁడు.)

## సెంట్రలిండియా ఏజన్సీ సంస్థానములు:

— భరతదేశఁపు మధ్యభాగమునందుంట నీపేరిడిరట. ఇవి మొత్తము డెబ్బదియొకటి. ఇండియాగవర్నరు జనరలుగారికి లోఁబడి మధ్యవర్తిగనుండు నేజంటుగారి పరిశీలనయందున్నవి. ఆయన ఇంటోరునం దుండును. ఈసంస్థానములు రాజపుత్రస్థానఁపు సీమలనుండి ఛోటా నాగపూరు సీమలదనుక మాళవదేశభాగములు, బుందేలఖండము (బొందిలీలదేశము) చేరియున్నవి. వైశాల్యము ౭౮౭౭౭ చతురఁపుమైళ్ళు. జనాభా ౯౯,౩౫,౭౩౭

వీటియందు పది Croun relation కల్గినవి. ఇవి పెద్దవిగనున్నను, చిన్నవిగ నున్నను పేరెన్నికగన్నవి. తక్కినవి చిన్నవి. ఇండోరు, గ్వాలియరు,

భూపాలము, రేవా, పున్నా, ఓర్ఛా (తెహిరి) సంస్థానములు ప్రాముఖ్యత నందినవి.

ఇండోరు సంస్థానము— దీనిని దొల్లి సుప్రసిద్ధురాలగు సహల్యాబాయి మహారాజ్ఞి పాలించియుండెను. దీనిని పాలించు ప్రభువునకు హోల్కారని పేరు.

గ్వాలియరుసంస్థానము— ఇది క్రీ. శ. ౧౯౨౧ లో రాజకీయముగ సెంట్రలిండియా యేజన్సీనుండి తప్పింపఁబడి ప్రత్యేకింపఁబడినది. వైశాల్యము ౨౬౩౬౭ చతురఁపుమైళ్ళు. ౩౫౨౩౦౭౦ జనాభా. స్వంత యినుపదారులు గల్గినది. విద్యుచ్ఛక్తి విరివిగా వాడంబడుచున్న రాజ్యము. కర్మాగారములు, యంత్రశాలలు విరివిగఁ గలవు. ప్రభువునకు సింధియా యని బిరుదము కలదు. ఈయన మహారాష్ట్రుఁడు. రాజధానియగు లష్కరుపురమును, ప్రధాననగరమగు గ్వాలియరు పురమును, నుత్తరహిందూస్థానమంతటియందు సంగీతమునకుఁ బేరందినది. గ్వాలియరు పర్వతదుర్గము. ఇది చాల బలమైనదని ప్రతీతి కలదు. [గ్వాలియరు చింత చెట్టు ఆకు చూడుఁడు.] విక్రమార్కమహారాజునకు మాళవదేశమున [ఆదిని] రాజధానిగనుండి పండితులగు వరాహామిహిరాచార్యాదులకు [విక్రమార్కమహారాజాస్థాన నవరత్నములు చూఁడుడు.] నివాసమై, ప్రథమజ్యోతిషాలయముం గల్గియుండిన నుజ్జయినీనగరమును, మహమ్మదీయుల కాదేశమున వారికాలమున రాజధానియైయుండిన మండూపురమును, గ్వాలియరుసంస్థానఁపు హద్దులలోనే యున్నవి.

భూపాలరాజ్యము—ఇది తొల్లింట 'భోజపాల' మని పోల్చుచున్నారు. ఇప్పటిప్రభుకుటుంబము మహమ్మదీయులు. లోకప్రసిద్ధమగు సాంచి (బౌద్ధ) స్థూప మీభోపాల రాజ్యములో నున్నది.

రీవాసంస్థానము తొల్లింటి రేవారాజ్యము. ఈరాజ్యమునందే మేఖలపర్వతో పరిభాగమున జన్మించి రాజ్యముగుండా ప్రవహించునర్మదానదికి రేవానది యనియుఁ బేరు కలదు.

పన్నాసంస్థానము—తొల్లింటి పేరు (పున్నా లేక పూర్ణరాజ్యము).

ఓర్ఛాసంస్థానఁపు రాజధానియగు ఓర్ఛాపురమున జహాంగీరుచక్రవర్తి కొక నివాసభవనముండెనట.

తెహిరీసంస్థానమున కీపేరుండె నందురు. సెంట్రలిండియా సంస్థానములలోఁ బెక్కులు రాజపుత్రస్థానసంస్థానములుకన్న నవీనముగ మొగలై రాజ్యపాలనమునను, మొగలై మహారాష్ట్రసంధి కాలమునను, నేర్పడినవి. వీటిప్రభువులు మహారాష్ట్ర

## సెంట్రల్తురుష్కస్థానము:—

(మధ్యతురుష్కస్థానము చూడుఁడు).

## సెంటిగ్రేడుతెర్మోమీటరు:—

(శీతోష్ణములంగొలుచు యంత్రముఁ జూడుఁడు).

**సెంటు ఎల్మోస్ ఫైర్** (St. Elmo's Fire):— ఇది 'ఎలక్ట్రికల్ డిస్చార్జి' యని పోల్పఁ బడినది. ఉఱుములు, మెఱుపులు గలవేళలందు, తుపానువేళలందు, వాతావరణమున కూడ చావలు, జండాకొయ్యలు, గొప్పవృక్షములు మొదలగువాటి నడుమప్రదేశముల నెలక్ట్రికల్ డిస్చార్జివలనఁ గన్పించెడి యగ్ని యించుక లేతదగు వెలుతురుతో సంభవించెడిని.

**సెంటు ఏంతోనీఫైర్** (St. Anthony's fire):—ఇది శరీరము వాచు యొకరోగము. క్రీ. పదునొకండవశతాబ్దమున నాంగ్ల సీమలందుఁ గనపడి వ్యాపించెనట. అత్తఱి 'St. Anthoney' యను స్వామిం బ్రార్థించుటంజేసి నివారణ మయ్యెనట.

**సెంటుగోతర్డు టన్నెల్** (St. Gothard tannel):— ఇది స్విజర్లాండు దేశమునుండి యిటలీదేశములోని లీగు నినుపదారిబాటపై నున్న పర్వతముం దొలచి యేర్పరచిన టన్నెలు మార్గము. దీని నైరోపాదేశస్థులు 'One of the greatest of engineering feuts' అనియెదరు. ఈసెంటుగోతర్డుఇనుపబాట నిర్మాణమున కొండలోవలను, నదులను, దాటుటయు, టన్నెల్సు గుండా నడుచుటయు, పయనమొనర్చువారికి వింత గొల్పుటయు, నిర్మాతలకు గొప్పకష్టమని యొప్పకొనక తప్పదు.

టన్నెల్సుగుండా బండ్లు పరువిడుతరి పారన్హీటు తెర్మోమీటరు ౫౫ డిగ్రీలకడ ప్రారంభమైనది 23 డిగ్రీలవఱకు లేచుటయు, ఎనీరోయిడ్ బారోమీటరు (aneroid barometer) రెండువేల యడుగులయెత్తునుండి మూఁడువేల యేఁడువందల యెనుబదియా రడుగుల యెత్తునకు లేచుటయు, కంపసుముల్లు దక్షిణమునుండి తూర్పునకు, తూర్పునుండి యుత్తరమునకు, నుత్తరమునుండి పశ్చిమమునకు నటనుండి తిరుగ దక్షిణమునకుఁ దిరుగుచుండ నీటన్నెల్సునందుఁ జూడఁదగిన వింతలుగ నుండును.

ఈయేబదిమైళ్ళమార్గమునందు ముఖ్యమగు టన్నెల్సు రెండుగలవు. అందొకటి చిన్నది, రెండవది పెద్దది. అది తొమ్మిదిన్నరమైళ్ళు. అంధే యీ బాటయందలి యెత్తగుతావు. అనఁగా పైఁజెప్పఁబడిన 3౭౮౬ అడుగుల యెత్తునకు లేచుట కలుగుచు. ఇది యింగ్లీషు ఎనిమిదంకెనుబోలి (8) యుంట కంపసుయంత్రి మన్ని దెసలకుఁ దనముల్లును దిప్పుచుండును. ఇది ప్రపంచమందలి పెద్దటన్నెల్సులలో రెండవదిగ జెప్పఁబడినది. (సింప్లన్ టన్నెలు చూడుఁడు, టన్నెల్సు చూడుఁడు).

క్రీ. వె. ఆరవశతాబ్దమున సీనడకమార్గము వాడుకయం దుండినటులను, పందొమ్మిదవశతాబ్దమున బండ్లబాట వేయఁబడినటులను, ౧౮౭౨ మొదలు ౧౮౮౨ లలో నినుపబాట వేయఁబడినటులను జెప్పఁబడినది. ఇది స్విజర్లాండులోని లూసెర్న్ పురమునుండి యిటలీలోని మిలాన్ వఱకు నైయున్నది.

**సెంటుజాన్సు [ఆర్డరు] సంఘము**:— దీని నాంగ్లమున St. John's of jerusalem అని యందురు. ధర్మపరోపకార సంస్థ. క్రీ. వె. ౧౦౪౮ లో జెరూసలెమ్ నగరమున స్థాపింపంబడి క్రైస్తవయాత్రస్థుల రక్షణకార్యము లొనర్చుచుండినది. ఇప్పుడు యుద్ధములందు గాయపడినవారల కాస్పత్రికరుగనున్న యితరరోగులకు నుపయోగించు St.Jhon's Ambulence associations గాఁ బనిచేయుచున్నది. క్రైస్తవ సంస్థల వశమై యున్నది.

**సెంటు బెర్నార్డు** (St. Bernard):— ఈపేరు వహించిన శిఖర మాల్ప్సుపర్వతములం దైరోపాఖండమున నున్నది. ఆప్రాంతములం దాల్ప్సుపర్వతములం దాఁటి యివ్వలవ్వల కరుగుటకు రెండుకనుమమార్గములు గలవు. అందు పెద్దదియగు మార్గము స్విజర్లాండులోని 'వలాయిస్' అనంబడుతావునుండి యిటలీలోని కరు

గును. దీని యె త్తెన్మిదివేల యడుగులుండునట. ఈమార్గమునందే సుప్రసిద్ధమగు హాస్పిస్ [హాస్పిస్ చూడుఁడు]. సెంటు జెర్నార్డు మోనోస్ట్రి [మఠ] మున్నది. దానిని క్రీ. వె. పదియవ శతాబ్దమున నిర్మించి రందురు.

రెండవ [కనుమ] మార్గమునకు లిటిల్ సెంటు బెర్నార్డు మార్గ మని పేరు. ఇది గ్రెయన్ఆల్ప్సును దాఁటును. ఇది యేఁడువేల యడుగులయెత్తున బోవుమార్గము. దీనియం దొక నక్షత్రశాలయు, నొక హాస్పిస్ మఠమును గలవు. రోమనుల యధికారకాలమునం దీరెండు కనుమమార్గములు వాడఁబడుచుండునటుల నిదర్శనములు కలవు. ఈ ప్రాంతములనుండియే పేరందిన mastiff కుక్కజాతికి సెంటుబెర్నార్డుకుక్కలని పేరు. చాల తెలివితేటలుగలజాతి. మంచునందు మనుష్యులవాసన పసిఁబట్టఁగలవు. అడుగులజాడంబట్టి యరుగుచు మంచునందుఁ గప్పఁబడినవారలను రక్షించుచుండు శక్తి కలవట.

## సెంటుమో్ౕరిజ్ వినోదస్థలము:—

స్విజర్లాండుదేశఁపుఁజెంగేడై నునందు,కోయరీనుండి ౨౭ మైళ్ళదూరమున సముద్రఁపునీటిమట్టముపై నాలువేలయడుగుల యెత్తుగలప్రదేశమునం దేర్పఱుపంబడిన వినోదస్థలము (Pleasurs resert). అందుఁగల నీటియూట [mineral springs] లనేకరోగములం గుదుర్చుచున్నవి. శీతకాలవినోదములకుఁ దావుగ నాటలాడుచుందురు. [స్విజరాండు దేశము చూడుఁడు.]

## సెంటు లారెన్సునది:—

(అమెరికా గొప్పజలమార్గము చూడుఁడు).

## సెంటులేగెర్ గుఱ్ఱపుఁబందెములు:—

ఇంగ్లాండుదేశమునందు Doncuster లోని పార్కుహిల్ మైదానమున క్రీ. వె. ౧౭౭౬ లో కల్నెల్ సెంటులేగర్ గారిచే స్థాపింపఁబడి జరుగుచున్న గొప్ప యింగ్లీషుగుఱ్ఱముల పందెము.

## సెంటువాలంటైన్ ఋషి (St. Valentine):—

ఈమహాత్ముఁడు క్రైస్తవమతమందుఁ జెప్పఁబడినబోధకులలో నొకఁడు. రోమక చక్రవర్తియగు రెండవక్లాడియస్ కాలమున నాయనయాజ్ఞమేరకు బందె (నిర్బంధ) నివాసమనుభవించుచుఁ దనబోధనాశక్తివలనఁ గారాగారాధికారిని (జైలర్) తనక్రైస్తవమతమునఁ గల్పెను. ఆయన కఱ్ఱలచే బాదఁబడి, శిరచ్ఛేద మొనరింపఁబడెనని చెప్పఁబడినది. ఫిబ్రెవరినెల పదునాల్గవదిన మామహాత్మునారాధించు దినము.

ఎటులనో సరిగాఁ దెలియరాకున్నను, నీఋషిని మన్మథునితోఁగల్పి యారాధించుచున్నారు. ఇది విచిత్ర మనిపింపకపోదు. ఆదిని రోమక సామ్రాజ్యకాలమున ఫెబ్రువాటాజూనో యనుపేరుగల దేవతకడ, నామెయుత్సవమునాఁ డనురాగవతీ యనురాగవంతులపేర్ల నొకపెట్టెయం దుంచువారట. అమె Roman godess of Love గాఁ జెప్పఁబడినది. కాని యీసెంటువాలంటైనునకును, ఫెబ్రువాటాజూనోదేవికిం గలసంబంధము దురూహ్యముగా నున్నది.

## సెంటుహెలీనాద్వీపము:—

ఆఫ్రికా ఖండమునకుఁ జెందిన పంద్రెండుద్వీపములు చూడుఁడు.

## సెంబిలాస్ట్రేటు:—

ఇది ఫెడరేటెడ్మలేస్టేట్సులోనిది.

[మలెయాదేశము చూడుఁడు.]

సెకండు ఎడ్వెంటు:—క్రీస్తుప్రభుపుభూమి పైన పునర్దర్శనమిచ్చునను క్రైస్తవమతసిద్ధాంత మొకటి కలదు. దానిని నమ్మువారలను 'ఎడ్వెంటీస్టు' లని వాడెదరు. అట్టివా రట్లు సెకండెడ్వెంటుకాల మతిసమీపముగనే యున్నదని చెప్పచుందురు.

సెక్టిలియన్:—
[న్యూమరికల్సు చూడుఁడు.]

సెకెండు క్లాసు పేపరు (Second class paper):— వాణిజ్యసంబంధపరి భాషాపదము. హుండీలు, నోట్లు, మొదలగువాట్లకు మితమగు స్థితిగతులుగలవారు హామీయుండిన వాట్ల కీపేరును వాడుదురు.

సెక్సెటు (సెక్సెంటు) ము:—(తురీయ, షడంశ, పరిశోధకసాధనములు చూడుఁడు. హైకోబ్రాహి పరిశీలకుఁడు చూడుఁడు.)

సెక్యులారిజమ్ (Secularism):— మతము, ఆచారములు - నను విధానమును త్రోసివేసి 'మానవధర్మము - విధి' అనువాని ననుసరించి మానవసేవ చేయుసిద్ధాంతము.

సెక్యూరిటీ (హామీ, తనఖా, పూచీ) (Security):—వాణిజ్యపరిభాషాపదము. పూచీ, హామీ యని యర్థము. వాట్ల realization కు హామీకలదనియు, భయములేదనియు నర్థము. హామీ లేక కుదువఁబెట్టిన యాస్తి, గల్గియుండి, అప్పిచ్చినవానికి 'Secured creditor' అని వాడుదురు.

సెక్టేరియనిజమ్ (Sectarianism):— Sect అనఁగా ఒకకులము లేక యొకమోస రు ఊహలు, నాచారములు గల సంఘము. మానవలోకము నొకేదృష్టితోడను, సమభావముతోడను, జూచుకొనక సంకుచితముగఁ గులములను, సంఘములనుబట్టి తారతమ్యముతోఁ బ్రవర్తిల్లుట సెక్టేరియానిజ మనఁబడును.

సెటల్మెంటు [పైసలాతీ]:—వాణిజ్య సంబంధపరిభాషాపదము. Settlement పైసలాతీ తకరరు తీర్చుకొనుటయని యర్థము. అప్పు తీర్చివేయుట, తగాదాకల్గినవ్యాపార ముభయసమ్మతముగా పైసలుచేసికొనుట. Stock Exchange తగాదాలకుఁ గడపటిమూఁడుదినములకు గనులవ్యాపారసందర్భమున నేర్పఱుచుకొనిననాల్గు దినములపనులకు నీపేరు వర్తించెడిని. మఱియు Stock Exchange లెక్కలసందర్భమునఁ గడపటిదినమును 'Settling day' అనుచున్నారు.

సెడ్లిజ్ [లేక సెడిలిటీ](Seidlity) పొడరు :— ఇది పై మూఁడువిధములుగఁ బలుకంబడుచున్న యౌషధము. ఆంధ్రదేశమున 'సుఖవిరేచనకారి' యని పేరందినది. దీని నాలోపతీవైద్యులు Laxative జాతి యౌషధ మనెదరు.

బొహీమియా దేశమునందుఁగల Seidlity గ్రామమునఁగల mineral spring నందలి యుదకములం దీగుణముండుటంజేసి యందుకె వాడఁబడుచుండెను. పిదప బుద్ధిశాలుర కృతకముగ నీయౌషధముం గనిపెట్టి, యానీటిగుణమే గలదిగ వాడుకలోనికిఁ దెచ్చి దానిపేరే యిడిరి.

ఇది చూర్ణములతోఁ జేయఁబడినది. ఇందు Tartarated soda యును, Potash ను Sodium-bi-carbonate ను, కలిసి యొకచూర్ణమును, Tartaric acid చూర్ణమును, రెం

కుపొట్లములుగ నమ్ముదురు. అందు మొదటిది ఊదాకాదితమునను, రెండవది తెల్లకాగితమునను, పొట్లములం గట్టుచుండుట యాచారమై యున్నది.

గోరువెచ్చని నీటియందు మొదటిపొట్లమును కరఁగించి, పిదప రెండవదాని నందుఁ బోసి పొంగుచుండుతరి త్రాగివైచెదరు. ఇది రెండు లేక మూఁడు సుఖవిరేచనములం గల్గించెడిని. రొంప, మలబద్ధము, లివరు డిజార్డరులం దిది చక్కఁగఁ బనిచేయునందురు. భోజనమునకు ముందరగంటలో దీనిని సేవింపఁ దగునని చెప్పఁబడినది గాని యుదయముననే సేవించిన గంటకు విరేచనములగునని వాడుకగాఁ జెప్పుచుందురు.

## సెనగలవ్యవసాయము:—

భరతదేశమున ననాదిగ నీపంట కలదు. సంస్కృతమున 'ఛణక' యనంబడుపదమున కాంధ్రమున సెనగ యని యేర్పడియెను. గ్రీసుదేశమున హోమరుకవి నాఁడును, ఈజిప్టుదేశమున క్రీస్తుశకమునాఁటనుండియుఁ గలదని తెలిసెడిని.

సెనగలందు నలుపు, పశిమి, తెలుపు, గవర వర్ణముగల నాల్గుభేదములు కలవు. తెల్లసెనగలను కాబూలుసెనగలనియు నందురు. లోతుగల నల్లరేగడిభూములు శ్రేష్టములు. తక్కినవాటియందుఁగూడ పైరగును. సెనగమొక్క కొమ్ములువేయునదనున ననఁగా మూఁడుమొదలైదంగుళములపొడవుగ నెదిగినతరి తలం గిల్లివేతురు. తోడన మొక్క యెదుగుటకు మారుగ బలిసి యధికముగ కాయలం గాచును.

సెనగయాకునందుఁ బులుపుపదార్థము కలదు. మంచు బాగుగఁ బడుకాలమున మనదేశములఁ జక్కఁగఁ బెరిగిన సెనగచేనులపై సన్నని తెల్లబట్టలం బఱచి గట్టిగఁ బిండి పుఱచి యాతడిం బీల్చుకొనగనే పిరుగఁ బిండుకొని సెనగపులుసును సంగ్రహించుకొందురు. ఇది వైద్యమున కుపయోగించెడిని.

ప్రత్యేకముగ సెనగచేలనే వేయుటయేగాని వరికోసినపిదప సెనగలు జల్లుటయుం గలదు. ఇది మైనునెలలపంట. యకరమునకు ౫౦౦ పౌనులు మొదలు ౬౦౦ పౌనులపంట నిచ్చును.

## సెన్సరిష్ప్ లేక సెన్సర్ [Censor ship or Censor]:—

యుద్ధకాలములం దపాయముఁ గల్గించునట్టియు నపాయకరమగునట్టియు వార్తలను, నుత్తరప్రత్యుత్తరములను, బొమ్మలను, పటములను, ప్రభుత్వమువారు సోదాచేసి యనర్హములుగఁ దలపఁబడినవాటిని నాశనముఁ జేయుచుఁ దక్కినవాట్లను రవానా చేయుచుండు నేర్పాటునకు 'సెన్సర్' అనియెదరు.

బ్రిటీషుదేశమున నాటకములు, ప్రదర్శనములు, లార్డుచాంబర్లిను, ఉద్యోగులచే పరిశీలింపఁబడి యంగీకరింపఁబడవలసియుండును. దీనిని 'సెన్సర్' అనియెదరు. ఇట్టిపని కొకబోర్డును సర్వదాయుండుటకు, ఐర్లాండు ఫ్రీస్టేటువా రిటీవల క్రీ. వె. ౧౯౨౯ వ సంవత్సరమునుండి యేర్పరచిరట.

## సెనిగల్ గమ్ (Senegal gum):—

అద్దకపుఁ బనిలో నుపయోగించు నొకవిధమగు జిగురు. (కలంకారి పరిశ్రమ చూడుఁడు)

## సెనిగాంబియాదేశము:—

ఆఫ్రికా ఖండమున నాఫ్రికా పశ్చిమభాగమున, పశ్చిమాఫ్రికా యనంబడు దేశములోని ఫ్రెంచి సెటల్మెంటగు సెనిగాల్ సెటల్మెంటులోని దేశము.

సెనిగాల్, గాంబియానదులజలములు ప్రవహించు దేశముగాన నిట్లు పేరిడఁబడినది. ఇది ఫ్రెంచిసౌడాన్ దేశమువఱకుఁ గల హింటర్లాండంతయు నిందులోనే చేరియున్న దనుచున్నారు. (ఆఫ్రికా, పశ్చిమ ఆఫ్రికా చూడుఁడు).

సెనిగాల్ నదీముఖద్వారముకడనున్న సెంటు లూయిస్ పురము ప్రధానకార్యస్థానము. జిగురు విస్తారముగా నెగుమతి చేయఁబడుచున్న రేవు. కేపువెర్డ్లాకడనున్న 'గోరే' పట్టణము మఱియొక రేవు.

## సెన్సెబిల్ హారైజన్ (Sensible horizon):—

(భూవలయరేఖ చూడుఁడు).

## సెన్సెషను:—

(చైతన్యము చూడుఁడు.)

**సెన్సెసు (Census) జనాభాలెక్క:**— జను లెంతమంది గలరో యాసంఖ్యను కొంత కాలమున కొకతూరి లెక్కించుకొనుచుండుట 'సెన్సెను' (Census) అనఁబడుచున్నది. ఇది యనాదిగ ప్రపంచమందలి వేర్వేరుదేశముల వేర్వేరువిధముల జరుగుచుండెను. నాగరిత యేనాటినుండిగలదో యానాటినుండియు జనాభాకూడ జరుగుచుండెనని తెలియుచున్నది. భరతదేశమునందు, పూర్వమునుండియు నిది కలదు. దీనిని ప్రభుత్వములే జరిపించుచుండుట యాచారమై యున్నది. క్రీ. వె. 1800 సంవత్సరమున బ్రిటీషు పార్లమెంటు సెన్సెసునుగురించి శాసనమొనర్చెను. 1801 సంవత్సరము మార్చినెలలో మొదటిబ్రిటీషుజనాభా జరిగెను. అప్పు డెన్నోకుటుంబములు, మనుష్యులు, లెక్కవ్రాసిరి. క్రీ. వె. 1871 వఱకు నట్లే నడచి, యాసంవత్సరమున బ్రిటీషు సామ్రాజ్యమంతటను జనాభా జరుగునట్లు శాసనము వ్యాపింపఁ జేయఁబడి, పదిసంవత్సరముల కొకసారి జనాభా నడుచుచున్నది. మొదటి భారతీయ సర్వసాధారణజనాభా బ్రిటీషుపరిపాలనక్రింద 1881 సంవత్సరమున నడిచెను. అందు నేపాళ కాశ్మీరదేశములు చేరియుండలేదు. గాని 1853 నందే యొకవిధమగుజనాభా ప్రోవిన్షియల్ ప్రభుత్వములు నడపినట్లుఁగూడ నిదర్శనములు గాన్పించుచున్నవి.

బాబిలోనియారాజ్య ముండినకాలమున నన్నగా క్రీ. వె. 2000 సంవత్సరములనాఁడే మనుష్యులంగూర్చియు, వ్యవసాయముంగూర్చియు, భోజనసామగ్రుల నిలువంగూర్చియు, పశుగణములు మొదలగుజంతుజాలముంగూర్చియు జనాభాలు జరుపఁబడినట్లుఁ దెలియుచున్నది.

పారసీకము, చీనాదేశము, ఐగుప్తుదేశముల జనాభాలనుగూర్చి తబిసీళ్ళు తెలియకున్నను, జరిగినట్లు మాత్రము చెప్పుట కేయాటంకమును లేదు. ఇది వేర్వేరువిధములుగ జరిగియుండనోపు. రోమక సామ్రాజ్యమునServiuslullinsచక్రవర్తి నాఁడు జనాభా చక్కఁగ నైదేండ్లకొకసారి జరుగుచుండెనట. ఇది క్రీ. ము. 478 ప్రాంతము. Augustus చక్రవర్తి రోమక సామ్రాజ్యమంతటను జనాభా జరుగవలెనని శాసించినవాఁడు. అది క్రీ. ము. అయిదవశతాబ్దము. క్రీ. వె. 1086 లో నింగ్లాండులోఁ దాను జయించిన భాగములలో ప్రజలంగూర్చియు, వారియాస్తులంగూర్చియు, విలియమ్ ది కాన్కరరు (Willam the Conquerar) భూపతి శాసనము మేరకు ప్రభుత్వోద్యోగులచే వ్రాయఁబడుచుండి Do-

mes day book అనులెక్క census యొక్క ఫలితమేయని తేలుచున్నది.

'New France' అనఁబడున మెరికాఖండపు Canada దేశములోని భాగమున క్రీ. శ. 1665 నాఁ డుండిన ఫ్రెంచికోలనీ, కుటుంబముల మనుష్యులం గూర్చి యొకజనాభా జరిపిననిదర్శనములు గలవు. బ్రిటీషు పార్లమెంటునందు క్రీ. శ. 1753 లో నేటేట నొకజనాభా జరుపుట కొకబిల్లు ప్రవేశ పెట్టఁబడెను గాని, జనసామాన్య మిష్టపడక తిరుగఁ బడుటచే కామన్సుసభవారి యంగీకారమును పొందినను, ప్రభువులసభవారిచే నిరాకరింపఁబడి త్రోసివేయఁబడెను.

బైబిలుగ్రంథమున పాలస్తినాదేశపు జనాభా లనుగురించి వేఱువేఱు జాతులు, వారియుద్ధ బలము, మొదలగుసంగతులు జనాభా జరిగిన నిద ర్శనములు గాన్పించుచున్నవి. దావీదుభూపతి యొక్కయుత్తరువుల మేరకు జోయాబ్ అను నుద్యోగి నడిపిన జనాభాగూర్చినప్రశంస బైబి లునఁ గలదు. చంద్రగుప్తమహారాజు పాలనమున మౌర్యసామ్రాజ్యమంతటను బ్రజల కులగోత్ర నామవృత్తులు స్త్రీపురుషభేదములతో వారి యం దాయవ్యయములను గూడఁ దెల్పు జనాభా లెక్కల వ్రాఁత జరిగినట్లు గొన్నినిదర్శనము లిటీ వల బయల్పడినవి.

**సెనోటాఫ్ (Cenotaph):—** ఒకనియొక్క గాని, కొందఱియొక్కగాని జ్ఞాపకార్థము వారి మృతికిఁ బిదప నిర్మింపఁబడు కట్టడఁపుఁబని. ఇది నిలువున నొకప్రత్యేకమగు నాకృతిం గల్గియుం డును. తఱుచుగ యుద్ధములందు మృతులైన వారింగూర్చి కట్టఁబడుచుండు జ్ఞాపకకట్టడము. ఇట్టికట్టడములందు పెద్దదియు, నుదాహరణముగఁ జెప్పఁదగినదియు, లండనునగరమున వైటుహాలు కడఁ గలదు. అది యైరోపామహాసంగ్రామమున మృతులైనవారి జ్ఞాపక చిహ్నముగ క్రీ. శ. ౧౯౨౦ సంవత్సరమున నిర్మింపఁబడినది.

**సెప్టిలియన్:—**
(న్యూమరికల్సు చూడుఁడు.)

**సెమియొలజీ (Semiology):—** ఔషధ చికిత్సయం దొకభాగము. (రోగ) చిహ్నాలనుబట్టి చికిత్సచేయువిధానము.

**సెమికోలన్ (Semicolon):—** ఇదియాం గ్లభాషాసాంగత్యమున నాంధ్రభాషలోనికి తెచ్చు కొనినగురుతు (;). ఒకవాక్యము [sentence] నం దిమిడియున్న రెండు ఉక్తులనడుమ నుంచఁ బడును. కామాకన్న నెక్కువబలముఁ గలది. ఒక వాక్యమందుఁ జెప్పఁబడిన రెండుసంగతులందుఁ గల సంబంధమును సూచించునది.

**సెమెంటు (Cement):—** దీని ననేకవిధ ములుగఁజేసిన యనేకభేదజాతుల సెమెంట్లు కలవు. పాలుగూర్చి దంచి యాడినసున్నమునకన్న ననేక విధములుగ జిగిగలదియై రాతిపనియందుఁగాని, యిటుకపనియందుఁ గాని, గిలాబాలపనియందుఁ గాని ప్రశస్తమైనదిగ నుండును.

సెమెంటుతో పాళ్ళంగూర్చి కాంక్రీటును, ఫెరోక్రికాంక్రీటును జేయుదురు. సముద్రఁపుటుప్పు నీటివలనఁ జెడని ప్రత్యేకజాతిసెమెంట్లు కలవు. బొమ్మలంజేయ నుపయోగించు సెమెంటుజాతు లును గలవు. ఇది కొన్నిగంటలలో నంటుకొని బిగిసికొనునుగాని, శాశ్వతముగ బిగిసి గట్టిపడుట కొకసంవత్సరము కావలసి యుండుననియు, దాని

సంతదనక తడపుచు తడిచుచుట యావశ్యక మనియుఁ జెప్పఁబడినది.

**సెమెటిక్కులిపి:—** నాగరికతనందియున్న సమస్తలిపుల కిది తల్లిగాఁ బాశ్చాత్యు లనెదరు గాని, హిందూదేశమందలి లిపులు దీనిసంబంధములు కానేరవు. సెమెటిక్కులిపి పురాతనమను టకు సందేహము లేదు. సెమెటిక్కుభాష నుపయోగించినవారే దీనికిఁ గర్తలు గానోపు. ఈజిప్టు దేశపుఁ జిత్రలిపి దీనికి మూలాధారమనియు, క్రీ. పూ. ౨౦౦౦–౧౦౦ మధ్యకాలమునం దేర్పడి యుండుననియు పరిశీలకు లనెదరు. ఇం దిరువది రెండువర్ణములు కలవు. అన్నియు హల్లులే. అచ్చు లిందు లేనే లేవు. కుడినుండి యెడమ కిది వ్రాయుచుండిరి. సుప్రసిద్ధమగు మోబైటు రాతి శాసన మీభాషలోనిది. పాలస్టినాదేశప్రాంతముల ఢీబానను గ్రామముకడ నొకక్రైస్తవమతాచార్యున కిది దొరకెనట. దాని నాతని కీయక టర్కీవారు, నరబ్బీలు తగవులాడుచు దానిని బగులఁ గొట్టిరట. పిదప నెవ్వరో దాని నతికి చదువ మోఆబ్ ప్రభువగు మేషా యనునతఁడు వ్రాసినట్లు తేలినదట. ఈతఁడు సోలోమోన్ భూపతికి సామంతుఁడు గాన క్రీ. పూ. ౧౦౦ నాఁటిదై యుండును. అది యిక్కాలమున ఫ్రెంచివారివశమై పారిస్ నగరమునం దుంచఁబడియున్నది. ఫోనీషియాలిపి దీనినుండి యేర్పడినదియే. (ఫోనీషియాలిపి చూడుఁడు.)

**సెమోలీడీస్ తెగప్రజలు:—** వీరు ఎస్కిమోజాతివారు. వీరిస్వభాషయందు తమ్ము ను 'సెమోలీడీస్' అనియు, తమదేశమును 'సేమ్' అనియు ననెదరు. (ఎస్కిమో చూడుఁడు).

**సెయింటు (Saint):—** సెయిం టనిన పవిత్రపురుషుఁ డని భావము. ఈపద మించుక భేదోచ్చారణలతోఁ గ్రైస్తవదేశములం దంతటను వాడఁబడుచున్నది. దీనిని సంక్షిప్తపఱచి, St. అని వాడుటయుం గలదు. క్రైస్తవమతధర్మమున మతకార్యమునందు బలత్కారమరణమందిన వారందఱకు సెయింటు లేక సెంటుశబ్దము వాడుట యాదికాలమునుండి సర్వసాధారణమైనది.

క్రైస్తవమతధర్మమునఁ దనప్రాణము దైవారాధన కర్పింపఁబడుట క్రైస్తవులందఱు సెయింటు లని యందురు. క్రీస్తుప్రభువునకు సెయింటుల పరిపాలకుఁడు 'King of saints అనెదరు.

రోమనుకాతలిక్కు క్రైస్తవ మతధర్మమున సెయింటుల నారాధించుటకు 'douleia' అనియు, వర్జినుమేరీదేవి నారాధించుటకు 'Hyper douleia' హైపర్ డౌలియా యనియు, దేవు నారాధించుటకు 'latrua' అనియు నందురు.

**సెయింటు నికోలాస్ [సెంటాక్లాసు]:—** [ఫాదరు క్రిస్టమస్ చూడుఁడు.]

**సెర్టోమేటర్ [Cyrtometer]:—** Curving lines [వక్రరేఖలు] కొలుటకు లేక యవసరమగునేని యంతేవక్రముతో నాలేఖన తిరిగి లిఖించుట [reproduce] మొదలగుపనుల కగుపరికరము.

దీనిని వైద్యులు శరీరస్థితిఁ బరిశీలించుట యందు వాడెదరు.

**సెరఫ్డమ్ (నిర్బంధసేద్య విధానము):—** ఈనిర్బంధవిధాన మైరోపాదేశములందు వ్యాపించి యాదికాలమునం దుండెను. రయితు తనయజమానిభూమిని సేద్యమొనర్చి కొంత

చెల్లించు నేర్పా టుండెఁగాని, యతఁడాభూమిని వదలివేయ స్వతంత్ర్యము లేకుండెను. శిస్తు నగదు రూపమున గాని, పంటదినుసు రూపమునఁగాని చెల్లింపఁబడవచ్చునట. లేక తనయజమానికిఁ బని చేసియైన దీర్పనయ్యెడిదట

రైతును భూమితోసహా మఱియొకరికి యజమాని యిచ్చివేయనగును. రోమనులక్రింది సెరపు రైతుకు యజమానివలన రక్షణనందు హక్కులుండెడివి. ఆంగ్లసీమలందు యజమానికిని, రైతుకును, గలసంబంధములు సరిగాఁదెలియరాకున్నను, గొంచెము హెచ్చుతక్కువగా నిట్లే యుండనోపు నని యనెదరు. క్రీ. వె. ౧౬ శతాబ్దాంతమునకు నిర్బంధమంత మందినదని యనుచున్నారు. స్కాట్లాండుదేశమునఁ బదునెన్మిదవ శతాబ్దప్రారంభము దనుక నుండెనటఁ గాని, యప్పు డొకశాసనము మూలమునఁ దొలగింపఁబడెనట.

ఫ్రెంచిదేశమునఁ గొంత తగ్గినస్థితియం దుండినటుల స్పష్టముగఁ దెలియుచున్ననుఁ గొంతవఱకు నిలచియుండెను. కొన్నితావులం దుండినదిసహా రివొల్యూషనుతో నంతమయ్యెను.

ఆస్ట్రియాసామ్రాజ్యమునఁ జక్రవర్తి రెండవ జోసెఫ్‌గారు ౧౭౮౧-౮౨ లలో నొకశాసనపూర్వకమున సెరఫ్డమ్ రద్దుపఱచెఁగాని, దానిని బూర్తిగ లేకుండఁజేయుట ౧౮౩౨ వఱకు నడుచుచునేయుండె నందురు. రష్యాదేశమున క్రీ. వె. ౧౭ శతాబ్దమున నొకవిధముగు సెరప్‌డమ్ ప్రారంభమయ్యెనట. ఇటుల నిర్బంధించుశాసనమే చేయఁబడెనఁట. పోలండునందునను నిందుకుఁ బ్రత్యేకశాసనమే యుండెనట. క్రీమి యన్‌సంగరమునకుఁ బిదప రెండవ అలగ్జాండరు జారుగారు సేరపునిర్బంధనము దొలఁగించి, స్వేచ్ఛ నొసఁగిరి. వారు యజమానులకుఁ బరిహారద్రవ్యమిచ్చియు, రైతులకు భూములనిచ్చి, వారినుండి నజరానాద్రవ్యముం గైకొనియు నరిపుచ్చిరట.

**సెరికల్చర్ [Sericulture] పట్టుపరిశ్రమ:** తొల్లింటనేగాక నేఁటికి నీభరతదేశమునఁ బ్రాముఖ్యతఁ గాంచియున్న పరిశ్రమ. పట్టుపురుగులం బెంచుట మొదలుగాఁగల కార్యము లీవిద్యకుఁ జేరునవి. పట్టుపురుగులు Lepidopterons తెగపురుగులకుం జెందినవి. సమశీతోష్ణప్రదేశములం దెక్కువగా వర్ధిల్లుజాతిపురుగు. ఈజాతి పురుగులకు నాల్గవస్థలు కలవు గాన Complete metamorphosis insect తెగకుఁ జెందిన విగఁ బాశ్చాత్యవిద్వాంసులు వివరించిరి. వీటి గుడ్లు డ్లాముదఁపుఁజెట్టు ఆకులయందుగాని, మల్బెరీ [పూచిక] చెట్లయాకులయందుఁగాని, యాకు క్రిందిభాగమున విస్తారముగఁ బెట్టును. ఈచెట్ల యాకులు పిల్లపురుగుల కాహారముగఁ బనికి వచ్చును. గుడ్లు చాల చిన్నవి. వీటిం బొదగ నక్కఱలేదు. రమారమి పదిదినములలోఁ బురుగులు గుడ్లనుండి బయటఁబడెడిని.

ఈసితియందు వా Larvae stage అనియు, 'Caterpillar stage' అనియుఁ బేరిడియున్నారు. ఈవస్థనున్నప్పుడే యధికముగా నాయాకులం దినక శాఖాహార మొనర్చునవి గాన Herbivorous పురుగుజాతిగ వివరింపఁ బడినది.

పట్టుపురుగునకు మేన రోమము లుండవు. ఆకుపచ్చరంగు. ఈపురుగు లెదుగుచుండుతరి [పామునకుం బోలి] కుబుసములను విడచుచుండును. దాని కాంగ్లమున 'moulting' అని పేరు. మూడంగుళములపరిమితివఱకును నెదుగును. రెండవయవస్థగాఁ జెప్పఁబడినది. [Caterpiller stage].

ఇట్లెదిగి పెరిగినపట్టుపురుగు తనజన్మకార్యముగ నిక విశ్రాంతింగొన నాయత్త పడును.

దానిముక్కుప్రక్కనుండి జిగురుపదార్థ మరుదెంచుట యిప్పటికిం గలదు. ఆజిగురుతీవ గాలితగులుటతో గట్టిపడి దారమువలె నయ్యెడిని. దానిం దనచుట్టు జుట్టుకొనుచు తానందు విశ్రమించుటకగున ట్లొక కాయను నిర్మించుకొనును. దాని నింకను కోశాణంపుంగాయ యనియందురు. ఆంగ్లశాస్త్రవిదులు 'Cucoon' అనియు, 'Chrysallis' అనియుం బేరిడిరి. అందున్నపురుగుయొక్క యవస్థ మూఁడవది. దానికి 'Chrysallis stage' అనియు, 'Resting stage' అనియుం బేర్లు వాడుకయందున్నవి. ఈయవస్థయందున్నపురుగు ఊపిరిఁ దీయుట, భుజించుట, నీరుఁద్రావుట, మొదలగునవి మాని యందు జీవించియుండును. ఆకాలము వఱకు గొంగలిపురుగుం బోలియుండి సన్నఁపుం బొడుగుపాటిదేహ మందమగు సీతాకోకచిలుకం బోలునట్లు మాఱును. శరీరమున రెండునొక్కలేర్పడి, శరీరము మూఁడుభాగములుగ మాఱి, యా ఱుకాళ్ళు, నాల్గుఱెక్కలు (చుక్కలుగల ఱెక్కలు) నేర్పడి, దానిపట్టుకాయం బగులఁదీసికొని పైకివచ్చి యెగురఁగల్గును. ఇది నాల్గవ యవస్థ, ఈయవస్థయందు మగపురుగులుగను, నాడుపురుగులుగను నేర్పాటుఁగల్గెడిని. దీని కాంగ్లమున 'Adult stage' యనియు, 'Butterfly stage' యనియుం బేరిడియున్నారు. ఈపురుగులు రాత్రి సంచరించునవిగాన 'moths' అనియెదరు. పగలు సంచరించవు. మఱియు నాడుపురుగులు గర్భము ధరించి గుడ్లుంబెట్టుటవలన జాతియాభివృద్ధిఁ గాంచుచున్నది.

ఇంక పట్టుపురుగులం బెంచి లాభమందఁగలవారు ముందు విత్తనమునకుఁ గొన్నిటిని మిగిల్చి, తక్కినపట్టుకాయలను వేఁడినీళ్లయందు వైచి, లోనిపురుగులం జంపి కాయయందలి దారమును జాగ్రతగఁ దీసికొనెదరు. అందు వెలుపలిదారమంత శ్రేష్టముగా నుండక 'Waste silk' అనఁబడును. లోనిదారము తెల్లగఁగాని, యించుక యాకుపచ్చధాతువుం గల్గిగాని యుండి, హెచ్చుమూల్యమున కమ్ముడుపోవును. వీటి కనేకరంగులు వైచి బట్టలుగ నేయుదురు.

పురుగులు తమంతటఁదామే కాయలం జీల్చుకొని వెలుపలికి వచ్చినతరి నాకాయలు పట్టుఁదీయఁ బనికిరావు. ఈపట్టుపురుగుకాయలు భరతదేశమునఁ గొన్నియరణ్యములందుఁ దమంతటఁదామే వర్ధిల్లుచుంటఁ గొన్నినదులు వెల్లువవైపాఱుతరి నీపట్టుకాయలు నీటియందుఁ గొట్టుకొనివచ్చుచుండుటఁ గాననయ్యెడిని.

జపాను, చీనాదేశము లిక్కాలమునఁ బ్రపంచమునందలి దేశములలో నెన్నఁదగిన యధికపట్టుపరిశ్రమను నడుపుచున్నవి. సర్వదేశములందుఁ గొద్దిగనో, గొప్పగనో యీపరిశ్రమ వ్యాపించియే యున్నది. పట్టునేతయు నూలునేతవలెనే జరిగెడిని. ఉష్ణమధికముగల్గియున్నకాలమున దారములు తెగిపోవును. గాన నేత నిలచిపోవుచుండును. ఈ పట్టుజాతికిఁజెంది యింతకన్న నధమఁపుజాతి యనంబడిన పొత్తిపంచలపరిశ్రమయు నిట్టిదియే యని యెఱుంగునది.

## సెర్వియా రాష్ట్రము:

— ఐరోపాఖండమునందలి బాల్కనురాష్ట్రములలోనిది. డాన్యూబునదికి దక్షిణమున బల్గేరియా, బోసినియాల నడుమ నున్నది. టర్కీసాంగత్యమునఁ బ్రజలను సెర్బ్సు అనియు, దీనిని సెర్బియా యనియుఁ గొందరనుచుందురు. కొంతకాలము టర్కీప్రభుత్వముక్రిందనుండి రష్యాటర్కీలయుద్ధసందర్భమున నేర్పడిన క్రీ. వె. 1878 బెర్లినుటీటీయందు

స్వతంత్రితంబడసి, వేఱురాష్ట్రముగఁ జేయఁబడినది. డాన్యూబునదిపైనున్న బెల్గ్రేడ్పురము రాజధాని. బలమగుదుర్గ మింటఁ గలదు. ఇది టర్కీ క్రింద క్రీ. శ. ౧౭౮౫—౧౮౭౮ ఉండెను. ౧౮౬౦౦ చతురఁపుమైళ్లునై శాల్యము. (బాల్కనురాష్ట్రములు చూడుఁడు).

సెరోగ్రాఫీ (Cerography):–Engraving by means of wax. or painting with colours mixed with wax.

మైనముతోఁ జిత్రించుకల. మైనముతో maps (భూపటముల) రూపము లొనర్తురు. అనఁగాఁ బర్వతము నెత్తుగను, నదులు, సరస్సులు, సముద్రము పల్లముగను, మొదలగురీతుల నొనర్తురు. మైనముచేయురంగులు తొల్లి యీజిప్టుదేశమున చేయఁబడి వాడఁబడుచుండెడివి. ఇప్పుడును నచ్చటచ్చటఁ గలవు.

జర్మనుభాషయందు 'Keros' అనిన మైనమనియర్థము.

సెల్లర్సు ఓవర్ [Sellers over]:— వాణిజ్యసంబంధపరిభాషాపదము. కొనువారలకన్న నమ్మువా రెక్కువయుండుట. ఒక Stock Exchange వర్తకుఁడు కొన్నవాటాలకు సొమ్ము చెల్లింపక తప్పిపోయినచో వాట్లనుతిరిగి అమ్ముటకీపేరు వర్తించును. ఇట్టితఱిఁ గొంతసొమ్ము నష్టము కల్గుతఱి నానష్టము నాతప్పిపోయిన యాతఁడిచ్చుకొనవలసి యుండును.

సెలాంగోరుస్టేటు:— ఇది ఫెడరేటెడ్మలేస్టేటులలో నొకటి.

(మలెయాదేశము చూడుఁడు).

సెలిబిస్ ద్వీపము (సులభద్వీపము)— ఇది ఓసినియాయందలి మలేశియా ద్వీపసమూహమునకుఁ జెంది, యందలి సుండా ద్వీపములలోనిదై యున్నది. సిలన్ ద్వీపమునకంటె మూఁడురెట్లు పెద్దదనియెదరు. బోర్నియో ద్వీపమునకుఁ దూర్పుదిశగా నుండును.

ఇందు నాల్గుద్వీపకల్పములు కలవు. వాట్లనడుమ లోతగు సముద్రములున్నవి. ధాన్యము విస్తారముగఁ బండును. Edible birds nests-[పక్షిగూడులు] విస్తారముగా చీనాదేశమునకిట నుండి యెగుమతి చేయఁబడుచున్నవి.

ప్రజలకు బూగిస్‌జాతివా రనిపేరు. వారు చాల బలాఢ్యులు. కొంతవఱకు నాగరికులుగనున్నారు. ద్వీపముయొక్క నైరుతిభాగమున 'మెకాస్సార్' అనుతావు డచ్చిప్రభుత్వమువారి రాజధాని.

సెలీనియమ్ (Selenium):— ఇది 'Chemical element' అనిచెప్పఁబడినది. దీని Chemical symbol Se- అనియు, atomic weight 79.2 అనియు, atomic number 34 అనియు, specific gravity 4.26 మొదలు 4.82 వఱకు నుండుననియుఁ జెప్పఁబడినది. ఇది క్రీ. శ. ౧౮౧౭ వ సంవత్సరమునఁ గనిపెట్టఁబడినది. Berzelius అను రసాయనశాస్త్రజ్ఞుఁడు దీనిం గనిపెట్టె నఁట. అద్దపుసామానులకు లేతగులాబీరంగు నిడుట కిది పనికివచ్చుచున్నది.

సెలీనియమ్ సెల్ (Selenium cell):- దీని నింకను 'Photo electric cell' అనుటయుం గలదు. దీనిని 'marvellous inventi. on' అని యున్నారు. దీనింగూర్చి రసాయన

శాస్త్రగ్రంథములందు 'It is so sensitive to light. That it responds to instautly rays of light of defferent intensities and changes them in to electrical impulses of corresponding strength' అని వివరించిరి. దీనియొక్క నిజరహస్యములం బరిశీలించిన, నది దీనిపేరునందే కలదు. సెలీనియమ్ లోహమునందు రెండు విచిత్రలక్షణములు గానవచ్చుచున్నవి. రసాయనశాస్త్రమున నీవిచిత్రలక్షణములు గననగును. The first quality is that is extremely sensitive to light so sens itive that it will react to light waves (which are invesble to human eye-and the second is that it is boath a conductor and also a nonconductor of electricity.) ఈరెండవసంగతియందలి విచిత్ర మేమన మానవదృష్టికగోచరమైనదిగనున్నను, వెలుతురునందు విద్యుచ్ఛక్తిప్రవాహమునకు కండక్టరుగను, ఆవెలుఁగును దీసివేయఁగనే కొన్నిమార్పులకులోనై, నాన్కండక్టరుగను నుండెడిని. నాన్కండక్టరుగా నుండుతరి Stubborn resistance to the passage of electricity గల్గించునని చెప్పఁబడియున్నది. ఈవిపరీతవిచిత్రగుణములు గల్గియుండుకతన వెలుతురుతో సంబంధముగల ఫోటోగ్రాపుకార్యములం దధికయుపయోగకరమై సెలీనియమ్‌లోహము వాడఁబడుచుండుకతన 'ఫోటో ఎలక్ట్రిక్ సెల్' అని దీనికిం బేరయ్యె నందురు.

ఈసెలీనియమ్‌లోహముం గూర్చిన విచిత్రములింకం గొన్నికలవు. ఇది Television నందు, టాకీపిలిమ్ నందు, ధ్వనిని గల్గించు నేర్పాటునందు గూడ నుపయోగింతురని తెలియుచున్నది. తలుపులు దీనిసాహాయ్యమునఁ దీయఁగల్గుదురట. వీధిదీపముల వెలిగించుట, ఆర్పుటలును, రంగులంబట్టి వస్తువులను వేఱుచేయుట, బంగీలను లెక్కించుట, దొంగలు [burglars] వచ్చినతరి ధ్వని [alarm] చేయుట మొదలగుపనులం జేయింపఁగల్గునని చెప్పఁబడినది. సెలీనియమ్ బ్రిడ్జి (selenium bridge) అను పరికరముచే నమర్పఁబడిన విద్యుద్దీపకళికల switch వలన దీపము నార్పుట వెల్గించుటలు చేయనగునంట.

**సెల్టుజ్ వాటరు** (Seltzer water);· ఇది జర్మనీదేశమున లింబర్గుసీమయందు నస్సాప్రాంతముల 'Selters' అనంబడు గ్రామముకడ లభించిన మినరల్‌వాటరు గాన నీపేరందినది. ఇక్కాలమున గ్రేటుబ్రిటను, అమెరికా ఖండములందు కృతకముగఁ జేయంబడుచు దొరకుచున్నది. ఇది ఎరేటెడ్‌వాటరుగ నున్నది. ఆల్కలైయిన్ వాటరుగ బైకార్బనేట్ ఆఫ్ సోడియమ్, కేల్సియమ్, మెగ్నీషియమ్, సల్ఫేటాఫ్, పొటాషియమ్ మొదలగునవి యిందలిభాగము లందురు. ఇది స్థిరపడిన యజీర్తివ్యాధులపై జక్కఁగ పనిచేయునట.

**సెల్జూకు నృపులు**:— వీరు టర్కీసంబంధులు. క్రీ. వె. ౧౧—౧౨ శతాబ్దములలోఁ బశ్చిమఆసియాదేశభాగములను బాలించినవారు. వీరి మూలపురుషుఁడగు సెల్జూకుగారినుండి పేరందినవారు. ఆయన క్రీ. వె. ౧౦౦౦ సంవత్సరములనాఁడు ఘుంజ్ తెగటర్కులను సైన్యముగఁ గూర్చుకొని, యుత్తరమునుండి బోఖారావఱకు దండయాత్ర సల్పినవాఁడు. ఆయనమనుమఁడు ౧౦౩౯ లో ఖురాసాను నాక్రమించి, క్రమముగఁ బారశీకదేశమును జయించి, జూర్ఘుల్, బాగ్దాదులను ౧౦ ౫౫ ప్రాంతమున నోడించి అబ్బాసైడు

కలీఫాలకు రక్షకుఁడై మహమ్మదీయమత పూర్వాచార సాంప్రదాయమునకుఁ బాలకుం డాయెనని ప్పఁబడినది.

క్రీ. వె. ౧౧ శతాబ్దమున సిరియాదేశమును, ఆసియామైనరును వీరికి వశమాయె నట. పిదప సెల్జూకులసామ్రాజ్యము కారునుండి డార్డనెలీసు దనుకను, కాక్సనుండి యరేబియాదనుకను వ్యాపించియుండెనందురు. మాలీషా యనుపేరుగల ప్రభువు మరణించినపిదప రాజ్యమందలి పశ్చిమ భాగము విడిపోయి, కొన్నిస్వతంత్రరాజ్యములుగ నేర్పడెనట. అందు ముఖ్యమైనది రూమ్ దేశఁపు సుల్తాన్ రాజ్యము. దానిరాజధాని ఇకోనియమ్ పురము. చక్కనినాగరికత కున్కిపట్టయి యుండెనని చెప్పఁబడినది. అది క్రీ. వె. ౧౩౦౦ లలో ఉత్మాన్ (ఓటోమాన్) తురుష్కులు ప్రబలువఱకు నిలిచియుండెనఁట.

పశ్చిమసెల్జూకులను సిరియానుండి యీజిప్టు దేశాధిపతియగు సల్లాదీన్ తరిమివేసెనని చెప్పంబడినది. వీరియందుఁ బ్రధానశాఖ హమాదాన్ రాజధానిగ నేలుచుండిరి.

## సెల్యూకసునెక్టారు:—

[మగధరాజ్యము చూడుఁడు.]

## సెల్యూలోయిన్ సెల్యూలోయిడ్ పదార్థములు:—

కాగితము చెట్లయందలి గట్టిపదార్థమునుండి చేయంబడును. దాని కాంగ్ల రసాయనశాస్త్రమున 'సెల్యూలోయిన్' [cellulouse] అనిపేరు. అందు నైట్రికాసిడు కొంత చేరినచో నపాయకరమైనపదార్థములలో నొకటి యయ్యెడిని. ఇంక నిట్టిపదార్థముతోఁ చేయంబడిన కాగితములు వెజిటెబిల్ పేటరుం (Vezitable matter) గల్గి, కార్బన్ హైడ్రోజెనులు Carbon & hydrogen విస్తారముగను, నించుక అక్సిజెనును తనయందుఁగల్గి, యగ్గిపుల్ల మొదలగు వాటినంటించి వేఁడిచేసినచో గాలియందలిఅక్సిజెనును బీల్చుకొనుచు మండుటకు సిద్ధముగనుండు పదార్థముగ నుండెడిని. అట్టికాగితములకుఁ గొన్ని ఏసిడ్సు చేర్చి వాటిబరమున దానిని క్రొత్త కాంపౌండు [a new compound] గ నొనర్చి వలయురూపములుగాఁ జేసినవే. సెల్యూలోయిడ్ వస్తువులు వేఁడిగనుండుతరి మెత్తగనుండి వంగుచు సాఁగుటయుఁ, జల్లఁబడినపిదప గట్టిపడుటయు దానికిలక్షణములుగఁ దనరెడిని. గాన దాని శరీరతత్వము [Composition] కాగితపుశరీర తత్వమువంటిదే. గాన కాగితముంబోలి యంటుకొనుట కేయాటంకము నుండఁ జాలదు.

## సెలెనోలజీ (Selenology):

జ్యోతిశ్శాస్త్రమునందు చంద్రునిసంబంధమునఁ జేయు భాగము. దీనిని భారతీయ సాంప్రదాయమున చాంద్రమాన మందురు.

## సెలెస్టియల్ ఈక్వేటరు (Celestial Equator):—

Fixed stars (ఫిక్సెడ్ స్టార్సు) నందలి యీక్వేటరున కీపేరు ఎస్ట్రోనామీశాస్త్రమున వాడఁబడినది. (ఎస్ట్రోనామీ చూడుఁడు, ఫిక్సెడ్ స్టార్సు చూడుఁడుడి, క్లినేషన్ చూడుఁడు).

## సెలెస్టియల్ హారైజన్ (Celestial horizon):—

దీనింగూర్చి యిటులఁ జెప్పంబడినది.

If the plane through the observer paralal to the surface of a liquid at rest be produced it will cut the celestial sphre in a great circle. This is called ahorizon.

**సెవెన్‌వండర్సు ఆఫ్ ది వరల్డు ఓల్డుఏజెస్:-**
(ఆదికాలఁపుఁ బ్రపంచమందలి యాపేకాలఁపు గొప్పవింతలు చూడుఁడు).

**సెవెన్ వొండర్సు ఆఫ్ ది వరల్డు మిడిల్ ఏజెస్:—**
(మధ్యకాలఁపుఁ బ్రపంచమందలి గొప్పవింతలు చూడుఁడు.)

**సెవెన్హి ల్సాఫ్ రోమ్:—**
(రోమకపురినిర్మాణచరిత్రఁ జూడుఁడు.)

**సెసియొ బోనోరమ్** (Cessio Bonorum):—వాణిజ్యసంబంధపరిభాషాపదము. వర్తకునకు నష్టములు వచ్చుటవలన నతనికిఁ బరపతి యను మానింపఁ బడెనేని, అతను తనఆస్తుల నప్పులవారికి వశపఱచినటుల యథార్థపఱుపఁ బడినపత్రము. దీని నాధారముగఁజేసుకొని యావర్తకుఁడు తిరుగ వర్తకము చేయుచుండవచ్చును.

**స్కెప్టిసిజమ్** (Scepticism:)— గ్రీకు తత్వశాస్త్రజ్ఞుఁ [Bc 275] డగు పైరో నుడివిన యనుమానభూయిష్ట మగు తత్వజిజ్ఞాస వస్తువు యొక్క యథార్థతత్వము మనకుఁ దెలియఁబడదని యితనిసిద్ధాంతము.

**స్కెలిటోగ్రాఫీ** [Skeletography]:- శరీరశాస్త్రమునం దస్తిపంజరనిర్మాణమునకు సంబంధించినకల.

**స్టెగోమియాజాతిదోమ:**—ఇది మనుష్యులు సంచరించుస్థలములందు నివసించును. నీరు నిలువయగు మురికినీటిగుంటలయందును, పీపాలు, బాల్చీలు, చెట్లతొఱ్ఱలు మొదలగుజాగాలయందు నిది గ్రుడ్లను విడచును. రాత్రియందుకంటె నిది పగటియందే యెక్కువగా సంచరించును. మధ్యాహ్న వేళలందు మోఁకాళ్లపై కుట్టుచుండును. ఇది దగ్గరచేరునప్పుడు ధ్వని చేయదు. కుట్టుటవలన నొప్పికలుగదు. అందు దోమ రక్తపానము చేసిన నాలుగైదుదినములకు గ్రుడ్లుపెట్టును. ఒక్కొకసారి 25-75 దోమగ్రుడ్లను విడుచుచుండును. రెండుమూఁడుదినములలో గ్రుడ్లు దోమలుగా మాఱి తమపరి వెలుపల కేగును. దీనిగ్రుడ్లు నల్లనిగొట్టములవలె నుండును. ఇవి కుళ్లుచున్న సేంద్రియ పదార్థములం దినుచు, శుభ్రమగునీటియందైనను, మలినమగునీటియందైనను, జీవింపఁగలవు. స్టెగోమియాజాతి దోమయొక్క యుదరభాగమందును, కాళ్లమీఁదను తెల్లనిరేఖ లుండును. దీనికొండి సన్నముగా, వంకరగా నుండును. ఆఁడుదోమయొక్క యింద్రియములు కొండికంటె పొట్టిగానుండును. (మలేరియా చూడుఁడు, అంటువ్యాధులు చూడుఁడు.)

**స్టెతోస్కోపు** [Stethoscope]:— జర్మ [illegible] stethos అనిన గుండెలనియు, skopein అనిన లోనికిఁ జూచుటయనియు నర్థములు.



గుండెలు మొదలగులోని యవయవములం బరిశీలించి వాటిస్థితినెఱుంగఁజేయు యంత్రపరికరము. ఇది రెండుగఁ జేయఁబడుచున్నది.

ఆంగ్లవైద్యులు దీనిని తఱచు వాడుచుందురు. Heart Lungs మొదలగు శరీరములోని యవయవస్థితుల నెఱుంగఁ జేయునది. ధ్వనులను జెవులకు వినఁబడఁ జేసెడిని.

స్టెనోగ్రాఫీ (Stenography):— సంక్షిప్తలేఖనమున కేర్పడిన రేఖలసమామ్నాయమునకు సంబంధించిన శాస్త్రము. ఈపనిని 'స్టెనోగ్రాఫీ' అందురు. ఆపరికరమునకు 'స్టెనోగ్రాఫీ' అనిపేరు.

స్టెప్పీస్ (Steppes):— రష్యాదేశమునందు, చెట్టుచేమలులేని సమప్రదేశములకు 'steppes' అనిపేరు.

(Land porteons చూడుఁడు.)

స్టెరియోగ్రాఫీ (Stereography):— ఘనపదార్థములపైఁ జిత్రములను జిత్రించుటను, ముద్రణానుకూలముగాఁగ నొనర్చుటనుగూర్చిన కల.

స్టెరియోస్కోప్ (Stereoxope):— రెండు చిత్తరువుల నొకేసారి యెత్తుటకును, వేఱువేఱుగనున్న రెండుదృశ్యముల నొకేసారి చూచుటకును వీలుగ నుండున ట్లమర్పఁబడిన దుర్భిణీ యంత్రము.

స్టెరిలైజేషన్ [Sterilisation] పరిశ్రమ:— స్టెరిలైజేషనుపద్ధతియొక్క ముఖ్యోద్దేశము పరమాణుస్వరూపముతో నొకవస్తువును అంటుకొనియుండు దుష్టక్రిములను నిర్మూలించుటయే. ఈపద్ధతి నాచరించుటకు వివిధములగు మార్గములు గలవు. ఏమార్గము నవలంబింపవలసినదియు నా వస్తువుయొక్క స్వభావమునననుసరించియు, ఆవస్తువును ముందుపయోగించు ప్రయోజనమునుబట్టియు నుండును. ప్రస్తుత మాచరింపఁబడుచున్న విధానములలో ముఖ్యమైనవి మూఁడు.

1 ఉష్ణప్రయోగమువలన నవలంబింపఁబడు మార్గములు.

2 రసాయనిక ద్రవ్యప్రయోగమున నవలంబింపఁబడుమార్గములు.

3 వడియఁగట్టు మార్గములు.

ఉష్ణత ప్రయోగించు స్టెరిలైజేషనుపద్ధతి:— సాధారణముగా స్టెరిలైజేషను వేఁడిమిని ప్రయోగించియే చేయబడుచుండును గాని, యా పదార్థ మట్టియుష్ణప్రయోగమువలనఁ జెడిపోవు నెడల నీపద్ధతి యుపకరింపఁ నేరదు. కాని యీయుష్ణప్రయోగము రెండువిధములుగాఁ జేయవచ్చును. ఒకటి అగ్నివేడిమి, రెండవది ఆవిరివేడిమి.

అగ్నివేడిమి (Dry Heat):— ఈపద్ధతిలో స్టెరిలైజేషను ఒక్కొక్కప్రక్క రెండేసిరేకులతోఁ జేయబడిన చతురశ్రమాకారము గల యొక లోహఁపుఁ బెట్టెతో నమర్పఁబడిన యొకవేఁడిగాలి పొయ్యిమూలమునఁ జేయఁబడుచుండును. ఆలోహముపెట్టె నొకస్టాండ్‌మీఁదఁ బెట్టి క్రిందను ప్రత్యేకఁపుబర్నరులవలనఁ గాని, మరియేదయిన మార్గమునఁగాని, వేఁడిచేయుచుండవలయును. ఆ పెట్టెకు ముందుభాగమున గుత్తమగుతలు పొకటియుండును. లోపల స్టెరిలైజుచేయఁబడు వస్తువుల నుంచుటకు మూడు, నాలుగు అఱ లమర్పఁబడియుండును. మీఁదిభాగమున వెలుతురు, గాలి, వచ్చుట కొకజాఱుమూఁత యమర్పఁబడియుండును. ఆమూఁతకు రెండుకొట్టము లుండును.

ఆగొట్టములలో నొకదానియందు 2000 వఱకు డిగ్రీలు గుర్తింపఁబడియున్న యొకధర్మామీటరమర్పఁబడి యుండును. రెండవదానియందు జాఱు నటువంటి ప్లాటినంపోయెంటుతోఁ గూర్పఁబడినట్టి యెలక్ట్రిక్ బెల్లు కలిగిన మరియొకధర్మామీటరుండును. ఏటెంపరేచరు కావలసిన నాటెంపరేచరు దగ్గర మ్రోఁగున ట్లాయెలెక్ట్రిక్ బెల్లు ఏర్పాటు చేయఁబడియుండును. ఒకప్రక్క నొక gas regulator అమర్పఁబడి యుండును. ఆరిగ్యులేటరు వలన నాపొయ్యియొక్క టెంపరేచర్ కంట్రోలు చేయవచ్చును. ఈమార్గమువలనఁ జిన్నచిన్న సీసాలు, గాజుబుడ్లు, టెస్టుట్యూబులు, గొట్టములు, గాజుసామానులు మొదలగువానిని స్టెరిలైజు (Sterilise) చేయవచ్చును.

ఆవిరివేఁడిమిపద్ధతి:—— ఈక్రిందవివరింపఁబడిన నాలుగుమార్గములలో దేనివలననైన నావిరివేఁడిమి (Moist Heat) ప్రయోగింపవచ్చును.

1 సెంటిగ్రేడ్ 100౦ డిగ్రీలకు తక్కువయగు నుడుకునీటిలో ముంచుటవలన.

2 100° C డిగ్రీలవేఁడిమి గల యావిరితోఁ గూర్చుటవలన.

3 ఆటోక్లేవ్సుస్టీమ్ అండర్ప్రెషర్ వాడుకచేయుట వలన.

4 శస్త్రవైద్యులు శస్త్రాదులగు తమయుపకరణములను స్టెరిలైజుచేసినట్లు వేడియావిరి నుపయోగించుటవలన.

## స్టెర్లింగ్ (Sterling):——

ఆంగ్లసీమలందుఁ బ్రచారముననున్న నాణెములధనమున నీపేరు వాడుచున్నారు. అనఁగా గ్రేటుబ్రిటనులోని పౌనులు, షిల్లింగులు, పెన్సు మొదలగునవి.

## స్టెర్లింగ్ మనీ [Sterling money]:—

ఆంగ్లదేశఁపునాణెసముదాయమున కీపేరు వాడుచున్నారు. తొల్లింటనీపేరు "Eastrling" (తూర్పునుండివచ్చిన విలువగలలోహము) అని యుండెనఁట. రాను రాను లుప్తపఱుపఁబడి మొదటస్కాట్లండుద్రవ్యము, ఐర్లండుద్రవ్యములు కాని యాంగ్లద్రవ్యమునకుమాత్రము వాడఁబడుచుండెడిదఁట. గాని రానురాను బ్రిటీషుదేశద్రవ్యమని యర్థమగునట్లు వాడుచున్నారు.

## స్ట్రెయిట్వాల్సు [Strait walls]:—

(గోడలు చూడుఁడు.)

## స్ట్రెయిట్ లేక సౌండ్ జలసంధి:—

Strait or sound జలసంధి. రెండు గొప్పజలభాగములం గలుపు సన్నని జలసంధి. (Sea Portion చూడుఁడు.)

## స్ట్రెయిట్సు సెటల్మెంట్సు:-

ఆసియాఖండమున ఇండోచైనా స్పెనెన్సులాలోనిది. ఇవి ౧ సింగపూర్, ౨ పెనాంగ్, 3 వెల్లెస్లీప్రోవెన్సు, ౪ మలాకా కలసి యైనపేరు. ఇది మలేయాపెనెన్సులాలోఁ జేరినది. ఇంచుమించు ౧౨౦౦ చతురఁపుమైళ్లువైశాల్యము గలది. రబ్బరు తోఁటలు, పేఁపబెత్తములయడవులు నధికము గాఁగలవు.

౧ సింగపూర్. ఇది మలయాదక్షిణఁపుఁగొనవద్ద నొకచిన్నద్వీపము. ఇది బ్రిటీషువారి నౌకాస్థానమును, గొప్పవర్తకము జరగురేవుస్థలమునై యున్నది.

౨ పెనాంగు. పెనాం గనిన 'పోకచెక్క' యని యర్థము. మలెయాపశ్చిమమున నొకచిన్నద్వీపముకడ సారవంతమైన ప్రదేశము.

3 వెలెస్లీప్రోవెన్సు. పెనాంగున కెదురుగ దేశభూమియందలి యొకమండలము.

౪ మలాకా. మలెయాకుఁ బశ్చిమముగానున్న యొకమండలము. పేపఅడవులకు పేరందినది ముఖ్యపట్టణము మలాకాపురము.

పెనాఁగును కేడారాజాగారు బ్రిటీషువారి కిచ్చివేసిరి. స్ట్రెయిటుసెటల్మెంట్సు క్రీ. శ. ౧౮౬౭ వఱకు నిండియాప్రభుత్వమువారిక్రిందనే యుండి, అప్పుడు క్రౌనుకోలనీగాఁజేయంబడి యొకగవర్నరు క్రింద నున్నవి.

**స్పెక్ట్రమ్ ఎనాలిసిస్ (Spectrum analysis)**:—పాశ్చాత్య భాషలందు 'స్పెక్ట్రమ్' అనుశబ్దమునకు రూపము లేక యాకారమనియు, ప్రతిమ, ప్రతిచ్ఛాయ, యనియు నర్థముఁ జెప్పుచున్నారు.

ఏరంగుగా నొకవస్తు వగుపడునో యారంగును ఏభాగమొనర్చి దాని నెఱుంగుటయని భావము. ఈపరిశీలనలో నావస్తువ శరీరముజోలికిఁ బోక, దానియాకారమునందున్నవాటిని విభజించి, దాని నిజతత్వ మెఱుగుటయని గ్రహించవలెను.

వస్తువు దూరమందున్నను దానియాకారము దేనిగుండా పరిశీలించువారినేత్రములం జేరునో యాపదార్థమునకు (Medium) 'ఈథర్' (Ether) శూన్యశక్తి యని పేరిడియున్నారు. అట్టి 'ఈతరు' నేత్రమునకుఁ గన్పించని పదార్థమని చెప్పఁబడినది.

వస్తువునందు వెలుతురు (తేజస్సు) ఉండుట వలన, తదాకారము గన్పించుననియు, వెలుతురే లేకుండుతరి నాయాకారమే (ఆవస్తువే) నేత్రముల కగుపడదనియు, మనసునం దుంచుకొనవలయును. ఎస్ట్రోనామీశాస్త్రసంబంధమున సూర్యునికాంతి నక్షత్రములపైఁ బ్రసరింప వాటియాకారమగుట యనఁగాఁ జూచువారినేత్రములకు 'ఈతరు' నుండి పయనమొనర్చుచుఁ జేరవలసియుండును. ఈతరు నుండి పయనమొనర్చుటయందు, ఆయాకారము తనయందలిబలము తగ్గుచుండ నలుదెసలకుం జెదరుచు వ్యాపించుచుండెడిని. దానింబట్టియే దూరఁపువస్తువులం జూచుటయందావస్తువుయాకారము స్పష్టముగఁ గన్పింపకపోవుటయు సంభవించుచున్నది.

ఒకయాకారము, అనఁగా దానిఛాయ. ఈథరుమార్గమునఁ బ్రయాణమొనర్చుచుండ, తన్మార్గమధ్యమున ఏ (Resistance) నిరోధము నుండదని చెప్పఁబడినది. అట్టి నిరోధము, [అడ్డంకి] యుండెనేని, ఆయాకారము నేత్రముం జేరకుండ మఱుగుపడవలసి యుండును. ఈథరుంగూర్చియు, దానిగుండా పయనమొనర్చు నాకారము నడుచుటంగూర్చియు, 'This is the modium that conveys the light waves that are excited by the rapid vibrations of the particles forming the huminons bodies [ఆకారము] of space' అని వివరింపఁబడినది. సూర్యచంద్రనక్షత్రాదికము లన్నియు నిట్లే యగుపడుట యనియు, అట్లగుపడుటయందలి నిజతత్వ మిదియేయనియు నెఱుంగునది.

ఇట్లు చూచువారి నేత్రముకడకుం జేరి, యగుపడుటను, 'exciting the sensation of light' అని శాస్త్రగ్రంథములందు వ్రాడియున్నారు. మఱియు నిదియే Photo film లో చేరినచో 'Rendering sensible by Photography' అని యనుచున్నారు.

ఈథరుగుండా జరుగుచుండు నిట్టిప్రయాణ వేగము, సెకెండుకాలములో 1,86,324 మైళ్ళని లెక్కింపఁబడినది. ఈసందర్భమున సూర్యునినుండి,

భూమికి, ఆయన యాకారము గన్పించుట కగు ప్రయాణకాలము 8½ మిని ట్లనియు, దూరఁపు planet [గ్రహము] అగు నెప్ట్యూనునుండి 4 గం టలకాల మనియు, సమీపఁపు fixed star అగు Alpha Centanri నుండి నాల్గు సంవత్సరముల కాల మనియు, నింకను, గెలాక్సీ కావలిభాగము నుండి నాల్గువేల సంవత్సరముల కాలముఁగూడ పట్టుననియు లెక్కింపఁబడినసంగతి నిట వివరించుట వినోదకరము గాకపోదు. దీనింబట్టియే గణితశాస్త్ర విశారదులగు కొందఱు ఎస్ట్రోనామీశాస్త్రవిదు లాకసమునఁ గడుదూరమునఁ గానవచ్చు కొన్ని వింతదృశ్యములు చిరకాలము క్రిందటి వనియు నవి ఈభరునుండిచేసిన ప్రయాణ మింతకాలము పట్టియుండుననియు ననుచుందురు.

స్వప్రకాశము లేనివియై, సూర్యుని నుండి, వెలుతురుపొందుచున్న చంద్రగోళము, పెక్కు నక్షత్రములు మొదలగు వాటి నీశాస్త్రమున 'Reflectors' అని వాడియున్నారు.

స్వప్రకాశము లేనివియై సూర్యునినుండి వెలు తురు Series of long waves of differe-nt lengths గా వచ్చుచుండు ననియుఁ జెప్పఁ బడినది. ధ్వనియు నిటులనే గాలినుండి నడచి కర్ణేంద్రియముం జేరుననియు, నేత్రేంద్రియము రంగులనుండి యాకారములం జూచుననియుఁ జెప్పఁబడినది.

పొడవుగనుండు length waves ఎఱుపు రంగు (చివర) నుం గల్గియుండుననియు, పిదప పొడవుగ నుండుటయందుఁ జెప్పఁదగిన waves వరుసగ orange (నారింజ), yellow (పసుపు), green [ఆకుపచ్చ], blue [ఊదా], Indigo [నీలిమందురంగు] Violet [నేరడిపండురంగు] లు

అని చెప్పఁబడినది. ఈయేడురంగులకును ఇంగ్లీషు పేర్ల మొదటియక్షరములఁ జేర్చి, యొకవిచిత్ర మైన పదముగా VIBGYOR అని ఆంగ్లేయులు వాడుచున్నారు.

Visible spectrum పొడ వించుమించు (శ్రీవ వంతు) Octevo అనియు, Usual Unit for measering wave lengths is tenth metre which is one ten millionth of a milli mertre అనియు, గణితశాస్త్రవిదు లనియెదరు. మఱియు నిది యొకటిగ నగపడు నందురు. (Red) ఎఱ్ఱని 8000 లును, Violet [నేరెడుపండు] రంగువి 3800 లును నని చెప్పఁ బడినవి.

Waves తరంగములయొక్క కడలనుండు Red End (యెఱ్ఱనిచివర) అనఁబడుదానికి He-at Rays వేఁడికిరణములనియు నందురు. వీని కావల weve length (తరంగఁపుఁబొడవు) మనకంటి కగపడునది యొకటి కలదు. దీనిం బరిశీలించిన Langly పండితుఁడు చిరస్మరణీ యుఁడు. (New ton కనుఁగొనినవాఁడు).

తెల్లనివెలుఁగునం దన్నిరంగులును జేరియుం యుండును. అనఁగా నన్నిరంగులకలయికయే తెల్ల నివెలుఁగని చెప్పఁదగును. అ ట్లన్నిరంగులకూట మియే యగు తెల్లనివెలుఁగును, అం దంతర్భాగ ములుగానున్న రంగుల నన్నింటిని, వేఱుపఱచి, మనకు దృగ్గోచరముసేయు యంత్రపరికరమునకే 'Spectro scope' అనుపేరు వాడుకలోనున్నది. అట్టియంత్రముద్వారమున నొకసూర్యకిరణము ప్రసరించునట్లుఁ జేసినచో, నావెలుఁగునందుఁగల యంతరవర్ణములు (Component colours) విభాగింపఁబడి వేర్వేఱయి, మనకు దృగ్గోచర

మగును. ఆరంగులన్నియును మనకు స్ఫుటముగాఁ గానవచ్చుటకు మధ్యేణి (భూతలద్దము) మొకటి యమర్చఁబడి యుండును. ఇటీవల నీరంగులను ఫొటోతీయుట గన్గొని, వాటిని 'Ultra Violet Spectrum' అనివాడుచున్నారు. అది infra red Spectrum నకు తీయంబడిన ఛాయాపట మనియుం జెప్పఁబడినది. ఇందు రంగు లగుపడ కున్నను, వాటివాటి Relative Brightness తోపాటు Lines అగుపడుచునే యుండును. వస్తువునందున్న Gases యే యుట్టిఫలితములం గల్గించుచుండునని షోల్పఁబడినది.

ఏ యాకారముయొక్క (వెలుతురు లేక వెలుఁగు లేక) కాంతిని పరిశీలింతురో, దాని నాశ్రయించియే యీ Gas ఉండుననియు, వెలుతురు నది నిరూపించు నాకారముతో సంయుక్తమైనదే యనియు, మనసునం దుంచుకొనవలెను. మెఱయుచుండు Gas అనఁగా ప్రకాశమాన మగు Gas, అఖండమగు (Contimons Ribbon of Light) యాకారముం బ్రదర్శింప నచట విస్తారముగ Pressure ఉండవలయు ననియు, Pressure చాలకుండినచో, ఈ Ribbon of Light Contimons గా నుండక ఖండఖండములై యుండుననియుఁ జెప్పఁబడినది. మఱియు నిట్టి పరిశీలనలు 'Spectrum analysis' అని వాకొందురు. ఇందు తీయఁబడిన ఛాయాపటములందు (Photgrphys) రేఖల రూపమునం గాననగుచుండును.

ఈరేఖలు వేర్వేఱు Gases లకు వేర్వేఱు విధములుగ నుండెడిని. మఱియు నివి శీతోష్ణస్థితి (Temparature of the place) ననుసరించి, Pressure (ఒత్తిడి) ననుసరించియు నుండును. వీటికి నిష్కృష్టయగువిధానము కలదు. ఇది సూర్యునియొక్కయు, పెక్కు fixed stars రొక్కయు, Spectrum యొక్కయు, లక్షణములని యెఱుంగవలయును. ఇవి Central Body ని Solid గానున్నదో, Liquid గానున్నదో, gas at inoramons pressure & surrounded by cooler atmosphure గా నున్నదియుఁ దెల్పును. ఈ atmosphure లో ఏ Gas కలదో, అందు కానవచ్చు spectrum lines వలననే తెలిసెడిని.

సూర్యునియందు Hydrogen [జలధాతు వాయువు] కలదు. Vapour of iron తఱచుగ నుండును. ఇంకను Gold, Silvar, Copper, Calcuim, Sodium మొ॥ వాని Vapours యును, ఇంకను నితర Tervestrial Elements కూడ నుండును. ఇందుఁ గొన్నికొన్ని యింతవఱకును భూమిపైఁ గాన్పింప లేదు. భూమిపైఁ గన్గొనఁబడకపూర్వ మెన్నియోసంవత్సములకు వెనుక Helium అను gas సూర్యుని యందుఁ గలదని పరిశోధనవలనఁ దెలియుచున్నది. మఱియు సూర్యుని Carona యందున్న Coronium అటనున్నదనియు, Nubnlium gas కూడ గలదనియు నెఱింగియున్నారు. కాని యవి భూమిపైఁ గానరాకున్నవి.

కొన్నిరేఖ లెక్కువయగుటయు, బలముగాఁ గానవచ్చుటయు జరుగుచుండుటచేత వేర్వేరు టెంపరేచరుల (శీతోష్ణస్థితుల) ని గుర్తించుచున్నారు. 'ప్రెషర్' అధికమైనకొలఁది రేఖలు వెడల్పగుటయు సంభవించుచుండును.

ఈరేఖలను magnetic field సూక్ష్మముగా Double లేక Trible అగునట్లు చేయును. ఆప్రదేశముచుట్టును Electricol Parti-

eles త్వరితగతిం దిరుగుటంజేసి, magnitism ఉత్పత్తి యగుచున్నదని కన్గొనంబడనది. నెబ్యులే యందు ప్రకాశమానమగు రేఖ చుట్టియుండుటం జేసి యందు Gas (వాయువు) కలదని తెల్పు చున్నది. ఆరేఖ యఖండమైయుండుటంజేసి, ఆ Gas (వాయువు) (solid) ఘనముగనో, (liquid) ద్రవముగనో, యున్నదనియు మఱియు నది High Pressure నందు లేక Low Pressure యందు నున్నదనియుఁ దెలుపును. వాతావరణము (atmospher) లేకుండు గోళములు సూర్యుని Spectrum నే ప్రతిఫలింపఁ జేయుచుండును. చంద్రునియందు వాతావరణము లేకుండుట నిర్ణే సంభవించుచున్నది. ఒకగోళము యొక్క spectrum రేఖలు Violet వైపు మార్పునందుట నాగోళము భూమిదెస కరుదెంచు చున్నదని (Red) ఎఱుపు వైపు మార్పునందుట భూమినుండి వెనుకకరుగుచున్నదని యెఱుఁగఁ జేయును. మఱియు వీటినుండియే ఆ Spectrum యొక్క రేఖల గమనవేగ మెఱుఁగనగునని పరిశీలకు లనుచున్నారు. గోళ మరుదెంచుతరిని, ఏగుదెంచుతరిని, ఎక్కువ waves తరంగములు పొడుగుటయును (wave length), తరంగ దీర్ఘత తగ్గుటయు, సంభవించుచుండును. ఇట్టి భేదచిహ్నము (Indication of change), Violet (నేరడిపండురంగు) వైపునకేగాక Red (ఎఱుపు) వైపునకుఁగూడ తటస్థించుచుండును.

ఇంకను Hall పండితుఁడును, Deslandres పండితుఁడును, కన్గొని రచియించిన 'Spectro-heliograph' అనంబడు యంత్రపరికరముమూలమున తీయఁబడిన ఛాయాచిత్రములు Sims Atmosphere నందలి Gas distribution లను దెల్పుచు సూర్యునినుండి బహిర్గతమగు Glowing Vapours మొదలగువాని నెఱుంగఁ జేయును.

**స్పెక్ట్రోగ్రాఫీ (Spectrography) ప్రపంచిపదము:—** సూర్యకిరణముల సాహాయ్యముచే రూపములఛాయలను గ్రహించి ప్రతిరూపముల నిర్మించువిధానము.

**స్పెక్ట్రోఫోను (Spectrophone):—** లాటిన్భాషాపదజన్యము. గ్రహగోళమునకు సంబంధించిన ధ్వనులనుఁ దెలియఁజేయు పరికరము.

**స్పెక్ట్రోమీటర్ [Spectometer]:-** గ్రహముల కాంతియొక్కయు, కిరణముల యొక్కయుఁ బరిమాణములను దెలుపుయంత్రము.

**స్పెక్ట్రోలొజీ [Spectrology]:—** గ్రహగోళమునకు సంబంధించిన కాంతి, ఛాయ మొదలగువానిని బరిశీలించు విధానము.

**స్పెక్ట్రోస్కోప్ [Spectroscope]:—** గ్రహములయొక్క పూర్ణస్వరూపములను, కాంతులను దిలకించుటకు వీలగుపరికరము.

**స్పెన్సిల్ఇంకు [సిరా]:—** (ఎంబ్రాయిడరీ ఇంకు పరిశ్రమ చూడుఁడు).

**స్పెన్సుప్రత్తివ్యవసాయము:—** ఇది గుజరాతుదేశమునం దెక్కువగా వ్యవసాయము చేయఁబడుజాతి. చెట్లిరువదిసంవత్సరములు జీవించును. స్వదేశఁపుజాతులలో శ్రేష్ఠజాతి. దీనిప్రత్తి 20 నంబరు నూలుతీయఁ బనికివచ్చునని చెప్పఁబడినది. విత్తులు శేరున కిరువదిరూప్యములు ధరయట

పత్తి తెల్లనిది. చక్కని సన్నదారమునకుం బనికివచ్చుజాతి. చెట్టునకుఁ జెట్టునకునడుమ నొక గజముదూర ముండునటుల నాటుదురు. గింజ లైదురోజులలో మొలచును. యకరమున కర్థ శేరు విత్తు లుండవలయును. వర్షారంభమున నాటి నం జాలును. నీరుకట్ట నవసరములేదు. ఆఱునెల లకు కాపు ప్రారంభమై పిదప నైదేసినెల లేచొ టం గాయుచుండును. (పత్తి వ్యవసాయము చూడుఁడు, కాంబోడియాపత్తి చూడుఁడు).

## స్పెయిన్ దేశము:—

[స్పానియాదేశముఁ జూడుఁడు].

**స్పెషల్ (ప్రత్యేకపు)** Special:—వాణి జ్యసంబంధపరిభాషాపదము. ఒకదేశమున పండిన పంటసర కెగుమతియగుటయు, దేశమునకు వలయు సరకుల (food articles) నితర దేశములనుండి దిగుమతియగుటయు 'Syecialcommerce' అను పేరంబరగెడిని. ఇందు 'special' అన ప్రధానమని యర్థమయ్యెడిని. ఒకరిపనివలన మా మూలుకన్న నధికనష్టము గల్గెనేని దానికి 'special Damage' అనియెదరు. ఇందు 'ప్రత్యే కమగు' అని యర్థమయ్యెడిని. ఒకహుండిని మరి యొకరిపేర చేయఁబడిన endorse నకు 'special endorsement' అనియెదరు. ఇందు 'special' అన 'వేరు' అని యర్థమిచ్చెడిని. ఒకమా మూలువిధముగఁగాక వేరువిధమున జరిగిన పై జాతికి 'special settlement' అనియెదరు. ఇందు 'మరియొకవిధ' మనియర్థము.

**స్పెసిఫిక్ గ్రావిటీ** [Specific gravity]:— ఒకవస్తువుయొక్క శరీరమును తానాక ర్షించుచుఁ దనవైపు లాగుకొను భూమియొక్క శక్తికి 'గ్రావిటీ' యనియు, దానిని లాగుకొనుపనిని 'గ్రావిటేషన్ పుల్' అనియు, సాంకేతనామములుగ వాడుచున్నారు. దానినుండియే ఆయాకర్షింపం బడువస్తువునం దొకతూనికబరు వేర్పడుచుండును. ఎంతబరువో యంతలెక్కకుఁ దూనికబరువని యెఱుంగునది. అటుల బరువుంగల్గించు నాకర్షణ శక్తి వేర్వేరుజాతిపదార్థములందు దానికిఁగల్గిన బరువునుండి యుండును. అట్టి ప్రత్యేకతకు 'స్పెసిఫిక్ గ్రావిటీ' (specific gravity) యని యాంగ్లరసాయన శాస్త్రసాంకేతికనామము. ఇచట 'స్పెసిఫిక్' అనిన నాంగ్లమున 'special' అనిగాని, 'particular' అనిగాని యర్థ మగును. ఇట్లనుట 'specific gravity' యను క్లుప్తపఱుపఁబడినశబ్దము 'gravity of a particular kind of thing' అనియర్థమిచ్చు నదిగా నున్నది. ఇంక నిట్టివేయగు specific heat అనిగాని, specific performance of contract అనిగాని, specific behavior అనిగాని, యీమొదలగు ఉక్తులం దిట్టియర్థమే యగుచుండెడిని. ఈసందర్భమున లాగుటయందు బరువేర్పడు ధర్మము తూచుస్థలముంబట్టియు, తూచఁబడు వస్తుశరీరతత్వముంబట్టియుఁ గూడ నుండునని చెప్పవలసి యుండును. తూచుస్థలమున నాకర్షించుపదార్థమున కెంతదూరమున నాయాక ర్షింపబడు పదార్థ ముండునో దానింబట్టి యుండు ననియు, తూచఁబడువస్తుశరీరతత్వ మన నొకేపరి మాణపుఁగొలతలుగల బంగారమునందలి పర మాణువులు, మొలక్యూల్సు అధికబరువగుట నెక్కు వబరువుగ, తూగుటయు, ఆపరిమాణపుఁగొలతలే గల వేరొకలోహమగు రాగియందలి పరమాణువు లు కొంతతక్కువబరు వగుట తక్కువబరువుగఁ దూగుటయు, సంభవించుచుండుం గాన దానిం బట్టి గూడ తూనికబరువుండునని స్పష్టమగు

చున్నది. ఇందువలన నివి యొకటితో నొకటి పోలిచి relativety గాఁ జెప్పనగుఁగాని దేనికదే ప్రత్యేకముగాఁ జెప్ప వీలుకా దనవలసి యుండెడిని.

భూమిపై భూమికడనే తూచిన తూనిక యందు తూగినంతబరువు, ఆవస్తువే భూమినుండి వేయియడుగులయెత్తున తూఁగఁజాలదు. రెండు వేలయడుగులయెత్తున నింకను తక్కువ తూగును. ఇట్లే భూమినుండి దూరమగుకొలఁది తక్కువ తూఁగుచుండెడిని. ఇంక తక్కిన వేర్వేరుజాతి పదార్థముల పరమాణువులు బరువుతేలికలంబట్టి యేర్పడు relativeweight చాల ప్రాముఖ్యమైన ప్రస్తుతాంశము. దానికే నిజమున specific gravety యనినం జెల్లనోపుఁగాక. వీట్ల భేదములకే Defferences of specific gravity' యనుచుందురు.

ఒకవీసెడుబరువగు బంగార మొకవీసెబరువు గల రాగికన్న తక్కువస్థల మాక్రమించి యుండును. అనఁగా రాగి యెక్కువప్రదేశ మాక్రమించునది. బంగారము తక్కువప్రదేశ మాక్రమించునది యని భావము. బంగారుశరీరతత్వము చిన్నదియు బరు వధికముగాగల పరమాణువులు (atoms) కలదియగుట తక్కువస్థల మాక్రమించి యుండుంగాన, రాగి శరీరతత్వము పెద్దదిగానుండు తక్కువ బరువుఁగలపరమాణువులుకలదియగుట నెక్కువస్థల మాక్రమించును. ఇట్టి పరమాణువుల తేలికబరువులకు డెన్సిటీ (Densety) యని యాంగ్లరసాయనశాస్త్రమున సాంకేతిక నామ మిడఁబడియున్నది. ఇట్టి శరీరతత్వపరమాణువుల డెన్సిటీ నుండియే నీటమున్గుట, తేలుట గూడఁ గల్గుచుండును. చన్నీటిలోనికి వేఁడినీటిం బాఱంచితిమేని చులకనిదగుట వేఁడినీరు పైపొర గను చల్లనినీ రడుగునను నుండుటఁ జూడ వచ్చును. అటులనే వేఁడినీటిలోనికిఁ జన్నీటిం బ్రవహింపఁజేసిన బరువగుచన్నీ రడుగున నేర్పడి చులకనగు వేఁడినీటిం బైకి తేలంజేయుటయుఁ జూడవచ్చును. ఇట్టి వెన్నో స్పెసిఫిక్ గ్రావిటీ సంబంధచిత్రములుఁ గలవు.

ప్రస్తుతాంశము వేర్వేరుజాతుల పరమాణువుల భారములు వేర్వేరుగనుండ వాటి రిలేటివ్ తూనికల నెఱింగించుటయ గాన, నట మరలుదముగాక. నీరు సర్వసాధారణపదార్థము గాన దానితోఁ బోల్చి రసాయనశాస్త్రవిదులు తూచి గ్రహించుట యాచారమైయున్నది. ఇందునుండి లెక్కించుటకొఱకు నుదకము [బరువు] నొకటి యని సాంకేతికనామ మిడుదుముగాక. ఉదకముకన్న బరువగుబంగారము, వెండి మొదలగునవి నీటియందు మున్గుననియు, మంచుగడ్డ మొదలగు నీటికన్న తేలికపదార్థములు నీటియందుఁ దేలుననియు, వేరుగఁ జెప్పనవసరముండదు. అనఁగా నొకటిగా జెప్పంబడు నీటియొక్క స్పెసిఫిక్కు గా బంగారఁపు స్పెసిఫిక్ గ్రావిటీ యధికమనియు, (more dense) మంచుగడ్డయొక్క స్పెసిఫిక్ గ్రావిటీ తక్కువ (less dense) యనియు, భావము.

ఈసంబంధమున ఘనపదార్థము [solids] లందు బంగారము 19 ° 3 అనియు, సీసము [lead] 11 ° 4 అనియు, వెండి [silver] 10° 5 అనియు, తగరము [tin] 7° 3 అనియు, మార్బెలురాయి 2 ° 8 అనియు, అల్యూమినియమ్ 2 ° 7 అనియును, మంచు [ice] ° 0 9 అనియు, బెండు [cork] 0° 2 అనియుఁజెప్పఁ బడినది. ఇంక ద్రవ

పదార్థము [liquids] లందు పాదరసము 13 ∘ 59 అనియు, గంధకధృతి [sulphuric acid] 1 ∘ 84 అనియు, పాలు [milk] 1 ∘ 3 అనియు, సముద్రోదకము [sea water] 1 ∘ 3 అనియు, పెట్రోలియమ్ 0 ∘ 84 అనియు, ఆల్కహాలు 0 ∘ 79 అనియు, పరమాణుపదార్థభారములుగ [atomic weights] ఆంగ్లరసాయన శాస్త్రగ్రంథములందుఁ జెప్పఁబడియున్నది. వీటిని సార్వశ్యములుగఁ గైకొనందగును. భూమియందుఁ గల యాకర్షణశక్తి కాంగ్లమున 'gravitation pull' అనిపేరు. అది యేవస్తువు నాకర్షించునో ఆవస్తు పదార్థమునందలి డెన్సిటీననుసరించి యేర్పడుచుండెడిని. [గ్రావిటేషన్ పుల్ చూడుఁడు, డెన్సిటీ చూడుఁడు]. ఇంక నాయాకర్షణశక్తిం గొలిచి లెక్కించి తెల్పుఫలితమునకు 'స్పెసిఫిక్ గ్రావిటీ' యనెదరు. అనఁగా నిష్కర్షయగుబల మని భావము. ఇది గ్రావిటేషన్ పుల్ యొక్క బల మింతయని యెఱుంగుటయే గాని వేరేమియుం గానేరదు.

**స్పెసిఫిక్ గ్రావిటీ (Specific Gravity):—** దీనిని 'Gravitation pull' అనియు ననెదరు.

ద్రవపదార్థములు.

| | |
|---|---|
| మంచినీరు | 100 |
| సముద్రోదకము | 103 |
| డెడ్సీ - ఉదకము | 124 |
| ఆల్కహాలు | 84 |
| టర్పెంటైను | 99 |
| సారాయము | 100 |
| అల్పాచమానము | 101 |
| సైడరు [Cider] | 102 |
| బీరు [Beer] | 102 |
| మనుష్యస్తన్యము [పాలు] | 102 |
| ఆవుపాలు | 102 |
| మేకపాలు | 104 |
| పోర్టరు [Porter] | 104 |

లోహపదార్థములు - రాళ్లు.

| | |
|---|---|
| గ్రానైటు [శాణాపు] రాయి | 278 |
| వజ్రము | 353 |
| పోతయినుము | 721 |
| తగరము | 729 |
| ఇనపగజములు | 779 |
| ఉక్కు | 783 |
| ఇత్తడి | 840 |
| రాగి | 895 |
| వెండి | 1047 |
| సీసము | 1135 |
| పాదరసము | 1357 |
| బంగారము | 1926 |
| ప్లాటినమ్ [Platinum] | 2150 |

ఎండుకట్టె [Timber]

| | |
|---|---|
| జీలుగుబెండు [కార్కు] | 24 |
| పోప్లార్ కట్టె | 38 |
| ఫిర్ కట్టె | 55 |
| సీడర్ కట్టె | 61 |
| పీర్ కట్టె | 66 |
| వాల్నట్ కట్టె | 67 |
| చెర్రీ [రేగు] కట్టె | 72 |
| మేపిల్ కట్టె | 75 |
| ఏష్ కట్టె [Ash wood] | 84 |
| బీచ్ [Beech] కట్టె | 85 |
| మహాగనీ కట్టె | 106 |

| | |
|---|---|
| ఓకుకట్టె | 117 |
| ఇరుగుడు | 133 |

చిల్లర ఇతరపదార్థములు.

| | |
|---|---|
| నీలిమందు | 77 |
| మంచు | 92 |
| తుపాకిమందు | 93 |
| వెన్న | 94 |
| బంకమన్ను | 120 |
| రాక్షసబొగ్గు | 130 |
| నల్లమందు | 134 |
| తేనె | 145 |
| దంతము | 183 |
| గంధకము | 203 |
| మార్బెల్ | 270 |
| సీమసున్నము | 279 |
| అద్దము [గాజు] | 289 |

పరిశుభ్రపఱుపఁబడిన యుదక మొక యడుగు ఘనపరిమాణము (అనఁగా నడుగుపొడవు, వెడలుపు లోతు) కలది, ఫారన్హీటు తెర్మోమీటరు 60 డిగ్రీలవేఁడికడ నుండునది, ఇంచుమించు వేయి ఔన్సులు Avoirdupois తూనిక యుండెడిని. పైన వివరింపఁబడిన స్పెసిఫిక్‌గ్రావిటి అంకెలను పదిచేత గుణించుటవలన దానితూనికబరువు తేలఁగలదు.

స్పెసిఫిక్ పెర్ఫార్మెన్సు( Specific Performance):— స్పష్టమగుపనిని చేయుట యని యర్థము. కంట్రాక్టుపనిని చక్కఁగ నెఱవేర్చుటకు 'Specifie Performance of Contract' అనియెదరు.

స్ఫెరికల్‌ట్రిగ్నామెట్రి (Spherical Trignometry):—రేఖాగణితమునందుమూఁడుగోళాకారరేఖలతోఁ నేర్పడుసమత్రికోణమునకు సంబంధించినభాగము.

స్ఫెరోయిడ్:—
(Spheroid:- Oblate spheroid చూడుడు.)

స్ఫిగ్మొలొజీ (Sphygmdogy):—
స్ఫిగ్మొగ్రాఫీకి సంబంధించిన శాస్త్రవిజ్ఞానము.

సేంట్ఫ్లాసు:—
(ఫాదర్క్రిస్టమస్ చూడుఁడు).

సేక్రిమెంటాలిజమ్ (Sacrimentalism):— మతసంస్కారములు విడువరానివియు, సహజమగునవియు, నని నమ్మువిధానము. క్రైస్తవ మతస్వీకారమునకు రొట్టెయు, సారాయియు నిచ్చుట మతసంస్కారచిహ్నము. (సేనలోఁజేయుం చుపద్రమాణమునకుఁ గూడ వర్తించును.

సేక్సో ఫోన్ (Saxophone): —
జర్మనుభాషాపదమగు phone=ధ్వని కర్తతోఁ జేర్చఁబడినది. గానమున నుపయోగింపఁబడు పరికరములలో నొకటి. ఇది ఇత్తడితోఁ జేయఁబడి 'క్లేరియంట్' అనుదానివలె నుండును. Sax అనువానిచేఁ గనిపెట్టఁబడినది.

సేగింగు మార్కెట్టు (Sagging market):— వాణిజ్యపరిభాషయం దొకసరకునకు క్రమక్రమముగ ధర పడిపోవుచుండుట (తగ్గిపోవుచుండుట)కు వర్తించును.

సేఛెల్లీస్ ద్వీపములు:— ఆఫ్రికాఖండపుఁదూర్పుతీరమున హిందూమహా సముద్రతీరప్రాంతముల నీద్వీపసముదాయము గలదు. ఇవి యన్నియు బ్రిటీషుప్రభుత్వమువారి కోలనీగనున్నవి.

చల్లని వాతావరణమును, ఆరోగ్యవంతమగు వాతావరణపరిస్థితులు, నిష్కల్మషమై యుద్ధముం బోలి స్వచ్ఛమైన సముద్రజలములు, తెల్లని ధావళ్యమగు ఇసుకబయళ్ళుం గల్గి, యారోగ్య ప్రదేశములు, సమశీతోష్ణప్రదేశములు నై యుంట బొంబై నుండి భరతదేశస్థులు, ఆఫ్రికాఖండప్రాంతములవారు నారోగ్యము కొఱకు, చల్లదనము కొఱకు, విశ్రాంతికొఱకు నట కేగిపోవుచుందురు.

బొంబై నుండి మొంబాసాకరుగు పొగయోడలలోఁ బయనముసల్పి యాఱు లేక యేఁడుదినములలో వీటికిఁ జేరనగును. ఈపరిసరములకరుగగనే వాతావరణము చల్లగనుండి సముద్రజలములు స్వచ్ఛములగుట, లోనిచేఁపలు మొదలగునవి చక్కఁగఁ గాననగుట వినోదకరమై యుండును. సేషెల్లీసుద్వీపములు లెక్కింపఁదగినవి. ఎనుబదియేఁడు కలవు కాని యివి తొంబదికలవని చెప్పఁబడినది. ఇందు మాహేద్వీపము పెద్దది. అన్నియుం గొబ్బరిచెట్లు, అనఁటిచెట్లు మయమై యొకకొననుండి రెండవకొన కడవులంబోలిన తోఁటలం గల్గి కడురమ్యమై యుండును. ద్వీపములనడుమనుండు సముద్రఁపునీటిచెలక లద్దముంబోలి స్వచ్ఛములై లోఁబర్విడు చేఁపలు మొదలగుజలచరములను వాటివాటిరంగులతోసహా పైకిఁ బ్రదర్శించునట్లు తమనీటినుండి ల్గుపడఁజేయుచు సముద్రమునందుండు నుద్ధృతం గోల్పోయి, విభ్రాంతిఁ గల్గించుచుండును. ఈద్వీపములం గొన్నిటియందుఁ గల కొండలు క్రిందియిసుకనుండి యాకసముదెస లేచినట్లుండు కొండలక్రిందిభాగఁపు టెత్తుప్రదేశములందు సరుగుడుతోఁటలును, శిఖరములందు మేఘములును, వింతసౌందర్యముం జూప, పర్వతమునుండి యన్నివైపులను నిర్మలజలప్రవాహము గల సెలయేరులు కర్ణానుకూలధ్వనులతో దిగువకుఁ బ్రవహించుచుఁ గ్రింది కొబ్బరి, యనఁటి మొదలగుతోఁటలం దడుపుచుంట నీద్వీపములు వింతవింతపూవులను, సమృద్ధి కతీతమగు వివిధ జాతిఫలములను, జెప్ప శక్యముగాని కొబ్బరి, యనఁటిపండ్లను గలిగి జీవనము మిక్కిలి చౌకగఁ గడుపఁ దోడ్పడుచున్నవి.

ఇవి యన్నియు ననేకుల యాస్తులుగ నుండు నట. కొబ్బరితోఁటలలో నెఱ్ఱని పై పెంకులుగల బంగళా లచ్చటచ్చట నన్నిద్వీపములందుఁ గాననగును. ఇందుఁ గొన్ని యద్దెల కిచ్చునవియుఁ దప్పక యుండును. గాన నారోగ్యమున కాద్వీపములకరుగువారల కన్నిద్వీపములందు నివాసమునకు వసతిగృహము లద్దెకు లభించుటయందేయిబ్బందియుం గలుగదు. హోటేళ్ళయందు దినమున కైదురూప్యములం గై కొందురని, ప్రత్యేకఁపుబంగళాలు నెల కేఁబది, యఱువదిరూప్యములలో దొరకుననియు నందురు. ఇచట వాడుకయందు భరతదేశఁపు టాంగ్లరూకలే యై యున్నవి.

ఈద్వీపములందుఁ దాఁబేళ్ళధికము. తాఁబేలు చిప్పలతోఁ జక్కనిపనులనిచటివారు చేయుటయుం గలదు. పెద్దదియగు మాహేద్వీపమున విక్టోరియా రేవు పొగయోడ లాగుతావు. అట చక్కని హార్బరునుం గలదు. ఆప్రాంతముననే తాబేళ్ళం బెంచుజల నిలయము చూడందగినది. దోమలు, పాములు, నక్కలు యీాదీవులందు లేవు. మలేరియాయననేమో యిచటివా రెఱుంగరు. అన్నిభోజన పదార్థములు, కూరలు దొరకుచునే యుండును. మాహేద్వీపముఁజొచ్చి నీటివారనే చక్కనిమోటారు బాటకల దిం దనేక కారు లనుదినము ద్వీపప్రదక్షిణ మొనర్చుచుంట సర్వసాధారణము. సెషెల్లీసుద్వీపముల పరిమాణము మొత్తమున ౧౫౬

చతురంపుమైళ్ళుండు నట. ప్రత్తి, ధాన్యము, పొగాకు ఇచటి పంటలు.

మాహేద్వీపము మిక్కిలి పెద్దది. ఇందుఁ గల రేవుపట్టణమునకు 'Port Victoria' అనిపేరు. ఇట నెగుమతులు కొబ్బరితాళ్ళు మొదలగున వనేకముగ జరుగుచుండును. ఇందు Praslin Selhouette island - La Digue - Ameraute islands - Cosmolede islands - Assumption island - Aldabra isles మొదలగు ద్వీపములు కలవు.

క్రీ. శ. ౧౫౦౫ లో, పోర్చుగీసువా రీద్వీప సమూహముం గనుఁగొని యాక్రమించి రట. పిదప నరబ్బులవశమై ౧౭౫౦ ఫ్రెంచివారి వశమాయె నట. ౧౭౯౪ లో బ్రిటీషువారివశమై తిరుగ దాటిపోయి, ౧౮౧౫తిరిగి బ్రిటీషువారివశమై నేటికి నట్లే నిలచియున్నవి. తొలుత నీద్వీపసము దాయమునమారిటి [illegible] మండెఁ గాని ౧౯౦౩ ప్రత్యేకము కోలనీగాఁ జేయఁ బడెను. ఈద్వీపములం దిరువదియైదువేల జనులు వసించుచున్నారు.

**సేటరు హౌస్** (Seater House):—
(ఆల్బ్యుహారన్ చూడుఁడు.)

**సేటిలైట్సు** (Satellites) :— లాటిన్ భాషయందు 'Satelles' అనినన్నాశ్రయించుకొని (కనిపెట్టుకొని) యుండునది యనియర్థము.

(సూర్యునివంటి) స్థిరమగు మహాగోళము నొకదాని నాశ్రయించి చుట్టుతిరుగుచుండు (భూమి వంటి) గోళములకు 'గోళము' లనిపేరు. అట్టి గోళములకు సైతము ఒక్కొక్కటికి త న్నాశ్రయించి తనచుట్టుఁ దిరుగుచుండు (చంద్రునివంటి) నుపగోళము లుండును. ఆయుపగోళములకు 'satellites' అనిపేరు.

**సేడిల్** (Saddle) :—ఒకపర్వతమున రెండు శిఖరములకు మధ్యనుండు పల్లపుప్రదేశమునకు 'Saddle' అనిపేరు. (mountains చూడుఁడు.)

**సేతువు [సేతుఁడు]**:— అత్రిసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి బభ్రువు. కుమారుఁ డంధుండు.

ఇంకను శ్రీరాముఁడు లంకపై దాడి వెడలుతరి సైన్యములు నడచుటకు సముద్రమునుండి పోయించిన గట్టునకు సేతువని పేరు. ఇది రామేశ్వరముకడ నున్నది. (రామేశ్వరము చూడుఁడు.)

**సేనజిత్తు**:— ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. భాగవతమున తండ్రి కృశాశ్వుఁడనియు నితనిసుతుఁడు యావనాశ్వుఁడనియుఁ జెప్పఁబడియున్నది. మఱికొన్నిచోట్ల యావనాశ్వుఁ డరుణాశ్వనిసుతుఁడని చెప్పఁబడియున్నది. యావనాశ్వనిసుతుఁడు మాంధాత.

మరియు బృహదిషునిసంతతిలోని (జయద్రథుని సుతుఁడగు) విశ్వజిత్తుకుమారుఁ డొకసేనజిత్తు కలఁ డితనిసుతులు రుచిరాశ్వుఁడు, దృఢహనువు, కాశ్యుఁడు, వత్సుఁడు ననువారలు.

## సేనాంగములు:—

(అంగములు చూడుఁడు).

## సేన్మార్నియో ప్రజాప్రభుత్వము:-

ఐరోపాఖండమున నిటలీదేశపు భూమియం దిది యొకచిన్న ప్రజాప్రభుత్వసీమ. రావెన్నాపురమున కు దక్షిణముగ నున్నది. రావెన్నాపురము తొల్లింట రోమనుసామ్రాజ్యమునకుఁ గడపటిరాజధానియై యుండెను. ఇది యిటలీలోని 'ఎమిలియా' ప్రోవిన్సునం దున్నది. ఈప్రజాప్రభుత్వము చాల చిన్నదయ్యు క్రీ. శ. ౫౦౨ నాఁటినుండియు నిలచియున్నది.

## సేనువంశనృపతులు:—

వీరు వంగదేశ మేలినవారు. ౧ సామంతసేనుఁడు, ౨ హేమంతసేనుఁడు, 3 విజయసేనుఁడు, ౪ బల్లాలసేనుఁడు, ౫ లక్ష్మణసేనుఁడు, ౬ అశోకసేనుఁడు మొదలగువారు. (వంగదేశము చూడుఁడు).

## సేఫ్టీఫస్టు (Sefety First):—

ఇది యొక లాంచనపుగురుతు (motto). ఇటీవల వ్యాపకముఁగాంచినది. మానవప్రాణరక్షణ సూచించునది. ఆదిని కర్మాగారము (Factory) లందలి పనివాండ్ర కపాయరక్షణమునకై యేర్పఱుపఁబడిన సంస్థలందుఁ జిహ్నముగా నేర్పడినపదము. ఇంగ్లాండుదేశమున సేఫ్టీఫస్టుసంఘములు స్థాపింపఁబడుటతోఁ మార్గములు కలసికొనుతావులం దపాయములు జరుగకుండ రక్షించునేర్పాటులకు, బండ్లరాకపోకలసందర్భపుజాగ్రత్తలు మొదలగువాట్లకు వ్యాపింపఁజేయఁబడినది. ఓడలం దపాయకరముల నుండి రక్షణోపాయములు జాగ్రత్తల కిది వ్యాపింపఁజేయఁగోరి యొకసుప్రసిద్ధసౌకాసేనాని యిచ్చిన యుపన్యాసములనుండి దేశదేశములందు వ్యాపించియున్నది.

## సేమాన్టిక్సు (Semantics):—

ఇది ఫైలాలోజీలోని యొకభాగము. పాశ్చాత్యకల. శబ్దమునకు నదినిరూపించు నర్థమునకుఁ గలసంబంధబాంధవ్యములనుగూర్చి వివరించుకల.

## సేమాఫోర్ సిగ్నలు కోడ్(Semaphore signal Code):—

ఇది యొకపద్ధతిసంభాషణపరికరము. సముద్రమున నడచు నోడలందలి యుద్యోగు లీసేమాఫోర్సిగ్నల్సు మూలమున సంభాషించుకొందురు. ఇటీవల విధానమును రెయిల్వేస్టేషనుల సిగ్నలింగునం దుపయోగింపఁ బ్రయత్నములు జరుపుచున్నారని తెలిసెడిని.

దూరమున కగుపడున ట్లొకపాటి పొడుగు స్తంభమునకుఁ దలవద్ద రెండుచేతులం బోలిన తెక్కలను, ఇంచుక దిగువగ రెండుతెక్కలను వదులుగఁ దిరుగుచుండున ట్లమర్చి, వాటిం ద్రిప్పుటకుఁ గమ్ములను క్రిందికిఁ దెచ్చి, పిడుల కమర్చియుంతురు. పిడులం గదల్చుటతోఁ బైతెక్కలు వలసినంత యెత్తున కెత్తఁ బడుటయు, దింపఁబడుటయు జరుగుచుండెడిని. దీనిని వాడనప్పుడు కేవలము క్రిందికి వ్రేలాడుచు స్తంభముతో నైక్యతం గల్గి గాన్పింపక తెక్కలు మఱుఁగుపడి యుండెడిని.

ఈసేమాఫోర్ సిగ్నలింగు గురు తక్షరములిందు వివరింపఁబడినవి. అన్నిదేశముల యోడలు నిదేసంజ్ఞలతో నీవిధానముననే వాడఁబడుచున్నవి.


M


N


O


P


Q


R


S


T


U


V


W


X







**సేర్కొలోజీ** [Sarcology]:—శారీరశాస్త్రమునందు, మాంసపూరితములగు భాగములను గురించిన విషయము.

**సేలంజిల్లా**:— అఱవదేశములో నిది చెన్నరాజధానికిం జేరియున్నది. సేలము ముఖ్యపట్టణము. వర్తకస్థానము. అచటి యంటుమామిడిపండ్లు ప్రసిద్ధిగలవి. శివరాయకొండలపై నున్న యేర్కాడుపురము సమశీతోష్ణస్థానము. వాణీంబడి, తిరుపాటూర్, ఊసూర్, ధర్మపురి, నామకల్లు నితరపట్టణములు. జిల్లాయొక్క యుత్తరభాగమునకు 'బారామహ' లనిపేరు. ఇందుఁ బండ్రెండుభాగములుండినదట.

**సేల్వాస్** (Selvas):— దక్షిణ అమెరికా దేశములం దరణ్యముఃబలిసిన సమతలప్రదేశములను 'selvas' అని వాడెదరు. (Land Portions చూడుఁడు).

**సేలిసిలిక్ ఆసిడ్** (Salicylic acid):— ఇది Carbon, Hydrogen, and oxygen compound లలో నొకటిగఁ జెప్పఁబడినది. ఇది యనేకచెట్లయందు లభించుచున్నది. oil of winter green నందుఁ బ్రధానభాగము. వాసన, రుచి లేనిది. పుండ్లను మాన్పుగుణముఁ గలది. ఇది 'Preservative' అని చెప్పఁబడినది. దీని salts నకు 'Salicylates' అనిపేరు.

**సేల్సు మేన్ షిప్**:—
[విక్రయవ్యాపారము చూడుఁడు].

**సేల్వేజి** [Salvage]:—వాణిజ్యసంబంధ పరిభాషా పదము. సముద్రమునంబడిపోయిన లేక పడవేయఁబడిన సరకునకై యొసంగఁబడు పరిహారమున కీపేరు వర్తించెడిని.

**సేల్ ఆర్ రిటర్ను** [Sale or Return]:— వాణిజ్యసంబంధపరిభాషాపదము. కొంత సరకును చిల్లరదుకాణపు వర్తకులకు 'అవి అమ్ముడుపోనిచో తిరిగి తీసుకొని సొమ్ము ముజరా యిత్తు' ననుషరతుతో నమ్ముట.

**సేల్ ఫర్ ది కమింగ్ అవుట్** (Sale for the coming out):— వాణిజ్యపరిభాషా పదము. ఒకకంపెనీ వాటాలకు సర్టిఫికెట్సుసైతము issue చేయఁబడకపూర్వమే వాట్లనమ్ముట.

**సేవన్నాస్ లేక ప్రైరీస్** (Savannahs or Prairies):— ఉత్తరఅమెరికాదేశములందు గడ్డిబయళ్లకు (పచ్చికబయళ్లకు) 'Savannahs' లేక 'Prairies' అనిపేరు.

(Land Portions చూడుఁడు).

**సేవ్ ఫ్రామ్ ఫ్రెండ్సు** (One must se saved from friends and he can save himself from his enimies):— విరోధి యని యెఱిఁగినచో నతనినుండి ప్రతివాడు

జాగ్రతగానుండి తమ్ము తామె రక్షించుకొనఁ గల్గుదురు. స్వహితులవలెనె వచ్చి యపాయ మొనర్పఁజూచు దుష్టులనుండియే రక్షింపఁబడ వలయును. గోముఖ వ్యాఘ్రములని తెలుఁగు నామెత కీవంటిదే కలదు.

**సేశ్వరసాంఖ్యమతము:—** నిరీశ్వర సాంఖ్యసూత్రములు కపిలర్షి వ్రాసినపిదప నీశ్వరుఁడు లేఁడనునంతవఱకుఁ బెక్కండ్రంగీకరించక తక్కినతత్త్వములసంఖ్యయితరధర్మములు ప్రకృతితో నాత్మసంయోగము మొదలగు నితరధర్మములందు గౌరవము గల్గియుండిరట్లుఁ దెలిసెడిని. అదివఱకే కృతయుగమున నుండిన శ్వేతయోగికాలమునుండి లకులీశయోగివఱకుఁగల యోగాచార్యులెల్లరును యమనియమాద్యష్టాంగయోగసాధనము నభ్యసించియే యుండిరి. మఱియు వీరిశిష్యులుగఁ బేరందిన నూటపండ్రెండుగురు యోగులును, యోగాభ్యాసవిధానమునఁ బ్రచారముఁ గల్గించుచుండిరి. దీని నంతయుఁ గాంచి పతంజలి శరీరాంతశ్శుద్ధిం గూర్చిన శాస్త్రముగను, సాంఖ్యధర్మమున కీశ్వరునింగూర్చియు, [ఈశ్వరుఁడు లేఁడనులోపమును నవరించి] ఈసేశ్వరసాంఖ్యమతము రూపమునేర్పఱచి సూత్రముల రచించెను. గాన నిది యోగాభ్యాసధర్మములను, సాంఖ్యమందలి కొన్ని ధర్మములనుగల్పి, ఈశ్వరునిం జేర్చినది. పతంజలి కర్తయని పెక్కండ్రు పొరబడి యనెదరుగాని యది సరి కాదు. ఆయన పాణినివ్యాకరణమునకు భాష్యము రచించినట్లే యదివఱకేయున్న మతములం జేర్చి సూత్రముల రచించినవాఁడు. (అష్టాంగయోగములు, సాంఖ్యమతశాస్త్రము చూడుఁడు).

ఇందుసాంఖ్యమతశాస్త్రమునవివరింపఁబడినటుల నిరువదియైదుతత్త్వములకుం బిదప నిరువదియాఱవ [illegible] మని చెప్పఁబడినది. మఱియు నటులనే ప్రకృతిపురుషవివేకజ్ఞానము లేకుండుట బంధమని చెప్పఁబడినది. అట్టిబంధమునుండి విముక్తికిఁదొలుత ప్రకృతిపురుషవివేకజ్ఞానముగడపి పిదప యోగసాధన మొనర్పవలయు నని విధానము సూచింపఁబడినది. (యోగసాధనముం గూర్చి యష్టాంగయోగములు చూడుఁడు).

నిరీశ్వరసాంఖ్యమున యోగాభ్యాసము ప్రకృతి పురుషవివేకజ్ఞానము గల్గించుకొన నొకసాధనముగఁ జెప్పఁబడినది. ఈసేశ్వరసాంఖ్యమునఁబ్రకృతిపురుష వివేకజ్ఞానము తొలుతఁ గల్గినపైని యోగాభ్యాసము మోక్ష సాధనముగఁ జెప్పఁబడినది.

నిరీశ్వరసాంఖ్యమునఁ బ్రకృతిపురుషవివేకజ్ఞానము వలన జనించిన పాపావదవస్థ మోక్షమని చెప్పఁబడినది. ఈసేశ్వరసాంఖ్యమున యోగాభ్యాససిద్ధి మోక్షముం గల్గించుచునని చెప్పఁబడినది.

ఇంక నీశ్వరున కాత్మలకన్న నధికముగ సర్వతంత్రస్వాతంత్ర్యమును, సర్వజ్ఞత్వమును, సర్వకర్తృత్వమును, కేవలసత్వగుణమే రూపముగ గల్గియుండుటయు, నాత్మజ్ఞానము, నాత్మల కుపదేశించు దేశికత్వమును, నీసేశ్వరసాంఖ్యమతవిధానమునఁ జెప్పఁబడినవి.

పాతంజలి రచించిన యోగశాస్త్రమునందు నాలుగధ్యాయములుగలవు. అందుఁ బ్రథమాధ్యాయమున వైరాగ్యవిషయములును, ద్వితీయపాదమున యమనియమాద్యష్టాంగయోగవిధానవిధులును, తృతీయపాదమున యోగవిభూతులును, చతుర్థపాదమున మోక్షధర్మములును చెప్పఁబడినవి. సేశ్వరసాంఖ్యవిధానమునఁ బదార్థములు 'ఈశ్వర ఆత్మ ప్రకృతు' లని మూఁడు చెప్పఁబడినవి. [నిరీశ్వరసాంఖ్యమున నాత్మప్రకృతులు

రెండుమాత్రము చెప్పఁబడినవి]. ఈశ్వరునకుఁ బ్రకృతితో సంబంధముకల్గుకతన చలింపఁడనియు, నాత్మకుఁ బ్రకృతితో సంబంధము కలుగునంతనే సకలవేదనలపాలౌననియు, వాట్లనుండి తప్పించుకొన యోగాభ్యాసమే కర్తవ్యమనియు, యోగాభ్యాసమునకుం బూర్వమే ప్రకృతిపురుషవివేకముఁ గల్గియుండవలెననియుం జెప్పఁబడినది. మరియు నీశ్వరుఁడు సర్వకార్యనిర్వాహకుఁడనియుం జెప్పఁబడినది.

సేషిగోత్రము:— [జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు].

స్కేన్డియమ్ [Scandium]:— ఇది 'rare earth metal of the cerium group' అనిచెప్పఁబడినది. దీని chemical symbal Sc అనియు, atomic weight 45°1 అనియు, atomic number 21 అనియుఁ జెప్పఁబడినది.

దీని oxide ను Nilson అను రసాయన శాస్త్రవేత్త క్రీ. శ. 1879 లోఁ గనిపెట్టెనట. మఱియు నిది స్కాండినేవియా సీమలందు monazite thorite అనఁబడిన rare minerals తో దొరకుచున్నదట. ఫిన్లాండు, గ్రీన్లాండు లందు తగరముతోఁ గలసి దొరకుచున్నదట.

స్టేంటోరియన్‌లంగ్స్ [Stentorian-Lungs]:— గొప్ప ధ్వనిచేయువారిం గూర్చి పలుకు ఉక్తి. Stentor అను గ్రీకువాఁడు క్షేత్రమున herald గా నుండువాఁడట. Trojan war నందు నట్లె పనిచేసినవాఁడట. ఆతనిధ్వని యేబదిమంది మనుష్యులధ్వని యంత హెచ్చుగ నుండెడిదట.

స్టేటుకోచి:— పాశ్చాత్యదేశములందు దేశ మేలుప్రభువు లుత్సవాదులందు నూరేగింపులందు నెక్కునట్టి గుఱ్ఱపుబండ్లకు 'State coach' అనె దరు. వీటికి నాల్గు, ఆరు, ఎన్మిది, పది, పండ్రెండు గుఱ్ఱములంబూసి యూరేగింపు చేయుదురు.



స్టేడియమ్ (Stadium):— గ్రీసుదేశము పొడవుం గొలుచు పరిమాణము. ఇంచుమించు 583 . 5 అడుగు లగును. ఈస్టేడియమ్ కొలత ఓలింఫియా ఆటలందుఁ బందెపుఁగొలతయని చెప్పఁబడినది. పిదప నాటలాడు గృహమునకును, ఈపేరే వాడుక యయ్యెనట.

స్టేపిల్ (Staple):— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ప్రధానమగు ముఖ్యమైన యని యర్థము. ప్రధానమగు చేతిపనులకు 'Staple industry' అనియు, ప్రధానభోజనపదార్థములకు 'Staple food articles' అనియుం బేరులు.

స్టేషనెరీ [Stationery]:— ఇప్పుడు కాగితములు, కలములు, పెన్సిళ్ళు, సిరా, వ్రాయని పుస్తకములు మొదలగువ్రాఁతసామానులకువాడు

చుండు ఉక్తి. తొల్లింట నాంగ్లదేశములం దట్టి వర్తకులే పుస్తకములంగూడ విక్రయించుచుండు వారు (Book sellers). విద్యాప్రాముఖ్యత కల్గి నిర్బంధవిద్య ప్రారంభమగుకతన నచ్చటచ్చట నావర్తకులయంగడులు నిర్మించియుంట కేర్పాటు జరిగెనఁట. గాన (station వారి యంగడికి నియమింపఁబడినతావుగను, వారికి 'stationer' అనిపేరు పారంభమై నానాఁటికి వా రమ్ము సరకునకు 'stationery' అనియుంగూడ వాడు కగా నారంభించెను. పిదప నానిర్బంధపు టేర్పాటు లంతరించినను పేరుమాత్ర మట్లే నిలచియున్నది.

**స్టేలుచెక్కు** [Stale cheque]:—వాణిజ్యసంబంధపరిభాషా పదము. సకాలమున cash చేసుకొనక నుంచఁబడినచెక్కు. ఈసందర్భమున నాఱునెలలు గతించినచెక్కులను బాంకులయం దుఁ దీసుకొనరు.

**స్లేటురాతిపలక** [Slate]:— ఈజాతి రాళ్ళ నందఱుఁ జూచియేయుందురు. ఇవి పలు చనిరేకులుగఁ జీరందగినపొరలం గల్గియుండును. రసాయనశాస్త్రజ్ఞులు దీనిని 'hardend and altered form of clay' యనెదరు.

దీనియందలి తొల్లింటిపంకమునందు silicate of aluminium ను, ఇసుకయు, సున్నమును, గలిసియుండెడిని. ఆబంకమన్ను వేఁడికి, గాలికి గట్టి పడి స్లేటురాయిగ నేర్పడునని చెప్పఁబడినది.

Earth caust యొక్క movements వలనఁ గల్గిన నొత్తుడులచేనదుమఁబడి mineral particles నర్దుకొనుననియు, వేఁడికిగట్టిగ రాయియే ననియు నందురు. రసాయన శాస్త్రమున నీశిలలకు metamorphic' అని నామమిడియున్నారు.

మరియు నీబంకమట్టి తననుండి నీటిం జొర నిచ్చునది కాదనియు, చాలమెత్తనిదియు, వదులగు నదియు నొట నతిత్వరితముగ కుళ్ళి decompose అగునది గాన నిటుల శిలీభూతమగుటకు నుసాధ్యమై యుండునది యనియుం జెప్పఁబడినది.

**స్వేతగోత్రము:—**
(శౌనక లేక గ్రత్సమదగణము చూడుఁడు.)

**స్ట్రెటిగ్రాఫీ** (Stratigraphy):— భూగర్భశాస్త్రమునం దొకభాగము. బొగ్గుగను లనుగురించిన కల.

**స్ట్రెటజీ** (Strategy):— ఫ్రెంచిభాషా జన్యము. యుద్ధము క్రమప్రకారము నడుపుటను గురించినకల. 'స్ట్రెటెజిక్'(Strategic) అనఁగా నందున కస్వీయవిజయార్థము ప్రయోగించు కపట తంత్రము.

**సైంధవగోత్రము:—**
(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**సైంధవలడ్డు:**—సైంధవుఁడు సింధుదేశపురాజు. దుర్యోధనునిసోదరియగు దుస్సలాదేవి భర్త. కురుక్షేత్రసంగ్రామరంగమున తనజనకుఁడగు నర్జునుఁడు కొండొక రణరంగమునఁబోరాడుచున్న సమయమునఁ బద్మవ్యూహము ఛేదింపఁ బోయిన యభిమన్యుని మాయచేసి చంపినవాఁడు. పద్మవ్యూహమంతయు ఛేదించుకొని నిరపాయముగా మరలుచున్నతఱి నడుమ నడ్డుదవిలి యభిమన్యుని మరణమున కితఁడు దుష్టచతుష్టయముతోఁగూడఁ గారకుఁ డయ్యెను. అప్పటినుండియు సర్వమును సిద్ధమయిన కార్యమున కెవరయిన మాయచేసి

యద్దుదవిలి కార్యభంగము చేసెనయెడల దానికి 'సైంధవలద్దు' అనునది లోకోక్తియయ్యెను.

## సైంధవాయనగోత్రము:—

(ధనంజయగణము చూడుఁడు.)

## సైంధవాయనగోత్రము:—

(కుశికగణము జూడుఁడు.)

## సైంధవారణ్యము:—

(నవారణ్యములు చూడుఁడు.)

## సైంహికేయగోత్రము:—

(భరద్వాజఉపగణము చూడుఁడు.)

**సైకతచిత్రరచనాకల:**—సైకత మనిన నిసుక. దీనితోఁ జిత్రములను [బొమ్మలను] రచించుట యని దీనిభావము. ఇది కేవలనవీనమైనకల. ఇటీవల నైరోపాఖండమునందున్న బెల్జియముదేశమున బయలుదేఱినది. ఆదేశపు సముద్రతీరములందుఁ బలురంగుల సన్ననిసముద్రఁపుటిసుకలు విరివిగా దరికిం గెరటములచేఁ ద్రోయంబడు చుండును. అం దిరువదిరం[illegible] [illegible]లు కలవు. హెకెల్జెమ్ [Hekelgem] అనుపేరుగల గ్రామముకడ నీరంగులయిసుకలు విస్తారముగ దిబ్బలుగా నేర్పడియుంటఁ గాననయ్యెడిని.

బెల్జియను లనాదిగాఁ బరిశుభ్రతకుఁ బేరందినవారు. వారియిండ్ల చీడీలు, వరండాలు, వాకిళ్ళు గట్టి నున్ననియిటుకలతోఁ గట్టంబడి తళుకుగఁ గడుగంబడుచు నతిపరిశుభ్రతగా నుంచఁబడుచుంటకుఁ బేరందియుండును. చిరకాలమునుండియు వాటిపై రంగులయిసుకలతో ముగ్గులుపెట్టుచుందురు. అది వారియం దాచారమైయున్నది. రానురానాముగ్గులు వివిధములుగ నాకారములను కడకఁ బొమ్మలుగను చిత్రింపఁబడుచుంట ప్రారంభమై యింటింటఁ గాననగుచుండెను. ఇటులుండ నొకప్పు డొకముసలమ్మ తనముంగిట గోడలందలి పటములం దున్నరీతిని చిత్రరూపములనిడ మొదలిడఁ గొన్నినాళ్ళ కదియు గ్రామమంతట నలము కొనసాగెను. అచిరకాలముననే నాయూరి బాలబాలికలెల్ల రీసైకతచిత్రరచనాకౌశలమున నేర్పరులు కాసాఁగిరి. అంతఁ గొందరు యువకు లెక్కువ నేర్పునకు బహుమతులీయ పోటీపరీక్షలను, ప్రదర్శనములను చందాలనెత్తి జరుప నారంభించిరి. పెక్కుపోటీప్రదర్శనములు నడచి యాగ్రామమున 'ఇన్కీపర్' [in-keeper] గానుండిన Pierre Van Ransbeek అనుపేరుగల యువకుం డా పోటీపరీక్షలందు నేర్పరియని మెప్పునందుచు, పెక్కు బహుమానములం బడయుచుండు వాఁడట. అతని కతా[illegible]గ సైకతచిత్ర మెంతబాగున్నను గాలికిఁ జెడిపోవునది గాన నస్థిరమని తోచి దానిని స్థిరముగనుండఁజేయు సాధనముండిన బాగుండునని తోచి, అట్టిప్రయత్నములం జేయ మొదలిడి పెక్కుపరిశీలనల నొనర్చుచు నెట్టకేల కొకద్రావకముం గని పెట్టి చేయఁబడిన సైకతచిత్రము చెడక గట్టిపడి యట్లే స్థిరముగనుండ నొనర్పంగల్గెనట. ఆగ్రామస్థులలోఁ గొంద రతిస్వల్పకాలముననే శ్రమయనునది లేక లతలు, పుష్పములు, ఫలములు, తదంగములు మొదలగువాటిని రంగులయిసుకలతోఁ జిత్రింప సమర్థులని తెలిసెడిని. అంతగాఁ బ్రసిద్ధినంది హెకెల్గెమ్ గ్రామముపుఁ బేరు ప్రసిద్ధమై, రాన్సుబీక్ చిత్రలేఖకునిపేరు ఐరోపాదేశములందు సుప్రసిద్ధమాయె నట. ఇది యాకలయొక్క కథనము. ఆరాన్సుబీక్ పండితునిసైకతచిత్రములు

పిదప స్థిరముగా జెడిపోకుండ జేయఁబడుచుఁ జేరంచుచున్నవి. బెల్జియమ్‌దేశపు వెనుకటిరాజ్ఞి గారిచిత్రపట మిప్పుడు రాజభవనమున వ్రేలాడఁ బడియున్నది. జార్జిసార్వభౌముని చిత్రపటము నాయన రచించెనని తెలియుచున్నది. వారిదేశ మున జిత్రలేఖకకలానిపుణులని పేరందిన పెక్కండ్ర విగ్రహచిత్రపటముల నీతండు రచించియున్నట్లును, Expressions ను, చక్కగను, బలముగను, తేగలశక్తియీతనికిం గలదనియు, రాన్ను బీక్ చిత్ర లేఖకునకుం గీర్తి కలదు. తొలుత నీమనుద్దతో నాకారముంగీచుకొని, పైని రంగుయిసుకల నర్హ రీతిని బోయుచు తనదారివకమునం దడిపి గట్టిఁ గల్గించుచు నీతండు పనిచేయుచుండు నట.

సైకతము:—
[ఇసుక చూడుఁడు. సిలికా చూడుఁడు.]

సైకాలోజీ (Psychology):— మాన సికసంబంధశాస్త్రము. పాశ్చాత్యకల. మనస్సు యొక్క వ్యాప్తి, తలంపులు, జ్ఞాపకము, రోత, విచారము, అహంకారము, గర్వము, దుర్వృత్తులు మొదలగువాటిస్థితులను వివరించుశాస్త్రము.

సైకిల్ బండి:—
[బైసైకిల్‌కథనము చూడుఁడు.]

సైకోపతీ (Psychopathy):— మెదడు నకుసంబంధించినవ్యాధులను (అనఁగా లనుబట్టి మెదడుకుఁ జేసినజబ్బులుగాక మనోవైకల్యములచే మెదడు చెడినవ్యాధులు) గురించిన వెద.

సైకోఫిజియాలోజీ [Psychophysiology]:— మనశ్శరీరములకుఁగల పరస్పరసంబంధములను, ఒకదానినిబట్టి మఱియొకదానికి వచ్చు మార్పులను దెలుపుశాస్త్రము.

సైకోమెట్రి (Psychometry):— మానసికశక్తియొక్క గమనపరిమాణమును దెలుపునట్టిది.

సైకోమెన్సీ (Psychomancy):— ప్రెంచిభాషాపదజన్యము. దివ్యశక్తులచే లేక దేవతలతోఁగల మానసికసంబంధముచే భవిష్యత్తు చెప్పునట్టికల.

సైకోలజీ [Psychology]:— మానసిక పరిణామములకు, నింద్రియజ్ఞానమునకు, సంబంధించినశాస్త్రము. ప్రకృతితో, సంఘముతో, సంబంధముగల మనుష్యునిమానసిక ప్రవృత్తియందుఁ గలుగు పరిణామముల నీశాస్త్రము తెలుపుచుండును. పదార్థతత్వశాస్త్రమునుండి భిన్నమగు నీసిద్ధాంతములు ప్రత్యేకము మానసికశక్తినుండి యాత్మశక్తి నుత్తేజింపఁజేయుటకు సాధ్యపడుమార్గములు సూచించును. ఈశాస్త్రమునందు బహువిధములగుజీవితము లుదాహరింపఁ బడి మానసికపరిణామములను దృష్టాంతపూర్వకముగ స్పష్టీకరించును. ఈసిద్ధాంతముల కాస్ట్రియనుపండితుఁడగు (Sigmund Fread) క్రీ. 1856 జన్మను.] పందొమ్మిదవ శతాబ్దమునఁ బ్రప్రథమమున దారి తీసెను. Swiss పండితుఁడగు Carl jung మిగుల నభివృద్ధిపఱచెను.

సైక్రోమీటరు (Psychrometer):— వాయువునందుఁగల శీతోష్ణములను గొల్చుటకుఁ గల రబ్బరుబంతివంటి పరికరము.

సైక్లాడీసుద్వీపములు:— గ్రీసుదేశమున కుం జెందినద్వీపములు. [గ్రీసుదేశము చూడుఁడు.]

**సైట్‌బిల్సు** (Sight bills):— వీటికి 'సైటుబిల్సు ఆఫ్ ఎక్సుఛేంజి' యనియందురు. దర్శనహుండీలు [హుండీని] చూపుటకు 'sighting a bill' అనియెదరు.

**సైటోలోజీ** (Cyrtology):— జంతువులు, వృక్షములు మొ॥ నవిజనించుట కేర్పాటగుటకు మూలములగు cells నుగూర్చినకల.

ఇట్టి cells ఏపదార్థములతోఁజేయఁబడినదో దానిని విమర్శించుశాస్త్రభాగమునకు 'cytoplasm' అనెదరు.

**సైడరైట్**:—ఇది 'Iron carbonate' అనిచెప్పఁబడినది. పసుపుఁబచ్చధాతువు [రంగులు] కలది. మెఱుపుప్రకాశము కల్గియుండునది.

**సైడీరియల్‌టైమ్**:—
(కాలవిభజనముఁ జూడుఁడు.)

**సైడీరియల్ సంవత్సరము** (Siderial సంవత్సరము):— ఎస్ట్రోనొమీశాస్త్రమున నీవత్సరకాలమున సూర్యుఁడు 360 డిగ్రీల ప్రదేశము తిరిగివచ్చునని చెప్పఁబడినది.

**సైడెరోగ్రాఫీ** (Siderography):— ఉక్కు, ఇనుము మొదలగువానిపైఁజిత్రముల నచ్చులను చెక్కెడువిధానము.

**సైతకిగోత్రము**:—
(లౌగాక్షిగణము జూడుఁడు.)

**సైన్యము [సేన] లు**:— భరతదేశమునఁ దొల్లింటికాలమందుసైన్యములను ౧ పత్తి, ౨ సేనాముఖము, ౩ గుల్మము, ౪ గణము, ౫ వాహిని, ౬ పృతన, ౭ చమువు, ౮ అనీకిని, ౯ అక్షౌహిణి యని తొమ్మిదిగ విభజించువారు.

అందు పత్తియన నొకయేనుఁగు, నొకరథము, మూఁడశ్వములు, నైదుగురు పదాతులుండునది. ఇది యధమమగుసైనికబలము. ఇంతకన్న తక్కువయగుదానిని సైన్యముగఁ బరిగణింపకుండిరి. ఈ వరుసనే సేనాంగములగు గజరథతురగపదాతులం బరిగణించుచుండువారు.

ఇట్టిపత్తులు మూఁడగునేని యొకసేనాముఖమనంబడెను. అనఁగా 3 ఏనుఁగులు, 3 రథములు, ౯ అశ్వములు (గుఱ్ఱపురౌతులుసహా) ౧౫ పదాతులు (కాలిబంట్లు) కలిసియని భావము. ఇట్టి సేనాముఖములు మూఁడగునే నొకగుల్మ మగును. [౯ గజ ౯ రథ ౨౭ అశ్వ ౪౫ పదా]. అట్టి గుల్మములుమూఁడగునేని యొకగణము.[౨౭ ఏనుఁగులు ౨౭ - రథ - ౮౧ అశ్వ - ౧౩౫ పదా] అట్టిగణములు మూఁడుకలసి యొకవాహిని [౮౧ గజ - ౮౧ - రథ ౨౪౩ అశ్వ - ౪౦౫ పదాతు] అట్టివాహినిలు మూఁడుకలసి యొకపృతన యగును. ౨౪౩ గజ - ౨౪౩ రథ ౭౨౯ అశ్వ -౧ ౨౧౫ పదా]. అట్టిపృతనలు మూఁడగునేని యొకచమువు [౭౨౯ గజ - ౭౨౯ రథ - ౨౧౮౭ అశ్వ - ౩౬౪౫ పదా.] ఇట్టిచమువున కధిపతియగువానిని చమూపతియనువారు. ఇట్టిచమువులు మూఁడు కలసి అనీకిని యనంబడెను. [౨౧౮౭ గజ - ౨౧౮౭ రథ - ౬౫౬౧ అశ్వ - ౧౦౯౩౫ పదా] ఇట్టి అనీకినులు పదియగునేని యొకఅక్షౌహిణి యనంబడెను. ఇందు ౨౧౮౭౦ గజములు - ౨౧౮౭౦ రథములు - ౬౫౬౧౦ అశ్వములు, ౧౦౯౩౫౦ పదాతులు నుండును. భారతయుద్ధము

మొదలగు తొల్లింటి గొప్పయుద్ధములందు తొల్లింట సీయక్షౌహిణిలలెక్కమేరకు లెక్కించుచుండిరి.

**సైన్యవిభాగములు:-** ఆంగ్లప్రభుత్వపు సైన్యములు 'ఆర్మీకోరనియు, 'ఆర్మీసర్వీస్' రనియు, 'ఆర్మీఆర్డినెన్సుకో' రనియు, 'ఆర్మీమెడికల్‌కో' రనియు, 'రెజిమెం' టనియు, 'కంపెనీ' యనియుఁ బేర్లంబరఁగెడిని.

సర్వసాధారణముగ బ్రిటీషు సైన్యమున ౩౮,౦౦౦ పదాతులును, ౧౫౨ ఫిరంగులును, ఒకకో రనెదరు. ఇది రెండుడివిజనులుగ నుండును. అం దశ్వసైనికులుగూడ నుండుటయుం గలదట.

'బ్రైగేడ్' డనిన పదాతులు నశ్వసైనికులు నుండుపటాలము. నాల్గువేలు మొద లేడువేల వఱకు పదాతులులు, వేయిమొదలు రెండువేల వఱకు నశ్వసైనికులు నుందురని తెలియుచున్నది.

రెజిమెంటునందు రెండువేలుమొదలు నాల్గువేలవఱకు పదాతులును, అయిదువందలు మొదలు వేయివఱకు నశ్వసైనికులు నుందురట.

నూటయిరువదిమంది పదాతులుండు సైన్యమునకు 'కంపెనీ' యనెదరు.

సైనికులకు భోజనపదార్థములం గొంపోవుటయు, గుడ్డలుకుట్టుట, గుఱ్ఱపుజీనులనుకుట్టి లేక మరమ్మత్తుఁజేసి సిద్ధపఱచుట, గుఱ్ఱపులాడములం బిగించుట, అవసరమగు చిన్నవడ్రంగిపనులు చేయుట మొదలగుపనుల నెఱపు దండునకు 'ఆర్మీసర్వీస్‌కోరు' అనిపేరు.

ఆర్మీ ఆర్డినెన్సుకోరునందు కమరపుఁబని చేయువారు, కంచరపనివాండ్రు, కాలరులు చేయుపనివాండ్లు, ఫిట్టరులు, వీలరులు, గుమస్తాలు, వారిపై యుద్యోగులు మొదలగువా రుందురు. యుద్ధభూమినుండి తిరిగివచ్చిన తుపాకులు, ఫిరంగులు మొదలగువానిని మరమ్మత్తుచేయుటయు, ఆయుధములు, మందుగుండుసామానులను, యుద్ధపరికరములను, యుద్ధభూమికిం జేర్చుట వీరి విధులలోనివి యందురు.

సైనికులకు వైద్యసహాయమొనర్చునది 'ఆర్మీమెడికల్కోరు' రనంబడును. ఇందు మందులిచ్చువారు, శస్త్రముచేయువారు, కట్లుగట్టువాడు, కడుగువారు మొదలగువా రుందురు.

ఇతరదేశంపుసైన్య విభాగములు వేర్వేరువిధములుగ నుండునని తెలియుచున్నది.

ఆంగ్లసైన్యములం దశ్వసైనికులు దినమున కవసరముంబట్టి ముప్పదిమొద లేబదివఱకు నడచెదరట. ౩౨౬ అశ్వసైనికులును, నొకఆఫీసరును గలిసి యొకటూప్ అనంబడును. ఇట్టిమూఁడు టూప్పు లొకస్క్వాడ్రన్ అగును. అట్టివి మూఁ డొకరెజిమెం టనంబడి యొకలెఫ్టినెంటు కర్నలుక్రింద నుండును.

ఇట్టి రెజిమెంట్లు మూఁడై నొకబ్రిగే డనంబడి యొకబ్రిగేడియర్‌జనరల్‌క్రింద నుండును. నాల్గుబ్రైగేడులు కలసి యొక్కడివిజన్ అనంబడును.

**సైన్యజిత్‌గోత్రము:—**

[జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.]

**సైన్యాంగములు:—**

[అంగములు చూడుఁడు.]

**సైప్రసుద్వీపము:—** ఏష్యామైనరు ఆర్కిపిలెనోసముద్రముననున్న బ్రిటీషువారి ద్వీపము.

మధ్యధరాసముద్రమున నున్నది. ౩,౫౦,౦౦౦ జనాభా కలదు. ఒకహైకమీషనుక్రింద నున్నది. సైప్రసుశబ్దమునుండియే 'Copper' అను రాగి శబ్ద మేర్పడెనట. ఇట గనులుండెను. నికోసియా ముఖ్యపట్టణము, రేవుసైయున్నది. గోధుమలు, బార్లీ, ప్రత్తి పంటలు, ఓలివుతోటలు గలవు. సముద్రమున స్పంజి విశేషముగ దొరకును. [ఏష్యామైనరు చూడుఁడు.]

సైఫన్ (Siphon):—Irrigation enginring నందు వివరింపఁబడిన యొకనిర్మాణము నకుఁ బేరు. (ఇరిగేషన్ చూడుఁడు.) ఒకజల ప్రవాహముయొక్క గాని, బాటలయొక్క గాని, మట్టములకు స్వల్పభేదముగల మట్టమున (అనఁగా నించుకభేదముతో నదే మట్టమున) అడ్డముగ వేఱొకజలప్రవాహము దాఁటవలసిన వచ్చినతరి, పైనుండి వంతెన నిర్మించి దాఁటించుటకు వీలుం డదు. అట్టితరి క్రిందికి త్రివ్వి గొట్టమువలెఁ గట్టి moesonary నిర్మాణముగాని, రెయిన్ఫోర్స్డు కాంక్రీటునిర్మాణమునకుం గాని, యొకప్రవాహ మునకై యేర్పఱచి దింపి క్రిందినుండి నడిపి దాటించి తిరుగఁబ్రవహింపఁజేసెదరు. దీనికి 'సైఫన్' అనిపేరు. కొన్నితావులందు ఆక్విడక్టు నిర్మిం చుటకన్న సైఫన్‌లను నిర్మించుట చాలా చౌకగ నగుంగాన వీటినిర్మాణములు జరిగెడిని.

సైబీరియాదేశము:— ఇది యాసియా ఖండమున నుత్తరదేశము. రష్యావారి రాజ్యము లోనిది. [రష్యాదేశము చూడుఁడు.] ఈదేశమున నొకప్పుడు తొల్లింట నొకతార్తారు ఖానుభూపతికి సైబీరనుపురము రాజధానియైయుండి, దానినుండి సైబీరియా యని పేరొందెనని చెప్పఁబడినది. దేశ వైశాల్య మేఁబదిలక్షల చతురఁపుమైళ్ళని యంచ నా వేయఁబడినది.

ఇది యుత్తరమున నార్కిటికుసముద్రమునుండి ఆల్టాయిపర్వతముల కించుక యేటవాలుగల సమ తలప్రదేశముగ నున్నది. ఓబీనది, ఎనిసీనది, లీనా నది, గొప్పనదులు నెమ్మదిగా నీదేశమునుండి ప్రవహించుచుండును. ఆమూరునది దీనికి, మం చూరియాకు సరిహద్దునఁ బ్రవహించుచుండును. ఇర్టిషనది పశ్చిమమున బాల్కాషుసరస్సునఁ జేరు కొనును. ఆగ్నేయదిశయందు పర్వతములును, నైరుతిదిశయం దిసుకబయళ్ళును గలవు. నదుల యందుఁ బెద్దపొగయోడలు ౧౦౦౦౦ మైళ్ళుపోఁ దగినలోతుప్రదేశ మార్గములు కలవు. శీతకాల మున బిగిసిపోయి మంచుగ నగుకతన స్లెడ్జిలపైఁ బ్రయాణములు చేయును.

బియిలూఖశిఖర మాల్టాయిపర్వతపంక్తియం దున్నది. ౧౧౦౦౦ అడుగులయెత్తుగల్గి తెల్లగ నుండుట నాపేరఁదినది. ఆల్టాయిపర్వతములసాగు డునే యాబ్లోనాయిపర్వతములుగను స్థానోవోయి పర్వతములుగ నగుచున్నవి. ఇవి తూర్పున సము ద్రముదనుక నేగును. బైకాల్సరస్సు పవిత్రోదక పూరితమని తలంపఁబడుచున్నది. దానికిఁ బశ్చిమ మున బాల్కాష్‌సరస్సు కలదు. ఇంకను పశ్చిమ మున అరాల్‌సరస్సు కలదు. దీనిని 'అరాల్సముద్ర' మనియు నందురు. ఉత్తరభాగము ప్రిజిడ్‌జోనునం దుంట మహాచలిప్రదేశము. సగటున చలిగాలులు దేశమంతటను వీచుచుండును. దక్షిణమున ఫారెన్హీ నైటు తెర్మోమీటరు వేసవియందు 120 డిగ్రీల వఱకు లేచును. బంగారము, వెండి, ప్లాటినము విస్తారముగ గనులందు దొరకుచున్నది.

శీతలప్రదేశ మగుటను జనసమృద్ధిలేకను గొప్ప గొప్పారణ్యప్రదేశములు వ్యవసాయము లేక యున్నవి కలవు. దక్షిణమున వేఁడిభాగములందు

సైధాన్యము, బార్లీధాన్యము పైరగుచున్నవి. మధ్యభాగమున నడవులందు గొప్పకలప గలయడవులు కలవు. వాట్లపైనచెట్లుపెరుగక పొట్టివిగనై తుదకు చిన్నమొక్కలవలెనై ముదిరి చచ్చిపోవును. రెయినుడీరుల కాహారమగునాచు సమృద్ధిగనుండును. ఫర్ లకు, తోళ్లకు పనికివచ్చు మృగములు పెక్కు గలవు. 'మామొ' తనంబడునొక జాతియేనుఁగు తొల్లింట నీదేశముననుండెఁ గాని యిప్పుడు తప్పిపోయినది. వాటియెముకలు భూమియందు, పూడియుండి త్రవ్వెన దొరుకుచున్నవి. వానిని యేనుఁగుదంతమువలె నుపయోగించుచున్నారు. లీనానదిముఖద్వారప్రాంతములను, అచట విస్తారముగా నున్నద్వీపములందునను నివి విస్తారము త్రవ్వి యెత్తఁబడుచున్నవి.

దేశమున నివసించుజనులలో సగమున కెక్కువమంది స్లెవోపాసంతతివారు. వారియం దనేకులు వారిదేశములందు శిక్షితులై యిచటిగనులందు, పనిపాటలుచేయుచు వరక మనుభవించువారి సంతతివారై యున్నారు. ఆదిమ నివాసులగు స్వదేశస్థులు, దేశదిమ్మరులు 'సెమోలీడస్' అనంబడు ఎస్కిమోజాతు లుత్తరతీరనివాసులు. (ఎస్కిమో చూడుఁడు.) నైరుతిదిగ్భాగమియందు కిర్ఘిజ్ తెగవారును, ఓస్టియాకు తెగవారును, ఆగ్నేయదిగ్భాగమున టుంగూశీతెగవారును, నధిక సంఖ్యాకులు నివసించుచున్నారు. బైకాల్సరస్సు ప్రాంతములు బూరియాట్ జాతులు గొఱ్ఱెలను, మేకలను, పశువులను మేఁపుమందలుగలవారుగ నున్నారు. క్రైస్తవమతము, మహమ్మదీయమతము, పిశాచపూజమతము, దేశమునఁగల మతములు. దేశమున ట్రాన్సుసైబీరియన్ రైయిల్వేయును, ననేకపొగయోడలును ప్రయాణసౌకర్యములై యుండునవి.

ప్రభుత్వము రష్యావారిపరిపాలనయం దున్నది. దేశమంతయు నాల్గు ఓబ్లాస్టు (భాగము) లుగా విభజింపఁబడి, యొక్కొక పరిపాలకునిక్రింద నున్నది. సైబీరియాభాషయందు 'స్కు' (sk) యనిన పురమని యర్థము. ఇటులనే ఓమస్కుపుర మనిన ఓమ్నదిపై నున్న పురమని యర్థమగును.

ఇర్కుటస్కుపురము ప్రధానపట్టణము. ఇది బైకాల్సరస్తీరమున నున్నది. టోబాల్నది, ఇర్టిష్నదియు కలియుతావున టోబాల్స్కుపురము గలదు. ఇది గొప్పవర్తకస్థలము. కియాఖ్టాపురము చీనాదేశముతో వర్తకము నడచుతావుగ నున్నది. లీనానదీతీరమందున్న యాకుటస్కుపురము ఫర్ వర్తకమున పేరందినది. మఱియు నిట మామూతు ఏనుఁగులదంతముల వర్తక మధికము. ఇది ప్రపంచమున నెక్కువశీతలమని చెప్పఁబడినది. ఒఖోట్సుసముద్రతీరమునన్నున్న ఒఖాటస్కుపురము. కామ్చట్కానుండి వచ్చు ఫర్ (Fur) వర్తకమునకుఁ జేరందినపట్టణము. ఆమూరునదీప్రాంతసీమయందున్న వ్లాడీవొస్టొకుపురము ప్రభుత్వమునావికాస్థానమై యున్నది. దీనికి (Ruler of the East) అని యర్థమందురు. దీనినుండి సెంటపీటర్సుబర్గున కినుపదారికలదు. ఓబినదియందుఁ గలియు నుపనదియగు టోమునదీతీరముననున్న టోమాస్కుపురమును, ఓమ్నదీ తీరమునఁగల ఓమాస్కుపురమును, వర్తకస్థలములై యున్న యితరపట్టణములు.

ఒకప్పుడు సైబీరియానుండియించి యేలిన యెర్మాకను కొజాకుభూపతి ౧౫౮౭ లో నిర్మించె నని చెప్పఁబడినది. కామ్చట్కా లేక కామట్కా ట్కాద్వీపకల్ప మడవులు గలవి. పర్వతమయ మైనది. అలియూటియన్ద్వీపములును, సఘాలియె న్ద్వీపమును, సైబీరియాప్రభుత్వమునకుం జెంది యున్నవి. (కామ్చట్కాద్వీపకల్పము, అలెయూటు యన్ద్వీపములు, సఘాలియెన్ద్వీపము చూడుఁడు.)

## సైమూమ్ సిరోక్కో (Simoom - Sirocco):—

అరేబియాదేశమున వీచు వేఁడిగాలు పులగాలికి 'Simoom' అనియు, ఆఫ్రికాదేశము లలోవీచు వేఁడిగాళ్ళుపులగాలికి 'serocco' అని యును బేర్లు. (వాయువు చూడుఁడు).

ఎడారులం దిసుక నెగురగొట్టి మేఘములవలెం జేసి భూమిపైఁబడుటలోఁ గొన్నివర్తకపుకార్వా నాలను సైతము గట్టివేయఁజాలును. ఇట్టి వీజట్టి లో క్వార్టోంప్రాంతపు టెడారియందు తఱచుగ గలుగుచుండును. అప్పటప్పట నాస్ట్రేలియా, అమెరికాదేశముల యెడారులందుఁ గూడఁ గల్గు చుండునందురు. దీని నాంగ్లమున 'శాండ్‌స్టారమ్' అనియెదరు. అనఁగా నిసుకతుపానని యర్థము. ఇవి యెడారిసంబంధమగు నపాయములలో నగ్ర గణ్యములు.

## సైయాగ్రాఫీ (Sciagraphy):—

(స్కైయాగ్రాఫీ చూడుఁడు).

## సైరంధ లేక సైరంధి లేక సైరంధ్య గోత్రము—

[కథ లేక కథ్యగుణము చూడుఁడు].

## సైరంధ్రిగోత్రము:—

(లౌగాక్షిగణము చూడుఁడు).

## సైరంధ్రి:—

(అజ్ఞాతపాండవులు చూడుఁడు).

## సైరస్ [Cyrus]:—

సిరిసియన్ నామము. పారసీకసామ్రాజ్య స్థాపకుఁడగు 'Cyrus the Great Emperor of Persia' పేరు. సూర్యున కర్థమగుపేరు. [ఈచక్రవర్తి క్రీ॥ పూ॥ 529 లోఁ జనిపోయెను]. పురుషనామము.

(క్రైస్తవనామములు చూడుఁడు).

## సైర్దారియానది (జాక్సారిటీసునది):-

దీనికిం బొల్లింట వేర్వేరుకాలములందు సితానది యనియు, శిలానది యనియు, రసానది యనియుఁ బేర్లుండెను. అవెస్తాయందు రస్తానది యనిచెప్పఁ కెను.

(రష్యాతురుష్కరాజ్యము చూడుఁడు).

## సైరిన్ధ్రపురము:—

దీని నిప్పుడు 'సర్హింద్' అనుచున్నారు. పంజాబునం దున్నది.

దీనిప్రశంస బృహత్సంహిత ౧౪ - ౨౯ యందుఁగలదు. బ్రహ్మాండపురాణము, పూర్వ ౫౦ అధ్యా. 'స్కందు' అనియు, వరాహసంహిత ౧౪ అధ్యా. 'సిరింధ' యనియుం బేర్లు గలవు.

## సైరిక్ - సైరిక్ల్ (Cyril Cyrill):—

గ్రీకునామము. ఇది గొప్పతత్వవేత్తయగు St. Cyril ఋషియొక్క పేరు. 'Loprdlr' అని యర్థము. పురుషనామము.

(క్రైస్తవనామములు చూడుఁడు.)

## సైరిషిగోత్రము:-

(లౌగాక్షిగణము చూడుఁడు.)

**సైర్ (Cyr):—** గ్రీకునామము. ఆదివారము. (సబ్బాతు) పుత్రుఁడని యర్థము. పురుషునిపేరు.

(క్రైస్తవనామములు చూడుఁడు.)

**సైవకగోత్రము:—**
(అగస్త్య ఉపగణము చూడుఁడు.)

**సైసిరగోత్రము:—**
(హారిత ఉపగణము చూడుఁడు.)

**స్కైస్క్రాపరు కట్టడములు (Sky Scrapers:—** ఆకాశమునై పుకట్టఁబడి యెక్కువ యంతస్థులం గల్గిన యెత్తగుమేడల రమెరికా ఖండమునఁ బెట్టఁబడినది. ఇనుపచట్రములకడ లందు గోడలంగట్టి బిగించి నిర్మించిన యంతస్థుల భవనములు. ఇట్టి వఱువదియంతస్థుల వఱకుఁ గూడ గలవు. పైయంతస్థుల కెక్కుట, దిగుట ఎలక్ట్రిక్కులిఫ్టుల మూలమున జరుగుచుండును. వీటి కమెరికాదేశమున 'ఎలివేటరు' లనియెదరు. వీటికి మూలస్థాన మమెరికాసంయుక్తరాష్ట్రము లందు న్యూయార్కునగరము. సగటున నాదేశమున నివి విస్తారముగ గలవు.

పెద్దపెద్దనగరములందు జాగా లిరుకై, వర్తక వ్యాపారములకుఁ జిక్కుగలుగుట దూరములవలన సంభవించెడిని. విస్తారప్రదేశములంగొని పెద్దయావరణములందు గొప్పకట్టడములంగట్టి కష్టతరమే గాక జాగాలును వర్తకస్థలములకడ లభింపవు గాన నెక్కువ వర్తకమును, ఎక్కువ జనసంఖ్యయు, నెక్కువధనసంపత్తియుం గూడఁగల యమెరికా సంయుక్తరాష్ట్రములవా రీవిధానములకట్టడముల నిర్మింపఁగనిపెట్టిరి. షికాగోనగరమున నివి యిటీవల విరివిగ నిర్మింపఁబడుచున్నవి. జెర్సీపురము నుండి హడ్సనునదిం దాటి న్యూయార్కునగరమున కేగుతరి నివి యత్యద్భుతమై గన్పించుచు వింత గొల్పెడిని.

ఇంక నాయమెరికాసంయుక్తరాష్ట్రసీమలందు 'Giant of all skyscrapers' అని సర్వసాధారణముగఁ జెప్పంబడు గౌరవపదవి నందియున్న Woolworth buildings నుగూర్చి యిచట వివరించుట సమంజసము. అది క్రిందిమట్టమునుండి యాకాశమునకు ౭౯౨ అడుగులయెత్తునకుఁ గట్టఁబడినది. దీనిపునాదులు ౧.౨౦ అడుగులలోతు నుండి నిర్మింపఁబడినవట. మానహట్టన్‌ద్వీపమున నడుగురాతికంటఁ గట్టఁబడిన వందురు. ఉక్కుచట్రమును తొలుత నిర్మించి, గోడలు సెమెంటుతో బిగించి, మార్బెలురాళ్ళు పఱచి, మెఱుగిడి పూర్తిచేసిన యీదివ్యభవనము గంటకు ౨౦౦ మైళ్ళవేగమునం బర్వెడుగాలి కాగునటులఁ గట్టిగ నిర్మింపఁబడి యున్న చిన్ననగరమువలె నున్నది. దీనిబరువు ౨,౨౩,౦౦౦ లుండునని యాంచనా వేసియున్నారు.

ఇందు పెక్కువర్తకసంఘములకార్యస్థానములు (offices) కలవు. అందు పనిచేయునుద్యోగులు పండ్రెండువే లుందురట. ఇంకఁ జూడ కార్యార్థులగవచ్చు వేలకువేలుజను లుందురది వేరుగఁ జెప్పనక్కఱయుండదు. ఈమహాభవన మేఁబది యెన్మిది యంతస్థులు గలది. దానిపై నొక యబ్జర్వేషన్‌గాలరీ (Observation Gallary) నిర్మింపఁబడి చుట్టుపట్లదృశ్యము వింతఁగొల్పుచు దూరమునకు మాసి చెదరునట్లుఁ గన్పట్టును, చూచువారి కుపయోగింపఁబడుచున్నది. దీనియంతస్థులలోనికెక్కుచు దిగుచుంట శ్రమకరము గాన

ఆఱ high speed lifts మిచిటుకాలమునందు రెండేసి బయలుదేఱుచు రెండేసివాప్పుడు దిగుచు పనిచేయుచుండును. ఇవి గాక ప్రత్యేక మేడవది నాల్గవ యంతస్థునకు రెండేసి (lifts) మిచిటు కాలమునం దేమందల యడుగుల త్వరితగతి నెక్కుచు దిగుచుండునవి వేఱుగనున్నవి. ఈకట్టడ మునందు ౫,౦౦౦ కిటికీలును, ౮౦,౦౦౦ విద్యుద్దీప కళికలును, ౧౫,౦౦ టెలిఫోనుయంత్రములును గలవని లెక్కింపఁబడియున్నది. ప్రపంచమునందున్న యిట్టికట్టడములలో నిది యెక్కువ యెత్తుగలదిగఁ జెప్పఁబడుచున్నది. పారిస్‌నగరమునందున్న Eiffel Tower ౧౧౮౦ అడుగులయెత్తు గల్గినవొక్కటియే దీనికన్న నెత్తుగునదిగాఁ జెప్పఁబడుచున్నది.

స్ట్రైక్:— వాణిజ్యసంబంధపరిభాషాపదము. దీనిని 'సమ్మె' యందురు. ఒకసంస్థయందుఁ బని చేయువారు జేరికమై సమ్మెకట్టి పనిచేయక మానుట కీపదము వర్తించును.

స్త్రైకాయనిగోత్రము:—
(కథ లేక కథ్యగణము చూడుఁడు.)

స్త్రైషకిగోత్రము:—
(ఆయాస్యఉపగణము చూడుఁడు.)

స్ఫైగ్మోగ్రాఫీ (Sphygmography):- ఫ్రెంచిభాషాపదజన్యము. ధాతువుల లేక శరీరము నందలి నాడుల గమనవేగమును, దెబ్బలను [కొట్టుకొనుటను] లెక్కించు పరికరమునకు 'స్ఫైగ్మోగ్రాఫ్' అనియు, దానివిధానమును దెలుపువిద్యకు 'స్ఫైగ్మోగ్రాఫీ' యనియుం బేరులు.

స్లైడింగు స్కేల్ ఆఫ్ వేజెస్ [Sliding scale of wages:—వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఒక చేతిపనికర్మాగారమునం జేయఁబడినసరకులు బజారునం దేధరల కమ్ముడు పోవుచుండునో యాధరల ననుసరించుచు మార్పు నందుచుండు పనివాండ్ల వేతనముల స్కేలు.

స్వైదతరగోత్రము:—
(కపి ఉపగణము చూడుఁడు.)

స్వైదేహగోత్రము:—
[ఆయాస్యఉపగణము చూడుఁడు.]

స్వైదేహిగోత్రము:—
(ఆయాస్యఉపగణము చూడుఁడు.)

స్వైరకిగోత్రము:—
[నిధ్రువగణము చూడుఁడు.]

సొకోటో స్టేటు:— ఆఫ్రికాఖండమునందు సూడాన్ లేక నిగ్రిటియాస్టేటులలో నొకటి. సొకోటో రాజధాని. ఇదియును,బోర్నూస్టేటును గలసి నిగేరియా యనుపే రిడఁబడిన Royal Niger Company వారిటెరిటరీలోనికిఁ జేరి యున్నవి. (ఆఫ్రికాఖండము సూడాన్ లేక నిగ్రిటియాదేశము చూడుఁడు.)

సొకోత్రాద్వీపము:— (ఆఫ్రికాఖండము నకుఁ జెందిన పండ్రెండుద్వీపములు చూడుఁడు.)

సోగ్దినాదేశము:—
(శకద్వీపదేశముఁ జూడుఁడు).

సోగ్ధిశాఖక్షత్రియులు—
(ప్రిమారశాఖక్షత్రియులు చూడుఁడు).

సోజ్వాలి గోత్రము:—
(భరద్వాజఉపగణము చూడుఁడు.)

**సోడా:**— దీని 'Sodium carbonate' అనియు, soda ash' అనియు, 'washing soda' అనియుఁ గూడ ననెదరు. 'making soda' యనిన 'Sodium by carbonate' అని యెఱుఁగునది.

అమెరికాసంయుక్తరాష్ట్రములలోని 'mono lake, owens lake' అనునవి 'Soda lakes' అని చెప్పఁబడినవి. ఇందలియుదకములు 'alkali' ప్రదేశములగుండా ప్రవహించి యుండుఁ జేరునట.

**సోడాసరస్సు** [Soda Lake]:— ఆఫ్రికాఖండమున కెన్యా, టాంగినాయికా దేశములనుధ్య భాగ(ప్రహ్మ)లందు 'మగాడి' యను పేరుఁగల యొకచాటిసరస్సు కలదు. అది యంత యు 'కార్బోనేట్ ఆఫ్ సోడా' మయమై యుండును. ఇటుల నందుఁగల ముప్పదిమైళ్ళప్రదేశ మందున్న సోడా రెండువందల మిలియనులటన్నులుండునని యంచనా వేసియున్నారు. దానినుండి త్రవ్వి తీసినకొలది నాళోతులలో నీరుచేరుటతోఁ దిరుగ సోడాతో నోయి క్రమక్రమముగ నిండి పోవుచుంట జరగుచుండునట.

**సోడియము:**—క్షారలవణములను నీటం గరగించి బలముగువిద్యుత్ప్రవాహమునందు నెజుపి, భేదించుటచే బయల్పడిన ధాతువులలో నొకటి. పరిశీలకుఁడు సర్ హంఫ్రీడేవి పండితుఁడు (హంఫ్రీ డేవి పరిశీలకుడు చూడుఁడు.) ఇది క్షారధాతువు.

ఇదియు పొటాసియముంబోలినదియే గాని, యంతకన్న బలహీనమైనది (పొటాసియము చూడుఁడు.) వేడినీటం బడవైచిన బంగారువన్నెమంటలు మండును. ఇది చన్నీటిని భేదింపఁజాలదని చెప్పఁబడినది. దీనిని నీసాయందు చమురులో నిల్వయుంచ వలసియుండును.

**సోదొమ్ గొమొర్రా పురములు:**— వీటియందు లాత్ నివసించెనట. మహాపాపభూయిష్ఠములగు పురములై యుండెననియు, శపింపఁ బడి యగ్నిచే దగ్ధమైనదనియుఁ జెప్పఁబడినవి. పాలస్తినాదేశము లోనివి. బైబిలుపూర్వగ్రంథమున వీటిప్రశంస గలదు.

**సోపచ్ఛరాలగోత్రము:**—
(ఆత్రేయగణము చూడుఁడు).

**సోపానారోహణన్యాయము:**- మెట్లెక్కుటయందుఁ గ్రమముగ నొకటితర్వాత నొకటిగ మెట్లెక్కుచు పైకిఁ జనియెదరు. ఇది క్రమమార్గము. ఇందుఁ గొంతకాలము పట్టుట తప్పదు.

**సోపాయనగోత్రము:**—
[జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.]

**సోపుచెట్టు:**— సోపు జీలకర్రంబోలినచెట్టు. సోపును జీలకర్రవాయలవలెనే యుండును. లా. Pimpinella Anisum అనియు, Foeniculum, ఇంగ్ల aniseed సం. మధురికా.

సోపును తాంబూలపుమసాలాలోఁ గల్పుచుందురు. వేడిచేసివాతమును శయింపఁజేయును. ప్రక్కయెముకలలోనినొప్పి, ఊపిరిగొట్టునొప్పి నడంచును. కడుపుబ్బరము నివారించును. విషముల ఉద్ధృతము నడంచును. స్త్రీలబుతురక్తమును చక్కఁగ వెడలించును. సోపుచూర్ణము పంచదారతో వేసవిదినములం దుదయముననే 2 డ్రాములయెత్తు పుచ్చుకొనుచుండిన నాసంవత్సర మే రోగములేక యారోగ్యమునిలచియుండునని చెప్పఁబడినది. సోపుచెట్టువేరు తేనెతో గంధముదీసి లోనికిచ్చుచుండిన వెఱ్ఱికుక్కకాటువిషము హరిం

నని చెప్పఁబడినది. మంచిగంధము సోపుకుఁ బరిహారమందురు.

**సోమకుఁడు:—** ఈపేరుగలవా రిద్దఱు గలరు. పాంచాలదేశాధీశుఁడై నవాఁడును, సహదేవునిపుత్రుఁడు [సుదాసుని పౌత్రుఁడు] నగు సోమకుఁ డొకఁడు గలఁడు.

సోమకుఁడను నేరొకరాజర్షి కలఁడు. ఈతనికి నూర్వురుభార్యలు, నూర్వురుపుత్రులు కలరనియు, నందు జన్తుఁడు జ్యేష్ఠపుత్రుఁడనియుఁ జెప్పఁబడినది. ఈజన్తుఁడు సౌవర్ణలక్షణలక్షితనవ్యవామపార్శ్వుఁడట.

వేరొకసోమకుఁడు సోమకాసురుఁడు. బ్రహ్మ నిద్రించుతఱి వేదముల నపహరించినవాఁడు. విష్ణుదేవుఁడు మత్స్యావతారమెత్తి యావేదములం దిరుగఁ దెచ్చెనట.

**సోమతీర్థము:—**
[ప్రభాసతీర్థము చూడుఁడు.]

**సోమదత్తుఁడు:—** అత్రి చంద్ర పూరువు కురువంశక్షత్రియుఁడు. తండ్రి బాహ్లికుఁడు. [బాహ్లీకదేశాధిపతి] పితామహుఁడు ప్రదీపుఁడు. పుత్రులు భూరి, భూరిశ్రవుఁడు, శల్యుఁడు నను ముగ్వురు.

**సోమదాయనగోత్రము:—**
(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**సోమనిగోత్రము:**
(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**సోమపేయగోత్రము:—**
(కుశికగణము చూడుఁడు.)

**సోమంభృవగోత్రము:—**
(విధృవగణము చూడుఁడు.)

**సోమయజ్ఞములు:—** ౧ అగ్నిష్టోమము, ౨ అత్యగ్నిష్టోమము, ౩ ఉక్థ్యము, ౪ షోడశి, ౫ వాజపేయము, ౬ అతిరాత్రము, ౭ అప్తోర్యామము.

పంచయజ్ఞములు:— ౧ దేవయజ్ఞము [వైశ్వదేవము], ౨ పితృయజ్ఞము [పితృతర్పణాదులు], ౩ భూతయజ్ఞము [బలి], ౪ బ్రహ్మయజ్ఞము [వేదాధ్యయనము], ౫ మనుష్యయజ్ఞము [అతిథి అభ్యాగతులం బూజించుట].
ఇవి నిత్యకృత్యములగు పంచయజ్ఞములు.

**సోమయాగగోత్రము:—**
[విధృవగణము చూడుఁడు.]

**సోమరాజకగోత్రము—**
[ఔతథ్యఉపగణము చూడుఁడు.]

**సోమరాజకగోత్రము:—** ఇది అంగీరస సంతతి. గౌతమగణము. సోమరాజికి యుపగణములోనిది. అంగీరస, సోమరాజిక, గౌతమయని ప్రవరరూపము.

**సోమరాజముచెట్టు:—** దీనిరసము (ముఖ్యముగ వేఱు) కషాయము విరేచనకారి యనియు, వ్రణములను మాన్పుననియు, వాతదోషము, వికారములు, శూలలు, నివారించుననియు నందురు.

**సోమరాయనగోత్రము:—**
(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.)

**సోమలత:—** లా. Asclepias. acida, ఆంగ్ల moon plant, సం. చంద్రవల్లభా,

చంద్రవల్లరీ, చంద్రవల్లీ, ధనుర్లతా, మహా గుల్మః, మహాగుల్మా.

ఇది యజ్ఞక్రతువులందుఁ బ్రధానద్రవ్యము. సోమపానమన దీనిరసపానము. ఈలత హిమవత్ప ర్వతములపై దొరకెడిని. దీనియాకులు శుక్లపక్ష మున దినమునకొకటిగ నభివృద్ధిపొంది, కృష్ణపక్ష మున దినమునకొకటిగ రాలిపోవునందురు.

ఇది త్రిదోషహరమనియు, పూర్వవయస్సును నిలిపి, పుంస్త్వబలము నొసంగి కాయసిద్ధి గల్గించు ననియు, నారోగ్యమును చెడనీయదనియుఁ జెప్పఁ బడినది. పవిత్రమైనలత.

## సోమలీలాండు భూప్రదేశము:—

ఇది యాఫ్రికాఖండపుఁదూర్పుప్రదేశమునం దున్న దేశము. బ్రిటీషువారియొక్కయు, ఫ్రెంచివారి యొక్కయు, ఇటలీవారియొక్కయు నాక్రమణల యందు మూఁడుగ విభజింపంబడియున్నది. బ్రిటీ షువారిప్రదేశము ౬౮,౦౦౦ చతురపుమైళ్లువైశా ము. జనాభా 3, ౪౪, ౦౦౦. ఫ్రెంచిసోమలీలాం డు ౮, ౪౯౦ చతురఁపుమైళ్ళ ప్రదేశము. దీని జనాభా ౬౮, ౯౬౫. ఇక్కన యిటలీవారి సోమ లీలాండు ౧,౯౦,౦౦౦ చతురఁపుమైళ్ళప్రదేశము. దీనియందలి జనాభా ౧౦,౧౦,౪౧౫. ఇయ్యది హారన్ ఆఫ్ఆఫ్రికానుండి కెన్యావరకు సముద్ర తీరమునందే వ్యాపించియున్నది. సగటున సోమలీ లాం డంతటనుండియు చర్మములు, ఉప్పు, కాఫీ, బంకదినుసులు, ఎండబెట్టిన పండ్లదినుసులు, దం తము నెగుమతిచేయఁబడుచున్నవి.

(ఇటాలియ న్సోమలీలాండు చూడుఁడు, ఇటలీపారెస్టొజిషన్ చూడుఁడు).

## సోమవారము (Monday):—

సోమవారము వారమున రెండవదివసము. దీని నిందు వాసరమనియు నందురు. చంద్రునకు సోముండని పేరుకలదు. ఇంకను శైవులు మానసహితుం డగు శివుఁడు సోముఁడనంబడుం గాన నిది శివప్రీతికర మగు పవిత్రదినముగ భావింతురు. కార్తిక శ్రావ ణమాసములందు సోమవారములు శివప్రీతికరము లగు పవిత్రదినములు.

ఐరోపా వారిపూర్వులకు, చంద్రప్రతిపాదకు రాలను Diana దేవతయొక్క దినము సోమవా రము. ఇది moon శబ్దముయొక్క లుప్తపఱుపఁ బడినరూపము. ఆమె వెండిరథము రాత్రులందు సంచరించునది. (ఆకాశగమనము). బాలబాలికల కీమె రక్షకురాలు. సోమవారమున సృష్టి ప్రారం భింపఁబడినది. భూమి, ఆకాశము, చీఁకటి, అగాధ జలము, వెలుఁగు సృజింపఁబడినట్లుఁ జెప్పఁబడినది.

## సోమవారవ్రతము:—

ఇది శివభక్తు లాచరించువ్రతము. దీనింగూర్చి పెద్దవిధానము చెప్పఁబడినది. ఇది స్త్రీపురుషబాలు రెల్ల రాచ రించుదురు. చైత్ర, వైశాఖ, శ్రావణ, కార్తిక, మార్గశిర మాసములం దెప్పుడైన నారం భించి [illegible] మంతయు జరుపుదురు. కొందరు సోమవాసరముల పగ లుపవసింతురు. కొంద రేక భుక్త మొనర్చుదురు. దంపతీపూజ లొనర్చు దురు. ఇందు శివభక్తుల నారాధించుట వ్రతాభి ప్రాయము.

## సోమవాహగోత్రము:—

ఇది అగస్త్య సంతతి. అగస్త్యప్రాగ్గణము. సోమవాహ ఉప గణముగఁ జెప్పఁబడిన గోత్రము. దీనికి అగస్త్య, దైర్ఘచ్యుత సోమవాహ అని ప్రవర.

## సోమశ్రవతీర్థము:—

పాంచాలదేశ ప్రాంతము. పాండవులు పాంచాలమున కేగుచు

నిట సంగారపర్ణుఁడను గంధర్వుఁడు తమ్మెు జెవి రింప నర్జునునితోఁ గలహించి వోడి సూపు మాసి, చిత్రరథుఁడనుపేరుతో నర్జునుని మైత్రి వడసిపోయెనఁట.

**సోమశ్రవసుఁడు:—** జనమేజయుని పురోహితుఁడు. తండ్రి శ్రుతశ్రవసుఁడు.

**సోమశాఖక్షత్రియులు [చంద్ర]:-**
(క్షత్రియకులము చూడుఁడు.)

**సోమసూత్రము:—** దేవస్థానమందలి గర్భాలయమునుండి యభిషేకాదు లొనర్చిన నీటిని వైటికిఁ బంపించుజలమార్గమునకు 'సోమ సూత్ర' మని శిల్పశాస్త్రమునఁ బేరు. ఇది తూర్పు నకుఁ గాని, యుత్తరమునకుఁ గాని, జలములు నడచునటులఁజేయఁబడును. కొన్ని గ్రంథములందుఁ దూర్పు ధనధాన్యసమృద్ధియు, దక్షిణ మాయు ర్వృద్ధియు, బశ్చిమము కీర్తి సంపదలును, ఉత్తర ము భోగభాగ్యములును సోమసూత్ర ఫలములుగఁ జెప్పఁబడినవి.

సోమసూత్రము గోముఖముగ నుండిన పశు వృద్ధియు, మొసలిముఖముతో నుండిన జలసమృ ద్ధియు, సింహముఖముతోనుండిన శత్రునాశన మును, సర్పముఖముతోనుండిన రోగనాశనమును, క్రిమికీటముఖముతో నుండిన సస్యసమృద్ధియుం గల్గుట ఫలితములుగఁ జెప్పఁబడినవి.

ఇంకను సోమసూత్రరంధ్రము పూర్వపీఠము నందుండిన యశస్సును, మధ్యమపీఠమునందుండిన సంపదలు, నూర్ధ్వపీఠమునందుండిన భోగభాగ్య ములు గల్గుచుండునని చెప్పఁబడినది.

**సోమాష్టమి:—** అష్టమితిథియందు సోమ వారము సంభవించిన సోమాష్టమి యనంబడును. పర్వతిథి. (పండుగలు చూడుఁడు.)

**సోమ్నాంబులిజమ్ [Somnambulism]:—** ఇతరక్రియాపరిణామములు లేనిమాన సికప్రవృత్తిని దెలుపువిధానము.

**సోమింతచెట్టు:—** లా. Coronilla Picta. సోమింతయందు, తెల్లని నల్లని పూవులం బూచు రెండుభేదములు కలవందురు గాని తెల్ల పూవులజాతి యెచ్చటను గానఁబడుటలేదు. పచ్చ పూవులఁబూచుసోమింత కలదందురు. ఇట్లిది త్రివిధమని చెప్పఁబడినది.

సోమింతకర్ర చాలగట్టిదిగాన, నినుపదారి కమ్ములుగ వాడుచున్నారు. చెఱువులయందలి యూపస్తంభముల కుపయోగింప నీకర్ర చెడిపోక చిరకాలముండునది. గాన విలువం గల్గియుండును.

దీనియాకు లాముదమున వెచ్చఁజేసి పైనవైచి గట్టిన కాళ్లనొప్పులు మానుననియు, గడ్డలు చీము పట్టి త్వరగా పగులుననియుఁ జెప్పఁబడినది. కూర యందు వాతమును పోఁగొట్టి క్రిమి కఫములను హరించుగుణము కలదనియు, వేఁడిచేయుననియు నందురు.

**సోరఠీయక్షత్రియులు:—**
(ప్రమారశాఖక్షత్రియులు చూడుఁడు.)

**సోరపీయి:—** లా. Lagenario Vuljaris. ఇది చేపలసంబంధము. సొరచేపసంబంధ మగునో కాదో సరిగాఁ దెలియరాదు. దాని మలము మాత్రము కానేరదు. ఒకవైపు పెంకు గట్టి గట్టిగనుండి రెండవవైపు గిల్లిన పిండివలె వచ్చును. సముద్రతీరములందు దొరకునది. చిన్నవి పెద్దవి గూడ నుంట నిది చేపలసంబంధమేయని తలపఁబడును. చెవిపోటుల కిది వైచి నిమ్మకాయ

రసముం బోసిన సున్నమువలె పనిచేసి యాపును. కొబ్బరినూనె పోసినను మాను జేయునందురు.

**సోర్బోన్నీ పారిస్‌నగరసంస్థ:—** ఇది ఫ్రెంచిదేశపుం బ్రధాననగరమగు పారిస్‌నందు న్న సాహిత్యరసాయనశాస్త్రవ్యాఖ్యానపరిశోధకసంస్థ. పారిస్‌విశ్వవిద్యాలయసంబంధ సంస్థ. ఫ్రెంచిభాష యందలి శాస్త్రవిద్యలు, సాహిత్యవిద్యలు మొదలగుపాండిత్యములకు గురుస్థానముగ గౌరవిం పంబడుచున్న పవిత్రస్థలి. ఫ్రెంచిదేశమేలినభూపతి యాస్థానమున నక్కాలమున chaplain పదవి యందుండిన Robert of Sorbonne మహా శయుం డీసంస్థను తనపేరంబరగు మతవిద్యావ్యాఖ్యాన సంస్థగా నేర్పఱుపంబడి నేటికి విద్యాసంస్థగా మా ర్పునంది సుప్రసిద్ధమై దనరారుచున్నది. ఆయన సేవించినప్రభువు తొమ్మిదవలూయీ యని తెలిసె డిని. పందొమ్మిదవశతాబ్దమున నీమార్పునందిన దనియు, పదునేడవశతాబ్దమున Cardinal Richeliers గారు దీనికట్టడములను విరివిగం గట్టించి యభివృద్ధిపఱచెననియు, ఫ్రెంచిదేశమున నాదిని ముద్రింపంబడినపుస్తకము లీసంస్థముద్రాక్షరశాల యందే ముద్రింపంబడినవనియుం, జెప్పంబడినది. ఇక్కాలమున దీనిపుస్తకభాండాగారమున ౬,౦౦,౦౦౦ గ్రంథములు కలవంట. విద్యానిధులు దీని యుపన్యాసవేదికయందుం గలసికొనుట గౌరవముని యెంచుదురంట. ఫ్రెంచివిద్యల కునికిపట్టనియు, విద్వాంసులకు మాతృస్థానముగను గౌరవింపం బడుచున్నది.

**సోలంకి [శాఖ] క్షత్రియులు:—** (చాలుక్యశాఖక్షత్రియులు చూడుడు.)

**సోలపద్మహస్తము:—** (హస్తాభినయము చూడుడు. భరతశాస్త్రము చూడుడు.)

**సోలా [Sola]:—** వాణిజ్యపరిభాషయందు 'ఇది యొక్కటే' యని యర్థము.

**సోలానోప్రచండవాయువు:—** ఇది శీతలముగను, ప్రచండముగను వీచు గాలి. స్పానియాదేశపుం బర్వతములనుండి మధ్యధరాసముద్రము లోనికి దేశసీమలనుండి వీచి, బాధ గల్గించి, యసౌఖ్యకరమై, యనారోగ్యకరమై యుండును. ఇది యప్పటప్పట వీచుచుండును.

**సోలార్ సంవత్సరము [Solar year]:—** [కాలవిభజనము చూడుడు.]

**సోలార్ సిస్టమ్ (Solar sytem):—** ఇది యైరోపాదేశముల శాస్త్రమగు ఎస్ట్రోనిమీ సంబంధమగు విజ్ఞానము. సూర్యునిజుట్టి తిరుగు నట్టి యితరగోళములును, వాటి నాశ్రయించుచు వాటింజుట్టి తిరుగుచుండు చంద్రగోళములును, ఇతరఉపగోళములు, అల్పగోళములు (astroids) గోళములసంబంధముననో, సూర్యసంబంధముననో తమ స్వంతవిధానమార్గములం దిరుగుచుండు తోంకచుక్కలును, సూర్యునితోసహా 'సోలార్సిస్ట' మనంబడుచున్నది.

సూర్యునియాకర్షణకు లోంబడి, సూర్యునిం జుట్టి తిరుగుగోళములు ౧ Mercurey, ౨ Venus, 3 Earth (భూమి), ౪ Mars, ౫ Jupitor, ౬ Saturn, ౭ Uranus, ౮ Neptune, Primary planets అని ఎస్ట్రోనిమీ శాస్త్రమునం జెప్పంబడిన ప్రధానగోళములు. చిన్నగోళము లింకను డెబ్బది లెక్కింపంబడినవి.

తొల్లింటి ఎస్ట్రోనొమీశాస్త్రజ్ఞులకు మెర్క్యూరీ (బుధుడు) 2 Venus (శుక్రుడు), 3 Mars,

4 Jupiter (గురుడు లేక బృహస్పతి) 5 Saturn (శని) యనునైదుగోళములు తెలిసి యుండెనని చెప్పఁబడినది. Dr Herschel పండితుఁడు. క్రీ. శ. 1781 లో Uranus గోళమును, Vesta - Juno - Ceres - Pallas అనఁబడు చిన్న (ఉప) గోళములను కన్గొనియెను. ఇంకను పెద్దగోళములనుండి వీడిన ముక్కలుగ తలంపఁబడిన యితర చిన్నగోళములు క్రీ. శ. 1801—1807 మధ్యకాలమునఁ గన్గొనఁబడియెను. 1845 మొదలు ఆంగ్లేయపండితులు, అమెరికా వారు, ఐరోపాఇతర దేశములందలి పరిశీలకులు, అపరిమితముగ నక్షత్రపరిశీలనలు సల్పి కన్గొని యున్నారు. ఈగోళములన్నియుం దిరుగుచుండు మార్గము లన్నియు Mars Jupiter గోళముల మార్గముల మధ్యనే యున్నవని తేలుచున్నది.

క్రీ. శ. 1846 లో Neptune గోళము కన్గొనంబడినది. ఈపరిశీలనలందు ఫ్రెంచిదేశపు సుప్రసిద్ధగణితశాస్త్రవిశారదుండగు M.Le.Verrier గారును, కేంబ్రిడ్జివిశ్వవిద్యాలయమున ప్రసిద్ధపండితుఁడగు Mr.Adams గారును, వీరి సిద్ధాంతములను పరిశీలించుచు స్థిరపఱచిన బెర్లిను (జర్మనీ) నగరవాసి యగు Dr Galle పరిశీలకుఁడును చిరస్మరణీయులు.

ఈగోళము లన్నియు 'Superior planets' అనియు, 'Inferior planets' అనియు, వాటి గమనవిధానమునుండి రెండుతెగలుగ విభజింపఁబడినవి. జూపిటరు, శాటర్ను యూరేనసు, నెప్ట్యూను ననంబడునవి 'సుపీరియరుగోళము'లనియు, మెర్క్యూరీ, వేనస్సులు, 'ఇన్ఫీరియరుగోళము' లనియుం జెప్పఁబడినవి. ఇవి యన్నియు సూర్యునుండి వెలుతురు నందునవిగాన ఎస్ట్రొనొమీ శాస్త్రమున 'opaque bodies' అనిచెప్పఁబడినవి. phases కలవని చెప్పఁబడినవి.

న్యూటన్ప్రభు వీగోళములన్నియుం దిరుగు మార్గము లన్నియు Law of Gravity మేరకు విధింపఁబడినవే యని తెల్పియుండెను. పిదప జర్మనుదేశపుసుప్రసిద్ధ ఎస్ట్రొనొమీశాస్త్రవిదుం డగు Kepter పండితుఁడు వీటినిపూర్తిగఁ గన్గొని వెల్లడించెను.

Superior plantes ఎన్నడు సూర్యున కడ్డముగా దాటుట సంభవింపదు. భూమి కాశ్రిత గోళముగ చంద్రుఁ డొకఁ డుండునటుల సోలారు సిస్టములోని పెద్దగోళము లన్నిటికి నాశ్రితగోళములగు చంద్రగోళములు గలవు.

Astroids అనంబరఁగుగోళముల శరీరపరిమాణములు చిన్నవిగ నుండును. అందు పెద్దదియగు జూనోయొక్క diameter రెండువందల మైళ్ళును, పల్లాసుయొక్క diameter డెబ్బది మైళ్ళును, నుండునని తలంపఁబడుచున్నది. అగుతరి చుట్టుకొలత 230 మైళ్ళకన్న నధికము పల్లాసు కలిగియుండదు.

గోళము లన్నియు పడమటనుండి తూర్పునకుఁ దిరుగుచుండునవి యని పోల్పఁబడినవి. [ఫిక్సెడ్స్టారుస్ చూడుఁడు, ఎస్ట్రొనొమీ చూడుఁడు, ఆయాగోళములు వాటితావులందు చూడుఁడు].

**సొలిప్సిజమ్** (Solipsizm) :—లాటిను. మనస్సునకు స్వీయమేకాని యితరమునుగురించిన నిర్ణయజ్ఞానము లేదనుసిద్ధాంతము.

**సొల్స్టిసిస్** [Solstices]:— లాటిన్ భాషయందు Sol. అన సూర్యుఁడనియు,

Sto అన నిలఁబడుటయనియు నర్థము. దక్షిణాయన ఉత్తరాయణములయందు జూన్ ౨౨ తేది డిశంబరు ౨౨ తేదుల ప్రాంతములవరుసగా నుత్తరమునుండి దక్షిణమునకును, దక్షిణమునుండి యుత్తరమునకును మరలెడిని. అట్లు మరలుతరి నొక నలుబదిగంటలకాలము నిలమన్లు కనఁబడును. ఇది నిలచుటఁ గాదు. ఒకవైపునకు నడచు force (ఊపు) ఆఁగి వెనుకకు మరలుటకగు మార్పు కాలము లేక సంధికాలము. దీనికి 'Solstices' అని పేరు.

## సోవియటు విధానము:—

[బోల్షివిజమ్, కమ్యూనిజమ్, సోషలిజమ్, చూడుఁడు, వైటురష్యనులు చూడుఁడు].

## సోషయాలోజీ (Sociology):-

దీనిని 'social science' అనియు నందురు. క్రీ. వె. ౧౮౩౮ లో Auguste comte అను మహనీయుఁడు దీనికిఁ బేరిడి యుద్ధరించెను. ఇది త్రివిధ భేదములుగఁ జెప్పఁబడినది.

'Anthropology, Social paychology, social institutions' అని.

## సోషలిజమ్:—

(బోల్షివిజమ్, కమ్యూనిజమ్, సోషలిజమ్ చూడుఁడు, వైటురష్యనులు చూడుఁడు.]

## సోషలీజమ్ (Socialism) :—

ఆర్థికపరిస్థితిం జక్కపఱుపఁదలఁచిన రాజకీయసంచలన సిద్ధాంతము.

ఎవరికి వారు జీవించుటకన్న, పనిచేయుటకన్న, యత్నించుటకన్న నందరును గలసిజీవించుట, పని చేయుట మొదలగునవి శ్రేయమనుసిద్ధాంతము.

ఇది రాజకీయకక్షకుఁజెందిన సిద్ధాంతము. ప్రజలే దేశము కవసరము గాని ప్రభువు దండుగ, నిరుపయోగము, ననవసరమనని వీరిసిద్ధాంతము.

ఇది ౧ సోషల్ డెమొక్రెటిక్ పార్టీ (Social democratic party ౨ సోషల్రివల్యూషనరీపార్టీ యనియు (social revolutionary party) 3 సోషల్ఎక్స్ట్రిమిస్టు లేక సోషల్బోల్షివిక్ పార్టీ యనియు Social Extremists or social Bolshivike party) అనియు, త్రివిధము. బోల్షివికీ యనిన మహా లేక గొప్ప యనియర్థమఁట.

## సోషియోలజీ (Sociology):—

మానవసంఘముయొక్క పరిణామములకు సంబంధించిన శాస్త్రవిజ్ఞానము.

## సొసైటీ ఆఫ్ ఫ్రండ్సు క్రైస్తవ సంఘము:—

దీనిని క్వేకరక్రైస్తవసంఘ మనియు నందురు. వీరిసంఘము చాల చిన్నది. ఇది క్రీ. వె. పదునేడవశతాబ్ద మధ్యకాలమున జార్జిఫాక్సు గారి నాయకత్వమునక్రింద స్థాపింపఁబడిన దందురు.

## సొసైటీద్వీపములు:—

ఇవి ఓసీనియాయందలి పోలినేసియాద్వీపసమూహమునకుం జెందినద్వీపములు. ఆస్ట్రేలియాద్వీపమునకును, దక్షిణ అమెరికాకును నడుమగా పసిఫిక్కుమహాసముద్రమునం దున్నవి. సాండ్విచ్ద్వీపములవలె ప్రాముఖ్యతఁగలవని చెప్పఁబడినది. ఇందు 'తహితి' యను ద్వీపము పెద్దది. దీని స్వదేశప్రభుత్వమునుండి బలాత్కారముగా ఫ్రెంచివారిస్వాధీనమున వీటి ప్రభుత్వముంచబడి పిదప ఫ్రెంచివారికిం గల్పివేసిరనియు, ప్రజలు క్రైస్తవులుగఁ జేయఁబడిరనియు, వ్రాయఁబడినది. వీటికాదినిగల స్వదేశఁపుఁబేరేదో చెప్పఁబడలేదు.

**స్టొక్ లేక స్టాక్ (Stock)**:— వాటాలు, పేరులు అని వాణిజ్యసంబంధ పరిభాషయందర్థము.

Stock exchang వాటాలవ్యవహారములు, కొనుగోలువిక్రియములు, వస్తూళ్ళు మొదలగు వాట్లం బరిష్కరించు కొనుటకు వర్తకు లందరు గూడ నేర్పర్చుకొనిన యొకగృహమున కీపేరు వర్తించును. వాటానుకొని సొమ్ముచెల్లించినతరి నిచ్చురశీదునకు 'Stock Reciept' అని పేరు.

**స్టోనేజి (Stone age)**:— పాశ్చాత్య విజ్ఞానవిధానమున లోహములవాడుక నెఱుంగని ప్రాతకాలమును 'Stone age' అనివాడుదురు. రాతితోనే అక్కాలమున పనిముట్లు చేయుచుండిరి గాన దాని కాపేరు బహుశః ఇడియుందురు.

**స్టోయిసిజమ్ (Stoicism)**:— గ్రీకు దేశఁపుఁదత్వశాస్త్రవిధానము. దీనిని అతెన్సుపుర వాసి యగు 'Zeno' అనుతత్వశాస్త్రవేత్త రచించెను. ఈవిధానము క్రీ. ము. 300 సంవత్సరముల నాఁటి దనెదరు.

Logic. అనియు, Physics అనియు, Ethics అనియు, నీతత్వవిధానము త్రివిధము. 'లాజిక్కు-వలన నిజముగువస్తువిజ్ఞాన మెఱుంగ నగును. ఫిజిక్సువలన జగత్తునకు వలసినధర్మముల నెఱుంగనగును. ఎథిక్సువలన ఆత్మ [ప్రాణము లేక జీవము] జ్ఞానము నెఱుంగనగును' అనివీరివాదము. వీరియందు సంతమనునది గర్హింపఁబడినది. బలాత్కారమరణము దూష్యము కాదు.

**స్టొరమ్‌సిగ్నల్సు (Storm signalls)**:— 'స్టోర' మనిన తుపానని యర్థము. సముద్రముపైఁ గాని, గొప్పనదులపైఁగాని యోడలలో రాకపోకలు, నౌకాయానుమతులు విస్తారముగ నడచుచుండు నేదేశములందైనను వాతావరణమునందుఁ గల్గెడి తుపానులు, సుడిగాలులు మొదలగు చికాకు లోడల కపాయకరము గాన వాటి నెఱింగి యోడలు జాగ్రతంగొనుచుండ వలసియుండును. అట్టి యపాయకర వాతావరణములకు 'Bad weather' అనియు, disturbed weather or atmosphere అనియుపేరు.

దీనిగూర్చి వివరించుకలకుఁ బాశ్చాత్యభాషలందు 'meteorology' అనెదరు. (చూడుఁడు). బ్రిటీషుప్రభుత్వపు metiorological శాఖ. అర్థ్వాముగుతావులందు తమస్థానములనుంచి యచటిస్థానికోద్యోగులవలన ననుదిన ముదయ మేఁడుగంటలకు, సాయంకాల మైదుగంటలకు పరిశీలనలను తంతీమూలమున వేర్వేరుతావులందలి స్థితిగతుల నెరిగించుచు భవిష్యత్సూచనల నాయారేవులకుఁ దెల్పుచుఁ నటనుండు పెద్దజెండాకొయ్యపై స్టారమ్‌సిగ్నల్సు నెగురవైచి ఓడలవారికి జనులకుం బహిరంగపఱచుచుండుట యాచారమై యున్నది.

అట్టి గురుతులపరికరము లేఁడుగనున్నవి. అవి 1 Vertical bar, 2 Horizental bar, 3 Vp Pointed Trangle, 4 Down Pointed Trangle, 5 Diagnel, 6 Double trangle (boath points meeting), 7 Ball. అనంబడునవి యైయున్నవి. ఈపరికరకూటములతోఁ బదునొకండు signalls ను ఏర్పఱచి యున్నారు.

ఈసిగ్నలు గురుతులను పగటియం దొకటి కింద నొకటిగ వాడుచు, రాత్రులం దివి కన్పించవుగాన నెఱ్ఱరంగు, తెల్లరంగు లాంతరుదీపముల నాజండాకొయ్య పై భాగముననే వ్రేలాడఁ దీసి ప్రదర్శింతురు.

క్తములం బ్రదర్శింపఁబడు పదునొకండుసిగ్నల్సు యందు జాగ్రత్తను హెచ్చరించు Crutionary signalls రెండును, అపాయములను సూచించుచు జాగ్రత్తను హెచ్చరించు warning సిగ్నల్సు రెండుగను, కేవలాపాయకరమని తెల్పు Danger signalls మూడుగను, మహాపాయములందెల్పు Great Danger signalls మూఁడును, నిూటిరియాలొలొజీ ప్రధానస్థానముతో నారేవునకుం గల Communication తెగిపోయి యుంటయు, నచటిస్థానికోద్యోగిస్థితి యపాయకరమని తలంచుచుంట నెఱింగించుసిగ్నల్ లొకటిగను, ఏర్పఱుపఁబడినవి. ఇంకను నీపదునొకండుసిగ్నల్సు నందు ఎన్మిది ఆప్రాంతసంబంధాపాయములను, రెండు దూరమునుండివచ్చువ ట్లుండు నపాయములను, ఒకటి సంబంధము తెగినస్థితిని దెల్పునవిగ నున్నవి. వాట్ల నీక్రింద వివరెంచుచున్నారము.

ఈసిగ్నల్సు సముద్రియొక్క యేప్రాంతపు వాతావరణపరిస్థితు ల్లకల్లోలమై disturbed state గానై నవో యాప్రాంతప్రదేశపురేవులందే ప్రదర్శింపఁబడు చుండెడిని.

౧ వ సిగ్నలు— పగలు హారిజంటల్ బారును, రాత్రులం దొకటికిం్రంద నొకటిగ వ్రేలాడఁదీయబడిన రెండుతెల్లదీపములు దీనిని Cautionary signall అనిమెదరు. “తుపాను (storm)” ఏర్పడుచుండు squally weather కారణముగలదని యీమెదటిసిగ్నలున కర్థము. రేవునందు పరిస్థితులు చక్కఁగనే యున్నను ఆరేవునుండి బయలుదేరు కతన నపాయపరిస్థితులలోని కరుగవచ్చుంగాన నట్టి రేవులం దీసిగ్నలు ఎత్తంబడునని చెప్పఁబడినది.

౨ వ సిగ్నలు— వెర్టికల్ బారు పగటియందును, ఒకటిక్రిందనొకటిగ వ్రేలాడఁజేయఁబడిన రెండు ఎఱ్ఱదీపములు రాత్రులందు దీనిని ‘warning signall’ అనిమెదరు. మఱియు దీనిని మొదటివార్నిం గనుటయుం గలదు. దీని కొకతుపా నేర్పడినదని యర్థము. ఈసిగ్నలు రేవునం దేదికాకులులేకున్నను రేవువిడచిపోయిన యెడ తుపానునందుఁ దగుల్కొనునేమో యని జాగ్రత్తం దెలుపుటకు ప్రదర్శింపఁబడునని చెప్పఁబడినది.

3 వ సిగ్నలు—Turned trangle పగటియందును, ఒకటికిం్రద నొకటిగ వ్రేలాడదీయంబడిన రెండులాంతర్లలో పైది తెల్లనిది క్రిందిది యెఱ్ఱనిది, రాత్రులందును ఐయున్నది. ఈ సిగ్నలునకు ఈరేవును spuallyy wether వెక్షపించుచున్నదని యర్థము.

౪ వ సిగ్నలు— పైకి మొనతేలిన Trangle పగటియందునను, ఒకటిక్రిందనొకటిగ వ్రేలాడీయంబడిన పైనిఎఱ్ఱనిదియు, క్రిందిది తెల్లనిదియు దీపములు రెండురాత్రులందునను దీనిని వార్నింగుసిగ్నల్ అనియు, రెండవ వార్నింగనియు ననెదరు. ఈసిగ్నలునకు ‘ఈరేవు తుపానువలన నెరపింపఁబడినది కాని యింతదనుక extreme measures of psecaution తీసుకొనఁదగినంత యపాయము చాలినంత లేదని కన్పించుచున్నది’ అని యర్థము.

౫ వ సిగ్నలు—క్రిందికి మొనగల్గిన down pointed Trangle ను, దానిక్రిందికి దానిమొన నుండి వ్రేలాడఁదీయంబడిన diagnel పగటియందునను నొకటిక్రింద నొకటిగ వ్రేలాడఁ

దీయఁబడిన మూఁడుదీపపులాంతర్లు, అందు క్రిందిది ఎఱ్ఱదిగను పైరెండు తెల్లదీపములు గను, రాత్రులందును

దీనిని 'danger signall' అనియు నందురు. 'రేవునకు దక్షిణదిశగాదరిజేరుననుకొనఁబడుచున్న స్వల్పముగనో, సాధారణముగనో బలము (intencety) గల యొకతుపానునుండి severe weather ను రే వనుభవించెడిని' అని సిగ్నలున కర్థముగా వివరింపఁబడినది.

వ సిగ్నలు పైకిమొనగల్గిన Trangle ను, దానిక్రింద వ్రేలాడఁదీయఁబడిన diagnel ను, పగటియందునను పైనెఱ్ఱదిగను, దానిక్రింద నొకటియు,నింక దానిక్రింద వేఱొకటిగను, వ్రేలాడఁదీయఁబడిన రెండు తెల్లదీపముల [లాంతరులు] ను రాత్రియందనియర్థము. దీనిని 'danger signall' అనియెదరు. రేవునకుత్తరముగా దరిజేరుననుకొనఁబడుచున్న స్వల్పముగనో లేక సాధారణముగనో బలముగలయొక తుపానునుండి severe weather ను ఈ రేవు అనుభవించెడిని. అని యీసిగ్నలున కరము.

౭ వ సిగ్నలు- పగలొక double Trangle నుండి క్రిందికి వ్రేలాడఁదీయఁబడిన diagnell రాత్రులందు మధ్య నెఱ్ఱనిదీపము, దానిపైని క్రిందను తెల్లదీపములుగలమూఁడులాంతరులు. దీనిని డేంజరుసిగ్నలు [క్రొందఱు రెండవడేంజరుసిగ్నలు] అనియు నందురు.

దీని కర్థము రేవునకే గాని లేక రేవునకు సమీపమునగాని, దరిఁజేరుననుకొనఁబడుచున్న స్వల్పముగనో లేక సాధారణముగనో ఒత్తిడిబలముగల యొకతుపానునుండి severe weather ను ఈ రేవనుభవించెడిని. అని యొయున్నది.

౮వ సిగ్నలు—పగలు క్రిందికిమొనగల Trangle నుండి క్రిందికి వ్రేలాడఁదీయఁబడిన Vertical Bar ను రాత్రులం దొకటినుండి యొకటి క్రిందికి వ్రేలాడఁదీయఁబడిన మూఁడుదీపపులాంతరులలో పైది తెల్లదీపము. క్రిందివి రెండు నెఱ్ఱదీపములు. ఇది Great danger signall. ఈసిగ్నలున కర్థము రేవునకు దక్షిణమునుండి యెక్కువ ఒత్తిడి బలములుగల తుపానునుండి severe weather ను ఈ రేవనుభవించెడి ననియెయున్నది.

౯ వ సిగ్నలు—పైకి మొనగల Trangle నుండి క్రిందికి వ్రేలాడఁదీయఁబడిన Vertical bar పగటియందునను, రాత్రులందు నొకటినుండి యొకటిగ క్రిందికి వ్రేలాడఁదీయఁబడిన మూఁడు దీపఁపులాంతరులలో పైవిరెండు నెఱ్ఱదీపములును, క్రిందిది తెల్లదీపపులాంతరులును, దీనిని 'Great danger signall' అనియెదరు. ఈసిగ్నలున కర్థము 'రేవు కుత్తరమునుండి యెక్కువ ఒత్తిడిబలములుగల తుపానునుండి server weather ను ఈరే వనుభవించె ననియెయున్నది.

౧౦ వ సిగ్నలు—ఒక double Trange నుండి క్రిందికి వ్రేలాడఁదీయఁబడిన Vertical Bar పగటియందునను, రాత్రులం దొకటిక్రింద నొకటిగ వ్రేలాడఁదీయఁబడిన మూఁడులాంతరులలో పైది క్రిందికొనది యెఱ్ఱదిగను, మధ్యది తెల్లదిగను నుండు దీపపులాంతరులు. దీనిని 'Great danger signall' అనియెదరు. ఈసిగ్నలున కర్థము రేవుకడనేగాని రేవు

సమీపమునఁ గాని దరిజేరనున్న యెక్కువ ఒత్తిడిబలముగల తుపానునుండి severe weather ను ఈరేవనుభవించెడిననియై యున్నది.

౧౧ వ సిగ్నలు—ఒక double Trangle పగటి యందునను, ఒకయరగ్రిదీపము రాత్రులందు నను దీనిని Failure of communication signall అనియెదరు. ఈసిగ్నలున కర్థము meteorilogical Head quarters తోఁ గల communication తెగిపోయిన దనియు నిచటనున్న స్థానికోద్యోగి Bad weather నుండి యపాయముకల్గునని యభి ప్రాయముం గల్గియున్నాఁడనియు యున్నది.

ఇవి సముద్రతీరమునందున్న పెద్దరేవులం దుప యోగించు సిగ్నలులు. ఈపెద్దరేవులందు గొప్ప గొప్పపొగయోడలు నిలుచుచుండెడిని. గాన నివి యన్నియు వాడఁబడుచుండుట కేర్పాటు కలదు. ఇంకచిన్న యోడలు, పడవలు, చేఁపలనావలు మాత్రమే గల కొన్ని చిన్న రేవులందు 1వ సిగ్నలు, నాల్గవసిగ్నలు, ఏడవసిగ్నలు, పదియవసిగ్నలు, మాత్రము వాడఁబడుచుండును. ఈపద్ధతిని 'Brief signall systum' అనియెదరు. [చూడుఁడు.]

ఇంకను బంగాళమునను, ఆసాముదేశమునను, గంగా బ్రహ్మపుత్రానదులందుఁగల యోడరేవులలో మూడుసిగ్నల్సు మాత్రమే వాడఁబడు చున్నవి. అత్తావుల బారిసాలు, గోయిలొండో, నారాయణగంజి, నోవాఖాలి, చందుపూరు, ఖూల్నా, రేవులు ముఖ్యములు. ఇవి యన్నియు నదిపైనున్న రేవులే.

(1) వ సిగ్నలు- ఒక Ball పగటియం దెఱ్ఱ దీపము, రాత్రులందిది warning signal అనంబడునది త్వరలో నొకతుపాను కల్గవచ్చునని దీనికర్థమని చెప్పఁబడినది.

(2) సిగ్నలు పైకి మొనగల Trangle పగలును, రెండుఎఱ్ఱదీపములు నొకటిక్రిందనొకటి రాత్రులందునను, ఇది 'Danger signal' అనంబడునది. త్వరలో నొకతుపాను కల్గునని దీనికరమని చెప్పఁబడినది.

(3) సిగ్నలు- ఒక Vertical Bar. పగటియందునను, ఒకటిక్రిందనొకటి వ్రేలాడఁదీయఁబడిన ఎఱ్ఱలాంతరులు మూఁడురాత్రులందు నను. ఇది 'Great Danger signal' అనంబడినది. ఒకగొప్ప యపాయకరమగు తుపాను త్వరితముగా వచ్చెడినని యీసిగ్నలున కర్థమని చెప్పఁబడినది.

**స్టోరియోలజీ (Storiology):-** కథా రచనమును గురించిన విజ్ఞానము. 'అరేబియన్ రాత్రులు' 'కాశీమజిలీలు' మొదలగునవియును మానవహృదయమును జీవితరహస్యమును స్పష్టీకరింపఁజేయు 'Shart stories' ను గురించిన కల.

**స్టోరేజిఇరిగేషన్:—**

(ఇరిగేషన్ చూడుఁడు).

**స్టోర్ (Store):—** వాణిజ్యసంబంధ పరిభాషాపదము. నిల్వయని యర్థము. సరకులను నిల్వవేయుట కర్థమగును. ఇంకను చిల్లరగానమ్మునట్టియంగడి కీపేరు వర్తించెడిని. ఓడయందలి (మార్గమున) భోజనసామగ్రినిల్వకు 'stores' అనెదరు.

**స్నో ఫ్లేక్ (Snow flake):—** హోరు ఫ్రోస్టు మంచుకిస్టల్సుగ నుండును. (హోరు ఫ్రోస్టు చూడుండు). ఇవి యధికముగ వాతావరణమునం దేర్పడినతరి శీతలముపైగా వాటికిం దగులులేని యవికరంగినవి వర్షముగ భూమిపైంబడును. కరంగనివల్లే భూమికింజేరి వడగం డ్లనంబడును. అట్టి వనేకములు కరంగుచుంపు స్థితియందు కలసి పోయినవి 'స్నోస్లే' క్సనంబడు చుండును. ఇది యాంగ్లపదము. స్నోఫ్లేక్సు వాయుపథమునుండి కొన్ని రసాయనికపదార్థములం గూడ తెచ్చి భూమికింజేర్చి దానిం బంటలకు బలపఱచునట. నీరు పాతె పస్కి లకుం బోవునట్లు పోక యింకి రసాయనపదార్థబలము పొలమునకుం గల్గించునట.

స్నోఫ్లేకు మంచైనను, నీరు ఘనీభవించిన మంచు మంచువలె జలమాత్రమే గాక యధిక గుణయుతమని రసాయనికు లందురు.

(హెయిల్ చూడుండు)

**స్నో లైను (Snow line):—** ఎత్తగు పర్వతశిఖరములు సంవత్సరము పొడవునను మంచుచేం గప్పంబడి యుండెడిని. అట్టి భాగమున సముద్రంపు నీటిమట్టముపై నెంత యెత్తునుండి యిటుల మంచు ప్రారంభమై యుండునో దానికి 'స్నో లై' నని పేరు.

ఇట్టిస్నోలైను ప్రపంచమందలి వేర్వేరుప్రదేశముల వేర్వేరు యెత్తులందుం బ్రారంభ మగునని తేలుచున్నది. ఉత్తర దక్షిణ ధ్రువప్రదేశములందు స్నోలైను సముద్రంపునీటిమట్టమునందే యుంట స్పష్ట మగుచునే యున్నది. ఏలయన నిట సముద్రంపునీరే ఘనీభవించి మంచుగ నై యుండును. ఇది భూమధ్యరేఖకడ నిరువదివేల యడుగుల యెత్తునకుంగాని తగులనటుల పరిశీలనలు బయల్పఱచినవి. ఇం దింకను వేరొకచిత్రము కలదు. పైహద్దుల నడుమప్రదేశములందు ఆల్ప్సు పర్వతముల దక్షిణంపుకేటివాలులందుం బదివేల యడుగులయెత్తున కారంభ మగుటయు, వాని వెనుకనే యుత్తరదిశ నేటవాలులందు, తొమ్మిది వేల యయిదువందలకే తగులుటయుం గల్గుచున్నది. హిమవన్నగమున దక్షిణదిశయం దించుమించు పదునారువేల యడుగులకుం బ్రారంభమైన స్నోలైను ఉత్తరదెసలం దిరువదివేలవఱకుం దగులకుండెడిని. ఎచట నెటులున్నను రాశిని భూమధ్యరేఖ కుత్తర దక్షిణములందు ముప్పది డిగ్రీలప్రదేశమున సముద్రంపు నీటిమట్టముపై పదునేనువేల యడుగులయెత్తునను, అఱువదిడిగ్రీల ప్రదేశమునం బదివేలయడుగులయెత్తునను, డెబ్బది డిగ్రీలప్రదేశమున నైదువేలయడుగుల ప్రదేశమునను, ఎనుబదిడిగ్రీలప్రదేశమున సముద్రంపునీటిమట్టముపైనను, తొంబదిడిగ్రీల ధ్రువములందు సముద్రంపు నీటిమట్టముకుం దిగువభాగమునను స్నోలైను తగులునని తేలుచున్నది.

**స్ఫోటకంపు టీకాలు:—** దీనిం గనిపెట్టిన మహనీయుండు డాక్టర్ ఎడ్వర్డు జెన్నర్ (Dr Edward Jenner) గారని చెప్పంబడినది. గ్లాసెస్టరుషైరులోని సడ్బరీగ్రామమునం దాయన వైద్యవిద్య నొకగురునికడ నభ్యసించుచుండుతరి నతాత్తుగా మనుష్యులకుం దగులు స్ఫోటకము (small pox) ను పశువులకుం దగులు సంచ (cow pox) రోగమును, అన్యోన్యసంబంధంపుం బోలికలం గల్గియున్నవి (antagonistic) గా ననుమానపడి, తాను విద్యాభ్యాసము ముగించి, బెర్కిలేయందు వైద్యవృత్తికిం గడంగినపిదప తన

వైద్యశాలకడనే వసించుచున్న యొకడైరీమెయిడ్ వనిత కౌపాక్సు రోగ మంటియుండ గాంచి, యతి కష్టముపై నామెనుండి రసిని (lymph) తీసుకొని జేమ్సు ఫిప్సనుబాలునకు టీకాలువైచి పరిశీలించెనట. ఇది క్రీ. వె. ౧౭౯౬ మే ౧౪ తేదీ యని చెప్పఁబడినది. పిదప నలువదియేఁడురోజుల వఱకా బాలున కేబాధయుం గలుగుండమిని పరిశీలించుచు జూలై ౧ తేదీని స్ఫోటకపురోగినుండి రసినరసితో టీకాలు వైచెనట. ఈపరిశీలనలనుండి తనవిధాన మించుకమార్పుఁ జెందుటతో సరియగువిధానమునకుం జేరునని తలంప సాగెను. ఆయనశిష్యు లెల్లరకు బోధించుచు టీకాలువేయ సాఁగిరి. కాని వారు దాని నిజతత్త్వము నెఱుంగని వారుగ నుండిరి.

కాని యక్కాలమున నాయనపనికి జయమెదురొక్కనలేదు. పెక్కండ్రు బాలు రింగ్లాండున నీటీకాలుకారణముగ మృతినందసాగిరి. ఆయన నెల్లరు గేలిసేయుచు హంతకుఁడనియు, ఆటీకాలు వేయుటను జెన్నరిజమ్ (Victim of Jennerism) అనియు, వెక్కిరించుచుండిరి. గాని జెనీవానగరమున నెదర్లాండ్సు దేశములందు, ఇటలీ దేశమున, దక్షిణఅమెరికాదేశముం దాయనను మెచ్చుకొనుచు పొగడుచుండిరి. ఎట్టకేల కింగ్లాండును, క్రీ. వె. ౧౮౫౩ లో పార్లమెంటుశాసనమున టీకాలనామోదించెఁ గాని, ఆయన యది వఱకే ముప్పదియేండ్లకుమున్ను చనిపోయియుండెను. నెపోలియన్చక్రవర్తి చేతఁగూడ నీవిధానము పొగడొందెనట. ఇక్కాలమున ప్రపంచమంతటను ఘోరవ్యాధియగు స్ఫోటకపు మృతినుండి యెల్లదేశములందలి ప్రజలను టీకాలు రక్షమై యున్నవట.

## స్త్యైషగోత్రము:—

(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.)

**స్రోతశ్శాస్త్రములు:—** స్రోత స్సనిన ప్రవాహమున కర్థము. ఇచట నుపదేశప్రవాహమని భావము. పరమేశ్వరాదాగతబోధలను పరమేశ్వరవిజ్ఞానకైవల్యములని చెప్పఁబడినది. పరమేశ్వరునకు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష ముఖము లధోముఖములనియు, ఈశాన్యముఖ మూర్ధ్వముఖమనియుఁ జెప్పఁబడినది. అధోముఖములు నాల్గింటినుండి కల్గినయనుగ్రహపూర్వకోపదేశములకు 'అధస్రోతస్సు' లనిపేరు. ఊర్ధ్వముఖమగు నీశాన్యముంగూర్చి యేమియుం దెలియదు.

౧ సద్యోజాతముఖము— దీనినుండి కల్గినది భూతతంత్రము. ఇందు సద్యోజాతభూతబ్రహ్మను నారాధింపవలయు ననియుఁ జెప్పఁబడినది. భూతప్రేతపిశాచబాధలనుండి విముక్తికి మంత్రౌషధము లీతంత్రమున వివరింపఁ బడినవి. సద్యోజాత బ్రహ్మమంత్ర మీముఖమును ధ్యానించెడిని.

౨ వామదేవముఖము— దీనినుండికల్గినది వామాతంత్రము. ఇందు వామదేవబ్రహ్మము నారాధింపవలయునని జెప్పఁబడినది. స్త్రీవశ్యార్థములగు మంత్రతంత్రౌషధు లిందు వివరింపఁ బడినవి. వామదేవబ్రహ్మమంత్ర మీముఖమును ధ్యానించెడిని.

3 అఘోరముఖము—దీనినుండి కల్గినది దక్షిణాతంత్రము. ఇం దఘోరబ్రహ్మము నారాధించవలయుననియుఁ జెప్పఁబడినది. శత్రువులంజయించు సాధనములగు మంత్రతంత్రాదు లిందు వివరిం

పఁబడినవి. అఘోరబ్రహ్మమంత్ర మీమాముఖ మును ధ్యానించెడిని.

౪ తత్పురుషముఖము— దీనినుండికల్గినది గారుడ తంత్రము. ఇందు తత్పురుషబ్రహోపాసనము చెప్పఁబడినది. సర్పదష్టవిషముక్తి సాధనములుగ మంతౌషధాదులు వివరింపఁబడినవి. తత్పురుష బ్రహ్మమంత్ర మీమాముఖమును ధ్యానించెడిని.

ఈనాల్గుముఖను లఘోముఖములు. పై నాల్గు తంత్రముల కధస్రోతస్సులనియు, నిందలి యైహికభాగమునకు విజ్ఞానమనియు, ఆముష్మికభాగమునకుఁ గైవల్యమనియుం బేరులు వాడఁబడినవి. ఊర్ధ్వముఖమగు నీశాన్యముఖముంగూర్చి యేమియుం దెలియదు గాని ఈశాన్యబ్రహ్మమంత్ర మీమాముఖమును ధ్యానించెడిని.

**స్రోతోవహాయతి:**— ఇది సంగీతశాస్త్రుఁపుయతి. కవిత్వసంబంధము గాదు.

(యతి ప్రాణము చూడుఁడు).

**స్వోరన్ బ్రదర్సు [నేస్తము] Sworn Brothers:**— నిశ్చలమైత్రికై ప్రమాణములు చేసుకొనిన మిత్రులు. ఆంధ్రదేశమున నిట్టివానికి నేస్తమని యందురు.

**స్ట్రాంటియమ్ (Strontium):**— ఇది 'metalic element' అని చెప్పఁబడినది. దీని chemical symbol Sr. అనియు, atomic weight 87°03 అనియు, atomic number 38 అనియు, చెప్పఁబడినది. ఇది calcium group నకుం జెందినగట్టిలోహము. పసుపుఁబచ్చ రంగు గలది. తీఁగెసాఁగును. సాగఁగొట్టిన మెత్తగ సాగునది. గాలికింజూపిన oxidises అగునది. నిప్పుకుం దగిల్చిన కాలుచుండును. క్రీ. వె. ౧౭౯౦ లోఁ గనిపెట్టఁబడినది.

దీని monoxide Sr O. అనియు, dioxide Sr O. 3 అనియుం జెప్పఁబడినది.

**సౌండ్ఏజ్ఏరోచ్ (Sound as a Roach):**— St. Roche గొప్పమహిమగలవాఁడు. క్రైస్తవభక్తుఁడు. ఇంగ్లాండుదేశమున ప్లేగు సంభవించినప్పు డనేకులకుఁ గుదిర్చినవాఁడట. గొప్పశరీరదార్ఢ్యము గలవాఁడని వాడుకయం దున్న 'ఉక్తి'.

**సౌండ్ లేక స్ట్రెయిట్ [Sound or Strait]:**— జలసంధి. రెండు గొప్పజలభాగముల గల్పు సన్ననినీటి మార్గమునకు 'Sound' అనియు, 'Strait' అనియుం బేరులు. (Sea Portions చూడుఁడు - Strait చూడుఁడు).

**సౌందర్యము [చక్కదనము] అందము:**— ఇది పెక్కండ్రను భ్రమపెట్టుచున్న విషయము. ఏదియైనను నుండవలసినరీతి నుండిననది సౌందర్యమని తోఁచెడిని. లేక దానియొక్కపరువఁపు టవస్థయందుఁడుతరి సౌందర్యమేని తోఁచెడిని. ఆపరువము చెడిన నందలిసౌందర్యభ్రమయు తగ్గిపోవును. అరుదుగఁ గల్గినవి యరుదుగఁ గల్గిన దృశ్యము లొకప్పుడు సౌందర్యవంతములుగ తోఁచుటయుం గలదు. అవియే తఱచుగ సంభవించుచుండిన వాటియందలి సౌందర్యభ్రమయు తగ్గిపోవును. మిగతఁదోఁచిన వాటియం దొకకొంత సౌందర్యభ్రమ కలుగనోపు. నిజమున సౌందర్య మనునది లేదు. సౌందర్యమునకు వ్యతిరిక మైనది కురూపము.

సౌందర్యభ్రమ మనస్సుయొక్క వికారము గాని నిజమున నట్టి దెద్దియును లేదు. దానికిఁ బతి-

మితియు లేదు. ఒకరికి రూపముగఁ దోఁచినది వేరొకరికిఁ దోఁచకపోవచ్చును. ఒకరికిఁ గురూపముగఁ దోఁచినది వేరొకరికిఁ జక్కఁదనమై తోఁచవచ్చును. ఇది చిత్తవృత్తి ననుసరించి యుండునది. తలంపు దానినట్లు తోఁపఁజేయును.

**సాంబకము:**— విమానము. పరమేశ్వరుఁడు (మయునిచేత రచింపఁజేసి సాల్వునకిచ్చినది. గగనసంచారశక్తి గలది. (సాల్వుఁడు చూడుఁడు.)

సాంబకమునే 'సాంభక' మని గూడ వాడుటఁ గలదు. ఈసాంభకవిమానముగల సాళ్వుఁ(ల్వు)డు సాంభకుఁడు కావున సాళ్వునకు మఱియొక పేరు సాంభకుఁడు లేక సౌబకుఁడు.

**సాంభకము:**—(సాళ్వుఁడు చూడుఁడు. సాంబకముచూడుఁడు. సాళ్వదేశముచూడుఁడు).

**సాంభకుఁడు:**—(సాళ్వుఁడు చూడుఁడు. సాంబకుఁడు చూడుఁడు. సాంభకము చూడుఁడు.)

**సాఖోవాహి గోత్రము:**—
(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.)

**సాగతీయగోత్రము:**—
(కుశికగణము చూడుఁడు.)

**సాగన్ధికము:**— సరస్సు. సౌగన్ధికపుష్ప విరాజితము. కుబేరుని యుద్యానవనమునం దుండునది. పాండవు లరణ్యవాస మొనర్చుతరి గన్ధమాదనపర్వతముకడ నుండ నీకొలనునుండి సౌగన్ధిక పుష్ప మొకటి గాలికెగిరిపడి వచ్చి ద్రౌపతికడం బడెనట. దానింజూచి యామె యట్టిపూవుల నింకను దెచ్చియిమ్మని భీమసేనునిం గోరెనట. అతండేగి తెచ్చియిచ్చుమార్గమున తనకగ్రజుఁడగు హనుమంతునింగాంచి యాతనికడఁ బెక్కుధర్మముల నెఱింగెనట.

**సాగయుగోత్రము:**—
(భరద్వాజఉపగణము చూడుఁడు.)

**సాగయుగోత్రము:**—
(ఆత్రేయగణముచూడుఁడు).

**సాగిగోత్రము లేక సాపక్షిగోత్రము:**—
(కుండినగణము చూడుఁడు.)

**సాగోలిగోత్రము:**—
(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.)

**సాచివృక్షగోత్రము:**—
(వశిష్ఠగణము చూడుఁడు.)

**సాజపృశ్నిగోత్రము:**—
(భరద్వాజఉపగణము చూడుఁడు.)

**సా[illegible]గోత్రము:**—
(శండిలగణము చూడుఁడు.)

**సాజరిగోత్రము:**—
(కపియుపగణము చూడుఁడు.)

**సాడాన్ లేక నిగ్రిటియా దేశము** (Negroland):— ఇది యాఫ్రికాఖండమున సహారాయెడారికి దక్షిణముగానున్న దేశము. పశ్చిమమున సెనగాంబియాదేశము మొదలు తూర్పున శిలానదీ [నైలు] తీరమువఱకు వ్యాపించియున్న నల్లవారిదేశము. ఈదేశపుఁ బ్రజలను నీగ్రోజాతి వారని దేశమునుండి పేరుకల్గెను. ఆంగ్లేయు లీదేశమును 'నీగ్రోలాం' డనియెదరు. నీగ్రోజాతు

లరబ్బీదేశంపువర్తకులవలన బానిసలుగఁ గొంపోఁబడి, విక్రియింపఁబడి, యనేకదేశములకుఁ జేర్పఁబడియున్నారు. కొందరు కూలినాలులకై వలసఁబోయిరి.

ఈదేశమునందు, పశ్చిమభాగము, దక్షిణభాగము కొండలప్రదేశములుగ నున్నవి. కాని మొత్తమున దేశమంతటను ఫలవంతమగు మైదానములుగ నుంటఁ గాననగును. ఇసుకలనుండి లేర్పర్పఁబడియు వ్యవసాయమునకు జలసమృద్ధింగల్గించుచు, పడమటవైపుననున్న గుట్టలగుండా నిగార్‌నది ప్రవహించుచుండును. తూర్పుభాగము ఔహాడ్‌సరస్సుయొక్క యేటవాలుప్రదేశమై యున్నది.

ఈదేశమున 'Royal Niger Company' అనుపేరుగల యొకసంఘమువారి వశమై 'నిగేరియా' యను టెరిటరీ యేర్పర్పఁబడినది. అందు బోర్న్యూ, సోకోటో స్టేట్లు గలవు.

ఈదేశమున వసించుజనులు నీగ్రోలనంబడుదురు. చాల నల్లగానుండుచర్మములు గలవారు. ఇంకను ఫెల్లాటా లనుజాతివారును గలరు. వీరు మూరులకును, నీగ్రోలకును మిశ్రజాతివారు. హౌసాసాజాతివారు కొంతమంది కలరు. వీరు బ్రిటీషువారియం దభిమానముఁ గల్గినవారు. తాము విద్యాధికులమని, నాగరికులమని యనుచుందురు. నిగ్రిటియాదేశమును గూర్చి సరిగాఁ దెలియదనియు, జనాభా యెక్కువ యని చెప్పఁదగునేకాని లెక్కింపఁబడ లేదనియుఁ బెక్కండ్రి యభిప్రాయము. వ్యవసాయము, పశువులపెంచుట ముఖ్యవృత్తులు. కొన్ని చేతిపనులు కలవట గాని యవి చాలమోటుగా నుండునట. వీరు మాటలాడుభాష యొకటికాదనియు, వాటిలోఁ బెక్కుభాషల కక్షరములు లేవనియు నొకవాడుకఁ గలదు.

తొల్లింటిమతస్థులు కొందఱును, మహమ్మదీయమతస్థులు కొందఱును గలరు. క్రైస్తవమతస్థులును నచ్చటచ్చటఁ గలరందురు.

ఈనీగ్రోభూమియం దనేకస్టేట్సు కలవనియు, నందు ముఖ్యములగునవి యెన్మిది యనియుఁ జెప్పుచున్నారు.

౧ బాంబరాస్టేటు— ఇది నైలునదిపై భాగమున నున్నస్టేటు. దీనికి రాజధాని సేగోపురము. ఇటనే మంగోపార్కుగారు మొదట నీగార్ నదిం జూచెనట. ఇది ఫ్రెంచి సౌడాన్‌దేశములోనిది.

౨ టింబక్టూస్టేటు— ఇది నిగారునదిపై భాగమున నున్నస్టేటు. దీనికి రాజధానిపేరు టింబక్టూపురము. ఉత్తరాఫ్రికానుండి వర్తకంపుఁగారవాను లిటకుఁ జేరిపోవుచుండు మార్గముపై నున్నది. వర్తకస్థలముగూడ నై యున్నది. ఇది ఫ్రెంచిసౌడాన్‌దేశములోనిది.

3 గండోస్టేటు— ఇది నిగార్‌నది క్రిందిభాగమున నున్నస్టేటు. దీనికి రాజధాని గండోపురము.

౪ సోకోటోస్టేటు— ఇది గొండోస్టేటుకుఁ దూర్పువైపున నున్నది. దీని రాజధాని సోకోటోపురము. ఇది పెద్దపట్టణము.

౫ బోర్న్యూ— ఇది టహాడ్‌సరస్సునకు నైఋతిదిశగా నుండుస్టేటు. దీనిరాజధాని కుకాపురము. ఇది టహాడ్‌సరస్సుతీరమున నున్నది.

బాగీర్మిస్టేటు— ఇదియు టహాడ్‌సరస్సుయొక్క నైరుతిభాగముననే యున్నది. స్వతంత్రరాజ్యమై కనెమ్ వాడైలతోఁ గలసి యొకసుల్తానుయొక్క యేలుబడియం దుండెను.

| | |
|---|---|
| ౭ కనేమ్ స్టేటు:— ఇది యుత్తరమున నున్నది. | ఏలుబడియం దేక రాజ్యముగా నున్నవి. |
| ౮ వాశ్లై స్టేటు— ఇది తూర్పున నున్నది. | |

ఇందు బాగ్మిర్మి, కనేమ్, వాశ్లై లిటీవల నేక రాజ్యమై యొకసుల్తాను పాలనయం దున్నవి. తక్కినవి ఫ్రెంచిః కిఁ గాని, బ్రిటీషుః కిఁ గాని లోఁబడినవి.

## సాడిగోత్రము:

(భరద్వాజ ఉపగణముఁ జూడుఁడు.)

## సౌతు జార్జియన్ ద్వీపములు

(South Georgian Islands):— ఇవి దక్షిణధ్రువప్రదేశములందు, అంటార్కిటికాసంబంధమగు ద్వీపములసమూహముగఁ బోల్పంబడిన భూప్రదేశము. (అంటార్కిటికా చూడుఁడు.)

## సౌతు షెట్లాండు ద్వీపములు

(South shetland Islands):— ఇది దక్షిణ ధ్రువప్రదేశములందుఁగల అంటార్కిటికాసంబంధమగుద్వీపముల సముదాయమని పోల్చఁబడిన భూప్రదేశము. (అంటార్కిటికా చూడుఁడు.)

## స్పౌత్రాంతికబౌద్ధమతము:

—ఇది చతుర్విధబౌద్ధములలో నొకటి. సర్వలక్షణములచే నీ మతము బౌద్ధసిద్ధాంతము ననుసరించినది. (బౌద్ధమతము చూడుఁడు.) బుద్ధభగవానుని తరువాతవారగు బౌద్ధపండితులలో నొకప్పుడు వివాదములు గల్గి బౌద్ధులు ౧ మాధ్యమికులు, ౨ యోగాచారులు, 3 సౌత్రాంతికులు, ౪ వైభాషికులు నని నాల్గుతెగలవారైరి. వీరివిభేదము లొక్క జ్ఞానజ్ఞేయములగు (అంతరార్థమగు బుద్ధి లేక యాత్మ) బాహ్యార్థమగు వెలుపలనుండు లేక బాహ్యార్థములగు జగద్వస్తువులంగూర్చియే యని యెఱుంగునది. ఇంకను వీరిలో నించుక నాచారభేదములుండినను నవి స్వల్పములుగాన పాటింపఁ బడఁజనవు.

సౌత్రాంతికబౌద్ధమున జ్ఞాన (బుద్ధి లేక ఆత్మ) జ్ఞేయ (బాహ్యజగత్తు) రెండును సత్యములు. ఇది యనుమానప్రమాణముచే విదితము. అవి క్షణికములు. వీరి నితరమతములవారు బాహ్యార్థానుమేయత్వవాదులనియు, సాలంబనవాదు లనియు నందురు. బాహ్యార్థ అనుమేయత్వమన జగద్వస్తువు లనుమానప్రమాణతః సాధించువా రనియు, అంతరార్థమగుబుద్ధి లేక యాత్మ కాలంబన (ఉనికిపట్టు) ముగ దేహముఁగలదనువారుగాన సాలంబనవాదు లనంబడిరి. ఈమతముల దేహము [జగత్తుతోఁబాటు] శూన్యము లేక మిథ్య కాదని భావము.

జ్ఞేయమగువస్తు వుండినే జ్ఞానము దానిం గూర్చి యేర్పడును. అట్లే జగద్వస్తువులు జ్ఞానమునకు విషయమగుచున్నవి. అనఁగా జ్ఞాన మావస్తువునం దారోపించి ప్రత్యేకముగ నావస్తుజ్ఞానము గల్గించుహేతు వగుచున్నది. జగద్వస్తువు లన్నియు క్షణికములగుట వస్తుజ్ఞాన మేర్పడిన తోడనే నశించినను, దానిరూపము జ్ఞానగతమై జ్ఞాపకమున నుండెడిని. ఆక్షణమునం దారూప మెట్లుండునో యెట్లు జ్ఞానమునం దేర్పడి యారూపము నశించినను ఛాయాపటము (Photograph) వలె జ్ఞానమునం దుండెడిని. అనఁగా నట్టిరూపము గలవస్తువు [నశించినదైనను] నొకప్పు డుండెనని తలంచుటగాఁ జెప్పఁబడినది. ఇది యనుమానప్రమాణముచే సిద్ధించుటగా నెఱుంగఁదగినదని చెప్పఁబడినది.

బుద్ధియందుఁ బ్రతిబింబించు నాకారము లన్నియు బుద్ధియొక్క రూపములు. నలుపు తెలుపు మొదలగురంగులకు ద్రవ్యము (వస్తువు లేక శరీరము) లేకున్నను గోచరించుట బుద్ధియొక్క పరిణామము (లేక ఊహ) గఁ జెప్పఁబడినది. ఏదోయొక యాకారము, ఏదోయొకరంగును గల్గినప్రతివస్తువునుబుద్ధియందుఁ దోఁచుబనూాలముననే తెలియ నగును గాన నది ప్రత్యక్షము గాదనియు, నను మానప్రమాణసిద్ధమనియు,నీరూపము ౧ ఘ్రాణేంద్రియమునఁగాని, ౨ జిహ్వేంద్రియమునఁగాని, 3 చక్షురింద్రియమునఁగాని, ౪ త్వగింద్రియమునఁగాని, ౫ శ్రోత్రేంద్రియమునఁగాని లీనమగుచుండునని చెప్పఁబడినది.

ఈమతిమున మాధ్యమిక యోగాచారుల నిర్వరను పుద్గల (పరమాణువులు) ములు లేవనుట నిరసింపఁబడినది. సౌత్రాంతికమతమున పరమాణువన నాకాశధాతు వనియు, ఆకాశమంతయుఁ బరమాణుసముదాయమేయనియు, నవి జ్ఞానమాత్రమేకాని యొకవస్తువుకావనియు, సర్వము క్షణికమగుట బుద్ధియాకారముననే విజృంభించునవి యనియు, బుద్ధి యాకారములే వస్తువుయొక్క యాకారములనియుఁ జెప్పఁబడినది. మఱియు బుద్ధికి స్థానముగ శరీరమును క్షణికమయ్యుఁ గల దని చెప్పఁబడినది.

**సౌత్విక్టోరియా:—** ఇది దక్షిణధ్రువ ప్రదేశమునఁ [అంటార్కిటికా] గల భూప్రదేశము. దీనిని క్రీ. శ. ౧౮౪౧ సంవత్సరము Sir James Boss గారు కనుగొనిరి. ఇది న్యూజీలాండునకు దక్షిణదిశయందుఁ గడుదూరమున నున్నదట. దీని సముద్రతీరమునఁగొప్పపర్వతశిఖరములు కలవనియు, నందు గ్లేసిరులు, అగ్నిపర్వతములు గూడ గల వనియు, Mount Er-ebus అను నగ్నిపర్వతమం దున్నదనియు, దానియెత్తు సముద్రఁపునీటిమట్టముపై ౧౨౪౦౦ ల యడుగు లుండుననియు, నందలిజ్వాల లున్నతముం జెందుతరి నంధకారబంధురమై యుండు శీతకాలఁపు రాత్రులందుఁ గడుదూరము వెలుఁగిచ్చుచుండుననియుఁ జెప్పఁబడినది.

[అంటార్కిటికా చూడుఁడు.]

**సౌత్ ఫ్రిజిడ్ జోన్** (South Frigid Zone):— (దక్షిణధ్రువప్రదేశము, South polar region చూడుఁడు.)

**సౌత్క్వరగోత్రము:—**

[ఆత్రేయగణము చూడుఁడు.]

**సౌత్పోలుప్రదేశము:—**

[దక్షిణధ్రువప్రదేశముఁ జూడుఁడు.]

**సౌదసుగోత్రము:—**

[శండిలగణము చూడుఁడు.]

**సౌదానవగోత్రము:—**

(శండిలగణము చూడుఁడు).

**సౌద్వాకిగోత్రము:—**

(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**సౌధహలగోత్రము:—**

[రాక్షసగణము చూడుఁడు.]

**సౌనంద (ముదావతి):—** వత్సంధ్రుని భార్య. విదూరథునికుమార్తె.

(ముదావతిఁ జూడుఁడు).

సౌనకప్రయాగ:—
(పంచప్రయాగలు చూడుఁడు.)

సౌనఘగోత్రము:—
(నిధ్రువగణము చూడుఁడు.)

సౌనారిగోత్రము:—
(కణ్వఉపగణము చూడుఁడు.)

సౌపవనగోత్రము:—
(సకృతిఉపగణము చూడుఁడు.)

సౌపవగోత్రము:—
(వశిష్ఠగణము చూడుఁడు.)

సౌపురిగోత్రము:—
(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

సౌపుష్పిగోత్రము:—
(గవిష్ఠరగణము చూడుఁడు).

సౌబుద్ధికగోత్రము:—
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

సౌభరాయణగోత్రము:—
(అగస్త్యఉపగణము చూడుఁడు.)

సౌభరి:— ఈపేరుగలఋషు లిద్దఱుగలరు. ఒకసౌభరి మాంధాతచక్రవర్తి యల్లుఁడు. ఏఁబది మంది కుమార్తె లీతనినే వరింపఁ బరిణయ మొనర్చెను. వారంద రీతనితో సహగమన మొనర్చిరట. వేఱొకసౌభరి వేదమిత్రునిశిష్యుఁడు. ఈతని సుతుఁడు శాకల్యుఁడు.

సౌభరిన్యాయము.—సౌభరియను ఋషి కుమారుఁడు. సంతానముంగన కోర్కెగలవాఁడై మాంధాతమహీపాలుని తనకొక సుతనిమ్మనికోరె నట. మాంధాతయు తనయేఁబదిమంది కుమార్తె లం జూపి వారియం దెవ్వ రీతనిం గోరుదని ప్రశ్నిం చెనట. వారంద రేకగ్రీవముగ నీతనిసౌందర్యమున కచ్చెరువంది యందరు వలచిరట. ఆఋషియు నాయేఁబదిమందిం బరిణయమై తనతపోమహిమచే నేఁబదిశరీరములతో వారినందఱ నేకకాలమునందే కూడుచుండెడివాఁడట.

సౌభాగగోత్రము:—
(హారిత ఉపగణము చూడుఁడు).

సౌభృతిగోత్రము:—
(ఆత్రేయగణము చూడుఁడు).

సౌభేయగోత్రము:—
(అత్రిపుత్రికాపుత్రులగణము చూడుఁడు).

సౌమత్యగోత్రము:—
[కుశికగణము చూడుఁడు.]

సౌమనసాయనగోత్రము:—
[వశిష్ఠగణము చూడుఁడు.]

సౌమ్యగోత్రము:—
[నిధ్రువగణము చూడుఁడు.]

సౌమ్యగ్రహములు లేక శుభగ్రహములు:— జ్యోతిషశాస్త్రమునందు, చంద్ర, గురు, బుధ, శుక్ర, గ్రహములు సౌమ్యగ్రహములనియు, శుభగ్రహము లనియుఁ జెప్పఁబడినది.

సౌమ్యాయన గోత్రము:—
[అగస్త్యఉపగణము చూడుఁడు.]

సౌమికగోత్రము:-
[జాతుకర్ణ్యగణము చూడుఁడు.]

**సౌముచయగోత్రము:—**
(ఔతథ్యఉపగణము చూడుఁడు).

**సౌముచిగోత్రము:—**
[శరద్వంత ఉపగణము చూడుఁడు].

**సౌయామగోత్రము:—**
[శరద్వంత ఉపగణము చూడుఁడు].

**సౌయామగోత్రము:—**
[ఔతథ్యఉపగణము చూడుఁడు.]

**సౌయామునిగోత్రము:—**
[గర్గఉపగణము చూడుఁడు.]

**సౌరగిగోత్రము:—**
[ఆత్రేయగణము చూడుఁడు.]

**సౌరద్వతిగోత్రము:—**
[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు].

**సౌరధిగోత్రము:—**
[కుశికగణము చూడుఁడు].

**సౌరభగోత్రము:—**
[భరద్వాజ ఉపగణము చూడుఁడు].

**సౌరభాగగోత్రము:—**
[అగస్త్యఉపగణము చూడుఁడు.]

**సౌరభేయి:**—పంచాప్సర [నారీ] తీర్థసంబంధి యగునప్సరస్త్రీ.

**సౌరమానము:—** సూర్యుఁడు భూమిం జుట్టి తిరుగున ట్లగుపడుచుండు రీతింబట్టి కాలమును లెక్కించుటను సౌరమాన మనెదరు. ఇది దక్షిణదేశమున ననఁగా నఱవదేశమున వాడుకయం దున్నది. (చాంద్రమానము, బార్హస్పత్యమానముఁ జూడుఁడు).

సౌరమానము సూర్యుఁడు మేషరాశియందుఁ జేరుతరి సౌరమానవత్సరము ప్రారంభమై మీన రాశిని వదలుతరి సంవత్సరాంత మగును. ఈసంవత్సరఁపు నెలలు ౧ మేషమాసము, ౨ వృషభమాసము, ౩ మిథునమాసము. ౪ కర్కాటకమాసము, ౫ సింహమాసము, ౬ కన్యామాసము, ౭ తులామాసము, ౮ వృశ్చికమాసము, ౯ ధనుర్మాసము, ౧౦ మకరమాసము, ౧౧ కుంభమాసము, ౧౨ మీనమాసము ననంబడును.

ఇంక వీరితిథులు— ఒకటవరోజు, రెండవరోజు, మూఁడవరోజు, ఇరువదియవరోజు, ముప్పదియవ రోజు ననియే వాడఁబడుచుండును. చాంద్రమాసఁపుఁబౌర్ణమిని, అమావాస్యను, ఏకాదశి ద్వాదశులను, వాటి చాంద్రమాననామములచేతనే వాడుచున్నారు. దీనింబాటించు దక్షిణదేశస్థులు మేషరాశియందు సూర్యుఁడు ప్రవేశించునదినమే సంవత్సరాదిగఁ బరిగణించుచున్నారు.

చైత్రవైశాఖాదిమాసముల నఱవమున వరుసగ చిత్రినెల, వైయ్యాశినెల, ఆణినెల, ఆడినెల, అవణినెల, పెరటాశినెల, అల్పిశినెల, కార్తికినెల, మార్గళినెల, తైనెల, మాశినెల, పంగునినెల అనియెదరు.

**సౌరమానమాసము:—** సూర్యగమనముచుండి పరిగణింపఁబడుట దీనికి సౌరమానమని పేరిడఁబడినది. ఇది దక్షిణదేశమునందును, బంగాళమునను వాడుచుందురు. ఒక్కసంవత్సరమునందుఁ బన్రెండురాసులందు సంచరించుటనే

పండ్రెండుమాసములుగ లెక్కించి పరిగణింపఁ బడుచున్నది. ఇట్లు మేషమాసము, వృషభ మాసము, మిధునమాసము, కటకమాసము మొదలగునవి వాడుకయం దున్నవి. సూర్యుఁ డొకరాశినుండి ముందురాశికిం బ్రవేశించుమార్పు ను 'సూర్యసంక్రాంతి' యనెదరు.

సూర్యచలన మెల్లప్పు డొకేరీతిని లెక్కింపఁ బడదు. గాన దీర్ఘ సౌరమాసమునందు దిన ౩౧– గంట ౧౫– మిని ౨౮ గల్గియుండి, హ్రస్వసౌర మాసమునందు దిన ౨౯– గంట ౭– మిని ౩౮ గల్గియుండెడిని. ఆర్యభట్టసిద్ధాంతముమేరకు సౌర మానవత్సరమునకు దిన ౩౬౫– గంట ౬– మిని ౧౨ పరిమితి యగును. ఈలెక్కకుఁ గ్రీస్తుశకవత్స రంపుదినముల లెక్క యించుమించు సరిపోవుచునే యున్నది. దానియందు దిన ౩౬౫– గంట ౫– మిని ౪౮ సెకండ్లు ౯౫ - ౯౮ కాలము చెప్పం బడుట నెక్కువతేడా గన్పింపదు. (మాసములు చూడుఁడు, చాంద్రమానమాసము చూడుఁడు, అధికమాసము చూడుఁడు, నష్టమాసము చూ డుఁడు.)

## సౌరసుఖిగోత్రము:—

(లౌగాక్షిగణము చూడుఁడు.)

## సౌరాజ్యము:-

(సురాష్ట్రము చూడుఁడు.)

## సౌరాష్ట్రదేశము:—

(అనర్త దేశముఁ జూడుఁడు. సురాష్ట్రదేశము చూడుఁడు.)

## సౌరిగోత్రము:—

(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

## సౌలిగోత్రము (సౌకి):—

(లౌగాక్షిగణము చూడుఁడు.)

## సౌవిష్టగోత్రము:—

(భరద్వాజఉపగణము చూడుఁడు.)

**సౌవీరము:**— ఇది యింగిలీకముంబోలిన మఱియొకటి.

ఆయుర్వేదౌషధములలోఁ గలియునది. మిక్కిలి వేఁడిచేయు ననియు, విరేచనము వెడలించి సమస్త వాతములు, సన్నిపాతములు, సుఖజాడ్యములు, నివారించుననియు, దీనిని శాస్త్రోక్తముగ శుద్ధిఁ జేయ వలెననియు లేకున్న విషమువంటిదిగ నుండు ననియు, దీనివిఱుగుడులు మేఁకపంచితము, గాడిద యల్పాచమానము, నిమ్మకాయ, దానిమ్మకాయ లరసము, సమభాగములు కల్పినది యని యం దురు.

**సౌవీర దేశము, సింధు సౌవీరదేశము:**— శిబికుమారుఁ డగు సౌవీరునిపరిపాల నమునఁ బేరందినదేశము. అల్బెరూనీపరిశీలకుఁడు మూలస్థానప్రాంతదేశమున కీపే రొకప్పుడుండె నని పోల్చియున్నాఁడు. మఱియు నీదేశమునకు సింధు సౌవీరమని వాడుక గలదు. ఈదేశముంగూర్చి భగ వాన్లాలుఇంద్రజీ పరిశోధకుఁడు సింధుసౌవీర మొకదేశమే గాని రెండుదేశములు కావనియు, నిరుగుపొరుగుదేశములౌట నట్లు గురుతుగ పేర య్యెననియు నభిప్రాయపడియున్నాఁడు.

ఈదేశమున దేవానది చెప్పఁబడినది. ఇది మైనాకపర్వతములందు జనించి యిప్పటిమూల్తాను ప్రక్కగఁ బ్రవహించుచు నేగి రావీనదియందు

సంగమించును. దీని నిప్పుడు డీగోసది యను చున్నారు.

రాజధాని 'సౌవీరపుర' మనుపేరం బరగుచుం డినదని తలంపఁబడుచున్నది. ఈదేశమేలిన డెమిట్రిస్ భూపాలుఁడు తనపేరు దత్తమిత్రుఁడని వాడు కొనుచుండువాఁడట గాన దత్తమిత్రిపుర మని యు వాడుకయుండెనట.

## సౌవీరాంజనము సుర్మారాయి :-

లా. Sulphate of antimony ఆంగ్ల Galena. సం. సౌవీరజం, సౌవీరాంజనం, సౌవీరకం. ఇంకనుగొందరు వారిజం, యామునం, కృష్ణం అను పేర్లను వాడియున్నారు. దీనిని సుర్మారాయి యందురు.

ఈయంజనము ప్రసిద్ధినందినది. తురుష్కులం దెక్కువప్రచారము గలది. సుర్మా దీనిశుద్ధిచేయఁ బడినచూర్ణరూపము, అం జనరూపము సమస నేత్రరోగముల నడంచునని యందురు. క్రమముగ శుద్ధిచేయఁబడిన దీనిభస్మము నోటిరోగములు, నాశికరోగములు, ఎక్కిళ్లు, శ్వాసకాసలు, విష దోషములు నడంచుననియు విరేచనములు, రక్త గ్రహణి, రక్తస్రావముల నాపుననియు, ఆవాతజ్వర మునందు దీనిని వాంతిచేయించుట మంచిదనియు నందురు.

## సౌశ్రుతిగోత్రము:—

(కుశికగణము చూడుఁడు.)

## సౌషతగోత్రము:—

(లౌగాక్షిగణము చూడుఁడు.)

## సౌషాతపగోత్రము:—

(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.)

## సౌష్టికగోత్రము:—

(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు).

## సౌహ్నము (పట్టణము):—

బలికుమారుఁడు సుహ్నుఁడు నిర్మించినపురి.

## స్కౌట్ (చారుఁడు) (Scout):—

తొల్లింటికాలమున చారులు లేక వేగులవాం డ్రు శత్రుసైన్యముల పరిస్థితులు, ఉద్యమములు, రాకపోకలు తెలియుటకునై యేగి వచ్చుచుం డెడి వార్తాహరులుగ నుండిరి. పాశ్చాత్యప్రభు త్వము లిట్టి గూఢచారుల నిట్లు పంపుచుండు పద్ధతియుఁ గలదు. యట్టివానిని 'Spy' అని యెదరు.

ఇటీవల భరతదేశమునస్కౌటుల నేర్పర్చఁ బోఁడఁగిరి. 'scout' అనిన చారుఁడు లేక వేగులవాఁ డనియే నైఘంటికార్థము. ఇది సైనికసంస్థగా నున్నది.

బడిపిల్లలనుండి యర్హులను జేర్చి Boy scout ల నిటీవల నేర్పఱుప నారంభించిరి. ఈబాలుర కొకమోస్తరు సైనికదుస్తులను, చేతి కొక లాటీకఱ్ఱను, కొన్ని పరికరములను నొసంగె దరు.

మార్గములందు, ప్రమాదములవలన నపా యముల నొందినవారికి సహాయమొనర్చి వైద్య చికిత్సాస్థానమునకుఁ గాని, వారి తావులకుఁగాని చేర్చుటయు, నుత్సవాదులందు జనసమ్మర్దములఁ దప్పిపోయిన బాలురను వారి తలిదండ్రులకడకుం జేర్చుటయు మొదలగు లోకోపకారకార్యము లొనర్చుటయు, దేశసేవయు, ప్రభుసేవయుఁ జేయు టకు వాగ్దత్తము నిచ్చుట వీరింగూర్చి యెఱుంగఁ దగినవి.

మఱియు నీసంస్థకుఁ జెందినవారిని శాలభట వర్గమని వాడుచుందురు గాని యిది యెంత వఱకు సరియగునో తెలియ రాకున్నది.

వీరికందరకుం బెద్దయధికారి భరతదేశమున డిల్లీనగరమున Chief scout for India and Burma నుందురట. వారికిక్రింద వేర్వే రుద్యోగులు గలరట. వీరికెవ్వరికిని జీతములేదని తెలియుచున్నది. వీరెవ్వరినుండియు నొనర్చిన సేవకుఁ బ్రతిఫలముగ నేమియుం బుచ్చుకొన రాదని విధులు కలవు. ఆపదంజెందినవారి కష్టము పడుటయే వీరిప్రధానధర్మముగ నుండునట.

పోలీసు, మిలటరి saluteలవలె స్కౌటులకు salute విధములు కలవు.

వాట్ల నిందు వివరించుట సమంజసము.



చేతలాటీలేనితరి salute చేయుట.



చేత లాటీతోనిలచియుండుతరి salute చేయుట.



చేత లాటీతో నడచుచుండుతరి salute చేయుట.

అప్పుడప్పుడు ఈ Boy scout భటులకు లోకజ్ఞాన మలవడునటుల కూటములం జరుపుదురు. వాట్ల కాంగ్లమున 'Rally' అనిపేరు. అందు వారికి వంట, కావలిగాయుట, ఈఁత, పరుగునడక, మరికొన్ని యితర కార్యములు, ఆటలు మొదలగునవిగూడ నేర్పి, యపాయ ముం జెందినవారి కుపకార మొనర్చు తీరును, తాత్కాలికఁపు వైద్యోపచారము లొనర్చుతీరును నేర్పెదరఁట.

స్కౌటులు నిలువఁబడు పద్ధతు లీక్రింద చూపఁబడినవి.



ఎలర్టు తిన్నగ నుంచునియుండుట.



ఎలర్టు ప్రక్కదృశ్యము.



Stand at ease ఆయాసము తీర్చుకొనుట నిలచుండుట.



Secure staves.



Trail Staves.



Support staves.



Slope staves.



Set at staves.



Shoulder staves.

ఆదికాలమున నుత్తరఅమెరికా వాసులగు నిండియనులును, దక్షిణాఫ్రికా నివాసులగు జూలూ జాతివారికిని జెందియుండిన నీస్కౌటు విద్య తమశతృవులను వెంటాడించి చునుమాడుట మొదలగు కార్యముల కవసరములగు రహస్యపరిశోధనలు, అన్వేషణలు, గూఢచాతురత్వము, రహస్యసంజ్ఞా సంభాషణ విధులు మొదలగు పనులయం దాతెగలవా రారి తేరి యుండిరి.



Prepare to Signaal (Semaphore)



Ready (Simaphore)



Ready position (Semaphore)

సంజ్ఞ. సేమాఫోర్ సిగ్నల్సు చూడుఁడు.)

పిదప నీవిద్య పోలీసుదళమునందలి గూఢచారులకు నేర్పమొదలిడిరి. అట్టి ఆరిందాయుద్యోగుల 'sleuth hounds' అను గూఢనామమును వారిపై యధికారులు వాడుచుండిరట. పిదప మధ్య కాలములం దీవిద్య పటాలఁపువారిలోనర్హులగు వారికి నేర్పి యుద్ధకాలమున శత్రుసైన్యములజాడ లందీయుట కుపయోగించ మొదలిడిరట. అటుల తరిబీయ్యతునందినసైనికులను 'Lovatsscouts' అని పైవారు గూఢనామము నిచ్చియుండిరట.



ప్రమాణము చేయుతరి స్కౌటులచేత నిట్లు పట్టించుట యాచారముగ నున్నది.

An my honour I promise
that I will do my best
To do my duty to God.
King and country
To help other people at
all times
To obey the Scout Law.



On my honour I promiss
that I will do my best
To be loyal and to do
my duty to God and
king
And to keep the law of
the wolf club Pack to
do a good turn every
day.

**స్థామాంగారిగోత్రము:—**

(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.)

**స్థాలకేశిగోత్రము:—**

(నిధృవగణము చూడుఁడు.)

**స్థాలగోత్రము:—**

[జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.]

**స్థాలపిన్డిగోత్రము:—**

[జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.]

**హంగేరీదేశము:**— ఐరోపాఖండమునం దాస్ట్రియాదేశముతో నైక్యతంజెంది లిమిటెడ్ మోనార్కీగానుండి యైరోపామహాసంగ్రామానంతరమున బ్రజాప్రభుత్వదేశముగమారిన దీదేశము. (ఆస్ట్రియాదేశముఁ జూడుఁడు).

హంగేరీదేశము, హంగేరీరాష్ట్రము, ట్రాన్సెల్వేనియారాష్ట్రము, శ్లావోనియారాష్ట్రము, క్రోఆటియా రాష్ట్రము ననఁబడు నాల్గురాష్ట్రములును టర్కీదేశఁపు సరిహద్దుపొడవున నుంచిన సైన్యస్థానఁపు రాష్ట్రమును నైదుభాగములు గలసినదేశమైయున్నది. ఇట్టి హంగేరీదేశము, ఆస్ట్రిదేశముతోఁ బరిపాలనాసౌకర్య బలముకొరకైక్యతఁజెందినదిగా నెరుంగునది. ఈదేశమున 'ప్రెబ్సర్గపురము' తొల్లింటికాలమున నిది యొకప్రత్యేక రాష్ట్రముగనుండిన కాలమున రాజధానియై యుండెను. అది డాన్యూబునదీతీరము. ఇప్పు డొకపాటి వర్తకస్థలమై యున్నది.

ఆస్ట్రియాతో నైక్యమైనపిదపఁగూడ హంగేరీదేశము దానిచట్టముల నదియే నిర్మించుకొనుచు దానివ్యవహారముల నదియే నిర్వహించుకొనుచుండు స్వతంత్రతం గల్గియున్నది. పిదపకాలమున దీని ప్రధానకార్యస్థానము బూడాపెస్టునగరముగ నేర్పరుపంబడి ముఖ్యపట్టణముగఁ జేయఁబడినది. నిజమున బుడాపెస్టునగరము రెండుపట్టణములుగ నెంచందగినది. డాన్యూబునది కొకవైపున బూడాపట్టణమును, రెండవవైపున పెస్టుపట్టణమును గలవు. ఇటీవల రెంటింగలుపు వంతెనలు నిర్మింపంబడియున్నవి. బూడాపట్టణమును ఓఫెన్ (ofen) పట్టణమనియు వాడుచున్నారు. రాజ్యబలమునకై హంగేరీదేశము నాస్ట్రియాదేశముతో నైక్యతం గల్గించునటులనే కొన్నికారణములచే బూడాపట్టణముతోఁ గల్పి బూడాపెస్టునగరముగఁ జేసి వాడుచున్నారు. ఇం దించుమించుగ నేఁడులక్షలజనులు వసించుచున్నారు. చాలసౌందర్యవిభ్రమములం గొల్పు నగరము.

హంగేరీదేశవాసులగు మాగ్యారుజాతివారు ఫిన్లాండుదేశమునవసించు ఫిన్నులవంటివారని చరిత్రకారులు వ్రాసినను వారిస్వచరిత్రలు తెల్పు పూర్వోత్తరగాథలందు వారు నినివేనగర మేలిన నిమ్రోదుచక్రవర్తి కులమువారని తేలుచున్నది. వీరియందును కొన్నిభేదశాఖలు గలవు. వీరు తక్కిన యైరోపాజాతులవలె నంత తెల్లనివారుగారు. నేత్రములతీరును భేదమై పరిశీలకులు జుత్తునుబట్టి తక్కినహంగేరియనులవంటి వారుకారనియు, భేదముగలదనియు ననుచున్నారు. గొప్ప రణశూరులు, సంగరప్రియులు. తొల్లింటికాలమున వీరు గుర్రపుస్వారియం దారితేరినవారుగ నుండిరట. హుజార్సనంబడు నశ్వదళసైన్యములపేరు వీరిభాషాపదమే. వీరినుండియే యితరదేశములవారును దీనిని గైకొనియున్నారు. స్వతస్సిద్ధమగు దయ, సహనముగల ప్రశాంతచిత్తులయ్యుఁ దమ్మునితరులు మోసపుచ్చి యపరాధ మొనర్చినతోడనే కోపోద్రేకమున వారినెదిర్చి వెనుదీయకఁ గలహించుటయందు ధృవచిత్తముగలవారు. కాని ప్రాతపగ, కుటిలవర్తనము వీరియందు లేదు. అగౌరవము నెంతమాత్రమును సహింపనివారు.

పెద్దలయందు మాగ్యారులకు భక్తిగౌరవములసమానములు. వీరిభాషయందు గౌరవసూచకోక్తిపదము లనేకములున్నవి. నిమ్రోదుచక్రవర్తికి హున్యారనియు, మాగ్యారనియు, జ్యేష్ఠపుత్రుఁడు గాక నిర్వురుసుతులు. వీరు తమతండ్రిరాజ్యమును తమజ్యేష్ఠసోదరునకువదలి తామువేర్వేరురాజ్యాధి

పత్యములు సంపాదించుకొనుతలంపుఁ గల్గియుం డిరి. ఐకమత్యమున మెలంగువారు. ఒకతరి దూర ప్రదేశములకు మృగయావినోదమున కరిగియుండ నిర్వురు సమానసౌందర్యవతు లగుపించి వీరి నిర్వు రను గాంచి చెరియొకతెయు భార్యలై తా మప్సరసలమనియు, వీరేలుటకుఁ దగినభూము లనుజూపింతు మనియుఁ దెల్పి పిలుచుకొనిపోయిరి. హున్యారును నాయనజనులును వోల్గానదికవ్వలను మాగ్యారును నాయనజనులును డాన్‌నదీప్రాంత ములను చేరుకొని కుదిరిరి. కొన్నితరము లైనపిదప సంతతియు జనసంఖ్యయు నధికమై యింకను నితర దేశమునకు వలసపోవుట సంభవించెను. అట్లే దేశమునకు మాగ్యారులు చేరినవారట. రష్యా దేశములోని కిర్గిజ్ తెగవా రీజాతివారే యందురు.

వీరితో నీదేశమునకుం జేరినవారిని గిప్సీ లనుచు న్నారు. వీరియం దాడువారు గానవిద్య, నాట్య విద్యాభ్యాసకులై విందులందుఁ దమవిద్యలచే నతిథులను రంజింపఁజేయుచుందురు. పురుషులు కమ్మరఁపుఁబనిని జేతురు. గుఱ్ఱములవర్తకమును, దొంగతనమునుగూడ నొనర్చుచుందురు. వీరి యందుఁ గాపురముగుదిరినవారిలో దొంగతనము లేదు. దేశదిమ్మరులుగ తిరుగువారియందు దొంగతనమును, గుఱ్ఱములవర్తకమును కలదం దురు. హంగేరీదేశమున నింకను స్లావుజాతులవారు, బల్గేరియనుజాతులవారు, రుమేనియనులు (ఓలా జాతి) జర్మనుతెగలవారు, స్లావీయనులు మొద లగువారు వసించుచున్నారు.

హంగేరీదేశమును The land of three mountains and four rivers అందురు. అనఁగా తాత్రాపర్వతములు, మాత్రాపర్వత ములు, ఫాత్రాపర్వతములును, డాన్యూబునది, థీస్‌నది, ద్రేవ్నది, సేవ్నదియను నదులును గల వని భావము. వేసవియందలి వేడిగాఢుపులువేళ మధ్యాహ్నమున 'డెలిబాబ' నంబడు మృగతృష్ణ (mirage) పలుచోట్లఁ గన్పడుచుండును. అది చాలావిచిత్రము. అది నదులు, గ్రామములు, పట్టణములు, పశువులమందలు, తలక్రిందుగఁ గన్పించి యచ్చెరు వొందించుచుండును.

ఇంక నీదేశచరిత్రము వివరించఁబడును. మా గ్యారు లీదేశముఁజేరుతరి వారినాయకుఁ డత్తిలా (Attila) యనుపేరుఁ గలవాఁడనియు, వారి వలనుచేరుట Scorget అనియుఁ జెప్పఁబడినది. అత్తిలా భూపతియై రాజ్యమును స్థాపించెను గాని యాయనసుతు లిర్వురును గలహించుచుండఁ గొందరు ప్రజలు ట్రాన్సల్వేనియాకరిగి కాపురముఁ గుదిరిరి. వా రచటి యెర్డిలేపురమున నేటికిని గాన నగుచు నీచరిత్రం దెల్పుచున్నారు.

మాగ్యారు లీదేశమునకుఁ జేరుతఱి నేడ్గురు నాయకులు సామంతరాజులుగ నుండిరట. వీరితోఁ గూడ గిప్సీలుమొదలగు నితరజాతులుకూడ నుండి రట. అప్పటికి నీహంగేరీయందు స్వల్పసంఖ్యాకు లగు జర్మనులు, స్లోవకులు, స్లోమెనులు నుండి రట. వారిని మాగ్యారులు యుద్ధమున నోడించి దేశమున స్థిరపడిరి. ఆయుద్ధమునకు Honfogla- las (అనఁగా Home making) యుద్ధమని పేరయ్యెనట. మొదటిప్రభువు అర్పాదనుపేరు గల నాయకుఁడు. ఇటుల క్రి. శె. పదియవశతాబ్దాం తమువఱకుం గడచి యత్తరిఁ గ్రైస్తవమతము వీరిని వశపర్చుకొనియెను. వారు గొప్పవిన్నాణము గల చేతిపనులఁ జేయనేర్చిన నాగరికులై యుండిరి. ఇప్పటికి గొప్పగొప్ప వారిండ్ల నానాటి చేతిపను లును, నాభరణములును గానవచ్చుచున్నవి. ఆ పనితనమును పారశీకదేశఁపు విన్నాణముతోఁ

బోల్చఁదగియున్న దందురు. కాని వారితో నేతెంచినవారియందు wild nomadic people కూడ నుండిరట. వారిబాధ యీదేశమునందేగాక చుట్టుపట్లదేశములకుఁ గూడ గల్గియుండెను. వారు కనుపడుటతో దొంగతనములుకూడ జరగుచుండెను. వారికి ungaros అని వాడుకపేరు కల్గెనట. వారే యిప్పటిగిప్సీజాతియని చెప్పఁబడుచున్న వారట. స్పానియాదేశమున నేటికిని పసిబాలు రేడ్చుచు నల్లరిఁజేయుతరి నంగారోస్ వచ్చుచున్నారని వెరపించుచుందురు. అంగారోపదము హంగేరీ పదసంబంధమై యుండనోపు.

హంగేరీయందు మొదటిక్రైస్తవభూపతి Vayik Stephen అనునతఁడని చెప్పఁబడినది. అరిపాద్ రాజవంశ మంతరించినపిదప ఫ్రెంచిదేశమునుండి Anjous వంశస్థులు ప్రభుత్వ మాక్రమించిరి. టర్కీదేశఁపు ముట్టడులు తరుచుగ గల్గుచుండెను. Hunyady ganos అనుపేరుగల క్రైస్తవశూరుఁడు టర్కీదేశమును జక్కగనరికట్టి నిలిపియుంచుటఁజేసి యాతని కోర్కెమేర కాతనిసుతుని ప్రభువుగఁ గైకొనిరి. పిదప నరువదిసంవత్సరముల వరకును దురుష్కులదాడి లేకుండెనట. పిదప క్రీ. వె. ౧౪౫౮ లో matthias corvinus అనునాతఁడు హంగేరీప్రభువయ్యెను.

ఈతఁడు చాలప్రసిద్ధ పురుషుఁడు; విద్యాధికుఁడు, గొప్ప పుస్తకభాండార నిర్మాత యని లోకప్రసిద్ధమయ్యెను. చిత్రకళ, విగ్రహకళ, చేతి పనులుఁ జక్కగవ్యాపింపఁ జేసెను. వారే gold enamel works కనిపెట్టి లోకులకుఁ దెల్పిన వారు. ఆపని ట్రాన్సిల్వేనియా యందలి మెరడ్లీ పురమున విస్తారముగ జరగుచుండినది. చాలధనము నిర్వ్యయమయ్యెను. నీతిపరుఁడుగను, బలాఢ్యుఁడుగను, న్యాయమార్గప్రవర్తకుఁడుగను దనకీర్తి వ్యాపించుటకుఁ దోడుగ తాను వృద్ధుఁ డయి తన సమాధిలో విశ్రాంతి నొందువరకును తురుష్కులు హంగేరీలోఁబ్రవేశింపఁజాలకుండిరి. దురుష్కులు యుద్ధమునకు సమకట్టి యెప్పుడు దండెత్తి

పులపట్టకూడ ధర్మముఁదాటక matthias corvinus భూపాలుఁడు తనపాలనమును గడిపి యనంతానవంతుఁడై మరణించెను. తోడనే తురుష్కులు దాడివెడలి దేశమాక్రమించి దోచుకొనిరని చెప్పఁబడినది. దీనికి mohacs యుద్ధ మనిపేరు. పిదప చాలదుష్పరిపాలనమున హంగేరీ ౧౫౦ సంవత్సరములు గడపెనని చెప్పఁబడినది.

తురష్క లాస్ట్రియాదేశఁపు వియన్నానగరమును ముట్టడించినతరి హంగేరియనులు తిరుగఁబడి తురుష్కులను పారఁదోలఁగల్గిరి. ఈసంధియం దాస్ట్రియాతోఁగూడకలహములుపొడసూపెను. ట్రాన్సెల్వేనియా తిరుగఁబడి యందరితోను గలహింప మొదలిడెను. కాని maria theresia యను నాస్ట్రియారాజ్ఞిపాలన హంగేరికి శాంతిఁ గలుగఁ జేసెను. ఆమె తురుష్కులకాలమున పాడైనవ్యవసాయములను బాగొనరించ మొదలిడి వారిని శాంతపర్చగల్గెంగాని యాస్ట్రియా దేశాచారములు, పద్ధతులు, హంగేరీవారియందు బలాత్కారముగఁ బ్రవేశపెట్టఁజూచుటతోఁ దిరుగుబాటు సిద్ధమగుచుండెను. ఇట్టి యశాంతస్థితి క్రీ.వె. ౧౮౬౭ వరకు నాస్ట్రియాపరిపాలనమునఁ గల్గుచునేయుండి పిదప స్వతంత్రతను వడసి యాస్ట్రియాతో నైక్యమైయుండెను. ఐరోపామహాసంగ్రామానంతరము జర్మనీతోపా టిదియు రిపబ్లిక్కుగాఁ బ్రజాపాలన మేర్పరుచుకొనినను హంగేరీస్వతంత్రవిధాన మట్లే నిలచియున్నది.

టోకేఫట్టణప్రాంతముల విస్తారము ద్రాక్షలుంట నిట లోకములోనెల్ల శ్రేష్ఠతరమగు సారాయము చేయంబడుచున్నదని వాడుకగలదు.

Schemnilz పురమును Kremnitz పురమును (ఉత్తరమున నున్నవి) గనులకడ నున్నవి.

ఓర్నోస్ వాపుర మైరన్గేటుకడనున్న పట్టణము. (ఆస్ట్రియా చూడుఁడు). ఆడ్రియాటిక్కు సముద్రతీరముననున్న Fium పురము రేవుపట్టణము. క్రోయెటియాయం దాగ్రాంపురము ముఖ్యపట్టణము. (ఐరోపాఖండముఁ జూడుఁడు).

**హంఫ్రీడేవీ పరిశీలకుఁడు:**—సర్వసాధారణముగ శాస్త్రగ్రంథములందుఁ గ్లుప్తరూపముగ యీమహనీయునిపే రిటుల వాడంబడుచున్నను నిజమున నాయనను సర్ హం|ఫ్రీడేవి యని చెప్పుటయె సమంజసము. క్రీ. వె. ౧౮౧౨ లో నింగ్లాండుభూపతి మూఁడవజార్జినరపాలుఁ డాబిరుదము నొసఁగి బహూకరించెను.

ఈయన యాంగ్లీయుఁడు. ఇంగ్లాండునందలి పెజాన్సుపురము జన్మస్థానమనియు, క్రీ.వె. ౧౭౭౮ డిశంబరు ౧౭ తేది జన్మకాలమనియు, ౧౮౨౯ మేనెల ౨౯ మృతియనియుఁ జెప్పంబడినది. బాల్యము నుండియు పదార్థవిజ్ఞానముంగూర్చియు, రసాయనములంగూర్చియు, పరిశీలనలొనర్చుటయం దాసక్తింగల్గినవాఁడు. వాక్చమత్కృతింగల్గి జనరంజకముగఁ బ్రసంగించు నేర్పుకలవాఁడు.

ఒకతరి నింగ్లాండునందుఁ గొందరుప్రముఖుల యెదుటఁ బ్రసంగించుచు నేవైనను రెండువస్తువులరాపిడి వేఁడినిగల్గించుననిచెప్పి మంచుసైతము దీనికిఁబాల్పడు ననియెను. తోడనే రెండుమంచుముక్కలనెత్తి యొండొంటితో రాపాడించగాఁ గొంచెము కరిగి యవి శీతగాలికంటుకొన నాకరగుట జనించినవేఁడివలననే యనియు నంటుకొనుట శీతలమువలన ననియు ఋజువుపర్చినందున నందరు నాశ్చర్యనిమగ్ను లయిరట.

ఈపరిశీలకుఁడు తానొనర్చిన రసాయనశాస్త్రపరిశీలనలు, పదార్థతత్వవిషయములు వివరింపుచు నొకగ్రంథమును వ్రాసి ప్రకటించెను. ఈయన పిదప రోయల్కాలేజి ఆఫ్ సైన్సునందు సహాయోపాధ్యాయుఁడై పిదప నందే ప్రధానోపాధ్యాయుఁడయ్యెను. క్షారలవణములను నీటంగరగించి బలమగువిద్యుత్ప్రవాహమునందు నెరపి భేదించి యీపరిశీలకుండందు పొటాసియము, సోడియము, మెగ్నీషియము, కాల్సియము, స్ట్రాన్షియము, బేరియము, నను నారు క్షారధాతువులు బయల్పడుటఁ గనిపెట్టెనట. ఈతఁ డొనర్చినపనుల నాయాతావులఁ గాననగును.

హైడ్రోక్లోరిక్కాసిడ్‌ను, విద్యుచ్ఛక్తి చేత భేదించి క్లోరిన్‌గాలి బయల్పడఁ జేయుటయు, దానిని సోడియముతోఁగల్పిన లవణమగుటయు నీతండొనర్చినపరిశీలనఫలితముగఁ గన్పెట్టంబడినవి.

ఈయనకు మైకేల్ ఫెరడేగారు ముఖ్యశిష్యుఁడు. వీనిని చక్కఁగ లోకమున వ్యాపింపఁజేసి వెల్లడించిన దాయనయేనని చెప్పుదురు. ఇంగ్లాండు ఫ్రెంచిదేశములకు ఘోరయుద్ధములు జరుగుకాలమున నెపోలియనుచక్రవర్తి శాస్త్రవిజ్ఞానియని హం|ఫ్రీడేవీగారిని సన్మానించి గౌరవించెనట. ఇంగ్లాండునందు రాక్షసబొగ్గుగనులలో 'మార్షుగాస్' అనంబడు చెడుగాలి యంటుకొనకుండ వైరుగాజుదీపములను కన్పెట్టి రచించిన దీడేవీగారే యని చెప్పంబడినది. ఈబుద్ధిశాలి బారోనెట్బిరుదమును కూడనందెను. రాయల్‌సొసైటీ కధ్యక్షుఁడయ్యెను. స్విజర్లాండులోని జెనీవానగరమున క్రీ. వె. ౧౮౨౯ మె ౨౯ తేదీని మృతినొందెనని చెప్పంబడినది.

**హంబగ్** (Humbug):— అబద్ధపు బడాయి కీయుక్తిని వాడుచున్నారు. ఇంగ్లాండు నందు Farfarshire నం దొకప్పుడు Hume o' the Bogue అనుపేరుగల బడాయికబురులం జెప్పుకొనుచుండువాఁడు (gasconade) డుం నఁట. ఆప్రాంతఁపువా రందరును హేళనగా బడాయికొట్టుసంగతులను Hume o' the bogue అనుచుండువారట. రానురాను అది Home o' bogue అయి యింకను క్లుప్తమై Humbug అయిపోయెనట.

**హంసగీత:**— హంసరూపుఁడగు పరమేష్టి సాధ్యుల కుపదేశించిన ధర్మవిధానముగఁ జెప్పఁబడి నగ్రంథము.

**హంసగోత్రము:**—
(హిమోదక ఉపగణము చూడుఁడు).

**హంసగోత్రము:**—
(హారిత ఉపగణము చూడుఁడు.)

**హంసతూలికా తల్పము (పాన్పు):**— 'హంసతూలిక' యన హంసపక్షియొక్క (పిగిలిపిట్ట కుచ్చుంబోలిన) మెత్తనితుచ్ఛని భావము. ఇంకను హంసతూలికయన జిల్లేడుదూదికిఁ గూడ నర్థము కలదుగానఁ గడుమెత్తగనుండుజిల్లేడుదూదికి నీపేరు వర్తించెడిని. గొప్పగొప్పశ్రీమంతుల యిండ్ల నొక్కొక హంసతూలికాశయన ముండుట భరతదేశము నకుఁ గొత్త గాదు.

ఇక్కాలమున 'Eder down' పటుపు లాతావు నాక్రమించినవి. Eder ducks ముఖ్యముగ నైస్లాండు దేశమునకుఁజేరిన కొన్ని ద్వీపముల యందు వసించును. అవి గుడ్లుపెట్టుతరి వాట్ల క్రింద మెత్తగనుండుట కిడును.

**హంసద్వారము:**— క్రౌంచరంధ్రమున కీపేరుగలదని మహాకవి కాళిదాసు మేఘసందేశ మున ౧౫౭ శ్లోకమునందు వర్ణించియున్నాఁడు.

**హంసమ్ము నాదతాళము:**—
(తాళములు చూడుఁడు.)

**హంసపర్వతము:**— మేరువునకుఁ జేరి దానియుత్తరమునసందు నొకపర్వతశాఖ.

**హంసపక్షహస్తము:**—
(హస్తాభినయముఁ జూడుఁడు. భరతశాస్త్రముఁ జూడుఁడు.)

**హంసపాదిచెట్టు:**— లా. Vitis Pedata అనియు, Cissus Pedatus అనియు నందురు. సం. హంసపదీ; హంసపాదికా; త్రిపాదికా; విశ్వగంధిః.

దీని సమూలరసకషాయములు శీతపైత్యమును, రక్తపైత్యమును హరించి వీర్యమునకు వేడిచేయు ననియు, పుండ్లను మాన్పుననియుఁ, జెప్పఁబడి నది. మఱియు ననేకరోగముల నివారించు నందురు.

**హంసపాదు:**— వ్రాఁతయందుఁ బొరపాటునఁ గొన్నియక్షరములకు లోపము సంభవించిన తరి నాపజ్క్రింద '⊥' అనుగుర్తు బెట్టి పైన లోపించినయక్షరములను వ్రాయుదురు, అటుల క్రింద నిడిన '⊥' అనుగుఱుతునకు "హంసపా" దని పేరు. ఇది హంసపాదమను పదమునుండి యేర్పడినపదము.

**హంసలఘువు:**— సంగీతశాస్త్రమున జాతి (లయ) ప్రాణమునగల దశలఘువులలో నొకటి. ఏఁడక్షరముల కాలము.

(జాతి (లయ) ప్రాణము చూడుఁడు.)

**హంసలీలతాళము:—** (తాళములు చూడుఁడు.)

**హంసవతీపురము:—** బర్మాదేశమున నిప్పుడు 'పెగూ' అనుచున్నారు. గుఱ్ఱములకుఁ బ్రసిద్ధమైనతావు. దీనిని సామల, విమల, యనుసోదరులు నిర్మించిరని చెప్పంబడినది. వీరెవ్వరో తెలియరాదు.

**హంసాభ్యాస అశ్రమము:—** (ఆశ్రమచతుష్టయము చూడుఁడు.)

**హంసాసనము:** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. రెండఱచేతులును భూమిపైనాని, మోఁచేతులు నాభి కిరుప్రక్కల మోపి, చేతులబలముచే శరీరమును పైకి లేవనెత్తి, వంకఅలేకుండనుండి, రెండుకాళ్లబొటనవ్రేళ్లను నేలనుమోపి యుండుట 'హంసాసన' మనంబడును. ఇందువలనఁ గడుపలచనయై యపానవాయువు బహిర్గతమగునని చెప్పఁబడినది.

**హంసాస్యహస్తము:—** (హస్తాభినయము చూడుఁడు — భరతశాస్త్రముఁ జూడుఁడు.)

**హంసుఁడు:—** ఈపేరుగలవా రిద్దరు గలరు. యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడగు వసుదేవునకు శ్రీదేవియను భార్యయందుఁగల్గిన సుతుఁడు. (రెండవవాఁడు.) మఱియొకహంసుఁడు కౌశికుఁడనుపేరుగలవాఁడు. వీనిసోదరుఁడు డిచికుఁడు. జరాసంధుని చెలికాఁడు.

**హంసో హసః బకో బకః:—** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. హంసయు, కొంగయు, తెల్లగానుండుపక్షులైనను, హంస హంసే; కొంగకొంగే. అనగా హంసగుణములు కొంగకును, కొంగగుణములు హంసకును, గలుగవని భావము. బాహ్యాకారము లోకరీతి నున్నను, గుణములు వేఱుగనుండునని దీనితాత్పర్యము.

**హజరదేశము:—** (అభిసారదేశముఁ జూడుఁడు.)

**హజారీబాగుజిల్లా:-** దీనికి హజారీబాగుపురము ముఖ్యపట్టణము. (ఛోటానాగపూరుప్రోవిన్సు చూడుఁడు.)

**హఠయోగము (కుంభకయోగము):—**(అభ్యాసయోగములుఁ జూడుఁడు.)

**హడ్సన్బేకంపెనీ:—** ఇంగ్లాండునేలిన రెండవఛార్లెసుప్రభువు ప్రిన్సురూపర్టుమొదలగు వారికిఁ దొల్లి కనడాదేశమున వర్తకమొనర్ప నొక ఛార్టరు (అంగీకారపత్రము) నీయ వారు పైపేరన నొకవర్తకసంఘమును స్థాపించి కెనడాదేశమున నర్హస్థానములందు వర్తకఁపుఁదావుల నేర్పరిచి Far చర్మములవాణిజ్యము 'నమెరికన్ ఇండియను' లతో సాఁగించిరి. వారిక్రింద ౨౩ ౦౦ ౦౦౦ చతురఁపుమైళ్లప్రదేశ ముండెడిది. ఇది క్రీ. శె. ౧౬౭౦ మొదలు ౧౮౬౯ వరకును సాఁగి యప్పుడు కనడాడొమినియనుక్రిందఁ జేరిపోయెను.

**హత్యాహరణతీర్థము [హత్తియాహారణ్]:—** అయోధ్యరాష్ట్రములోని హర్డోయి పురమున కాగ్నేయదిశగా ౨౮ మైళ్లదూరమున 'హత్తియాహారణ్' అనఁబడుతావు గలదు. ఇట శ్రీరాముఁడు రావణవధాదోషనివృత్తి నొందెనని చెప్పుదురు.

## హాన్షియుద్వీపము (నిప్పన్ద్వీపము):-

(జపానుదేశముఁ జూడుఁడు.)

## హనీమూన్ (Honey moon):—

పాశ్చాత్యులలో వివాహమైనదిమొదలు మొదటి నెల కీపేరు వర్తించెడిని. జర్మనీదేశమున ట్యూటన్సులలో తేనెలో 'మెడ్' అను పానీయముఁ (Honey & mead) గల్పి వివాహదినముమొద లొకనెలవరకుఁ ద్రావుచుండు నాచారము గలదు. అది వ్యాపించి కొంత కొంతగమారి యీరూపము వహించెను.

## హనుమాన్తీర్థతిరువళము:—

ఇది సింహళద్వీపమునం దున్నది. అరణ్యమధ్యమునం దొకసరస్సును నాతీరముననున్న శివక్షేత్రమును నై యున్నది. తొల్లి శ్రీరాముండు సీతను రావణ భూపతి యపహరించినపిదప నామెను వెదకికొనుచు వచ్చి రాముఁ డాంజనేయుని వెదుకఁ బంప నాతండు యీామెం గనుంగొని (సింహాలమున రావణునిచే నిర్బంధింపఁ బడినతరి సీతాదేవి వసించినతావుఁ జూడుఁడు.) శ్రీరాముముద్రికం జూపి సందేశముం దెల్పి తనతోకకు గుడ్డలంజుట్టి వెల్గించిన లంకాపురింగాల్చెనని రామాయణ ప్రసిద్ధము. పిదప నాతం డాయగ్నిని నీసరస్సునందలి జలములచేఁ దొక నార్పికొనియెనట. ఆతావును శ్రీరాముం డాంజనేయునివలన నెరింగి యాతావున విడిసి యట నొకశివలింగముం బ్రతిష్ఠించి పూజించెనట. అదియే యటఁ గలశివలింగమని చెప్పఁ బడినది. అటంగల గ్రామమునకు అమృతగాలి (అమిర్తగాలి) యని యిప్పుడు వాడుచున్నారు. సింహాలద్వీపముఁ దూర్పుతీరప్రాంతమున నున్నది. ఇట నాషాఢబహుల అమావాశ్యయందు (ఆడి నెల బహుళ జూలై మాసము) గొప్పస్నానయాత్ర జరగును. అత్తరి నచట శివలింగమున కాజలముల నభిషేకమెగాక, ఉత్సవిగ్రహముల నాసరస్సునందు స్నానమొనర్పఁజేతురు. తోడనే వేలకొలది యరవ లందు స్నానము లొనర్తురు. ఇది పగలు పండ్రెండుగంటలవేళ నడచును. ఆముహూర్తమున హారో హారి యను ధ్వనిమిన్ను ముట్టునటుల వినఁబడుచుండెడిని. విస్తార మన్న ప్రదాన మట జరగెడిని.

## హన్నవంశనృపతులు [హూణులు]:—

వీరు గుప్తవంశనృపతుల జయించి, అరాటదేశ మనంబడు పాంచాలదేశభాగ మేలిన వారు.

మిహిరకులుఁడు హూణుఁడని చెప్పఁబడిన వాఁడు. ఈతఁడు హూణదేశము లేక శాకలదేశ మేలినవాఁడు. శాకలపురము (ఇప్పటి పంజాబునందలి సయాల్కోట) రాజధాని.

## హన్గ్చౌపట్టణముకడ పోటుపాటు లచిత్రము:—

ఇది చీనాదేశమునం దున్న పట్టణము. ఇటకుఁ గతిపయదూరమున హైనింగను సముద్రపురేవుపట్టణము గలదు. అది యొక యాఖాతముకడ నున్నది. అట నాసముద్రజలముల హఠాత్తుగా నొక యిరుకుపల్లపు మార్గముల నుండి నొక్కంబడినట్లు బలాత్కారమున హన్గ్చౌపట్టణముదనుక సముద్రపుఁ బోటుచే నెట్టఁ బడుటచే నట పోటుపాటు లధికముగఁ గన్పట్టుచుండురని పోల్పఁబడినది. దీని నాంగ్లేయులు తమ భూగోళశాస్త్రములందు 'Hangchow Bor' అనియందురు. వాటియం దిది Biggist tidal wave in the world అని వివరింపఁబడినది. ఈ చిత్రమును గాంచుటకుఁ జాలదూరమునుం

డియు జను లేతెంచుచుందురు. స్వదేశస్థులు దీనిం గల్గించునది మంత్రప్రభావశక్తి యనుకొందురట.

## హాఫిజ్ [కవి, గాయకుఁడు]:—

మహమ్మదీయులు ఖురాన్షరీఫును కంఠతః వల్లె వేసినపండితుని 'హాఫిజ్' అందురు. హాఫిజ్ కవి. పారశీకదేశమున క్రీ. శ. ౧౪ వ శతాబ్దమునం దుండిన విద్వాంసుఁడును, గాయకుఁడును, ఖురాన్ షరీఫును చక్కగ నర్థయుక్తముగ వర్ణించినవాఁడు. గొప్పగ్రంథములను రచించినమహనీయుఁడు. సుఫి శాఖమహమ్మదీయుఁడు. ఈతనిపేరు షంషుద్దీన్ మహమ్మద్.

## హమీర్పూరుజిల్లా:—

దీనికి హమీరు పూరునగరము ప్రధానస్థానము.

(అగ్రాప్రోవిన్సుఁ జూడుఁడు).

## హయగ్రీవుఁడు:—

విష్ణుదేవుని యవతారరూపములలో నొకటి. దీనిని కల్క్యవతారమనియు నందురు. మనుష్యశరీరముపై గుర్రపు ముఖముఁ గల్గియుండునట. తొల్లి విష్ణు వీరూపముననే మధుకైటభాసురుల నుండి వేదములం దెచ్చి బ్రహ్మ కిచ్చెనట.

మరియు సోమకాసురునకును హయగ్రీవుఁ డనుపేరు కలదు.

## హయపతిబిరుదము:—

బహమనీ సుల్తాన్ సైన్యమున నశ్వము (హయము) లధికముగను, చాలప్రశస్తమైనవిగను నుంట వారికి హయపతులనియు, నాంధ్రకర్నాటకసామ్రాజ్య ప్రభువులకడఁ గాల్బలము లధికమైనవి యుంట వారిని నరపతులనియు, కటకము చౌదుఆర్ రాజధానులుగ నుత్కలరాజ్యమేలిన గజపతి రాజులకడ నేనుఁగు లధికముగ సైన్యమందుంట వీరికి గజపతులనియు బిరుదములుగ వాడుకలు గల్గెనట.

## హయముఖక్షేత్రము:—

సంయుక్త రాష్ట్రములలోని యలహాబాదునకు వాయవ్య దిశను ౧౦౪ మైళ్లదూరమున గంగానది కుత్తర తీరమందు డౌండియాఖేరాయని పిలువఁబడుచున్న గ్రామముగ కన్నింగ్హామ్‌పండితుఁడు పోల్చి యున్నాఁడు. దీనిని హ్యూనచ్యాంగు దర్శించెను. ఇది జైమినీభారతము ౨౨ యందుఁ బ్రశంసింపఁ బడినది.

## హయ్తిద్వీపము (Hayti island):—

ఇది పశ్చిమగోళార్ధమున పశిఫిక్కుమహాసముద్రమునందు వెస్టిండీసుదీవులకుఁ జెందిన పెద్దఏంటిలీస్ ద్వీపసమూహములోని ద్వీపము. దీనిని San-domingo యనియు నందురు. ఇం దొకభాగమున పశ్చిమమున హాయ్తి నీగ్రోప్రజాపరిపాలనము కలదు. ఇందు ౧౦౨౦౦ చతురపుమైళ్ళ వైశాల్యము కలదు. (పదిలక్షలజను లున్నారు.) దీనికి Port an Prince ప్రధానస్థలముగా నున్నది. ఇదియు independant republic అయియున్నది.

రెండవవైపు తూర్పు భాగమున Spanish crcole Dominecan republic (ప్రజాపాలన ప్రదేశము) గలదు. ఇది ౧౮౦౦౦ చతురఁపు మైళ్ళ వైశాల్యము కలది. (ఆరులక్షలజను లున్నారు.) ప్రధానస్థలము San Domingo పురము. ఇదియు independant republic [వెస్టుఇండీస్ ద్వీపములు చూడుఁడు.] అయి యున్నది.

## హారకిగోత్రము:—

(వశిష్ఠగణముఁ జూడుఁడు.)

**హరకేళదేశము:—**
(వంగదేశము చూడుఁడు.)

**హరగ్రీవగోత్రము:—**
(సంకృతిఉపగణముఁ జూడుఁడు.)

**హరనాథ్‌బాబా:—**
[ఠాకూర్ హరనాద్ బాబా చూడుఁడు.]

**హరబరేజా:—** ఇది పారశీకుల జెండు భాషయందు భరతదేశపు మేరుపర్వతమునకుఁ బేరు. [భరతదేశపు లిపులుఁ జూడుఁడు.]

**హర్యంగుఁడు:—**
సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి చంపుఁడు

**హర్యశ్వగోత్రము:—**
[ఆత్రేయగణముఁ జూడుఁడు.]

**హర్యశ్వ లేక హర్యశ్విగోత్రము :—**
[పరాశరగణముఁ జూడుఁడు.]

**హర్యశ్వుఁడు:—**ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి ధృష్టకేతుఁడు. పితామహుఁడు సుధృతి లేక సత్యధృతి. కుమారుఁడు మరువు లేక మరుత్తు.

మరియు నిక్ష్వాకుసంతతియందే దృఢాశ్వుని కుమారుఁడు హర్యశ్వుఁడే. ఈతనిసుతునిపేరు నికుంభుఁడు.

ఇక్ష్వాకుసంతతియందే యనరణ్యునికుమారుఁడొకఁడు హర్యశ్వుఁడనుపేరుగలవాఁడే గలఁడు. ఈతనిసుతునిపేరు సుమనస్సు.

పూరువంశస్థుఁడగు భర్మ్యాశ్వుఁ డనువానికి నామాన్తరము హర్యశ్వుఁడు.

**హర్నాలమ్ లేక సిరోకో [Harnallam]:—** ఆఫ్రికాదేశపు మధ్యభాగమునుండి వీచు ప్రచండవాయువు. ఇది వేడిగాలి. దీనికి Sirocco అనియుఁ బేరుకలదు.

**హరా.**
(పరాశరగణము చూడుము.)

**హరికథ:—** విష్ణుదేవుని లీలా ప్రభావ చరిత్రకథనమని యర్థము. పరమేశ్వరలీలాకథనము లని దీనిభావము. 'ఆస్తిక్యముగ, ధర్మాధర్మములను సర్వజనమనోరంజకముగ, నృత్యగీత వాద్యయుక్తముగ నుపన్యసించుటకు హరికథ' యని యొక సుప్రసిద్ధకథకుఁడగు మహాపండితుఁడు చెప్పియున్నాఁడు.

ప్రహ్లాదనారదాది భక్తులు గానయుక్తముగ పూతచరిత్రలను పాడుచు నుపన్యసించి లోకులఁ దరింపఁజేసిరనియు, తామునుతరించిరనియు నిదియే హరికథలకు మూలమనియు భక్తులగు కథకులు తలంచుచున్నారు. వీరు దైవభక్తిం బోధించుటకు గాన మర్గసాధనమనియు నందురు. పురందరుఁడు, విఠలుఁడు, వాల్మీకి, జయదేవుఁడు, నారాయణతీర్థుఁడు మొదలగు సంగీతకవులు వీరికిఁ జిరస్మరణీయులు.

ఈహరికథాకళ హిందూస్థాన్‌దేశము, మహారాష్ట్రదేశము, కన్నడదేశములం దాంధ్రదేశమునందువలెనే వ్యాపించియున్నది. అరవదేశమున హరికథలంజెప్పు కథకుని 'భాగవతార్' అనియెదరు. ఆంధ్రదేశమున 'దాసు' లందురు. సర్వసాధారణముగ యక్షగానము లిట్లుపన్యసింపఁబడుచుండును. ఇంకను హరికథల నిటీవలఁ గొందరు ప్రత్యేకముగ రచించియున్నారు.

**హరికర్ణి గోత్రము:-** [భరద్వాజ ఉపగణము చూడుఁడు].

**హరికారికలు:—** ఆంధ్రివ్యాకరణసంబంధకారికలని తలంపంబడుచున్నవి. ఎన్నియో సరిగాఁ దెలియరాకున్నవి. వీటిని హరిభట్టు రచించె నని పెక్కండ్రు తలంచుచున్నారు. అధర్వణ కారిక లందు హరిభట్టుకవి పేర్కొనఁబడెను గాన నాతని కీతఁడుపూర్వుఁడో లేక సమకాలికుఁడోయై యుండ వలసియుండుననియుఁ బెక్కండ్రు తలంచుచున్నారు. హరికారికలను హరిభట్టు లేక హరికవి రచించెననియు, వానికి వృత్తిని శిష్టు కృష్ణమూర్తి కవి రచించియుండనోపుననియుఁ దలంపంబడుచున్నది. గాని యాంధ్రవిద్యావాచస్పత్యాది బిరుదాంకితులగు కొటి శ్యామల కామశాస్త్రి గారు కారికలుగూడ కృష్ణమూర్తి కవిగారే రచించిరని యభిప్రాయపడుచున్నారు. వాని వృత్తింగూర్చి యిటుల వివరింపంబడినదట.

శ్లో॥ శిష్టకులకలశజలనిధి
శీతకరః కృష్ణమూర్తి సంఖ్యావాన్।
షడ్దర్శనీస్వతంత్రః
స్తనోతిహరికారికావృత్తిం॥

ఇట్లుంట వీనివృత్తినే ఆయన రచించెనని కొందరనుచుందురు. గ్రంథము మాకు లభింపలేదు. (అధర్వణకారికలు, శిష్టు కృష్ణమూర్తి కవి చూడుఁడు.)

**హరికేశుఁడు:—** యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. వసుదేవుని తమ్ముఁడైన శ్యామకుని జ్యేష్ఠపుత్రుఁడు.

**హరిత ఉపగణము:—** ఇది ఆంగీరస సంతతి. కేవ లాంగిరసగణములోని యొకఉపగణము. ఇందు నలువదియొక్కగోత్రములు చెప్పఁబడినవి.

బోధాయన సూత్రోక్తగోత్రములు [౧౮]

| | |
|---|---|
| ౧ కారీషి | ౧౦ మహోదర |
| ౨ కౌతప | ౧౧ మాన్ధాత |
| ౩ దర్భ | ౧౨ మిశ్రోదన |
| ౪ నైమిశి (నైమిశ్రి) | ౧౩ మాత్స్య |
| ౫ పోటల | ౧౪ వాలోదర |
| ౬ భైమగవ | ౧౫ సాంఖ్య |
| ౭ మండకారి | ౧౬ సౌభాగ |
| ౮ మత్యాయు | ౧౭ హరిత |
| ౯ మధూప | ౧౮ హారీత |

ఆశ్వలాయన సూత్రోక్తగోత్రములు [౪]

| | |
|---|---|
| ౧ కుత్స | ౩ పింగ |
| ౨ కౌత | ౪ శంఖ |

మాత్స్యసూత్రోక్తగోత్రములు [౧౪]

| | |
|---|---|
| ౧ ఉమాంది | ౯ పైంగల |
| ౨ కౌమార | ౧౦ మదిగారి |
| ౩ ఖాండాయన | ౧౧ మాత్స్యభాలి |
| ౪ గణగారి | ౧౨ మాలి |
| ౫ గవేరిణి | ౧౩ హంస |
| ౬ ద్రిల | ౧౪ హస్తిన |
| ౭ దాముల | ౧౫ హస్తివాస |
| ౮ పలాశి | |

ఇతర గ్రంధోక్తగోత్రములు (౪)

| | |
|---|---|
| ౧ అంబరీష | ౩ సైశిర |
| యావనాశ్వ | ౪ హైమగవ |

ఈగోత్రములకుఁ బ్రవరరూపములు

౧ ఆఙ్గీరస - అంబరీష - యౌవనాశ్వ.

౨ మాన్ధాతృ - అంబరీష - యౌవనాశ్వ.

౩ ఆంగీరస - మాన్ధాతృ - కౌత్స.

౪ ఆంగీరస - పౌరుకుత్స - త్రాసదశ్వ.

౫ ఆంగీరస - అంబరీష - హారిత.

౬ హారిత - అంబరీష - యౌవనాశ్వ.

## హరితగోత్రము:—

(హారిత ఉపగణము చూడుఁడు.)

**హరితర్షిగోత్రము:**— వీరికిఁ బ్రధానర్షి అంగిరస. ప్రవరరూప 'మాంగీరస, అంబరీష, యౌవనాశ్వ' అనియు, 'మాంధాత, అంబరీష, యౌవనాశ్వ' అనియుఁ జెప్పడమైనది. శిష్టకరణములలో '౧ దామోదరపాత్రునివారు, ౨ నరిసిపురంవారు' అనువా రీగోత్రజులై యున్నారు. (శిష్టకరణములు చూడుఁడు.)

## హరిత్యగోత్రము:—

(నిధ్రువగణముఁ జూడుఁడు.)

## హరితాయనగోత్రము:—

(నిధ్రువగణముఁ జూడుఁడు.)

## హరిణద్వేయ గోత్రము:—

(భరద్వాజ ఉపగణముఁ జూడుఁడు.)

**హరితుఁడు:**— ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. బ్రహ్మర్షియైనవాఁడు. తండ్రి యౌవనాశ్వుఁడు. పితామహుఁ డంబరీషుఁడు. ప్రపితామహుఁడు మాంధాత.

వీరిసంతతివారు బ్రాహ్మణులు. వీరు హరితులనియు ననఁబడిరి. హారితుఁడు చెప్పినటునఁజెప్పఁబడిన మోక్షగ్రంథమునకు హారితగీతయని పేరు. ఇందు మోక్షధర్మములు చెప్పఁబడినవి.

మరియు నిక్ష్వాకుసంతతియందలి లోహితాస్యునిసుతుఁడు హరిశ్చంద్రునిపౌత్రుఁ డొకఁడు హరితుఁడను పేరుకలవాఁడు కలఁడు. ఈతనిసుతుఁడు చంపుఁడు.

ఇంకను విశ్వామిత్రునిసుతులలో నొకహరితుఁడు కలఁడు. ఈతఁడు బ్రాహ్మణుఁడు. వీరిసంతతి యగు హారితసగోత్రజు లిరుతెగలవారుగ నున్నారు.

**హరిదాసు మతము:**—మతకర్త హరిదాసనుభక్తవరుఁడు. తండ్రి సనందుఁడు. తల్లి రాజమాగ్రామనివాసియగు గంగాధరుఁడను బ్రాహ్మణునికుమార్తె. జన్మకాలము విక్రమశకము ౧౪౪౧ సంవత్సరమని చెప్పఁబడినది. సనందుఁడు తనకాపురమగు గోల (మథురాసమీపము) యందు గిరిధరస్వామి యనుపేరున విష్ణువు నొకదేవాలయమందుఁ బ్రతిష్ఠయొనర్చి పూజించుచుండువాఁడు. హరిదాసుని విష్ణుభక్తుండుగాన నాతనిమతమును వైష్ణవమే. వీరిది మధురగోకులప్రాంతమట. ఈతనిమతమును శ్రీకృష్ణు నారాధించుమతముగ నున్నది.

హరిదాసు వ్రజమండలమునందలి మానసరోవరముకడ దపంబొనర్చుచు మతబోధనల్పువాఁడు. ఈతనికడ సాలగ్రామమొకటి యుండెను. ఈతనికి విఠలభూపాలుఁడు ప్రథమశిష్యుఁడు. డిల్లీకాపురస్థుఁడగు దయాళుదాసుండనునాతఁడు రెండవ శిష్యుఁడు. ఈహరిదాసు మహానుభావుఁడు. పెక్కు లద్భుతములగు మాహాత్మ్యములఁ జూపినవాఁడని యీమతస్థులు చెప్పుదురు. విక్రమ

సంవత్సరమున (తొంబదిఆఱవ యేట) వైకుంఠము నలంకరించెనందురు. ఈయ నకుఁబిదప విఠలభూపాలుఁడును, బిదప బిహారీదా సును, బిదప నగరిదాసును మహంతుపీఠ మధిష్ఠించి రట.

విష్ణుభక్తి ప్రధానము. ఇది చైతన్యమత ముంబోలిన మతము. అంతకన్న నిందు తత్వవిచార మధికముగఁ గలదు. సర్వధర్మములను బరిత్యజించి శుద్ధసన్యాసి యగుట వీరికి ముక్తిమార్గము. వీరికి రసికపదము, సాధారణసిద్ధాంతముననఁబడు మత గ్రంథములు గలవు. వ్రజమండలప్రాంతమున నీమ తస్థులు గానఁబడుచున్నారు.

## హరిపద

(పుణ్యకాలములు చూడుఁడు.)

**హరిభట్టుకవి:—** ఆంధ్రకవులయం దాధు నిక కవులలోఁ బరిగణింపఁబడినవాఁడు. వెలనాటి బ్రాహ్మణుఁడు. భారద్వాజసగోత్రుఁడు. రామ పండితపుత్రుఁడు. రచించినవి వరాహపురాణము, మత్స్యపురాణము. ఇందువరాహపురాణమును కం భంమెట్టుకరణమగు కోవిపాక యెఱ్ఱనామాత్యు నకుఁ గృతియిచ్చెను. మత్స్యపురాణమును శ్రీరం గనాథస్వామికిం గృతియిచ్చెను.

ఈకవి కష్టఘంటావధానియని బిరుదముండె నట.

**హరి లేక హరిరూద్‌నది(హరిరుద్ధ):-** ఇది యిప్పటి యాఫ్ఘనిస్థానదేశమునం దున్ననది. గ్రీకు లరియస్సని వాడియున్నారు. ఇది హిందూ కుష్‌పర్వతములయందు జనించి తొలుత ఆఫ్ఘని స్థానఁపువాయవ్యదిశగా నాదేశమందే నడచి పిదప నాదేశమునకును, బారసీకదేశమునకును నెల్లగఁ గొంతదవ్వేగి మరలి హీరత్పట్టణంపుఁబ్రక్కఁబడి ప్రవహించుచు కడకు తేజన్‌కడనున్న యిసుక మైదానమున నింకిపో నారంభించి చమ్మనేలగ నె పోయి యచటియావలో నస మించును.

ఈనది ప్రవహించుప్రదేశంపుఁ బొడ వేడువం దలమైళ్లని చెప్పఁబడినది.

**హరివంశ్యాచార్యమతము:—**

(రాధావల్లభమతము చూడుఁడు.)

**హరివంశ్యాచార్యుఁడు:—** (రాధావల్లభా చార్యుఁడు, రాధావల్లభమతముఁ జూడుఁడు.)

**హరివర్షము:—** టిబెట్టుదేశంపుఁ బశ్చిమ భాగమునకు హరివర్షమని పేరు. దీనిప్రశంస కాళికాపురాణము ౮౨ యందును, మహాభార తము సభాపర్వము ౨౮ యందును గలదు. మరియు సభాపర్వము ౭౮ యందు దీని నుత్తర కురుభూమియనియుం బేర్కొనిరి.



**హరివ్యూహము:—** రామానుజీయ వైష్ణవ చైతన్యవైష్ణవ మత ధర్మములందు తదేకా త్మరూప మహావిష్ణువు. అందు ద్వితీయ చతు ర్వ్యూహములలో నొక టియనియు ననిరుద్ధ వ్యూహము లెదింటిలో నొక యుపవ్యూహమని యు, విలాసమూర్తి యని యు, వరుస శంఖచక్ర పద్మ గద లాయుధము లనియుఁ జెప్పఁబడినది.

(విష్ణుదేవాలయవిగ్రహములు చూడుఁడు.)

**హరిశ్చంద్రుఁడు:—** మరీచి ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి త్రిశంకువు. భార్య చంద్రమతి. కుమారుఁడు లోహితాస్యుఁడు. ఈతఁడు నిత్యసత్యవంతుఁడుగాన సత్యహరిశ్చంద్రుఁడని పేర్వడసినవాఁడు. విశ్వామిత్రుఁడతని నకారణముగఁ బరీక్షింప ననేకములగు నిడుములకుఁబాల్పడియుఁ గడకు దరిద్రుఁడై హరిశ్చంద్రమహారాజు భార్యాపుత్రులంగోల్పోయి తాను కాశీయందు స్మశానమున వాతిపాతికదండుటకై నసేవకుఁడై యుండియు, బహుకష్టము లనుభవించియు నన్నృతమాడనివాఁడు. కాశీపట్టణమున హరిశ్చంద్ర బజారని యీతఁడు భార్యాపుత్రులను సేవకావృత్తి కమ్మిన తావీమహాగుణసంపన్నుని పేరునఁ బరగుచున్నది. మరియు నీతండు కొల్వుండిన స్మశానము నేటికిని హరిశ్చంద్రస్మశానమని కాశీపట్టణమునందుఁ గానసయ్యెడిని. ఈతనిరాజధాని యయోధ్యయనియు, నీతనిమంత్రి సత్యకీర్తియనియు నీతఁడొకచక్రవర్తియనియుఁ జెప్పఁబడినది. నేటికిని నన్నృతమాడనియాతని సత్యహరిశ్చంద్రునివంటివాఁడని పోల్చి సామెతగానుడువుదురు.

**హరిశిష్టగోత్రము:—** ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.) హరిశిష్ట [అరిశెట్ల – అరిశిష్టకుల] గోత్రము. అత్రిగణము. సంస్కృతగోత్ర మాత్రేయస. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథము లాశ్వలాయనసూత్రము, నిర్ణయసింధు, ధర్మసింధు. ఋషభేశుఁడు దేవత. యల్లమాంబ భార్య. సరయూతీరము తపస్థానము. సంధిసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౪౦. క్షేత్రసంఖ్య ౩౬. శకటము దానము. గానుగ, ఎర్రకామలు, బెత్తము, వర్జనీయములు.

451½

**హరి హర పుత్రదేవస్థానములు:—** ఇచట హరిహరు లనిన మోహినీమోహను లని భావము. సముద్రమథన దారుకావనవిహారకాలముల పురాణములందుఁ జెప్పఁబడిన మోహినీమోహనుల కొకసుతుండు గల్గుటంగూర్చి యేమియుం దెలియరాకున్నది. ఆబాలకు నెవ్వరుపాలిచ్చి పెంచి పెద్దఁజేసిరోకాని హిమాలయప్రాంతసీమలందు భైరవుఁడుగనుండి పూజలందుచుఁ జపాటీలనైవేద్యము లారగించుచున్నాఁడు.

ఇంక నీముద్దులపాపనికి మహారాష్ట్రాంధ్రదేశముల నాదరముగలినటులఁ గానరాదు. ఈరెంటిం గడచి యరవసీమల కరగులతో 'అయ్యనార్' అనుపేరు సిద్ధమైనది. ద్రవిడదేశమునఁ బ్రతిగ్రామమునం దీహరిహరపుత్రుఁడు పూజింపబడుచునుత్కలదేశమునం దొకప్పు పట్టణోనాయకో (పట్నాయకు) లు గ్రామాధికారులుగ నుండినటులనే 'అయ్యనార్' లేక 'అరియనార్' అను పేరున గ్రామరక్షక దేవతగా వెలసియుంటఁ గానసగును. ఆంధ్రదేశమున దూరూర రక్షకురాండ్రైన గ్రామదేవతలవలె నరవ గ్రామములందయ్యనార్ గ్రామరక్షకుండట.

ఆర్యశబ్దమునుండి కల్గిన యయ్యగారి కసలు పేరరవమున 'శాతన్' అనఁబడును. శాసించువాఁడుగాన నిట్లనఁబడునందురు. శాసించుటం జేసి శాత్తనుఁ డధికారమూర్తిగ స్ఫురింపకపోదు. ఇంతటితో నాగక తమ్మిశకోశములు కొన్ని యీ స్వామిని శాతవాహనశబ్దసంభూతుఁడేమోనని శంకించినవి. ఈశాతవాహనుఁ డెవ్వరో, యేమిసంబంధమో దురూహ్యము.

'అయ్యనార్' గారు శ్వేతగజారూఢులు. వారి తెల్లయేనుఁగు 'కారి' యనంబడును. ఆయన యాయుధమగు దండము 'శెండు' అనం బడును. ధర్మరక్షణ మీతనికార్యము. ఈయన పతాకముపై కుక్కుట (కోడి) లాంఛనముండు నట. నలసివాఁడు. చేతనుండుకోల్ణు వంకరదండ ముగను కొరడావలె నుండును. కొన్నితావులందు గుఱ్ఱమునెక్కినటులఁ గూడఁ జిత్రింపఁబడుచుం డును. ఒక్కొకతఱిఁ బెద్దవృక్షచ్ఛాయను సుఖా సనాసీనుఁడై యున్నటుల నుండును. ఈయన పరివారము భూతప్రేతపిశాచములును, రాక్షసు లును నందురు. అరవదేశమునం దీస్వామి దేవ స్థానము నంటియున్న యావరణమున నీతనివాహ నము లేనుఁగులు, గుఱ్ఱము లేక పెక్కుజాతుల జంతుగణములును పరివారముగ వికారాకారము గల మానవ రాక్షసవిగ్రహములు నుండును. ఈపరివారసమేతుఁడుగనుండు శాత్తన్ [అయ్యనార్] రాతివిగ్రహములుగగాని, కుండవిగ్రహ ములుగగాని, కొయ్యవిగ్రహములుగగాని యుం డును. మదన, వర్ధని, యీతని ప్రియురాండ్రు. వారలకే పూరణై, పుద్గలై యనునవి నామాంత రములట.

పావాడైరాయన్, మదురైవీరన్, అనువార లీరక్షకుని సేనాను లందురు. ఈదేవస్థానములందు కల్లరుజాతివారు పూజారులుగ నుందురు. [కల్లరు జాతివారు చూడుఁడు.]

ఇంక నీఅయ్యనారుశాస్త యఱవదేశముఁ గడచి మలయాలదేశమున కరిగినతోడనే 'శాత్తన్' నామముతో స్థిరపడి కొంతపవిత్రతయుంగూడఁ గల్గియుండెను. బ్రాహ్మణులు పూజారులుగగల ప్రతిదేవస్థానమున నైరుతిదిక్కున నీతని కొకదేవళ ముండి యాదేవస్థానమున కతఁడు క్షేత్రపాల కుఁడై దనరెడిని. బ్రాహ్మణులే యీతనిం బూజిం తురు. గాని గుఱ్ఱములు, నేనుఁగులు, పరివారఁపు బొమ్మలు దక్షిణదేశమునందే యుండిపోవుఁగాని మళయాళమున కరుగవు.

## హరిహరరాయులు [హుక్కరాజు]:-

యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. విజయనగ రసామ్రాజ్యమును స్థాపించిన మొదటిమహారాజు. తండ్రి సంగమరాజు. కనిష్ఠసోదరుఁడు బుక్కరాజు. హరిహరరాయులపేరు హుక్కరాజు. క్రీ. శ. ౧౩౩౬ సంవత్సరప్రాంతమున చక్రవర్తి యైన వాఁడు. (జీర్ణవిజయనగరముఁ జూడుఁడు).

**హరిహరక్షేత్రము:—** గండకీనది గంగా నదితో సంగమించుతావున గజేంద్రమోక్షణస్థాన ముగల హరిహరనాధశివలింగము విష్ణుదేవప్రతిష్ఠ యని వరాహపురాణము ౧౪౪ యందుఁ గలదు.

మరియుఁ దుంగభద్రానదియందు మైసూరు రాజ్యమున హరిద్రానది సంగమించు తావున నొక హరిహరక్షేత్ర మున్నది. ఇట గ్రామముపేరు 'కుందలూరు' అనుచున్నారు. దీనిం గూర్చిన ప్రశంస పద్మపురాణోత్తర ౬౨ యందుఁ గలదు. ఈహరిహరనాధభక్తి నెల్లూరుమండల సీమలందు విస్తారముగ వ్యాపించియున్నది.

**హరిక్షేత్రము:—** పెన్నార్‌నదిపై 'హరి కాంతం సెల్లా' రనుగ్రామమున నీక్షేత్రము గల దనియు, దీనిని చైతన్యదేవుఁడు దర్శించెననియు చైతన్యభాగవతమున ౬ యందుఁ జెప్పంబడినది.

**హరిగ్రకేన్** (Harricane):— కొంచెము పాటివానతోఁ గలసిగాని, కలియకగాని, వీచు ప్రచండవాయువు. ఇది Cyclone లలోఁ జేరిన తుపాను.

(వాయువు, దానికార్యములు చూడుఁడు).

**హరీతకివనము:**— బంగాళములోని సంతాల్పరగణాయందలి వైద్యనాథధామ మున్న తావున నీయరణ్యముండినదని (చితాభూమి) వైద్యనాథక్షేత్ర మాహాత్మ్యమునఁ జెప్పఁబడినది.

**హరీతగోత్రము:**—
(హారిత ఉపగణము చూడుఁడు.)

**హరీతాశ్రమము:**—రాజపుత్రస్థానములోని యుదయపూర్ నుండి యాఱుమైళ్ల దూరమునంగల యేక్లింగ్ జీ యనంబడు తావున హరీతర్షి యాశ్రమము గలదు. ఈతఁడు హరీతసంహిత రచించిన వాఁడు.

**హర్లీ బర్లీ** (Hurly Burley):— గొడవ లోనినియు, సందడిలోనినియు నర్థమిచ్చుట కీయుక్తిని వాడుచున్నారు. ఇందు 'Burl' అను శాక్సనుపదమునకుఁబట్టణఁ (పుజనాకీర్ణ) మనియు, 'Hurl' అన ధ్వనియనియు నర్థములు.

**హర్షుఁడు:**— ధర్మునకు శ్రద్ధయందుఁ బుట్టిన తృతీయపుత్రుఁడు. సోదరులు శముఁడు, కాముఁడు. భార్యపేరు నంద.

మఱియుఁ గాశ్మీరదేశాధిపతి యగు హర్షుఁ (హర్షవర్థనుఁడు) డొకండును, నైషధము రచించిన శ్రీహర్షుఁ డొకఁడును గాననగుచున్నారు.

**హరైర్‌క్షత్రియులు:**—
(ప్రమారశాఖ క్షత్రియులు చూడుఁడు.)

**హల లేక హలముఖరేఖ.**—(పురుష సాముద్రికము చూడుఁడు. స్త్రీసాముద్రికము చూడుఁడు.)

**హల్యాసునది:**—
(ఏష్యామైనరు చూడుఁడు.)

**హలిబేడు:**—
(ద్వారసముద్రము చూడుఁడు.)

**హలీమఖము:**
(కామిలరోగము చూడుఁడు.)

**హల్** Hull [**రేవుపట్టణము**]:— సముద్రమున నడువఁగల పొగయోడయొక్క ముందుభాగమున కీపేరు గలదు.

**హవ్యకవ్యములు:**—
౧ హవ్యము లేక హవ్యాన్నము—హవ్యవాహ నాగ్నియందు 'స్వాహా' యను మంత్రముచే హోమ మొనర్చునది; లేక విశ్వేదేవస్థానమున నుండు భోక్త కిడునది.

౨ కవ్యము లేక కవ్యాన్నము— కవ్యవాహనాగ్నియందు హోమమొనర్చునది, లేక పితృస్థానముననుండు భోక్తల కిడునది.

**హవ్యవాహనుఁడు:**— గృహపతియను నగ్నికి హవ్యవాహనుఁడను నామాంతరము గలదు. మరియు శుచికుమారుఁడగు నగ్నికిని హవ్యవాహనుఁ డనుపేరే గలదు.

**హవిర్యజ్ఞములు ౭:**—
౧ అగ్న్యాధేయము.
౨ అగ్నిహోత్రము.

3 దర్శ (అమావాస్య) పూర్ణమాస (పౌర్ణమి) ములు.

౪ ఆగ్రయణము.

౫ చాతుర్మాస్యలు [౧ వైశ్వదేవము. ౨ వరుణ ప్రఘాసము. 3 సాకమేధము. ౪ సునాసీరీయము.]

౬ నిరూఢపశు బంధము.

౭ సౌత్రామణి.

**హవిర్ధానుఁడు:—** విజయాశ్వుఁడు లేక నభస్వతియందుఁ బుట్టిన సుతుఁడు. ఇతనిసుతులు ౧ బర్హిషదుఁడు లేక ప్రాచీనబర్హి. ౨ గయుఁడు. 3 శుక్లుఁడు. ౪ కృష్ణుఁడు. ౫ సత్యుఁడు లేక యజుఁడు. ౬ జితవ్రతుఁడు లేక అజినుఁడు ననువారు. అందు బర్హిషదుఁడు లేక ప్రాచీనబర్హికిఁ బదిమంది సుతులు. వారు ప్రచేతసులు.

**హవిర్భుక్కు:—**
(ప్రీతి చూడుఁడు.)

**హసజిహ్వాగోత్రము:—**
(ముద్గల ఉపగణము చూడుఁడు.)

**హసజిహ్వాగోత్రము:—**
(వాధ్ర్యస్వ లేక మిత్రయువగణము చూడుఁడు.)

**హసద్భిఃక్రియతే కర్మ రుదద్భిరనుభూయతే** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి.

ఒకఁడు నవ్వుచుఁ జేసినపనివలన నగు కష్టఫలము నతఁడే దుఃఖింపుచు ననుభవించుట సంభవించెడిని.

**హస్తచతుష్కోణాసనము:—** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. ఇది ద్వివిధము.

౧ వామహస్తచతుష్కోణాసనము— గుదస్థానమున కుడిమడమనానించి యెడమ మడమ నెడమమోచేతిసందున నునిచి పైకెత్తి రెండుచేతులను మెడపై లంకెవేయుట వామహస్తచతుష్కోణాసనమనియు;

౨ దక్షిణహస్తచతుష్కోణాసనము—గుదస్థానమున నెడమమడమ నానించి కుడిమడమ కుడిమోచేతిసందున నునిచి పైకెత్తి రెండుచేతులను మెడపై లంకెవేయుట దక్షిణహస్తచతుష్కోణాసనమనియుఁ జెప్పఁబడినది.

వామాసనమువైచినతఱిదక్షిణనాడియు, దక్షిణాసనమున వామనాడియుఁ జలించుచుండు నని చెప్పఁబడినది.

**హస్తభుజాసనము:—** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. ఇది ద్వివిధము.

౧ వామహస్తభుజము— ఎడమకాలు నెడమభుజముపై ముందునకుఁ బాదము వచ్చునటుల నుంచి దాని నెడమచేతంబట్టుకొని కుడిచేత మెడనుబట్టుకొని కూర్చుండుట.

౨ దక్షిణహస్తభుజము— కుడికాలును కుడిభుజముపై ముందుకుపాదము వచ్చునటులనుంచి దానినిఁ గుడిచేతఁ బట్టుకొని యెడమచేత మెడనుబట్టుకొని కూర్చుండుట.

3 ఉభయహస్తభుజాసనము— కుడికాలు కుడిభుజముపైనిన్నీ, యెడమకాలు నెడమభుజముపై

నిన్నీ పాదములు ముందువచ్చునటుల నుంచి వానిని బట్టుకొని గాని, మెడంబట్టుకొని గాని కూర్చుండుట.

వీనియభ్యాసమునఁ గుండలినీప్రబోధ మగునని చెప్పఁబడినది.

**హస్తరేఖలు:—** మనుష్యుల హస్తము లందుఁగల రేఖలఁగూర్చిన విధివిధానఫలితములం గూర్చి తెలుపునది సాముద్రికశాస్త్రము. (సాముద్రికశాస్త్రము చూడుఁడు).

చేయి ముడుచుట, విప్పుటలందుముడతలు పడిన తావుల రేఖలేర్పడును. ఆరేఖలతావులందుఁ జైతన్యశక్తి యధికమైయుండును. పరిశీలనలవలన హస్తమందలిరేఖలు చేతితోఁ దేనినైనఁబట్టుకొనుటకు చేతి కవసరమనియు, నవియే లేకుండిన నంతబలముగ పట్టుకొనుటకు వీలు చాలకుండు ననియుఁ దేలినది. ఇంక నఱచేతిరేఖలంబట్టియే యఱచేతి మృదుత్వము మోటుదనము లేర్పడెనని చెప్పఁబడినది. మధ్యకాలమున నదృష్టవశమున నెవ్వరికైన నేదేని గొప్పలాభము గల్గుటను 'రేఖబయల్పడిన' దని సామెతగా నందురు. ఇత్తావున రేఖయన హస్తమున నదృష్టరేఖయని భావము.

**హస్తలాయనిగోత్రము:—**
(నిధ్రువగణముఁ జూడుఁడు).

**హస్తాగ్నిగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**హస్తానక్షత్రము:—** ఇది యాకసమునఁ జేతివ్రేళ్ళంబోలునటుల నైదునక్షత్రములు కూడి యుండు నక్షత్రవితతి. దీనికింకను బర్యాయపదంబులు హస్తః, అర్కః, దివాకరః, సవితా, సావితా, సూర్యః అనునవి కలవు. సూర్యుండధిదేవత. దేవగణనక్షత్రము. తిర్యఙ్ముఖము. పుంస్వభావము. గేదె, చిలుక, ప్లక్షవృక్షము, నీనక్షత్రసంబంధము లనియుఁ బ్రవేశించిన యిరువదియొక్క ఘటికలపై త్యాజ్యము (విషఘటికల) నియు, నలుపదియైదుఘడియలపై నమృతఘడియలనియు, క్షిప్రస్వభావనక్షత్రమనియుఁ జెప్పఁబడినది.

**హస్తాఽభయయుక్తాసనము:—** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. ఇది ద్వివిధము.

౧ వామహస్తాఽభయయుక్తాసనము :— స్వస్తికాసనమునఁ గూర్చుండి కుడిచేతిని కుడిమోఁకాలికడఁ జిన్ముద్రపట్టి, యెడమచేతిఁ బైకెత్తి వ్రేళ్లను నిలువుగావిప్పి, (అభయహస్తము) న వామహస్తాఽభయయుక్తాసనమనియు,

౨ దక్షిణహస్తాఽభయయుక్తాసనము :— స్వస్తికాసనమునఁ గూర్చుండి, యెడమచేతి నెడమమోఁకాలికడఁ జిన్ముద్రపట్టి కుడిచేతిఁ బైకెత్తి వ్రేళ్లను నిలువుగావిప్పి (అభయహస్తము) న దక్షిణహస్తాఽభయయుక్తాసనమనియు, నెఱుఁగునది. దీనియభ్యాసమున శ్వాసము విపరీతగతిని నడుచుననియుఁ జెప్పఁబడినది.

**హస్తాభినయము:—** నటించువారు తమ భావములను చేష్టాదులమూలమున వ్యక్తీకరించుచుఁ బ్రదర్శించుట కభినయ మనఁబరగును. దీనియం దనుకరణము ముఖ్యము. భరతముని రచించిన నాట్యశాస్త్రమునందలి యభినయ మాంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికమునను నాల్గుతెఱఁగులుగఁ జెప్పంబడినది.

ఆంగికాభినయము— ముఖము, హస్తములు, నేత్రములు మొదలగు శరీరేంద్రియముల వ్యాపారమూలమున, నేదేని యొకనిమనస్సు నందలి సంగతిని పైకిఁ బ్రదర్శించుట.

ముఖమును వికసింపచేయుట, విన్నఁగాఁ జేయుట, కోపపుఁజూపులు మొదలగునవి యిందుఁజేరెడిని. బహిరింద్రియ వ్యాపారము, మనోవ్యాపారమును బయల్పరచునటుల నటించుటయని భావము. అభినయమెప్పుడును లోకరీతిగ నుండవలయును గాని యస్వభావికముగ నుండరాదు. గంభీరతం బ్రదర్శింపఁదగిన నాయకుఁడు బాలునివలె బావురుమని యేడ్చుటను నటించుటయు చూపులందు జాగ్రత్తలేకుండుట మొదలగునవి.

౨ అభినయదోషములు—ఆంగికాభినయము త్రివిధ భేదములు గలది. అవి శారీరకము, ముఖజము, చేష్టాకృతమునననునవి. ముఖమునందలి లక్షణములనుండి ప్రదర్శించునది ముఖజాంగికాభినయము; తక్కిన యితరావయవముల లక్షణములనుండి ప్రదర్శించునది శారీరాంగికాభినయము; క్రియారూపమునఁ ప్రదర్శించునది చేష్టాకృతాంగికాభినయమునని చెప్పఁబడినది. ముఖజాంగికాభినయమునకు ముఖరాన్వితమనియు నందురు. ఇదియే యుత్తమమని చెప్పఁబడినది.

ముఖము హృదయప్రతిబింబమువంటిది. గాన మనోభావములతోఁబాటు ముఖరాగాదులును మారుచునేయుండవలయును. లేకున్న నభినయము దోషగతమగును. దీనినిగూర్చి

శ్లో॥ శాఖాంగోపాంగసంయుక్తోం కృతోఽప్యభినయశ్శుభః। ముఖరాగవిహీనస్తు నైవశోభాన్వితోభవేత్। శరీరాభినయోఽల్పోఽపి ముఖరాగసమన్వితః। ద్విగుణాం లభతే శోభాం రాత్రావివనిశాకరః। నయనాభినయోఽపిస్యాన్నానాభావరసస్ఫుటః। ముఖరాగాన్వితోయస్మా న్నాట్య మత్ర ప్రతిష్ఠితమ్॥

అని భరతాచార్యకృతనాట్యశాస్త్రమున నెనిమిదవయధ్యాయమున శ్లోకములు ౧౪౯ ౧౫౦, ౧౫౧ యందుఁ గలదు.

ఈ యాంగికాభినయము సర్వసాధారణముగ షడంగాభినయమనియు, నుపాంగాభినయమనియుఁ ద్వివిధముగఁ దలంపంబడుచున్నది. కొందరు ప్రత్యంగాభినయముఁ గూడఁగలదని త్రివిధములని యందురు. కొందరు నాట్యశాస్త్రవిదులు ప్రత్యంగము లుపాంగముల లోనివేగాన ప్రత్యేకత నీయనక్కరలేదని నిరాకరించిరి. ఇత్తరుణమున వానిని వివరించుట సమంజసము.

1 షడంగములు—శిరస్సు, హస్తములు, ఉదరము, పార్శ్వము (ప్రక్క), కటి (పిరుదు), పాదములు, షడంగములు.

2 ఉపాంగములు—నేత్రములు, కనుబొమలు, నాశికము, అధరము, చెక్కిళ్లు, గడ్డము, అను నారును నుపాంగములు.

ప్రత్యంగములు— మూఁపు, బాహువు, వీపు, కడుపు, తొడ, పిక్కలు, మణికట్లు, మోకాళ్లు, మోచేతులు ననుదొమ్మిదియుఁ బ్రత్యంగములు.

ఇట్టి త్రివిధాంగచలనభేదములగు నభినయములు మున్నూటయరువదినాల్గుగ నాట్యశాస్త్రకర్తలు వివరించిరి కాని యవి యాదరణయం దంతగఁ గాన్పింపకున్నవి.

ఇంక ముఖరాగము, స్వాభావికము, ప్రసన్నము, రక్తము, శ్యామమునను నాల్గుగ రాగములు చెప్పంబడినవి. మధ్యస్థాదిభావ నిరూపణమునకు స్వాభావికరాగమును, అద్భుతహాస్యశృంగారములకు ప్రసన్నరాగమును, వీర, రౌద్ర, మద, కరుణలకు రక్తరాగమును, భయానకభీభత్సములకు శ్యామరాగమును, నాట్యశాస్త్రమునఁ జెప్పంబడినవి.

౨ వాచికాభినయము— అర్థానాట్యమున కర్థాములగు లేక నుచితములగు వచనములచేతను అనగా ధ్వనిభేదములు, కాకువులు, విరామభేదములగు వాక్యమొక్కటియైనను పలు విధములగు నర్థములను స్ఫురింపఁజేయుచు భావములను ప్రదర్శించుట వాచికాభినయమనంబడును. ఇక్కాలమున నుపన్యాసకులకిది యుపయోగముగ నున్నది. గ్రామోఫోను యంత్రము లీసంబంధములేమో?

3 ఆహార్యాభినయము— దీనికింకను నేపథ్యవిధానమనియుఁ బేరుకలదు. కేవల వేషమాత్రముచేతనే పాత్రోచితమనోభావములం బ్రకటించుట కాహార్యాభినయ మనుపేరు కలదు. ఇం దేకాలఁపువ్యక్తులఁదెల్పుదురో యానాటి వస్త్ర, భూషణ, రూప, లక్షణాదులను జక్కఁగ నెరింగి ప్రదర్శించుట యావశ్యకము. నాటకరంగమున నగుపఱుపఁబడు నరణ్యోద్యానవన పుర, సౌధ, మార్గ, పర్వత, జలాదిదృశ్యములు (scene) న్నియు నాహార్యాభినయసంబంధములనియే పెక్కండ్రు నాటకకళావిదుల యభిప్రాయ మైయున్నది. ఇది యింకను పరిశీలింపఁబడఁదగును.

ర సాత్త్వికాభినయము— సత్వమన మనస్సునం దుత్పన్నమైనదియని భావము. భరతాచార్యుం డీ సందర్భమున 'నటించు నాతఁడు తాఁగైకొనిన భూమికతోఁ గొంతవఱకైన నైక్యతంజెందిన యనుభవమును గల్గి యాభావముల నెఱింగి ప్రదర్శింపనగునని' యభిప్రాయపడియున్నాఁడు. ఇత్తరుణమున ౧ స్వేద, ౨ స్తంభ, 3 రోమాంచ, ర స్వరభేద, ౫ వేపథు, ౬ వైవర్ణ్య, ౭ అశ్రు, ౮ ప్రళయము లెన్మిదియు, నష్టసాత్త్వికభావములని యెఱుంగునది.

ఇంకను నాట్యశాస్త్రవిదులు ౧ స్వేదమును— క్రోధము, తాపము, దుఃఖము, భయము, రోగము, లజ్జా, శ్రమ, హర్షముల పరిణామముగను; ౨ స్తంభమును— భయము, రోగము, విషాదము, విస్మయము, శోకముల పరిణామముగను; 3 కంపమును— జర, భయము, రోగము, రోషము, శీతము, స్పర్శము, హర్షముల పరిణామముగను; రోమాంచమును (గగుర్పాటు) — క్రోధము, భయము, శీతలము, స్పర్శము, హర్షముల పరిణామముగను; ర స్వరభేదమును— క్రోధము, జర, భయము, మదము, హర్షముల పరిణామముగను; ౫ వేపథువును (మాట తడబడుటను)— కోపము, జ్వరము, బెదరుట, యెక్కువ సంతోషముల పరిణామముగను; ౬ వైవర్ణ్యము (తెల్లపోవుట లేక వెలవెలఁబాఱుటను)— క్రోధము, భయము, తాపము, శ్రమము, శీతముల పరిణామముగను; ౭ అశ్రువు (కన్నీరిడుట)—నానందము, కంటియం దేదేని నలక మొదలగునవి

పడుట, రెప్పపాటులేక చూచుట, శోకముల పరిణామముగను; ఠ ప్రళయము (అనగా మూర్ఛంజెందుట)— నభిఘాతము, నిద్ర, మదము లేక మత్తత, మూర్ఛ, మోదము, శ్రమ, హఠాత్తుగ వినిన వార్తల పరిణామముగను; నాట్యాచార్యులు రెక్కలం డ్రభిప్రాయపడియుండిరి.

ఇక్కాలంపు నాటకరంగములందు శరీరాంగములను నిష్క్రియగ కదలకనుంచుటచే స్తంభము నభినయించుచున్నారు. విసరుకొనుట, గాలినాస్వాదించుట, తుడుచుకొనుటతో స్వేదము నభినయించుచున్నారు. గాత్రసంస్పర్శ (శరీరములు తగులుట) చే రోమాంచలమును, గద్గదముచే స్వరభేదమును నభినయించుచున్నారు. అదరుట శరీరమును వడకించుటచే వేపథువును, కన్నీరు నొత్తుటవలన నశ్రువులను, భూమిపై బడుట, చేరంబడుట, కనులుమూసి చేష్టలు దక్కియుంటచే, ప్రళయమును నభినయించుచున్నారు. నందికేశ్వరుండు, కోహళాచార్యుండును నిటులనే తెల్పియున్నారు.

ఇంక నీయభినయముంగూర్చి ముగించుటకుం బూర్వము ౨౫ వ అధ్యాయమునందుం జెప్పంబడిన కొన్నిశ్లోకములను వివరింపందగును.

శ్లో. యాని శాస్త్రాణి యేధర్మా యాని శిల్పాని యాః క్రియాః। లోకధర్మప్రవృత్తాని నాట్యమిత్యభిసంజ్ఞితమ్॥ ౧౨౮.

టీ. ఏశాస్త్రములు, ఏధర్మములు, ఏశిల్పములు, ఏక్రియలు లోకధర్మానుసరణము గలవియో, అది నటనయేగాని వేఱుకాదు. అదియే నాట్యశాస్త్రము.

శ్లో. నచశక్యం హి లోకస్య స్థావరస్య చరస్యచ। శాస్త్రేణ నియతం కర్తుం నానాచేష్టావిధిం ౧౨౯.

టీ. స్థావర జంగమాత్మక లోకమందలి చేష్టావిధులను శాస్త్రవిధులచే నిర్బంధించుట సాధ్యము కానికార్యమై యుండును.

శ్లో॥ నానాశీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితమ్। తస్మా ల్లోకప్రమాణం హి జ్ఞేయం నాట్యం ప్రయోక్తృభిః॥

టీ. ప్రకృతులు పలుశీలములకు లోంబడియుంట, శీలమునందే నాట్యము (నటన) నిలచియున్నది. గాన దానికి లోకమే ప్రమాణమనియెఱుంగందగును.

ఇంక హస్తాభినయము ౫౭ ముఖ్యభేదములు గలిగినదని చెప్పంబడినది. అనంగా నేంబదియేడు హస్తములలక్షణము నెఱుంగవలయునని భావము. వానియందు 'పతాక' యని పేరుగలహస్తము ముఖ్యమని తలంపంబడుచున్నది. దానింగూర్చి యిటుల వివరింపంబడియున్నది.

శ్లో॥ స్పర్శే దేహీతివచనే నిషంగస్య నిదర్శనే।
వీథ్యాం ప్రవేశభావేపి వికారే చాంగరాగనే।
ఆత్మార్థే శపథేచాపి తూష్ణీంభావనిదర్శనే।
నృపశ్శ్రీష్టశ్చ భావేచ గాఢాలింగనభావనే।
ప్రలాపే ఖడ్గరూపేఽపి పలాయనవిధిక్రమే।
పంచార్ధే సలిలే సింధౌ క్షీరే చేద్ధరకుంచితః।
తత్ర తత్రేతివచనే తారక్ష్యే స్వకృతిక్రమే।
ఏవం పతాకహస్తస్య వినియోగః ప్రకల్పితః॥

టీ. అనగా స్పర్శ, యాచన, నిషంగదర్శన, వీధీప్రవేశ, నికార, వేపన, ఆత్మశపథ, తూష్ణీభావ, రాజభావ, గాఢాలింగన, ప్రలాప, ఖడ్గనిరూప, పలాయనక్రమ పంచార్ధ, జలసముద్రక్షీర ప్రదర్శనాదులయందు పతాకహస్తవినియోగము కల్పింపబడినది.

ముఖ్యహస్తములను వివరించి ముగింతుముగాక.

## హస్తాభినయ విషయానుక్రమణిక:

### హస్తాభినయము (వ్యాసవిషయము)

౧ పతాకహస్తము

అంగుళ్యః కుంచితాంగుష్ఠాః సంశ్లిష్టాః ప్రసృతా యది । సపతాకకరః ప్రోక్తో నృత్యకర్మవిశారదైః॥



కుడిచేయి ఉపయోగములు చూడుఁడు.

౨ త్రిపతాకహస్తము - లక్షణము

సఏవ త్రిపతాక స్స్యా ద్వక్రితా నామికాంగుళిః॥



కుడిచేయి

3 అర్ధపతాకహస్తము - లక్షణము

త్రిపతాకే కనిష్ఠాచే ద్వక్రితార్ధపతాకకః॥



కుడిచేయి

౪ కర్తరీముఖహస్తము - లక్షణము

అస్యైవ చాపిహస్తస్య తర్జనీచ కనిష్ఠికా।
బహిఃప్రసారితేద్వే చే త్సకరః కర్తరీముఖః॥



కుడిచేయి

౫ మయూరహస్తము - లక్షణము

అస్మి న్ననామికాంగుష్ఠే శ్లిష్టే చాన్యే ప్రసా
రితే। మయూరహస్తః కథితః కరటీకావిచక్షణైః॥



కుడిచేయి

౬ అర్ధచంద్రహస్తము - లక్షణము

అర్ధచంద్రకరస్సోఽయమ్ పతాకేఽంగుష్ఠపార
ణాత్॥



కుడిచేయి

౭ అరాళహస్తము - లక్షణము.

పతాకే తర్జనీ వక్రా నామ్నాసోఽయ
మరాళకః॥



కుడిచేయి

౮ శుకతుండహస్తము - లక్షణము

అస్మిన్ననామికావక్రా శుకతుండకరో భవేత్॥



కుడిచేయి

౯ ముష్టిహస్తము - లక్షణము

మేళనా దంగులీనాం చ కుంచితానాం తలాంతరే। అంగుష్ఠేనో పరియుతో ముష్టిహస్తోఽయ ముచ్యతే॥



కుడిచేయి

౧౦ శిఖరహస్తము - లక్షణము.

చేన్ముష్టి రున్నతాంగుష్ఠ స్సయేవ శిఖరః కరః॥



కుడిచేయి

౧౧ కపిత్థహస్తము - లక్షణము

అంగుష్ఠమూర్ధ్నిశిఖరే వక్రితా యది తర్జనీ। కపిత్థాఖ్యకర స్సోఽయమ్-



కుడిచేయి

౧౨ కటకాముఖహస్తము - లక్షణము

కపిత్థతర్జనీచోర్ధ్వమ్ మిశ్రితాంగుష్ఠ మధ్యమే
కటకాముఖహస్తోఽయమ్ కీర్తితో భరతాదిభిః.



౧౩ సూచీహస్తము - లక్షణము

ఊర్ధ్వం ప్రసారితా యత్ర కటకాముఖతర్జనీ।
భవే త్సూచీకర స్సోయమ్ కీర్తితో భరతాగమే॥



౧౪ చంద్రకలాహస్తము - లక్షణము

సూచ్యా మంగుష్ఠమోక్షేతు భవే చ్చంద్ర
కలాకరః॥



౧౫ పద్మకోశహస్తము - లక్షణము

అంగుళ్యో విరళాః కించి త్కుంచితా స్తల
నిమ్నగాః । పద్మకోశాభిధో హస్తః ...





౧౩ సర్పశీర్షహస్తము - లక్షణము

పతాకతలనిమ్నత్వా త్సర్పశీర్షకరో భవేత్।



౧౪ మృగశీర్షహస్తము - లక్షణము

అస్మి న్కనిష్ఠికాంగుష్ఠే ప్రసృతే మృగశీర్షకః॥



౧౫ సింహముఖహస్తము - లక్షణము

మధ్యమానామికాగ్రాభ్యా మంగుష్ఠో మిశ్రితో యది। శేషౌ ప్రసారితౌ యత్ర స సింహముఖ ఈరితః॥



౧౬ లాంగూలహస్తము - లక్షణము

పద్మకోశేఽనామికా చే న్నమ్రా లాంగూలకో భవేత్॥



౨౦ సోలపద్మహస్తము - లక్షణము

కనిష్ఠాద్యావర్తితా శ్చేద్విరళా స్సోలపద్మకః।



౨౧ చతురహస్తము - లక్షణము

దర్జన్యాద్యాత్రియ శ్లిష్టాః కనిష్ఠా ప్రసృతా యది । అంగుష్ఠే ఽనామికామూలే తిర్యక్చేచ్చతురః కరః॥



౨౨ భ్రమరహస్తము - లక్షణము

మధ్యమాంగుష్ఠసంస్పర్శే తర్జనీ వక్రితాయది। శేషౌ ప్రసారితౌ యత్ర భ్రమరాభిధహస్తకః॥



౨౩ హంసాస్యహస్తము - లక్షణము

మధ్యమాద్యాస్త్రయోఽంగుళ్యః ప్రసృతా విరళా యది । తర్జన్యంగుష్ఠసంయోగే హంసాస్య కర ఈరితః॥



౨౪ హంసపక్షహస్తము - లక్షణము

సర్పశీర్ష కరే సమ్యక్ కనిష్ఠా ప్రసృతా యది।
హంసపక్షకర స్సోఽయమ్ ...



౨౫ సందంశహస్తము - లక్షణము

పునఃపునః పద్మకోశే సంశ్లిష్టాః ప్రసృతా యది । సందంశాభిధహస్తోయమ్ కీర్తితో భరతాగమే॥



౨౬ ముకుళహస్తము - లక్షణము

అంగుళీపంచకం చైవ మిళిత్వాఽగ్రే ప్రదర్శనే । ముకుళాభిధహస్తోఽయం కీర్తితో భరతాగమే॥



౨౭ తామ్రచూడహస్తము - లక్షణము

ముకుళే తామ్రచూడ స్స్యా త్తర్జనీ వక్రితా యది॥



౨౮ త్రిశూలహస్తము - లక్షణము

నికుంచయిత్వాంగుష్ఠన్తు కనిష్ఠాంచ త్రిశూలకః।



రెండుచేతుల దోశిలొగ్గుట

౨౯ అంజలిహస్తము - లక్షణము

పతాకతలయో ర్యోగా దంజలిః కర ఈరితః॥



౩౦ కపోతహస్తము - లక్షణము

కపోత స్సకరో జ్ఞేయ శ్శ్లిష్టమూలాగ్రపార్శ్వతః॥



౩౧ కర్కటహస్తము - లక్షణము

అన్యోన్య స్యాంతరీయతాంగుళ్యో నిసృత హస్తయోః। అంతర్బహిర్వా వర్తంతే కర్కట స్సోఽభిధీయతే॥



౩౨ స్వస్తికహస్తము - లక్షణము

పతాకయో స్సన్నియుక్తం కరయో ర్మణి బంధయోః। సంయోగేన స్వస్తికాఖ్యమ్ కీర్తితో భరతాగమే॥



33 డోలాహస్తము - లక్షణము

పతాకేఽప్యూరుదేశస్థే డోలాహస్తోఽయ
ముచ్యతే॥



34 పుష్పపుటహస్తము - లక్షణము

సంశ్లిష్టకరకే సర్పశీర్షే పుష్పపుటః కరః॥



35 ఉత్సంగహస్తము - లక్షణము

అన్యోన్య బాహుమూలస్థౌ మృగశీర్షకరౌ
యది। ఉత్సంగనామా హస్తోఽయమ్ కీర్తితో
భరతాగమే॥



36 శివలింగహస్తము - లక్షణము

వామేర్ధచందోర్ని విన్యస్త శ్శిఖర శ్శివలింగకః॥



37 కటకావర్ధనహస్తము - లక్షణము

కటకాముఖయోః పాణ్యో స్స్వస్తికా న్మణి
బంధయోః। కటకావర్ధనాఖ్య స్స్యాదితి నాట్య
విదో విదుః॥

### ౩౮ శకటహస్తము - లక్షణము

భ్రమరౌ మధ్యమాంగుష్ఠ ప్రసారా చ్ఛకటో భవేత్॥



### ౩౯ శంఖహస్తము - లక్షణము

శిఖరాంతర్గతాంగుష్ఠ ఇతరాంగుష్ఠసంగతః।
తర్జన్యాద్యాయతా శ్లిష్టా శంఖహస్తః ప్రకీర్తితః॥



### ౪౦ చక్రహస్తము - లక్షణము

యత్రార్ధచంద్రౌ తిర్యఞ్చౌ వన్యోన్యతల సంస్పృశౌ। చక్రహస్తస్సువిజ్ఞేయః॥



### ౪౧ కూర్మహస్తము - లక్షణము

కుంచితాగ్రాంగుళీ శ్చక్రే త్యక్తాంగుష్ఠకనిష్టకః।
కూర్మహస్త స్సువిజ్ఞేయో ...



### ౪౨ మత్స్యహస్తము - లక్షణము

కరపృష్ఠోపరి న్యస్తో యత్ర హస్త స్త్వధో ముఖః। కించిత్ప్రసారితాంగుష్ఠ కనిష్ఠో మత్స్య నామకః॥



### ౪౩ గరుడహస్తము - లక్షణము

తిర్యక్తలస్థితావర్ధ చంద్రావంగుష్ఠయో గతః గరుడః ...



౪౪ వరాహహస్తము - లక్షణము

మృగశీర్షే త్వన్యకరః స్థేవశ్లిష్టస్థితో యది।
కనిష్ఠాంగుష్ఠయో ర్యోగా ద్వరాహః కర ఈరితః॥





౪౫ నాగబంధహస్తము - లక్షణము

సర్పశీర్షా స్వస్తికా చేత్ నాగబంధ ఇతీరితః॥

౪౬ ఖట్వాహస్తము - లక్షణము

చతురే చతురం న్యస్త్య తర్జన్యంగుష్ఠమోక్షతః
ఖట్వాహస్తో భవేత్ ...



౪౭ లతాహస్తము - లక్షణము

పతాకా డోలికాకారా లతాఖ్యః భరతాగమే



౪౮ ముష్టిస్వస్తికహస్తము - లక్షణము

ముష్ఠిహస్తా స్వస్తికతామ్ కుక్షిస్థానే గతా
యది। ముష్టి స్వస్తికతాం స్యాత్తా ...



౪౯ కుశలహస్తము - లక్షణము

అన్యోన్యాభిముఖా వర్ధచంద్రా కుశలసంజ్ఞికః॥



 హస్తాభినయవిషయానుక్రమణిక



౫౦ నృసింహావతారహస్తము - లక్షణము

వామే సింహాముఖం ధృత్వా దక్షిణే త్రిపతాకకః। నరసింహావతారస్య హస్త ఇ త్యభిధీయతే॥



కుడి ఎడమ

౫౧ వామనావతారహస్తము - లక్షణము

ఊర్ధ్వాధోధృతముష్టిభ్యామ్ సవ్యాన్యాభ్యాం యది స్థితః । స వామనావతారస్య హస్త ఇ త్యభిధీయతే॥



కుడి ఎడమ

౫౨ రామావతారహస్తము - లక్షణము

(దీనిని రఘురామావతారమనియు, శ్రీ రామావతారమనియుగూడ నందురు)

కపిత్థం దక్షిణే హస్తే వామేతు శిఖరః కరః।
అధరోత్తరభాగేతు రామచంద్రకర స్మృతః॥



కుడి ఎడమ

౫౩ కృష్ణావతారహస్తము - లక్షణము

మృగశీర్షేతు హస్తాభ్యామ్ అన్యోన్యాభిముఖీకృతే। అంసోపకంఠే కృష్ణస్య హంస ఇత్యభిధీయతే॥

 హస్తాభినయవిషయానుక్రమణిక

౫౪ కల్క్యవతారహస్తము - లక్షణము

పతాకం దక్షిణే వామే త్రిపతాకకరోధృతః।
కల్క్యవతారహస్తస్స్యా దితి నాట్యవిదో విదుః॥



కుడి ఎడమ

౫౫ విష్ణుహస్తము - లక్షణము

హస్తాభ్యాం త్రిపతాకాభ్యాం విష్ణుహస్తోభి
ధీయతే॥



కుడి ఎడమ

౫౬ సరస్వతీహస్తము - లక్షణము

సూచీకృతే దక్షిణేఽర్ధచంద్రే వామకరే తథా।
సరస్వత్యాః కరం ప్రోక్తో భరతాగమవేదిభిః॥



కుడి ఎడమ

౫౭ మన్మధహస్తము - లక్షణము

వామకరేతు శిఖరమ్ దక్షిణే కటకాముఖః।
మన్మధస్య కరః ప్రోక్తో నాట్యశాస్త్రవిశా
రదైః॥



కుడిచేయి ఎడమచేయి

**హస్తామలకాచార్యులు:**—వీరు శంకరాచార్య శిష్యులు. అద్వైతి (వాయువుయొక్కయవతారముగఁ జెప్పబడినవారు.) వీరు ప్రభాకరుని పుత్త్రులనియు, మళయాళదేశమున మళయాళ భగవతీ (మూకాంబ) క్షేత్రమునకుం గతిపయ దూరమునందున్న శ్రీవల్లీపురనివాసి యనియు, శంకరు లాక్షేత్రమునకు కలారోహణ మొనర్ప నేగుదనుక మాటలాడకను వినకను నుండెననియుఁ బ్రభాకరులు వీరిని శంకరులకడకుం గొంపోయి చూప వారు మాటలాడఁజేసిరనియుం జెప్పఁబడినది. శంకరదర్శనార్థినై తా నిట్లుంటినని వీ రనిరట. పిదప వారు శంకరశిష్యులై యతిత్వరితముగఁ బ్రత్యుత్తరములు నుడువుచుండువారు గాన హస్తామలకాచార్యులు (అఱచేతి యుశిరికకాయ) అని పే రయ్యెనట.

**హస్తిక లేక హస్తితగోత్రము:**—
(నిధృవగణము చూడుఁడు.)

**హస్తికుల గోత్రము:**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు.) హస్తికులగోత్రము. ఏకార్షేయ (౪౯) గోత్రము. సౌమ్యగణము. సంస్కృత గోత్రము సౌమ్యస. ఆపస్తంబసూత్రము. యజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ. రామేశుఁడు దేవత. రామాంబభార్య. మలయాద్రి తపస్థానము. అశ్వత్థసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౨౦. క్షేత్రసంఖ్య ౧౦౦. శాలి ధాన్యము దానము. ఉపోతనికి వర్జనీయము.

**హస్తిగిరి:**— కాంచీపురము నందలి వరదరాజస్వామివారి దేవాలయమున్న చిన్నకొండకు పేరు. హస్తిగిరిమాహాత్మ్య మను గ్రంథమున కాంచీక్షేత్ర మాహాత్మ్యమే వివరింపఁబడినది. మఱియు సత్యవ్రతక్షేత్రమనియుఁ గాంచీపురమునకుఁ బేరుండెనట. బ్రహ్మ యిట నొకయశ్వమేధయాగ మొనర్చెనని చెప్పఁబడినది.

**హసిగోత్రము:**—
(నిధృవగణము చూడుఁడు.)

**హస్తిగోత్రము:**—
(రథితర ఉపగణము చూడుఁడు.)

**హస్తిజిహ్వానాడి:**—
(అష్టాంగయోగములు చూడుఁడు).

**హస్తినగోత్రము:**—
(హరితఉపగణము చూడుఁడు.)

**హస్తినాపురపు [జాగా] నివేశనము:**—తొల్లింట హస్తినాపురము నదియందుఁ గలసిపోయినది. ఆప్రదేశము మెరత్ పురముకడ మేరతునుండి ౨౨ మైళ్ళదూరమునఁ గలదు. తొల్లింటికాలపు ముక్తేశ్వరశివక్షేత్రము నేటికిని మంచిస్థితియం దున్నది. దాని నిప్పుడు 'ఘర్ ముక్తేశ్వర్' అనుచున్నారు. దీనిప్రశంసలు భారత భాగవతములందుఁ గలవు. ఇది యొకపాటి చిన్న కొండపై నున్నది. దిగువను కొన్ని సహగమనములు జరిగియుండినప్రదేశములు గలవు. హస్తిన మహారాజుచే నిర్మింపఁబడిన యీనగరము నిచక్షున్నినాఁడు నదిలోఁ గలసిపోయినదట. ఇట జైన దేవాలయ మొకటి కలదు. వారి కిప్పుడు యాత్రాస్థలమై యున్నది. ఇక్కాలమున నది యొకవైశ్యునకు మొఖాసా యై యున్నదట.

**హస్తినాపురరాజ్యము:**- భాగవత ౧౦ - ౬౮ యందు 'గజసాహ్వయనగర' మని పేరు హస్తినాపురమున కిడియున్నారు. కౌరవుల

రాజధాని. పిదప పాండవులకును రాజధాని. ఇప్పుడు నదీగామియై యున్నది.

విఘ్నేశ్వరుఁడు శివార్చనమొనర్చిన తావుగఁ జెప్పఁబడినది. ముక్తేశ్వరక్షేత్రము తొల్లింటి హస్తినాపురములోని దందురు. ఇప్పుడు 'గడముక్తేశ్వర్' అనంబడు క్షేత్రమై యున్నది.

**హస్తిమతీనది:—** గుజరాతులోని సబర్మతీనదియందు సంగమించు నొకనది. దీనింగూర్చిన ప్రశంస పద్మపురాణము ఉత్తర ౫౫ యందుఁ గలదు. ఇప్పుడు దీనిని 'హశాత్మతీ'యనుచున్నారు.

**హస్తిమహారాజు [హస్తికుఁడు]:—** అత్రి చంద్ర పూరువంశ క్షత్రియుఁడు. తండ్రి సుహోత్రుఁడు. కుమాళ్లు అజమీఢుఁడు, ద్విమీఢుఁడు, పురమీఢుఁడు. హస్తిమహారాజు హస్తినాపురము నిర్మించి తనరాజధానిగఁ జేసుకొనినవాఁడు. ఈయజమీఢుని కాలముననే కదా అదివర కెన్నో శతాబ్దములనుండి పౌరరాజ్యమున నొకభాగముగాఁ గలిసియున్న పాంచాలదేశము చీలి ప్రత్యేకరాజ్యముఁగా నేర్పడుట.

**హస్తివాస గోత్రము:—**
(హారితఉపగణము చూడుఁడు).

**హస్తిసోమానది:—** మహానదియందు సంగమించు నొకపాటినది. దీని నిప్పుడు 'హస్తు' యనుచున్నారు.

దీనింగూర్చిన ప్రశంస పద్మపురాణమున ఆది-స్వర్గ- 3 యందుఁ గలదు.

**హస్తుఁడు:—** యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి వసుదేవుఁడు. తల్లి రోచన.

**హసెన్ హుసేనుల పీర్లపండుగ:—** దీనిని మొహరంపండుగ యనియు ననుట కలదు. ఇది మహమ్మదీయుల మతసంబంధముగ జరుపఁబడుచున్నది. దీనికథనము ౧౩౦౦ సంవత్సరములకు మున్ను నడచినదిగాఁ దలంపఁబడుచున్నది. ఏఁటేట నిస్లాంమతస్థుల మొహరంమాసపు మొదటిదినము నుండి దశరాత్రము లాచరింపఁబడును. ఇట్టివాని నాంగ్లదేశస్థులు 'పేషన్-ప్లే' (Passion play) అనెదరు.

మహమ్మదుజగద్దేశికులు భౌతికశరీరమును వీడి యల్లాసన్నిధికిం జేరసరుగుకతన వారికిఁ బుత్రులు లేక ఒకకుమార్తెయు, వారివలన 'హస్సేన్ హుస్సేన్' అనుపేరులుగల యిర్వురు దౌహిత్రులును నుండిరి. అందు హుస్సేన్ జ్యేష్ఠుఁడఁట. వీరు సైన్యబలము చాలక కొంతబలహీనులై యుండుకతన 'యాజిద్' అను మహాత్ముఁడు మతాధిపత్యగురుపీఠముల నాక్రమించెనఁట. మహమ్మదు దేశికుఁడు మరణించిన మదీనాపురముననే పాప మాయన దౌహిత్రులు వసించుచు నుండిపోయిరట. ఇట్టి పరిస్థితులందు కుఫా (Kufa) వాస్తవ్యుల కుట్రను సంబంధించిన కుటిలసందేశ మొకటి మదీనాపురమున వీరికడకుఁ జేరెనట. అందు తాము సైన్యబలమును జేకూర్తుమనియు, హుస్సేన్‌గారు మతాధిపత్య గురుపీఠములకుఁ బోటీచేయుచు నిలచి కలహమునకుఁ బయలుదేఱవలయుననియు నుండెనట. తనయాత్మబంధువు లెంత వలదని వారించినను వినక, హుస్సేన్ మహోదయుఁ డా కుట్రసందేశమును నిజమనినమ్మి రాయబారులను గారవించి వల్లెయని కొద్దిపాటియనుచరవర్గముతో బయలుదేఱి మదీనాపురము వీడి బాబిలోనియా సరిహద్దునకు మొదటిదగు మొహరం నెల ప్రథమ దినముననే చేరెనట.

అచటఁ గొందఱు గుఱ్ఱపుకౌతులు వీరికొఱకై యుదివఱకే వేచియుండి గన్గొనిరఁట. వారినాయకునిపేరు 'అల్‌హుర్' సేనానియనియు, వీరిని బసారిగవర్నరుకడకుఁ జేర్చుట కాతం డంపఁబడెననియుఁ దెలిసెడిని. మధ్యేమార్గమున హుస్సేన్ మహోదయున కొకయపశకునము సంభవించెనఁట. రాత్రియంచుఁజేయు ప్రయాణముల వాహనారూఢులై యుండుతరిని వారికి సిచుర నైగ్రిమ్మి యవశమవ వా రది యపజయసూచకమగు దుశ్శకునమని తలంచిరఁట. మోహరం మూఁడవదినమునఁ గొంద అధికసంఖ్యాలగు శత్రుసైనికులు యూఫ్రటీస్‌నదిం దాఁటనీయక చుట్టుకొనిరఁట. హుస్సేన్‌గారు తాదిరిగిపోవుట కనుజ్ఞనడిగెనఁట. అడుగ హుర్‌సేనాని ప్రోత్సాహమున 'ఇబాన్‌సాద్' అనునాయన యరిగి పరిపాలకునకు నివేదింప, నాతం డేమరతును లేని శరణుజొచ్చుటను హుస్సేనుగారికి విధియని యనెనఁట. ఈసంధిరాయబారములతో నాఱుదినములు గడచి మోహరమ్‌తొమ్మిదవదినము నాఁటికి నిష్ఫలమని స్పష్టపడెనఁట. హుసేనుగా రప్పటికి తన డెబ్బదియిద్ద రనుచరులతో యూఫ్రటీసునదీతీరముననేయున్న కెర్బాలా మైదానమునందు విడిసియుండిరఁట. ఇంతలోఁ గొందఱు శత్రుసైనికులు హుస్సేన్‌గారి బలమునఁ జేరిరఁట. కుముర్ అనునాయన స్వారిచేయుచునే హుస్సేనుగారిసన్నిధికరిగి బసారిపరిపాలకుని కడపటి సందేశముగ నేమేమో నుడువ, హుస్సేనుమహాత్ముఁడు మఱునాఁటియుదయము (మొహరము నెల పదవదినము) దనుక ప్రత్యుత్తర మీయ గడువుం గోరెనఁట. ఆగడువీయఁబడె ననియే దలంపఁబడుచున్నది. హుస్సేన్ మహోదయుఁడు తన పరివారముం జేరఁబిలిచి 'మీరందఱును మీమీయిండ్లకుఁబోయి బ్రదుకుఁ' డనియెనఁట గాని వా రట్టిదుస్థితియందు హుస్సేన్‌గారిని విడిపోనొల్లరైరఁట. దానింగాంచిన హుర్‌సేనాని తనముప్పదిమందిభటులతో హుస్సేన్‌గారికి శరణుజొచ్చి శత్రుసైన్యములనుండి చీలి హుసేనుగారి పరివారముం గలిసిపోయెనఁట.

హుసేన్‌గారితో సంగరమొనర్చుట కిష్టము లేకున్నను, శత్రుసేనానియాజ్ఞకు లోబడి శత్రుసైనికులు సంగరమునకు గడంగ, షిమార్ అనునాతం డొకశరమును హుసేన్‌గారినివాసముపై వదల, సంగర మారంభమాయెనటఁ గాని, శత్రుసైన్యము లధికముగనేయుంటఁ గాననగుచుండెనఁట. ఇంక కుషావారిప్రశంసయే గారాదు. హుసేన్‌గారికి తలయం దొకగాయముతగిలి రక్తమధికముగ స్రవించుచుండ నదీజలములను దాహాతురుఁడై త్రావ దరికేగెనఁట. అత్తఱి నేజొక బాణము నోటియందుఁగూడ దగిలెనఁట. ఇది దాహము ద్రావుచుండుతరినే జరిగెనఁట. జరుగ వారు కండ్లు గగనముపై పునకెత్తి ప్రార్థించుచుఁ బ్రాణములను వీడిరఁట. ఇది పదియవదినము. హుస్సేనుగారితమ్ముఁడగు హస్సేనుగారును వారితోడనే మరణించిరఁట. నేఁటికిని జరుగుచుండు పీర్లపండుగు పదదినము లాపదిదినములే యఁట. పీర్లపండుగయందు దిస్లాంమతస్థులు గుండెలొద్దుచు 'యాహుస్సేన్, యాహస్సేన్' అనుచుండుట మహమ్మదుజగద్గురుని దౌహిత్రులగు హుసేన్, హస్సేనులంగూర్చియే యఁట. పీర్లపండుగయందు నిర్మించి యూరేగింపఁబడుచుండు గుమ్మటము లిస్లాంమతగ్రంథములందు 'తాజీ' లనంబడినవి. అవి వారిగౌరవార్థమే నిర్మింపఁబడుచున్నవి. మహమ్మదుదేశికులవాహనము వారికిఁబిదప ఆలీగారి కీయఁబడి, వారికిఁబిదప తిరుగ హుస్సేనుగారికొసంగబడెనఁట. ఈమోహరమ్ పీర్లపండుగ

షియ్యా తెగమహమ్మదీయులచే నాచరింపఁబడు చున్నది. ఆచరింపని సున్నీతెగమహమ్మదీయులు శత్రుపక్షావలంబులకషు రేమో!

## హ్రస్వరోముఁడు:—
ఇక్ష్వాకు సంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. మిథిలదేశాధిపతి. తండ్రి స్వర్ణరోముఁడు. కుమాళ్లు ధర్మధ్వజుఁడను (రెండవ) జనకమహారాజు. కుశధ్వజుఁడు ననువారు.

## హాంకాంగుద్వీపము:—
తొలుతఁ జీనావారిచె యుండి క్రీ. వె. ౧౮౪౨ లో ఆంగ్లేయు వారి హస్తగతమైనది. విక్టోరియాపురము ప్రధాన పట్టణము.

## హాంగ్హోనది (హొయాంగ్హో):—
చీనాదేశపునదులలో నొకటి. ఇది ప్రవహించు మార్గమునఁగల పసుపుపచ్చబంకమట్టిని విస్తారము కరగించుకొని, తాను పసుపుపచ్చరంగుజలములం బ్రవహింపఁజేయుటచే 'హవాంగ్హో' (పచ్చనది) యనిపేరందుటయే గాక, తానంగమించుసముద్ర జలములుగూడ నారంగే యగుట 'యెల్లోసీ'యను పేరుం గల్గించినది. ఆంగ్లేయులు దీనిని Yellow river అనియే వాడుచుందురు.

ఇంక నీనది తనవఱదముంపులవలన దేశము యొక్క విశేషభాగములను ధ్వంసమొనర్చుచుండు మహాపకారి గాన దీనిపేరున కసార్థములు చీనావారు కల్పించి, చీనాయొక్క దుఃఖమనియు, కన్నీటి పరీవాహమనియు, హేళనగా నర్థములం జెప్పుచున్నారు. దీనిపొడవు ౨౫౦౦ మైళ్లు.

క్వేన్లున్పర్వతములందు జనించి, యనేకపర్వతములనుండి కోసికొని ప్రవహించుచు, పచ్చమట్టి నేలలనుండి వచ్చు పెక్కులుపనదులం గల్పుకొనుచు నుత్తరమునుండి దక్షిణచీనాకు జలమార్గమని యీనదినుండియే పేరందిన 'టంగ్హ్వాన్' కనుమ ర్గమునుండి యివ్వల దక్షిణవాహినియై ప్రవహింప మొదలిడి 'వియిహో' లోవగుండా టారిమ్మేసి సడచి, సమతలప్రదేశప్రారంభమున నున్న కైఫెంగుపురముప్రక్కఁబడి చనుచు, నట నుండి భయంకరమై వర్ధిల్లును. కైఫెంగునుండి నది కుభయతీరములను గొప్పగట్టులంబోసి భద్రపఱచినను, వఱదలకాలమున నాప్రదేశప్రుజలు నమ్మి నిర్భయముగ నుండుటెఱుఁగరు. ఆది నీనది యెల్లోసీ యందు సంగమించుచుండెడిని. క్రీ వె. ౧౮౫౨ సంవత్సరమునఁ గల్గినయపాయకరములగు ముంపులందు జలమార్గమును మార్చి యిప్పుడు పిచిలీసంయుక్తాగ్రగుడసముద్రమున కరుగుచున్నది.

సగటున నదిపైభాగము వడి యధికముగుట నోడలగమనమున కనర్హము; క్రిందిభాగము వెడలుపధికమై లోతు చాలమి నోడలగమనమున కనర్థము సంభవించెడిని. వఱదలచే ముంపు లధికము.

## హాకీ లేక హాకీఆట (Hockey):—
ఈయాట 'అసోసియేషను ఫూట్బాలు' వంటిదని కొంద రనెదరు. ఈయాటయు, నూఱుమొదలు నూటముప్పది గజములవఱకు పొడవును, ఏఁబది మొదలు నూరుగజములవఱకు వెడలుపును గల ప్రదేశమందు దానివలె నాడఁబడు నాటపద్ధతులును నవియే గాని యిరువదియైదు గజముల దూరములోననె (అనఁగా గోల్స్తానునుండియని యెఱుంగునది) ఆట గెలువనగును. చిన్న గట్టిబంతి యిం దుపయోగింపఁబడును. ఆటకఱ్ఱలకు 'క్లబ్బ' అనిపేరు. దీని ప్రారంభమున నెవ్వరు ముందాడుటను అని యొకవిధానము కలదు. ఆవిధానమునకు bullying off అని పేరు. ఆటయందుండు బంతిని, ఆటకాఁడు తాకరాదనియు, తన్నరాదనియు, ఆటకఱ్ఱను బుజములయెత్తుకన్న పై

కెత్తరా దనియు, ఈహాకీయాటయందు నియతు లేర్పడి యాచారముగ వచ్చుచున్నవి.

**హాగియొలొజీ (Hagiology):—** యతులు, సన్యాసులు, ఋషులు, మునులు, వారిధర్మ విధానములు, వారిచరిత్రలు, చర్యలు మొదలగునవి దెలుపు చరిత్రశాఖ కళ.

**హాగ్మనే (Hogmanay):—** స్కాట్లాండు దేశమున సంవత్సరాదికిఁ బూర్వపురాత్రియందు నూతనవత్సరప్రవేశకాలమున కీపేరు వర్తించెడిని.

**హాజలిగోత్రము:—**
(లౌగాక్షిగణము చూడుఁడు.)

**హాటకము:—** హిమాలయముపై నున్న ఉండేశ లేక హుండేశదేశము. ఇందు మానసరోవరము కలదనియు, నిచటిప్రజలు గుహ్యకులనియు, మహాభారతము సభాపర్వము ౨౭ అధ్యాయమునఁ గలదు.

మఱియుఁ దొల్లింటి యనర్తదేశమున కొకప్పుడు ప్రధాననగరమైయుండి, యిప్పుడు గుజరాతునందు సిద్ధపూరున నాగ్నేయదిశగా డెబ్బది మైళ్ళదూరముననున్న చమత్కారపురము హాటకక్షేత్రమని స్కాందపురాణనాగరఖండమునఁ జెప్పఁబడినది.

**హాటకసీమ:—** హుండేశదేశమున మానసరోవరప్రాంతసీమ యని మహాభారత సభాపర్వము ౨౭ యందునఁ గలదు. ఇది గుహ్యకుల దేశమని చెప్పఁబడినకతన నిప్పటిఘూర్కాజాతికి వారితో నేసంబంధము గలదో తలంపఁబడవలసియుండును.

తొల్లింటి యనర్తదేశమున రాజధానిగనుండిన చమత్కారపుర ప్రాంతఁపుఁ బవిత్రావరణమునకీపేరుండినటుల స్కాందపురాణ నాగరఖండమువలనఁ దెలియుచున్నది. ఇది ఘూర్జరదేశమున నహమదాబాదుజిల్లాలోని సిద్ధపురమునకుఁ దూర్పుగా ౭౦ మైళ్ళదూరమునఁ గలదు.

**హాటెన్టాట్ జాతివారు:—** దక్షిణాఫ్రికాయందుఁ గానవగుదురు. నీగ్రోజాతి, బంటుజాతి, బుష్మెన్‌జాతితో సంకరసంబంధము గలవారనియందురు. వారికిఁ బ్రత్యేకమతము కలదఁట. కులగురువులుగూడ వారియందు గలరఁట. వారిప్పుడు ౬౦౦౦౦ మంది యున్నారఁట. కేప్ హాటెన్టాట్సు Half breeds అని వాడుక గలదు.

**హాన్ లేక హూన్‌శాఖ క్షత్రియులు:—**
(క్షత్రియకులముఁ జూడుఁడు.)

**హాబ్ అర్ నాబ్ (Hob or Nob లేక Hob and Nob):—** Hob అనిన వెచ్చనగుటులఁ జేయుట కర్థము. Hob and Nob అనఁ నొకగ్లాసుయొక్క పైభాగము క్రిందిభాగముఁ దాఁకుటయని భావము. విస్తారఁపుయోచనయు తేడాలు పాటింపక (ఖరారు) సఖ్యపరిమాణము లొనర్చుకొని యేకీభవించుట కిఁడక్తిని వాడుచున్నారు. షేక్స్పియరుమహాకవి యీఁడక్తికి 'ఇచ్చుట పుచ్చుకొనుట' యని యర్థము వాడియున్నాఁడు.

**హాబ్సన్సు ఛోయిస్ (Hobson's choice):—** Mr. Tobias Hobson అను నాయన తొల్లింటికాలమునం దాంగ్లదేశఁపు కేంబ్రిడ్జిపురమున Imkeeper and Horse carrier అనఁగా వాటపూటియు, ప్రయాణములకుఁ గుఱ్ఱముల నద్దెకిచ్చువృత్తి గలవాఁడుగ నుండువాఁడు. ఆంగ్లేయుఁడు. ఆయనకడ నద్దెకిచ్చుటకు

చాలా ప్రశస్తమైన సవారిగుఱ్ఱములు కొన్ని యుండునవి. ఆదినములలో రైలు మొదలగుసౌకర్యములు లేక నాటున గుఱ్ఱములపై నెక్కి ప్రయాణములు చేయుచుండువారు.

ప్రయాణమొనర్చి యలసివచ్చిన గుఱ్ఱమును కడనుంచుచుంట, తాజాపడిన గుఱ్ఱము మొదట నుంట జరుగుచుండునది. ఎవ్వరేని గుఱ్ఱమునకై వచ్చినతరి ఎక్కువతాజాపడి యెక్కువ విశ్రాంతి నందిన మొదటిగుఱ్ఱమునే యిచ్చుచుండువాఁడట. తరువాత వచ్చినవారికి తరువాత నెక్కువవిశ్రాంతి గొనియుండిన తర్వాతిగుఱ్ఱము నొసంగుచు నిట్లు అలసినగుఱ్ఱమునకు త్వరలోఁ దిరిగి అలసట తగులనీయక న్యాయము నెఱుపుచు తనగుఱ్ఱములం జెడిపోనీయక జూచుకొనువాఁడు. ఇది ప్రసిద్ధమై 'Hobson's choice' అని వాడుకగల్గి సర్వ సమత్వము పద్ధతిగాఁగల వారికి 'Hobson's choice' అని సామెతగా నయ్యెనట.

## హావిా:—

(ఇండెమ్నిటీ చూడుఁడు.)

## హాయునిగోత్రము:—

(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**హారవంశక్షత్రియులు:**—వీరు చౌహాను చతుర్వాస్త శాఖక్షత్రియులు. (క్షత్రియశాఖలు చూడుఁడు, బూందీపురము చూడుఁడు.)

## హారశాఖక్షత్రియులు:—

(చౌహాను క్షత్రియులు చూడుఁడు.)

**హారహూరదేశము:**— సింధునది; జీలం నదిమధ్యనుండిన చిన్న దేశమని తలంపబడుచున్నది. గండగర్వర్వతము సాల్టురేంజి కలసి యీదేశమైన దందురు. దీనిప్రశంస బృహత్సంహిత ౧౪—33 యందుఁగలదు.

## హార్కారిగోత్రము:—

[నిధృవగణము చూడుఁడు.]

**హార్బరులు [Horbours]:**—సముద్రతీరములం దొక్కొకతావున నోడలు క్షేమముగ దరిజేరి ప్రజలను, సరకులను నెక్కించుకొనుటకుఁగాని, దింపుటకుఁగాని, వీలగునట్టియు, నోడలు నిలుచుట కనుకూలమగునట్టియు, జలప్రదేశముల నాంగ్లమున హార్బరులందురు.

వీటియందు గొప్పగొప్ప సముద్రఁపుటోడలు దరిజేరి నిలుచువసతు లమర్పఁ బడును. హార్బరులు నైసర్గికములగు రేవులు [natural horbours] గను, కృతములగు రేవులు [Artificial horbours] గను ద్వివిధములు. ఈ రెంటికినికొన్ని భేదము లుండును. స్వతస్సిద్ధముగ నమరియున్న నైసర్గికరేవులం దమరియేయున్న వీలుచా ళ్ళుప యోగింపఁబడుటయు, కృతకములందు బ్రేకువాటరులు నిర్మింపఁబడి యోడలకు వసతు లమర్పఁ బడుటయు సంభవించుచుండును. హార్బరుల నిర్మాణవిధానమున బ్రేకువాటరులు ముఖ్యములు. అన్నిహార్బరులందు జెట్టీలు, డాకులు, లైటుహౌసులు ప్రధాననిర్మాణములు.

బ్రేకువాటరు లన నోడలునిలుచు జలప్రదేశఁపు టావరణఁపుగోడ. ఇదియే సరియగు హార్బరు నావరణము. మధ్యనున్న జలావరణమును హార్బరనియే యందురు. బ్రేకువాటరుగోడలు రాతి సున్నముల (masonary) పనిగగాని, కాంక్రీటు పనిగఁగాని సెమెంటుకాంక్రీటుతో గొప్పగొప్ప దిమ్మలుచేసి త్రాటితోఁగాని, కేవలము గొప్ప రాళ్ళతోగాని నిర్మింతురు. రాళ్ళు సిమెంటుతో

జాగ్రతగ బిగించి నిలువుగోడను జాగ్రతగ నిర్మించినతావులందు గొప్పగొప్ప సముద్రపుటోడలు దరిజేరఁగల్గునుగాని, నీటియందు రాళ్ళం బోత పోసినతావులం దరిజేరనేరవు. అట్టి తావులందు జెట్టీ (Jetty) లను నిర్మింపవలసి యుండెడిని. ఇంక సెమెంటుకాంక్రీటుబ్లాకులు చాల పెద్దవిగఁ జేయఁబడి ప్రత్యేకపుజాతి భారవాహకములగు క్రేనులు (cranes) చే నెత్తఁబడుచు నర్హస్థలముల నమర్పఁబడును. బ్రేకువాటరు గోడలను నిర్మింతురు.

సముద్రపు గొప్పపోటుపరిమాణపుటెత్తు నెఱింగి దాని కించుక యధికముగ హార్బరుగోడలు నిర్మింపఁబడుటయేగాక తగినంతవెడలుపుగఁగూడ నిర్మింపఁబడి వాటిపై నినుపదారులంగూడగల్గి, వాటిపై రైలుబండ్ల రాకపోకలకును, మనుష్యులరాకపోకలకును గూడ తగినవసతిఁ గల్గియుండెడిని. వీటి ప్లాట్ఫారములనంటి కొన్నితావుల పొగయోడలు నిలచి యెగుమతి దిగుమతి పనులను నిర్వర్తించుకొనఁగల్గును. (పోటుపాటులు చూడుఁడు.)

లోతునీటిలోనికిం జొచ్చుకొనియుండునటుల నిర్మింపఁబడి యోడలు దరిజేరునటులను వాటిపై ని సౌఖ్యముగ నెగుమతి దిగుమతులం జేయఁగల్గునటులను నీటిలోనికి నిర్మింపఁబడునవి జెట్టీలనంబడును. ఇవియు (Jetties) ను హార్బరుప్లాట్ఫారములవంటివే. ఇవి తఱుచుగ దూలములనుకొయ్యలుగ (piles) నీటిలోని క్రిందిభూమియందు దిగంజేసి యడ్డుదూలములచే బిగించి, పైనిబాట వలెఁజేసి నిర్మింతురు. (పునాదులు pile foundations చూడుఁడు.)

షిప్పింగులపనులనిమిత్తము నిర్మింపఁబడుజలావరణములకు 'డాక్సు' (Docks) అనిపేరు. వీటిలోని జలావరణమందున్ననీటి (మట్టము)control చేయుటకు నీరుకారని ద్వారములు తలుపులు (water tight gatet) నమర్పఁబడిగాని, యట్టిదేయగు నితరయేర్పాటులం గల్గినదిగాఁగాని యుండెడిని. ఇందువలన వలయునేని నీటిని బైటికి వెడలించుటకుఁగాని, తిరుగ నింపుటకుఁగాని, వీలుగల్గి యుండును. కొన్నిడాకులందు సర్వకాలములం దేదో నిర్ణీతమగుమట్టమును మీఱక నిలిచియుండెడి నట్టివానికి 'wet docks' అని పేరు. నీరుండువిధి లేనిడాకులను 'dry docks' అనియు, 'graving docks' అనియు ననెదరు. నీటి నుండి యోడల నెత్తగలశక్తి గలవిగను, వాటిని మోయుచు నిలుపఁగలసామర్థ్యము గలవిగను, నిర్మింపఁబడిన monuble struclures (కదలికకట్టడములు) 'ఫ్లోటింగు డాక్సు' (Floating docks) అనంబడును. ఇటుల డాకులందు మూఁడు ముఖ్యములగు తరగతులు కలవు.

ఈసందర్భమున నీడాకులందలి గోడలంగూర్చి యిట నించుక వివరించుట సమంజసము. వీటిని 'డాకువా' (Doc walls), లనియు 'క్వేవాల్సని'యుఁ (Quay walls) గూడ నందురు. ఇవి చాలా బలమగుగోడలు. ఎక్కువభారమును మోయఁగల్గినవిగఁగూడ నుండవలయును. ఇవి రెంటికవైపునంగల మట్టిని నిలుప సమర్థముగలవి యగుటయేగాక ప్లాటుఫారములపైనుండి యెగుమతిదిగుమతులపనులంజేయుచుండు బరువగుక్రేనులను (Cranes) నినుపబాటలను వాటిపై నడపు నినుపట్రక్కులు (trucks) ఇనుపతోట్టెలబండ్లు మొదలగుభారముల నన్నింటిని మోయుఁదగినవిగ నుండవలసియుండును. రెండవపక్కలంగల (ఓడలనుమోయు) లోతునీటిని Vertical గా నిలచి నిలుపఁగల్గి యుండవలసియుండును. ఒకొక్కతరి

డాక తవరణముఁనుండలి సీటిమట్టము పై సీటిమట్టము కన్న నెక్కువయెత్తుగా నుండునెడల నాడాకుల మొగను లాకులు (Locks) నిర్మింపఁబడవలసియు నుండెడిని. (లాకులు చూడుఁడు).

## హారిగ్రీవిగోత్రము:—

(అగస్త్యఉపగణము చూడుఁడు.)

## హారిగ్రీవిగోత్రము:—

(సంకృతిఉపగణము చూడుఁడు.)

## హారిగోత్రము:—

(సంకృతిఉపగణము చూడుఁడు).

## హార్టికల్చరు లేక తోటల వ్యవసాయము:—

హార్టికల్చరనుమాటకుఁ దోఁటలు వేసి పెంచి బాగుచేయుకృషి యని యర్థము. అందుచే నిది వ్యవసాయపరిశ్రమశాఖలలో నొకటిగాఁ బరిగణింపఁ బడుచున్నది.

దీనిలోఁ జేరిన యంతర్భాగములు ఫలవృక్షములువేయుట (Fruit gardening), పూలచెట్లునేయుట (Flower gardening), లతలు మొదలగునవి అలంకరించుటకువేయుట (Arbori culture), కూరగాయలుకాపించుట (Vegetable gardening) మొదలగునవి ముఖ్యములు.

ఫలపరిశ్రమ:—ఇందంటుమామిడి, సపోటా, జాంబు, గులాబిజామి, నిమ్మ, దబ్బ, నారింజ, ఆపిల్, ద్రాక్ష, కిస్మిస్ మొదలగుఫలవృక్షములు చేరును. ఈజాతులఫలములు సర్వసాధారణముగా సారవంతమైనట్టియు, ఆరోగ్యకరమైనట్టియు రసమును గలిగియుండును. వీనికి 'Fleshy Fruits' అని పేరు. ఇందులో మామిడిపండునకు 'Drupe' అనియు, తక్కినఫలజాతులకు 'Berries' అనియుఁ బేరు. అనాసపండ్లు, పనసపండ్లు ననేక ఫలములసముదాయమున నుత్పన్నమగుచున్నవి గావున సమిష్టిజాతిఫలముల (Collective Fruits) లోఁ జేరును. ఇవి సరిగాపక్వమైనవిదపఁ గాని భక్షించుట కర్హములు గానేరవు.

పుష్పపరిశ్రమ:—[Flower gardening]

ఆదినుండియు నివి యుద్యానవనములలో వేయఁబడుచుండుట యాచార మయియున్నది. కొంతమంది కేవలశృంగారవిలాసముకొఱకును మరికొంతమంది దీనివలన ధనమార్జించు వ్యాపారమునకును వేయుచుందురు. ఈజాతులుతఱచుగా మల్లె, సంపెంగ, గులాబి, చామంతి, జాజి, విరజాజి, నైట్క్వీన్ మొదలయినవి. దవనము, మరువము మొదలగునవి పూలుపూయకపోయినను పరిమళముకొఱకు పెంచఁబడుచుండును.

ఈజాతులు ఫలవృక్షములకన్న నధికతరమగు శ్రద్ధతోఁ బరామర్శింపఁబడవలసి యుండుటచేతను, అంతకన్న తఱచుగా నీరు పోయ్యవలసిన యవసర ముండుటచేతను, సర్వసాధారణముగా గోలెములలో వేసి పెంచఁబడుచుండును. ఈపూలచెట్లు సమశీతోష్ణప్రదేశములయందు విరివిగా వర్ధిల్లునుగాని యుష్ణప్రదేశములయం దంతగా వృద్ధిఁబొందవు.

వీనియభివృద్ధియు నుత్పత్తియుఁ గేవలము బీజములపై నాధారపడక కొమ్మలు నఱికి నర్సరీలనఁబడు చలువమళ్ళలో నీడను పెంచఁబడి బాగుగా చిగిరించినవెనుక గోలెములలోని కెత్తఁబడును. ఈగోలెములలోనికి మార్చుపని సామాన్యముగా మబ్బు మసబుగా నుండుదినములయందే జరిపించిన యెడల మొక్కలు వాడిపోక సరిగా చిగురించి

బ్రతుకుటకవకాశము గలిగియుండును. దీనికి Vegitation propagation అనిపేరు.

ఈపరిశ్రమ తరుచుగా పట్నవాసములకు పరిసరములనుండుస్థలములయందే చేయఁబడుచుండును.

అలంకారార్థముగా వేయఁబడులతలు, తీగలు మొదలగువానిని బెంచుపరిశ్రమ ఆర్బోరీకల్చరనఁబడును. ఈలతికా జాతులలోఁ జేరినవానిలో ముఖ్యములయినవి మాలతీలత, మాధవీలత, మల్లెతీగ, కాశీరత్నము, లవంగరత్నము, జూకామల్లె మొదలగునవి.

ఇయ్యవి లతాగృహములకు, చంద్రశాలలకుపాకించి యందమయిన నమోనాలలోనేర్పాటుచేయుచుందురు. ఇవి కేవలము విలాసముకొఱకే గాక, ఆరోగ్యము కొఱకును, నేత్రానందముకొఱకును వేయఁబడుచుండును.

పై నుదహరించిన మూడురకములతోఁటలకుఁ గావలసిన పరిస్థితులు. మొదటిది బాగుగా నీరారుచునట్టియు, ఇవక బట్టనట్టియు loamy సోయిలు అయియుండవలయును.

రెండవది విశేషముగా సత్తువచేయుటకు నానావిధములగు గెత్తములు ఈగెత్తములలో మేఁక, గొఱ్ఱె, గుఱ్ఱము, ఆవుగెత్తములు ముఖ్యములు. పై జంతువుల మూత్రపురీషములను భూమియందు చివకఁబెట్టి బాగుగా చివికినవెనుక గెత్తముక్రింద నుపయోగింపవలయును. ఇంతేగాక యాకులను కుళ్ళబెట్టి 'Leaf mould' అను గెత్తమును తయారుచేయుదురు. దీనికే Ceat అని మఱియొక్కపేరు.

గోలెములలో నీరారుచుటకు గెడ్డయిసుకయు, నెఱ్ఱమట్టినిగూడ సమకూర్పవలయును. వివిధజాతులకు వేఱుపాళ్ళున్నవి గాని సాధారణముగా పై నుదహరించినవి సమానభాగములుగాఁ గలిపి గోలెములలోని కెత్తుట యాచారము. జలాధిక్యతవలన చివకఁబట్టకుండ కొన్నిగోలెములకుఁ గ్రిందరంధ్రములు చేయుటయు, గుళకతేర్చుటకుఁగాను కొన్నిటియడుగున చిల్లిపెంకులు చేర్చుటయుఁ గలదు.

మొక్కలు ముఖ్యముగా ఫలవృక్షములు పాతునపుడు విరివినిబట్టి దూరములు వేరువేరుమొక్కలకు వేరువేరువిధములుగా నేర్పాటుచేయఁబడుచుండవలయును. ఫలవృక్షములకును, పూలమొక్కలకును నీరుపోయుట మొదలగుపనులసౌకర్యార్థము మధ్యమధ్యను క్రమమయినబాట లేర్పాటు చేయఁబడి యుండవలయును. ఫలవృక్షములకుఁ గాక తక్కిన రెండువిధములగు పరిశ్రమలకు Plant Sanitation అత్యంతావసరము.

ప్రధానములయిన తోటపనిముట్లు:— 1 గునపము, 2 పాఱ, 3 తొల్లిక, 4 కత్తెర (Sheering Scissors), 5 చేకత్తి, 6 నీరుపోయుటకు జల్లుబొక్కెన మొదలగునవి.

ఫలవృక్షములను వృద్ధిచేసి ఫలింపఁజేయు విధానము.

మామిడి— అంటుగట్టువిధానము. మామిడిపండ్లలోని టెంకలను చెట్లనీడలక్రింద భూమిని బాగుగా మెత్తపఱచి విరివిగాపోసి దానిని పలుచగామట్టితోఁ గప్పవలయును. వర్షాకాలమునందు తప్ప తక్కిన కాలములయందు దినమువిడిచిదినము నీరుపోయుచుండవలయును. మొక్కవచ్చిన యాఱుమాసములకుఁ జిన్నచిన్న గోలెములలోని కెత్తవలయును. మొక్కలయొక్కకాడ చిటికనవ్రేలంత

దళమునకుఁ జెరిగినతరువాత నది యొకదళముగల చెట్టుకొమ్మతో నంటుఁగట్టవలయును. కారుమొక్కయొక్కయు, అంటుకొమ్మ (scion) యొక్కయు పైపొరలను కేంబియమ్‌పొరలు (Cambium Layers) పైకిఁ గనుపించువరకు సున్నితమయిన, కత్తితోఁగోసి ఏరజాలు గానున్నదినమునందు రెండును గలిపి మైనపుగుడ్డతో బిగించి జాగ్రత్తగాఁ గట్టవలయును. కట్టిన రెండుమూడు మాసముల వఱకుఁ దల్లిచెట్టునుండి సంబంధము తుంపివేయరాదు. అంటుపారినతరువాత కారుమొక్కయు పరిభాగమును తుంపివేయవలయును.

అంటుకట్టుటలో ననేకవిధానములు గలవు. Layering అనఁగా చెట్టునుండి క్రిందికి వ్రేలాడుచున్న కొమ్మను గాని, తీఁగను గాని, భూమిలో పాతి, అది లేచిపోవకుండ ఎత్తుగా బరువైనదిమ్మను గాని రాతినిగాని పెట్టుట. Bud-grafting అనఁగా ఒకేరకములోని (Specier) మొక్కతాలూకు లేతమొగ్గను మఱియొకమొక్కతాలూకు లోపలిపొరలను (Cambium cells) తాకునట్లుచేసి యుంచుట. అట్లు సుమారు రెండునెలలకాలముంచినతరువాత మొగ్గనుండి చిగురుపెట్టుకొనివచ్చును. అప్పుడు మొదటిమొక్కను గోసి వేయవలయును.

'Tongue grafting' అనఁగా నొకేజాతి మొక్కలలో నొకదానికొమ్మలో (V) జివ్వాకారిముగా వివరమునుచేసి, రెండవదాని (ఎం) ఆకారముగా చేయఁబడినవరదలో దానినిజొనిపి యంటుగట్టుట.

'Saddle-grafting' అనఁగా నొకపెద్ద చెట్టుమాత్రకును నఱికి దాని కాంబియమ్‌లేయర్లు గల భాగముచుట్టు కొన్ని స్వజాతికొమ్మలను జొనిపి యంటుగట్టుట.

ఇంకను నంటుగట్టువిధానములు కలవు. అవి తఱచుగా వాడుకలో లేవు.

కొమ్మలు నరికి (Cuttings) పాతి చెట్లు చేయుట, కొమ్మలువంచి యంటుగట్టుటకు సామాన్యముగా నంట్లుచేయుట, ఈపద్ధతికి 'Vegitative Propagation' అనిపేరు. Layering నకు 'Inarching' అనికూడ మరియొకపేరు గలదు.

సాధారణముగా నంట్లుకట్టుట కుపయోగింపఁబడు తల్లిమొక్కలవలన విశేషముగా ఫలములు లభింపవు. తక్కినమొక్కలకుఁగూడ నంటుగట్టు పద్ధతి యిదియేగాని, సపోటాఅంట్లను పాలమొక్కలకుఁ గట్టవలయును. అంటుమొక్కలు వేగముగా ఫలించును. కాయలుపెద్దవికాచును. జాతిచెడదు. కాని కొన్నిసంవత్సరములు మాత్రమే కాచి యావెనుక నశించును.

## పూలమొక్కల పరిశ్రమ.

ఇందులోఁ బ్రధానములై ధనసంపాదన కవకాశ మిచ్చునవి చేమంతి, మల్లెచెట్లు మొదలైనవి.

ఇవికూడ Vegitative Propagation అనువిధానముననే వృద్ధిచేయఁబడును. వేఱువేఱు చెట్లు వేఱువేఱుకాలములందుఁ బుష్పించును. వేసవికాలములో మల్లెలు, వర్షకాలములోఁ బారుజాతములు, శీతకాలములోఁ జేమంతులు విశేషముగాఁ బుష్పించును.

మల్లెలలో ఒంటిరెక్కమల్లె, బొండుమల్లె, పందిరిమల్లె మొదలగు ననేకజాతులు గలవు. బంతులు, చేమంతులు, గులాబీ మొదలగువానిలోఁగూడ పలురకములు గలవు. పుష్పముల రంగును, పరిమళమును ఆయాజాతులనుబట్టియు, శీతోష్ణపరిస్థితులనుబట్టియు, భూసారమునుబట్టియు, పురుషప్రయత్నమునుబట్టియు మారుచుండును.

క్రోటనులు, దమనము, మరువము మొదలగునవికూడ Vegitative Propagation వలననే పెంపొందింపఁ బడును.

మాగ్నొలియసంపెంగ, పొగడ, మొగలి, గన్నేరు మొదలగువానికి Xerophytes అనఁగా నీరంతగా నక్కరలేనివని పేరు.

ఆర్బోరికల్చరుయొక్క ప్రధానోద్దేశము, అందముకొఱకేగావున వేఱువేఱు నమోనాలుతో (designs) పొదరిండ్లయందును, చంద్రశాలలయందును, ప్రమదావనములయందును, వ్రేలఁదీయబడిన గోళెములలోఁ గొన్నియెడలను బెంచఁబడుచుండును.

కాయగూరలనుగూడ పండించువిధాన మీ హార్టికల్చరులోనే చేర్పవచ్చును. ఇందు ధనసంపాదనమే ప్రధానాంశము. కాబేజీ, నూల్ కోల్, టొమెటోస్, వంకాయలు, ఉరలగెడ్డలు మొదలగువానివలన విశేషధనము వచ్చును.

పాదులపరిశ్రమ.

దొండ, పొట్ల, కాకర, బీర మొదలగు కూరపాదులను బెంచుటఁగూడ హార్టికల్చర్లోనిదేయగును. ఇందును ద్రవ్యమే ప్రధానాంశము.

చిత్త, చీడ, మిడత, ఆకుతేలు, వేఱుపురుగులు మొదలగునవి మొక్కజాతికి తరుచుగా సంభవించుచుండురోగములు. వీనిని మైలతుత్తపునీటివలనను, బోర్డోమిక్చరు అనఁబడు నొకవిధమగు ద్రావకసహాయమునను, చేఁపసబ్బు (Fish oil soap) వల్లను నిర్మూలము చేయవలయును. చిత్తరోగము పొయ్యిబుగ్గివలన కుదురునని కొందరు నమ్ముచున్నారు. Plant Sanitation వలగూడ క్రిమివ్యాప్తి తగ్గింపవచ్చును.



## హార్దిక్యుఁడు (కృతవర్మ):—

యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. కృతవర్మయని నామాంతరముగలవాఁడు.

(కృతవర్మ చూడుఁడు.)

## హార్డువాటరు, సాఫ్టువాటరు [జలములు]:—

'Hard water' అనంబడు జలములందుఁ గొన్ని lime salts కరఁగియుంటనందు సబ్బులు desolve కానేరవు. కాని వీటిని దాహోదకముగ నుపయోగించుట శ్రేయమని చెప్పఁబడినది. Soft water నం దా salts ఉండమి నందు సబ్బుబిళ్ళలు సులభముగ desolve అయ్యెడిని.

## హార్సుచెస్టునట్-చెస్టునట్ హార్సు

(Horse Chestnut and a Chestnut horse):—పైకి సంబంధము గన్పించుచున్నను నిజమున కేసంబంధము లేదని తెల్పుటకీయుక్తిని వాడుచున్నారు. పదము లొకటిగనే యున్నను, మొదటిదొక యడవిజాతి కాయలోని పిక్కయు, రెండవది యొకజాతిగుఱ్ఱమునునై యున్నవి

ఒకప్పుడు పార్లమెంటుమహాసభయందు 'montague matthieus' అనియు 'matthew montague' అనియు నిద్దరుసభ్యు లుండిరట. వేరొకగ్రహస్తు పొరపాటుగ నొకరింగూర్చి యనునది వేరొకరింగూర్చి యన నాతండు దాని నెదుర్చుచు పేర్లు కొంతసంబంధము ప్రదర్శించుచున్నను నవి నిజమునకు horse chestnut & chestnut horse లకుఁగల యంతభేదమున్నదని వచించి యందరిని నవ్వించెనట. నాఁడాదిగ నీయుక్తి వాడుకనందెను.

**హార్సుపవర్ (Horse power):—** యంత్రములబలము గుఱ్ఱములబలముతోఁ బోల్చి కొలుచుట (చూడుఁడు).

**హార్సుపవర్:—** నీటియావిరి (steam) విద్యుచ్ఛక్తి (electricity) మొదలగు 'ఎనర్జి' (energy)ని కొలుచులెక్కకు 'పవర్' (power) అనుచుందురు. ఆపవర్ ఇంగ్లాండుదేశమున నేర్పడినలెక్కమేరకు 'హార్సుపవర్' అనునామమున భరతదేశమునందు వాడుకనందియున్నది. అట్లు వాడఁబడుచున్నను దానికి గుఱ్ఱముతోనే సంబంధము లేదు. దానిపూర్వకథనము వివరింతుము గాక.

ఆదిని బ్రిటీషుసీమలందు బరువులనెత్తుట, మోయుట, వ్యవసాయముచేయుట మొదలగు పనులకు గుఱ్ఱములే వాడఁబడుచుంట నాదేశములందు గుఱ్ఱము ప్రతికార్యమునకు ప్రధానజంతువుగా పరిగణింపఁబడుచుండెడిది. అక్కాలమున crane యంత్రములు బరువులనెత్తు magnet యంత్రములు లేకుండెను. పిదప నక్కాలపువాఁడగు James walt అనుపేరుగల పండితుఁడు గొప్పగొప్పపరిశీలనల నొనర్చి, బరువుల నెత్తుటకు యంత్రిసాధనములం గన్పట్టెను. ఆబుద్ధిశాలి సర్వసాధారణ పరిస్థితులందు Dry-horses బలముగు జంతువులుగ నెన్నఁబడుచుండె గాన నయ్యవి యెంతబరువు నెత్తఁగల్గినవో యొకలెక్కఁ గుదిర్చెను. ఒకగుఱ్ఱము సెకెండునందు ౫౫౦ ఫూట్ పౌనుల బరు వెత్తఁగల్గెనని నిర్ణయించెను. ఇట్లనుటయం దొకగుఱ్ఱ మొకసెకండునందు ౫౫౦ పౌనులబరువు నొక యడుగెత్తున కెత్తఁగలదని భావము. ఇందువలన నొకమినుటునకు 33000 పౌనులుగ తేలుచున్నది. ఇది కేవలము నిర్ణయింపఁబడిన లెక్కయేగాని యిందు తేడా నిజమున నాచరించుటయందుఁ గల్గునని తోచకపోదు. గాని యటులనే వాడుకనంది నెల్లరు పాటించిరట. నేఁటికిని పాటించుచునే యున్నారు.

పిదప వాడుకలో నీలెక్కయం దంతర్భేదము లేర్పడియెంట. Indicated horse power. 'ఇండికేటెడ్ హార్సుపవ' రనంబడుచున్న లెక్క ఎంజినుయొక్క పిస్టన్ (piston) నం దుపయోగింపఁబడిన ఎనర్జియొక్కలెక్క. ఇందు కొంత ఎనర్జి ఎంజినును నడపుటయందు వినియోగమైపోయి తక్కినది యంత్రిభాగ పరికరముల నడపి పనిం బూర్తియగునటులఁ జేయుట కుపయోగించుచుండును. అద్దానిని 'బ్రేకు హార్సు పవ' రనియు, actual effecter horse power అనియు, పేరంది వాడఁ బడుచున్నది. ఇదియే నిజమున ఎంజిను లేక మోటారులనడుప నుపయోగించు ఎనర్జి (power) గా నున్నది. ఇఁక ఎలక్ట్రిక్ హార్సుపవరు మెకానికల్ హార్సుపవరే; దానితో సమానముగనుండునదియే. అం దొకహార్సుపవరు ౭౪౬ వాట్సుగా నెన్నఁ బడుచున్నది. ఈసందర్భమున 'వాట్' అనునది ఆపరిశీలకునిపే రిడంబడిన లెక్క యని యెల్ల రెఱింగినదే. అది యొక వోల్టు (Volt) ఒత్తిడి (pressure) క్రింద తేఁబడిన లేక ప్రవహించిన యొక ఏంపైర్ (ampere) మొత్తమని యెఱుంగవలయును. ఈలెక్క నేఁటికిని వాడుకయం దున్నది.

**హార్సుపవర్ (Horse power):—** వాణిజ్యసంబంధ పరిభాషాపదము స్టీము యంత్రములను గుఱ్ఱముబలముతో కొలిచెదరు. అట్టి

unitకు ఈపేరు వర్తించును. (గుఱ్ఱముబలముతో యంత్రములం గొలుచువిధానముం జూడుఁడు).

## హార్మోనియము-సంగీతపుపెట్టె:—

దీనిని Alexandre debain గారు కనిపెట్టిరని తెలియుచున్నది. వీరు క్రీ. వె. ౧౮౦౯ మొదలు ౧౮౭౭ వఱకు జీవించినవారు.

(సంగీతశాస్త్రము, వీణ చూడుఁడు).

## హాలండుదేశము [నెదర్లాండ్సు]:—

ఐరోపాఖండమునందలి దేశము. హాలం డనిన పల్లపుభూమిదేశమని యర్థము. క్రీ. వె. ౧౮౧౫ నుండి దీనికి నెదర్లాండ్సు అనిపేరు వాడుకయయ్యెను. నెదర్లాండ్సుఅనిన పల్లపుకొంటీలని యర్థము. ౧౨,౬౫౦ చతురపుమైళ్ళ వైశాల్యముగల దేశము. పల్లముగానుండు సమతలప్రదేశము. సముద్రముతట్టుప్రదేశములు సముద్రపు నీటిమట్టముకంటె పల్లముగా నుంట వాటిని గట్టుపోసి సముద్రమునాపి నిలిపియుంచియున్నారు. వాటికీదేశమున 'dykes' అనెదరు. ఇవి గాక చతురంగపాళిగళ్ళంబోలి కాల్వలుత్రవ్వి వాటిగుండా ఊరినీటిని 'wind mells' అనంబడుగాలిపంపులతో పైకిఁ దోడి సముద్రమునందు పోయునేర్పాటులం జేసియున్నారు. రైనునది, మేస్‌నది, షెల్టునదులయొక్క దిగువభాగము లీదేశముల గుండా నడచి సముద్రమునం జేరుచున్నవి. ఉత్తర ప్రదేశమున జూడర్జీ (దక్షిణసముద్రము) కల దిది భూమిలోనికిం జొచ్చుకొనివచ్చిన సముద్రపుచెలక. ఇది సరస్సువలెనే యుండును. లోతధికముగా లేనిది. దీనిని సముద్రపుతట్టు dykes నిర్మించి, బంధించి లోననుండునీటి నవ్వలికిఁ దోడివైచి భూమిగా మార్చుప్రయత్నమును కొన్ని సంవత్సరములుగ ప్రభుత్వమువా రొనర్చుచున్నను నిది గొప్పపనియగుట నింకను చిరకాలముపట్టునని తలంపఁబడుచున్నది. ఇక్కాలమున జూడర్జీనుండి నార్తుసీకి పోవీలుకలదు. క్రీ. వె. పదమూఁడవశతాబ్దమునఁగల్గిన నీటిముంపు లిట్లుచేసెనని తలంపఁబడుచున్నది.

హాలండునందు రైనునదిడెల్టా చేరియున్నది. రైనునది ఆడెల్టాగుండా సముద్రమున కరుగు ముఖ్యమగుప్రవాహమునకు 'వాల్' అని పేరు. అదియే ముఖద్వారముగ నున్నది

హాలండునం దనేకద్వీపములు చేరియున్నవి. అందు పెద్దవి ముఖ్యములైనవి Walcheren ద్వీపము, Beveland ద్వీపము, Texel ద్వీపమునై యున్నవి. ఇందు మొదటిరెండు దక్షిణమునను మూఁడవది యుత్తరమునను గలవు. ఇది చలిదేశము. శీతకాలమున కాల్వలు, నదులు ఘనీభవించెడిని. అక్తరి మంచుపై స్లెడ్జిలలో పోవుచుందురు. అప్పుడు skating సర్వసాధారణమై గాననగుచుండును. దేశమునందలి తంపరలను నీరుతోడి మెరకచేయుటవలన బయల్పడినభూమి బలమైన గోగ్రాసము నిచ్చుచుంట దేశమున గోసమృద్ధి గలదు. వాటిపాలను Chese ఉండలుగా చేసి దేశదేశముల కమ్ముచుజేతురు. గాన దేశమునందలి పశువు లభివృద్ధింజెందియున్నవి. ఎక్కువపాలిచ్చు ప్రశస్తమైన జాతియావులు కలవు. చేఁపలంబట్టుటయు నొకవృత్తిగనే యున్నది. ఈదేశమున వంటచెఱకున కడవులు చాలవు. రాక్షసబొగ్గితరదేశములనుండి రావలయుంగాన చాలా ప్రియము. ఈదేశముననే గ్రోనింజప్పురప్రాంతములభూమి యందు దొరకుపీటముంపలచీలికల నెండించికాల్చుచుందురు.

భూములు చౌకునేలలగుట నిసుపజాటు లధిక ముగా వేయఁబడినను అందు మనుష్యులబండ్లే నడపుచున్నారు. వర్తకఁపుసరకులను కాల్వలపై పడవలలో పంపుచుందురు. హాలండుదేశఁపుఁ బ్రజలను డచ్చివారని పిలుచువాడుక గలదు. మనదేశస్థులు 'ఒళాందావా'రనియు ననుట కలదు. ఇది హాలండుశబ్ద సంబంధపదము. డచ్చివారు జన్మతః వర్తకపు నిపుణతల నెఱింగిన విద్యా పరిపూర్ణులుగ నుందురు. సముద్రమున నోడల నడపునేర్పునం దారితేరినవారు. శరీరపరిశుద్ధత, గృహపరిశుభ్రత వారిసొమ్ము. నిర్మలాంతఃకరణ ముగలవారు. అతిధైర్యవంతులు. అతిసాహసులు. కృపణవృత్తి నెఱుంగనివారు. రోమన్కాతలిక్కు క్రైస్తవులుగ గొందఱును, ప్రొటస్టాంటు క్రైస్తవులుగ గొందఱును నున్నారు.

## పట్టణములు

ఆమ్స్టర్డామ్‌పురము—దేశమున ప్రభుత్వకార్యాలయస్థానము గలది. గొప్పవర్తకస్థలము. వజ్రములకోతకు పేరందినపురము. డచ్చిపనివాండ్రు కోసినవజ్రములు పూవులకవలములు గాక పలకలవలె నుండి పైనిముఖములం గల్గియుంట నాంధ్రదేశమున వీటిని 'బళాందవజ్రము' లనియు 'బళాందపరువు' లనియు, పలకలనియు ననుచుందురు.

అమ్స్టెలునదీముఖద్వారమునందు కట్టఁబడిన పురము. అనేకవీధులలో నీటికాల్వలు గలవు. నేల చౌకునేల యగుట బురదలో కఱ్ఱలం దిగఁ గొట్టి వాటిపైనుండి కట్టబడిన యిండ్లు వెన్నీసు నగరము (ఇటలీ) నందువలెనే యుండును. అమ్స్టెలునది జూడర్జీయందు సంగమించుచున్నది. ఇట నుండి నార్తుసీ (జర్మనోషను) లోని గొప్పయోడల కాలువ గలదు.

హార్లెమ్‌పురము—ఈప్రాంతములఁగల టూలిప్ లవ్యవసాయమునుండి పేరుప్రతిష్ఠలం గాంచినపురము. ఇవి చెంగలువవంటిమంప (పాయ) నుండి జనించుచెట్లు. వేలకొలదిజాతులు కలవు. కొన్ని యెక్కువవిలువగల జాతులును గలవు.

లైడెన్పురము—రైనునదీతీరము. విశ్వవిద్యాలయమున్నపురము.

ఉట్రెక్ట్‌పురము—రైనునదీతీరమున విశ్వవిద్యాలయమున్నపురము. ఇట నొకసంధిపత్రముపుట్టెను

గ్రోనింజన్‌పురము—విశ్వవిద్యాలయస్థానము. పీటమంపలవంటి చెఱకువర్తకము గలదు.

హాగుపురము—రాజధాని. చక్కనిపట్టణము.

రోటర్డమ్‌పురము—మాస్నదీతీరము. వర్తకస్థలము.

డచ్చిప్రభుత్వమువారికి ఓసీనియా యందు జావాద్వీపము, మొలుక్కాద్వీపము, సుమత్రాద్వీపమునందలి భాగము, బోర్నియోద్వీపము, సెలిబీసు ద్వీపము, న్యూగినియా ద్వీపములోని భాగము (డచ్చిగినియా); సురినామ్‌ద్వీపమును, కొలనీలుకలవు. ఇవి యన్నియుంగలసి 2,73,000 చతురపుమైళ్ళ వైశాల్యము. (ఐరోపాఖండము చూడుఁడు).

## హాలాస్యక్షేత్రము [దక్షిణమధుర]:-

దక్షిణమధురాపురమును హాలాస్యక్షేత్రమందురు. ఇట సుప్రసిద్ధములగు సుందరేశ్వరశివలింగమును, మీనాక్షీదేవీస్థానమును గలవు. గొప్పధనవంత

మగు దేవస్థానము. మధుర విఘరస (ఇప్పటి వైఘై) నదీతీరము. ఇటతిరుమలనాయకునిభవనము చూడఁదగినది. మధుర తొల్లి పాడ్య దేశమునకు నాయకభూపతులనాఁడు రాజధానిగ నుండెను. ఇం దనేకచిత్రవిచిత్రపనితనముగల మంటపములు గలవు. చెన్న రాజధానియందు చెన్నపురికిఁబిదప మధుర యొక్కవజరసంఖ్యగల నగరమని చెప్పఁబడినది.

## హాలేయగోత్రము:—

(అత్రిపుత్రికాపుత్రులగణము చూడుఁడు).

## హాలేయగోత్రము:—

(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు).

## హాలోహరగోత్రము:—

(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

## హాల్వెల్ జ్ఞాపకచిహ్నము:—

(కలకత్తాచీకటికొట్టు చూడుఁడు).

## హాల్ ఆప్ ఫేమ్ (Hall of Fame):-

అమెరికాసంయుక్తరాష్ట్రములందలి న్యూయార్కు విశ్వవిద్యాలయము వారిపరముగ ౨౫౦౦౦౦ డోలరుల ద్రవ్యము నిచ్చి యీభవనము నిర్మింప నేర్పఱచిరి. అం దమెరికాదేశస్థులగు నూటయేబది మంది పేరందిన గొప్పవారినామములను చిరస్థాయిగ నుండునటుల నాసావడియందు ౧౫౦ ఫలకములను (panels) ఉంచఁగోరిరట. అవి యెన్మిది యడుగులపొడవును రెండడుగులవెడలుపును గల్గి యుండునటుల విధించిరట. ఆపేళ్లు (గలవారిని) గ్రంథకర్తలు, క్రొత్తవాటింగన్పెట్టినవారు (inventors), క్రొత్తప్రదేశములంగన్పెట్టినవారు (explorers) చిత్రకారులు (artists), రాజకీయవేత్తలు (statesmen), మొదలగు పదునేను భేదతరగతులవారుగ నుండవలెననియు, నేర్పాటులు గలవట. ఏఁబదిపేరు లెన్నుకొనంబడి ప్రతి ఐదేండ్లకై దేసిపేరులు చేర్పంబడుచుండ నేర్పరిచిరట. ఇదివఱకే జార్జివాషింగ్టన్, బెంజామిన్‌ఫ్రాంక్లిన్, హేరియట్‌బీచర్‌స్టౌవ్ అబ్రహాంలింకన్ మొదలగువార్ల పేరుల ఫలకములుంచియున్నారట.

## హాల్ మార్కు (Hall marks):—

వాణిజ్యసంబంధపరిభాషాపదము. వెండి బంగారు వస్తువులపై వేయఁబడుగురుతులు. ఇవి లోహముయొక్క నమ్మకము తొల్లింటికాలమునఁ దెలుపునవిగ నుండెను. ఇక్కాలమున వాడుకయే గాని యంతగా ప్రచారమున లేదు.

## హవాయి [తొల్లింటి సాండ్విచ్] ద్వీపములు:—

పసిఫిక్కుమహాసముద్రమునఁగల ద్వీపములు. అమెరికాసంయుక్తరాష్ట్రములవారికిం జెందిన టెరిటరీగా నున్నవి. మొత్తము ౬౪౦౭ చతురఁపుమైళ్ళ వైశాల్యముగలవి.

ఇందు తొమ్మిది నివాసస్థలములుగ నున్నవి. అవి ౧ హవాయిద్వీపము లేక ఓవహీద్వీపము, ౨ మాయిద్వీపము, ౩ ఓఆహుద్వీపము, ౪ మొలోకైద్వీపము, ౫ కౌఆయిద్వీపము, ౬ లానాయిద్వీపము, ౭ నీహావుద్వీపము, ౮ కాహూలవుయిద్వీపము, ౯ కౌలాద్వీపము.

హవాయిద్వీపమునందున్న హిలో పట్టణము ప్రధాననగరము. హనోలూలూ రేవుపట్టణము,

కచేరీస్థానము. మాల్టోకై ద్వీపమున కుష్ఠురోగులకాశ్రమ మొకటి ౧౮౬౫ లో ఏర్పఱుపఁబడినది.

**హాస్పిజసీ :—**
(గ్యాస్పిజన్సీలు చూడుఁడు).

**హావీద్వీపము (Hawice):—** (సాండ్విచ్ ద్వీపములు, పోలినేసియా ద్వీపములు, ఓసీనియా చూడుఁడు).

**హాస్ పీస్ [ధర్మశాల]:—** వీటిని 'House of rest and refuge for travellers maintained by religeous houtes' అని నిర్వచించియున్నారు. ఇట్టివి అల్ఫ్సుపర్వత మార్గములందు monks ఏర్పఱచి నడపుచున్నవి కలవు. కొందరు గృహస్థులును ధర్మకార్యముగ నేర్పఱచియుంట నాప్రాంతసీమలందుఁగాన నయ్యెడిని. సెంటుబార్నార్డు నిట్టిదియే. ఇది క్రీ. వె. ౯౬౨ లో నేర్పడినది.

**హాసలాయనగోత్రము:—**
(నిధ్రువగణము చూడుఁడు.)

**హాస్యగానికి తేలుకుడితే హాస్యం క్రింద పోతుంది:—**
[ఆంధ్రలోకోక్తి].

**హాస్యగోత్రము:—**
[నిధ్రువగణము చూడుఁడు].

**హ్రితాృయువిగోత్రము:—**
[గర్గ ఉపగణము చూడుఁడు.]

**హ్లాదినీనది:—** తూర్పున శతధృ (శెట్లజ్) నది, పశ్చిమమున కేకయదేశము హద్దులుగాఁగల మధ్యదేశముగుండా ప్రవహించెడినదిగాఁ జెప్పఁబడినది.

భరతుఁడు కేకయమునుండి యయోధ్యకేగుచు నీనదిందాఁటెనని రామాయణము అయోధ్యాకాండము ౭౧ యందుఁ జెప్పఁబడినది.

**హింగ్గీతమాకు:—** ఇది యొకజాతిపొగాకు. ఘాటు తక్కువగానుండునది.
(జార్డాపరిశ్రమ చూడుఁడు).

**హింగుళాదేవీక్షేత్రము:—** (కూర్మాచల దేశము చూడుడు— బాలోకుదేశము, బెలూచిస్థాన్, చూడుఁడు).

**హింటర్లాండు (Hinter Land):—** ఆఫ్రికాఖండమున పశ్చిమభాగముగ 'పశ్చిమ ఆఫ్రికా' యనంబడుభాగమున సముద్రతీరఁపు భూము లేమైరోపాదేశస్థులకుఁజెందినవో వారికే దానికితిన్నగా లోనకేగుభూమియుఁ జెందవలయునని యనుచున్నారు. లోనికేగుభూప్రదేశమున కీసందర్భమున 'Hinter land' అని పేరిడియున్నారు.

ఇట్లే స్పానిష్ వెస్టాఫ్రికా (సముద్రతీరము)కు తిన్నగా సహారాఎడారివఱకుఁగల లోపలి ప్రదేశము వారి 'హింటర్లాం' డనఁబడుచున్నది.

**హింతాలము:—**
(నీలతాళము చూడుఁడు.)

**హిందీభాష (చతుర్విధము):—**

౧ వ్రజభాష—ఇది ఛాందోబద్ధమై శృంగారరసముచు వివరింప నుపయోగింపఁబడెడిని. కొందరు దీనిని వ్ణసలచు వివరించుటయందు వాడుటయుం గలదు. పెక్కండ్రు గాడభక్తి

నీవ్రజభాషయందే వాడిరి. తులసీదాసురామాయణమున నిట్టివర్ణనలు భక్తియుఁ దెలుపఁబడినవి.

౨ బుందేల్ఖండీ—ఇది బుందేలుఖండ (బందేలుఖండ) నివాసులయందు ప్రచారమందియుండినభాష. ఇది యిక్కాలమున కవులచే వాడఁబడు గ్రాంథిక భాషయైయున్నది. అమ్యల కభేద్యము.

౩ బైసేవారి—ఇది నవరసములను వ్యక్తీకరించు భాష. వచనము ఇందే తొలుత హిందీభాషయందు ప్రారంభింపఁబడినదట. ఇం దన్య వ్యక్తిత్వము, భాషాబలము, ధ్వనివిశేషములు, నుపమానములు మున్నగునవి విపులముగ వ్యక్తీకరింప సామర్థ్యతగలదిగ తలంపఁబడుచున్నది. దీనిప్రవక్తృక్త బొలన్నభట్టు.

౪ భోజపురి—దీనియం దన్యభాషాపదము లెక్కువగఁ జేరిపోయి యుంట పరిశుద్ధభాషగ నెన్నఁబడదు. దీని కిక్కాలమున ప్రచారము తక్కువగఁగూడ నైయున్నది. భోజవంశనృపతుల రాజధానిపురియందు వాడఁబడుట నిట్టిపేరందెనందురు.

హిందీభాషయం దాదిగ్రంథములుగ 'పద్మావత్' అను గ్రంథమును, 'పృథ్వీరాజరాయస' యను గ్రంథమును నెన్నఁబడెడివి. రెండవగ్రంథమునకుఁ 'అల్హాఖండ్' అనియుఁ బేరుఁ గలదు. మరియుఁ గొందరీ 'పద్మావత్' ఉచ్చగ్రంథమనియు 'అల్హాఖండడ్' ను నీచగ్రంథమనియు నుడివియున్నారు.

## హిందుస్థానదేశపు (హిందీభాష) సామెతలు:—

అజ్ఞానికి సైతము ఆకలి కడుపునింపుట తెలుస్తవి.

ఇంటిలో కందిరీగ దూరితే ఇల్లు కాల్చుకుంటూరా?

ఇతరులసాహాయ్య మపేక్షించువాఁడు దీనుఁడై యుండుట తప్పదు.

ఉడతగారినివాసం ఉన్నచెట్టుకొమ్మలలోనే.

ఎక్కడ సాయంత్రమయితే అక్కడే తురకపకీరుకు ముసాఫరుఖానా.

ఎవ్వరికి శాన్తికలదో వారే దేవునియనుగ్రహమునకుఁ బాత్రులు.

ఒకమౌనము నూరుమాటలం జయించగలదు.

ఒక్కడైతే ఏకాకి; ఇద్దరైతే సహవాసము.

ఒడలియందలిక్రొవ్వు కండ్లను గప్పివేయును.

కండ్లకు రెప్పలు బరువా?

కాలము ఆలస్యమునకు లోబడునది కాదు.

కూంతురు, అల్లుఁడు, మేనల్లుఁడు, మేనకోడలు, తనవారు కారు.

కోపము గుణదోషములం బాటించునదికాదు.

గుడ్లను అమ్మకపోతే కోడిపిల్లలు కావలసినన్ని.

గ్రుడ్డివాళ్లు పరిగెత్తఁగూడదు.

గోడలకుకూడా మాటలు వినఁబడుతాయి.

డబ్బు తనదికాకపోతే దానాలు చాలాచేయవచ్చును.

దొంగలందరూ ఒకరికొకరు సోదర్లే.

దెయ్యము దెబ్బతో పారిపోతుంది.

దైవసంకల్ప మనుకూలించిన సర్వం జయమే.

ధనము జగత్తును నడిపించ తాళిగలది.

ధైర్యము మనుష్యుల కాభరణము.

పనినసుసరించే జీతము.

పిల్లికి కలలో కనిపించేవి పాలకుండలే.

పిల్లి పులికి మేనమామో, మేనత్తో.

పెండ్లిఅయినరోజులు పెండ్లికొడుకు రాపు వాఁడు.

పోగొట్టుకొనుటవలన జాగ్రత నేర్చుకోవల వలయును.

బుద్ధిమంతుఁడగు శత్రువు బుద్ధిహీనుఁడగు స్నేహితునికన్న మెరవడియే.

మంచివారికి లోకమంతయు మంచే.

మత్తు, నిద్ర, ఆవులింతలు మరణానికి సవతి తమ్ములు.

మనుష్యులను పరిచయమువలనను, మంగలిని క్షౌరమువలనను, బంగారమును గీటుకాల్పులవల నను నాణ్యము చేయవలసినదే.

మనుష్యులందరితలపైని మంగలిచెయ్యి.

మిఠాయి యెంతవంకరగానున్నా తియ్యగానే ఉంటుంది.

మూన మర్థాంగీకారము.

యుద్ధములో మిఠాయి పంచిపెట్టరు.

సూర్యునిపై బుగ్గిజల్లితే తనమీఁదే పడుతుంది.

## హిందూకుష్ పర్వతము:—

అఫ్ఘనుస్థానమున కొంతయు, నుత్తరమున బదక్షాన్‌సీమయు, దక్షిణమున కాఫిరిస్థాన్ సీమలనడుమగా కొంతయుఁ గల్గి యైదువందలమైళ్ళ పొడవున వ్యాపించియున్న పర్వతపంక్తి. దీనియం దనేకశిఖరములు కలవు. అందు కొన్ని 20000 అడుగుల మెత్తుగలవి కూడఁ గలవు.

## హిందూదేశము:—

(భరతదేశము చూడుఁడు).

## హిందూమహాసముద్రము (Indian Ocean):—

ఇండియానుండి పేరందినమహాసముద్రము. దానికి దక్షిణమున నున్నది. భరతదేశపు దక్షిణపుకొన (India's lands end) నున్న కన్యాకుమారి అగ్రమునుండి దక్షిణమునకు నలుబదిడిగ్రీలదనుక వ్యాపించియున్నదని కొందఱును, దక్షిణధ్రువమహాసముద్రముదనుక వ్యాపించియున్నదని కొందఱును పరిశీలకు లభిప్రాయభేదములం గల్గియున్నారు. కన్యాకుమారి అగ్రముకడనే బంగాళాఘాతమును, అరేబియా (పశ్చిమ) సముద్రముఁ, ననఁగా పూర్వపశ్చిమసముద్రములు దక్షిణసముద్రముతోఁ గలియును. గాన నిది గొప్పస్నానతీర్థముగ నున్నది. కన్యాకుమారి దేవస్థానమిచటనే కలదు. దీనివైశాల్యము దక్షిణధ్రువసముద్రముదనుక నగునేని ఇరువదియాఱు మిలియనుల చతురపుమైళ్ళును, నలువదిడిగ్రీల ప్రదేశముదనుక నగునేని పదునేడు మిలియనుల చతురపుమైళ్ళును వైశాల్యముఁ గల్గియుండెడిని.

భరతదేశపుదక్షిణపు కొననుండి దక్షిణధ్రువసముద్రముదనుక నొకగట్టువలె సముద్రము కొంత లోతు తక్కువయై యుండును. ఈగట్టునంటియును దాని కిరుప్రక్కలను మాలాద్వీపసముదాయము (maldives), చాగోద్వీపములు, న్యూఅమ్స్టర్డామ్ ద్వీపము, కెర్గూయెలెన్‌ద్వీపసమూహమును గలవు. దీనినుండియేచీలిన వేఱు శాఖపై కొంతపశ్చిమముగా సైఛెలీస్‌ద్వీపములున్నవి.

సింహలద్వీపము, సోకోత్రాద్వీపము, మెడగాస్కరుద్వీపము, Continental iles అనంబడుచున్నవి. మూరిటియసుద్వీపము, నూరోప్రెట్టుద్వీపములును నిందున్న యగ్నిపర్వతములు. తక్కినద్వీపములందుఁ బెక్కులు పగడపుచట్టు ద్వీపములే. (అటోల్సు చూడుఁడు).

బంగాళాఖాత మనంబడు పూర్వసముద్రమును, అరేబియసీ యనంబడుచున్న పశ్చిమ

సముద్రమును, మన్నారు సింధుశాఖ, ఏడమ్సు భానల్ దీనిశాఖలే.

**హింసః**— (౧) నిరృతికూఁతురు. అధర్మునిభార్య. (౨) ఒకరిని నొప్పించుట.

**హింస, అహింస, ధర్మములు:**—ఇటీవల భరతదేశమున నహింసాధర్మమునకుఁ గర్తయు ప్రవక్తయు ప్రతిపాదకుండును ప్రచారకుండును గంధీమహాత్ముం డనియే కాంగ్రెస్‌పక్షమువా రను చున్నారు. ఇది యన్య దేశములం దెట్లున్నదో భరతదేశమునఁ దొల్లింట యెట్లుండినదో వివరించుట యాంధ్రవిజ్ఞానమునకు సమంజసము.

బుద్ధభగవానుఁడు తనమతమున కహింసాధర్మము మూలధర్మ మనెను. ఇది క్రీస్తుప్రభువు జన్మించుటకుఁ బూర్వమే భరతదేశమున వాడుకయందుండినమాట. ఆకాలముననో, దానిపూర్వముననో, యించుక పరముననో గాని, చీనాదేశమునందు లావోట్జ్ యనుమహాత్ముఁ డొకఁడు తనబోధనలను 'టావోటీకిఁగ్' అను నొక చిన్న గ్రంథముగ రచించుచు నందు నీధర్మమును వివరించెను దానికి 'సన్మార్గ'మని యర్థమట. వాటికి 'వ్రాదీమై' ధర్మములని యాయనయే పేరిడెను. వాటికి సుప్రసిద్ధుండగు Rev. C. F. Andrews పండితుఁడు 'Nonassertion' ధర్మములని యనువదించెను. అవి (౧) సన్మార్గమైత్రి గల యాచరణలు. దుఃఖప్రతిఫల బాధకరకృత్యములు కాఁజాలవు, (౨) బాధకరమగు విజయధాటి దుఃఖముగ పరిణమించి ముగియుచుండును. (౩) హింసాపరికరౌన్నత్యము మానవక్లేశౌన్నత్యమనందగును. ఇట్టిధర్మములు చీనాదేశభాషానుగుణ్యముగ సర్వాపదములచేఁ గూర్పంబడి యున్నవి. పాలస్తినాదేశపు జెరూసలెము నగరమున 'ఇసయా' ప్రవక్త కొన్ని యహింసాధర్మములను ప్రవచించెను. వాటిని క్రైస్తవు లేకగ్రీవముగ క్రీస్తుప్రభువుం గురిజూపి గౌరవించుచుండిరి. అవి ముఖ్యముగ ప్రజలయం దన్యోన్యాచరణీయధర్మములుగా నున్నవి. మఱియుఁదొల్లింట గ్రీకుల నాగరికతకు ప్లేటోపండితుఁడు (౧) అన్యాయాచరణము అన్యాయానుభవముకన్న నధమమనియు, (౨) అన్యాయముగా హత్యఁగావింపఁబడిన వానిం గూర్చి కనికరమందుట సరియేయైనను, నట్టిహత్యం గావించిన హంతకునిం గూర్చి యెక్కువ కనికరమందుట తగుననియు, (అనఁగా హత్యగావింపఁబడిన వారికిఁ గొంతధన్యత కలదుగాని, హంతకున కట్టిధన్యత లేదనిభావము) (3) హత్యకులోనై చచ్చుటకన్న హత్యగావించుట యధికమగుసిగ్గున కాస్పదమనియు, ఆకాలఁపు గ్రీకులకుఁ బోధించియుండెను. ఈప్లేటోగారి బోధనల నుదాహరించుచు డాక్టరు whitehead పండితుఁడు తన 'Adventures of Idias' అను పుస్తకమున నహింసను 'Victorey of Devine persuation over the Force' అని పేరిడి యున్నాఁడు. అనఁగా ప్రశాంతవృత్తి కనువగు క్షమకు 'Devine persuation' అనియు, నపరాధమునకు ప్రతిహింసకు 'Force' అనియు పేరిడియున్నట్లు స్ఫురించెడిని. ఇవి యన్యుల యహింసాశబ్దార్థములు. ఇంక భరతదేశమందలి యాదికాలఁపు ఋషుల యభిమతము తెలుపుదుముగాక. 'అహింసా పరమోధర్మః' యను ఉక్తినుండియే యహింసాధర్మమునుగూడ స్ఫురించెడిని. అహింసంగూర్చి వదలి హింసాధర్మముం గూర్చి యోచింతము.

సుప్రసిద్ధవ్యాసరచనాచతురుఁడగు Rev. C. F. Andrews గా రలహాబాదుపురమునఁ గూడిన all India Philosophic congress మహాసభయం దుపన్యసించుచు హింసాధర్మముం గూర్చి Short cnt of Violence Appears to be all attractive' అనియు, 'success seems to be so near espicial in youth' అనియు వచించియున్నాఁడు. ఇందునుండి యాయనదృక్పథమున భరతదేశపు హింసాధర్మము లేనేలేదనిస్పష్టమగుచునేయున్నది. వేఱొకతరి వారే గాంధీమహాత్మునింగూర్చి ప్రశంసించుచు 'world philosophy behind him which has proved amazingly true by its results' అనియున్నారు. అది వారియందుఁ గల గౌరవాధిక్యతను పాక్షికాభిమానమును సూచించును గాని భరతదేశఁపు నిజతత్వమగు హింసాధర్మ అహింసాధర్మములం గూర్చి కానేరదు. భరతదేశమున నిక్కాలమున గాంధీమహాత్మబోధిత అహింసాధర్మము భరతదేశఁపుఁ బూర్వధర్మము గాదని తేలుచుంట నద్దానింగూర్చి వివరించి ముంగింతుముగాక.

భరతదేశదృష్ట్యా హింసాధర్మమునకుం గూడ తావు కలదు. విరోధివలన బాధకలుగకుండ వానిని శిక్షించుట హింసాధర్మము. రాజమండలి ప్రజారక్షణ, దుష్టశిక్షణము, సాధురక్షణములు హింస అహింసా ధర్మయుతములు. అవసరమగుతరి స్వరాజ్యక్షేమమునకు పరులతో సంగరము హింసయైనను, ధర్మమేయగును. ఇట్టితరి నహింస ప్రమాదకరము నష్టదాయకము నగును.

తనను బాధించినవానిపట్ల దురహంకృతి (కోపము-పగ) మాని, యోర్చి, యాకూ్రరునిమదికి భయము, కనికరము, విరక్తిం దోఁపఁజేసి, యిక ముం దెవ్వరిని బాధింప సాహసింపనివానిగఁ జేయుట యహింస యయ్యెడిని. వీటిని నడుపుటకు దేశ కాల పాత్ర పరిస్థితులంబట్టి విధి నెఱుంగవలయునని భరతదేశఁపు దండనీతి మొదలగు ధర్మవిధు లెఱుంగఁజేసెడిని.

## హికస్మరిగోత్రము:—

(జమదగ్నివత్సఉపగణము చూడుడు.)

**హిజరా** [హిజరీ]:—మహమ్మదీయమతమునందు ఫసలీవంటి శకము. మహమ్మదుగురుఁడు మక్కానుండి మదీనాకు పలాయనమైనదాదిగ నీశకప్రారంభము.

వారినుండియే మదీనా (నగమని యర్థము) కు 'అల్మదీనాతున్నబీ' యని పేరయ్యెను. అనఁగా భోధకునినగర మనియర్థము. అటనే యాయన గోరీ కలదు.

## హి|జా [హిడుక హిజరీ] శకము:—

'హి|జా' యనిన 'పలాయన' మనియర్థము. మహ్మదీయులం దీశకము వాడుకయం దున్నది. మహమ్మదువారు మక్కానుండి మదీనాకు పలాయనమగుటనుండి యీశకము లెక్కింపఁబడెడిని. అది క్రీ. వె. ౬౨౨ అని లెక్కింపఁబడినది. దీనిని వాడుకయందుంచుటకు శాసించినది. కాలీఫ్—ఒమారొ భూపతి. ఈశాసన మీాయన క్రీ. వె. ౬౩౯ జూలై పదునాఱవతేదిగ నిర్ణయించెను.

మహమ్మదీయుల మాసములలెక్కమేరకు ౹రిపలాయనము మొదటినెల మొదటిరోజుననే

జరిగెనందురు (మహమ్మదీయులది చాంద్రమానమని యెఱుంగునది) అదివఱకు వారియందు వాడుకగానున్న శకము ఫసలీయని యంద రెఱింగినదే.

**హిజియోలొజీ** [Hygiology]:— Hygiene (ఆరోగ్యధర్మలక్షణకళ) ను గూర్చినలీల.

**హిడింబ:—**

(కమలపాలిక చూడుడు.)

**హిడింబపురము:—** దీని నిప్పుడు 'కాచార్' అనుచున్నారు. కామరూపదేశ మేలిన హిడింబుఁడను నొకనృపతిపేరు. ఆసాముదేశములో నున్నది. ఈతఁడు కాన్పూరునందుఁ గట్టినభవనఁపు టానవాళ్ళు కలవు.

**హితం మనోహారి చ దుర్లభం వచః:-** హితమగుమాటలు మనోరంజకములై యుండుట దుర్లభము.

**హితహరివంశ్యాచార్యమతము:—**

(రాధావల్లభమతము చూడుఁడు.)

**హితోపదేశము:—** ఇది ప్రాచీనకాలమున విష్ణుశర్మ యనుబ్రాహ్మణునిచే వ్రాయఁబడిన సంస్కృతగద్యకావ్యము. ఇయ్యది కల్పితకథలమూలముగను, లోకసామాన్యములగు దృష్టాంతములమూలముగను, నీతిసిద్ధాంతముల స్థాపించు నపూర్వసారస్వతము [Ethies Didactive Literature] లోఁ జేరినది. ఇది సంస్కృతభాషలో వ్రాయఁబడిన మొదటి గద్యకావ్యము. ఈగ్రంథము రచింపఁబడినవెనుకనే కల్పితకథలమూలమున నీతిని బోధించుపద్ధతి రానురాను ఖండాంతములవఱకు వ్యాపించినది. ఇట్టిగ్రంథము లన్నిటికి సంస్కృతభాషలో నాదినివ్రాయఁబడిన యీహితోపదేశగ్రంథమే ప్రాతిపదికమని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. ప్రతికథయందును మానవజీవితమునకు నుపయుక్తములగు రాజకీయ, వ్యవహారికసంబంధములగు లోకవృత్తములు సుబోధకముచేయునీతి యిమిడి యుండును.

ఇతరులకు నూతనాంశములు బోధించుటకు మానసిక శాస్త్రప్రకారము రెండువిధానములు గలవు. ఒకటి Inductive method అనఁగాఁ గొన్ని సాదృశ్యములను, నుదాహరణములను విద్యార్థులకుఁ దెలిపి కథలమూలమున నభిరుచి పుట్టించి సిద్ధాంతము విద్యార్థులే చేసికొనునట్లు చేయుట. ఇది లేఁతవయస్సులోనున్న బాలికాబాలురకు బోధించు సులభమగుమార్గము.

రెండవది Deductive method. ఇందు ముందొకసిద్ధాంతము చెప్పఁబడును. ఆసిద్ధాంతము దృష్టాంతీకరింపఁబడును. పిమ్మట లోకసామాన్యములగు కల్పితకథలమూలమున నది ధ్రువపఱుపఁబడును. తరువాత నదరుసిద్ధాంతము మరలస్థాపింపఁబడును. హితోపదేశ మీరెండవవిధానమునకుఁ జెందియుండినగ్రంథము. ఇయ్యది విద్యాగంధము లేని వయసుమీఱినవారికి నీతిబోధకము చేయుటకయి యుపకరించుపద్ధతిని రచింపఁబడినది. అందుకే 'Ethico Didactic Literature' లోఁ జేర్పఁబడినది.

ఇది విష్ణుశర్మ యనుబ్రాహ్మణుఁడు పాటలీపుత్రరాజకుమారులు విద్యాగంధములేక పశుప్రాయులై తిరుగుచుండఁగా వారిని జ్ఞానవంతు

లనుజేయుటకుఁ బూనుకొని కల్పించి చెప్పినట్లు వ్రాయఁబడినది.

దీనికి 'పంచతంత్ర' మని నామాంతరము గలదు. [పంచతంత్రము చూడుఁడు.] ప్రపంచకమునందలి కథాసారస్వతమంతటికి పంచతంత్రము ప్రధానస్థాన మాక్రమింపఁజాలు గ్రంథరాజము. ఈగ్రంథము పాటలీపుత్రప్రభువులయొద్దనుండి పారసీకదేశప్రభువగు నహౌషర్వానునకుఁ బంపఁబడినట్లు ఫెరిష్టాచరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. అప్పటిలో పారసీకప్రభువునొద్ద వజీరుగానుండిన భూజూర్మెహార్ అనునతఁ డీగ్రంథమును పహ్లావి భాషలోనికి పరివర్తింపఁజేసెనట. అట్లు పరివర్తింపఁబడిన గ్రంథమునకు పహ్లావిభాషతో 'కలాల దమన' యను పేరు పెట్టఁబడెను. ఈకలాలదమ్న [కరటకదమనకుల] కథయే. అరేబియాదేశ ప్రభువగు 'కాలిఫ' హరూన్ - అల్ - రషీద్ పరిపాలన కాలములో ఇబూ - ఊల్ - ముక్బా యను నరబ్బీపండితునిచే నరబ్బీభాషలోనికి మార్చఁబడెను. తరువాత 'సుల్తాన్ బై రామ్‌షాగిజ్నవీ' అను పారసీకచక్రవర్తి పరిపాలనలో నరబ్బీభాష నుండి పారసీకములోనికి తర్జుమా చేయఁబడెను. ప్రాచీనమగు ఆపారసీకగ్రంథమును ఇటీవల సుల్తాన్ హుస్సేన్ మీర్జాకిర్వారజ్మి అనునతఁడును ముల్లాహసేన్ వాయిజ్ కాస్పి యనునతఁడును సులభశైలిని పరిషియనుభాషలో పద్యకావ్యముగా వ్రాసి ఆగ్రంథమునకు 'అన్వారీ - సుహాయిలీ' అను పేరిడిరి. (Brigg's)

(Ferishta, Vol I pp. 149 and 150)

అరబ్బీభాషలోనికి మార్చఁబడిన భాషాంతరీకరణమునుండి ఐరోపాఖండమునం దీమధ్యకాలములో ననేకభాషలలోని కీగ్రంథము పరివర్తింపఁబడి వేఱువేఱుపేళ్ళం బరఁగుచుండెను. క్రి. వె. 1000 సంవత్సరములో సిరియాభాషలోనికిని, 1180 సంవత్సర గ్రీకుభాషలోనికిని, 1130 సంవత్సరమున పరిషియనుభాషలోనికిని, 1494 సంవత్సరములో పారసీకభాషలోన తిరిగి 'అన్వారీ సుహాయిలీ' యనుపేరునను, 1251 సంవత్సరమున స్పానిష్ భాషలోను, 250 సం॥రమున హీబ్రూభాషలోను, ఇది చేయఁబడినది. హీబ్రూభాషలోనికి మార్చఁబడిన యీగ్రంథమే 'John capma' అనుకవివలన ల్యాటిన్ భాషలోనికి తర్జుమా చేయఁబడెను. ఇది 'Directorum Humanco Vitain అనుపేరున 1489 సం॥లో ముద్రింపబడెను.

John Capna గ్రంథమునుండియే యిది జర్మనీభాషలోనికి మార్చఁబడి "Das Buch Der Byspetteralten Wysen" అను పేరున వ్యవహరింపఁబడుచుండెను. ఇది 1481 సం॥ ప్రాంతముల ముద్రింపఁబడెను. ఇటీవల 1552 సం॥ ఇటాలియాభాషలోఁగూడ నిది వెన్నీసునగరమున ముద్రింపఁబడెను. దానినుండి క్రీ. వె. 1570 సం॥లో నింగ్లీషుభాషాంతరీకరణము వచ్చెను. (Sir Thomas North, 1570) సుమా రొకవేయి సంవత్సరములకాలములో నిన్నిభాషలలోనికిఁ బరివర్తింపఁబడుటంజేసి యిప్పది హిందూదేశపు గ్రంథమగునా కాదా యనుసందేహమునకుఁగూడ గురియైనది. (Macdonell's Sanskrit Literature, p. 417) హిందూదేశమునం దతి

ప్రాచీనకాలమునుండియు వాడుకలో నున్న కల్పితకథలు ప్రస్తుత మింగ్లాండు, అమెరికా ఖండములయందు 'పిల్లలకథలు' (Nursery Stories) గా నుపయోగింపఁబడుచున్నవి. చిన్నయుదాహరణము చూడుఁడు. హితోపదేశము (పంచతంత్రము)లో టిట్టిభపిట్ట కథ గలదు. తాము కట్టుకొన్న చెట్టునుండి సముద్రునిబారిబడకుండ గూడు మార్చుకొనుట మంచిదని స్త్రీపక్షి చెప్పినసలహాకు పురుషపక్షి పరిహసించుచు సముద్రుఁడు తనకన్న బలవంతుఁడు కాఁడని మందలించెను. (Benfy, Vol. II,pp 87–89). ఇది హిందూదేశఁపు సారస్వత మనుటకు నీయొక్క దృష్టాంతము చాలును. అరబ్బీభాషలో ఆపిట్ట పేరు "టిట్టవి" అని చెప్పఁబడినది. ఈశబ్దమున కెట్టివ్యుత్పత్త్యర్థమును నరబ్బీ భాషయందుఁ గానరాదు. కాఁబట్టి అది సంస్కృతశబ్దమగు టిట్టిభమే కావలయును. దీనికి వంగభాషయందు "టిటిబ్" అనియు, ద్రావిడభాషయందు "తీతు" వనియు ననాదిసిద్ధముగా వాడుకలోనున్నది. హితోపదేశములోని మిత్రభేదమునందలి వృషభము పేరు సంజీవకము. అరబ్బీభాషలో కలాలదమ్నకథయందలి యెద్దుపేరు 'సంజేబే'. నక్కలపేరు కరటకదమనకులు. ఇవియే అరబ్బీగ్రంథమందు 'కలాల, దమ్న' అనునపభ్రంశరూపముల నందెను.

పై కారణములనుబట్టి గీర్వాణభాషయందలి హితోపదేశమే యాదిమగ్రంథమని నిర్వివాదముగాఁ జెప్పవచ్చును.

## హిద్మరోగము:—

(ఊపిరిగొట్టునొప్పి చూడుఁడు).

**హిప్నాటిజమ్** [Hypnotism] **సజెషన్:**— దీని నిజము కొంతయుండ నది దరిత్రమై నిజముగనున్నదానికన్న నధికమగు శక్తిసామర్థ్యములు దాని కంటఁగట్టఁబడి లేనిస్థితిం గల్గించియుంటఁ గానవచ్చెడిని. కొందరు దీనిని నమ్మువారును గానఁనగుచుందురు. ఒకరోగి నొక హిప్నాటీస్టు మైకముం గల్గించి వశపఱచుకొని తన సజషన్‌మేర కాతని పరివర్తింపఁజేయఁ గల్గుట బలహీనమనస్కులగు రోగులం దచ్చటచ్చటఁ గాననగునుగాని, యిది యెల్లరకుం గల్గునని భావించుట పొరపాటు. రోగియొక్క దీనావస్థయందాతండు నమ్మిన ఘనవైద్యునిసలహాయం దెంత శక్తి యుండునో నీసజెషన్‌శక్తియు నంతగనే యుండునని పోల్పఁబడినది. ఇది గురునికడ శిష్యునకు శక్తిపాతవశమున గురుభక్తి యేర్పడునట్టిదియే యందురు. ఇంకఁ గొందరు వైద్యులిది స్వల్పగుణ మప్పుడుగల్గింపఁ గలిగినను నది తాత్కాలికగుణమే యని యనిరి. ఇట్లనుటవలన సజెషన్ వైద్యులందరు కుటిలురని యనుట గానేరదు. వారీవిద్యను నమ్మినవారైనను ఫ్రాన్సుదేశమున డాక్టరు Charcot పండితునివంటివారీహిప్నాటిజమ్‌విద్యావిధానవైద్యులే యైనను ఈవిధానము విమర్శకు గురియగుచునే యుండెను. ఆయన యొకతిరుగుడు అద్దముం ద్రిప్పుచు మైకముఁ గల్గించుచుండువాఁడట. వీరు పారిస్‌నగరమున నీవిధానవైద్యము నడపినవారు. తొలుత Dr.Cone పండితుని Nancy school of hypnotism దీనిని నిరాకరించెనట. రానురా నీరెండవవిధానమే బలపడి యట స్థిరపడెనట. ఇది యిక్కాలమున నంతగా వ్యాపకమునందియుంట గానరాకున్నది. కాని, దీనికి నిజమగుసత్తువ యెంతవఱకుఁ గలదో పరిశీలనలు జాగ్రతగా జరుపవలయుననియే తలంపనగును.

**హిప్నాటిజమ్ [Hypnotism]:—** నైసర్గికమగు మార్పులవలన శరీరమున కనేక స్థితులు గల్గుచుండెడిని. అటులనే ప్రయత్నముల చేత కృతకముగ నొకవిధమగుస్థితిని మనస్సునకు శరీరమునకుఁ గూడఁ గల్గించుటను 'హిప్నాటిజమ్' అనియెదరు. గ్రీకుభాషయం దీపదమునకు నిద్రలోనికి పుముకుట యనియు, జర్మనుభాషయందు నిద్రంబోలినమైక మనియు దీని కర్థములుగఁ జెప్పఁబడినవి. ఆస్థితిం గల్గించి మనస్సునకు నమ్మకము గుదిర్చి, కొన్నిపనులుగూడ చేయింప నగు ననుచున్నారు. మనస్సునకుఁ గల్గెడిదృఢనమ్మకము సాధకముగ హిప్నాటిజమువలనఁ గొన్నిమానసిక రోగములం గుదుర్పనగునని యాంగ్లవైద్యవేత్తలనియెదరు. దీని మైకమువలన వివశులై యున్న వారుతమ్మడిగిన ప్రశ్నల కుత్తరములనిత్తురట. Tunetianal nervous disorder అను పేరుగల వ్యాధిని హిప్నాటిజము కుదుర్పఁగలదట. రోగిని నిరోగిగాఁ జేసితినని నమ్మించి (యీమైకము మూలమున) యాతనిచే నటులఁ దలంపంజేసిన నాబాధయతనికిదూర మగునట. 'రోగి తనమనశ్శక్తి నేమాత్రము నుపయోగింపరాదు' అని దీనిమూల సూత్ర మందురు. విశ్రాంతికరమగు గదియందు మనస్సునం దెట్టితలంపులు లేక దేనినైనను జూచుచుండ, హిప్నాటిజమ్మైకము సులభముగఁ గల్గు నందురు. నేత్రములు బరువెక్కి మూతపడుట యుండుజరుగు మొదటిపని యట. దుర్బలమనస్కులచే గాఢమగుమైకము కలుగకమున్నె కొన్ని పనులం జేయింపనగునని చెప్పఁబడినది. ఈమైకమున కొకసారి లోఁబడినవారిని పిదప సులభముగ మైకముఁగల్గించుటయందు లోఁబఱుచుకొన నగు నని యందురు. కొందఱువైద్యులిది యొక్కొకతరి నపాయస్థితిం గల్గింపనోపునని కూడ నను వారును గలరు.

పైకిఁ జెప్పక మనస్సులో దాచుకొనినసంగతులను వానిచేఁ జెప్పించుట కిది తగుసాధనమని కొందరనుచుందురు. ఈమైకమున కాంగ్లమున 'Trance' అనియెదరు. హిప్నాటిజమ్ చేయువారికి చేయఁబడినవాఁడు వశవర్తియైయుండు నని చెప్పఁబడినది. ఆవశవర్తిత్వము తెలివిగల్గినపిదపఁ గూడ నుండునఁట. కడుపునొప్పి తలనొప్పి మొదలగుబాధ లాతనికిఁ దెలియరాకుండఁ జేయనగు నను వైద్యులును గలరు.

**హిప్పాక్రేటిస్‌గారి ప్రమాణవచనములు:—** గ్రీసుదేశమున ప్రాచీనకాలమున నీతఁడు వైద్యుఁడై, గొప్పపేరందినవాఁడు. ధీశాలి. ఆయనకు వైద్యవిద్యకుఁ బితరుఁడని బిరుదనామము నక్కాలఁపుఁబ్రజలు వాడుచుండిరఁట. ఆయన ఇతరసాధనములను నిరసించి రోగమున కౌషధప్రయోగమే మూలికాశక్తియే ప్రతిహతమని నమ్మినవాఁడని చెప్పఁబడినది. ఆదేశమున నాయనయు, నతని శిష్యులును గల్గించిన వైద్యవిద్యాపత్రము లెనుబదియాఱు నిల్వయుంచఁబడినవి కలవు. అవి పురాతనపు చరిత్రకాగితములవలె మాత్రమే గాక వైద్యవిద్యామూలపత్రార్థగౌరవముతో చూడఁబడుచుభద్రపఱుపఁబడుచున్నవి. వాటిని 'Hippocratic collection' అని సాధారణముగ వాడుచున్నారు. వారివైద్యవిద్య నేర్చుకొననభిలషించువారిచే నీక్రిందవివరింపఁబడిన ప్రమాణవచనములు ఖరారుగఁ జెప్పించుట కా మహాత్ముఁ డేర్పఱచి వ్రాసెనఁట. ఇవి యన్నియు 'Loeb Library' యనఁబడు పుస్తకభాండాగారమునందుఁ గాననగుచున్నవి. ఇది ఆప్రమాణవచనానువాదము.

"నాకు వైద్యవిద్యను నేర్పిన గురుని నన్ను గన్నతండ్రిని గౌరవించినరీతిని గౌరవించుచుందును. ఆయన కవసరమగునేని సాధనము నాయనతో పంచుకొందును. ఆయనసుతులు వాంఛించిన, వారిని నాస్వంతసోదరులవలెనే వారికి వైద్యవిద్య గఱపుదునుగాని వారినుండి ప్రతిఫల మేదియుం గోరకుందును.

ఈవైద్యవిద్యాప్రమాణమునే యొనర్చిన నా సుతులకుంగాని, నాగురుపుత్త్రులకుంగాని, నాశిష్యులకుంగాని ఆవైద్యవిద్య నేర్పుదుంగాని ప్రమాణ మొనర్పని యన్యులకు నేర్పను.

నేనొనర్చు వైద్యచికిత్స, వైద్యోపచారములు, రోగులకేయగుంగాక, 'అవి రోగుల క్షేమమునకు, ఆరోగ్యాభివృద్ధికే యగుంగాక, అట్లు నేనొనర్చు చికిత్సాదులు నాశక్తి వంచనలేకుండ నామనస్సాక్షికిం దోచునట్లు నర్హరీతినే చేతును. అట్టితరి రోగి కపాయకరమగునటుల కుటిలవర్తన మొనర్ప కుండెదను.

చంపుట కేయౌషధముంగాని, మూలికను గాని, వనౌషధింగాని యేరోగికిం బ్రయోగింపను. ఎవ్వరడిగిన నీయను. అట్టి వ్యవహారములందు సలహాయీయను. నావైద్యవిద్య నెప్పుడును పరిశుద్ధముగను పవిత్రముగను నుంచి వాడుచుందును. వైద్యక్రియాభ్యాసమునకై యేయింటనేని బ్రవేశింపనంభవించిన ఆప్రవేశించుట రోగులలాభమునకును, నారోగ్యమునకుం బ్రవేశింతునుగాని నీతిబాహ్యకార్యములకుంగా నుపయోగింపను. అత్తరి నారోగిరోగముం గూర్చి గాని, తత్సంబంధాన్య ప్రసంగిక వార్తలంగూర్చి గాని, యెప్పుడు నెవ్వరికి బయల్పఱచను. అట్టిసావకాశములందు మానము వహించి యూరకుందును. వాటింబయల్పఱచనీక దాచుట వైద్యవృత్తికిం బవిత్రకార్యమని నమ్మువాఁడను.

వీటిని నాకడవరకు నెరపిన నాకు చిరస్థాయియగు యశోమును, నెరపక దాటిన నపయశోముం గల్గి సౌఖ్యజీవిని గాకపోదునుగాక. నాపరమార్థ మీప్రమాణవచనపాలనపై నిలచియుండుఁగాక.

**హిపోపేథోలొజీ** (Hippo-pathology):- అశ్వములకుఁగల్గు రోగాదులంగూర్చినకళ.

**హిపోలోజీ** (Hippology):— అశ్వశాస్త్రము.

**హిప్నొలొజీ** (Hypnology):— నిద్ర (పట్టుచు) గల్గించువిధానకల.

**హిప్పొడ్రోమ్:** ఏరోడ్రోమ్ యు విమానముల కెటుల దిగఁదగినతావో హిప్పోడ్రోమ్ గుఱ్ఱముల కట్టితావు. జర్మనీభాషయందు 'హిప్పోస్' అనిన గుఱ్ఱముల కర్థము.

కొంతకాలము గుఱ్ఱపురథములు, గుఱ్ఱపుపందెములకు గ్రీసుదేశమున తావుగ నుండెను.

**హిప్సొగ్రాఫీ** (Hypsography):—సముద్రపుమట్టముపై వేర్వేఱ ఎత్తు (hight) గల వేర్వేరుప్రదేశములంగూర్చినకళ. ఇది Geography లోనిభాగమే.

**హిప్సొమీటర్** (Hypsometer):— తెర్మోమీటరు వేఁడినీటిని వేఁడెక్కించుట కుపయోగించు చిన్నగిన్నెవంటి పరికరము.

**హిబ్రూభాష:**— ఇది యూదులభాష. బైబిలు ఆదిహిబ్రూభాషయందే వ్రాయఁబడి

నది. యేసుక్రీస్తుప్రభువు చేసినబోధలు హిబ్రూభాషయందే చేసియుండెను. ఇది సిమిటిక్కుభాషల తెగలోనిదిగఁ జెప్పఁబడినది. అరబ్బీభాషకు, అరమటిక్కుభాషకు, బేబిలోనియాభాషకు, హిబ్రూభాషతో సంబంధములు గాననగుచున్నవి. ఆదియందు కేవలము హల్లులతోఁ గూడినభాషగ నుండెనట. కాని యేడవశతాబ్దమున మెసోరిటీస్ అను నాయన యచ్చులంగూడఁ జేర్చువాడుక దెచ్చెనట.

మోసెస్ మహాత్ముఁడు మతోద్ధారకుఁడుగ హిబ్రూమతమును సంస్కరించెనట. పిదప మహమ్మదు, క్రీస్తుజగద్దేశికులు రెండు వేర్వేరుమతములుగ నామతమునే సంస్కరించిరి. వీరిద్దరు నేకదైవోపాసననే స్థిరపఱచిరి.

**హిబ్రూఎపా (Ephah):**—ఇది హిబ్రూదేశఁపు కొలతపరిమాణము. ఇది 4½. 9 గాలను లుండెడిని. ఇది దశాంశభాగమునకు 'ఓమ' రందురు. అనఁగా పదిఓమరులు గలది. ఈప్రమాణము పిండి, బియ్యము, బార్లీధాన్యము, గోధుమలు మొదలగువానిఁగూర్చి యాదేశములందు వాడుచున్నారు.

**హిమత్రయము:—**
(త్రిహిమములు చూడుఁడు.)

**హిమవంతుఁడు:**—పర్వతరాజు. భార్య మేరువుకుమార్తె యగు మేనక, లేక మనోరమ. కుమార్తెలు పార్వతి, గంగ.

**హిమాలయపర్వతపంక్తి:**— భరతదేశమున కుత్తరమునఁ గల పర్వతములు. హిమాలయ మన మంచునకు నిలయమని యర్థము. నగాధిరాజుగ హిమవన్నగమును మహాకవి కాళిదాసు వివరించియున్నాఁడు. ఆఫ్ఘనుస్థానమునందలి హిందూకుష్‌పర్వతము మొదలు పశ్చిమమున నప్పరుబర్మావఱకు వ్యాపించియున్న యీపర్వతపంక్తి ౧౫౦౦ మైళ్ళపొడవును, ఇంచుమించు నిన్నూరుమైళ్ళవెడలుపును గల్గియున్న దందురు.

మంచుచేఁ గప్పఁబడిన లెక్కలేని శిఖరము లీపర్వతపంక్తియందుఁ గలవు. అందు గౌరీశంకర శిఖరము చాలఎత్తైనది. ప్రపంచమందలి పర్వతశిఖరములన్నిటికన్న నెత్తై మేటిదైయున్నది. దీనిని పాశ్చాత్యులు Mt. Everest అనుచున్నారు. గంగానదిమొదలగు గొప్పనదు లీహిమవన్నగమున జన్మించినవి.

**హిమోదక ఉపగణము:**— ఇది యగస్త్య సంతతియందలి యగస్త్య ప్రాగ్గణములోని యొక యుపగణము. ఇందు ఎన్మిదిగోత్రములు కలవు.

౧ క్రసగోత్రము, ౨ చాప, 3 భాష, ౪ శాక్ర, ౫ శేక, ౬ హంస, ౭ హిమోదక, ౮ హేమవర్మి.

ఈహిమోద ఉపగణమునందలి యెన్మిదిగోత్రములకుఁ బ్రివరరూపము. ప్రవర- అగస్త్య, హైమవర్చ, హైమోదక.

**హిమోదకగోత్రము:—**
(హిమోదకఉపగణము చూడుఁడు.)

**హాయిరోగ్లిపిస్ లిపి [Hieroglyphis writing]:**—ఇప్పటి యీజిప్టు, అలెగ్జాండ్రియా, తొల్లింటి బాబిలోనియా, ఖాల్డియా, తొల్లింటి గ్రీసుదేశములం దచ్చటచ్చట క్యూనిఫారమ్ వ్రాత లిపియు, కూసిఫారం వ్రాతలిపియు, హాయి

రోగ్లయిఫిస్ వ్రాతలిపియు నని మూడురకముల వ్రాతలిపి శాసనములు గానవచ్చుచుంట పరిశీలన ప్రపంచమునం దెల్లయెడలను సుప్రసిద్ధమే. క్రీ. ము. ౪౦౦౦ సంవత్సరములనాఁ డిది వాడుకయం దుండెనని తెలియుచున్నది. క్రీ. ము. ౨౦౦ సంవత్సరములదనుక వాడుకయం దుండెనట. హియిరోగ్లిఫిస్ లిపి బొమ్మలతో వ్రాయఁబడునది. ఇది త్రివిధముగ నుండునని కనిపెట్టఁబడినది. మొదటిది హియిరోగ్లిఫిస్‌లిపి. ఇది కేవలము బొమ్మలుగనే వ్రాయఁబడునది. రెండవది Hieratic. ఇది యాబొమ్మలం బోల్పఁదగిన ప్రధానములగు పోలికలు లేక యానవాళ్ళు మాత్రముండి తక్కినవి గీతలుగ సంస్కరించి మార్చి వ్రాయఁబడునది. మూడవది Demotic పోల్కెలు స్ఫురించుటకు కేవలము గీతలుగనే వ్రాయఁబడువ్రాఁత.

ఇట్లు త్రివిధములుగ నాకారములు మారి యేర్పడినలిపి కంతకు సామాన్యముగ హియిరోగ్లిఫిస్ లిపియని యనుచున్నారు. ఆలిపియందే దీని నిట్లు వ్రాసిన నది దేవలిపి యగును. తోత్ను విద్యాధినాథుండగు దేవుఁడీలిపిని కుదిర్చి యాదికాలమున కల్పించెనని చెప్పఁబడియుంట నీలిపి కిక్కాలఁపువా రీపేరిడిరి. దీనికి 'పవిత్రలిపి' యని యర్థము కుదురుచున్నది.

రోమనుకాలపుప్రారంభదశనాటికే యీలిపి తెలియక మఱుఁగుపడిన దట. ఎవ్వరో యెఱింగిన మతాచార్యు లుండిరనిరట గాని వారికిని స్వాధీనము కాలేదట. పందొమ్మిదవశతాబ్ద ప్రారంభకాలమున చేయఁబడినప్రయత్నము లన్నియు నిష్ఫలములుగనే పరిణమించెనట. క్రీ. వె. ౧౭ శతాబ్ద ప్రారంభకాలమునాఁటివాఁ డగు జియోగా యను పేరుగల పరిశీలకుఁ డొకభూపతిపేరును చుట్టు గీత యుండునని కన్గొనెను. 'రోసెట్టాస్టో' ననంబడుశాసనమునను, Philae - stone obelisk నందలి శాసనమును, ఆయనకు స్పష్టపఱచెను. అందుమొదటి దిప్పుడు లండనునందలి బ్రిటీషు మ్యూజియమునం దుంచఁబడినది. రెండవది 'Dorset' నందు kingston Lacy నం దొక యుద్యానవనమునను నుంపఁబడియున్నవి.

క్రీ. వె. ౧౭౭౩-౧౮౨౯ నాఁటివాఁడగు Thomas Young గారు పరిశీలించి, Ptolemy భూనాథునియొక్క పేరును వేఱొకతావున క్లియోపాత్రారాజ్ఞి పేరును చక్కఁగఁ బరిశీలించి పోల్చి వివరించెను.

క్రీ. ము. ౧౯౬ మార్చినెలలో మెంఫిస్ దేవాలయమున, అనఁగా మెంఫిస్‌నందలి Ptah దేవుని దేవస్థానమునఁగూడినమహాసభయం దుండిన Priests of the country (ఈజిప్టు) పేరు లిట్టిగౌరవముం బడసియున్నటుల పిదప సరిపోల్పంబడెను. obelisk from Philal నందుఁగూడ పై ఇరువురిభూనాథుని రాజ్ఞి పేరులు కన్పించుచున్నవి. అవియు నిట్లే యున్నవి. కాని

క్రీ. శ. ౧౭౯౦ - ౧౮౩౨ మధ్యకాలమునాటి పురుషుండగు G. F. Champollian పండితుఁడు పడినశ్రమలు, చేసినపరిశీలనలు, కన్గొనిన యక్షరములపోలిక లీసందర్భమున చిరస్మరణీయములని యెల్లరంగీకరించియే యున్నారు. ఆయనరచించిన యొకగ్రంథము హియిరోగ్లిఫిక్ వ్యాకరణము. నిఘంటులోనున్న పెక్కు ఈలిపిశాసనములు కలవు. ఆమహాగ్రంథ మాధారముగ ననేక పరిశీలనాఫలితము లిటీవల బయలుదేరిన వందురు.

ఈలిపియం దేదేని సంగతి వివరింపఁబడునెడ దానిని "Idiograph" అనియెదరు. అదియొకధ్వనిని నిరూపించుతరి 'Phonetic' అనఁబడును. ఒకమాటను ఫోనెటిక్కుతో రచించెనేని దానియర్థమును స్పష్టపఱుపఁగలవేరొక Character కూడ పిదప నేర్పఁబడుచుండెడిని. దానికి Determinative అని పేరిడియున్నారు. బహువచనము లీలిపియం దొకటిక్రింద నొకటిగ మూఁడు నిలువు strokes వలనఁ దెలియనగుచుండును.

---

౧ దేవతాపిలి

౨ ప్టోలమీ (భూనాధుఁడు)

౩ క్లియోపాత్రా (రాజ్ఞి)

౪ పకారము

౫ టకారము

౬ టకారము (రూపాంతరము)

౭ మకారము

౮ సకారము

౯ ఉకారము



౧౦ టకారము

౧౧ అకారము

౧౨ a. e. i. (ఇకారము)



౧౩ బకారము

౧౪ ఫకారము



౧౫ మకారము



౧౬ నకారము



౧౭ రకారము



౧౮ హకారములు



౧౯ ఖకారము

౨౦ సకారము



౨౧ షకారము

౨౨ కకారము



౨౩ టకారము



౨౪ టకార రూపాంతరము



౨౫ ట్చ (tch)

౨౬ వ్రేలు (ideo graph)

౨౭ హృదయము

౨౮ రాతిఫలకము

౨౯ నోరు (జలోపరిభాగము)

౩౦ పొలము

౩౧ గోడ

౩౨ గొడ్డలి-దేవునకర్థము

౩౩ వీణ-సంతోషమున కర్థము

౩౪ Bier with mummy చావున
కర్థము పీనుఁగ-

౩౫ నిలచు (ండు) ట

౩౬ బాధ-రోగము-పీడనము

౩౭ పక్షి-అపశకునము-కీడు

౩౮ శీతలోదకము

౩౯ మనుష్యులగుంపు



అం కె లు

హాయిరోగ్లిఫిక్ లిపియం దొకటి మొదలు తొమ్మిదిదనుక నంకెలు నిలువుగీతల (strokes)చే (| | | | | | | | |) నిటుల వ్రాయఁబడినవి.

ఇంక—  పదిగను,  నూరుగను,

 వేయిగను,  పదివేలుగను,

 కప్ప లక్ష గను,



పదిలక్షలుగను,

 కోటిగను, వాడఁబడి యున్నవి. తక్కినసంఖ్యలు గానరాకున్నవి.

## హిరణ్యగోత్రము:—
(కుశికగణము చూడుఁడు)

## హిరణ్య గర్భ గోత్రము:—
(ముద్గలఉపగణము చూడుఁడు.)

**హిరణ్యగర్భమహర్షి:—** హిరణ్యగర్భ మహర్షి (బ్రహ్మను మహర్షులలోఁ జేర్చిరట) విష్ణు దేవుని నాభికమలమునుండి జనించినవాఁడు. సృష్టి కర్త. భార్య సరస్వతీదేవి. (ఈమె విద్యలకధి నాథురాలు.) కుమారుళ్ళు కర్దముఁడు, దక్షుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, భృగువు, క్రతువు, అంగిరసుఁడు, వసిష్ఠుఁడు, మరీచి, అత్రి, నారదుఁడు, మృత్యువు, ధర్మాధర్మములు, కామ క్రోధ ములు. ఇవి వేర్వేరుపురాణముల కొన్నికొన్నిగ దొరకెడిని. దీనింగూర్చి యొకేవిధముగ నన్నిపురాణ ములందుఁ జెప్పఁబడలేదు.

**హిరణ్యగర్భుఁడు:—** ఈతఁడు ప్రాణాత్మ వాదిమతమునకుఁ గర్త. (ప్రాణాత్మవాదిమతము చూడుఁడు.) ఇంద్రియాత్మవాదిమతమును ఖండించుచు ప్రాణమేయాత్మయని యీతఁడు సిద్ధాంత మొనరించెను.

## హిరణ్యాగోత్రము:—
(గవిష్ఠరగణము చూడుఁడు.)

**హిరణ్యానాభుఁడు:—** శ్రీరామునిసుతుఁడగు కుశునిసంతతివాఁడు. ఈతఁడు జైమినిశిష్యుఁడగు యాజ్ఞవల్క్యునికడ యోగవిద్య నభ్యసించె నని చెప్పఁబడినది.

మఱియు మైనాకునకు హిరణ్యానాభుఁడు హేమనాభుఁడు నను నామాంతరము కలదు.

**హిరణ్యనిధిదృష్టాంతన్యాయము:—** భూమియందు ధనము పాఁతఁబడియుండినతఱి దాని నెవ్వరెఱుఁగమింజేసి దానిపైనుండి నిర్లక్ష్యముగ త్రొక్కుచు నడుచుచుందురు.

గొప్పవారగు మహనీయుల నెఱుఁగక వారిని జులకనగఁ జూచుటను, నిరసించుటను దెల్పుట కీన్యాయము వాడుదురు.

**హిరణ్యాపురము:—** రాజపుత్రస్థానము లోని జయపూర్‌రాజ్యము (తొల్లింటి అంబరీష పురరాజ్యము) న హిండౌన్ లేక సౌక్షాన్ అను పేరుగలతావు. తొల్లింటికాలమున నిది హిరణ్యా కశ్యపపురము. ప్రహ్లాదుని రక్షింప విష్ణుదేవుఁడు నరసింహావతారమెత్తిన స్థలము. దీనిని పెక్కండ్రు సంశయింతురు.

(అంబరీషపురరాజ్యము చూడుఁడు).
పద్మపురాణ శ్రీస్థిఖండము దీనిప్రశంస కలదు

మరియు మల్లదేశములోని మూలస్థానపురము హిరణ్యకశ్యప ప్రహ్లాదులచర్యల పెక్కునానవాళ్లె

కలవు. దీని నిప్పుడు 'ముల్తాన్' అనుచున్నారు. (మల్లదేశము చూడుఁడు).

## హిరణ్యబాహుగోత్రము:—

(శండిలగణము చూడుఁడు.)

**హిరణ్యరేతసగోత్రము:—** ఇది విశ్వామిత్రసంతతియందు హిరణ్యరేతసగణముగఁ జెప్పఁబడినగోత్రము. దీనికి విశ్వామిత్ర, హిరణ్యరేతస అనిద్వ్యార్షేయప్రవర.

**హిరణ్యరోముఁడు :—** నలువురులోకపాలురలో నొకఁడు.

## హిరణ్యాయనగోత్రము:—

(నిధ్రువగణము చూడుఁడు.)

**హిరణ్యవాహ:—** శోణభద్రానదికీపేరు గలదు.

**హిరణ్యబిందు:—**కాలింజర్ (బందేల్ఖండము) నందొకప్రసిద్ధయాత్రాస్థలి. ఇది మహాభారతము వనపర్వము ౮౭ యందు ప్రశంసింపఁబడినది.

ఇంకను హిమాలయముపై నీపేరుగలక్షేత్ర మొకటి కలదని తెలియుచున్నది.

## హిరణ్యస్తంభిగోత్రము:—

(ముద్గలఉపగణము చూడుఁడు.)

**హిరణ్వతీనది:—**కోసలదేశము (ఉత్తర) న పశ్చిమముకడ నుండునది. ఇది వామనపురాణము ౩౮ న ప్రశంసింపఁబడినది.

మరియొక హిరణ్వతీనది కురుక్షేత్రమునఁ గలదది మహాభారతము-ఉద్యోగపర్వము ౧౫౮ యందు ప్రశంసింపఁబడినది.

**హిరణ్యవతీనది:—** దీనిని అజితవతి యనియు, చిన్నగండకి (ఛోటాగండకీనది) యనియు నందురు. కుశినార (కుశినగర) ము ప్రక్కనుండి ప్రవహించుచు, (పెద్ద) గండకీనది కెగువ నెన్మిది మైళ్ళదూరమున గోరక్షకపురము (గోరక్పూరు జిల్లా-సంయుక్తరాష్ట్రము) మండలమున సరయూ (గోగ్రా) నదిలో కలసిపోవుచు.

## హిరణ్యాక్షగోత్రము:—

(ముద్గల ఉపగణము చూడుఁడు).

**హిరణ్యాక్షవరములు :—** ఈసామెత దఱచుగ యావన్మందియు వాడుటగలదు. హిరణ్యాక్షుఁడు కోరినవరములుగఁ జెప్పుచుందురు. హిరణ్యకస్యపుఁడు గోరుటయు, హిరణ్యాక్షుని నామ మాచరణంబుగ నుంటయుఁ గారణాంతరము సరిగాఁ దెలియరాదు. సోదరుం డగుహిరణ్యాక్షుఁడు విష్ణునిచే నిహతుఁడై యుండుకతన పిరించింగూర్చి తపముఁజేసి వరములం బడసి విష్ణునిం జయింప నిశ్చయించినకారణమున "హిరణ్యాక్షవరము" లని సార్థకనామము వచ్చియుండ నోవు.

హిరణ్యకస్యపుఁడు, హిరణ్యాక్షుఁడు ననువార లిర్వురు సోదరులు. అందు హిరణ్యకస్యపుఁ డగ్రజుఁడు. భక్తాగ్రేసరుండగు ప్రహ్లాదునితండ్రియు, మూలస్థానపురము (ఇప్పటిముల్తాన్) నకుఁ బ్రభువును నయియుండెను. సోదరుని మరణానంతరము విష్ణుదేవుని యందు పగఁబూని విధాతంగూర్చి గొప్పతపం బాచరించి క్లిష్టతమమగు వరములం గోరెను. అవి యిరువదిమూడు వరంబులుగ బమ్మెరపోతరాజకృతమగు తెలుఁగుభాగవతము సప్తమస్కంధమున (90) తొంబదవపద్యమునఁ జెప్పఁబడియె.

వరములు (23)

1 గాలిని, 2 కుంభిని (భూమి), 3 అగ్నిని, 4 నీటియందు, 5 ఆకాశమందు, 6 దిక్కులందు, 7 రాత్రియందు, 8 పగటియందు, 9 చీకటి యందు, 10 వెలుఁగునందు, 11 జలచరముచేత [గ్రాహము], 12 రక్షస్సులచేత, 13 మృగముల చేత, 14 సర్పములచేత, 15 దేవతలచేత, 16 నరులచేత, 17 జంతువులచేత, 18 కలహము లందు, 19 సమస్తాస్త్రములచేత, 20 సమస్త శస్త్రములచేత, 21 రణమునఁదుకన్పడు శౌర్య మును, 22 లోకపాలుర నతిక్రమించుమహిమ యును, 23 భువనత్రయజయంబును.

హిరణ్యకశ్యపుఁ డీవరములు బ్రహ్మదేవునిచేఁ బడసెను. "హిరణ్యాక్షవరము" లననిచ్చుటకు సావకాశముకలుగనట్టివియు, ఈషద్ద్వేషము సమర్థ తఁగల్గునెడల తానిచ్చువరములు తనకే ముప్పు దెచ్చునవియు నఁగా నీయ వీలులేనివనియును తరార్థము.

## హిరణ్యాక్షాయనగోత్రము:—

(కుండినగణము చూడుఁడు.)

**హిరణ్యాక్షుఁడు:—** తండ్రి కశ్యపప్రజా పతి. తల్లి దితి. సోదరుఁడు హిరణ్యకశ్యపుఁడు. దైత్యుఁడు.

**హిరోడోటస్ చరిత్రకారుఁడు:** క్రీ. ము. ౪౮౪–౪౨౪ కాలమువాఁడు. గ్రీసు దేశస్థుఁడు. దీర్ఘయాత్రలొనర్చి ఇయోనిక్భాష యందు తొమ్మిది గ్రంథములను రచించెను. ఇవి పారశీకదేశచరిత్ర, ఈజిప్టుదేశచరిత్ర లిడియాదేశ చరిత్రములై యున్నవి. గ్రీకు, పారసీక కలహము లిందలి ప్రధానకథనమని తోఁచెడిని.

## హిలకాయనగోత్రము:—

(కుశికగణము చూడుఁడు)

**హిల్టిప్పెరాసంస్థానము:—** ఇది తొల్లింటి త్రిపురరాజ్యములోనిది. (చూడుఁడు). బ్రిటీషు టిప్పెరాదేశమునకు తూర్పున నున్నది. నివసించు ప్రజలు చాలతక్కువమంది.

**హిల్ట్స్టేషన్ (Hill-station):—** కొండల పైన నెక్కువయెత్తుగు ప్రదేశమున నవారోగ్య ప్రదేశము గాక చల్లఁగనుండు altitude లందు నిర్మితములగుతావులు. వీట్లను 'Sanitoriam' అనెదరు.

(Sanitoriam — సమశీతోష్ణప్రదేశములు చూడుఁడు).

**హిల్ (Hill):—** పర్వతమునకంటెఁ జిన్నది యగు కొండ. (Mountains చూడుఁడు.)

**హిల్-బ్రౌను-సిద్ధాంతము (Hill-Brown-Theory)—** ఇది న్యూటన్సు లా ఆఫ్ మోషను సంబంధమగు సిద్ధాంతము. (న్యూట న్సులా ఆఫ్ మోషను చూడుఁడు. లా ఆఫ్ గ్రావిటీ చూడుఁడు). దీని నింకను 'లూనార్ తియరీ' అనియు నందురు. మరికొందఱు 'Planetary Theory' అనియు వాడుచుంట కలదు. దీనింగూర్చి (అనఁగా చంద్రగమన విధానము - ప్లానెట్సుయొక్క గమనవిధానములం గూర్చి)యు, తొలుత Hansen పండితుఁడును, Delaunay పండితుఁడును గొప్పగణితములు చేసిరట గాని కుదురలేదు. సూర్యునిగమన మసలే కుదురకుం డెను. తరువాత నమెరికాదేశపు గణికుండగు G. W. Hill గారును, అమెరికాలోని Haverford నందును, పిదప Yale విద్యాపీఠమునను,

నధ్యాపకుఁడైన E. W. Brown గారును, చంద్రగమనము, ప్లానెట్సు గమనమును కుదిర్చిన కతన నీవిధానమును వారిపేర వాడుచున్నారు. వీరు Sinple Square Law ఉపయోగించి కుదిర్చి యిప్పటివిధానమును గ్రావిటేషన్‌పై నాధారపడునటుల కుదిర్చిరి. [లా ఆఫ్ గ్రావిటీ, ఎస్ట్రోనొమీ, చంద్రుఁడు, ప్లానెట్సు చూడుఁడు].

**హిస్సార్జిల్లా:**—హిస్సారుపురము ప్రధాన స్థానము. [పంజాబుదేశము చూడుఁడు.]

**హిస్టోరియోగ్రాఫీ (Historio graphy):**— దేశ కాల రాజకీయాదులంగూర్చి తెలుపుచరిత్రలకు 'History' అనిపేరు. దానిని వ్రాయునేర్పు, పరిశీలన మొదలగువానింగూర్చిన కళ.

**హిస్టోలొజీ (Histology):**— మైక్రొస్కోపుతోఁ బరిశీలింపఁగల మనుష్యశరీర భాగ పరిశోధనకల.

**హీనయాన మహాయాన బౌద్ధమత మార్గములు:**—బుద్ధభగవానునిబోధ ప్రారంభమైననాఁటినుండియు హీనయానమార్గ మొక్కటియే బౌద్ధమతమున కుండెను. ఇది బౌద్ధసిద్ధాంతములను నిరీశ్వరవాదయుక్తముగ వివరించుచు, ప్రాణి కర్మబంధమునుండి విముక్తిఁ గాంచుటకు వలయుధర్మజ్ఞానములను సాధనములను వివరించును. ఇది యిక్కాలమున విరాగియై సర్వసంగపరిత్యాగియగు బౌద్ధభిక్షువు (అనఁగా పరివ్రాజకుఁడు) నకును, వారిసంఘమునకును, అర్హాధర్మములం దెల్పుచు వారిని నడిపించు మార్గముగ నున్నది.

మహాయానమార్గము నాగార్జునబోధిసత్త్వునిచే నేర్పఱుపఁబడినది. ఆమహాత్ముఁడు దీనిని బుద్ధభగవానునిబోధలనుండియే స్పష్టపఱచి విడదీసి యొకవిధానముగఁ బ్రవర్తింపఁజేసెఁ గాన నాయన దీనికిఁ బ్రవర్తకుఁడే గాని కర్త గాఁడని చెప్పఁబడెను. మహాయానమార్గమునందు ౧ మాధ్యమికనికాయ మనియు, ౨ యోగికనికాయ మనియు, రెండు నికాయములు చెప్పఁబడినవి. మాధ్యమికనికాయమున ౧ సర్వశూన్యవాదము నని ద్వివిధశూన్యత్వములును, యోగికనికాయమున ౧ బాహ్యమేయశూన్యవాదము, ౨ బాహ్యార్థప్రత్యక్షశూన్యవాదము నను ద్వివిధశూన్యత్వములును చెప్పఁబడి మొత్తమున చతుర్విధశూన్యవాదము లేర్పడియున్నవి. అనఁగా నీప్రతిపాదనమే బోధిసత్త్వుఁ డొనర్చెఁ గాని, కర్త బుద్ధభగవానుఁడే యని మనసునం దుంచుకొనవలయును.

మహాయానమార్గము పరివ్రాజికేతరు లగు గృహస్థులు భక్తిమార్గముచే బుద్ధభగవాను నుపాసించుచు కర్మబంధమునుండి విముక్తిఁగాంచువిధానమైయున్నది. ఇందు నిరీశ్వరవాదమునకుఁ బ్రాముఖ్యత లేదు. బుద్ధభగవానుఁడు సుగతుఁడు. ఉపాసింపఁబడదగినవాఁడు. ఇక్కాలమున నీమహాయానమార్గము సర్వత్ర వ్యాపించి యున్నది. బౌద్ధభిక్షువులు (పరివ్రాజకులు) హీనమార్గమున బుద్ధునుపాసించువారు. నాగార్జునబోధిసత్త్వుఁడు తాను మహాయానమార్గప్రవర్తకుఁడై యెల్లరకు బోధించుచుండియు, తాను పరివ్రాజకుఁడే గాన హీనయానమార్గమున తనబుద్ధోపాసనను నడుపుచు దశభూమికల నధిగమించెనని చెప్పఁబడినది.

(నాగార్జునబోధిసత్త్వుడు చూడుఁడు. బౌద్ధమతము చూడుఁడు.)

**హీరత్ పట్టణము:—** ఇది అఫ్ఘనుస్థాన దేశమునందున్న పురము. ఫలవంతమగు సీమకు నడుమగా నున్నది. హరిరుద్నదీతీరము. హరిరూద్ పరగణాకు ప్రధానస్థానము. కాబూల్ నగరమునకుఁ బశ్చిమముగా ౪౦౦ మైళ్ళదూరము. సముద్రపు నీటిమట్టముపై 30000 అడుగులయెత్తు. ఇచటి కరువదిమైళ్ళలో పారసీకరాజ్యపు సరిహద్దును, రష్యాదేశపుసరిహద్దును చేరనగును. రెంటికి మంచి బాటలు కలవు. భరతదేశమున కేగుబాటయు నిటకే చేరెడిని. దీని నెఱింగి యలగ్జాండరు ది గ్రేటుగా రీతావున నీపురముం బ్రతిష్టించి భరత దేశపుమార్గమున కిది తాళపుచెవి యని తెల్పె నట. ఇచట తివాచీలనేత, పట్టుబట్టలనేత జరుగు చుండును.

**హుంకారేశ్వరతీర్థము:—**
(సూకలతీర్థము చూడుఁడు)

**హుగ్లీజిల్లా:—** హుగ్లీనదీతీరమందున్న హుగ్లీ పట్టణము ప్రధానస్థానము. బంగాళీభాషయందు 'హోగ్ల' యనిన నీటిరెల్లున కర్థము. లవి యీ ప్రాంతముల మెండగుట తొలుత హోగ్లా యనం బడి, ఆంగ్లోచ్చారణయందు హుగ్లీగా మాఱినది. దీనినుండియే యీనది కీపేరు కలిగెను.
(బంగాళాదేశము చూడుఁడు.)

**హుతమన్యుఁడు:—**
(భుమన్యువు చూడుఁడు.)

**హుర్రా (Hurrah):—** గౌరవార్థ మఱచు సముచ్చయపదము (interjection) Hiera Sotyma (Holy jerusalem) అనుమాటల నుండి కల్గిన క్లుప్తపదము. తొల్లి క్రైస్తవమత వ్యాపకమునకు వెడలెడివీరులు భక్తితన్మయత నఱచెడి యఱపు (Cry of Crusaders).

**హులు:—**
(క్షత్రియకులము చూడుఁడు).

**హుళక్కి భాస్కరుఁడు:—** ఆంధ్ర కవులందు పూర్వకవులలో నొక్కఁడుగ నెన్నఁ బడినవాఁడు. భాస్కరరామాయణములోని యుద్ధ కాండములోని ౧౧౩౪ పద్యముల నీతఁడు రచించె నని పరిశీలకులు పోల్చుచున్నారు.

**హూక్ ఆర్ క్రూక్ [Hook or Crook]:—** ఏదోయొకవిధముగా ననుటకీ ఉక్తిని వాడుదురు. ఇంగ్లాండునం దొకటవ ఛార్లెసు భూపతి పాలనమున 'Hook' అనియు, Crook అనియుఁ బేర్లుగల యిర్వురు న్యాయాధిపతు లుండువారఁట. అక్కాలమున నాన్యాయమూర్తు లలో నొకరివద్ద వ్యాజ్యముతెచ్చి న్యాయము లభింపకపోయిన రెండవవారివద్ద తిరుగ విచారణకుఁ దెచ్చి న్యాయమందునాచార ముండెనఁట. ఆనాఁటనుండి మీఉక్తి కి మూలమయ్యెనఁట.

**హూనదేశము:—** శాకలదేశ మనియుఁ దీనికి పేరుండెను. పంజాబునందలి యిప్పటి సయాల్కోట శాకలపురమని పోల్పఁబడినది. ఆప్రాంత దేశమై యుండవలయును. మిహిరకులుండను భూపతి కిది రాజధానిగ నుండెనట. అతఁడు హూనుఁ డుగఁ జెప్పఁబడినవాఁడు.

కొందఱు మానసరోవరప్రాంతదేశమునుహూన మని తలంచుచున్నారు గాని, నిదర్శనములు గాన రావు గాన దూరదేశపువారలు తలంచుతలంపు లని యనంబడుచున్నవి.

**హ్యానత్స్యంగు (చీనాయాత్రికుఁడు)** —భరతదేశఁపు జరిత్రకారుల కీమహాత్ముఁడు క్రొత్తవాఁడు కాఁడు. బౌద్ధభిక్షువు, జన్మస్థానము హోనన్యా రను గ్రామమనియు, స్వదేశమున నదివఱకే పేరుప్రతిష్ఠలం గల్గినవాఁడనియుఁ దేలుచున్నది. భరతభూమిని యాత్రసల్పి బౌద్ధవిజ్ఞానము, గ్రంథవితతి సంపాదింపఁ దలంచి యొక్కఁడే బయలుదేఱి గోబీఎడారిని దాటి, పర్వతకనుమమార్గమున నడచి పెషావరుపురముం జేరి, యటనుండి పెక్కుబౌద్ధక్షేత్రములం దర్శించి, అసామదేశమునుండి తిరుగ కాబూలున కరిగి, తనదేశముఁ జేరెను. చీనాచక్రవర్తియగు తాయిట్సింగనువారి యాజ్ఞంగొని తన యాత్రాచరిత్రమును బ్రకటించెను. ఈమహాత్ముని జన్మము క్రీ. పె. ౬౦౫ అనియు, మృతి ౬౬౪ సంవత్సరమనియుఁ బరిది. భరతదేశమందలి తొల్లింటి రాజ్యములు మొదలగువాటి నెఱుంగ నీయన యాత్రాచరిత్ర సహాకారిగ నున్నది.

**హ్యూమన్ఫిజియాలోజీ (Human Physiology):**— దీని కాంధ్రభాషయందు 'మానవదేహధర్మశాస్త్ర' మని పేరిడఁదగును. ఇది పాశ్చాత్యవిజ్ఞానమందలి యొకకల. తొల్లింట నిది భరతదేశఁపుకలగా నాయుర్వేదవైద్యశాస్త్రమున వివరింపఁబడెఁగాని పాశ్చాత్యకలవలె నభివృద్ధి నందలేదు. పాశ్చాత్యశాస్త్రవిదులు Human Physiology విద్యను Human Biology అనియు వాడియున్నారు.

ఈశాస్త్రమున నుపకలలుగ నస్తిపంజరవిజ్ఞానము (Study of skeliton) Study of muscles (మాంసఁపుకండలంగూర్చినవిజ్ఞానము) Study of Internal organs (అనఁగా శరీరాంతస్థావయవ కార్యవిజ్ఞానకల), Excretory system study (అనఁగా మల మూత్ర స్వేద విసర్జనల విజ్ఞానధర్మములంగూర్చిన కల), Nervous system study (అనఁగా మెదడు, వెన్నెముకలోని ముఖ్యనరము (spinal card)ను గూర్చియు, తక్కిన యన్నినరములం గూర్చియు విజ్ఞానముం దెల్పుకల), Study of Sensoryorgans (అనఁగా పంచజ్ఞానేంద్రియములంగూర్చిన విజ్ఞానముం దెల్పుకల) వివరింపఁబడియున్నవి.

ఇవి యన్నియు మనుష్యశరీరసంబంధములుగ నారోగ్యముతోను రోగములతోను ననుబంధములం గల్గియుండును గాన పాశ్చాత్యవైద్యవిద్యలోనివిగఁ జెప్పియున్నారు.

**హ్యూమానిజమ్ (Humanism):**— మానవసేవయే మతముగ నెన్నఁదగిన గ్రీకు రోమన్ బోధితమతకల.

**హ్యూమిజమ్ (Humism):**—Devid Hume అను తత్వవేత్త మతము.

**హృదికుఁడు:**—అత్రి చంద్ర యాదవ వంశక్షత్రియుఁడు. తండ్రి రెండవ భోజుఁడు. కుమాళ్ళు ౧ కృతవర్మ, ౨ శతధనువు, 3 దేవమీఢుఁడు ననువారలు.

**హృద్రోగగోత్రము:**—

(అగస్త్యఉపగణము చూడుఁడు.)

**హృద్రోగగోత్రము:**

[నిధృవగణము చూడుఁడు.]

హృద్రోగము:— ఆంగ్ల Heart Disease గుండెలలో పుట్టు శ్లేష్మరోగము. దీనిని weak hart అనియు నందురు. ఇది కలవారు కొన్నిదినములు బ్రతుకుటయుఁ గలదు. బరువగు పనులు చేయరాదందురు. అపాయకరమగుజబ్బు. అకాత్తుగా నూపిరాడుట గుండెవద్దనాడి యాఁగి పోయి మృతిసంభవించును.

హృషీకేశ! హము:— రామానుజీయవైష్ణవ చైతన్య వైష్ణవ మతధర్మములందు తదేకాత్మరూప మహావిష్ణువు అందు ద్వితీయ చతుర్వ్యూహము లలో నొకటియనియు, అనిరుద్ధవ్యూహము లైదింటిలో నొక యుపవ్యూహమనియు వైభవ విలాసమూర్తి యనియు, వరుసగ గద, చక్ర పద్మ శంఖము లాయుధములనియుఁ జెప్పఁబడినది.



(విష్ణుదేవాలయ విగ్రహములు చూడుఁడు).

హృషీకేశక్షేత్రము:— హరిద్వారమున కెగువను ౨౦౦ మైళ్ళదూరమున గంగానదిపై నున్నతీర్థము. ఇది తొల్లింటి దేవదత్తునియాశ్రమమని వరాహపురాణము ౧౪౬ అధ్యాయమున కలదు. గొప్పస్నానతీర్థము.

హెక్సాటూచ్ [Hexateuch]:- బైబిలునందాఱవపుస్తకమగు జోషువాగ్రంథముతో నేర్పడిన ఆరుగ్రంథముల పుస్తకమునకు గుదిర్చినపేరు. బైబిలని భావము.

హెక్సామెటర్ (Hexameter):— ఇది గ్రీకురోమనుకవిత్వమున లయాస్థానము పరికరము కాదు.

హెక్టేరుసర్వేకొలత:— ఇది ఫ్రెంచి దేశపు మెట్రికుసర్వే కొలతపద్ధతి, 2.471. ఇంగ్లీషుఎకరములకు ఒక మెట్రికు అగును. దీనిని బ్రిటీషువారు Superficial measure అనెదరు.

హెక్టోగ్రాపి (Hectography):— ఒక యంత్రపరికరము, లేక సాధనము. దీనివలన నొక వ్రాత కనేకనకళ్లు తీయనగును.

హెచ్అక్షరమునకుజెందిన క్రైస్తవ పురుష నామములు:—

Hadrian-Adrian లాటిన్ నామము. ఇదియొక రోమనుచక్రవర్తి పేరు. కొందరు పోపుగురుస్వాము లీపేరం బరగియుండిరి. అద్రియా యనునది ఇటలీదేశములోని యొకపురము. అద్రియాసంబంధమని యర్థమిచ్చుచున్నది.

Ham-Hamar హిబ్రూనామము. నోవామహాత్మునికుమారునిపేరు.

Hamilton నవీనకల్పితనామము.

Hamish స్కాట్లికు నామము. Supplauter అని యర్థము.

Hamlyn Hamo ట్యూటోనికు నామము. స్వగృహవాసమని యర్థము.

Hannibal ఫ్యూనిక్కునామము Grace of Bal (బాల్ దేవత) అని యర్థము.

Harcourt ఉచ్చారణ Harcurt అని. నవీనము.

Harding ట్యూటోనిక్కునామము. Firm అని యర్థము.

Hardrada ట్యూటోనిక్కునామము. పెక్కండ్రు భూపాలుర కీపేరుండెను. firm in Council అని యర్థము.

Harold-Horald ట్యూటోనిక్కునామము. ఒకరారాజు పేరు. Warrior power అని యర్థము.

Harry (same as Henry) దీనినుండి కల్గిన ముద్దుపేరు Hall. ట్యూటోనిక్కునామము. Ruler of Home అని యర్థము.

Hartly
Hart well } నవీన పదములు.

Harvey-Hervey-Herve సెల్టిక్కుపదము. Bitter అని యర్థము.

Haslam నవీనపదము.

Hastings ట్యూటోనిక్కుపదము. Swift అని యర్థము.

Havelock
Hawes
Haydn } నవీన పదములు

Hayman Haymon ట్యూటోనిక్కుపదము. Home అనియర్థము.

Heathcote ఉచ్చారణ Hethcot అని. నవీన పదము.

Hector గ్రీకుపదము. defender అనియర్థము.

Hedley నవీనపదము.

Hed worth నవీనపదము.

Helier లాటినుపదము. Cheerfulఅనియర్థము

Heneage నవీనపదము. ఉచ్చా Hennidge

Hengist ట్యూటోనిక్కుపదము. అశ్వమని యర్థము.

Henry ట్యూటోనిక్కుపదము. పెక్కండ్రు భూపాలుర కీపేరుకల్గెను. Ruler of Home అని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేర్లు

Harry-Harrye-Hall-Henry అనునవి.

Herbert ట్యూటోనిక్కునామము. Great warrior అని యర్థము.

Herbrand ట్యూటోనిక్కునామము. warrior swords man అనియర్థము.

Hercules గ్రీకుపదము. గొప్పశూరునిపేరు. ఆతనికిబలమును మెండు. గొప్పశరీరము. loardly fame అని యర్థము.

Herdman నవీనకల్పితపదము.

Hereward Herewald ట్యూటోనిక్కుపదము. Sword guardian అని యర్థము.

Herman - Hermann - Hermon ట్యూటోనిక్కునామము. Public army man అనియర్థము.

Hervey - see Harvey

Herwin ట్యూటోనిక్కునామము. Army friend అని యర్థము.

Hezekiah హీబ్రూనామము. ఒకయూదుల రాజుపేరు. Strength of the Lord అని యర్థము.

Hibbert నవీనపదము.

Hilary - Hilaire - Hilaro లాటినుపదము. Cheerful అని యర్థము.

Hildebert ట్యూటోనిక్కుపదము. Battle bright అని యర్థము.

Hildebrand ట్యూటోనిక్కుపదము. Battle swords man అని యర్థము.

Hildred ట్యూటోనిక్కుపదము. Battle council అని యర్థము.

Hilgrove నవీనకల్పితపదము.

Hiram హీబ్రూపదము. Noble అనియర్థము. తైరు నేలినయొకరాజుపేరు.

Hobart (ఉచ్చారణ Hubbart అని) నవీనము.

Hodge ట్యూటోనిక్కు పదము. (same as Roger) Spear of fame అని యర్థము.

Holt నవీనపదము.

Homer గ్రీకుపదము. pledge అనియర్థము. ఒకగ్రీకుకవిపేరు.

Honorius లాటిన్‌పదము. Honourable అని యర్థము.

Horace Horatio లాటినుపదము. worthy అని యర్థము.

Hosea హిబ్రూపదము. saving అనియర్థము. సమేరియాయందుండిన యొకగొప్పదివ్యజ్ఞాని యగు భక్తునిపేరు.

Howard నవీనపదము. popular అని యర్థము

Hubert Hubbard ట్యూటోనిక్కు పదము. ఒక ఋషిపేరు Bright mind అనియర్థము.

Hugh - Hugo - Hughes ట్యూటోనిక్కు పదము - ఒకఫ్రెంచిభూపాలునిపేరు. Thoughtful mind అనియర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేర్లు Hughie Huggin.

Humbert ట్యూటోనిక్కు పదము. ఇటలీదేశమేలినయొకరాజుపేరు. Support of brightness అని యర్థము.

Hume - Humble నవీనకల్పితపదములు.

Humphrey - Humphry - Humfrey ట్యూటోనిక్కు పదములు. peace supporter అని యర్థము. దీనినుండి కల్గినముద్దుపేరు Humph అని.

Hunt - Hunter నవీనపదము. వేటగాఁడని యర్థము.

Hyacinth గ్రీకుపదము. purple అనియర్థము.

Hylton నవీనకల్పితపదము.

## హెచ్ అక్షరమునకుం జెందిన క్రైస్తవస్త్రీలనామములు:—

Haggy లేక Haggie గ్రీకుపదము. మంచి యనియర్థము.

Haidee ట్యూటోనిక్కు పదము. సుఖమని యర్థము.

Hannah హిబ్రూపదము. కటాక్షమనియర్థము.

Harriet - Harriette - Harriot - Harriott ట్యూటోనిక్కు పదములు. గృహపరిపాలనమని యర్థము. ఇందుగల్గిన ముద్దుపేరులు Hatty. (Henry - Harry లకు స్త్రీవాచకపదమని పెక్కండ్రయభిమతము)

Hazel ఒకజాతిపుష్పముపేరు. సఖ్యమొనర్పుమని యర్థము.

Heather ఉత్పత్తి అర్థములు తెలియవు. పూలభూమలో ఒంటరితనమని యర్థము.

Helen - Helena - Helene - Helaine గ్రీకుపదము. వెలుతురని యర్థము. దీనియందు గల్గినముద్దుపేర్లు. Nell - Nellie - Nina

Henrietta - Henriette - Heneritta ట్యూటోనిక్కు పదము. గృహపరిపాలకురాలనియర్థము. దీనినుండికల్గిన ముద్దుపేరులు Etta - Hetty - Nettie.

Hermione - Hermia గ్రీకుపదములు. గ్రీసుదేశపుదేవుఁడగు Hermes పేరు.

Hermine లాటిన్పదము. రాజసమున కర్థము.

Hero గ్రీకుపదము. దొరసాని యనియర్థము. ఒక గ్రీకుయోగినిపేరు.

Hersey ఐరిషుపదము. అర్థము తెలియదు.

Hester - Hesther లాటిన్పదము. నక్షత్రమని యర్థము. ఇందుఁగల్గిన ముద్దుపేరులు Hetty ఇది ఈస్తరుయొక్క ప్రతిపదమే యని యందురు.

Hestia గ్రీకుపదము. ఒకగ్రీసుదేశపుదేవతపేరు.

Hiawatha ఇది Redindian పేరు వాడుక యందును లేదు.

Hilaria లాటిన్పదము. సంతోషపూరితమని యర్థము. Hilary యొక్క స్త్రీవాచకపదము.

Hilda – Hylda ట్యూటానిక్కుపదము.యుద్ధమొనర్చుపడుచు అనియర్థము.

Hildegarde ట్యూటానిక్కుపదము. యుద్ధమొనర్చుపడుచురక్షణ మని యర్థము.

Honor - Honora - Honore - Honoria Honorine లాటిన్పదము. గౌరవమని యర్థము. ఇందుఁ గల్గినముద్దుపేరులు Nora Norah.

Hope ఆంగ్లపదము. ఆశ (నిరీక్షణ)యనియర్థము.

Horatia లాటిన్పదము. Horace యొక్క స్త్రీవాచకపదము. ఈనడుమకాలమున కొందరు పిల్లలకు Horatio అని పేరుపెట్టిరి కాని అది మగపేరు.

Hortense - Hortensia - Ortensia లాటిన్పదము. ఉద్యానవనయువతి యని యర్థము - హాలండుదేశపుఒకరాణిపేరు.

Huldah - Hulla ట్యూటానిక్కుపదము.

Hyacinthe - Hyacynthe గ్రీకుపదము. ఒకరంగు.

**హెజాజ్ సీమ** (Hejaz):— అరబ్బీదేశమునందలి పవిత్రసీమ. ఇందే లోకప్రసిద్ధముగల మక్కానగరము, మదీనానగరము లున్నవి. జిడ్డాపురమును నిందులోనిదే.

అసీరున కుత్తరభాగమున నెఱ్ఱసముద్రము యొక్క (Red Sea) తూర్పుతీరమున నెన్మిది వందలమైళ్ళుపొడవును, రెండువందలమైళ్ళు వెడలుపు (దేశములోనికి) ను గలసీమ. మక్కాకు జిడ్డాపురమును, మదీనాకు యాంబోపురమును రేవులై యున్నవి. డమస్కసు బైరూటపురముల నుండి హెజాజ్ రైల్వే మదీనావఱకుఁ గలదు.

క్రీ. శ. ౧౯౧౬ వఱకు హెజాజ్ దేశము టర్కీకి లోబడియుండ, గ్రాండుషరీపు హుసేనుగా రప్పుడు స్వతంత్రతను యుద్ధకాలమున బ్రకటించి, బ్రిటీషు, ఫ్రెంచి, ఇటలీవారి యంగీకారము నందెను. ౧౯౨౪లో ఇబానౌదుగా రాయనం బడద్రోసి తాను గ్రాండుషరీ పాయెను. ఆయన హెజాజునకు, నజీద్నకు, గూడ నధిపతిగ నేలుచున్నాఁడు.

**హెటిరోజెనిసిస్ట్రి** (Hetero genesistry):—తల్లిండ్రులరూపగుణములకు భిన్నముగ జనించినసంతానము. అట్లేల జనించెననుశంక కలుగకపోదు. అట్టివి రెండు మూడు నాల్గు పురుషాంతరములకుముందలి యొకరూపము మొ॥ నవిగనుండ వలెనని, అట్టిమార్పు జరుగుట తటస్థించుచుండునని, కనిపెట్టఁబడినది. దానింగూర్చిన కల

**హెడ్** [Head]:—

[అగ్రహాము చూడుఁడు].

**హెడ్జాజుభాగము**:— అరేబియాలోని యాత్రాస్థలములుగల భాగము.

[అరేబియా చూడుఁడు].

**హెడ్లూసు** (Head sluices):—

Irrigation (పంటకాల్వల) engineering నందుఁ జెప్పఁబడిన యొకనిర్మాణమునకుఁ బేరు. (ఇరిగేషన్ చూడుఁడు).

పొలములకు నీరివ్వఁదగిన యెత్తునకు నీటిని ఎత్తుగ నిలుపుటకు నదీప్రవాహముల కడ్డముగ

నిర్మింపఁబడిన ఆనకట్టున కిరుదెసలందుఁ గాని, యొక్కొ-కతరి నొకదెసనుగాని, (అటుల నిలుపఁబడిన) జలములం గొంపోవు నీటికాల్వలు ప్రారంభమయ్యెడిని. ఆకాలువలలోనికిఁ బ్రవహించునీటిని Control చేయుచు, నవసరములవెంబడి నెక్కువగఁగాని, తక్కువగఁగాని, వదలుచుండుట కీహెడ్డుస్లూసు నిర్మింపఁబడును. ఇది Masonary కట్టడము.

ఇది కాల్వమొగను జలప్రవాహమున కడ్డమున కడ్డముగ నిర్మింపఁబడిన కట్టడము. తరుచుగ రాతితోఁగాని, యిటుకలతోఁగాని, సున్నముతోఁ గట్టఁబడునది. దీనినానుకొని దీనిపైన నొకలాదులవంతెనను నిర్మించి, లాదు లందు పైకిని క్రిందికిని ఆడు Shutter తలుపు లమర్పఁబడి యుండును. వీటిని పై కెత్తుటవలన నీరధికముగను, కిందికి దించుటవలన తక్కువగను (నదియందలి ఆనకట్టచే నిలుపఁబడిన) జలము కాలువలోనికిం బ్రవహించుచుండును. ఈవిధమున కాల్వలోని కరుగుజలములు regulate చేయఁబడుచుండును. ఈరిగ్యులేషనునను 'Control' అనియు నందురు.

**హేడోనిజమ్:**— మనస్సుయొక్క-గాని శరీరముయొక్క- గాని వినోద సౌఖ్యములే జన్మకు సార్థకములను సిద్ధాన్తము. దీనిని పెక్కండ్రు పాశ్చాత్యపరిశోధకు లనుమతించియున్నారు.

**హేథెనిజమ్ (Heathenism) మతము:**— అనాగరికత. (నిజదైవమును వదలి) పెక్కుదేవతల నారాధించుమతము.

**హెన్నా (గోరింత ఆకు):**— గోరింటకు ఈజప్టుదేశభాషయందు 'హెన్నా' యనిపేరు. ఎండించిన యాకులచూర్ణమున కింక నెవ్వియో రంగువస్తువులంగూర్చి హెన్నాయను పేరున నాదేశమున విక్రయింతురు. అచటిస్త్రీలు గోళ్ళకు దీనితో రంగువైచుచుందురు.

**హెనోథెయిజమ్ (Henotheism) మతము:**— అనేకమంది దైవములు కలవని నమ్మచు అందొక దైవమునందు భక్తి కుదిరి పూజించుమతము.

**హెమ్మరుఫెస్టుపట్టణము (Hammerfest):**— ఇది నార్వేదేశమున ఫిన్మారుకౌంటీయందున్న పట్టణము. ప్రపంచమునం దుత్తర ధ్రువమున కింతసమీపముననున్న పట్టణము లికగానరావు. కావాలోద్వీపపుఁ బశ్చిమతీరమునందున్నది. Lat 70°-40° N. Trondhjem పురమునుండి యీశాన్యదిశగా 675 మైళ్ళ దూరము. కలపతోఁ గట్టఁబడిన పట్టణము. వర్తకస్థలము.

ఇచట మే ౧౩ తేదీ మొదలు జూలై ౨౯ తేదీవఱ కొకేపగలుగ నుండి సూర్యాస్తమయమే యుండదు. నవంబరు ౧౮ తేదినుండి జనవరి ౨౩ తేదీ వఱకు నొకేరాత్రిగనుండి సూర్యోదయమే యుండదు. ఈపురమున ౨,౭౦౦ జనులు వసించుచున్నారని తెలిసెడిని.

**హెమిస్ఫియర్:**—
(గోళార్థము చూడుఁడు).

**హెయర్ డయి (Hair Dye) అనఁబడు శిరోజములను నల్లఁబఱచురంగు:**-

దీనిపాళ్ల

సిల్వర్ నైట్రేట్—3 డ్రాములు.

నికిల్ సల్ఫేట్—12 గ్రెయినులు.

లిక్ అమ్మోనియాఫోర్టు—Q. S.

సిల్వర్ నైట్రేట్‌ను నికిల్ సల్ఫేటును రెండు ఔన్సులవర్షపునీటి (Distilled water) తోఁ జేర్చి, అంతయుఁ గరఁగిపోయిన పిదప దానిలో లిక్విడ్ అమ్మోనియా బొట్లుబొట్లుగా అడుగంటిన ముద్దపూర్తిగా కరఁగిపోవువరకును పోయుచుండవలయును. తరువాత దీనిని నాలుగుఔన్సులు భర్తీ చేయుటకుఁ గావలసిన వర్షపునీటిని కలుపవలయును.

ఉపయోగించు పద్ధతులు.

ముందు తల సబ్బుతో శుభ్రముగా రుద్దుకోవలయును. తడియారిపోయిన తరువాత నున్నితమయిన కుంచె (Brush) తో రంగు వేయవలయును. ఒకగంటయయినవెనుక అరంగు పరిశుభ్రమయిననీటితో కడిగివేయ వలయును. తరువాత నూనె రాసికోవలయును. వెండ్రుకలకు గాఢమయిన నల్లరంగు వచ్చును.

**హెర్మసునది:—** ఏష్యామైనరునందున్న నది. ఆర్కిపిలెగో సముద్రమునం గలియును. (ఏష్యామైనరు చూడుఁడు.)

**హెరాల్రి (Heraldry):—** వంశచరిత్రయగు Genealogy యం దొకభాగమగు వంశముయొక్క పౌరుషప్రతిష్ఠలంగూర్చి వ్రాయు నేర్పు లేక కల.

**హెరిటెబిల్ బాండ్సు (Heritable Bonds):—** వాణిజ్యసంబంధ పరిభాషాపదము. అసలు వృద్ధులు సకాలమున చెల్లింపఁబడక తప్పినచో నొకభూమి నంతటితోనప్పిచ్చినవారికి క్రయసిద్ధికల్గునటుల వ్రాసియిచ్చిన పత్రములు.

**హెర్జిగోవినాస్టేటు:—** ఐరోపాఖండమందలి బాల్కనుస్టేట్సులో నొకస్టేటుగ నొకప్పుడుండి పిదప నొకప్పుడు టర్కీపరిభుత్వమునకుం జెంది యుండినది. (బాల్కనురాష్ట్రములు చూడుఁడు).

టర్కీ ఆస్ట్రియాల యుద్ధసందర్భమున క్రీ. వె 1878 బెర్లినుట్రీటీ (సంధి) తీర్మానములమేరకు ఆస్ట్రియాయందు జేరిపోయియున్నది. (ఆస్ట్రియా దేశము, బోసినియాస్టేటు చూడుఁడు— టర్కీ దేశము చూడుఁడు.)

**హెర్సియొలొజీ [Heresiology]:—** నమ్మినది. [నమ్మకము తోచినది] యదార్థము. దానింబట్టి కార్యము నడుపవలెననుసిద్ధాంతమునకు 'Heresy' అనెదరు. దానిం గూర్చినకల.

**హెర్స్చెల్‌స్టార్ [Herschell star]:-** [ఇది యూరేనస్ గోళము చూడుఁడు.]

**హెర్బేరియొలోజి [Herbariology]:-** మొక్కలరకములను, జాతులను preserve చేసి నిల్వయుంచుసంస్థను 'Herbarium' అనెదరు. దానినిగూర్చినశాస్త్రముపేరు హెర్బేరియోలొజీ.

**హెల్లాసుభాగము:—** ఇది యైరోపాఖండములోని గ్రీసు దేశభాగము. దీనిని Continental Greece అనియు నందురు. ఐరోపాభూమికంటియున్న దేశభాగము [గ్రీసుదేశము చూడుఁడు.]

**హెలియొగ్రాఫీ (Heliography-Hiliotypography):—** Chemically prepared surface పైని సూర్యకిరణములవలన నొకరూపముగాని, యొకవ్రాతగాని, చిత్రింపఁబడునట్లుఁగాని తన్మూలమున నొకముద్రణమున నుపయోగించు plate ఏర్పడుటం గూర్చినకల. అట్టి plates తయారుచేయుటకు Heliotypography అనియందురు.

హెలియోటైపోగ్రాఫీ (Heliotypography):—లితోగ్రాఫ్ రాతినుండి తయారుచేసి ముద్రాయంత్రమునం దిడి ముద్రించునటులనే Gelatine surface నుండి Photographic Process మూలమున నారూపమును Pinrt గా చేసి ముద్రణాయంత్రమునందిడి ముద్రింపఁజేయుకల.

దీనిని Earnest Edwards అను బుద్ధిశాలి కనిపెట్టెను.

హెలియోపోలిస్‌పట్టణముతావు:—ఒకప్పు డీపుర మీజిప్టుదేశపు రాజధానిగ నుండెను. దీని కప్పటిపేరు 'ఆన్' అనియుండి గ్రీకులయాధిపత్యమున హెలియోపోలిస్ అనిపేరిడఁబడియెను. ఇప్పటి కైరోనగరమున కీశాన్యదిశగా నైదుమైళ్ళ దూరమందున్న ప్రదేశము. గ్రీకునామమునకు సూర్యపురమని యర్థము. ఇట గ్రీకులచే నిర్మింపబడిన గొప్ప సూర్యదేవస్థానమును, దానికింజేరిన యొకవిద్యాపీఠము (విశ్వవిద్యాలయమును) నుండెనట. మరియు నందే యిప్పటి నక్షత్రశాలలంబోలిన జ్యోతిషాలయ మొకటికూడ పరిశీలనల కమర్పఁబడి యుండెనట. క్రీ. ము. ఐదవశతాబ్దమునుండి యిట గొప్పగొప్ప ఖగోళశాస్త్రపరిశీలనలు జరుగుచుండెనట. ఆదికాలపు టానవాలుగ నీతావున నిప్పటికిని ఎర్రగ్రానైటు రాతిస్తంభ మొకటి (Oclisk) కలదు. దానిపై ఉస్టెర్సెన్ (usertsen) అనఁగా senusert I అను పేరు కలదు. ఈయన ఈజిప్టుదేశమేలిన ఫరోనృపతి యునియు, పండ్రెండవప్రభుసంతతివాఁ డనియుఁ బోల్పంబడినవాఁడు. గ్రీకులనాటి విశ్వవిద్యాలయాదుల యానవాళ్ళేమియుఁ గానరావు.

హెలియోమీటర్ (Heliometer):—ఆకాశమునందు చిన్నచిన్నమూలాలు Angles కొలువఁగల పరికరము.

హెలియోలేట్రీ (Heliolatry):—సూర్యుని పూజించుమతము. (సౌరమతము).

హెలియోలోజీ (Heliology):—సూర్యుని శక్తి, చేయుపని, వేఁడి మొదలగువాట్లం గూర్చినకల.

హెలియోసెంట్రిక్‌సిస్టమ్:- (భూమధ్యసిద్ధాంతము చూడుఁడు — కోపర్నికస్‌పండిత సిద్ధాంతము చూడుఁడు).

హెలియో సెంట్రిక్ సిస్టమ్ (Helio Centric system):— ఇది ఎస్ట్రానామీ శాస్త్రవిధానములలో నొకటి. దీనికిఁ గర్త Niccolaus Copernicus పండితుఁడు. (గ్రహణములు చూడుఁడు).

హెలియోస్కోప్ (Helioscope):—సూర్యుని జూచుటకైన పరికరము.

హెల్మినోలోజీ (Helminthology):—జంతువుల intestines లో జీవింపఁగలజంతువులకు helmith అనిపేరు. ఇది వాటింగూర్చినకల.

హెల్లెనిజమ్ (Hellenism):—Physicial and intellectual culture (sweetness and light as they are called together) గ్రీకు idial ను గూర్చిన ప్రత్యేకకల. అనమ్మకము.

హేలేస్‌కోమెట్ (Halleys comet):—(కోమెట్సు చూడుఁడు — తోఁకచుక్కలు చూడుఁడు).

**హెల్లే (Edmond Halley)**:– ఈఖగోళ జ్యోతిషవేత్త (Astronomer) లండనునగరమున క్రీ. వె. ౧౬౫౬ అక్టోబరు ౨౯ తేదిని జన్మించి, గ్రినిచ్చిపురమున ౧౭౪౨ జనవరి ౧౪ తేదిని మృతి నందినవాఁడు.

ఈయన Royal astronomer గా పదవి నందినవాఁడు. న్యూటనుప్రభువద్ద విద్యాభ్యాస మొనర్చినవాఁడు. Jupeter, Saturn మొదలగు కొన్నిగోళములం గూర్చి పరిశీలించి వాటి చలనవిధానములను గనిపెట్టినవాఁడు.

**హెల్లోగ్రాఫీ (Hellography)**:— టెలిగ్రాఫునందు శబ్దములను నడపి వార్తలను విదేశస్థులకుం దెలుపునటుల సూర్యునికిరణములద్దములందు ప్రతిఫలింపఁజేసి వాట్లను కదపుటవలనఁ గల్గెడి (Reflections) ప్రతికాంతులనుదూరములగు తావుల కనుపుటమూలమున (సౌంజ్ఞలుగ) మాటలనంపుకల.

**హెల్లోటిపెస్ట్రి (Hellotypestry )**:— Photograph Negatives మూలమున కెమికల్సువాడి లితోగ్రాఫువలెనే పెక్కుప్రతుల (Copies) తీయు నొకకల.

**హెవీస్టాకు (Heavy stock)**:—వాణిజ్య సంబంధ పరిభాషాపదము. విస్తారమై యొత్తిడి గల్గించుచుండు Railway goods traffic ను నడపుటయం దీపేరు వాడుచున్నారు.

**హెస్సిడరమ్స్టాటు గ్రాండుడచ్చి**:— ఐరోపాఖండమున జర్మనుదేశములోని మైనరు స్టేట్సునకుం జెందిన గ్రాండుడచ్చి. (జర్మనుమైనరు స్టేట్సు, జర్మనీదేశము చూడుఁడు).

**హేంగ్‌మేన్సు వేజెస్(Hang man's wages)**:—పదమూఁడు పెన్నీలనర (thirteen and half pennies) కీఉక్తి వాడుచున్నారు. తొల్లింట నీమొత్తమును హరించుట నీచాపరాధముగ నెంచఁబడెడిదఁట. ఒకప్పు డొక నీచుఁడు ఉరులందీయువాని కూలిసొమ్మునుండి పదమూఁడున్నరపెన్నీ లపహరించుటంజేసి నీచకార్యముగ వాడుకగల్గెనఁట.

**హేకెనీకేరేజి (Hackney Carriage)**:– హేకెనీ యన ఫ్రెంచిభాషయందు తాపీగా నడచిపోవుగుఱ్ఱమున కర్థము. కాని, యది లాగుబండికేసంబంధము లేదు. ఇంగ్లాండుదేశమున ప్రయాణముల కద్దెలకుఁ గుదురునట్టి మెల్లగ నడచిపోవు గుఱ్ఱములకు 'హేకెనీ' యని వాడుకగల్గెను.

పిదప రానురాను కాలములు మారినకొలఁది హేకెనీపేరు రోడ్లు ఇంగ్లాండున వేయఁబడుచు బండ్లయందు ప్రయాణములొనర్ప నారంభమగుచుండుకాలమున ప్రయాణముల కద్దెలకుఁ గుదురునట్టి మెల్లగనడచిపోవు గుఱ్ఱపుబండ్లకుఁగూడ వ్యాపించెను. పిదప నది ప్రసిద్ధమై ప్రభుత్వము 'Hackney Carri act' అనుశాసనముగూడ రచించి యాపేరును స్థిరపఱచిరి.

సర్వసాధారణముగ నద్దెలకుఁ గట్టుగుఱ్ఱపు బండ్లను 'హేకెనీ కేరియేజి' అనెదరు. హేకెనీ లండనునగరపు ఈశాన్యదిశగానున్న బరోవై యున్నది. ఇచటి గుఱ్ఱములు సుప్రసిద్ధములు. ఇచట downs, Marshes అధికము. గుఱ్ఱములు అద్దెబండ్లకుఁ గట్టఁబడుట నీపే రద్దెబండ్లకుఁ గల్గెనఁట. హెకెనీగుఱ్ఱములు బండ్లనులాగుట స్వారీనీయుటకుఁగూడ వాడఁబడును. 14 hands and more పరిమాణమని చెప్పఁబడినది.

**హేగ్ కాన్ఫరెన్సు:—** హేగుపట్టణము హాలండుదేశపురాజధాని. హాలండు చాల చిన్న దేశమగుట తటస్థదేశముగ నేర్పడియున్నది. ఇది యితర బలమగు నైరోపాదేశస్థుల యంతఃకలహములలో జోక్యము గల్గించుకొనదు గాన హేగుపురము సంధిసభలు జరగు తావులలో నొకటిగా నున్నది. సుప్రసిద్ధమగు క్రీ. శ. ౧౮౯౯ లో జరిగిన హేగుకాన్ఫరెన్సు రెండవనికలాస్ జారుగారిసలహామేరకు జరిగి, యిందొక సకలదేశీయన్యాయస్థానము హేగునం దేర్పఱుపఁ బడినది. దీనిని 'Inter national tribunal' అనియెదరు. దీనిసంధిపత్రమునందు పదునారు ప్రభుత్వములు సంతకములు చేసినవి. సాధారణముగ ప్రతిప్రభుత్వమును నల్గురున్యాయాధిపతులను ఆరేసిసంవత్సరములకాలమున కేర్పఱచుచుండును. క్రీ. శ. ౧౮౩౨ లో గ్రీన్లాండుప్రభుత్వము విషయమైన తీర్మాన మిటనే జరిగెను.

**హేగియొగ్రాఫీ (Hagiography):-** తొల్లింటి యాదికాలపుఋషిసత్తముల జీవితచరిత్రమునుగూర్చిన విద్య. జీవితచరిత్రకు (వ్రాయఁబడినది)Haliograph అనియు, నీవిద్యకు Hagiography లేక Hagiology అనియుఁ బేర్లు కలవు.

**హేన్సమ్‌శకటము (Hansom):—** ఒంటిగుఱ్ఱముచే లాగఁబడు రెండుచక్రములపెట్టెబండి. ఇర్వురు కూర్చుండుతావుగల పెట్టెబండి. తోలువానియాసన మెత్తుగ వెనుకతట్టున నమర్పఁబడి, బండిటాపుపైనుండి వచ్చినపగ్గములు వానిచేత నుండును. ఇది చాల చులకనగా పోవుబండి, ద్వారము ముందున కమర్పంబడి యొకప్రక్కకు తిరిగియుండును. యార్కుషైరు కాపురస్థుఁడగు J. A. Hansom గారిపేరం బరగుశకటము. చక్రములు పెద్దవిగ నుండును.

**హేన్సు ఎండర్సేన్ (Hans Christian Andersen):—** ఈబుద్ధిశాలి డెన్మార్కుదేశస్థుఁడు చాల బీదవాఁడై యుండెను. ఈతఁడు ఫెయిరీటేల్సు (Fairy tales) కట్టుకథలు వ్రాసినవాఁడు. పాశ్చాత్యదేశములందు 'ఫెయిరీ' లనఁబడునవి దేవతాసంబంధ స్త్రీవ్యక్తులు. వాట్లతో మానవుల కథలం గల్పించి వ్రాసినవాఁడు. కొన్ని నాటకములుగూడ రచించెనట. తర్వాతికాలమున పెక్కండ్రు భూపతుల సన్మానము నందినవాఁడు.

**హేన్లేజి [Hanlage]:—** వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఒకరెయిల్వేస్టేషనునందు పంపఁబడుసరకునకగు రెయిల్వేఛార్జిమూల్యము. ఇందు loading & un-loading ఛార్జీలు చేరవు.

**హేప్లోగ్రాఫీ (Haplography):—** తలంచుకొనని దే ప్రమాదవశముగా నొకమాట కొకమాటయు, నొకయక్షరమునకు వేఱొకయక్షరమును, నొకసారి వ్రాయవలసినది వేఱొకసారిగ వ్రాయుటయు, రెండుపర్యాయములు వ్రాయవలసినదాని నొకసారి వ్రాసి యూరకుంటయు.

**హేబర్డాషర్ (Haberdasher):-** Flemish దుకాణములవారు తమ యంగడులనుండి Habtihrdas (ఇది కావలయునా?) అని యరచుచుండువారట. అట్టియంగడు లింగ్లాండునందు ప్రారంభమై ప్రస్తుత మాయరపులు లేకున్నను, ఆపేరాంగ్లభాషాసాంప్రదాయముమేరకు కొంచెము మారి పై రూపముఁ వహించి యట్టియంగడులవారి కన్వర్థ మయ్యెనట.

**హేమకూట (పర్వత) ము:—** ఇది యక్షనగరమగు నలకాపురమున కధిపతియగు కుబేరనివాసమని మహాభారతము భీష్మపర్వ, ౬ యందునను, కూర్మపురాణము ౧-౪౮ యందునను జెప్పఁబడినది.

అలకానంద, యమునా, భగీరథీనదు లుత్పన్నములగు భండారుపుచ్ఛపర్వతపంక్తికిని హేమకూటమని పేరని వరాహపురాణము ౮౨యందుఁ జెప్పఁబడినది.

**హేమగవగోత్రము:—**
[రథితరఉపగణము చూడుఁడు].

**హేమద్పన్తు [హేమాద్రి]:—** మహారాష్ట్రదేశమేలిన యాదవభూపతియగు రామచంద్రనృపతికడ మంత్రిగనుండినవాఁడు. చతుర్వర్గచింతామణిని రచించినమహాపండితుఁడు. మహారాష్ట్రదేశమున హేమద్పన్తువిధానదేవాలయము లనంబడువిధానకర్త. అనేకదేవాలయములం గట్టించినవాఁడు. (మహారాష్ట్రదేశము చూడుఁడు.)

**హేమమణిగోత్రము:—**
(ఉపమన్యుగణము చూడుఁడు).

**హేమరత్నగోత్రము:—**
(అగస్త్యఉపగణము చూడుఁడు).

**హేమర్డు (Hammered):—** వాణిజ్య సంబంధపరిభాషాపదము. Hammered ఇది Stock exchange పదము. ఒక stock exchange సభ్యుఁడగువాఁడు తన బాకీలను చెల్లింపక కాలమతిక్రమించెనేని పూర్వకాల మందలి యాచారమునననుసరించి కఱ్ఱసుత్తితో (hammer) బల్లపై ముమ్మారు కొట్టి శబ్దముగల్గించి, సభ్యుల దృష్టి నాకర్షించి, సకాలమున సొమ్ముచెల్లింపని (defaulter) యాతఁడని ప్రకటించువారట. తోడనే యతనిసభ్యత్వ మంతమైపోయెడిదఁట. సుత్తికొట్టి పిలుచుటంబట్టి defaulter లకు 'The hammered' అనుపే రన్వర్థమయ్యెనఁట.

**హేమవర్మిగోత్రము:—**
(హిమోదక ఉపగణము చూడుఁడు.)

**హేమాంగదుఁడు:—** యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి వసుదేవుఁడు. తల్లి రోచన. (ఈతఁడు రెండవసుతుఁడు.) భిన్నోదరసోదరలు శ్రీకృష్ణబలరామాదులు.

**హేమాక్షికము:—**
(తారమాక్షికము చూడుఁడు.)

**హేముఁడు:—** తండ్రి జయద్రథుఁడు. బలిపితామహుఁడు.

**హేమెటోలొజీ (Haematology):—** శరీరమునందలి రక్తముంగూర్చిన కళ. శరీరమున రక్తము ప్రవహించు (movements) టగూర్చిన జ్ఞానమునకు 'Haemophilia' అని యనెదరు.

**హేమెటోసిటోమేటర్ (Haemato-cytometer):—** శరీరమునందలి రక్తమునఁగల Corpnscles లెక్కింపనగు పరికరము.

**హేరంబనరసింహన్యాయము:—** హేరంబయన వినాయకుఁడు. ఇది యేనుఁగు, మనుష్యుఁడు కలసినరూపము. నరసింహస్వామి ఇది సింహము, మనుష్యుఁడు కలసినరూపము. అనఁగా రెండురూపములందు మనుష్యశరీరములపై నేనుఁగుశిరస్సు, సింహపుశిరస్సునని భావము.

విరుద్ధపదార్థముల కూడికగలుట నీన్యాయ మందుఁ దెలుపఁబడినది. ఇంకను ఏనుఁగకు, సింహమునకు వైరమైనను వినాయక నృసింహులకు వైరము లేదని గమనింపఁ దగినది.

**హేలమంచకులగోత్రము:—**
(యలమంచకుల చూడుఁడు).

**హేల్క్యాయిన్ డేస్** (Halcyon days):— ప్రశాంతసౌఖ్యదినములని (Peaceful happy days) యర్థముగ వాడఁబడుచున్న ఉక్తి. తొల్లింట Celyx అనువాఁడును, Halcyone అనునామెయు ననురాగవంతులగు దంపతులనియు, నాతఁ డకాలమరణముం జెందఁగా నామెయు జీవింపనొల్లక యాతనిశరీరముం గట్టుకొని తానును సముద్రమునంబడి మృతిజెందెనని యుం జెప్పఁబడినది. ఇంకను తోడనే వారిద్వరు లకుముకిపిట్టలై (King fishers) రనియుఁ జెప్పఁబడినది. దక్షిణాయనము (Winter Solstice) నకు పూర్వ మేడుదినములును, దక్షిణాయనప్రవేశమునకుఁ బిదప నేడుదినములును కల్పి పదునాల్గుదినములు 'Hal cojon days' అనంబడుచున్నది. Happy days అని చెప్పుటకీ ఉక్తిని వాడుచున్నారు.

**హేలికోప్టరులు:—**
(హైడ్రోవిరోపెలేనులు చూడుఁడు.)

**హేహయదేశము:—**
(అనూపదేశము చూడుఁడు.)

**హేహయ లేక హైహయవంశనృపతులు:—**వీరు చంద్రవంశక్షత్రియులు. హేహయుఁడు యదుమహారాజు మునిమ్మనుమఁడు. సహస్రజిత్తు మనుమఁడు. శతజిత్తు సుతుఁడు. వేణుహయుఁడు, మహాహయుఁడు నీతనికి సోదరులు. కుమారునిపేరు మాహిష్మంతుఁడు.

౧ హేహయుఁడు, ౨ మాహిష్మంతుఁడు, 3 పృశ్ని, ౪ వృష్ణి, ౫ ఉశనస్సు, ౬ మాహిష్మంతుఁడు, ౭ కృతవీర్యుఁడు, ౮ కార్తవీర్యార్జునుఁడు (పేరు అర్జునుఁడు పాండవార్జునునుండి భేదపఱచుటకై తండ్రిపేరుం గల్పి కార్తవీర్యార్జునుఁడని వాడుచున్నారు.), జయధ్వజుఁడు, తాళజంఘుమహారాజు (ఈతనిసంతతివారు తాళజంఘులనంబడుచుండిరి). వీరిసంతతివారు కొందరు బిలాసపూర్ కడనున్న రత్నపూర్‌నందు రాజ్యమేలిరి. మరికొందరు గడమండలము లేక గర్హామండల రాజ్యమేలిరి. (దక్షిణకోసలము).

**హేహయుఁడు:—** అత్రి చంద్రవంశ యాదవుఁడు. తండ్రి శతజిత్తు. సోదరులు వేణుహయుఁడు, మహాహయుఁడు ననువారు. పుత్రుఁడు మాహిష్మంతుఁడు. ఈతనినుండి హేహయవంశ క్షత్రియశాఖ ప్రారంభమాయెను. చేదిదేశమేలిన నృపతి.

**హైక్రోమీటర్** (Hycrometer):— గాలియందలి యుదకము (అనఁగా నావిరిరూపముననున్న యుదకము) గొలిచి తెలుపునట్టి యంత్రపరికరము.

**హైజిన్ కల** (Hygiene):- ఆరోగ్యశాస్త్రము. ఈవిద్యను పాశ్చాత్యవైద్యవిద్యకును, (Medical) పారిశుద్ధ్యవిద్యకును (Sanitation) సంబంధించినదిగఁ జెప్పఁబడినది. ఆరోగ్యవంతము, పరిశుభ్రవంతము, శుచివంతమునగు జీవిత

మునకు వలయు విధివిధానజ్ఞాన మీాశాస్త్రము నందుఁ జెప్పఁబడినది. Bacteriology యనం బడు క్రిమికీటకాదులమూలమునఁ గల్గు సంబంధ దోషములంగూర్చిన విజ్ఞానకల హైజనుసంబంధమే యని చెప్పఁబడినది. ఈశాస్త్రవిజ్ఞానవిధు లందు ముఖ్యమైనవి పరిశుభ్రాహారము, పరిశుభ్రపానీ యము, పరిశుభ్రవాయువునని చెప్పఁబడినది. ఈ మూటియం దేది దోషవంతమై చెడినను శరీరా రోగ్యభంగము ఫలితముగఁ జెప్పఁబడి రోగోదయ మగునని వివరింపఁబడినది. ఈసందర్భమున ప్లేగు వ్యాధి, కలరావ్యాధి, అంటురోగములగు మశూచ కాదులు కల్గుట, వ్యాపించుటల నాఁపుట కీశాస్త్ర విధులే తగుసాధనములుగఁ జెప్పఁబడినవి.

హైజను విజ్ఞానమును పాశ్చాత్యపరిశీలకులు Internal అనియు, External అనియు ద్వివి ధములుగ వివరించియున్నారు. Internal Hy- giene నందు (1) Free Exercise (వ్యాయా మము) (2) Occasional evacuation of bowels (విరేచనసాధనము) (3) Pure food (పరిశుభ్రాహారము) (4) Pure water (పరి శుభ్రోదకపానము) (5) Pure air (పరిశుభ్ర వాయువు నూపిరిగపీల్చుట యనునైదు భాగ ములు చెప్పఁబడినవి. తక్కిన External hy- giene భాగమున పరిసరపరిశుభ్రత (cleanly sourroundings) Sunlight (ఎండ) యను రెండుభాగములును వివరింపఁబడినది.

అంటువ్యాధులసంబంధము గల్గినతావులందు వాటిని నిర్మూలనమొనర్చి శుభ్రపఱచుటకు 'Dis- infection' అనిపేరు. వాటికిఁగాను కొన్నిద్రావ కములు ప్రయోగించుటయుఁ, గాల్చుటయు, నెండకు వదలి బహిరంగపఱచుటయు సాధనము లుగ నున్నవని కనిపెట్టఁబడినది. ఇండ్లలోగాలి స్వేచ్ఛగ ప్రసరించుట, యెండ లోనికిఁ దగులుట, నిష్కలంకముగ ఘాటుగలసున్నము పూతవేయు చుండుట, తుడచి పేడతో నలికి పరిశుభ్రపఱచు టయు మొదలుగాఁగల క్రియలు హైజినుశాస్త్ర విధులే.

భుజించుపదార్థము నిల్వయుండుటవలనఁ జెడి పోయినవి గాక, యర్హమగు పసనుగల్గియుండుట హైజిన్‌విధులలోనిదే యనియు, నీరు పరిశుభ్రము స్వచ్ఛతలం గల్గియున్నతరినే త్రాగవలెననియుఁ జెప్పినవిధు లీహైజినుసంబంధములే యని యెఱుం గవలయును.

## హైటోమీాటర్ (Hyetometer):—

దీనిని 'rain gang' అనియు నందురు. కురిసిన వర్షముయొక్క పరిమాణమును వివరించు పరి కరము.

## హై్డ్రాలిక్సు (Hydraulics):—

హైడ్రోర్ అనిన నీటి కర్థము. ఇది ఎంజనీరింగ్‌కల యం దొకభాగము. దీనియందు ద్రవ్యముల కద లికంగూర్చిన ధర్మములు వివరింపఁబడును. అందు ముఖ్యముగ నీటిచలనపుటెనర్జినిగూర్చి వివరించు శాస్త్రము హైడ్రోలిక్సనఁబడును.

ఉదకముయొక్క చలన మెగువనుండి కల్గుబరువు యొక్క యొత్తిడివలననే గల్గుచుండును. ఒత

డియే లేకుండిన నుదకము ప్రవహించుటయే సంభవింపదు. ఇదియే దీని ప్రధానసిద్ధాంతము.

ఒకగొట్టమును నిలువఁబెట్టి దానినిండ నీరు నింపితిమేని క్రిందినుండి నీరు కారిపోవుటకు కారణమైన యొత్తిడి (pressure) పైనుండి ప్రారంభమగునని యందఱెఱిఁగినదే. ఆయొత్తిడియందు నీటియొక్క బరువు మాత్రమే గాక మహావాయుపథమందలి వాతావరణపు టొత్తిడియుఁ గలదు. ఆగొట్టమునందు కొన్ని వంకర లున్నవనుకొందము. ఈవంకరలతోసహా తలనుండి కొంత దిగువగా గొట్టమునం దొకతావునఁగల ఒత్తిడిబలమును గొలిచి యుంచుకొందము. మఱియు వంకరలు లేక తిన్నగనున్న వేరొకగొట్టము నదేయెత్తున నిలిపి, యందు నీరునింపి దూరమును పాటింపక, వంకరల గొట్టమునం దెంతదిగువగ నుండుతావున నొత్తిడిని పాటించితిమో యంతేదిగువను దానితో సమముగ నుండుతావున తిన్నని గొట్టమునందలి తావున నొత్తిడిబలమును గొలిచితిమేని రెండును సమముగనే యుండుట దెలియఁగల్గుదుము.

ఇందువలన వంకరలను పాటింపక దూరమున దిగువను నొత్తిడిబల మొకేరీతి నుండునని తేలినది. ఇం దొకకొండపై నీటిరిజర్వాయరు నేర్పఱచి చుట్టు క్రిందికి నీరుతీసికొనుచుంద మనుకొందము. అత్తరి నాకొండపై నెత్తగు తావునకు Head అనియు, నందు బలము(energy) కలదనియు, దానిని కొన్నిపనులొనర్ప నుపయోగించుకొన నగుననియు శాస్త్రజ్ఞులు కనిపెట్టిరి. దీనిని సైఫన్ (siphon) గుండా నడిపి బరువులెత్తించుట, బరువులునడపుట మొదలగుపనులం జేయింపవచ్చునని కనిపెట్టఁబడినది. మరియు నెత్తునుండి గొట్టములగుండా క్రిందికిందింపఁబడిననీ రల్లె వాతావరణసంపర్కముం దగులనీయక పైకెత్తి నడిపిన, నందు నీరు పైకెగురుననియు, ఎగురుట యన మొదటి Head reservoir కన్న నదనముగ పైకెగురుననియుఁ జెప్పఁబడినది.

కాని యీయెగురుట ముప్పదిమూడడుగుల వఱకేయని తేలినది. మఱికొందరియనుభవమున నిది యిరువదియెన్మిది యడుగులదనుకనే యని యనుచున్నారు. ఈశాస్త్రము క్రీ. వె. ౧౭౫౫ సంవత్సరమునుండి యభివృద్ధినొంది వాడుకలోనికి వచ్చినది. హైడ్రోలిక్సుశాస్త్రవిధానమున 'Hydrostatics' అనియు, 'Hydrokinetics అనియు నీశాస్త్రము ద్వివిధములుగ నెఱుఁగఁదగినది.

ఇక్కాలమున నెంజనీయరులు గొప్పగొప్ప బరువగుదూలముల నెత్తుట, వంతెనలపై నినుపగర్డరులం బైకెత్తుట, ముందునకు వెన్కకు ప్రక్కలకుం జరుపుట మొదలగుపనుల నీహైడ్రాలిక్సుమూలముననే పరిపూర్తి గావించుచున్నారు. జలప్రవాహమునుగూర్చిన పై సిద్ధాంతము లానకట్టులు, నీటికాలువలు, వంతెనలు మొదలగు నిర్మాణపనులకు పట్టణములలో విధానములయందును, జలఘర్షణమును శక్తిరూపకముగా (ఎలక్ట్రిసిటిగా) చేయుటమొదలగువాని కుపయోగింపఁబడును.




**హైడ్రోఏరోపెలేన్:**—ఇదియు నేరోప్లేను వంటి యంత్రమును శరీరమును గలదియే (ఏరోప్లేనులు చూడుఁడు) గాని యిది నీటిపైనుండి తేలుచు బయలుదేరుటకును, నీటిపై వ్రాలుటకును ననుకూలపరిస్థితులతో శరీరభాగములు కొన్ని చేయఁబడి యమర్పఁబడినది. నీటిపైఁ దేలుపడవలంబోలి నీభాగములుగలచక్రములు తిరుగుటకుఁగాని, తిరుగకపోవుటకుఁగాని, పైకెత్తఁబడుటకుఁగాని, క్రిందికి దింపఁ బడుటకుఁ గాని వీలగునట్లమర్పఁబడి యుండును. దీనిని సీప్లేను [Sea plane) అనియు ననెదరు.

ఇటీవలి పరిశీలన లోకమోస్తరు హైడ్రోప్లేనును 'హెలికోప్టరు' అని [Helicopter]

పేరిడఁజేసినవి. ఇది నీటఁదేలుచుండినతరి start నిచ్చి యెగిరించిన గాలిలోనికిఁ దిన్నగాఁ పైకెగురును. అత్తరి దిశలకుం దిప్పుట ముందుకు నడపుట మొదలగు పనుల కనుకూలించురీతిని యంత్రములను మార్పు జెందింతురు. ఇటుల నీయంత్రమును నడపుచుందురు.

## హైడ్రోకార్బన్ (Hydro carbon):—

ఇది యొకకాంపౌండని చెప్పఁబడినది. ఇందు కార్బన్ హైడ్రోజనులు ప్రధానద్రవ్యములు. హైడ్రోకార్బనులందు రెండుజాతులు కలవు. అవి ౧ పెట్రోలియమ్, ౨ డైడిస్టిలేషన్ ఆఫ్ కోల్ అనునవి.

హైడ్రోకార్బనును 'Neutral combustible' అనెదరు. ఇది వేఁడివలన హైడ్రోజనుగను, కార్బనుగను, decompose అగును. ఇది combustible అని చెప్పఁబడినది.

(కాంపౌండ్సు చూడుఁడు).

## హైడ్రోక్లోరిక్ ఏసిడ్ (Hydro chloric acid):—

దీనిని muriatic acid అనియునందురు. (H. C. I.) హైడ్రోక్లోరిక్ ఆసిడ్ గాస్‌ను నీటియందుఁ గరఁగించి చేయఁబడునది. దీనిని soda ash చేయుతావులందు by product గాఁజేయుచున్నారు. దీనియందు జీర్ణింపఁజేయు శక్తి గలదు. ఇది బలముగునది యయ్యేనేని విషమగునని చెప్పఁబడినది.

## హైడ్రోగ్రాఫీ (Hydrography):—

Surface waters of the Earth నుగూర్చిన శాస్త్రము. మరియును, (Hydrography) నీటినిగొలుచుకల. అనఁగా సముద్రఁపునీటిని గొలుచుటంగూర్చినకల. పెద్దనదులు, సరస్సులు, ప్రవాహములు, నీటిలోనికొండలు, పగడము మొ॥ చట్టలు, రాళ్ళు, మొదలగు నావికాసంబంధము లన్నిటింగొలుచుటకు నైపుణ్యమిచ్చుకల.

## హైడ్రోటోమాట్ (Hydrautomat):-

ఇట్టియంత్రములంగూర్చి సరిగా లోకమునకువెల్లడి కాలేదు. సాధారణపరిస్థితులయందు దుదకము పల్లమునకు జనునేకాని మెరకకెక్కదని యెల్లరెరింగినదే. కాని గాలిం దీసివైచిన యొక Vaccum గొట్టమునందు నీరు పైకి ముప్పదియడుగుల యెత్తున కెక్కుననియు, నది క్రిందినుండి పైకినెట్టి ఒత్తడి (Forse of pressure) చే నిట్టిపని జరుగు ననియు, నొకధర్మమును శాస్త్రవేత్తలు గ్రహించియున్నారు. అట్టిపనిని జేయుయంత్రములకు పంపు (Pump) అనెదరు.

ఇందొకవిచిత్ర మింకను గమనింపవలసినది కలదు. ఒకగొట్టము నొకకొంతయెత్తునుండి కొంత వఱకుఁ గ్రిందికి దింపి వంచి తిరుగ దానిని పైకెత్తి దానియందు నీటిని నింపిన నందు గాలియుండని కారణమున పైనుండి నీటిబరువుఒత్తడి (pressure force) కల్గియున్న హేతువుగ నెంత యెత్తునుండి యాగొట్టమందలినీరు ఎత్తఁబడుచున్నదో యంతయెత్తుదనుక నాగొట్టమందలినీరు గొట్టము వంగినతరువాతభాగమున పైకెగురునని యుదేధర్మముగా శాస్త్రవేత్త లెఱింగియున్నారు. దీనిం బట్టియే ఫౌంటైనా లనంబడు జలయంత్రములం జేయుచున్నారు. వీటిని శాస్త్రగ్రంథములందు సైఫన్ (Cyphon) లనియెదరు.

ఇవి సరియగు Perpetual molions కాకున్నను అట్టివియే యని శాస్త్రగ్రంథములందుఁ గాననయ్యెడిని. పై రెండుపరిస్థితులు లేనితావుల

నదియందలి జలప్రవాహమును పై కెత్తుట యసాధ్యము. ఇట్లయ్యు లోకమున విద్యాధికులగు ఎంజినీరులయందు ఉత్తరమునుండి దక్షిణమునకు ప్రవహించు మిసస్సిప్పినది మెరక నెక్కుచు ప్రవహించుచున్నదని యొకచలోక్తి వాడుకయందున్నది. ఏలయన భూమి యుత్తరదక్షిణములతగ్గిపోయి Low elivation గను, భూమినడుమను భూమధ్యరేఖకడ నెత్తుగ Higher elivation గను నుండును గాన నుత్తరమునుండి దక్షిణమునకుఁ బ్రవహించు నదియగు మిసస్సిప్పినది పల్లమగు నుత్తరమునుండి యెత్తగు భూమధ్యరేఖ (equator) కుఁ బోవుటయం దెత్తున కెక్కుచున్నదని చలోక్తిని వాడుచున్నారు. ఇందలి నిజమేమోగాని యిటీవల లండనునగరసీమయందు Wandle అనుపేరుగల యొకకొండవాగునుండి క్రిందికి (సమతలమునకుఁ దొరలు) కొండవాగునుండి యనుకూలమగు తావున నసఁగా Carshalton గ్రామముకడ నొక యంత్రమును నీటినుండి ప్రక్కమెరకప్రదేశమునకు ఆకొండవాగుజలములే యెల్లప్పు డెక్కుచుండునటులఁ గుదిర్చి, నీటిని పై కెక్కునటులం జేసియున్నారు. దీనిని గన్పెట్టి రచించినవాఁడు సుప్రసిద్ధుండగు ఎంజినీరు T. G. Allen పండితుండని చెప్పఁబడినది. ఆధీశాలియే దీనింగన్గొనినవాఁడట. దానింగూర్చి "It depends entirely for its working action on two natural sourecs of energy-the weight of a column of water and atmosphearic pressure" అనివివరింపఁబడియున్నది. ఇంక నీయంత్రముపనిచేయుటంగూర్చినవివరములందు 'All that is needed is:-a river that has a certain fall of water from a higher to lower level - and between these two levels. an operating chamber is constructed into which water flows threw a supply pipe from the upper Level- and from which it runs away to the lower level. In doing so by an ingeniows use of a Vacumm and compressed air - the water of the river is raised to a place many feet high, అనివివరింపంబడియున్నది.



ఇంక దీనిపనింగూర్చి నాల్గుసంగతులు వివరింపఁబడినవి. వాటి నట్లే వివరించిన సమంజసమని యాంగ్లముననే వివరించెదము గాక.

I. It consists of an operating-chamber at the bottom and a series of tanks alternately opend and closed and connected with pipes. An air pipe also links them all. Water is shown here [in the picture] running into the Operating chamber from the river below - thus compressing the air and forcing it threw the air pipe to the closed over head tanks.

2. The closed overhead tanks are full of water at the begining of

the operation - but the pressure of the air from the operating chamber forces the water out of the closed tanks- and in each case it passes threw a bent outlet pipe, into the tank immediately above. At the close of the operation - therefore as shown in the picture - the operating chamber and the open tanks are full of water and the closed tanks are full of air.

3. The operating chamber-now-decharges its water into the river - and in doing so - automatically closes. By a simple lever machenism - the inlet into the chamber from the river. When the water has all run-out at the lower level - practically a vacum is left, which extends - by the air pipe to the various closed tanks above.

4. The Vacuum in the closed tanks. Causes the water to be sucked up one flight from the open tanks below and at the end of the movement- the operating chamber and the open tanks are empty of water, while the closed tanks are full- the inlet from the river then automatically opens- and the operation is repeated.

ఇట్టిఆపరేషనులు వాటికవే సర్వదా నడచుచుండునని చెప్పఁబడినది.

హైడ్రోట్రోపిజమ్ [Hydrotropism]:- మొక్కలు తమమూలములను నీరు చమ్మగల వైపునకు త్రోసికొని పెరుగునని నమ్మకము.

హైడ్రోడినామోమీటర్ (Hydrodynamo meter):—Engine power కొలుచు పరికరము.

హైడ్రోపతివైద్యము (Hydropathy):— ఉదకమువలన చేయు వైద్యవిధానము. ఇది మంచు తోఁగాని, యుదకముతోఁగాని ఆవిరితోఁగాని, లోపలకు బైటికిఁగూడ వైద్యమొనర్చుచున్నారు. ఇంకను నుష్ణోదకముంగూడ నీవైద్యవిధానమున నుపయోగింతురట. ఉష్ణోదకస్నానము, అతిశీతళోదక స్నానము మొదలగున వింకు వేర్వేరుగుణములం గల్గించునట.

హైడ్రోప్లేన్:—
(హైడ్రోఏరోప్లేను చూడుఁడు.)

హైడ్రోఫోన్:— నీటియందు ధ్వనులను దెచ్చి వినిపించుయంత్రపరికరము. దీనిమూలమున నోడలు సముద్రమున నడచుతరి నీటియందుఁ దిరుగు నోడభాగముల ధ్వనిని దెలిసి యేవేవో సంగతులం గ్రహించుచుండును.

హైడ్రోమీటర్ [Hydrometer]:— తేలుచుగ liquids యొక్కయు, కొన్నొక్కప్పుడు solids యొక్కయు specific gravity ని కొలుచుపరికరము.

హైడ్రాలోజీ (Hydrology):— ఉదకములు, దానియందుఁగల పదార్థములు, నవిచేయుఁగలపనులు వీట్లంగూర్చినకల. (Hydrolics)

హైడ్రోసియానిక్ ఆసిడ్ (Hydrocyanic acid):— ఇది విషముగుద్రావకము. (H. C. N.) దీనిని ప్రూసిక్ఏసిడ్ అనియెదరు. దీనిని polassium ferrocyanid ను, సెల్ఫ్యూ

రిక్ ఆసిడ్‌తో decompose చేయుటవలన నేర్పడునని చెప్పఁబడినది.

**హైడ్రోస్కోప్ (Hydr oscpe):—** చెఱువులు మొదలగు నీటిభాగముల యడుగు భాగములం జూడవలసివచ్చినపుడు స్పష్టముగాఁ గానఁ నగునట్లు జూపనగుపరికరము.

**హైదరాబాదు ఎసైన్మెంటుస్ట్రిక్ట్సు:-**
(బీరార్సుప్రోవిన్సు చూడుఁడు.)

**హైదరాబాదుజిల్లా:—** బొంబై రాజధాని సింధుదేశములోనున్నది. హైదరాబాదు (సింధ్) ప్రధానస్థానము. (బొంబై రాజధాని చూడుఁడు.)

**హైదరాబాదురాజ్యము:** ఇది యిండియాప్రభుత్వమునకు లోఁబడిన గొప్పస్వదేశసంస్థానరాజ్యము. దీనిని 'నైజాము డొమినియన్సు' అనెదరు. ఇది రక్షితసంస్థానము. ౮౨,౦౦౦ చతురఁపుమైళ్ళ వైశాల్యమని తలంపఁబడుచున్నది. దక్షిణహిందూస్థానపు పీఠభూమియందున్న రాజ్యము. ఉత్తరపుటెల్లను పయోష్ణి లేక విదర్భానది (ఇప్పటి పెయిన్గంగానది) కలదు. గోదావరీనది యుత్తరభాగములందుఁ బ్రవహించి తూర్పుటెల్లఁగూడ నగుచున్నది. తుంగభద్రానది, కృష్ణానది దక్షిణపుహద్దునఁ గలవు. మూసా యనుపేరుగల చిన్ననది యొకటి హైదరాబాదుగుండా ప్రవహించుచున్నది. ఇట్టి చిన్నచిన్ననదు లింక ననేకములు కలవు. చెఱువులక్రింద పంట కొంతవఱకుఁగలదు. దేశమున నరణ్యాము లధికము. భూమి సారవంతమనియే చెప్పవచ్చును. కొంతవఱకు వరిపంట, ప్రత్తి, జొన్నలు, రాగులును విస్తారముగ నాముదపుగింజలు, నువ్వులును పైరుచేయబడుచున్నవి. శింగరేణికడ రాక్షసబొగ్గుగనులు కలవు. గోల్కొండవద్ద వజ్రపుగనులుండెనుగాని యిప్పు డంతరించినవి. నల్లశాణపురాయి పర్వతములందు విస్తారము దొరకును. ప్రజలు తెలుఁగువారు, మహారాష్ట్రులు, కన్నడులు. హైదరాబాదు సికందరాబాదులం దరవలును గలరు. మహమ్మదీయులు కొంతమందిగ నున్నను వారు పరిపాలకులు, నధికారులు నైయున్నారు. ప్రభువగు నైజాము గారికి His Exalted Highness అనుబిరుదము వంశపారంపర్యముగాఁ గలదు. నైజాం అనిన 'Regulator of State' అని యర్థము. తొలుత ఢిల్లీచక్రవర్తుల రాజప్రతినిధిగ నుండి, స్వతంత్రమువహించిన రాజకుటుంబము. ఇప్పుడు బ్రిటీషుప్రభుత్వమునకు సామంతుడుగ నున్నాడు. దేశమున నినుపబాటల సౌకర్యము బాగుగనే యున్నది.

హైదరాబాదునగరము రాజధాని. నిజాము ప్రభువుగారు మహమ్మదీయులు. ఇది గొప్పపట్టణము. ధనవంతము ప్రజావంతము నైనది. వర్తకము చాల తక్కువ. అరబ్బులు, పఠానులు, రోహిల్లాలు, సిద్దీలు, సైనికులుగ నిటఁ గలరు. గొప్పగొప్ప సామంతరాజులు నగరమున నివసించుచు, గొప్పగొప్ప యుద్యోగులుగ నుందురు. సికందరాబాదు (కడనేయున్నది) బ్రిటీషుసైన్యస్థానమును గొప్పవర్తకస్థానము నైయున్నది. బొలారము మొదలగు గ్రామములు సైన్యనివాసములుగ నున్నవి. ఇది యైదులక్షలవఱకు జనసంఖ్యగల తావని యందురు. తొల్లింటి రాజధానిగ నుండిన గోల్కొండ దక్షిణముగఁ గతిపయదూరమునందున్నది. ఇచటిదుర్గము బలమైన దందురు.

వరంగల్పట్టణము (తొల్లింటి ఒరుగల్లు లేక ఓరుగల్లు ఏకశిలానగరము) జిల్లాయందు ముఖ్య నగరమును, గొప్పవర్తకస్థలము నై యున్నది. తొల్లి కాకతీయవంశనృపతు లాంధ్ర త్రిలింగదేశము నేలిన రుద్రమదేవీ ప్రతాపరుద్రమహారాజాదుల రాజధానిగ నుండినపురము. నాఁటిదుర్గము నేఁటికిని గలదు.

బిదర్పట్టణ మొకప్పుడు మహమ్మదీయరాజధానిగ నుండినది. గుల్బర్గాపట్టణము, వికరాబాదు [తాండూరు], ఔరంగాబాదు, దౌలతాబాదు [తొల్లింటి దేవగిరి], నాందేడు, జాల్నా, రాయచూరు మొదలగు పట్టణములు కొన్ని కలవు. గుల్బర్గా బహమినీసుల్తానుల రాజధానిగ నుండిన పురము. నాందేడు సిక్కుమతస్థుల యాత్రాస్థలము. రాయచూరు చరిత్రప్రసిద్ధదుర్గముగలది. షహాబాదు పలకరాళ్ళకు పేరందినది. ఎల్లూరా గుహాలు, అజంతా [అచింత] గుహాలు, ఈరాజ్యములోనివే. మున్న యనఁబడు మునియేటితీరమందలి కంభంమెట్టు వర్తకస్థలము.

## హైపురగోత్రము:—

(శండిలగణము చూడుఁడు).

## హైపెర్బోలిజమ్ (Hyperbolism):—

అధికోక్తిగ వచింపఁబడిన యుపన్యాసము లేక ఉక్తి. సత్యమునకన్న నధికముగ నుడువుట.

## హైబర్నేషన్ నిద్ర (Hibernation sleep):—

ఉత్తరధ్రువ ప్రదేశప్రాంతములందు చలికాలమున నధికశీతలమగుట సముద్రములే గాక నదులు, సరస్సులుఁ గూడ నీరు మంచుగనై ఘనీభవించి బిగిసిపోవును. అత్తరి అందున్న చేపలు మొదలగు జలచరము లామంచునందు తగుల్కొని చచ్చిపోక నిద్రజెందును. తొలుత మైకముజెంది బిగిసిపోయెడిశీతలత ఉన్నంతకాలము నిద్రయందే యుండి, పిదప మంచు కరగిపోవుటతో తెల్వినంది కదలుచు తిండిని వెదకికొనుచు నడచెడిని. ఈ నిద్రకు హైబర్నేషన్‌నిద్ర యని యాంగ్లమునఁ బేరిడిరి.

చలిదేశములందు కొన్ని యడవిజంతువులు, పొలములందువసించు నుడుతలు మొదలగుజంతువులు శీతకాలమున చీకటిగలప్రదేశములగు గుహాలు, తొఱ్ఱలు, కన్నములు, పుట్టలు మొదలగుతావులందు దూరి ఈ హైబర్నేషన్‌నిద్రం జెందునట. అందు కొన్నిజంతువులు గాఢనిద్రంజెంది శీతకాలాంతమున మేల్కాంచునటగాని కొన్ని మధ్యమధ్య మేల్కాంచుచు తాము కూడఁబెట్టుకొని నిల్వజేసుకొనిన యాహారపదార్థములఁ దినుచు తిరుగ నిదురంజెందుచు కాలము వెళ్ళబుచ్చి నిదుర నుండి మేల్కాంచునట. ఎటులైనను నిదుర వాటి శరీరోష్ణమును దగ్గించివై చెడిని. కొన్నిజంతువులందు ఫారన్హీటుతెర్మోమీటరున నలువదిడిగ్రీలవరకుఁ దగ్గిపోవుటకు, నింకఁ గొన్నిటి కిరువదిడిగ్రీలవరకు తగ్గునని పరిశీలనలు తెల్పుచున్నవి. అట్టిస్థితి చుట్టుపట్లశీతలముకన్న నొకటిరెండుపాయింట్లు వేఁడిమాత్ర ముండునని చెప్పఁబడినది. ఊపిరియు, గుండెలుకొట్టుకొనుచుంటయు కడుంగడు మందమై జగతి మృతులైనట్లే పడియుండును. అట్టి నిద్రనుండి దానిని లేపుటకు విద్యుత్ప్రయోగము Electric shock కావలయునని పరిశీలనలు తెల్పెడిని.

## హైమగవగోత్రము:—

(హారితఉపగణము చూడుఁడు).

**హైమవతవర్షము:**— ఇది భరతవర్షము నకు (భరతపాలనమునకు మున్నుండిన) ఆది నామము.

**హైమవతీ (నది):**— శతధ్రునదికి తొల్లింటి పేరు. వశిష్ఠుడు దీనిందర్శించి జలకములాడనేగినకడ నూరుపాయలై యుండినకతన శతధ్రు యనిపేరిడె నట. దీని నిప్పుడు సట్లెజ్ యనుచున్నారు. సింధు నదిలోఁ జేరునది. పాంచాలములోని నది. దీనిం గూర్చి మహాభారతము ఆది ౧౭౭ యందు వివరింపఁబడినది.

ఇంకను పాంచాలములోని రావీనదికిని నీపేరుండెనని మత్స్యపురాణము ౧౧౪ నందుఁ గలదు. ఇంకను పాంచాలదేశములోని ఐరావతీనదికి నీపేరు వర్తించునని యందే చెప్పఁబడినది. ఋషికుల్య యనునదికి తొల్లింటిపేరు హైమవతి యని యుండెనని హేమకోశమునఁ జెప్పఁబడినది.

**హైమవాహగోత్రము:**—
(అగస్త్యఉపగణము చూడుఁడు).

**హైయెటోగ్రఫీ (Hyetography) లేక Hyetology):**— పుడమిపై నేయేప్రదేశముల నెంతవాన గురియఁగలదో దానిని గూర్చిన కల.

వర్షములవిధానము Monsoon currents వివరించుచు maps వ్రాయుటయు నిందులోనిదే యగును.

**హైరాటదేశము (హైరాటపురము):**- దీని నిప్పుడు గుజరా తనుచున్నారు. పంజాబు దేశమునం దున్నది. గుజరా తనఁగనే ఘూర్జర దేశసంబంధమే యని శంక వొడమకపోదు. చీనా బునది దీనికిఁదూర్పుగా తొమ్మిదిమైళ్ళుండును. జీలమ్‌నుండి లాహోరునకేగు పెద్దబాటపై నున్న పురము. దీనిప్రాంతదేశమునకు హైరాటదేశ మని యొకప్పుడు పేరుండెను. సురాజవంశరాజపుత్రుండగు వచనపాలనృపాలుఁడు దీనిని నిర్మించి యేలిన మొదటిభూపతి యనియు, కొంతకాలమునకు శిథిలముకాఁగా గుజార్ మహమ్మదీయుఁడగు నాలీ ఖానుఁడు పునర్నిర్మాతయై మొదటిప్రభువాయె ననియు, నాతండే క్రీ. వె. ౮౩౩ నం దొకసారియు, ౯౦౧ నందొకసారియు, శంకరవర్మ నృపాలునకోడి కడకు నిహతుఁడాయె ననియు, పిదప క్రీ. వె. ౧౩౦౩ లో పురము భగ్నమొనర్పఁబడి క్రీ. వె. ౧౫౮౦ లో నక్బరుచక్రవర్తిపాలన కాలమున పునర్నిర్మాణ మొనర్పఁబడినదనియు, సర్ కన్నింగ్ హాముపండితుఁ డభిప్రాయపడియున్నాఁడు. మరియు నాపరిశీలకుఁడే యిది అరాటదేశమా యని సంశయముతోఁ దలంచెను. (గుజరాతుపట్టణము చూడుఁడు - గుజరాతుజిల్లా - పంజాబుదేశము చూడుఁడు).

గుజార్ మహమ్మదీయులచే నిర్మింపఁబడి వారిచేఁ బాలింపఁబడుటచే నీపురము గుజరాత్ అయ్యె నని యచటివా రనుట నట్లే తలంపఁబడుచున్నది.

**హైరుపర్చేజి పద్ధతి:**— పెక్కుండ్రికు హైరుపరిఛేజు పద్ధతి, డిఫర్డు పేమెంట్సు పద్ధతి యొకటిగనే తోచుంగాని రెంటికిని చాల భేదము కలదు. హైరుపరిచేజుపద్ధతి నిర్ణీతమగువాయిదాలను సొమ్మంతయు నమ్మినవారికిఁ జెల్లువఱకు వస్తువుయొక్కహా క్కమ్మినవారియందే యుండును. సొమ్ముచెల్లేవఱకు అమ్మఁబడినవస్తు వమ్మిన వారిదె యయ్యుండును. కొనువారి వాడుకయం

నుండునని యేర్పాటు నెఱుంగవలసినది. కాని అమ్మినతోడనే డిఫర్డుపేమెంటుపద్ధతిం బోలి కొని నవారిసొత్తుగ నమ్మబడినవస్తువుగ మార్చఁబడ లేదు. (డిఫర్డుపేమెంటుపద్ధతి చూడుఁడు).

## హైరేటిక్లిపి:—
(హియిరోగ్లిఫిక్‌లిపి చూడుఁడు.)

**హైరోలొజీ (Hierology):**— పవిత్రమగు హంశములపై నాధారపడునట్టి లేక మతగ్రంథ ములపై నాధారపడునట్టి మతవిద్య.

**హైసీస్ (High seas):**—సముద్రపుటం చు లేదొయొకదేశమునకుఁజెందియుండును. అటుల గాక లోబారుసముద్ర మేదేశమునకుఁ జెందినది గాక అందరికి సాముదాయికముగఁ జెప్పఁబడు చున్నది. దానిని 'హైసీ' యనియెదరు. తీరము నుండి మూఁడుమైళ్లదూరమునుండి హైసీ ప్రారం భమని చెప్పఁబడినది.

## హైహయదేశము:—
(అనూపదేశము చూడుఁడు.)

**హైహయమహారాజు:**— హైహయవం శము పురాణప్రసిద్ధము. అంను హైహయవంశ నృపాలు రీయనసంతతివారు. ఈయన నామధేయ మేకవీరుఁడు. ఈయన భార్యపేరు ఏకావళీదేవి. ఈయనకీ హైహయనామ మెటులఁ గల్గెనో తెలియుటకు మహాభారతము, హరివంశము, దేవీ భాగవతము ననుమూఁడుగ్రంథములం జదువవలసి యుండును. ఈమూఁడును వేదవ్యాసవిరచితములే. వీటియందు గమనింపఁదగిన చిత్రమేమన భారత మున రచింపకవదలినసంగతులు హరివంశముననను, నందు పూర్తిగ వివరింపక వదలినసంగతులను స్పష్ట ముగ దేవీభాగవతమునను, నామహాకవి వివరించి యున్నాఁడు. కాని, వీటిమూఁడుగాథలు సమన్వ యించుకొనుట కొంతకష్టమనిపించును గాన చక్కఁ గఁబరిశీలింప వలసియుండును.

చంద్రవంశపు భూపతియగు యయాతిమహా రాజు పురాణప్రసిద్ధినందినవాఁడు. ఆయన కిర్వురు భార్యలుండిరి. అందు పెద్దయామె శుక్రాచార్యుని కుమార్తెయగు దేవయాని. ఆమెయందు యయా తికి యదువు, తుర్వసు ననునిర్వురుపుత్రులు కలి గిరి. యయాతిరెండవభార్యపేరు శర్మిష్ఠ. ఈమె వృషపర్వుండను నసురనృపాలుని పుత్రికయు దేవ యానికి చెలికత్తెయు నని తెలియుచున్నది. ఈమె యందు యదుమహారాజునకు ద్రుహ్యుఁడు, అనువు, పూరువు ననుముగ్గురు సుతులు గల్గిరి. యయాతి తనసింహాసనము పూరువున కొసంగి, తక్కినసుతులు నల్వురకు రాజ్యమున సామంతు లుగ నుండనేర్పఱచి, రాజ్యమున నాగ్నేయదిశ యందు తుర్వసునకును, యదుమహారాజున కీశా న్యదిశయందునను, ద్రుహ్యునకు పశ్చిమదిశయందు నను, అనువున కుత్తరదిశయందునను, రాజ్యమున సామంతనృపాలురుగ నిలిపి, చక్రవర్తిత్వమును పూరువున కొసంగి రాజధానియగు హాస్తినాపుర మున రాజ్యాభిషిక్తునిగఁజేసెనని దేవీభాగవతము ౬ – ౧౬ – ౨౩ యందునను, హరివంశము ౧ - ౩౦ - ౧౭ యందునను, తెలియనగుచున్నది గాన చంద్రవంశము పూరువువలనను, యదువం శము యదువువలనను, సా.గెని తెలిసెడిని.

ఇఁక తుర్వసువునకు సంతానము కలుగనందున నున్నఁడై సంతతికొనసాగ తపమాచరించుచుండ విష్ణుదేవుండు ప్రసన్నుండై ప్రశ్నింప "నీవంటి సుతుండు గావలయు" నని తుర్వసువుకోరెను.

విష్ణుదేవుఁడును తనకు హయగ్రీవత్వమున నొకానొకతరి శాపవశమున లక్ష్మీదేవి యాఁడుగుఱ్ఱమై యమునాతమసానదుల సంగమపవిత్రస్థలియం దుండుతరి, హయగ్రీవునివలనఁ గల్గినసుతుం డగు ఏకవీరుం డనుబాలునిం దెచ్చి యొసంగి తుర్వసుని సంతతి కొనసాఁగింప నొసంగెను. ఆబాలున కేక వీరుండనునామ ముండియు, హయములకు జనించినకారణమున హైహయుం డనువాడుకనంది తుర్వసునకు వంశకర్తయయ్యెను. ఆహైహయుఁడే సుప్రసిద్ధహైహయవంశ నృపతులసంతతికి మూల పురుషుండై తుర్వసునిరాజ్యముం గై కొని తన శౌర్యవీర్యబలపరాక్రమములచేఁ జక్రవర్తియయ్యె నని చెప్పఁబడినది.

హైహయుఁడు కాలకేతుండనురాక్షసునిచేతఁ జిక్కుకొనుచు నార్తనాద మొనర్చుచున్నయేకావళి యనుబాలికం గాంచి యారాక్షసునిదును మాడి యామెను విడిపించి యామెను బరిణయ మాడెనట. వారిసంతతియందే కృతవీర్యుఁడును, ఆయనసుతుఁడుగ సుప్రసిద్ధుండగు కార్తవీర్యార్జు నమహారాజును, జనించిరనియు, నేకావళీదేవి రైభ్యుండను నృపతికుమార్తె యనియు, దేవీభాగవతమునందుఁ గలదు.

హరివంశమున ౧–33 యందు కృతవీర్యుఁడు వారణాసి నృపతియగు భద్రసేనుని సుతుఁడని చెప్పఁబడినది. ఈతఁడు హైహయుఁడేయని వేఱుగఁజెప్పనక్కఱ యుండదు. వీరిసంతతివాఁ డగు మహిష్మంతుఁడు చేదిదేశఁపు రాజధానియగు మాహిష్మతీపురనిర్మాత యందురు. హరివంశము ౨–3౮ నుండి మాహిష్మతినిర్మాత నాగలోకవాసియగు ధూమ్రవర్ణుండనువాని దౌహిత్రుం డగు ముచుకుందుం డనువాఁడని చెప్పఁబడియుంట దీనింగూర్చి పరిశీలనలు జరుగవలసియుండును. లేక అమ్మాహిష్మతి వేరై యుండునేమొ? మాహిష్మతీపురము నర్మదానదీతీర మని చెప్పఁబడినది. ఇప్పు డానగరఁపుఁ జాడ లేశము గానరాకున్నది. [చేదిదేశము చూడుఁడు]. ఒకమాహిష్మతి యాదవులరాజధానిగ నుండెనట. ఏది యెట్లైనను హైహయులు, యాదవులు, వేర్వేరుతెగలనుట స్పష్టము. నేఁటికిని హైహయసంతతివారమని చెప్పుకొను క్షత్రియులు భరతదేశమునఁ బెక్కుండు గానగుచున్నారు.

## హొండురాస్‌దేశ ప్రభుత్వము

(Ho-nduras):– మధ్యఅమెరికాఖండమునందలి ప్రజాప్రభుత్వదేశము.

నలుబదినాల్గువేల రెండువందల డెబ్బదియైదు చతురపుమైళ్లు వైశాల్య మనియు, నేడులక్షల డెబ్బదిమూడువేల యైదువందలు జనసంఖ్యయని యుఁ జెప్పఁబడినది.

## హొండూరాస్ ప్రజాపరిపాలనదేశము

(Honduras republic):— ఇది మధ్య యమెరికాయందున్న ప్రజాస్వపరిపాలనదేశము. ౪౬౨౫౦ చతురఁపుమైళ్ల వైశాల్యము గలది. ఇఁదించుమించు ౫,౮౮,౦౦౦ వేలజనులు వసించుచున్నారు. Truxillo (ట్రూహిల్యో) పురము ప్రభుత్వస్థానము. ఇదికరేబియన్ సముద్రముపై నున్న రేవుపట్టణము. (మధ్యఅమెరికా చూడుఁడు).

## హొయిసలబల్లాలనృపుల గాంగవాడీ రాజ్యము:—

ఈ గాంగవాడీరాజ్యము క్రీ. వె. ౧౧౦౬ ప్రాంతములనుండినట్లు తెలియుచున్నది. బల్లాలవంశనృపతులు సామంతులుగ పాలించిరి. విఠలదేవరాయ లనునృపతి ద్వారసము

ద్రము (ఇప్పటి దొరసముద్రము లేక తలకాడు) రాజధానిగ పశ్చిమచాలుక్యచక్రవర్తి యగు ఆరవ విక్రమాదిత్యునకు సామంతుఁడుగ పాలించెనట. జైనమతస్థుఁడు. రామానుజజగద్దేశికుఁడు బ్రహ్మరాక్షసుని బారదోలి బాగుచేసిన దీవిశలదేవరాయనృపతికుమార్తెయే యనియు నందుకుఁగా నీయన దొడ్డగురునహల్లియను గ్రామమగ్రహార మిచ్చెనట. అదియే యిప్పుడు తిరునారాయణపురమనుమేలుకోట యనెదరు. ఈవిశలరాజును, రాణి భార్య శాంతాదేవియు శిష్యులై వైష్ణవమతమవలంబించినటుల వైష్ణవగ్రంథములం దుండుటయే గాని యితరనిదర్శనములు గానరాకుంటయే గాక యాతనిజైనభక్తి తగ్గినట్లు కానరాదని పరిశీలకు లనుచున్నారు. ఇది క్రీ. వె. ౧౧౯౭ అని శ్రావణబెళగోలస్థలపురాణమునఁ గలదు.

ఈభూపతి హాలేవీడు (ఇప్పటి హాలెబిడ్) లోని జయగొండేశ్వరదేవస్థానమునకు క్రీ. వె. ౧౧౨౧ భూదానమొసర్చెనని విరూపాక్షపురశాసనమునఁ గలదు. హాలేబిడ్నందుఁ జూడఁదగిన దేవస్థానపుకట్టడములు కలవు. నిర్మాత (మేస్త్రి) జకనాచారి యనువిశ్వబ్రాహ్మణుఁడు. ఇప్పుడు మైసూరు రాజ్యమునం దున్నదట.

## హొరైజన్:—

(భూవలయరేఖ చూడుఁడు.)

**హొరోలోజీ (Horology):—** కాలమును కొలచుశాస్త్రము. గడియారములు మొదలగునవన్నియు నీకళలోనివే.

## హొాతగోత్రము:—

(సిధృవగణము చూడుఁడు.)

## హొాత్రిణగోత్రము:—

(విష్ణువృద్ధఉపగణము చూడుఁడు.)

**హ్యూయనచ్యాంగు సీయూకీ యాత్రా చరిత్ర:—** హ్యూయనచ్యాంగు భరతదేశమున యాత్రసల్పిన చీనాదేశస్థుఁడని యెల్ల రెఱింగినదే. ఆయన ప్రయాణములందు విషయములను వ్రాసికొనుచుండువాఁడు. నాలందవిశ్వవిద్యాలయమున రెండుసంవత్సరములు విద్యాభ్యాసమొనర్చి దేశసంచారమొనర్చుచు ధాన్యకటకమున కరిగినతరి మహాసాంఘికవ్యాఖ్యాన యుక్తముగ త్రిపిటకసూలం జదివి, విద్యాపూర్ణతనంది యచ్చటచ్చట తానుసంపాదించిన ౬౫౭ బౌద్ధమతగ్రంథములను బంగారుతోటి వెండితోటి మంచిగందపు కఱ్ఱతోటి చేసినబుద్ధవిగ్రహములు ౧౫౦ బుద్ధధాతువు (అస్తిక) లు, బొటిపిటలు, గుఱ్ఱములపై వైచుకొని స్వదేశమునకుం గొంపోయెను. అట చక్రవర్తిచేతను, ప్రజలచేతను, గౌరవింపంబడి గొప్పమన్ననల నంది భూనాధునియాజ్ఞమేరకు తన యాత్రాచరిత్రను సీయూకీ యనుపేరుగల గ్రంథముగా రచించెను. సీయూకీ యన చీనాభాషలో పశ్చిమదిశయందు బుద్ధునిసంగతులని యర్థమట.

ఈయన చేన్వంశస్థుఁడు. ఈవంశము షూన్ చక్రవర్తిసంతతి యనియు, పురాతనప్రసిద్ధసాంప్రదాయముగల్గినకుటుంబమనియుఁ జెప్పఁబడినది. ఈ సాంప్రదాయమువారందరు రాజసేవాపరత్వమే వృత్తిగాఁగల్గినవారు. నపేరు చేన్ ఐ. జన్మస్థానము చేన్హావుకో యనంబడుగ్రామము ఇది చీనాయుత్తరప్రాంతమున హొానన్ సీమయందు కౌషీపట్టణప్రాంతమున నున్నది. జన్మకాలము క్రీ. వె. ౬౦౦ సంవత్సరము. వీ రన్నదమ్ములు నల్వురలో నీయనయే కడపటివాఁడు. పొడవరి. తేజశ్శాలి. బుద్ధిసూక్ష్మత గల్గి యేకసంతగ్రాహియై జ్ఞాపక

శక్తి బలముగఁ గలవాఁడు. కన్ఫూషియన్‌ధర్మముల నాచరించు బౌద్ధమతస్థుఁడు.

ఇరువదిసంవత్సరముల వయస్సప్పుడు బౌద్ధబిక్షుండై సన్యాసస్వీకరణ మొనర్చి యెన్మిదిసంవత్సరములు చీనాదేశమునం దెల్లెడల సంచార మొనర్చుచు మతవిద్యల నభ్యసించుచుండువాఁడు. ఒకనాఁ డకస్మాత్తుగా బుద్ధభగవానునిజన్మదేశమగు భరతభూమి కరిగి యున్నతమతవిద్యం జదువ తలంపుగల్గి క్రీ. వె. ౬౨౮ ఆరవనెలలో నొకయర్ధరాత్రమున నిలువెడలి ప్రయాణమయ్యెను. క్రీ. వె. ౬౨౯ లో వర్షకాలము ముగిసినపిదప భరతదేశముం బ్రవేశించి యేడెనిమిది సంవత్సరము లుత్తరహిందూస్థానమునందే సంచార మొనర్చుచుండెను.

క్రీ. వె. ౬౩౭ లో నాలందకుంజేరి విశ్వవిద్యాలయమున నివాసమేర్పఱచుకొని శీలభద్రస్వామి యను విద్వాంసునకు శిష్యుఁడై యాయనకడ రెండుసంవత్సరములు విద్యాభ్యాస మొనర్చితిననియు, గురువుగారిజన్మస్థానము దక్షిణదేశమున కాంచీపుర మనియు, వ్రాసికొనియున్నాఁడు. విద్యాభ్యాసమునకుఁ బిదప తామ్రలిప్తి (ఇప్పుడు బంగాళములోని తాంలూకు), అటనుండి దక్షిణకోసల లేక మహాకోసల, ఆంధ్ర మహాంధ్రదేశములం జూడఁదలంచి బయలుదేరెను. ఆంధ్రవిజ్ఞానపు చదువరుల కీతని యాంధ్రదేశసంచారపుసంగతులే ప్రాముఖ్యములని హెచ్చరించువారము.

తామ్రలిప్తినుండి కర్ణసువర్ణదేశము గుండా నడచెను. ఈదేశ మిక్కాలమున వంగదేశపు దక్షిణభాగమున సింగభూమ్, బీర్భూమ్, అనంబరఁగు సీమలుగా నున్నది. అటనుండి యుత్కలదేశము గుండా నరిగి దానిం గడచి కోన్యోఢదేశముగుండా తనపయనము సాగించెను. కోన్యోఢదేశ మిప్పటి చిల్కసరస్సుతీరపుదేశమని పోల్పఁబడికది. దానిం గడచి కలింగదేశములో ప్రవేశించుటయే యాంధ్రదేశసంచారప్రారంభమని యెఱుంగునది. అక్కాలమున కళింగదేశమునందు నగరికటకము ముఖ్యపట్టణమనియు, దానికిం గతిపయదూరమున నున్న ముఖలింగ (శివ) క్షేత్రము దేశమున ప్రాముఖ్యతనందిన దేవస్థానమనియు తెలియుచున్నది. ఇప్పటి దంతదుర్గము సైన్యస్థానముగను, నదీతీరమందున్న శాలీకుండము (ఇప్పటి సాలెహూండము) కడనున్న గిరిపై నుండిన బౌద్ధచైత్యవిహారములం దేదుగురు బౌద్ధులు వసించుట మొదలగుసంగతులు స్ఫురించునటుల వ్రాసెంగాని స్పష్టపఱుపఁడయ్యెను. ఈతావు లన్నియు నదీతీరమునందే యున్నవి. ఇంక నొకమూర్ఖుండగు కాళంగి యొకమహాత్ముని వేధించి దేశమును శపింపఁజేయుట మొదలగు కథనములను వివరించెంగాని నిదర్శనశూన్యములును చరిత్రకు పనికివచ్చునవియుఁ గావు. కళింగమునుండి హ్యూనచ్వాంగుగా రక్కాలమున దక్షిణకోసల లేక మహాకోసల యనంబడుచుండిన రాజ్యమునం దేర్పడి, ఆంధ్రదేశభాగమునకుం జెంది, యిప్పుడు గుంటూరుమండలములోనిదిగనున్న నాగార్జునుని కొండయు, నిప్పుడు కాసలనాటిసీమ నాఁబరిగిన దేశము సీమకుం జేరెను. దాని నాతఁడు దక్షిణకోసలదేశమనియే వ్రాసియున్నాఁడు. (దక్షిణకోసలదేశము చూడుఁడు). సీయూకీగ్రంథమునం దీప్రాంతముననే (నాగార్జునబోధిసత్వుఁడు చూడుఁడు — నాగార్జునుని సుహృల్లేఖ చూడుఁడు — దశభూమికలు చూడుఁడు) కొన్ని బౌద్ధమతవిషయములు, చరిత్రాత్మకవిషయములు, తెలియనగుచున్నవి. అటనుండి యిప్పుడు చాళుక్యరాజ్య

మునఁజేరియుండిన వేఁగిదేశమునకుఁ జేరెను. దానినాతఁ డాంధ్రదేశమని వ్రాసెను. (వేఁగిదేశము చూడుఁడు). తనచరిత్రయం దచ్చటచ్చట స్థూప చైత్యారామాదులనేకరువుపెట్టుచు, దిఙ్నాగాచార్యుఁడు తర్కశాస్త్రగ్రంథములు వ్రాయుటం దెల్పి (దిఙ్నాగాచార్యుఁడు చూడుఁడు) ముందుకుఁజని, యకాలమున మహాంధ్రమని పేరుగాంచిన ధాన్యకటకదేశముఁ జేరెను. ఇది క్రీ. వె. ౬౩౯ ప్రాంతమని తెలిసెడిని. అతఁ డాదేశఁపు రాజధానియగు ధాన్యకటకమునం దారుమాసము లుండి, సుభూతిస్వామి, సూర్యాచార్యస్వామి యనంబడు నిర్వురుబౌద్ధభిక్షువులకు శిష్యుఁడై మహాసాంఘికవ్యాఖ్యాన యుక్తముగ త్రిపిటకములం జదివి యుత్తీర్ణుండాయెనని యాయనయాత్రాచరిత్రయగు 'సీయూకీ' నుండి తెలియుచున్నది. బౌద్ధమతచతుర్నికాయములు చూడుఁడు- హీనయానమహాయానములు చూడుఁడు). ఆదేశము నుండిహ్యూనచ్వాంగు చోళమండలమున కరిగితినని వ్రాసెఁగాని, పరిశీలన లది చోళమండలము కాదనియు, నిప్పటి కడప, కర్నూలు మండలములున్న సీమయనియు బయల్పఱచినవి. అటనుండి తన నాలందగురువగు సీలభద్రునిజన్మస్థానమగు కాంచీపురమున కరిగెను. కాంచీపురము చోళమండలమో ద్రావిడదేశమో యని యెఱుంగవలయును. ఇది క్రీస్తు వె. ౬౩౯ న కళింగకుంజేరి ౬౪౦ లో ఆంధ్రదేశమును వీడెనని తెల్పెడెని.

హ్యూనచ్వాంగు ౬౪౪లో తిరుగతనస్వదేశమగు చీనాకుఁజేరెఁగాన నాయనభరతదేశపుసంచారము ౬౨౯ మొదలు పదునారువత్సరములని యెఱుంగునది. దేశ మాయనను గౌరవించి గొప్పయుత్సవము లొనర్చి సన్యాసనంఘాధిపతిం జేసెను. ఆయన పరివ్రాజకుఁడెగాన తక్కిన తనకాలము మహాయానమార్గ బోధకుఁడై తుషితస్వర్గమై త్రేయబోధిసత్వుఁ [సుగతుఁడు] డు వచ్చువఱకు వేచియుండి, యాతనితోఁ దిరుగ భూలోకమున జన్మింతునని చెప్పుచుండువాఁడట. జనులునునట్లే ఆయనంగూర్చి యనుచుండిరట. ఈతఁడు తెచ్చినగ్రంథములు చీనీభాషలోనికనువదింపఁబడి యున్నవి. ఈయనమృతి క్రీ. వె. ౬౬౪ రెండవ నెల ఆరవదినమని చెప్పఁబడియున్నది. [కోన్యోఢదేశము చూడుఁడు- కర్ణసువర్ణదేశము చూడుఁడు- నాలంద చూడుఁడు. అమరావతి చూడుడు.]

**హోమ్ కన్సంప్షన్** (Home Consumption):-వాణిజ్యసంబంధ పరిభాషాపదము. Home Consumption-స్వదేశమున భోజనాదులకు వ్యయపడునట్టులని యర్థము. ఇందుస్వదేశమునం దుత్పత్తియగునవియు విదేశములనుండి యిందుకుఁగాను దిగుమతిచేయఁబడి Bonded warehouse నందు వ్యయకాలముదనుక నిల్వ యుంచఁబడునవియుఁ గూడ నుండును. మరియు నట్టిసరుకులను Bonded warehouse నుండి తీసుకొనుటకిచ్చెడి యధికారుల యంగీకారపత్రమునకు 'Home uke entry' అని పేరు.

**హోమకుండములు**:—క్రతువులందు హోమముచేయు నగ్నికుండములకు హోమకుండము లందురు. అగ్ని దేవముఖుఁడని చెప్పఁబడినది గాన దేవతలకు క్రతువులందించు హవిర్భాగము లగ్నిముఖమున హోమము వేల్తురు.

విధిగ్రంథములందు హోమకుండములు తొమ్మిదిగా చెప్పఁబడినవి. క్రతువులం దీనవకుండములను వేదికచుట్టునుంచి యందు హోమము లొనర్తురు. దీనికి నవకుండవిధానమని పేరు. తొమ్మిదికుండము లందు హోమముచేయలేని కొందరైదగ్నికుం

డము లొనర్చి యందు హోమమువేల్చుదురు. దీనికిఁ బంచకుండవిధాన మనిపేరు. అదియుం జేయఁజాలనివారు వాపక్షమున నేకకుండమునసే హోమమొనర్తురు. దీనికి 'ఏకకుండవిధాన' మని యెదరు. కుండముంజేయ నశక్తులగువారు స్థండిలముం జేసి, యందగ్నిం బ్రతిష్ఠించి హోమమొనర్చుదురు. ఇది తాత్కాలికపుకార్యము.

తూర్పున చతురశ్రకుండము— ఇది నాల్గుమూలల నాల్గు సమమగుప్రక్కలం గల్గి చౌకముగ నుండును. ఇం దశ్వత్థసమిధలు (రావిపుడకలు) హోమము చేయవలయునని చెప్పఁబడినది.

ఆగ్నేయమున నశ్వత్థపత్రాకారకుండము— ఇది రావియాకుంబోలిన యాకారము గల్గియుండును. ఇందు శమీసమిధలు (జమ్మిపుడకలు) హోమము చేయవలయునని చెప్పఁబడినది.

దక్షిణదిశయం దర్ధచంద్రాకారకుండము— వృత్తమును రెండుగ విభజించునటుల నడుమ నడ్డముగ గీతం గీచిన ట్లుండునది. ఇం దుదుంబర సమిధలు (బొడ్డచెట్టుపుల్లలను) హోమము చేయవలయునని చెప్పఁబడినది.

నైరుతిదిశను త్రికోణాకారకుండము—ఇది మూడు సమమగు ప్రక్కలను, మూడుసమమగు మూలలను గల్గి ముక్కోణాకారమై యుండును. ఇందు కదిరసమిధలు (చండ్రపుడకలు) హోమముచేయవలయునని చెప్పఁబడినది.

పశ్చిమమున వర్తులాకారకుండము— ఇది గుండ్రముగ నుండునది. ఇందు ప్లక్షసమిధలు (జువ్వి పుల్లలు) హోమము చేయవలయునని చెప్పఁబడినది.

వాయవ్యదిశను షట్కోణాకారకుండము— ఇది యాఱుఫలకములు, నాఱుకోణములు గల కుండము. ఇం దపామార్గ సమిధలు (ఉత్తరేణిపుల్లలు) హోమము చేయ వలయునని చెప్పఁబడినది.

ఉత్తరమున పద్మాకారకుండము— ఇది యష్టదళపద్మముంబోలిన యాకారముఁగల్గి యుండును. ఇందు వటసమిధలు (మఱ్ఱిపుడకలు) హోమము చేయవలయునని చెప్పఁబడినది.

ఈశాన్యదిశను అష్టకోణకుండము— ఇది యెన్మిది ప్రక్కలు, యెన్మిది మూలలు గల్గినది. ఇందు బిల్వసమిధలు, మారేడుపుల్లలు, హోమము చేయవలయునని చెప్పఁబడినది.

ఇవి నవ (హోమ) కుండములుగా నగుట కీశాన్య పూర్వదిశలకు నడుమ నొకచతురశ్రకుండము గాని, వర్తులకుండముగాని రచించుదురు. దీనికి ప్రధానకుండమనియుం బేరు. ఇందు పలాశ (మోదుగ) సమిధలు హోమముఁ జేయవలయునని విధిఁపఁబడినది.

ఇంక పంచకుండవిధానమున నైదగ్నికుండములం జేసి హోమమొనర్చువారు- తూర్పున చతురశ్రకుండమును, దక్షిణమున నర్ధచంద్రాకారకుండమును, పశ్చిమమున వృత్తాకారకుండమును, నుత్తరమున పద్మాకారకుండమును, ఈశాన్యపూర్వదిక్కులనడుమగా ప్రధానకుండమును (పైఁజెప్పఁబడినరీతిని) రచించి, యందగ్నిం బ్రతిష్ఠించి హోమములొనర్పఁ దగునని చెప్పఁబడినది. ఈపంచకుండవిధానమునుగూడ నిర్వహింప నసమర్థులగువా రొకప్రధానకుండమునే రచించి యందే హోమమంతయుం జేయుచుందురు. అస లగ్నికుండములనే చేయనేరనివారు తాత్కాలికముగ స్థండిల

ముంజేసి హోమ మొనర్తురు. (స్థండిలము చూడుఁడు). అగ్నులు చూడుఁడు).

**హోమరుకవి:**—గ్రీసుదేశపు కవిపుంగవుఁడు. క్రీ. పూ. ౧౨౦౦-౮౫౦ మధ్యకాలము వాఁడు. జన్మస్థానము తెలియదు. ఏడుపట్టణము లతని జన్మస్థానముగ వాదించుచున్నవి. తనకవిత్వ ముంబాడుచు నంధుఁడై దేశాటన మొనర్చినవాఁడని చెప్పుదురు.

ఈయన రచించినవి Iliad అనునదియు, Odyssey అనుగొప్పగ్రంథములు. ఇయోనిక్భాషలో వ్రాయఁబడినవి.

**హోమోపతీ(హోమియోపతీ లేక హోమోయియోపతీ) వైద్యము:**—దీనిని చికిత్సావిధానశాస్త్రమనియనుటకలదు. (Science of Therapeutics) ఇది కొంతవఱకు ఏకమూలికావైద్యముం బోలినది. (ఆంగ్ల ఆలోపతీ) వైద్యవేత్తలు గర్వముతోఁ దమవైద్యవిధానము నందలి యొక Philosophy గా నెన్నుచున్నారు.

విదేశములందలి వైద్యులును, భరతదేశఁపు ఆలోపతీవైద్యులును, దీనిని Harvey's blood circulation theory—Jenner'svaccination theory— లంబోలిన యొక theory (సిద్ధాంతము) గా నెన్నుచుందురు. కొందరు మహనీయులు దీనిని Doctrine of Hahnemann అనియు, Science of Hahnemam అనియు నుడివెదరు. ఇంక నేబలము చేయూతగ లేనివారగు నాయుర్వేదవైద్యులు వైద్యవిధానమున కాయుర్వేదవిధానమే మాతృక యనియు, దీనింగూర్చి అష్టాంగహృదయమున విషచికిత్సయందునను, చరక మధ్యదోషచికిత్సయందునను ప్రశంసలు కలవనియుం దెల్పుచు నీక్రిందిశ్లోకము నుదాహరణముగఁ జూపుచున్నారు.

శ్లో. కృష్ణసర్పేణదష్టస్య లింపే ద్దంశేప్యాతేఽసృజః॥ చారటీనాకులీభ్యాం వా తీక్ష్ణమూలవిషేణవా। పానంచ క్షౌద్రమంజిష్టా గృహధూమాయుతంఘృతమ్॥

ఈస్వోత్కర్ష ల నిటుల వదలి యిప్పటి కేర్పడియున్నరీతి నీహోమోపతీవైద్యచరిత్ర మించుక వివరించి ముందుకుఁ జనుట సమంజసముగా నుండును.

దీనిని దనపరిశీలనలనుండి కన్పెట్టినటుల బయలుదేరఁదీసినమహాత్ముఁడు Samuel Hahnemann అనుపేరుగల జర్మనువైద్యుఁడు. ఆయననే యీ వైద్యవిధానమునకుఁ గర్త గ వాడుచున్నారు. ఆయనయొనర్చిన పరిశీలనలను Organon అను తనగ్రంథమున వివరించెను. అది యిప్పుడు 'Organon of the medicine' అనుపేరున నాంగ్లానువాదమునంది సుప్రసిద్ధగ్రంథముగనున్నది. అందు జర్మనుభాషయందు 'Similia Similibus Curentor' (అనఁగా నాంగ్లమున Like for like) అను మూలసిద్ధాంతధర్మమును వివరించెను. దాని నింకను స్పష్టపఱచుచు నాయనయే Simili Semilis Curanon Contrarium (అనఁగా ఆంగ్లమున ననువాదముగా Similars Cure similars) వ్రాసెనట. ఇట్టి మూలధర్మముల నాంగ్లమున 'Basic Principles' అనెదరు. ఇటులనే అలోపతీవైద్యవిధానమున మూలధర్మముగ 'Contraria Contraris' అను మాట వాడఁబడుచున్నది.

హోమియోపతీవైద్యమునం దభిమానముగల వారు 'లోకమున చికిత్సావిధానము లంధకార బంధురమగు నజ్ఞానదశయందుండినతరి నీవిధానము బయలుదేరిన'దని గర్వముగ పల్కుచుందురు. ఇది Deduction లేక Induction విధానముల ననుసరించు వైద్యము కాదు. హాహ్నెమాన్ వైద్యుఁడే గొప్పపరిశీలనలుసల్పి తర్కించుటకుఁ గూడ నాగఁగల వైద్యవిధానమును బయల్పఱచె నని వాడుక ప్రబలియున్నది. చికిత్సలొనర్చుట జీవన బలమున్న శరీరమునకుం గాని, మృతకళేబరము నకుం గాదు, గాన నౌషధీపరిశీలనలు (Drug experiments) ఆరోగ్యవంతమగు శరీరమునందే చేయఁబడవలయునను విధి నేర్పఱచెనట. జీవన బలమున కీశాస్త్రమున Life force అను పరిభాషావద మేర్పఱుపఁబడియున్నది. అఘాతముగ తగిలినగాయములు మొదలగువ్యాధుల కీశాస్త్రమున Mechanical injuries అనియెదరు. అట్టివి తప్ప తక్కినరోగసముదాయము మానవ నేత్రముల కదృశ్యములను ధర్మ మాయన చేపట్టెను. మరియు నారోగవితతి యేదోయొక కారణముగా నేర్పడియును, జీవనబలము తగ్గుటవలననే శరీరమున వ్యాపించునని యాయనపల్కెను. అట్టి స్థితిని జక్కపఱుప నౌషధులను పరమేశ్వరుఁడు లోకమున కనుగ్రహించియున్నాఁడు గాన వాటి గుండా తిరుగ నారోగ్యమునుగల్గించుట వైద్యవృత్తికి ధర్మముగా నాయన దెల్పెను. ఓషధుల నారోగ్యవంతమగుశరీరమునం బ్రయోగించి వేర్వేరుపరిమితులుగల మోతాదులు వేర్వేరుగుణములంగల్గించుట యాయనకనిపెట్టి, దానికి Proving అని సాంకేతనామ మిడెను. అట్టిమూలికాశక్తుల కీశాస్త్రమున 'Pathogenetic power' అని పేరు. ఈశాస్త్రగ్రంథములం దట్టి శక్తులు వివరింపఁబడియున్నవి.

'Simelia Simelibus Cnrentor' అనుధర్మమును హాహ్నెమాన్ పరిశీలకుఁడే తన పరిశీలనలనుండి యేర్పఱచెను. దాని యాంగ్లానువాదము simetars cure similars అని గానోపు. ఆయన పరిశీలనలయందు ఆముదము పెద్దమోతాదు విరేచనములఁ గల్గించుట, చిన్న చిన్న మోతాదు విరేచనబద్ధముం గల్గించుటయు, బలమగు కాఫీకషాయపు మోతాదులు నిద్రారాకుండఁ జేయుస్థితిం గల్గించుచుండ, చిన్నచిన్నవగు మోతాదు నిద్రంగల్గించుస్థితిం గలిగించుచుంటయు, నారసి యోషధిప్రయోగమునఁ గల్గెడిగుణములకును, రోగములం గుదుర్పఁగల దానిశక్తికిని, ఒకరోగమునందు ప్రయోగింపఁబడిన ఓషధీగుణము కల్గించిన రోగపరిహారమునకును (the symptoms produced by any given drug—its power of curing diseases—and the remidy for any given disease) సమీపయగు సంబంధమే గలదని యాయన యెఱింగెను. ఈసంగతి నీశాస్త్రగ్రంథములం దాంగ్లమున 'For any set of symptoms in their totatility is that drug which given to any healthy person—will produce the most perfect imetation of the said set of symptoms. [in other words], Similia Similibus Curentor' అని వివరింపఁబడినది. దీనింబట్టియే యీవిధాన వైద్యవిద్యావిశారదు లిందలి Potentizing, Dynamizing of medicinal substances is original అని వాదించుచున్నారు. ఇంక నీవిధానవైద్యవిద్యను చక్కఁగ నెఱింగిన డాక్టరు పి. కే. వాసుదేవరావుగారి వ్రాతనుండి యెఱుంగఁదగిన కొన్ని యితరహంశములను వివరించుటకన్న వారివ్రాత నక్లే యిందు పొందుపఱచినందుల కాయనమన్ననలం గోరెదము.

'The fundamental principles are based upon the facts that diseases are manifested by objective symptoms, and the action of the drug is expressed by the experimentation on the healthy human body. The curative relation between these two sets is by Virtue of 'Law of similars'.

'The medicenes are not material substances- and there is no matter in any remidy in its potentized form besides alcohal and sugar of milk—and they are only Vehicles [on which medicines are stored up] but not medicines'.

'The medicine itself is only an abstract energy – a dynamic – Not even a trace of a medicine can be demonstrated by any chemical analysis or other tests'

రోగమంటిన Tissue ల నుండి వెడలు విషపునీరు, రశి (వసా) ఆరోగమునడంచు శక్తిం గల్గియున్నవిగా నెల్లరెరింగినదే. ఇట్టివాటి నాంగ్లమున Nodes అనిమెదరు. క్రీ. వె. ఇరువదియవ శతాబ్దమున నడచిన గొప్పపరిశీలనలు, అనఁగా:— (1) Von Behring Pasteur పండితుని పరిశీలనలు, (2) Wright పరిశీలకుని serum పరిశీలనలు, Vaccines - Anti Toxins— Serums—Radium salts మొదగున వన్నియును Opsomic index నందు మార్పుఁ గల్గించి మానంజేయు గుణముం గల్గియున్నవని (అనగా curatively effective లని) బయల్పడియున్నవి.

ఇంకను లండనునగరంపు Dr. Wheeler పండితుని phosphorus పరిశీలనలు, బోస్టను నగరంపు Watters పండితుని పొటాశియంసాల్ట్సు పరిశీలనలు, జాన్హాప్కిన్సునగరంపు Frey పండితుని Rhustox పరిశీలనలు, షికాగోనగరంపు Bailey పండితుని రేడియో ఏక్టివ్ పదార్థపరిశీలనలు, ఎవ్వియు నీవైద్యవిధానమునకు వ్యతిరేకములు కావట. హోమోపతీ వైద్యము తల్లులకు, పిల్లలకు, పశువులకుం గూడ వాడనగునట. రోగోద్రేకబాధలు Cancer లు ట్యూమరులు మొదలగుబాధలు, శస్త్రవైద్యంపుబాధలు, లేక సౌఖ్యముగను త్వరితముగను తక్కువవ్యయముతో నారోగ్యమొసంగునని హోమోపతీవైద్యాభిమాను లనుచుందురు.

ఈవైద్యవిధానమున నెఱుంగఁదగిన మూఁడు సమభాగములు (Proportinos) కలవనియు, వాటినుండి మూఁడువిధులు కల్గినవనియు, దీనికి నాల్గురోగపరిశీలనావిధానములు కలవనియు, ఓషధీప్రయోగమునందు నాల్గుజాగ్రతలు (లేక బాధ్యతలు) కలవని చెప్పంబడినది. వాట్లను వివరించి ముగింతును గాక. వాట్ల నాంధ్రమున కనువదించుటయందుకన్న నాంగ్లమునం దట్లే వివరించుట యధికసుబోధకమని యట్లే వివరించుట మన్నింపఁబడుగాక. ఇంక రోగపరిశీలనయు, ఓషధీగుణపరిశీలనలు వైద్యు లెరింగియే యుండవలసినవిగాఁ జెప్పఁబడియున్నది.

1 Proposition—That the scientific mode of ascertaining drugaction upon human economy is- by experimenting them upon a healthy individual.

2 Proposition—That the healing properties of a drug correspond to its decease producing properties.

3 Proposition—That as necessary consiquence of the above two pro-

positions, the drug must be admiu-stered in such a dose- that will not produce too great an aggravation of the existing decease- or the natural decease itself.

పై ధర్మములనుండి యేర్పడినవిధులు మూడు (౧) ఓషధుల (drug) పరీక్షలు పూర్ణారోగ్యవంత ములగు మానవశరీరములపైననే చేయఁబడవల యునను విధి. (౨) ఓషధియొక్క గుణము రోగ దోషముతో (అనఁగా రోగబలముతో) సమాన బలముగలదిగ నుండునటుల నెఱుఁగుట యను విధి. (3) ఓషధీప్రయోగమునం దొక్కొకతరిని ఒకేగుణము కల్గునటుల (అనఁగా నన్యమయిన ఓషధీమిశ్రమదోషము లేకుండునటుల) ప్రయో గింపఁబడవలయు ననువిధి.

ఈవైద్యవిధానమున రోగపరిశీలనా విధాన ములు నాల్గు చెప్పఁబడినవి.

(౧) రోగపరిశీలనావిధానము— రోగియొక్క శరీర ముం దా (స్పృశించి) రోగము నెఱుంగుట (Palpation).

(౨) రోగపరిశీలనావిధానము— రోగియొక్క శరీర ముం బరిశీలించి రోగము నెఱుంగుట (Inspection).

(3) రోగపరిశీలనావిధానము— రోగి శరీరమును దట్టి చూచి రోగమును గుర్తించుట (Percussion).

(౪) రోగపరిశీలనావిధానము— రోగియొక్క శరీర మందలి ధ్వనులను విని రోగముం బోల్చుట (Auscultation).

వీట్లను క్రీ. వె. ౧౭౫౫—౧౮౪3 కాలమున జీవించియుండినటులఁ జెప్పఁబడిన హాహ్నెమాను పరిశీలకుఁడును, పిదప క్రీ. వె. ౧౭౦౮ లో జన్మిం చిన ఆల్బెర్టు హాలరుపరిశీలకుఁడును పరిశీలించి స్థిర పఱచి వాడియుండిరట. ఇంకను ఈవైద్యవిధాన క్రియాభ్యాసము (వైద్యముచేయుట) నందు వైద్యుం డెరుంగఁదగిన జాగ్రతలు, లేక బాధ్య తలు నాలుగు వివరింపఁబడియున్నవి.

(౧) బాధ్యత లేక జాగ్రత— రోగి కషాయము గలుగకుండ ఓషధిని ప్రయోగించుట.

(౨) బాధ్యత లేక జాగ్రత— వీలగునంతవఱక ప్రయోగించు ఓషధింగూర్చి వైద్యుఁ డెరింగి యుండుట. ఇది చతుర్విధభేదములుగాఁ జెప్పఁ బడినది. ౧ ఆయోషధి ఆరోగము నివారిం చుటకు నిర్ణీతమైన ప్రత్యేకౌషధి [specific] యో, లేక ౨ ఆరోగముం గుదర్పఁగల గుణముకూడ నందుఁగలది (curative)యో లేక 3 ఆరోగమున కుపశాంతిం గల్గించుగుణ మాయోషధియం దుంట (pallative) యో లేక ౪ రోగియొక్క శరీరమునం దేభాగమున నుండు ఆజబ్బున కాయోషధి (ప్రత్యేక ముగ) నుపశాంతిం గల్గించునదిగా నెరింగి ప్రయోగించుట (placebo) యో వైద్యుం డెఱిఁగి పిదపఁ బ్రయోగింప వలయునని విధిం పఁబడినది.

(3) వీలగునంతవఱక—ప్రయోగింపఁబడు ఓషధి (drug) ఇతరసమ్మేళనరహితముగ ఒకేగుణ మొకసారిగ నొసంగునటుల ప్రయోగించుట.

(౪) వైద్యుఁడు ప్రయోగించుఓషధి— అర్హారీతి నాయత్తపఱుపఁబడినదిగా (correctly prepared as a medicine) నెఱింగి, రోగిశరీ రమున కుపయోగింప వలయునను బాధ్యత, లేక

జాగ్రిత. (అల్పమగు మోతాదు నిచ్చుట యును, అవసరమగునంత కాలమువఱకు ప్రయోగించుటయు, రెండుబాధ్యతలు లేక జాగ్రతలుకూడ కలవని చెప్పఁబడినది.

ఈవైద్యవిధానము తనజన్మభూమియగు జర్మనుదేశమునందే గాక ఇతరదేశములకుం గూడ వ్యాపించియున్నది. అమెరికాసంయుక్తరాష్ట్రసీమలందునను గ్రేటుబ్రిటన్‌సీమలు, ఫ్రాన్సుదేశసీమలు, రష్యా ఇటలీ స్విజర్లాండు స్పానియా బ్రెజిల్ మెక్సికో దేశములకుం గూడ బ్రాఁకినదట. భరతదేశమున బంగాళా, పంజాబు, బొంబై రాజధానుల ప్రభుత్వామోదముఁ బడసినదట.

**హోమ్హోట్జుసిద్ధాంతము:—**
(సూర్యరశ్మి చూడుఁడు.)

**హోమోశాపిన్సు** (Homo Sapiens):- ఈపదము జంతువులు, పక్షులు, కటకములు మొదలగుప్రాణుల జాతివిభాగమునందు మనుష్యునకీయఁబడినపేరు. (జూలోజీ చూడుఁడు). లాటిన్భాషయందు బుద్ధిమంతుఁడగు మనుష్యుఁడని యర్థము.

సమస్తజీవజంతుగణమును జూలోజీ శాస్త్రజ్ఞులు శరీరమున Cells కలిగియుండుట Meta-zoa class అనియు, వెన్నెముకఁ గల్గియుండుట Vertebrata class పిల్లలకు పాలుగుడుపుట Mammals class కోఁతి ape మొదలగువాటి పోలిక Primates order anthropoidia order మొదలగు వాటింబట్టి విభజనమొనర్చి పేర్లిడియున్నారు.

మనుష్యునకీలక్షణము లన్నియుం గల్గియుంట నన్నితరగతులందు చేరుంగాన మనుష్యునకగ్రస్థానమిచ్చి 'హోమోశాపిన్సు' అనిరి. ఇది శాస్త్రజ్ఞులందు సుప్రసిద్ధవ్యవహారనామము.



**హోర్ ఫ్రోస్టు ఐస్ క్రిస్టల్సు** (Hoar frost ice Crystals):—డ్యూపోయింటు టెంపరేచరు (మంచుబిందువులు గడ్డిపై నేర్పడుట Below the freezing point of water టెంపరేచరునం దగుట సంభవించుతరి నేర్పడు మంచుబిందువులు) చిన్నచిన్న మంచుకణములు (ice Crystals) నేర్పడును. దానిని హోర్ ఫ్రోస్టనియెదరు. వీటిని భూతద్దముతో చక్కఁగఁ బరిశీలించిన తళతళ మెఱయుచు వజ్రపుకణము లంబోలి సౌందర్యముగఁ గన్పించెడిని. ఇట్టివి యద్దముపై నేర్పడునేని వింతవింత యాకారములుగ నేర్పడెడిని.

**హోరోలోజీ** (Horology):—గడియారములు ఘటికాజలసైకతసాధనములు మొదలగు నుపకరణముల మూలమునను, సూర్య చంద్ర నక్షత్ర చలన ఉదయాస్తమయముల లెక్కమూలమునను కాలమును విభజించుట లెక్కించుట కైనశాస్త్రము.

**హోర్సు లాటిటెట్యూడ్సు** (Horse latetudes):— (ఈక్వెటోరియల్ కామ్సు చూడుఁడు, ట్రేడ్విండ్సు చూడుఁడు, భూమధ్యరేఖ చూడుఁడు, ఏంటీ ట్రేడ్విండ్సు చూడుఁడు.)

**హోల్డరు** (Holder):— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. కల్గియుండువాఁడని యర్థము. భూమింగలవానికి Land holder అనియు, హుండీగాని, బిల్లుగాని యెవ్వరికి విక్రయింపఁబడి ఎవరిస్వాధీనమునందుండునదో యట్టివానిని Holder అనియు ననెదరు. అద్దెకున్నవారు కాలా

త్రీతముగుకతనగాని వదలివేయుమని నోటీసుపుచ్చు కొనిగాని కదలక నుండుటకు 'holding over' అనియెదరు. అట్టివారు రెట్టింపులద్దె యిచ్చుకొన వలయునని పద్ధతి కలదు.

**హోల్కాఱ్సుటెరిటరీస్:—** (ఇండోర్స్టేటు చూడుఁడు.)

**హోలీజమ్ (Holism):—** ఇదియొక తత్వసిద్ధాంతము.

**హోలీసెపుల్చర్:—** లాటిన్భాషయందు Sepetire అనిన ప్రాతుట కర్థము. హోలీసెపుల్చరనిన క్రీస్తుప్రభుని సమాధిచేసిన పవిత్రస్థలియని యర్థము. ఈక్షేత్రము పాలస్తినాదేశపు జరూసలెమ్నగరమున పురాతనఁపు పట్టణప్రాకారములోనున్నది. దీనిపై నొకటియు, దీనిచుట్టు వేర్వేరు క్రైస్తవమతస్థులకు వేర్వేరు దేవస్థానములు నిర్మింపఁబడి పెద్దదేవస్థానముల సముదాయముగనున్నది. కడునైభవోపేతము.

కాని యిది నిజమగు సమాధి కాదనియు, పురప్రాకారమునకు వెలుపల నట్టిస్థాన ముండవలెననియుఁ దలంచియున్నారు. కాని యీదేవస్థానము నిట్లే నడుచుచున్నది. ఏది నిజమైనను క్రీస్తు ప్రభువుశరీరము భూమియందే లేదు. ఏలయన నామహాత్ముఁడు సమాధినుండి పిదప లేచి యాకాశముపై పెగిరిపోయెననియు, పిదప నొకమేఘ మాయన యగుపడకుండ నడ్డమాయెననియు మొదలగుసంగతులు బైబిలునందుఁ గలవు.

**హోలోగ్రాఫీ (Holography):—** ఎవ్వరిపేరున నొకపత్రము కన్పించుచున్నదో దాని నతఁడే వ్రాసియున్నచో నది 'Holograph' అనుపేరంబరఁగును. ఆవిద్యకు 'Holography' అని పేరు.

**హోలోమీటర్ (Holometer):—** కొలతలం దెల్పు పరికరము. ఇది సర్వేచేయువారి కుపయోగము.

**హోషియార్పూరుజిల్లా:—** హోషియార్పురము ప్రధానస్థానము. (పంజాబు దేశము చూడుఁడు.)

**హోలీపండుగ:—** (హోలాపౌర్ణమి చూడుఁడు.)

**హిమోగ్లోబిన్:—** ఊపిరితీయుట జీవించుచుండుటకే యగును. శరీరమందలి విషపదార్థములను వెడలించుటయును ప్రాణాధారమగు ప్రాణవాయువు (ఆక్సిజెను) గాలిని లోనిరక్తమున కందిచ్చుచుంటకు నూపిరిదీయుచుండవలసి యుండును. గాన నీయూపిరి రక్తముతో సంబంధము గలదిగ నున్నది. ఆరక్తము సెల్సు, ద్రవము, వాయువులు నని మూఁడుభాగములం గల్గియున్నది. అందురక్తమునం దెఱ్ఱసెల్సు (Redcells) తెల్లని సెల్సు (white cells)అని ద్వివిధములగు సెల్సు కలవు. ఎఱ్ఱనిసెల్సు శరీరరారోగ్యమును సూచించునవి యనియు, తెల్లనివి శరీరమందలి యనారోగ్యమును సూచించునవి యనియు చెప్పఁబడినను తెల్లసెల్సు అనారోగ్యకాలమున రక్షించునవియనియుం జెప్పఁబడినవి. (రెడ్సెల్సు చూడుఁడు - వైట్సెల్సు చూడుఁడు). ఈవిధములగు సెల్సు రక్తమునం దెంతవఱకుండునో పరిశీలించి యాంగ్ల (అలోపతీ) వైద్యులర్వారీతి నౌషధనిర్ణయ మొనర్చుదురట. శరీరారోగ్య మారెంటియొక్క యభివృద్ధి క్షీణతలనుండియే తెలియ నగునట. శరీరారోగ్యస్థితినుండి యది మారుచుండు

నట. ఈ ఎర్రనిసెల్సు ఎముకలందు అనగా నెముకల మధ్యభాగమునం దుండు Red marrow (ధాతువు) నుండి జనించి, యెముకగొట్ట ములనుండి వెలుపలికింజారి రక్తములోనికిం జేరు చుండును. ఈరెడ్ మేరో ఊపిరియాడు పీల్చు దుర్వాయువులమూలమున నొక్కొకతరి చెడుచుం డినయదనున నీరెడ్సెల్సు జనించుట యాగిపోవు చుండుననియుం గనినిపెట్టఁబడియున్నది.

ఒక్కొకతరి ఈరెడ్సుకడ మైక్రోబ్సు (microbes) కూడ గాననగుచుండును. ఈరెడ్సెల్సు ఎర్రగనుండునవి యైనను నందు పసుపుపచ్చ (ధాతు) పదార్థము కలదు. అది చాల ముఖ్య మైనదిగా నెఱుంగఁబడినది. దానిపేరే 'హ్యోమో గ్లోబిన్' అనెదరు. అది సాంకేతనామము. గ్రీకు భాషయందు హ్యోమో యనిన రక్తమున కర్థము. ఇది కెమికల్ కాంపౌం డనిచెప్పఁబడినది. దీని మొల క్యూల్ (molecule) నందు వేయివఱకు వేర్వేరుజాతుల పరమాణువులు (atoms) కల వని పరిశీలకు లనుచుందురు. అందు ముఖ్యముగ కార్బన్, ఆక్సిజెన్, నైట్రోజెన్, హైడ్రోజెన్, ఆటోమ్సు కలవని పోల్చుచున్నారు. దానియం దింకను ఐరన్ (iron) కల దది చాలముఖ్య పదార్థమనెదరు.

ఐయర్న్ చాల మెఱుపురంగుగల దది లోహ మని పోల్చియున్నారు. ఇది జంతుశరీరరక్తధాతువు నందే కాక మొక్కలశరీరధాతువగు రసమునందు గూడ ముఖ్యమైన దందురు. గరిక మొక్కల కాకు పచ్చరంగుం గల్గించుననియు నిటీవలి పరిశీలననుండి యెఱుంగనగుచున్నది. జంతుజాలమునందలి యథ మపుజాతి చిన్నవాటికి దక్క తక్కినజంతువులకుఁ గూడ నీఐయర్న్ కడుముఖ్యపదార్థమని చెప్పఁ దగును. ఇది తినునాహారముగుండా శరీరములోని కిం జేరి కల్గుచుండునని వేరుగఁ జెప్పనక్కరలేదు. శరీరారోగ్యము చెడుటకుఁగల కారణములలో ముఖ్యమగునది హ్యోమోగ్లోబిన్ తగ్గిపోవుటయే యగును. ఊపిరిఁదీయుతరి లోనికరిగినవాయువు నుండి ఆక్సిజెనును పీల్చుకొనుట కీహ్యోమోగ్లో బిన్ సహాయమొనర్చెడిని. దీనిసహాయముననే రక్తము శరీరమందలి యన్నిభాగములకుఁ జేరు చుంటయు నైయుండును.

ప్రతినాల్గు మినిట్లకాలమునం దొకసారిరక్తము శరీరములోని యూపిరితిత్తుల (Lungs) నుండి శరీరభాగములన్నిటం దిరుగుచుండుననియు నదియే రక్తప్రసార (blood circulation) మనం బరఁగుచున్నదనియు లెక్కింపఁబడియున్నది. సెల్సు కొన్నివారములలో నశించి తిరుగఁ గ్రొత్తసెల్సు జనించుచు వాటిస్థాన మాక్రమించుచు రక్తమును దానిస్థితియం దుంచుచుండుంగాని హ్యోమోగ్లో బిన్ మాత్రము మారక హెచ్చుతగ్గులు గల్గు చున్నను శరీరము జీవించియున్నదనుక నట్లే యుం డుచుండును. ఇందువలన రక్తమందలి తెల్లని సెల్సుగాని, కేవలద్రవపదార్థముగాని శరీరమంత టను ప్రసరించుతరిని గాని, ఊపిరితిత్తుల గుండా జనునపుడుగాని ఆక్సిజెనును పీల్చుకొనుసని యెక్క డను బయల్పడలేదు. నిజముగ నవి యట్టివిగనే యుండుసని తెలుచున్నది. ఎర్రని సెల్సునం దుండఁ దగినంత హ్యోమోగ్లోబిన్ లేకుండిన అనగా చాలకుండిన నాక్సిజెనును పీల్చుటయుఁ గొరంతఁ బడుననియుం దేలుచున్నది. ఇంకను హ్యోమో గ్లోబినునందే ఆక్సిజెను మొలక్యూలు కలదనియుఁ గూడ తేలుచున్నది. ఇట్లుండియు దానియందున్న పదార్థపరిమాణము లిదమిత్థమని చెప్పనీలుగల్గుట లేదు. ఐనను రసాయనశాస్త్రవిదులు దానికి

H. B. అని సాంకేతికపుగుర్తునిచ్చి వాడు చున్నారు.

ఇటులనే ఆక్సిజెనుమోలక్యూలును 0.2. అని సాంకేతనామమిచ్చి వాడుచున్నారు. గావున లంగ్సునందు H. B.—0 2 తోఁగలసి H B. 0 2 యనంబడుకలయిక యగునని రసాయనశాస్త్ర వేత్త లనెదరు. దీనిని Oxyhaemoglobin అనినదానికి సాంకేతకమగు ననిపించెడిని. కాని ఆక్సిజెను దీనినుండితీసివేయంబడినతరి దానిని 'reduced haemoglobin' అనుట సమంజసము. దీనిని మనసునం దుంచుకొనవలసియుండును.

ఈసందర్భమున నెఱుంగఁదగిన దింకొకటి కాకున్నను దీనినే తిరుగ నుడువఁదగియుండును. లంగ్సు లోనికరిగిన శరీరరక్తము H. B. గనే యుండును. అనగా simple Haemoglobin అని యెఱుంగునది. అది నలుపురంగుకలసినరక్తవర్ణముగ నుండునది. లోని కరిగి ఆక్సిజెనుమొలక్యూలుంగైకొని H. B 0 2. యగును. అత్తరి నది యెర్రబడి Life coloured red అనఁబరఁగుచు శరీరమునం బ్రసరింపఁ జనుచుండును. అత్తరి దాని లోని ఆక్సిజెను వదలిపోయి తిరుగ లంగ్సున కరుగు వరకు తిరిగి H. B అయిపోయెడిని. లంగ్సులోనికి పీల్చినయూపిరివాయువులోని ఆక్సిజెను జేరుచు అటనే రక్తములోనికిం జేరుచుండును. ఈపనికంతకుం బ్రధానకారణము హ్యూమోగ్లోబిన్‌గా నెఱుంగునది.

**హౌదా:—** ఏనుఁగుల పైగట్టున కూర్చుండుట కేర్పాటుతావు. ఇట్టివి లేకున్న నేనుఁగుల పై నెక్కి కూర్చుండుట కష్టముగనే యుండెడిని. గొప్పగొప్పవారును, మహారాజులును కూర్చుండు హౌదాలు చాల సుప్రసిద్ధములు, గొప్పవిలువ గలవిగా నుండును. దంతముతోను, వెండితోను, బంగారముతోను చేయఁబడిన హౌదాలు కలవు. హౌదాకు పైయాస్తరణ ముండినను నుండును. లేకుండుటయుం గలదు.

**హౌస్ సైట్సు:—** (నివాసస్థలములు చూడుఁడు).

**క్షత్రధర్ముఁడు:-** చంద్రవంయుఁడు. క్షత్రవృద్ధుని సంతతిలోనివాఁడు.

**క్షత్రపరాజవంశనృపాలురు:—** వీరు నహపాణిసంతతివారని చెప్పఁబడిరి. పూనామండలములోని జూనేర్ అని యిప్పు డనఁబడుచున్న తొల్లింటిజీర్ణనగరము రాజధానిగ నాపాంతరాజ్యమేలుచుండి పైఠన్ (తొల్లింటి ప్రతిష్ఠానము) రాజధానిగ రాజ్యమేలుచుండిన 'పులమేయి' యను పేరుగల భూపతి (ఆంధ్రభృత్యుఁడు) చే నోడింపబడి నిహతుఁడాయెను.

క్షత్రపరాజవంశనృపతులు మహారాష్ట్రదేశమును క్రీ. వె. ౨౧౮ మొదలు ౨౩౨ వరకును నేలిరి. వీ రభీరులచేనోడి రాజ్యముఁ గోల్పోయిరి. (ధరణికోటరాజ్యము చూడుఁడు.)

**క్షత్రియకులము:—** భరతదేశమునందలి క్షత్రియులు సూర్యవంశస్థులనియు, చంద్రవంశస్థులనియు నిరుతెఱంగులుగ నున్నారు. మానవదృష్టి యందు పరమేశ్వరునిసృష్టియొక్క యవస్థానిరూపణమనఁబడిన బ్రహ్మకుఁ గొందరు మానవపుత్రులుఁ గల్గిరనియు, నందు మరీచి యనుపుత్రునకుఁ గళయనుపేరుగల భార్యయందు కశ

డనుసుతుండును, పూర్ణిమయను పేరుగల సుతయుఁ గల్గిరనియు, నందు కశ్యపునకు వివస్వంతుం డనుసుతుం డుదయించెననియు, నీతండే ద్వాదశాదిత్యాత్మకసూర్యునియంశగ జన్మమందినవాఁడనియు, నీతనికి యముఁడు, శనైశ్చరుఁడు, వైవస్వతమనువను పుత్రులును, తపత, కాళింది, యను కుమార్తెలును సంతతిగాఁ గల్గిరనియు నందు వైవస్వతమనుసంతతియం దిక్ష్వాకుమహారాజు, నృగుఁడు, దిష్టుఁడు, ధృష్టుఁడు, శర్యాతి, కరూశుఁడు, నరిష్యంతుఁడు, వృషధృుఁడు, నభగుఁడు, కవి యనువారలు జనించిరనియు, వీరివలనఁగల్గిన క్షత్రియులు సూర్యవంశఁపువారనియుఁ జెప్పఁబడినది.

ఇటులనే బ్రహ్మకు వేరొకమానవపుత్రుఁడుగ జెప్పఁబడిన యత్రి కనసూయ యనఁబడిన భార్యయందు దూర్వాసుఁడు, దత్తాత్రేయుఁడు, చంద్రుఁడు ననుముప్వురుసుతులు జన్మించిరనియు నందు చంద్రునకు బుధుండును, బుధునకు పురూరవచక్రవర్తియును సుతులుగఁ గల్గిరనియు, పురూరవచక్రవర్తి (విక్రముఁడు) కి నూర్వసియను నప్సరస్త్రీయం దాయువు, ధీమంతుఁడు, నామవసువు, చిరాయువు (లేక శతాయువు), శ్రతాయువు (లేక వసుమంతుఁడు) ననుసుతులు కల్గిరనియు, వీరు గాక వేరొకసుతుండు (పేరు తెలియదు) గూడ గల్గినటుల తెలియుచున్నది.

అం దాయువునకు నహుషమహారాజు, క్షత్రవృద్ధు, రజి, రంభుఁడు, ననేనస్సు ననుసుతులును, ఆమవసువునకు విజయుఁ డనుసుతుఁడును గల్గిరని చెప్పబడినది. వీరలసంతతులు చంద్రవంశఁపుక్షత్రియులుగఁ జెప్పఁబడినవారు.

ఇ ట్లేర్పడిన సూర్య చంద్రవంశముల క్షత్రియకులజులు భరతదేశమం దెల్లతావులందును దరుచుగ గానవగుచుందురు. ఇటుల నాదియందు క్షత్రియకులోత్పత్తి వివరింపఁబడినది.

పిదపఁ గొంతకాలమునకు జమదగ్నిరేణుకల పుత్రుండును, మహాప్రభావ మహిమాసంపన్నుండును, బ్రాహ్మణుండునుగఁ జెప్పఁబడిన పరశురామునకును, హైహయక్షత్రియవంశకులోత్తంసుఁడును, చేదిదేశమేలుచుండిన కృతవీర్యపుత్రుఁడగు అర్జునభూపతి (కార్తవీర్యార్జునచక్రవర్తి) కిని ఘోరవైరములు గల్గి పరశురాముఁడు కార్తవీర్యార్జునమహీపతినేగాక క్షత్రియకులముపై బగఁబూని యిరువదియొక్కసారులు క్షత్రియులనదేవనిగ వధింపసాగె ననియు, దానంజేసి క్షత్రియుల సంఖ్య చాల తగ్గిపోయెననియుఁ జెప్పఁబడినది.

పిదపఁ గొంతకాలమునకు బ్రాహ్మణులగు ఋషు లేకమనస్కులై దైవసాహాయ్యముంగొని క్షత్రియకులమును బునరుద్ధరింప సమకట్టి యర్బుదపర్వతోపరిభాగమునకుఁ జేరి ("ఆబూ పర్వతశిఖరము") యట గొప్పతపంబులును హోమములు వేల్చుచు యాగమొనర్చి రనియు నందు నాల్గుతెగల క్షత్రియులకు మూలపురుషులగు నల్గురువీరు లుద్భవించి రనియు చెప్పఁబడినది.

ఈ నల్వురువీరులును అగ్నికుండమునుండి యుద్భవించినకతన వీరి కగ్నికులు లనియుఁ బేరు వాడుకగలైనట. వీరియుత్పత్తి యగ్నికుండమున జేయఁబడిన హోమమువలనఁగాన వీరియుత్పత్తి యభివృద్ధు లెటులఁగల్గినను నగ్నికులక్షత్రియ నామము వీరికిం గలైనవియందురు. బహుశః అప్పుడొనర్చిన తపోహోమములు క్షత్రియకులమందు మిగిలిన దంపతులకు సంతానాభివృద్ధిని గల్గించియుండనోపునని తలంపఁదగి యుండును.

ఆయాగమున సుప్రసన్నులై గల్గిన నల్గురువీరు లనఁబడినవారు :- ఇంద్రాంశనిరూపణమగు ప్రమారశాఖ బ్రహ్మాంశనిరూపణమగు చళూక, లేక సోలంకిశాఖ, విష్ణ్వంశానిరూపణమగు చౌహన్‌శాఖ, రుద్రాంశానిరూపణమగు పురిహార శాఖ యనఁబడినవి. అందు ప్రమారశాఖాక్షత్రియ వీరుల కర్బుదసీమయు, ధార్సీమయు, నుజ్జయనీ సీమయు, పరిపాలింప ఋషులచే నొసంగఁబడె ననియు, బ్రహ్మాంశనిరూపణమగు చళూక (చాళుక్య లేక సోలంకి) శాఖవారి కనిహాలా రాజ్యమును, విష్ణ్వంశనిరూపణమగు చౌహన్ (చౌహాత్ చతుర్హాస్త) శాఖవారికిఁ బరిపాలింప గడమండల (లేక గర్హామండల) రాజ్య మొసంగఁ బడెననియు, రుద్రాంశనిరూపణమగు పురిహార శాఖాక్షత్రియవీరులకు నవమరుస్థలియు నొసంగ బడెనని చెప్పఁబడినవి.

ఇట ఋషులొనర్చిన తపోహోమాదులవలన గల్గిన నాల్గుతెగలక్షత్రియులుకూడ తాము సూర్య వంశస్థులనియో లేక చంద్రవంశస్థులనియో నేటి కినిఁ జెప్పుకొనుచునేయుంట వీరు బ్రాహ్మణు లొనర్చిన తపోహోమములచే నతిపరాక్రమశాలు రుగనై యధికసంఖ్యాకులుగ నభివృద్ధినొంది రని స్ఫురించుచున్నది. బౌద్ధులు తమగ్రంథములందు తక్షకుల నగ్నికులజు లని వ్రాసిరి. క్రీ. ము. రెం డవశతాబ్దకాలమునాఁడు వీరు భరతదేశముపై దాడివెడలి వచ్చినవారు. ఈకాలముననే పరశు నాథుఁడను జైనతీర్థకరులలో నిరువదిమూడవ మహాత్ముండుండెనుగాన కాలమును లెక్కింపనగు చున్నది. ఇంక నీప్రమార చళూక, చతుర్హాస్త, పురిహారశాఖల క్షత్రియులంగూర్చి యోచింతుము గాక. వీ రుత్తరహిందూస్థానమున గాన నగు చున్నారు. వారిలో ప్రమార క్షత్రియులందు ముప్పదియై దంతశ్శాఖలును, చళూకులందును గొన్ని అంతర్భేదశాఖ లేర్పడినవిగాని యవిపూర్తిగ దెలియరాకున్నవి. (చళూకశాఖా క్షత్రియులు చూడుఁడు). చౌహాన్ [చతుర్హాస్త] శాఖాక్షత్రి యులలో నిరువదినాల్గుశాఖలు చెప్పఁబడినవి. [చౌహానుక్షత్రియులు చూడుఁడు]. ఇంక దక్కిన పురిహారశాఖక్షత్రియులందు పండ్రెం డంతశ్శాఖలు కలవని చెప్పఁబడినను మూడుమాత్రమే గాన వచ్చుచున్నవి. [పురిహారక్షత్రియులు చూడుఁడు].

ఈయగ్నికులులంగూర్చివ్రాయుట చరిత్రకర్త మైనదిగాదని కొందరు చరిత్రకారు లనిరి కాని యది సరికాదనియు వీనినిగూర్చి పూర్తియగుపరి శీలన జరుగవలెననియు తలంచుట సమంజసము. ఆనాల్గుశాఖలంగూర్చి వేర్వేరు తావులందు చూడ వలయును.

క్షత్రియులలో 'శిశోదియా' యను నొక సుప్రసిద్ధవంశము గలదు. వీరు మేవాడుప్రభువులు. వీరు ప్రమారశాఖవారనియు శ్రీరామునిసుతుం డగు లవునిసంతతియనియు చెప్పుచున్నారు. [ఆం ధ్రదేశమందలి క్షత్రియులు చూడుఁడు]. 'హమీా ర్, బప్పారావల్' అనుపేర్లుగల సుప్రసిద్ధరాజపుత్ర వీరు లీశిశోరియావారేయని చెప్పఁబడినది. గుహ లేటు లేక గ్రహరాటనువంశ మీా శిశోదియావంశ సంబధశాఖయేనని తెలిసెడిని.

శ్రీరాముని కుమారులగు కుశునిసంతతియు లవునిసంతతియు వేర్వేరుగజెప్పబడు కుటుంబములు కావు. కుశునిసంతతివారు 'కుశ్వాహ' రాజపుత్రుల మనుచున్నారు.

## క్షత్రియకులమునందలి శాఖలు:-

క్షత్రియులందుఁ దొలుత సూర్యచంద్రవంశములు

రెండేర్పడినను నర్మదపర్వతముపై ఋషులొనర్చిన క్షత్రియకులాభివృద్ధింగూర్చిన యజ్ఞయోగమున ౧ ప్రమార, ౨ పురిహార, ౩ చళూక్య, ౪ చౌహా నుశాఖలు నాలు గేర్పడినవి. (క్షత్రియకులముఁ జూడుఁడు.)

ఇవియన్నియు సూర్యవంశమునకుఁ జెందినవిగనో, చంద్రవంశమునకుఁ జెందినవిగనో యున్నవి. కొన్ని క్షీణించియుఁ గొన్ని నశించియు గూడనున్నవి. కొందరు మహమ్మదీయులగుట వ్యక్తిత్వముమారి పోయియున్నవి.

ఇక్ష్వాకులమున సుప్రసిద్ధములై లెక్కింపందగిన క్షత్రియకులమందలిశాఖలు ముప్పదియారు గలవు. ఉత్తరహిందూస్థానమునను రాజపుత్రస్థానఁపు సీమలందు సుప్రసిద్ధములగు పాటల రచించిన కవులుగ చేరంది రాజపుత్రచరిత్రలను బెక్కుపాటలరూపముఁ నరచించిన చందుకవీశ్వరుఁడును, కీచీకవీశ్వరుండును, తమపాటలందు వీరిశౌర్యధైర్యోదార్యశక్తులను చక్కగ వర్ణించియున్నారు. కుమారపాల చరిత్రమను గ్రంథమునఁ గొన్నిప్రతినామములు చెప్పఁబడినవి. ఘూర్జరదేశమున వీరికిఁ గొన్నిప్రతినామము లాదేశీయములుగ వాడుకయందున్నవి.

౧ ఇక్ష్వాకుశాఖ:—దీనికిఁ గీచీకవి (bard) 'గిహాలిత్' అనుపేరును నిందుకవి 'రవ్య' యను ప్రతినామమును వాడిరి. ఘూర్జరమున'గొట్టా' రనియు 'గోపాల్' అనియుఁ బ్రతినామములు వాడుకయందున్నవి.

౨ సూర్యశాఖ:—దీనికి పూషశాఖయని ప్రతినామము గలదు. ఘూర్జరమున నీ 'గోపాల్' అనుపేరు వాడుకయం దున్నది. వీరు ప్రమారులు.

౩ సోమ లేక చంద్రశాఖ:—వీరికి యదుశాఖవారని ప్రతినామముగలదు. ఘూర్జరదేశమున 'కట్టి' లేక 'కథి' యనుపేరు వాడుచున్నారు. వీరి నుండియే కథియవాడ్ నామము గల్గెనట. వీరు చౌహానులలోనివారు. గుహాలేత్ వారునుగొందరు కలరందురు.

౪ యదుశాఖ:—ఇది ప్రత్యేకశాఖ. వీరును ప్రమారులలోను చౌహానులలోను గల యాదవ్వులలో నొకప్రత్యేకశాఖ. వీరికి ఘూర్జరమున 'కైసై' రనుపేరు వాడుకయందున్నది. వీరు చాళుక్యులందుకూడ గలరట. యదుశాఖలందు నాలుగంతశ్శాఖలు గలవందురు.

౫ చాహూమాన్ శాఖ (చౌహాన్):—వీరికి 'రహతూర్' అని ప్రతినామముకలదు. ఘూర్జరదేశమున 'నికుంప' యనుపేరు వాడుకయందున్నది. ప్రమారులలో కొందరీశాఖవారు గాననగుచున్నారు.

౬ ప్రమారశ్శాఖ:—వీరికి 'భీర్గుజర్' అను ప్రతినామమునుకీచీకవి వాడియున్నాఁడు. గుజరాతుసీమలందుబర్జైతాయను పేరుకలదు. చాళుక్యులలోనుచౌహానులలోనుగూడ ఈశాఖకలదందురు.

౭ చళూక్ శాఖ:—దీనికి 'సోలంకి' యనియు, 'చందక్' అనియు బాపురే ప్రతినామములు గలవు. పురిహారులందుఁగూడ నీశాఖవారు గాననగుచున్నారు.

౮ పురిహారశ్శాఖ:—వీరికి 'శైలాహార్' అనియు 'రాజతిలక్' అనియు మారణయనియు (గుజరాతీ) బ్రతినామములు గలవు.

౯ చౌరా:—వీరియందుఁగూడఁ గొందరు శైలాహారులు గలరు. 'చపోట్కట్' అనియు

'జాలా' యనియు వీరికిఁ బ్రతినామములు వాడుకయందున్నవి.

౧౦ దోడియా:—వీరికి 'అభీరు' లనియు 'ప్రీతిహారు' లనియు ప్రతినామములుకలవు. 'దహిమా' లని ఘూర్జరనామము.

౧౧ రహతూర్ శాఖ:—వీరికి 'శుక్రంక' యనియు 'కచ్వాహా' యనియు గుజరాతుదేశమున 'దోడియా' యనియుఁ బ్రతినామములు వాడుకయందున్నవి.

౧౨ గోహిల్ శాఖ:—వీరికిఁ 'గూర్వా' లయనియు 'గోర్' అనియుఁ బ్రతీనామములు గలవు.

౧౩ దాబిశాఖ:—వీరికి 'చవోట్ఖట్' అనియు 'శెంగార్' అనియు 'చంద్రైల్' లేక 'ఛండేల్' అనియుఁ బ్రతినామములు గలవు. గుజరాతు దేశమున 'భాగేల్' అని వాడుచున్నారు. 'భాగ్ఖేలండు' వీరిపరిపాలననుండియే పేరందె నని తెలిసెడిని.

౧౪ మేఘవాహనశాఖ:—దీనికి 'ఓహిల్' అనియుఁ బ్రతినామము గలదు. వీరు యాదవులనియు, పురిహారులనియు నందురు.

౧౫ నోర్క శాఖ:— వీరికి 'రహతూరు' లనియు 'ఖుర్వర్' అనియుఁ బ్రతినామములు గలవు. ఘూర్జరమున 'జైత్వ' యని వాడుక నామమున్నది.

౧౬ అస్వరేశాఖ:—వీరికి 'దిమోరా' యనియు ఘూర్జరమున 'జేర్జా' యనియు వాడుకనామములు గలవు.

౧౭ సలార్:—(శైలార్) వీరు 'శైలాహారు' లనంబడిరి. వీరికి 'తక్' అనియు 'దహామా' యనియు వాడుకనామములును, ఘూర్జరమునకే 'జత్' అనుపేరును గలవు.

౧౮ సిండా:—వీరికి 'సింధూ' యనియు, 'ధనపాల' యనియు, 'దాహ్యా' యనియు వాడుక ప్రతినామములు గలవు. వీరు చాళుక్యుల లోని యొకశాఖవారు.

౧౯ శవత్ శాఖ:—వీరి 'కనంగ' యనియు 'బైసీ' యనియుఁ బ్రతినామములు గలవు. ప్రమారులలోని శాఖవారు.

౨౦ హాన్:— (హన్నులు లేక హూనులు) వీరికి 'పటక్' అనియు 'కాబా' యనియు 'ఘుర్వా' లనియు వాడుక నామములు గలవు. (కాబా, ఘూర్జరనామము).

౨౧ కిత్థాల్:—వీరికి 'పృథిహారు' లనియు, 'మారుండలీకు' లనియు, 'నికొంప' యనియు వాడుక నామము లున్నవి. ఘూర్జరమునకుచవ్రూరయని పేరుకలదు.

౨౨ హుశైరాశాఖ:— వీరికి 'దివ్యోతా' యనియు 'నికుంప' యనియు 'చారసీమ' లనియు 'దేవత్' లనియు వాడుకనామములు గలవు. వీరు 'శైలాహారు' లని యందురు.

౨౩ రాజపాలిశాఖ:—వీరికి 'కరిత్పాల్' అనియు ఖాంటనియు, జోహ్యాలనియు వాడుకనామములుకలవు. వీరు 'హన్నులలోని' వారని ప్రతీతికలదు.

౨౪ ధనపాలిశాఖ:—వీరికి కోట్పాలయనియు 'క్షైరాల' నియు, 'సికర్వాలు' లనియు వాడుక

నామములు కలవు. 'బల్లాల'ని కుమారపాల చరిత్రమున 'బల్లాల' ని వాడఁబడియున్నది.

౨౫ అగ్నిపాలిశాఖ:—వీరికి 'హూల్' అనియు 'హర్యల్' అనియు 'దాబియా' యనియు వాడుక గలదు. ఘూర్జరమున 'రావులిశాఖ' యని వాడఁబడుచున్నది.

౨౬ బల్లాశాఖ:— వీరికి 'గోర్' 'మోకూర్' 'దోడా' 'మకానియా' (ఘూర్జర) యని ప్రతి నామములున్నవి.

౨౭ జాలాశాఖ:—వీరికి 'నికుంప' వోకరులని ప్రతి నామములు గలవు. ఘూర్జరమున 'పాలను' లందురు.

౨౮ భగ్గోలాశాఖ:— వీరికింకను 'రాజపాలిక' లనియు 'హాల్లా' లనియు 'మోకరు' లనియుఁ బ్రతినామము లున్నవి.

౨౯ మోట్టన్ శాఖ:—వీరికి 'కానిశాఖ' యని యందురు. ఘూర్జరమున 'జాలా' శాఖ యందురు. వీరు అభీరులు.

30 మోహర్ శాఖ:— వీరు 'కాలోబ్రరక్' లేక 'కూర్కురా' లని యనంబడుచున్నారు. హాయ వంశస్థులు. ఘూర్జరమున 'దహిర్యా' లనఁబడుచున్నారు.

3౧ కుగ్గర్ శాఖ:— వీ రగ్నిపాలురలోనివారు. ఘూర్జరమున 'బహారియా' లనఁబడుచున్నారు.

3౨ కుర్జయోశాఖ:—వీరికి 'అశ్వేర్వా' లేక 'సజ్జా' లని ప్రతినామములున్నవి. ఘూర్జరమున సయ ఛత్రాయ తన్నార్ క్షత్రియులని వాడుకలుగలవు.

33 చాఢ్లియాశాఖ:—వీరు 'హూలులు' 'పురిహారులు'.

3౪ పోకారశాఖ:—వీరికి 'మనుత్యాల్' అని ప్రతి నామము. 'చేహానులు'.

3౫ నికుంపశాఖ:—వీరికి 'మాల్యా' యని ప్రతినామము గలదు.

3౬ సులాలశాఖ:— వీరికి 'చాహిల్' అనియు 'దహిమా' లనియు వాడుకలు కలవు.

(ఆంధ్రదేశమందల్లి క్షత్రియులు చూడుఁడు).

## క్షత్రియోపనివేశము:—

(ఉపనివేశదేశము చూడుఁడు.)

## క్షతే ప్రహారాని పతంత్యభీక్ష్ణమ్ :—

దెబ్బతగిలినచోటనే తిరిగిదెబ్బతగులుట. ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. గోరుచుట్టుపై రోకటిపోటు. తగిలినచోటనే తగులుట, నొగిలిన కొంపే నొగులుట. మొదలగులోకోక్తుల కదియె భావము.

## క్షతే మక్షికాపాతః :—

ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. దెబ్బ (పుండు) పై నీగ వ్రాలినట్లని యర్థము.

## క్షతే క్షారమివేతిన్యాయము:-

కురుపుపై నుప్పుజల్లుట యనియర్థము. నొప్పి గల్గినపిదప దానినింకను బాధించుటయని భావము.

## క్షత్రోపేక్షుఁడు:—

యదుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి శ్వఫల్కుఁడు. సోదరుఁ డక్రూరుఁడు.

క్షపగోత్రము:—
(నిధృవగణము జూడుడు.)

క్షపణకుడు (దిఙ్నాగాచార్యుడు):-
ఉజ్జయినియందుండిన గొప్పవిద్వాంసుడు. (ఉజ్జయని చూడుడు.)

క్షపేయగోత్రము:—
(కపిఉపగణము జూడుడు.)

క్షపోతార్షిగోత్రము:—
(ఔతథ్యఉపగణము జూడుడు.)

క్షమ:—దక్షప్రజాపతికుమార్తెలలో నొకతె. భర్త పులహుడు.

క్షయమాసము:—
(నష్టమాసముజూడుడు.)

క్షయరోగము:—
[యక్ష్మ రాజయక్ష్మ చూడుడు.]

క్షరయగోత్రము:—
[కుశికగణము జూడుడు.]

క్షామిగోత్రము:—
[పరాశరగణము జూడుడు.]

క్షారత్రయము:—
[త్రిక్షారములు చూడుడు.]

క్షారాష్టకము:—౧ మోదుగు, ౨ ఇరుగుడు, ౩ ఉత్తరేణి, ౪ పగిస, ౫ నువ్వులచెట్టు, ౬ మొక్కపుచెట్టు, ఈచెట్లనూ, యవాక్షారము, వెలిగారము, వీటిభస్మమునకుపేరు. ఆయుర్వేదవైద్యవిధానమున నివి యష్టశూలలు, గుల్మరోగము, మహోదరము, వాతదోషముల నడంచునని చెప్పఁబడినది.

క్షిప్రానది:— దీనినిప్పుడు శిప్రాయను చున్నారు. దీనిప్రశంస బ్రహ్మపురాణము ౪౩, వామనపురాణము ౮౩-౮౫ యందు గాననగును.

క్షీరకరన్తగోత్రము:—
(ఔతథ్య ఉపగణము చూడుడు.)

క్షీరకరమ్భగోత్రము:—
(ఔతథ్య ఉపగణముఁ జూడుడు.)

క్షీరకరమ్భగోత్రము:—
(శరద్వస్త ఉపగణము చూడుడు.)

క్షీరదగ్ధజిహ్వాన్యాయము:— వేడిపాలతో నాలుకఁ గాల్చుకొన్న ట్లనియర్థము. గొప్పఁగ జెప్పుకొనుట కీన్యాయము వాడుదురు.

క్షీరనీరన్యాయము:— నీళ్ళును పాలును గలసిపోయిన ట్లని ఆంధ్రలోకోక్తి కలదు. ఒకటితో నొకటి యన్యోన్యమును గలసిపోవువస్తువు లని తెల్పుట కీన్యాయమును వాడుదురు. దీనిని నీరక్షీరన్యాయము, క్షీరోదకన్యాయము ననియు వాడుచుందురు.

క్షీరంవిహాయ [అరోచకగ్రస్తస్య] సౌవీరరుచిమను భవతీతిన్యాయము:—
పాలను విడిచి పులిశినగంజిని (లేక జావ) రుచి చూచినవా డనిభావము.

మంచిస్థితియందు స్థిరత (నిలువక) దీనావస్థ యగు నిర్భాగ్యపుస్థితిని జేరినవారి కీన్యాయమును వాడుదురు.

క్షీరసాగరము:— వ్రజమండలమున మధురనుండి పదిన్నరమైళ్ళదూరమునగల యొక పవిత్రసరోవరము. ఇటఁగల గ్రామమునకుఁ 'బల

దేవు) అనిపేరు. సరత్త్రిరమున బలరామస్వామి దేవళ మున్నది. యాత్రాస్థలము.

**క్షీరాబ్ధిమధనమున జనించిన వస్తువులు:—** క్షీరాబ్ధిమథనమును సర్వసాధారణముగ సముద్రమథనమని వాడుచుండుటయుఁ గలదు. ఇందు మందరగిరిని వాసుకినాగమును విష్ణుదేవునికూర్మావతారమును పరికరములుగ గైకొని దేవాసురులు పాలసముద్రమును మథించి నటులను దానియందత్తరి ౧ హాలాహలమనఁ బడువిషము, ౨ ఉచ్చైశ్శ్రవము, ౩ ఐరావతము, ౪ కల్పవృక్షము, ౫ అప్సరోగణము, ౬ చంద్రుఁడు, ౭ లక్ష్మీ (శ్రీ) దేవి, ౮ అమృతకలశము ధరించిన ధన్వంతరియు జనించిరనియు బమ్మెరపోతరాజవిరచి తాంధ్రభాగవ తాష్టమస్కంధమునఁ జెప్పంబడినది.

**క్షీరాబ్ధిద్వాదశి [చిలుకుద్వాదశి]:—** కార్తికశుద్ధద్వాదశి. తులశి (బృంద) భక్తికిమెచ్చి శ్రీకృష్ణుఁడు బృందావనమున కరిగి యామె నను గ్రహించి పరిగ్రహించిన దినము. బృంద (తులశి) దేవీసహిత లక్ష్మీనారాయణులను స్త్రీలు పూజించు వ్రతదిన మిదియే! (యోగీశ్వరద్వాదశి చూడుఁడు.) క్షీరాబ్ధిమథన మాదిని జరిగిన దినమని చెప్పంబడినది. (పండుగలు చూడుఁడు.)

**క్షీరభవానీదేవి:—** కాశ్మీరమునందలి శ్రీనగరమునకుఁ బండ్రెండుమైళ్ళదూరమునం దీక్షేత్రము గలదు. ఒకజలకుండమున దేవీవిగ్రహ ముండును. పగటివేళ వేర్వేరుకాలముల వేర్వేరురంగులతో నాకుండమందలిజలములు గాననగుచుండును.

**క్షీరిగోత్రము:—**
(కుశికగణము చూడుఁడు.)

**క్షుతము:—** క్షుతశకునమనగా తుమ్ము శకున మనియర్థము. ఇటుఁ గార్యాలోచనారంభమున, గార్యాచరణారంభమున, గమనారంభమున, తనకుఁగాని, యితరులకుఁగాని, గల్గినతుమ్ముల శకునములని యిచటి భావము.

వరుసగ రెండుతుమ్ములు వచ్చిన కార్యసిద్ధి. నడచుచుతుమ్మిన సమస్తదోషము లడంగును. తుమ్మి తోడనేచీదుట కార్యహాని, యాపదయు, తుమ్ముచు, దగ్గుచునడిచినను, పరుండితుమ్మి యుమిసినను, నాపత్కరము.

తుమ్మినేలంగోకిన యపశకునము. తుమ్ముచు నవ్వలకేగుటయు, తలగోకికొనుటయు, తడబడుటయు, చింతనొందుటయు, చీదుటయు, నపశకునములనియు, శిలలైనను వీనివలనఁ గష్టములపాలగుననియు చెప్పఁబడినది.

లేచుతరితుమ్మిన శుభప్రదము. కూర్చుని తుమ్మినను, జలసమీపమునతుమ్మినను, గొణుగుచు కలహించుచు తుమ్మినను, కార్యహాని. తుమ్మినతోడనే ఇనుము, వెండిఁ, జూచిన కార్యనాశము. కొందరుఋషులు రాగినిగాని కంచునుగాని తుమ్మినతోడనే జూచినయెడల మంచిదని నుడివియున్నారు.

పసిబాలయును, భోగముస్త్రీయును పంచముడును, కుంటివాడును, తుమ్మిన కార్యసిద్ధియు జయప్రదమునునని చెప్పఁబడినది.

కులటయు, గర్భిణీస్త్రీయును, గొడ్రాలును ముత్తైదువును విధవయు, అంధుఁడు, వీరితుమ్ములు మృతిప్రాయఫలదములనియు; చాకలది, గాండ్లది, కుట్రపుది, మూగది, మెఱుకలది, మొండిది, ముక్కులేనిది, వీరితుమ్ములు దుఃఖప్రదములనియు

చతుష్పాదజంతువుల తుమ్ములు మరణప్రదము లనియుఁ జెప్పఁబడినది.

తుమ్మినతోడనే మొసలినిగాని, బంగారుగాని, ఫలములనుగాని, స్త్రీనాట్యమునుగాని, జూచుటయు, పాదప్రక్షాళన మొనర్చుకొని తాంబూలము వైచికొనుటయు, బంగారము, వెండి, రత్నములు, వీనిందాకుటయు, తుమ్మువలనగల్గు దోషములను పరిహరించుననియుఁ జెప్పఁబడినది.

**క్షుధ:—**
(ఆకలి చూడుఁడు.)

**క్షుప త్రయము:—**
(కంటము లేక కంటత్రయము చూడుఁడు.)

**క్షుపుఁడు:—**
(తండ్రి మొదటిఖనిత్రుఁడు.)

**క్షురప్రము:—**
(బాణాగ్రములు చూడుఁడు.)

**క్షుల్లకపురము:**—కరవీరపురము, కొల్హాపురము, శైలాహారదేశము చూడుఁడు.

**క్షేత్రగణితము:**— దీనిని క్షేత్రాకార గణితమనిన నెక్కువస్పష్టముగనుండును. భరతదేశపుగణితశాస్త్రమందలి యొకభాగముగ నున్నను ప్రత్యేకశాస్త్రలక్షణములతో దనరారుచున్నదిగా నున్నది. ఐరోపాదేశములం దిది జియోమిట్రి (Geometry) యనఁబడు శాస్త్రమై యున్నది. ఈజిప్టుదేశవాసియగు యూక్లిడ్పండితకృతమైన యొకగ్రంథమును గ్రీకుపండితులు గైకొని తమభాషలోని కనువదించుకొనిరనియు నట నుండి యైరోపాదేశముల కి వ్యాపించెననియు నందురు.

ప్రస్తుతాంశమగు క్షేత్రగణితము భరతదేశపు టుత్పత్తి గలిగినదందురు. ఇది లీలావతీగణితశాస్త్రమునందుంట నితరదేశములనుండి దిగినదికాదని తేలుచున్నది. భరతదేశమున పూర్వులనాఁడిట్టి శాస్త్రము వారికుండినటుల నిక్కాలపు భారతీయఁపుముఖ్యులలోఁ బెక్కండ్రకుఁ దెలియకపోవచ్చును. యూక్లిడ్పండితుని జియోమెట్రిశాస్త్రము భరతదేశమున నాంగ్లపాఠశాలలందు వాడఁబడుకతన నీశాస్త్రము ప్రభుత్వావలంబనలేక దాని చాటున మరుగుపడిపోయినదిగా తేలుచున్నది.

ఇందు సూత్రములవలెనున్న యుక్తులు డెబ్బదియొకటి గానవచ్చుచున్నవి. అం దేబదినాల్గు పదార్థనిర్వచనములును (Definitions), ముప్పదియేడు నిశ్చితధృవములును (Axioms), కొన్ని యొప్పందలలును (Postulates), గానవచ్చెడిని. ఎట్లున్నను నీశాస్త్రమును దీనిఁబోలిన యితర శాస్త్రములఁబోలి యభివృద్ధిపరుపఁబడక నెట్లేర్పడినదో యటే నిలచిపోయినదని తోచకపోదు.

తారానాథతర్కవాచస్పతివిరచిత వాచస్పత్యమను విజ్ఞానగ్రంథమునకు క్షేత్రతత్వదీపికయని పేరనియుంట నాపేరుగల గ్రంథమొక్కటి కలదా యని సంశయముతోచెడిని. ఈశాస్త్రముమేరకు గుణించి లెక్కించుట కెరుంగందగిన ఫలితములుగ కొలతలెక్క లరువదిరెండు వాచస్పత్యమున వివరింపంబడినవి.

క్షేత్రగణితముఁగూర్చిన యితరగ్రంథములు లభింపమి దీనినిగూర్చి యేమియు వ్రాయుటకు వీలుకలుగకున్నది. ఇందు బిందువు, రేఖ, తలము, స్థూలపదార్థము, సరళరేఖ, వక్రరేఖ, మిశ్రరేఖ, సంపాతరేఖ, సమానాంతరరేఖ, యోగము, విషమాంతరము, లంబరూపము, వృత్తసంపాతము,

సమకోణము, అల్పకోణము, అధికకోణము, విషమకోణము, సమధరాతలము, వర్తులధరాతలము, సంలగ్నము, విషమధరాతలము, త్రిభుజము, ద్విభుజము, విషమద్విభుజము, సమకోణత్రిభుజము, విషమత్రిభుజము, అధికకోణత్రిభుజము, న్యూనకోణత్రిభుజము, చతుర్భుజము, సమకోణాయత చతుర్భుజము, విషమకోణాయత చతుర్భుజము, బహుభుజక్షేత్రము, వృత్తక్షేత్రము, కర్ణము, పరిధిసంజ్ఞ, పాలిసంజ్ఞ, కేంద్రము, వ్యాసము, వ్యాసార్థము, చాపము, చాపకర్ణము, అర్ధవృత్తము, వృత్తాంకము, వృత్తఖండకము, వృత్తపాదము, అంశ, కలా, వికలా, ప్రతివికలా, చాపగతాంశ, సమము, దీర్ఘము, చాపాంతర్గతకోణము, ఉపరిస్థకోణము, కేంద్రకోణము, పరిధిసంలగ్నము, వృత్తఖండినీ, సమభుజము, ఏకనిష్పత్తి, సజాతీయము మొదలగునవి నిర్వచింపఁబడినవి. ఈనిర్వచనములు (Definitions) లో కొన్నియును వేరుగకొన్నియును నిశ్చితధ్రువములు (axioms) ను, మరికొన్నిగను, నొప్పుదలలు (Postulates) ను, చెప్పంబడినట్లు వివరింపంబడినది.

## క్షేత్రమెఱిగి విత్తనమును పాత్రమెఱిగి దానమును:-(ఇదిఆంధ్రలోకోక్తి.)

**క్షేమకుఁడు:—** చంద్రవంశక్షత్రియుఁడు. అభిమన్యుని (పాండవ) సంతతి యీతనితోఁపూర్తి యయ్యెను. తండ్రిపేరు రెండవనిమి. పితామహుఁడు దండుఁడు, లేక దండపాణి. ఈతనికాలమునకు కలియుగమున వేయిసంవత్సరము లాయెనని చెప్పఁబడినది.

**క్షేమవతీ (ఖేమవతీ) నగరము:—** ఇది బుద్ధక్రికుచ్ఛందుని జన్మస్థానమని చెప్పఁబడినది. ఆయనకుఁ గ్రికుచ్ఛందుఁడని వాడుక నామము కలదు. ఈయనప్రశంస స్వయంభుపురాణము ౮ అధ్యాయమున గలదు. దానికింకను క్షేమదీపవంశమనియుఁ బేరుండెనందురు.

దీనిని నేపాలదేశపు తెరై యందు 'తిలౌరా' యనఁబడుతావుననుండి దక్షిణముగాఁ నాల్గుమైళ్ల దూరమున గల 'గుటీవా' గ్రామముగ P. C. mukherjisi's antiquities of Terai Nepal అనుగ్రంథమున 49–55 పుటలందు వివరింపంబడినది. పాహీనూను nepeikea లేక Nabhiga అని మాత్రము వ్రాసికొనెను.

**క్షేమవతీక్షేత్రము:–**నేపాళదేశపుహద్దులలోన తెరైభాగమునందు 'గుటీవా' యనంబడు గ్రామముగ బోల్చియున్నారు. ఇది యిప్పటిబుద్ధభగవానునకుఁ బూర్వపుబుద్ధుని జన్మస్థలము.

**క్షేముఁడు:—** మగధబార్హద్రథసంతతి క్షత్రియుఁడు. తండ్రి శుచి. పితామహుఁడు విప్రమహారాజు. కుమారుఁడు సువ్రతుఁడు.

ఇంకను కావ్యులలో వేరొక క్షేముఁడు గలఁడు. ఇతఁడు సునీతునికుమారుఁడు. ఈతని సుతునిపేరు సుకేతుఁడని చెప్పఁబడినది.

**క్షేమేంద్రుఁడు [మహాకవి]:—** ఈతఁడు గొప్పవిద్వాంసుఁడగు మహాకవి. బ్రాహ్మణుఁడు. శివభక్తుఁడు. అద్వైతమతస్థుఁడు. తండ్రిపేరు ప్రకాశేంద్రుఁడు. ఈతఁడుబ్రహ్మవేత్తగఁజెప్పంబడినవాఁడు. విద్యాగురువు గంగకోపాధ్యాయుఁడు

భోజమహారాజునకు సమకాలికుఁడై యాతని బంధువగు మ క్రీ. వె. 996–1051 ల నడుమనో, లేక మరికొందరు తలంచునటుల క్రీ. వె. 1028–1080 ల నడుమనో కాశ్మీరరాజ్యమేలిన యనంతవర్మమహీపాలునికడ నాస్థానవిద్వాంసుఁ

ముగ నుండినవాడని కల్హణపండితుని రాజతరంగిణి నుండి తెలియుచున్నది. గాన కాళిదాసమహాకవికిం దరువాత నుండినవాడని తోఁచెడిని.

వశ్యవాక్కునకు క్షేమేంద్రుఁడే యగ్రగణ్యుఁడని పండితులందురు. ఈతఁడు తనకు వ్యాసదాసనుపదమును బిరుదముగ వాడుకొనుచుండినటుల గానవచ్చెడిని. ఈతని కావ్యాంతములందు గద్యముల నటుల చెప్పుచుండువాఁడు.

ఈమహావిద్వత్కవి రచించినగ్రంథములు పెక్కు గలవు. గాని కొన్ని ఖిలమై నామమాత్రావశిష్టమైనవి ఇక్కాలమున నిరువదినాల్గు చూడనగుచున్నవి. ఐదుగ్రంథములు గానవచ్చుట లేదు. ఏవో కొన్ని యీతనిగ్రంథములు జర్మనుదేశమున నింకను గలవందురు.

రామాయణమంజరి, భారతమంజరి, బృహత్కథామంజరి, చతుర్వర్గసంగ్రహము, కవికంఠాభరణము, సువృత్తతిలకము (పద్యములఛందస్సు) సేవ్యసేవకోపదేశము, చారుచర్య, (మహనీయుల చరిత్రలనుండి దృష్టాంతములు). ఔచిత్యవిచారచర్చ, అమృతతరంగకావ్యము, దశావతారచరిత్రము, ముక్తావళి, దేశోపదేశము, పద్యకాదంబరి, వాత్స్యాయనసూత్రసారము, శశివంశమహాకావ్యము, చిత్రభారతము (నాటకము), పవనపంచాశతి, లోకప్రకాశకోశము (నిఘంటు), బోధిసత్వావధానకల్పలత, లావణ్యవతి, రాజావళి (కాశ్మీరరాజులచరిత్ర దీనిని కల్హణపండితుఁడు సరికాదని నిరసించియున్నాఁడు). నీతిలత, లలితరత్నమాల, వినయవల్లి విచారచర్చ (అలంకారశాస్త్రము), అనుగ్రంథములు గానవచ్చెడిని. ఇంకను మునిమతమీమాంస, యవసరసారము, నీతికల్పతరువు, కనకజానకి, సమయమాతృకాకలావిలాస మనుగ్రంథములు గలవందురుగాని గానవచ్చుట లేదు.

**క్షేమ్యుఁడు:**— పూరువంశ క్షత్రియుఁడు. ఉగ్రాయుధునికుమారుఁడు.

**క్షౌమితిగోత్రము:**—
(అగస్త్యఉపగణము చూడుఁడు.)

**క్షౌరపుసబ్బు (Shaving Scap) పరిశ్రమ:**—

| | | |
|---|---|---|
| Tallow (క్రొవ్వు) | 250 | భాగములు |
| కొబ్బరినూనె | 125 | ,, |
| పందిక్రొవ్వు (Lard) | 25 | ,, |
| Causte Soda lye of 20°Be | 275 | ,, |
| Caustic Potash lye of 20°Be | 75 | ,, |
| లవండరుతైలము | 1 | ,, |
| క్యూమిన్ (Cumin) తైలము | 1/2 | ,, |
| తైమ్ (Thyme) తైలము | 1/2 | ,, |

Tallow (క్రొవ్వు), కొబ్బరినూనె, పందిక్రొవ్వు, కలిపి కరిగించి 115° F వచ్చువఱకు చల్లారనిచ్చునది. (తరువాత Caustic Soda lye యున్ను, Caustic Potash lye యున్ను జేర్చి మెల్లగాకలియఁబెట్టునది. ఆపిదప పైనిచెప్పిన లవండరు మొదలగు పరిమళద్రవ్యములను మిళితము చేసి సువాసనకలుగునట్లు చూచునది. ఒకదినము ఆరనిచ్చి మూసలలోఁబోసి Sticks స్టిక్కులు తయారుచేయునది.

శ్రీ

# ఆంధ్ర విజ్ఞానానుబంధము

**SUPPLIMENT TO THE**

# TELUGU ENCYCLOPÆDIA

## ప్రసాద భూపాలుఁడు

జమీందార్ ఆఫ్ దేవిడి.



జ్ఞానోదయము.

మొదటికూర్పు 1000 ప్రతులు.

1941

PRINTED AT THE BOX PRESS

BY B. V. RAMANIAH & SONS, RAJAHMUNDRY.

# విషయసూచిక.



 అంకగణిత పరిభాషాపదములు

## అంకగణిత పరిభాషాపదములు:-

తెలుఁగున నిఁకముందుఁ బుట్టఁబోవు గణితశాస్త్రములం దుపయోగింపంబడుట కాంధ్రవిజ్ఞాన సర్వస్వకర్తలు వీనినిఁ బ్రకటించిరి. గాన నవి యట్లే యుపయోగింపంబడఁగోరి యిందుఁ బొందు పరుపఁ బడినవి.

| తెనుఁగుపదము | ఇంగ్లీషుపదము |
|---|---|
| సంకలనము, కూడిక. | Addition ...... |
| మిశ్రగణితము | Alligation ... |
| రమారమి, ఆజూకు, అందాదు, ఇంచుమించు. | Approximate ... |
| అంకగణితము. వ్యక్తగణితము. పాటీగణితము, | Arithmetic |
| అంకగణిత మధ్యమానము. | Arithmetic mean... |
| అంకశ్రేఢి, (శ్రేణి). | Arithmetical Progression... |
| పదము, ధనము. | Term ... ... |
| ఆదిపదము, ముఖపదము. | First term ... |
| మధ్యపదము | Middle term ... |
| అంత్యపదము | Last term ... |
| గచ్ఛము, పదసంఖ్య | Number of terms ... |
| చయము | Common difference ... |
| పదసంకలనము | Sum of two series... |
| అంశసవర్ణము, భాగజాతి | Assimilation of Fractions... |
| దలాలి (దళాలి) దళారి, కాయదా... | Brokerage ... |
| మూలధనము, పెట్టుబడి... | Capital ... |
| గుణకము, గుణకసంఖ్య. | Co=efficient ... |
| అంకయోగములు. | Combinations ... |
| సమచ్ఛేదము | Common Denominator ... |
| సామాన్యాపవర్తకము, సామాన్యపరిమాణము. | Common measure... |
| సామాన్యాపవర్త్యము, సామాన్యనిరుద్ధాంకము నిరుద్ధాంకము, గుణిజము... | Common multiple... |
| చక్రవృద్ధి—వడ్డీకివడ్డీ | Compound Interest... |
| ఘనము... | Cube ......... |
| ఘనమూలము | Cube Root ... |
| దశమాంశము | Decimal ... |
| హారము, హరము, ఛేదము... | Denominater ... |
| అంతరము | Difference ... |
| అంకము... | Digit ... ... |
| భాజ్యము... | Dividend ... |
| భాగహారము | Division ... |
| భాజకము | Divisor ... |
| సమీకరణము | Equation ... |
| మూలక్రియ, ఘాతమూలకర్మ | Evolution ... |
| వినిమయము | Exchange ... |
| భిన్నము, అపూర్ణము, కలాసవర్ణము | Fraction — |
| మిశ్రి ... ... | ,, — Complex — |
| సంయుక్త ... ... | ,, — Compound |
| వితత— (అవ్యవధానత)— | ,, — Continued |
| విషమ, అపసవ్య | ,, — Inproper |
| భాగానుబంధ; మిశ్ర ... ... | ,, — Mixed — |

| తెనుఁగుపదము | ఇంగ్లీషుపదము |
|---|---|
| సవ్య, సమ— | ,, — Proper . |
| (మహత్తమ; గరిష్ఠ సామాన్య) అపవర్తకము; గరిష్ఠసామాన్య పరిమాణము— | G.C.M. ... . |
| గుణోత్తరశ్రేఢి (శ్రేణి). | Geometrical Progression... |
| గుణోత్తరము, గుణోత్తర— చయము... | Common Ratio... |
| హారాత్మకశ్రేఢి (శ్రేణి) సమస్వరశ్రేఢి. | Hormonic Progression— |
| ఘాతసూచి..., —సూచి;... | Index ... ... ... |
| అనంతరాశి; ఖహారము. | Infinity ... ... |
| వడ్డీ— | Interest ... ... |
| వ్యస్తవిధి; విలోమవిధి. | Inversion ... |
| ఘాతక్రియ... | Involution ... |
| (లఘుతమ,సామాన్య) అపవర్త్యము; కనిష్ఠ సామాన్యగుణిజము— | L.C.M. ... ... |
| అపవర్తకము— ప్రమాణము, భాజకము. | Measure |
| అపవర్త్యము; భాజ్యము; గుణిజము. | Multiple . |
| గుణ్యము. | Multiplicand |
| గుణకారము, హెచ్చువేత; | Multiplication |
| గుణకము | Multiplier — |
| అంకనపద్ధతి, అంకసంకేతము. సంఖ్యాలేఖనము. | Notation — |

| తెనుఁగుపదము | ఇంగ్లీషుపదము |
|---|---|
| సంఖ్యావాచనము, సంఖ్యనుచదువుట, సంఖ్యనుశబ్దములతో వ్రాయుట. | Numeration |
| సంఖ్య; రాశి, అంకము | Number |
| నిరుపాధిక; సామాన్య— | ,, abstract |
| యుగళాత్మక— | ,, amicable . |
| ఉచ్చార్య | ,, articulate . |
| సంఖ్యార్థము | ,, Cardinal . |
| మిత | ,, Commensurable. |
| గుణజ | ,, Composite . |
| యుక్త | ,, Compound . |
| సోపాధిక, పరిగణిత వ్యావహారిక— | ,, Concrete — |
| సమ; సరి | ,, Even — |
| సమ సమ | ,, Evenly even . |
| సమవిషమ | ,, Evenly odd |
| సంకలిత | ,, figurative |
| భిన్న | ,, incommensurable.. |
| కరణి | ,, irrational .. |
| మిశ్ర | ,, mixed .. |
| ఏకాదిక్రమ | ,, natural .. |
| ఋణ | ,, nagative .. |
| బేసి; విషమ | ,, odd ... .. |
| విషమవిషమ | ,, oddly odd .. |
| పూర్ణ, నిధ | ,, perfect .. |
| బహుభుజాకార | ,, polygonal ... |
| ధన | ,, positive ... |
| ప్రధాన, ప్రథమ | ,, prime ... |
| సజాతీయ;... ...తగుపాటి | ,, proportion ... |
| మూలక, సమూలక | ,, rational ... |

| తెనుఁగుపదము | ఇంగ్లీషుపదము |
|---|---|
| త్రిభుజాకార | ,, triangular ... |
| అభిన్న; పూర్ణ | ,, whole ... ... |
| పరికర్మములు | Operations — |
| సరాసరి | Par ... ... |
| భాగస్వామ్యము | Partnership ... |
| అంకపాశవ్యవహారము | Permutations ... |
| ఏకాదిచయాంకఘాతము | Factorial ... |
| క్రయవిక్రయములు | Purchase & sale |
| ఘాతము. | Power ... ... |
| వర్గము, ద్విఘాతము | 2nd Power ... |
| ఘనము; త్రిఘాతము | 3rd Power ... |
| చతుర్ఘాతము | 4th Power ... |
| వ్యవహారగణితము | Practice ... ... |
| త్రోపుడు; అడతి | Premium ... ... |
| లాభనష్టములు | Profit & Loss ... |
| ఉపపత్తి. | Proof ... ... |
| శ్రేణి; శ్రేఢి. | Progression ... |
| యుగ్మనిష్పత్తి; అనుపాతము. | Proportion ... |
| లబ్ధి; లబ్ధము. | Quotient .... ... |
| నిష్పత్తి; ప్రమాణపరిమాణము. | Ratio ... ... |
| ఆవర్త దశమాంశము. | Recurring Decimal... |
| శేషము. | Remainder — |
| ఫలము | Result ... ... |
| మూలము | Root ... ... ... |
| చతుర్మూలము | 4th root ... |
| త్రైరాశికము | Rule of Three ... |
| పఞ్చరాశికము. | Double Rule of three ... |
| వ్యస్తత్రైరాశికము | Immerse Rule of three ... |
| ప్రమాణము | First term, measure, or argument... |
| ఇచ్ఛ | Second term, Demand or Requisition ... |
| ఫలము | Third term ... |
| ఇచ్ఛాఫలము | Fouth term or answer ... |
| వర్గము; చదరము | Square ... ... |
| వర్గమూలము; చదరమూలము | Square Root ... |
| ప్రభాగము | Sub- Devision of a fraction ... |
| వ్యవకలనము; తీసివేత: | Subtraction — |
| ఇష్టకర్మము | Supposition — |
| కరణి | Surd ... ... ... |
| నిలువ, రాశిమొత్తము | Stock ... ... |
| రూపము | Unit ... ... ... |
| గణితము, కృతగణనము— | Working ... ... |

**అగ్గిపుల్ల వెలుఁగుచుండుతరి నూదిన నారిపోవుట—** అగ్గిపుల్లను గీచి వెల్గించుట యన నిప్పు రగుల్కొనఁజేసి చిన్నమంటనుజేయుట యనఁదగును. చిన్నమంటయు దీపమును నొకటియెగావున- దాని కవసరమగు ప్రాణవాయువు (ఆక్సిజెన్‌గాలి) ను తగురీతిని వెచ్చఁజేసి యుపయోగించుకొనుపని నది వెల్గుటతోడనే ప్రారంభించును. అత్తరి నూదితిమేని యాదీపము కడనున్న వేడిచేయఁబడిన యాక్సిజెనుగాలి దూరముగ నరుగంజేసినవార మగుదుము, గాన దీపము కాలుటకు వేడియైనగాలి లేక నార్పనగుచుండును. వడిగాలి వీచుతరినిగూడ దీప మారుటకు జరుగు పనియు నిదియే. గాలి శాంతముగనుండి మెల్లఁగ వీచుట. దీపముగాలు పరిస్థితు లనుకూలములే గాన దానికి సహాయకరములై వెలుఁగఁజేయును.

విద్యుద్దీపకళిక, గాస్‌లైటులు మొదలగుమూయఁ బడిన దీపములు మూయంబడియుంట రక్షణమై దానిపరిస్థితులను వేరుగ నుంచెడిని.

**అగ్గిపెట్టెలు**— భరతదేశమున నొకజాతి కఱ్ఱల నొకటితో వేరొకటి రాపాడించి యగ్నిఁ బుట్టించుపద్ధతి నాదికాలమున వాడుచుండిరి. నేటికిని యాగాదులందుఁ బవిత్రాగ్నిఁ బుట్టింప నాపద్ధతియె యాచరణమం దున్నది.

పిదపఁ జాలకాలము చెకుముకిరాతి నుక్కులోహపుబిళ్లపైఁ గొట్టి మిణుగురులం బుట్టించి వాటి నొకనూలుదారముపైఁ బడునటులంజేసి రగులుకొల్పి దానిని గంధకమున కంటించి వెలుఁగం జేయుచు యగ్నిని రగుల్కొల్పుపద్ధతి చిరకాల మాచరణయం దుండెనని యగ్గిపుల్లలపరిశ్రమలో వ్రాయఁబడినది. ఈయాచారమె యైరోపాదేశము లందుఁగూడవాడంబడుచుండినదఁట. ఆంగ్లేయులు దానిని Flint and steel అనియు రగులఁజేయు చూర్ణమును tinder అనియుఁ బేర్లిడి వాడుచుండిరఁట. ఇక్కాలమున Petrol pipe lighter అనఁబడునది యాపద్ధతినుండి నేర్చినదే యందురు.

క్రీ. శ. ౧౮వ శతాబ్దకాలమున నైరోపాదేశమున ఫ్రెంచిసీమయందు Bagniard de la tour అను రసాయనశాస్త్రవిదుఁడుPhosphorus mastic తో-oxide of Phosphorus ను గల్పి యందుఁ బుల్లనుముంచి యగ్గిపుల్లఁ దయారుచేసెను— ఇదియె Friction match నిర్మాణమునకుఁ బ్రారంభమని యనుచుందురు. పిదప ౧౮౨౭లో నింగ్లాండుదేశమున stocktiouon on- Tees నందు ఫోస్పరస్ లేకుండ నేలంగీచిన వెలుఁగు నగ్గిపుల్లలఁజేసిరఁట. ఇంకను స్వీడన్‌దేశమునను, నార్వేదేశమునను పుల్లలతలలకు ఫోస్పరస్‌సోల్యూషన్ అంటించి కాలిపోకుండ నొకయాటంకముగ నొకపార నతికి యగ్గిపుల్లలఁజేయఁ గన్గొనిరి. స్వీడన్‌దేశఁపునగ్గిపుల్లలకు నిటడల్నని పేరిడిరఁట. అవి చాలకాలము భరతదేశమున కమ్మంబడుచు వాడుకయందు వ్యాపించియే యుండెను.

ఇంగ్లాండుదేశమున వాకర్‌పండితుఁడు (Johu walker) తాఁ జేసిన యగ్గిపుల్లల నక్కాలమున నూటి కొకషిల్లింగుచొప్పునను, వాటినుంచు గుండ్రని డబ్బికి రెండుపెన్నీలును మూల్య మేర్పరిచి యమ్ముచుండెనఁట. అవి sand paper పై గీయవలసియుండెనఁట. పిదప నింగ్లాండున Lucefers అనియు, Vestas అనియు, Fusees అనియు, Vesuvians అనియు మొదలగు పేళ్ళఁ బెక్కురకముల యగ్గిపుల్లలు బయలుదేరెనట. కాని యివి యన్నియు నపాయకరములుగనే యుండి యించుకనొత్తిడితో రగుల్కొని కాలిపోయి నష్టములు గల్గింప నసంతృప్తి గల్గుచునే యుండెనఁట.

క్రి. శ. ౧౮౫౫ లో safty match కనుగొనఁబడి చేయంబడెను. అందు పోస్ఫరస్ పుల్లపైఁ గాక గీచుప్రదేశమున నుండెనఁట. పిదప గంధకము వాడఁబడుట ప్రారంభ మయ్యెనఁట. ఇది ౧౯౦౦ సంవత్సర మందురు. ఇక్కాలమున నీపని కర్మాగారములందే చేయఁబడుచున్నది.

దీనికి Aspne Pine, అనఁబడు జాతులకఱ్ఱలగ్గిపుల్లలకు శ్రేష్ఠమని తలఁపఁబడుచున్నవి. ఇక్కాలఁపు గర్మాగారములందుఁ గఱ్ఱదుక్కలు ముక్కలుగాఁ గోయఁబడి పైపట్టయు గుంపులును సుడులున్ను దొలగింపఁబడి యంత్రమున రెండుమూడు సారులలో నగ్గిపుల్లలు పలకలుగ గోయఁబడెడిని. వీటికి skillets అని సాంకేతికనామము గలదు. పూర్తిగ నగ్గిపుల్లలపరిమాణముగఁ గోయఁబడి

splints అని పేరంపును. అందుల కర్రపొడి తొలఁగింపఁబడి పేరాఫిన్‌తో తడపఁబడి Head mixure అనఁబడు ద్రావకము తలల కంటింపఁబడును. పిదప పెట్టెలలో సమర్పంబడుట పైకాగితము లంటించుట మొదలగు పనులన్నిఁటిని యంత్రములే చేసెడిని. అగ్గిపుల్లలలో wax vestao అనఁబడు మైనపుటగ్గిపుల్లలును గలవు.

అగ్ని ప్రజలు— వీరి నాంగ్లదేశస్థులు Flame dancers అనియు, People of the flame అనియు, పలువిధనామములచే వాడుచుందురు. వీరి దీయగ్నిమతమో లేక నిది మనశ్శక్తిమహిమమో తెలియరాదు. కాని యిట్టివారు, డచ్చిగినియా (దక్షిణమెరికాలోనిది); ఆఫ్రికాఖండము, ఫిజీ మొదలగు దేశములందుఁ గలవని లోకమున వాడుక ప్రబలియున్నది. వీ రీయగ్నికార్యము నతిరహస్యముగ నెఱపుదురఁట. ఎవ్వరింజూడనీయరఁట. కాని యిది గారడీవిద్యవంటి బూటకము గాదని యందురు.

దీనింగూర్చి Miss Rosita Forbes అనునామె కొంతపరిశీలించి- దానిని Tho-modern world అనుగ్రంథపు వోయసీర్సను భాగమునఁ గొంతవివరించెను. ఆమె గొప్ప దేశసంచారిణి యఁట. గొప్పసాహసములు గలదిగఁజెప్పఁబడినది- ఆమె ఈప్రజలను Flame dancers అని వివరించెను. ఆమె డచ్చిగినియా కరిగి వీరియగ్నిజ్వాలానాట్యముఁ గన్గొనెనఁట. దక్షిణమెరికాఖండఁపు టీశాన్యదిగ్భాగమున నీడచ్చిగినియాదేశ మున్నది. Paramaribo యనుపురము దీనిప్రధానపురము. దేశమంతయుఁ దంపరలు, నరణ్యములుగా నుండును. అందుఁ బ్రాణాపాయకరములగు విషసర్పములు, మొసళ్లు, జాగుఆర్లనఁబడు జంతువులు, బాధకరములగుదోమలు మొదలగునవి యధికముగ నుండెడిని. ఇట్లయ్యు దేశమున వ్యవసాయము కొంతవరకు బాగున్నదని చెప్పవలసియుండును. దేశఁపు వెలుపలిభాగములఁ గొన్ని పెద్దగ్రామములున్నను మధ్యభాగమున కరిగినకొలఁదిని కుగ్రామములతో నరణ్యము దట్టమై ప్రజలు చాలాతక్కువగ నివసించుట గాన నయ్యెడిని. ప్రజలం దిండియనుజాతియు, నీగ్రోజాతియుం గలరు. వా రీ మతావలంబకు లేమో యనిపించుంగాని నీగ్రోల కామతభక్తి తప్ప మతకార్యాచరణములందుఁ బ్రవేశమున్నట్టులఁ గానరాదు. అట్లయ్యు నుభయులును దానిని రహస్యముగ నుంచుటయందు జాగ్రత గొనియే యుందురు. బహిరంగముగ నెవ్వరి నడిగినను 'ప్రభుత్వ మట్టికార్యములను జరుపరాదని శాసించినది. Superstition witchcra-ft, and all traces of savagery లను నాశనమొనర్ప నిశ్చయించుకొనినదిగాన వీలుండ' దని ప్రత్యుత్తరములు వచ్చును. విమతస్థు లధికారమునందుండుతరి నిట్టిలక్షణములు నవనాగరికులకు సంఘసంస్కారఁపుమిషచేఁ దోచునవి గాన బహిరంగముగా నిట్టివి జరుప వీలుండదు.

మిస్- రోసిటా- ఫోర్బిస్‌గా రిట్లు వివరించిరి. “నా యాతురతం జూచి యేమో రహస్యముగ నాకో దేశఁపులోపలిభాగఁపు మహారణ్యమున సూరినామ్‌నదీతీరమున నట్టిరహస్యకార్యముచూడ నగు”నని సూచించెను. నే నింకఁ గొన్నిసంగతులడుగ నాసీగ్రో ప్రత్యుత్తరమీయక బయలుదేరినఁ దెలియఁగలవనిమాత్రము సూచించెను. మే మట్లే బయల్వెడలి యాతనిపరిముఖమునసె దొకనావం గుదుర్చుకొని ఆతనింగూడఁ దీసుకొని సూరినామ్‌నదిలోఁబ్రవేశించిదానిబురదనీటియందుఁ బయనము సాగించుచు నది కెగఁబడి దేశమధ్యభాగఁపు మహారణ్యముగుండా నడచుచుంటిమి. ఆతండు పౌర్ణమినాఁ డాకార్యము నడచుననియు

నాదినము రేపుగా నేటి కెట్లైన నూగుట సమంజసమనియు నని యొకభద్రమగు తావున మానివాస మేర్పరిచెను. ఆతావటమున గొంత సమీపమేయున్నను మద్దెలవాయిద్యపు ధ్వనులు మనకు వినిపించినంతనే బయలుదేరిన నటకరుగ నగు ననియెను. మేము విశ్రాంతిగొనుచు కాలము గడుపుచుంటిమి. అట నేడి యధికముగాను దోమలు మొదలగువానిబాధ లెక్కువగను నుండెను. దారి తెన్నుగానరాని మహారణ్యమధ్యము నందు నదియందు నావలో నుంటిమి. ఆరాత్రియు పగలును నట్లో గడచెను.

పౌర్ణమినాడు సాయంత్రము గాకమునుపే వాయిద్యములధ్వని వినబడసాగెను. మానిగ్రో మార్గదర్శియు నానను నడపజెప్పి నాకడం గూర్చుని యగ్నికుమారి యనంబడు బాలికం గూర్చి తెలుపసాగెను. అట్టి మహిమాన్వితలగుట కర్హ్వా లక్షణములుగల బాలిక లప్పటప్పట తప్పక జనించుచునే యుందురనియు, ఆమె లేనిదే యిట్టి కార్యములు జరుగనేరవనియు, నాయగ్నికుమారియే యగ్నిమంటల వశపరచుకొని వేడి లేకుండజేయ నందు నడచువారు నడవగల్గుదురనియు నామె మనస్సు బిగియబట్టియుండవలెననియు నది చెడిన నంతయు నగ్నిప్రమాదముగ బరిణమించుననియు ననెను. అచిరకాలముననే రాత్రియై వెన్నెల పొడ కట్టెను. మేమొకప్రక్క నిఱుకులోనికి నావను నడపి యొకచెట్టుపైకట్టిన ఒడ్డునకుదానింగట్టి నడువ మొదలిడి త్వరితముగనే మరుగుపడియున్న నెత్తగు గూఢప్రదేశముం జేరి చూడ నారంభించితిమి. సమీపముననందే యాపవిత్రప్రదేశము నాకగు పడెను. అది యట్టి పెద్దస్థలముకాక నొకపాటిదిగా నుండెను. అడవి నడికి తిన్ననిమూలల నంచులతో బయల్పడ జేయంబడిన తావు. అందు మధ్యను వర్తులాకారముగ జేయంబడిన యగ్ని ప్రదేశ ముండెను. ఉత్తరదిశయం దొకబాల నిలుచుండెను. ఆమెయే యగ్నికొమార్తె యట. తూర్పున వాద్యము లుండెను. అవి మట్టిజాడీలకు తోలుమూసి వాయించుచుండినవి. ఆధ్వని భయంకరమై మిన్నుముట్టుచున్నట్లుండెను. దానిని వినుటతో నావేశతన్మయత గల్గునట్లుండెను. పడమట పురుషులును, దక్షిణమున స్త్రీలును నిలచి యుండిరి. ఆయగ్నికుమారి సంఘమువారిచే బరీక్షల కాగినమనిషియేయనియు, పిమ్మటనుండియు నామె నగ్నిపుత్రికయని గౌరవించుచున్నారనియు ననెను. ఆపరిసరములంగల కొన్ని మట్టిగుడిసెలం జూపి యది వారినివాసగ్రామ మనియెను. స్త్రీ జనంబులు వివశతం గాపాడుచు నాడుచుండిరి. పురుషులును తాండవ మాడుచునేయుండిరి గాని పాడుటలేదు. వారినాయకుం డొకండు ముందుగా బురుషులకడనిలచి యగ్నికుమార్తెం జూచుచుండెను.

ఆమె యెట్టకేలకు జేతులను ముందునకుం జాపెను. వారినాయకుండప్రమత్తుండై యుండెను. ఎల్లరు నాట్యములు పాటలు నాపి నిరీక్షించుచుండిరి. అగ్నికుమారి యాచేతులను మెల్లగ నాకసమునై పున కెత్తెను. వాయిద్యములధ్వనితప్ప నితరధ్వను లాగియుండెను. తాపీగా నామె యాచేతుల నాప్రక్కలకు నూపుచటుల వాల్చుచు గ్రిందికిం దింపి యుద్రేకపూరితయై తనకడనున్న యొకగంపనుండి రెండేసి గుప్పిళ్ళగుండ నాయగ్నిపై జల్ల నది గొప్పమంటగా నగుచుండెను. తొలుత నాయకుండును పిదప నొక్కొక్కరుగా బురుషులును బిదప స్త్రీలును నాయగ్నిమంటల నోలలాడజొచ్చిరి. వారి కేప్రమాదములును గలుగలేదు. ఆయగ్నికుమారి యుండియు, నుడిగియు,

నాచూర్ణము నగ్నిపైఁ జల్లుచునే యుండెను. ఇట్టియగ్నిప్రవేశమును నగ్నినాట్యమును వారికి మహదానందకరమని మావర్ణదర్శి చెప్పి నన్నింక పడవకు మరలవలయునని నిర్బంధించెను. నేను మరలువఱకు తెల్లవార నయ్యెను. పడవయు నేను కకు మరలెను. ఆచూర్ణముంగూర్చి మావర్ణ మా కేమియుం జెప్పక నది యొకజాతి చెట్టు యొక్క వేరుచూర్ణ మని మాత్రమనెను.

**అగ్ని మండుటలో కన్పడుచుండు రంగులు**—అగ్ని మండుటకుఁ గలప్రధానకారణము 'ఆక్సిజెనుగాస్' అని యిదివరకే యెఱింగియున్నారు. ఆక్సిజెను అధికమగునేని యధికతేజోవంత మగును కాని యిట్టితఱి కార్బన్ మోనాక్సైడ్ (carbon monoxide) ఏర్పడుటయుఁ గలదు. అట్టితఱి నూదారంగున నగ్ని కాలుట సంభవించెడిని. ఇంకను వేర్వేరుగాసెస్ (gases)వేర్వేరురంగులుగలవని యెఱింగియున్నదే! ఇవి వాటికాల్పునం దగుపడుచుండెడిని. రాక్షసబొగ్గునం దనేకఖనిజపదార్థము లుండును. ఇంక నిటీవల పరిశీలనలనుండి యనేకగాస్ (Gas) లు కూడఁ గలవని వినుచున్నాము. గాస నవి కాలుతరి మంటరంగును మార్చునవిగనే యుండనలయును. ఇవిగాక గాలి హెచ్చుతగ్గులనుండి యించుక రంగుమార్పు గల్గుచుండునని తెల్పుపరిశీలకులును గలరు.

**అగ్నియందువేడి (Heat of Fire)**—అగ్నియందున్నవేడి ద్వివిధముగా నున్నది. ౧ అగ్నిని రాజబెట్టునప్పు డందలివేడి చెదరి పరిసరవాయువును వేడిగ నొనర్చును. ఇదియె దరినున్నవారి శరీరచర్మములకుం దెలియనగును. రెండవది యగ్ని చక్కఁగ బ్రజ్వరిల్లి కిరణరూపమున జెసలకుఁ బైకి వ్యాపించుచు గాలినుండి జనుచు సమీపముననున్నవారికి వేడి తెలియుచుండును. దీని కాంగ్లమున Radiant heat అనిపేరు. ఇది కొంతదూరముననున్న వాతావరణముం గూడ వేడిఁగల్గింపనోపును. ఈవేడికిఁగలకారణము రాక్షసబొగ్గు కట్టెలు చమురు మొదలగు వానియందున్న కార్బను బహిర్వాతావరణమునుండి యగ్నియే కాల్చుటకు గ్రహించు నాక్సిజెనును నీవేడిఁగల్గించుటయే.

వానియం దెనర్జియును, పవరును (Energy & power) ననఁబడునవి కలవనియు, నవి నాటియందు బంధింపఁబడి యుండునవనియు, నాకార్బను ఆక్సిజెనుల కలయికతో నగ్ని ప్రజ్వరిల్లుతఱి నవి విడుదలనందుతఱి తిరుగగలసి యగ్ని వేడిమికిఁ దామునుగూడ వేడిమై heat energy యనఁబడు నదిగా నగునని చెప్పంబడినది. అత్తఱి దానిలక్షణము త్వరితగమనమని యెఱుంగ నగుచున్నది. వాఎనర్జి వాయుపరమాణువులకు వేడింగల్గించి యీతీరున నందువేడితరంగములను(hot waves) గల్గించుచుండును. దీనినే మనము రేడియంటుహీటని పిలుచుచుందుము.

**అగ్నిహోత్రము; పొగ**—యంత్ర ధూమ స్తత్ర వహ్నిః (అనగా నెచట ధూమము గల్గుచుండునో యచ్చట నగ్ని యుండునని భావము) అను తర్కన్యాయము గలదు. పొగ యగ్నియున్నచోటనే బయలువెడలునని యిందలితాత్పర్యము. దీనివలన నగ్నియుండినతావుల ధూమముండునని యర్థము చేయరాదు. అగ్ని యందుఁ బొగగల్గినఁ గలుగవచ్చుఁగాని యగ్ని లేకుండిన పొగగలుగదని మాత్రము జెప్పనగును. పొగ లేకుండ నగ్నిం జేయ వీలులేకపోలేదు. రాక్షసబొగ్గు కార్బన్ (corban) గాన దానిని సులభముగ మండింపఁజాలరు. దానింగాల్ప నెక్కుడువేడి గావలసి యుండెడిని. అట్లొనర్చుట కాక్సిజెనునిచ్చు పరి

శుభ్రవాయువు కావలసి యుండును. అక్సిజెను సంబంధమున నిది చక్కఁగఁ గాలును. ఇది యెల్ల తావులందున నెల్లపరిస్థితులందును సంభవించుచుండుటదుస్తరముగాన రాక్షసబొగ్గుకాల్చునిప్పు లధిక ధూమమును గల్గించుచుండును. ధూమము సరిగా గాలకుండినఁ గల్గుపదార్థమే కాని వేరుకాదు. బాగుగ కాలినచో ధూమ ముండనేరదు. గాన రాక్షసబొగ్గుఁ గాల్చుతావులం దీపొగ యధికమని తేలుచున్నది. భరతదేశమున కర్రలఁగాల్చుట యాదినుండియుఁ బరిపాటిగాన నీన్యాయోక్తి ధూమ మగ్నియుండినతావుననే గల్గునని యేర్పడినదిగాని యగ్నియుండినతావుల ధూమముగల్గునని చెప్పంబడలేదు. అగ్నిలేనిదే ధూమముండదని దీని నుండి గ్రహింపనగుచున్నది. గాని యగ్నిగల తావుల ధూమముండితీరునని గ్రహింప వీలు గాదు.

## అట్లాంటిక్ కోస్టుగార్డు (Atlantic Coast Guard)

—దీనినిట్లనుట యున్న యుద్యోగపదవిని యున్నట్లువాడుటకన్న వేరుకాదు. నిజమన దీని నట్లాంటిక్ ఐస్‌పెట్రోలని డెల్పుట సమంజముగ నుండెడిని. కాని దీనిని పూర్తిగ వివరించి తెల్పవలెననిన "The international service of ice observation and ice patrol in the north Atlantic Ocean by Atlanticcoast guard officers, under the control of united states of America's Government. —అనినఁ జక్కఁగ స్పష్టమయ్యెడిని. దానిని వివరింతుముగాక—నిజము జాగ్రతగఁ బరిశీలించిన నుత్తర దక్షిణ ధృవసముద్రములనుసంగతి మనస్సునందుంచుకొని ప్రస్తుతవ్యవహారమగు నుత్తరధృవసముద్రముం (Artictic Ocean)గూర్చి యోచింతముగాక. ఇట ఘనీభవించినహిమము లేక మంచు కారణాంతరములచేఁ బగిలి బీటలువారి గొప్పగొప్పముక్కలై యడుగున ఘనీభవించక నున్ననీటియందు తేలుచుండును. వాని నాంగ్లమున (Icebergs) అనియెదరు. అందుఁ గొన్ని తేలుచుఁ గదలుటయందు దక్షిణమునకు జరగునవి. సముద్రజలప్రవాహములగు గల్ఫ్‌స్ట్రీమ్ (Gulf-Stream) మొదలగువానియందుఁ దగుల్కొని కొట్టుకొనివచ్చుచు ధృవప్రదేశసరిహద్దులందాటి యించుక వెచ్చనఁగల యుదకములంజేరి కరిగి నీటఁగలసిపోవును. ఈకథన మింతవఱకెల్లరకును సుబోధక మగుచుండునదిగనే యుండును.

ఉత్తరంపు టట్లాంటిక్కుమహాసముద్రమున నెక్కుడురాకపోకలంజేయుచుండు నోడలసముదాయము గలదు. వాటికి ఐస్‌బెర్గులబాధక మధికముగాఁ గల్గుచుండును. ఇటులనే క్రీ. వె. ౧౯౧౨ సంవత్సరంపు ఏప్రిల్ నెల ౧౪ వ తేదీని టిటానిక్కను పేరుగల గొప్పయోడ యొకఐస్‌బెర్గునకుఁ దగిలి భిన్నమై దానిపైనున్న ౧౫౦౦ మంది ప్రయాణస్థులను నీటముంచి సముద్రముపాలొనర్చెను. ఈమహానౌక చాలాపెద్దదియౌట దీని నెల్లరును (Giant Liner Titanic) అని వాడుచుండిరి. ఈఘోరకార్యము గ్రీన్లాండుదేశ తీరములగు (Grand Banks) కడ జరిగెను. ఈఐస్‌బెర్గ్సు (హిమఖండములు) చాలాగొప్పవి. ఒకపాటి పర్వతములవలె నుండునవికూడ గలవు. వాటియం దధికభాగము నీటియందుండి తక్కినది పైకిఁదేలుచుఁ గన్పట్టుచుఁ బ్రవాహమార్గమునఁ దేలుచుంబోవుచు నేపాటి స్వల్పయుష్ణపరిస్థితులు గల వాతావరణము తటస్థించినను గరఁగుచు నెట్టకేలకుఁ బూర్తిగ గరగిపోవుచుండును. వీట్ని నాపుటకుఁగాని వేరుమార్గమునకు మరలించుటకుఁగాని నేరికిని శక్యముగాదని యెల్లరెఱింగినదే! ఇంక వీనియపాయమునుండి తామే తప్పించుకొనుచుం

డుట యోడలకు విధిమైయుండును. ఇవి తరుచుగ గ్రీన్లాండు, గ్లేసియరులనుండి విడిఁబడి క్రిందకుఁ దిగఁబడుచు వచ్చునవియె. మనప్రస్తుతాంశమగు నుత్తరఁపుటట్లాంటిక్కుమహాసముద్రమున నడచు నోడల కపాయకరములుగ నుండును. అందుఁ గొన్ని లేబరుడోర్ కరెంటు (Labrador current) ప్రవాహమునకుఁ జేరి యోడ లధికసంఖ్యాకములుగ రాకపోకల జరుపుచుండు నుత్తరము వైపుననున్న యట్లాంటిక్కుమహాసముద్రభాగము దెస కరుగుచు నడచుచుండెడిని. వీటిశీతల మాకాశవాతావరణమున మంచుం (Fog) గలిగించి సూర్యరశ్మినేగాక వెలుతురుంగూడ మరుగు పర్చంగాన విస్తారప్రదేశము పట్టపగటియందుఁ జీకటులచే నంధకారబంధురమై యెదుటవచ్చు నోడంగానక ఢీకొనంజేయుచుండెడిని. ఇట్టి సముద్ర జలప్రదేశమునకు ఐస్ ఏరియాయనియు, ఐస్ లిమిట్సుఅనియుఁ జేరిడియున్నారు. ఆచీకటియందు నడచుటకు (Travelling in blind) అనియు నామంచుచీకటి యధికముగాఁ గల్గియుండుకాల మేఁటట నేప్రిల్‌నుండి జూలైదనుక ననియు నీప్రదేశము న్యూఫౌండ్లాండు దేశముయొక్క Grand Bankను తత్పరిసరములనియు నిర్ణయింపంబడియున్నది. ఇంకను పరిశీలనలు గల్ఫుస్ట్రీము ప్రవాహము లెబ్రడోరుకరెంటు ప్రవాహము తో సంగమించు ప్రదేశముల నైసుబర్గులశీతలము నధికముగ నాకర్షించి ఫాగ్ (మంచు) నాకసమునం గల్గించి వాతావరణమున వ్యాపింపంజేసి యెండను వెలుతురును దిగకుండనాపి చీకటిం గల్గించునని పరిశీలకు లభిప్రాయపడియున్నారు. ఈచీకటిలో దారితెలియక నోడలు జరుదెంచుటయే Travelling in blind అనఁబడుట.

టిటేనిక్ స్టీమరు మున్గిపోవుటతో నమెరికా సంయుక్తరాష్ట్రప్రభుత్వము జాగ్రత్తంగొని యా ౧౯౧౩ వ సంవత్సరమున మిగిలినకాలమున రెండు Navy Scont cruiser (ఓడ) లను నియమించి కావలింగాయ నేర్పరచిరఁట. మరుచటి సంవత్సరమునుండియు కోస్టుగార్డుద్యోగు లోడల సంరక్షణబాధ్యతను వహించుట కుత్తరువులనంది పనికిం బ్రారంభించిరఁట. క్రీ. శ. ౧౯౧౪ జనవరి ౨౦ తేదీని లండనునగరమునఁ బదునాల్గు ప్రభుత్వముల ప్రతినిధులుఁగూడి సభంజరిపి (Inter national convention for the safety of life at sea) సంతకములుంజేసిరి. ఇదియె Inter national service of ice observation and ice Patrol ఏర్పాటులకు మూలమయ్యెను. ఈఘనకార్య నిర్వహణ మొనర్పనమెరికాసంయుక్తరాష్ట్రప్రభుత్వమువారి సమ్మతించిరి. తోడనే ప్రభుత్వాగ్రాసనాధిపతి (President) గారు కోస్టుగార్డుద్యోగుల నర్హులనెన్ని నియమించిరఁట. వీ రీయుద్యోగనిర్వహణమున నెక్కువబాధ్యతయు, పూచీయును గల్గియుండవలయునని వేరుగఁజెప్పనవసర ముండనేరదు. ఏలనన ప్రాణములును నాస్తులును వీనిక్షేమమును వీరి జాగ్రత్తపై నాధారపడియుండును. ఈసందర్భమున వీరు లోకులసలహాల నాహ్వానించిరఁట. అందుఁ గొందరిసలహాలు నవ్వువచ్చునవి కలవఁట. ఐస్ బర్గులను భగ్న మొనర్చుమని వచ్చినసలహాల కమెరికాసంయుక్తరాష్ట్రప్రభుత్వము వారదేపనిగ నటిపై సురంగులఁ బేల్చిమొదలిడి విసికి నిరర్థకమని మానిరఁట. ఐస్‌బర్గుపై దీపములనిడుమని వచ్చినసలహాల నాచరణీయములు కావని తొలుతనుండియుఁ ద్రోసివైచిరఁట. ఇక్కాలమున వాటినుండి తప్పుకొనుటయే మార్గమని స్థిరపర్పంబడియున్నది.

ఇప్పు డేటేట మార్చినెల ౧౫వ తేదీ నీపనికై నిర్మింపంబడిన రెండు Iee cutter స్టీమరు (ఓడ)

లును నొక Oceanographic Vessel ఓడయు నాప్రదేశమున కంపఁబడుచుండును. అందు రెండవయోడయందు సముద్రపుమంచుకళలందుఁ బ్రవీణులగుపండితులు యంత్రపరికరములతో నపు పంపంబడుచుందురు. వా రదేపనిగ పరిశీలించుచు నేదెసనుండి యెంతెంతపరిమాణముగల ఎన్ని యైస్ బర్గ్సు విడిఁబడి వచ్చుచున్నవియు నవి యెంతకాలములో నెచ్చటికిఁ జేరగల్గునదియు, నప్పటిప్పటి కెంతెంతతరిగి యెంతపరిమాణముల నుండునదియు, ప్రవాహజలము లత్తఱి నెంతవడిని ప్రవహించుచుండునదియుఁ బరిశీలించి యెరుంగుచు వ్రాసి యా వివరముల నేక్షణమున కాక్షణమే రేడియోమూలమున వచ్చుచుండుపోవుచుండు నోడలనడపు వారి కందించుచుందురు. ఇట్లుండుటకు వారెల్లప్పుడు నప్రమత్తులై యుండవలసియుండును. ఆప్రదేశమంతయు బలమగు రేడియోవాతావరణమయమై యుండెడిని. ఐస్కట్టరుస్టీమరులు తిరుగుచుంట నోడలకడకుంజని రక్షించుటకు గాదు. భోగట్టాలందెచ్చి యోషనోగ్రాఫిక్ వెసలులోని వారి కందిచ్చుచుంటకని ఎరుంగునది. గాన నాఓడలుద్యోగులకార్యస్థానములునై, భోగట్టాలతావులునని గ్రహింపనగుచున్నది. ఇంకను నాయోడలందలి యుద్యోగు లీఐస్బర్గ్సుల కేవేనివిధానములు గలవేమోయని సాంప్రదాయములఁ బరికించుచుండెదరు.

ఈయుద్యోగులజీతములు నోడలకగువ్యయము మొదలగునవి పదునాల్గుప్రభుత్వములు భరించునఁట. అమెరికాసంయుక్తరాష్ట్రప్రభుత్వము పెద్దతనముఁబూని నడపుచున్నది. ఈసందర్భముననే క్రొత్త విషయములఁ గన్గొని యోషనోగ్రాఫికల కెక్కువప్రాణఁ గల్గించినందున Commander Edward, H. Smith; V. S. Coast Guard గారికి హార్వర్డుయూనివర్సిటీవారు Ph. D. డిగ్రీనొసంగి గౌరవించియున్నారు. ఈయుద్యోగుల జాగ్రతనుండి ౧౯౧౩ నుండియు ఆప్రాంతముల నోడల కపాయములులేక యున్నవని తెలిసెడిని. ఇటీవల ౧౯౬౯ మే నెల ౩౧వ తేదీని లండనునగరమున నడచిన కన్వెన్షనుసభ యీయింటర్నేషనల్ సర్వీసు నిర్వహణమున కమెరికాసంయుక్తరాష్ట్రప్రభుత్వమునకుఁ గృతజ్ఞతం దెల్పుచు ముందుఁ గూడ నిట్లే జరుప నర్థించియున్నారు.

**అకాస్మాత్తుగా గొప్పధ్వనియైన చెవులు గడియలుపడుట**— చెవులు గడియలు పడుటయన నితరశబ్దము వినుపించనిరీతిని తాత్కాలికబధిరము గలుగుటయని భావము. వినిపించుట యనఁగ శ్రోత్రేంద్రియమునఁ బలుచనిపొరయగు టింపెనమ్పైఁ దాకి లోనికిఁ దెలియనగుట. ఇది సర్వసాధారణస్థితులందుఁ గర్ణశ్రవణధర్మము సౌఖ్యముగ (సాధువగుధ్వనితో) నెరవెడిని. ఇచట నకాస్మాత్తుగా శ్రీమాసౌఖ్యముఁదాటి మితిమీరుచుఁ గర్ణేంద్రియమునకు బాధకరమగునట్టుల గొప్పధ్వనియగుట. టింపెనమ్పై విపరీతమగు సంచలనము (Disturbance) కలిగించుట సంభవించుఁగాన నించుకసే పితరధ్వనుల కది సావకాశ మీయఁజాలని (అనగావినఁజాలని) మస్థితికిఁ బాల్పడియుండు నక్కాలమున నేధ్వనులును వినఁబడఁజాలవు. అట్టిస్థితిని చెవులు గడియలుపడిన (అనగా మూయంబడినవి) వని యనుచుందురు. విశేషమగు నాకలిగల్గినతఱిఁగూడ నీరసము, పైత్యాధిక్యత కల్గి ఇట్టి చెవులు గడియలుపడుటయె సంభవించెడిని. అత్తరి నీరస (అనగా బలహీనత) మధికమగుకతన శరీరేంద్రియములు చక్కగ పనులంజేయఁజాలకుండును. ఈస్థితియందుఁ గంట్లు వచ్చఁబడిన వందురు. సరిగాఁ జూడఁజాలకుండును. చెవులు గడియలు వడును. నాలిక తడి యార్చుకొనిపోవును. కాళ్లు తడఁబడును.

**అద్దములోను నీటియందును ప్రతిబింబదర్శనము**— మన మేవస్తువునైనను చూచుటయన దానియొక్క వెలుతురు ప్రతిబింబము మనకనుపాపలకడ కరుగుదెంచుటయేయని వేరుగఁ జెప్పనక్కరయుండదు. కళాయిచేయఁబడిన యద్దములోఁ జూచుట దానికి రంగులు లేనికతన దాని వెలుతురుబింబము సరిగా నుండుటకన్న స్వచ్ఛతయు నాకారహీనత యధికమై దానిబింబము కంట్లకుంజేరి తిరుగఁబడుతచే మనయాకారము యొక్క వెలుతురు బింబ మద్దమునం గన్పడెడిని. కదలని నీటియందుఁగూడ నిట్టిస్థితియేయుంట నీపని యే జరుగుచుండెడిని. అద్దమునందుపోత దట్టము పొరలు నివెన్నిన్నశదోషము మొదలగునవి యుండినతఱి దానిని బహుముఖముల యద్దమందురు. అట్టితరి సరిగా నందు నిజరూపాకారము గాన్పింపక వికారాకారములుగన్పట్టెడిని. ఇంకఁ గదలుచుండిన తఱి నీటియం దసలే రూపాకారబింబములు ప్రతిఫలించి యగుపడఁజాలకుండెడిని. ఇట్టిపరిస్థితులే నీటియడుగుననున్న వస్తువులంజూడ వీలు గాకుండుట కారణము.

**అద్దుడుకాగితపు వ్రాసిన వ్రాతలోనిసిరాను బీల్చుకొనుట**— త్రాఁగట్టిగ నుండి నున్ననిపై పొరంగల్గిన వ్రాతకాగితములు సిరాను పీల్చుకొనఁజాలకున్నను దానిపై వ్రాసిన యక్షరములదలి సిరా నించుక తనపై పొరలోనికిం బీల్చుకొనక తప్పకుండును. తక్కిన తక్కువరకముల కాగితములు పలుచని కాగితములు కొంతవఱకు సిరాను బీల్చుకొనును. అచ్చుకాగితము లంతకన్న నించుక యధికముగ సిరాను బీల్చుచుండును. అట్టిసిరా యారుటయన నాసిరాయందలినీ రావిరియై పైకెగురుటయై యున్నది. పిదప సిరాలోనిరంగుకొంతకాగితములోనను, నధికముగఁ గాగితంపుఁ బైపొరపైనను నిలచి యెండి కానవచ్చుచుండును. కాని యద్దుడుకాగిత మంతగట్టిది కాక వదులగుకూడిక (loose texture) శరీరముం గల్గి చిన్నచిన్న తెలియరాని మెరకపల్లములంగల్గి యుంట స్పంజి నీటిం బీల్చుభంగి వ్రాతయందలి సిరాను బీల్చంగల్గియుండును. కాని యిత్తఱి సిరాయందలి నీరుమాత్రమేగాక అందలిరంగు కూడ కొంచ మద్దుడుకాగితమునకుం జేరును. అద్దుడు కాగితముపై వ్రాసిన సిరా నలుదెసలకుం బ్రాకిపోవుట వ్రాయవలనుపడదు గాన ఇటీవల దానిపై ముద్రణాక్షరములను ముద్రింప నారంభించియున్నారు.

**అధిక్షేత్రపు**- -(సేహూరు చూడుడు)

**అనాధ్యాయపు దినములు**—ఇచట వేదముం జదువుకొనుచుండు విద్యార్థులు తమ గురువులనుండి యీయనాధ్యాయదినములందుఁ బాఠములం జెప్పుకొనరాదని చెప్పఁబడినది.

సంవత్సరమునందలి ప్రతి నెలయొక్క యుభయ పక్షములయందలి పాడ్యమితిథులు నష్టమితిథులు, చతుర్దశితిథులు, పౌర్ణమి, యమావాస్యతిథులు, వేదవిద్యాపఠనమునకనర్హములు.

చాతుర్మాస్య (శ్రావణ భాద్రపద ఆశ్వీయుజ కార్తీక మాసములు) ద్వితీయ (విదియ) దినములు వేదవిద్యాపఠనమున కనర్హములు.

యుగాదితిథులు— (కార్తికశుద్ధనవమి కృతయుగాది— వైశాఖశుద్ధనవమి. త్రేతాయుగాది- మాఘబహుళ అమావాస్య ద్వాపరయుగాది— భాద్రపదబహుళత్రయోదశి కలియుగాది) వేదవిద్యాపఠనమున కనర్హములు.

మన్వాదితిథులు— ౧౪ — (౧ కార్తిక. శుద్ధ ఏకాదశి— స్వాయం —౨ స్వారో. (తెలియదు)— 3 చైత్రశుద్ధతృతీయ-ఉత్తమ —౪ భాద్ర శుద్ధ తృతీయ- తామస - ౫ పుష్యశుద్ధ ఏకాదశి-

రైవత —౬ ఆషాఢశుద్ధ దశమి— చాక్షు ౭ మాఘశుద్ధ సప్తమి వైవస్వతమన్వాది— ౮ భాద్రపద బహుళసప్తమి— సూర్యసా— ౯ కార్తీకశుద్ధపౌర్ణమి— దక్షసా- ౧౦ ఫాల్గుణ శుద్ధ పౌర్ణమి— బ్రహ్మసా—౧౧ ఆషాఢబహుళ అష్టమి-ధర్మసా— ౧౨ శ్రావణబహుళఅష్టమి- రుద్రసా— ౧౩ చైత్రశుద్ధపాడ్యమి- దేవసా— ౧౪ జ్యేష్ఠశుద్ధ పౌర్ణమి- ఇంద్రసావర్ణికమనాఁ ఈపదునాల్గుతిథులు వేదవిద్యాపఠనమున కనర్హము లని చెప్పంబడినవి.

అన్వష్టకతిథులు—(మార్గశిర- పుష్య- మాఘ మాసములందలి బహుళపక్షముల సప్తములు- అష్టములు- నవములు- తొమ్మిదితిథులు) వేద విద్యాపఠనమున కనర్హములని చెప్పంబడినవి.

సూర్య చంద్ర గ్రహణములు పట్టినతిథులు వేదవిద్యాపఠనమున కనర్హములని చెప్పఁబడినవి.

అయనములు మారినతిథులు వేదవిద్యాపఠన మున కనర్హములని చెప్పం బడినవి.

విషువత్పుణ్యకాలతిథులు (మేష తుల సూర్య సంక్రమణతిథులు) వేదవిద్యాపఠనమున కనర్హము లని చెప్పంబడినవి.

శ్రావణద్వితీయ- గ్రామంకాలిపోయిన దినము, పిడుగుపడినదినము, ఉల్కాపాతము కల్గినతిథి యివి వేదవిద్యాపఠనమున కనర్హములని చెప్పఁబడినవి. ఇవి యనాధ్యాయములు.

**అనూరాధ పురము**—ఇది సింహళద్వీప మునఁ బాడుపడిన నగరఁపుతావు-బౌద్ధులయాత్రా స్థలము. కొలంబోనగరమునుండి ౧౨౮ మైళ్లను కేండినుండి- దంబుల్లా- మిర్నిగోనీ ఓయాలమీఁ దుగా ౮౬ మైళ్లను త్రింకోమలినుండి ౬౯ మైళ్లను దూరము. ఇచట నొకతామరకొలను సుప్రసిద్ధము. అందు వేర్వేరుజాతుల తామరలు కలవు. రైల్వేస్టేషను సమీపముననే నువారా మేపయాజలనిలయము (Reservoir) కల దది యీనగరమున కాదినిదాహోదకజలనిలయమఁట. దీని జలస్తంభనస్థానఁపుఁగట్టడము (dam) పై మోటారుబండ్లు నిర్భయముగఁ బోతగిన వెడ ల్పుఁ గల్గినది.

దానికవ్వల మహంతాల్‌కొండ యగుపడు చుండును. క్రీ॥ ము॥ ౨౪౭ నుండి ౨౦౭ వఱకు రాజ్య మేలిన దేవనంపియాతిస్సా ఇటనే బౌద్ధుం డాయెను. ఆజలనిలయముకడనే గడ్డిఁబట్టిన ఒక దిబ్బను ఆర్కియాలోజికల్ ఉద్యోగులు జేతవన విహారమనియు, పెక్కండ్రు బౌద్ధులు అభయ గిరియ యనియుఁ బోల్చుచున్నా రిది ధర్మరుచి సంఘబౌద్ధుల ప్రధానస్థానమఁట. ఆచోటయందే పెద్దయావరణప్రదేశమునం దనేకబోధివృక్షసము దాయము న్నదానిమధ్య నొకచిన్నయావరణమున గయనుండి అశోకచక్రవర్తిసుత యోగిసంఘమిత్త తెచ్చిన సుప్రసిద్ధబోధివృక్షమును కలవు. దీని కొమ్మలనే భక్తులు ఆవనమం దచ్చటచ్చట నాటి పెంచినవఁట. ఇది క్రీ॥ ము॥ ఆఱనూఱాబ్దమునాటి కథ. మహావంశమను బౌద్ధగ్రంథమున సీబోధి వృక్షచరిత్ర కలదు. తొల్లి యిది మహామేఘుం డను సింహళభూపతిచే వినోదవనముగ నేర్పరుపం బడి బౌద్ధభిక్షువులకు దాన మీయంబడియున్న దందురు.

దాని కెదురుగ బాట కవ్వలిభాగమున దుతు- జనుఁడుకట్టించిన లోహమహాపయా విహారఁపుఁ బాడు రాతిస్తంభములయడవింబోలి గన్పట్టుచుం డును. ఆయన అఱువదమ్మిళ్ళుల నోడించిన యాస వాలుగఁ గట్టంబడిన దందురు. దానిపై పెంకులు ఇత్తడివగుట నాపేరం దెనఁట. దానిప్రక్కనే యా భూపతి నిర్మించిన తదనుబంధమగు “ రువన్వె లిశేయ ” మహాస్థూపము కల దద్దాని కాసర

పాలునికి ౧౦౦౦౬.౦౦౦౦౦ కహాతపనము(సింహాలనా ణ్యము) లు శెలవాయెనఁట. అం దనేకపవిత్ర పదార్థములు కలవనియు నందొకటి నవరత్నస్థకిత స్వర్ణబోధివృక్షము కలదని చెప్పుదురు. మరియు నీస్థూపముంగూర్చిన కథన మొకటి వాడుకయం దున్నది. అది పూర్తి కాకమునుపే జముమన్నృపతి కిఁ గాల మాసన్నమగుకతన నాతనితమ్ముఁడు సదాతిస్సారాకొమరుఁడు స్థూపము పూర్తి యగుచో నెటులఁ గానంబడునో యట్లగుపడు నటుల వెదురుతోఁ గట్టించి యథాన్న ప్పుఁ బట్ట లచేఁ గప్పించి చనిపోవనున్నభూపతికిం జూపి యుర శ్శాంతిఁ గల్గించి పిదపఁ దాను భూపతి యైన తోడనే దానిం బరిపూర్తిం గావించెనఁట.

యాత్రిస్థు లీస్థూపమునకుఁ దెల్లజండాలతో 'సాధుసాధు'అను కేకలతో మంగళవాద్యములతోఁ బ్రదక్షిణము లొనర్తురు. జూను జూలై నెలలపౌర్ణ ములం దీయాత్ర యధికముగా నడచును. దీనికిం బశ్చిమమున నభయవాపిక కల దది యిక్కాల మున బసవక్కులమనంబడుచు స్నానతీర్థముగ నున్నది ... సూర్చునకు కడువిన్నాణ వంతములగు పనితనముఁగల చిత్రములు పెక్కు కలవు. స్థంభచిత్రాదులేగాక ఒకతావున నొకకోతి తన్నుం బట్టుకొనిన తనపిల్లతోసహా చెట్టుకొమ్మ నుండి తలక్రిందుగ వ్రేలాడుచున్నటుల నున్నశిలా చిత్రము వాటియం దగ్రగణ్యముగ నెంచఁబడు చున్నది. వేరొకతావున నొకముంగియు పామును కలహించుచున్నటులఁ జిత్రింపంబడిన శిలాచిత్రము చక్కనిది కలదు.

ఇత్తావున కుత్తరమున నూరుగజములదూర మున తూపారామము దేవనంపియాతిస్సా నిర్మింపఁ జేసినది కలదు. ఇదియె సింహాలద్వీపమున మొదటి నిర్మాణ మందురు. పరిసరములనే సంఘమిత్తస్మశా నఁపుఁబూడిదనుంచినస్థూపము-మహింద్రొస్మశానఁ పుఁబూడిద స్థూపము - ఆప్రక్కనే బుద్ధదంత మీాయూరనుండినినాటి గృహపు బునాదియాన వాళ్ళు-రాణులు వసించిన ప్రాసాదఁపు బాట యానవాళ్ళు-దానిసోపానముల కంటెంపఁబడి నేటికి నట్లేయున్న అర్ధచంద్రాకారఁపుఁ జంద్రకాంతశిలా ఫలకము చక్కనిపనితనముంగల్గి చూడందగినవిగ నున్నవి. ఈప్రక్కనుండియున్న బాటకు Outer circular roadఅనిపేరు. అనూరాధపురము పదు న్నాల్గుమైళ్ళుచొక ముండెడిదఁట. ఇది మహోన్నత దశయందుండుతఱి రోమకపురి నిర్మింపఁబడెనని లెక్కించియున్నారు. ఇట స్నానముల తావునకు పోకునా యనియు పేరు. ఎండిపోయి రాలిపోయిన బోధిపత్రములను యాత్రిస్థు లింగ్లకుంగొంపోయి పవిత్రపదార్థములుగ బౌద్ధులు దాచికొందురఁట. (సింహాలము చూడుడు.)

**అపోతెరీస్ వెయిట్** (Apothecaries' weight) — ఇది ఆంగ్లవైద్యమున (అలోపతీ) ఘనపదార్థములగు మందులు తూచుకొనుట కుప యోగించుచున్నారు.

౨౦ గ్రెయినులు (grains) — ఒకస్క్రూపుల్ (scruple)

3 స్క్రూపుల్సు—ఒకడ్రాము (drachm or dram)

౮ డ్రాములు—ఒకఔన్సు (ounce దీనికిం గురుతు O. Z.)

౧౨ ఔన్సులు— ఒకపౌండు (Pound-దీనికిం గురుతు lb.)

ఇందు ఔన్సు - పౌండు - ట్రోయివెయిటు తూనికలు—

(ద్రవపదార్థములగు మందులు తూచుకొను లెక్క—)

౬౦ చుక్కలు (minims)—ఒకడ్రాము (drachm or dram)

౪ డ్రాములు—ఒక టేబిల్ స్పూన్ (Table spoon full)
౮ డ్రాములు—ఒక ఔన్సు (ounce దీనికిం గురుతు O.Z.)
౨ ఔన్సులు—ఒక వైన్గ్లాస్ (wine glass full)
3 ఔన్సులు—ఒక టీస్పూన్ (Tea spoon full
౪3౭న్నర (437½) గ్రెయినులు ఒక ఔన్సు
౨౦ ఔన్సులు—ఒకపింటు (Pint)
౮ పింట్సు—ఒక గాలను (gallon)

**అబ్సల్యూట్ జీరో**(Obsolute Zero)- ఇది సెంటిగ్రేడు తెర్మోమీటరునందు మంచుకరగు Melting Point నకు౦ దిగువను ౨౭3 డిగ్రీల కడ నుండునటుల కెల్విన్ ప్రభువు Lord Kelvin ఏర్పర్చియున్నాడు. ఈమహనీయునియాదినామము William Thomson గారై యుండెను. ఈయన క్రీ. శ. పందొమ్మిదవ శతాబ్దము నాటివాడు. ఆకాలమున Deepest thinker అనియు Greatest in ventor అనియు పేరందియుండెను. అబ్సల్యూట్ జీరో ఫ్రాన్హైటతెర్మోమీటరునందు Freezing point నకు౦ దిగువను ౪౯౨ డిగ్రీల కడనుండెడిని. దీనిని గ్రొత్తపెంపరేచరని కెల్విను ప్రభువు వాడియున్నాడు. ఇట "Every known form of matter liquid or gas would freeZe solid" అని యీమహాత్ముడే కన్గొనినను ఆయబ్సల్యూటుజీరోప్రదేశమును Coldest Cold that could be reachedఅని యీయన వచించెను.

ఈయబ్సల్యూట్ జీరోకడకు౦ బరిశీలించం గలశాస్త్రమునకు తెర్మో డైనామిక్సని (Thermo Dynamics) పేరయ్యెను— ఈశాస్త్రమును నిర్వచించుచు- "That investigates the links between Heat & Force- and therefore between heat and matter in the end" అని వివరించియున్నారు.

కెల్విన్-ప్రభునికిం బిదప చాలకాలము గడచిన తరి. Sir James Dewar- పండితునిపరిశీలన లందు - హైడ్రోజనుగాస్ను ఘనీభవింపజేయుటకు—అబ్సల్యూట్ జీరోకు నాల్గుడిగ్రీలతక్కువ. అనగా—సెంటిగ్రేడు తెర్మోమీటరునందు మంచు కరగు Melting Point నకు౦ దిగువను ౨౬౯ డిగ్రీలకడనుండు శీతలము గావలసియుండునని బయల్పడియెను. అట్లే పిమ్మట—Leyden పురవాసియగు Dr. Kamerlingh Onnes పండితుని పరిశీలనలందు— హీలియమ్ గాస్ను ఘనీభవింపంజేయుటకు ఇంకనూ రెండుడిగ్రీలుకూడ క్రిందికిం బోవలసియుండునని బయల్పడెను. కెల్వినుప్రభువు గణితశాస్త్రము నెరింగినవాడని యందురు. మొట్టమొదట అట్లాంటిక్కు కేబిల్ లైనును నిర్మింపంజేయంగల్గిన దీమహాత్ముడే.

**అమరపుర**— ఇది బర్మాదేశమునం దొక పట్టణము. ఒకప్పుడు రాజధానిగ నుండెడిది. మాండలే కైదున్నరమైళ్ళదూరమున నైరావతీ నదీ తూర్పుతీరమునున్న చిన్నపట్టణము. జనాభా ౮౨౫౪. తౌంగూతా మనుసరస్సునకు నదికి మధ్యనున్నకతమున చల్లగాలులు వీచుచుండును. ఇది క్రీ.శ.౧౭౮౩లో బోడావపాయన్నృపాలునిచే నిర్మింపంబడినది. తొలుత తనరాజధానింజేసి యాతండే ౧౮౨౨లో వదలివైచి, యీవాకు మార్చెను. పిమ్మట ౧౮3౭ లో తిరుగ రాజధానిగం జేయంబడి మిండన్నృపతిచే మాండలేపురము నిర్మింపంబడిన కతన౧౮౫౭లో నటకు మార్పంబడుట చిన్నగ్రామమాయెను. ఆనాటికోటగోడల యీనవాళ్ళు (కందకము) గాననగుచున్నవి. దేవస్థానములు చూడం

దగినవి పెక్కులున్నవి. కొన్ని పాడగుచున్నవి. ఇక్కాలమున దీనిప్రసిద్ధి పట్టునేతనుండి ఏర్పడినది. అన్నియిండ్లను మగ్గములు గలవు. అందరును నేత గాండ్రే. ఇట సౌందర్సు నేతపాఠశాల గలదు. అందుఁ బట్టుబట్టలనేత నేర్పుచున్నారు. ఆయన మాండలేకమీాషనరుగ నుండినవాఁడు. పరిసర గ్రామములగు కతియందు అభేయిల్ అనంబడు విలువగల బట్టను నేయుచున్నారు. తమెయిష్ బట్టలుకూడ నిట నేయంబడునఁట. అవి చాలా విలువగలబట్టలు.

## అయస్కాంతశక్తి గల్గింపంబడినను ఇనుము బరువధికము గాకుండుట-

ఒకయినుపగజముందూచిన నెంతబరువుండునో దాని కయస్కాంత సంబంధముం గల్గించి శక్తింగూర్చిన నంతేబరువుండును. దాని కన్యపదార్థముల నాకర్షించుశక్తిమాత్ర మధికమగుననిమెఱుంగునది. దానిచే వేరొకవస్తువుం బట్టుకొనంజేసి తూచితిమేని యా పట్టుకొనంబడిన వస్తువుభారము దాని స్వంతభారమునకుం గలసి యధిక మయ్యెడిని.

తూచుతరి భారము భూమియందలిగ్రావిటేషనను నాకర్షణశక్తినుండి తెలియనయ్యెడిని. అట్టి గ్రావిటేషనుశక్తి కయస్కాంతశక్తితో నేసంబంధమును గలుగనేరదు. తూచంబడువస్తుశరీరము-దానియందలి పదార్థము- దానిగట్టితోనే సంబంధముండెడిని.

## అరచేతులు-అరికాళ్లు లందలి రేఖలు

**రేఖలు**—అరచేయికిం బైగా వేళ్లుండును. ఈరెంటితోను దేనినైనను పట్టుకొనుచుండుట, పనులుచేయుటయం దత్యంతావసరముగాన వేళ్లరచేతులు వలయునంతవరకు ముందునకు వంగుచుండుట తప్పనిది. అట్లు వంగుతరి నేర్పడునాన వాళ్లు రేఖలనంబడుచున్నవి. కొంతవర కిట్టిరేఖ లరకాళ్లలందుఁగూడ నేర్పడుచుండునుగాని వాటి యం దంతప్రాముఖ్యత గానరాదు.

హస్తరేఖ లరచేతియందలి చైతన్య శక్తి నధికపర్చును. శరీరమునందలి మృదుతరావయవములలో నరచేతులు చెప్పందగినవిగాన రేఖలు చర్మముదరినే నడచు చైతన్యనాళములుగ నుండును. (నొప్పిచూడుడు). అరచేతిమృదుత్వము (మెత్తఁదనము) దేనినైనం బట్టుకొను వీలును బలపర్చును. ఈరేఖలనుండి ఫలముల నెరింగించు భరతదేశఁపుశాస్త్రమునకు సాముద్రికమని పేరు. భరతదేశస్థులనేగాక వారిశాస్త్రములంగూడ నిరసించుటయందు వినోదచేతస్కులగు కొందరు పాశ్చాత్యు లేవంచనమాటలన్నను పాటింపక వారిని వంచనామతులుగ నెంచు భారతీయులు సాముద్రికశాస్త్రముంగూర్చి యింకను జక్కని పరిశీలన సల్పుచుంటయె సమంజసమని తోఁచెడిని.

పాశ్చాత్యదేశములయందు Palm History అనుపేర నీశాస్త్రము కొంతవృద్ధినంది యున్నది. ఈశాస్త్రమును భరతదేశఁపు బ్రాహ్మణపండితుల నుండి నేర్చికొనినవిద్యగ Ben మొదలగు పామిస్టులు తమ సుప్రసిద్ధగ్రంథములందు వ్రాసుకొని యున్నారు. బహుస్వల్పకాలము నుండియు పాశ్చాత్యులీభారతీయకళయందు నూతన పరిశీలనలఁ జేయుచున్నారు. భరతదేశమున సముద్రుఁడను నాయన యీకళ నభివృద్ధిచేసినందున సాముద్రిక మనఁబడుచున్నది.

## అరబిక్ ఫిగర్సు (Arabic figures.)

భరతదేశమునందు సంస్కృత (దేవనాగరి) భాషకక్షరము (లిపి) లున్నట్లే యంకెలును గలవు. అట్లే యాంధ్రము, హిందీ, మహారాష్ట్రము, బంగాళీ మొదలగు వేర్వేరుభాషలకు వేర్వేరక్షరములున్నట్లే యంకెలుగూడ కలవు. కాని ఫొనీషియనులు, గ్రీకులు,

హిబ్రూజాతివారల కంకెలు నేడుగలేవు. అంకెల నక్షరములతోనే వారు వ్రాయుచుండిరి. పిదప రోమనులప్రాబల్యకాలమున సంఖ్యలంగూడ నక్షరములతో వ్రాయుట [illegible] వారిలిపి యక్షరములలో M. D. C. L. X. అను నేడక్షరముల నంకెలఁ దెల్పుటకేర్పఱచి వాడుచుండిరి. పిదప V యను నక్షరముఁగూడ చేర్చిరి. ఇట్లు I, II, III, IV, V, VI, VII, VIII, IX, X పదియంకె లేర్పడియుండెను. పిదప శత, సహస్రాదిస్థానములకు పై యేడక్షరముల గురుతులుగాఁ జేర్చుకొనుచు వాడుచుండిరి. పిదప L. కూడఁజేర్చిరి. పిదపఁ గొంతకాలమున కొకటొకటిగ నైరోపాజాతులవారు తమతమ భాషలలోని కరబ్బులువాడుచుండు నంకెలను 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, యనఁబరగు నంకెలంగైకొని చేర్చుకొనిరి. అవియరబ్బులు భరతదేశస్థులనుండి గైకొనినవని చెప్పఁబడినవి. వాటియం దరబ్బులు వారి స్వదేశమునం దాదినెరుంగని సున్న కూడనుండునది. అరబ్బులు కొంచెము జాగా ఖాళీగావదలి యందొకచుక్కం బెట్టుచుండెడివారఁట. భరతదేశపు భాషలకు సంస్కృతము (దేవనాగరి) మాతృకయని వేరుగఁ జెప్పనక్కరయుండదు.

**అర్ధనిమీలిత నేత్రములు**—(Blinking eyes) ఇవి యోచనకాలములందును (తరుచుగ) విశ్రాంతియందుండు గనుల స్థితిగాఁ పోల్పఁబడుచున్నవి. విశ్రాంతియనిన యన్యపదార్థదర్శనము తన మదినాకర్షింపకుండ నొకేధ్యానయోచనమున మనస్సునిలచుటయని భావము. ఇది కనురెప్పలకండరములు (మసిల్సు Museles of the eyelids) చేయుపని. హృదయమున వ్యాపించిన లేక మేధస్సునగుదిరిన యోచనయందు గాఢమైన యాసక్తిచే సంభవించుచుండు స్థితి. అట్టి కనురెప్పలనుండి బాష్పములు గర్గి యించుకకన్నులఁ జెమ్మఁజేయుట సంభవించుచుండెడిని. పాములొనలగు కొన్ని కనురెప్పలులేని జంతువుల కియర్థనిమీలితదృష్టికి వీలుండదు. వానికండ్లఁ బైపొరయె బలముగనుండి నీటిచేఁ దడపుచుండ బనియుండదు. దానియం దావహించి బుగ్గియందలి త్రసరేణువులు దానికదలికవలననే పడిపోయెడిని.

**అలసట** (Fatigue)— అలసటయనునది జీవజంతువులకుమాత్రమే యుండుననుకొనుచు నిర్జీవములగు లోహముల కుండదని పెక్కండ్రు పొరఁబడి తలంచుచుందురు. నిజమారసిన కలములపాళీలును, పొగమోడల యందుండి వానిని నడుపు యంత్రములును నినుపబాటపై బండ్లనులాగు యంత్రపుబండ్లును గర్మాగారములందలి యంత్రములును పంటలఁబండు పొలములును నలసినవనియు, విశ్రాంతి నీయవలయుననియు, వానినివాడుచుండువా రనుట వినుచునే యున్నాము. క్షౌరముఁజేయు మంగలికత్తి యెంత పదునుగ వాడిఁగల్గియున్నను నెక్కువపనిఁజేసినపిదప నలసినదని విశ్రాంతినీయవలయునని మంగలివాండ్రనుట కలదు. అదేపనిగ వ్రాయుచుండువారు కలములందలిపాళి యలసినదని వేరొకకలముతో వ్రాయుట క్రొత్తసంగతి కాదు. ఆపాళీకలమే కొంతవిశ్రాంతికింబిదపఁ జక్కగ వ్రాయును. పెక్కండ్రు పాశ్చాత్యపరిశీలకు లీయలసటఁగూర్చి పరిశీలించి "Fatigue of metals" అని పేరిడి వాడుచున్నారు. వారి పరిశీలనలందు గొప్పగొప్పభూతద్దముల నుపయోగించి చూచిరఁట. అవి యొత్తిడిక్రిందఁ గడకుఁ బగిలిపోవుట పరిణామముగఁ జెప్పుచున్నారు. కొన్ని సంకోచావస్థంజెంది ముడుచుకొనునఁట. కొన్ని చుట్టుకొనునఁట. అలసినతరి దానియందలి Erystalline grains వాటియాకారములు మారి యొత్తిడి లేక నలసటతగిలినతావునై పరుగు.

నఁట. మానవు లలసినతరి యోగాభ్యాసపరులు వెల్లకిలఁబరుండు నర్థశవాసన మతిత్వరితముగ నలసటఁ బాపునందురు.

శ్రమకోర్చుచుఁ గొంతపనిఁజేసిన నలసటఁగల్గుట యెల్ల రెఱుంగునదియె. ఎండవేడియందైన నలసట కొంతవేగముగనె గల్గుచుండుననియు, నాపని నపాయకరస్థితులనుండి తప్పించుకొనుచు నధిక జాగ్రతతోఁ జేయుచుండవలసిన యంత్రాగారాదులందుఁ జేయుపనుల కెక్కువగఁ గల్గుచుండుననియు ననుభవములనుండి తేలుచున్నది. అలసట శరీరభాగములం దాయాపనులకుఁ దగినటుల విషపదార్థము నించుకఁగల్గించుననియు, దానిని నిద్రించుటయందు రాత్రులలోఁ బోఁజేయుచుందురనియు గాననే యుదయములందు లేచుతఱిఁ దిరుగబలముఁ గూర్చుఁగొననగుచుండుననియుఁ బరిశీలకు లనుచున్నారు. అలసట యెక్కువకాకుండినతఱి నేర్పడెడి ఫలితవిషపదార్థము రాత్రులందుఁ జక్కని నిద్రఁ గల్గింపనగుచుండునఁట. ఈపరిశీలనలం దెక్కునపర్విడి యలసిన నొకకుక్కరక్తము నించుక తీసి యలసటఁజెందని వేరొకకుక్కశరీరములోనికిఁ జొప్పించిన నాయలసటఁజెందనికుక్కయు నలసిన లక్షణములఁగల్గి యలసినదానివలెనె యగునని తేలినది. ఇంకను నాహారబలముచే శరీరమున నిల్వయైన బల మలసటఁ జెందకపూర్వమే వ్యయపరుపఁబడి పిదపనె యలసట ప్రారంభమగుననికూడ కనిపెట్టంబడి యున్నది. ఇంక నలసట యధికముగ నుండు తఱి బలవత్పదార్థము లధికముగఁ దినువారి కరుగవని తేలినవిషయమే. అలసటకు నిద్రయే తగిన పరిహారము. ఉదకము ఫలరసములు, నలసటను వాపునందురు.

**అల్లకల్లోలముగనుండు సముద్రపునీటిని నూనెపోసి శాంతపరుచుట –** సముద్ర మల్లకల్లోలముగనుండి నడచు పోగ యోడల కపాయము గల్గునట్లుండుతఱి నీటితరుణములకై వానియందుఁ గొంపోవంబడు నూనెపీపాలను విడఁగొట్టి యోడకు నాల్గుదెసలను సముద్రమునఁజల్లి జలములను శాంతపరిచి యోడల నాపద్యమునఁ గొంతకాల మాపుటయుఁ గలదు. నీటియందలి పరమాణువులకన్న నూనెలందు జిడ్డుపదార్థములందుఁగలపరమాణువులు(molecules) చిన్నవిగ నుండుటయేగాక జిడ్డుగల నూనెలుమొదలగువాని పరమాణువు లెక్కువబలమున నొకటి నొకటి కలసికొనుశక్తిఁ గల్గియుంటయు, నీటింద్రుళ్లనీయక బరువైనపొరగఁ బైనుండి యాపుటకుఁ గారణమగును. ఇంక నాముదము మొదలగువాని పరమాణువులు చాలపెద్దవగుటకుఁదోడుగ నధిక బలముఁ గల్గినవి.

రెండు సీసాలయందు నొకదానినిండ నీటిని, రెండవదానినిండ యాముదమును నింపి రెంటినిఁ గదిపి చూచితిమేని యాముదము శాంతముగను, నెగురుపాటు లేకుండను గదలుటయు నీరటులఁగాక తొందరపాటుతో నదరిపడుచుంటయు గానవయ్యెడిని.

**అల్ట్రావయొలెట్ రేస్**-(Ultra Violet Rays) ఇవికూడ ఇన్ఫ్రారెడ్ రేస్ వలెనే నేత్రముల కగోచరములుగాన Invisible ultra violet rays అని రసాయనశాస్త్రవిదులచే సాంకేతికనామ మిడంబడి వాడంబడుచున్నవి. (సప్లిమెంటల్ వాల్యూములోని ఇన్ఫ్రారెడ్- రేస్- చూడుడు)-అల్ట్రావయొలెట్ అనిన beyond violet అనియర్థము. ఇవి సూర్యునుండి వచ్చుచున్నవనియు, శరీరారోగ్యమున కత్యావశ్యకములనియు పరిశీలనలు బయల్పరచియున్నవి. ఎండం

తిరుగుచుండువారి శరీరములలోనికివి పీల్చంబడుచుండునఁట. Sunbath సూర్య (కిరణ) రశ్మి స్నానమునందు వీటివలనఁ గల్గు ఫలము శరీరావయవముల కన్నిటికిం గల్గునని తలంపంబడుచున్నది. ఇటీవల నిట్టి వెలుఁగుఁ కిరణములు ఆర్టిఫిషల్ లైట్ (artificial light) వెలుతురునుండి కూడఁ బొందనగునని చున్నారు. గాన నివి అగ్ని నుండికూడ వెలుతురుగుండా కలుచున్నటులం దెలియనగుచున్నవి. ఈకిరణములను శరీరముతో గ్రహించుట భోజనముగుండా డి (D) విటమినులం గ్రహించుటంబోలినదని ఆలోపతీవైద్యులనుచున్నారు. డి విటమిన్ ఎముకలకు బలమొసంగి నోటిపండ్లను భద్రపర్చుటయేగాక బిడ్డలకువచ్చు బాలపాపచిహ్నరోగమును రాకుండ నాపునని పరిశీలకులు తెల్పుచున్నారు. భోజన పదార్థములను అల్ట్రావయోలెట్ రేస్ నందుఁ గొంతకాలముంచిన నీవిటమినులందుఁగూడ నేర్పడి కల్గునని ఇటీవల కనిపెట్టంబడినది.

**అసురసంధ్యావేళ**—దీనిని అజ్ఞులు "అసర సంధ్యావేళ" యనుటయుం గలదు. సాయంసంధ్యా కాలమున రాక్షసులకు బలమధికమని చెప్పంబడినది. వారత్తఱి విజృంభించుచుండిరఁట. అది తామసమునకుం గాలమని పోల్పంబడియున్నది.

**అహింసాధర్మము**—(హింస, అహింస, ధర్మములు చూడుఁడు.)

**ఆంగ్లవైద్య(ఆలోపతీవైద్య)పరిభాషా పదములు**—ఈపరిభాషాపదము (లేక సాంకేతిక పదము) లాంగ్లభాషయందే గాననగుచున్నవిగాని యైరోపాఖండఁపు టన్యభాషలయందుఁ గానరామి నివి యాంగ్లవైద్య లేర్పర్చుకొని యుండురని తోఁచెడిని. కాని వ్యాపకమున నంద రాంగ్ల ఆలోపతీవైద్యులును వాడఁచునేయున్నారు.

Aberration—Rubbing off; of the Skin—శరీరమును తాకి రాచుట లేక మర్దన చేయుట.

Abnormal—మామూలుస్థితి నతిక్రమించి యుండుట. (సరిలేకపోవుట)

Abrasion—శరీరమున మర్దనఁజేయుట (Rubbing off)

Abscess—వాపు-చీమున్నను వాచియుండు స్థితి.

Acerbity—Acid tasting—పులుపుఁ గల్గి యుండుస్థితి (రుచికాదు)

Acetate—A salt of acetic acid Lead acetate మొదలగు నుప్పులలో నొకటి.

Acne—అజీర్తి మొదలగు కారణములవలనఁ జర్మము రేగి చిన్నపొక్కులు లేచినస్థితి.

Aconite—నాడివ్యాధులు, నొప్పులు మొదలగురోగములందు వాడఁబడు నొకవిషము. ఇది తోఁడేలు సంబంధ మందురు. ఇది యింకను Vegetables నుండికూడఁ జేయుచున్నారఁట.

Adenoid—ముక్కు వెనకనుండు గ్లాండ్సు అభివృద్ధియగుట (పెరుగుట).

Adepose:—క్రొవ్వధికమై పెరుగుట. దీనిని obsrety అనియు నందురు.

Ague:— a type of intermittent fever with cold shivering etc.

Albinism:—పాండురోగము, శరీరము తెల్లబారుట, కండ్లుపచ్చఁబడుట, వెంట్రుకలు నెరయుట మొదలగు లక్షణములు గలది.

Alkali:— ante thesis of acid— these can turn red Vegetable colours blue.

Anodyne;—relieving pain.

Antacid:—alkalis used for counter acting acidity in stomach.

Antidote;—That which counter acts the poision—విషమునకు విరుగుడు.

Anus:—The lower orefice of the intestines.

Aorta:—The main artery of the body, leading from the left-Ventricle of the heart.

Aphasia:—నోటిమాటరాకుండ పడిపోవుట. (ఇది brain trouble వల్ల గల్గుచుండెడిది.)

Artery:—Principal vessels conveying blood from the heart to the various parts of the body.

Arthritis:—మోకాళ్లవాతములలో నొకజాతి రోగము (Gout)

Ashpyxia:—ఊపిరాడక ఆటంకముగల్గుట.

Atrophy wasting away:—వృద్ధిక్షయము మగుచుండు వ్యాధి.

Auricle:— External ear of animals. ఇంకను upper cavities of the heart నకుc గూడ నీపేరు వర్తించును.

Axis:—The second vertabra of the neck on which atlas turns.

Bacillus:—Organisms which propogate disease, and multiply themselves.

Bedsores:—ఎక్కువకాల మొకేరీతి పరుంట వలనcగల్గిన irritation (చర్మము రేగుట).

Biceps:— Principal muscles of the Thigh and arm with heads (seperate).

Bile:—Thick yellow fluid secreted in the liver for assimilating of fat in the body.

Bladder:— A thin membranous bag which secretes the fluids of the body is human and other animal bodies (esply-Gall and minasey)

Botulism:—a form of food-poisoning, caused by micro-organism called bacillus botulinus.

Brights disease:—an inflammatary affection (వాపు) in kidneys.

Bronchi:—a branch of pipe of wind-pipe to carry air into lungs.

Bubo:- swelling in grain (armpit) tending to suppurate (a tumour)

Bunion:— inflammation in toe joints (నొప్పిగలవాపు)

Calculus:—a stone in the bladder or kidneys.

Caligo:—ఒకజాతి నేత్రవ్యాధి (ఇందిట్టి వనేక జాతులు గలవని చెప్పcబడినది.)

Calomel:—sub chloride of mercury.

Caloric:—pertaining to natural heart.

Capellaries:—tiny blood vessels connecting arteries and Veins.

Carbuncle:— బహుమూత్రరోగముతో సంబంధముగల రాచపుండు.

Cardiac:—pertain to the heart.

Caries:—ulceration of a bone or tooth. పల్లుకురుపు, పుప్పిపన్ను ఈజాతిలోనివి.

Carminative:— releaving flatulence or pain in the bowels.

Cartilage:—gristly cushions of the joints of bones.

Catalepsy:— suspension of consciousness.

Catarrh:— secretion from mucous membranes.

Cautery:—burning of a morbid part with either, canstic or hot iron etc (చురకవేయుట.)

Cellular:—consisting of cells.

Cerebellum:— lower portion of the brain.

Cerebrum:—upper portion of the brain.

**ఉదకము - పేరాఫిన్:—** ఉదకము నాంగ్లరసాయనశాస్త్రవిదులు Oxidised (or burned) hydrozen అనియెదరు. అం దాక్సిజెనుభాగము చాలతక్కువగా నుండును. అది చేపలు వసించుచు నించుకకాలము పీల్చుటకుం దగినదిమాత్రముగనే యుండుంగాని యగ్నిపుల్ల మొదలగువాటిలోని యగ్నిం గాల్పఁజాలదు. అం దట్టివాటిని ముంచిన నది కాల్చుచున్న నాక్సిజెను నుండి యాయగ్నిని దూరముం జేసినయట్లగుంగాని వేరుకాదు. మీదుమిక్కిలి యుదకము Good conductor of heat గాన నందు ముంచిన నగ్నిలోనివేడిం బీల్చి యింక కాలలేని దీనస్థితికిం దెచ్చుంగాన దాని నార్పివేయును.

పేరాఫిన్ అట్టిది గాదు. అది హైడ్రోజెన్ - కార్బనులకూడిక. అవి రెండును వాటికిందగిన వేడిమాత్రము సంభవించిన నాక్సిజెనుం జేర్చుకొని కాల్చునవియె. అందు మండుదీపమును ముంచఁ బోయినతోడనే పేరాఫిన్ అంటుకొనును. అవి కాలుచు నీటిని కార్బన్ డి ఆక్సైడును కల్గించును. అటుల పేరాఫిన్ అంతయు నుదకముగను, కార్బన్ డి ఆక్సైడుగను మారి వ్యయమైపోవుదనుక నట్లు కాలును.

**ఉదకములు తమ నిమ్నోన్నతముల నెఱుంగుట:—** (Water finds its own level). ఈరహస్యముంగూర్చి ఆంగ్ల రసాయనశాస్త్రవేత్తలం దొకధర్మము లేక సిద్ధాంతము ప్రచారమందియున్నది కలదు. "There is no force Pulling or Pushing in any other dirrection that is not exacute counter balenced by an equal & opposit "force" దీని ననువదించుటకన్న వివరించి తెల్పుటయె సమంజసముగ నుండును. నీరుమొదలగు ద్రవపదార్థములన్నియు బహిరంగస్థితియందుండుతఱి నది దాని యుపరిభాగము సమమగుదనుక నూరకుండవు. అనగా నాపల్లము దెసఁ బ్రవహించెడినవిభావము. నీరు పల్లమెఱుఁగును. నిజము దేవుఁ డెఱుంగు నను సామెత నెల్లరెఱిఁగినదే. ఇందుఁ జాలప్రాముఖ్యత యిమిడియున్నది. ఇందలి నిజతత్వమేమన నాంగ్ల రసాయనశాస్త్రమున as every particle in a mass of liquid is free to move about – that there is no excess of pressure in any one dirrection అని చెప్పంబడియుంట జలపరమాణువు లేదెసనుండి యధికమగు నొత్తిడి యుండదో యాదెసకుఁ గదలిపోవుట కేయాటంకము లేనిదిగ నుండెడినని భావము. ఇంకను Every pressure must be exactly counter balenced by an equal pressure in an opposit derrection- if the particle is to remain where it is అను ఒకరసాయనశాస్త్రసుప్రసిద్ధోక్తియుం గలదు. అనగా నొకజలపరమాణువ యొకేతావున నిలువవలయుననిన నొకదెసనుండి కల్గునొత్తిడి (pressure) దానినెదుటదెసనుండి కల్గునొత్తిడితో సమమై యెదుర్కొనుచుండవలసియుండునని భావము. ఇంతకన్న నీసంగతిని సులభముగఁ దెల్పుట కింతటితో నీజలధర్మముల నుడువుట నాపి సాదృశ్యమునకుం గడంగవలయును. ఒకపర్వతాగ్రమునుండి దానికడనేయున్న వేరొకపర్వతాగ్రమునకు జలముం గొంపోవలయుననిన నొకగొట్టమును వేసితి మనుకొనెదముగాక. అం దుదకప్రవాహ మమర్చితి మనుకొందముగాక. ఆగొట్టము కొండక్రిందికిఁ బల్లమునకుం జని తిరుగ రెండవకొండ కెక్కుననుకొందము. అందులోనికిందిగిన ప్రతిజలకణము పైనుండు జలకణ

ములచే దిగువకు నసగా ముందున క్రొత్తగాంబడు చునే యుండును. దానినెదుర్కొనుట కాయెదుటి దిక్కునుండి యేయొత్తిడియు లేదు. గాన దిగువకు ముందునకుంజనుచుంటయె కర్తవ్యము. దీనింగూర్చి No open body of water can remain at rest in a stoping position అనగా నేట వాలుప్రదేశమున నాటంకపెట్టంబడని జలకణ ములు విశ్రాంతిగ నిలువంజాలకుండునని వేరొక సుప్రసిద్ధరసాయనశాస్త్రవేత్త పలికి యుండెను. పీటినుండి జలముల యుపరిభాగము నొకకొననుండి రెండవకొనకు సమమట్టముగ నేర్పడుదనుక నేట వాలునందు నీరు నిలువంజాలదని తేలుచున్నది. కాని యిచటం బ్రధానాంశముగ నాగొట్టము రెండవకొండపై కెక్కియున్నదని మరువరాదు. ఆగొట్టములోనికిం దూరినజలములను ఏయొత్తిడి పైనుండి నొక్కుచు దిగువకుం బర్వింజేసెనో, ఆయొత్తిడియె యింకను నొక్కుచునే యుండును. గాన నీరు ఎత్తునకుంగూడ నట్టి నొక్కంబడుచు ముందునకు (అనగా ఎత్తునకు) జనుచుండెడిని. ఇది మొదటికొండపై యెంతయెత్తున గొట్టముం జొర మొదలిడెనో యంత యెత్తున కెక్కుదనుక నట్లే నొక్కంబడుచుం బోవుచు నాయెత్తు చేరుతఱి విశ్రాంతినంది నిలచును. ఐనను నీటివ్యవహారముల నడపు ఎంజినీయర్లు ఇంచుక తగ్గినయెత్తుతో విశ్రాంతి నొసంగుచుందురు. ఇది వారిజలప్రవాహసౌకర్యార్థమేగాని వేరుకాదు.

నీరు నిలచినపిదప గ్రావిటేషన్ ధర్మముమేర కుపరిభాగము సమతలముగ నేర్పర్చుకొనును. (గ్రావిటేషన్‌పుల్ చూడుడు). ఇంకం గొందరు పరిశీలకులు నీరు గొట్టమునం గ్రిందికిందిగుటకు గ్రావిటేషన్‌పుల్ ఒసర్చినపనియుం గొంతకల దనియు పై కెక్కుతఱి దిగువనుండి వానిభార మును వహించిన నీరు క్రిందినుండి యెత్తుట యనియు ననుచున్నారు. ఇది యింకను పరిశీలింపంబడందగియె యున్నది.

**ఉదకరూపభేదములు—** ఉదకము నకు ద్రవరూపమనియు, వాయురూపమనియు, ఘనరూపమనియు మూడు సుప్రసిద్ధరూపములు కలవు. అందు ద్రవరూపమె యెల్లరెఱింగిన యుదకము. అది ప్రవహించునంతటి పలుచగనుండు రూపము. ఇది యెల్లరెఱింగినదే. ఇంక దీని కగ్ని సంయోగమున వేడియగుటయు నెల్లరెఱింగినదే. దానిని నీటిం గాచి వేడిచేయుట యనెదరు. ఆనీటిం గాచుటయందు Boiling point వచ్చుదనుకం గాచనగుంగాని పిదప నెక్కువగాం గాచ వీలుండదు. ఏలనన నంతటినుండి నీరు ద్రవరూపమును వదలి వాయురూపమునంద నారంభించుచు నావిరియై యెగయుచుండును. నీటియావిరి యుదకము యొక్క వాయురూపము. కాని యీసందర్భమున వేరొకసంగతింగూడం జెప్పవలసియుండును. నీటియావిరి కింకను వేడిం గల్గించుచుం గాచుచుండిన నాయావిరిరూపమునందే బోయిలింగుపోయింటు వేడికన్న నధికవేడిగ నాయావిరి యగును. అనంగా నీటికి బోయిలింగుపోయింటు నేడికన్న నధికవేడి యటులం గల్గింపంబడినదని భావము. దీనివలన ద్రవరూపమున బోయిలింగుపోయింటుకు మించినది చేకురదనియు వాయురూపమున నధికవేడి కల్గింపంబడనగుననియుం దేలుచున్నది. ఇచట బోయిలింగుపోయింటు సర్వత్ర యొకేరీతి నొకేతావునం గల్గునదికాదని వేర్వేరు నిమ్నోన్నతములందు వేర్వేరు శీతోష్ణస్థితులు వాతావరణస్థితులు వాతావరణంపు టొత్తుడులందు వేర్వే రంతరాయములు వేడికిం గల్గుచుండుననియు మనసునం దుంచుకొనవలసియుండును. (బోయిలింగు పోయింటు చూడుడు.)

ఇంక నుదకమునకు శీతముతో సంబంధము గలుటతో ఘనీభవించుతావుగఁ జెప్పంబడు ఫ్రీజింగుపోయింటు దనుకం గ్రిందికి తెర్మోమీటరు నందుఁ బాదరసము దిగిపోవుతావున ద్రవరూప ముగనుండిన యుదకము గట్టిపడుచు (ఘనీభవించుచు) మంచుగ నై పోవుట కారంభించును. మంచునీటియొక్క ఘనీభవించిన రూపము.

ఫ్రాన్హైటు తెర్మోమీటరునందుఁ బల్లపుఁబ్రదేశములలో బోయిలింగుపోయింటు సర్వసాధారణ పరిస్థితులందు ౨౧౨ ఉండును. సముద్రఁపునీటి మట్టముకన్న ౨౦౦౦ అడుగులకన్న నెక్కుడు లోతుననున్న డెడ్సీ (dead sea) కడ బోయిలింగుపోయింటు ఇంకను నెక్కుడువేడికింగాని కలుగకుండును. ఎత్తగుతావులగు పర్వతాగ్రములందు బోయిలింగుపోయింటు కొంతతక్కువ వేడియందే కల్గుచుండును. సెంటుగ్రేడు తెర్మోమీటరునందు జీరో (సున్న) నీరు ఘనీభవించుతావుగను, ౧౦౦ డిగ్రీల వేడి బోయిలింగుపోయింటుగను సర్వసాధారణపరిస్థితులందు దానింబట్టి మారుచుండెడిని.

## ఉయ్యేల ఊగుట-యాగుట—

చేతంబట్టుకుని యుయ్యేల నూపినతతి దానిం ద్రోసితిమని యెఱుంగునది. అట్లు త్రోయంబడుట యన చేతినుండి కొంతశక్తి energy దానికొసఁగఁబడినదని యెఱుఁగునది. అటుల నాయెనర్జి నందిన యుయ్యేల తన కాటంకము కలుగక వీలగు నంతఁదనుక నొకదెసకుంబోయి యాటంకము గలుగగనే యాదెస నాగెడిని. ఈలోన నివ్వలి నుండి దానిబరు వాకర్షింపంబడుటయు నవ్వలి నుండి యాబరువే యిటకుం ద్రోయఁబడుటయు సంభవించుంగాన నది యచిరకాలముననే రెండవ దెసకు మరలి యూగనొదలిడి తిరుగ నాటంకముచే నాపఁబడినదనుక నూగి తిరుగ తిరుగ నిల్లి మరలుచు నూగుచుండును. ఒక్కొకదెస నాగుట యన దానియందుఁ గలశక్తి పనిచేయలేక యాగినదని యెఱుంగునది. తిరుగాఁ గొత్తశక్తి పనిచేయ మొదలిడినదిగా నెఱుంగునది. ఇది గాలియందు జరగినపని. గాలి లేనితావున (in a vacuum) జరుగుపనియె వేరు.

## ఉఱుము - పిడుగు - మెఱుపు—

ఉఱుమునకుం గారణము మేఘములరాపాటమని పెక్కండ్రు పొరఁబడుచుందురు. మేఘములు చాలమెత్తనివి. ఒకటి నొకటి హత్తుకొనుతతిని, కలసిపోవుంగాని ధ్వనిచేయునంతటి గట్టివాటిగనుండుడు. అందలి విద్యుత్తు జారుచు నొక మేఘమునుండి వేరొకమేఘముపైఁ బడుతతిని, మేఘములపైనుండి జారి భూమిపైంబడుతతిని దరినుండు వాతావరణమున వేడి వ్యాపించి యధిక మగుచుండును. ఆవేడి గాలియం దలలం గల్గించి ధ్వనిఁ (vebration) జేయునదియె యుఱుమందురు. ఇంక మేఘములనుండి జారి భూమిపైంబడిన విద్యుత్తునే పిడుగనెదరు. మేఘములనుండి విద్యుత్తు రాపాడుకొనుచుఁ బ్రకాశవంతమై భూమిపై వారలకుం గన్పట్టుట మెఱుపనంబడుచున్నది.

ఉఱుము ధ్వనిప్రతిధ్వనులు కలసిన చప్పుడె గాన దానికి వెరువవలసినది లేదు. ఇండ్లయందు good conductors of electricity లగు వస్తువులకడనుండుట శ్రేయస్సుగాదు. వేడిగాలి పొగపొయిబుగ్గి మొదలగువాటికడనుండు టపాయకరము. లోహములు పిడుగుల నాకర్షించెడివిగాన వాటికడనుండఁ జనదు. కిటికీలయం దినుము మొదలగులోహములుండుంగాన నట నుండు టపాయకరము. ఇంటిమధ్యనుండుట మంచిదందురు.

గడ్డిచాపలు, పొడిబరకములు నిరపాయకరములు. మూడంతస్తులమేడ యగునేని మధ్యయంతస్తు శ్రేష్ఠమని చెప్పంబడినది. ఇండ్లబయట వేరుస్థానమున నిలచుండుట కూర్చుండుట మంచిదిగాని జారఁబడుట పరుండుట యపాయకరము. చెట్లనీడ నిలచుట యపాయకరము. జనులు జంతువులు క్రిక్కిరిసియున్న తావుల పిడుగులు ఉఱుములు పడు కాలమునం దుండరా దందురు.

## ఉఱుములు - మెఱపులు - పిడుగులు గల్గినతఱి పాలు పెరుగు లధికముగఁ బులియుట (Milk and curd turns more sour in thunder storm):-

పాలు తోడుపై చిన విరిగి పెరుగుట సహజము. అట్టితో డధికమైనతఱిఁ ద్వరితముగ విరిగి నిల్వయుంట పులియుట కారంభించెడిని. ఇంక నుఱుములు మెఱపులు పిడుగులు పడుట సంభవించుతఱి నచటివాతావరణమంతయు విద్యున్మయమై (Charged with electricety)యుండుంగాన నత్తఱిఁ బాలువిరిగి పెరుగగుట యతిత్వరితముగ జరగు నట్టియం దింకను నిల్వయుండుట పులియుట కారంభించుటయు విద్యుత్సహాయమున నింకను త్వరితముగఁ బులియుటయు సంభవించెడిని. లోహపాత్రలు కండక్టరులేగాన మూతలు వైచి భద్రపర్చినను నీపని తప్పదు. nonconductor లతోఁ జేయబడిన పాత్రలందు మూయంబడి భద్రపర్చంబడినవాటి కీపని జరుగ వీలుండదు.

## ఉర్ ఆఫ్ ఛాల్డీస్:-

(సుమేరియనుల ఉర్వీపురముఁ జూడుడు)

**ఊదారక్తము** (Blue blood)—ప్రతి శరీరమునందునను నెఱ్ఱరక్తము నూదారక్తముంగూడఁ గలవు. ఎఱ్ఱరక్తము మానవశరీరమందు arteries గుండానున్న, ఊదారక్తము Verius గుండానున్న ప్రవహించునది. రక్తము శరీరమందంతటం బ్రవహించుకతన హృదియము కడ నూపిరినుండి పీల్చుకొనిన ఆక్సిజెనుం గోల్పోయి కడకు carbon di oxide సంయుక్తమై purpolish రంగుగ మారి verius నందుఁ బ్రవహించుచుఁ గడకు హృదయమున lungs నకుం జేరి యట నూపిరిగాలినుండి తిరుగ నాక్సిజెనుం గైకొని తిరుగ నెఱ్ఱంబడుచుండును. ఇది నిజమగు నూదారక్తము. (హేమోగ్లోబిన్ చూడుడు.)

**ఎక్సు - రే** (X-Rays):—ఇక్కాలమున నానుపతుల్రలసంబంధ మించుక యెఱింగినవారి కెల్లరకు ఎక్సురే కిరణముల పేరెరుక లేకపోలేదు. వీటింగూర్చి Rontgen అనుపేరుగల గొప్పపండితుఁడు పెక్కుపరిశీలనల నొనర్చి కనిపెట్టి చిరస్మరణీయుం డాయెను. ఆమహనీయుఁడు క్రీ. వె. ౧౮౯౫ లోఁ బరిశీలన లొనర్చుచుఁ దాను ప్రత్యేకముగ నాయత్తపర్చుకొనిన లోన గాలిలేని గాజుగొట్టముగుండా విద్యుత్ప్రసారమును నడపుచుఁ బరిశీలించుచుండ నతాత్తుగా నేదో యొక నల్లనిపదార్థ మాగొట్టముం గప్పెనఁట. తోడనే యట నొక Chemical screen ఏర్పడి మెఱయుట ప్రారంభమాయెనఁట. అతఁ డచ్చెరువందుచు దానిని (అప్రకాశమును)Invisible rays from the tube which had passed right through covering of black material and made the screen to shine అని గ్రహింపఁ గల్గెనఁట. అదియె నీయెక్సురేలం గన్గొనఁ జేసినమొదటిప్రయత్న మఁట. రానురా నిట్టి పరిశీలనలనుండి యెక్సురేకిరణములు రాళ్ళగుండానున్న, కఱ్ఱగుండానున్న, మానవశరీరస్థ మాంస చర్మాదులగుండానున్న, నిట్టివేయగు కొన్ని యితర పదార్థములేగాక Opaque

పదార్థములగుండా కూడఁ జొచ్చుకొని పోఁగల విగ బయల్పడియెను. ఇక్కాలమున నెక్సురే లాంతరులలోని దీపములగుండా శరీరభాగముల ఛాయాపటములం దీసి లోని యెముకలు నితరాటంకములు లోనగలకురుపులు మొదలగు వాటి నన్నిఁటిని అలోపతీ (ఆంగ్ల) వైద్యులు పెద్దపెద్ద యాసుపత్రులయందుఁ దీసి గ్రహించి చికిత్సల నొనర్చుచున్నారు. ప్రమాదవశమున శరీరములోని యెముకలు విరిగినతఱి వాటిం జక్కఁబరచుట దీనిముఖ్యోపయోగముగా నున్నది. గొప్పవైద్యవిద్యావిశారదు లీయెక్సురేను బహిరంగపరచి యావెలుతురునందుంచుటకు గుణము లుగఁ బెక్కుబాధకరములగు రోగములు కుదురు ననుచున్నారు. ఈయగోచరకిరణము (invisible rays) లంగూర్చి యీకిరణసముదయము short length of the wave which measures about one two hundred and fifty millionth part of an inch అని చెప్పం బడియున్నది.

ఎక్కిళ్లు:— ఎక్కిళ్ల నెల్లరెఱింగినవే యైనను నవి యెటుల సంభవించునాయని విచారించువారు చాలాతక్కువ. గాన నిందు వ్రాయ నెంచితిమి. ఈశబ్దము సంస్కృతపదమగు హిక్క యనుదానినుండి కల్గినది. ఆయుర్వేదవైద్యగ్రంథములగు సంస్కృతగ్రంథములం దెక్కిళ్లకు హిక్కా శబ్దమును వాడియుండిరి. సంస్కృతజన్యభాషలలో మనకు సమీపభాషయగు ఓడ్రమున నది హిక్కో యనంబడినది. కాని యాంధ్రభాషయం దీపదము నిత్యబహువచనాంతముగనే వాడంబడు చున్నదెకాని దీని యేకవచనపద మెక్కడను చూపింపంబడిన ట్లగుపడదు. గాన దీని కేకవచనము గానరాకున్నది.

వీటి కాంగ్లేయు లింకను నించుక ముందుసకుం జని యేమొ Hic-up అని వాడుచున్నారు. ఆంధ్రపదముగ గాననగు ఎక్కిళ్లు అనుట యందే క్రిందినుండి పైకెక్కుట స్ఫురించుచునే యున్నది. ఇంక నీశబ్దముంగూర్చి ఎక్కుడులు, ఎక్కిళ్లు పదములతోవదలి యస లెక్కున దేదో కారణమేమో విచారింతుముగాక. దీనిం గూర్చి సుప్రసిద్ధాయుర్వేద గ్రంథమనిపించుకొను చున్న చరకమునందు "అన్నజాన్ యామి(జామి) లాన్ క్షుద్రాన్ గంభీరాన్ మహతీన్। తథా వాయుః కఫేనానుగతః పంచ హిక్కాన్ కరోతిహి" అనగా కఫానుగతమైనవాయువు ఐదువిధములగు ఎక్కిళ్లు (హిక్కా) లం గల్గించునది. అవి ౧ అన్న (భోజన) జములు. ౨ యా (లేక జా) మిళము లనగా నొకటితరువాత నొకటి జోడాలుగా సంభవించునవి. ౩ క్షుద్రములు (చిన్నవియని భావము). ౪ గంభీరముగా వచ్చునవి. ౫ పెద్దవిగా (పొడవుగను ధ్వనింజేయుచు) కల్గునవి యని తేలుచున్నది.

ఎగురుట:- పక్షు లాకసమునం దెగురుట యన గాలియం దెగురుటయని భావము. నీటి యందుఁ జేప లీదుబెట్టి విద్యయో గాలియందుఁ బక్షులెగురుటయు నట్టివిద్యయే. పక్షిశరీరము గాలి కంటె బరువని యెల్లరెఱింగినదే యైనను దాని శరీరమున గాలిచే నింపంబడిన వెలితిప్రదేశము లధికముగ నున్నవి. గాని యవి సహాయ మొనర్చునవియే. పక్షిని నిజముగఁ దేలంజేయునవి దాని రెక్కలని యెఱుంగవలయును. వాటి నాడించు చుండకపోయిన నాపక్షి నేలకుం బడకతప్పదు. రెక్కలందుఁ బక్షికి బలమధికము. అది క్రిందికి దిగవలసినతఱి రెక్కల నాడింపదు. అట్టితఱి జాగ్రతతోఁ జకతాత్తుగ నాడించుశక్తియుఁ ద్వరితగమనమున కతిత్వరగా రెక్కల నాడించుశక్తియుఁ బక్షికిం గలదని కనిపెట్టంబడియున్నది. ఆకాశవిమానము లీపక్షిరెక్కలవిధానముననే చేయం బడుటఁ బరిశీలించినఁ దెలియఁగలదు. ఇందుముఖ్య

ముగ నెగురు రెక్కలశక్తి కనుగుణముగఁ బక్షిశరీరము చేయంబడినదని మనసునం దుంచుకొనవలసియుండెడిని.

**ఎట్రాక్షన్ డిఫ్లెక్షన్:–** (Attraction & deflection) ఎట్రాక్షన్ అనిన ఆకర్షణ. డిఫ్లెక్షన్ అనిన అనాకర్షణము. తాపీ పనిచేయువారి యొడంబము (Plumb ball) ను త్రాటిచేఁ బైనుండి క్రిందికిఁ దిన్నగ వ్రేలాడందీసినచో నానిలువునాగీచినగీతకు Plumb line అనెదరు. ఒడంబము గుండు (Plumb ball) కొంతభారము గల్గినది కాన భూమియొక్క యాకర్షణశక్తికి లోనై భూమధ్యభాగమున కాకర్షింపంబడుచుంట నా నిలువుగీత కాంగ్లమున Vertical line అనియెదరు. ఇది సర్వసాధారణ పరిస్థితులందు జరుగుచుండుపనిగా నెల్లరెఱింగినదే. భూమియొక్క యాకర్షణశక్తి కాంగ్లరసాయనశాస్త్రమున Gravitation pull అను సాంకేతిక నామ మిడియున్నారు. ఆకర్షించుట లేక ఆకర్షించుపనికి 'ఎట్రాక్షన్' అని సాంకేతికనామ మిడియున్నారు. ఇందాకర్షింపంబడునది యొడంబమునందలి గుండునందున్న బరువని మనసునం దుంచుకొనవలయును.

ఇంగ్లాండు దేశమున బ్రిటీషుసామ్రాజ్య ప్రభుత్వఁపు ఎస్ట్రానమర్ రోయల్ (astronomer royal) పదవియం దొకప్పుడుండిన Dr. Maskelyne పండితుఁ డీసందర్భమునఁ బరిశీలన లొనర్చుచు నాదేశమునందు Perth shire నందు Schiehallion అనుపేరుగల గ్రామముకడనున్న నొకకొండయొక్క యుత్తరమున నొకటియు దక్షిణమున నొకటియు రెం డొడంబములను వ్రేలాడందీసి పరిశీలించెను. అప్లంబులైన్సు పైనుండి క్రిందికి సరిగా వ్రేలాడక నించుకఁ గొండవైపు చేరినట్లుండుట కనిపట్టెను. ఇందువలన నాయుత్తరదక్షిణములందు వ్రేలాడఁ దీయంబడిన లైనులు పర్టికల్ కాకుండఁ గొండవైపున కాకర్షింపంబడియుండుటయన భూమిచే గ్రావిటేషన్ పుల్ ఆకర్షింబడుచు నంతకు సమీపమునంగల పర్వతశరీరముచేఁగూడ నించుక యాకర్షింపంబడుటచే దానివైపున కాకర్షింపంబడినదిగాఁ దేలుచున్నది. దీనినుండి భూమియొక్క మధ్యభాగమునకు గ్రావిటేషన్ పుల్ లాగుచున్నను బ్రక్కను సమీపముననే గలపర్వతము (పర్వతశరీరము) కూడఁ దనవైపున కాకర్షించుచున్నటుల నెఱుంగనగును. మొదటియాకర్షణ (attraction) నును తా నించుక జయించి తనవైపు లాగికొనినపర్వతఁపుటాకర్షణ కాంగ్లరసాయనశాస్త్రమున Deflection అని సాంకేత నామ మిడియున్నాడు.

ఇవి యిట్లుండ భరతదేశమున నిదియె పరిలనలనంది వేరొకవిచిత్రము కన్గొనంబడియున్నది. హిమవద్వింధ్యనగంబులనడుమసీమలం దొడంబములు హిమవత్పర్వతము దెస కాకర్షింపఁబడునని యెల్లరు దలంపనగుగాని యట్లు జరుగక వింధ్యనగంబువైపు దక్షిణమున కించుక యాకర్షింపంబడుట దక్షిణదిశ కించుక చేరియుండును. వింధ్యదక్షిణసీమలందు అనగా ద్వీపకల్పఁపు భూములం (Peninsular regions) దొడంబసూత్రములు తిన్నగా (Verticully) నిలువంబడియుంటయు జరుగుచున్నది. దీనినుండి హిమవన్నగముందుకన్న వింధ్యయం దేదో యుత్తరదిశగా నతిభారమైన పదార్థ మాకర్షించుచున్నది కలదనియు నట్టిబరువగు పదార్థములు హిమవన్నగఁపు దక్షిణదిశయందు లేవనియు స్ఫురింపకపోదు. ఈడక్కన్ పీఠభూమియం (Deccan Plain) దు వింధ్యదరినిమాత్ర మావైపున కించుక యాకర్షింపంబడుచు దానినుండి దూరమరిగినకొలఁది సరిగా నిలువంబడుచు (Verticully) దక్షిణదేశములందు నిష్కర్షగ (Verticul) నిలువుస్థితిందాల్చియుండును.

**ఎడతెరపి లేకుండ క్రిందికిని పైకిని గిరగిర జలపాత్రం ద్రిప్పుచున్నను నందలిజల మొలికిపోకుండు కారణము**—ద్రవపదార్థములన్నియు భూమియాకర్షణము (గ్రావిటేషన్ పుల్) నుండి పరిసరపదార్థములయొత్తిడి యొకదెసనుండి యధికమై దాని యెదుటి యెదుటిదెస నల్పముగనుండినంగాని కదలక యథాస్థానమం దున్నట్లె యుండునని చెప్పంబడియున్నది. (గ్రావిటేషన్ పుల్ చూడుడు). ఇట్టిసందర్భములందుఁ బాత్రయు నందున్నయుదకమును భూమియొనర్చు నాకర్షణశక్తికి లోఁబడియే యుండెడిని.

అట్టి జలపాత్రి లెడతెరపి నీయక క్రిందికిని పైకిని గిరగిరఁ ద్రిప్పుచుండుతఱి జలమున కొకదెసనుండి యధికమగు నొత్తిడియు నొకదెసనుండి తక్కువయొత్తిడియుం గలుగుటకు మారుగ నితర బలములు వాటిం జెలరేగనీయకుండఁ బట్టియుంచుటయు జలమొలుకుటకుం దగినకారణము గలుగకుంటయు సంభవించుంగాన నవి యొలకనేర కాపాత్రియం దట్లె యుండెడిని.

**ఎదుగుటయందలిరహస్యములు**—నిజమున నెదుగుటంగూర్చి సరిగాఁ దెలియదనియే చెప్పవలసియుండును. ఒకచెట్టెదుగుట జరగుచుండగా దానియం దాకులు, పూవులు, కాయలు మొదలగునవి ప్రత్యేకముగ నెదుగుచుండును. అవి కొంచెముకాలము పరిణామముంజెంది పండి, పూచి, రాలిపోవుట జరిగినను చెట్టుయొక్క యెదుగుటయం దేమార్పు జరుగక చెట్టు జీవించుచునే యుండెడిని. ఇంక బాలురశరీరములోని కిచ్చునాహారమునుండి యెదుగుట సంభవించుచున్న ట్లగుపడుచున్నను నంతమాత్రిములో నది సరియని చెప్ప వీలుకాకున్నది. కొంతవయస్సు వచ్చి శరీరము ముదురుటతో జీవజంతువులయం దెదుగుట యాగిపోయెడిని. దీనినుండి భోజన మెదుగుటకుఁ బ్రధానసాధనమని చెప్పవీలు కుదురుట లేదు. కాని బాలురు మొదలు మొక్కల దనుక బాల్యమున Growth is among other things the addition of new meterial to the body threw food articels అనిమాత్రము చెప్పవీలగుచుండుట నది యొకశరీరశాస్త్రధర్మపద్ధతులలో నొకటిగ నేర్పడియున్నది. దీనినుండియే "Matter cannot be made out of nothing" అను ధర్మము రుజువై నట్లు చెప్పుట కేసంశయములేదని చెప్పవలసియున్నది.

ఇంతియకాక నారోగ్యస్థితి, వ్యాయామము, మనస్సునందలి సంతసము, ఉత్సాహముంగూడ నెదుగుటకుఁ గారణములని పరిశీలనలనుండి గ్రహింపనగుచున్నది. ఒకసుప్రసిద్ధశరీరశాస్త్రవేత్త పరిశీలించుచు Real growth is only is outward visible sign of devolopment- as when an acron devolops in to a beg tree" అని నుడివెనఁట.

ప్రాణులశరీరములు పెరిగి పెద్దవిగ నగుటయని భావము. శరీరమంతయు cells అనంబడు వాటిమయమై యున్నదని యెల్లరెఱింగినదే. ఆహార నిద్రా వ్యాయామాదులచేతను సంతోషోత్సాహజయాదులచేతను శరీరమునందలి సెల్సు బలపడి పెద్దవగుటతో నాగక సంఖ్యయం దధికము లగుచుంటయు ముదిమి, క్లేశము, ఆహారలోపము, ఆధివ్యాధులు మొదలగువాటివలనఁ గృశించి సంకోచావస్థ నందుటయెగాక సంఖ్యయందుఁ దగ్గిపోవుచుంటయు సంభవించుచుండును. వృద్ధియగుటకుఁ బెరుగుట లేక ఎదుగుటయనియు నందురు. క్షీణించుటకుఁ జిక్కుట కృశించుట యనెదరు. వయస్సు మళ్ళుటతో సంభవించు నావుదలకు నెదుగుట మాాెనందురు. ఎదుగుట యాగుట నైసర్గిక లక్షణములుగఁ బ్రాణులకుఁ గల్గుచున్నవి.

**ఎనర్జి (Energy) శక్తి**:— ఎనర్జి యనం బడు నాంగ్లపదమునకు శక్తి లేక సామర్థ్యమని యర్థము. ఈశక్తి జగమంతటను నిండి సర్వత్రి గల్గియుంటనే భరతదేశంపు టార్యులపూర్వులు "సర్వంశక్తిమయం జగత్" అని గ్రంథములందు వాడియున్నారు. ఇట్టిజగద్వ్యాపకశక్తి నొక పూజ నీయదేవతగా భక్తి సల్పుట కర్థముం జెప్పుట యపార్థము. జగదీశ్వరుండగు పరమేశ్వరున కిట్టి మహాశక్తిని సహధర్మచారిణిగం బోల్చిన యార్య మతధర్మ మెంతటియపార్థము వాల్పడంజేయబడి నదో నిష్పక్షపాతబుద్ధితో యోచించినం దెలియం గలదు. ఎనర్జి యనుపదము గ్రీకుభాషకుం జెంది నది.

ఎనర్జి నెవ్వరు క్రొత్తగ సృష్టింపంజాలరు. జగ ద్వ్యాపకముం గాంచి యదివరకేయున్న ఎనర్జిశక్తి స్వాధీనమగుట కర్థమగునటులం గేంద్రస్థానముల నేర్పరచి దానిని వశపర్చుకుని పనులం జేయునట్లు నడపుదురు. ఇది యాంగ్లమున Dirrection అనంబడును. ఇట్లాశక్తిని రావించి నడపి పనులం జేయించుటకు వలయునవి మూడు. 1 Matter, 2 Sufficent energy, 3 Dirrection. ఇందుం గటపటిదగు డైరక్షన్‌నకు అనగా నడపు టకు మనస్సు ప్రధానముగానం గొందరు శాస్త్ర వేత్తలు డైరక్షన్ అనుటకుమారుగ మైండు (Mind) అనుటయె సమంజస మనుచుందురు. ఏది యెట్లున్నను Minds dirrection అనుటం గూడ సమంజసమే యగును. గాని యయ్యది చాలచిక్కులం గల్గించు పదార్థము. సాధువై నేర్పెరుంగని మనస్సుగాక విద్యనేర్చిన మనస్సుగ నుండవలయును. ఇంక నావిద్యయు సర్వ విద్యయై యుండవలయును. నడపుటయందును నేర్పుగలదు. ఇందుకుం బ్రవీణత యవసరము. అత్తటినే నడ పుట జయముం గాంచ నగును.

ఇందు Matter (పదార్థముగాననది) చూడం బడందగియుండును. తక్కిన యెనర్జి (శక్తియును) డైరక్షను లేక Mind ను చూడంబడునవిగాన వాటిని చూడ శక్యముకాదు. కాని యిందొక్క సంగతి నెఱుంగుదము. పనిచేయునపుడు శక్తి పదార్థమునం దుండునని గ్రహింపనైనది. అదియే యాపదార్థము (Matter) చే నాపనిం జేయించు నదియని స్పష్టముగా గ్రహింపనైనది. గాని దానిని వదల్చునట్టియు పనింజేయ నడపునట్టియు మనస్సు లేక డైరక్షన్‌గూర్చి మన కేమియుం దెలియదు. కొందరది తాత్కాలికముగ జరుపం బడునట్టి పని యందురు.

ఇందుకు సాదృశ్యముగ నొకతుపాకిం బేల్చు టతో నొకానొకగురిపెట్టిన తావునందుం గొట్టుట యనుకొనినచోం దుపాకిం జేయించి యందు మందు తోటాలనింపి యాయత్తపరచుటతోం బదార్థము (Matter) పరిపూర్తి యగును. దీనినే చూడంగల్గినదని చెప్పుదుము. తక్కినశక్తి మన స్సులం జూడంజాలరు. దానిని మనస్సు నడుపకున్న నాశకి యేపనియు నాపదార్థముచేం జేయింపం జాలకుండెడిని. ఇట మనస్సు నడపుటయన నా తుపాకియందలి Triggerను లాగుటయైయున్నది. దానినే యాశక్తిని విడుదల (Release) చేయు టగాం జెప్పనగును. ఇంక నడపుట దానిం గురిం జూచియుంటం గానోపు.

ఎనర్జిశక్తినిం బరిశీలకులు "Energy is a power which meets with an instant recognition by mind" అని నిర్వచించి యున్నారు. కొందరు పరిశీలకు లాశక్తి మృతకళే బరములందుంగూడ నుండుననియు దానిని నడపు మన స్సందు లేనందున నటుల నిరర్థకస్థితియం దున్నదనియు ననుచున్నారు. ఎనర్జిశక్తి వాడుచుం బనిచేసినకొలది యరుగునది కాదు. తరుగునది కాదు. చెడునది కాదు.

## ఎనాయిస్తిటైజేషన్ (anaesthetisation)

ఎనాయిస్తిటైజేషన్ అన శస్త్రచికిత్స యందు రోగికి బాధ తెలియకుండునటుల Unconscous (అనగా చైతన్యరహితచిత్తముగల స్థితి) యందుంచుటయని యర్థము. ఇది నిషా చేయుటయని గాని మొద్దుబారించుటయని గాని తలంపరాదు. ఆపరేషన్ (శస్త్రచికిత్స) యొనర్చుతఱి మనస్సునకు నొప్పి, భయము, అనుమానము మొదలగునవి కలుగకుండఁ జైతన్యస్థితిని తాత్కాలికముగఁ దప్పించుటయని యెఱుంగునది. క్రి. శ. ౧౮౦౦ సంవత్సరముదనుక నిట్టిదానింగూర్చి తలంపే లేకుండెను. పిదపఁ జికిత్స జరగుతావును లేక శరీర భాగమును మొద్దుబారుటకుఁ బ్రియత్నము లచ్చటచ్చట జరుగ నారంభించెంగాని సంతృప్తి ఁగల్గింపలేదు. క్రి. శ. ౧౮౪౨ లో డాక్టరు Harace wells అనుపేరుగల అమెరికాదేశపుదంతవైద్యునకుఁ దనదంతచికిత్సాకాలమున రోగిమనస్సునకుఁ జైతన్యముం దప్పించిన బాగుండునని మొట్టమొదట తలంపుఁగల్గి యది యెట్లుచేయనగునా యని యోచించుచుండెను. ౧౮౪౪ లో నొక రసాయనశాస్త్రవిదుని యుపన్యాసమును వినుట తాతం జేగి nitrous oxide gas నందుగల భాగములంగూర్చి విని దాని నాతం బొకనికిఁ బీల్పింప నించుకసేపు చైతన్యము తప్పుటం గాంచి తానును తనరోగిపై వాడెంగాని యాసర మగు సంతదనుక నారోగి యాచైతన్యరహితస్థితియందుండలేదు. పిమ్మట వెల్సుగారు దీనింగూర్చి Dr. morton అనుపేరుగల వేరొకదంతవైద్యునితో యోచించుచుండెనఁట. మోర్టనుగారు ఈథరు నుపయోగించి తనకుక్కకు మైకముం గల్గించి తాను స్వంతముగాఁగూడ వాడుకొని సంతృప్తుండై యొక శస్త్రవైద్యుని వాడిచూడుమని ప్రోత్సహించెనఁట. అట్లు చేసిన శస్త్రచికిత్స సంతృప్తికరముగ నడచెనఁట.

ఈవార్త త్వరితముగ వ్యాపించి ఎడింబరో నగరమున Dr. Jame Young Simpson అనుశస్త్రవైద్యుఁడు తన రోగులపై వాడుచు శస్త్రచికిత్స లొనర్ప మొదలిడెనఁట. ఆయన క్లోరోఫారముంగూడ మొదట వాడినవాఁడఁట. ఇక్కాలమున Nitrous oxied gas - ether-chloroform ఈమూడును ఎనాయిస్తిటైజేషన్ కార్యమున నుపయోగింపంబడుచున్నవి. వాటివాటి యావసరముల వెంబడి నప్పటిపను లావసరముల మేరకు వాడంబడుచుండును.

## ఎమజానుజాతి మనుష్యులు

ఎమజానుజాతి మనుష్యులు- వీరు బలాఢ్యులు, ధైర్యవంతులు, గట్టిశరీరముఁ గలవారు. స్త్రీలు బ్లాక్సీయొక్క ఆసియాఖండపుఁ దీరమున వసించుచుండిరనియు నట వారి కొక రాజ్యముండెననియు Penthesilea అనుపేరుగల యామె రాజ్ఞియై యుండెననియు వారిరాజ్యము లోని కెవ్వరిని రానివ్వకుండిరనియు యుద్ధమున శూరులనియుఁ దలంపంబడుచున్నదఁట.

ట్రోజనుజాతివారితోఁగూడి గ్రీకులతో వీరు యుద్ధముఁ జేయవలసివచ్చి యందు రాజ్ఞి వీర స్వర్గ మందుకతన వీరిరాజ్య మంతరించెనని వాడుక గలదు. రాజ్ఞిం జంపినవానిపేరు Achilles అనెదరు. వీరు గృహనిర్మాణవిద్యయందుఁ గడు నేర్పరులఁట.

## ఎరూకా పదము

ఎరూకా పదము—దీనికి 'ఎరుక' యనం బడుపద మర్థము. నేఁ గన్గొంటిని లేక నా కెరుక యయ్యెనని దీనిభావము. తొల్లి సిసిలీ ద్వీపరాజ్యమునకు Syracuse అనుపేరుగలపురము రాజధానిగ నుండెనఁట. సిసిలీద్వీప మిటలీదేశమునకు దక్షిణభాగమున సముద్రమునం దు ము

ఈపురమున 'ఆర్కిమీడీస్' అనుపేరుగల విద్వాంసుఁడు తత్వశాస్త్రవేత్త యుండెడివాఁడు. ఆతని జీవనకాలమున నొకప్పు డాదేశ మేలుభూపతికిరీట మొకబంగారుపనివానికిఁ జేయ నీయంబడియెనఁట. అం దాతఁడు కొంతబంగారములోఁ గొంచెము వెండింగల్పి ద్రోహ మొనర్ప యనుమానింపంబడి ఆర్కిమీడీసుగారికిఁ బరిశీలింప నప్పగింపంబడెనఁట. ఆకిరీటము నాయనఁ బెక్కుపరిశీలన లొనర్చుచు నీటముంచియుండుతఱి దానిం దూచి బంగారఁపు బరువు వెండిబరువున కధికమనియు దానిలోఁ గొంత వెండి కల్పియుండుననియుం గన్గొని భూపతికిం జూపి ఋజువుపర్చె నఁట. కన్గొనినసంతోషమున నుత్సాహముతో "ఎరూకా" యని యరచెనఁట. నాటినుండియు నాకుం దొరికినది లేక నే నెఱింగితిని అనుమాటలకుగాను నిది వాడుకయాయెనట.

**ఎఱ్ఱగఁ గాల్చిన లోహమును మెల్లఁగ ముంచినను చల్లనినీటి యందల్లకల్లోముం గల్గించి కలవర పరచుట:**— సర్వసాధారణముగఁ జల్లనినీటిలో నడఁగి కలసియుండిన గాస్ హత్తుకొనం జేయంబడిన (Compressed gas) గా నుండును. దాని కఠాత్తుగా వేడి తగిలి యది విడఁబారుట (expand) సంభవించును. అత్తఱి నది బుడగవలె నీటిచే నావరింపంబడిన దగును. పగులుటకన్న దానికిం గత్యంతర ముండదు. తేలకముం దది పగిలిన చలనము నీటియందుఁ గలుగుట సహజము. అట్టివి పెక్కులు సంభవించుకతన నీటియం దల్లకల్లోలము కల్గి కలకలము సంభవించుంగాని లోన మెల్లఁగ నుంపంబడిన లోహము కదల్చిన కదలిక గాదు.

**ఎలక్ట్రిసిటీ వాడఁబడు తావులందు బాల్చీలలో ఇసుకను నింపి యుంచుట:**- ఎలక్ట్రిసిటీ వాడంబడుచుండు తావులందు షార్టు సర్క్యూట్ (Short Circiet) టనం బడు నపాయ మగ్నిప్రమాదముం గల్గింప నోపు. ప్రమాదమును నీటితో నార్ప వీలుపడదు. ఏలనన నీరు ఎలక్ట్రిసిటీకి కండక్టరు (Conductor) గాన నగ్నిని వ్యాపింపంజేసి ప్రమాదము నధికపర్చనోపు. అట్టితఱి నిసుకం జల్లిన నది యెలక్ట్రిసిటీకండక్టరు గాదుగానఁ బ్రమాదము నాపి వ్యాపింపనీయదు. గానసె ఇసుకబాల్చీలను నిల్వయుంచుపద్ధతి యేర్పడియున్నది.

**ఎలిమెంట్సు-గ్రూప్సు** (Elements and their groups) ఆంగ్లరసాయనశాస్త్రమున 'ఎలిమెంట్సు' కొన్ని తెగలుగ విభజింపఁబడియున్నవి. ఈయేర్పాటును రష్యాదేశఁపు రసాయనశాస్త్రవేత్త Mendeleef గారును, జర్మనుదేశఁపురసాయనశాస్త్రవేత్త Lothar meyar గారును, ఆంగ్లరసాయన శాస్త్రపండితుఁడు J. A. R. Newlands గారును చేసినవారు. వారు చిరస్మరణీయులు. ఇక్కాలమున Periodic Table of elements అనిచెప్పంబడుచున్న విభజనపథకమున కీప్రారంభపథకములే పునాదిగ నున్నవి. వేర్వేరుకాలములందుఁ గ్రొత్తక్రొత్త రహస్యములు కనిపెట్టంబడుటతో నీపథకము మార్పు నందుచుండెను. ఇవి యాలోహములు కన్గొనంబడిన కాలములవరుసను వాటివాటి కెమికల్‌బిహేవియర్ (Chemical behaviour) ల ననుసరించి విభజింపంబడియున్నవి. ఇంతవఱ కవి యెన్మిది గ్రూపులుగ విభజన నందియున్నవి. అందుఁ గడపటిది ఆరు గాసెస్ gases గలది. ఇది ఇటీవల

నేర్పరుపంబడినదిగా నున్నది. అవి ౧ Helium, ౨ Neon, ౩ Argon, ౪ Krypton, ౫ Xenon, ౬ Radium emanation అనంబడునవి. వాటికి Inert gases అని సాంకేతికనామ మిడియున్నారు. ఏలనన నవి వేటితోను కలుపంబడ వీలులేనివిగ నున్నవి. అనగా వాటికిం దక్కువగు నెలిమెంట్సుతోఁ గలియవని భావము. జర్మనురసాయనశాస్త్రగ్రంథములందు వాటిని noble gases అని వాడియున్నారు. వాటిపరమాణువులు (atoms) బరువునందు భేదముం గలియుండును. అందు హేలియమ్ హైడ్రోజెనుకుఁ బిదపం జెప్పంబడినది. తక్కిన వీపద్ధతినే ౧౦, ౧౮, ౩౬, ౫౪ సంఖ్యలుగాఁ జెప్పంబడి హేలియమ్ ఎమానేషన్ ౮౬ గా నుంపంబడియున్నవి.

ఈపథకమునందున్న విభజనము ముఖ్యముగ నామెలిమెంట్సు కన్గొనంబడినకాలము ననుసరించిన వరుసగ నేర్పడినదనియే చెప్పవలసియున్నది. తొలుత ౧ హైడ్రోజెన్‌గూ్రిపు. పిదప హేలియమ్‌గూ్రిపు ౨ లిథియమ్‌గ్రూపు (Lethium group) ౩ బెరిలియము(Beryllium) ౪ బెయిరన్ (Beron) ౫ కార్బన్ ౬ నైట్రోజెన్ ౭ ఆక్సిజెన్ ౮ ఫ్లూఓరైన్ (fluorine) ౯ నియాన్ (neon) ౧౦ సోడియమ్ (sodium) ౧౧ మెగ్నీషియమ్ (magnesium)౧౨ అల్యూమినియం (aluminium) ౧౩ సిలికాన్ (silicon) ౧౪ ఫోస్ఫరస్ (Phosphorus) ౧౫ గంధకము (Sulphur) ౧౬ క్లోరైన్ (Clorine) ౧౭

——ఈకాలముల (Periods) విభజనము ఏడుగ నున్నటుల పథకమునుండి గాననగును. ఆయేడవ పీరియడ్‌కాలమున Radium, Actinium, Thorium, Uraniumమొదలగునవి చెప్పంబడియున్నవి. ఇందు వదలివేయంబడిన వెలితి సంఖ్యాస్థానములు కలవు. బహుశః ముందైన ఎలిమెంట్సు కన్గొనంబడియెనేని నింపవచ్చుననిగాబోలు వదలియున్నారు. వీటియం దింక నొకచిత్రము కలదు. మొదటివరుస (first Row) లోని మొదటి ఎలిమెంటు హేలియమ్. (2) రెండవ వరుస (Second Row) లోని మొదటి ఎలిమెంటుంబోలియుండెడిని (నియాన్ 10) ఇటులనే లీథియమ్ (3) సోడియములు (11)——మొదలగు కొన్ని యొకటినొకటి పోల్కలు కలవిగనుండెడివి. వీటిభేదము చక్కఁగఁ గన్పట్టం దగియుండును. ఇట్టివి యింకం గొన్ని కలవు.

ఆల్కలీస్ (లేక alkaline metals) అనంబరగు లిథియమ్ సోడియమ్ పొటాషియమ్ లు- 3, ౧౧, ౧౯ లుగా పథకము (Table) నందు సంఖ్యాస్థానములు కుదర్పంబడియున్నవి. వీటి Chemical behaviour ఒకటిగనే యుండును. మరియు alkaline earths అనిచెప్పంబడిన Beryllium, Magnesium, Calcium లు పథకమున ౪, ౧౨, ౨౦ స్థానములుగ నమర్పంబడియున్నవి. ఇవి యెన్మిదిగ్రూపులు. ఈసందర్భమున ఎలిమెంట్సు ఎనుబదియెన్మిది (88) కన్గొనంబడినవి. ఇంకను నాల్గుదొరకు సూచనలు కలవుగాన రసాయనశాస్త్రవిదులు ఎలిమెంట్సు ౯౦ అని కొందరును ౯౨ అని కొందరును వాడుచున్నను నిది యభిప్రాయభేద మెంతమాత్రము కానేరదు.

## ఎల్జిన్‌మార్బెల్సు - పూర్వోత్తరము

(Elgin marbeles). ఇవి గ్రీసుదేశపుఁబనికి సుప్రసిద్ధములుగఁ జెప్పంబడుచున్న మార్బెలు రాతివిగ్రహచిత్రములు. కడునేర్పరితనమును సౌందర్యమును ప్రదర్శించు చక్కనిపనితనము, పని

వాంఛశాస్త్రజ్ఞానమును తెల్పుచుండునవి. వాటిం గాంచినవారు Chief golry of Greek art అనుచున్నారు. ఆదిని Phidias పండితుఁడును నేర్పరులగు నాతని శిష్యులును జేసిన విగ్రహ చిత్రములు.

తొల్లి పందొమ్మిదవశతాబ్దపు టాదికాలమున గ్రీసుదేశము టర్కీకి వశమై దానిచే నాక్రమింపంబడి పాలింపంబడుచుండినకాలమునఁ దురుష్క పరిపాలకుం డొకఁడు ఆతెన్సునగరమందలి అక్రోపోలిస్ భవనమున వసించువాఁడు. ఒకతఱి నాతని మార్గమున కాటంకముగనుండి యాతనికి దెబ్బ తగులుటం గినిసి యందలి చిత్రకలాప్రపూర్ణము లనం దగిన మార్బెలువిగ్రహములం దీయించి పారవేయించం దలంచెనఁట. అట్లు వాటినాశన మాయత్తపడుచుంట యెఱిగి స్థంబూల్ (అప్పటి కాన్స్టాంటినోపిలునగరమున బ్రిటీషు ఎంబేసిడరు పదవియం దప్పుడుండిన Earl of Elgin ప్రభువుగారు దాని నెఱింగి బ్రిటీషుప్రభుత్వమును ప్రోత్సహించి డెబ్బదియైదువేల పౌనుల కాబొమ్మల నన్నిటింగొని యింగ్లాండున కంపి బ్రిటీషు మ్యూజియమందుండఁజేసెను. అది నాటినుండియు ఎల్జిన్ మార్బెల్సనంబడుచు బ్రిటీషుమ్యూజియమ్ ప్రాముఖ్యత నధికపర్చియున్నవి.

**ఎవాయిర్డుపోయిస్ తూనిక**-(Avoirdupois weight) ఇది ఆంగ్ల (అలోపతీ) వైద్యమున నోషధులు (drugs) తూచుకొనుట కుపయోగించుచున్నారు. (మందులు తూచుకొనుటకు కాదనిభావము). (అపోతెకేరీస్ వెయిట్ చూడుడు).

౨౭౧౧ ౩౨ గ్రెయినులు—ఒక డ్రాము (drachm or dram)

౧౬ డ్రాములు—ఒకఔన్సు (ounce దీనిగురుతు o. Z. ఇది $2\frac{1}{2}$ తులములు తూగెడిని.)

౧౬ ఔన్సులు—ఒక పౌండు లేక పౌను (Pound దీనిగురుతు. ఇది ౪౦ తులములు తూగెడిని)

౨౮ పౌనులు—ఒకక్వార్టరు. (quarter దీనిగురుతు)qr. ఇది ౨౮వ పౌనులు తూగెడిని.)

౪ క్వార్టరులు—ఒక హండ్రెడ్వెయిటు. (hundred weight. దీని గురుతు C. W. T. ఇది ౧౧౨ పౌనులు తూగెడిని.)

౨౦ హండ్రెడ్వెయిటులు ఒక టన్ను. (Ton, ఇది ౨౨౪౦ పౌనులుతూగెడిని.)

ఇంకను పౌనును ఎల్బిపౌనని వాడుటయుం గలదు. ఇంక నీతూనికలే సర్వసాధారణముగ వర్తక సంబంధమునను వాడుచున్నారు.

**ఎస్కలేటర్** (Escalator) (1 సం. 518 పుటలోని తరువాయి)—ఇది సర్వదా యెత్తున కెక్కుచుఁ బల్లమునకుం దిగుచుండు సోపానముల వరుస. ఒకమెట్టుపైనిలువంబడిన నదియె పై కెక్కుచుండునది. ఇక్కాలమున లండన్ నగరమునం దెల్ల దెసలకుంగల భూమికిక్రింది యినుపబాటల (under ground Rail) స్టేషనులం దిగుతావు లందు నిర్మింపంబడి చక్కగాఁ బనిచేయుచున్నవి. ఆదిని వీటియందు సోపానములు లేకుండెనఁట.

ఎస్కలేటరు మినిటునకు నలువదియడుగు లెక్కుటకుగాని దిగుటకుగాని ప్రయాణము చేయుచుండును. తొందరపనులుకలవా రింకను త్వరితగమనమునకుగా నాసోపానములపై తామును ముందునకు నడచుచుందురు. ఇందువలన దానిగమన

మటుండ వారినడకగమనమును నంమఁ జేరుచుం డును. ఇవి కడుసౌఖ్యప్రదములనియు, క్షేమంకర ములనియుఁ దలంపంబడుచున్నవి. క్రొత్తవారలు బెదర నక్కరలేదు.

## ఏజంతువు విష మాజంతువునకు బాధకరము కానేరదు—

నైసర్గికముగ నేజాతిజంతుశరీరమునం దేర్పడినవిష మాజాతిజంతు శరీరముల కనుకూలమైనదేయని తోఁపకపోదు. ఏలనన నిది యన్యజాతిజంతు (శరీరముల) వుల నుండి కల్గఁబోవు బాధల నెదుర్కొన నొక యాయుధమువలె నాజంతువుశరీరమునం దేర్పడి నిల్వయుండునది. పాములు దురహంకారమున తమతోకనే కఱచుకొనుటఁ బెక్కండ్రెఱింగియె యున్నారు. అట్టి తోకకొనముక్క పోయిన పాములు గాననగుచుంట సర్వసాధారణమే. అట్టి తఱి వాటి కేప్రాణాపాయము కల్గకుంట యిందుకు నిదర్శనము. తేనెటీగలు తమలోఁ దాము కల హించుకొనిన బాధకల్గునట్లు తెలియఁబడలేదు గాని యన్యులం గఱచినచో బాధకల్గుననుట యెఱుంగుదుము.

ఏజంతువువిష మాజంతుశరీరమున కపాయమే యగునేని యాశరీరమునం దుంటయె యసంభవ మగుగాక.

## ఏటోమిక్ - నంబర్ (atomic number)—

కాలము (period) ననుసరించి విభజింపం బడినట్టి రెండువరుసలందున్న వేర్వేరు ఎలిమెంటు, ఒకేపదార్థమునుండి యాదినుండి వేర్వేరుకాలము లందు వేర్వేరు పరిస్థితులలో నొకటితరువాత నొక టిగఁ గల్గింపంబడినటుల గాననయ్యెడింగాని వేర్వేరు పదార్థములనుండి వేర్వేరెలిమెంట్సు కల్గినవనిచెప్ప వీలుగానరాదు. వాటి కాదికాలమున నైరోపారసా యనశాస్త్రవిదులు Protyle అని వాడుచుండి రని తెలియనగుచున్నది. ఈయెలిమెంట్సు లాగా అని కొందరును ౽౨ అని కొందరును నభిప్రాయపడు చున్నారు. అవి యొకదానిపోలిక వేరొకదానికి లేనివిగ నుండును. ఇట్లయ్యు నన్నియు నాది నొకే పదార్థమునుండి కల్గినవిగఁ జెప్పంబడుట విచిత్ర మనిపించకపోదు. (ఎలిమెంట్సు గ్రూపుని చూడుడు.)

కాలములవరుస నేర్పరుపంబడిన యీయెలి మెంట్సుపథకములందు (tables) వాటి కొక్కొక్క సంఖ్య (number) ల వరుస యమర్పంబడి యున్నది. అది యాపథకమునం దాయెలిమెంటు యొక్కతావును వివరించుంగాని దాని యేటోము యొక్క బరువు మొదలగు వేటిని వివరింపదు. దాని కాంగ్లరసాయనికశాస్త్రమున atomic number అని పరిభాషాపదనామ మిడి వాడు చున్నారు. వీటియుపయోగములు మూడు కలవు. ౧. ఏగ్రూపునం దేపీరియడ్ (period) నం దది స్థానమీయంబడినదో వాటింబట్టియు నచటఁ గాన నగు నితర యెలిమెంట్సుతో దానికిఁగలసంబం ధానుబంధములంబట్టియు నం దే యే chimical properties ఉండునో తెలియనగుట. ౨. ఆయెలిమెంటుపరిణామవిధానమున (in the proces of evolution) వేరొకయెలిమెంటున కంటెఁ బూర్వముననో తరువాతనో యెట్లు చేయం బడి యేర్పడియెనో దానిం దెలియ మార్గముం జూపుట. 3. ఎలిమెంటుయొక్క యేటోమిక్కునంబ రెంతో యన్ని యేటోము లాయెలిమెంటునం దుం డుననిఁ దెలియనగుట.

ఇందునకు సాదృశ్యముగ నేటోమిక్కు నంబ రొకటిగఁగల హైడ్రోజెనుయొక్క న్యూక్లి యసునం దొకయెలక్ట్రెను కదలుచు దాని యేటో మునం దుండును. అట్లె రెండు సంఖ్యగాఁగల

హీలియము. ఇట్లే రెండు ఎలక్ట్రోన్సును, ఎన్మిది సంఖ్యగల ఆక్సిజను ఏటోము న్యూక్లియసునం దెన్మిదియేటోములును నుండునని యెఱుంగనయ్యెడిని. మరియు లోహములందుఁగూడ నిట్లెయగును ఇరువదియారవసంఖ్యగల యినుము(iron) నందలి యేటోమున్యూక్లియసునం దిరువదియారు ఎలక్ట్రోన్సును డెబ్బదితొమ్మిదవసంఖ్యం దనరు బంగారము (Gold) నందు డెబ్బదితొమ్మిది యెలక్ట్రోనులును కలవని తెలియ నయ్యెడిని.

## ఏటోము మొలక్యూల్సులను ఎలక్ట్రిసిటీచే భేదించుట— Laws of Decomposition of atom molucules by electricity)

సర్ హంఫ్రి డేవీ(Sir Humphry Davy) పరిశీలకుఁడు ఎలక్ట్రిసిటీప్రవాహమును రసాయనశాస్త్రమున కుపయోగింపంజేసినవాఁడు. ఆయనశిష్యుఁడై సహాయకారిగనుండిన Faraday పరిశీలకుఁడునై యున్నాడు. అందు ఫరాడెగారి తండ్రి యింగ్లాండుదేశమున వెస్టుమూర్లాండుసీమయందుఁ గమ్మరపనివాఁడుగా నుండెనఁట. బాలుఁడగుఫరాడేగారు కొంతకాలము పనిపాటలం జేయు errand boy గా నుండెనని చెప్పంబడియున్నది. ఈమహాపండితుఁడే యెలక్ట్రిసిటీ ప్రవాహశక్తిని కార్యోపయోగమునకుం గుదిర్చిన పరిశీలకుఁడు. అతఁడు చిరస్మరణీయుఁ డగుగాక. దీనింగూర్చియె పిదపకాలమున Faraday revealed the nature and behavionr of matter అనునుక్తి యేర్పడినది.

ఈ మహామహుఁడు "when atoms and molecules of different elements of Ox gyen-Hydrogen of carbon or Iron or nitrogen were built up into compounds so firmly that it seemed as if nothing would burst them asunder Electricity would rend them apart" అను సంగతిం గన్పెట్టి యీ ధర్మము నేర్పర్చెను. ఆపరిశీలనలం దవి యెట్లు చేయఁబడును? ఏల చేయంబడు ననుప్రశ్నలకుఁ బ్రత్యుత్తరము లేర్పడియెను. వారిధర్మములకు The Laws of Decomposition by electricity అని పేరు గల్గెను. అనగా నెలక్ట్రిసిటీతో భేదించుధర్మము అనిభావము. కాని వాటికాయన Electrolysis అని పేరిడియుండెనఁట. నేటికిని రసాయనశాస్త్రవేత్త లాయనధర్మములను "The wonderland where force and matter meet" అనియు వాడుచున్నారు. అవి యేటోమ్సునందు ఎలక్ట్రోన్సు లేక electric ions electric atoms or electrons) కలవని వెల్లడించినవి. అనగా Part of atome of matter అని యెఱుంగునది. వీరి పరిశీలనలు విద్వాంసులను matter - matter గా నుండక ఎలక్ట్రిసిటీయైన తావునకుం జేర్చినవని ఛలోక్తిగా ననుచుందురు.

## ఏటోమ్సు ఎలక్ట్రోన్సు:— (Atoms, Electrons)

తొల్లి యొకప్పుడు కలసియుండిన పరమాణు సముదాయమునకు మొలక్యూల్సు (molecules) అనియు వేర్వేరుగ నుండిన పరమాణువులకు ఏటోమ్సు (atoms) అనియు నాంగ్లరసాయనశాస్త్రవిదులు పేరిడిరి. ఆగ్రంథములందు The molecule of any kind of matter eithor solid, or liquid or gas was the smallest possible amount that could exist as a combination and that an atome was the smallest possible amount that could stand alone అని నిర్వచింపంబడియుండెను. పిదపశాస్త్రజ్ఞులు విద్యుచ్ఛక్తి (electricity) నెఱింగినకతనఁ గొన్నివింతలు గాననైనవి. మాలెక్యూ

లుల స్థానమును న్యూక్లియస్ (nucleus) ను, ఏటోమ్స్థానమును ఎలక్ట్రోను (electron) లును ఆక్రమించినవి. ఏటోమునం దించుమించు లక్ష భాగములలో నొకభాగముగ ఎలక్ట్రో సుండునని తెలుచుః దలంపంబడుచున్నది. ఒక్క హైడ్రోజెను ఏటోమునం దొకే ఏటోముగల న్యూక్లీస్ కలదనియుః దక్కిన వేర్వేరు ఏటోమ్మునం దధికముగ నుండుననియు బయల్పడినది. ఇంతియెగాక నొక ఏటోమునందే పోజిటివ్, నెగటివ్, (Positive & Negative) విద్యుత్ప్రసారములు కలవని బయల్పడినది. ఎలక్ట్రిసిటీ యొకపదార్థము కాదనియు నది యాశక్తియొక్క ప్రవర్తనవిధానమనియు మనస్సునం దిడుకొని యవిదాని కెదురుదాని నాకర్షించుచుండునను ధర్మమును మనసునం దుంచుకొనిన చక్కఁగఁ బరిశీలింపనగుచువీటిరహస్యము తెలుఁగ నయెః (ఆటోమిక్ నంబరు చూడుడు.)

**ఏనిమల్ మిల్కు వెజిటెబుల్ మిల్కు భేదము**— Animal milk & vegetable milk) ఆవులు, గేదెలు, ఒంటెలు, ఏనుఁగులు, మేకలు, గొఱ్ఱెలు మొదలగునవి పాలిచ్చుజంతువులు. వీటిపాలు ఏనిమల్ మిల్కుఅనియు, కొబ్బరిచెట్లకాయలం జితుకం గొట్టి పిండినపాలు మొదలగువాటిని వెజిటెబుల్ మిల్కుఅనియు వాడుచుందురు. మిల్కు (milk) అనినపాలని యర్థముఁ జెప్పుట కేయాటంకము లేకున్నను వెజిటెబుల్ మిల్కు అనంబడునవి నిజమున క్షీరములు కానేరవు. అవి రసములనుట సమంజసముగాకున్న పాలు అనుట సారూప్యధర్మనామమని తలంపవలసియుండును.

అట్లగుచోః దురుష్కులటోపి ధరించినవారి నెల్లరను మహమ్మదీయులుగను, ఐరోపావారి Hat టోపీలం ధరించినవారిని యూరోపియనులుగను నెఱుఁగుటవంటిదే యగును. ఆదిని భరతదేశఁపుటార్యులు, ఏనిమల్ మిల్కనంబడినవాటికి క్షీరములనియు వెజిటెబుల్ మిల్కనంబడినవానిని ఫలరసములలోఁ జేర్చియు సంస్కృతమున వాడియున్నారు.

**ఏడువారములు**— వారములు ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శనివారములని యేడువారము లనాదిగ భరతదేశమునందు వాడుకయందుంట యెల్లరెఱింగినదే. ఇవి భరతదేశమునం దాదేశఁపు జ్యోతిషశాస్త్రములోఁ బ్రారంభమై నట్లగుపడెడిని. ఏలనన నాదివారమును కాదిత్యవారమనియు, భానువాసరమనియుఁబేర్లుగాన నది సూర్యగ్రహమునకుం బ్రీతికరమైన దినమనియు, సోమవారము చంద్రునకుం బ్రీతిదినమనియు, మంగళ లేక భౌమవాసరము కుజుఁడు (లేక అంగారకునకుః) బ్రీతిదినమనియు, బుధ లేక సౌమ్యవాసరము బుధునకుం బ్రీతికరమైన దినమనియు గురు లేక లక్ష్మీవారము గురుఁడు లేక బృహస్పతికిః బ్రీతికరమైన దినమనియు, శుక్ర లేక భృగువాసరము శుక్రునకుం బ్రీతికరమగు దినమనియు, శని లేక మందవాసరము మందగమనముఁ గలవాఁడగు శని లేక శనైశ్చరునకుం బ్రీతికరమగు దినమనియు, వారిపేర్లం బరగుచున్నవి. ఇంకం గ్రైస్తవులగు ఆంగ్లేయులును వీటిని Sunday, Monday, Tuesday, Wednesday, Thursday, Friday, Saturday యని వాడుచున్నారు. ఈపేరులును పైగ్రహనామసంబంధములేయని పరిశీలించినం దెలియంగలదు. ఐనను కొందరు క్రైస్తవులు తమమతావేశపూరితులుగాన బైబిలునందుః బరమేశ్వరుండగు జహోవా-ఆరుదినములందు సృష్టిం బూర్తిఁజేసి యేడవదినంబున విశ్రాంతిం (సబ్బాతు) గొనెంగాన దానింబట్టి యేడువారము (week days)

లేర్పరుపంబడిన వనెదరు. పరిశీలించిన భరతదేశంపు గ్రంథములందుఁ గృతయుగమునాడే ముహూర్త విచారణయం దీవారములు గ్రహసంబంధములుగ వాడంబడినవిగఁ జెప్పంబడుటయుఁ ద్రేతాయుగము వారగు శ్రీరామ రావణాదులు ముహూర్తము లం బరిశీలించుచో గ్రహసంబంధములుగ నెంచి నటుల రామాయణాదిగ్రంథములందు వాడియుం టయుఁ గాననగుచున్నను దానిం దెలియక బైబిలు నందు వివరింపంబడినరీతి ననుసరించిన వనెదరు. బైబిలుకాలముం బరిశీలించిన నిందలిస్థితి తెలియ గలదు. ఇంక మహమ్మదీయుల వారములపేర్లు వేరుగనున్నవి. వారి ఖురానునందలి పేర్లకు వీటికిం గలసంబంధముఁ దెలియ దుర్భేద్యముగనుంట నది వేరువిధానమనియె చెప్పఁగుముగాక.

త్రము— ఇది యాదికాలమున సుప్రసిద్ధశివక్షేత్రముగ నుండినది. అక్కాలమున నట ప్రధానదేవళముగనుండిన సోమేశ్వరశివలిం గమునుండి పరమేశ్వరప్రసాదసంభూతుఁడుగ రేణు కారాధ్యుఁడను మహాభక్తుం డుదయించి, పెక్కం డ్రకు శివభక్తిం గఱపి, దక్షిణదేశమున కరగిన యగస్త్యునకు శివదీక్ష నొసంగి, పంచాక్షరీమహా మంత్ర ముపదేశించి శివైక్యముం జెందెనని చెప్పం బడియున్నది.

పిదప నీయైపురశివక్షేత్ర మనేకమార్పు లకుఁ బాలై పాడై దీనదశంజెంది జైనక్షేత్రమై కొలనుపాకయనంబడు గ్రామ మట నేర్పడి యది యుంగూడ మార్పునంది కొల్లిపాక యనఁబరగుచు నిప్పుడు జైనక్షేత్రముగ నేర్పడి H. E. H. The Nizam Dominians లోనిదిగ నేర్పడి నైజాంస్టేటురెయిల్వే ఆలీరుస్టేషను పరిసరిసరముల నున్నది. (కొలనుపాకక్షేత్రము చూడుడు.) ఇచటి సోమేశ్వరశివలింగ మట్లెయున్నదిగాని. దీనా వస్థంజెంది జైనక్షేత్రముచాటున నిలచియున్నట్లు గాననగును. శైవపంచకమనుగ్రంథమునఁ బ్రశం సింపంబడిన ఐపురశివక్షేత్ర మిదియెయని బయ ల్పడుచున్నది. ఇంతదనుక నీక్షేత్రంపుటాదినామ మును బ్రజలు మఱచిపోయిరని తలంపంబడు చుండెను. (శైవపంచకము చూడుడు.) దీని కొకప్పుడు (బహుశః జైనుల యధికారకాలమున నేమొ) బింబావతీపురమనియుం బేరుండెనఁట. బింబావతీదేవి జైనశక్తి గానోపు.

## ఐరావతీనది - బర్మాదేశము

ఐరావతీనది బర్మాదేశమున కాధారభూతము. ఇందు సంగమించు చుండ్విన్‌నదియు నాదేశంపుదూర్పు భాగమునఁ బ్రత్యేకనదిగాఁ బ్రవహించుచు బంగా ళాఖాతమునం గలియు సాల్వీనునదియు దేశంపుఁ బంటల కాధారములై యుంటయేగాక దేశమునం దుత్తరదక్షిణముల రాకపోకలకైన ముఖ్యమార్గ ములై యున్నవి. వీటియందుఁ బ్రధానజలమార్గ మగు నైరావతీనది యుత్తరదక్షిణములకు భామో నుండి మాండలే, రంగూన్‌లమీదుగా ముఖ్య ద్వారమున సముద్రమునకు వేయిమైళ్ళదూరము పెద్దపొగయోడలు పోఁదగిన లోతు వెడల్పులం గల్గి యనాదిగ జలమార్గమై దనరుచు నిక్కాలమున బ్రిటీషుపాలనమున వేయంబడిన యినుపదారి చక్కఁగఁ బనిఁ జేయుచున్నను నుపయోగముం గోల్పోవక రాకపోకలకు, వర్తకమునకు ముఖ్య ముగఁ గలపతెప్పల రాకపోకల కాధారమై యున్నది.

ఉత్తరమున టిబెట్టుదేశంపుఁగొండలలో నెచ్చ టనో తెలియఁబడనితావులందు జన్మించిన మా యీఖా-మాలీఖా- లనంబడు రెండునదులసంగ మముకడనుండి యైరావతియని పేరంది దక్షిణ వాహినియై దేశముపొడవునం బ్రవహించుచు

రంగూన్‌నగరమునుండి దిగువ నిరువదియొక్క మైళ్లదూరమున ననేకశాఖలుగ సాగరసంగ మొన ర్చుచున్నది. దీనిని great water highway of Burma అని వాడెదరు. దీని యుత్తరసీమల నుండి కరగించి తెచ్చుచున్న నొండుమట్టితోఁ బ్రపంచమునం దెల్లగొప్పదియగు లంకా (డెల్టా) ప్రదేశము కల్పింపంబడియున్నది. ఈపల్లఁపులంకలు తుప్పడొంకలు బలిసి పులులు మొదలగు నడవి జంతువుల కాశ్రయమై యుండ నైరావతి లెక్క లేనిశాఖలై లంకలగుండా ప్రవహించుచు సముద్ర ముం జేరును. ఈప్రాంతముల చేపలవాండ్రగ్రామ ములు స్తంభములపై నెత్తుగ నిర్మింపంబడుచుం డును. ఈప్రదేశములలో రంగూన్ బేసిన్ పుర ములనడుమప్రదేశములను వరిపొలములుగఁ జేసి పంటం బెట్టుచున్నా రిది గొప్పపంటయనియు నీపురములనడుమ లోతగుప్రదేశఁపుఁజాయగుండా రంగూన్ రేవుకుఁ జేర వీలై యాధాన్యఁపురాశి రంగూనున నెగుమతులందు ముఖ్యభాగమనియుఁ జెప్పంబడినది. ఐరావతీనదియందుఁ దిరుగు ముఖ్య మగు పొగయోడలకంపెనీ కై రావతీఫ్లోటిల్లాకంపె నీయని పేరు. వీరియోడలలోఁ బెద్దవి 300 అడు గులపొడవును, ౦౦ అడుగులవెడల్పుం గల్గినవి కలవు. వీటికిందోడు వేలసంఖ్యగా స్వదేశఁపుం బడవలు మనుష్యులను వర్తకపుసరకులను నెక్కిం చుకొనుచు దింపుచు నదేపనిగ నెదురు వాలు సబురు లనుదినముఁ జేయుచునే యుండెడిని. నది కిరుదెసల దూరమునఁ బర్వతపఙ్క్తులు వ్యాపించి యుంటయు వాటినుండి లెక్కలేని సెలయేరులు జక్కెరలు మొదలగు జలప్రవాహము లరుదెంచి యైరావతిలోఁ గలియుచుంట దారిపొడవునఁ గని పించుచుండు దృశ్యమే. ఇరుదెసలనుండు బర్వత పఙ్క్తులకు 'యోమాలనియే' పేరు. యోమాయనిన వెన్నెముకయని యర్థమఁట. నది కిరుదెసల గొప్ప బలమగు మంపుగట్లు వేయంబడియున్నవి. బర్మా దేశమునఁ బెద్దచిన్నపట్టణములు, వర్తకస్థలములు, పెద్దపల్లెలుఁగూడ నదీతీరములందే యుంటఁ గాన నగును. నదికి దూరమున నున్నగొన్ని తావులు నివాసములు నాపరిసరముల సేద్యములకై యేర్పడి నవియేకాని వేరుకావు.

నదియందు జలములు వరదలందు వేర్వేరు కాలముల వేర్వేరుమట్టములుగ నుంట నావేర్వేరు మట్టముల భూప్రదేశము లిరుప్రక్కల నేర్పడి యున్నవి. వీటినుండి జలప్రవాహ మిరుదెసల శాంతస్వభావజలములతోను నడుమ నొకతావున వడిగలప్రవాహముగ నడచుచుండుటఁ జిత్రముగా నుండును. ఆవడిఁగల ప్రవాహ మిటునటు మారు చుంటయుం గలదు. ఒక్కొక్కతఱి దరులందుఁ జేరిన లంకమట్టిం గొసికొనిపోయి వేరొకచోటఁ జేర్చి లంకను బెంచుటయుం గాననగుచుండును. నదిపై నడచునోడలలోఁ గొన్ని బజారుదుకాణము లుండును. అవి యాగిన గ్రామములవారు కొను గోలువ్యాపారముల నెఱపుచుందురు. వాటియందు భోజనసామగ్రిలు, కూరగాయలు, సాపుసామా నులు, బట్టలుకూడ నుండును. వీటియందు షాను జాతివారు నౌకరులుగ నుందురు. ఉత్తరఁపుటడ వులనుండి దక్షిణమునకు రంగూనునకు నితరదేశ ములకు వరదకాలమునఁ గలపతెప్పలు విస్తారముగ నడచుచుండును. అందుఁ గొన్ని చాల పెద్దవిగా నుండి, వాటిపైనుండు నౌకర్లుమొదలగువారికై నిర్మింపంబడుగుడిసెలు, పాకలు నొకగ్రామమువలెఁ గాన్పించెడిని. ఒక్కొకచో నది యొకపాటిసరస్సు వలె వెడలుపగుతఱి నడవిబాతు లందు విశేష ముగఁ జేరియుండెడిని. వేరు కొన్ని తావుల నదియం దిసుకను పైకి యంత్రములగుండా తోడి యందుం గల బంగారుతగ్రసరేణువులఁ (ఇసుక) గావించు నేర్పాటులు గాన నగును. ప్రవాహజలములలోని

బంగరు ఇసుక యెక్కడనో తెలియంబడని తావుల నుండి కొట్టుకొనివచ్చునఁట. దేశమం దిట్టి యిసుకం గడగుకొనుచుండు వృత్తియె కలవారు కొందరు కలరు.

ఐరావతీనదియొక్క పెక్కు భాగములందు, అందు ముఖ్యముగ నడవులసమీపములం దుదయకాలములందు దట్టమైనపొగమంచు గ్రమ్ముచుండును. అత్తఱి నోడలం దున్నవారికి దరినున్న వెవ్వియుఁ గానరాక వారాడుమాటలు, చేయు ధ్వనులు చక్కఁగ విన్పించుచుండుటఁ జిత్రమై తోఁచెడిని. నదీజలము లద్దముంబోలి నిలచియున్నట్లుండుట నద్దరినున్న దృశ్యములు నీటియందుఁ బ్రతిబింబించి స్పష్టమై వ్రాయంబడిన చిత్రపటమునందువలెఁ జక్కఁగఁ గాననగుచుండును. దూరముగ నవ్వలివ్వలి యోమాపర్వతముల పై భాగములందుఁ జేరుకొనిన పొగమంచు మేఘములవలె నట వ్రేలాడుచుండు దృశ్యము నీటియందుఁ బ్రతిబింబించి యద్దమునందువలెఁ గాన్పించుటఁ జూచితీరవలయుం గాని వ్రాయవీలు గాకుండెడిని. నిప్పు రగులంబెట్టిన ప్రతితావునుండి పైకి లేచు పొగ శీతవాతావరణమునఁ బలుచఁబడుచున్న మంచునందుఁ గదలక నిలచి యున్నపొగకంబమువలెఁ దిన్నగ వంకరలులేక నాకసముదెసకుం జనుచుండు వింతదృశ్యము వర్ణనాతీతమై యుండెడిని. ఇట్టి ధూమస్తంభములు పొగయోడల చిమ్నీ గొట్టములనుండియుఁ గలపదూలముల తెప్పలపై రగులఁబెట్టంబడిన నిప్పులనుండియుంగూడ నొకే రీతిం గాన్పించెడిని. గ్రామములనుండి చెప్ప నక్కరయే యుండదు.

మాండలేపురమున కుత్తరముననున్న నైరావతీనది కోసికొనివచ్చిన కోతలోవయం దీనదీసౌందర్యచిత్రి మద్భుతముగా నుండును. నదీప్రవాహము కొండలయిరుకున నతిసన్నముగ నొక్కంబడియుంటయు నొక్కొక్కతావున నిరుదెసలందు ౮౦౦ లేక ౧౦౦౦ అడుగులయెత్తునకుంగూడఁ గొండ ప్రక్కభాగము లాకసముదెస కెదిగి యెగసినట్లుంటయు నుదయకాలములం దత్తఱిఁ బొగమంచు మేఘములంబోలి యుభయతీరములందుఁ బర్వతాగ్రములంబట్టి నిలచియుంటయు నదియందు వంకరలుండినతావుల "ఇఁక ముందునకుం జనవీలులేదు" అనునటుల దారి మఱుగుపడి పర్వతపార్శ్వారణ్యములన్నియు నేకమై కలసిపోయియున్నటుల ముందుదారి గానరాకుంటయు నోడలలో నుండువారికీనదీగమనఁపుంగుటిలతలు చెప్పనలవిగాని యాతురతం గల్గించుచు వర్ణనాతీతములుగ నుండెడిని. ఈ ప్రదేశమున నడవిచెట్లయాకులు దట్టమై బలముగల రంగుం గల్గియుంటయు రాళ్ళసందులు మొదలగు నిరుకుప్రదేశములన్నైత మడవిచెట్లు పుట్టి బలముగఁ బెరిగి వలమైయుంటయు లతలు మిక్కిలి పొడవునకుం బ్రాకుచు బద్దుకట్టె చక్కఁగ బలసి పూలంబూసియుంటయు శోభాయమాన నేత్రోత్సవకుతూహలమై నైసర్గికసౌందర్యలక్ష్మియుద్యమించిన ప్రదేశమోయనం బరగుచుఁ బొగయోడకు రెండుగంట లాలోవలోఁ గడిచెడిని. పెక్కండ్రీనైసర్గిక సౌందర్యములంజూడఁ బొగయోడలలో నేతెంచి దీనిం గాంచి మరలిపోవుచుందురు. ఇది మఱువరాని దృశ్యము. నదికిం బశ్చిమతీరము నంటియె కిరసనైలుగను లున్నప్రదేశము కలదు. (బర్మా ఆయిల్ ఫీల్డ్సు చూడుడు.)

భామోపురముదనుక రంగూనునుండి వచ్చిన పొగయోడలు పిదప నదికాలోతు చాలమి నుత్తరమున కెగువ కరుగఁజాలవుగాన నటనుండి దేశఁపుఁ బడవలలో రాకపోక లొనర్చుచుందురు. ఎగుమతి దిగుమతులును వాట్లయందే నడచెడిని. భామో చీనాసరిహద్దుననే కలదు. చీనాదేశఁపుఁబురములవలెనె యుండును. తెయిపింగునది యటనే కల

దద్దాని కవ్వాలనేయున్న దేవళసముదాయము బర్మా వారినిర్మాణమే యందు రది చీనావారిదై యున్నది. వర్షకాలమున (అనగా మే-జూన్- జూలై - ఆగస్టు సెప్టెంబరు - లైమనెలలు) ఐరావతీనదియందు జలము లేబదియడుగుల యెత్తునకుం బొంగియుండును. అంచులమెయ్యా ప్రవహించుచు భయంకరమై పలుతావుల నదివెడలుపు రెండుమైళ్ళుండునని తోపంజేయుచు ముఖద్వారముకిడ నున్న లంకల నించుకఁ బెంచుచుండును. (బర్మాదేశము చూడుడు.)

**ఒకపాత్రలో నీటియందుఁ జేపలు బ్రతుకఁజాలక పోవుట**— చేపలు నీటియందు బ్రతుకునని యెల్లరు తలంతురుగాని దాని కితరపరిస్థితులుకూడ కలవని తలంచువా రరుదు. ఒకప్రవాహమునందో యొకపెద్ద జలనిలయమునందో యుదకమునఁ గరగిన ఆక్సిజెను వలసినంతఁ గల్గుచుండుంగానఁ జేప లందు జీవింపఁ గల్గును. ఒకపాత్రయం దట్టివీలుండదు. అవి పీల్చి కాల్చిన (ఊపిరితీసిన) ఆక్సిజెను తరిగిపోవుచుండుంగాని తిరుగ నందుఁ జేరుచుండుటకు వీలుండదు. వాయువునుండి ఆక్సిజెనుఁ బీల్చి కాల్చు జీవజంతువులవలెనే (ఒకగాలి వీచనిగదియందు మూయఁబడినట్లు) చేపలును నొకపాత్రయం దుంచంబడిన తఱి నందలియాక్సిజె నయిపోవఁగనే చచ్చి పోవలసి వచ్చును. అవి యింకను జీవించుచుండవలెననిన నాపాత్రలోని కొక జలప్రవాహమును వదలి యందలి ప్రాతజలములు వెడలిపోవుమార్గ మేర్పర్చ వలసి యుండును.

**ఓజోను (Ozone)**— ఇది ఆక్సిజెను యొక్క వాయురూపము. దీనిమొలక్యూలునందు మూఁడాక్సిజెనుపరమాణువులుంట నాంగ్లరసాయన శాస్త్రవిదులు దీనికి o z. అను సంకేత మిడి యున్నారు. Blue రంగుగా నుండునది. క్లోరైను లేక వెల్లుల్లివంటి వాసనఁ గలది. దీనిం గాచిన నాక్సిజెనుగా మారిపోవును. ఆదిని నిది సముద్రతీరములం దుండునని తలంపంబడుచుండినది. ఆకాలఁపుఁ బండితు లిది యురుములు- పిడుగులు గల తుపానుకాలమున (Thunder storm) విద్యుచ్ఛక్తి వలన నిర్లేర్పడునని తలంచుచుండిరి. పిదప National Institute for medical rese-rch కిం జెందిన రసాయనశాస్త్రజ్ఞుఁడగు Ben-Jamin moore పండితునిపరిశీలనలం దోజోను సముద్రతీరములం దుండదనియు నిది బలమైనవెలుతురుచే నిట్లగుననియు సముద్రతీరములందుండునది Nitrogen peroxide అనియు నదియు gas యెననియు బయల్పడియెను. ఇక్కాలమున నోజోన్ రసాయనశాస్త్ర మెఱింగినవారిచే విస్తారముగఁ జేయంబడుచు నూనెలను పరిశుద్ధిఁ జేయుట కుపయోగింపంబడుచున్నది. ఇంకను మైనము, ఏనుఁగుదంతము దీనిచే శుభ్రమగును. నీటిని steritise చేయుటయం దుపయోగింపఁ గలదు.

**ఓర్పు- (ఓరిమి) సహనము - అసూయత**— ఓరుపు లేక ఓరిమి, ఓర్చుచునూరకుండి నిరీక్షించుట. సహనము, అన్యులశ్రేయస్సు మతధర్మము మొదలగునవి తనవి కాకుండియు నొక్కొక్కతఱిఁ దన్నతిశయించుచున్నను నోర్చియుండుట. ఇంక నసూయతయన నోర్వలేమి. ఇం దోర్పు కార్యనిర్వహణమునకు మార్గముగను, సహనము సర్వజనరంజకమగు సౌఖ్యమార్గముగను, నసూయత లోకవిరోధకారణముగను లోకనీతియందుఁ దలఁపఁబడుచున్నవి. అందుఁ గడపటిదగు నసూయత మనస్సున కంటునదనియుఁ దననే బాధించుచు మనస్సుం గలవరపరచునదియనియుఁ దత్త్వవేత్త లనెదరు.

అన్యమతధర్మములు, ఆమతస్థులు వాటి నాచరించుట, వీటియందు సహనము లేకుండుట, అసహన మనంబడును. అది యోర్వలేనితనము. దానినే అసూయత యనందగును. వారిది తన మతము కాకపోవచ్చును. తన కామతవిధానమున నమ్మకము లేకపోవచ్చును. అందఱికి సాముదాయకమైన జగత్తునందుఁ దనకున్నహక్కువంటి వన్యులకుంగూడఁ గలవని తలంచుట ధర్మమగును. తలంపకపోవుట యధర్మమని వేరుగఁ జెప్ప నక్కరయుండదు. ఇది హిందువుల మతధర్మమునందలి పద్ధతి. బైబిలు నవీననిబంధనయందుఁ గ్రీస్తుప్రభువును నిట్టిదేయగు వేరొకవిధమగు నోర్పును బోధించి యుండెను.

ఓర్పు ఐహికకార్యములందుఁ గార్యసాధకమగును. "ఓర్చినపశువునకుం దేటనీరు (దాహమునకు)" అను సామెత కలదు. త్వరపడకఁ బరిస్థితులనుకూలించుదనుక శాంతముగ నోర్చి కార్యసాధనముం గాంచవలసియుండునని దీనిభావము. ఆముష్మికధర్మములం దోర్పు పరమేశ్వరానుగ్రహమున కోర్చుచు నిరీక్షించుచుంట యగును. అసహనము తగ నిది. అసూయత బాధకరమైనది.

అన్యులదుష్కార్యాచరణమున కోర్చుటయన వానిచర్యలందుఁ దన విముఖత యనిభావము. అది యొకతఱి దానిపరిణామమైన నగుగాక. ఇంకఁ బ్రభుత్వకార్యములం దోర్పు గడుసుతనమైనం గావచ్చును. లేకున్నఁ గార్యసాధనవిధానమైన నయ్యెడిని. ఎట్లైన నన్యులశ్రేయస్సునకు, అభ్యుదయమునకు నోర్చుట సహన మనంబడుచుఁ బ్రపంచమందలి గొప్పసద్గుణములలో నొకటిగఁ జెప్పంబడుచుండునది.

**కంచి కైలాసనాథ దేవాలయ కట్టడము:—** ఇది సుప్రసిద్ధకాంచీపురంపు నూరివెలుపలఁ బశ్చిమదిశను గీతాభాష్యమతమున కవ్వలనున్న పాడుదేవళము. ఇప్పు డర్చనాదు లిందు జరుగుట లేదు. ఆర్కియాలోజికల్ డిపార్టుమెంటు వారి స్వాధీనమునం దున్నది. ఇది యంతయు దిబ్బ (పాడుదిబ్బ) క్రిందఁ జేరియుండ వారు త్రవ్వించి బైలుఁదీయించి బాగుచేయించుచున్నారఁట. సుందరవంతమైన పురాతనపుపని. ఈదేవాలయకట్టడము కంచిప్రాంతముల సుప్రసిద్ధమైనది. క్రీ. వె. 500 మొదలు 900 వరకును దక్షిణహిందూదేశమునఁ జోళరాజ్యమును పల్లవరాజులు పరిపాలించిరి. అందు ముఖ్యముగ మహేంద్రవర్మ, రాజా సింహవర్మయనువారు గొప్పనిర్మాతలని ప్రసిద్ధి వడసిరి. అందు మహేంద్రవర్మ సముద్రతీరమున నేడు దేవాలయములను నిర్మించె నందురు. రాజా సింహవర్మ తన రాజ్యమున ననేకస్థలములలో ననేకదేవాలయములను నిర్మించుటయేగాక, కంచియం దీసుప్రసిద్ధకైలాస నాథదేవాలయమును నిర్మింపం జేసెనని యిటీవలిపరిశీలనలు బయల్పడఁ జేయుచున్నవి.

## కండక్టర్సు ఆఫ్ హీట్ చేయుపని—

The work of conductors of heat.

ఇట 'కండక్టరు' అనిన నాకర్షించునదియనియర్థము. వేడి నాకర్షించుటయని భావము. దీని కుదాహరణములుగ మార్బెలురాయి, ఇనుము, వస్త్రము, కఱ్ఱలను గైకొందుముగాక. మార్బెలు రాతిబల్లనంటి యూరవేయంబడిన తడి వాలును, కఱ్ఱపిడి కమర్పంబడిన కత్తియు నొకేవిధముగ శీతోష్ణస్థితి (same temperature) నంది యుండునని తలంతుము. అట్టితఱినైనను మార్బెలురాతిం దాకి చూచినఁ జేతులకుందగిలినంత చల్లగాఁ దడితువా లుండకుంటయుఁ గత్తిం దాకి చూచిన తఱిఁ దగిలినంతఁ జల్లగాఁ బిడిందాకి చూచిన లేకుంటయు వింతగఁ దోపక మానదు. ఐనను దీనికిం గారణము మార్బెలురాయియు నినుమును

good conductors ఆఫ్ హీట్ లగుటం జేసి తాకిన చేతులనుండి వేడి (వెచ్చఁదనము) నతిత్వరితముగ నాకర్షించుకొనునవిగానఁ చేతికిఁ జల్లగఁ దగిలెడిని. ఇంక బట్టయు, కఱ్ఱయు bad conductors of heat గాన నవి యంతఁ త్వరితముగఁ దాకినఁ జేతివేడి నాకర్షింపంజాలకఁ జేతి కించుక వెచ్చనివిగాఁ దగిలెడిని.

మార్బెలును, లోహమును శరీరచర్మముకన్నఁ జల్లనివగుటఁ దాకినయెడనునఁ జల్లఁగఁ దగిలి శరీర చర్మమునుండి వేడి దానిలోనికిం బ్రవహించుట సహజ మనిపించకపోదు. అవి యొకటెంపరేచరునం దున్నను శరీరమునకుఁ జల్లగనె తగిలెడిని. కాని కఱ్ఱ బట్టలస్థితి యట్టిది కాదని యెఱుంగందగును.

## కండ్లుతిరుగుట(Vertigo) మూర్ఛ-

చెవులకడనుండు నొకశరీరావయవముం గూర్చి పెక్కండ్రకుం దెలియక పోవచ్చును. దానిపరిస్థితు లనుకూలింపనియెడనునఁ గండ్లు తిరుగును. పిల్లలు తమకుఁ దామె గిరగిరఁ దిరుగుటనుండి యొడలు తిరుగు ననెదరు. అది యాశరీరావయవముయొక్క పరిస్థితులకుఁ జికాకుం గల్గించి కండ్లు తిరుగుటం గల్పించును. ఇది ముదరి యధికమైన తఱి మూర్ఛం గల్గింపనోపునని నీతిరుగుట మేధస్సునకుఁ గండ్లకుఁగల సంబంధము నాపగల్గుననియుఁ దోడనే రెండునేత్రములు కలసి యొక దెసకుం జూచుస్థితి యాగి యేనేత్రమున కానేత్రమే స్వతంత్రముగఁ జూడంగలస్థితి యేర్పడి యవి పద్ధతి లేని విరుగుడు నారంభింప నదియె కండ్లు తిరుగుట లేక యొడలు తిరుగుటగాఁ (Vertigo) జెప్పఁబడు ననియుఁ గన్గొనంబడినది. ఇది యధికపైత్యోద్రేకమునఁ గల్గునని యాయుర్వేదవైద్యు లనెదరు.

పిల్లలు తమకుఁ దామె గిరగిరఁ దిరుగుటనుండి యిట్టిస్థితి కల్గుతఱి నట్లే వెనుకకు మెల్లఁగఁ దిరుగుట యుపశాంతికరమని తెలియున్నది. ఒక్కొక తఱిఁ గొన్నిశరీరములకుఁ దల బరు వగుటయుఁ గొందరికి వాంతియగుటయుఁగూడ సంభవించు నఁట. కాని యీపరిస్థితియందుఁ గూర్చుండుటయె కష్ట మనిపించెడిని. ఈయవయవమున కాంగ్లమున organ of balance అనెదరు. వెర్టిగోయందలి Vert అనినఁ దిరుగుటయని యర్థము.

**కండ్లు మూసుకుని తిన్నగా నడువలేక పోవుట:-** నడచుతఱి Balancing our bodies చాలా ముఖ్యమైన కార్యము. బైసెకిల్ పై నెక్కుతఱి ని దత్యావశ్యకమని యెల్లరెఱింగినదే. దానికిఁ జూపు ముఖ్యావశ్యకము. చూడకుండినతఱి బేలన్సింగ్ దుస్తరము కాన గ్రుడ్డివారి వలె వేరొకనిపై నాధారపడి నడువవలసియుండును. లేకున్న నడక తిన్నఁగ జరుగక నిటునటుఁ దిరుగుచుఁ దూగుచుంట సంభవించును.

**కంప్రెషన్ ఆఫ్ వాటర్ (నీటినినొక్కి యణచి సంగ్రహపర్చుట).** ఇటీవల స్వానుభవములనుండి "When the waves are set up inside the closed pipe water shall be compressed in it" అనునొక ధర్మ మేర్పడియున్నది. మూయంబడిన నీటిగొట్టమందుఁ దరంగములను గల్గించినచో నాగొట్టమునందలి జలము నొక్కంబడి యణఁగి సంగ్రహోదకముగ (Compressed water) నగునని భావము. ఈధర్మ మెఱుంగనినాఁ డొకఘన పదార్థము కంప్రెస్ చేయంబడనగుంగాని ద్రవ పదార్థ మట్లువదని తలంపం బడుచుండెనఁట. George Constantiresco అనుపేరుగల రూమేనియాదేశఁపు రసాయనశాస్త్రవేత్త యెరోపామహాసంగ్రామరంగానుభవములనుండి ద్రవ పదార్థములుగూడ కంప్రెస్ చేయనగునని కన్పెట్టె

చిరస్మరణీయం బాయెను. ఇందుఁ గల్గింపఁబడిన యలలు గాలియందు ధ్వనివలెనె సెకెండునందు ౧౧౧౮౬ అడుగులు చలించెనని యాయన వివరించి యున్నాఁడు.

**కంబముమెట్టు - (పురము)** ఘనత వహించిన నిజాముప్రభువుగారి రాష్ట్రముననున్న పట్టణము. వరంగల్లుమండలములోనిది. దీని కింకను కంభముమెట్టనియు, ఖమ్మమెట్టనియుఁ గూడ వాడుకనామము లేర్పడి వాడంబడుచుంటఁ గాన నగును. ఇట నొకచిన్నకొండపై నరసింహస్వామి దేవళమును నం దొకస్తంభమునుండి బయల్వెడలు చున్న నృసింహవిగ్రహమునుండి యీతావున కీ పేరుఁ గల్గినదని యచటివా రనెదరు. మునియేరు దరినే యున్నది. (మున్ననది చూడుడు) దీనిని స్తంభపురియని కొందరు పండితులు వాడుదురంట.

ఇచటికొండపై నొకగండశిలపై నున్నగొప్ప దుర్గము కల దది క్రీ. వె. ౧౦ యో లేక ౧౧ శతాబ్దమున సీతాపతి యనుపేరుగల భూపతివశ మునం దుండినటుల నం దొకశాసన మున్నదిగాని యితరసంగతు లేమియుఁ దెలియరాకున్నవి. ఆయన యెవ్వరో తెలియదు. హరిభట్టారకుఁ డనుకవి యిచటనే జన్మించెననియు నాయన మత్స్యపురాణ మును రచించినవాఁడనియు నందురు. తొల్లి పెద్ద గ్రామముగ నుండిన కంబంమెట్టు క్రిష్ణామండలము లోని జగ్గయ్యపేట చెడినపిదప నాగ్రామమం దుం డిన వణిక్ప్రంగవు లిట కరుదెంచుటఁ బట్టణముగఁ బెరిగి వర్తకస్థలమై యున్నది.

దీనికిం బదిమైళ్ళదూరమందున్న నేలకొండపల్లె యనుగ్రామముకలదిచటివా రట కైదుమైళ్ళదూర మందున్న నిటుకదిబ్బతోఁ గల్పి విరటాగ్రజపట్టణ మనియెదరు. ఆయిటుకలదిబ్బను తొల్లింటి బౌణా పురమనియు నందురు. అట నాపేరుఁగల గ్రామ ముంగూడ నున్నది. అట నొక శమీ (జమ్మి) వృక్షముం జూపుచు దానిపైనే పాండవులు తమ యస్త్రముల నాదిని దాచియుండిరని చెప్పుదురు. గాని నిదర్శనము లెవ్వియుం గానరావు. ఇంకం గొంద రదియె శివాజీమహారాజగురుండగు రామ దాసుస్వామి జన్మస్థాన మనియెదరు.

**కఠియవాడ్ లేక కథియవాడ్**— ఇది ద్వీపకల్పము. ఇందు ౧౮౭ స్వదేశసంస్థానము లున్నవి. అందు నవనగర్, జూంనగరు సంస్థానపుర ములు మిగుల నభివృద్ధి నందియున్నవి. సముద్ర తీరఁపుస్థలములు చక్కనిరేవులుగా నున్నవి. పట్టుపనులు, బంగారుజలతారుపనులును నిట సుప్రసిద్ధములు. కచ్చిసంస్థానము వీటియందుఁ బెద్దది. ధనవంతమని పేరందినది.

**కడుపుబ్బనవ్వుతటిని నిద్రయందును శరీరావయవపటిమ తప్పుట**— పరిశీలించిన నిది విచిత్రముగఁ దోపకపోదు. కడు పుబ్బనవ్వుటను సంస్కృతాలంకారశాస్త్రమున నతి హసిత మనియెదరు. ఆంగ్లమున నద్దానినే 'Taken captive by intense laughter' అని వివరించియున్నారు. నిద్రయందు మేధస్సు విశ్రాంతిం గొనుచు చైతన్యము వదలియుండుం గాన నట్టిస్థితియు నతిహసితఁపుస్థితివంటిదే. ఇట్టితటి శరీరేంద్రియము పనిఁజేయఁజాలకఁ బటిమం దప్పి యుండును. కాని యవయవములు క్షీణింపమి వాటిబలహీనత కాదనియు నర్వాస్థితియందుండియుఁ బటిమం గోల్పోవుటయనియు మన మెఱుంగఁ గల్గుచున్నారము.

రెండుస్థితులందు మేధస్సు పటిమ లేకుండుట పనిచేయ ప్రోత్సహింపంజాల కుండును. అత్తటి

మేధస్సున రక్తప్రసారము సరిగా నుండదు. సదరి నుండి చక్కఁగ మేల్కాంచినతఱిని నవ్వు ఆగి విశ్రాంతి గల్గినతఱినిగాని మనుష్యుల యింద్రియావయవవ్యాపారము లుండక శారీరకధర్మము లగు గుండెలు కొట్టుకొనుచుండుట నాడి మొదలగునవిమాత్రమే యుండును. వీటికి మనస్సుతోఁ బని యుండదు. అతిహాసితమునకుఁబిదప శరీర మలసియుండుట నెల్ల రెఱింగినదే. అట్టిస్థితికిఁ బూర్వస్థితి నాంగ్లశరీరశాస్త్రవిదులు in intense laughter the centers of will are starved of energy which is being drained away very quickly resulting in exhausting అని వివరించుదురు.

## కతియవాడ్—

(కతియవాడ్ చూడుడు.)

## కదలని నీటియందు దూరపువస్తువులైనను ప్రతిఫలించుట—

కదలిక లేక నిశ్చలముగనున్న నుదకము లద్దమువంబోలి యెదుట నున్నవాటినిం దనయందుఁ బ్రతిబింబించుశక్తిఁ గలది. ఎంతదూరమునందున్నను లెక్కయుండదు. దూరమునందున్న చంద్రబింబముగాని కడుదూరము మునందున్న సూర్యబింబముగాని, యింకను దూర నందున్న నక్షత్రములుగాని ప్రతిబింబించుట కేయాటంకము నుండకుండిన (అనగా మేఘములు మొదలగునవి మధ్య నాటంకము లేకుండిన) స్పష్టముగఁ గన్పట్టెడిని. నీ రచలముగనుంట ముఖ్యము. వెలుతురుగుండ నీయాకారము లీతరులోఁ బ్రయాణ మొనర్చి నీటియం దర్థమునందువలెనే ప్రతిబింబించును. భూతలద్దము మొదలగు సాధనములతో దానిం బరిశీలించితిమేని యావస్తువునందున్న యాకారవిశేషములన్నియు దర్శితములై (magnified) స్పష్టముగఁ దెలియ నగుచుండును. వెలుతురుబింబము లెంతదూరమైనను నరఁగి ప్రతిబింబించునని తెలియ నగుచున్నది.

## కనకపుష్యరాగమణి (Cairn gorm)-

ఇవి తరుచుగాఁ Grampian పర్వత శిఖర ప్రదేశములందు దొరకు నందురు. పసుపుపచ్చ రంగుఁగల్గి పుష్యరాగముంబోలిన స్వచ్ఛతను గట్టిని గల్గియుండు రత్నములు. ఆంగ్లమున దీనిని Yellowish Brown Coystal of Hexagonal shope అని వివరించియున్నారు.

అది దొరకుపర్వతమునుండి తొలుతఁ బేరంది రానురాను యిప్పటిపేరుగ నాంగ్లమున మారెనట.

## కనకసభ:—

(పేరూరు చూడుడు.)

## కన్నంబాడి - డాము (Dam) —

(జలస్తంభనస్థానము — బృందావన మహోద్యానవనము చూడుడు)

## కనడాదేశపుఁ బేరు (Canada Name)—

ఆదిని పోర్చుగీసుసేనాని నావికుఁడు Cortereal అను పేరుగలవాఁడు భరతదేశమునకు మార్గ మరయుచు నిప్పటిసెంటులారెన్సు కెగఁబడి నావికాయాత్ర సలుపుచుండ నది కాక పోవుట నిరాశం జెంది యారెోడలందలివా రేక గ్రీవముగ "కనడా" యని యరచిరఁట. పోర్చుగీసుభాషయందు canada యనిన 'నిది వృథా' యనియర్థము. ఆదేశస్థు లామాట నొక బిరుదఁపు మాటగఁ దలంచి దానిని గర్వముగా వాడుచుండిరఁట. పిదప నితరదేశస్థు లట కేగ నీకనడా ఉక్తి కేకలచే వారికి స్వాగత మిచ్చుచుండి రఁట. మఱియుఁ బోర్చుగీసువారివలెనే యన్యులును కనడా మహావాక్యములచేఁ ద్వరితముగా వెడలి పోవుచుండిరఁట. ఐరోపావా రాదేశమునకు నావేరే

యిడి వాడ నారంభించ నది వ్యాపక మయ్యెనఁట. వలసపోయిన నైరోపావారు బలపడి స్వదేశస్థులు తగ్గుటతోఁ గనడాపేరే దేశమున స్థిర మాయెనఁట.

**కన్నొబ్బెమలు**—కన్నొబ్బెమలు కనుఱెప్పలవలెనె నేత్రరక్షకములుగ నున్నవి. తలచుగఁ జమటం బట్టుచుండు నుదురునకుం దిగువునఁ జమటగుండా శరీరమునుండి విషపదార్థములను, త్రసరేణువులను మెత్తనిశరీరభాగమగు నేత్రములలోనికిం బ్రవహించనీక నాపుటకును నధికమగుతఱి దెసలకు మరల్చుటకును కన్నొబ్బెమ లేర్పరుపంబడి పైని కుంచెంబోలి వెంట్రుకలంగూడఁ గల్గియున్న నని చెప్ప వలయునేగాని యవి చేయుపని వేరుగఁ గానరాదు. గృహమునందుఁ బంచ లుండుటంబోలిన రక్షకము.

**కమ్మనాటిసీమ**—ఇది యారువేలనాటి సీమకు దక్షిణముగా నుండెనఁట. క్రీ. వె. ౧౧౫౧ కాలమున మహామండలేశ్వర త్రిభువన మల్లదేవ పొత్తపి చోడదేవభూపతి కొల్యదొన (ఇప్పటి కోణిదెన) రాజధానిగ నీసీమం బాలించె ననియు నత్తఱిఁ బెనుగొండవాస్తవ్యుండగు కోప నయ్య శ్రేష్ఠిసుతుఁడు వాసనయ్య శ్రేష్ఠి చెరువు గట్టుపై దేవాలయమునుం గట్టించి సోమేశ్వరశివలింగ ప్రతిష్ఠఁజేసి వేయించినట్లున్న శాసనమునుండి యీసంగతియు నాభూనాధునిపేరును, శాసనకర్త పేరును బయల్పడి యున్నవి.

**కర్ణసువర్ణదేశము**— వంగదేశమునం దొక భాగముగ నొకప్పు డీపేరుగల దేశ ముండెనఁట. పిదపకాలమున నాప్రాంతములు సింగభూమ్ (సింహభూమి) బీర్భూమ్ (వీరభూమి) మండలములుగ వాడంబడుచున్నవి. హ్యూనచ్యాంగను చీనాయాత్రికుఁడు తామ్రలిప్తి (ఇప్పటి తామ్లూక్) నుండి కర్ణసువర్ణదేశమున కరగినటుల నతనియాత్రాచరిత్రమగు సి-యూ-కీ- గ్రంథము నందుఁ గలదు. (హ్యూనచ్యాంగు చూడుడు. తామ్రలిప్తి చూడుడు. సీయూకీ చూడుడు.)

**కరాచీరేవుపట్టణము**_ కరాచీ యిప్పుడు సింధుదేశమునకుఁ బ్రధాననగరమై యున్నది. గవర్నరుగారినివాసమగుటయేగాక ప్రభుత్వకార్యాలయము లుండుతావు. ఇది యీనగరమున కంత ప్రాముఖ్యము గాదు. దానిరేవున నోడలరాకపోకలు, ఎగుమతిదిగుమతులు, దాని యాకాశవాయు విమానస్థానము దానిపా మూలకారణములై యుంటఁ జూచినవారికిం దోపకపోదు. గాన వాటింగూర్చి వివరించుటసమంజసము. ఇన్నగరము సింధునదీముఖద్వారముకడ నేర్పడిన డెల్టాప్రదేశమున నందే యున్నది. ఆఫ్ఘనుస్థానఁపుభూపతియగు ఖాను (Khan of khelat) నుండి క్రీ. వె. ౧౭౯౫ లో తల్పూరు మీర్సు (Mirs of Talpur) గైకొనిరి. పిదప ౧౮౪౩ వరకు వారి వశమందే యుండి యప్పుడు వారినుండి బ్రిటీషు వారివశ మాయెను. అనగా మీరులు The Hon John (ఈస్టుఇండియా) కంపెనీవారి కిచ్చివేసిరి. అత్తఱినందొక చిన్నదుర్గముమాత్ర ముండెడిదఁట.

దానిచరిత్రయన దానియభివృద్ధిచరిత్రయేగాని యితరసంగతు లెవ్వియుం దెలియరావు. ౧౮౪౩ లో నది రేవు అనిపించుకొనం దగిన లక్షణము లట లేనే లేవు. ఇప్పు డోడలు నిలచుతా వప్పుడపాయకరమగు బురదతోఁగూడినమెరకప్రదేశమై చిన్ననావలు పోఁదగిన సముద్రఁపుంజెలకకాలువ యొకటి కరాచీగ్రామమువర కుండెడిది. దాని గుండా చేపలవాండ్రపడవలు మొదలగునవి పోవుటకు నాటంకప్రదేశముందాటుటకు బలమగు గాలి కావలసియుండెడిది. పెద్దమోడ లిప్పుడు మనోరా పోయంటనుప్రదేశమున కవ్వలనే కడుదూరమున

నిలచి యచట నావలలోని సరకులను, మనుష్యులను దింపి యిప్పటి హార్బరున్న తావునకు సముద్రంపుఁబోటు తగులుదనుక నిరీక్షించి పోటుకాలమున నీరెక్కువగుకతనఁ బోవలసియుండెడిది. అటనింకను జిన్ననావలలోఁగాని తెప్పలపైంగాని యొక బురదప్రదేశముగుండా త్రోసుకొనుచు వచ్చి యిప్పుడు హార్డింజివంతెన యనంబడుచున్న తావునకుఁ బరిసరములందు దింపవలసియుండెడిది.

అట్టిసందర్భములను ఈస్టిండియా కంపెనీ వారి మొదటి గవర్నరుగా సింధుదేశమున కరుదెంచిన Sir Charles Napier గారు దీనియందు దేశంపుఁబడవలకుఁగాను కాలువను వెడలుపుచేసి జెట్టీ (Jettys) లను నిర్మించి రేవును బాగుచేసి హార్బరునిర్మాణమునకుం గడంగఁ దలపెట్టి ప్లానులం దయారుచేసి కియామారీ, కరాచీలం గలుప సర్వప్రయత్నముల నొనర్ప సాగెంగాని పరిస్థితులనుకూలింపమి కాలువం గొంతవెడలుపుచేయుటయు జెట్టీలనిర్మాణమాత్ర మాయనయుద్యోగ కాలమునం జరిగెంగాని తక్కినపనులకు వీలు కుదురదయ్యెనఁట.

పిదపం గొంతకాలమునకు Sir Bartle Frere గారు సింధుదేశమునకుఁ గమీషనరు పదవియం దేతెంచెను. ఆయన (క్రీ. శ. ౧౮౫౦-౧౮౫౯) తొమ్మిదిసంవత్సరము లాపదవియందుండెను. ఆయన కరాచీరేవుప్రాముఖ్యతం గ్రహించి యిట హార్బరునిర్మాణావశ్యకతంగూర్చి పైయధికారులకు వ్రాయమొదలిడి వారియంగీకారములం బడయుచు నాటంకప్రదేశమును నిరుదెసలప్రదేశములను సర్వేకొలతలంజేయించి యప్పటి గవర్నరుజనరల్ డల్హౌసీ(Lord Dalhousie) ప్రభువుగారికి నివేదించి కోర్టాపుడైరక్టరువారిచే నక్కాలమున హార్బరునిర్మాణములం దారిందా యనిపించుకొనిన Walker ఇంజినీయరుగారి నేర్పాటుచేయించి పరిశీలింపఁజేసి సెక్రెటరీ[illegible]

క్రీ. శ. ౧౮౬౦ లో ౧ Manora water — ౨. Kiamari Groyne— ౩. Napier mole Bridge — ౪. Native Jetty—౫. New Chanuel— ౬. Chinna creek Stoppage — నిర్మాణముల కుత్తరువులీయంబడి వాటిపై నధికారిగ W. H. Price గారనుపేరుగల ఎక్జిక్యూటివ్ ఎంజనీయరుగారిని నియమించిరి. వా రిదివరకు సింధునదికాలువపై నుద్యోగిగ నుండువారు. పిదప నాయననే పోర్టు ఎంజినీయరుగాఁ జేసిరి. అటుల నాకారమందిన కరాచీరేవు ౧౮౮౦ సంవత్సరముదనుకఁ గమీషనరుగారి యుత్తరువులకు లోఁబడిన నొకహార్బరు మేష్టరుగారిచే నడుపంబడుచుండి యటుతోడనే హార్బరు బోర్డుకు వశపర్పంబడెంగాని దానియగ్రాసనాధిపతి కరాచీ కలక్టరుగారే యైయుండిరి. అటుల ౧౮౮౭ మార్చినెలవరకు జరగి పోర్టుట్రస్టు ఏర్పరుపంబడియెను. ఆనాటికి 3000 టన్నుల బరువు భరింపంగల యూఁడోడలకు వసతియు స్వదేశంపుఁ బెద్దపడవలకు నేపియర్ మోల్ బోటు వార్ఫుం గల్గిమాత్ర ముండినది. అప్పటినుండి యభివృద్ధిం గాంచుచు నేటికి ౮౬౦౦ అడుగులపొడవుఁగల కియామారివార్ఫిజి గల దిందు ౧౭ ఓడలు నిలువనగును. దీనినంటి యినుపదారి యమర్పంబడినది. ఇందు 35 హైడ్రలిక్ వెయిట్లమోసలు 30 టన్నుల బరువు సరకుల నెత్తఁగల క్రేను (Cra[illegible]) లమర్పంబడియున్నవి. ఇవి హైడ్రోలిక్కు[illegible] గాన నతిత్వరితముగఁ బనిఁజేయుటయం దద్వితీయ[illegible] ములై యున్నవి.

గొప్ప సముద్రంపుటోడల కిరువదిమూరింగులు కలవు. స్వదేశంపుటోడలకు సమృద్ధియగు వసతి కలదు. షిప్పుకెనాల్ ఉత్తరంపుకడను స్వదే

కేంపుటోడలకు జెట్టీకలవు. అట వాటిసరకులకుఁ గొడాములు (Warehouses) కట్టంబడి యున్నవి. బల్కాయల్‌పీరు (Bulk-Oil-pier) నం దనేక ఆయల్‌కంపెనీల టాంకులకు గొట్టముల గుండా నూనెంబోసి నింపునేర్పాట్లు కలవఁట. స్టీమరులు నిలచియుంటఁ గాననయ్యెడిని. పెట్టెలలో డబ్బాలతో వచ్చిన కెర్సనైలుకు ప్రత్యేకంపుగొడాములు కలవు.

౧౯౩౧ లో నివి చాలక నాలుగు క్రొత్త బర్తులు (Burths) నిర్మింపంబడి తెరువంబడినవి. ఇవి హార్బరునకుఁ బశ్చిమముగానుండినవి. వీనిని (west burths) అనెదరు. ఇవి deepwater quarys (లోతునీటిరేవు) లనంబడుచున్నవి. ఇవి ౫౫౦ అడుగులపొడవు 39 అడుగుల లోతునీటింగల్గి [illegible]దుఁ బదునారు ఎలక్ట్రిక్ క్రేను లమర్పం [illegible]యున్నవి. అందొక్కొక్కటి రెండేసిటన్నుల బరువు సరకుల నెత్త గలవఁట. ఇంక నివియుం జాలక నెగుమతులతావు (export yard) గ వేరొక తావేర్పరుపంబడినది కలదు. అది యోడవార్ఫులనంటియె దానిపొడవునను నినుపదారులుకల విశాల స్థలము. ఇంకను Thole produce yard అనతి దూరముననె వేరొకటి నిర్మింపఁబడి ప్రత్యేకము ప్రత్తి సరకులకై యుపయోగింపంబడుచున్నది. దీని యందు నిష్కర్షయగు నగ్నిప్రమాదరక్షణంపు పేర్పాట్లమర్పంబడినవి. ఇటులనే తూర్పుదెస నున్న East wharves నందు దిగుమతిసరుకుల నోడలగర్భములనుండి రెయిల్వేవేగనులలోనికే దింపుచున్నారు. దాని కేసుంకమును లేక నటనుండి మూఁడుమైళ్ళదూరమందు వ్యాపారప్రధానస్థానమున నిర్మింపంబడిన గొడాములలోనికిం జేర్చి దింపి నిల్వయుంచెదరు. అచట వాటి నిచ్చివేతురు. సగటున నెగుమతి దిగుమతులందు ౧౭ గంటలు పనిచేయు రోజునందు ౧౦౦౦ టన్నుల డెడ్వెయిటు (dead weight) గలసరుకులను ౮౦౦౦ టన్నుల బరువుగల Baged cargo (సంచులసరకులను) ఎగుమతి దిగుమతు లొనర్పుచున్నారఁట. ఈలెక్క యోడవక్కంటికని యెఱుంగవలయుంగాని మొత్తమున హార్బరునం దంతటానని తలంపరాదు.

ఇంకం గరాచీనగరపుఁబ్రాముఖ్యత నధికపరచు వాయువిమానస్థానముంగూర్చి యించుక వివరించుటసమంజసము కానేరదు. నైసర్గికముగ నైరోపా నుండి భరతదేశమునకేగాక నింకను తూర్పున కనుకూలమార్గమునం దున్నకరాచీనగరమున వాయువిమానస్థానము (air port) గొప్ప ప్రాముఖ్యత నందియున్నది. ఎంపైర్-ఎయిర్- మెయిల్‌సర్వీసునకిది ప్రధానస్థానమైనది. ఇటీవల నందే సీ-ప్లేన్-స్టేషనుకూడ నిర్మించియున్నారు. ఇది హార్బరునంటియే పశ్చిమమున నున్నది. ఇందుఁ జక్కగ దిగు నెక్కు వసతులు మరమ్మతులకుఁ జక్కనియంత్రములుగల కర్మాగారము (work shop). సుంకములకచ్చేరీలు, వైద్యపరిశీలనస్థానము మొదలగునవన్నియుఁ గలవు. చూచువారల కింకం గరాచీయభివృద్ధి దీనిపై నాధారపడియున్న దనిపింపకపోదు.

**కలకత్తా కాళీదేవస్థానము**—కలకత్తా నగరముయొక్క దక్షిణంపుఁగడను వృద్ధగంగా (ఇప్పటి టోలీసునల్లా) తీరమునఁ గాళీఘట్ట మను భాగమునం దున్నసుప్రసిద్ధదేవస్థానము ధనవంతమైనది. దేవస్థాన మేమంత గొప్పదేవళము కాకున్నను విలువం గల్గినది. బంగాళీలు శాక్తేయులు గాన నీకాళీదేవిపై వారికి భక్తిమెండు. అనుదినముఁ గొన్నివేలజనులు దేవిం దర్శించుచుందురు. ఇట (బలులు) జంతువధ యధికము. దేవస్థానమునకుం జెందిన ధర్మశాల యొకటి దేవాలయము కడనే కలదు. ఇటను సమీపముననే కాళీఘట్టమను నినుపదారితావు (స్టేషన్) కలదు.

కలకత్తా యనుపేరు కాళీఘట్టమునుండియె రానురాను కొంచము మార్పునంది యాంగ్లేయులచే వాడంబడుటఁ బ్రారంభమయ్యెను.

**కవలపిల్లలు**— (Twin children) ఒకతెయొకు దొకేప్రసవమున నిద్దరు శిశువులు జనించిన వారిం గవలపిల్ల లందురు. వారి కించుమించు పోలిక లొకేరీతి నుండుట సంభవించుచుండెడిని. కొందరు వైద్యు లతిబాల్యస్థితియందుఁ గవల పిల్లలలో నొకరి కొకజబ్బు సంభవించుకతన దాని జతపిల్లకుంగూడ నాజబ్బే యాకాలముననే సంభవించుచుండు ననెదరు. దీనింబట్టియె 'కవలపిల్లసంకటము' అను నుక్తి యేర్పడిన దనెదరు. ఈకవల పిల్లలంగూర్చి స్వీడనుదేశమున నుపశాల Upsala విశ్వవిద్యాలయమునందు Prof Lundberg పండితునిపరిశీలనలును Frankfort-on-main నివాసియగు Prof Hugan Fischer పండితుఁ డొనర్చిన పరిశీలనలును సుప్రసిద్ధములుగఁ దెలియుచున్నవి. ఇవి కవలపిల్లలు రెండుతెగల వారని కొందరు పండితులును మూఁడుతెగల వారని మరికొందరును తలంపందగిన యభిప్రాయ భేదములం గల్గించినవి. ఎట్లైనను Idential Twins అనియు Non Idential Twins అనియుఁ గవలపిల్ల లిరుతెగలవారని చెప్పుట కే సంశయము నుండ నక్కరయుండదు. కవలపిల్ల లిరువురు మగవారుగనో యిరువురు ఆడవారుగనో జన్మించిన వారలకు ఐడెన్షియల్ ట్విన్సనియు నటులంగాక నొక రిటులగను వేరొకరు మరియొకరుగను జన్మించినవారలకు నాన్ ఐడెన్షియల్ ట్విన్స నియు సాంకేతికనామముల నిడి వాడుచున్నారు. పరిశీలనల నొనర్చుతఱి వా రిర్వురు పరిశీలకులు పితృ మాతృ లక్షణము (Hereditary factors) లగు చర్మఁపురంగులు, తలవెంట్రుకల రంగులు ముఖ్యముగను రక్తలక్షణములు (Blook group), వ్రేళ్లముద్రల పోల్కి లక్షణములు (Fenger prints), చెవుల యేర్పాట్లపోలికలు, ముక్కు ఏర్పాట్లపోలికలు (Ear and nose forms), పిదపఁ బ్రధానఁపుఁబోల్కలుగను గ్రైకొని పరిశీలించిరి. మరియు వీటికి Serological and morphological characters అని పేర్లిడి వాడుచున్నారు.

వీరి పరిశీలనలనుండి కవలవారు జన్మించుటకుం గారణము వా రెట్లేర్పడుదురో యావిధానములుఁ గూడ నించుక దొరకినవని యందురుగాని సరిగా బయల్పడుట గానరాదు. కవలలజన్మములు శీతల ప్రదేశములం దెక్కువయనియు నుష్ణప్రదేశముల చాల తక్కువయనియుఁ దేలుచున్నది. ఇట్టివాటి నాంగ్లవైద్యవిశారదులు medico legal problems అనెదరు. ఇటీవలఁ గలకత్తానగరమందలి Bose institute దీనింగూర్చి పరిశీలింప సమకట్టిరి. వె. ౧౫౦౧ సంవత్సరఁపుజనాభా లెక్కలందుఁ గొన్నిసదుపాయముల నర్థించి భరతదేశఁపు ప్రభుత్వమువారింగోరియున్నదని వినుచున్నారము.

**కాకతీయసామ్రాజ్యము—**
(త్రిలింగ కాకతీయ సామ్రాజ్యము చూడుడు.)

**కాకవన్నతిస్వామహారాజు—**
(విహారమహాదేవి చూడుడు.)

**కాగితములు**—ఆదినుండియు భరతదేశమునందేగాక యితరదేశములందుఁగూడఁ గాగితములు గుడ్డపేలికలతోఁ జేయంబడుచుండినవి. వాటిని నానించి మెత్తఁగ నూరినముద్ద కాంగ్లమున Felt అని వాడుచుండిరి. దానిరేకులే కాగితము లనంబడుచుండినవి. గుడ్డపేలికలరుదుగానఁ గాగితములును నక్కాలమునఁ గడుప్రియముగా యుండినవి. రానురాను పరిశీలన లధికముగ జరగుచు వేర్వే రితరపదార్థములును నిట్టికార్యమున

నుపయోగించునని కనిపెట్టంబడినది. వార్తాపత్రికల ప్రథమ దేశములందు వ్యాపించుకొలది కఱ్ఱతోఁ గాగితములం జేయుటయుఁ బ్రబలినది. Esparto grass (ఎస్పార్టో) యను పేరుఁగల గడ్డి కాగితములు చేయుటయందు మిక్కిలి యుపయోగకరమని కనిపెట్టంబడియున్నను నాగడ్డి దొరుకుట కడుదుస్తరము. స్పానియాదేశమునం దాగడ్డి కొంతవరకు దొరకెడిని. అల్జీరియాదేశమునఁ గొంతవరకు లభించుంగాని యివి చాల తక్కువ యనియె చెప్పవలసియున్నది. ప్రపంచమునఁ జేయంబడు కాగితములస్థితితోఁ బోల్చిన నిది కడుంగడు లోపమనియే చెప్పవలసియుండును. ఇటీవల దీని నితరదేశములందుఁ బెంచప్రియత్నములు జరగుచున్నను సరిగాఁ బెరుగుట కానరాకున్నది.

కఱ్ఱలతోఁ జేయంబడుకాగితములు వార్తాపత్రికల కధికముగ నుపయోగించుచున్నవి. అవి ప్రత్యేకముగ నొకేకఱ్ఱతోఁ జేయంబడుటయును కొన్నిజాతులకఱ్ఱలం గల్పి చేయుటయుంగూడ కలదు. కఱ్ఱలం జితుకంగొట్టి మెత్తఁగ నుండునటులం జేసినముద్దకు pulp అని పేరిడియున్నారు. కఱ్ఱలపల్పు wood pulp అనియు Chemical pulp అనియు ద్వివిధములు. కెమికల్పల్పు కఱ్ఱముక్కలను కొన్నిరసాయనికద్రవ్యములతోఁ గొంతకాల ముడుకంజేసి చితుకంగొట్టి గంధమువలె మెత్తగంజేసి పల్పుగ నొనర్తురు. కాగితముల రకములందు ఎస్పార్టో గడ్డిపల్పు కలిసినవి శ్రేష్ఠములు. ఇంకను గుడ్డపేలికలముద్దగూడఁ గలిసినవింకను శ్రేష్ఠములుగఁ జెప్పంబడుచున్నవి. మంచి ప్రశస్తమైన కాగితములు పీటికెలుపుడలల నుండియే చేయంబడుచున్నవి. అట్టికాగితములు చక్కని యుపరిభాగముఁ (surface) గల్గి పుస్త

కములను ముద్రింప వీలగుచున్నది. కేవల కఱ్ఱ కాగితములు Wood pulp paper వార్తాపత్రికలకుఁ జౌకగ లభించుట నుపయోగించుచున్నారు.

ఇక్కాలమునం యూరోపాదేశములందు Common spruce చెట్లయొక్కయు white spruce—Black spruce—Silver fir జాతిచెట్ల కఱ్ఱయును నమెరికాదేశములందు Hemlock—poplar Aspen జాతులచెట్లకఱ్ఱలును, భరతదేశమున ఓకు పోప్లార్ జాతులును కాగితములం జేయ నుపయోగించుచున్నారు. వీటిని వీలగునంతఁ దనుక మొదట ౧౨ అంగుళముల దళసరిమాత్రమే గల లేఁతకఱ్ఱల నుపయోగించెదరు. బ్రిటీషుదేశములం దేఁటేట నేబదివేల టన్నులకలప కాగితములు చేయంబడుచున్నదని లెక్కింపంబడియున్నది. వీనింజేయుటకుఁ బది లేక పంద్రెండు మిలియనుల కఱ్ఱఁ గావలయునఁట. కఱ్ఱలపై బెరడు, లోనిగుంపులు, తిరుగుడులు మొదలగు కఠినప్రదేశములం దీసివైచి పిదపఁ బల్పుగ చితుకంజేతురు. కఱ్ఱల నరుగఁదీసి నీటింబారించుచు చేసినగంధమునకు wood pulp అనెదరు. దీనికాగిత మట్టి జిగిగా నుండనందున వార్తాపత్రికలకు వాడుదురు. కఱ్ఱం గోసిన చిన్నముక్కలను cheenks అనియెదరు. వాటిని రసాయనికద్రవ్యములలో నుడికించుబానలకు Digister అనెదరు. అది పెద్దయుక్కపాత్ర. ఉడికినపిదపఁ గఱ్ఱముక్కలు Brown రంగుగలవిగ నగును. ఇటుల నగుతఱి సగముకఱ్ఱ నష్టమగును. మరియు మిగుల ద్రవ్యమును వ్యయమగుచుండును. అట్టికఱ్ఱలయొక్క ముద్దయందుఁ (pulp) జక్కని felting matter కలదని చెప్పంబడినది. దానినే matting puality అనియు ననుట కలదు. దానియందే కాగితంపు విలువ యుండెడిని. అనుభవజ్ఞులు నూరుభాగములం దెనుబదిభాగములు wood pulp ను,

నిరువదిభాగములు కెమికల్‌పల్పును చేర్చిన వార్తాపత్రికలకుం బ్రశస్తమగు కాగితముం జేయనగునని చెప్పుచున్నారు.

కాగితములకుఁ జక్కని మెఱుగు వలయునేని Resin బంకయును china clay యనంబడు పదార్థమును కొంచము చేర్చుదురు. సగము నీటితోఁ గలసియున్న మెకానికల్ లేక వుడ్‌పల్పు పదునేనువందల టన్నులును, ఎండిన కెమికల్ పల్పు ఇన్నూటయేబదిటన్నులును చైనాక్లేపదార్థము నూటయిరువదిటన్నులును, రెయిసిన్ బంక, పటిక యిరువదిభాగములును కలియునఁట. నుడికించుట కేడువందలయేబది టన్నుల రాక్షస బొగ్గును, చేయుటకు ౮000000 గాలనుల యుదకమును వలసియుండునని లెక్కింపంబడియున్నది. ఇట్లనుటయం దెన్మిదివేలగాలనుల యుదకము గావలసియుండెడిని. విధిగా దీనిం గమనించి కాగితంపుయంత్రాగారములం గట్టవలయును.

## కౌజుయేషన్ (Causuation) సిద్ధాంతము

తము—జగత్తునందు నడచిన నడచుచున్న నడువంబోవుచున్న ప్రతికార్యమునకును, సంభవించిన సంభవించుచున్న సంభవించెడి ప్రతికార్యమునకును కారణము గలదనియుఁ గారణము లేని కార్య ముండదనియు నన్నిటికి నాదికారణము దైవసంబంధమనియు సిద్ధాంతము. కార్యములకుఁ గారణము వెనుక నుండును. అనఁగా వెనుక నడచినకార్య మిప్పటికార్యమునకుం గారణ మగును. దానికిం గారణ మూరయవలయుననిన దాని కింకను వెనుకఁ బరిశీలించవలసియుండును. ఇట్టికారణముల కెల్ల నాదికారణముగ దైవసంబంధ ముండును.

## కామధేనుపురము—

(పేరూరు చూడుడు)



## కార్బనోమ్నాక్సైడ్ –(Corbonmonoxide)

—హైడ్రోజెనుగాసు (gas) రెండు ఏటోములు, ఆక్సిజెనుగాసు (gas) ఒక ఏటోమును కలసి యుదక మగును. ఆంగ్లరసాయనశాస్త్రవేత్తలు నీటికి $H_2 O_1$ అని గురుతు నిచ్చియున్నారు. ఇటులఁ గలసిన దొకనీటిమొలక్యూల్ (molecule) అగునని చెప్పంబడినది. అదియే జలపరమాణువు. ఇటుల నుదకపరమాణువు (molecule) నందు మూఁడే యాటోములుండెడిని. గనులందు Choke damp అని చెప్పంబడు తడియందొక ఆక్సిజెను ఏటోమున కొకఏటోము కార్బను కూడ కలియుట నది కార్బన్ డీ ఆక్సైడుగ నగుట సంభవించెడిని. దానిని కార్బన్ మొనాక్సైడు అనుటయుం గలదు.

## కాలింపాంగ్ సమశీతోష్ణప్రదేశము-

హిమవన్నగమున డాలింగుకనుమపైఁ గొండనెన్నన సముద్రంపునీటిమట్టముపై ౪000 అడుగులయెత్తున సిక్కింరాజ్యప్రాంతమున భూటాన్ నుండి టిబెట్టులోని కరుగు సుప్రసిద్ధమగు వేయిమైళ్ళ వర్తకంపురహదారీపెద్దబాటపైనున్న సమశీతోష్ణప్రదేశము. ఆపెద్దబాట కాలింపాంగుపురంపు నడుమగానున్న పెదబజారుగుండా పోయెడిని. మరియు నీబాట బండ్లబాట కాదు. గుఱ్ఱములు, ఏనుఁగులు, గాడిదలు, ఎద్దు, జాబూలపైని సరకులను నైచుకొని కాలినడకను చీనావర్తకులు, టిబెట్టువర్తకులు, లడకునుండి లడకీయులు, సిక్కింవర్తకులు, లెప్చావర్తకులు, భూటానునుండి భూటియావర్తకులు, నేపాలదేశంపువర్తకులు కాలినడకను పోవుచు నిటఁ గొనుగోలువ్యాపారములం జరపుచుంట నిది గొప్పవర్తకస్థలముగ నున్నది. ఇది మధ్యఆసియా వర్తకస్థలములలోఁ జేరందియున్నది. ప్రధానవీధి (బజారు) కిరుదెసలనుండు చిన్నబజారు అంగడులందు చీనావింతవింతల పని

తనముగలవస్తువులు, టిబెట్టుదేశపుజిత్రపుబనులు మొదలగునవి యమ్మఁబడుచుండును.

ఈప్రదేశము క్రీ. శ. ౧౮౬౫ వరకు భూటాను రాజ్యమునకుం జెందియుండెను. బ్రిటీషు ఇండియా లోని డార్జిలింగుకన్న వర్షపాతము తక్కువగనుండి శీతల మంతకఠినముగా లేక సమశీతోష్ణత సాధువై (milder) యుండుకారణమునఁ గ్రిష్టియన్ మిషనరీ లిట సెంటు ఆండ్రూస్ హోమ్సు స్థాపించి నడపుచుండిరి. అవి నేటికి నల్లె విడివిడిగానున్న కట్ల కాలేజీ యింగ్లండుగా గుంపుగూడి యుంటఁ గాననయ్యెడిని. పిదప భూటానీయులదొంగలు దోపిండిగాండ్రవలన బాధ లధికముగాఁ గల్గి యా ప్రభుత్వమువారి రక్షణలేనందున బ్రిటీషుఇండియా ప్రభుత్వమువా రాక్రమించి యిండియాలోనికిం జేర్చినపిదప నాతొందరలాగి సురక్షితముగా నున్నది.

దీనికిం జేరుటకు భరతదేశమునుండి రెండు మార్గములు కలవు. కలకత్తానగరము నుండి యీస్టర్న్ బెంగాల్ స్టేటురెయిల్వేలో శిలిగురిసంధి వరకరగి యటనుండి టీస్తా వేలీఎక్స్టెన్షన్లైనుపై గైల్లిఖోలాస్టేషనులో దిగవలయును. అచటి కిది పంద్రెండుమైళ్ళదూరము. మంచిమోటారుబాట పైఁ బోనగును. ఇదిగాక లగ్గేజీసరకులు మొదలగుసరకులం జేర్ప నొకరోపువేలైను గైల్లిఖోలా నుండి రైల్లీ (కాలింపాంగునుండి నాల్గుమైళ్ళదూరము) వరకు వేయంబడినది కలదు. కాలింపాంగునం దన్నివసతులు, కచేరీలు కలవు. అచటి యారోగ్యస్థితియు మంచిదే. ఉదకసమృద్ధి కలదు. పురమున దక్షిణభాగమున బంగాళాదేశస్థుల కోలనీ గల దటనుండి చూచిన దూరదృశ్యములు కడురమ్యములై కన్పడును. వాతావరణము స్వచ్ఛమైన దగుట స్పష్టముగాఁ గడు దగ్గరగా నుండురీతిం గన్పట్టుచుండును. ఉదాహరణముగా నెచ్చటనో కడుదూరమున డార్జిలింగుకడనున్న సెంచాల్ కడుసమీపమునం దున్నట్లు గన్పడుట వింతగా నుండెడిని. డార్జిలింగునుండికన్న కాలింపాంగునుండి హిమవన్నగదృశ్యము లుపరిభాగములమంచు దృశ్యములు స్పష్టముగఁ గన్పట్టుటఁ బ్రసిద్ధము. దీని కరుగునాటుబాట కొండనెక్కుటకుఁ దొమ్మిదిమైళ్ళు కష్టతరమైయుండును. ఇచటిపూఁదోటలు, ఐరోపా దేశపుఁ బూలచెట్లతో నిండియుండును. పూ లధికముగఁ బూచును. నగటున నిది యడవి మధ్యమునం దున్నట్లుండును. ఇచటి యడవిచెట్లయాకు లందు రం గధికమై గన్పట్టును. చెట్లమధ్యనుండి క్రైస్తవదేవళ గోపురములు పైకిఁ గన్పట్టుచుండును. ఈప్రదేశమునఁ గ్రైస్తవపాదిరీల పలుకుబడియు నధికముగా నుండును.

ప్రజలు బౌద్ధులగుట నిండ్లముంగటఁ బొడుగైన వెదురుబొంగుల నాటి వాటిపై బౌద్ధ షడక్షరీమహామంత్రమగు ఓమ్మణిపద్మేహం అను నక్షరముల వ్రాసి గాలియం దెగురఁజేయుచుంట నెల్లెడలఁ గాననగుచుండును. పురమున నొకగొప్ప బౌద్ధభిక్షువుల విహారము (మఠము) కల దది తప్పకఁ జూడందగినది. వారు చక్కనియాదరణము నెఱపుదురు.

కాలింపాంగునకుఁ బశ్చిమదిశగా రంగీత్ నది లోవయుఁ దూర్పున రైల్లీనదిలోవయు నుత్తరమున భూటాన్ శిక్కిందేశముల పర్వతపఙ్క్తులును దృశ్యములై యుండును.

**కాల్చిన సున్నపురాళ్లు లేక గుల్లపై నీటిం బోసిన నుడికి పొంగుట - విడఁ బారుట**—ఇది రసాయనశాస్త్రవేత్తలచే Chemical process అనంబడుచున్న సర్వసాధారణముగ నెల్లరెఱింగిన కార్యమే. కాల్చినసున్నపురాళ్లు, గుల్ల పైఁబోసినతోడనే నీరు వేడియగును.

సున్నము metal Calcium యొక్కయు నాక్సిజెనోయొక్కయు కాంపౌండుగ నాంగ్లరసాయనశాస్త్రమునఁ జెప్పంబడినది. దీనిని ఆక్సైడ్ ఆఫ్ కేల్సికమ్ అనుటయుం గలదు. ఈకాంపౌండునం దున్నప్రతిమొలక్యూలునందు నొక్కొక ఏటోము చొప్పున పైయెలిమెంటు (Element) కలదు. గానను రసాయనశాస్త్రవిదులు C a O. అని గుఱుతిడిరి. ఈ ఆక్సైడునకునీటింజేర్చితిమేని బలముగల దిగఁగలిసెడిని. దీని కింకను క్విక్లైమనియు (Quick lime) స్లాకెడ్లైమనియు (slaked lime) కూడ ననుట కలదు. స్లాకెడ్ లైమనిన oxide of calcium plus water అని నిర్వచించి రసాయనశాస్త్రవిదులు C a O . H O . అని ఫార్మ్యులా వ్రాయుచుందురు. ఇంకం గొందరు Ca (O.H.) 2. అనగా రెండుభాగములు ఆక్సిజెను, రెండుభాగములు హైడ్రోజెను కూడ కలదనుచు నట్లు చెప్పవలెనందురు.

**కాల్చి వేడిఁజేసినతఱిని, శీతలమైన తఱిని లోహములు బరువు**— ఆంగ్లరసాయనశాస్త్రధర్మములలో నొకటియగు 'Heat expands bodies & Cold contracts them" అనుధర్మముమేరకు లోహముతోఁ జేయంబడిన వస్తువు లెట్లుఁగఁ గాల్చినతఱి నుబికి యధికస్థల మాక్రమించున ట్లగుటయు శీతలసంయోగము (సంకోచమునంది) ముడుచుకుని లేక క్రుంగి తక్కువస్థల మాక్రమించున ట్లగుటయు సంభవించుచుండుంగాని యట్టిస్థితియందుఁ దూచినచో బరువునం దెట్టిభేదము గానరా కుండెడిని. ఏలనన భారము (బరువు) భూమియొక్క ఆకర్షణ శక్తి Gravitation pull) తో నావస్తువునకు దానిశరీరఁపు డెన్సిటీకి సంబంధముగాని యావస్తువు యొక్క శీతోష్ణస్థితితో నేసంబంధముఁ గలది కాదు. తూనికెయందు బరువు పూర్వమువలెనె యుండెడిని.

**కాలుట - వేడి - వెలుతురు** Burning Heat Glowing—కట్టెలు, రాతిబొగ్గు, చమురు, వత్తి మొదలగు పదార్థము లెన్నియో కాలునవి గలవు. అవి కాలినపిదప యారిపోవును. పూర్తిగను, తృణముగను కాలక నేకారణముచేత నైన నారిపోవునేని యందింకను కాలఁగల పదార్థము మిగిలియే యుండును. కాలినతఱి నేర్పడుచుండు నివురుగొయ్యి (బూడిదలం) దొలఁగింపకున్నఁ బూరిగాఁ గాలదు. లేక ఆక్సిజెనుగాలి సరిగా యందకుండిన నారిపోవుటయుం గలదు. ఆక్సిజెను తగ్గినకొలది కాలుటయుం దగ్గి యధికమగుచోఁ ద్వరితముగను తృణముగను కాలుట సంభవించుచుండెడిని. ఆక్సిజెనుగాలిని కాల్చుచుండునిప్పు క్రింది భాగమునుండి పీల్చుకొనుచుండును. అది చాలక నిప్పారిపోవుటను నాంగ్లశాస్త్రవిదులు suffocation కారణ మనెదరు.

కాల్చునగ్ని వేడిని వెలుతురును కల్గించును. కాలుటవలన వేడికల్గి పిదప వెలుతురు కల్గునని కొంద రనెదరు. మరికొందరు వేడియే వెలుతురుం గల్గించునసియెదరు. ఒకతీగయం దెలక్ట్రిసిటీశక్తినిఁ బ్రసరింపంజేసిన నది వేడి నాతీగెకుం గల్గించుంగాని రెండుతీగె లెదురొక్కన్నంగాని వెలుతురు కలుగదు. వెన్నెలయందుఁ జంద్రకిరణములు భూమిపై వెలుతురుం గల్గించును. గాని సూర్యరశ్మియందలి వేడింగూడఁ గల్గింపఁజాలవు. గాన వెలుతురున్నచో వేడి యొక్కొకసందర్భమున లేకుండనగుం గాని వేడియసలే కలుగకున్న వెలుతురు కలుగనే కలుగదు. వేడి వాడుటవలన జనించెడిని. అగ్ని కాలుచుండుంగాన వేడి గల్గును. సూర్యుఁడు కాలపున్నను దానింజుట్టిన గాలులు కాలుచు మండు

చుండుంగాన వేడి, వెలుతురు గల్గుచున్నది. ఎలక్ట్రిసిటీకీఁగ కాలకున్నను తాఁ బ్రసరించుట కీగకు వేడింగల్గించుచున్నది. ఇటీవల సూర్యునుండి వేడి భూమికడకు రాఁజాలదనియు భూమిపై వ్యాపించు వేడి వేరుకారణములనుండి గల్గుచున్నదనియుం గనిపెట్టంబడినది. వీటి వేడి వెల్గుప్రసారముల నాంగ్లరసాయనశాస్త్రవిదులు radiation అనియు to give rays of heat and light అనియుం బేరిడియున్నారు.

**కావేరీనది**— ఈ నదిని దక్షిణదేశస్థులగు హిందువులు భాగీరథీగంగనుబోలిన పవిత్రనదిగా నెంచుచుఁ బొగడుచుందురు. ఇది కొడగురాజ్యమున మెర్కారాపట్టణమునకుఁ గొంతదూరమున దక్షిణమున నున్న పర్వతపంక్తియొక్క యొకానొకయెత్తుగుప్రదేశమున నొకకుండముండినతావున జన్మించి, పెక్కుక్షేత్రములగుండా ప్రవహించుచు, నైదువందలమైళ్ళు నడచి, మూఁడుప్రధానశాఖలుగఁ జీలును. అం దుత్తరముననున్న పెద్దశాఖకుఁ గొల్లడ మనిపేరు. తక్కిన రెండుశాఖలును నొక్కొకటి రెండేసిగఁ దిరుగఁజీలి, యీయైదుశాఖలును పూర్వ (తూర్పు) సముద్రమనంబడు బంగాళాఖాతమున తంజావూరుమండలప్రాంతముల నాగపట్టణమురేవు కాంరెక్కాలుపురము ట్రాంక్విబారుపురముపరిసరముల నుత్తరదక్షిణదిశలందు సముద్రమునఁ జేరుకొనుచుండును. దీనింగూర్చినపురాణకథనము తులాకావేరీమాహాత్మ్య మనంబడు గ్రంథమున గాననయ్యెడిని.

కావేరినదిజన్మస్థానము కవేరమహర్షి యాశ్రమమునకుఁ గతిపయ దూరమునందుఁ గలదు. పర్వతమునకు 'బ్రహ్మగిరి' యనిపేరు. ఈనది వైష్ణవక్షేత్రముల ప్రక్కంబడి ప్రవహించుఁగాన దీనిని రామానుజీయవైష్ణవమతస్థులు భక్తిపారవశ్యమున "కావేరీవిరజాత్తోయం వైకుంఠం రంగమందిరం। పరవాసుదేవో రంగేశో ప్రత్యక్షం పరమం పద"మ్మనుచు, కావేరీజలములు వైకుంఠమున నున్న విరజానదీజలములనుండియె వచ్చినవని పల్కుచుందురు. కవేరర్షి కొక చక్కనికొమరిత యుండెనఁట. ఆమె కాయననుండియె 'కావేరి'యని పేరు గల్గెనఁట. ఆమె యటనున్న బ్రహ్మగిరిశిఖరమున గొప్పతపం బాచరించి, పరమేశ్వరునిమెప్పు నందెనఁట. తండ్రికడనే యుండి యుపచారము లొనర్చుచు నుండుతఱి నగస్త్యుం డరుదెంచి యామెం జూచి కామించి యామెనిమ్మని యర్థింపఁ గవేరర్షియు నీయకొన నామె నాయగస్త్యుండు విడకుండునంతదనుక తనయాశ్రమంబుననే యుండి యామెకుం భర్తగనుండు విధితోఁ బరిణయ మొనర్ప నాతం డట్లె యొప్పుకొని యామెతో గార్హస్థ్యసుఖముల ననుభవించుచుండెనఁట. ఒకనాఁ డెట్టకేలకు వారిబుణవిముక్తి సమీపింప నాయగస్త్యుండు విధిని మరచి స్నానమునకై దూరప్రదేశమున కరుగ, కవేరుండును నైక్యావస్థం జెందెనఁట. కావేరియుఁ దనతపఃఫలంబుఁ జేయూఁతగఁగొని తానటనే యొకనది గాఁగోరి, భూమినుండి జలధారఁగ జన్మించి ప్రవహించుచుండ, నాయగస్త్యుం డరుదెంచి ఖిన్నుండై వగచుచు "నోనదీలలామమా! గత మిటులజరిగె నైనను నీవిఁకముం దరుఁగఁదగిన మార్గముం దెల్పువాఁడ నట్లరుగుదువు గాక" యని కొన్ని క్షేత్రములను నుడివెనఁట. అగస్త్యుండు దారిందీయుచు ముందునడువ, కవేరసుతయగు కావేరీనదియు వెనువెంట మందగమనయై జనుచుండె. ఆకొండలలో నొకచోఁ గేవలనిర్జనప్రదేశమున నాజక్కెర యొకరంధ్రమునంబడి భూమియం దింకినట్టె యటకుఁ గొంచముదూరముననే యివ్వేలఁగానున్నభగమందక్షేత్రమునం దలచూపి, భూమినుండి పైకివచ్చుటంగూర్చి యీక్రిందికథనముం

జెప్పుచున్నారు. ఆనిర్మానుష్య ప్రదేశమున మునిస్వామి కవేరసుతయందు మోహావేశదుర్భర పరవశుండై యానదీలలామము నాలింగనమొనర్ప సమకట్టుతఱి, నాజలప్రవాహము భూగతమై యదృశ్యమయ్యె. అంత నాతండు తెల్విం దెచ్చుకొని, నిట్టూర్పు నిగుడ్చి వగచుచు నేమియుం దోఁచక నడచి భగమండక్షేత్రమున నిలచి పశ్చాత్తాపమునంది యిఁకముం దిట్లుం జేయ కుండు నని కావేరిం బ్రార్థింపఁ దిరుగ నట నుద్భవించి, యాతనివెంటఁ జనసాఁగెనఁట.

అచటికిఁ గొంచెముదూరమునం దిరుదశలనుండియు రెండు చిన్ననదు లీకావేరియందు సంగమించును. ఆమూఁడునదులం గల్పియే కృష్ణరాజనగర మనంబడు గొప్పసరస్సును, అందు కన్నంబాడి డాముకట్టడమును మైసూరురాజ్యమునం దిటీవల నిర్మింపంబడినవి. వాటింగూర్చి వేరుతావున వివరింపఁబడియుంటఁ దిరుగనిట వివరింపబడఁలేదు. ఇది మైసూరుప్రభుత్వమువారిచే నిర్మింపఁబడిన గొప్ప జలనిలయము (reserovir) గ నున్నది. అందుత్తరదిశనున్ననది యధికజలములం దెచ్చి చేర్చు నని చెప్పంబడినది. దాని కిరువదిమైళ్ళలోఁ గావేరీనది రెండుశాఖలుగఁ జీలి యారెండుశాఖలనడుమను శ్రీరంగపట్టణద్వీపము నేర్పఱిచి తిరుగ నారెండుం గలసిపోయెడిని. ఇట్టుల నగుటకుం గావేరీనది పశ్చిమవాహినిగఁ బ్రవహించును. ఇట గొప్పస్నానతీర్థ మేర్పడియున్నది. ఇంక నిట పురాతనఁపు రాతివంతెనకిందుగ నడచెడిని. శ్రీరంగపట్టణద్వీపమున రంగనాథునిదేవస్థానమున్నది. దీని నాదిరంగ మని శ్రీవైష్ణవు లనియెదరు.

ద్వీపమున కవ్వల రెండుపాయలు తిరుగఁ జేరుకొనినతావున సంగమేశ్వరశివలింగముకడ స్నానతీర్థ మేర్పడియున్నది. అటుల నేకమైనకావేరి యింక ముప్పదిమైళ్ళదూరమునందున్న శివసముద్రముకడకుఁ జేరుంగాని దారిలో నెక్కువవంకరలం దిరుగుకతన దూర మధికమగును. ఈశివసముద్రముకడనే జగత్ప్రసిద్ధమగు విద్యుచ్ఛక్తి జనింపఁజేయు మైసూరుసంస్థానఁపువారి యంత్రాగారమును నిర్మించియున్నారు. ఇట నది రెండు పాయలుగ దిరుగఁ జీలి, జలపాతములుగ నేర్పడి తిరుగఁ గలసి ముందున కాగ్నేయదిశగా నరిగెడిని. కొంతదూర మటులం జని, హోజనకాల్ జలపాతముల యుదకములం గల్పుకొని నైరుతిదిశకు మరలి కొంచముదూర మరగి, తిరుగ నాగ్నేయదిశకుం దిరిగి నడుచుచు నొకచిన్నజలప్రవాహముం గల్పుకొని దక్షిణాభిముఖమై మెట్టూరుకడకుఁ జేరును. మెట్టూరుడాము సుప్రసిద్ధనవీననిర్మాణము. ఇదియుం గొప్పజలనిలయము. సేలంమండలములోనిది. కావేరీగమనమార్గము నించుక యూపి, యీ మెట్టూరుజలనిలయముం గూర్చి వివరింతుము గాక.

మెట్టూరుడాము (Dam) బ్రిటీషుసామ్రాజ్యమంతటియందు నెక్కువ పెద్దదిగాఁ జెప్పంబడినది. ప్రపంచమంతటను లెక్కించిన నిది రెండవదియఁట. దీనిని నిర్మించుట కారుసంవత్సరములు పట్టెను. ఆరువందల యెనుబదిలక్షల రూపాయలు వ్రయమయ్యెనని తెలియుచున్నది. డాము గోడపొడ వొక మైలుండును. జలనిలయములోతు ౨౧౭ అడుగులుండి యాజలనిలయము (reservoir) నందుఁ దొంబదిమూఁడువేల అయిదువందల ఘనఁపుటడుగుల (Cubic feet of water) జలములను నిలుప వీలగుచున్నది. దీనికిం జలములం దెచ్చుమార్గమును Bridle of the river అనియెదరు. ఇది తొలుత రెజర్వాయరు జలనిలయముగఁ బ్రారంభింపఁబడినను పిదపం గావేరిముంపులనుండి దేశమును పంటలను రక్షింప

నుపయోగించుచున్న దనుచున్నారు. కావేరీనది ముంపులనుండి క్రీ. శ. ౧౯౨౪ జూలై నెలలో సంభవించినయుంత యధికనష్టముఁ గల్గించినదని చెప్పంబడినది. అప్పటి ౪౫౦ గా తక్కువయందు Cusecs గా నుండిన జలములు ౪౫౬,౦౦౦ Cusecs గా పొంగి యధికనష్టకరమై భయంకరముగఁ బరిణమించె నందురు. ఈమహానిర్మాణమగు డాము నందుఁ జూడఁదగిన విచిత్రము వేరొకటి కలదు. దానిగోడలగుండా యెన్మిదిన్నర యడుగుల యడ్డుకొలతఁగల నాల్గుపెద్దగొట్టములు నిర్మింపంబడినవి. వాటికి Hydro electric pipeo అనెదరు. వాటిగుండా నీరుప్రవహించుచు నివ్వల కరుగు నంతలో విద్యుచ్ఛక్తి జనించునటుల లోని యంత్ర పరికర మమర్పంబడియుంట విచిత్ర మనిపించెడిని. ఆవిద్యుచ్ఛక్తి కడుదూరము గొంపోవం బడుచున్నది. కాంచీపురమున వెల్గిచ్చు దీపకళిక లిట నుండియే వచ్చుచున్న వందురు. ఇటీవల మెట్టూరునుండి మైసూరు శివసముద్రముఁదనుక నొకటొంబాట విద్యుచ్ఛక్తిచో నడపంబడునది వేయుచున్నారని వించుము. ఈవిద్యుచ్ఛక్తి నుండియె ఎంజినీయరు లీ మెట్టూరువిద్యుత్సంస్థను వారి శాస్త్రభాషావచనములతో "Mettur is now a base lood station tud to the Pykara the former supplying normal power, and the latter taking the peak loods" అని యనుచున్నారు. ఎల్లరు నీసంస్థను "marvel of modern engineering skill" అని పొగడెదరు. దీనిని నిర్మించుటకు మున్నిదివరకు జ్వరపూరితమై యున్నారుజనులను మాత్రముఁ గల్గియుండిన మెట్టూరుగ్రామమును జేచిరా కొనచ్చి యిప్పటిమెట్టూరును నిర్మించి యం దుద్యోగుల నుండంజేయుచుఁ గూలీలను రప్పించి డాముపనులకుం గడంగిరని యందురు. ఇది సర్వవిధముల యభివృద్ధి నందుచు నారోగ్యవంతమగు పట్టణమై యున్నది. సర్వదా గొప్పధ్వని యొనర్చుచుఁ జెవులం గింగురుమనం జేయుచుండు నుదకధ్వనులం గల్గినదావుగ నున్నది. చక్కని యంగడులు గలబజా రేర్పడియున్నది.

దీని నింతట వదలి కావేరీనదీగమనముకడ కరిగిన, దక్షిణముగా నరుగుచుండిన నది భవాని యనంబడు గ్రామముకడ కరగును. ఇట భవాని యనునది కావేరియందు సంగమించును. ఈసంగమమున నమృతలింగేశ్వరశివలింగము కలదు. ఇది పుణ్యస్నానతీర్థమై యుండుశివక్షేత్రముగ నున్నది. ఇది యీరోడ్డుపట్టణపరిసరము. ఇటనుండి నది యాగ్నేయదిశగా నరుగుచు నోవారను నదిం గల్పుకొని పూర్వవాహినిగఁ గొంతదూర మరిగి యట వేరొకచిన్ననదిం గట్టుకుని తిరుగ నాగ్నేయదెస కరగుచుఁ గుడిమైపున నమరావతీనదిని వేడమమైపున వేరొకచిన్ననదిం గట్టుకొని బలపడి పూర్వవాహినియై తిరుచనాపల్లిపట్టణముకడకుంజేరి యట పురముందాటి తూర్పుదెసకు రెండు చీలికలై సుప్రసిద్ధశ్రీరంగద్వీపము నేర్పఱచి దాని కవ్వల తిరుగం గలుసుకొనునటుల నటించుచు మూడుపాయలుగం జీలుకొని నడుమనడుమ డెల్టాల నేర్పర్చుచుండెడిని. అం దుత్తరంపుశాఖానది యెక్కువ వెడల్పైనది. దీనికిం గొల్లడమని పేరు. ఇది యీశాన్యదిశగాఁ జనుచు పుదుచ్చేరి, గూడలూరు పురములకుం దక్షిణముగను కారైకాలుపురమున కుత్తరముగను కొంతదూరముగ బంగాళాఖాతమును జేరుకొని సంగమించును.

తిరుచనాపల్లికడ కావేరీనది కడ్డముగ నిర్మింపంబడిన యానకట్టకలదు. అది చోళభూపతులపాలన నాటి నిర్మాణమని చెప్పంబడుచున్నది. ఇది వేయి యడుగులపొడవున నున్నగట్టిపని. దీని నాంగ్లమున Grand Anicut అని వాడుచున్నారు.

తక్కిన కావేరినది చీలికశాఖలలో రెండవది. తిరుగ రెండుశాఖలుగఁ జీలుకొని పూర్వవాహినులై బంగాళాఖాతముననేసంగమించునను. అందుఁ గ్రింది (దక్షిణఁపు) శాఖ కారైక్కాలుపురము కడనే సాగరసంగమ మొనర్చెడిని. మిగిలిన మూఁడవశాఖ పూర్వగమన మొనర్చుచు సుప్రసిద్ధమగు తంజావూరుప్రక్కఁబడి నడచి కొంతవఱ కాగ్నేయమునకు మరలి కొంతదూర మరిగి యదియు రెండు చీలికలుగఁ దిరుగం జీలి రెండగును. అం దుత్తరఁపుశాఖ యాగ్నేయదిశకుఁ బ్రవహించుచు ట్రాంక్విబార్ రేవునకుం గొంత దక్షిణమున బంగాళాఖాతముం జేరును. దక్షిణఁపు శాఖ కేవలదక్షిణాభిముఖమై జనిచని బంగాళాఖాతమునం జేరుకొనెను.

౧. మెర్కారా
౨. బ్రహ్మగిరిపర్వతపం
౩. కన్నంబాడిడాము
౪. శ్రీరంగపట్నం
౫. మైసూరు
౬. శివసముద్రం
౭. మొగినేకాల్ జలపాతము రిజరు
౮. మెట్టూరుడేము [వాయరు
౯. మెట్టూరు
౧౦. సేలం
౧౧. భవాని
౧౨. ఉదకమండలం
౧౩. ఈరోడ్డు
౧౪. కోయంబత్తూరు
౧౫. తిరుచునాపల్లి
౧౬. శ్రీరంగం
౧౭. తంజావూరు
౧౮. కారిక్కాల్
౧౯. గూడలూరు
౨౦. పుదుచ్చేరి
౨౧. నాగపట్నము
౨౨. ట్రాంక్విబార్



తొల్లింట వైవస్వతమనువు తనమనుధర్మ శాస్త్రము వ్రాయువరకే నదులయొక్క గమన త్వరిత మానదీజలములం బరిశుభ్రపరుచు చుండు నను సిద్ధాంతమును భరతదేశ మెఱింగియే యుం డెను. వైవస్వతుఁడు తనమనుధర్మశాస్త్రమునఁ గొన్నివేల సంవత్సరములకుఁ బూర్వమే క్రీస్తు పుట్టుటకు మున్నే దీనిని వివరించియుంటఁ గాన నగును.

ఇటీవల చెన్నపురియందు శేనిటరీకమీష నరుగా నుండిన Lieutenant colonal King. I. M. S. గారు కావేరీనదీజలములం గూర్చి గొప్పపరిశీలనల నొనర్చి యొకపర్యాయము కావేరీ జలములకుం దగిలిన విషూచిరోగదోషము పద్దెని మిదిమైళ్ళ ప్రయాణమైనపిదపంగాని యాజలము నుండి పూర్తిగా వీడదని కనిపెట్టి వ్రాసెను.

ఇంగ్లాండునందలి డీ (దేవ) నదీజలముల పరిశీల నలు, Isar నదీజలముల పరిశీలనలు, భరతదేశఁపు యమునానదీజలపరిశీలనలు జాగ్రత్తగఁ బరిశీలించిన Hinkin పండితుని పరిశీలనాఫలితములనే స్ఫురింపఁ జేయుచున్నవి. భాగీరథీ గంగానదీజలము లతిశుభ్రము లగుచుండుట కిదియే కారణము గాఁబోలును.

**క్రాంగనూరు దేవీక్షేత్రము**- దీని నర వలు కొడుంగల్లూరనియు వాడుట కలదు. ఆది సంస్కృతనామము కోటిలింగపురము. ఇది మళ యాళదేశమునఁ దిరుచ్చూరు (Trichur) నుండి దక్షిణముగా నిరువదినాల్గుమైళ్ళదూరమున క్రాంగ నూరని వాడంబడుచున్న పట్టణముగా నున్నది. ఇటనే యాదిని చేరమాన్పెరుమాళ్ళనుభూపతి రాజ్యమేలెనందురు. ఇటంగల దేవీక్షేత్ర మీప్రాంత దేశమున సుప్రసిద్ధము. ఈదేవిని కొందరు మళ యాళభగవతి (మూకాంబ) యని యందురు. ఇటంగల శివలింగమునకు ముండేశ్వరుఁడని పేరు. ఏటేట నీదేవీక్షేత్రమున మీనమాసమున (ఫా ల్గుణి) భరణి యాత్ర జరగును. అత్తఱి మళ యాళభూమియంతటినుండి వేనకువేలుగ యాత్రస్థు లరుదెంచి దేవాలయబహిఃప్రాకారఁపు ద్వారము కడ నొకయావరణమున నొకకోడిం బలి యిచ్చు చుందురు. ప్రతియాత్రార్థియు బలి నర్పింపఁ దన కోడిం దాఁ దెచ్చుకొనుచుఁ గడుంగడు దూర మైనను నడచి యేతెంచునందురు. దారి నడచు తఱి జావళీపాటలం బాడుదురఁట. ఈక్షేత్రము కొచ్చిన్ ప్రభుత్వరాజ్యములోనిది. ఇట దేశమంద లివారలకు భక్తి మెండు.

అత్తఱి నీదేవి కడనుండు నందురు. తలుపులు మూయంబడి పూజానైవేద్యము లుండవఁట. ఏడుదినము లీయాత్ర యటుల జరుగునఁట.

**క్వార్ట్జురాయి** Quarty stone— ఈశిలం భూత(దుర్భిణి) యద్దములతోఁ బరీక్షించిన శరీరమంతయు రంధ్రములఁబోలిన కన్నములు లేక గుంటలు (bavities) తో నిండియుండును. వాటియందు నీరుండుటయుం గలదు. ఇట్టివి యొక ఘనఁపు టంగుళపరిమితిఁగల రాతియందుఁ గోట్లు కొలది యుండుట విచిత్రము. క్వార్ట్జురాయి ప్రపం చమునందలి కఠినమైనశిలలలో నొకటిగఁ జెప్పంబడి నది. అరుగక నిలచునది. పగులఁగొట్టంబడినను కఠిన ములైనగులకరాళ్ళును, గ్రైనైటురాళ్లును, నిసుకం గట్టిగఁ బట్టుకొనుచుండునది. sand stone అనంబడు రాతిపర్వతములు క్వార్ట్జురాతిపొడుము లేక యిసుకతోఁ జేయంబడినవనియు సర్వసాధా రణఁపు టిసుకయందుఁగూడ నీక్వార్ట్జురాతి పొడుము త్రసరేణువు లధికముగ నుండుననియుఁ గనిపెట్టియున్నారు.

బంగారఁపుగనులందు బంగార మీరాతియందుఁ దరుచుగ దొరకుచుండును. దానిం బొడుముగ నొనర్చి బంగారముం దీసికొనెదరు. ఈక్వార్ట్జు రాతిలోని Silicon నుండియె యగ్గిరాళ్ళు (Flints), Prisms రాళ్ళు, సులోచనములం జేయుచున్నరాళ్లు, Pebble రాళ్ళు, లెన్సు Lences రాళ్ళు కల్గుచున్నవి. Amithyst, Agate, Cairngorm, Chalcedony Jasper, Opal రాళ్ళు దీనిపరిణామములేనని పరిశీలనలు స్థిరపరిచినవి. కొన్నిరత్నములును క్వార్ట్జురాతిరూపాంతరములేనని తలంపంబడుచున్నది. ఆది నిది Gneiss రాయిగ నేర్పడి లక్షలుఁ గోట్లసంవత్సరములు గడచినపిదపఁ గ్వార్ట్జుగనైనదని కొందర నుచున్నారు.

**కింగ్సు ఇంగ్లీషుభాష:**—ఇంగ్లీషు లేక ఆంగ్లభాష స్వతంత్రభాష కానందున వేర్వేరు విధములుగ నాంగ్లదేశఁపు వేర్వేరుసీమలందు వాడంబడుచుఁ దెలియఁ గష్టముగ నుండెనఁట. పండితులం దొకమంచిభాషంగూర్చి ప్రభుత్వసన్నిధానమున వాడుచుంట నాభాషకు కింగ్సు ఇంగ్లీషని వాడుక గల్గెనఁట. wireless broad casting వచ్చినతఱి స్వచ్ఛమగు నుచ్చారణకై పండితులసంఘ మొకటి యేర్పడి మాటల నెంచెనఁట.

**కితకితలు-నవ్వు (Tickle & Laugh):-** నవ్వునకు మనస్సునందు జరుగుపని ప్రధానము. ఇదియె నవ్వుయొక్క ప్రధానరహస్యము. ఆనందము, వినోదము, నన్యులందుఁ బరాభవము మొదలగు రసాభాసములం గాంచిన నవ్వువచ్చుటకు మనస్సునందలి యట్టివాటిగ్రాహ్యశక్తియె గాని వేరుకారు. అన్యులు కితకితలు పెట్టినతఱి నవ్వువచ్చుట మనస్సున కఠాత్తుగ నది విభ్రమముం గల్గించుటయె. ఎవ్వారికి వారు కితకితలం బెట్టుకొనినతఱి మనస్సున కెఱుకయై యుండుం గాన విభ్రమముం గల్గింపదు. కాన మనస్సు చేయుపని యుండదు గాన నవ్వు రాదు. కితకితలందు శరీరఁపుంద్వక్కు (చర్మము) నందే యలజడి కల్గి మనస్సునకు నాటి యట విభ్రమము కల్గునని పోల్పంబడియున్నది. విభ్రమము, ఆనందము, సంతసము, నన్యులరసాభాసగ్రాహ్యము మనస్సునకు బలహీనతం గుదిర్చి పరవశత్వముం గల్గించెడిని.

**కిర్క్యూక్-** ఇది ఇరాక్ (మెసపుటేమియా) దేశమునం దున్నది. బాగ్దాదునుండి యిట కినుప దారిబాట కలదు. కొందరు పరిశీలకులు బైబిలునందు వివరింపంబడిన 'అరారాతు' ఇదియెనని పోల్చుచున్నారుగాని పరిశీలనలింకను జరగవలసి యున్నది. రైల్వేస్టేషనునుండి మైను మైళ్ళదూరములో మంచిమోటారుబాటను బాబాగుర్గూరను గ్రామముకడ భూమినుండి రాతియిరుకుల నుండి యగ్నిజ్వాలలు కల్గుచుండుతావు కలదు. అచ్చటనే బైబిలునందు వివరింపంబడిన ముగ్గురు బాలు రగ్నిపరీక్ష నందినతావని చూపుదురు. నేటికిని నగ్నిజ్వాల లటఁ గల్గుచుండును. కిర్క్యూకు నుండి పదునాలుగుమైళ్ళదూరమునంగల 'తర కాలన్' అనంబడుతావును, ఆర్కియాలోజికల్ డిపార్టుమెంటువారు త్రవ్వించి కొన్నిపూర్వఁపు వింతలం బయలుదేరఁదీసిరి. కిర్క్యూకునుండి మసొలున కరుగుబాటనంటియె 'అర్బిల్' అనుగ్రామము కలదు. అది బైబిలునాడున్న పేరునే నేటికిం గల్గి యుంట విచిత్రము. ఏమార్పు నందలేదు. అర్బిల్ అనిన నాల్గుదేవతలని యర్థమఁట. దేవస్థానమం దొక దిబ్బపై నున్నది. దిబ్బక్రింద దానిక్రింద దిబ్బలో 'ఇష్టార్' దేవత యున్నదఁట. ఇష్టారనిన మహామాతయనియో, మహామాతృకయనియో నర్థమఁట.

**కి. వి. పిట్టలు (పక్షులు) kivi birds:-** ఇవి న్యూజిలాండుదేశమున వెనుక విస్తారముగను, ఇప్పు డరుదుగను గన్పించెడిపక్షులు. వీటికి రెక్కలుండుజాడలే గానరాకుండును. వీనియరపు నుండి స్వదేశస్థులు వీనిని కి. వి. పిట్ట లందురు. ఆంగ్లశాస్త్రవేత్తలు వీనికి 'Apteryx' అని పేరిడిరి. ఇవి రాత్రులం దాహారమును సంపాదించుకొనబయలువెడలును. వానికిఁ బొడుగైన ముక్కును దానికొనను నాశికారంధ్రములును నుండును. దీనికి ముఖ్యాహారము భూమియందుండు పురుగులు. దీనినెదిర్చిన కాలిగోళ్ళతోఁ గడుధైర్యముగఁ బోరాడుచుండును. కోడియంతప్రమాణఁపు శరీరముఁ గలియుండునది.

**క్లియోపాత్రాస్ నీడిల్** (Cleapatra's Needle):— ఇది యేకశిలాస్మారకచిహ్నము. కడను సూదిగనుంట నీటిల్ (సూది) అని పేరిడంబడి యుండనోపు. బ్రిటీషుసామ్రాజ్యఁపు రాజధానియుఁ బ్రధాననగరమును నగు లండనునందు తేమ్సు ఎంబేంకుమెంటు (నదీతీరము) నందు ఛార్లింగుక్రాసు రెయిల్వేవంతెన కనతిదూరమునం దిది యొకశిలాపీఠము (దిమ్మ) పై సమర్పంబడి యలంకారార్థ ముంపఁబడినది. కాని దాని వాడుకనామము దానినిర్మాణముతో నేసంబంధమును గల్గినదికాదు. అది 3౫00 సంవత్సరముల నాటిదని యందురు. ఈజిప్టుదేశమేలిన మూఁడవ తోత్మీస్ భూపతి కాలమున నాదేశఁపు గండశిలల నుండి యిట్టిసూదికొనలుగల నలుపలకల స్తంభము లంబోలిన యేకశిలాచిహ్నములు రెండుచెక్కఁబడి వానిపై నామహీపాలుని ఘనకార్యములు జయములు చెక్కఁబడినవి. అవి భాషాక్షరములు కావు. Hieroglyphics అని పేరిడంబడిన చిత్రలేఖన (picture writing) విధానశిల్పము. అవి చెక్కఁబడునాటికి క్లియోపాత్రారాజ్ఞి జన్మించుటయేలేదు. పిదప మూఁడుశతాబ్దములనాఁ డామె జన్మించినదిగా చరిత్ర చెప్పుచున్నది. ఆరెండు శిలలలో నొకటి యమెరికాసంయుక్తరాష్ట్రముల ప్రధానవర్తకనగరమగు న్యూయార్కులోని సెంట్రల్ పార్కుమహోద్యానమునకుఁ గొంపోవఁబడి యట స్థాపింపంబడియున్నది. అది పొడవు వలము లందుఁ బెద్దదియై లండనుక్లియోపాత్రాస్ నీడిల్ నకు మిన్నయైయున్నది. తరువాతిది లండనునందున్నది. అరువదియెన్మిదియడుగులన్నర యెత్తు గలది. ఇది క్రీ. శ. ౧౮౭౮ సెప్టెంబరునెల తే ౧౨ దిని యట సమర్పంబడినదఁట.

**కీబోర్డు ఆఫ్ ఇన్విజిబుల్ హీటు వేవ్సు** (Key Board of invisible waves of heat:—ఈ యంత్రపరికరము సాధారణముగ తెర్మోమీటరుంబోలియె యుండునుగాని దాని కన్న సునాయాసముగఁ గనిపించని హీట్ వేవ్సు (రంగులం) గూర్చి వివరించునది. (రంగులనిజతత్వము చూడుఁడు) ఇది రెండుగనుండియు నొకటి తరువాయి వేరొకటియెగాని యన్యముకాదు. specirum of visible light నందువలెనె దీనియందును నల్లగీతలు, తావులు గన్పించెడిని. కన్పించని యుష్ణతరంగములకు రసాయనశాస్త్రవేత్త లింకను voilet rays కన్నఁగూడ చిన్నవిగ నుండుకతన ultra voilet rays అనిగూడ వాడుచున్నారు. అవి ఇంకను చిన్నవగుచు క్రమముగ పోనుపోను X rays గా సమసించెడిని.

హీటో రేస్ ఇంకను బోర్డునందు క్రిందికిఁ జనుతటి నాలస్యముగను పెద్దవిగను సమసించుచు electrical properties గ నేర్పడి యెలక్ట్రిక్ వేవ్సుగ నయ్యెడిని. అవియె టెలిగ్రాఫు టెలిఫోనుల తీగెలవెంబడిని బర్వెడునవి. మరియు

వైర్లెస్‌నందుఁ బనిచేయు ఎలక్ట్రిక్ వేవ్సుకూడ నివియె. ఎలక్ట్రిక్ కరెంటు (ప్రవాహము) గల్గించునవియు నివియె.

దీనిని elecric theorey అనియు ననుట కలదు. దీనింబట్టియె వెలుతురుకూడ నెలక్ట్రిసిటీ యేనా? యని యనిపింపకపోదు. కొందరు రసాయనశాస్త్రవేత్తలు invisible heat waves ను Radient heat అనియు వాడియున్నారు. వీటిం గొన్నిపదార్థము లాటంకముం గల్గింపనివి (that admit light) గను, కొన్ని దానిం ద్రవపర్చి పీల్చివేయునవిగను, నింకంగొన్ని వాటితలము లనుండి ప్రతిఫలింపం జేయునవిగను చెప్పంబడుం గాని వాటింగూర్చి యిదమిద్ధమని చెప్ప వీలు గాన రాకున్నది. అట్లయ్యు వెలుతురు రేడియంటు హీట్ (వేడి) ధ్వనుల నొకేరీతిని ప్రవర్తింపఁ జేయుటం దెల్పు పద్ధతి యొకటి రసాయనశాస్త్రమున కెఱుకయైనది కలదు.

ఒకరబ్బరుబంతి నొకగోడకుం దగులునటులఁ దిన్నగాఁ గొట్టనది యాగోడకుం దగిలి తిన్నగనె వెనుకకు నెట్టంబడి కొట్టినవైపునకే తిరిగి వచ్చెడిని. ఆరబ్బరుబంతినె యొకవైపునుండి వంకగ విసరిన నది గోడకుఁ దగిలి యేవంకనుండి యది విసరఁబడినదో యావంకకే తిరిగి వచ్చును. ఇట్లనుటయం దెంతమూల (Angle) గఁ గొట్టుదురో యంతమూల (Angle) గఁ దిరిగివచ్చునని యెఱుంగునది. అట్టిమూల కాంగ్లరసాయన శాస్త్రమున The angle of incidence అని సాంకేతికనామ మిడంబడి వాడంబడుచున్నది. ఈ angle of incidence వెలుతురుయొక్క angle of reflection గను, ధ్వనియొక angle of reflection గను నుండునని కన్గొనంబడి యున్నది (రిఫ్లెక్షను చూడుడు. రిఫ్రెక్షను చూడుడు).

## కుడిచేతివాటము - ఎడమచేతివాటము

కుడిచేతివాటము - ఎడమచేతివాటము—ఏచెయ్యి యెక్కువగను, నెక్కువ నేర్పుగను, నెక్కువబలముగను పనిచేయునో యాచేతివాట మామనుజునకని వాడుచుండు టెల్ల రెఱింగినదే. పరిశీలకులు నూటికిఁ దొంబదిమంది కుడిచేతివాటము కలవారుగను, పదిమంది యెడమ చేతివాటము కలవారుగను నుందురని లెక్కించి యున్నారు. కొందరింకను రెండుచేతులవాటము నొకేరీతిం గలవారు కలరుగాని యట్టివారు చాల యరుదు. కొందరెక్కువ యభ్యాస మొనర్చి రెండుచేతుల నొకేరీతిం బనిచేయ నేర్పరులుగ నయ్యెదరుగాని యది పాటింపందగినది కాదు.

వాట మేర్పడు టలవాటని చెప్పందగును. నైసర్గికముగ సహవాసమునుండియు నింటిలోని వారింబట్టియు నిట్టియలవాటు బాల్యమునఁ బరిపాటగుట ప్రారంభమై స్థిరపడుననియుఁ బసితనమందట్టి యలవాటుండదనియు వాటము కుదురుట మెదడునకు స్పృహగల్గుటతో నారంభమగుచుండుననియు బరిశీలనలు తెల్పుచున్నవి.

## కుశస్థలీనది—

(నగరి-కుశస్థలీనది చూడుడు)

**కూకట (ఇప్పటిగోకట)**— ఇది యొక గ్రామము. కడపమండలమునకుం జెందియున్నది. దీనిని శ్రీకృష్ణరాయసార్వభౌముఁడు తనయాస్థానకవియగు నల్లసానిపెద్దనామాత్యుని కగ్రహారముగ నీయ నాయన భక్తితోఁ దనవిద్యాగురుఁడగు శఠగోపయతికి భక్తిపూర్వకముగ సమర్పించెనఁట. ఈప్రాంతములఁ బెద్దనామాత్యుని స్వశాఖీయు

లగు నందవరీక బ్రాహ్మణులు విస్తారముగ వసించుచున్నారు. పెద్దనపాడను పేరంబరగుచున్న గ్రామ మీసమీపమందే గలదు. అది అల్లసానిపెద్దనగారి స్వగ్రామ మందురు. నేటికిని యాప్రాంతముల నడచు శుభకార్యములందుఁ దొలుత నల్లసాని పెద్దనగారితాంబూలమని గౌరవతాంబూలమొకటి వేరుగ నునిచి పిదపఁ దక్కినపండితులకుఁ దాంబూలము లిచ్చు నాచారము వాడుకయం దున్నది. పెద్దనపాటి దాహముల నీటిచెఱువున కిప్పటికిఁ బెద్దనచెరువను పేరు నిలచియున్నది. తొల్లి యొకప్పు డీప్రాంత మరణ్యసీమగ నుండెననియు నత్తఱి నడవిమృగము లిందు దాహముం దీర్చి వర్రాత్రులం దరుదెంచుచుండెననియు నచటివా రందురు.

## కృష్ణరాజసాగర జలస్థంభన స్థానము:— (బృందావనమహోద్యానము చూడుడు)

**కెమికల్ - సెన్సెస్** (Chemical senses) (**వాసనరుచి**)— ఘ్రాణేంద్రియమునకుం దెలియు వాసనయు జిహ్వకుం దెలియనగు రుచులు ను రసాయనికచైతన్యములు. వీటి నాంగ్లరసాయన శాస్త్రమున 'కెమికల్ సెన్సెస్' అని వాడి యున్నారు. ఇవి యీతరునుండి వచ్చినను గాలి నుండివచ్చినను నలలరూపమునఁ గదలునవి గావు. ఇవి యన్యోన్యసంబంధముఁ గలవిగఁ దోఁచెడిని. ఒకటితో నొకటి కలసి పనిఁజేయుచుండునవి.

మేధస్సునుండి రెండుజతలనరములు ఘ్రాణేంద్రియమునకుం జేరును. అం దొకజత వాసనలు గ్రహింపం జేయు చైతన్యనాళములు (Sensative nerves)గ నున్నవి. రొంపఁ గల్గినతఱి నవి మొద్దుఁబారి వాసనలం దెలియకుండ నగుచుండును. వాటి నాంగ్లశరీరశాస్త్రవిదులు first pair of nerves అనుచుందురు. అవి ముందుండునవి. ఇవి వార్థక్యమున నించుక పటిమ తగ్గి యుండును. అనగా వయఃకాలమున నున్నంతబలముగ వాసనలం గ్రహింపఁ జాలకుండునని భావము. రెండవజతనరములు వీటివెనుకగా నుండి మేధస్సు (brain) నుండి ఘ్రాణేంద్రియముకడకుం జేరునవి. వీటికి వాసనలతో నేసంబంధము లేదు. ఇవి ముక్కునందుఁ గల్గు కితకితలచేఁ గల్గు తుమ్ములం గల్గించుట మొదలగు పనులం జేయునవి. ముక్కు దిబ్బడివేయుటయందు వీటికింగూఁడ గొంచెము పనిగలదని కొందర నుచున్నారు.

భరదేశఁపుఁ బూర్వఁపుఁబరిశీలకులు రుచు లారని వివరించిరి. అవి, ఉప్పు, పులుసు, కారము, తీపు, చేదు, వగరు అనిరి. ఇంకం గొందరు వీటికిఁ జప్పదనము, ఘాటు, కమ్మఁదనములం గల్పి నవరుచులనియున్నారు. ముఖ్యముగ నీరుచులం గ్రహించు శక్తి నాలుకయం దుండుంగాని నాలుకయె వీటికిఁ బ్రిధానస్థానమన పీలు కానున్నది. శ్రోత్రేంద్రియములకు సుఖముం గల్గించుట, త్వగింద్రియమునకు సుఖము గల్గించుట మొదలగునవన్నియు రుచులేనని కొందరు వాడియున్నారు. అన్నివిధములైన సౌఖ్యములకు రుచితో సంబంధము కలదని యిందువలన స్ఫురించెడిని. ఇం దొకచిత్రము కలదు. కొందరి శరీరేంద్రియములకు మనస్సునకు హితవగు రుచులు మరికొందరికి హితవు కాకపోవుటయుం గలదు. అనగా రుచికరములు కాకపోవచ్చును. అట్లె వాసనలందుఁగూడ నగుచుండును. ఇది వారియభ్యాసముపైనిన్ని మనస్సుయొక్క నిరీక్షణ కొక్క మనస్సుయొక్క వృత్తినుండి యుండును. ఇవి సహవాసఁపుగుణదోషముల నుండి యేర్పడుటయుంగూడ కలదు. ఎట్లైనను హితవుకలవి రుచులుగను, అహితకరము లేహ్యములుగను చెప్పందగియుండును. ఇం దింకను

వేరొకచిత్రము కలదు. శరీరపుష్టికి కనుకూలమగు ఔసరములగు పదార్థములం దాతరుణమున హితవుం గల్గియుంట సర్వసాధారణముగ గానవచ్చు చుండును. ఇది సర్వత్రి ధర్మమనిచెప్ప వీలులేని మనోచాపల్యము, జిహ్వాచాపల్యము, బలహీనపు మనస్సు కలవారియందుఁ బ్రబలి యబద్ధపురుచులం గల్పించి యపాయకరములగునాటిని హితవుగఁ దోపంజేయుటయుం గలదు.

## కెయిరన్గోరమ్-రత్నము Cairn-gorm

—ఇది కొత్తగా నిటీవలఁ గన్గొనంబడిన రత్నములలో నొకటి. గ్రాంపియన్ పర్వతములందున్న కెయిర్న్గోరమ్ శిఖరముకడఁ గతిపయ దూరమునందు దొరకుచుండ నాశిఖరముపే రిడి యున్నారఁట. స్వచ్ఛమైనది పసుపుపచ్చ Brown రంగుగా నుండును. Hexagonal shape అనియు Crystal అనియు చెప్పంబడినది.

## కెరాసనాయిల్ ఫీల్డ్సు—

(పెట్రోలియమ్ తైలము చూడుడు)

**కెలోరిమీటరు కొలత** (Calorimeter కొలత)—వేడి యాదికాలమునఁ బాశ్చాత్య దేశవాసులచే ద్రవరూపమున నుండునని తలంపంబడుచుండెడి దఁట. అక్కాలమున వారు దానిని Caloric అను సాంకేతికనామమున వాడుచుండిరఁట. ఆపదము నిక్కాలమున old name అందురు. దానిం గొలుచు పరికరయంత్రమునకు 'కెలోరిమీటరు' అని పేరిడుటఁ గల్గెనందురు. ఇది నేటికి తెర్మోమీటరునుండి భేదమగునది గనే యున్నది. కెలోరిమీటరునందు వేడియొక్క పరిమాణము (Quantity) తెలియును. తెర్మోమీటరునందు దాని యున్నతస్థితి (level) తెలియును. ఇక్కాలమున రసాయనికశాస్త్రవిదులు కొంత వేడిమొత్తమును Caloric అని వాడుచుండుటఁ గూడ కలదు.

లేటెంటుహీటనిన (Latent heat) వేడికే యర్థ (heat itself) ముగను వేసవివేడి (Summer heat) అనిన టెంపరేచరునం దగుపడు heat level అని యర్థమగురీతిని వాడుచున్నారు. కెలోరిమీటరుం గన్పెట్టిన పరిశీలకులు Laplace అనుపేరుగల ఫ్రెంచిదేశస్థుఁడగు ఎస్ట్రోనిమీశాస్త్ర పండితుఁడును, Lavoisier అనుపేరుగల ఫ్రెంచిదేశస్థుఁడగు రసాయనశాస్త్రపండితుఁడును చిరస్మరణీయులు.

## కేండీపురము-

సింహాలదేశమునం దిక్కాలమున బౌద్ధులయాత్రాస్థలముగఁ బేరందిచూడఁదగినతావులలో నొకటిగ నున్నది. అది నీప్రాంతసీమ ఖండదేశమని యొకప్పుడు వాడంబడుచుండి కేండీపురము రాజధానిగ ఖండదేశపురమనియు, ఖండపురమనియు పేర్లంగల్గి రాను రాను నేటికి కేండీయై నిలచియున్నది. కొండలలో నున్న పుర మనూరాధపురమునుండి దంబుల్లా మీఁదుగా ౮౬ (ఎనుబదియారు) మైళ్లును కొలంబోనుండి డెబ్బదిరెండుమైళ్లును దూరమునం దున్నది. చరిత్రాత్మకప్రశంస దీనింగూర్చి పదునాల్గవశతాబ్దమునుండి గానవచ్చుచున్నను ప్రాముఖ్యత పదునారవశతాబ్దమునఁ బోర్చుగీసువారు సామంతభూపతుల యేర్పాటొనర్చిననాటనుండియు ననందగును. కేండీపురము కొంతవఱకు రాజధానిగౌరవముంగూడఁ బడసియుండినది. ఇత్తావు సముద్రపునీటిమట్టముపై ౧౭౬౦ అడుగుల యెత్తున నున్నది. పరిశీలకు లీపురమును బ్రిటిషుసామ్రాజ్యమునఁ జూడఁదగిన నైసర్గికసౌందర్యస్థలములలో నొకటిగ నెంచుచున్నారు.

కేండీపురమున బుద్ధభగవానుని నోటిదంత మొకటి (Left canine tooth) 'దళదమాలి గావా' యనంబడు బుద్ధదేవళమున నొకస్వర్ణక రండమున భద్రపరుపంబడి పూజింపంబడుచుంట నిది బౌద్ధులయాత్రాస్థలమై యున్నది. అది రెండు న్నరయంగుళముల పొడవుగ నున్నది. దేవస్థానముం జుట్టి గట్టిగోడలును, దానింజుట్టి కందకమును కలవు. లోన నొక గొప్పపుస్తకభాండాగార మీ పుర మేలిన కడపటిసింహాలభూపతి యేర్పరచినది కలదు. అందు బెక్కుమతగ్రంథములు శ్రీతాళ పత్రలిఖితంపుంబ్రతులు కలవు. ఈదేవస్థాన మొక యెత్తగుతావునం దున్నది. రాజనివాసభవనము నుండి యీదేవస్థానములోనికి భూమినుండి సొరంగము కలదు. చూచువారల కీదళిదమాలిగావా యొకచిన్నదుర్గ మేమో యనిపించెడిని.

కేండీపురమునం జేతిపనిపాటలు కొంతవరకు బాగుగనే యున్నవి. మరియు నచ్చటిపనులు సింహాలమునందలి యితరతావుల పనిపాటలకన్న నెక్కువనిపుణతను, విన్నాణమును గల్గియున్న వని పించెడిని. దళిదమాలిగావాయందలి బుద్ధదంత మాబుద్ధభగవానుని స్మశానమునుండి యెవ్వరో వారిశిష్యులు గైకొనిరనియు నది యెట్లెట్లో కళింగోత్కళరాకొమరితయగు 'హేమమాల' యనం బడునామెకడకుం జేరి నాల్గవశతాబ్దకాలమున నప్పటిసింహాలభూపతియగు మేఘవాహనునికడ కనుపంబడి భద్రతనంది మతగౌరవములతోం బూజింపంబడుచుండెననియుం జెప్పంబడియున్నది.

ఫాహియానను చీనాయాత్రికుం డనూరాధ పురమున దీనిని దర్శించితినని వ్రాసియున్నాడు. అట సంవత్సరమునందు మూడు నెలలో, లేక మూడుపర్యాయములో అభయగిరిస్థూపారామమున నెల్లరకుం దీని నగుపడునటులం బ్రదర్శించుచుండెడివారని యాయన వివరించియున్నాడు.

ఇక్కాలమున కేండీపురమునందుం జూడందగిన భవనము నాదికాలంపుభూపతులు దర్శనమిచ్చుచుండిన చావడి యందురు. దానియందలి గొప్ప గొప్పస్తంభములు చాల విలువంగల మంచిజాతి కఱ్ఱలతోం జిత్రవిచిత్రంపుంబనితనముగం జెక్కంబడి వింతంగొల్పుచుండెడిని. బ్రిటీషుప్రభుత్వమునం దిప్పుడున్నతన్యాయస్థానమగు supreme court నుంచియున్నారు. ఇంక నిప్పట్టణమునం జూడం దగినవి దూతూజెమును నృపాలనిర్మిత మిరిశవేతి విహారస్థూపములు. ఇవి యాతనివైరియగు దమ్మిళ భూపతి యెవేరాగారిని జయించిన యానవాలుగ నిర్మించెనట. పిదపం జెప్పందగినది యిసూరుమ్మునియా శిలాగుహాదేవస్థానమునందలి బంగారుమలామా చేసిన బుద్ధవిగ్రహము. ఇది కడు పురాతన మందురు. చక్కనిపనితనముం గల్గియున్న విగ్రహము.

ఇంకను నీపురమునందుం జూడందగినచిత్రములాబుద్ధవిగ్రహశిలాగుహలుం దూర్పునవెస్సగిరియాబుద్ధదేవళసముదాయకందరములును, దూతూజెమునునృపాలుని సమాధిస్థూపమును నతిసౌందర్యవంతములగు స్తంభములంగల్గి క్రీ. వె. ఒకటవ శతాబ్దమునాటి పనియని పోల్పంబడుచున్న లంకారామమును, రత్నప్రాసాదమును, రాణీనివాసభవనంపుంబొడును, ఏనుంగులస్నానపుచెరువును, అటనే యున్నరాతిపడవయును, అటనేయున్నమూండు బుద్ధవిగ్రహములును, చాలగొప్పకట్టడమగు నుత్తరంపుదగోబా (లేకధాతుగర్భ) యును, అభయగిరియారామమును, అటనేగల కుత్తం, పోకునా యనుపేర్లుగల రెండుస్నానకుండములును, నిటీవల నార్కియాలాజికల్ డిపార్టుమెండుహారివలనం ద్రవ్విం

చంబడి బయలుదేరఁ దీయించంబడిన రెండుపాత్ర రస్త్రాలు మొదలగునవియై యున్నవి.

పురమధ్యమునందు స్నానతీర్థముగ నున్న చక్కనిసరోవరమును, కేండీపురమేలిన కడపటి భూపతి శ్రీ విక్రమ రాజసింహునిచే నిర్మింపం బడిన కృతకసరస్సును, దీనియం దనేక యగాధ జలకుండములు కడులోతైనవి కలవు. అట్టిలోతు తావులందు జలము లతిశీతములై యుంట వింతఁ గొల్పెడిని. నగటున సరస్సునం దంతటను జలములు కదలిక లేక నిశ్చలమై యద్దమువలెనుంటఁ జుట్టు పట్లనుండు సర్వమును నీటియందుఁ బ్రతిబింబించి యగుపడుచుంట చూడఁ జిత్రముగ నుండెడిని. ఆగుండమున నొకదెసనుండి యెదుటిదెస కీదుచు నగాధజలగుండముల మున్గిపోక బ్రతికి దరిఁజేరి నవా రుండరని యచటివారియందు బలమగు వాడుక గలదు.

కేండీపురపరిసరములనేగల మహావేలి (వళి) గంగాతీరము లతిసుందరవంతములై యుండును. పరిసరపర్వతమార్గము లతిరమ్యములై యేగ వినో దమనిపించును దరినేయున్న గ్రామమగు కటుగా స్తోటకడ దంతావళము లేటియందు జలకము లాడుకొనుచు నీదుచు వినోదము లొనర్చుకొను చుండుట చూడ ముచ్చటయై యుంటఁ బెక్కండ్రు వచ్చి చూచిపోవుచుందురు.

కేండీపురమున బౌద్ధమతకళాశాలలు కొన్ని గలవు. అవి బౌద్ధభిక్షువులవశమునం దున్నవి. కేండీప్రోవిన్సంతయు సామంతులరాజ్యములుగ నున్నది. వారి నాంగ్లమున Kandian chiefs అందురు. స్వదేశస్థులు వారికింగల రతమాహా త్మేయ బిరుదనామమున వారింగూర్చి వాడు చుందురు. ఏటేట వారెల్లరు పేరేహారోత్సవము నడపుచుందురు. అది పేరందిన యూరేగింపు (కేండీ పుర పేరేహారా ఊరేగింపుటుత్సవము చూడుడు) ఈరతమాహాత్మేయు లెల్లరుఁ గడపటి కేండీభూప తిపైఁ దిరుగుఁబా టొనర్చి యొకరాజకీయసభ యందుఁ గేండీప్రభుత్వమును బ్రిటీషువారికి వశ పర్చ బ్రిటీషుప్రభుత్వసామ్రాజ్యమున క్రొన్నోట లనీయై యున్నది.

**కేండీపుర పేరేహారా ఊరేగింపు టుత్సవము**— కేండీపురము సింహాలద్వీపము లోనిది. దీనికి ఖండపురమని యాదిని పేరుండె ననియు నది ఖండదేశమునకు రాజధానిగ నుండె ననియుఁ జరిత్రలు దెలుపుచున్నవి. ఇట దళద మాలిగావా యనంబడు దేవస్థానమున బుద్ధభగ వానునినోటి పన్నొకటి యొకస్వర్ణకరండమున భద్ర పరుపంబడి పూజల నందుచున్నది. దాని కంగరక్ష కులగు కేండియన్ చీఫ్. (సామంతభూపతు) లు, ఏటేట ఆగష్టునెల పౌర్ణమిదినమునకుఁ బదిదినములు ముందుగా నుత్సవముఁ బ్రారంభించి పౌర్ణమినాటి సాయంత్రమునుండి బుద్ధదంతము నేనుఁగుపై నుంచి యూరేగింతురు. అం దాసామంత భూప తులు రత్నాలంకారధరులై సపరివారవై భవో పేతులై బుద్ధదంతమున కంగరక్షకులుగనుండి యూరేగింపు సాగింతురు. పురమునం దీయుత్సవ ము నడచుమార్గములన్నియు నలంకరింపంబడును. రాత్రియందు దీపావలి పురమున నెటఁగన్న నటఁ గాంచనయ్యెడిని. దినిం గాంచుటకు సింహాల మం తటినుండియెగాక యితరదేశములనుండియుకూడఁ జూపరు లరుదెంచిచూచి యచ్చెరు వందు చుందురు.

పేరేహారా యనిన సింహాలభాషయం దూరే గింపున కర్థము. ఈబుద్ధదంతమును శాస్త్రపరిశీల కులు Left conine tooth అని పోల్చియు

న్నారు. ప్రారంభమున నాదేవస్థానపుద్వారము కడకు దేవస్థానపుఁబెద్దయేనుఁగు నలంకరించి తెచ్చి నిలుపుదురు. ఆదంతావళమును స్వర్ణాభరణములచే మాత్రముగాక రత్నములచేఁగూడ నలంకరింతురు. దానిదంతములకుంగూడ బంగారఁపు డొలకలం దగల్చుదురు. దానియలంకారములవిలువ చదువరులే యూహించుకొనఁ గల్గుదురుగాక. దాని వెనుక వేర్వేరు సామంతుల నెక్కించుకొనిన యేనుఁగులు రత్నమయ స్వర్ణాభరభములచే నలంకృతములై నిలచియుండును. బుద్ధదంతమును ప్రధానభద్రగజము పైనుంచి యుత్సవము బయలుదేరెడిని. వేషధరులగు నటకులు, మేళతాళముల వాండ్రు, ధవళశంఖములం బూరించువారు, దివిటీదీపములం బట్టువాండ్రు తరతరములుగ నీయుత్సవపుఁగొల్వునం దుండినవారేగాన వారివారి కర్హస్థలము లుత్సవమునం దేర్పడియున్నవఁట. సామంతులు ధరించు రత్నాభరణములు దేదీప్యమానమగుకాంతుల నీనుచుఁ గనులు మిరుమిట్లఁగొలుప దీపావళివై భవదృశ్యములు వింతంగల్గింపఁ బ్రధాన భద్రగజము దేవస్థానపుసోపానములం దిగి క్రింది బాటకుం జేరుటతో నుత్సవము బలపడెడిని. ఆమహోత్సవము కొన్నిదేవళములప్రక్కనుంబడి క్రిన్నుహి ఉేలుప్రక్కఁగఁ బురమధ్యమం దున్నపవిత్ర సరోవరముంజుట్టి వచ్చి మరలెడిని.

నడుమనడుమ నాగుచుండుతటి వేర్వేరుసామంతులయెదుట వారివారలు మృదంగతాళవాయిద్యయుక్తముగ నాసామంతకుటుంబమువారి పూర్వుల పౌరుషకీర్తిగాథలు, వారొనర్చిన ఘనకార్య కథనములం గానరూపమునం బాడుచు నాట్యాభినయశాస్త్రసాధుత్వమునఁ జూపరులం బరవశులుగ నొనర్చుచుందురు.

ప్రధానదంతావళమున కెదుట బుద్ధదంతకథనముం బాడుచు బౌద్ధమతధర్మవివరణమున భక్తిపారవశ్యముం గల్గించి మతావేశపూరితులగు నట్లు నృత్యగానాభినయవిద్యలం జూపుచుందురు. ఆ యేనుఁగును నేలపై నడువనీయక దానికిముందు విలువగలరత్నకంబళముల నాల్గింటిం బరచుచు నడచి ముందుకేగుతరి వాని నెత్తి తిరుగ ముందునకు వైచుచు నుత్సవమును సాగించెదరు. మరియు నీభద్రగజము నత్యతి నతిపవిత్రవంతముగ నెంచి యెల్ల రతివినయముతో నాయుత్సవమున మెలంగుచుందురు. ఈపేరేహారాయుత్సవమున బౌద్ధభిక్షువులపని యేమియు నుండదు. ఇది కేవలము కేండియన్ సామంతభూపతులు బుద్ధదంతమున కంగరక్షకులుగఁ గాచుచుఁ భద్రిపర్చు నధికారముం బ్రదర్శించు మహోత్సవము. (సింహలద్వీపము చూడుడు.)

## కేప్నోమేన్సీ - శకునము Capnomancy

Capnomancy—ఐరోపాదేశములందు, పాలస్తినాదేశములందు దేవునికి బలు లర్పించి యాయగ్నిబలినుండి ధూమము (పొగ) పైకి వెడలురీతింబట్టి భవిష్యత్తుం దెల్పుచుండెడివారఁట. కాలుచుండు బలి చుట్టు వారు శుచిమై భక్తితోఁ గూర్చుని పైకి యాకసముదెస వెడలు పొగను పరిశీలించుచుండువారఁట. పొగ పైకి లేచుచు నేదెస కేగునో దానింబట్టి చాల భవిష్యద్విధానముం దెలియు వారఁట.

పొగ వంకరలుబోక తిన్నగాఁ బైకి లేచునేని యది మంచికాలమును సూచించెడిదఁట. చక్కగాఁ బైకి వెడలకను వెరిగా నిటునటు త్రోయంబడుచు చెదరుటయు భవిష్యత్కాలము బాగుండదను నపశకునముగాఁ దలంపంబడుచుండెనఁట. ఇట్టి శకునములు పూర్వఁపువారి కుండెనఁట.

**కేలెండ్సు (Kalends) ఇడీస్ (Ides) నోనీస్ (Nones) తిథులు:**—గ్రీకుల యాధిపత్యమున నైరోపాదేశములందు 'కేలెండ్సు' అనునవి వాడఁబడలేదుగాని రోమనులనాడు ప్రతినెల మొదటితేదులు కేలెండ్సనంబడినవి. మరియు మార్చి, మే, జూలై, అక్టోబరు నెలలందలి పదునేనవతేదులును తక్కిన నెలలందలి పదమూడవ తేదులును ఇడీసు లనంబడినవి. అట్టి యిడీసు తేదులకుం బూర్వము తొమ్మిదిదినములనాటి తేది నోనీసు అనంబడినది. ఇవి రోమనులనాటి పంచాంగములందుఁ గాననగుచుండినవి. ఇట్లనుటయందు నోనీసుతేదులు మార్చి, మే, జూలై, అక్టోబరు నెలలం దేడవతేదులును తక్కిననెలలం దైదవతేదులును నగునని భావము. నెలలమొదటి తేదులు కేలండ్సు లనంబడుటనే సంవత్సరఁపుఁదిథులనన్నిటిం దెలుపు పంచాంగములకు 'కేలండరు' అను నామ మిడంబడుచుండెను. ఈకేలండుతిథుల పరిపాటి గ్రీకుపంచాంగములందుఁ బాటింపంబడలేదు. గాన నెవ్వరేని స్పష్టముగ లేనియొక తేదీకి వాయిదాయని తెల్పిన నద్దాని నసలేచూడ నిచ్చగింపని వ్యవహారమని యర్థమగునటుల నుక్తి యేర్పడినది. అనగా గ్రీకుకేలండు తేదీకి జరుగరాని కార్యమని యర్థమేర్పడి యున్నది.

**కేసియన్‌పదార్థము (Casein):**—దీనితో గుండీలు మొదలగునవి చేయుదురు. ఇది పాలనుండి లభించుపదార్థమఁట. పాలకుఁ బులుపు పదార్థముం గలిపి విరచి పెరుగుగఁ జేసి యెండించి గుండగఁజేసి, ఆల్కలైను ద్రావకమునఁ గలపి రంగులంజేర్చి తిరుగఁ బులుపులంగల్పి తేర్చి నముద్దగనై వలసిన యాకారములుగఁ జేయనగునఁట. అవి Tranoperent గా నుండెడినఁట. గట్టిగ నుండునవియు వంగునవియు నగ్నికిం గాలనివియు నెండినపిదప insulators గా నుపయోగించునవి యనియుఁ జెప్పంబడినది. ఇక్కాలమున Electric switches మొదలగు insulators గాఁ జేయంబడిన సిగరెట్టుపెట్టెలు, దువ్వెనలు, పూసలు మొదలగు పెక్కుపదార్థములు గానవచ్చెడిని.

**క్వేకరుసంఘము (Quakers):**—దీని నింకను society friends అనియు ననుట కలదు. ఇది క్రైస్తవమతసంబంధసంఘము. Puritan సంఘమునకుం జెందిన క్రైస్తవుండగు George Fox అనునాయన దీనికి నిర్మాత. ఆయన నేతపని వృత్తిగాఁగల్గి యుండినవానిసుతుండని చెప్పంబడినది. ఫాక్సుగారు పందొమ్మిదవ వత్సరమువరకు జోళ్లు కుట్టుకర్మాగారమునఁ బని నేర్చుకొనుచుండి దైవప్రేరితావేశపరవశుఁడై నాల్గుసంవత్సరములకాలము దేశాటన మొనర్చుచుఁ దనస్వబుద్ధిజన్యసిద్ధాంతధర్మములను బోధించుచుండెను. ప్రభుత్వమువారాజ్ఞోధ చేయవలదని వారించినను వినవందున క్రీ. వె. ౧౬౪౯ లోఁ గారాగారనిర్బంధ మనుభవింపఁజేసిరి. ఆయన క్వేకరు సంఘమును పిదప స్థాపించెను. ఆయన వ్రాసిన జర్నల్ గొప్పగ్రంథమై యున్నది.

**కొంగుదేశము:**— దక్షిణదేశమునందుఁ గోయంబత్తూరుప్రాన్తసీమ. (పేరూరు చూడుడు)

**కొండపల్లిదుర్గము:**—

(రెడ్డిప్రభువులు-కొండపల్లిదుర్గము చూడుడు.)

**కొండవీటిసీమ (దండకవిలె):**—

(దండకవిలె చూడుడు.)

**కొండవీడు-దుర్గము:**—

(దండకవిలె చూడుడు.)

**కొన్ని భూములపైఁ గొన్ని మొక్కలు పెరిగి కొన్ని మొక్కలు పెరుగక పోవుట:**—దీనికి ముఖ్యకారణము భూపరిస్థితులు పెరుగని మొక్కల కనుకూలింపలేదని యెల్ల అనుచున్న మాటయె. ఇందలిని జతత్వమేమనిన భూమియం దదివరకేయున్న salts గాక వర్షముతోఁ గొన్ని salts భూమిపైఁబడి కరగి భూమియందుఁ జేరుచుండును. అవి యట్లగుటయన నీటిని వదలుటయని భావము. ఇంకం గొన్ని జాతుల చెట్లకుఁ గొన్ని లవణము లవశ్యములగుట నవి యుండని తావులం దట్టిచెట్లు పెరుగఁ జాలకుండును. దానినే యాభూమి కవి సరిపడవని యనుచుందురు.

ఆ యాలవణములు భూమియందుఁ గరగి యుండి వేళ్ళనుండి యాచెటకు లభించుచుండుటాచెట్ల కెట్టి యవసరమో యాచెట్లం దినువాటి కింగూడ యాలవణములు వాటినుండి లభించుటయు నట్టియవసరమే యగును.

ః— ఇప్పటి యుత్కల రాష్ట్రములోని చిల్కసరస్సుప్రాంతమున గంజాము మండలఁపుటుత్తరభాగము సరిపోవునని ఫెరుగ్సన్ పండితుఁడు పోల్చుచున్నాఁడు. కన్నింగ్హాము పరిశీలకుఁడును దీనినే యంగీకరించెను. క్రీ. వె. ఏడవ శతాబ్దకాలమున నీభూమి నేలుచుండిన శైలోద్భవ రాజులశాసనములనుండి యీనిర్ధారణ సరిపోవుచున్నది. కొండలదేశమయ్యు ఫలవంతమగు పంట భూమిగా నుండెనఁట. ఉష్ణదేశమున చీనాయాత్రస్థుండగు హ్యూనచ్యాంగు దీనిని వివరించెను. కళింగోత్కలముల నడుమనుండు చిన్నరాజ్యమని యాతండే వ్రాసియున్నాఁడు. మరియుం జిలకసరస్సర్ధచంద్రాకారమున భూమిలోనికిం జొచ్చుకొని వచ్చినదని యాతండు వివరించెను. (హ్యూనచ్యాంగు చూడుడు)

**కొలంబో కాకులు**.—ఇవి పెద్దజాతికాకులు. కడుబలమైన పక్షులు. కొలంబోనగరమున నివి లెక్కకు మితిమీరిన ట్లుండును. చూచువిదేశస్థులకుఁ దొల్లి యీసింహాలము రాక్షసభూమిగా నుండుతటి నప్పటిపరిస్థితుల కర్హమగు కాకులుమాత్ర మట్టిస్థితియందే నిలచియుండినవా యనిపించెడిని. వేర్వేరుచెట్లపై నగరపరిసరముల రాత్రులందుండి పగలు పట్టణమునకుంజేరి యెల్లదెసలఁ దిరుగుచు వేలకువేలుగా నల్లరిగల్లత్తులం జేయుచు నిండ్లపైనను, కొబ్బరిచెట్లపైనను వరుసలుగాఁ గూర్చుండుచుండును. కాకు లఱచిన మామూలుకన్న నెక్కువ ధ్వని యగును. ఇవి చాలపెద్దకాకులు. తినుబండారములు, రమ్యముగఁ గన్పట్టువస్తువులు, మెరయు వస్తువులు వాటికి వీలగుతఱి నెత్తుకపోవుటకు సర్వదా సిద్ధముగనే యుండెడిని. స్త్రీలవస్తువుల నెత్తుకపోవుటయందు దుష్టతనమును, చిన్నపిల్లలం బాడుచుటయందు దుర్మార్గవర్తనమును గల్గి యుండెడిని.

చిన్నరాళ్ళను, పెంకులను ముక్కునం గరచుకుని పోయి యింటిపై కప్పువెన్నునుండి జారవిడచి ధ్వనిఁ జేయుచు దొరలుచుంటతో నాకాకు లాడుకొనుచుఁ గాలక్షేపము సల్పున ట్లగుపడుచుంట ననుదినదృశ్యమే. ఇట్టికాకులు కొలంబోనగరమున నధికసంఖ్యాకములు వసించున ట్లితరతావులఁ గానరావు. (కొలంబోనగరము చూడుడు. కొలంబో పాములు చూడుడు.)

**కొలంబోనగరము**:— కొలంబోనగర మిక్కాలమున సింహాలద్వీపమునఁ బ్రిధాన నగరము. దేశఁపుగవర్నరుగా రిట వేసవియందుఁ దప్ప తక్కినకాలముల వసింతురు. వేడి యధికమగు కాలమున సమశీతోష్ణప్రదేశమగు నువారా యేలియాయం దుండెదరు. ఇక్కాలమునఁ

గొలంబోజనాభా ౨౮౦౧౬౦ యని తెలియుచున్నది. క్రీ. వె. ౧౬ శతాబ్దంపుఁబ్రారంభమునఁ జేపలవాండ్రు కుగ్రామముగనుండిన నిట ననుకూలస్థలమున గొప్పలవంగతోట యుండెనఁట. దానికి డచ్చివారిట రేవు దిగి యటంగల తోటవారి భాషయందు కోలోన్ - పో గాన నాసముద్రతీరమున నల్లె వాడసాగిరఁట. అటఁ బెరిగినగ్రామము పెరిగి పెద్దదైన పురముంగూడ కొలోన్పో గా నేర్పడియెనఁట. ఇప్పుడు నగరమై యించుక మార్పునంది కొలంబోగా నిలచియున్నది. అందలి నాటి లవంగతోటప్రదేశ మాంగ్లేయులచే నిప్పుడును Cenemon Gardens అనంబడుచు రోపాదేశస్థులబంగళాలం గల్గి యైరోపా ఖండఁపుటాకారమేగాక నాచారవ్యవహారముల నవలబించుచున్నట్లందు నగరభాగముగ నున్నది. ఇం దిప్పు డాలవంగచెట్లు లేవు. పోర్చిగీసువారు కట్టిన కోటశేషములు నేటికిం గాననయ్యెడిని. నగటున నగరమె య్యైరోపాలక్షణముల వహించి యున్నదందురు.

కొలంబోకోటయందే కచేరీలు, వర్తకస్థానములు, పెద్దషాపులు, ఎంపోరియములు, స్టోరు అంగడులు మొదలగునవి యున్నవి. ఇటనే Gordan gardens అనంబడు నావరణమున Queen's house అనుపేరుగల భవనమున గవర్నరుగా రుండుతఱి వసించుచుందురు. కోటకు సమీపముననేగల పేటయందు స్వదేశవర్తకము విరివిగా జరుగుచుండును. పురాతనఁపుఁబురమందిరము, హిందువులదేవస్థానము, గంటస్తంభము, క్లేమేనుగేట్సు (ద్వారము) ఇట దర్శనీయభవనములుగ నున్నవి. పూర్వఁపులవంగతోట (కోలోన్పో) గొప్పవారినివాసభవనములం గల్గియున్నది.

గుఱ్ఱఁపుఁబందెములకైన మైదానము, క్లబ్బులు, విక్టోరియాపార్కు, ఉద్యానవనమును నిందుఁ గలవు.

కొలంబోమ్యూజియము సుందరవంతమగుభవనము. ఇం దొక గొప్ప పుస్తకభాండాగారముం గూడ కలదు. ౧౮౮౫ నుండి ప్రకటింపంబడిన **సమస్తముద్రితగ్రంథము** లిందుంచియున్నారు. పుర**మందిరము** రాత్రులందు వెన్నెలలోఁ జక్కని దృశ్యము నొసంగు చుండును. అశోకారామమను**బౌద్ధదేవళము** బౌద్ధుల చందాలధనముతోఁ గట్టంబడిన నవీననిర్మాణము. చూడందగినది తింబిరిగాస్యబాటయం దున్నగొప్పభవనము.

కోటకు దక్షిణముగా 'గాలీఫేస్' అనంబడు నుద్యానవనమార్గము (esplanade) కలదు. గాలీ యోడరేవున కరుగునదిగాన నటులపేరందినది. చల్లనితావుగల సముద్రతీరముంగాన సాయంకాలములం దనుదినము కొలంబోనగరవాసుల విహారప్రదేశమై సాయంత్రములం దధికముగ బండ్లు బర్వెడుత్రోవై యున్నది. ఈబాట నంటియుండు బంగాళాలంజుట్టి యుండుతోటలలోఁ గొబ్బరి, పనస, మామిడి, రొట్టెపండుచెట్లు నధికముగా నుండును. ఇచటిపనసచెట్లు వయస్సున కడలందును నించుక ముదిరినతఱి వలమగుకొమ్మలందును కౌమారావస్థయందు ప్రమానునందునను వార్థక్యమున వ్రేళ్ళ (roots) యందునను కాచుచుండును. వ్రేళ్ళకాపు కడురుచ్యమని చెప్పంబడినది. 'మర్దానా' యనంబడుభాగమున 'మాలిగాకండా' యనుపేరుగల బౌద్ధదేవళము, దానియనుబంధమఠము కలదు. అందు బౌద్ధభిక్షువులు మతవిద్యలందుఁ దరిబియ్యతు నందుదురు. పురమందిరము ప్రక్క నున్నపెద్దమశీదును, గాలిఫేసునందున్న క్రైస్తవదేవళమును దర్శనీయములగు గొప్పభవనములు. ఇచటి మహమ్మదీయులు, అరేబియా

యందు, ఇస్లాంమత మేర్పడినకాలమునం దిచటికి వలసవచ్చినవార మందురు. కొలంబోనగరమధ్యమున ౨౧౫ యకరముల పరిమితిగల చెరువును దానినడుమను 'స్లేవుఐలండు' అను పేరుగలద్వీపముం గలవు. ఇందు స్నానములు, బట్టలుతుకుట, పశువులం గడుగుట జరుగుచుండెడిని. ద్వీపమును బాటసుం గల్పువంతెన కట్టంబడినది. ఇం దాదిని బానిసలను రాత్రిలందు నిర్బంధించువారని వాడుక గలదు. ఇప్పుడు మలేతురకలు, ఆఫ్ఘనుతురకలు వసించుపేటగా నై యున్నది. నగరమునఁ బెద్ద వీధుల కిరుదెసలను నెత్తుగ మనుష్యులనడకకై న యుపమార్గములు (పిల్లబాటలు) గచ్చుచేయంబడినవి కలవు. వాటిపై నర్వస్థలముల స్తంభములపై పైకప్పుగల సాల లుండును. భూమధ్యరేఖకుం గడుసమీపముననే గలసింహళమున వేడి యధికముగనుండి యెండవానలు మిక్కిలియై యుండుట కీపాకలు రక్షకములో యనిపించెడిని. కొలంబోనగరమున రాత్రిలందలి వెన్నెల లతితేజోవంతమై గన్పట్టెడిని.

ఈనగరమునం దేకారణముననో మేఘము లతిత్వరితగతి నాకసమునఁ గదలుచుఁ జిత్రవిచిత్రాకారరూపములం గన్పడుచు మారిపోవుచుంట వింతఁగొల్పెడిని. ఆకస ముదయమున నెఱ్ఱయూదా రంగును, సాయంత్రముల నింద్రధనస్సునందుఁ గన్పట్టు విచిత్రవర్ణసముదాయమును, సూర్యాస్తమయకాలమున నెఱ్ఱనిరక్తవర్ణమును, ఒక్కొకతఱి బుద్ధకిరణములును (సామంతకూటము బుద్ధకిరణములు చూడుడు) కన్పట్టుచుండెడిని. మరియు రాత్రులందు మెరుగుడుపురుగులచలనము తెల్లడలం గన్పట్టుచుఁ గ్రొత్తవారికి వింతఁగొల్పకపోవు. మొత్తమున వర్తకవ్యాపారముల నైరోపా ననుసరించినను మతాభిమానధర్మములందట్లుగాక భరతదేశముం బోలియుండెడిని. నగరఁపుటుత్తరఁపుటెల్లగా కెలనిగంగానదియు నచటి సాగరసంగమము నటంగల బౌద్ధదేవళము స్నానతీర్థములై యున్నవి.

కొలంబో గొప్పవర్తకస్థానము. సముద్రఁపుఁగూడలి (సంధి) స్థానము నగుటఁ బ్రాముఖ్యత నందియున్నది. హార్బరునం దెప్పుడును పెక్కుదేశఁపుటోడ లెగుమతి దిగుమతులతోను, మార్పులతోను, రాకపోకలతోను కదలికం గల్గియుండెడిని. ఐరోపా, ఆస్ట్రేలియా భరతదేశఁపుదెగలవా రనేకులుగానఁగుచుందురు. కొలంబోలో Seastreet నందు నాటకోటిసెట్లు (నాటకోటిసెట్లు చూడుడు) బాంకరులుగను వర్తకులుగను పనిచేయుచుందురు. మెయిన్‌స్ట్రీటునం దంగడులు గుమిగూడిన ట్లుండును. మూరుమహమ్మదీయులు, చిల్లరవర్తకులు. వీరుత్సాహవంతులు. మాట నిలకడం గల్గినవారనియు వర్తకావసరములఁ బాలుమాలక వలసినచో శ్రమకు వెనుఁదీయువారు కారనియుఁ బేరందియున్నారు. చిల్లరవర్తకము వీరిహస్తగతమైనట్లుఁ గాన్పించెడిని. చిల్లరంగడులు (కిరాణఁపుటంగడు)లకుఁ గొలంబోయందు "బొటిక్వి" లని పేరు. అది పోర్చిగీసుపదము. వీటినుంచినవారు మూరులు, నాటకోటిసెట్లు నై యుందురు.

కొలంబోరేవునఁ బదునేడు Steamer lines ఏజెంట్లద్వారా పనిచేయుచుంటయు, రెండు Passinger agencies పనిచేయుచుంటయు, వర్తకపుఁబెట్టుబడిధనము నప్పీయ ధనికులకు నాటకోటిసెట్లసముదాయమేగాక నెన్మిదిబాంకుల ధనాగారములు నెన్మిది Banking Companyలును పనిచేయుచుంటయు, నవిగాక చిల్లరప్పులిచ్చు ఆఫ్ఘనుమహమ్మదీయు లనేకులు పనిచేయుచుంటయు గాంచ నీనగరఁపువర్తకఁపువిలువ తెలియఁగలదు. పలుదేశప్రభుత్వముల రాయబారు లీనగరమునఁ బనిచేయుట వింతగఁదోఁచెడిని.

కొలంబోనగరపుఁగాకులు లెక్కకు మితిమీరి నట్లును, నితరతావులందలి కాకులకన్న కడుబల మైనవిగను గాన్పించెడిని. (కొలంబోకాకులు చూడుడు. కొలంబోపాములు చూడుడు.)

**కొలంబోపాములు.**- ఇచటఁ గొలంబో పాములు అనిన నొకకొలంబోనగరమునందేగాక సింహాలద్వీపమంతట యనిచెప్పుట సమంజసమె యైనను కొలంబోనగరవాసులకుఁ బాములభయ మధికముగానఁ గొలంబోపాములని సింహాలమున సామెత కలదు. సింహాలఁపు టడవులందు నాగ సర్పము లచ్చటచ్చటఁ గానగుచుండును. నిజ మున మట్టిబుక్కటము (పాములు) లధికముగాఁ గలవు. తాచుపాములు టిక్పోలోనాగము లనం బడు వేరుజాతిపాములు తరుచుగఁ గానగు చుండును. ఆకుపచ్చరంగు పోలోనాగములు, కరవిల్లాజాతిపాములు మొదలగుజాతులు పెక్కులు గలవు. సింహాలులు పాములం జంపరు. వెడలఁ దరుముటకుమాత్రము యత్నించి యూరకుందురు. సింహాలమున నాఁడుపాము మగపాము కలసియె వసించుచుండు నందురు. ఒకదానిం జంపిన రెండ వది పగఁబూని వేచియుండి కఱచి పగఁదీర్చుకొను నందురు. 'మాపిళ్ళ' యనుపేరుగలపాములింటిపై కప్పుల యిరుకులందు వసించుననియు, వాటికిం గులాభిమానము, పగ, పట్టుదల లధికమనియు, ఔసరములఁ గొన్ని గొలుసువలె నన్యోన్యము వ్రేలాడుచుఁ బెనుచుకుని కప్పునుండి వ్రేలాడు చుండ వాటినుండి ప్రాకుచుం దిగి కఱచుననియు, వీటికాటునకుం దిరుగులేదనియు సింహాలదేశస్థులు చిత్రవిచిత్రగాథలం దెలుపుచుందురు. (కొలంబో నగరముచూడుడు. కొలంబోకాకులు చూడుడు.)

**కొవ్వొత్తులు:**- కొవ్వొత్తి, కాంగ్లమున Candle అందురు. నిజమున నిది కొవ్వైనను మైనమైనను పైనామముచే వాడంబడుచున్నది. ఆంగ్లమున The game is not worth the candle అను నొక ఉక్తి కలదు. ఇది కొవ్వొత్తుల యుచ్ఛదశకాలమునం దేర్పడి యుండనోపు. ఎట్లైనను (వెలుగిచ్చు) కొవ్వొత్తి విలువ పాటి లాభ మం దుండనేరదని భావము. ఇక్కాలమున విద్యుద్దీపములు దేశమంతటను వ్యాపించియున్నను కొవ్వొత్తిదీపములు మానలేదు. గాన దీనిచరిత్ర వివరించుట సమంజసము కాకపోదు.

ఐరోపాదేశములం దాదికాలమున నీవత్తులు Tallow అనంబడు కొవ్వుపదార్థపుద్రవమున ముంపంబడిన వత్తులుగ నుండినవఁట. పిదప నితర కొవ్వుదినుసులుగూడ వాడంబడ సాగెనఁట. Sperm whale అనంబడు తిమింగిలముయొక్క మెద డునందుఁ బేరుకొనియుండు కొవ్వునకు Spermaceti అందురు. ఆకొవ్వు పిదప వాడుకలోనికిం గూడ వచ్చెనఁట. ఇది మైనముం బోలియుండు నది. చాల తెల్లగా స్వచ్ఛతం గల్గియుండు పదార్థము. దీనితోఁ జేయంబడిన కొవ్వొత్తుల దీపములు చలించకఁ దిన్నగ నిలువంబడి కాలును గాని యిది చౌకగ లభించునది కాదుగాన వ్యాపక మందఁజాలకుండెను. ఇంక Tallow fact అతిత్వరితముగా కరగిపోవునదిగాన దీపము కాలుటయం దధికభాగము నీటివలెఁ గరగి క్రిందికిం జారి యనుపయోగమగుట దానియుపయోగమ్ముకూడ నంతగా వ్యాపింపకుండెను.

ఈరెండుపదార్థముల వస్తుతత్త్వములంగూర్చి గొప్పపరిశీలనల నొనర్చిన Chevreul అనుపేరు గల ఫ్రెంచిరసాయనశాస్త్రవేత్త చిరస్మరణీయుఁ డయ్యెను.

ఆయన తనస్వంతపరిశోధనాలయమునఁ జిర కాలము పరిశీలన లొనర్చి కడకు క్రీ. వె. ౧౮౨౦-

౨౩లో "Fats were not simple substances అనియు they consist of a mixture of solid fatty acids—and one of which is stearine (as it is now colled) అనియుం గన్గొని బయట బెట్టెను. అదియె నేటిక్రొవ్వొత్తులకుఁ బ్రధానద్రవ్యముగ నున్నది. కాని దానిని ౧౮౨౩ దనుకం గ్రొవ్వొత్తులు చేయువారు సరిగాఁ బాటించినట్టులం గానవచ్చుట లేదు. ఇది యిట్టుండ నానాడు Parafin wax అనంబడి కన్గొనంబడియెను. అది Petrolium distillation నందు బయల్పడు by product గా నున్నది. తెల్లని స్వచ్ఛతఁగల గట్టిపదార్థము. త్వరితముగాఁ గరగిపోకఁ గొంత నిలచునది యైనను నక్కాలమున విరివిగ లభింపకఁ జాల తక్కువగా దొరకుచుండినకతనఁ గావలసినంతగా నుపయోగింపలేదనియే చెప్పవలెను. కాని దీనితో stearine నుం గల్పి యక్కాలమునఁ జేయంబడిన క్రొవ్వొత్తులు వెల యధికముగనే గల్గియుండినవి. కేవలము పేరాఫిన్ మైనము గట్టిదైనను వేడిమి కోర్వఁజాలక నతిశీఘ్రముగాఁ గరగి మెత్తఁబడి వంగిపోవుచుండును. గాన Stearine తో Para fin wax భాగములంగూర్చి చేసిన క్రొవ్వొత్తులు చక్కగాఁ గాలునవిగా నుండెను. పెట్రోలియం గను లధికమై యీకొఱతఁ దీర్చుదనుక నీస్థితి యిట్లె యుండకఁ దప్పదయ్యెను. ఆస్థితి నేటికి నట్లె నిలచియున్నది.

ఇంక నీసందర్భమునఁ బిదపం జెప్పందగినది క్రొవ్వొత్తిలోని నూలువత్తింగూర్చియె యున్నది. ఆది నివి వలముగనుండు నూలుదారముగఁగాని, పేనిన నూలుత్రాడుగఁగాని యుండినవి. కాలుటయం దీనూలుదారము Carbonise లగుటయు దానినుండి బొగ్గు గట్టుచుంటయు సంభవించుచుండెను. దానిం దులిపి రాల్చుచుంటకు snuffers అనంబడు పరికర మొకటి కూడ నుంచుకొనుటయుఁ గాలుచుండుతఱి దాని నొకరు రాల్చుచుండుటయుఁ దప్పనిదిగా నుండెను. ఇంకను ప్రత్తియందుఁ గొద్దిగనో, యధికముగనో mineral matter ఉండెడిని. అదియె కాలినపిదప రొయ్యి (ash) రూపమై కాలుటయం దడ్డముగ బరువై యాటంకముగ నుండెడిది. క్రీ. శ. ౧౮౨౫ లో Cambaceres అనుపేరుగల ఫ్రెంచిరసాయనశాస్త్రవేత్త పరిశీలన లొనర్చి దారమును పెనవేయుటకుబదులు జడవలె ముప్పేటవైచినఁ గాలుటయందు బొగ్గు కట్టదని కన్పట్టెను. పిదపం గొందరు రసాయనవేత్తలగు పరిశీలకులు Borax (వెలిగారము) ను sulphate of ammonia కల్పిచేసిన యొకద్రావకమున నానవైచి యెండించిన రొయ్యికూడకట్టక కాలి నశించునని కన్గొనిరి. నేటికిని యీపనులు జరగుచు నాబాధలు లేకుండఁ గ్రొవ్వొత్తులు చేయంబడుచున్నవి.

## కోటిలింగపురము—

(క్రాంగనూరు - దేవీక్షేత్రము చూడుడు)

**కోలారు బంగారు గనులు** (Kolar gold fields):— ఇవి మైసూరుసంస్థానరాజ్యములోనివి. M. S. M. చెన్నపురి బెంగుళూరు రైలుపై బౌరింగుపేటసంధినుండి వేరురైలుపైఁ బోవలయును. ఇవి ఊర్గాంగని, నందిదుర్గముగని, చాంపియనురీపుగని, మైసూరుగని అని నాల్గు తావులం ద్రవ్వంబడుచున్నవి. ప్రపంచమందలి గనులలో నూటికి రెండుపాళ్ళబంగారము భరతదేశఁపుగనులందు దొరకుననియు నందు నూటిలోఁ దొంబదియైదుపా ళ్లీకోలారుగనులందు దొరకు

చున్నదనియుఁ జెప్పంబడినది. బెంగళూరునుండి ౪౦ మైళ్ళ దూరమున Quarty reef gold bearing రాయి నాల్గుమైళ్లపొడవున నున్నదఁట.

చిరకాలముక్రిందటనే కన్గొనంబడిన నిది క్రీ. శ. ౧౮౮౫ లో messrs John Taylor & sons mining Engineers of London వారు పనిఁజేయువరకు సరిగా నడువకుండి ౧౯౦౫ లో ౬౩౧౧౬ ఔన్సులబంగార మెత్తఁబడి ౨౩౭౩౮౫౭ పౌనులవెల కమ్ముడుపోయి యప్పటి వరకుఁ బనిఁజేయుచుండిన యైదుకంపెనీలచే ౧౦౬. ౬౬౧౫ పౌనుల డివిడెండు చెల్లింపంబడుట స్థిరమై చక్కఁగఁ బనిఁజేయుచున్నవఁట. గనులకు సమీప స్థలినే యావిరియంత్రబలమున విద్యుచ్ఛక్తి నాయత్త పరచి గనులపనుల నిర్వర్తించుచుండెడివారఁట. ౧౯౦౨ సంవత్సరమునుండియు నచటికిం దొంబది యైదుమైళ్ళదూరమున నీరాజ్యమందేయుండు శివసముద్రజలపాతముకడ నిర్మింపంబడిన Electric power generating station నుండి యిరువదివేల హార్సుపవ రెనర్జీని తెచ్చి త్రివ్వుట, క్వార్ట్జురాతిం జితుగఁగొట్టుట, దీపములను వెలిగించుట మొదలగు యావత్తుపనుల నిర్వర్తించుచున్నను తొల్లింటియంత్రముల నూరక నిల్వయుంచియున్నారు. శివసముద్రజలపాతమున Hydro-electric power అని తెలియుచున్నది. (శివసముద్రజలపాతము చూడుడు)

మైసూరుప్రభుత్వమువారికి రెండులక్షలపౌనుల నేఁటేట రాజభాగముగను, విద్యుచ్ఛక్తి కేఁటేట హార్సుపవరునకుఁ బదిపౌనులచొప్పునను చెల్లుచున్నవి. గనులం దిరువదియేడువేలజనులు పని చేయుచున్నారు. గనులందు cyanide మొదలగు పద్ధతులపనుల నెరపుదురఁట. ఊర్ధ్వాంగన్నులు మిగుల లోతందురు. సముద్రఁపునీటిమట్టమ్మునుండి ౫౩౨౫ అడుగులలోతునం బనిచేయుచున్నారఁట. లోనికిం జనుమార్గము ౪౨౯౨ అడుగులపొడవున నున్నది. దీనిలోనికిం దిగుటయన భరతదేశమును వీడి భూగర్భమునం దున్నపురములోనికిం దిగుటయెయనిపించెడిని. (బృందావనమహోద్యానము, కృష్ణరాజసాగరజలస్థంభనస్థానము చూడుడు)

**కోవార్ - కలుపుడులోహము** — ఈ వింతలోహము లోహసముదాయమున నవీనమైనది. ఇది యాంధ్రులకుఁ జక్కఁగాఁ బరిచితమైనదికాదు. ఇది విద్యుచ్ఛక్తిమూలమున జరుగు Transportation & Communications (రాకపోకలు - వార్తలు) మొదలగు కార్యములకైన యంత్రజాలమునందు multiformed vacuam గొట్టములలోపలఁ బనింజేయుచుండుంగాన నెల్లరకుఁ బైటఁగన్పించునది కాకున్నది. దీనిం గనిపెట్టిన మహనీయుఁడు Howard Scott పండితుఁడు. ఈపరిశీలకుఁ డమెరికాసంయుక్తరాష్ట్రములందు సుప్రసిద్ధమగునట్టి Westinghouse సంస్థయందు Metallurgical Engineer పదవియం దుండువాఁడు. చిరస్మరణీయుఁడు. ఆయన పరిశీలించుచు నాల్గులోహములం గల్పి దీనిం జేయుటఁ గనిపెట్టెను. అవి నికెల్ లోహము, కోబాల్టులోహము, మేంగనీస్ లోహము, ఇనుము ననంబడుచున్నవి. ఈలోహముల నాంగ్లరసాయనశాస్త్రవిదులు 'మెటలిక్ ఎలిమెంటులు' అనియెదరు. అందు నికెల్ నూటనిరువదితొమ్మిదిభాగములుగను, కోబాల్టు నూటంబదునేడుభాగములుగను, మేంగనీస్ నూట నొకభాగమునందలి యైదింట నొకపాలుగను, శేషించినదంతయు నినుముగను నుండెడిని.

ఇట్టి కోవారు కలుపుడులోహము నుపయోగించుచుండుకతనఁ బదుమూడుసంవత్సరముల

క్రిందట (అనగా క్రీ. శె. ౧౯౨౭ నాటి) Transmitter Valves కన్న నీలోహము నుపయోగించుచున్న సిప్పటివి పదిరెట్లధికబలముం గల్గిన పనిఁ జేయుచున్నట్లు తెలియుచున్నది. రేడియో పరిశ్రమయం దీకోవారులోహము నుపయోగించు కతన రిసీవింగుసెట్సునం దధికయభివృద్ధిం గల్గించ సాధ్యమైన దనుటయం దేసందేహము నుండఁ బోదు. వాటి బలాతిశయమున కీలోహమే కారణము.

కోవారులోహము కనిపెట్టఁబడకపూర్వ మిట్టి యంత్రపరికరములు టంగ్ స్టెన్ (tungsten) అనంబడు molybdenum తోఁ జేయంబడు చుండినవి. అవి యిప్పటివాట్లకన్న నారు లేక యెన్మిదిరెట్లధికమూల్యమును వెలగాఁ గల్గియుండి చౌకగ లభించునవి గాకుండినవి. కోవారులోహము తీగెలుగను, చిన్నచిన్న పరిమాణములుగల యాకారములతో నున్నవిగఁగూడఁ జేయఁబడ నగుచున్నది. కాని యింతఁదనుక నీమిశ్రితలోహము నం దీశక్తిసామర్థ్యము లిమిడియుండుటకుం గల కారణము లేమో పండిత పరిశీలకుల కెఱుకఁబడ కున్నది. ఆప్రశ్నకుం బ్రత్యుత్తర మీయ రసాయన శాస్త్రమునం దెట్టిసంగతులు కానంబడుటలేదు. గొప్పగొప్ప విద్వాంసులు కలుపుడులోహములం దట్టిమహాశక్తిసామర్థ్యము లుండుట స్వతస్సిద్ధ స్వభావమై యున్నదనిమాత్ర మనుచుందురు.

**కోహెషన్‌శక్తి (Cohesion Power)**— రాతియందలి మొలక్యూల్సు (molecules) ఒకటి నొకటి హత్తుకొనునట్లుఁ గల్పి పట్టియుంచెడి శక్తి కాంగ్లరసాయనశాస్త్రమున cohesion అను సాంకేతనామ మీయంబడియున్నది. దీని కాంగ్లమున సర్వసాధారణముగ stecking together అనుచుందురు. రాతిని బలమగు సుత్తితోఁ గొట్టినఁ బగులుట యనఁ గోహెషనుశక్తిం జయించి వాటి యందు హత్తుకొనియున్న మొలక్యూలును భేదించుట యగును. కోహెషనుశక్తిం జయించుటకు దానికన్న నెక్కువ జోరుగల వేరొకశక్తి కావల యునని భావము. అట్టివేరొకశక్తి సుత్తియందలి గట్టితనము, బరువులపై నాధారపడియుంటయు దానికిం గల్గింపంబడిన త్వరితమునుండియు నేర్పడి యుండును. ఇచట "The force of a moving body depends on its mass and the speed at which it is moved" అను రసాయనికశాస్త్రధర్మము వర్తించునని యెఱుంగునది.

## గంగానది (భాగీరథి):-

(భాగీరథిగంగానదీజలములలోని రసాయన పదార్థములు.)

గంగానదీ (భాగీరథీ) జలములలో నిటీవల నానదీజలములంగూర్చి చేసిన యొక భరతరసాయనశాస్త్రపరిశీలకుని పరిశోధనలనుండి Only .0 3 % (Per cent) of iron నును, Calcium కొన్ని సెలికేట్లు, కొన్ని ఫోస్ఫేట్లు, కలవని తెలియుచున్నది. కాని క్లోరెడ్లు, గంధకము (sulphur) మొదలగు నపరిశుభ్రపదార్థము లెవ్వియుఁ గన్పడనట్లు వినుచున్నాము. గాననే గంగోదకము లందు, Power of Immunization (శక్తి) కలదని స్ఫురించెడిని. ఇంకను గంగానదీజలములఁ బరిశీలనలు జరుగవలసియేయున్నవని రసాయన శాస్త్రవేత్త లనుచున్నారు.

**గండము-అరిష్టము:**— ప్రాణాపాయకరమగు నాపద తటస్థించుస్థితిని 'గండము' అని యెదరు. అట్టిస్థితిఁ గడచి ప్రాణాపాయముఁ దప్పుటను గండము గడచిన దనియెదరు. ఇట్టి యపాయ

పరిస్థితులు పిల్లలకు బాల్యమునందే సంభవింప నుండు పరిస్థితులకు బాల్యారిష్టములని భరతదేశః పుజ్యోతిషశాస్త్రమునందు సాంకేతికనామము వాడంబడినది. జాతకమున (అనగా శిశువు జన్మిం చినకాలమునందు)

శ్లో॥ చంద్రాష్టమంచ ధరణీసుతస ప్తమంచ రాహూ ర్నవంచ శనిజన్మ గురుస్తృతీయాః అర్కాస్య పంచ భృగుషష్ఠ బుధశ్చతుర్థ లగ్నేచ కేతు ఇతి రష్టబుధా వదంతి॥

అని బాల్యారిష్టగండములుగాఁ జెప్పియున్నది. ఇంతియెగాక గురు శుక్రగ్రహసంబంధము లీదో షములకుఁ బరిహారములనికూడ చెప్పంబడినది. ఇంక బాల్యవయ స్సతీతమైనపిదపఁ గల్గుచున్న ప్రాణాపాయస్థితులను గండము లనియెదరు. ఇంక నీగండములు ౧ తిథిగండములనియు, ౨ నక్షత్ర గండములనియు, 3 రాశిగండములనియుఁ ద్రివిధము లుగ నుండును.

౧ తిథిగండములు:— అమావాస్య (తర్వాత వచ్చెడి) శుద్ధపాడ్యమిలసంధి రెండుగడియ లును, దశమి ఏకాదశులసంధి రెండుగడియ లును, శుక్లపక్షపౌర్ణమి కృష్ణపక్షపాడ్యమిల సంధి రెండుగడియలును జన్మమునకుఁ దగవ నియు నందు జన్మించిన శిశువునకు తిథిగండ మనియు ననెదరు.

౨ నక్షత్రగండములు:— పుష్యమి, ఆశ్రేష, ఉత్తర, చిత్త, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ నక్షత్రములేడును మహాదోషవంతములనియు వీటియందు జన్మించిన శిశువును తండ్రి వరు సగా మూడునెలలు, తొమ్మిదినెలలు, రెండు నెలలు, ఆరునెలలు, పదునేనుమాసములు, ఎన్మిదిసంవత్సరములు, ఎన్మిదిమాసములు,



అర్హాశాంతింజేసి పరిహరించుకొని మరి చూడ వలయునని శాస్త్రము విధించుచున్నది. ఇవి మహాదోషవంతములు.

ఇంకను, అశ్విని ౧ వ పాదము శిశుగండమనియు, శేషించిన మూడుపాదములు దోషరహితము లనియు, భరణి 3 వ పాదములో మగపిల్లవాఁడు కల్గినఁ దండ్రికిని, ఆఁడుపిల్లగల్గినఁ దల్లికిని గండ మనియు, తక్కిన ౧ ౨ ౪ పాదములు దోషము లేనివనియు, కృత్తికానక్షత్ర 3 వ చరణమున మగపిల్లవాఁడు కల్గినఁ దండ్రికిని ఆఁడుపిల్లగల్గినఁ దల్లికిని గండమనియు తక్కిన ౧ ౨ ౪ పాదములును దోషములేనివనియు, రోహిణీనక్షత్ర ౧ ౨ పాద ములు మాతృగండమును 3 ౪ పాదములు మేన మామగండముననియు, మఖానక్షత్రమున ౧ వ పాదము శిశుగండమనియు, 3 వ పాదమున మగ పిల్లవాఁడుకల్గినఁ దండ్రికిని, ఆఁడుపిల్లకల్గినఁ దల్లికిని గండమనియు, ౨ ౪ పాదములు స్వల్పదోషయుత ములనియు, హస్తనక్షత్రఁపు 3 వ పాదమున మగ పిల్లవాఁడు కల్గినఁ దండ్రికిని, ఆఁడుపిల్లకల్గినఁ దల్లి కిని గండమనియు, ౧ ౨ ౪ పాదములు దోషము లేనివనియు, విశాఖానక్షత్రమునఁ బురుషజననము బావమరిది లేక మరదులకు గండమనియు, స్త్రీ జననము మరదికి గండమనియు, రేవతీనక్షత్రఁపు ౧ వ పాదము శిశుగండమనియు, తక్కినమూఁడు పాదములు దోషరహితములనియుఁ జెప్పంబడినది.

జ్యోతిషశాస్త్రకర్తలగు కొందరు మహర్షులు మహాదోషవంతములుగఁ జెప్పంబడిన ౧ పుష్యమి, ౨ 3 చరణముల మగపిల్లవాఁడు కల్గినఁ దండ్రికిని, ఆఁడుపిల్లకల్గిన దల్లికిని గండమనియు తక్కిన ౧ ౪ పాదములు సామాన్యదోషయుతములనియు, ౨ ఆశ్రేష ౧ వ చరణము నిర్దోషమనియు, ౨ వ చర ణము ధనహానియనియు, 3 వ చరణము మాతృ

గండమనియు, ౪ వ చరణము పితృగండమనియు, ఉత్తరానక్షత్రపు ౧ వ పాదమున మగపిల్ల వాఁడు కల్గినఁ దండ్రికిని, ఆఁడుపిల్ల కల్గినఁ దల్లికిని గండమనియు, తక్కిన మూఁడుపాదములు సామాన్యదోషయుతములనియు, చిత్తానక్షత్రపు ౧ ౨ పాదములందుఁ బురుషజననము పితృగండము, స్త్రీజననము మాతృగండముననియు, తక్కిన 3 ౪ పాదములు సామాన్యదోషయుతములనియు, జ్యేష్ఠానక్షత్రపు ౧ వ పాదము సౌఖ్యహాని, ౨ ధనహాని, 3 పెదతండ్రికి, ౪ వ పాదము జ్యేష్ఠసోదరునకు గండములనియు, మూలానక్షత్రపుఁ ౧ వ పాదము పితృగండము, ౨ వ పాదము మాతృగండము 3 వ పాదము ధననాశము, ౪ వ పాదము శుభమునియు, పూర్వాషాఢనక్షత్రపు 3 వ పాదమున మగపిల్లవాఁడు కల్గిన పితృగండము, ఆఁడపిల్ల కల్గిన మాతృగండము, తక్కిన ౧ ౨ ౪ పాదములు సామాన్యదోషయుతములనియు నభిప్రాయపడిరి.

మతాంతరమునఁ గొందరు జ్యోతిషశాస్త్రకర్తలగు ఋషులు జ్యేష్ఠానక్షత్రమును దశసమాన భాగము లొనర్చి ౧ మాతామహ ౨ మాతామహి 3 మేనమామ ౪ తల్లి ౫ శిశువు ౬ స్వవంశము ౭ మాతృపితృవంశములు ౮ జ్యేష్ఠభ్రాత ౯ మామగారు ౧౦ ఎల్లరకు గండమని దోషములం దెల్పిరి. అటులనే మూలానక్షత్రమును పదునేనుభాగము లొనర్చి ౧ తండ్రికి ౨ పెదతండ్రికి 3 మరిదికి ౪ పితామహునకు ౫ తల్లికి ౬ పినతల్లికి ౭ మేనమామకు ౮ పినతండ్రిభార్యకు ౯ సర్వమునకు ౧౦ పశువులకు ౧౧ భృత్యులకు ౧౨ శిశువులకు ౧3 అన్నకు ౧౪ చెల్లెలకు ౧౫ మాతామహునకు గండదోషారోపణ మొనర్చిరి.

ఇంకను శేషించిన ౧ మృగశిర ౨ ఆర్ద్ర 3 పునర్వసు ౪ పుబ్బ ౫ స్వాతి ౬ అనూరాధ ౭ ఉత్తరాషాఢ ౮ శ్రవణం ౯ ధనిష్ఠ ౧౦ శతభిషం ౧౧ పూర్వాభాద్ర ౧౨ ఉత్తరాభాద్ర నక్షత్రములు పండ్రెండును నిర్గండనక్షత్రములనియు వీట్లయందు జననము నిర్దోషమనియుఁ జెప్పంబడినది.

3 రాశిగండములు (మూఁడు). మీనమేషములు, కర్కాటకసింహములు, వృశ్చికధనస్సులు, నడుమ సంధి యర్థగడియయందు జననము శిశుగండమనియుఁ జెప్పంబడినది. వీటికి ౧ అష్టోవాక్య, ౨ నవగ్రహజప, హోమ, 3 రుద్రాభిషేక, ౪ అప్రదక్షిణ, ౫ సూర్యనమస్కార అపమృత్యుజప అన్నదానాదిశాంతులచేఁ బరిహారము సల్పుచున్నారు. తిథిగండపరిహారము వృషభదానమును, నక్షత్రగండపరిహారము గోదానమును, లగ్నగండపరిహారము కాంచనదానమును అని చెప్పంబడియున్నది.

## గండశిలలు - ప్రాణవాయువు(Rocks and Oxigen)

—రాళ్లు ఊపిరి విడచునవి కాకుండమి నిది సంబంధముం డనిసంగతి యనిపించెడిని. భూమి గట్టిబడి శిలలుగ నేర్పడుచుండిన యాదికాలమున నవి యట్లేర్పడుటకుఁ గారణమె ప్రాణవాయువు వాటియందుఁ జేరి వాటినిర్మాణము నట్లుఁ గల్గించియుండెనని శాస్త్రజ్ఞు లనుచున్నారు. వాటియం దధికమొత్తము లాక్సిజెను చేరియుండెనంచురు. ఇప్పటికి నట్టిగండశిలలు భూమినుండి యేర్పడుచుంటయు నం దధికముగ నాక్సిజెనుచేరి వాటి నట్లు జేయుటకుం గారణమగుచుంటయు జరుగుచునే యున్నదని వా రనుచుందురు. ఆక్సిజెనత్తఱిఁ దక్కువ చేరుట సంభవించిన తావుల రాళ్ళు క్రుంగి వాటియాకారమునందు దిగఁబడుటఁ గాననగుచుండెడిని. అట్లనుట రాయి భూమిలోని

కిం దిగఁబడుట కాదు. రాయి తనలోఁ దానే క్రుంగునని భావము. కొన్ని పగిలిపోవును. అట్టివి యేటేటఁ దమంతటఁ దామే యెండగాడ్పులకు వానలకుఁ జలికి యరగిపోవుచుఁ దగ్గిపోవుచుండును. ఏటేట నీసంగతి పరిశీలించుచుండినఁ దెలిసెడిని. కోమలముగఁ గన్పించు రాళ్లయం దీయాక్సిజెనుప్రభావముఁ గాంచనగును.

## గండికోట (దుర్గము)—

(పినాకినీ నదియందలి గండికోట చూడుము.)

**గండ్రగొడ్డళ్ళం బాతుట, త్రవ్విపెకలించుట** (Burying the hatchet, and reding them):— ఉత్తర అమెరికాఖండమున వసించు నిండియనులకు గండ్రగొడ్డలి శత్రువుల వధింప ముఖ్యాయుధము. దానికి వారిభాషయందు 'టోమహ్వాక్' అని పేరు. ఆంగ్లమున దానికి 'Hatchet' అనెదరు. ఆదేశమునకు వలసఁ బోవుచుండిన యాంగ్లేయులు మొదలగు నైరోపా జాతులకును ఆదిమనివాసులగు నాంధ్రులకును ననేకకలహములు జరుగుచు ధననష్టము లధికముగఁ గల్గుచుండెనఁట. ఒకతఱి నిరుఁదెగలవారికి రాజీకుదురి సఖ్య మేర్పడినకతన నిండియనులు తమ యుద్ధపుగండ్రగొడ్డళ్ళను భూమియందుఁ బాతి నిరాయుధులై స్నేహభావముఁ గన్పర్చిరఁట. వేరొకప్పుడు తిరుగఁ గలహములు మొలకలెత్తి వైరముగలుగఁ దిరుగ నాగండ్రగొడ్డళ్ళం ద్రవ్వుకొని సంగరమున కాయత్తపడిరఁట. దానిం బట్టి నేటికిని వైరములు మాని సఖ్యపడుటకు Burying the hatchet అనియుఁ దిరుగఁ గలహించుటకు dyging the hatchet అనియు నాంగ్లమున సుప్రసిద్ధముగా నుక్తులేర్పడి వాడఁబడుచున్నవి. వీటిజన్మస్థాన మమెరికాఖండపుఁ గనడాదేశమని యెఱుంగనగును.

**గబ్బిలముల చైతన్యశక్తి** (Bat's sense of feeling):—గబ్బిలములందుఁ బెద్దజాతియుఁ జిన్నజాతియునని రెండుభేదజాతులు గానవగుచున్నవి. వీట్లకుం గ్రాహ్యశక్తి (చైతన్యశక్తి) యధికము. దీని నాంగ్లశాస్త్రవిదులు Amazing sense of feeling without touch అని వాడియున్నారు. మానవశరీరములం దిట్టిశక్తికి వీలులేదు. వీటిరెక్కలు, నేత్రములు శరీరములం దతిసన్నపుఁజైతన్యనాళము లధికము. ముక్కునాళములగుత్తియై యున్నది. ఆనాళములు రెక్కలందు వ్యాపించియుంట ముక్కుకడను నేత్రములచేతను గ్రహింపబడిన సంగతులను రెక్క లనునయించుంగాని పొరపాటుం జెందవు. నేత్రములందుఁ జీకటిలోఁ జూడంగల శక్తికలదు. ఇది పిల్లి, ఎలుకల దృష్టిశక్తికి మించి యున్నదని గ్రహింపంబడినది. గబ్బిలములంగూర్చి పరిశీలించు నొకపండితుఁడు గదిపైభాగమునుండి కొన్ని తాళ్ళను వ్రేలాడఁగట్టి యందు గబ్బిలములను బెక్కింటిని వదలెను. అవి మామూలుమేరకు గదియం దంతట నెగుఱుచుఁ బర్విడెంగాని యేతాడునకుం దాకవయ్యెను. గబ్బిలములరక్తము చాల వేడిగ నుండునఁట. శీతలము వీటికిం గిట్టదఁట. శీతకాలమునం దివి చచ్చినట్లు నిద్రించునఁట. అత్తఱి నూపిరికూడ నించుమిం చుండదని తలంచునట్లుండును. అత్తఱి శరీరము చల్లఁబడి యుండెడిని.

గబ్బిలములనోటఁ బండ్లుండును. అవి చాల వాడిఁగల్గి సన్నములుగ నుండును. గబ్బిలములకుఁ బిల్లలందుఁ బ్రేమ యధికము. బొచ్చుఁగల గబ్బిలములు తమపిల్లల నాబొచ్చుగట్టిగఁ బట్టుకొనఁ జేసి తీసికొనిపోవుచుండును. బొచ్చులేనిపావురములు తమకడుపునకు వాటినిహత్తుకొనంజేసి తీసికొనిపోవుచుండును. కొన్ని వీపుపై నెక్కించుకుని యెగురుచుండునఁట. పరిశీలనలు నాగరకప్రపంచ

మున కెఱుంగంజేసినమేరకు గబ్బిలములందుఁ బలు జాతులు గాననయ్యెడిని. తెలియఁబడని భేదజాతు లింక నెన్నియో కలవు.

సర్వసాధారణముగ గబ్బిలములు కాయలు, పండ్లు, పురుగులం దిని జీవించును. గాలిలోని పురుగులం దినునఁట. వీటిరెక్కలను శరీరపరిమాణముతోఁ బోల్చిచూచినఁ గడుపెద్ద వనిపించును. ఇంగ్లాండునం దొకజాతిగబ్బిలముయొక్క శరీరము పొడవు మూఁడంగుళములును, తోక అంగుళమున్నరయును, విప్పంబడిన దానిరెండురెక్క లొకకడనుండి రెండవకడకుఁ బదునాలుగంగుళములుండెడిని. సాధారణముగ గబ్బిలములు పగలు చీకటియం దేమూలనో దాగియుండి రాత్రులందు బైటికరిగి తిండి సంపాదించుకొనుచుండును.

పండ్లం దినివేయుజాతిగబ్బిలములు భరతదేశమునను, సింహాలమునను, మలేద్వీపములందునను, జపానుదేశములందునను, మెడగాస్కరుద్వీపమునను, ఆస్ట్రేలియాయందునను, దక్షిణయమెరికా దేశములందునను, పసిఫిక్కుదీవులందునను కలవు. ఇవి కలతావులందుఁ బండ్లతోటలం బాడుజేయుంగానఁ గావలియుండి వీటిం దోలుచుంటయో, వీటిం జంపుచుంటయో కర్తవ్యముగ నుండును. వీటియందుఁ బెద్దజాతిగబ్బిలములరెక్కలు విప్పి కొలచిన నొకకొననుండి రెండవకొన కైదడుగులుండును. దీనికాంగ్లశాస్త్రవేత్తలుFlying fox అని పేరిడి రేలనన నక్కముఖముం బోలినముఖమును, Red brown రంగుబొచ్చును గల్గియుండును. ఇవి యధికముగఁ దిండిం దినుచుండుంగానఁ బండ్లతోటలకేగాక పంటచేలకుంగూడ నష్టముం గల్గించునఁట. పండ్లచెట్లకు బుట్టలం గట్టి పండ్లం గాపాడుచుందురఁట. ఇవి పండ్లతోటపరిసరములనే పెద్దముసిలిచెట్లయందు వ్రేలాడుచు వసించుచుండును. ఇటీవల నాస్ట్రేలియాలోని క్వీన్సులాండుదేశమున నిక్కాలఁపు యుద్ధములలో వాడంబడు Flame throwers నుపయోగించుచు వీటి నడంచిరని వినుచున్నారము. సింహాలద్వీపమున 'కెరివౌల్లాపిక్టా' యను పేరుగల యొకజాతి గబ్బిలములు కలవు. వీటిమేనునందు సీతాకోకచిలుకలందువలెఁ గడువిన్నాణములగు రంగులుండును. మలయద్వీపములం దొకజాతిగబ్బిలము శరీరమున రోమములుండక బోడిగనుండి మెడచుట్టుమాత్రము కుచ్చువలె వెంట్రుకలుండును. అమెరికాదేశములందుఁ జిన్నచిన్నచేపలంబట్టి తినుజాతిగబ్బిలములును, తెల్లనిరంగుగల గబ్బిలఁపుజాతియుం గలవు.

ఇంగ్లాండుదేశమున నిరువదిభేదజాతుల గబ్బిలములు కలవు. అవి పురుగులఁ దినివైచుచు బ్రతుకుచుండునవి. అవి యపాయకరములుగా వందురు. కాని యితరదేశములనుండి యింగ్లాండు కరుదెంచుగబ్బిలఁపుజాతులు కొంతవరకు బాధకరము లనియెదరు. హార్సుషూజాతి గబ్బిలములందుఁ బెద్దజాతియుఁ జిన్నజాతియుం గూడ నాదేశమునందుఁ గాననగును. పెద్దచెవులు గల గబ్బిలములు కొన్ని గలవు. ఇంక Barbastelle-Pipistrelle-noctule-Hairy armed-Serotine-Rough legged-natter's whiskerid bats—అని పేరిడంబడిన జాతిగబ్బిలము లింగ్లాండునందుఁ గాననగుచుండు నిం దొకటిరెండుజాతు లితరదేశములనుండి వచ్చి యింగ్లాండునఁ గాపురముండిన వందురు. అచటివారు తమదేశఁపుగబ్బిలములు నిర్బాధకరములని యేకగ్రీవముగ ననుచుందురు.

'డెస్మోడస్' (desmodus) అనంబడుజాతి గబ్బిలము మిగుల నపాయకరముగఁ జెప్పంబడినది.

దీనికి దంతములుండక నన్నిటికి సన్నఁపువాడిగల పండ్లు నోటనుండెడిని. ఇవి నిద్రించుచున్న మనుష్యులకాలిమడమలను, పశువులు, గుఱ్ఱములు, కోళ్ళు మొదలగు పక్షులను కరచి చిన్నగాయము లొనర్చి రక్తముం బీల్చుచు బ్రతుకుచుండును. కొన్నిసీమలం దీగబ్బిలము లధికముగనుంట నటఁ గోళ్లు బ్రతుకుట దుస్తరమై యాజాతియే యట బ్రతుకదఁట. ఆదిని గబ్బిలములకాటు ప్రాణాపాయకరంబని తలంపఁబడుచుండెనటం గాని యిప్పుడు శరీరఁపురక్తనష్టము మాత్రమేనని తలపంబడుచున్నది. ఇది యర్థరాత్రమునఁ జీకటిలోఁ గప్పుకొననితావులందుఁ గఱచునఁట. అత్తటి నౌసరము మేరకు గాలియందుఁ జప్పుడు గాకుండ రెక్కల నాడించుచు నంతరాళమున నల్లెయుండి రక్తముం బీల్చునఁట. ఆకాశమునం దంతరాళమున ఏరోప్ల లేన్ రెక్కలం గొట్టుకొనుచు నెట్లు నిలువఁ గల్గునో యట్లె యిదియు నెత్తున నిలచి నిరాధారస్థితియందుఁ గలచి రక్తపాన మొనర్చునఁట. ఈదొంగతనఁపుఁబనిఁజేయుచుఁ గడుపునింపుకొను శక్తికి మెచ్చఁదగునని తోఁచెడిని. దానికి వేరాహారము లేదఁట.

## గల్లప్ ఆర్గనైజేషన్ సర్వే (Gallup organisation survey)

— ఇది అమెరికా సంయుక్తరాష్ట్రపుటేర్పాటుసంస్థ. స్థిరముగా నిలచియుండు సంస్థకాదు. రాజకీయసంబంధమునఁ బ్రభుత్వఁపుటెన్నికలలో నిలువంబడు నర్థి ప్రత్యర్థులలో నెవ్వరికి జయముఁ గల్గునో, ప్రజాభిప్రాయమెట్లున్నదో కన్గొనుటకు నేర్పరులగు గూఢచారులను దేశమంతటకుఁ బంపి విచారించి కన్గొనుటకు గల్లప్ - ఆర్గనైజేషన్ - సర్వేయని పేరిడిరి. వెనక రూజువెల్టుప్రెసిడెంటుగారి యెన్నికలం దిట్టి సర్వే జరగి హరిప్రత్యర్థి Landon గారి కనుకూలింపదని కన్గొనంబడెనని చెప్పంబడినది.



## గ్రంథసాహేబ్ (సిక్కుల మతగ్రంథము)

:—ఇట సాహేబుపదము గౌరవసూచకము. ఇది సిక్కుమతస్థుల మతగ్రంథము. వీరు పంజాబుదేశవాసులుగ నున్నవారు. సిక్కుమతమునకుఁ గ్రీడాబ్రహ్మవాదసిద్ధాంతమని పేరు కలదు. వీరు అవైదికమతస్థులు. అనగా నార్యులవేదమును పాటించువారు కారని భావము.

వీరిమతగ్రంథమునకు గ్రంథసాహేబు అనియు దాని నిడుపవిత్రాలయమునకు దర్బారుసాహేబనియుఁ బేరులు వాడుచున్నారు. దీనికిం గర్తలు పదిమందిగురువులు. అందు మొదటిగురుండు నానకు జగద్దేశికుఁడు. ఆయనకుం బిదప నాతని ప్రధానశిష్యుఁడగు లహానుండను నతఁ డంగదగురుండనుపేర రెండవగురుం డయ్యెను. నానకు జగద్దేశికుండు తనయరువదితొమ్మిదవవత్సరఁపు వార్ధక్యమునఁ గర్తారుపూరునందు, క్రీ. వె. ౧౫౩౮ లో మృతినొంది శ్రీహరిపథముం జేరెనని సుప్రసిద్ధపరిశీలకుండగు శివానందస్వామి వివరించియున్నాఁడు. మరియు నాయనయె కర్తార్పూరున నాయనవార్థక్యముఁ గడపెననియు నత్తటి నాతని కుటుంబమంతయు నాతని కడనే కలసియుండి యాతనికిం బరిచర్యలొనర్చుచుండిరనియు నట వారి నివాసమున కొకగృహమును నొకధర్మశాలయు నిర్మింపంబడెననియు వ్రాసియున్నాఁడు. నానకు దేవుఁడు తనకుంబిదప గురువీర మధిష్ఠింపఁ దన సుతుని నియమింపక ముఖ్యశిష్యుండగు లహానునకంగదనామ మిచ్చి రెండవగురునిగ నియమించెను.

నానకుజగద్దేశికుని యంత్యదినములం దుదయప్రార్థనయగు జప్ జీ యును, సాయంకాలఁపుఁ బ్రార్థనయగు సోహిలాయును నాతనికడఁ జదువంబడుచుండెడివఁట. వాటి నాయనయే రచించియుండె నందురు. అత్తటి మర్దనుఁడుకూడ

నాయనకడనే నివసించుచుండువాఁడఁట. అంగద దేవుండు దేశికుండై మతమును నడిపించెను. పిదప ౩ అమరదాసుగురుండు, ౪ రామదాసు గురుండు, ౫ అర్జునదేవుఁడు, ౬ హర్గోవింద గురుఁడు, ౭ హరిరాయిదేవుఁడు, ౮ హర్కిసన్ దేవుఁడు, ౯ తేజబహద్దర్ గురుఁడు, ౧౦ గోవింద శింగ్ గురుఁడును సిక్కుమతమున దశగురుమూర్తులు. వీరికింబిదప గురువులు లేరు. గోవిందసింగు దేశికుఁడు తనకుంబిదప నొకగురుని నియమించ నిరాకరించి మతధర్మము లన్నియుఁ దమమత గ్రంథమునం దుండుంగాన దానినే గురుపీఠమునం దుంచి గురునిగ గారవించ ననుమతి నొసంగెను. నాటినుండి ప్రధానదర్బారుసాహేబగు అమృతసర్ స్వర్ణదేవస్థానమునందునను, తక్కిన యన్నిగురు ద్వారము (గురువులజన్మస్థానము) లందునను గ్రంథసాహేబునుంచి పూజించుచు గురువుగ భావించుచున్నారు. గ్రంథసాహేబునందలి మొదటి వచనములు "దేవుఁ డద్వితీయుఁడనియు నాతని నామము సత్యమనియు నాతఁడు జగత్కర్త" యనియునై యున్నవి. అందతిశయధర్మనియతులు వివరింపంబడినవి. పరిశుద్ధజీవనధర్మములు, గురు సేవాధర్మములు, కనికరము, త్యాగము, లేక దానము (ఈవి) మెళకువం గల్గియుండుట, న్యాయము, సత్ప్రవర్తనము, సత్యశీలత, స్వార్థ రాహిత్యజీవనము, పరోపకారసేవలు, ప్రేమ, మాంసాహారవిసర్జనము మొదలగు ముఖ్యధర్మములు గ్రంథసాహేబునందు వివరింపఁబడి విధింపంబడినవి. ఇంకను దంభము, కోపము, గర్వము, అసూయ, బాధంగల్గించుట, దురాశ, లోభత్వము, క్రూరత్వము, కొండెములంజెప్పుట, అసత్యమాడుట దుశ్చరిత్రలుగ నిరసింపంబడి యనర్హములుగ నిషేధింపంబడినవి.



గ్రంథసాహేబునందు గురువులు రచించిన పద్యములు పాటలరూపమున నుండును. వాటిని మద్దెలతాళములతో సహా దర్బారుసాహేబునందు గురుద్వారములందుఁ బాడుచుందురు. దీనికి సంకీర్తన మనిపేరు. గ్రంథసాహేబులన్నియు గురుముఖిలిపియందు వ్రాయంబడుచుండును. అది సిక్కులపవిత్రలిపి. దానిని నానకుదేవుండే కుదిర్చెను. అప్పటి దేవనాగరిభాషాలిపియక్షరములం గ్లుప్తపర్చి యీమహనీయుండు రూపములం గుదిర్చెనఁట. వారినుండియె దానిని గురుముఖిలిపి యని వాడసాగిరఁట. సిక్కులేగాక సింధీలును గురుముఖలిపిం గారవించుచున్నారు.

మొదటియైదుగురుగురుదేవులు రచించిన గానీయధర్మముల నాదిగ్రంథమనియు, గురుగ్రంథసాహేబనియు ననుచున్నారు. ఐదవగురుండగు నర్జునదేవుఁడు వాటింజేర్చి కూర్చి వరుసలుగ నొనర్చి యొకసంపుటముగ నొనర్చి దానికి గురుగ్రంథసాహేబని పేరిడియెనఁట. అందు వైష్ణవభక్తుండగు కబీరు మొదలగుభక్తులు రచించిన పాటలం గూడ జేర్చియున్నారు. ఇది చాల పవిత్రగ్రంథమనెదరు.

పిదపఁ బదియవదేశికుండగు గోవిందసింగుదేశికుఁ డన్నిటింజేర్చి గ్రంథసాహేబును పరిపూర్తియొనర్చెను. అదియె సిక్కులమతగ్రంథ మనంబడు గ్రంథసాహేబు. ఇందు దశదేశికులచే రచింపంబడిన గానీయములలో వివరింపంబడిన ముఖ్యాంశములను వివరించి ముగించుట సమంజసము. సిక్కుమతధర్మసముదయ మంతయుఁ బ్రథమదేశికుండగు నానకుదేవునిచేతనే వివరింపంబడినదని చెప్పనొప్పు. ఆమహనీయుఁ డీధర్మములను వివరించుపాటలను రచించుటయందుఁ బ్రవీణతఁ గల కవిపుంగవుఁడు. కవిత్వ మాభాషయందు

నాతికఠినము. మృదుమధురము. సమయస్ఫూర్తి కలది. సిక్కులకు 'వాహిగురు' వనంబడు మంత్రముకలదు. దానిని గురుమంత్రమనియు నందురు. 'ఏకోంకార్, సత్నామ్, కర్తా, పురాఖ్ నిర్భావ్, నిర్భైర్, అకాల్మురాతజునిస్వాయి, భంగ్, గురు ప్రసాద్' అనుపదములు కూడిన మంత్ర మతిపవిత్రవంతము. దీనిం జపముచేయుదురు. దీని కర్థము దేవుఁడద్వితీయుఁడు. ఆయన పేరు సత్యమైనది. ఆయనయె సృష్టికర్త. జగద్వ్యాపకుఁడు. భయరహితుఁడు. పరులు జరామృతులు జన్మము లేక సహజజీవియై సహజస్థితింగల్గి యజ్ఞానాంధకారనివృత్తిఁ గల్గించు దయామయుండగు దేశికుఁడు అని యై యున్నది. పరమేశ్వరుఁడు త్రికాలముల భేదము బాధలేని సల్లక్షణయుతుండని యిందలి యభిప్రాయము. గ్రంథసాహేబునందుఁగాని గురుగ్రంథసాహేబు (ఆదిగ్రంథ్) నందుఁగాని యధిక సంఖ్యాకములగు ముఖ్యగానములు నానకుజగద్దేశిక విరచితములుగనే యున్నవి. గాన నాయననే ప్రధానదేశికునిగా నెన్నుచుఁ దక్కిన తొమ్మండు గురిని మతోద్ధారకులుగ సిక్కులెన్ని భక్తి సల్పుచున్నారు. నానకుదేవబోధితమతధర్మములం గ్లుప్తముగ నామహానీయుఁ డొకగానముగ రచించి యున్నాఁడు. అందన్నిమతముల ప్రవక్తలం గారవింపుమనియు గర్వమును మానుమనియు నిజమైన మతరహస్యము నమ్రత సానుభూతులుగాని వస్త్రధారణాదులు భస్మధారణాలు శృంగినాదములు ముండనములు దీర్ఘప్రార్థనలు శరీరకష్టములు సన్యాసమార్గమునుంగాక జగద్వాంఛలందుఁ బరిశుద్ధత సత్ప్రవర్తనములందె కలదని వివరించి యున్నాఁడు.

నానకుబోధకుం డెల్లప్రాణులం బ్రేమించుమనియు, దేవుని ప్రేమింపుమనియు, మానవులం దున్నదైవత్వముం బ్రేమింపుడనియు దేవుని స్మరించుచు నాయన యౌన్నత్యముం బాడుడనియెను. తామరపద్మము నీటిం గోరునటులను, చాతకపక్షి వర్షముం గాంక్షించునటులను, భార్య భర్తం బ్రేమించునటులను, పరమేశ్వరుని ప్రేమభక్తులతో మరుపురానీక స్మరించుచుండవలయు ననియెను. లేఖినీ (కలము) హృదయ (మనస్సు) లిఖితము (వ్రాత)లవలె నేకముగ నుండున ట్లొనర్చుకొనుడని బోధించుచుండువాఁడఁట. దేవునిసంబంధము నంది యాయనకౌఁగిలిలోనికిం జేరుకొనుఁడని దెల్పువాఁడఁట. ఆమహాత్ముఁడు దైవసన్నిధి కరుగు మార్గము దీర్ఘమనియుఁ గష్టతరమనియుఁ దెల్పెను. దానిం జేర ధనికులకు నధికారులకు దగ్గరదారులు లేవనెను. మనస్సును పరిశుద్ధపర్చుకొని మానవసేవ నామసంకీర్తనము నచటికిం జేర్చుననియెను. అదియె దైవము నిర్ణయించిన మార్గమనెను. గొణుగుకొనుట, సణుగుకొనుట, నయిష్టము నందుండ వీలు లేదనియెను. పరమేశ్వరసంకల్పమే తనకోర్కెగా నొనర్చుకొనవలయు ననెను. అట్లగుటకు దైవకటాక్షమునభిలషించి ప్రార్థించవలయు ననియెను. ఆస్థితి నుండువారు గురుప్రసాదార్థులని పేరిడెను. ప్రార్థన చాల ముఖ్య మనెను. పరమేశ్వరకటాక్షపాత్రతం బడసినవారును దీనమనస్కులై ప్రార్థించవలసి యుందు ననెను. పరమేశ్వరకటాక్షముపై నాధారపడి తమతమస్వప్రజ్ఞలను, వాక్చమత్కృతులను, భాషానైపుణిని పాటింపరాదనెను. ఇట్టిశరణ్యము పరమేశ్వరకృపం గల్గించుననియెను. ఆమహాత్ముని బోధలందు దైవముతో మానవులకుఁ బితృపుత్రన్యాయమును మానవులలో మానవులకు సభ్రాతృన్యాయమును వర్తించుట బోధించెను. పరమేశ్వరచింతనస్మరణయం దూపిరి లోనికిం బీల్చుతఱిని బయటికి విడుచుతఱింగూడ మరువక నుండునాతనిని పూర్ణయోగిగ నెంచెను. జీవితకాల మనిశ్చి

తముగాన క్షణకాలమైనను మానకుండరా దనెను. అట్టివాఁడు మహనీయుం డనెను. అట్టివారికి దైవభక్తియు వర్తనపరిశుద్ధతయుఁ బ్రధానము లనియెను. గానము పరమేశ్వరమానవుల యైక్యసంధానకరముగాన సంకీర్తనము స్మరణము గానముతో జరుపవలయునని విధించెను.

ఆమహాత్ముఁడు పరమేశ్వర మానవసంబంధ ధర్మము నైదుఖండములుగ విభజించి దెల్పియున్నాఁడు. అందు మొదటిది ధర్మఖండము. ఇం దాచరణీయ ధర్మములు వివరింపంబడినవి. ప్రతివాఁడును యథావిధిగఁ దనపనుల నెరవేర్పవలయుననియు ధర్మమార్గమునఁ బ్రవర్తించవలయు వలయుననియునాతని కార్యములనుండియె యాతని విలువ, అర్హత పరిశీలింపంబడుననియు భావము.

రెండవది జ్ఞానఖండము. సత్ప్రవర్తకుఁడు సరియగు నమ్మకముతోఁ గర్మ నాచరించవలయును. మనోకుటిలత కనర్హమైనది. పరమేశ్వరజ్ఞానవంతుఁడై యుండవలయునని భావము.

మూఁడవది పరమ్ ఖండము. ఇందు దైవప్రేరిత తన్మయతఁ గల్గియుండు నవస్థ. ఇందు ధర్మమె యామానవస్వభావికముగ నమరియుండ నగును. అత్తటి సహజముగ ధర్మము జ్ఞానముం గుదురుకొనును.

నాల్గవది కర్మఖండము. ఇందునుండి బలవంతుఁడు పలుకుబడికల వాఁడగును. మృత్యుభయ మడంగిపోయి యాతండు శూరుఁడై తేజోవంతుఁడై పరాక్రమశాలి యగును.

ఐదవది సత్యఖండము. ఇది కడనుండునది. దైవసన్నిధియందు వసింపనయ్యెడిని. అతఁడు దైవత్వ మనుభవించును. స్థిరజీవియై జన్మసాఫల్యత నందును. జీవయాత్ర యిచ్చట సరిపోవును. (క్రీడా బ్రహ్మవాదమతము చూడుడు.)

**గాలికి బహిరంగపరుపంబడిన యితరలోహములు రంగుమాయుట,బంగారమురంగు చెడకుండుట—** గాలియం దేదో యొకరూపమున గంధక (sulphur) ముండెడిని. దీనిని కొన్నిగాస్ (gass) కుం గాల్పు తఱి గాలికిం గంధకముంగల్పుటఁ జూడనయ్యెడిని. ఆగాలి దానికి బహిరంగపరుపంబడినఁ బెక్కు లోహములను మాసి కాంతి తగ్గుటయు మచ్చలుగ నేర్పడుటయుం గల్పించుచుండెడిని. గాననే వెండి మొదలగునవి మెరుపు తగ్గియుంటయు, రాగి కేవలము రంగేమారుటయు మొదలగు ఫలితములు సంభవించుచుండెడిని.

సల్ఫర్ కాంపౌండు (sulphur compounds) లకు బంగారముపై నెట్టిపనిం జేయవలనుపడదు. (no sulphur compound can do any action on gold metal) అను ధర్మ మిట మనసునం దుంచుకొనవలయును. వెండిపైఁ బైపొరగనయిన మాపుపదార్థమున కాంగ్లరసాయన శాస్త్రమున sulphide of silver అని సాంకేతనామ మిడియున్నారు. ఇది వెండి నరుగంజేసి బరువుం గోల్పోవం జేయును. వెండినగలను ధరించినవారికి గంధకసంబంధౌషధ మిచ్చిన నది యించుక శరీరచర్మమునుండి తప్పించుకొని యా వెండిని రూపమును మాయునట్లొనర్చునని కనిపెట్టంబడినది.

**గాలితెరచాపలు:-** గాలిసహాయమువలనఁ దెరచాపలనెత్తి సముద్రముపైని, నదులపైని, సరస్సులపైని, ఓడలను నడపుచుండుట నెల్లరెరింగినదే. ఈ తెరచాపయనునది దళసరిబట్ట. తెరలనఁ బడవలవాండ్రయందుఁ బరిభాషాపదముగ వాడంబడుచున్న పదముకాని నిజమున నవి చాపలు కానేరవు. ఈవిద్య యాదికాలమునుండి భరత

దేశమునం దుపయోగింపంబడుచున్నది. ఐరోపా దేశములందుఁ గూడ నిటులనే కలదు. అమెరికా సంయుక్త రాష్ట్రములు, కనడా దేశములం దధికముగను, నార్వే, స్వీడను, ఫిన్లాండు దేశములం దించుకఁ దక్కువగను మంచుపైఁ బర్విడు నొకవిధమగు తేలికపడవలను (yacht) తెరచాపలమర్చి గాలిసహాయమునఁ బర్విడంజేయుదురు. ఈ తేలికపడవ లెనమండుగుర నెక్కించుకొని జారుచుండు బురదమంచుపై గంట కెనుబదిమైళ్ళవడితోఁ బర్విడునందురు.

కొన్ని దేశములం దినుపబాటల ట్రాలీలకు గాలితెరచాపలనెత్తి పర్విడం జేతురంట. చీనాదేశమున సాధారణంపుబాటలపై నాల్గుచక్రముల బండ్లపై సరకులనిడి వాటికిం గాలితెరచాపలనెత్తి బాటలపైఁ బర్విడంజేయుచు వర్తకంపుసరకుల నడపుదురని తెలియుచున్నది.

**గాలి నీటం గలసిపోవుట (Air desolving in water):**—గాలి నీటియందుఁ గరగి కలసిపోకుండినఁ జేపలు మొదలగుజలచరములు నీటినుండి యాక్సిజెనుగాలిం బీల్చుకొనుట సంభవింపదు. నీటింగాచుతఱి నగ్నిచేఁ దప్తమై యాక్సిజెనుగాలి వెడలిపోయి వాతావరణమునకుం జేరుకొనుచుండుంగాన నట్టినీటిం ద్రావిన రుచిగానుండనేరదు. కాఫీగాని, టీగాని చేయుతఱి నిటులనే సంభవించును. పిదప దానిని రెండుపాత్రలలో నొకదానినుండి యింకొకదానిలోనికిం దిరుగఁబోయుచుందు రిందువలనఁ దిరుగ నావాతావరణమునుండి యాక్సిజెను మొదలగునవి యాకాఫీ టీలయందుఁ దిరుగఁ బ్రవేశించును. గాననె యటులఁ దిరుగంబోయని కాఫీ టీలు రుచిగనుండకఁ బలుసార్లు తిరుగఁబోసినపిదపఁ గడురుచిగానుంట సంభవించుచున్నది. ఇది దానియందలి వేడిం జల్లార్చుటకేనని పెక్కండ్రు తలంచుటతోఁ బొరపడుచుందురు. మెరకనములందు బోతుండదు. నీరు తరుచుగ గాలినంటియే ప్రవహించుచుండును. అట్టినీటియం దాక్సిజెనుగాలి యధికముగఁ గలసియుండుకతన నది మిగుల రుచికరమై యుండును.

**గాలియందుఁ దడి యారుట:**— ఇది నీటియావిరిధర్మమువలననే జరుగుచుండును. ఎండయందైనను నీడనైనను తడియారుటఁ గాంచుచుంట సర్వసాధారణమే. అన్నిరకముల శీతోష్ణపరిస్థితులం దీవాతావరణము తడియార్చుచుండుట సాధారణమైయుండును. వాతావరణమునందుండు నీటియావిరి హెచ్చుతగ్గులనుండి యీయారుట భేదములం గల్గియున్నను నన్నిరకముల శీతోష్ణస్థితులందుఁగూడఁ గలుచునే యుండెడిని.

**గాలిలోని ధూళి.** (Dust in the air)

వాతావరణంపుగాలియందుఁ ద్రసరేణుసముదాయ మనందగిన మెత్తనిబుగ్గి యెగురుచుం దేలుచుండెడిని. అది గాలివిసరులకు భూమినుండి లేచియుం దల్లాడుచున్నదేగాని వేరుకాదు. ఇంటిపై కప్పున నొకచిన్నరంధ్రముండి దానినుండి సూర్యుని వెలుతురు భూమిపైంబడుతఱి నావెలుతురు కంబమున సన్ననిబుగ్గిత్రసరేణువులు తేలుచుఁ గదలుచుంటఁ బరిశీలించిచూచిన యగుపడును. ఒక air tight గదికిం దాళమువైచి కొన్నిదినములట్లేయుంచి తెరచిచూచిన (నందలి భూమట్టము గచ్చునెంత శుభ్రపర్చియుంచినను) అందించుక బుగ్గి మెత్తనిది పలుచనిపొరగా భూమట్టంపుగచ్చుపై నేర్పడి పరచినట్లుండెడిని. ఇది యెక్కడినుండి వచ్చెను? అది air tight గదినుండియెగాని వెలుపలనుండి రావీలులేదు. ఇంక గదియందుండిన గాలినుండి క్రిందికిందిగి భూమిపైనున్న గచ్చుపై నేర్పడియుండవలసియుండును. ఇంకనాగదియందుఁ

దెరువంబడిన కిటికీలుండిన వాటినుండి క్రొత్తగాలి వీచుచుఁ గొప్పి బుగ్గం దెచ్చి చేర్చియుండును. ఊపిరిం బీల్చు గాలియందుసైతము కొంతబుగ్గి నాశికారంధ్రములలోని కరుగుఁగాని యవి యా టంకములనుండి లంగ్సుకడకుఁ దఱచుగ నేగఁ జాలకుండెను.

**గాలీ-ఓడరేవు**—కొలంబోనగరమునుండి ౭౨ మైళ్ళు దూరముననున్న సింహాలదేశఁపుటోడ రేవు. క్రీ. శ. ౧౭ శతాబ్దమున నిది సింహాల రేవులలో నగ్రగణ్యామై యుండెను. కొలంబో హార్బరునిర్మాణమునకుం బిదపఁ దగ్గిపోయినది. ఊరిలోఁ బెక్కుగొప్పభవనములు పాడుపడుచుం టయు, బాగున్నవి సరకుల నిల్వగోదాములక్రింద వాడంబడుచుంటయుఁ గోటగోడలపై మొలచిన పచ్చిక చక్కని నడకమార్గముగ నేర్పడియుఁ గాన నయ్యెడిని. పాతయూరునందున్న పురాతనఁపు లైటుహౌస్ చూడందగినది. ఇప్పటిగాలీపట్టణము కోటకు వెలుపలఁ బెరిగినది.

కొలంబోనుండి గాలీ కరుగుమార్గమునకుఁ 'గాలీఫేస్' అనిపేరు. ఇది కొబ్బరితోటక్రింద నుండియె నడచు నుద్యానవనమార్గముగ నున్నది. బాట కిరుప్రక్కలను పూఁదోటలనడుమ నిర్మింపఁ బడిన సుఖనివాసభవనములు కలవు. ఇవి బాడు గకుం దొరకెడిని. వాటి కనుబంధముగ సముద్ర స్నానఁపు టేర్పాటులు కలవు. ఈభవనములందు 'బెంటోటావాక్కడువా' యనుపేరుగలవి చక్కని సౌఖ్యకరములని పేరందినవి. మార్గమధ్యమున 'అంబలంగోడా' యనంబడు గ్రామమునకడ సము ద్రస్నానమున కావరణముం గట్టి చక్కని యేర్పా టులం జేసియున్నారు. బైబిలుప్రాత నిబంధన గ్రంథమున గాలీరేవును 'తార్షీష్' అని వాడి యున్నారఁట. అరబ్బీలగ్రంథములందు 'కలా' యనివాడిరఁట. గాలీయందుఁ గొబ్బరికాయలను మనుష్యుల ముఖములవలెను పీచు జుత్తువలెను చెక్కు చేతపని కలదు. చంద్రకాంతశిలను మెరుగు పెట్టుట, తాబేటిబురికెతో వింతవింతవస్తువులం జేయుట, సముద్రఁపుగుల్లచిప్పలతో వివిధాకార ములం గుదిర్చి బొమ్మలుగఁజేయుట చేతిపనులుగ నున్నవి.

**గాస్‌లైటుదీపము (gas light lamp) లోనిమంట యూదారంగుననను, బైటి మంట పసుపుపచ్చరంగుననను గన్పిం చుట**:—మంటలందలిరంగులు దానివేడి (temperature) యొక్క పరిమితిపై నాధారపడి యుండెడిని. ఎఱ్ఱగాఁ గాలినలోహము నింకం గాల్చి వేడి నెక్కించినకొలఁదిఁ దెల్లనిఛాల్పుగా మారి పిదపఁ గరగుచుంటఁ బరిశీలించిన తెలియనగును. ఇట్లె Sirius నక్షత్రగోళ మధికవేడిఁగలదిగఁ జెప్పంబడినది. దూరమునకుసైతముఁ దెల్లగఁ గాన నగుచు దానికన్న నించుక తక్కువవేడిం గల్గు నటులఁ జెప్పంబడిన సూర్యగోళ మెఱ్ఱనిరంగునఁ గానంబడుచుండును. దీపము వెలుగుతఱి దాని మంటయందు వెలుపలిభాగమున నధికవేడిమియు లోభాగమునఁ దక్కువవేడియు నుండునని పరిశీల నలు బయల్పఱచినవి. గాననె సర్వసాధారణముగఁ జముదుదీపములన్నియు బయటిభాగము తెల్లగ నుండి వెలు గిచ్చుచున్నవి.

సోడియమ్ (మెటల్) గా సంచుఁ గలదు. సోడియం కాలుతఱిఁ బసుపుపచ్చరంగు గన్పించె డిని గాని యెక్కువవేడిగల గాస్‌లైటుదీపఁపు వెలుపలిభాగమునఁ దనస్వాభావికమగు పసుపు పచ్చరంగుం బ్రదర్శించుచున్నను దక్కువవేడియం

దంతబలము చాలని లోపలిభాగమున నూదారంగు గనై గన్పించెడిని. ఇవి Gas light దీపము నందే యని యెఱుంగునది.

**గ్రావియేషన్ - పుల్**—న్యూటన్‌పండితుని గ్రావిటేషన్‌ధర్మముమేర కాయన కన్గొనిన మూఁడుధర్మములు 'గ్రావిటేషన్‌ధర్మము' లనఁబడుచున్నవి. కెప్లరుపండిత వినిర్మితధర్మములు మూఁడును Laws of planetary motions అనఁబడుచు గ్రావిటేషన్‌ధర్మములమేరకే వాటియం దిమిడియున్నవియే గాని యన్యములుఁ గానేరవు. జగత్తునం దాకాశగోళము లన్నియు గ్రావిటేషనుధర్మములమేరకే తిరుగుచున్నవన నతిశయోక్తి గానేరదు. Herbert Spencer పండితుఁడు 'It is in the Law by which the Universe is balanced' అని నుడివియున్నాఁడు. ఈపరిశీలన లన్నియుఁ జెట్టునుండి పండు రాలి క్రిందఁ బడుటనుండి చంద్రగోళము భూమింజుట్టి తిరుగుట, సూర్యకుటుంబగోళములు సూర్యగోళముంజుట్టి తిరుగుట, తక్కినగోళములు వాటివాటి యాశ్రయగోళములంజుట్టి తిరుగుట దనుక సర్వచలనములు గ్రావిటేషన్‌ధర్మమేరకే జరుగుచున్నవని బయల్పఱచినవి. ఆధర్మము లాంగ్లమున "Every portion of matter attracts every other portion of matter with the power that depends in an obsolute regular way on the amount of stuff that is being attracted and on the distance" అని నిర్బంధింపఁబడి జగత్తునందలి సర్వము నొకటిగ నిలిపియున్నది. పరిశీలనలు రెంటినడుమనుండు నేపదార్థమైనను దానిని మార్పఁజాలదని బయల్పఱచినవి. మరియు నట్టివేవియు గ్రావిటేషనుశక్తి నధికపఱచుటఁగాని తగ్గించుటఁగాని చేయఁజాలవని తేలియున్నది. శీతోష్ణస్థితులు గ్రావిటేషనుశక్తి నేమియుం జేయఁజాలవు. ఇఁకను హైడ్రోజెన్ ఆక్సిజెనులు కలసి నీరగునటువంటి కెమికల్ కాంబినేషనులు (chemical combinations) కూడ గ్రావిటేషన్ మహాశక్తి నెదిరింపఁజాలవని ఘంటాపథముగఁ జెప్పుచున్నారు గాని గ్రావిటేషను కలుగుటకు నిజకారణ మింతవఱకు నెవ్వరికిం దెలియలేదు. కొందరు తమచేతఁ బట్టుకొనినపండు గ్రావిటేషను వలన నేల యాకర్షింపఁబడలేదనియు, ఆకాశమునం దెగురు నేరోప్లేను (ఆకాశవిమానము) నేల గ్రావిటేషనువలన నాకర్షింపఁబడి నేలఁగూలలేదనియు వాదించిరి గాని గ్రావిటేషనుశక్తి నెదిరించు వేరొకబలమైన యుద్ధృతశక్తి (force) తాత్కాలికముగ నట్లాపుంగాని దానికి లోఁబడకుండఁ జేయుట గాదని స్పష్టము కాఁగలదు. చేతనున్న పండును బట్టుకొనిన మనుష్యులబలమునందలి force దాని నాపుటయు నాకాశమునం దెగురు వాయువిమానము యంత్రబలముయొక్క బలమునందలి force ను దానిని నేలంబడకుండ నాకాశమున నడువంజేయుచున్నవే యని తెలియఁగలదు. చేతిపండు జాఱిన నేలంబడుటయు వాయువిమానయంత్రము చేతి పనిచేయకున్న నది నేలంబడుటయు వీటికిఁ బ్రత్యుత్తరములుగఁ దనరెడిని.

**గ్వాలియరు సంస్థానము**— చారిత్రాత్మకస్థలము లిందు విశేషముగాఁ గలవు. భరతదేశపుదుర్గములలో నించుమించుగ నగ్రగణ్యమనందగు గ్వాలియరుదుర్గము రెండుమైళ్ళపొడవు, తొమ్మిదివందలగజముల వెడలుపు, మూఁడువందలడుగుల యెత్తునుంగల శిలాతలమున నిర్మింపంబడినది. దానిలోని కరుగుబాట, అరేబియన్‌నైట్సు కథలలో వివరింపంబడినరీతిగా నుండును. ఆరుకా

వలి స్థలములనుండి పోవలసియుండును. ప్రభుత్వము వారి యతిథులకు నేనుఁగులనుండి పో నేర్పాటులు కలవు. లోనఁ జూడందగిన భవనములలో ముఖ్యమైనది. 'మాన్ మందిరము.' అది క్రీ. వె. ౧౪౮౬-౧౫౧౬ రాజ్యమేలిన మాన్సింగు మహారాజనిర్మితము. అది హిందూకట్టడనిర్మాణములలో వింతమైనదని పేరందినది. ఫెరుగ్సన్పండితుఁడు దీనిని మెచ్చుకొనియున్నాఁడు. దీనియలంకారచిత్రము లేనుఁగులు, నెమళ్ళు, పక్షులు మొదలగునవన్నియు రంగులయద్దఁపుఁ బెంకులతో విచిత్రముగ నమర్పంబడియున్నవి. లోనున్న బందీలగదులలో నొకదానియం దౌరంగజేబుచక్రవర్తి తనసోదరుండగు మురాదు రాకొమరుని నిర్బంధమున నుంచెనని జూపుదురు. కరన్ భవనమునిర్మాణము విచిత్రమనిపించెడిని. మాన్సింగుమహారాజునాటి రాణీనివాసభవన మిప్పుడు, ఆర్కియాలోజికల్ మ్యూజియముగా నున్నది. కోటలోనున్న సాస్ బాహు (అత్త కోడలు) దేవాలయములు చూడందగిన వింతలు. ఇవి ౧౦౯౩ నాటివఁట.

తేలీకాలాత్ (తిలకులి దేవస్థానము) చూడందగినది. కోటం జుట్టి మార్గము వెంబడిని జైనగుహలు, చిత్రఁపుఁబనులు కలవు. ఇం దొకతీర్థంకరుని శిలావిగ్రహము ౫౭ అడుగులయెత్తుకలది చూడఁదగినది.

మహారాజుగారి నివాసభవనమగు జయవిలాసమహలునం దొకతివాచి ప్రపంచమునం దెల్లఁ బెద్దది. ఎక్కువచిత్రఁపుఁబని కలది. ఎక్కువబరువైనదని పేరందినది కలదు. కోటయొక్క పాదము కడ గ్వాలియరుపట్టణ మున్నది. ఘౌస్ మహమ్మదు మశీదు సుందరవంతము. సుప్రసిద్ధసంగీతవిద్వాంసుఁడగు తాన్సేన్ సమాధియు నటనున్న చింతచెట్టును సంగీతవిద్వాంసులకు యాత్రాస్థానముల వంటివి. చింతాకులం దినిన గాత్రము చక్కగా నొదుగునని సంగీతవిద్యార్థులు దీనిని తినెదరు. గ్వాలియరునందు మొహరమ్ ఊరేగింపునాటి రాత్రి దీపావళి సుప్రసిద్ధమైనది. (గ్వాలియరు చింతచెట్టు చూడుడు.)

సుప్రసిద్ధపురమగు నుజ్జయినీపుర మీరాజ్యము లోనిదే. ఇట సిప్రానదీతీరమందున్న కలియడా ప్రాసాదము (Water Palace) వింతఁ గొల్పెడిని. ఈరాజ్యమున షివపురి యనునది సమశీతోష్ణ ప్రదేశము. కొండలపై నున్నది. చక్కనిబాటలు కలవు.

**గిప్సీజాతి:**—వీరు నల్లనివారు. గానమొనర్చుట, నాట్యము, ఇనుపపని వృత్తులుగాఁ గలవారు. ఐగుప్తుదేశమునుండి వీ రింగ్లాండుచేరుటను వీరిని 'Egyptian' అనుచుండెడివారఁట. ఆ మాట కాలముగడచి మార్పులనుండుచు గిప్సీ (Gypsy) యైనదందురు. వీ రాదిని భరతదేశము నుండి బయలుదేరినవారని పరిశీలకులు కొందఱు కూడ బయలుదేటిరి. అలగ్జాండరు ది గ్రేటు గారిదండయాత్రకుఁ బిదప నిలువెడలిరని వారనెదరు. వీరై రోపా పట్టణములందు నివసించుటకుఁ బ్రత్యేకింపఁబడిన యావరణలకు 'ఘెట్టో' లనిపేరు. (ఘెట్టోయావరణము చూడుడు)

**గిరినార్ పర్వతము:**—జూనగడ్ సంస్థానరాజ్యమున (కఠియవాడు) గల యీపర్వతముపై జైనదేవస్థానములు సుప్రసిద్ధములు. ఇది జైనుల పంచయాత్రా (పవిత్ర) స్థలములలో నొకటి. కొండక్రింది యరణ్యమునకు గిర్ అరణ్య మనిపేరు. అందు భరతదేశఁపుసింహము లున్నవి. వాటిని వేటాడ నీయరు. వినాశము చెడకుండ సంరక్షించుచున్నారు.

**గ్రీనిచ్‌పురంపు లోకల్ టైము**— (Greenich time) భూమి తనకుఁ దానే గిర గిరఁ దిరుగుచు సూర్యునిం జుట్టి తిరుగుచుంటవలన సూర్యున కెదురుగ వచ్చుతఱి నాభాగము పగలనియు, వెనుకనున్న భాగము రాత్రియనియుఁ గాలభేదము లేర్పడియుంట నెల్ల రెఱుంగుదురు. ఇంక నిందుఁ జిత్రమేమన భూపటమునం దుత్తర ధ్రువముచుండి దక్షిణధ్రువముదనుక రేఖలం దీసియున్నట్లు భావించితిమేని యానిల్వుగీతపై నున్న తావులం దంతటను కాల మొకటిగనే యుంటఁ దెలియనయ్యెడిని. ఆభావితరేఖలకు శాస్త్రవిదు లాంగ్లమున Longitude అని పేరిడియున్నారు. వాటి నంతటను నుత్తరభాగము దక్షిణభాగము ననుభేదములు లేక, యంతటను సూర్యోదయ సూర్యాస్తమానములు నపరాహ్ణము సరియగు నొకేకాలమున జరుగుచుండెడిని. అట్టి కాలమునకు "Local time" అనిసాంకేతనామముగ నిడియున్నారు.

అట్టికాలములు వేర్వేరు భావితరేఖలపై నుండుతావులందు వేర్వేరై యుండునని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఇంగ్లాండు దేశమునందలి లండను నగరపరిసరములనున్న గ్రీనిచ్‌పురమునందలి కాలమును పెక్కుదేశములవా రాకాశమున జరుగుచుండు మార్పులకాలము నెఱుంగుటకును, సముద్రమునఁ బాగయోడలు నడచుకాలము నెఱుంగుటకును వాడుకొన నేర్పఱచి, దానికి 'గ్రీనిచ్ టైము' అని వాడుకొనుచున్నారు. అది భరతదేశంపుఘడియలు విఘడియలలో లేదు. ఐరోపాదేశంపు గంటలు మినిట్లుగ నేర్పఱచిరి. ఆ లాంగిట్యూడు రేఖ లుత్తర దక్షిణధ్రువములందుఁ గలసికొనును. భూమధ్యరేఖ (equator) కడ నొకటి కొకటి దూరమునం దుండెడిని. ఏలయన భూమి గుండ్రముగ బంతివలె నుండుటయే కారణము. దీనికి 'గ్రీనిచ్ మెరిడియన్' అనెదరు.

**గ్రీన్‌స్టఫ్ - వెలుతురు** (Green stuff in plants & Light)—మొక్కలందలి గ్రీన్‌స్టఫ్ రక్తమందలి యెఱుపురంగువంటిది. అది లేకున్న మొక్కకు నీరసమే. ఇది సూర్యరశ్మివలనఁ గల్గుచుండును. ఒకఁతీగను నించుకభాగమున నొక కాగితము మొదలగువానిం జుట్టి సూర్యరశ్మి వెలుతురు తగలకుండగఁ గట్టియుంచినచో నాభాగము తెల్లఁబడును. తక్కిన ముందు వెనుక భాగములు గ్రీన్‌స్టఫ్ కల్గి యాకుపచ్చరంగుఁ గల్గియుండును. గ్రీన్‌స్టఫ్‌యందునను రక్తమందలి యెఱ్ఱరంగునందు వలెనే iron కలదని కనిపెట్టంబడినది. అదియే శరీరత్రాణ. ఎండకన్నెఱుఁగని సుకుమారశరీరులు తెల్లగనుండుట సంభవించుట. వారిరక్తమునందు రెడ్‌స్టఫ్ తగ్గి త్రాణతగ్గియుంటయే. ఎండలోఁ దిరుగువారిత్రాణ గానవె బలముగ నుండును. చెట్లయందు గ్రీన్‌స్టఫ్ అట్టిదే. అట్టిపనినే చేయఁ గల్గును.

**గుండీల ప్రదర్శనము** — చొక్కా గుండీల రకములం బ్రోగుచేయు వాంఛ లిటీవలఁ బ్రారంభమైనవి. ఇది నిజమున నమెరికాసంయుక్తరాష్ట్రములందుఁ బ్రారంభమైనదని తెలియుచున్నది. వారు షికాగోనగరమునం దొకప్రదర్శనమును దీనింగూర్చి జరిపిరి. ఇంతకన్నను విచిత్రమూ దేశమంతటను Button clubs ఏర్పడియున్నవని తెలిసెడిని. గుండీలను బ్రోగుఁజేయుచు నిల్వయుంచినవారలలో నింతఁదనుకఁ దెలిసినంతలో Mrs. Margaret Varney wales సతీమతల్లిగా రధికులని యందురు. ఈమె యమెరికా సంయుక్తరాష్ట్రములలోని వాషింగ్టన్ సీమయం

చున్న Seattle గ్రామనివాసి యఁట. పై షికాగోనగరపు గుండీలప్రదర్శనమున మొదటి బహుమానపు మొప్పంబడసెను. ఆమె యొక్క భారతీయునితో "గుండీలం బ్రోగుజేసి చేర్చుట యన చరిత్రంబ్రోగుజేసి చేర్చుటయె"యని ప్రసంగించెనని చెప్పఁబడినది. ఆమె సంచితమున Calico buttons—Sandwich glass buttons (ఇవి యన్నియు శాండ్విచినందే చేయంబడిన గాజుగుండీలు) massachusetts (ఈగుండీలంజేయుప్రదేశ మమెరికాయంతటికిఁ బ్రధానస్థానమందురు) డ్రెస్డెన్ చైనాగుండీలు Bottons made of Lustre ware Red glass buttons Iridescent glass buttons- Gold stone buttons Enamel buttons Gold plated enamel buttons Porcelain buttons Gold filigree buttons Oldpewer buttons Intaglio buttons Cameo milk glass buttons solid silver buttons whale bone buttons (తిమింగిలపు నెముకలతో గుండీలం జేయునేర్పు ఎక్సిమోజాతివారి కధికమఁట. వారు కడు నేర్పరులఁట.) Dague rrotyp e buttons మొదలగు పలురకములు కలవనియెదరు. ఇందుఁ గడపటివి ౧౭౭౬ నుండి కల్గినమార్పులం దెల్పుచుఁ బ్రతిదానిపై జార్జి వాషింగ్టన్ మహాశయుని యాకారముం గల్గియుండునఁట. ఇంకను నామెగారి గుండీలసముదాయమున క్రీ. శ. ౧౮౪౪ నుండియు Henry Clay గారి రూపమునుగల్గి, సంవత్సరములు లిఖింపఁబడిన చక్కని యిత్తడిగుండీల సముదాయము మెచ్చుకొనవలసినది కలదందురు. ఇది పరిపూర్తిగఁ గలదని చెప్పఁబడినది.

Mrs. wales సతిగారి తల్లిగారికిఁ గూడ నీగుండీలసరదా యుండియుండెనేమో యామెనుండియు నీమెగారికిఁ గొంతగుండీలసముదాయము వారసత్వరీత్యా వచ్చిచేరెనఁట. అందుఁ బెండ్లి రెండవనాటిమస్తులగుండీలు పెక్కు లుండెనఁట. వీటియందున్న రాగి, యిత్తడిగుండీ లెక్కువ పనితనముఁ గల్గినవందురు. వీటిలో J. D. Rockefeller ధనికుని మొట్టమొదటి మోటారుకారు డ్రైవరు యూనిఫారందుస్తులందుండిన యొక మోటారుకారు యాకారము చిత్రింపంబడి చక్కనిపనితనముఁగల్గియున్నది కలదు. ఈగుండీలసముదాయ మంతయు, ఆపిల్ పండంత మొదలుకొని గుండుసూదితలయంత చిన్నదివఱకు పరిమాణముఁలం గల్గియుండెడిని. చీనాపనింబోలిన గొప్పపనితనముఁగల్గినవియుం గలవు. ఎక్కువపనినేర్పుఁ గల్గినగుండీలకు 'Classic buttons' అని పేరిడియున్నారు. ఇటీవల వీటింబోలినగుండీలు చేయఁబడుచు విక్రయింపఁబడుచున్నవఁట. Mr. Polly Crummett అనునాయన యిటీవల "Button Collecting" అను నొకగ్రంథము నీగుండీల రచనంగూర్చి వ్రాసియున్నాఁడు. ఆది నీగుండీలు చేతిపనిగ్రమైయుండి, ౧౮౨౫ నుండి యంత్రముతోఁ జేయఁబడుటఁ బ్రారంభమాయెనని యాయన వ్రాసియున్నాఁడు.

## గుండెలు కొట్టుకొనుచుండు నాడి:-

మనుష్యులకు గుండెకడఁ గొట్టుకొనుచుండునాడి నాంగ్లమున 'Heart beats' అనియెదరు.

వలివరిశోధన లీనాడి మేధస్సునకుఁగాని, శరీరేతర భాగములనాడులతోఁగాని సంబంధములేక కొట్టుకొనుచుండు నని కనిపెట్టఁబడినది. ఒకకప్పయొక్కయు నొకచెవులపిల్లియొక్క (కుందేలు) యు నొకపక్షియొక్కయు గుండెలం గోసి శరీరమునుండి వేఱుచేసి పరీక్షింపఁ జేతియందుఁ జాలకాలము కొట్టుకొనుచుండుటఁ గన్గొనఁబడియెను. కాని, మేధస్సు తనకిచ్చగల్గినచో వీటి నాపుటకుఁగాని త్వరితగతిం గొట్టుకొనఁ జేయఁ గల్గుననియు,

మందగతిని గొట్టుకొనున ట్లొనర్పఁగలదనియుఁ గూడఁ జెప్పఁబడియున్నది. హృదయమంతయు నాడులమయమందు సెల్సు (cells) కలవు. ఆనెర్వుసెల్సు కోయఁబడినఁ గొట్టుకొనుట యాఁగునఁట. సంబంధముండువైపునఁ గొట్టుకొనుచు నాళములనుండి దానిరక్తాహార మందువలనఁ గొట్టుకొనుచుండఁగలవు. వాటికిఁ గొట్టములఁ దగిల్చి వాటినుండి రక్తనాళములకు సముద్రిలవణమును, నింకఁ గొన్ని యుప్పులను గలద్రవమును హృదయమున కందఁజేయుచు, వారముదినముల దనుక గుండెలం గొట్టుకొనఁజేయుచుండ నగునని కనిపెట్టిరి. అందుఁ బంచదార మంచిహృదయాహారమని యనిరి. ఆల్కొహాలు నిరర్థకమఁట.

## గుజరాతుపట్టణపు దేశభూమి:—

మధ్య ఆసియాప్రదేశములనుండి గుజూరు లను వారు వలసవచ్చి చేరుటంజేసి వారినుండి పేరందినది. ఇది క్రీ. వె. ఆరవశతాబ్దమునాటిమాట. అన్హిలాపురము లేక అన్హిల్వాడా రాజ్యపాలనము నందుండిన దేశసీమ. ౧౫౯౭ మహమ్మదీయుల వశమై, అక్బరునాడు మొగలసామ్రాజ్యమునఁజేరి పోయెను. (౧౫౭౭)

## గ్రుడ్డివారికి శ్రవణశక్తి యధికము—

నేత్రములుగలవారు చూచుచు వినెదరు. శ్రవణశక్తి లేనివారు వినుటమాత్రమే గాన, వారి గ్రాహ్యశక్తి యంతయు శ్రద్ధతోఁగూడి యొక్క శ్రవణేంద్రియముపై నాధారపడియుంట నఁట నెక్కువ మెళుకువతోనుంట సంభవించెడిని. గాన గ్రుడ్డివాండ్రకు శ్రవణశక్తి యధికముగానుంట సంభవించెడిని.

## గుణదోషములు (Virtue & Vice):—

దీనిని పెక్కండ్రతిశయార్థముగ గ్రహింతురు. ఆంగ్లమున గుణమునకు 'Virtue' అనెదరు. దాని కాంగ్లనైఘంటికులు 'Qualities of a man' అని కొందర ర్థమును వివరించిరి. గాని, యది సరియగునట్లు తోచదు. ఏది యథాస్థితి నెట్లుండఁదగునో యట్లుండుట గుణ మనియు, దానికిం దగ్గిపోవుట హీనత యనియు, యథార్థస్థితిని వదలి యన్యమార్గమునఁ బడుట దోషమనియు, భారతనైఘంటికులు నిర్వచించిరి. ఇందు కుదాహరణముగ నొకనిశరీరారోగ్యము తగ్గి జబ్బుపడియుండుతఱి నారోగ్యమున కౌషధమిాయ నెట్లున్న దని యెవ్వరేని ప్రశ్నించినయదనున, గుణముగ నున్నదని వచించుచుంట యెల్లరెఱింగినదే. ఇచట గుణమనిన యథాస్థితికిఁ జేరుచుంట లేక ఉండవలసిన యస్వామగు నారోగ్యము కల్గుచుంట యనియేభావము. గుణ మనిన యథార్థస్థితియే యని తెలుచున్నది. గాన గుణవంతుండనినఁ దనవిధులఁ జక్కఁగ నాచరించువాఁడని తోఁపకపోదు. దైవభక్తి, పరోపకారపరాయణత, దుష్టకార్యములందు విముఖత మొదలగు న వన్నియు నతిశయములు గాని గుణమాత్రములుగ నెన్నఁబడఁ జనదు. గుణముం దప్పుట దోషము. ఇది విధులఁ బాటింపకపోవుట, చేయరాని కార్యముల నొనర్చుట నిషేధ మగును. హిందూమత ధర్మమున బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ తురీయాశ్రమము లని నాల్గాశ్రమములు కలవు. అం దొక్కొకదానియందుఁ గొన్ని విధులుగను, కొన్ని నిషేధములుగను నేర్పఱుపంబడియున్నవి. ఆయాయవస్థలయం దున్నవిధులు మఱికొన్ని యాశ్రమములందు విధులు కాకపోవచ్చును. తురీయాశ్రమమునకుఁ బిదప విధినిషేధములు చెప్పఁబడలేదు గాన లేవందురు.

## గురుగ్రంథసాహేబ్—

(గ్రంథసాహేబు చూడుడు.)

**గురుమంత్రము (వాహిగురు)**-
(గ్రంథసాహేబు చూడుడు.)

**గురుముఖిలిపి**—
(గ్రంథసాహేబు చూడుడు.)

**గుఱ్ఱములకొలత** (Measuring of horses) ఆంగ్లదేశమున గుఱ్ఱములయెత్తుం గొలుచు మానము hands గాఁ జెప్పంబడుచున్నది. 'హేండు' అనిన నాలుగంగుళములుగా నుండును. ఈకొలత యరచేతిదిగా నాదినుండి యిటుల స్థిరపఱుపంబడినదఁట. గాన నిక్కాలమున గుఱ్ఱ మిన్ని హేండ్సున్నదని యెత్తు గొలువంబడుచున్నది.

ఇంకను నాంగ్లసీమలందు సహోక్స్పోనీ షైను, పోనీ, షెట్లాండుపోనీ జాతులు చిన్నజాతివి. ఇవి ౧౪ మొదలు ౧౨ హేండ్సువఱ కెత్తుండునవి.

**గోర్డియన్ - నాటు** (Gordian Knot) **ముడి:**—తొల్లి ఆసియామైనరు (చిన్నఆసియా) నందు 'ఫ్రిజియా' యనుపేరు గలరాజ్య ముండెడిది. అందలిప్రజలు చిరకాలము సత్పరిపాలనము లేక మిక్కిలి విసిగియుండుటఁ దటస్థించెను. నిరాశపాలైనప్రజలు తమదేవతకై మొరలిడుచుండ నొకరి కావేశము గల్గి జ్యూపిటరుదేవళమున కరుగుతఱిఁ దొలుతం గన్పించినవానిం బ్రభువుగ నొనర్చిన సత్పరిపాలన గల్గునని ప్రవచించెనఁట. తోడనే మతావేశపూరితులగు గురువులు జ్యూపిటరుదేవాలయమున కరుగుచోఁ దొలుత 'Gordins' అనుపేరుగల వ్యవసాయవృత్తి జీవనాధారముగఁ గలవాఁ డొకఁడు బండితోలుకొనుచు నెదురుగ రా నాతని రాజుగ నొనర్చిరఁట. ఆతఁడును కృతజ్ఞతఁగల్గి తనబండియొడ్లను జ్యూపిటరు దేవున కర్పించి, యొకత్రాటితో దాని నొకదేవాలయస్థంభమునఁ గట్టి ముడివైచెనఁట. ఆముడి యెవ్వరికిం దెలియఁబడక విప్ప వీలుగాక యొక విచిత్రమై దనరుచుండెనఁట. అచిరకాలముననే అలగ్జాండరు దిగ్రేట్ గారట కేతెంచి దానింజూచి విప్పఁజాలక తెగగోసి యూడఁదీయ నాప్రజలును గురువులును, నేకగ్రీవముగ భరతదేశమును జయింపఁదగినవాఁడని యాతనిం బొగడిరఁట.

నేటికిని నాడాదిగ ఉక్తిగ నిలచిన 'Gordian knot' ఏదో లాభనష్టములం బాటింపని సాహస కార్యములే గాని విచారణమున న్యాయముతేలని చిక్కువ్యవహారములను గోర్డియన్నాటువ్యవహారమనియెదరు.

**గోల్డెన్ ఫ్లీజు** (Golden Fleece)—'ఫ్లీజ్' అనిన గొఱ్ఱె బొచ్చని యర్థము. ఉన్ని యనియందురు. ఆస్ట్రేలియాఖండమును 'Land of Golden fleece' అని యాంగ్లేయులు వాడుచుందురు. ఏలయన నట గొఱ్ఱెలు, మేకలు మంద లపరిమితసంఖ్యాకములుగఁ బెంపఁబడుచున్నవి. వాటింగాయువాండ్రు గుఱ్ఱములపై నెక్కి మందలను మరలింపవలసియుండునంత పెద్దపెద్దమంద లటఁబెంచుచున్నారు ఆసీమలందు నీటియెద్దడి యధికముగాన నాగ్డైజన్నూతులం ద్రవ్వుకొనెదరఁట. ప్రపంచమున నధికమగు ఉన్ని యిట దొరకునని పేరందియున్నది.

**గోళ్లు** (Nails)—వీటి నాంగ్లశరీరవేత్తలు Epidermis యొక్క పరిణామరూప మనెదరు. అది dermis యొక్క పరిణామరూపముగాని వేఱుకాదు. (త్వగింద్రియము చూడుడు.) గోళ్లు semi transperent గ నుండుట గలదు. దాని యందుఁ జైతన్యముండమి దానిని మృతపదార్థముగఁ జెప్పవలసియుండును. దానిం గోసినను నొప్పి యుండదు. దాని నంటియున్న జీవితభాగమందు నొప్పిగల్గును. పశువుల డెక్కలు, కొమ్ములు, నిట్టివేనని పోల్చియున్నారు.

## గోస్సామర్‌దారము:-

(నైలన్ (దారఁపు) పోగులబట్ట చూడుడు)

## గౌడపురము(గౌర్ లేక గౌడ్):-

తొల్లింటి వంగదేశఁపు రాజధానిగ నుండినపురము. ఇప్పుడు పాడుపడుచు పల్లెటూరై యున్నది. కలకత్తానుండి ౧౯౪ మైళ్లదూరము. ఉత్తరబంగాళమునం దున్నది. మాల్డాపట్టణమునుండి తూర్పుగా ౧౪ మైళ్ళదూరము మాల్డాఊరుబయటనున్న యింగ్లీషుబజారను తావునుండి రెండుబాటలు పోవును. పియాజబారిమీఁదుగా బాటలు పోవును. ఇది ౯౦౦ సంవత్సరములు హిందువులకాలమునను, మహమ్మదీయులకాలమునను, ప్రధాన ప్రభుత్వస్థానఁపుదశ ననుభవించినది. క్రీ. శె. ఎన్మిదవశతాబ్దమున పాలవంశఁపునృపతి ధర్మపాలమహారాజు తనరాజధానిగాఁ జేసికొనెను. పిదప నాగారవము వదలిపోయి లక్ష్మణసేననృపతి తిరుగ రాజధాని నిటకు మార్చెను. ఆయనయే సేన వంశఁపు మొదటిభూపతి. ఇది ౧౨ శతాబ్దఁపుమధ్యకాలమని తెలియుచున్నది. హిందువులనాటివి, బుద్ధులనాటివి యగు నానవాళ్లిప్పుడు 'బల్లాల్‌బారి' యనంబడు దిబ్బలక్రిందఁ గలవని తలంపఁబడుచున్నది.

పఠాన్‌తురకల యధికారమునా డిది బంగాళమునకు రాజధానిగ నుండెను. కాని ౧౩౪౫ లో షంషుద్దీన్ లియాస్‌షా అనతిదూరమందున్న 'పాండువా' యనుతావునకుఁ బ్రభుత్వస్థానమును మార్చి దానికి 'ఫిరోజాబా' దని పేరిడెనఁట. నాడాదిగ ౧౪౪౫ దనుక బంగాళమునకు రాజధానియై యుండెను. ౧౪౪౮ లోఁ దిరుగ గౌడపురము (గౌర్) నకే ప్రభుత్వకార్యాలయములు మార్పఁబడి ౧౫౫౦ వఱకు రాజధానిగౌరవము నందుండెను. అప్పుడు గొప్పమహామారివ్యాధి తగిలి పట్టణము పాడయ్యెను. మహమ్మదీయుల నాటియానవాళ్లు లోటోన్మశీదు, దానిరంగుల పెంకులు గాననగును. ౧౫౨౬ లో తయారైనట్లు చెప్పంబడిన బంగారుమశీదు, ఫిరోజుమినార్ (స్తంభము), ఇటుఁ జూడఁదగినవి కలవు.

## గౌడియామిషన్-సంఘము:-

చైతన్యదేవునితల వెంట్రుకలు చూడుడు

కౌటకద్వీపము చూడుడు

చైతన్య మతనిషేధములు చూడుడు

చైతన్యమతము చూడుడు

నవద్వీపధామము చూడుడు

నవద్వీపము (తొమ్మిదిద్వీపములు) చూడుడు

## గౌర్ (పురము):-

(గౌడపురము చూడుడు)

## ఘుడుముక్తీశ్వరక్షేత్రము:-

(ముక్తీశ్వరక్షేత్రము చూడుడు)

**ఘుటియారీ షరీఫ్**— ఇది యిస్లాంమతస్థుల కతిపవిత్రమగు ప్రార్థనాస్థలము (మశీదు). కలకత్తానగరమునుండి మంచిబాట నినుపదారి మార్గమున ౨౦ మైళ్ళదూరమునందున్న మహమ్మదీయులదేవస్థానము. మశీదు పెద్దది. ఇటుఁ గల మహమ్మదీయ కుగ్రామము ప్రాముఖ్యతంగల్గినది కాదు. ప్రతిశుక్రవార మిటకు మహమ్మదీయు లధికసంఖ్యాకులు వచ్చి తిరిగి పోవుచుందురు. ఈస్టర్న్ బెంగాల్ రెయిల్వే (మశీదుకడనే) స్టేషను నిర్మింపఁబడుటఁ గలకత్తా నుండి పెక్కండ్రురాచున్నది.

**ఘెట్టో (యూవరణము)** (Ghetto-enclosure) పూర్వకాలమున రోమకపురి ఔన్నత్యదినములలో యూదుల నివాసమునకుఁగాను

ప్రత్యేకావరణము లేరుఁబఱచి యందు వసింప నియమించుచు, వాటికి "ఘెట్టో"లని పేరిడిరి. పిదప దేశమంతట నిట్టియేర్పాటులే జరిగెను. అందువారం దఱుఁ గలసి నివసించుట యాయాదులకుఁగూడ ననుకూలముగనే యుండెనఁట. నానురాను యూదులే గాక గిప్సీజాతివారును నిట్టి ఘెట్టోయావరణములందే వసించుట కేర్పాటులు ప్రారంభమై వ్యాపించెను. ఐరోపాసీమలందు నేటికినచ్చటచ్చట నట్టిఘెట్టోలు కానఁగుచున్నవి. రోమనుల శాసనములమేర కాదికాలమున ఘెట్టోలందు నివసించు పురుషులు పసుపుపచ్చటోపీలును, స్త్రీలు పసుపుపచ్చ ముసుగులను ధరింపనిదే యితరవీథులలోనికి రారాదని విధియుండెనఁట. ఇది వారు స్వదేశస్థులుగారని యెఱుంగఁజేయుటకుఁ గానోపు.

**చంద్రు (గోళము) నందు మనుష్యులు లేకుండుట**— చంద్రగోళమున వాతావరణవాయువు లేదని పరిశీలనలనుండి తేలుచున్నది. గాన నూపిరిఁ దీయుట కట వలనుపడదు. గాన నట మనుష్యులుండుటకు వీలుండదు. ఇంకను సూర్యరశ్మియందు గాలి లేకుండుటంబట్టి యెండవేఁడిమి నుండి రక్షించు వాయుచలనము లేక యెండి మాడిపోవలసియుండును. అట్లే రాత్రులందు శీతలమునుండియు, వాయుచలనరక్షణ లేక చలి యందు బిగిపోవలసి యుండుంగాన మనుష్యులుండఁజాలరు. తక్కిన జంతుజాలములును చంద్రునియందు జీవింపవనియే తలంపనగుచున్నది. అట వాయువు, జలములు నుండిన నద్దానింజుట్టి మేఘము లుండియుండవలయును. అట్టి వెప్పుడు చంద్రునియందుఁ గాన్పించుచిహ్నములను గాని వెన్నెలంగాని మరుగుపర్చుటలేదుగాన వాయువుగాని జలముగాని యుండదనియే గ్రహింపనగుచున్నది.

**చంద్రుని యాకర్షణ భూమిపైఁబడి నసముద్రజలములకుఁ బోటుపాటుల గల్గించుఁగాని కెరటములఁ గల్గింపవు. నదీజలముల కంతగాఁ బోటుపాటుల కార్యముండియుఁ గల్గింపఁజాలవు**—

చంద్రునియాకర్షణ లోతగుట సముద్రజలములం దెక్కువగ (స్పష్టమై తెలియునంత) పోటుపాటులు గల్గించెడినని యెల్లరెఱింగినదే కాని నదీజలములు లోతులేని వగుట పోటుపాటులకాలమున నాపద్ధతినందియు నంతగా స్పష్టముగఁగాన్పింపవు. ఇంతియే గాదు భూమియొక్క యుపరిభాగఁపుఁ బొరయు నించుక (అనఁగా వీలులేనంత స్వల్పభాగము) పొంగునని కన్గొనఁబడినది. ఇంకఁ గెరటములు వాయువువలనఁగల్గిన తోఁకుకునుండి సంభవించునవి గాన పోటుపాటులతో సంబంధించినవి కానేరవు. పోటుపాటులందుండినను లేకుండినను నవి వేఱుగ గాలినుండి కల్గుచుండును. గాలి నిలచిన నెట్టితరుణమందైన నఁ దగ్గిపోవుచుండెడిని.

**చంపాషష్ఠి-దేవాస్ సంస్థానరాజ్యము:-** ఇది పశ్చిమయిండియా మహారాష్ట్రసీమల నెల్లరకుం గులదైవమగు ఖండోబాదేవుని జన్మదినము. ఖండోబాను శివావతార మందురు. ఈఖండోబాదేవునిభక్తికి మూలస్థానము. పూనా, హుబ్లి మీటరుగేజి (M. S. M. రెయిల్వే) లైనుపై నున్న జెజూరీపట్టణము కేంద్రస్థానము. ఇది ఖండోబాభక్తుల యాత్రాస్థలము. ఇట్లయ్యును బొంబాయిరాజధానిలోని దేవాస్ సంస్థానమున ఖండోబాభక్తి చంపాషష్ఠితో సంబంధించినదిగా నున్నది. ప్రభుకుటుంబము శివభక్తులు. యాదవ కులక్షత్రియులు. చంపాషష్ఠికిమున్ను పసునారు సోమవాసరముల నుపవసించుచు ఖండోబాపూజ లొనర్చుచుందురు. మార్గశిర శుద్ధషష్ఠి చంపాషష్ఠి

యనఁబడును. ఇది శివుఁడు ఖండోబాయవతార మెత్తిన దిన మందురు. తరుచుగ డిశెంబరునందు సంభవించుచుండును. రాజధానియగు దేవాస్‌పురమున ౧౭౭౦ డిశెంబరునెలలో నామహారాజుగారికి భూమియందుఁ బాతిఁబడిపోయియున్న ఖండోబాశివలింగ మొకటి దొరకి దేవస్థాన మేర్పడి యాత్రాస్థలమై యున్నది.

**చక్కఁదనము (Beauty):**—మన శరీరేంద్రియములకు, మనస్సునకు, బుద్ధికి, ప్రమోదము, నానందము, సుఖము లేక సంతసములలో దేనినైనఁ గల్గించుదానిని చక్కనిది (beautful) గా నెంతుము. గాని నిజమునఁ జక్కనిదనుట కర్థమే లేదు. తర్కశాస్త్రదృష్ట్యా చక్కఁదన మంగీకరింపఁబడఁజాలదు. ఒకరికిఁ జక్కగనుండినది వేరొకరి కుండకపోవచ్చును. కొంతఁ జక్కదనమనిపించిన నొకకొంత యధికచక్కఁదనముఁగల్గిన వేరొకటి యుండునని తలంచువారును నుందురు. గాన చక్కఁదన మొకప్రత్యేకపదార్థమై యెల్లర కొకరీతి నుండునది కాదు.

అనుకూలత కొందరికిఁ గల్గుతఁరి వారు దానిని చక్కనిదందురు. అనుకూలింపని మఱికొంద రట్లనకుందురు. గాన మనస్సునకు హితమగునవి వారికి సౌందర్యవంతము లనియుఁ జక్కఁదనముగ నగుపడుట మన మనస్సుస్థితినుండియె యనియుఁ జెప్పనగును.

**చక్రకోట్యమండలరాజ్యము (బస్తరుసంస్థానరాజ్యము):**— కాకతీయ - అన్నమదేవ - సంతతిభూపతులచేఁ బాలింపఁబడుచు, మధ్యరాష్ట్రముల గవర్నరుగారి యధికారమునకు లోఁబడిన రక్షితసంస్థానముగా నున్నది. ఇంద్రావతీనదీతీరమందున్న జగదల్పుర మిప్పటి రాజధాని. ఇంద్రావతీనది గోదావరియందుఁ జేరుకొను నుపనది. రాయపూరునుండి నలువదిమైళ్ళదూరమందున్నది. రాజ్యమరణ్యములయమై చాల తక్కువగా భూములు మితిమీఱి కాళీయై యున్నవి. ఆదని ధారావర్షుండను నాగవంశప్రభుభూపతిచేఁ బాలింపంబడె నితండు రాజరాజనరేంద్రునిభార్య అమ్మంగదేవిసుతుఁడు. రాజేంద్రచోడుఁడు లేక ఒకటవకులోత్తుంగచోడునకు సమకాలికుండఁట. ఆనాటిరాజధాని చక్రకోట్యము క్రమముగ మాఱి కొంతకాలము చిత్రకూట మనఁబరఁగి, యొక పల్లెయై యింద్రావతీనదీతీరమున దీనావస్థయందున్నది. శాసనములందుఁ జక్రకోట్యము, చక్రకూటము, చిత్రకూటము నను పేరులు వాడఁబడి యున్నవి. మార్కండేయోత్తరపురాణమున దీని ప్రశంస గలదు. (బస్తరుసంస్థాన రాజ్యము చూడుఁడు)

**చమురు కాలుట**— చమురుపదార్థములన వేర్వేరునూనెలు, నాముదములు మొదలగు జిడ్డుగలపదార్థము లన్నియు చమురులే. అందుఁ బలుచనివి నూనెలుగను, చిక్కని వాముదములనియుఁ బేరుకొని గట్టిపడుచుఁ దిరుగ వేడిం గరగుచుండు పాలనుండిలభించు జిడ్డుపదార్థము నేయి (ఘృతము), యనియు వాడుచున్నారు. ఇవి యన్నియు చమురుపదార్థములే. ఇంకఁ గొబ్బరినూనె, అవిశనూనె, పత్తిగింజలు, ఆవాలు మొదలగువాటినుండి లభించినదంతయు చమురుపదార్థములే. వీటియం దధికభాగము కార్బన్ ఎలిమెంటు, హైడ్రోజెన్ ఎలిమెంటు కలదని పరిశీలనలనుండి యెఱుఁగనైనది. వీటిలోఁ గొన్నింటమాత్రమే కొంత ఆక్సిజెను కలదఁట. కాని తక్కినవాటియందుఁ జాల తక్కువయని తేలుచున్నది. అనఁగా వాటియందలి హైడ్రోజెన్ కార్బనులం గాల్చఁ

జాలక కడుంగడు తక్కువగానుండునదని భావము. అందుండు హైడ్రోజను కార్బనులం బూర్తిగఁ గాల్చవలె ననిన, నందలి ప్రతిరెండుపరమాణువులకు నొక యాక్సిజెనుపరమాణువు, హైడ్రోజెనునకును రెం డాక్సిజెనుపరమాణువులు కార్బనునకును కావలసియుండును. ఇంచు మొదటిదాని నాంగ్లరసాయనశాస్త్రవేత్తలు H 2 O. అనియు, రెండవ దానిని C. O. 2 అనియు వాడుచున్నారు. గాననె చమురుపదార్థములఁ జక్కఁగఁ గాల్చనగునని వాడుక నందియున్నది. వాటికెలయికకాలుటయే గాన ఆక్సియాడైజు (Oxidise) కార్యము పూర్తిగ నగువఱకు ననగా నా రెండు పూర్తిగఁ గాలుట యగుదనుకఁ గాలునని యెఱుఁగునది.

**చలనము (Movement):**— చలన మన కదలిక యని భావము. చంద్రుఁడు భూమిం జుట్టియు, భూమి సూర్యునిం జుట్టియు మొదలుగాఁగలతిరుగుట లన్నియుఁ జలనములే. జగద్వస్తుసముదాయ మంతయు నిట్టిచలనమునకు లోఁబడినదియే. ఈచలనములు కాళీప్రదేశము (space) నాక్రమించి, యందు వ్యాపించియున్న ఈతరుగుండా జరుగుచుండునని చెప్పఁబడినది. (ఈతరు చూడుఁడు. పదార్థము చూడుఁడు) ఈతరుగుండా మేటరుపదార్థము నడచుటకు వస్తుభేదముగాని, పరిమాణభేదముగాని, పాటింపనక్కఱయుండ కొకేరీతి నీతరునం దలలగుండా యలలం గల్గించుచుఁ జలనమునందుచుండు ననెదరు. దీనికాంగ్లశాస్త్రవిదులు 'All prevading force in nature' అని వాడుటయుఁ గలదు.

శాస్త్రపరిశీలనలు చలనశక్తి నెట్లు మానవోపయోగమున కుపయోగింపనగునో యట్టివిజ్ఞానము మానవులకుఁ గల్గించుచుండును. అనేకకాలములనుండి కలజలపాతములు చలనముఁగలవియే. ఆచలనశక్తిం బట్టి విద్యుచ్ఛక్తిం గల్గించి యుపయోగించుట యిందుకు సాదృశ్యమే గాక నేమగును? ఆవిద్యుచ్ఛక్తి వార్తల నడఁపుచుంటయు, దీపములం గల్గించి వెల్గిచ్చుచుంటయు, విసరుచుంటయు, వీధులవెంటఁగూడ ప్రయాణఁపుబండ్లను నడఁపుట మొదలగు ననంఖ్యాకములగు పనులం జేయుచుంట నేడు జగమునఁ గాననగుచున్నది. ఎలక్ట్రిసిటీ కర్మాగారములందలి యంత్రములంగూడ నడుపుచున్నది.

మానవులకుఁ దెలియకపూర్వము సైతము నైసర్గికముగ మొక్కలు పెరుగుట, చెట్లు పూచి కాచుట మొదలగుకార్యములకు సృష్టివిధానము, ఎలక్ట్రిసిటీ నుపయోగించుకొనుచునే యున్నది. ఇది యంతయుఁ జలనములోనివనులే యైయున్నవి.

**చలిచే గడఁగడ వణఁకుట:**—కడన్, కడనన నిట, (కడ కొనలకు) నని యర్థము. ఇటునటు వడకుటయని భావము. ఇది చలి యధికముగ శరీరమందలి వీపు, కడుపు, హృదయము మొదలగునవియుండు భాగమునకుఁ దాకుతతి సంభవించుచుండును. మేను కొరడుబారుటకుఁ బూర్వఁపుస్థితి యని పోల్చిరి. ఇది రక్తనాళములకుఁగల్గు దుఃస్థితి (desturbance in nervous systum) అనియు, నరముల excitement అనియు, నాంగ్లవైద్యవిద్యావిశారదు లనుచున్నారు. దీనికి శాంతి యుష్ణోదకస్నానమందురు. ఆంగ్లమున వణకుటకు Shivering అందురు.

వేడి యధికమగుతఱి నుత్సాహశక్తి మందగించి బలముతగ్గును. చలివలన వడకుట నుత్సాహశక్తినధికపర్చి బలముఁ గల్గినదిగాఁ బోల్పఁబడినది. ఆంగ్లవైద్యులు "Cold shivering is stimulent" అనియెదరు. ఇంకను వారు Shivering serves the purpose of the

body అని దీనియుపయోగమును వివరించుచున్నారు. వణఁకుట యసౌఖ్యకరమైనను నుత్సాహశక్తి (activity) నధికపర్చుట శరీరోపయోగమయ్యెడిని.

## చిత్తూర్ ఘడ్:-

(మేవాడ్ చిత్తూరు చూడుడు)

**చిరకాలము జీవించు చెట్లు**—భరతదేశమున మఱ్ఱిచెట్లధికకాలము జీవించునని బలమైనవాడుక కలదు. రావిచెట్లు (బోధివృక్షము)ను నెక్కువకాలము జీవించునవిగాఁ జెప్పఁబడుచున్నవి. ఇంగ్లాండుదేశమున middle sex సీమలోని staives గ్రామమునందలి yews వృక్షములు పురాతనములని చెప్పంబడుచున్నవి గాని యిటీవలఁ గొందఱు వృక్షశాస్త్రవేత్తలు వాని నొకవేయిసంవత్సరములవయస్సుండునవిగాఁ బోల్చిరి.

పాలస్తినాదేశమున లెబనాన్‌కొండప్రక్కల నుండి సీడరువృక్షవనము కడుంగడు పురాతనమని క్రైస్తవమతావేశపరులు సోలోమోన్ భూపతి కట్టిన జహోవాదేవుని దేవస్థానమునకుంబూర్వమే యుండినవనియు 'Famous old cedaro of Lebnon అని గంభీరముగఁ బల్కుచు నవి జగత్తునఁ బురాతనములని యందురు కాని యది సంశయాస్పదమే. ఏలనన నిటీవలిపరిశీలన లవి రెండువేల సంవత్సరములనాటివిగ బయటఁ బెట్టినవి. ఇంకనమెరికాసంయుక్తరాష్ట్రములకుఁ జెందిన కాలిఫోర్నియాలోని Sierra Nevada కొండల ఏటవాలుప్రదేశములందుఁ బెరుగు Gian Sequoia వృక్షములు ప్రపంచమునఁ బురాతనములని యమెరికాదేశస్థులేకగ్రీవముగ ననుట కలదు. అవి రెండువేలుమొద లయిదువేల సంవత్సరముల వయస్సు కలవఁట.

Von Hamboldt అనుపేరుగల జర్మనుదేశపు రసాయనశాస్త్రవేత్త పరిశీలనలకుఁ గొప్పదేశసంచారము లొనర్చుచు మెక్సికోదేశమున Oaxaca లోవలోని యొకసూర్యరశ్మిచేఁజక్కఁగ వేఁడియైయున్నభూమియందు మైదానముగఁ జెప్పఁబడు మెరకప్రదేశసీమయందున్న ఋాలీ గ్రామమునందలి సాంటా మేరియాక్రైస్తవదేవస్థానపుటావరణమున నున్న యొకముసలిప్రాఁతచెట్టును ప్రపంచమున నెక్కువపురాతనమై జీవించియున్న వృక్షముగఁ బోల్చి దానిపైఁ దనపేరున నొకశాసనమాచెట్టున కంటఁగట్టించియున్నాఁడు. అది లోహశాసనము. జర్మనుదేశమునం దారసాయనశాస్త్రవిదుఁడు గొప్పపేరుప్రతిష్ఠలం గాంచినవాఁడని తెలియుచున్నది.

ఆచెట్టు Cypress జాతికిఁ జెందినదఁట. దాని trunk చుట్టుకొలత (భూమినుండి నాలుగడుగుల యెత్తున) నూటయిఱువదియడుగు లుండునఁట. ఇరువదియెనమండ్రుగురు మనుష్యులు దానిం జుట్టుకొని చేతులతోఁ బారఁజాచి దానితుండును వేళ్ళ కొనలం దగులుచ ట్లాలింగనముఁ జేసికొనవలసియుండునని చెప్పఁబడినది. అది తుప్పవలె గుజ్జుగాఁ బెరుగు గున్నచెట్టుగా నుండునఁట. దాని యెత్తాకాశమువైపు ౧౬౦ అడుగులు మాత్రమేనఁట. కొమ్మ లధికముగాఁ బ్రక్కలకు దీర్ఘములుగ వ్యాపించియుండ నాకొలత దెసకు ౧౪౦ అడుగుల వఱకు జనియుండునఁట. చెట్టు సాపుగానుండక మెరకపల్లములతో నుండు పాతచెట్టుగాఁ గన్పట్టుచుండునఁట. కాని దానివయస్సెంత యుండునని యాజర్మనురసాయనశాస్త్రవిదుఁడుఁ గూడ వివరింపఁజాలకఁ గొన్నివేలసంవత్సరములని మాత్రము నుడివెను.

అచటివిప్రజ లందఱు రెడ్ ఇండియనుజాతికిఁ జెందినతెగలవారు. వారిలోఁ బెక్కండ్రు వృద్ధులు.

వారు తమపూర్వు లీఓక్సాకాలోవలోని కరుదెంచిననాటి కీమహావృక్షము పెద్దదియైయుండెననియు, వారద్దానిని పెద్దచెట్టని పొగడుచుండిరనియు కోర్టీస్ సేనాని తమసైన్యబలములను నడిపించుకొనుచు నాలోవకుఁ జేరి, యాచెట్టుక్రింద సైన్యముతో దిగెననియు, నాముచ్చటల నాలోవలోఁ గాపురములు కుదిరినవారెల్లరుఁ దరతరములుగఁ జెప్పుకొనుచు జ్ఞాపకపరంపరలచే నిల్వ యుంచుకొనుచున్నార మనియు జర్మనురసాయనవేత్త కెఱింగించిరట.

## చీఁకటియం దగుపడకపోవుట—

చీఁకటి యనిన వెలుతురు లేకపోవుటయనిభావము. శబ్దములధ్వనియే లేకుండుటను నిశ్శబ్దమనినటుల వెలుతురు కేవలము లేకుండుటను చీఁకటి యన వలయును. నిజముగ నట్టిచీఁకటియే వ్యాపించి యుండునేని కేవలాంధకారబంధురమై యెట్టినేత్రముల కేవస్తువయుం గానరాకుండవలసియుండును. కాని నిజమారసిన నట్టిస్థితి లోకమున ననగాఁ భూమిపైఁగల్గుట యరుదు. భూమి కొకవైపున సూర్యుఁడు ప్రకాశించుచు వెలుతురు నింపుచున్న తఱి వేరొకదెసను వెలుతు రుండకఁ గొద్దిగనో కొంతగనో చీఁకటియగును. గాని భూమియొక్క యవ్వలి వెలుతురుదెసనుండి వెలుఁ గించుక ప్రతిఫలించుచునే యుండును. దీని నాంగ్లమున శాస్త్రవిదులు 'Reflection & Refraction' అనియెదరు. సంపూర్ణసూర్యగ్రహణము చేకూరి వెలుతు రుండవలసినపక్షమున సైతము చీఁకటి యగుతఱి రెండవదెసం జీఁకటి యధికమగునుగాని సంపూర్ణత నందదు. ఏలయన సూర్యగ్రహణములు భూగోళార్థమంతటను చీకటింగలుగఁజేయునవి కావు. అవి భూమిపై నాగోళార్థపుఁ గొంత భాగమునకే చీఁకటిం గల్గింప సూర్యబింబమును మఱుగుపఱుపఁ జాలెడిని. ఇవి యన్నియుఁ గాక ఏవో కొన్నినక్షత్రములనుండి యించుక వెలుతురైనను నుండకపోదు. ఇంక నాకసమున దట్టమైన మబ్బు గ్రమ్మి యుండెనేని చీఁకటి యధికమగునుగాని యది సంపూర్ణాంధకారమును గల్గింప నేరదు.

కొన్ని తక్కువచీఁకటులందు సైతము చూడఁ జాలని బలహీనంపుదృష్టి గలవారికి రేఁజీఁకటి యందురు. బలమగుదృష్టిగలవా రట్టి తక్కువ చీఁకటియందుఁ జూడఁగల్గియుందురు. ఇంకను గాఢమగుచీఁకటియందు గుడ్లగూబలు, పిల్లులు, కుక్కలు మొదలగుకొన్నిజంతువులు తమనేత్రములందలి కనుపాపలను చక్కఁగ విడఁ జేసిచూడఁ గల్గుచున్నవి. వాటికి దృష్టిబల మధికమని చెప్పుట కనుపాపలను చీఁకటియం దెక్కువనేర్పుతో నధికముగ విప్పుశక్తిగలదని చెప్పుటయే యగును. అట వ్యాపించియున్న కొంచెపు వెలుతురైనను దానిఁ జీఁకటియందు దృష్టింగల్గించి యగుపడఁ జేయుచుండును. దృష్టిబలము చాలనివా రిట్టిస్థితియందు నిరర్థకులే.

ఇందువలన బయటనుండికల్గిన వెలుతు రాచీఁకటియందున్నపదార్థములను (అన వాటియాకారమును) చూచువారికండ్ల కందిచ్చి, యగుపడఁ జేయుచున్నదిగాఁ దెలియనగుచున్నది. చీఁకటియం దావస్తువు కండ్లకగుపడుటయన వెలుతురుసంబంధమైన యాకారము గాని, యావస్తువుయొక్క నిజశరీరముగాని ఆచీకటియవంబడు పరిస్థితియందట లేకుండిన, చూచుట, యగుపడుట సంభవింపఁజాలదు. కొంచెపుఁబాటి వెలుతురైనను పని చేయుచునేయున్నదని యిందువలన నెఱుంగనగుచున్నది.

సర్వసాధారణముగఁ గనుపాపలను విప్పి యొక పాటిచీఁకటియందు సైతము పశువులు మొదలగు జంతువులు, గుడ్లగూబలు మొదలగు నక్తంచరములగుపక్షులు, నెలుకలు మొదలగునవి చూడఁగలశక్తిఁ గల్గియున్నవని తలంపఁ బడుచున్నవి. కోఁతుల కట్టిశక్తి లేదు. కొన్నిపశువులకుఁ గూడ రేఁజీఁకటియుంటఁ జూచుచున్నారము. గబ్బిలములు, గుడ్లగూబలు నధికమైన వెలుతురునందుఁ జూడఁజాలకుండును. సముద్రమునఁ జేఁపలంబట్టువారు రాత్రులందుఁ జక్కగా చూడఁగల్గుచున్నారు.

## చీఁకటిరాత్రులందు నక్షత్రము లెక్కువ గాననగుచుండుట

మేఘములుండని చీఁకటిరాత్రులందు నక్షత్రము లధికముగఁ గాన్పించుటంజేసిఁ చీఁకటికిఁ జుక్క లెక్కువ, దరిద్రమునకు సంతానమెక్కువ'యని యొకఁడుక్తి సామెతగా నేర్పడియుంట యెల్ల రెఱుంగుదురు. దీనికిఁ గారణము చక్కని బలమైనచీఁకటియందుంట మన నేత్రములు నక్షత్రములను నధికసంఖ్యాకములఁ జూడఁగల్గుటయే గాని నక్షత్రము లధికమగుట యెంతమాత్రము గానేరదు.

అంతరాళమునం దాకాశమున ధూళి వాయువు నందుండినతటిఁ జిన్నచిన్నప్రకాశముగల వాటిం జూడఁజాలము గాని యాకాశము నిర్మేఘమై వాతావరణము స్వచ్ఛమై చీఁకటి గాఢమైయుండు తటి స్వల్పప్రకాశవంతములగు నక్షత్రములఁ బెక్కులఁగూడఁ జూడనగుచుండెడిని.

**చీనాసామాను:**— భారతదేశమున చీనాసామాను, పోర్సిలైనుసామాను, పింగాణీకుండసామాను, బిస్కట్ చైనాబొమ్మసామాను మొదలగున వన్నిటినిఁజేర్చి పల్కుట యాచారమైనది. ఐరోపాదేశస్థులు వాడుకొనుచుండు Cups, Saucers, Plates, Disheo, Bowels మొదలగున వన్నియుఁ బింగాణీజాతులకుఁ జెందిన వియే యైయున్నవి. వీట్లంజేయుటయందు వీటి శరీరపదార్థము, వీటిపైఁబూతమెఱుఁగునను రెండు భేదపదార్థములుగ నున్నవి. వీటిని చేయుటయందందటికిని సమానధర్మములు పెక్కులు కలవందురు.

ఆది నీపింగాణీకళ చీనాదేశమునందుఁ బ్రారంభమై, యన్యదేశస్థులచే నామహాదేశమునందుఁ జేయఁ బడుకతన "చీనాసామా" (China-ware)నని పేరంది యన్యదేశములందుఁ జేయఁబడినను నాపేరనే వాడఁబడెనఁట. పోర్సిలైను పైఁ బూతమెఱుఁగు semi Transparent గా నుండుటయుఁ దక్కినవి యించుకభేదములతోఁ దగ్గియుంటయు, వీటియందుండు ముఖ్యభేదములు వీటియందుఁ జైనాసామానుచేయుటయందలి రహస్యముల నన్యదేశములవా రనేకశతాబ్దములనుండి యెఱిఁగియుండినటులఁ దెలిసెడిని. అవి యొక ప్రక్కనుండి వేఱొకప్రక్కకు గుడ్డివెలుతురుం బోనిచ్చునంతటివిగా నుండెనఁట. అవి ప్రభువుల మెప్పులఁ బడయుచుండె నందురు.

తొలుదొలుత నీకళనుగ్రహించిన యైరోపాదేశస్థు లిటలీవారఁట. పిదప జర్మనులును, ఫ్రెంచివారును దీనింజేయనేర్చి యెవరికివారు దీనింజేయు రహస్యముల నతిగోప్యముగ నుంచుచుండిరఁట. దీనియందలి వింతగుణములం గలుగఁజేయునది 'Kaotin' అను పదార్థమఁట. క్రీ. శ. ౧౬౭౧ దనుక నింగ్లాండుదేశమున కిదిబయల్పడకుండెనఁట. ఆసంవత్సరము John Dwight గారనునాయన దీనింజేయ patent నందెను. పిదప క్రీ. శ. ౧౭౫౧ లో డాక్టరు wall అనుపేరుగల విద్యా

ధికుఁ డొకఁడు Warcester porcelain కర్మాగారమును స్థాపించెను. ఈతఁడు చిత్రలేఖకుఁడు, వైద్యుఁడు, రసాయనశాస్త్రవేత్తయుఁ గూడ నై యుండెనని చెప్పఁబడినది. ఈయనకర్మాగారమునఁ జేయఁబడిన సామానులు డ్రెస్డెన్, సెవ్రెన్‌నగరములందలి కర్మాగారములఁ జేయంబడినసామానులకుఁ దీసిపోకుండెనని చెప్పఁబడినది.

ఇక్కాలమున నీపోర్సెలైనుసామాను జేయుటయందు ముడిదినుసులు ౧ Cornish granite, ౨ China clay, ౩ Flint, ౪ Fire clay, ౫ Swedish Felspar, ౬ Silica; వీటికిఁ బైఁబూత మెఱుఁగుఁజక్కఁగఁ గల్గింప Ox bone కావలయు నందురు. వీటిని యుదకములతోఁ గల్పి యంత్రములచే మెత్తగ నూరుదురు. అత్తఱి నది పలుచని నీటిబురదంబోలియుండి mixing pots అనఁబడు యంత్రభాగమునకుఁ బంపులగుండా పంపుదురు. అటుల నేగుతఱి సూదంటురాళ్లనడుమనుండి యరుగవలసియుండెడిని. ఏలనన పైముడిదినుసులయందుండు నినుపరేణువులు సామానునకనాకారముం గల్గింపకుండ నాయయస్కాంతములచే నాకర్షింపఁబడి వాటి కంటుకొనవలసియుండెడిని. అటుల విముక్తిఁగాంచిన యార్ద్రపదార్థమునకు Slip అనుసాంకేతికనామమిడి వాడుచున్నారు. దానియం దధికముగుపలుచందనముండిన దానిలోని యధికజలముఁ బిండివైచి కొంతపదునుగనుండి ముద్దగఁజేసి మధించుచు నొక్కుచుండురు. అది వంగియుఁ బగులనిస్థితిఁ గలిగి గట్టిపడినపిదప నట్లే నిలువయుంచుకొందురు. దీనిని Manufactured clay అనియు క్లుప్తరూపముగ 'clay' యనియు వాడుచున్నారు.

ఈ క్లేముద్దను ద్వివిధకార్యములకు వాడెదరు. అవి (౧) కప్పులుమొదలగు 'బోలు' (లోతుగల) పాత్రలంజేయుపనికి 'Throwing' అనియు, అట్టి పనులఁ జేయుపనివానికి 'Thrower' అనియు, సాంకేతికనామము లిడిరి. పిదప (౨) పళ్ళెములం బోలిన లోతులేని మెరకసామానులం జేయుపనికి 'Pressing' అనియు, బొమ్మలు (విగ్రహములు) మొదలగువానిని జేయుపనికి 'Casting' అనియు, సంకేతనామము లిడియున్నారు. ఇందు 'త్రోయింగు' 'ప్రెస్సింగు'పనులకు క్లేముద్దను, కేస్టింగుపనులకుఁ బలుచగనుండు స్లిప్ బురదను వాడుదురు. మఱియు మొదటిరెండుపనులం జేయుటకుఁ గుమ్మరిసారె (చక్రముల)ను మూఁడవదియగు విగ్రహచిత్రములకుఁ బోతమూసలను నుపయోగించెదరు.

(౧) త్రోయింగుపని:—ఇందుఁ గుమ్మరిసారె వాడఁబడును. ఈవాడుక యైదువేలసంవత్సరములనుండి యొకేరీతినున్నదని పరిశీలకులందురు. పనివాడు తనకాలితో నొకమీటనునొక్కుచు చక్రముం దిరుగఁజేయుచుండును. కుమ్మరిసారెల చక్రమొకేరీతిదైనను త్రోయింగు ప్రెస్సింగు పనులకు వేర్వేరుభేదములఁగల్గియుండెడిని. చక్రఁపుటిరుసునంటి పైకివచ్చిన యుపరిభాగమున నించుక క్లే ముద్దనిడి చక్రముఁద్రిప్పుచు కప్పులు మొదలగు బోలువస్తువులఁ జేతివ్రేళ్ళతోనానుచు జేయును. దానియాకారము వ్రేళ్ళతోను నరచేతితోను నొక్కుటనుండి యేర్పడుచుండును. దీనిందీసి యుదకఁపుఁజెమ్మఁ బీల్చుకొనునట్టి (Porous) మూసయందుంచి బిగించ నిష్కర్షగ నాకారమేర్పడును. దీనిని Fashioning అందురు. అనగా దానియాకారమును నిష్కర్షపరచుటయని భావము. దాని నామూసతోసహా యించుకసేపుంచినఁ దడియారుచు గట్టిపడును. దానిందీసి turner (లేకత్రిప్పునాతఁడు) Lathe యంత్రమందుంచి యంచులను మొదటనిష్కర్షపర్చి నఱకును. ఇది

వరకే యాయత్తపర్చఁబడి యారుచున్న (పట్టుకొనుటకైన) పిడిని స్లిప్ బురదతోఁ దగిలించి యంటింతురు. అదియు నారుటతోఁ గలసిపోయి యతుకుకొనును. ఆసామానునారనిచ్చి కాల్చుటకాయత్తపఱతురు.

(౨) ప్రెస్సింగ్ పని:— లోతులేనిపళ్ళెములు (Plates & Saucers) మొదలగునవి వేరొక కుమ్మరసారె (చక్రము) పై యిరుసునం దొక వలాసయందుఁ జేయుదురు. ఆమూసయం దా క్లేముద్దనునిచి యదిమి (నొక్కి) యుంచెదరు. అట్టి సారెచక్రమునకు Jigger అని సాంకేతిక నామము గలదు. చక్రము తిరుగుచుండుతఱినే దానియాకారము కుదురునటుల మూసయం దదిమి యంచులను వృత్తాకారాదులతోఁ దీర్చెదరు. అట్లుతీర్చినవఱకుఁ బనిముట్టునకు Profile అని సాంకేతికనామ మిడియున్నారు. దానిని మూసతోసహా యొకవేడితావునందుంచిన గట్టిపడి విడిపోయి తీయ నలవియగును. దాని నారనిచ్చి కాల్చుట కాయత్తపఱచెదరు.

(3) కేస్టింగుపని:— ఇది విగ్రహచిత్రము దీనిని చమ్మనాకర్షించు (Porous) మూసలలో స్లిప్ బురదఁ బోసినింపి యూరకొందురు. అది యించుకసేపులోఁ దడియారి పలుచనిపొర బొమ్మ రూపమున నేర్పడును. పెద్దపెద్దబొమ్మలు చేయుతఱి ననేకముక్కలు గల మూసయందుఁ జేయుటయుఁ గలదు. ఆముక్కలను స్లిప్ బురదతోనే యంటించి కూర్చుదురు. ఆబొమ్మ లారినపిదప లొటిపిట్టల రోమములకుంచెలతో సాపుచేసి యారనిచ్చి కాల్చుట కాయత్తపఱచెదరు.

వీటింగాల్చు నావములు వేర్వేరుసామానులకు వేర్వేరుగ నుండెడిని. వాటి నందు నింపి దారి నిటుకలతోమూసి యగ్నినంటించి నలువదిగంటలసేపు



కాల్చి నలువదియెనిమిదిగంటలసేపు చల్లారనిత్తురు. వాటినంటియున్న యిసుకరేణువులు Flint ముక్కలు వదల్పంబడి dipping process వలన మెరుగుపూత పూయఁబడి తిరిగి glost oven యందుఁ గాల్పఁబడును. పిదప దానిని బొమ్మల (చిత్రము) తో నలంకరించి తిరిగి కాల్చుదురు. బంగారురంగు agate రాయి Blood stone లతో రాచిన మెఱుగువచ్చెడిని.

## చుక్కయెదురు (ప్రతిశుక్రదోషము):-

గర్భిణీస్త్రీలు, బాలింతరాండ్రు, క్రొత్తగాఁ బెండ్లియైన నూతనవధువులు, చుక్కకెదురుగఁ బ్రయాణముఁ జేయరాదనువాడుకను పెక్కండ్రెఱిఁగియే యుందురు. దీనికి జ్యోతిషశాస్త్రమునఁ బ్రతిశుక్రదోషమని పేరు. శుక్రగ్రహము తూర్పుదెసనున్నతఱిఁ బశ్చిమమునుండి తూర్పు, యీశాన్యదిక్కు, వాయవ్యదిక్కు, నుత్తరదిక్కులకు బ్రయాణముసేయుట క్షేమముకాదని దీనిభావము అటులనే శుక్రగ్రహము పశ్చిమదెసనున్నతఱిఁ దూర్పుదెసనుండి యాగ్నేయదిక్కు, దక్షిణదిక్కు, నైఋతి, పశ్చిమదిక్కులకుఁ బ్రయాణముచేయుట క్షేమముకాదనిదీనిభావము. అనగా నానక్షత్రమున కెదురుగాఁ జనరాదని భావము. ఈదోషము నత్రి, యాంగిరస, కాశ్యప, గార్గ్య, భారద్వాజ, భృగు, వాత్స్య, వాశిష్ఠ గోత్రములవారు పాటింప నక్కరలేదని చెప్పఁబడినది. ఒకేగ్రామమునఁ బాటింపనక్కరలేదని కొందరుఋషు లభిప్రాయపడిరి.

మహాంతరమునం దింకను వివాహకార్యములందుఁ దీర్ఘయాత్రలందు దుర్భిక్షకాలమునందు రాజవిద్వర (విడ్డూర) లేక మహోత్పాతబాధలనుండి తప్పించుకొనుటకే తరలిపోవుటలందు, రోగములు మొదలగు దేశోపద్రవములనుండి

తప్పించుకొను ప్రయాణములందుఁ బ్రదోష ముండదనియుఁ బెక్కండ్రు బుధు లభిప్రాయపడియున్నారు.

**చులకనివస్తువులు బరువువస్తువులందుఁ దేలుట**— ఇచట బరువు చులకన లనుటయందు వస్తువునందున్న డెన్సిటీయని భావము. (డెన్సిటీ చూడుఁడు) డెన్సిటీయుండియే భూమి యొక్క ఆకర్షణశక్తి (Gravitation pull) పనిచేయుచుండుం గాన (గ్రావిటేషన్‌పుల్) చూడుఁడు) చులకనివస్తువులందు బరువగువస్తువులు గ్రావిటేషన్‌పుల్ వలన భూమిపైపు (అడుగునకు) లాగఁబడుచుండును. దానిని బరువువస్తువులు చులకనివస్తువునందు మున్గుటయందురు. ఇటులనే నీటియం దినుము మున్గుట సంభవించును. ఇనుము నీటికన్న నెక్కువడెన్సిటీ గలదిగాన మున్గెడిని. కాని పాదరసమునం దాయినుము మున్గక తేలుచుండును. ఏలనన పాదరసఁపుడెన్సిటీ యినుమునందలి డెన్సిటీకన్న నధికముగాన పాదరసమునం దినుము భూమియొక్క గ్రావిటేషన్‌పుల్ నధికముగా నొందఁజాలదు. ఇదియుఁ జులకనివస్తువులు బరువువస్తువులందుఁ దేలుటయే యగును.

**చెట్టుపండ్లు; టెంకలు:**- చెట్లు చక్కఁగఁబెరిగి వృద్ధపై నపిదప నకాలమునఁ బూయ నారంభించెడిని. ఇది చెట్లయందు ఫలితమునందలి ప్రారంభము. పూత దాని సౌందర్యప్రదర్శనము. పూవునందలి రెక్కలు పరిణామముగ రాలిపోవ నారంభించుట దాని కపాయము కానేరదు. ఇంకను నాపూరెక్కలుండి ప్రయోజనములేదని భావము. పూవే యొకరీతిని కొద్దిగనో గొప్పగనో యాజాతిచెట్లంబట్టి యర్వాపాసనలఁగల్గియుండును. తోడనే యత్తావునొక గట్టిదైన యాకార మేర్పడును. దానికిఁ బైనొకపొరతొక్కయు, లోన విత్తనఁపుఁ టెంకయు, నడుమ సెల్సుగల కొంతభాగమును గల్గియుండును. అదియె మున్ముందుఁ బక్వస్థితినంది పండనఁ బరగునది.

అదియును ముదిరి పక్వస్థితినంది చెట్టునుండిగల పట్టు తగ్గుచు నెట్టకేలకు సంబంధము పూర్తిగ వదలి నేలంబడును. దానిని కాయ లేక పండందురు. ఇట్లయ్యు సెల్సుగల మధ్యభాగము పక్వస్థితినందుచు లోనున్న టెంక కొద్దికొద్దిగ నొదుగుచు ముమురుచునే యుండెడినని కనిపెట్టంబడినది. ఇదియే యాచెట్టుకైన విత్తనము. దీనికొరకే పూవులంబూచుట. కొన్నిచెట్లరటిమొదలగునవి నిర్బీజములై చెట్లకొమ్మలందు బీజశక్తిఁ బేరుకొనుచున్నది. కొన్నిచెట్లకుఁ గ్రిందిదుంపలనుండి తిరుగ మొక్కలు మొలచుట ప్రారంభమగును. ఇదియే దానిసంతతి.

**చెట్లపూవు లెదుగుట:**—చెట్లు తామెదుగుచుండఁ గాడలందు మొగ్గలందొడుగ నవి ప్రాకమ్ముగ నెదుగుటకారంభించి పెరిగి పువ్వులై పరిణామముంజెంది రేకులు రాలిపోవుటయు, అందుఁ గొన్నిపిందెలుగనేర్పడి తిరుగనెదుగుట కారంభించి పెద్దకాయలై పండ్లై రాలిపోవుట పరిణామముఁ జెందుటయు విచిత్రమై యెదుగుటలోఁ దిరుగ వేరొకటిరెం డెదుగుటలుగాఁ దోపకపోదు. ఎదుగుట నైసర్గికమైనను వృద్ధియావనసంబంధమైనఁ గావచ్చుఁగాని యెదుగుటలో నెదుగుటలు వింత గాకపోవు. చెట్లపరిణామమునకులోఁబడి పూవుల పరిణామము వేరుగను, పండ్లపరిణామము వేరుగను జరుగుచుండును. పూవులు స్త్రీలరుతువుతోడను, కాయలంగాచుటయు ఫలించుటయు సంతానముఁ గనుటతోడను భగతదేశఁపుఁదత్వవేత్తలు పోల్చియున్నారు. పాశ్చాత్యతత్వవిదులు చెట్టునందలి

రసములమార్పిటుఁగల్గించు నందురు. గాని వారి పరిశీలనలు చాలనట్లు తోపకపోదు.

**చెట్లయాకులు రాలి (కుళ్లి లేక ముక్కి) యెరువై చెట్టున కాహార మగుట**—తాటి, కొబ్బరి, ఈత, కర్జూరము, జీలుగు మొదలగు కొన్నిజాతుల చెట్లయాకులు ముక్కిపోవుంగాని కుళ్ళి యెరువగవు గాన వేరు పనుల కుపయోగింపంబడుచున్నవి. కాని సర్వ సాధారణముగఁ దక్కిన యన్ని చెట్ల యాకులును వేసవికాలఁపుఁ గడను చెట్లనుండిపండి రాలిపోయి యెరువగుచుండును. ఆకు లెండనెండి గ్రీన్‌స్టప్ (Green stuff) అనఁబడుపదార్థమును తనయం దేర్పడఁజేసికొనుచు వేసవియంతమున రాలిపోవు చుండును. అవి నిలచియున్న కాలమునఁ జెట్టు ఆగ్రీన్‌స్టప్‌నుండి బలమందుచుండెడిని.

ఆకురాలుటకుముందే మైక్రోబ్సు వేచియున్నటుల దానింబాడుచేయ మొదలిడి కుళ్ళించిగాని ముక్కంజేసికాని ఎరువుగ మార్చుచుండును. ఎండ దాని కధికముగఁ బిదపఁ దగులుట సంభవించునేని యది యెండిపోయి వృథాయగుటయుఁ గలదు. అట్లే ఎరువైనయాకు లాచెట్టుక్రిందనే పడుట సంభవించుంగాన నాచెట్టుండినతావునకే బలముం గల్గించునెరువుగ నేర్పడుట సంభవించుచుండుట విచిత్రము. ఒకచెట్టొకతావుననుండుటయన నచటి భూమిలోని వృక్షాహారపదార్థములం దినివైచి భూమిసారమును తగ్గంజేయుటయు దానియాకులే యానిస్సారఁపుఁబ్రదేశమున కెరువై బలపర్చుటయు నిటఁ గమనింపందగినది.

**చెట్లవ్రేళ్లు:**—చెట్లవ్రేళ్లు భూమిలోనుండి ననే జెట్లకుఁ బ్రయోజనము గలదు. ఏలనన నవి ముఖ్యముగఁ జెట్లయాహారమును భూమినుండి పీల్చుకొనుటకై యేర్పడినవి. దాని తరువాత కార్యము గాలులకుఁ జెట్లు తిరుగఁబడిపోకుండఁ బట్టుబట్టునట్లు చెట్టునకు బలమైయుండుట గాన నివి చెట్లనోళ్లుగఁ జెప్పంబడుటకర్హములై భూమిలోనికి లోతుగనణుగకున్న నిష్ప్రయోజనములే. కొన్ని చెట్లవ్రేళ్ళయందుఁ గుంకటి (సుంకటి సూకటి) వేరనఁబడు మధ్యవేరు క్రిందికిలోతునకుఁ జొచ్చుకొనిపోయియుంట కిదియె కారణమని తోపంజేసెడిని. వాటికి సూర్యరశ్మి తగిలినను నిష్ప్రయోజనమే యగును. చెట్లయాకుల కెండతగిలి Chlorophyll అనఁబడునది యేర్పడునట్లు చెట్లవ్రేళ్ళకుఁ గల్గనేరదుగాన నెండ వ్రేళ్ళకు నిరర్థకమే. ఆంగ్ల వృక్షశాస్త్రజ్ఞులు భూమియొక్కయాకర్షణ శక్తి (gravitation pull) దీనికిఁ గొంతకారణ మందురు. డార్వినుపండితుఁడు చెట్లకు వ్రేళ్ళను భూమిలోనికిఁబంపు స్వతస్సిద్ధశక్తి కలదనెనఁట. వ్రేళ్ళకొనలు యాహారఁపుఁ దేమఁ బీల్చుట కన్ని దెసలకుఁ బ్రాకుటం జూచుచునే యున్నారము.

**చెట్టు ముదిరినపిదప దాని వయఃకాల మెఱుంగువిధము:**—చెట్టును మొదలుభాగమున రంపముతోఁ గోసినచో నొకటివెలుపల నొకటిగఁ గొన్ని వలయాకారఁపు టానవాళ్ళుఁ గన్పించెడిని. అవి పొరలవలెనుండుంగాని పొరలు కానేరవు.

పరిశీలన లిట్టియాకారఁపు టానవాళ్లు చెట్టు యొక్కవయస్సుని (సంవత్సరములని) బయల్పెట్టినవి. గానఁ జెట్లేటేట తమశరీరములకుఁ జుట్టునొక దారుకండరము (Woody tissue) ను పెంచుకొనుచుండుననియు నదియే చెట్లు వలయమగుటయనియు వృక్షశాస్త్రులిదు తెలిసిరి. ఎక్కువవెడల్పు గల వలయములు చెట్టుచక్కఁగఁ బెరిఁగినవత్సరము లవనియుఁ దక్కువవెడల్పుగలపొరలు చెట్టుచక్కఁగఁ

బెరుగనివత్సరములవనియు స్ఫురింపకపోము. ఇట్లయ్యుఁ జెట్టునకు వయస్సుముదిరినకొలఁది వలయములవెడలుపు తగ్గిపోవుచుండుననియు, మనస్సునందుంచుకొనవలసి యుండెడిని. ఏలనన మ్రానువలమగుకొలఁదిని చుట్టునేర్పడుపొర దళసరి తగ్గుచుండుట సహజమే.

**చెట్లుపెరుగుట:**—సర్వసాధారణధర్మము చెట్టుంబుట్టించువిత్తునందే కొన్ని సెల్సు (cells) లుండుననియునందుఁ గొన్ని పైకింబెరిగి వెలుతురు, ఎండలలోనికింబోనిచ్చునవిగను,ఇంకఁగొన్ని క్రిందికిఁ బెరిగి గాఢాంధకారమగు భూమిలోనికిఁ బోనిచ్చునవిగను, అందిఁక నొకటిరెండు గ్రావిటేషనుతో సంబంధముఁగల్గి తిన్నగ వంకలులేక భూమిలోనికిఁ గ్రిందికిఁ జొచ్చుకొని పోనిచ్చునవిగను నుండునని పరిశీలకు లనుచున్నారు. పైకిఁ బెరుగఁజేయునవి యాకులు, పూవులు, కాయలుఁ గల్గించునవిగా నుండి చెట్టుంబైకి నాకసముపై పునకుఁ బెంచును. ఈభాగమున కెండయు వెలుతురును ముఖ్యములు.

క్రిందికిఁ బెంచునవి వ్రేళ్ళంగల్గించి భూమినుండి రసాహారములఁ బీల్చుకొనుచు వృక్షముం బోషింపంజేయునవి. ఇందేది కాయలంగాచుటయు, దుంపలుపెరుగుటయుఁ గొన్నిటియం దుండవచ్చును. ఒకటిరెండుమాత్రమునసెల్సు కుగ్రింకటి వేరులం గల్గించి తిన్నగనడుగునకు వేరులఁబోనిచ్చి చెట్లుగాలికింబడిపోకుండ రక్షకములుగ నేర్పర్చును. దీనికిఁ గాచుటయు దుంపలూరుటయు నుండదఁట. పనసచెట్లు వార్ధక్యమునఁ బ్రక్కలకుఁ బారినవేళ్ళయందుఁ గాచుటయుఁ గలదు. వ్రేళ్ళనుండి పీల్చంబడిన వృక్షాహారము మ్రానుకొమ్మల పైపట్టలేక బెరడునుండి యాకులకుం జనును. గాన దానికిఁ గాయములగుట చెట్టుజీవనమునకు క్షేమము గానేరదు. మంచిగంధఁపుఁజెట్లకు వేళ్ళుండవు గాన నక్కిరిమొదలగు నితరజాతివృక్షముల వేళ్ళపై నాధారపడుచుండునటుల నుపాయము లొనర్చుచుందురు. అంటుమామిడి సపోటాచెట్ల కంటఁగట్టి క్రింది వృక్షభాగఁపువేళ్లతోఁ బీల్చు నాహారముఁ గుదురఁజేతురు. కొన్నితీఁగెలకు గుంపులకడనుండి భూమికానితావులందుఁ గ్రిందికివేళ్ళు వచ్చుచుండెడిని.

**చెమట (Prespiration):**— చర్మము లోనిభాగమునకు రక్తనాళము లనేకములతో సంబంధము గలదు. శరీరరక్తమునందున్న యపరిశుభ్రజలములు శరీరచర్మము లోనిభాగముల వేరై చర్మరంధ్రములు (రోమకూపనాళములు Pores) నుండి బైటికి వచ్చివేయుచుండును. దీనినె చెమట (స్వేదము) యందుము. సర్వసాధారణముగ వచ్చు చెమటనీ రించుకఁ బులుపుగనుఁ గొంచ ముప్పగను నుండెడిని. ఒక్కొకతఱి శుభ్రమైననీరుగూడ వచ్చుచుంటఁ గలదు. దీనికిఁ గారిణము దినమునం దధమ మిరువదియైదౌన్సులజలమైనను చమటగ వెలువడుచుండునని లెక్కింపంబడి యున్నది.

ఇటుల వెలుపలనుండి శరీరములోనికిఁ జమట దారులనుండి నీరుపోఁజాలదు. ఏలనన లోనుండి నీరుబైటికివచ్చుతఱినవి నీరుజారివచ్చునట్లు వీలిచ్చెడిని. కాని వెలుపలినుండి లోనికి నీరేగకుండ యవి నొక్కుకొనియుండును. ఇట్లుండుటకుం గారణము లేకపోలేదు. ఎండకాలమున వేడి యధికమైపోవును. శీతకాలమున శీతల మధికమగును. ఈ రెంటియందును శరీరమును గాపాడుట కొకటి నొకటి యెదుర్కొని శరీరస్థితిని రక్షింపవలసి యుండును. శరీరమందుఁ జెమట నేసవియందుఁ జెమట బయటికి వెడలుచు బయటివేడికి తానావిరియైయెగసిపోయి శరీరమును చల్లఁబఱచెడిని. ఇంక శీతకాలమునఁ జెమట కడుంగడుతక్కువగ నెడ

లుట బయటికిరాక నాఫిరియగుట లేనందున శరీరం పుంజల్లదనముండక వెచ్చగనుంచం గల్గుచుండును. (ఉక్క లేక గుమాయింపు చూడుండు) చెమట యంతయు శరీరమంతటను చర్మమునందుండు glands చేయుపనిగాం జెప్పంబడియున్నది. వీటి నింకను capellary blood vessels అనియు నందురు. ఇవి సర్వకాలములందును పనిజేయు చుండునవియే కాని యూరకుండునవికావు. అను నిత్యమును పనిచేయుచుండునవియె. రక్తమునుండి రసముం బీల్చుచుండునవియె. గాననే శరీరము వేడిగనుంటయుం జల్లగనుంటయుం గల్గుచున్నది. చెమటయందు నూటియందు ౭౭ పాళ్లు నీరును, ఒక పాలు salts-acids మొదలగున వనేకములుండు నంట. మెదడునందలి దిగువభాగమునకుం జెమట glands తో సంబంధము గలదందురు. శరీరము నకు జ్వరము తగిలినతఱిం జెమట పోయదు. ఇత్తఱి రక్తమం దుష్ణమధికమగుట చెమటయవసరమై నను కలుగదు. ఇత్తఱి మెదడునందలి దిగువభాగ మున జ్వరము (నందలివిషము) పటిమందప్పించుటం జెమటగ్లాండ్సు పనిచేయకుండునంట. జ్వరము వది లినతఱి నీచిక్కవదలి పనినడచి చమటపట్టి వేడి వెడలిపోవునంట. నాఫిరికాఖండంపుంజెట్టునుండికల్గు మూలిక చెమటంగల్గించుటకు వాడంబడుచున్నది. అట్లే చెమటనాపుటకుంగూడ మూలికలు గలవు.

**చేపలనిద్రః—** నిద్రయనిన విశ్రాంతి. ఇది మేల్కొనుతఱిం గలిగెడి కదలిక, యలసటల యందు వ్రియమైన శరీరత్రాణను తిరుగంజేర్చి కూర్చుటకైన విశ్రాంతిగ నెఱుంగవలయుంగానం బ్రతిజీవజంతువును తనశరీరమున కౌసరమగునంత నిద్రం గల్గియుండవలయును. నిద్రం జెందుతఱి రెప్పలచేం గనులు మరుగుపర్చంబడి మూసియుం డును. కాని చేపలు, పాములు మొదలగు కొన్ని జంతువులకు రెప్ప లుండనేయుండవుగాన నిద్రించు తఱినింగూడ వాటికండ్లు చూచుచున్నటుల నట్లే యుండును. వానికిం గండ్లుమూయుట యుండదు. చేపలన్నియు ముఖములను, మూతుల నొకకడకుం జేర్చుకొని చక్రమువలె నొకటిపైంగూడ వేరొకటి యెక్కుచుం జలనముమాని యట్లే కూటమియం దును నిద్రించెడిని. అత్తఱిం గండ్లు చూచుచున్న టుల తెరచియేయుండు నట్లుండును. ఇందువలనం జేపలకు గాఢనిద్రయుండదనియుం గడుస్వల్పకాల మే నిదురించుట చాలుననియు స్ఫురించెడిని. ఇది నీటియడుగుననో లేక వేరొక దన్నుగలతావుననో యొకయూశ్రమమున జరుగుచుండును. చేపలు కూటమియందే నిద్రించుట స్పష్టమే.

## చైతన్యచరిత్రముః—

(చైతన్యదేవుని తలవెంట్రుకలు చూడుండు.
కౌటకద్వీపముం జూడుండు.
చైతన్యమత నిషేధములుం జూడుండు.
చైతన్యమతముం జూడుండు.
నవద్వీపధామముం జూడుండు.
నవద్వీపముం (తొమ్మిదిద్వీపములు) జూడుండు.)

**చైతన్యముః—** (Feelig) సర్వప్రాణు లందును జైతన్యముం గలదు. చైతన్యమన శరీర మందలి స్మారకము. ఇది కల్గియున్నంతదనుక జీవిత కాలమనియు, వీడిపోవుట మృతియనియు నెఱుంగ నగును. కాని ఈచైతన్యశక్తి వేర్వేరుజంతువుల యందు వేర్వేరంతరములుగ నమరియుండును. మానవులందధికముగను కోతులం దింకం గొంతతగ్గి యు నుండును. ఎనుములందింకను దగ్గియుంట నెఱుంగుదుము. ఇతరజంతువుల యందుం జాల తక్కువగనుంటయుం గలదు. కొంకచిలువ(పాము)

లందింకను తక్కువగ నుండునందురు. చేపలందుఁ గలదుగాని చాలాతక్కువయఁట.

చూచుట, వినుట, కొట్టుకొనుట, తినుట మొదలగుపనులు చైతన్యజన్యములు. చైతన్య శక్తియన యోచనాశక్తిగఁ దలంపఁజనదు. యోచన చైతన్యమునకుఁ బిదప గల్గునది.

**జనసమ్మర్దము గల గదియందుఁ గల్గెడి తలనొప్పి:-** జనసమ్మర్దముఁగల్గి గాలి వీచుట సరిగానుండని గదియందుండినఁ దలనొప్పి సంభవించుచుండుట యెల్లరెఱింగినదే. దీనికిఁ బెక్కుద్రు గదియందలి వారూపిరి వదిలినఁగార్బన్ డై ఆక్సైడు నూపిరిగాఁ బీల్చుటవలనఁ దలనొప్పి కలుగునని పొరపాటున నభిప్రాయముఁ గల్గియుందురు. గాని పరిశీలనలు కార్బను డై ఆక్సైడు తలనొప్పిం గల్గించునంతగ వెడలుచుండునది కాదనియు నందలిగాలి still warm and moist గా నుండుటఁ బిడుగులుపడంజేయు Thundery weather నందుఁ దలనొప్పి గల్గించెడి కారణము గలదని బయల్పఱచినవి.

అట్టిగదియఁ దుండువారిశరీరములు వేడిగ నుండు టందలివాతావరణమును వేడియెక్కియే యుండెడిని. గాలి వీచుటలేనందున నది యాగదియందే యుండవలసియుండుంగాన నందలివాయువు Warm & wet అయ్యెడిని. అది యందుండు వారి శరీరములనుండి తప్పించుకొని వెడలిపోఁజాలకుండును. దానిఫలితముగ జ్వరముంబోలిన యసౌఖ్యము, లంఘనందుఁ బ్రోత్సాహశక్తితగ్గుట, హృదయమున వికారమును గలుగును. శరీర చర్మము చమటను వెడలంజేసి చల్లపర్చఁజాలకుండుట వీటికిందోడ్పై తలనొప్పి సంభవించుట కేయూటంకమును నుండదు. ఇంకను నాక్సిజెన్ తగ్గిపోవుచుంటయుఁ గార్బన్ డై ఆక్సైడు పెరుగుచుంటయు దీనికి సహాయమేయగుంగాని కాదనవీలులేదు. ఇట్టిదుఃస్థితి యధికమగునేని యూపిరియాడమి (సఫోకేషన్ Suffo cation) సంభవించును. ఆయవస్థ యించుక తక్కువయగుచో దాని నుక్కిరిబిక్కిరి యందురు.

**జలముయొక్క యుపరిభాగము భూమియొక్క గుండ్రతనతో సనువగు గుండ్రని వంకరఁ గల్గి యుండియుఁ గండ్లకు సమముగ నుండు నట్లుండుట:-** భూమియాకర్షణశక్తి (గ్రావిటేషన్‌ఫుల్ చూడుడు.) జలము నాకర్షించుచుండుఁగాన జలము భూమియొక్కపైభాగమునువీడి పైకిం బోఁజాలదు. గ్రావిటేషన్ ఆకర్షణము బంతివలె గుండ్రనగు భూమియొక్క నడుమకని యెల్లరెఱింగినదే. ఒకజలముగం దన్నితావులనుండియు భూమధ్యమువైపగాఁ గ్రిందినుండి లాగఁబడుచుండిన కతన జలముయొక్కపైపొరయగు సర్ఫేస్ టెన్షన్ (చూడుఁడు.) ధర్మముమేరకు సమనగును. ఈ సమనంబగునది బంతివలె గుండ్రముగానున్న భూమియొక్క యుపరిభాగఁపువంక కనుగుణముగ నెమ్మితగ్గులుగ నుండక సరిపోవురీతి నుండును. దానింగాంచుతఱి మనకండ్ల కగుపడుచుండుతావు భూపరిమాణముతోఁ బోల్చిన చాలస్వల్పముగాన మనకుం దెలియఁబడక సమనుగా బల్లపరుపుగ నుండునట్లు తోఁచెడిని. గాని యిది యించుక వంగి భూమియొక్క గుండ్రనియాకారముమేరకే యుండుఁగాని దాసిం దాటదు.

ఇంక నీసంగతి సముద్రముగం దోడలు భూవలయరేఖ కవ్వలనుండుతఱిఁ గప్పించకఁ గొంత సమీపించినతఱిఁ బెద్దదియగు పడవ గానరాక దానిస్తంభములకొనలు గాన్పింపమొదలిడి రాను

రాను పోడవగచుఁ గడను భూవలయ రేఖకుం జేరుతటిఁ బడవపెద్దభాగముకూడఁ గాననయ్యెడిని. దీనిం బరిశీలించిన జలములయుపరిభాగమును భూమిపై భాగముయొక్క వంకరతోఁబాటు వంగి యుండునని గ్రహింపనగుచున్నది. అటులంగాకున్న జలములు సదునుగనుంట యసంభవమే యగును.

కొన్ని జీవజంతువులశరీరములు చిన్నవిగను, కొన్ని పెద్దవిగను నుండుంగాన వాటి కవసరమగు రీతిని బలములు వాటికొసంగబడి యుండును. ఏనుఁగు శరీరముంబట్టి దాని కధికబలమును, యెలుకశరీరముంబట్టి దాని కర్హమగుబలమును స్వతస్సిద్ధముగనే గలవు. ఇంక నీబల మవి చేయు పనులకు వలయునటుల నమరియె యుండును. కావుననే యొకజంతువుయొక్క బలమధికమనియు, వేరొకజంతువుయొక్క బలమల్పమనియు మనము పోల్చుటకు వీలుగాకుండును. దాని నిజస్థితి నెఱుంగనివారు మూర్ఖతగాఁ బోల్చిన నది యర్థములేని మాటయె యగును.

ఇంక నిట్టివి రిలేటివిటీ ధర్మమున నొకటితో నొకటి పోల్పంజూచిన నింతచిక్కు కలుగదు. ఈగశరీరమున కవసరమగు బలమును మనుష్యశరీరమున కవసరమగుబలముతో రిలేటివిటీధర్మదృష్ట్యా పోల్చిచూచిన నీగయందలిబల మధికమనిపించెడిని. కాని యిది యెగురుట కవసరమని తోపకపోదు.

## జలావర్తము (నీటియందలి సుడి

Whirl pool)— వడిగల రెండుజలప్రవాహము లొండొంటి నెదుర్కొనం గలియుటయు నాసంగమస్థలిపై సుడిగాలి (whirl wind) నిలచియుంటయు జలవర్తముగలుగుటకుఁ గారణములుగ భూగోళశాస్త్రవిదులు చెప్పిరి. ఇట్టివి తాత్కాలికములేయని యెన్నంబడినను ప్రపంచమున మూఁడు జలావర్తములు సుప్రసిద్ధములు.

౧ Charybdies జలావర్తము:— ఇది కొన్నివేల సంవత్సరములకుం బూర్వముండి యిటీవల యంతరించినది. దీనిస్థలము మారిపోయినదని శాస్త్రజ్ఞులందురు. ఇది messina జలసంధి కడనుండినది. ఈప్రాంతసీమలన్నియు భూకంపములప్రదేశములుగఁ బేరందినవి. ఆసమీపమునను Scylla అను పేరుగల గొప్పగుండశిల కలదు. దానికిని, జలావర్తముపడినతావునకును నడుమ ననేకనావలు పగిలియు, మునిగియు భగ్నమైనవని వాడుక కలదు. నేటికిని ముందు నకుంజనిన గొయ్యి, వెనుకకుమరల నుయ్యి యని యాంధ్రమునఁగలయుక్తి మేర కుండు నపాయస్థితి నాంగ్లమున Between Scylla and charybdis అను నుక్తిని వాడుచున్నారు.

౨ రెండవది నయగారాజలపాతమునకుం దిగువగ నేటికి నట్లే యున్నది.

3 మూఁడవది maelstrom జలావర్తము. ఇది నార్వేదేశపుఁదీరమున నించుక దూరమున సముద్రముననున్న సుడిగుండము. అపాయకరమని పేరందియున్న దీనికథ లనేకము లాదేశసీమలందుఁ జెప్పుకొనుచుందురు. దీని కోడలు వెరచుచుండును.

**జింబాబ్వే:**—ఆఫ్రికాఖండమునందు రోడెశియా (Rhodesia) యను దేశము గలదు. అందలి దక్షిణభాగమున నీకట్టడపుఁబాడు కాననగుచున్నది. ఇది రాతిగోడలచే రక్షకమైయుండిన తావు. పెద్దయావరణము. దొంగలకు దుర్గమము. వింతఁగొల్పుతావు. అందుఁ బైకప్పులేని యొక దేవస్థానముంబోలిన కట్టడము కలదు. అది యనేక

చిన్న చిన్న గదులుగ విభజింపంబడి యున్నది. ఇది యొకచిన్నకొండదిగువనె యున్నది. ఆకొండపై దీనిని కావలిగాచు సైన్యస్థాన మొకటి నిర్మింపంబడినది. ఇది యిపుడు పాడగుచున్నది. దీనినిర్మాతలంగూర్చి సరిగాఁ దెలియరాకున్నది. అంతయు రాతిగండశిలలమయమైనతావు. పరిశీలించిన నిది యాదికాలమున నొకచిన్నపట్టణ మనిపించెడింగాని స్మశానము దీని కెటనుండెనో తెలియఁబడకుంట సంశయింపవలసివచ్చుచున్నది. దీని నిర్మాణమునకు వలసినరాయి యెటనుండి తేఁబడినదో యాతావుఁగూడఁ గానంబడకున్నది. దీనిని రక్షించు సైనికుల యాయుధములకు నిలయ (స్థాన) మను కొండమన్నను పోల్కెఁ గుదురుటలేదు. ఇందలి జనులెవ్వరో? ఎటనుండి యిటకుఁ జేరిరో? దీనిని వదలివేసినతరి నెటకుఁజేరఁబోయిరో? ఏలపోయిరో? ఏమైరో? పరిశీలనలకు దుర్గ్రాహ్యమై యున్నది. గాన నాప్రాంతముల వాడుకనందియున్న కథనమె యిట వివరింపందగును.

ఆదికాలమున నాదుర్గముండినప్రాంతదేశము పాలస్తినాదేశమేలిన సోలోమోన్ భూపతి, షేబా రాజ్ఞిలవశమందుండి వారియొక్క బంగారమును నేనుఁగుదంతఁపుఁగొమ్ములును నిల్వయుంచుకొను తావుగను, దేశమందలి వర్తకప్రముఖులు తమ తమ వర్తకఁపుసరకులు నిల్వయుంచుకొను గిడ్డంగులును నీదుర్గమునందుండ నిర్మింపంబడియెననియు, నాభూపాలు లిర్వుర కీపరిసరముల బంగారుగనులుండెననియు, వాటిని నేటికినిఁ జూడ నగునానవాళ్లు గలవనియు నాప్రాంతములవారందురు. ఈసీమయందే ప్రాముఖ్యత నందియున్న జాంబీజీనది, (Zambezi) నుండి యిది యాపేరం దెనో, దీనినుండి యది పేరొందెనోగాని పేరులందుఁ బోల్కెగలదు.

## జూడర్ జీ డైక్సు, హాలండుదేశము (Zuyder Zee Dykes Holland):—

ఐరోపాఖండమందలి హాలండుదేశ మచటినైసర్గిక పరిస్థితులమేరకు సర్వదా సముద్రాక్రాంతమైపోవుటకు వీలుండుచు గొప్పగొప్పసముద్రకెరటములచే బెదరింపంబడుచున్న భూప్రదేశముగనున్నది. గాన నాదేశఁపుఁబ్రజ లనాదిగ సముద్రము నెదిర్చి కెరటములను సరకుగొనకుండఁ దమదేశభూమిని రక్షించుకొనుటకు హద్దుగట్టుల (dykes)ను నిర్మించుకొని తమభూమిని సముద్రాక్రాంతముఁగాకుండ నిల్పుకొనుటయేగాక సముద్రమునుండి క్రొత్త భూములం బయల్పర్చి యాక్రమించి పచ్చికపొలములుగను, వ్యవసాయఁపుఁ బొలములుగనుకూడ నొనర్చియు నొనర్చుచు నొనర్ప నున్నారు. అందు ముఖ్యము లనేకములు గలవు. అందు దేశమున కాగ్నేయదిశనున్న జూడర్ జీ యను పేరుగల గొప్పసముద్ర (మెరక) ప్రదేశమును నిరర్థకముగా జలమయమైయుండఁగాంచి నీటిఁదరుముకొనిపోవుచు భూమింబయల్పరచి సారవంతములగు పొలములుగఁగూడఁ జేసిరి. పరిశీలించిన నది కడు వింతఁగొల్పకపోదు.

ఊటనీటి నొకకాల్వనుండి సముద్రముకడకుం జేర్చి యట Windmill ను నిర్మించి వాటిచే నట నమర్పంబడిన పంపులసాహాయ్యమున నెత్తున కుందోడి సముద్రమునఁ బడఁజేయుచుందురు. ఇట్టి డైక్సులలోఁ గొన్ని యరువదియడుగుల యెత్తున కడుబలమైనవిగ నిర్మింపంబడినవి కలవు. వాటిపై బాటలు వేయంబడినవి. ఆబాటలు దేశముయొక్క సముద్రఁపు టంచుపొడవునను గలవు.

జూడర్ జీ సముద్రము భూమిలోని కరువది మైళ్ళదూరమువరకుఁ జొచ్చుకొనిపోయి యున్న నార్తుసీ (సముద్రము) యొక్క యొకభాగము.

ఇందుండి బయలుదేరఁ దీయంబడినభూములు చాలఫలవంతములుగ నున్నవి. చతురంగఁపుటాట గడులంబోలి పొడవునను, వెడలుపునను కాలు వలందిప్పి యాటనీటిం బారించి విండుమిల్ను పంపులనుండి పై కానీటినెత్తి సముద్రమునంబడఁ జేసి యాభూములం జెమ్మలేకుండఁ బొడిభూము లుగఁ జేసిరనిన నతిశయోక్తి యం దేమియులేదు. ఇటుల సముద్రములనుండి వెలువడిన భూములు సముద్రంపుపీటమట్టముకన్నఁ బల్లముగ నుండుం గాన వీటిపైకి నీరురాకుండ డైకన్నగట్లు సముద్రము నాపుచున్నవి. హాలెన్డ్ లే కనఁబడుపద్దేశ మిటు లనే బయల్పరుపంబడి యిప్పుడు ఫలవంతమగు సీమగా నున్నది. డైకన్ కొన్నివంకరలు లేక తిన్ననిపొడవుంగల్గి పైనిచక్కనిబాట లమర్పంబడి భూమినైప్పు చక్కని భవనములతో మైళ్ళతరఁబడి పొడవున నున్నవి కలవు. అట్టిహాటియందు, అమ్స టర్డం నగరము కడనున్నది సుప్రసిద్ధము (హాలం డుదేశము చూడుఁడు)

## జేబుగడియారము:—

(వాచీ చూడుఁడు)

**జ్యేష్ఠదోషము:—** ఇది జ్యోతిషశాస్త్ర సంబంధ దోషము. వివాహముహూర్తములందు వధువు తలిదండ్రులకు జ్యేష్ఠజన్మయగుట యొక జ్యేష్ఠముగను, వరుఁడు జ్యేష్ఠజన్ముండగుట యొక జ్యేష్ఠముగను, (జ్యేష్ఠజన్మయన ప్రథమజన్మ) వధువుజన్మనక్షత్రము జ్యేష్ఠయగుట, వరునిజన్మనక్ష త్రము జ్యేష్ఠయగుట,వధూవరులవివాహము జ్యేష్ఠ మాసమందు ముహూర్తము కుదురుట, వధూ వరుల వివాహముజ్యేష్ఠనక్షత్రమున ముహూర్తము కుదురుట జ్యేష్ఠము లనంబడును. ఇవి యాఱునుగల్గి యుంట జ్యేష్ఠషట్కము బహుదోషమనియు నిం దొకటితక్కువయై (యైదింటిఁగల్గి) యుండుట జ్యేష్ఠ పంచకదోషమనియు, రెండు తక్కువయై (నాల్గిం టిఁగల్గి) యుండు టర్థదోషమనియు, మూఁడు జ్యేష్ఠదోషములం గల్గియుంట స్వల్పదోషమనియు, ద్విజ్యేష్ఠము, మధ్యమమనియు, ఏకజ్యేష్ఠము శుభ మనియుఁ జెప్పంబడినది.

## టంకశాల - నాణెముల ముద్రణము:—

టంకశాలయందుఁ బ్రభుత్వమువారు దేశమందు వాడుకొనునాణెములను ముద్రింతురు. ఇంచుక యోచించిన ప్రతివారికిని నాదికాలము లందు టంకశాలలు ప్రభుత్వనాణెములు లేనికాల మున వర్తకులకో లేక పండించువారలకో తమ కున్నసరకులనిచ్చి తమకు వలసిన సరకులం గైకొ నుట (barter) నిత్యవ్యాపారమై యుండినదని తోఁపకపోదు. అట్టి బేరఁపుఁజికాకుల నివారించి ధనమును రూప్యముల (నాణ్యముల) మూలముగ నేర్పరిచి ముద్రింపించి వ్యాపించఁజేయుటకుఁ బ్రభు త్వము లారంభించినదాదిగఁ బ్రభుత్వముల వారి టంకశాల లేర్పడి పనిఁజేయుచున్నవి. టంకమనిన రూప్యమని యర్థము. దానినే యిప్పుడాంధ్రదేశ మున "రూపాయి" యనివాడుచున్నారు.

ఆంగ్లమున టంకశాలకు mint అనియెదరు. ఇంగ్లాండు ప్రభుత్వఁపు టంకశాలను దర్శించుచో లండనునగరమున నొకసుప్రసిద్ధకవి "If we cannot make money-we atlest know how to spend it" అనెనఁట. ఇం దాయనయభిప్రాయ మేదియైనను సర్వసాధారణ ముగాఁ బెక్కండ్రు కది "ధనము నెట్లు గడించు టయో మనకుం దెలియకున్నను (అధమము) దానిని వ్రయ మొనర్చుటయైన మనకుం దెలియును" అనియర్థ మగుచుండును. ఎట్లైన

నది యొకయుక్తిగా నాంగ్లదేశమున వాడుక నందియున్నది. ఏదేశమందైనను తరుచుగ నాణెములు కొన్నికారణములచేఁ బేరందియుండును. భరతదేశఁపు మాడ, వరహా, రూప్యము, టంకము మొదలగు నాణెములేగాక నింగ్లాండుదేశఁపు పెన్నీ, పౌను మొదలగునవియు నట్లే పేరందినవి. Pendo (తూచుట) శబ్దముయొక్క వికృతిగా Penny శబ్దమేర్పడినది. Sterling pound బంగారునాణెము తొలుత lb. pound వెండికి సరిచూగువిలువగానుండి యాపేరందినది. ఎల్‌బి పౌనన భరతదేశఁపు నలువదితులములయెత్తుగల పౌను. భరతదేశమున శ్రీరామునిపాలనమున నీ శ్రీరామమాడలనునాణెములుండినటులఁ దెలిసెడిని. ఆనాణెము లీనాటికిని హిందువులయిండ్లలో గొప్ప వారి దేవతార్చనలందుఁ బూజింపంబడుచుంటఁ గానవయ్యెడిని. ఇంగ్లాండుదేశమునఁ బ్రభుత్వము వారిటంకసాల (Royal mint) క్రీ. వె. ౧౮౧౧ లో నేర్పడినదని చెప్పంబడియున్నది. ఇది లండను నగరమున (Tower Bridge) సమీపముననే గలదు. అనఁగాఁ దొల్లింటి (Eastminister abbey) యుండినతావుననే నిర్మింపంబడియున్నది.

టంకశాల ప్రభుత్వమువారి స్వంతకర్మాగారము గాని వర్తకసంబంధసంస్థ కానేరదు. ఇందుఁ బ్రభుత్వనాణెములు, వారు మెప్పుగ నొసంగుమెడల్సులు ముద్రింపంబడును. దీనిసంబంధమున నొక మ్యూజియ ముండును. అం దాదినుండియు నందు ముద్రితములైన నాణెములు (coins) మెడల్సు నిల్వయుంపంబడును. బంగారము, వెండి, రాగి, నికెలు, బ్రోంజు, లోహములు టంకశాలకుఁ జేరగనే యప్పటియవసరములమేరకు వాటిని నిలువయుంచుటకు భద్రమగుగదులు (strong rooms) కలవు. అవి వీలువెంబడిని గఱగింపంబడుచు వాటివాటి పద్ధతులమేరకు మిశ్రమలోహములం గల్పి యర్హమగుపదు నుండునట్లొనర్చుదురు. సర్వసాధారణముగ నిరువదిరెండుపాళ్ళ బంగారమునకు రెండుపాళ్ళు రాగిమొదలగునవి గల్పుచుందురఁట. అటులనే ముప్పదియేడుపాళ్ళ వెండికి మూఁడుపాళ్ళ రాగిమొదలగువాటిం గల్పుదురఁట. బ్రోంజు (Bronze) లోహమునందు రాగి, తగరము, తుత్తనాగము (zinc) మిశ్రమముగాఁ గల్పుదురఁట. వాటినట్టి యవసరమగునంత దళసరితో సన్ననిరేకులుగఁ జేసి పరిమాణములుగ యంత్రములచే నొక్కించి ఖండించి ముక్కలుగ నొనర్తురు. ఇట్టిపనిని punching అందురు. మరియు నీపని పెద్దనాణెముల నొక్కటొక్కటిగను చిన్ననాణెములను జోడాలుగను జేయుచుందురు. వీటికి Blanks అనిపేరు. పిదప వాటిచుట్టును గంట్లునురకుటగాని, లేకయుబ్బెత్తుగ నంచులం దీర్చుటగాని, వంకరలు చేయుటగానియంత్రము నందే జరిగెడిని. ఈయాంత్రమునకు Edge rolling machine అందురు. దీనివలన నాణెముల పై ముద్రింపంబడిన ముద్రణముల కరుగుదల త్వరితముగఁ గలుగదని తలంపంబడుచున్నది. పిదప నాబిళ్ళలును (disces) - anneating feernace లందు ముద్రణముల కర్హముగఁ బదునీయంబడును. దీనితో నవి రంగుమాయుంగాన dilute sulphuric acid నందుముంచి తిరుగ రంగుకలుగున ట్లొనర్తురు. ఇంకను రంపఁపుఁబొట్టునందుఁ బీపాలలో వాటింగల్పిపోసి యంత్రములచేఁ గుదిలింపించి మంచిచాయఁ గల్గింతురు. పిమ్మట నవి వేరొకముద్రణయంత్రమునం దొకేసారిగఁ గ్రింద పైని కూడనొక్కంబడి ముద్రింపంబడుటతోఁ బూర్తిగ నాణెము లగును. ఈ నొక్కుడు (ముద్రల) యాంత్రములందలి dies చాలగట్టి యుక్కుతోఁ జేయంబడుచుఁ బ్రతి

౧౦౦,౦౦౦ ముద్రణములతో మార్చివేయం బడుచు ముద్రితాక్షరములందు భేదమించుకయైనం గల్గకుండునటుల జాగ్రతం గొనుచుండురు.

ఒకసారి యరిగినబంగారుసవరసు (సావరను నాణెము) ల నింగ్లాండుదేశమునం దిరుగ ముద్రింపించవలసివచ్చి ముద్రించిరంట. దీని లోహంపుం దరుగు ౩౮౫౫౦౭ పౌనులు బంగారు బాంకి ఆఫ్ ఇంగ్లాండుసంస్థ (Bank of England) భరించినదంట. టంకసాల ప్రభుత్వకార్యాలయమేగాని ధనాగారము కాదు. అది వారి స్వంతకర్మాగారము. లోహములు టంకసాలకుం జేరుట యాదిగ నాణెములరూపమున టంకశాలను వీడు వరకును ప్రతికార్యాచరణాంతమునను తూచం బడుచుం దరుగువిరుగులు లెక్కింపంబడు చుండును.

**టన్నెల్సు:-** (Tunnels) టన్నెల్సు పర్వతములందుం జేయంబడిన రంధ్రములు. వీటినుండి యివ్వలవ్వలకు మార్గమేర్పర్చి బాట నడపుదురు. కొన్నిటినుండి యినుపబాటలు నడపుటయుం గొన్నిటినుండి సాధారణంపుబండి బాటలు నడపుటయుం గొన్నిటినుండి జలప్రవాహముల నడపుటయు జరుగుచుండును. కాన వీటినుండి వచ్చు మన్ను రాళ్లు మొదలగునవి చాల తక్కువగ నుండుననియు, పనామాకాలువం ద్రవ్విన మన్ను ౩౬౦౦౦౦౦౦౦ టన్నులని యంచనా వేయంబడి యుండ నాల్పుపర్వతములందుం ద్రవ్వంబడిన టన్నెల్సునుండి రెండులక్షల యిరువదియైదువేల టన్నులుగ నుండెనంట.

ప్రపంచమందున్న టన్నెల్సులో నగ్రగణ్యమని చెప్పంబడందగినది యమెరికాసంయుక్త రాష్ట్రముల న్యూయార్కునగరమునకు దాహోదకముం గొంపోవు Catskill aquiduct నకుం జెందిన shandaken Tunnel అనుపేరం బరగునది. దీనిపొడవు ముప్పదిమైళ్లు. వెడలుపు పదిన్నరడుగులు. లోతు పదకొండున్నరడుగులు. ఇది Schoharie Creekనుండి జలములం దెచ్చి Aspokan రిజర్వాయరునకుం జేర్చుచున్నది. రెయిల్వే టన్నెల్సులో నగ్రగణ్యమని చెప్పంబడినది. స్విజర్లాండు, ఇటలీదేశములనడుమ నాల్పుపర్వతములందుం జేయంబడిన రంధ్రము. ఇది సింప్లన్‌ప్యాస్ క్రిందుగం దొలువంబడినది. దీనిపొడవు పండ్రెండున్నరమైళ్ళు. దీనినుండినగరంపుటినుపబాట మిలాన్ పట్టణమున కరుగుమార్గమున Brigue స్టేషను, Iselle స్టేషనుల నడుమ నున్నది. ఈటన్నెలుం దొలచుటకు రెండుప్రభుత్వములకు ముప్పదిలక్షల పౌనులు వ్రయమాయెనంట. పిదప క్రీ. శ. ౧౯౨౧లో దీనికి వేరొక టన్నెలుగూడం దొలువంబడి రెండునుగలసి యాయినుపదారిని పనిం జేయుచున్నవి.

ఇంక నీసందర్భమున నాల్పుపర్వతములందలి యితరరెయిల్వే టన్నెల్సు కలవు. అవి Mount Cenis టన్నెలు. ఇది యిటలీ ఫ్రాన్సుదేశముల నడుమనున్నది. ఎనిమిదిమైళ్ళపొడవుం గలది. ౧౮౭౧ లోం బూర్తియై తెరువంబడినది. సెంటుగోతర్డుటన్నెలు తొమ్మిదిన్నరమైళ్ళపొడవుం గలది. Goeschenen స్టేషను, Acrolo స్టేషనుల నడుమ నున్నది. ఇది ౧౮౮౧లోం బూర్తియై తెరువంబడినది. పిదపం జెప్పందగినది స్విస్ ఓబర్లాండుసీమయందున్న Loetschberg టన్నెలు తొమ్మిదిన్నరమైళ్ళ పొడవుం గలది. ౧౯౧౩ లోం బూర్తియై తెరువంబడినది. పిదపం జెప్పందగినది Langen నుండి St. Anton కరుగుమార్గమున నున్న యారుమ్ముప్పాతికమైళ్ళపొడవుంగల యరల్బర్గుటన్నెలు. కడపటిది Brunnadern, Lichtensteigel నడుమనున్న Wasserfluth

టన్నెలు రెండుమైళ్ళ పొడవుఁ గలది. ౧౯౧౧లోఁ బూర్తియై తెరువంబడినది.

దక్షిణ అమెరికాఖండమున ఆండీస్‌పర్వతము లందుఁ దొలువఁబడిన టన్నెలు (రంధ్రము.) పశ్చిమదిశయందు Valparaiso నుండి తూర్పున Buenos aires వరకుఁ జను నినుపబాటకు జనుమార్గమై యున్నది. దీనిపొడ వైదుమైళ్ళ నియు, సముద్రపునీటిమట్టముపై రెండుమైళ్ళ యెత్తున నున్నదనియు ౧౯౧౦లోఁ బూర్తియై తెరువఁబడినదనియుఁ జెప్పంబడినది.

కనడా (ఉత్తర అమెరికా) యందు కన్నేడియన్ పసిఫిక్ రెయిల్వేసంబంధమైన రెండు స్పిరల్ టన్నెల్సు (Spirar Tennels) కిడు సుప్రసిద్ధములు కలవు. ఇవి ట్యూబు (tube) టన్నెల్సు. అందుఁ బడమటిట్యూబురంధ్రము ౩౨౫౫ అడుగులపొడవును, తూర్పుట్యూబు ౨౯౨౦ అడుగులపొడవును, గలవి. రెంటికిని నడుమ Kicking horse river అనఁబడునది యున్నది. మొదటిది కెథీడ్రిల్ మౌంటెన్సు నందునను, రెండవది Mount ogden పర్వతమందునను చేయంబడిన రంధ్రములై యున్నవి. ఇంక నాయినుపదారియందే సెల్కిర్కు పర్వతమున Rogirs pass నకుఁ గ్రిందుగాఁ జేయంబడిన రంధ్రపుటన్నెలుగా నున్నది. దీనియందు రెండు యినుపబాటలైను లైదుమైళ్లుపొడవువి గలవు.

ఇంగ్లాండుదేశమున monmouth shire నుండి Gloucester shireన కరుగు ఇనుపదారి (బాట) యందు నాల్గుమొద లైదుమైళ్ళవరకుఁ బొడవైనవి కలవు. ౧౮౮౬లోఁ బూర్తియైనవి. pennines పర్వతమునందు Dunford bridge స్టేషను woodhead స్టేషనుల నడుమనున్న వుడ్ హెడ్‌టన్నెలు మూడుమైళ్ళపొడవుది గలదు. లండనునగరముకడనే తేమ్సునదికిక్రింద మైలున్నర పొడవుగల టన్నెలొకటి ౧౮౪౩లోఁ బూర్తియై తెరువంబడినది.

ఫ్రాన్సుదేశమునుండి స్విజర్లాండున కరుగుబాటను Jura a mountains నందుఁ జేయంబడిన టన్నెలు mont d' or. టన్నెలు నాల్గుమైళ్ళవరకుం బొడవైనది కలదు. న్యూజీలండు ద్వీపమున Otira టన్నెలు ఐదుమైళ్ళపొడవుగలది సుప్రసిద్ధముగాఁ బేరందియున్నది.

అమెరికాయందు Gunnisou నదిని (జలప్రవాహమును) కొండలగుండా యవ్వలి Unconepaghre Vally లోనికిం గొంపోవు టన్నెలొకటి ౧౯౦౯లోఁ బూర్తిచేయంబడి తెరువఁబడి యున్నది. ఆజలము లదివర కూసరక్షేత్రమైన నాలోవను పంటలభూమిగానొనర్చియున్నది. న్యూయార్కు Croton aqueductనకు నీటినందియ్య ముప్పదిమూఁడుమైళ్ళ టన్నెలురంధ్రము కలదు.

సాక్సనీదేశమున Felberg గనుల నీటిటన్నెలు ముప్పదియొక్కమైళ్ళపొడవు కలదియును కలదు. Roths chonberg tunnel అనంబడుచున్నది. ఇది ౧౮౭౭లోఁ బూర్తియై తెరువంబడియున్నది. Czecho slovakia దేశమునందు Stiavnica కడ నొకటన్నెలు పదునొకండుమైళ్ళ పొడవుది కలదు. ఇది గనుల సంబంధమునఁ జేయంబడినదియె.

## టిస్యూకాగితము (Tissue Paper) కడుచులకనై నీటింగారఁ జేయుట:-

కాగితములందుఁ దలవెంట్రుకలుంబట్టని రంధ్రములనేకము లుండెడిని. గానసే కాగితములంజేయు Pulp నందు రెయిజెన్‌బంకయు చైనాక్లేయను పదార్థభాగమును కల్పుచుందురు. అవి వాటిం

బూడ్చి కాగితమును సమముగ నొనర్చుటకే యని యెఱుంగునది. టిష్యూకాగితములందట్టిభాగములు చేరవుగాన చులకనై యుండుటయె గాక నతిసన్న ములై నేత్రదృష్టి కాననిరంధ్రములతో వెలుగును గ్రుడ్డిపరచి యివ్వలనుండి యవ్వలకుఁ బోనీయం దగిన Semi Transperant or opaq స్థితి యందు వెలుతురునందుఁ గాన్పించెడిని.

**టీస్థా (త్రిస్థానది)**:—హిమనన్నగమున శిలిగురినుండి డార్జిలింగు సమశీతోష్ణప్రదేశమున కరుగు మార్గమునఁ బ్రవహించుచుండు నది. దీని జన్మస్థానము టిబెట్టు దేశమునఁ జామో సరస్సునందని చెప్పంబడినది. ఆప్రక్కనే కాంచనగంగాశిఖరము నంటియున్న టాలంగు (హిమనిలయము) గ్లేసియరునుండి కరగినజలములు పెక్కుకాలువలనుండి దొరలుచు వచ్చి టీస్థానది జన్మస్థానమునుండి కలియ నారంభించును. అది ప్రవహించ మొదలిడినది మొదలు కాచంగునది, జెమూనది, రొంగినీనది, రొంగుపునది, రంగీత్ నది రంగూనది మొదలగు పెక్కునదులు, అది ప్రవహించులోవ కిరుదెసలనుండు పర్వతపంక్తులపార్శ్వము లనుండి వారి దొరలుచు వచ్చి దీని పొంగం జేయుచునే యుండును. మరియు నాసీమలందు వర్షములును నధికములే. అందు క్రీ. శ. 1915 లో నీనదీవెల్లువలు వర్షాధిక్యమువల్ల గొప్ప నష్టములఁ గలిగించినవి.

టీస్థానది ప్రవహించు కొండలోవ చాల లోతైనది. అటవీసౌందర్య మధికముగఁ గలిగినది. నదీప్రవాహమున ననేకవంకరలు పొడవునను కలవు. అచటి చెట్లకు రంగధికము. అటను సిక్కింరాజ్యము టిబెట్టురాజ్యమునకు సరిహద్దు.

**టెంపరేచర్ (Temperature)**:—టెంపరేచరు భూస్థితినుండియు, వాతావరణస్థితినుండియుఁ దెలియఁబడు శీతోష్ణస్థితి. (క్లైమెటన్ లేక దేశమందలి శీతోష్ణస్థితి చూడుఁడు) ఇది తెర్మోమీటరు పరికరమునుండి తెలియనగుచుండును. దీనిని సర్వసాధారణముగ నీడనుంచి డిగ్రీల రూపమున నెఱుంగుచున్నారు. ఇది వేర్వేరుదేశము లందు వేర్వేరుగఁ జూపుచుండెడిని.

భూమధ్యరేఖనుండి యుత్తరమునకుఁగాని, దక్షిణమునకుఁగాని మూఁడువేల మైళ్ళదూరమున పార్నైటు తెర్మోమీటరునం దగుపడులెక్కమేర కిరువదిడిగ్రీల వేడితగ్గియుంటఁ గాననగును. అచట నుండియె (భూమధ్యరేఖనుండియె) యొకమైలు దూరి మెత్తున కెక్కిన నాయిరువదిడిగ్రీలవేడి తగ్గియుంటఁ గాననగును. ఎత్తునం దింతస్వల్పదూరమం దిటుల వేడి తగ్గియుంటకుం గారణము దేశమందలి శీతోష్ణస్థితియందు వివరింపంబడియున్నది.

ఇంక సముద్రమునుండి కల్గుమార్పును వివరింతుముగాక. ప్రపంచమున నించుమించు మూఁడు పాళ్లు సముద్రమును, ఒకవంతు (అనగా నాల్గవ వంతు) భూమియుఁ గలదని పోల్పంబడి యున్నది. నీరు సూర్యునివేడిని భూమికన్న నధికముగఁ బీల్చుకొనును. ఇంతటితో నాగకఁ బైకి వాతావరణము లోనికిం దిరుగఁగొట్టి వేడిని కడునాలస్యముగఁ బోఁజేయును గాన సూర్యుఁడు తనపైఁ బ్రకాశించుకాలమున ననగా ముఖ్యముగ వేసవికాలఁపు టెండవేళలఁ జల్లగనుంటయు, శీతకాలఁపు రాత్రులందు భూమిపైకంటె నెక్కువ వెచ్చగానుంటయు సంభవించుచుండును. ఈసందర్భమున సముద్రజలములపై నున్నరీతినే దరిని సముద్రమందలి చిన్నచిన్నద్వీపములందుఁగూడ నుండునని యెఱుంగునది. ఇంక భూమియొక్క తీరములుగాక లోభాగములందు (intereor of countrees) వేసవియందు వేడియు, శీతకాలమునఁ జలియు నధికములుగ నుండుట సంభవించుచుం

డును. ఆంగ్లభూగోళశాస్త్రవిదులు మొదటివాటి (సముద్రశీతోష్ణములకు) mari-time లేక equable temperature అనియు, రెండవది యగు భూశీతోష్ణములకు Continental లేక extreme temperatures అనియు సాంకేత నామము లిడియున్నారు. వీటిని వివరించుచు నొక సుప్రసిద్ధ భూగోళశాస్త్రవేత్త "mari-time places keep cool summers and mild winters - while - continental places keep hot summers and bitter cold winters" అని వాడియున్నాడు.

పిదపం జెప్పందగినది వాయుప్రసారము. గాలి వీచుటకుం గారణములు పెక్కు గలవు. భూమధ్య రేఖకడ వేడి యధికముగాన దానికింపైగా వాతావరణంపుగాలి వేడియై పలుచంబడి వ్యాపించుట యందుం బైకి నాకసముదెస కెక్కిపోవుచుం టయుం జల్లనిగాలి ప్రక్కలనుండి యాతావు నాక్రమింప నరుదెంచుచు వీచుచుంటయు సంభవించుచుండును. ఇటుల నుత్తరమునుండియు, దక్షిణమునుండియు భూమధ్యరేఖాప్రదేశముల వీచు గాలుల కాంగ్లమున Trade winds అని పేరిడి యున్నారు. ట్రేడనిన నిట regular and persistant అని యర్థమంట. భూమి యెల్లప్పుడును తనకుం దానే గిరగిరం దిరుగుచుండు కారణమున నీట్రేడ్విండ్సు (గాలులు) తిన్నగ నుత్తరదక్షిణములనుండి వీవంజాలకం దూర్పున కించుక వంగి వీచుచుంట నుత్తరగోళార్థంపుట్రేడ్విండ్సు యీశాన్యదిశనుండియు(North East trade winds) దక్షిణగోళార్థమున నాగ్నేయదిశనుండియు (South East trade winds) వీచుచుండు నట్లుండును. ఇవి చల్లగానుండియు నివి వీచుమార్గమున వర్ష ముండదు. వీటితావు నాక్రమింప వీటి కెదురుగా వీచుచు ధృవములకుం జేరుకొను నెదురు వాయువుల కుత్తరభూగోళార్థమున వీచుగాలులకు South west anti Trade winds అనియు, దక్షిణగోళార్థమున వీచుగాలులకు North west anti Trade winds అనియుం బేళ్లు వాడుక నందియున్నవి. ఇవి వేడిగనున్నను వర్షంపుగాలులై యున్నవి. ఏంటీ ట్రేడ్విండ్సు, ఆమార్గముననె యెదురుగ వీచుచు ధృవప్రదేశములకడకుం జేరుకొని బలహీనములై మహావాతావరణమునం జేరుకొనుచుండెడివి. పెక్కండ్రు పరిశీలకులు ప్రపంచమున శీతోష్ణస్థితులను సవరించుచుంట కీట్రేడ్విండ్సు, ఏంటీట్రేడ్విండ్సే ముఖ్యకారణము లని యభిప్రాయపడిరి. ఇట్టివేయగు సముద్రజల ప్రవాహములు (Ocean currents) గల్ఫుస్ట్రీములు (Gulf streams) కూడ శీతోష్ణస్థితులం జక్కపర్చ కారణములుగ నున్నవి. వర్షపాతమునకు నివియే కారణము. (వర్షపాతము చూడుండు).

**టెలిక్ట్రోగ్రాఫీ కళ:**— టెలిఫోనుపై వార్త లంపుట, మాటలాడుట యెల్లరెఱిఁగినదే. అది లేనిదే యిక్కాలమున వర్తకవ్యాపారము, కర్మాగారంపుంబనులు నడువవేమో యనిపించెడివి. ఇది లోకమునకుం గల్గుటకుం బండితులగు Galvani, Volta, Bell, Edison, Thomson, మొదలగువారును, నింకం గొందరు పరిశీలకులును చిరస్మరణీయులు. ఇటీవల సంతకములు, బొమ్మలు, ఫొటోగ్రాపులు, యొకతావునుండి వేరొకతావునకేగాక యొకదేశమునుండి వేరొకదేశమునకుం గూడ నంపుట కనిపెట్టంబడినది. ఈపరిశీలనలు మూఁడుసంవత్సరములకాలము పట్టెనంట. ఈవిద్యకే (ఈకళకే) టెలిక్ట్రోగ్రాఫీయని పేరు. దీనిం గల్గించు భాగ్యమొసంగిన పండితుండు Thorne Baker పరిశీలకుండు చిరస్మరణీయుం డగుగాక.

దీనినే పారిస్సుదేశమునఁ గనిపట్టిన మహానీయుఁడు Edouard Belin గారను పండితుఁడు. ఈయన, ఇటీవల పారిస్సుదేశపుఁ బ్రధానమంత్రిగారి సంతకమును, ఎఫెల్ టవరనంబడు నెత్తుగుపరిదేశమున కెక్కి యమెరికాసంయుక్త రాష్ట్రములందలి రిసీవింగుస్టేషనుకు వైర్లెస్ ద్వారా పంపియున్నాఁడని వినుచున్నారము. ఇట్టివి పంపించుతఱి బొమ్మ యొక్క భాగములను విభజించి వాటివెలుతురు నీడలతోసహా యెలక్ట్రిసిటీసహాయమున టెలిగ్రాపుగా నాఫొటోగ్రాపును, ఈతరునుండి పంపవీలగుచుండునఁట. రిసీవింగుస్టేషనునందుఁ గూడఁ దిరుగ నింతపనియుం జరిగి యవి తిరుగఁ బొటోగ్రాపుగఁ గూర్పంబడునఁట. ఇదియంతయు Open circute అని యందురు.

**టెలివిషన్** (Telivision);—టెలివిషన్ అనినంతనే యది టెలిగ్రాపు, టెలిఫోనులవంటిదేనని స్ఫురించుంగాని యించుకఁ జక్కఁగఁ బరిశీలించిన నిది వైర్లెస్ బ్రాడ్ కేస్టింగు విధానమున రేడియోవంటి దనియనుటయే సమంజస మనిపించెడిని. ఏలనన రేడియో చెవుల కిట్టిదియో టెలివిషన్ నేత్రముల కట్టిదిగాని వేరుకాదు. రేడియోయందు Electro magnetic ear ఉపయోగింపంబడును. టెలివిషనునందు electric eye ఉపయోగింపంబడుచున్నది. ఎలక్ట్రో మేగ్నెటిక్ ఇయ్యరునకు (చెవి) microphone అని సాంకేతికనామ ముంచియున్నారు. ఇంక ఎలక్ట్రిక్ - ఐ (నేత్రము) అనగా రెండుజతల ఫోటో ఎలక్ట్రిక్ సెల్సుండును. (సెలీనియమ్-సెల్-చూడుఁడు.) ఇవి very sensetive to light అని వేరుగఁ జెప్పనక్కరలేదు. ఎవ్వరి యాకారరూపములు Telivisionise చేయవలయునో యాతని శరీరఁపువెలుతురు బింబమునుండి ఛాయాకిరణములను ఎలక్ట్రిక్ ఐ లేక రెండుజతల ఫోటో ఎలక్ట్రిసెల్సు సంగ్రహించి elecrical impulsus గా మార్చి వలయునంతదనుక వాటినిదృఢపర్చి (amplifie.) Transmitting station యొక్క ఏరియల్ నుండి మహావాయుపథములోనికిఁ (ఆకాశవీధికి) బంపివేయుదు. అవి యటులంజనుచు టెలివిషన్ రిసీవింగుసెట్టు (Telivision recieving set) గల వేరొకతావునందలి యేరియల్ నందు గ్రహింపంబడి దానినుండి neon lamp లోనికిం జేరుకొనును. (నియాన్ లేంపుచూడుఁడు.) ఇందుఁ గల revolving perforated dise నుండి కిరణములుగ నేర్పడి కలసికొని కిరణము లధికాల్పబలములఛాయలతోఁ దిరుగ నాకారరూపములుగ నేర్పడి యొకతెరపై నానుకొని చూచువారల కాయాకారరూపములం బ్రదర్శించు చుండును. ఇది టెలివిషన్ యొక్క నిజతత్వము. ఇదియంతయు మాచదువరులకుఁ జక్కఁగ సుబోధకమగుట కొక సుప్రసిద్ధ టెలివిషన్ పండితుని యాంగ్లగ్రంథమునుండి వారివ్రాతల నట్లె వివరించుట సమంజసముగ నుండెడిని. గాన ముం దట్లుఁజేయుటకు మన్నింపంబడుదుము గాక. ఇందుకు వారికిం గృతజ్ఞులము. ఇక్కాలమున టెలివిషన్ Broad casting station లందు Broad casting set అనియు, Recieving station లందు recieving set అనియు ద్వివిధముల పరికరములు పెక్కుమాదిరులుగాఁ జేయబడుచున్నవి. ఎన్నిమాదిరులుగాఁ జేయంబడినను నన్నిమాదిరులకు మూలధర్మవిధానము పైని వివరింపంబడిన దొక్కటిగనే యుండెడిని. అటులఁ జేయంబడుచున్న మాదిరులలో నిక్కాలమునందు ముఖ్యములనిపించుకొనుచున్న మాదిరులు రెండు కలవు. అందొకటి స్పీకరు టెలివిషన్ (Speaker Telivision) విధానము. రెండవది కెథోడ్-రే- (Ca-

thode-ray) విధానము. మాన్యులగు మా సుప్రసిద్ధపండితుని వ్రాతకూడ నిట నాంగ్లమున వివరించి ముగింతుముగాక. వారివ్రాతకు మా కృతజ్ఞత నింకొకసారి తెల్పుచున్నారము.

"Television is to the eye what wireless broad casting is to the ear."

"As in broad-casting there is an electric ear, So in Telvision there is an electric eye, which picks up Varying rays of light and shade, and converts them into corresponding electrical impulses, and these are radiated out, and are again picked up by the Telvision recieving (station) sets-which in turu, re-convert the impulsed into rays of light of Varying intensity, so that a picture is built up on the screen."

**జోన్:-** (Time Zone) టైము జోన్ననిన స్టాండర్డుటైముజోన్నని భావము. స్టాండర్డుటైమనిన నేర్పరుచుకొనిన సాముదాయిక కాలనిర్ణయముగా నెఱుంగవలసియుండును. ఏతావునం దైనను సూర్యోదయ సూర్యాస్తమానములు మూలప్రమాణముగా నెఱుంగఁబడిన కాలము (Time)ను లోకల్ టైమని వాడుచుందురు. తంతివార్తాస్థానములు, యినుపదారిస్టేషను (స్థానము)లు మొదలగువాటియం దొకేకాలముండకున్న వాటిపనులు జరుగుటకుం గష్టముగా నుంట యెఱింగినపిదపఁ బ్రభుత్వములు తమయధికారదేశముల స్టాండర్డుటైముల నేర్పాటుచేయ నారంభించినవి. ఇటుల భరతదేశమునందును ప్రభుత్వశాసనాఁగీకారముంబడసిన స్టాండర్డుటైము తంతివార్తాస్థానములు, రెయిల్వేలచే వాడంబడుచునే యున్నవి. ఇంక నమెరికాఖండమునందలి కనడాదేశము, సంయుక్తరాష్ట్రములు మొదలగు నెక్కుడునైశాల్యముగల దేశములు రెండు మూఁడు నాలు స్టాండర్డుటైములం గూడ నేర్పర్చుకొని యున్నవి. అనగాఁ దూర్పుపడమరలకుఁగాని, యుత్తరదక్షిణములకుఁగాని యాదేశ మంత విరివిగనుంట నట్లేర్పర్చవలసివచ్చెనని యెఱుంగునది.

ఈవ్యవహార మింతటితో నాగలేదు. వేర్వేరుదేశములకు వేర్వేరు స్టాండర్డుటైము లేర్పడినను నాయాదేశములమధ్య రాజకీయసంబంధపుఁ దంతివార్తలు, వర్తకసంబంధపుఁదంతివార్తలు సముద్రమునఁ బోగవోడలు నడచుతటి వేర్వేరుదేశములంగూర్చిన వ్యవహారములఁ దంతివార్తలందుఁ గల్గుచుండు వేర్వేరుటైముల చిక్కులను, యిబ్బందులను, నసౌఖ్యములను నీస్టాండర్డుటైములు నివారింపఁజాలకుండెను. దానింగాంచి పెక్కుదేశముల ప్రభుత్వములు కూడి టైముజోనులు వాటిస్టాండర్డుటైములను నిర్ణయించుకొనియెను. అది టైముజోనుస్టాండర్డుటై మనంబడుచున్నది.

ప్రపంచ మంతయును ౩౬౦ నిలువ్గీతలడిగ్రీలుగ విభజింపంబడియుంట భూపటములతోఁ బరిచయముగలవా రెఱిగినదే. అట్టిడిగ్రీలు ౧౫ ఒక్కొకజోనునందుండునటుల భూమిని ౨౪ టైముజోనులుగ విభజించి యొక్కొకజోనునం దొక్కొకటైమును స్టాండర్డుగ నియమించిరి. దీనిని పోగవోడలందు నావికులు చక్కఁగ గమనించుచుంట జరుగుచునే యున్నది. ఈపద్ధతి నవలంబించిన పెరోదేశము గ్రీనిచ్టైమునుండి యైదుగంటల స్లోతేడాతోఁ గుదురుచున్నది. కాని యాప్రక్కనే యున్న దేశము 'ఎకూఎడోరుదేశ' మీపద్ధతి నవలంబించియుండమి ౫ గంటల ౧౪ మినిట్ల తొంబదియారు డెసిమల్ ఏడు సెకెండ్లకాల మాలస్యముగనుండుట జరుగుచున్నది. ఇంతదనుక గ్రీన్లాండుదేశము, ఐరోపాఖండమునను, అరేబియా, అబ్సీ

నియాదేశములును నంగీకరించి యీాషైముజోను పద్ధతికిఁ జేరలేదు. ఆసియాఖండముసందలి దేశములు దీని కనుకూలింప లే దనుచున్నారు.

**టోటెమ్ పోల్- (Totem Pole)** ఇచట 'టోటెమ్'అనినఁ జిహ్నము లేక లాంఛనమనియు, 'పోల్' అనిన సంఘము లేక తెగయనియు నర్థములు. ఆదిని యైరోపాదేశసీమలందుండు వేర్వేరు తెగలవారికి వేర్వేరుటోటెమ్ (లాంఛనము)లు తమ తెగలాంఛనముగ నుండెనఁట. వారు దానిని పవిత్రముగ నెంచి పూజించుచు గౌరవముగఁ జూచుచుండెడివారఁట. అవి వారికి రక్షకములుగ నుండునని తలంపఁ బడుచుండెడిదఁట. ఇట్టి 'పోలు టోటెమ్' ఏర్పా ట్లమెరికాదేశఁపు టెండియను జాతులయందును, నాస్ట్రేలియా యడవిజాతుల యందునుగూడ నుండినటులఁ దెలిసెడిని.

**టోర్టిస్‌షెల్ (Tortise shell):**— ఇది పైకిఁ దాంబేటిచిప్పయని తెలియుచున్నను నిజమారసినఁ దాంబేటిసంబంధము కానే కాదు. ఇది నిజముగ Turtle అనునొక జలచరము (shell) చిప్పయై యున్నది.

వేడి ‥గు దక్షిణసముద్రభాగములందు Hawks 1 Turtle అను పేరుగల జలచరములు కలవు. ‥ యీాగుడ్లం బెట్టుటకు దరి కేతెంచెడిని. అత్త ఱి ‥ ం బట్టుకొందురు. వాటి ప్లేట్సుచిప్పలను (Pl‥es shells) కాగుచుండు నీటియందుడికించి శుభ్రపర్చి పై నుండు కొమ్మువంటి పొరను ద‥గించి లోపలిచిప్పను వాడుదురు. అదియె Tortoise shell అనఁబడుచున్నది. పెద్దవస్తువులంజేయ రెండు లేక మూఁడు లేక నాల్గుచిప్పలఁగూడ వేడియందు మెత్తఁబఱచి కరుగంజేసి యతుకుటయుఁ గలదఁట.

**డక్కా, దక్షిణేశ్వరీక్షేత్రము:-** బంగాళమునందుఁ దూర్పుభాగమున దక్షిణేశ్వరీ దేవీ క్షేత్రమై యాత్రాస్థలముగనుండిన నీతావును మొగలై చక్రవర్తులపరిపాలనమున బంగాళాదేశఁపుఁ బరిపాలకుఁడుగ నుండిన యిస్లామ్‌ఖాను తాను నిర్మించిన పురిగా నేర్పరిచి జహంగీరునగర మని పేరిడి క్రి. శ. ౧౬౦౮ లో రాజధాని నిటకు మార్చెను. కలకత్తానగరమునుండి ౨౭౦ మైళ్ళ దూరమునందున్నది. కాని జహంగీరునగరమను పేరు స్థిరపడక నాదినామముఁగూడ మారి 'డక్కా' యనఁబడుచున్నది. ౧౭౦౪ వర కటులనేయుండి బంగాళాదేశఁపు సుబేదార్ (గవర్నరు)గారి రివిన్యూమంత్రిగనుండిన నవాబు మూరిద్ కూలీ ఖాన్ ప్రభుత్వకార్యాలయములను మూర్షదాబాదును నిర్మించి యచటికి మార్పించెను

బ్రిటీషుపాలనమున రాజప్రతినిధిగా నుండిన కర్జన్ప్రభువు బంగాళమును విడఁదీసి తూర్పుబంగాళమున కిది రాజధానియగున ట్లొనర్పంజేసెఁగాని యచిరకాలముననె యాపదవిం గోల్పోయి పూర్వఁపుస్థితికిఁ జేరిపోయెను. నేటి కిటఁ జూడఁదగిన కట్టడములు ౧ బారాకత్రా, ౨ చోటాకత్రా, 3 జహంగీరుచక్రవర్తి నాటి కోట, ౪ లాల్బాగు దుర్గము, ౫ హుశేనీదలాన్, ౬ ఒకముసల్మాన్ సేనాని గోరీ మొదలగునవి కొన్ని తావులుఁ గలవు. డక్కామ్యూజియమ్, యూనివర్శిటీకట్టడములు, ప్రభుత్వభవనము, ఎగ్రికల్చరల్ ఫారమును జూడఁదగినవియె. దక్షిణేశ్వరీదేవస్థానము, రామ్నాకాళీ బారీదేవస్థానమును నేటికిని యాత్రాస్థానములై యున్నవి. మశీదులు, దరగాలు, మహమ్మదీయుల యాత్రాస్థలములుగ నున్నవి. (మూర్షదాబాదు చూడుఁడు.)

**డమోాక్లేసు - ఖడ్గము:—** క్రీస్తుప్రభువు జన్మించుటకుం బూర్వము ౪౦౦ సంవత్సరములనాఁ డిటలీదేశమునకుం దక్షిణదిశనున్న సిసిలీద్వీప రాజ్యమును 'డియోనీసియస్' అనుభూపతి పాలిం చుచుండెను. అతఁడు క్రూరుఁడని చెప్పంబడినది. ఆతనికడఁ గొందరు సన్నిధానవర్తు లుండిరి. ఆభూపతి యెడతెరిపిలేక రాజ్యసంరక్షణకార్యము లందు నిమగ్నుండై యుండుటయేగాకఁ గనికర ముం బాటింపకఁ దనకు శత్రువుఁడని యను మానముఁగల్గిన ప్రతివారిని నతికఠినుండై దండిం చుచుండ సన్నిధానవర్తులలో నొకండగు 'డమో క్లేస్' అను నాతడు సాహసించి ప్రభునితో "స్వామీ! మీరు సౌఖ్యము, విశ్రాంతి యనుభ వించువారుగ నుండుట సమంజస" మనియెనఁట. భూపతియు నాతని మనోభిప్రాయ మెఱింగియె "అట్లైన నీవు నాసింహాసనముపైఁగూర్చుండుము. నేను విశ్రాంతింగొనుచు సౌఖ్యముల ననుభవింతు" నని యాతని నటం గూర్చుండఁబెట్టెనఁట. డమోక్లే సతిమోదమంది తన భోగభాగ్యముల కుబ్బి తబ్బి బ్బగుచుఁ బైదెసకుంజూచి యొక గుఱ్ఱపుతోఁక వెంట్రుకతో వ్రేలాఁడదీయఁబడిన వరదీసిన ఖడ్గ ముంగాంచి యది తనపై నెప్పుడు పడునోయని వెరగంది ప్రభునికడకుఁ బర్విడి యాయాపదఁ గల్గ కుండఁ దన్నురక్షింపు మనెనఁట. భూపతి నవ్వు కొనుచు రాజ్యపరిపాలన రక్షణమొనర్చువారి కది తప్పదని యాతనికిఁ దెల్పిగలుగంజెప్పి యూరకుం డంజేసెనఁట. నాఁడాదిగ డమోాక్లే సాఖడ్గ (Soward of Damocles)మను నుక్తి యేర్పడెనఁట.

**డల్హౌసీ [సమశీతోష్ణప్రదేశము]:-** నార్తువెస్ట్రన్ రెయిల్వేపైని పథాన్‌కోట(రెయిల్ హెడ్డు) స్టేషనునుండి యేబదిరెండుమైళ్ళదూర మున, చంబాసంస్థానఁపు (హిల్ స్టేటు) గొండ లపై సముద్రఁపునీటిమట్టముపై నేడువేలయడు గుల యెత్తుననున్న మూఁడుకొండలపై నిర్మింపం బడినది. ఇది యారోగ్యప్రదేశముఁగూడ నై యున్నది. ఆకొండలు ౧ బక్రోటాకుండ (౭౮౧౯ అడుగులు), ౨ తెహరాకొండయు పోట్రియను కొండయు (౬౭౮౫ అడుగులు) సముద్రఁపు నీటిమట్టముపై యెత్తును గల్గియున్నవిగ లెక్కింపం బడి యున్నవి. పథాన్కోటనుండి డల్హౌసీకి రాక పోకలకుఁ జక్కని బాట కలదు. దీనియందైదు సుప్రసిద్ధమోటారుసంఘములు ప్రభుత్వఁపు జిల్లా యధికారుల పరిశీలనాధికారముల క్రింద మోటారు రాకపోకలం జరుపుచున్నవి. రెయిల్వే ఔటు ఏజన్సీవారి బస్సునర్వీసును పనిచేయుచున్నది.

డల్హౌసీ బ్రిటీషుసైన్యస్థానము. మార్చిమొదల క్టోబరు కడవరకును బ్రిటీషుసైన్యములిట నుంపం బడుచున్నవి. లాహోరుడివిజన్ మిలిటరీ డిస్ట్రిక్టు హెడ్క్వార్టరువారి వేసవినివాసముగ నీతా వున్నది. టేక్సీకారుల కిటఁజేర మూఁడుగంటలును, మోటారుబస్సులకు నాల్గుగంటల పదునేనునిమిష ములును బట్టును. తెహరాకొండం జుట్టియు, బక్రోటాకొండం జుట్టియుఁ జక్కని విహారఁపు బాటలు కలవు. పోస్టాఫీసునుండి పంచపుల్లా సాత్ ధారులకు వేయంబడినబాట సుప్రసిద్ధ విహార మార్గమై యున్నది. సాత్‌ధారాపర్వతఁపు టుత్తర భాగమున నేడుజలపాతములం గల్గియుంట నది చూడఁదగిన తావుగ నున్నది. డల్హౌసీనుండి పది మైళ్ళదూరమునందున్న 'ఖాజీయా'రను ప్రదేశము చూడ ముచ్చటయగు సౌందర్యస్థలము. అట నుకాంబంగాళాయుఁ గలదు. అటకుం దొమ్మిది మైళ్ళలో, చంబాసంస్థానఁపు రాజధానియగు చంబాపురము కలదు. అదియు దర్శనీయమే. డల్హౌసీయందు నివాసమున కద్దెకు దొరకుబంగా ళాలు చాలతక్కువ. అది సీజనున కారువందల

రూప్యములనుండి యెక్కువగ నుండెడిని. వాటిం గూర్చి ముందుగ నేర్పరుచుకొనవలసి యుండియు డబ్లానీయందొక క్లబ్బు మూఁడు రోపాహాొటే ళ్లును కలవు. ఒక లైబ్రిరీ కలదు.

## డ్రాగోన్ జంతువులు:-

వీటిం గనులారఁ జూచినవా రెవ్వరును గానరారు. ఆంగ్లభాష యందున్న Fairy tales మొదలగు కథనములందు వీటింగూర్చి వివరింపంబడియుంట నెల్లరెఱిఁగినదే. కొన్ని యైరోపాపట్టణములందు వీటివోల్కె గొప్పగొప్పబొమ్మలఁజేసి చక్రిములపై నమర్చి యుత్సవములం దూరేగించుటయుఁ గలదు. ఇటీవల కొమోడో (Komodo) అనుపేరుగల సముద్రిద్వీపమున నొక ముత్యాలసలాపమునకై యరగిన జనులుగల యోడ క్రి. వె. ౧౯౧౨ లో డ్రాగోనుజంతువు లున్నటులఁ గన్గొనినది. అవి యెన్మిది లేక తొమ్మిది యడుగుల పొడవుగనున్న బల్లిజాతిజంతువు లఁట. గోళ్ళు చాల పెద్దవఁట. వీటి కాకలి యధిక మఁట. మాంసాహార మిష్ట మఁట. పెద్దపెద్దపశువులంగూడ తినివేయు నఁట. వేడిమాంసమునం దధికప్రీతి కలదఁట.

ఈ కొమోడోద్వీపము డచ్చి ఈస్టు ఇండీసు లోనిది. ఈజంతువులకు భయము, వెరపు లేద నియుఁ గలహించుటకు గొప్పసాహసముఁ జూపునని యు ననుచున్నారు.

## డి ఫెండర్ ఆఫ్ ది ఫెయిత్ బిరుదము ("Defender of the faith" Title):-

ఈబిరుద మాదికాలమునాటినుండియు టర్కీదేశఁపు సుల్తానుల (కలీఫాల) కుండెడిది. అది యిస్లాంమతసంబంధమని వేరుగఁ జెప్పనక్కర యుండదు. ఇంకం గ్రైస్తవమతమునకుంగాను నిదే బిరుదము బ్రిటీషుచక్రవర్తుల కున్నది. ఆదియం దీబిరుదమును King Henry VIII భూపతి నాఁ డాయనకు పోపు (Pope) జగద్దేశికుం డొసంగెననియు నందునకుం గారణము మార్టిన్ లూతరు (Martin Luther) గారి విమర్శన లను ఖండించుచుఁ బురాతనక్రైస్తవధర్మసిద్ధాంత ములను ఖండించుచు వ్రాసినగ్రంథమనియుఁ బిదపఁ గొంతకాలమున కాభూపతి తలపెట్టిన Catherine of Aragon దేవిగారితోడి వివాహము నకుఁ బోపుజగద్దేశికుం డంగీకరింపమి నెనిమిదవ హెన్రీభూపతి గినిసి పోపుజగద్దేశికుని నిరాకరించి పుచ్చి యాంగ్లసీమలఁ గ్రైస్తవమతధర్మాధికారము తానే వహించితినని ప్రకటించెననియుఁ జెప్పంబడి యున్నది.

ఇంగ్లాండుదేశఁపు నాణెములపై భూపతియాకారచిహ్నముఁగల తావునను సర్వస్థలములందును 'Dei Gra Britt Omn Rex Fid Def Ind Imp' అనుమాట లుండెడిని. వాటియర్థము "By the Grace of God king of all Britain Defender of the Faith Emperor of India" అనియై యున్నది. గానఁనీడిఫెండ రాఫ్ ది ఫెయిత్ బిరుదము బ్రిటీషుచక్రవర్తులకే చెంది యున్నదిగాఁ దెలిసెడిని. ఈబిరుదముఁగూర్చి యొకగాథ కలదు. దాని నిట వివరించుట సమంజసము. వెనుక క్రి. వె. ౧౮౪౯ లో నాంగ్లదేశమున, ఫ్లోరిన్ (Florin) నాణెములు తొలుత ముద్రింపంబడియెను. బ్రిటిషుమింటు (టంకశాల) యం దధికారిగనుండి 'మింటుమాస్టరు' అను నుద్యోగి రోమన్ కేథోలిక్ క్రైస్తవుఁడుగనుంట నాతని క్రీఫ్లోరిన్‌నాణెములపై By the grace of God అనుటకైన D. G. యనుచిహ్నమును defender of the faith అనుటకైన F. D. యనుచిహ్నమును తప్పించివైచి ఫ్లోరిన్నాణెముల ముద్రించెనఁట. అవియుఁ గొంతవ్యాపకమైనతటి నీసంగతి కన్గొనంబడి ప్రభుత్వమువారిచే నానాణె

ములు తిరుగఁ డెప్పింపంబడి రద్దుపరుపంబడి తిరుగ నాబిరుదచిహ్నములంజేర్చి పునర్ముద్రణ మొనర్పంబడి వ్యాపింపంజేయఁబడినవఁట. ఆయుద్యోగి రోమన్ కాతలిక్కుయుద్యోగపదవినుండితీసివేయంబడి యన్యుం డొక్కండట నియమింపంబడెనఁట. (టంకశాలనాణెములు ముద్రణము చూడుఁడు.) "డిఫెండర్ ఆఫ్ ది ఫెయిత్" అనిన మతరక్షకుఁడని యర్థముఁ గా నోపు.

**డెన్సిటీ (Density):**— పొడవు, వెడలుపు, ఎత్తు, నొకే పరిమాణముగఁగల చౌకమున కాంగ్లమున క్యూబ్ (cube) అనియెదరు. అట్టి క్యూబు పలుచని గట్టిరేకులతోఁ జేయంబడుట సమంజసము. అట్టి క్యూబునిండ నుదకము, పాదరసము, కరిగినబంగారము, కరగిన వెండి మొదలగున వొక్కొకటి యొక్కొకసారిపోసి నింపి తూచిన నింకొకబరువు తూగుంగాని యన్నియు నొకేపాత్రయందుఁ దూచినకారణముగ నొకేబరువు తూగవు. ఏలనన వేర్వేరువస్తువుల కూటమి వేర్వేరుగి దట్టములందలి భారమునందు హెచ్చుతక్కువలుగ నగుచుండును. ఆబరువునుగాని, తేలికనుగాని కల్గించుదట్టమున కాంగ్లమున శాస్త్రజ్ఞులు డెన్సిటీ (density) అని పేరిడి రిది సాంకేతినామము.

ఇట్లనుటయం దొకేపరిమాణ[illegible] (పొడవు, వెడలుపు, ఎత్తులంగల్గినవి.) గల వేర్వేరువస్తువులు వేర్వేరుబరువులుగ (వాటి డెన్సిటీ క[illegible]మగున[illegible]) తూగుంగాని యన్నియు నొకేభారము[illegible]గ[illegible] యొకే బరువుగఁ దూగవని స్ఫురించెడిని. ఇ[illegible] నొకే పరిమాణముననుంట కాంగ్లమున [illegible] Volume అనిపేరు. అనగా నది భూమిపై[illegible] వాతావరణమునం దాక్రమించిన స్థలమని భావము.

ఇంక నీడెన్సిటీధర్మమున నొకవిచిత్రాంశము కలదని కనిపెట్టఁబడినది. భూమికిని తూచంబడిన పదార్థమునకును గలగ్రావిటేషన్ పుల్ ప్రధానమై బరువును ప్రదర్శించెడిని. అటుల బరువుం గల్గించు గ్రావిటేషన్‌పుల్ భూమిపై భాగమున నధికమైయుంటయుఁ బై కాకసముపై పు, ఎత్తున కెక్కినకొలఁదిని కొంచముకొంచముగఁ దగ్గుచుంటయు జరగుచుండుంగాన భూమిపైనే తూచిన పదార్థము కొంతయెత్తునఁ దూచిన బరువించుకఁ దగ్గియుండును గాని డెన్సిటీయందు వస్తుపరిమాణమునం దుండ నవసర ముండదు. ఇంక నీగ్రావిటేషన్‌పుల్ భూపరిమాణము ననుసరించి భూమిపైనను చంద్రుని పరిమాణముననుసరించి చంద్రునిపైనను నుండునదిగాన భూమిపైఁ దూచినవస్తువు బరువు దానినె చంద్రునిపైఁ దూచినఁ జాల తగ్గిపోయి యుండవలయును.

## తప్తపాణి (ఉష్ణోదకబుద్బుదము)

ఉత్కలదేశస్థమైయున్న గంధకదగ్ధమగు వేడినీళ్ళయూట. దీని నుత్కలులు తత్తిలాపానీ యనియు, తత్తవపానీయనియుఁ గూడ ననుచున్నారు. తప్త యనినఁ గాచఁబడినవనియుఁ బానీ యనిన జలములనియు నర్థము. ఆంగ్లమున Sulpher springs అనియెదరు. చిన్నకిమిడి (సొన్నాకిమిడి లేక పుడామర్) జమీాందారీ యరణ్యమునం దిది యున్నది. ఆయరణ్య మిప్పుడు బ్రిటీషుప్రభుత్వఁపుటాస్తిగా నున్నది. దీనిని క్రీ. వె. ౧౮౧౧ లోఁ గన్గొనిరట. ౧౮౩౭ లో నీబుద్బుదముం బరివేష్టించునటులఁ జక్కనిసిమెంటు ప్రాకారమును నెన్మిదిపలకలుగ నిర్మించిరి. బుద్బుదములోతుమొలబంటిమాత్రమే. స్నానమున కనుకూలమగు వేడింగల్గియుండెడిని. మధ్యమున రెండుపణుకురాళ్లున్నవి. అవి నీటియూటలను జాగ్రతగఁ బైకి వెడలఁజేయుచుండును. వాటిసందులనుండి యుష్ణజలములు పైకివచ్చుచుండెడిని. ఉత్తరఁపుదిశను రెండుచీడీలుగా రాతి

పలక లమర్పంబడినవి. వాటిపైఁగూర్చుండి స్నాన మాడెదరు. ప్రాకారఁపు దక్షిణదిశ నొకపరీవాహము (పోర్లురంధ్రము లేక Outlet) నుండి యెక్కువైననీరు వెలుపలకుఁ బ్రవహించుచుండెడిని. పోర్లునీ రనతిదూరమునఁ జల్లారుంగాని గంధకఁపువాసన మాత్రము వీడకుండును. ఇది రెండూ వృక్షములనడుమ నున్నది. ఇరువదిగజముల దూరమునం దొక పురాతనఁపుశివలింగమును, నంది యు నొకచెట్టుక్రింద నున్నవి. కాని యాలయము లేదు. దీని కన్నిదిశలందును గొండలు నరణ్యమేగాని యేడెన్మిదిమైళ్ళలోపున గ్రామములు లేవు. చాల యెత్తైనతావు. ఇటకు మన్యఁపు మోహానీగ్రామము తొంబదిమైళ్ళుండు ననిరి. ఇటనే యొకఫర్లాంగుదూరమున డి. పి. డబుల్యూవారి రెస్టుహౌసు బంగాళాయును, నడుమను దాహోదకముల కొల్లాయియుఁ గలవు. ఇది గంజాముజిల్లా బరంపురము నుండి ముప్పదియైదుమైళ్ళదూరము. దిగుపూడి రోడ్డున నేగవలయును. మధ్యేమార్గమున, అంగబడ, గుంటుమంథో, దక్షిణపురి, లంజ, బగజరి, బంగినబడి, డెంగాపాదరో, సిద్ధేశ్వరో, నారాయణపురి, గోకర్ణపురి, అనగాపురి, దిగుపూడి (లేక పెద్దకిమిడి) (బొడాకిమిడి) లేక దిగపాహండీ, మలాభణిజ, కొన్నామారీ, ధర్మపురి, పుడామరి, లేక సొన్న (చిన్న) కిమిడి గ్రామములుకలవు. అటనుండి నాల్గుమైళ్ళలో నరణ్యము ప్రారంభమై యెన్మిది మైళ్ళలో నీతప్తపాణీ యుండును. ఈప్రాంతముల సిద్దేశ్వరమున సిద్ధేశ్వరశివలింగమును, సుకుండాలో గోకులేశ్వరశివలింగమును, లాఠీలో బ్రహ్మేశ్వర శివలింగమును సుప్రసిద్ధములు. అరణ్యమున, కోదు పల్లెలు కలవు. అందు, కోదువాండ్రే వసించుచున్నారు.

**తిమింగిలఁపు వేట** (Hunting of whales):—తిమింగిలముంగూర్చి మున్నాంధ్ర విజ్ఞానమున వివరింపంబడియే యున్నది. దానివేట నేల యాచరింతురో యిట వివరించుట సమంజసము. తిమింగిలము జలచరమైనను చేపలంబోలిన జలచరము కాదు. నిజ మారసిన నది పెద్దజంతువు (animal). చేపలరక్తము చల్లఁగ నుండును. తిమింగిలమురక్తము వెచ్చనిది. చేపలతోకలు వాటిశరీరముతోఁబాటు పొడవున నుండును. తిమింగిలముతోక దానిశరీరముతోఁబాటుగాకఁ గడ కిటు నటు ప్రక్కలకుఁగూడ వ్యాపించి యడ్డముగా నుండును. గొప్పపరిశీలన లొనర్చినవా రది తొల్లి భూచరజంతువుగానుండి కాళ్ళంగల్గియుండెననియు, కాలవశమున మార్పులంజెంది జలచరముగ మారి యుండుననియు, దానితోక (వెనుక) కాళ్ళసంబంధమై యుండుననియు, నూహించు చున్నారు. సీలు, వాల్రస్ జంతువులు (Seal & walrus) కూడ నిట్టివేయనియుఁ దలంచుటకుఁ గారణములు కలవు. వీట్లతోకలు వాటి కిక్కాలమునఁ జుక్కానివంటి యుపకరణము (steering gear) గా నుపయోగించుచున్నవి.

చేపలు నీటియం దెంతకాల ముండినను చచ్చిపోవు. తిమింగిలము, సీలు, వాల్రస్ అట్లుండఁజాలవు. అవి యూపిరిఁ దీయుటకు బయటికి వచ్చుచుండును. చేపలు గుడ్లం బెట్టును. తిమింగిలము పిల్లంగనును. చేపలు పిల్లలకుఁ బాలిచ్చి పెంచునవి కావు. తిమింగిలము తనపిల్లకుఁ బాలిచ్చి పెంచెడివి. తిమింగిలముల కుత్తరధృవముఁబోలిన శీతలప్రదేశములయందు వసించుట యధికప్రీతియైనను భూమధ్యరేఖకడనున్న యధికవేడిగల ప్రదేశములకైనను తన కాహారము దొరకుటతో దానిని వెంబడించుచుఁ బోవుచుండును. అనగా దొరకుచుండు నాహారపరిస్థితిని వెంబడించుచుఁ జనుచుండును. ఆహారముం దినుటకు నోరు చాల

పెద్దదిగనున్నను గొంతుక చాల చిన్నది. ఆహార మునకై నోరుఁ దెరచుకొని నీటంబర్విడ నీటితో సహా చేపలు మొదలగునవి నోటఁబడ నోరుమూసి నీటిని దవడయెముకలనుండి (mass of whale-bone screen) పైకి వదలివైచి మిగిలినవాటిని గ్రమక్రమముగా లోనికి మ్రింగుచుండును. దవడ యెముకలపంజరమునకు బాలీన్ [boleen] అని పేరు. బాలీను తిమింగిలమునోటియం దుపరిభాగ మున నిరుదెసలందుండు యెముకలవరుసలకును, వాటియందు జాలరువలె నమర్పంబడిన పొలసుల సముదాయమునకును, పేరు గాని వేరుపదార్థ మేమియుఁగాదు. బాలీనుఎముక లేనుఁగుదంతముఁ బోలిన వన్నెంగల్గి నాణ్యమైయుంటఁ జాకుల పిడులు, దువ్వెనలు, గుండీలు మొదలగుపనుల కుపయోగింతురు. ఇవి యధికధర కమ్ముడుపోవును. తిమింగిలము నోటియందుండు వేల్బోనుయెముకలు మూఁడువందలుమొదలు నాల్గువందలవర కుండు నందురు.

తిమింగిలము ధృవసముద్రములందు వసించు నదిగాన దానిశరీరముంజుట్టి చర్మముక్రింద మూఁడు నాలు గంగుళముల దళసరిగల క్రొవ్వు పొరవలెఁ జుట్టియుండును. అదియె దాని నంతటిశీతలోదకము లందునహా ఔసరమగు వెచ్చదనముం గల్గించు చుండునది. దానిశరీరమునందు లభించెడి విలువగల పదార్థము నదియె. దానిం గరగించి నూనెంజేసి పీపాల నింపుకొందురు. శరీరమందలి తక్కినభాగ ములందున్న యెముకలం గుండఁజేసి పొలములకు సత్తువనిచ్చు మెన్యూరులందుఁ గలుపుకొందురు. ఈపనులకువలయు యంత్రములు, పరికరములు తిమింగిలములవేటాడు గొప్పపొగయోడలందే యమర్పంబడి యుండును. కొన్ని చిన్నచిన్నస్టీమరులు వాటిసంబంధఁపువికూడ నుండెడివి. తిమింగిలముం గాంచగనే హార్పూనుతుపాకులం (Har-poon Guns) పేల్చి వాటిం జంపి దానిశరీర ములోనికి గాలిని యంత్రమునుండి యూది (పంపుఁజేసి) యుబ్బింతురు. అది నీటిపైఁ దేలుచుండ దానింబట్టినయోడయొక్క లాంఛనఁపుజెండా నొకదానిని దానిపై నెగురవైచి వేరుతిమింగిలము నకై వెడలుదురు. ఇది యితరయోడలు కాంచి యది యెవ్వరిదో యెఱింగి దానిజోలికిం బోకుం డును. క్రీ. శ. ౧౯౩౮ లో నలువదివేల తిమింగిలములు వేటాడంబడినవఁట. (తిమింగిలము చూడుఁడు)

## తుపానుకుముం దాకాశఁపురంగు మొద్దుఁబారి యుండుట:—

సర్వసాధారణముగ నాకాశఁపురంగు సూర్యరశ్మి సరాసరిగఁ బ్రసరించుట వలనఁ గలుగు వెలుతురువలనను, అది భూమిపైఁబడి ప్రతిఫలించి తిరుగ నాకాశఁపుఁదెసకు మరలి యటనుండియుం గల్గునది. ఈ రెంటికిని వాతావరణఁపువాయువుతో సంబంధము గలదు. కాన వాతావరణఁపుస్థితిపై నాధారపడి యుండెడిని. వాయు వల్లకల్లోలముగ నుండుట నిది తారుమారగుట సంభవించుటయు, దట్టమై కూడుచు విడుచుండు మేఘము లాటంకమై వెలుతురు నాటంకపర్చుచుంటయుఁ గలసి యాకాశము మొద్దుఁబారిన ట్లగుపడంజేయుంగాని యొకవాయు విమానమున మేఘములపై నాకాశముదెస నెక్కి చూచిన సూర్యరశ్మి యథాస్థితిగనే యుండుంగాని యన్యత్రి యుండదుగాన నీమొద్దుఁబారుస్థితి మేఘములనుండి క్రిందికి భూమిపై వారల కగుపడు దృశ్యమే గాని యితరస్థలములం గనుపించునది కానేరదు.

**తుమ్ముట.**-(Sneeze) అట నుండ వీలుండని పదార్థ మేదో నాశికారంధ్రమునం దుండుతఱిఁ దుమ్ముట సంభవించునని యెల్లరెఱింగినదే. ఊపిరి లోనికిం బీల్చుమార్గ మీరంధ్రమేగాన లోసి నుండి వేరునాళము మేధస్సులోని కరుగుచుఁ దెలియఁజేయుచుండెడిని. అటుల ననౌసరపదార్థ మందున్నదని మేధస్సులోనికిఁ దెలుపంబడుటతో హఠాత్తుగా నధికవాయువు నొకేసారి దాని నివ్వలికిం ద్రోసి బహిష్కరింప నారంధ్రమునుండి వెలుపలకుఁ ద్రోసికొనివచ్చును. అదియె తుమ్ముట యందుము. ఒకసారితో నాయడ్డుపదార్థము బయటికి జారిపోకున్నఁ దిరుగ నటులనే తుమ్మువచ్చుట కల్గుచుండును. ఇది యదివరకు మనకుం బూర్తిగ దెలియని యప్రియత్నముతో నతిత్వరగ సంభవించుట నించుక కష్టముగఁ దోపనగుంగాని యపాయకరమై యుండదు. ఒక్కొకతఱిఁ దుమ్ము లధికమగు వెలుగునుండి సంభవించుటయుఁ గలదు. ఇట్టితుమ్ము నిరర్థకము. ముక్కునందున్న యెముక భాగముకడ నొక్కిపట్టిన తుమ్మురాక యాఁగిపోవుటయుం గల్గుచుండును. ఇటనుండియే మేధస్సులోనికిం జేరునాళము ప్రారంభమయ్యెడిని.

**తెలుకులగానుగకు రెండెడ్లం గట్టి త్రిప్పుచుండినతఱిలోపలిభాగఁపుటెద్దు తక్కువగను, వెలుపలిభాగఁపు టెద్ద ధికముగను నడువవలసి వచ్చుట:-** ఒకతిలకులి (తెలకుల) గానుగకు (లాగవలసినబరువధికమై) రెండెడ్లను ప్రక్కలందే పూన్చి లాగించుచుఁ ద్రిప్పుచుండినతఱి లోపలియెద్దుకన్న వెలపలియెద్దెక్కువ దూరము నడువవలసియుండును. ఏలనన లోపలియెద్దు నడచుమార్గమొకవృత్తముగను, వెలపలియెద్దు నడచుమార్గమొకవృత్తముగను గీచిచూచిన లోపలివృత్తము వెలుపలివృత్తముకన్న చిన్నదియె యుంటయు, వెలుపలివృత్తము పెద్దదియైయుంటయు స్పష్టమగును. పెద్దవృత్తము (Circle) నందుఁ దిరుగుట కెక్కువ నడక పట్టును. వేరుగఁ జెప్పనక్కరయుండదు. ఇటులనే యొక పొడుగాటి కఱ్ఱపిడికి రెండు సుత్తితలలు (Hammer heads) తగిల్చితిమేని వాటితోఁ గొట్టుతఱి దిగువసుత్తిదెబ్బబలమునకన్న పై (వెలపలి) సుత్తిదెబ్బబల మధికమని తెలియఁగలదు.

**తేదీ (దిన) ప్రారంభము (Begining of date):**—ఇట తేదీయన నాంగ్లకాలమున పంచాంగఁపు (కేలండర్) దినమని భావము. బ్రిటీషుప్రభుత్వమునకు లోఁబడినదేశములందు, తేదియర్థరాత్రియందుఁ బ్రారంభమై తిరుగ రాత్రి పంన్రెండుగంటలవర కుండుట నందరెఱిగినదే. అనఁగాఁ బగటియందుండు తేది ముందురాత్రియం దారుగంటలును, తరువాతిరాత్రియం దారుగంటలును, మధ్య పగటియందుఁ బంన్రెండుగంటలును నిటుల నిరువదినాల్గుగంటలగుటఁ గొందరికి వింతఁగానోపు. ఇంకం గొంద రీయేర్పాటు సౌఖ్యమునకై యందఱును నిద్రించుతఱి నర్థరాత్రమున తేదీమారుట కేర్పరుపంబడినదిగా నర్థముఁ గుదుర్చువారుం గూడ కలరు. దీని పూర్వోత్తరము లించుక వినోదముఁ గల్గించెడిని.

సూర్యోదయముతోఁ బగలు ప్రారంభమై సూర్యాస్తమయముతో ముగియుటయు నప్పుడు ప్రారంభమైనరాత్రి తిరుగ సూర్యోదయముతో ముగియుటయు నెల్లరెఱింగినదే. కాని యీపను లెల్లతావులందు నొకేకాలమున జరుగుచుండుట లేదు గాన తేదీ ప్రారంభమగుట కొకకృతకమగు నేర్పా టుండవలసియుండును. ఇట్టియేర్పాటు స్టాండర్డుటైముమేరకు జరుపవలసినదిగ స్ఫురింపక

పోదు. (పై మజోను చూడుడు.) నైసర్గికముగ మనము రాత్రులందు నిద్రించువర కాతేదియే స్ఫురించుచుంటయు నిదురించి మేల్కాంచిన కాలమునుండి ముందు తేదీగా స్ఫురించుచుంటయు స్వతస్సిద్ధముగ స్వభావమైయుంట నించుక యోచించినఁ దెలియఁగలదు. ఇట్లనుటయందు నిద్రయందు మధ్య నొకహద్దును రెండుతేదులనడుమగ నేర్పరుచుట సమంజసమని తోఁపకపోదు. అటులనే యర్ధరాత్రమున ౧౨ గంటలదనుకఁ బూర్వదినమునకును, పిదపఁ బరదినమునకును చెందంజేయఁబడినది. దానినే ప్రభుత్వశాసన మంగీకరించి స్టాండర్డుటైమున హద్దుగ నేర్పర్చిరి. ఇంక నీభావితకాలమునుండి యొకనిలువుగీత యుత్తరధృవమునుండి దక్షిణధృవముదనుక గీయంబడినట్లు భావించిన దానికి Date line అని పేరిడం దగియుండెడిని. కాని డేట్ లైను లొక్కొక స్టాండర్డుటైము ప్రదేశమున నొకటిగఁ బ్రపంచమం దెన్నియో డేట్ లైనురేఖ లేర్పడి పెక్కులు కావలసియుండెడిని. గాన నారేఖ లంతప్రాముఖ్యమైనవిగాఁ దలంపఁబడకున్నవి.

**తేయాకు, కాఫీ కషాయములునిద్ర నాపుట:—** వీటియం దుత్సాహముం గల్గించు గుణము కలదు. తేయాకునందున్న Theine అని పేరిడంబడినదియు, కాఫీయందు Caffeine అనంబడునదియు రసాయనశాస్త్రదృష్ట్యా యించుమించొకే లక్ష్యలక్షణములుఁ గల్గిన పదార్థములే. వీటియందు మెదడును బ్రోత్సహించి మనస్సునకుఁ జురుకుఁదన మిచ్చుగుణము గాననగును. ఇందు మత్తుం గల్గించునది యెద్దియు నుండదు. వీటిని మత్తుపదార్థములలోఁ జేర్పరాదని తోఁపకపోదు.

కాని మేధస్సును బ్రోత్సహించుటయందును, జురుకుదనముం గల్గించుటయందును నిద్రిందగ్గించుటఁ దప్పనిదే యైనను మితముగ నుండిన యపాయకరములు కానేరవు. అదేపనిగ నిద్ర నాపుటకే వాడుచుండినతతి insomnia యని యాంగ్లవైద్యులచేఁ బిలువంబడు నిద్రరానిరోగమునకు దారిఁ దీయుట కేయాటంకమును లేదు. పరిశీలకులు బాలురశరీరములకు నైసర్గికప్రోత్సాహము నిద్రనాపుటకుం జాలుననియుఁ దేయాకు, కాఫీ లక్కరలేదనియు ననుచున్నారు. అట్టి లేఁత శరీరముల కివి యపాయకరములేమో ననిపించెడిని.

**తొండముదిరి యూసరల్లి లేక నూసరవిల్లి యగుట:—** తొండల నెల్ల రెఱుంగుదురు. అవి వయస్సుం గడపి ముదిరినతతి మేన రంగులు గలవిగనై యుండును. ఆరంగుల నధికపర్చుటకుంగాని, యించుక మార్పునందఁ జేయుటకుంగాని వానికి శక్తి యుండును. చక్కగ ముదిరిన తొండ (ఊసరల్లి) శరీరమునంగల చిన్న చిన్న సెల్సు (Cells) ముదిరినకొలఁదిని బలపడి యందుఁ దెలుపురంగుచమురు యింకం గొన్ని రంగుపదార్థము లేర్పడును. తనయొక్క శరీరస్థితి మనస్థితులనుండి తనయిష్టమువచ్చినరంగును మేన వెడలంజేయుశక్తి దానికిం గలుగ నారంభించును. దానిపరిస్థితులనుండి తెల్లరంగుంగాని, దానితో జిడ్డుపదార్థముంగూడ వెడలంజేసి పసుపుపచ్చరంగులంగాని, యింక నితరరంగులుగాని యన్నిటింగల్పి వెడలించి నల్లరంగుంగాని యది ప్రదర్శించ మొదలిడును. ఈనల్లరంగు శరీరముపై భాగమునకురాక నించుక లోననె యుండుతతి నాకు పచ్చరంగుగ నూసరల్లి యగుపడునని యిటీవలఁ గన్గొనంబడినది. ఈరంగులమార్పు లింకను వాతావరణమునందుఁ గల్గు నధికోష్ణము, నధికశీతము లేక చలి, వాన మొదలగువాట్లనుండి మార్పు లందునేమోనని కొందరు పరిశీలకు లనుమానించుచున్నారు.

**తోట్కాబాజ్:—** ఈమాటను తొందరతోఁ గ్లుప్తపర్చి యిటులఁ బల్కుచున్నను దీనిని స్పష్టముగాను, చక్కఁగను నుచ్చరింపవలెననిన 'తోటాకాబాజీ' యని పల్కవలసియుండును. దీనికిఁ బాంచాలదేశభాషయందుఁ దోటాలసందడి యని యర్థము. తోటా లాంధ్రభూమియందు బాణసంచాసంబంధమనియుఁ దోటాలంగాల్చుట దీపావళియమావాస్యతో సంబంధముండునేమో యనియు స్ఫురించుంగాని తోట్కాబాజున కట్టి సంబంధ ముండునని పొరఁబడరాదు.

ఈతోటాలసందడి పంజాబునందలి జలంధర్ పురమునం బ్రధానముగ జరుగును. ఆసీమయందుఁ దప్ప నితరతావుల నీసందడి గానరాదు. తొల్లింటి కాలమున నీజలంధరుప్రాంతదేశ మరణ్యమైయుండి దానికి జలంధరుఁడు లేక జాలంధరుఁడను రాక్షస ప్రభు వధినాథుండై యుండువాఁడఁట. ఆయన జయాదేవీభక్తుండగుట. బలాఢ్యుండయ్యు పరిపాలనయం దనురక్తిం గల్గి సదా తనదేశక్షేమ కార్యములందు నిమగ్నుండై యిప్పటిజలంధరు పురమునందున్న జయాశక్తి పీఠముకడఁ దపం బాచరించుచు దేశమున సమృద్ధిగ నీరులేక పంటలు తలఁప వీలుండకఁ బ్రజ లల్లాడుచుంట నెఱింగి విచారనిమగ్నుండై యెట్టకేల కాదేశమున నర్హాస్థలంబుల మూఁడుగోతులం ద్రవ్వించి వర్షజలంబులు మొదలగు జలములచే నింపి కొంతదనుకఁ బ్రజల కనుకూలింపంజేయ నాదేశమునకుం ద్రిగర్త (మూఁడుగోతుల) దేశమని పేరు వాడుకగా సాగెనఁట. ఆమూఁడు గొప్పసరస్సులకు నడుమగ నొక పురమును నిర్మింపంజేసి జలంధర (జలములం ధరించిన) పురమని పేరిడి తనరాజధానిగ నొనర్చుకొనెనఁట. నేటికినినది 'జలంధర్' అనియే (పేరున) పంజాబుదేశమునందుఁ జేరిపోయియున్నది. పిదపనైన్య స్థానముగఁ జేయంబడినది, పిమ్మటఁ గాలానుగతి నాసాగరములుమరమ్మతులులేక మెరకలై యితర జలావసరములక్రింద వడకట్టఁబడి పొలములై పోయి ననుత్రిగర్త దేశమనుపేరు ప్రజలజ్ఞాపకమునం దుండియె యున్నది. ఈపరిసరమంతయు పఠాన్ తురకల ప్రాంతసీమగానుంటఁ గాననగును. ఇంక నాజలంధర భూపతిజ్ఞాపకార్థ మీతోట్కాబాజుసందడి నడుచుచుండు నందురు. జయాశక్తి పీఠమును నటనే యున్నది. ఇంక సందడింగూర్చి వివరింతుముగాక.

పాంచాలదేశస్థులు రణశూరులగుట నందును నీపరిసరసీమ గోడెకాండ్రు చావునకు వెరువని సాహసికులై యధికోత్సాహమును (ఎక్కువ సరదా) గల్గినవాండ్రగుటను, తోటాలసందడి జలంధరునఁ బెద్దసందడిగాఁ బేరంది నడుచుచున్నది. నిర్ణీతదినమునకు మూఁడునెలలముందుగాఁ దోటాలంజేయ మొదలిడెదరు. తొలుదొల్త నర్హాభాగములంగూర్చి నూరి తుపాకిముందుంజేసి దానిం దడిపి యారంగుళములనుండి యడుగుదనుక పొడవుంగల్గిన మందుకణికలంజేసి యుల్లిపొరంబోలిన కప్పతోలు, నుడుముతోలు మొదలగు పలుచని పొరల చర్మములం జుట్టుచు వాట్లం దడపుచు ననుదినమును పరీక్షించుచుందురు. గుల్లగ నుండరాదు. ఎండియుండిన నగ్నిప్రమాదముగాన ననుదినము వాటిం దడుపుచునే యుందురు. నేర్పరియగు పరిశీలకుఁడు తోటాలధ్వనులం బరిశీలించుచునే యుండును.

నిర్ణీతదినమునకు ముం దొకయర్హాప్రదేశము నేర్పర్చుకొందురు. జలంధరు పురపరిసరములనే నాల్గు పఠానులనాటిదుర్గములు గలవు. ఆగోడల ప్రక్కగ నీ తోట్కాబాజునకుఁ దా వేర్పరిచి దానిజుట్టి బలమును వలమునుగల యినుపగజముల గొప్పవలయముం జేయుదురు. దానికిఁ జిన్నద్వారములు రెం డేర్పరిచి లోన దీపముం బెట్టెదరు.

ఇది తోటాలు ముట్టించుకొన నుపయోగించెడిని. తోటాలకుం బ్రధాననాణ్యములు మూఁడు. ౧ వెలుగిచ్చుట, ౨ పూవులు (అగ్నిపుష్పములు) లేకుండుట, ౩ బలముగ బర్వెడుటయు నై యుండును. వీటిని గాల్చుటయందు ధైర్యము చెడని మనోబలమును, చైతన్యముంగల్గి జాగరూకతతో నుండిన నేయపాయమును నుండదనియు, వీటియందేది చెడినను చైతన్యముం గోల్పోవుటతో నపాయములు సంభవించుననియు నచటివా రందురు. పెక్కుచిన్నచిన్న యపాయములు వాటిల్ల వాటిని సరకుఁగొనుటయే లేదు. కొందరికిఁ బెద్ద యపాయములు సంభవింప నాసుపత్రులు, వైద్యశాలలేగతి. ఇంక నొక్కొక్కప్పుడు ప్రాణాపాయము వాటిల్ల వారిం బాతి సమాధి నిర్మించి "తోటాకాబాజీ వీరులం" జేసి గౌరవించుచుందురు.

చూడవచ్చినఁ జూపరుల కపాయములు రాకుండ నినుపవలయము రక్షించుచుండఁ దోటాల నొకటిగాని, రెంటిగాని యంటించి చేతులం బారసాచి యర్ధ్వాకాలమున వదలుచు నాటిరాత్రి యంతయు నీతోటాలసందడి సాగించి మరునాటి యుషఃకాలమునఁ దోటాకాబాజీవీరుల సమాధుల కడ కరిగి తలవైపున నొక్కొక తోటాఁగాల్చి వారిం బహూకరించి యిండ్లకు మరలుదురు. ఇది "తోట్కాబాస్" సందడి. ఈ తోటాలఁగాల్చు వారు దళసరియగు దోలుచొక్కాలును, దోలు మరాయిలను దొడుగుకొని మఱియుఁ దోటాలఁ గాల్తురు.

**త్వగింద్రియము** (Covering of body):— 'త్వక్' అను సంస్కృతపదమునకుఁ జర్మమని యర్థము. జీవముల శరీరముపైఁ గప్పంబడియుండు చర్మమునకుఁ ద్వగింద్రియ మందురు. ఇది స్పర్శము నెఱుఁగు శక్తిఁగలది. ఇది యొకటియేయయ్యు నడుగుభాగ మధికచైతన్యముఁ గలిగినది. దీనియందుఁ జైతన్యప్రదములగు నాళములు (Sensative nerves) పరిణామముఁ జెందును. ఇది చాలమృదువుగఁ గ్రిందియారంభభాగమునను, రానురాను కొంచెముకొంచెము గట్టిగనగుచుఁ గడకుఁ బైకరుగువరకు నించుక పొరవలెఁ బ్రత్యేకతను వహించును. లోపలిభాగము నాంగ్లశరీరశాస్త్రవిదులు 'aline' అనియెదరు. దీనిపై పొర పరిణామమునగ గోళ్లు, డెక్కలు, కొమ్ములు నేర్పడుచుండును. ఇది యెదుగుట కాదనియు, లోనుండి ముందునకుఁ దోసుకొనివచ్చుచున్నట్లగుటయనియుఁ బరిశీలనలు తెల్పుచున్నవి. శరీరఁపుఁజర్మముయొక్క లోనిచైతన్యాధారమైన భాగమే మేధస్సు (Brain) తో సంబంధము కలది. పైచర్మము గోకుకొనుట, కడిగికొనుట మొదలగురాపిడితో నరిగిపోవుచుఁ దరుగుచుండునది. ఏలననది మృతావస్థయందుండు ననిపించెడిని.

చర్మముయొక్క మృతావస్థకు సూర్యరశ్మితో సంబంధము కలదు. సూర్యరశ్మి తగులకుండిన శరీర మెదుగదు. గట్టిపడదు. చర్మముయొక్క పైపొర కీమృతావస్థ సిద్ధించదు. అనఁగా గట్టియుండదని భావము. ఊపిరి లోతుగఁ దీయుటఁ గలుగదు. వెలుతురు శరీరమునకుఁ దగులుటయే మేధస్సునకు బలము, శక్తి గల్గుటఁ గాని బ్రెయినున కెండతగుల నక్కరలేదనియు, వెలుతురు తగిలిన నరములనుండి యీపని జరుగుచుండుననియుఁ గని పెట్టంబడినది. ఇందు నేత్రములకడ నున్ననరములు ముఖ్యములఁట. కండ్లకుం గంతలు కట్టినంతసేపు నెడ్లకీయుపయోగ ముండక నాగిపోవుచుండునఁట. చర్మమునకు వెలుతురు తగులుచుంటయు నంత ముఖ్యమైనదియే. ఇప్పు డైరోపాదేశములందు

'సన్‌బా' తనంబడు నెండ వెలుతురులను శరీరమున కంతకుం బ్రసరింపంజేయుచుంటయు నిట్టిదియే. నిజమున ధరించుదుస్తులు దీనికి విరోధములు. చర్మము సాఁగఁదీసిన సాఁగునవి (elastic) గాననే యిటునటుం దిరుగ మసలఁ గదల వీలగుచున్నది. లేకున్న నవి దుస్తరములు. చర్మము సాఁగఁదీసిన సాఁగి తిరిగి ముడుచుకొనుచు యథారీతిగ నగుచుండుశక్తి కలది. చర్మము రక్తమునందలి చెడినసీటిని (దుర్జలమును) పైకి వెడలించుటకు రంధ్రములఁ గల్గియున్నది. వానిని రోమకూపము లందురు. (చెమట చూడుఁడు) ఈ రంధ్రములనుండి లోనినీరు బయటికి వెడలును గాని బైటనుండి యేదియు లోని కరుగఁజాలదు. ఇది వీటియందలివిచిత్రము. చర్మము 'వాటర్‌ప్రూఫ్' (water proof) అని చెప్పఁబడినది. అనగా నీటివలనఁ దడియునదేగాని తడిసి చెడునది గాదని భావము.

చర్మముయొక్క లోభాగమునకు డెర్మిస్(dermis) అనియు పైభాగమునకు ఎపిడెర్మిస్ (epidermis) అనియు నాంగ్లశరీరశాస్త్రవిదులు పేరిడియున్నారు. 'డెర్మిస్' అనిన నిజమగు చర్మమనియు, 'ఎపిడెర్మిస్'అనిన వెలుపలిచర్మమనియు, భావము. ఎ. పి. యనినఁ బైనుండునదియని యర్థము. చర్మమంతయు సెల్సు (cells) చేఁ జేయఁబడినది. ఆసెల్సు జీవముతోఁ గూడి లోనిచర్మభాగమునం దుండును. అవి ముదురుచుఁ బైకి వచ్చుచుండుతఱిఁ జర్మఁపు వెలుపటిపొరకుం జేరుచుఁ గ్రమముగ మృతావస్థ నొంది శరీరమునందలి పైచర్మముగ నైపోవును. అత్తఱి దాని కేరాపిడి గల్గినను నలిగి రాలిపోవుచుండును. ఈసంగతి చర్మముపై గోకుకొనుతఱి గోళ్లయం దించుకఁ దెల్లనిపొడుముగఁ జేరుటనుండి గాననగుచుండును. కోమలశరీరముగ నుండు బాల్యావస్థయం దీసంగతి చక్కగఁ దెలియంబడకపోయినను వార్ధక్యమున స్పష్టమై గన్పట్టును. ఇందువలన, ఎపిడెర్మిస్ డెర్మిసును రక్షించుచుండు నని తేలుచున్నది.

ఆంగ్లశాస్త్రవిదులు శరీరమంతటను ముఖ్యభాగములందుఁ జర్మమున Glands అనఁబడునవి కలవనియు, నట్టివి ముఖ్యస్థానములై పనిచేయుచుండుననియు, పొత్తికడుపులోని గ్లాండ్సు జీర్ణద్రవముఁ గల్గించునవియనియు, సర్వసాధారణముగ శరీరమంతటను నందు నుదురు, మెడ, చెక్కలు, హృదయము, చేతులు మొదలగుతావులందుఁగల గ్లాండ్సు చెమటగ్లాం డ్సనఁబరగుచు (Sweet glands) చెమటఁ గల్గించుండుననియుఁ జెప్పంబడినది. (చెమట చూడుఁడు.) (వెంట్రుకలు రోమములు అనువ్యాసములు చూడుఁడు. గోళ్లు చూడుఁడు.)

**త్వరితము:—** (Speed) త్వరితముం గూర్చి యెక్కువగా నెల్లరెఱుఁగుదురు. గాని యది యర్థములేనిమాటగ నున్నది. భరతదేశఁపుఁ దర్కశాస్త్రదృష్ట్యా యిది స్వతస్సిద్ధార్థపదము కానేరదు. ఒకదానిగమనముకన్న నెక్కువ త్వరితమనియో, లేక తక్కువ త్వరితమనియో యుండిన నుండునుగాని దీనికిఁ బ్రత్యేకత లేదు. ఇట్టివాటి కన్యములతోఁగల సంబంధము నాంగ్లతార్కికులు 'Relativity' యనెదరు.

**త్రింకోమలీయోడరేవు (సింహళద్వీపము).** ఇది తూర్పుతీరమున సింహళద్వీపమునందున్న రేవుపట్టణము. దేశమున నిట కినుపబాట కలదు. కొలంబోనుండి కేండీదంబుల్లాల మీదుగా ౧౮౧ మైళ్ళును, కేండీనుండి ౧౦౭ మైళ్ళును, అనూరాధపురమునుండి హోరావుపోతనామీదుగ ౬౭ మైళ్ళును దూరము. ఇది క్రీ. పు. ౨౫౦౦ సంవత్సరమునాటికే రేవుగనుండెంగాని యిప్పటి

పే రవ్వు డుండలేదు. ఇట సముద్రములోనికిఁ జొచ్చుకొనియున్నకొండకు, 'తిరుకోనాథమలై' యని పేరు. దానిపై, తిరుక్కోనాథుని దేవాలయ ముండెనఁట. దాని నప్పటియధికారులగు పోర్చుగీసువారు మతగౌరవహీనులై రేవుగోడలఁ గట్టుటకు రాళ్ళకై ఁ బడఁగొట్టి కొంపోవుటయు నంతటితో నాగకఁ బలుకుటకు నోరు తిరుగకఁ గాఁబోలు నేపోర్చుగీసుదొరగారో 'త్రింకోమలి' యని నవీన నామమిడి య ట్లుచ్చరింపసాగెనఁట. నేటికి నాపేరే వాడుచున్నారు. కాని కోనేశ్వరభక్తి మనుష్యులను వీడక హిందువులు, బౌద్ధులుఁగూడఁ బ్రతి సోమ శుక్రవారములం దచటి కేగుచు నాదేవునిఁ బూజించుచునే యున్నారు. అటనే ఫెడరిక్దుర్గముం గట్టినది వారే కాఁబోలును. అటకు నాలుగు మైళ్ళదూరమునఁ గన్నియగ్రామముకడ నీదేవస్థానానుబంధఁపు వేఁడినీళ్ళయూటలు స్నానతీర్థములై యున్నవి. వాటియందు స్నానము రోగములం గుదుర్చునందురు.

ఇచటిరేవగుహార్బరు నైసర్గికమై యచ్చెరువుఁ గొల్పెడిని. భూమియం దడఁగి కొలఁదిగమాత్రము పైకిఁ దలఁజూపిన రెండువరుసలగుట్టలు తీరమునుండి సముద్రములోనికిఁ జొచ్చుకొనిపోవుచు నడుమను సింధుశాఖంజేసి విశాలజలప్రదేశఁపు హార్బరును వ్రియమక్కరలేకఁ గుదర్చినది. ఈ ప్రాంతముల నైరుతిదిశనుండి యపాయ కరమగు వర్షఁపుగాలులు వీచి యోడలకు బాధఁ గల్గించుచు దరికిఁ జేరనీయకుండును. ఈగుట్టలవరుస లీశాన్యదిశనేయుండి మధ్యనున్న జలమున కాతొందరఁ గలుగనీయక శాంతజలములుగా నుంచుఁ గాన నోడ లతిసౌఖ్యమున దరికింజేరును. రేవుంజుట్టి డచ్చివారు నాఁడు కోటలఁగట్టి భద్రపర్చిరి. ఇటకు దక్షిణముగా డెబ్బదిమైళ్ళదూరమున 'బట్టికాలోవా' రేవున్నది. త్రింకోమలీహార్బరు ముఖముకడ Ostenburg దుర్గమును, Fort Frederick దుర్గమును గండశిలలపై నిర్మింపఁబడినవి కలవు. అందు సైన్యములులేవు.

డచ్చివారి పరిపాలనాకాలమున నిట కమేండెంటుద్యోగ మొనర్చిన సేనానికూతురు 'Francina Van Reede' అనునామె యొకడచ్చి యుద్యోగిపై ననురాగమూని పరిణయముగాఁ గోరి నిర్ధారణ (Betrothal) యొనర్చుకొనిరఁట. అచిరకాలముననే యాతఁ డొనర్పవలసిన విదేశనిలయసేవాకాలము పరిపూర్తియగుట స్వదేశమున కరుగుతఁటి నీమెతో నేర్పఱుచుకొనిన వివాహసంబంధముఁ దెంపుకొని యోడ నెక్కెనఁట. ఆ కుటిలవర్తనుం డటెగినయోడ సముద్రపుఁలో బారున కఱుగగనే వంచితయగునామె కొండపైనుండి సముద్రమునంబడి మృతి నందె నఁట. ఆసంగతి ఫ్రెడరిక్కుదుర్గమున నెత్తుగుతావున డచ్చి భాషయందు శిలాశాసనమున వ్రాయఁబడి యమర్పంబడి యున్నది.

పరిసరతీరములఁ జిత్రవిచిత్రవర్ణముల సముద్రపుఁజిప్పలు, గుల్లలు పట్టి బొమ్మలుగ నంటించి యమ్ముదురు. పెద్దపెద్ద ఓయస్టరుచిప్ప లిటం దొరకెడిని. అవి ముత్తెఁపుఁజిప్పల యాకారమును, వన్నెయు, స్వచ్ఛతయుఁ గల్గి రంగుతోఁ గూడి యుండెడిని.

## దక్షిణేశ్వరీదేవిక్షేత్రము:—

(ఢాకా చూడుడు.)

**ద్వాదశతేజోలింగములు:**—వీటి నింకను జ్యోతిర్లింగములని వాడుటయుఁ గలదు. వీటింగూర్చి యాంధ్రవిజ్ఞానమున నిదివర కొకవ్యాసము "ద్వాదశ తేజోలింగము" లను తావునఁ గాననయ్యెడిని. అం దారవదిగ వివరింపంబడిన "ఢాకినీ

క్షేత్రమున భీమశంకరలింగము" అని కలదు. కాని ఢాకినీక్షేత్ర మింతవఱకు బయల్పడకున్నది. ఈ భీమశంకరలింగమును రెండు తావులందుఁ బోల్చుచున్నారు.

౧ బొంబాయిరాజధానిలోని పూనానగరమున కుత్తరదిశగా ౪౩ మైళ్ళదూరమున సహ్యాద్రి (పశ్చిమకనుమల) పై భీమానది జన్మస్థానము కడనున్న శంకరనామముఁగల శివలింగమును భీమశంకరలింగ మందురు. ఈప్రాంత మంతటను ఢాకినీశబ్దసంబంధ మేమియుఁ గానరాదు. భీమానది యొకవిగ్రహమునుండి స్రవించుచుంటఁ గాననగును. ఈప్రాంతముననే కీర్తిశేషుండగు నానాపడ్నవీసుభూపాలునినాఁడు త్రవ్వింపంబడిన రెండుసరస్సులు కలవు. దేవాలయప్రాంతమున నిర్మితమైన యొకచిన్నగ్రామమునందు 'శంకరుఁడు త్రిపురాసురవధనొనర్చి శ్రమనివారణార్థ మిట విశ్రాంతిఁగొనె నత్తఱిని నిటఁ దప మాచరించుచుండిన యయోధ్యానగరపు భూనాథుఁడు భీమకమహారాజు దేవదేవుం దర్శించి యటఁ బరమేశ్వరుఁ డెల్లరకుఁ దర్శన మిచ్చుచుండఁ బ్రార్థింప శివుఁ డటులనె వర మొసంగ నాఁడాదిగ నాస్థలము భీమశంకరక్షేత్రమని పేరందెనని బలముగు వాడుక గల' దని క్షేత్రమాహాత్మ్యముఁ దెల్పుచున్నది. దీనిం జేరుటకు G. I. P. కల్యాన్ సంధి నుండి ౨౧ మైళ్ళు దూరమునంగల నరేల్ (లేక నెరాళ) స్టేషనుకడ దిగి యటనుండి తూర్పుగా ౧౦ మైళ్లెడ్లబండిపైని; ఆరుమైళ్లు కాలినడకను ఈక్షేత్రమునకుం జేరసగును. అట్లు కాకుండిన తలేగావ్ స్టేషనునుండి యీ క్షేత్రము ౨౪ మైళ్ళుదూర మెడ్లబండిలోఁ బోనగును. తలేగావు పూనానుండి ౨౧ మైళ్ల దూర ముండెడిని.

౨ వేరొక భీమశంకరలింగ మాసాముదేశముః కామరూప్ జిల్లాలోని గోహాతిపట్టణమునుండి సమీపముననే బ్రహ్మపురపర్వతముపై నున్నది. కామరూపదేశము నేలిన కామరూపనృపాలుఁ డీక్షేత్ర మున్నతావునఁ దపం బాచరించుచుండ భీముఁడనుపేరుగల రాక్షసుఁ డొకఁ డాతని నెదిర్చిన నాభూపతి "భజామి శంకరం దేవం స్వభక్తపరిపాలకమ్" అని ప్రత్యుత్తర మీయ నారక్కసుం డలిగి తనకరవాల మాతనిపైఁ బ్రయోగించ శంకరుఁ డట నుద్భవించి వానిం దునుమాడెనఁట. అత్తఱిఁ బ్రార్థితుఁడై శంకరుఁ డట భీమశంకరలింగమై నిలచెనఁట. ఈకథ శివపురాణమున ౨౧ వ అధ్యాయమున ౫౪ శ్లోకమున "ఇత్యేవం ప్రార్థిత శ్శంభుః లోకానాం హితకారకః। తత్రైవ స్థితవాన్ ప్రీత్యా స్వతంత్రో భక్తవత్సలః" అను శ్లోకమున స్ఫురించుంగాన నిదియె భీమశంకరలింగమని కొందరు వాదించుచున్నారు గాని యిటంగూడ ఢాకినీశబ్దసంబంధము గానరాకున్నది. ఇట కాసాం బెంగాల్ రెయిల్వేపైని గౌహాతీవరకుఁ బోవలసి యుండును.

ఈ ద్వాదశతేజో లింగములలోఁ గడపటిది (పండ్రెండవది) ఘృష్మేణ లేక ఘుశ్మేశలింగము. ఘుశ్మ గొప్పశివభక్తురాలు. ఇచటి పవిత్రసరస్సునకే శివాలయ మనిపేరు. అం దాఘుశ్మ తాఁ బూజించిన పార్థివ (మట్టి) లింగములం బడవేయుచుండెడిదఁట. అందునుండియే యీతేజోలింగ ముద్భవించి యీపేరఁ బరగుచున్నదఁట. ఇంక నీశివలింగమునకు ధృష్ణేశ్వరమనియు, ఘుసృణేశ్వర మనియుఁ గూడ పురాణములందు నామములు వాడియున్నారు.

ఘుశ్మేశ్వరక్షేత్రము (శివాలయసరస్సు) నైజాంరాజ్యమున నైజామున్టేటురైల్వే సికిందాబాదునుండి మన్మాడుసంధికింబోవు మీటరుగేజి (చిన్నలైను) యినుపబాటపై మన్మాడునుండి ౬౬ మైళ్ళదూరమున నున్న దౌలతాబాదు మీఁదుగా (ఆదౌలతాబాదునుండి) ఇంకను ౧౨ మైళ్ళదూరము నందున్న వేరోల్‌స్టేషనునకుఁ గతిప యదూరమునం దున్న క్షేత్రము. దౌలతాబాద్‌న కుత్తరముగాఁ గాలినడకమార్గమున నీక్షేత్ర మైదు మైళ్ళదూరమునందే యున్నది. గాని యింతవరకు మంచిబాట వేయంబడమి గమనము కష్టముగా నుండెడిని. ఇచట నింకను ధారేశ్వరము మొదలగు కొన్నిపవిత్రక్షేత్రము లీప్రాంతముననే గలవు.

N. B:-ఈ అనుబంధవ్యాసమును "ఆంధ్రవిజ్ఞానము" నందున్న ద్వాదశతేజోలింగముల వ్యాసముతోఁ గల్పి చదువవలయును.

**దీపము- గాస్‌లైటుదీపము, ఎలక్ట్రిక్ దీపముల భేదములు-** చమురున వత్తితో వెల్గు దీప మగ్నిచేఁ గాల్పం బడుచుండునది. క్రొవ్వొత్తి దీపము, కెరోసనాయల్ లాంపుదీపము లును నిట్టివే. కర్రలు, గడ్డి, తాటియాకులు మొదలగువానిమంటలును నగ్నిచేఁ గాల్పంబడుచు నుండి వెలుగిచ్చునవియే. గాస్‌లైటుదీపము గొట్టముల నుండివచ్చిన గాసు (Gas) నగ్నిచేఁ గాల్చి వెలిగిచ్చుదీపమే. కార్బైడులైటుదీపము కార్బైడు నుదకసంబంధమున గాసు (Gas) గా మారంజేసి యగ్నిచేఁ గాల్చి వెలుగిచ్చునట్టి దీపముగానే యున్నది. ఇవి యన్నియు నాతావునందలి వాతావరణముననున్న ఆక్సిజెనుగాసును కాల్చునవియే.

ఎలక్ట్రిక్‌దీప మట్టిది కాదు. అది యగ్నిచేఁ గాల్పబడుచు వాతావరణఁపునాక్సిజెనును తగులఁ బెట్టునది కాదు. లైటును Off చేసి యార్చిన వెలుఁగనే వెలుఁగదు. on చేసిన విద్యుత్ప్రవాహమును దీపఁపుబల్బులోనికిం గొంపోవుతీఁగలం దెఱచి, విద్యుత్ప్రవాహముం బోనిచ్చును. వాటి యందుఁ గొంత resistance కలదు. అది దీపమునందలి సన్ననితీఁగెనుండి కలుగునట్లు కలుగఁగనే ప్రవాహము Circute నుండి నడఁచుతతీఁగల యుద్రేకము force దానియందు వేఁడిం గల్గించి వెలుఁగిచ్చునట్లుఁ జేసెడిని. అనఁగా విద్యుత్ప్రవాహఁపుటుద్రేకము (force) రెసిస్టెన్సు నెదుర్కొను తఱి, వేఁడిగ మాఱి వెలుఁగిచ్చును.

ఆప్రవాహ మధికమైన నధికవేఁడిమి, యధిక వెలుతురుఁ గల్గెడిని. అంత యధికముగ నెలక్ట్రిసిటీ వ్రయమగుచుండును. బల్బులందు గాలియుండదు. ఉండెనేని యందలిసన్ననితీఁగెలు కాలిపోయి పని చేయవు. రెసిస్టెన్సు కల్గదు.

**దుప్పికొమ్ములు:-** దుప్పిపిల్ల జన్మించిన దాదిగ నొకసంవత్సరకాలముఁ గడచుదనుక దానికి కొమ్ము లుండవు. పిమ్మటఁ గొమ్ము లారంభించి శాఖలు లేక యెదుగ నారంభించెడిని. ఆకొమ్ముల కాంగ్లమున 'antlers' అనిపేరు. అవి యెదిగి ముదిరినపిదపఁ గొమ్ములకు శాఖలేర్పడి యెదుగును. ఆశాఖలు పండ్రెండు కల్గినపిదప దాని కాంగ్లమున 'royal hart' అనిపేరుఁ గల్గెడిని. బాగుగ నెదిగి ముదిరిన దుప్పికొమ్ములు మూఁడడుగుల పొడవునఁ గుండెడిని.

**దుఃఖము-కన్నీరు, ఏడుపు:-** దుఃఖము సంతసమునకు వైరి. (నవ్వు చూడుడు.) దుఃఖము కల్గినతఱిఁ గన్నీరుండిన నుండవచ్చును; లేకుండుటయుం గలదు. దుఃఖ మంతర్గతమై యుండుతఱిం గాక, బహిర్గతమైన నేడ్పగును. ఇట్టిఁ

గన్నీరు తఱచుగఁ గల్గియుండెడిని. గాయములు తగులుట మొదలగు నపాయస్థితులందును, నతి విచారకరవార్తలు వినినతఱిని దుఃఖము చైతన్య ముఁదప్పున ట్లొనర్చి, వివశతఁ గల్గించుఁగాని, కన్నీరుండు టరుదు. మనుష్యులందు బాల్యమున న వ్వధికము. దుఃఖమును నధికమై, వయస్సు ముదిరినకొలఁది నవ్వు తగ్గిపోయి, జాగ్రత యతిశయించెడిని. వార్ధక్యమున నవ్వుట యరుదు.

దుఃఖమునకుఁ గన్నీటితోఁగల సంబంధము తనయందున్న యశక్తతయే. తనయందు శక్తి యున్నంతఁదనుక నడ్డగించుప్రయత్నమే చేయుచుండును. ఆశ వదలినతఱినే కన్నీరు ప్రారంభమగును. కనురెప్ప వేయకుండినతఱిఁగూడ, కన్నీరు గారవచ్చును. కన్నుచూచుచుండుతఱి గాలికి కన్నారిపోవుచుండును. మఱియుఁ గొన్నిసందర్భములందు ధూళి సమీపమందేయుంటఁ గష్టముగ నుండును. ఇట్టితఱి ఱెప్పలు వాల్చి, కన్నుమూయుట యప్రయత్నముగ సంభవించినను సంభవించును. కన్ను తడిగ నారిపోయినఁ గనిపించుటఁ దగ్గిపోవుంగానఁ గన్నించుక తడిగానుండుట యావసరమే. కంటిపై రెప్పలందుఁ దలవెండ్రుకలకుఁ దగినసన్నఁపురంధ్రము కలదు. దానినుండి యింకను నీరరుదెంచుచుఁ గంటిచెమ్మ నారకుండఁ దడపుచుండును. ఈధార యధికమయ్యెనేని యదియె కన్నీరు. ఆకారణముననే కన్నీ రధికముగఁ గారినఁ దలనొప్పి సంభవించుచుంటయుఁ గలదు. ఈ కంటిని దడుపుచుండుపని ఱెప్పవేయుతఱినే జరుగుచుండును.

## దుతుజుమ్ము మహారాజు.
(విహారమహాదేవి చూడుఁడు)

**దూరఁపుఁగొండ లూదారంగున నున్న ట్లగుపడుట**_దీనికిఁ గారణము సూర్యరశ్మియందలి యూదారంగుకిరణములు. చూచు నేత్రములకు నాపర్వతమునకు నడుమనుండు వాతావరణఁపుగాలియం దెగురుచుండు మట్టి పరమాణువులు (atoms) పైనఁ బ్రసరించి, తక్కిన రంగులు చెదరిపోయి, యట్లుఁ గన్పించుచుండునని పరిశీలకు లనియున్నారు. ఇటీవలి పండితుఁడగు Lord Rayleighప్రభువు గొప్పపరిశీలనలొనర్చి, యంతియే గాక నావాతావరణమునందలి నైట్రోజెనుగాలియొక్క యూదారంగిందుకు సాహాయ్యమొనర్చి, బలపఱచుచు, నారంగును గనపఱచుచున్నదని తెల్పియున్నాఁడు. ఇది దినమందేకాలమునందుఁ జూతుమో దానింబట్టియు, నాదూరఁపుఁగొండపైఁ దఱచుగ మొలచియుండు నాకుపచ్చ, (లేక) ఊదారంగులచెట్ల మొక్కలం బట్టియుఁగూడ నుండునని కొంద అనుచున్నారు.

ఎట్లున్నను సూర్యరశ్మి రంగులను క్షణక్షణమునకు మార్పుఁగల్గించునటుల మరుగుపఱుచుటయందు,మార్చుటయందుఁ బ్రవర్తించుటయందుఁ బేరందినదిగా నెల్లరెఱింగినదే.

**దృష్టి-దృశ్యము, నేత్రేంద్రియము, మనస్సు సంబంధములు:**— చూచునట్టి 'దృష్టి' యనిపేరు. దేనిం జూచునో దానిని దృశ్య మందురు. శరీరేంద్రియములలోఁ జూచు శక్తిగల యింద్రియమునకు నేత్రేంద్రియ మని పేరు. నేత్రేంద్రియమునుండి దృష్టి (చూచుట) యను సూర్యునివెలుతు రాదృశ్యముపైఁ బడి, ఆయాకారరూపబింబమును నేత్రేంద్రియమునఁ బ్రతిబింబింపఁజేసి మనస్సునకు గోచరింపంజేయుటయై యున్నది. ఈపని నంతను 'దృష్టి' యని, సర్వసాధారణముగఁ జూచుటయనియు వాడుచున్నారు. చూడఁబడుదృశ్యమున కాంగ్లమున 'sight' అని పేరు.

నేత్రములనుండి ప్రతిబింబింపఁబడి, మనస్సు
నకు గ్రాహ్యమైనదృశ్యము నాంగ్లమున 'sight'
అనఁబడినట్లే, ఈపనులేమియు నక్కఱలేకుండ
నొక్కమనోభావనలచే మనస్సునకు గ్రాహ్యమైన
దృశ్య మాంగ్లమున 'Vision' అనఁబడుచున్నది.

:ములు స్వప్నములందుఁ గానంబడునవి.
ఇవి తఱుచుగఁ గల్గుచుండెడిని. ఇవి గాక యరు
దుగ నొక్కొక్కప్పుడు మానవులకుఁ గల్గుచుండు
'విషన్స' (Visions) కొన్ని గలవు. అవియును
నేత్రములపని యక్కఱలేకయే కల్గినను కలుగ
వచ్చును. లేక నొక్కొకతఱిఁ బ్రోత్సహింపఁ
బడిన మనస్సుయొక్క ప్రోద్బల (బల) ముచే
నేత్రములకుఁగూడ నగుపడున ట్లుండినను నుండు
చుండును. ఐనను నిట్టివి విషన్సే గాని, నేత్రదృశ్య
ములు గానేరవు. వీటికి భరతదేశఁపు టాదికాలఁ
పుఁబండితులు, మనోదృశ్యము లని పేరిడి
యున్నారు.

దృశ్యములుగ మనస్సునకుం గాన్పించకున్నను,
మనస్సునకుం దోచిన వన్నియు మనోగ్రాహ్యముల
లనఁబరఁగెడినిగాని, మనోదృశ్యములు కానేరవు.
మనోదృశ్యములు నిశ్చలములై మనస్సున కగు
పడునట్లే యుండును. ఇదియే యీరెంటియందుఁ
గల భేదము. దీనిని జాగ్రతగ నెఱింగి, బోధపరుప
వలసియుండును. ఇట్టివాటియందు శరీరమునందలి
Brain అనఁబడుభాగముతో సంబంధమెక్కువ
యుండునని యాంగ్లశరీరశాస్త్రవేత్తలనుచున్నారు.

స్వప్నములందు రాత్రి లగుపడినవి యుదయ
మునకు జ్ఞప్తియుండి చెప్పఁగలుగుట మనస్సునకుఁ
జక్కఁగ నాటినవే యనుట కేయభ్యంతర ముం
డదు. అట్లు నాటుట కాంగ్లపండితు లనునటుల
మెదడునందుఁ బనిజరిగియుండు ననిపించెడిని.
ఆంగ్లపండితు ;విధదృశ్యముల నొకటి శరీర
నేత్రమున కగుపించిన (దృష్టి) దృశ్యమనియు,
రెండవది మనోనేత్రమున కగుపించిన (మనో)
దృశ్య మనియుఁ దలంచిరి. శరీరనేత్రదృష్టి జ్ఞాను
లకు, మూర్ఖులు నజ్ఞానులునగు ననాగరికులకు
నొకేవిధమునఁ గన్పడినను, జ్ఞానులు దానినిజతత్వ
మెఱింగినవారుఁ గాన వారిభావములం దప్పుడు
స్ఫురించెడిస్థితి వేరుగ నుండును. మూర్ఖాజ్ఞానము
యులగు ననాగరికులు దానినిజతత్వ మెఱుంగని
వారుఁ గాన, వారిభావములందు స్ఫురించెడిస్థి
వేరుగ నుండును. స్వప్నములందలి యర్థము
లిట్టివే.

మఱియు నీమనోదృశ్యములగు విషన్సు నమ్మ
కము మూలస్థానముగఁ గల్గినవనియు, భవిష్య
త్సంబంధము లేమో యనియుఁ దనకుఁ బ్రాప్తించ
నర్హములుగ నుండఁదగినసంగతులుగ స్ఫురింపక
పోవు. అగునేని భవిష్యత్సూచకము లేమోయని
తలంప నగుచుండును. ఇట్టివి ప్రాణికాధ్యాత్మిక
ధర్మములా యనుతలంపుతోడనే గలుగ నయ్యె
డిని. ఇతరజీవజంతువులవలె మనుష్యులు శారీరక
చైతన్యము నిర్బంధింపఁబడియుండకఁ గొంత యధిక
మగు నాత్మీయ లేక యాధ్యాత్మికచైతన్యముం
గూడఁ గల్గియుంట జ్ఞాపకమునకు వచ్చుటయు
నిట్టి విషన్సు, అట్టి యధికజ్ఞానమునకుఁ జెందిన
వేమో యనిపించెడిని. భవిష్యత్తులోనికి దూరా
లోచనలుగల కొందఱు ధీశాలుర దూరదృష్టి, దు
రాలోచనలుకూడ నిట్టివేయని వాదించువారును
గొందరున్నారు. ఆంగ్లమున "All our phy-
sical thoughts and senses have the-
ir spitual counter parts" అను సిద్ధాంతో
_సంబంధములు గానోపు ననిపించును. ఏసుక్రీస్తు
ప్రభువు నుడివిన "He that hath ears to
hear let him hear" అనునుక్తి కర్థము నిదే
యేమో యనిపించెడిని.

 దేశమందలి శీతోష్ణస్థితి

**దేశమందలి శీతోష్ణస్థితి** (climate of the land):—ఆంగ్లభూగోళతత్త్వవిదులు శీతోష్ణస్థితిని 'weather' అనియు, 'climate' అనియు రెండుగ విభజించిరి. అందు మొదటిది తాత్కాలికము. రెండవది సంవత్సరఁపుబొడవునను, సగటునఁ జెప్పఁబడినది. ఒకతావునఁ గొన్నిమాసములు సౌఖ్యప్రదములగు శీతోష్ణస్థితులఁ గల్గియుండునది 'వెద' రనఁబడును. 'క్లైమే' టనఁబడునది యేఁటేట నొకరీతిని సగటున నుండుస్థితి. దీనిం దెలియుటకుఁ గొన్ని పరిశీలనలను సంవత్సరముపొడవున నాసీమయందు నడచుపరిస్థితులఁ గొన్నిఁటిని బరిశీలింపవలసియుండును.

భూమి గుండ్రముగ బంతివలె నున్నటులఁ జెప్పఁబడినది. అది సూర్యగోళము నాశ్రయించి, దానిం జుట్టి తిరుగుచు, దానినుండియే వేఁడిని గ్రహించుచున్నది. సూర్యునుండి వెడలివచ్చుచుండు రేడియంటుహీటు (Radient heat) నందు రెండువేల మిలియనుభాగములలో నొక భాగము భూమికిఁ జేరుచుండు నని లెక్కించి యున్నారు. అనఁగా మిలియను పదిలక్షలని యెఱుంగవలయును. ఈ సందర్భమున భూమి సూర్యగోళమునుండి ౯౩ మిలియనులమైళ్లదూరముగం దానిం జుట్టి తిరుగుచుండునని వివరించుట సమంజసము.

సూర్యునుండి భూమికిఁ జేరు వేఁడియంతయు వేఁడిగ నుండునదియే. అది తిన్నఁగ నల్లే చేరినచో భూమిపై వసించుటయే దుర్భర మగును. తేజస్సును నేత్రములతోఁ జూడ దుస్సాధ్యముగ నుండును. కాని, యటుల జరుగుట భూమికిఁ జేరువేఁడియందు సమభాగము దారియందు మేఘములచేతను, గాలిలో వాయుపథమునఁ దేలుచుండు బుగ్గి పరమాణుసముదాయముచేతను, గొంతయాటంకముఁ గల్గుచుండుకతన వెలుతురు మార్పునంది, భూమికిఁ జేరుచుండును. కొంతవేఁడి వాయుపథమునం దిమిడిపోవును.

ఇటుల సగము వ్యయమగుకతన శేషించిన సగమును భూమిపైనను, అందున్న సముద్రజలములపైనను బ్రసరించుచు, భూమిపై పొరలోని కొన్నియడుగులలోతుదనుకఁ గూడఁ జొచ్చుకొనిపోవునుగాని, సముద్రజలములపైఁ బడినది కడుదూరములోతునకుఁ జొచ్చుకొనిపోవుచుండునని కనిపెట్టఁబడినది. మఱియు నీవేఁడియె చెట్లుచేమలు పెరుఁగుటకు, మనుటకు నుపయోగించుచున్నది. ఇందొకచిత్రముజరిగెడిని. భూమికిఁదాఁకినవేఁడిలోఁ గొంతఁదిరుగఁ బైకిఁ దిరుగఁగొట్టఁబడుచు, వాయుపథములోనికిఁ జేర్కొనుచుండెడిని. గాననే భూమికడ వేఁడి యధికమై, యెత్తుగుతావుల కెక్కిన కొలఁదిఁ జల్లఁగ నుండుటఁ గల్గుచున్నది. ఆచల్లగ నుండుట కితరకారణము లింకనున్నను నిది యొక కారణముగఁ జెప్పనగును.

భూమికిఁ జేరినవేఁడి భూమిచేఁ బీల్చఁబడి, యందు నిల్వయుండుటకుఁగాని, లేక వెడలఁగొట్టఁబడి వాయువునందుఁ జేరుకొనుటకుఁగాని, ప్రధానమైనకారణ మొకటి గమనింపఁదగినది కలదు. భూమి బంతివలె గుండ్రనై యుంటయుఁ దనకుఁ దానై గిరగిరఁ దిరుగుచుంటయు నం దెప్పుడు భూమధ్యరేఖ సూర్యుని కెదురుగనే తిరుగుచుంటయు జరుగుచుండునుగాన భూమధ్యరేఖ (Equator ప్రదేశమునను, దాని కిరుదెసల నుండు ప్రదేశములను, సూర్యునివేఁడి తిన్నగఁ బైఁబడుచు, నవ్వలినుండి యుత్తరధ్రువముదనుకను, నివ్వలినుండి దక్షిణధ్రువముదనుకను, నేటవాలుగఁ బోనుపో నధికమైన యేటవాలులుగఁ బడుచుండును. ఇట్లనుటయం దేటవా లధికమైనకొలఁది

వేఁడి తక్కువ యగుచుండునని యెఱుంగునది. గాననే యుత్తరదక్షిణముల కరిగి (దూరమగు) స కొలఁది వేఁడితగ్గి తగులుచుండుచు ధ్రువములకడ కేవలశీతల మైపోయెడిని. భూమధ్యరేఖ సమీపించినకొలఁది వేఁడి యధికమగుచుంట కిదియే కారణము. భూగోళపటమునం దొక్కొక లాటిట్యూడు (latitude) ప్రదేశములం దీపరిస్థితు లొకేరీతి నుండుటకుఁ గారణ మిదియే. ఇంక వేఱొక కారణ మాదేశములయొక్క యెత్తు (altitude) గా నెఱుంగఁదగును. ఈయెత్తును సముద్రపు నీటిమట్టముపై లెక్కించుచున్నారు. అనగా సముద్రపునీటిమట్టమును సున్నగాఁ గైకొనెదరని భావము. భూమినుండి వాతావరణములోనికిఁ దిరుగఁ గొట్టఁబడినవేఁడి భూమట్టముకడ నధికముగ వేఁడిగానుండి, యెత్తున కెక్కినకొలఁదిఁ దగ్గిపోయెడిని. గాన నెత్తుగనుండు సమశీతోష్ణ ప్రదేశములు చల్లఁగ నుండెడిని.

ఈసందర్భములందుఁ జెప్పఁబడినరహస్య మొకటి పరిశీలనలందుఁ గన్గొనఁబడినది. దాని నిట వివరింతుము గాక. వాయు వెల్లప్పుడు నొకదిశ నుండి దాని యెదురుదిశకు (Horizontal) మాత్రము వీచుచుండునది కాదనియు నొక్కొక తఱిఁ బై నుండి క్రిందిదెసకు, క్రిందినుండి పై దెసకుఁ గూడ వీచుచుండుననియు, నిదివఱ కెఱింగినదియే. ఎట్లన భూమిపై వేఁడియైనగాలి యాకసము దెస కేగురుటయు, నాకసమున శీతలస్థితినంది బరువెక్కినగాలి క్రిందిదెసకు భూమికిఁ దిగుటయుఁ గ్రొత్తసంగతులు కావు. ఇది గాలి యాకసము పైకి వీచుటయే. ఇంక బరువెక్కినగాలి క్రిందికిఁ దిగుట క్రిందికి వీచుటయే యగును. క్రిందికిఁ దిగుచుండుతఱిఁ గాలి యణఁగి హత్తుకొనుట (Compressed), వేఁడియగుట సంభవించెడిని. పై కెగురుతఱి విడఁబాఱుచు (expanding) పలుచఁబడి శీతలమగుచుండును. పై కెగురుతఱి నీయావిరియుం దడఁగి (Condence) నొక్కఁబడుట సంభవింపదుగాని క్రిందికి దిగుటయందు నొక్కఁబడి యధికముగ హత్తుకొని యొత్తిడిఁ గల్గుట సంభవించుచుండును. అందు మేఘములందలి పదార్థము (Cloudy matter) లుండఁజాలవు. కాని, పై కెగురువాయువునందు మేఘపదార్థము లుండునని మీటియాలొజీ (meteorology) పరిశీలకులు కన్గొనియున్నారు.

**ధ్వని - గమనపరిస్థితులు:—** ధ్వని ప్రయాణ మొనర్చుటకే గాక యుండుటకుం గూడ వాయువు medium గా నుండుట యావసరము. అట్లు గాక ఒక Vacuum మొదలగు గాలిలేనితావులందు ధ్వని కలుగనే కలుగదు. అనఁగా వినిపించుట యనునది యుండనేరదని భావము. నిలిచియుండు గాలియందు ధ్వని సెకెండుకాలమునందు ౧౧౧౮ అడుగులు ప్రయాణమొనర్పఁగలదని లెక్కింపఁబడియున్నది.

ధ్వనిప్రయాణ మనుటయందుఁ ద్వరితము, దిక్కు లేక దిశ, యనురెండుసంగతు లెఱుంగఁదగినవి కలవు. మఱియు నారెంటికిని వాతావరణపరిస్థితి (wind) శీతోష్ణపరిస్థితి (temperature) పొగమంచు మొదలగుపరిస్థితులు (fog ctc) లు నాటంకములుగఁ గాని, సహాయకరులుగఁ గాని యుండెడిని. బలమగుగాలి ధ్వనిప్రయాణమున కాటంకముఁ గల్పించునని వేఱుగఁ జెప్పనక్కఱ యుండదు. ధ్వనితరంగ మేవైపున కరుగ నిర్దేశింపఁబడినదో యావైపున బలమగుగాలివలన నాటంకముఁ గలిగినచో నది యనుకూలమగు వేఱొక వైపున కరుగుచుండును. వెచ్చనిగాలియందు ధ్వనితరంగములు త్వరితముగ నడుచుటయు, శీతల

వాయువునం దాలస్యముగ నడచుటయు, టెంప రేచరుతో ధ్వనికిఁగల సంబంధము వెల్లడియగు చున్నది. సముద్రముపైఁ గొన్నితావుల నదటిపరిస్థితులమేర కప్పుడప్పుడు పొగమం (fog) చధికముగఁ గల్గుచుండునట్టితావులు ధ్వనిప్రయాణముంగూర్చి పరిశీలన లొనర్ప నోడలనుండి వీల య్యెడిని. అట్టిపరిశీలనలం దొకతావునఁ గల్గింపఁబడినధ్వని దూరమునకుఁ జక్కఁగా వినిపించినను సమీపముననేయున్న (ధ్వని బయలుదేఱిన) పరిసరముల వినిపించలేదు. ఇంతియేగాక యొకదెస యందు బయలుదేఱినధ్వని వేఱొకదెసనుండి వినిపించుట సంభవించును. ధ్వనితరంగముల గమనమునకు పొగమంచు కొన్నియాటంకములం గల్గించుట కన్గొనంబడెను. దీనికిఁ బ్రధానకారణము కమ్మిన పొగమంచునందుఁ గొన్ని వేఁడియధికముఁ గల పొరలు, కొన్ని శీతల మధికముగఁగల పొరలు, కొన్ని దట్టమైనపొరలు (more density) కొన్ని తక్కువడెన్సిటీఁగల పొరలు నుండుననియు, వాటిం బట్టి ధ్వనితరంగములగమన మందు జరుగుననియుఁ గన్గొనంబడినది.

వాయువునందుకంటె నీటియందు ధ్వని నాలుగున్నరరెట్లధికముగఁ ద్వరితగమనముఁ గల్గియుండునని లెక్కింపఁబడినది. ధ్వని యుక్కులోహఁపు సంబంధపు (తీఁగె) నుండి గాలియందుకంటెఁ బదునారురెట్లధికవేగమునఁ బయన మొనర్చునని కన్గొనంబడియున్నది. గాననే విద్యుత్సహాయముంగూర్చి యుక్కుతీఁగెనుండి తంతివార్తలను నడుపుచుండుటకు వీలు గలిగినది.

**నదియొక్క కుడి యెడమ తీరములు:**—ఒకనది జన్మించినతావునుండి ప్రవహించుదిక్కున వెనుకకుఁదిరిగి యది యెటు ముఖద్వారముదెసకుఁ బ్రవహించుచుండునో యాముఖముగ నిలుచున్నవారి కుడివైపు నదియొక్క కుడివైపును (తీరము), ఎడమవైపు నదియొక్క యెడమవైపును (తీరము) నుండునని యెఱుంగవలసియున్నది.

**నద్దియా:**

(నవద్వీపము చూడుఁడు.)

**నల్లధాతువు (రంగు) గలవస్తువులు తెల్లధాతువు లేక ప్రకాశమానమగు రంగుగల వస్తువులకన్న వెచ్చఁదనముఁ గల్గియుండుట (Dark Things are warmer than light things):**—ఇందు మొదటితెగవస్తువులపై సూర్యరశ్మి తగులుతఱి నారశ్మి ప్రతిఫలించుటఁగాని దానినుండి వెనుకకు నెట్టుటగాని యుండదు. గాన నావేఁడి దానియందు నిలువ యయ్యెడిని. ఇట్టి వేఁడి రేడియంటుహీటు (Redient heat) అనఁబడుచున్నది. ఇంక సూర్యరశ్మియందు మంచు సైతము కరగెడిని గాని వేఁడిని తనయం దధికముగా నిల్పుకొనంజాలదు. అట్లే యితరధాతువులుగల వస్తువులును వేడిని నిల్పుకొనఁ జాలవుగాన నించుకఁ జల్లంబడును.

**నవద్వీపధామము గౌడియామిషన్ చైతన్యచరిత్రము:**—నవద్వీపమనఁ దొమ్మిది ద్వీపము లనియర్థము. (నవద్వీపము తొమ్మిదిద్వీపములు చూడుఁడు.) ఇం దంతర్ద్వీపము ప్రధానమైనది. అందే మాయాపూరునందు శ్రీచైతన్యమహాప్రభువు క్రి. వె. ౧౪౮౬ సం॥ ఫిబ్రవరి ౧౮ సాయంత్రఁపువేళ జన్మించెను. ఆజన్మమే యాతావునకుఁ బవిత్రతఁ గల్గించి నవద్వీపమును ధామ మనిపించి చైతన్యమతస్థులకు యాత్రాస్థలిగా నొనర్చినది. అంతర్ద్వీపము నడుమగా

నున్నది. ౩౨ మైళ్ళ వైశాల్యమని చెప్పంబడి నది. యాత్రాకాలమునం దేటేట నీతొమ్మిదిద్వీప ములంజుట్టి ప్రదక్షిణమొనర్చుచున్నారు. శ్రీచైతన్యమహాప్రభు జన్మకాలమునకుఁ దొమ్మిదిదిన ములుపూర్వ మీప్రదక్షిణ మారంభింపంబడి యానాటికి ముగింపంబడును. వేలకొలఁదిగ జను లరుగుదురు. ఈక్షేత్రము గౌడీయామిషన్‌వారి పరిపాలనమునం దున్నది. దీనిని భక్తిపారవశ్యమునఁ జైతన్యమతస్థులు నవద్వీపధామనియు, మతమును శ్రీకృష్ణచైతన్యమనియు ననుచున్నారు. యాత్రకాలమున మిషన్‌వారే భోజనము లిడి బసల నిత్తురఁట.

వంగదేశ మేలిన సేనవంశనృపతులలోఁ గడపటివాఁడగు లక్ష్మణసేనున కిది రాజధానిగ నుండినటుల ౧౮౮౦ ఇంపీరియల్ గెజటీరునందు Sir William Hunter గారు ౧౦౬౩ లో లక్షణసేనుఁ డీమాయపూరును నిర్మించి తనరాజధానిగ జేసుకొనెననియు, మహమ్మదీయ దండయాత్రయం దాయన పరారియై మరణించెననియు వివరించియున్నారు. ఒకపెద్ద సరస్సు (ఒకమైలుపొడవు, అరమైలువెడలుపుఁ గలిగినది) న కాయనతండ్రి (బల్లాలసేనుని) పేరిడి యుండెనఁట. లక్షణసేనుని దుర్గము పాడగుచు నేటికిఁ గలదు. చైతన్యదేవుని జీవితచరిత్ర చైతన్యభాగవతమనుపేరున టాకూర్ బృందాబన్దానను పేరుగల యొకచైతన్యభక్తుఁ డిటీవల రచించెను. అందు వారికాలమున వంగదేశము హుశేన్‌షా యనుపేరుగల నవాబువశమం దుండెననియు నాయన యుద్యోగిగ, మౌలానా సెరాజుద్దీనుసాహేబు ఫౌజుదారుగ నవద్వీపమునం దధికారపదవియం దుండెననియు నాయనకే చంద్ కాజీయను వాడుకనామ ముండెననియు నొకనాఁడు చైతన్యులభజనమృదంగము నొకతురక బద్దలుగొట్ట విని చైతన్యదేవుఁ (గౌరాంగుఁ) డనుచరవర్గముతో నట కరిగి వారిం గాంచిన చంద్ కాజీ (ఫౌజుదారు) వారికి శిష్యుం డాయెననియుఁ జెప్పంబడినది. నేటికిని నాసాయీబుగారి గోరీ గౌడీయామిషనువారు తమవశమం దున్నదని చూపుచున్నారు.

చైతన్యమతస్థులు చైతన్యదేవుని శ్రీకృష్ణుని యవతారమే యని యందురు. వీరు గురుండగు గంగదాస్‌పండితునికడ విద్యలం గఱచిరఁట. వ్యాకరణము, న్యాయశాస్త్రము, మీమాంసము వీరు చక్కఁగ నభ్యసించిరఁట. తండ్రిపేరు జగన్నాథ మిశ్రులు. తల్లిపేరు శచీదేవి. మొదటిభార్యపేరు లక్ష్మిదేవి. ఆమె వల్లభాచార్యుల కుమార్తెయని చెప్పంబడినది. చైతన్యగురుండు తూర్పుబంగాళమున కఱగి యటనుండుతఱి లక్ష్మిదేవి వియోగభరమున భౌతికశరీరమును వీడెననియు, ఆయన తిరుగ నరుదెంచి సనాతనమిశ్రుని సుతయగు విష్ణుప్రియాదేవిం దిరుగ వివాహమాడెననియు నందురు.

చైతన్యదేవునికి మంత్రోపదేశదీక్ష నిచ్చిన గురునిపేరు ఈశ్వరపురియనియు నాయన మాధవమత ధర్మమార్గవర్తియగు మాధవేంద్రపురిగారికి శిష్యుండనియు, వీరిని చైతన్యదేవుఁడు తండ్రి చనిపోయినతఱి నంత్యేష్టిమొనర్ప గయ కరిగినతఱి నటఁ గాంచెననియుఁ జెప్పంబడినది. గాననే చైతన్యసాంప్రదాయమునకు శ్రీబ్రహ్మమాధవ గౌడీయ సాంప్రదాయ మని పేరఁట. ఈ జగద్గురుండు మతదీక్షనందుట "పతితజీవులు గురుముఖతః దీక్షనందుట యత్యావసరమని లోకమునకుఁ జూపుటకే" యని చెప్పఁబడినది.

తాను వైష్ణవదీక్షనొందినపిదపఁ జైతన్యదేవుఁడు (గౌరాంగజగద్దేశికుఁడు). నవద్వీపమునకుఁ దిరుగ

నరుదెంచి శ్రీకృష్ణాన్వేషణయందు నిమగ్నుఁడై రాత్రులందు శ్రీవాసపండితునిగృహమున కనుదిన మరుగుచుఁ దన యనుచరవర్గముతోఁగూడి శ్రీకృష్ణపవిత్రనామసంకీర్తన మొనర్చుచుండెడి వాఁడు. అక్కాలమునందే యామహాత్ముండు తనశిష్యులగు నిత్యానందప్రభువును, హరిదాస్ ఠాకూరును ప్రజలకు మతబోధఁ గావింప నియమించెను. ఇదియే యాయన ప్రథమప్రయత్నమని యందురు. వారితో జాతి, మత, వర్ణ భేదములఁ బాటింపక బోధింపుఁడనియెనఁట. నామసంకీర్తన మొనర్చు బోధకుఁడు గడ్డిపోచకన్న దీనుఁడుగను, వృక్షమునకన్న నధికమగు నోర్పుతో నిలచి యుండువాఁడుగను, అందరిని గారవించువాఁడుగను నుండుటయేగాక స్వార్థత్యాగిగా నుండవలయునని విధి నేర్పరిచెనఁట.

ఇట్లయ్యును తాను పరిమితిలేని కనికరముఁ గలవాఁడుగ నుండియుఁ దొలుదొలుత వీరిబోధ నాలింప కుండెనఁట. నిరాశఁజెంది యాబోధకుఁడు ప్రపంచవిముఖుఁడై సన్యసింపనెంచి (బంగాళము లోని) కట్వాపురమున కరిగి కేశవభారతీ (సన్యాసి) స్వామినుండి సన్యాసముం గైకొని వారికి శిష్యుఁడై శ్రీకృష్ణచైతన్యదేవుండను సన్యాసాశ్రమనామము నొందెను. దీన్నినుండి వారిది భారతీసాంప్రదాయసన్యాసమని తేలుచున్నది. ఆతోడనే నవద్వీపమునకు రా నిచ్ఛగింపక శ్రీకృష్ణభగవానుం గాంచ బృందావనమున కరుగ బయల్వెడలెనుగాని యాత్ర జరుగ దాయెను. మధ్యేమార్గమున రాఢాదేశమని పేరందిన భూమియందలి వర్ధమానమున (ఇప్పటిబర్ద్వానుపురమున) మూఁడహోరాత్రములు మైమఱచి యాహారనిద్రలఁ గొనక చైతన్యుఁడు చైతన్యరహితస్థితిని శ్రీకృష్ణనామసంకీర్తనా నిమగ్నుండై యుండ ననుచరశిష్యుండగు నిత్యానంద ప్రభుం డాస్వామిని శాంతిపురమునకుఁ గొంపోవ నట నాయన మిత్రుండగు నద్వైతాచార్యుం డాదరించెనఁట. వారు దశరాత్రములఁ గడపి శ్రీజగన్నాథమున కరిగిరఁట. శ్రీజగన్నాథమున కప్పుడు పురుషోత్తమక్షేత్రమను పేరు వాడుకయం దుండెను. దానిక్లుప్తరూపమే యిప్పటి పూరీ. అట గంగవంశఁపునృపతి ప్రతాపరుద్రదేవుఁడు పాలించుచుండెనఁట. ఆయన యాస్థానమున నైయాయిక శాస్త్రపండితుఁడుగా నుండిన సార్వభౌమభట్టు వీరి నాదరించె నఁట.

అటనుండి యనతికాలముననే యారుగురు శిష్యులు దక్షిణదేశమున కరిగిరని చెప్పంబడినది. వారు శ్రీరంగమునఁ జాతుర్మాస్యలం గడపిరనియు నుడిపియందు మాధవమఠము దర్శించిరనియు, తిరువాట్టూరులోని యాదికేశవస్వామి దేవళము నుండిబ్రహ్మసంహితయను చైత్యనవైష్ణవమతానుకూలగ్రంథమును, కృష్ణవేన్వనునుండి క్రిష్ణకర్ణామృతమనుగ్రంథమును సంపాదించిరనియు, కన్యాకుమారి, శ్రీరామసేతువుల దర్శించిరనియు, శ్రీక్రిష్ణదాసు కవిరాజుగోస్వామి యనునాయన తాను రచించిన చైతన్యచరితామృత మనుగ్రంథమున వివరించియున్నాఁడు. దక్షిణయాత్రలనుండి వారు శ్రీజగన్నాథమున కరుదెంచి యుత్తరదేశమునకు బృందావనమున కరిగిరఁట. పిదప ద్వాదశ (వ్రజమండల) వనపరిక్రమము నెఱపి ప్రయాగ మీఁదుగా కాశీక్షేత్రమున కరిగిరఁట. అటనుండి ప్రయాగ కేతెంచి దశాశ్వమేధఘట్టమున శ్రీరూప గోస్వామికి దీక్ష నిచ్చిరఁట. తిరుగఁ గాశీ కరిగి యట చంద్రశేఖరసనాతనగోస్వామికి దీక్ష నిచ్చి వైష్ణవధర్మరహస్యముల నెఱిఁగించిరఁట. ఈసనాతనశిక్ష చైతన్యచరితామృతమునఁ గొన్నియధ్యాయములుగ వివరింపంబడి యున్నది. వారటనుండి జగన్నాథమున కరిగిరని చెప్పంబడినది.

శ్రీకృష్ణచైతన్యదేవుఁడు సన్యసించినది యిరువదినాల్గవ సంవత్సరఁపు వయస్సునయు నారుసంవత్సరములకాలము యాత్రలంచుఁ గడపిరనియు, పిదపఁ బదునెన్మిదివత్సరములు శ్రీజగన్నాథమునందే యుండిరనియు నందుఁ గడపటి పండ్రెండు వత్సరములును పూరీయందుఁ గేవలధ్యానపరాయణచిత్తులై చైతన్యరహితవృత్తి నుండిరనియుఁ జెప్పంబడినది. ఇంక వీరిమత మంచిత్యభేదాభేద సిద్ధాంతముగ వివరింపంబడియున్నది. అవి ౧ శ్రీకృష్ణత్వ మచింత్యమనియు, నిది ప్రాణికి (ఆత్మకు) శ్రీకృష్ణునితోఁ (పరమాత్మతో) గల సంబంధమును వివరించుటయనియు, ౨ పరిణామమునందుఁ బ్రియత్నము శ్రీకృష్ణభక్తియనియు నిదియే సాధనమనియు, ౩ గమ్యస్థానముంజేరుట శ్రీకృష్ణప్రేమయనియు నదియె పరిణామమందుట (లేక ముక్తినందుట) యనియు, నింక నిదియె శ్రీకృష్ణప్రాణుల (ఆత్మపరమాత్మల) సంబంధము నెఱింగెడి జ్ఞానమనియు నైయున్నది.

ఈభేదాభేదముల ధర్మములు బద్ధప్రాణులకు గోచర మగుట దుస్తరము. వస్తుతః, ఆత్మపరమాత్మ (శ్రీకృష్ణప్రాణు)ల కభేదమును, కర్మతః బద్ధప్రాణులగుట భేదము నందురు. ఇట్లే లోకమును పరమేశ్వరపదార్థమేయగుట యభేదమును భ్రమాత్మకనామరూపభ్రాంతి వ్యవహారతః భేదముఁగల్గి యీచైతన్యవైష్ణవసిద్ధాంతము భేదాఽభేదసిద్ధాంతమని చెప్పంబడినది. ఇం దొక్కపరమాత్మయె యచింత్యమని చెప్పఁబడినది. పరమాత్మయగు శ్రీకృష్ణుని పవిత్రశరీర మాశ్రీకృష్ణనామముతో సంబంధముఁ గలది. అనగా నాపవిత్రశరీరమున కాపేరుతప్ప నితరనామములు వర్తించవనియు నాశ్రీకృష్ణనామమున కాపవిత్రశరీరము తప్ప యన్యశరీరములు పనికిరావనియు, గాననానామసంకీర్తనముకన్న బద్ధప్రాణుల కన్యసాధనమే లేదనియు, వీరిధర్మము.

చైతన్యమతపద్ధతిని తానభ్యసింపక నితరులకుఁ బోధింపరాదని విధి కలదు.

## నవద్వీపము (తొమ్మిదిద్వీపములు):

—ఇవి బంగాళాదేశమున గంగానది కిరుదెసలందు నున్నవి. చైతన్యమతస్థులకుఁ బ్రధానయాత్రాస్థలము. నదికిఁ దూర్పువైపున నాసదియందే ౧ అన్తర్ద్వీపము, ౨ సిమంద్వీపము, ౩ గోద్రుమద్వీపము, ౪ మధ్యద్వీపము, ౫ కోలాద్వీపము, ౬ రితుద్వీపము, ౭ జహ్నుద్వీపము, ౮ మోదద్వీపము, ౯ రుద్రద్వీపము (అన్నియు) నవద్వీపమను పేరఁ బరగుచున్నవి.

అంతర్ద్వీపమునందే ప్రధానక్షేత్రమగు మాయాపూర్ కలదు. దానినే "నవద్వీపధామము" మనియెదరు. నవద్వీపఘాట్ స్టేషనునుండి పడవలపైఁ బోవలయును. మాయాపూర్ శ్రీచైతన్యదేవుని జన్మస్థానము. చైతన్యదేవుని శ్రీకృష్ణభగవానుండనియే యామతస్థు లనియెదరు. ఈద్వీపము లన్నియు ౩౨ చతురఁపుమైళ్ళుఁట. (నవద్వీపధామముఁ జూడుఁడు.) ఈనవద్వీపప్రఖ్యాతి చైతన్యదేవుని (గౌరాంగుని) జన్మస్థల మగుటచేతనే కల్గినది. ఇట వ్యాపించియున్నమతము శ్రీకృష్ణచైతన్యమతమే. దీనిని సర్వసాధారణముగ వంగదేశఁపుబంగాళీలు 'నద్దియా' యని వాడుటయుఁ గలదు. నవద్వీప మాదిని సంస్కృతశాస్త్రపాండిత్యములకుఁ బేరందినతావు. ఇచట నాది నొకశాస్త్రవిశ్వవిద్యాలయ ముండెడిది.

**నాటకప్రదర్శనకల:**—ప్రపంచమునందుఁ గల కళలలో నాటకప్రదర్శనకళ యొకటిగఁ జెప్పఁబడుచున్నను నది యంతమాత్ర మనుటకన్న కలాతీత మనుట సమంజసముగ నుండును. ఏలయన నిందు నాట్యాభినయాదులగు భావప్రకటనములే గాక, గానము, కథాసందర్భమై దుష్యము, సర్వాంగసుందరరచనానైపుణ్యత, ప్రదర్శనచతురత మొదలగున వనేకములు యుక్తములై యిమిడి యున్నవి. గానఁ గొన్నికళలసాముదాయకకల యని చెప్పినను నతిశయోక్తి కానేరదు. ఆఙ్గ్లనాటకకలం గూర్చి పరిశీలకులందుఁ "Painting, music, literature, architecture" కూడఁదనయందుఁగల్గినకళయని పొగడియున్నారు. ఇం దెంతయున్నను నొకసుప్రసిద్ధపరిశీలకుఁ డగు పండితుఁడు "It is in itself the only art that has life" అని నాటకకలం గూర్చి ప్రశంసించియుంట యెల్ల తెటేంగినదే. ఇది సినీమాలంబోలినది కాదని యెఱుంగవలసి యుండెడిని.

జగమే నాటకరంగ మనియు, నడుచుచుండు జగత్కార్యములే ప్రదర్శనము లనియు, నీసందర్భమున వచించుట యసమంజసము కానేరదు. అం దెన్నో నీతులు, రుచులు, శౌర్య గాంభీర్య ధైర్యాదిప్రదర్శనములు మొదలగువాటి నేరికూర్చి రచించిననాటకములం బ్రదర్శించుట. విద్యగఱుపుటవంటిదిగూడ నైన నగుంగాక. ఒకఛాయాపటమువలె నది స్థిరమగునది కాకున్నను, నది నడిచినకొంచెమునేపును పెక్కండ్రకు వినోదము, కొందఱకు విద్యగఱుపుట, కొందఱకు నీతినిబోధించుట, కొందఱకు ధైర్యశౌర్యసాహసాదిగుణాతిశయముల బోధించి మనసునం దించుక మార్పు గల్గించుట మొదలగుకార్యము లొనర్పఁ గల్గెడిని. నిజముగ నది నిజమైనను, గాకున్నను జూచువారల మనంబులం దూహలను (imagination) ప్రసరింపఁజేసి, పలుతావులకుఁ ద్రిప్పి చూపించునటుల నయ్యెడిని. తాము విద్యాధికులమని విఱ్ఱవీఁగు సంస్కారప్రియులు, నాటకకలయందు గానము నిరర్థకమనువారును, అభినయము నిరర్థకమనువారును, నృత్యాదులు సంబంధరహితము లనువారును, నిటీవల బయలుదేఱి యుపన్యాసము లిచ్చుచున్నను, చూచువారు వ్యామోహితులై తమశక్తి మించురీతిని ప్రదర్శనదర్శనాభిలాషులై యరుగుటఁ జూడ, నిజస్థితి నిర్ధారణచేయనోపెడిని. నాటకప్రదర్శనకల భూత వర్తమాన భవిష్యత్తుల నలముకొనియే యుంటఁ గాన నయ్యెడిని.

**నాధారాధనమతము** (not worship religion) **బర్మాలోని కాచిన్ జాతుల ప్రజలు:**—నాధశబ్దమున కిట పితరులని భావము. చనిపోయినప్రాణుల కర్థము. దీనిని 'Spirit worship' అనియు 'Animism' అనిగూడ నందురు. దీనినుండి పర్వతములు, నదులు, చెట్లు మొదలగువానియందలి యధిదేవతలనిగూడ నర్థమగుచున్నది. ఈమతగ్రంథము లెవ్వియు లేనందున నామతస్థుల యాచరణలనుండియే మతమును గూర్చి గ్రహింపవలసియుండునుగాన, నామతస్థులగు కాచినుజాతుల ప్రజలంగూర్చికూడఁ గొంత వివరింపవలసియుండెడిని. కాచిను లిక్కాలమున బర్మాదేశఁపుటుత్తరభాగములఁ గాననగుచున్నారు. బర్మాదేశమునందలి భామో, లాషియోలమధ్యగ నొకహద్దును భావించితిమేని, దానికిఁ దూర్పునను, నుత్తరమునను, కొండలందుఁ జీనాసరిహద్దును మీఱి, యవ్వలఁగూడ వీరు వసించుచున్నారు. ఉత్తర దక్షిణ షాన్‌స్టేటులందు వీరు కానఁబడుచున్నారు. అప్పటి బర్మా, షాన్‌స్టేట్సు, చీనాసరిహద్దుదాటిన కొండలప్రదేశములవా రందరు

కాచిను లని బర్మావారు వాడుట కర్థము లేదు. నిజమున కాచినులనుపేరుగలజాతియే లేదు. చీనా వారిపేరు 'యా యిన్' అను చీనాభాషాపద సంబంధ మనియెదరు గాని, బర్మాభాషయందు, 'కాచిన్' శబ్దమునకుఁ బులుపు, చేఁదు యని యర్థ మగుచున్నది. బర్మనులు కాచినులని పిలచు వా రందరు కొండ అడవిజాతులవారే. ఇందు, చింగ్పా (లేక జింగ్పా) జాతి, యాయిన్‌జాతి, మారూస్‌జాతి మొదలగు కొన్నిజాతులు కలవు. అనఁగా బర్మావా రటుల వారి ననాదరణతో 'కాచిను' లని వాడుదురే గాని, పైనఁ జెప్పఁబడిన జాతులవారి కటులఁ బిలువఁబడుట హితవు గాకున్నది. చేయునదిలేక (ఏమియుఁ జేయఁజాలక) వారూరుకొనుచున్నారు. గాని, వారి కిష్టములేదు. అట్టి జాతియే లేదు.

ఈ కాచినుజాతులంగూర్చి యింకను సుబోధక మగునటులఁ దెల్పవలెనని వేఱొకమార్గము కలదు. జపాన్, కొరియా, చీనా, టిబెట్టు, ఆసాము, మలయాదేశస్థులును, గుర్ఖాలు, డయాకుజాతివారు మొదలగువారిని, మంగోలు తెగవారనుట యెల్ల రెఱిఁగినదే. అందు జపాను, కొరియా దేశముల వారి నుత్తరఁపు మంగోలులనియు, చీనా, ఆసాము, టిబెట్టు దేశములవారిని, గుర్ఖాజాతివారిని, దక్షిణఁపుమంగోలు లనియు, మలయనులను, డయాకు జాతివారిని, ఇండోనేసియన్ మంగోలు లనియు, మూఁడువిధములుగ శాస్త్రవేత్తలు సౌకర్యార్థము విభజించియున్నారు. అందు దక్షిణమంగోలులు, మాన్‌ఖమేరుమంగోలులు, టిబెటో, బర్మీస్, మాంగోలులు, తాయిచైనీస్‌మంగోలు నని తిరుగ మూఁడుపభాగములుగ విభజింపఁబడియున్నారు. మఱియు నిందు టిబెటో బర్మీస్ నుపశాఖ బర్మా దేశమునకుఁజేరినవారై యున్నారు. వారు తిరుగ (బర్మాకుఁ జేరినపిదపనే) బర్మను లనియు, చిన్ను లనియు, లోలోలనియు, కాచిను లనియు, తిరుగ నాలు గుపశాఖలుగఁగూడ విభజింపఁబడి ఇందు, కాచినులు మనప్రధానాంశశాఖ. వీరు చేరినకాలములు తెలియరావు. కాని కాచినులు నలువది తరములనుండి యున్నామని వారనుచుందురు. వారే మూఁడు లేక నాల్గువందల సంవత్సరముల నాటినుండి బర్మాయం దున్నామనెదరు. అతః పూర్వఁపువారిచరిత్ర వారిపాటలం దిటులున్నది. అది నిజమైనను గాకున్నను దానిని వివరించుట యాంధ్రవిజ్ఞానమునకు ధర్మముగాన వివరించుచున్నాము. వా రొకనాథ (Spirit) సంతతి. దాని పేరు "షిప్పావన్ అయవంగ్". ఇది వారిపరదైవ మగు కరైకసాంగ్ నాద్ దయకుఁ బాత్రమగు పవిత్రితఁ గలది. దానిపౌత్రుఁడు వా నాద్, ఐదుగురుపుత్రులం గనెను. వారు ౧మరీప్, ౨ లటవ్, ౩ లపాయ్, ౪ నహ్కుమ్, ౫ మరాన్ అనుపేరుగలవారు. వీరిసంతతివారైదు చింగ్పా జాతుల తెగలవారు. ఇంకను గొన్ని మిశ్రజాతు లేర్పడినను వీరే ప్రధానజాతులవారు. వారియా దినివాసపవిత్రభూమి "మజోయి షింగ్రా భూమ్". దీని కున్నత సమతల ప్రదేశమని వారే యర్థముఁ జెప్పుదురు. కొందఱు పరిశీలకులు హూయాంగ్ హో, యాంగిసీకియాం గనునదుల జన్మస్థానము కడ నీభూప్రదేశ మున్న దనిరి. ఇంకఁ గొందరు పరిశీలకులు "ఐరావతీనది యగుటకు మాలీఖాస్, మాయీఖాస్ నదులు జన్మించినతావుకడ నున్న త్రికోణప్రదేశ" మని యూహించు చున్నారు.

ఇవి సర్వే చేయఁ బడినప్రదేశములు. ఈప్రదేశముల సంచార మొనర్చి, వీట్ల నెఱిఁగినవారగు Major C. M. Enriquez గారును, Major G. H. Green M. B. E. గారును ఈప్రదేశముంగూర్చి చాలదూరము పరిశీలించి, వ్రాఁబది

తరములకుఁ బూర్వమే పానునెదిరించి, కాచినుల నటనుండి రానీయక నిలిపినతావు త్రికోణాకారముఁ బ్రదేశమే యనియు నది యూనదులజన్మస్థానప్రాంతమే యైయుండు ననియు, నేకాభిప్రాయులైరి. గాన మఱియొకటి బయల్పడుదనుక దీనినే నిజమని విశ్వసింతుముగాక. వ్రా రడవిజాతులవారు. విద్యాగంధ మెఱుఁగరు. లిపి యిటీవలనే నేర్పబడినది గాని, పూర్వ మున్నటులఁ గానరాదు. పాఠశాలల కేగ నిచ్ఛగింతురు గాని, గ్రాహ్యశక్తి తక్కువ. మతావేశపరులు. మనపాదిరీదొరలు కొందరికిఁ గ్రైస్తవమతదీక్షఁ బ్రసాదింపఁ గల్గినను, వారు తమపద్ధతులు, మతాచారములు మానరు. మతమునందుఁ బట్టుదల వీడనివారుగ నున్నారు.

ఇంకఁ గాచినులమతముంగూర్చి వివరింతుము గాక. కరైకసాం గనునాయన పరమేశ్వరుఁడు. నాథుల కెల్ల యధినాథుఁడు. శరీరమందు దానికధినాథుఁడుగఁ బ్రాణము నాథుఁడై యుండును. ఇంతియేగాక నాథు (spirits) లనేకములు శరీరమునం దుండును. శరీరమును, దానినాథుఁడగు (spirit) ప్రాణమును వేర్వేరై యున్నవి. గాననే శరీరమునకు మృతిగలదు గాని, ప్రాణికి మృతి యుండదు. శరీరమునం దధినాథుండగుప్రాణము గాని, దానియందేయుండు నితరనాథులు గాని, శరీరము నిద్రయందు విడిచి వెడలిపోయినను పోఁగలుగును గాన, కాచినులు నిద్రయందున్న వారిని లేపుట మహాపరాధముగ నెంతురు. ఒకరి పాపపుణ్యముల ననుసరించి వార్ధక్యమునను, నైసర్గికముగను, ప్రశాంతముగను, అనాయాస మరణము సంభవించుటఁ బుణ్యమునుండియు, ఘోర మరణము, ఆవేదనపడి మరణించుట, బలాత్కార మరణము సంభవించుట పాపమునుండియు నని వారనెదరు.

వీరి యాదినివాసమగు మజోయి - షింగ్రా - బూమ్ న కుత్తరదిశను నమ్‌నమ్ - వమ్‌నమ్ - గా యనంబడుప్రదేశము కలదు. అది యేడుగ విభజనల నందియున్నది. అద్దానిని సప్తపితృస్థలు లని యెదరు. అవియె సప్తస్వర్గములు. వాటిలో నొక దానియందుఁ దనపూర్వులగు పితరులతోఁ గలసి వసించుటయే వారికి స్వర్గానుభవము. ఇది సన్మరణ మందిన పుణ్యాత్ములకుఁ గల్గునది. దుర్మణ మందినవారు లాసాగా మొదలగునరకముల వసింపవలయును. చచ్చి పుట్టిన (జన్మించిన) పిల్లలు, ప్రసవమగుటలో మరణించిన స్త్రీలు న్దాంగను నగరమున వసింపవలసియుండును. వారిసంతతి వారు వారికై త్రికరణశుద్ధిగ దుఃఖించి, పందులను, నెనుబోతులను బలి యర్పించిన నానరకము నుండి విముక్తిఁ గాంచెదరు. అత్తఱి నటనుండి 'జైబ్రుఛేట్' అనంబడు నిసుకమార్గమునుండి పితృసీమ కరుగును. ఇందు నడచుటఁ గష్టమనియు నందురు. పితృసీమ (వారిస్వస్థలమగు మజోయి - షింగ్రాభూమ్ కుత్తరముగ నుండునని) యిదివఱకే చెప్పఁబడినది. పిచ్చివాండ్రు బహుపాపాత్ములు. వారితలపై నన్నుఁపుకుండ నుంచి, తిన్నగా మానాగా యనంబడునరకమున కనుపఁబడుదురు. అది వారి స్థిరనివాసము.

కాచినుల యపరకర్మ (అంత్యేష్టి) కడుముఖ్యమందురు. జరిగిన స్థితిగతులు, కలిగినశకునలక్షణములు ననుసరించి, అంత్యేష్టి తోడనే జరిగినను జరుగును. లేకున్న నెలలకొలఁది నాలస్యమైన నగును. వీరియందుఁ బౌరోహిత్యునకుఁ 'దుమ్సా' యనెదరు. ఆయన చనిపోయినవారి చెవియందలినుండి పోవలసినమార్గము వివరించును. ఈ దేశకాల పాత్రవివరణము, మార్గము నన్యులకే గాక, వారికింగూడ నర్థము కాదఁట. ఇందు వారు

చెప్పకున్నను పర్వతారణ్య నదీ ప్రదేశములు వివరింపఁబడుట తెలిసెడిని. కాని వారు దాని నన్యులకుఁ జెప్పక గూఢముగ నుంచెదరు. చనిపోయిన వానినోట ద్రవ్యమును మార్గవ్యయముల కని యుంచెదరు. వీరినృత్యములు చూడనగుంగాని దానింగూర్చి బయల్పఱుపక గూఢముగ నుంచెదరు. వాటికి మానోనాట్యము లనిపేరు. 'తోన్ని, హ్యూనిత్, మీాన్' అను (స్పిరిట్) నాథులు ముప్పదియేండ్రురు కలరు. వారిని పల్లీకుబాటల ప్రక్కలందు రాతిగూడులు, చిన్నచిన్నకట్టగుడులం దిడి పూవులు మొదలగువాని నర్పించి పూజింతురు. వా రొకప్పుడు నుద్దండులగువారు. వారిలోఁ గొందరికిఁ గొందరిష్టులగు నాథులు కలరు. వారు వారిని దప్పక పూజింతురఁట. ఈముప్పదియేడ్గురునాథు లతిత్వరితముగఁ గోపగించుటకుఁ గాని, శిక్షించుటకుఁ గాని, దయఁగల్గి రక్షించుటకుఁగాని, సర్వదా సంసిద్ధులై యుందురు గాన, వారి నేమఱి యుండ రాదందురు. కాచిను లడవులనుండి కొండలపై నుండి దిగివచ్చి దోచుకొందురు గాన వారి కాపేరు బర్మను లిడిరఁట. మతము పట్టుదల కలవారుగానఁ గొంతమంది క్రైస్తవులై నను దేవుని జొహోవా యనక కర్రైకసాం గనియే యందురు.

**నానకుజగద్దేశికుఁడు:–** (గ్రంథసాహెబు చూడుఁడు—సిక్కుమతము చూడుఁడు.)

**నియోన్ లేంపు** (Neon Lamp):—
ఈదీపముల నిక్కాలమునఁ బ్రపంచమంతటను పెక్కుదేశములందుఁ బ్రకటన (advertisement) పనులకుఁ గాను వాడుచునేయున్నారు. ఇవి ప్రకాశించు గాజుగొట్టములవలె నుండెడిని. దీనింగూర్చి "Possesses the property of being as sensitive to electrical impulses as the photo electric cell, or electric eye (as it is named) is to variations of light" అని చెప్పఁబడినది.

ఏరియల్‌నుండి ఎలక్ట్రికల్ impulses ఈదీపములోనికిఁ జేరుతతి నా electrical impulses యొక్క బలాబలములమేర కధిక లేక న్యూనవంతమగు ప్రకాశముతో వెల్గిచ్చుచు దాని నుండి నడపి యవ్వలికిఁ జేర్చును. (టెలివిషన్ చూడుఁడు.)

**న్యూజీలాండుద్వీపములు:—**
{ ఆంధ్రవిజ్ఞానము నాలుగవసంపుటము నందు 1711 పుటయందున్న 'న్యూజీలాండుద్వీపములు' అనువ్యాసఁపుఁ దరువాయి. }

న్యూజీలాండుద్వీపముల నైసర్గికసౌందర్యముల ననుభవించుచుండుటకు హవాయి దేశస్థులు, శ్యామోాదేశస్థులు, ఫిజీదేశస్థులు తఱుచుగ నరుదెంచుచుందురు. ఇచటికి దక్షిణధ్రువప్రదేశము నుండి శీతలవాయువులు వీచు చుందురు. భూగోళశాస్త్రధర్మముమేరకు న్యూజీలాండుద్వీపములు కడుపురాతననాగరికతఁగల యానవాళ్ళను బ్రదర్శించుచున్నను, చారిత్రకముగ నిటీవల ౧౦౦ సం॥ రములనుండియే దీనిపేరు బయటకు వచ్చినది. ఇక్కాలమునఁ బ్రశస్తమైన గుఱ్ఱపుజాతి నిటం బెంచుచున్నారు. ప్రపంచమంతటితోను గొప్ప వర్తక మిటనుండి జరుగుచున్నది. ఇచటిసరకులను విదేశఁపువర్తకులు Quality products అని శ్లాఘించెదరు. న్యూజీలాండు దేశస్థులు సముద్రఁపురేవులయేర్పాట్లు, యంత్రములు చాలచక్కనివి వాడుచున్నారు. గొప్పగొప్ప భవనములను

నిర్మించి యున్నారు. ఎలక్ట్రిసిటీతో నగరులను, మనుష్యులను ప్రయాణములం జేయింపవలసిన సాధనసంపత్తిని నధికముగఁ గల్గియున్నారు. ఇనుప బాటలు, మోటారుబాటలేగాక యీద్వీపములం దాకాశగమనపుఁ టేర్పాటులు చక్కగా నున్నవి. న్యూజీలాండుపందెంపుగుఱ్ఱములు ప్రపంచమునం దనేకచోట్ల మంచిపందెంపుగుఱ్ఱములని పేరందినవి. ఈద్వీపములను Play-ground of the Pacific అనియు, Newzealand the wonder land' అనియు దీని యద్భుతసౌందర్యములం గాంచి యచ్చెఱువందిన మహనీయులు వ్రాసియున్నారు.

న్యూజీలాండుపదము Newzealand సీలాండు Sealand పదమునుండి యేర్పడినది. ఇందుఁ బెద్దపట్టణము (Auckland) ఆక్లాండు. ఈ నగర మీద్వీపములందు గొప్పనగరము. ఇందు రెండులక్షల యేబదివేలజనులు వసించుచున్నారు. ఇం దన్ని స్కై స్క్రేపర్సు (Skyscraper) కట్టడములు లేకున్నను పోలిక, అమెరికాదేశపు Sanfrancisco (సాన్‌ఫ్రాన్సిస్కో) నగరమును బోలియుండుటయు, చుట్టు కొండలుంట నా Golden Gate City యొక్క పోలికఁ గల్గి యుండును. ఇది యొకప్పుడు రాజధానీగౌరవ మనుభవించినపురము.

ఈద్వీపమునఁ జూడఁదగినతావులు కొన్నిగలవు. ఉత్తరద్వీపమునందు (Rotorwa) రోటోరువా యనుసరస్సును, ఆతీరముననే యాపేరుగలపట్టణమును గలవు. ఆపరిసరము లన్నియు, తేర్మాల్ ఏక్టివిటీ (Thermal Activity) మయము లై యుండి, చూడఁదగినవిగా నున్నవి. ఈతా వుత్తరద్వీపమునందలి, ఆక్లాండు, విల్లింగ్టన్‌పురముల కనతి దూరమున నున్నది. రోటోరువా పురపరిసరముల, 'వాకరేవరేవా' యనుగ్రామమునఁ జక్కని పనితనముఁగల కఱ్ఱపై జెక్కఁబడిన వింతపనులు చూడ నగును. ఇది మవోరీప్రజలగ్రామము. ఇచటి కొన్ని యిండ్లకు గుమ్మములమెట్లకడనే జలబుద్బుదములు వేఁడినీళ్ళజలోద్ధృతచిత్రములు గాన నగును. నైసర్గికముగ మావోరీ లుత్సాహవంతులుగను, వినోదముల నభిలషించు మనస్సుగలవారుగను జెప్పఁబడుచున్నారు. క్రొత్తవాఁని జూచి, సంగీతముఁ బాడు వినోదాసక్తచిత్తులు. ఈసీమయంతయు 'థెర్మాల్‌రీజన్' అని పిలువఁబడుచున్నది. సూర్యరశ్మియందు సూర్యబింబమున కెదురుగా నెగిరి పడుచుండు నుద్ధృతజలములం దింద్రధనుస్సు యొక్క రంగు లగుపడుచుండుట వింతఁగల్గించుచుండెడిని. ఈమావోరీల పూర్వచరిత్రగాథలు వారిపాట (Folk Songs)లయందుఁ బెక్కులు కలవు. అచటికిఁ గతిపయదూరముననే 'ఓహినే ముతూ' అను మవోరీగ్రామమునను, గ్రామపరిసరమునను గలవేఁడినీళ్ళయూటలయావిరి, యెగిరి పడుచుండు జలోద్ధృతములవిన్నాణములు, నీటితో నెగిరిపడుచుండు ట్రౌట్ చేపల పైఁగూడఁ బ్రసరించు నింద్రధనుస్సుయొక్క రంగులవింతలు నిది గారడీలగ్రామ మేమో యనిపించెడిని. అచటి చేపలు మచ్చిక కలవాయైనవి. చూపరులు వీటి కాహారమును చేతితోఁ దినిపించెదరు. ఇచటిజలములును బహుస్వచ్ఛతం గల్గియుంట నీటియడుగునఁ గలసర్వమును స్పష్టముగఁ గనిపించుచుండుకతనఁ బెక్కండ్రు ఛాయాపటములంగూడఁ దీసియున్నారు.

'టికీటేరీ' అను వేఱొకసమీపగ్రామమున భూకంపములంబోలిన చిన్నచిన్న లఘుకంపములును, అగ్నిపర్వతముంబోలిన యొకచిన్నగుట్టయును జూడ జూడ విభ్రమముఁ గొల్పెడిని. ఇవి

నై సర్గికములయ్యు నిరపాయకరములని పే రంది యున్నవి. ఇచట భూతప్రేతపిశాచములవ్యాపక మధికమని తెలిసెడిని. ఈపరిసరములనే 'తారా వేరా' అను పేరుగల యగ్నిపర్వతశిఖరము కలదు. ఇటనుండి 'వై మంగూ' అనుపేరుగల గొప్పవృత్తా కారఁపుబాటను నిర్మించియున్నారు. దాని ప్రద క్షిణమునఁ బెక్కువింతదృశ్యము లిట్టివి గాన నగును. విద్యాధికు లాబాటయందుఁ బ్రయాణ మును 'Compleate' Education, ఇందు Thermal wonders of Newzealand' అని వాడెదరు. ఆపరిసరములనేగల 'వెయిరాకీ' హిమనిలయప్రదేశఁపులోవయు, 'ఔపో' సర స్సును, నత్యాశ్చర్యవిభ్రమములం బురికొల్పు సౌందర్యరాశిప్రదేశములై యున్నవి. కరాపిటీబ్లో హోల్ (Karapiti Blow–Hole) రంధ్ర మునుండి బలముగ నీటి యావిరి పైకి వచ్చుచుం డును. అం దొక కాళీకిరసనైల్‌డబ్బా నడుమ నెత్తియుంచినదానిని గ్రిందఁబడనీయక పట్టి యావు నంతటబలమైనదిగ నానీటియావిరి యుండును. దీని యెత్తు 50 మొదలుకొని 70 యడుగులవఱకు నుండెడిని. దీనికాంగ్లేయులు 'Exhaust Valve of Newzealand' అనిపేరిడిరి. 'ఔపో' సర స్సీ రమున 'వై రాకీ' యనుగ్రామము కలదు. ఇటనే 'వై కాటో' నదీజన్మస్థాన మున్నది. ఇచటికిం గొన్నిమైళ్ళదూరమున మత్స్యపరిగ్రహణస్థానములు (Fishery) కడుంగడు ప్రసిద్ధము. ఇచటనే 'హూకా' జలపాతము గలదు. ఇచట నొక Thermal Spring సుప్రసిద్ధమైనది కలదు. ఈ యుత్తరద్వీపముననే 'వెయిటోమో' గుహాలు చూడఁదగినవి. అం దొకటి మెఱుఁగుడుపురుగుల గుహా తప్పకఁ జూడఁదగినది. ఈ ద్వీపఁపుఁ బశ్చిమ తీరమునను, ఉత్తరభాగమునను ౨౦ మైళ్ళపొడవు గల మోటారుపందెఁపుబాట గలదు.

ఇంక దక్షిణద్వీపమున ప్రపములం దెత్తైన పర్వతములును, దానియందుఁ బండ్రెండు వేలయడు గులయెత్తుగల Cook పర్వతశిఖరమును, దానికిఁ దిగువగనే హూకర్‌లోవయు దర్శనీయములగు తావులు. ఈపర్వతములందే Franz Josef Glacier ఒకటియు, ఎత్తునుండి క్రిందికి 600 అడు గులయెత్తుదనుక నేటవాలుగ దిగుప్రదేశము చూడఁదగినది. ఈప్రాంతములంగల సముద్రఁపుఁ జెలకకు 'Milford Sound' అనియు, Worlds Wonder Walk' అనియుఁ బేరందినసౌందర్య స్థలములు కలవు. ఈ సీమయందే Sutherland falls (జలపాతము) ప్రపంచ మంతటిలో నెత్తైన దని పేరందినది కలదు. దీనిజలములపాతము 1900 అడుగులని చెప్పఁబడినది. ఇంక నీద్వీపములందు Champagne Couldron జూడఁదగిన వింత లలో నొకటియని యందురు.

## నేయియందుండు విటమినులు:-

ఇక్కాలమున నేయియందు విటమిను లుండు టెల్ల రెఱింగినదే. మఱియు నది పాలయొక్క by probuct (అనగా పాలనుండి కల్గినపదార్థమగుట) పాలయందుండిన విటమినులలో నన్నిగాని, కొన్ని గాని, నేయియం దుండునని చెప్పకయే తెలిసె డిని. ఆపాలయందుండు విటమిను లాజంతువు యొక్క శరీరస్థితింబట్టియు, నదిమేయుచుండు మేఁతంబట్టియు నుండునని పరిశీలన లిదివఱకే బయల్పఱచియున్నవి.

S. ఘోస్ అనుపండితుఁడు నేయియం దవి కరగిపోవు విటమినులని తెల్పియున్నాఁడు. అనగా నేయిని తిరుగఁ గాచిన నందు విటమినులు గూడ కరఁగిపోవునని భావము. వీరు లండనువిశ్వవిద్యా లయమున Biochimical Laboratory యం దుఁజేసినపరిశీలనఫలితమఁట. అట్లగునేని యిది విట మినుల A. B. C. D. E. భేదజాతులుగ విభ

జింపఁబడకపూర్వముగాఁ జెప్పుదురు.

పిదప Bacharach పండితుఁడు, బొంబాయిలో నాల్గు వేర్వేరు ఆసుపత్రులనుండి పరిశీలన కంపఁబడిన నాల్గువేర్వేరునేతులం బరిశీలించెనఁట. ఆపరిశీలన కెమికల్ ఎగ్జామినేషనుగా జెప్పఁబడినది. మఱియు నవి Colorimetric పరీక్షలకు లోనై, అందురెండు నేతులు Colour reaction గుర్తులఁ జూపనే లేదఁట. మూఁడవనేయి ఊదా (Blue) లక్షణములం జూపి, నాల్గవది Standard Codliver oil జూపుదానిలో 1/500 భాగముతో సరిపోల్పఁ దగిన లక్షణములం గనపఱచెననియు, వెన్న చూపుదానిలో 1/10 దశాంశతో సరిపోల్పఁదగిన లక్షణములం గనపఱచెననియుం జెప్పఁబడినది. ఇందు A విటమిన్ తక్కువందురు.

## నేషనల్ కలెక్షన్ ఆఫ్ టైపుకల్చర్సు సంస్థ:-

ఇది జరమ్సుచేఁ బనిజేయించుచు నుపయోగముఁ బడయుచున్న వింతసంస్థ. ఇంగ్లాండు దేశమున హార్టు-ఫోర్డు-షైరు-నం దున్నది. దీని నింకను 'జెరమ్-ఎక్సుఛేంజి' (Germ Exchange) అనుటయుఁగూడఁ గలదు. ఇం. దిప్పుడు రెండు వేలకుఁబైగా నీజరమ్సు మైక్రోబ్సు, బేక్టేరియా, బేశిలై తెగలజాతులం బెంచి యభివృద్ధి నందించుచు, వాట్లంగూర్చిన వివిధపరిశీలనల నొనర్చుచు మానవాహారపదార్థరక్షణము త్వరితముగ గాయములను, పుండ్లను, వ్రణములను, కుఱుపులను మాన్పుచిత్రములు మొదలగుపనులం జేయుమార్గములం గ్రహించుచున్నారు. ఇందు గాజుగొట్టములు, సీసాలు మొదలగువాటియం దసంఖ్యాకములో యనునట్లు కోట్లతరఁబడిగా నీజాతు లుంచఁబడి పెరుగుచున్నవి. మానవ జంతుజాల వృక్షముల రోగబాధలకుఁ గారణభూతములై యవి యిటులఁ బరిశీలనల నందుచున్నవి. ప్రపంచ మంతటినుండియు నివి జాతులవారీగాఁ గూర్పఁబడినవఁట.

ఇందుఁ గొన్నింటికి అగర్ (agar– the gelationous substance) భోజనపదార్థమఁట. గాజుగొట్టములం దాపదార్థముల పైననే యవి విశ్రాంతిం గొనుచు వసించుచుండునఁట. వాటిని వేర్వేరుకాలములందు వేర్వేరుగొట్టముల లోనికి మార్చుచుందు రఁట-Meningococcus లేక cerebro spinal meningitis జాతి జరమ్సు మూఁడేసివారముల కొక్కొకటి క్రొత్త గాజుగొట్టములోనికి మార్పంబడుచుండవలయునఁట. అందుఁ గొన్నిజాతులు రొట్టెలు, జున్ను, పెరుఁగు మొదలగువాటియం దగుపడుచుండునటువంటి జాతులు నిరపాయకరములని చెప్పఁబడినది.

## నైలన్ [దారపు] పోగులబట్ట:-

ఇది రాక్షసబొగ్గునుండి తీయఁబడిన దారములబట్ట. దీనితోఁ గాలిమేజోళ్లు చేయఁబడుచున్నవి. అవి పట్టుమేజోళ్ళవలెనే యుండును. ఇది యమెరికా సంయుక్తరాష్ట్రముయొక్క రసాయనశాస్త్రపరిశోధనాఫలితముగ నిటీవల బయలుదేఱిన చిత్రము.

ఆదేశమున నొక కెమికల్ - కార్పోరేషన్ (Chemical corporation) సంఘము తమ వ్యయమునఁ బరిశోధనల నొనర్చుటకు Dr. W. M. Carothers పండితుని పరిశోధకునిగా నియమించియుండెను. అదివఱ కీవిద్వాంసుఁ డాదేశముననే హార్వర్డువిశ్వవిద్యాలయమున రసాయనశాస్త్రవేత్తగనుండి పట్టుపనుఁ బదు లట్టిబట్టనే యితర పదార్థములతోఁ జేయు రహస్యములంగూర్చి పరిశోధన లొనర్ప నియమితుఁడై, పరిశీలించుచుండువాఁడఁట. క్రీ. శ. ౧౯౨౮ నుండి కార్పోరేషన్ వారీపనిని పండ్రెండుగురు పండితులగురసాయన

శాస్త్రవిదులను సహాయులుగ నుంచుకొని, పరిశీలనలను దొమ్మిదిసంవత్సరములు శ్రమపడి సల్పి, మొలక్యూల్ (molecules) లం గలుపఁ గన్గొనెననియు, రాక్షసబొగ్గు (coal), నైట్రోజెన్ (nitrogen), వాయువు (air) తారు (Tar), ఎమ్మోనియా (ammonia) లం గల్పి దారములుగ నొనర్పఁ గన్గొనెననియుఁ జెప్పఁబడినది. ఆదారము పట్టుదారమునుబోలి యుండునఁట. ఆయనపరిశోధనలు ౧౯౩౭ సంవత్సరమున ముగించినతోడనే నేషనల్ అకాడెమీ ఆఫ్ సయన్సు నం దెల్లఱచే గౌరవింపఁబడెను. పిదప నొకమాసముదినములు గడచుకతన దానిని పేటెంటు (patent) పూర్తియైనపిదప నొకదినమున ఫిలడల్ఫియానగరమునం దొకహోటెలునఁ బరుండుగదియం దొకగళాసున లెమన్‌స్క్వాష్‌నందుఁ గలుపఁబడిన విషముం ద్రావి చనిపోయి యుండఁ గన్గొనఁబడె నఁట.

పిదప నాకెమికల్ కార్పొరేషన్ వారా పరిశీలకునిస్మృతికి వగచుచు, నాపరిశీలనఫలితములకు యంత్రకర్మాగారమును నిర్మించి, పని నడుపఁదలంచుచు, నారంతస్తులుగల యొక స్కైస్క్రాపరుభవనముం గొని యందు యంత్రముల నమర్చించి, కర్మాగారముగ నిర్మింపఁజేసిరి. దీనిని 'Delavere' అనుతావున నిర్మించిరి. దీనికి రెండు మిలియను లాయె నందురు. దీనిని నడుప దీనిపై నధికార్లుగ నుద్యోగులను నియమించిరి. రాక్షస బొగ్గు తొలుత ద్రావకముగఁ జేయఁబడి (గరఁగింపఁబడి), పైయారవయంతస్తునకు గొట్టముల నుండి పంపుచేయఁబడి యటఁ దొలుదొలుతఁ జిక్కఁగ బురదగను, పిదప ముద్దగను, పిదప బిళ్ళలుగను జేయఁబడి, నీటిచేఁ జల్లార్పఁబడి చీనాపింగాణీవలె గట్టిపడినపిదప ముక్కలుగఁ గొట్టఁబడి, తిరుగఁ గరఁగింపఁబడి, మిక్కిలి సన్నఁపు రంధ్రములుఁగల రేకుపైఁ బోయఁబడుచుఁ గ్రిందికి దారములువలె సన్నముగఁ గాఱి గాలికి గట్టిపడి చుట్టఁబడినదారము లగునఁట. వాటికి 'గోస్సామెర్' (Gossamer threads) దారములని పేరు.

ఇటీవల జరిగినపరిశోధన లీగోస్సామెర్ దారములకు రంగులుగూడ వేయ వీలుఁగలిగించినవి. వాటితోనల్లిన మేజోళ్ళు భేదములేక పట్టుమేజోళ్ళవలెనే యన్నిపరీక్షలందాఁగి నిలచియుండెడివి.

ఈనైలన్ మేజోళ్ళు నీటనుంచి తడిపి పొడితువాలున నొత్తినతోడనే తడిపోయి, పొడిమేజోళ్ళయి యుండును. అనఁగా నాదారములకుఁ దడి పట్టదని భావము. గాని, వీటిని గాళ్ళకుఁ దొడిగికొనిన కొంచెముసేపటిదనుక శీతలముగనుంట కాళ్ళకుఁ దెలియుచుండును. గాని, యతిత్వరితముగనే వెచ్చనై తెలియనయ్యెడివి. తొడుగుకొనిన తోడనే క్రిందికి జాఱిపోవుచున్నటుల దోఁచుచుండెడివి. ఇది నిజమున జాఱిపోవుటగాదు. అదియుఁ గొంచెముసేపు తోఁచి మానును. బలమున పట్టు మేజో (Silk Stockings) ళ్లెంత బరువును మోయఁజాలకఁ జిరుగునో ఈ నైలన్ మేజోళ్లు నంతకు రెట్టింపుభారమునకుఁగాని చిరుగవని పరీక్షించి కన్గొనియున్నారు. ఇంతియెగాదు. పట్టు మేజోళ్లు ౧౭౫౦ Machine strokes నకును, నూలుమేజోళ్లు ౨౮౭౬ మిషిన్‌స్ట్రోక్సునకును, చిరుగుచుండ, నైలన్‌మేజోళ్లు ౧౯౭౬౦ స్ట్రోక్సునకుఁ జిరుగక గట్టిగానిలచునని పరీక్షలనుండి తేలినది. ఇప్పు డీనైలన్మేజోళ్ళు పట్టుమేజోళ్ళవలెనే ధరఁగల్గియున్నవి. అమెరికాయందు స్త్రీలలో నూటికిఁ బదిమంది వీటిని వాడుచున్నారని తెలిసెడివి. ఇక్కడికి నైలన్‌మేజోళ్ళయుత్పత్తి సరిపోవుచున్నదఁట. కాని వెనుక నొకప్పుడు నాల్గుమిలియనుల మేజోళ్ళజత లొకేదినముం దాదేశమున

నమ్మఁబడినవని చెప్పుదురు. అది సరకు నిలువ యైనతఱిం గానోపు. ఇవి గత క్రీ. శ. ౧౯౪౦ మే నెలనుండి యమెరికాయం దమ్మఁబడుచున్న వఁట.

నొప్పి (బాధ) (Pain):— వైద్యశాస్త్రమున "When any portion of the body becomes faulty weare warned of the danger or fault inside by certain uncomfortable sensation which we call pain" అని నొప్పి వివరింపఁబడినది. ఆంగ్లవైద్యశాస్త్రవేత్తలు నొప్పి యసౌఖ్యమాత్రమేగాక, శరీరమునం దట్టిభాగమం దేర్పడినతప్పుం దెల్పుచు, మిగిలిపోక ముందుజాగ్రతఁ బడుటకు మేల్కొలుపఁజేయుఁగాన నిజమున నుపకారియే యందురు. కొందఱు పరిశీలకులు నొప్పికలుగుట Nature's healing న కిది మార్గదర్శకమని కూడ ననియున్నారు. ఏది యైనను రోగికి నొప్పి బాధకరమై యుండెడిని. దీనికిఁ గారణ మొకానొక 'abnormal state inside' అని యనిపింపక పోదు.

పదమూఁడవ సంఖ్య:— కైస్తవులందుఁ బదమూఁడవసంఖ్య కడుదురదృష్టకరమని తలంపఁబడుచున్నది. క్రీస్తుప్రభువు తనపన్నిద్ద రనుచర శిష్యులతోఁ దనజీవనపుఁ గడపటిరాత్రి కలసి భుజించుటయే కారణ మందురు. వారియందుఁ బదముగ్గురు కలసి నేటికిని భుజింప నొల్లరఁట. ఫ్రెంచిదేశమున నటులసంభవించుతఱిఁ బదునాల్గవవానిని (Quartorziennes) బిలచి కల్పుకొని భుజించెదరు. ఇంకను దురుష్కదేశము (Turkey) న నాసంఖ్యను నుడువుటకుఁగూడ నిచ్చగింపరు. ఇటలీదేశమున లాటరీలయం దాసంఖ్యను రానీయరు. మహమ్మదీయుల సహవాసమునఁ గాబోలు తీన్, తేరా, నౌ, అఠారా, నైహై (3-౧3-౯-౧౮ సంఖ్యలు తగవు.) అని యుత్తర దేశములం దొక ఉక్తిగా వాడెదరు.

## పహర్పూరుకడ బయల్పడిన పట్టణము:—

కలకత్తానగరమునుండి, ఈస్టుబెంగాల్ స్టేటు రెయిల్వేపై శిలిగురికిం బోవుమార్గమున, జమాల్గంజి (రెయిల్వే) స్టేషనుకడ బండిదిగి, యటకు మూఁడుమైళ్ళదూరమునఁ గల పహార్పూరనుగ్రామముకడ నున్న దిబ్బల నిటీవలఁ ద్రవ్వించి ఆర్కియాలోజికల్ డిపార్టుమెంటువారు పాతఁబడి పోయిన యొకపట్టణమును బయలుదేఱ దీయుచున్నారు. అం దొక గొప్పదేవళము బయల్పడిన వాటిలో ముఖ్యమైనది. అది కడుపురాతనకాలఁ పునిర్మాణమఁట. ఇది కలకత్తానుండి ౧౯౨ మైళ్ళ దూరము. ఆపట్టణముపేరు తెలియదు. దేవస్థాన మార్షమత, బౌద్ధ, జైన లక్షణములతో నున్నది. జావా (యవ) ద్వీపమునఁ గాననగుదేవాలయముల పోల్కిగా నున్న దేవళము. బర్మాలోఁగూడ నిట్టిదేవాలయములు కలవఁట. అచటి శిలాశాసనములందు మోహేంద్రపాల్ భూపతినామ మగుపడుచున్నది. ఆయనసంగతి సరిగాఁ దెలియకున్నది. జమాల్‌గంజియందు మకాంబంగళా గలదు.

## పాపనాశనముడామ్-జలపాతము:-

పాపనాశనము స్నానతీర్థమై యున్నది. తామ్రపర్ణి నదీతీరము. ఇది చెన్నపురిరాజధానియందుఁ దిరునల్వేలిజిల్లాలో నున్నది. ఇది యరవదేశపు దక్షిణఁపుఁగొన. తామ్రపర్ణి నది యిచట పడమట కనుమలపాదమున నున్న గుట్టలలో నెత్తగుతావున జన్మించి, జలపాతములుగఁ గ్రిందికిఁ బడుచు, పాపనాశనమునీక్షేత్రముకడకుఁ జేరును. జలపాతము 330 అడుగులయెత్తని శాస్త్రవేత్తలు లెక్కించియున్నారు. పాపనాశనమునకించుక యెగువను 176

అడుగులయెత్తగుడాము (అడ్డుగోడ) ను నిర్మించి, జలములను నిల్పిన నదియే రిజర్వ్వాయర్(జలనియమము) గా నేర్పడినది. ఇందు 5500, మిలియనుల ఘనఁ పుటడుగులనీరునిలుచునని యేర్పఱచిరి. దానినుండి నీ రీవలకు వదలుటకు రెండుగొట్టముల నేర్పఱి చిరి. అం దొక్కటి యెనిమిదిన్నరయడుగుల వైశాల్యము గలది. వాట్లయందే Valves to controll flowing water యంత్రము లమ ర్పఁబడినవి. పాపనాశనము జలపాతముకడనే యొక diversion Weir నిర్మింపఁబది. (నది యందు) చిన్న storage నిర్మింపఁబడినది. ఇది 28 మిలియన్ల ఘనఁపుటడుగులప్రమాణము గల దఁట. అనుదినము దానినుండి యుదకములను Daily regulation నిమిత్తముఁ గై కొనుచుం దురు. తొమ్మిదియంగుళముల మందముగల యుక్కు-గొట్టములు రెండు, ఒక్కొకటి 3500 అడుగులుపొడవు గలవి వీటినుండి Head works నకుఁ గలుపఁబడి పనిచేయుచుండును. Head works తయారైన పిదప 330అడుగులుండునఁట. 66 అంగుళముల Penstock pipes గొట్టము లఱువదియా అందులోనికిం జేరియుండు నఁట. వీనిం గూర్చి "four ganarating Sets coupled to turbines of 9850 horse power or to be instated and a peak power of 28000 kilowatts is excepted to be generated when the scheme is in full oparation" అని చెప్పబడియున్నది. వీట్ల నన్ని టిని గుదిఁగూర్చి కలిపి, pykara కుఁ జేర్చుదు రఁట. అది మధురాపట్టణమున నుండునఁట. ఈ scheme వలన తూత్తుకుడి, కోయల్పట్టు,మధుర, తేనె కాసీ, రాజపాలాయముల కుపయోగించునఁట. ఈసందర్భమున కూర్తాలంజలపాతమును ఆత్మిక గాఁగల చిత్రానది, (River Chittra) తామ్ర పర్ణిలో సంగమించుట మనసునం దుంచుకొనవల యును. ఇది జీవనది యని చెప్పఁబడినది. కూర్తా లం దక్షిణదేశమున జలపాతస్నానతీర్థమయ్యె దేశ మంతట సుప్రసిద్ధమైన సమశీతోష్ణప్రదేశమని చెప్పఁబడుచున్నది. ఈస్థలము లన్నియుఁ దిరున లీమండలమునఁ దిరువాన్కూరురాజ్యఁపుసరిహద్దు కడ నున్నవి. (తామ్రపర్ణినదిఁ జూడుడు.)

**పిల్లిమీసములు:**—పిల్లికి మీసములు నిరర్థకము లని కొందఱకుఁ దోపనోపుఁగాని పరిశీ లనలనుండి యవి దానికి చాలా యుపయోగకర ములని తేలుచున్నవి. ఆమీసముల నది బిగియఁ బట్టి యడ్డముగ నుండునట్లు నిక్కించిన వాటి రెండుకొనలు పిల్లియొక్క కడుపువలమునకు సరి పోయెడిని. చీఁకటియం దది సంచరించుతఱి నేదేని యిరుకుప్రదేశమునుండి దూరవలసి వచ్చినతఱి వాట్ల నందుఁ దొలుత చొప్పించి బిగియఁబట్టి కొలచుకొని తా నందు దూరఁగలదో లేదో నిర్ణ యించుకొనుచుండును. ఇట్టి యుపయోగములు దాని కింకను వాట్లవలన నెన్నికలవో పరిశీలింపఁ దగును.

**పీటర్సు పెన్సు (Peter's pence):-** పన్ను:—పీటరుదేశికుని పెన్నీ లని యర్థము. ఇది క్రైస్తవమత మైరోపాఖండము నలుముకొని వ్యాపించిన కతన సింటుపీటర్సు డే (ఆగస్టునెల యొకటవతేది) ని దీని నైరోపాక్రైస్తవభూప తులు వసూలుచేసి రోమకపురి యందలి పోపు జగద్దేశికునకుఁ బంపుచుండిరి. రానురా నీవ న్నాదే శములందలి ప్రతిక్రైస్తవకుటుంబము చెల్లించు పన్నుగా నయ్యెను. తర్వాత నిది ముప్పదిపెన్నీల రాబడిఁ దెచ్చు జీవజంతువులుగల క్రైస్తవకుటుం బములకు విధి యని సంస్కరింపఁబడియెను.

ఆదిని సాక్సనులకాలమునాటినుండియు నుండె నట్లు గాననయ్యెడిని. క్రీ. శ. ౭౨౫ లో రోమక

పురియందలి యాంగ్ల పాఠశాల కుపయోగింపఁబడిన పన్నుగా నుండెనఁట. రిఫార్మేషన్ కాలమున నెన్మిదవహెన్రీభూపాలుఁడు దీనిని రద్దుపఱచె నందురు. ఐనను రోమన్కాథలిక్కు కుటుంబములనుండి భక్తిపూర్వకముగఁ బోపుగారికి సమర్పింపఁబడు ద్రవ్యముగాఁ దిరుగఁ దలయెత్తి నేఁటికిని నిలచి యున్నది.

**పుల్లాయవేమవరము:**— ఇది యొక ఉక్తి. సామెతగాఁగూడ వాడుచున్నారు. కార్యసానుకూలత నెఱుంగని వ్యర్థఁపుఁబ్రయత్నమునకు దీనిని వాడెదరు. తొల్లి యొకగ్రామమున నొక ధనికుఁడగు భూస్వామి వసించుచుండువాఁడఁట. అటకుఁ గతిపయదూరమున వేమవరమను వర్తకస్థల ముండెడి దఁట. గ్రామమందలి ధనికునికడ, పుల్లయ్య యను పేరుఁగల తెలివితక్కువవాఁ డొకఁడు సేవకుఁడుగ నుండువాఁడఁట. ఆనిరక్షరు నెల్లరు వెఱ్ఱిపుల్లయ్య యని హేళనగా వాడు చుండువారఁట. ఒకనాఁ డాభూస్వామి యొకమిత్రునితో నేదో కార్యాలోచన మొనర్చుచు రేపటి దిన ముదయముననే మనపుల్లయ్యను వేమవర మంపి, వారికి లేఖ నందించిన కార్యమనుకూలించునని, పుల్లయ్యవిని బిరబిర వేకువనే మేల్కాంచి లేచి వేమవరమున కరిగి నాల్గువీధులం దిరిగి తిరిగి వచ్చి, యిలు సేరి కూర్చుండియుండ, యజమానుఁడు 'వేమవరమున కరిగెదవా' యని లేఖ నీయఁబోవ "అయ్యారే, నే నంత మతి లేనివాఁడ ననుకుంటిరా? అప్పుడే పోయి తిరిగి వచ్చితి" నని గాంభీర్య మొలుక పచించెనఁట. నేఁటికిని కార్యావసర మెఱుంగని తెల్వితక్కువవా రొనర్చుపనులం గూర్చి యీ ఉక్తిని వాడెదరు.

**పుష్పగిరి:**—పుష్పగిరి యనినంతనే సుప్రసిద్ధాద్వైతమతపీఠములలో నొకటి యని జ్ఞాపకమునకు రాకమానదు. ఇది యొకపురాణప్రసిద్ధ క్షేత్రరాజము. ఈక్షేత్రము పినాకినీనదీతీరమునఁ బర్వతారణ్యపరివేష్టితమై మనోజ్ఞమై యున్నది. పినాకినీనది జీవనది. ఈనదీగర్భమున నేఁటికి నొక పర్వత మడ్డముగ నున్నది. ఈదృశ్యమునుగూర్చియు, ఈనదీమహాత్మ్యమునుగూర్చియు దీనిపేరును గూర్చియు, స్థానికములగు పెక్కు మహాద్భుత గాథలు తెలియవచ్చుచున్నవి. గరుత్మంతుఁడు తనతల్లికోరికం దీర్ప నమృతకలశమును గొంపోవుచు, మార్గమధ్యమున నింద్రునితోఁ బోరాడినప్పుడు కలశమునుండి తొలఁకిన యమృతబిందువు, కాశికి గంగలోఁ గలుపఁ గుమారునిచేఁ గొంపోఁబడుచున్న యొకమునీశ్వరుని యస్థికలపైఁబడి, యాశల్యములను పవిత్రమొనర్చి వానిని పుష్పములుగ నొనర్చెనఁట. ఆచెంగటనేయున్న పినాకినీనదిలో నొకముదుసలిరైతును నాతనిభార్యయు, తాన మాడి నవయౌవను లైరఁట. ఆరైతుయొక్క వృషభము లిందలిజలములు ద్రావి కడుబలిష్టము లైనవఁట. ఈయుదంతము నారదుఁడు బ్రహ్మకెఱిఁగింప, నాతఁడు విష్ణువుతోఁగూడి యిటకు వచ్చి యాంజనేయునిచే నొకపర్వతమును దెప్పించి, నదీమధ్యమున వేయించి, నదిలో నేర్పడిన యా యమృతసరోవరము మూయించి పాదములతో నదిమివేసిరఁట. విష్ణుమహేశ్వరులపాదము లాపర్వతముపై నున్నవి. ఆంజనేయాలయము దానిపై నున్నది. ఇదియే పుష్పగిరి యనుపేరఁ బరఁగుచు నదీమధ్యమం దమృతసరస్సుపై నున్నపర్వతము.

పుష్పగిరిలో శిథిలదేవాలయములు పెక్కులు కన్పట్టుచున్నవి. ఐదంతస్తుల గాలిగోపురముగల చెన్నకేశవదేవాలయమును, వృషభారూఢుఁడైన మహేశ్వరునిదేవాలయమును నేఁ డిందు సుప్రసిద్ధములై యున్నవి. శివాలయమున భిన్నమైన యొకశిలాశాసన మున్నది. ఆశాసనమున క్రీ. శ. 1582 సం॥రమున శ్రీకృష్ణదేవరాయలపిమ్మట

విజయనగరమును బాలించిన యచ్యుతదేవరాయ లిచ్చుటం గొన్ని దేవాలయములను బ్రతిష్ఠించిన ట్లున్నది. ఈదేవాలయశిల్పము విజయనగరాంధ్ర రాజులనాఁటి శిల్పమువంటిదై యున్నది.

పుష్పగిరి కడపతాలూకాలోఁ జెన్నూరునకు సమీపమున ప్రస్తుత మొక కుగ్రామమైయున్నది. జనాభా చాల స్వల్పము. ఇం దున్నమఠాధిపతుల భవనమున నొక కూపము (బావి) కలదు. దానిని 1725 శా. శ. ప్రథమమఠాధిపతి త్రవ్వించిన ట్లా కూపముపైఁగల శాసనము నుడువుచున్నది.

**పెట్రోలియమ్‌తైలము:**— పెట్రోలియమ్ భూగర్భమునుండి లభించు నొక (ద్రవరూపముగు) తైలము. క్రీ. శె. ౧౯ శతాబ్దమున దీనిని భూమినుండి తోడుటకు మార్గములను గన్పెట్టిరి. అంతఁదనుక నది యుండుప్రాంతముఁ బల్లములం దూరి నిల్వయున్న పెట్రోలియమును దెచ్చుకొని దీపములు వెల్గించుకొనుచు నుండెడివారఁట. ఇది దొరకుభూప్రదేశములు చెట్లు, చేమలు, గడ్డి లేని గొడ్డుభూములుగ నుండును. కొన్ని తావుల రాళ్లుండినవిగ నుండెడివి. అట్టిప్రదేశములకు Oil fields అనియు oil ryions అనియు నాంగ్లమునం దందురు.

గొప్పగొప్పపండితులు పెద్దపెద్దపరిశీలన లొనర్చియుఁ బెట్రోలియముయొక్క పూర్వోత్తరములం గనిపెట్టి యేకాభిప్రాయమునకు రాలేకపోయిరి. పెక్కండ్రు తైలమును mineral oil అని వాడుదురు. వారు దీనిని లక్షలసంవత్సరములక్రిందట animal or Vezitable (plant) matter గా నుండి భూమిచేఁ గప్పంబడి, ముక్కి, కుళ్ళి, నిల్వయై రానురాను ద్రవరూపముగ నేర్పడినదని యభిప్రాయపడుచున్నారు. ఇంక ననేకులు భూమిలోఁ గప్పఁబడిన inorganic matter నుండి ద్రవించునదిగాఁ బోల్చెదరు. inorganic matter అనిన నాంగ్లమున "matter that never had life" అని నిర్వచించియున్నారు. కొందరు పండితు లాప్రదేశపు టిసుకగాని, మట్టిగాని సీమసుద్దతోఁ దప్పకఁ గలపియుండవలసి యుండు నందురు. ఆంగ్లదేశస్థుండగు ప్లే. ఫెయిర్ ప్రభువు (Lord play fair) దీనింగూర్చి పరిశీలన లొనర్చి చిరస్మరణీయుఁడైన మహనీయుఁడు. దీని యుపయోగముల నెల్లఁ గన్పెట్టి లోకమునకు వెల్లడించెనుగాని యిది విస్తారముగ నెటుల లభించునో తెలియక నాప్రభుని పరిశీలనాఫలితములు నిరర్థకము లనిపించుచుండెను. పిదప Colonel Drake అను పేరుగల సుప్రసిద్ధయంత్రశాస్త్రవిదుఁడు (engneer) భూమిలోని కిది దొరకుతావుల బోరింగుమూలమున గొట్టములం జొనిపి పంపు (pump)ల మూలమునఁ బెట్రోలియమును పైకిం దోడుకొను యంత్రవిధానమును గన్పెట్టుటతో నది బయల్పడి ప్రభువుగారిపరిశీలనలు లోకమునకు కుపయోగింప నారంభించెను. ప్లే ఫెయిర్ ప్రభువుగారే పెట్రోలియమును తేలికయగు వెలుఁగిచ్చుటకును, యంత్రము నడుపుటకును, నూనెగను, బరువగు Lubricating oil గను గూడఁ జేయనగునని చూపి రుజువుపర్చెనఁట. దాని నెఱింగినపిదప బంగారుగనులపై భ్రాంతి తగ్గి పెట్రోలియంగనులపై నావేశ మధికమయ్యె నందురు.

భూమినుండి పైకి వచ్చినతోడనే యీనూనె గాఢమగు గోధుమ (drak brown) రంగుఁగల కల్మషముఁ గల్గిన ద్రవమై యుండెడివి. అందనేక చిక్కఁదనములు (deusities) గల హైడ్రోకార్బను (Hydrocarbons) లుండె

డెని. వానిని పెట్రోల్ (Petrol), బెంజిన్ (benzene) నెఫ్తా (Naptha) మొదలగునవిగాఁ బోల్చియున్నారు. వీనినే రసాయనశాస్త్రవిదులు డిస్టిలేషన్ ద్వారా నొకటినుండి వేరొకటిని వేరు చేయుదురు.

భూగర్భమునుండి పెట్రోలియముతైలమును పంపులనుండి తోడి పైకిఁ దెచ్చునూతు లొక్కొకటి దక్షిణకాలిఫోర్నియాయందు రెండుమైళ్ళు కూడ లోతుండునని తెలియుచున్నది. అట్టినూతిని నిర్మించుటకుఁ బదివేలనుండి యిరువదివేలపౌనులఁ దనుక వ్యయమగు నఁట. వీనిం ద్రవ్వి నిర్మించుతఱిఁ జాలసంగతులు గమనింపవలసి యుండెడిని. త్రవ్వుచుండుతఱినే ప్రక్కలు వదలి పడకుండ గొట్టములఁగూడ దింపుచుండవలసి యుండును. పంపు సహాయమునఁ దోడవలసియుండి యందలి పెట్రోలియమ్ పైకిరాకుండిన పంపును తోడుట కమర్పవలసియుండును. లేక నది ఆర్టిజన్ వెల్ (artisen well) గానై తైలము దా నంతట నదే పైకి వచ్చుతఱి నతిత్వరితముగ రాకుండఁ దగినయేర్పాటులఁ జేసుకొనవలసియుండెడిని. లేకుండిన ననేకాపాయములు కలుగవచ్చును. అపాయములలో నగ్నిప్రమాద మత్యధికనష్టములఁ గల్గించెడిని. దీనిపదార్థములు కొన్నివ్యాత్తులలోనికిని, సువాసనద్రవ్యములలోనికిఁ గూడఁ గావలయునందురు. రబ్బరుపనుల కిది కావలయు నఁట. నూతుల యజమానులను oil kings అందురు. ఏలనన వారు ప్రపంచమున నెక్కువ ధనవంతులఁట.

## పేరేహారా (ఊరేగింపు):—

(కేండీపురపేరేహారా యూరేగింపుటుత్సవము చూడుఁడు)

**పెల్మేనిజమ్ (Pelmanism):—** ఇది జ్ఞాపకశక్తి నభివృద్ధి నొందించు నభ్యాసములను గూర్చిన కళ. ఇది నవీనముగా నిరువదియవ శతాబ్దమునఁ గనిపెట్టఁబడినది. ఈకళ మానవజీవిత ప్రవర్తనలఁగూర్చి చెప్పునది. బ్రిటిషుసామ్రాజ్యమునందలి వివిధభాగములలోను, ప్రధానరాజధానియగు లండనునగరమునను, గల పెల్మేనిజమ్ సమాజములు 1914 సం॥ మొదలు 1918 వరకు, సామ్రాజ్యసామర్థ్యమునకు గొప్పయుపకారముగఁ బనిచేసినవఁట. ఈకళను ముఖ్యముగ సైన్యాధికారులును, నావికాదళాధిపతులును, రాజ్యతంత్రవేత్తలును చాల కొనియాడి యాదరించిరి. గతించిన యైరోపామహాసంగ్రామమున ననేకమంది బ్రిటీషుసైన్యాధిపతులు మొదలగు నుద్యోగు లీకళను నేర్చుకొనినంమన, వారిపద్ధతి ననేకవేలమంది యుద్యోగు లవలంబించి, దానిలాభమును చవిఁ జూచిరి. ఆకాలమున నంతటి యుపకారకమగు నీకల, నేడు 1941 సం॥ న బుద్ధిబలముచేతను, ననుభవములచేతను, మఱియు నుత్తమకలగా మెఱుఁగుపెట్టబడిన దందురు. ఇందలి ప్రతియంశము మానవస్వభావచేష్టలఁగూర్చి చెప్పఁబడినది. జీవితము సుఖకరముగను, లాభకరముగను బెంపొందించుకొని, సంతసముగ నుండుటనుగూర్చియు, నాత్మగౌరవమునుగాపాడుకొనుటగూర్చియు నీకల సాంతముగా విశదీకరించునని చెప్పఁబడినది.

ఈకళోపాసకులు, కళయందలిపద్ధతులను తమకుఁ దామే యన్వయించుకొనక, నాకళయం దభిమానపూర్ణానుభవములుగల దేశికులచే నభ్యాసవిధులు మొదలగునవి వారివారిభావములు రుచుల ననుసరించి తెలుపఁబడును. అందువలన వేర్వేరభిరుచులుగలవారి కిది వేర్వేఱువిధముల యభ్యాసములుగల కళయని తెలిసెడిని. దీనిని గనిపెట్టిన

మహాత్ముఁడు పెల్మేన్ పండితుఁడు గాన, నీకళ యాతనిపేర "పెల్మేనిజ" మనఁబఱఁగెను.

**ప్లెక్సిగ్లాస్ (Plexiglas):**—ఇది రసాయన శాస్త్రవిదులు 'ప్లాస్టిక్సు'(Plastics) అని వాడుచుండు కృతకపదార్థసంబంధమైనది. టెలిఫోనులు, గొడుగులపిడులు, ఫౌంటెన్ పేనాలు (సిరాకలములు), మొదలగునవి ప్లాస్టిక్సుతోఁ జేయఁబడుచుంట యీకాలమున సర్వసామాన్యమే. ప్లాస్టిక్సు పెట్రోలియమ్, కొన్ని భూఖనిజపదార్థములు, కొన్ని వెజటెబిల్ (Vegetable) పదార్థములు, ఏనిమల్ (animal) పదార్థములు, కొన్నిగాసెస్ (gases), రాక్షసబొగ్గు (coal), కొన్నిగాలులు, ఉదకము మొదలగు పదార్థములంగల్పి చేయుచున్నారు. వీనియందు నద్దమువలె స్వచ్ఛమైయుండు ట్రాన్స్పరెంటుప్లాస్టిక్ (Transparent plastic) నకు 'ప్లెక్సిగ్లాస్' అని పేరిడఁబడియున్నది. క్రీ. శ. ౧౯౦౧ నుండి యమెరికాసంయుక్తరాష్ట్రములలోనిపెన్సిల్వేనియారాష్ట్రమునందున్న బ్రిస్టల్పురనివాసియగుDr.Otto Rohm పండితుఁ డదేపనిగఁ బరిశీలన లొనర్చుచుఁ గని పెట్టినఫలితముగ నిటీవల మానవోపయోగమునకు సామానులుగఁ జేయఁబడుచు నమ్మకమున కమర్చఁబడుచున్నవి. 'ప్లెక్సిగ్లాస్' అను పేరాపదార్థమునకు flexibility crystal clear transparency ల రెండులక్షణములనుండియు నీయంబడి వాడుక నందుచున్నది.

ప్లెక్సిగ్లాస్ ౧౯౩౬ జనవరినుండి వాడుకలోనికి వచ్చియున్నటులఁ జెప్పంబడినను, పరిశీలన జరుగుచునేయుండి యిప్పటిస్థితి కిటీవలనే వచ్చిన దఁట. ఇది యద్దముకన్నఁ గొంతయధికముగ clarity ని గల్గియుండుననియు నద్దమునుండి నూటనెన్బదియెనమిదిభాగముల (88 %) వెలుతురు పోఁగల్గుచుండ, ప్లెక్సిగ్లాసునుండి తొంబదిరెండుభాగముల (92%) వెలుతురు పోఁగల్గుచుండుననియు మరియు నిది Crystal వలె మెరయుననియు వంకరలంజుట్టి వెలుతురును పోఁజేయంగల్గుఁ it is able conduct light around curves) ననియుఁ బరిశీలనలనుండి తేలుచున్నది.

ప్లెక్సిగ్లా సద్దమునుబోలి పగులునది కాదు. [not brittle]. వెచ్చఁజేసినపిదప వంచనగునది, మెలచగూడనది [bent or twisted]. చల్లారినపిదపఁ జాల బలముగనుండి యాగునది. చాల చులకగ నుండునది. అద్దముతోఁ బోల్చిచూచితిమేని 45% బరువుమాత్ర ముండునది. ఆపరిశోధకుఁడగు పండితుఁడే దీనిని hardest transparent sheel plastic ever made అని వివరించెను. రాగి [లోహము] అంతగట్టిఁగల్గియున్నను machin చేయుటకుఁగాని, సిమెంటుతోఁనతుకుట (machined or cemnented) లకుఁగాని వీలుకల దనుచున్నారు. వాయువిమానములందిది వాడంబడుచున్నది. వంగుకిటికీలకు (curved windows), తలుపులఅద్దములుగను, మోటారు పడవలందును వాడుచున్నారు. ఇటీవల నింటి సామానులుగఁగూడ జేయప్రయత్నములు నడచుచున్నవని వినుచున్నారము.

**పేశ్చర్పండితుని జెరమ్సుపరిశీలనలు:**– పాశ్చాత్యవైద్యపరిచితులకు Louis Pasteur పండితునిపే రొకక్రొత్తనామముఁగానేరదు. కాని యాయన వైద్యుఁడుకాదనియు, రసాయన శాస్త్రవేత్త (chemist) యనియు మేము వివరించిన వింతగా నుండకపోదు. జన్మతః ఫ్రెంచిజాతివాఁడు. ఫ్రెంచిదేశమున క్రీ. శ. ౧౮౨౨ లో నాదేశఁపుఁబ్రాగ్భాగమున 'డోల్'

అను గ్రామమునందు జనించినవాఁడు. ఆయన తండ్రి తోళ్ళను బాగునఁజేసి పదునిడువృత్తివలన జీవించెడివాఁడు. ఇంచుక సౌఖ్యజీవనము గలవాఁడగుట కుమారునకుం దొలుత నార్బోయిస్‌పురమునను, బిదప పారిస్‌నగరంపుఁగళాశాలయందును సయ్యన్సు (Science) విద్యఁ గరపించుచుండ హఠాత్తుగా నబ్బాలుని రసాయనశాస్త్రసామర్థ్యము వెల్లడియై విద్యాభ్యాసము ముగియగనే Strasbaurg పుర కళాశాలయందు రసాయశాస్త్రోపాధ్యాయుఁడుగఁ గైకొనంబడి యట చక్కనిబోధకుండని పేరందెను.

అక్కాలఁపుఁజరిత్రిలనుండి నేటికి మనకుఁ దెలియుచున్నమేర కదివరకే ముక్కియు, కుళ్ళియు, భ్రిష్టయిన పదార్థములందుఁ బరమాణుపరిమాణ శరీరములుగల యేవో జీవజంతువు లుద్భవించునని దేశమందుఁ దలంపంబడుచుండెను. గాని యీ స్థితి మృతపదార్థముల (dead mutter) కేగల్గుఁ గాని జీవించియున్నపదార్థములకుం గల్గుట నెవ్వరును తలఁపరైరి.

పేశ్చరు పండితునికడఁ జదువు కొనుచుండిన యొకవిద్యార్థియొక్కతండ్రి సారాయములఁ జేయువాఁడు. పండితునకు మిత్రుఁడై యాయన నొకతఱి "పండితవర్యా! నాసారాయము లొక్కొక్కతఱిఁ బులిసిపోయి పొంగు (ferment) స్థితికిం జేరిపోవుచుండును. తాము దయతోఁ బరిశీలించి కారణమరసి నాకెఱిఁగింతురే?" యని ప్రార్థింప నా పండితుఁడు వల్లెయని పరిశీలించి "మిత్రమా! మీ సారాయములం దొక్కొక్కతఱిఁ జిన్నచిన్నపరమాణు పరిమాణ శరీరములుగల గల tiny organisms ఉండుకతన దానిఁ బాడుచేయుచున్నవనియు, నవి పలురకములుగ నుండుననియు, మరియు నయ్యవి గాలియందును, దూళియందునుఁగూడఁ గాన నగుచున్నవనియును దెల్పెనఁట.

అంతేఁ దనకుఁ గల్గిన యుత్సాహముతో నా పండితుఁడు తనపరిశీలనస్థానమున గాజుగొట్టములలో నట్టి సైనీఆర్గనైజేషనులం జేర్చి పెంచుచుఁ బరిశీలించుచు నాజరమ్సునకుఁ గారణ మాకుళ్లుచు ముక్కుచుండిన పదార్థము గాదనియు, ఆపదార్థములు కుళ్ళుచు ముక్కుచు చెడుట కాజరమ్సే కారణమగుచున్నదనియుఁ గన్గొనెను. ఇందునుండి యట్టిజెరమ్సును నాశన మొనర్చిగాని, దూరపర్చిగాని యాపదార్థములను కుళ్ళకుండను, ముక్కకుండనుజేయనగునని యేర్పడియెను.

పిదప నామహనీయుని పరిశీలనలు, జెరమ్సు అనేకవిధములనియు నందుఁ గొన్ని మానవజంతు శరీరములకు రోగములఁ గల్గించుననియు బయల్పరిచెను. ఇంకను పిదప నాయనయె పిచ్చికుక్కకాటువలన శరీరమునందుఁ జేరుకొను hydrophobio అను విషయముఁ గల్గించు రోగమునకుఁ బ్రతిహత మొనర్చు నౌషధపరిహారమును గన్గొనెను. ఇది చాల సుప్రసిద్ధమైనకార్యమై పేరు ప్రతిష్టలఁ దెచ్చెను.

ఇక్కాలమున నైరోపాదేశముల శస్త్రచికిత్స (Surgery) పైఁ బెక్కండ్రువైద్యుల కభిమాన మధిక మగుచుండెను. అం దాంగ్లదేశమున సుప్రసిద్ధుండైయుండిన డాక్టరు Lister గారు పేశ్చరు పండితుని పరిశీలనలయం దధికగౌరవముఁ గల వాఁడై వానిని దనశస్త్రచికిత్సలయందుఁ గైకొనఁగోరుచుండువాఁడు. ఆకాలమున శస్త్రచికిత్స యందు గొప్పయాపద యించుమించుగ నన్నియు septic అగుచుండి inflamed గా మారి blood poisoning వలన మరణము సంభవించుచుంట

సంభవించుచుండెను. పేశ్చరుపండితుఁ డీసెప్టిక్కు-స్థితిఁ గల్గుటకుఁ గారణ మొకజాతిజరమ్మని చూపినకతననామహనీయుని పరిశీలనలందు నమ్మకముఁగల డాక్టరు లిస్టరుగారు దానిం జక్కఁగ గ్రహించి పండితునిపరిశీలనలను గౌరవించి కార్బొలిక్కు-లోషనుతోఁ గడగి జరమ్ము లేకుండఁజేసి శస్త్రవైద్య మొనర్ప నాయాపరేషనులు (operations) సెప్టిక్కు- గాకుండ నిలువ మొదలిడెను.

## పేసోవరుపండగ-(Passover feast)

ఇది క్రైస్తవులుగూడ నాచరించుచున్నారు గాని నిజముం బరిశీలించిన నిది యూదులపండుగ దినముగ స్ఫురింపకపోదు. బైబిలు జెనిసిస్‌నందు యూదులకుఁ బూర్వీకుఁడగువాఁడును, యహోవా (దేవున) కు మిత్రుఁడుగఁ జెప్పంబడినవాఁడును నగు అబ్రహాం (మహమ్మదీయుల ఇబ్రహిం) ప్రవక్తతో దేవుఁడు "నీప్రజలగు యూదుసంతతి జనులు వారిది కానిదేశమునఁ బరాయివారుగఁ గొలువునందు బందీలుగ నాల్గువందలవత్సరము లుందురుగాక" యని శపించినట్లు చెప్పంబడినది. అట్లే ఇశ్రాయేలీయు లీజిపుట (ఐగుప్తు) దేశమున నాల్గుపురుషాంతములు నిర్బంధవాస మనుభవించుచుఁ గష్టములగుపనులఁ జేయుచున్నటుల నిదర్శనములు కలవఁట. ఇది నాల్గువందల సంవత్సరములకాలమున కించుక మించియున్నదఁట. వారు క్రీస్తుమునుపు ౧౩౨౦ నా డైగుప్తును వీడి వారి యిచ్చవచ్చినటుల వెడలిపోవ రెండవ మెన్ప్టా నృపతి యనుమతిఁ బడసిరఁట. (వారిప్రవాసకాలమున రెండవరామ్సీస్‌నృపతికూడఁ గొంత కాల మేలికగా నుండెనఁట.) వారు మోసెస్ (మోషే) మహమ్మదీయుల మూసా ప్రవక్తను నాయకునిగాఁ జేసుకొని దేశమునువీడి, ఎఱ్ఱసముద్రముం దాటి (Redsea) తమ కొసంగఁబడిన పాలస్తినాదేశమునకుఁ జనిరఁట.

వారికిఁ దొలుదొల్త నైగుప్తుదేశమును వీడిపోవ ప్రభువులగు ఫరోభూపతులు సెలవివ్వక నిరాకరించుచుండిరఁట. యొహోవాదేవుఁ డైగుప్తుదేశముపైఁ బదియాపదలఁ బంపెనఁట. అందుఁ గడపటిది 'తొలుతఁ గల్గినబాలు లెల్లరు నొక్కరాత్రి మరణించుట' యని చెప్పంబడినది. ఈ పది యాపదలతో వెరగంది ఫరోనృపతి యిశ్రాయేలీయులను ప్రవాసమునుండి విమదలంగావించి యైగుప్తుదేశమునువీడి వెడలిపో ననుజ్ఞ నిచ్చెనఁట. వారటనుండుకాలమున రాత్రియం దింటింట నగ్రసుతుల హఠాత్తుగ మరణింపంజేయ నరుదెంచిన మృత్యువు (angle of death) యూదుల గృహద్వారములపైనున్న మేక, గొర్రె పిల్లల రక్తంపుమరకల యూనవాళ్ళచే నాగృహములఁ గడచిపోవుచు (passing) నైగుప్తీయులు గృహములంజొచ్చి యగ్రసుతులం బరిమార్చుచు నరిగెనఁట. నాఁడాదిగ నామృత్యువు గడచిపోవు (passing over) దినమున ప్రతియేటను పండుగగా నేటికి నాచరించుచుందు రఁట. అదియే passover (పేస్సోవరు) పండుగ.

## పొట్నూరు ఇంటిపేరుగఁగల కంఠి మంత్రివారు

వీరు శిష్టుకరణశాఖకుఁ జెందిన గౌడబ్రాహ్మణశాఖవారు. కౌశికగోత్రజులు. ఆదిని కంఠిమంత్రివారని వాడఁబడుచుండిరఁట. కొందరు వీరివా రింకను కంఠిమహంతి (మహామంత్రి) వారని వాడఁబడుచున్నవారు కలరఁట. పిదపఁ గొందరికిఁ బొట్నూరువారని యింటిపేరు గ్రామనామమై కల్గె నందురు. ఇప్పుడు వీరు పొట్నూరువారనఁ బరగుచున్నారఁట.

**పౌనులు, షిల్లింగులు, పెన్నీలు, అక్షరపు గురుతులు**—పౌనులకు L అనియు, షిల్లింగులకు S అనియు, పెన్నీలకు D అనియు నాంగ్లమున వాడుచుంట నెల్ల రెఱింగినదే. ఆ మూఁడక్షరములును లాటిన్భాషాపదములగు Librae=పౌనులు, Solide=షిల్లింగులు, denarii=పెన్నీలు నను మూఁడుమాటలుగ నుండి ప్రథమాక్షరములు గుర్తులుగఁ గైకొనంబడిన య్యును నిందుఁ బౌనులందెల్పు ఎల్ అక్షరముల పై నది తూనికపౌను కాదని దెల్పుట కొకటిగాని రెండుగాని యడ్డుగీతల నుంచెదరు. (సప్లిమెంటల్ వాల్యూమ్ టంకశాల చూడుఁడు.)

**ఫిషర్మేన్సురింగు (Fishermans Ring)** ఇది రోమన్కాతలిక్కు కైస్తవమతాధిపతి యగు పోపుజగద్గురుని చేతినుండు (ఉద్యోగాధికార) లాంఛనమగు ముద్రిక. క్రీ. వె. పదునారవ శతాబ్దముఁదనుక దీనిపై సెంటుపీటరు జగద్దేశికుని యొక్కయు, సెంటపాల్ జగద్దేశికునియొక్కయు రూపములు చిత్రింపఁబడుచుండెనఁట. ఇక్కాలమున నొకప్రక్క పోపుమహాత్ముని యధికారలాంఛనములును, వేరొకప్రక్క వారిపేరును చెక్కంబడుచున్నది. వారు మరణించినచో నది భగ్నపరుపఁబడి తిరుగఁ గ్రొత్తయుంగరముగఁ జేయంబడి క్రొత్త పోపుగారి కొసంగబడుట యాచారమై యున్నది. కాని ఈయుంగరమున కీ పేరబ్బుట దురూహ్యము, దుర్గ్రాహ్యముగి నున్నది.

**ఫ్రీలేన్సు (Free lance)**:—పూర్వకాలమున ననగా నాగరికత పూర్తిగా వ్యాపించని యాదికాలమున, దేశము లైకమత్యము నెఱుంగని నాఁడు, యుద్ధములనుండియే సర్వకార్యములు పరిష్కరింపంబడు దినములందు, సామంతరాజులై రోమాదేశములందుఁ గలహప్రియులై యుద్ధశూరులను,రణవీరులనుకొలువులం దుంచుకొనుచుండు స్థితియందు బలశాలురు యుద్ధనిపుణులునగు రౌతులు సామంతరాజుకడ కరిగి జీతమునకుఁ గొల్వునం దుండుటను 'ఫ్రీలేన్సు' అని వాడుచుండిరి. కాలములు మారి యట్టివృత్తి జీవనములు లేని యిక్కాలమున నర్థవ్యాసములు వ్రాసియు కలముతో మాటలనువ్రాసి కలహించుట కావేరు వాడంబడుచున్నది. ఇట్లనుటయందు వార్తాపత్రికాసేవకుల కీపేరు వాడుటఁ గానరాదు. వ్యాసరచనానైపుణి నన్యులతోఁ [వ్రాతలమూలమున] గలహించుటకుమాత్రమేయుపయోగింపఁబడుచుంటఁ గాన నయ్యెడిని.

**ఫ్యూజ్ (Fuse) చేయుపని** — ఇది విద్యుచ్ఛక్తిని కట్టడములలోనికి, దీపములు మొదలగువాటికొఱకుఁ దంతులనుండి తెచ్చుతఱి నపాయముఁ గలుగకుండుటకై యేర్పఱుపఁబడిన యొక యుపాయము. ఇది యొకతీఁగ. అతిత్వరితముగఁ దాఁ గరఁగి భగ్నమై విద్యుత్ప్రవాహము నాపి వైచి, యపాయముఁ గలుగకుండ నాపుట కేర్పఱుపఁబడినది. దీనింగూర్చి యాంధ్రమున వివరించుట యనినఁ జదువరుల కెల్లఱకు సుబోధకము గాదేమోయను సంశయము కల్గెడిని నాన నొక సుప్రసిద్ధ విద్యుద్విద్యావిశారదుని వ్రాత నాంగ్లమునవే చదివి, దానిని మాచదువరు లెఱుంగుదురు గాక యని వారల మన్ననల నర్థించెదము.

విద్యుద్దీపకళిక లమర్పఁబడినతావుల నొక్కొక్కప్పు డకాత్తుగా దీపము లారిపోయి, రాత్రిలం దైనచో నంధకారబంధుర మగుచుండుట నెల్ల రెఱింగినదియే. ఇందుకుఁ గారణములు ముఖ్యముగ రెండు కలవు. Electric bulb నందలి సన్నఁపుఁదీగెలు కాలిపోవుటయో, లేక 'ఫ్యూజు'




(fuse) కాలిపోవుటయో యై ........ కారణముగ నిటుల వివరింపఁ బడినది. "There has been a short circute some whire that is to say- the electric current has found some other easier way of running round- Perhaps a wire has frayed and is touching some other wire and the whole force of current is allowed to rush back (with out doing itswork of entering in to the bulb)and the light is no more- This is not all- as there is danger of setting to the bulding if possiable and In a specially protected (insulated) box - near the electric meter pieces of soft easily melted wire are fastened across points on a porcelain block (insulator)

The current runs quite well threw these soft weres when all is in order-but when a short circute occurs the fuse wire being soft (weakest part of wiring) melts and the current is cut off"

ఇది నిజమునఁ బ్రాణులను electric shock ఆపదలనుండి రక్షించునట్టియు, కట్టడముల కగ్ని హోత్రిబాధను దప్పించునట్టియుఁ జక్కని యుపా ...... పోదు. ఆ fuse wire తాను గాలిపోయి, భగ్నమై, ఆపదలం దప్పించుచున్నది. దీనిని బాగుచేసుకొనుటకుముందు పెద్దస్విచ్చిని ఆఫ్ చేసుకొనవలసి యుండెడిని. పిదప insulators ఒకటితరువాత నొకటిగఁ దీసి కాలిపోయి కరఁగిపోయినతీగను గన్గొని బాగుచేసికొనెదరు.

## ఫ్రెంచిదేశపు-జాతీయగీతము ;—

దీనినాంగ్లేయులు 'French NationlAnthem' అనెదరు .కాని పరాసుభాషయందు దీనిని "marscillaise" అని వాడుచున్నారు. దీనికిఁ గర్త "Rougetdelisle" అనుపేరుగల సైనికోద్యోగి శమ్ముపై నధికారిగ నుండినవాఁడు Strasbourg అనుతావున సేనానిగా నుండిన తటి నాపురపాలకసంఘాధ్యక్షున (mayor) కుఁ గానుకగా నిది వ్రాసి సమర్పించె నఁట. ఈపాట యందుఁగల జాతీయాభిమానగూఢార్థమును, శబ్ద చిత్రమాధుర్యములును దీని నతిత్వరగా వ్యాపింపఁజేసి, జాతీయగీతాగౌరవముం గూర్చెనఁట. క్రీ. శ. ౧౭౯౨ లో పారిస్‌నగరవాలంటీరుదళము వారు దీనిని బాడుచు నగర వీధులందు నడువ జనులమనముల నాకర్షించెనఁట.

**ఫ్రెంచిలీవు (French leave)**:—తొల్లి పరాసుసైనికులు తమకుఁ గావలసిన వస్తువులను బలాత్కారముగఁ గైకొనుచుండి రఁట. పిదపఁ దమకు స్వంతపను లున్నప్పు డధికారులసెలవుఁ గైకొనకనే యుండిపోవుచుంటకు మొదలిడి రఁట. ఆదురాచారము వాడుకనంది నేటికి సెలవుఁ గైకొనక యుండిపోయినను, జెప్పకుండ వెళ్ళిపోయినను, దానిని ఫ్రెంచిలీ (French leave) యని యాంగ్లేయులు వాడఁదొడఁగి రఁట.

**ఫ్లైయింగు డచ్చి మేన్ (Flying Duch man)**:—ఆఫ్రికాఖండఁపు దక్షిణఁపుఁ గొనయందున్న గుడ్‌హోపు అగ్రము (Cape of Good hope) కడఁ దుపానువేళలం దల్లకల్లోలములలో నోడయాకారములుగఁగన్పట్టుదృశ్యముల కీపేరు వాడెదరు. దానిదర్శనము దురదృష్టకరమని నావికులు తలంతు రఁట. ఆది నొక డచ్చియోడపై నిట నొకఘోరమగు నరహత్య జరిగి, శిక్షగా నాయోడ మునింగి, పిశాచరూపమున నట్లగపడు చుండు నందురు.

**ఫోనిక్సు పక్షి (Phoenix bird)**:— ఇది యీజిప్టుదేశఁపు గ్రంథస్థమగు పక్షిగాని, నిజముగ జీవించియున్నది కాదు. ఆదేశమున హెలియోపోలిస్ పట్టణమున నీపక్షికి [దైవమునకు] దేవస్థానము కలదు. అటకుఁ బ్రతియైదువందలవత్సరముల కొకసారి వచ్చి పోవుచుండు ననియు, నది మగపక్షి యనియు, నొకేపక్షి యనియు, దాని యవసానకాలమున నదియే చితిఁ బేర్చుకొని యగ్నిఁ బెట్టుకొని రెక్కలతో వీచి రగుల్కొల్పి యందుఁ దా నిలచి దహింపఁబడి బూడిదయై యాబూడిద నుండి తిరుగ నుద్భవించుచుండు ననియుఁ జెప్పఁబడియుంట నిక్కాలమున నాశనములేనిదాని కీ పేరు వాడుచున్నారు. దానియాయుఃప్రమాణము పంద్రెండువేల వత్సరము లఁట.



**బంగాళాదేశప్రజనపనార, వ్యవసాయము, గోనెసంచులు**— ఈనార నాంగ్లమున 'Jute' అనుచున్నారు. ఇది గోంగూర జాతికిఁ జెందిన యొక కూర (శాఖా) జాతిచెట్టు. నాల్గునెలలలోఁ దయారగుపంట. చెట్టుంజుట్టి యుండెడిబెరడు (లేక నార) కై యీపంటఁ బెట్టుచున్నారు. ఫిబ్రెవరినెలనుండి మేనెలఁదనుక నీపంటను నాటి మొలపించి, జూన్ నెలనుండి సెప్టెంబరు దనుక కోయుచుందురు. అనఁగా నాల్గునెలలవ్యవసాయమని యెఱుంగునది.

ఇప్పటి బంగాళాదేశము బీహారురాష్ట్రములందున్న చెమ్మగల తడిపొలములం (Damp soil) దిది చక్కఁగాఁ బైరగును. దీని కెండ వేఁడి యధికముగ నుండవలసియుండును. చెట్టు పదియడుగులవఱకు నెత్తున కెదిగెడిని. పూవులం బూచినది మొదలు గింజకట్టి ముదురులోపుననే వీటిం దీసి వేయవలయును గాని, యంతకంకను ముదిరినచో నీనార గోనెలనేతకుఁ బనికి రా దందురు. ఈ దేశఁపునారపంట జగత్తునందు నారపండు తావులలోఁ బ్రధానమైనదిగఁ బేరందియున్నది. దీనితో నేసిననారబట్ట నాంగ్లమున (hassian cloth) అనెదరు.

తొలుత చెట్లను మొదలంటఁగోసి మెరక ప్రదేశముల నాల్గుదినము లెండించుటతో దీని యాకులు డుల్లి, చెట్టువాడును. పరిశీలన లిట్టిచెట్లను నూరుపౌనులుండిన నాఱుపౌనులనార వచ్చునని తెల్పుచున్నవి. చెట్లంగోసి కట్టలుగఁగట్టి నీట నానవేయుదురు. అత్తఱిఁ జెట్టు నాని నారతీయ వీలగును. దీనికి 'fermantation' అనుచున్నా

రు. ఇది పండ్రెండవమొదలిరువదియైదుదినముల వఱకుఁ బట్టునఁట. ఇది యెక్కువపరిశీలనతోఁ జూచుచుండవలసినది. లేకున్న నారపాశస్త్యము చెడిపోవును. ఆకట్ట లవుగున నేలకుఁ దగుల రాదఁట. ఈ యూరుట నాంగ్లమున 'retting process' అనెదరు.

పిదపఁ జెట్లమొదళ్ళనుండి నారను కడదనుకఁ దీసి యొలచి, యూరవేయుదురు. ఒకమనిషి రోజునందు (ఎండిననార) నలుబదిపౌనులు మాత్రమే తీయఁగల్గునఁట. వొలిచిననార నుతికి, కడిగి, శుభ్రపఱచి, వెదురుకఱ్ఱదండెముల పై నెండించి, కర్మాగారములకు నేతకై పంపుదురు. నారను విడఁదీయుట, కడుగుట, రెండవుగులలోతునీటియందే చేయుట కష్టముగనే యుండును. నార నెండింప మూఁడు దినములు పట్టును. దానితో నేసిన బట్టనే గోనెంకెములుగఁ గుట్టుదురు.

**బన్షీ-పిశాచము**— (Banshee Eerie Spirit) ఐరోపాదేశములందు శకునములు మొదలగువాటిని నమ్మువారు పెక్కండ్రు కలరు. వారు గృహమందు మృతి రానున్నపుడు బన్షీ పిశాచము తెల్పుచుండుననియు, దాని ధ్వని యత్తఱినే విన నగుచుండు ననియు ననెదరు. అది విషాదమును నరపులరూపమునఁ దెల్పునందురు. దానిని గొందరు 'evil spirit' అని యనెదరు. బన్షీపేరు 'Ban Sith' అను Gaelic భాషాపదములనుండి జనించినదఁట. ఆమాటల కాంగ్లమున 'Woman Fairy' యని యర్థమఁట. ఆమె ధ్వను లాకాశమునుండి వినఁబడునఁట.

**బమ్మెరగ్రామము:**— ఘనత వహించిన నిజాముప్రభువుగారిరాష్ట్రమున వరంగల్లు పరిసరముల నీగ్రామ మున్నది. ఇదియే యాంధ్రభాగవతము, వీరభద్రవిజయము, భోగినీదండకములను రచించిన సుప్రసిద్ధకవిశిఖామణియగు బమ్మెర పోతనామాత్యుని నివాసగ్రామ మనియెదరు. ఈ వరంగల్లునే 'ఓరుగల్లు' (ఏకశిలానగరము) అని కీర్తిశేషులగు రా. బ. కందుకూరి వీరేశలింగం పండితులవారు తెల్పియుండిరి.

ఈ బమ్మెరగ్రామమునఁ బాతఁబడిన నాల్గుశిలలపై నమర్పఁబడిన శిలాఫలకము నచటివారు 'పోతనగద్దె' యనెదరు. దానికడనే దారి కడ్డముగ నిలచియున్న యొకరాతిని 'పోతరాజు' అనెదరు. ఈపోతరాజు, పోతన లెవ్వరో బమ్మెరపోతరాజ కవికి, వీటికి లేక ఈతావులకుఁ గలసంబంధము లెట్టివో తెలియఁబడుట లేదుగాని, బమ్మెరపోత రాజకవియం దచ్చటివారికిఁగల గౌరవాధిక్యత మాత్రము వెల్లడియగుచున్నది. ఆయన కవిసార్వభౌము శ్రీనాధకవికి బావమఱఁదియని యెల్లరెఱింగినదే.

బమ్మెరకు నేఁబదిమైళ్ళదూరమునందున్న వెలిగందల గ్రామము భాగవతమునం దాఱవస్కందమును కవిత్వము రచించి, పూర్తిఁజేసిన పోతనామాత్యకవిశిష్యుఁడగు వెలిగందల నారాయణకవి గారి నివాసగ్రామ మనియు, జన్మస్థాన మనియుఁ జెప్పుచున్నారు. ఇంకను బమ్మెరనుండి మూఁడు మైళ్ళదూరముననున్న పాలకుర్తిగ్రామము సోమనాధకవిగారి నివాసగ్రామమనియు, జన్మస్థాన మనియుఁ జెప్పుదురు. అందు సోమేశ్వరశివదేవస్థానమును గలదు. అచటివారు బమ్మెరపోతనామాత్యకవియు నీసోమేశ్వరదేవస్థానమునకు గొప్ప భక్తుఁడని యనుచున్నారు.

**బర్మా ఆయిల్ ఫీల్డ్సు** (Burma oil fields) బర్మాదేశమున నైరావతీనదీప్రాంతమగు

చోట డ్రిల్లుజోనుసం దున్నవి. అవి యేనంగ్యాంగు, యేనంగ్యాత్, సింగ్, మింబూ అను పేరుగల గ్రామముల పరిసరప్రాంతములుగ నున్నవి. అవి యెఱుపు, పసుపు రంగులు గలపిన రంగు వంటివర్ణముగల గండశిలలుండు నూసరక్షేత్రములుగ నుండును. కొండలలో మైళ్ళతరబడిగ వ్యాపించియున్నవి. ఐరావతీనదీతీరముల నంటియే వ్యాపించియున్నవి. అచట నీనదీతీరములు కిటకిట లాడుచు మనుష్యులకదలికలతో నుండెడిని. పొగయోడలలో నదియందుఁ బయన మొనర్చువారికి నూతులనుండి నూనెఁ బైకిఁ దోడుయంత్రముల పొగగొట్టములు పైకిఁ గన్పడుచుండెడిని. వీటిని 'ఆయిల్ ఫీల్డ్సు' అనియెదరు.

ఇం దాదిని త్రివ్వఁబడిన నూతులనుండియు, నిక్కాలఁపుబోరింగు నూతులనుండియు, కెర్సనాయిల్ పైకిఁ బంపుచేయఁబడుచుండెడిని. దానిని పాటికై నిర్మింపఁబడిన పొగయోడలందు నింపి రంగూన్‌నగరముకడనున్న రిఫైనరీకర్మాగారములకుఁ జేర్చి, యటఁ బరిశుభ్రపఱచి, పెట్రోలియముగను, కెర్సనైలుగను, క్రొవ్వొత్తులంజేయు మైనఁపుఁబదార్థముగను విభజించుచుందురు. నూతులనుండి పంపులచేఁ దోడించిన దాని నించుక మాత్రము వడఁగట్టి, 'క్రూడాయిల్' (Crude-oil) అను పేర నమ్మెదరు.

'యేనాంగాంగు' అను పేరుగలతావునుండి రంగూనునగరముఁ దనుక మూఁడువందలమైళ్ళ దూర మొకగొట్టమును భూమినుండి యమర్చియున్నారు. దానినుండి చాల కెర్సనైలు రంగూను రిఫైనరీలకుఁ జేర్చఁబడుచున్నది. 'సీరియమ్' అనుతావుకడ నొక గొప్ప రిఫైనరీకర్మాగారము నేర్పఱచియున్నారు. కెర్సనైలు బోరింగునూతులలోఁ గొన్ని మూఁడువేల యడుగులలోతువి కూడఁ గలవఁట.

తొల్లి యీబర్మాదేశ మమెరికానుండి కెర్సనైలుఁ దెప్పించుకొనుచుండెడిది. ఇప్పుడు తన దేశమునం దుత్పన్నమైన కెర్సనైలు చేతనే స్వదేశావసరములందీర్చుకొనుటయేగాక భరతదేశముం బోలినయన్యదేశములకుఁగూడ నమ్ముచుంటఁ గానఁగుచున్నది. కాని, దీని యితరసంగతు లింకను బయలుపఱుపఁబడలేదు. బర్మాయందుఁ బెక్కుపొగయోడ లీదేశమందలి క్రూడ్ ఆయిల్‌నే కాల్చుచు, సబురులం జేయుచున్నవి. (పెట్రోలియమ్ ఆయిల్సీడ్సు చూడుఁడు.)

## బర్మాదేశమున దీపావళి పండుగలు:—

బర్మాదేశమున రెండు దీపావళిపండుగలాచరణయం దున్నవి. అవి ౧ తండింగ్యూటు పండుగ, ౨ తాజండైంగుపండుగ యని వాడఁబడుచున్నవి.

౧ తండింగ్యూటు (దీపావళిపండుగ):—ఇది బర్మాదేశఁపువర్షకాలాంతమున సంభవించుచుండును. ఏఁటేట సెప్టెంబరునెల కడదినములందో లేక అక్టోబరునెలప్రారంభముననో వచ్చుచుండెడిది. బర్మాదేశఁపు బౌద్ధమతసంబంధమగు పండుగ. బౌద్ధమతధర్మమున నీదేశభాష యందు 'నాత్' అనిన భరతదేశఁపుగంధర్వులో, అప్సరలో, కిన్నరులవంటివారో యగుదురు. వా రొక ప్రత్యేకలోకమున వసించువారుగఁ జెప్పఁబడినవారు. ఆనాత్‌లోకమునకు బుద్ధభగవానుఁ డొకతడి నేగి తనమత ధర్మములను బోధించి, వారి నందఱను బౌద్ధులుగ నొనర్చి తిరుగ భూలోకమున కరుదెంచెనఁట. ఆమహాత్ముఁడు తమలోకమున కేతెంచి

తమ్మందఱను జ్ఞానవంతులుగఁ జేసినయీన వాలుగ నాతు లంద రాయన భూమికి మరలి పోవునపుడు పోవుమార్గము పొడవునను దీప సముదాయముల నిడి యీమహనీయుని యందుఁ దమకుఁ గల భక్తిగౌరవముల వెల్ల డించిరఁట. అయీనవాలుగ నాఁ డాదిగ నేఁటి నాదినమున నీదీపావళి బర్మాదేశమున మూఁడుదినములు రాత్రులం దాచరింపఁబడు చున్న దందురు. ఈమూఁడురాత్రములు సం సారులు నివసించుచుండు నివాసగృహము లును, బౌద్ధభిక్షువులమఠములగు విహారము లును, దేవాలయములును దీపసముదాయము లతో నలంకరింపఁబడి వింతవింతరంగుల లాం తరులదీపములచేఁ దనరారునట్లుఁ జేయఁ బడును. మరియు వీధుల సందులనుండియు, మైదానములనుండియు, వీధులందలి విశాలము లగుప్రదేశములనుండియు, వాయువిమానఁపు బుట్టలు (బెలూనులు) లోన దీపఁపుజ్యోతు లం గల్గి యాకసమువైపు వాతావరణమునం దెగురునటుల వెల్గింపఁబడి యెగుఱఁజేయఁ బడును. వీటినుండి క్రిందికి వ్రేలాడుచుండు పొడవైన సన్నఁపు రాగితీఁగల పొడవగు తోఁకలును, వాటిపొడవునను దీపములు వెలుఁ గుచుండు రంగులకాగితఁపు లాంతరులును కట్టఁబడియుండెడిని. వీటింగూర్చి వేరొకకథ కలదు. అద్దాని నిట వివరించుట సమంజసము గాన వివరింతుము గాక.

బుద్ధభగవానుఁడు నిర్యాణావస్థం జెందు మహాసమయమునకువారిశిష్యబృందమంతయు కుశనారపరిసరారణ్యమున వేచియుండిరఁట. అందుఁ బెక్కండ్రుభూపతులు, వారిశిష్యులే గాన వారియందు భక్తితో సైన్యములతో నరుదెంచి, యుండిరఁట. అటులనే నాత్ లోకాధీశుండగు ప్రభుండుఁగూడ నరుదెంచి, భక్తితో నటనే తనవిధిని నెఱపుచుఁ గాచు కొనియుండెనఁట. ఆమహాత్ముఁడు నిర్యాణ దశఁ జెందినపిదప శిష్యులు దహనసంస్కార ముల నొనర్చి, వారిశరీరధాతువులగు నస్తులం బంచికొన, తగవులు గల్గి, కలహముగనై, సంగరము నడచుననున ట్లుండెనఁట. ఎట్టకే లకెటులనో యొక బుద్ధిమంతుఁడగు విప్రుండు మధ్యవర్తిగ నేర్పడి, ఆ బుద్ధధాతువులం బంచ నియమితుఁడై, యొక ప్రధానమగు నెముకనువారికంటఁ బడనీయక మఱుగుపఱచి తనశిరోవేష్ట (తలపాగ) లో దాచుకొనియె నఁట. దానిని మనుష్య లెఱుంగకున్నను నాత్ లోకాధీశుఁడు చూచుచుండి, వానితలపాగా నుండి వానికిఁ దెలియకుండఁ దా నపహరించి, యిదియే చాలునని సంతసించుచుఁ దనలోకం బున కేగి, యొకయర్వాథ స్థలమున నొకగొప్ప దేవళము నిర్మించి, యం దీబుద్ధధాతువునుంచి, బౌద్ధదేవస్థానముగఁ బ్రతిష్ఠించెనఁట. దానికి సులేమానీదేవస్థానము అని పేరఁట. అట కరుగుటకే నీవాయువిమానఁపుబెలూన్‌బుట్టల నెగుఱఁజేతురఁట. భూమినుండి నాత్‌లోకము కడుదూరము గాన మార్గమునం దుండు చీఁకటిలో దానికి దారి చక్కఁగ నగుపడున టుల దానితోఁకకు దీపఁపులాంతరు లంటఁ గట్టఁబడుచుండు నఁట. నాత్‌లోకమున నాదే వళ మొక్కటియే కలదని చెప్పఁబడినది.

౨ ఇంక రెండవ దీపావళీపండగయగు తాజుం డైంగు:—అగ్నిదేవుఁడు తనసింహాసన మధి ష్ఠించి, లోకములఁ బాలించు దనుక నానవా లుగ మూఁడుదినము లాచరింపఁబడు పండుగ.

ఇది మొదట దీపావళినుండి లెక్కించి నాల్గు వారములనాఁ డాచరింతురు. ఇది మొదటి దీపావళికన్న వైభవోపేతమై, చూడ విన్నాణమై జరుపఁబడుచుండును. ఇంకనుఁ బాఠశాలాభవనములు, వర్తకఁపుభవనములు మొదలగు నవి దీపారాధనలచే నలంకరింపఁబడును. అంతియే గాదు. వీధులసందులందు గొప్ప విచిత్రములు, వినోదకరములు నగు దీపావళి యలంకారములతో ఇది'Fairy land'అనునట్లు రంగులవెల్గుతో నలంకరించుటయు, దీపకళికలతోనే నెమళ్లు, పాములు మొదలగు నాకృతులను రచించి, చూడ నాశ్చర్యముం గొల్పఁ జేతురు. బర్మీయులు స్వతస్సిద్ధముగాఁ జిత్రకలానిపుణతఁ గలవారు గాన నీపండుగల విచిత్రము లత్యద్భుత చిత్రవర్ణ కాంతులం బ్రదర్శించుటలు మరువరానివిగా నుండును.

**బరోడాసంస్థానము:**—దీనిని 'గైక్వారు డొమినియన్సు' అని వాడుటయుం గలదు. సముద్రతీరమునంటియు, భూభాగములోనుగూడఁ జెదరినటుల గుజరాతు (పరగణా) దేశముయొక్కయు, కథియవారుదేశముయొక్కయు భాగములందు వ్యాపించి యేర్పడిన రాజ్యము. అంతయు నేకమొత్తముగా గలసియున్న ప్రదేశము గాక చెదరినట్లున్నది. అభివృద్ధిఁ గాంచు చేతిపనులతోను, కర్మాగారములతోడను, విరాజిల్లుచున్న సంస్థానము. దీనిని Progressive state అని యెదరు. దీనికిఁ గచ్చిసంయుక్తాగ్రిగుడతీరమున 'ఓఖా' యనురేవుపట్టణము కలదు. అది యాబరోడా రాజ్యమునకే గాక, వెస్ట్రిన్ ఇండియాసంస్థాన రాజ్యములతోడను, ఉత్తరప్రదేశములతోడను, ఈశాన్యదిశగానున్న ప్రదేశములతోడను, రాకపోకలు, ఎగుమతి దిగుమతులు, సంబంధముం గల్గియున్న వర్తకప్రదేశమై యున్నది. మఱియు నిందు కెమికల్ ఇండస్ట్రీ, నేతపనులు, ఉప్పుపనులు, భరతదేశమున గొప్పకర్మాగారములలో నెన్నఁ బడిన సెమెంటుపనులు, పేరందియున్నవి. ఈచేతిపనులను చక్కఁగ నడుపుట కొఱక ప్రభుత్వోద్యోగశాఖను బరోడాప్రభుత్వ మేర్పఱచి నడపుచున్నది. రాజ్యమున ౨౦౦ మైళ్ళయినుపబాటలు కలవు. గొప్ప వాయువిమానస్థానముకలదు. రాజ్యమునఁ జక్కని మోటారుబాటలు విరివిగా నున్నవి. అన్నిజాతుల కూరలు చక్కఁగాఁ బెట్టఁబడుచు సమృద్ధిఁగల్గించుచున్నవి. గోధుమ, పొగాకు, చెఱకు, ప్రత్తిపంటలు దేశమున పరిపాటిగాఁ గలవు. ఇది మహారాష్ట్రరాజ్యసంస్థానమని చెప్పవచ్చును. ఢిల్లీమొగలై రాజ్య మస్తమించుటతో నేర్పడినరాజ్యము.

క్రీ. వె. ౧౭౬౧ లో బరోడామహారాజు దానూజీగైక్వారు అహమ్మదుషాదురానీనవాబుతోఁ బోరి జయించెను. ఇది పానిపట్టుయుద్ధమని పేరందినది. తరువాత పతేసింగుగైక్వారు బ్రిటీషువారితో సంధిచేసికొని ౧౭౮౦ లో మిత్రుఁడాయెను. ఆదినిది యశోకచక్రవర్తిరాజ్యములోనిదిగ నుండి, పిదప నుజ్జయనిరాజ్యమునకుఁ జేరి, పిదప ననేకహిందూరాజులవశమై ౧౨౯౭ లో మహమ్మదీయులవశమై ౧౫౭౨ లో నక్బరుచక్రవర్తిరాజ్యమునకుఁ జేరి (ఒకప్పుడు కతియవాడు భాగము మౌర్యులక్రిందనుండి) ఢిల్లీసామ్రాజ్యాస్తమయమున మహారాష్ట్రసంస్థానమై నిలచియున్న రాజ్యము.

Pttomey పండితుఁడు అలెగ్జాండ్రియాతో వర్తకమొనర్చుచుండినటుల కతియవాడుదేశముం గూర్చి వ్రాసియున్నాఁడు. రైవతపర్వతము, తత్సమీపముననేయున్న ప్రభాసతీర్థము, ద్వారక (శ్రీకృష్ణునినాటి ద్వారావతి) పట్టణము, నీరాజ్య

ములోనివే. అచటదొరకిన మారుతిశిలావిగ్రహము చూడఁ దగినది. అటనే దొరకిన గణేశవిగ్రహము నట్టిదియే. క్రీ. శె. పదునొకండవశతాబ్దమునఁ బేరందిన దర్భావతిపుర మిప్పుడు దాభోయి యనఁ బడుచున్న దుర్గముగలపట్టణము. ఈదుర్గద్వారములలో నొకటియగు రత్నద్వారము చూడఁ దగినపనితనముఁ గల్గియున్నది. దీని పనితనముం గూర్చి James Forbes పరిశీలకుఁడు పురాతనఁపు లేక ఆధునికఁపు హిందూకట్టడములపనితనమునం దిది యగ్రగణ్యమని తన Oriental memoirs అనుగ్రంథమున వ్రాసియున్నాఁడు.

మండియాపురమందలి దుగ్ధేశ్వరశివదేవస్థానము ముధేరాపురమున సూర్యదేవస్థానము చూడఁ దగినవి. ఈమూఁడును క్రీ. శె. ౧౦ శతాబ్దకాలమున మూలరాజగైక్వారునాటి వందురు. పిదప జయసింగుసిద్ధరాజు గైక్వారుగారు వీటిం బాగుచేయించిరఁట. బరోడానగరము విశ్వామిత్ర నదీతీరము. ఇందుఁ జూడఁదగిన భవనములు పెక్కులున్నవి. అందు లక్ష్మీవిలాసభవన మగ్రగణ్యము, కడుసుందరవంతమని పేరందినది. గొప్ప పూఁదోఁటయందున్న మహాభవనము.

**బలిద్వీపము:**- ఇది బలిచక్రవర్తి పరిపాలననుండి పేరందినది. ఒకపాటి పెద్దద్వీపమనియే చెప్పనగును. South sea Islands లోని యొకద్వీపము. డచ్చిప్రభుత్వమువారికిఁ జెంది యుంట భూగోళగ్రంథములందు Duch East India లోనిదిగాఁ జెప్పుచున్నారు. సుమిత్రా, జావా (యవ), బోర్నియో, సెలిబిస్, ద్వీపము లీసముదాయమునకుఁ జెందినవియే.

**బహురూపియా కల:**— ఈ నిపుణత, ఆదిని ఉత్తరహిందూస్థానమున, ముఖ్యముగా డిల్లీ, లక్నో పట్టణపరిసరసీమలందు, మొగలయిదర్బారు లక్నోదర్బారులుండిన మహమ్మదీయప్రభుత్వము లుండిననాడు చక్కఁగా వ్యాపించియుండెను. అది వఱ కుండెనేమో చెప్పుటకు నిదర్శనము లెవ్వియు నింతఁదనుక బయల్పడియుండలేదు. "బహురూపముల వహించుచు నన్యుల కచ్చెరువుఁగలుగఁ జేయునేర్పు" అని యీపదమున కర్థము. ఆసంస్థానప్రభుత్వము అంతరించి, ప్రభుత్వకటాక్షబలములం గోల్పోయి, నానాటికిఁ బటిమఁ గోల్పోవుచుఁ దగ్గినను, నిప్పటికి నీయుత్తరహిందూస్థానపట్టణములను, పరిసరములను, నచ్చటచ్చట బహురూపియాకళానిపుణులుఁ గాన నగుచుందురు. వీరు ప్రత్యేకజాతివారు గారు. ఈవిద్య నభ్యసించినవా రెల్లరు 'బహురూపియాలు' అనంబడుచుందురు. ప్రభువులసన్నిధి, వారియాస్థానములందు సహా యక్కాలమున బహురూపియాలు గొప్ప గొప్పగౌరవములను, మన్ననలను, బడసియుండినటుల నిదర్శనములు పెక్కు గలవు.

పెక్కం డ్రాంగ్లేయప్రముఖులు, బహురూపియాలను Quick change artists of high ways అనియు, Finished actor of the Road అనియు నుడివియున్నారు. ఇంకఁ గొందఱు వీరిని men with many disguises అనిరి. వీరు (బహురూపియాలు) కడుసాహసము నభ్యసించినవారుగను, దూరఁపుఁ బ్రయాణము లొనర్చిన లోకజ్ఞానులుగను, చారిత్రికక్రియల నొనర్ప నభ్యసించినవారుగను, అధమము మూఁడు లేక నాల్గు భాషలను చక్కఁగ నభ్యసించినవారుగను, అతిశీఘ్రముగఁ దమకంఠస్వరములను మార్చుచు, నన్యులధ్వనులతోఁ బలుకఁ గల చతురతఁ జక్కఁగ నభ్యసించినవారుగను నుండుట యవసరము. వీరి చెవులు (కర్ణేంద్రియములు) కండ్లు (నేత్రేంద్రియ

ములు) - త్వరితగాత్రివ్యాశక్తి కలవాటుపడియుండ వలసియుండెడిని.

బహురూపియాలంగూర్చిన కథలు పెక్కు ఉత్తరదేశమునఁ జెప్పుకొనుచుందురు. ఒకతటి షాజహానుచక్రవర్తి పాలనకాలమున నైరోపా వర్తకులు వారిసన్నిధి కరుదెంచుచు, దర్శనము లొనర్చుకొని, నజరుబహుమానద్రవ్యములర్పించి, వర్తకఁపుసదుపాయముల నర్థించుచుండు నాదిన ములం దొక ప్రభుత్వపియామిత్రుఁడగు బహురూపియాం వారివేషభాషాదులం గనిపెట్టుచుండి, ప్రభువు తీరికఁ గల్గిననాఁ డొకతటి నొకయైరోపా వర్తకునివేషమున సన్నిధి కరిగె నఁట. మూఁడు నాల్గుసంవత్సరములుగఁ దనయాస్థానమునఁ దన్నుఁ గొలుచుచుండిన యాబహురూపియా నాచక్రవర్తి పోల్చలేకుండినటుల నాతనివేషము, తప్పులేని వైఖరిగానుంటఁ జక్రవర్తి యాతని నల్లె యను కొని తనద్విభాషి (Interpreter) గుండా మాటలాడి మన్నించి సెలవు నొసంగెనఁట. పిదప బహురూపియా వినయముగ సలా మొనర్చి తా నేలికయొక్క బహురూపియానే యనఁ జక్రవర్తి యచ్చెరువంది యాతని బహూకరించె నఁట.

వేరొక యాత్రస్థుఁ డిటీవల నొకతండ్రియు, నాతనిసుతుండును, బహురూపియా నిపుణతచే నొకతహశ్శీలుదారు (సుతుఁడు), రైతు (తండ్రి) తో సంభాషించుటయు, నొకడిప్యూటీకలక్టరు (సుతుఁడు) పాములవారి నాగస్వరము (తండ్రి) వినునటులను, ఒకయాచకుఁడు (తండ్రి), ఒక జ్యోతిషశాస్త్రవిదుని (సుతుఁడు) అడుగుకొను నటులను, ఒకవీధులం దుడుచువాఁడు (తండ్రి) ఆతనిసుతుఁడు (కుమారుఁడు) యు బాటపైఁ దుడుచునటులను, ప్రదర్శనముల నగుపఱుచుటఁ దాఁ జూచితినని నుడివియున్నాఁడు. ఇంకను నొక యాంగ్లసివిల్ సర్వీసు ఉద్యోగి తనకుఁ బంజాబుదేశ మునఁ నొకబహురూపియా యొకచెట్టునఱుకు కూలి వానిగను, ఒకఆఫ్ఘనుస్థానఁపుపఠానువలెను, ఒక యాచకురాలగు వనితగను, నగుపడి, ప్రదర్శనములం జూపెననియు నద్భుతముగ నుండెననియు వ్రాసి యున్నాఁడు.

ఈబహురూపియావిద్య నాటకకలనుండి జని యించెనో, నాటకకలయే బహురూపియావిద్య నుండి జనియించెనో, చెప్పుటకు వీలుగాకున్నది. ఐనను నాటకములు, సినీమానటనలు, పగటివేష ములు, దొల్లింటిప్రభువులనాటి హాస్యగాండ్రు, ప్రదర్శించుచుండిన విద్యానైపుణ్యము లన్నియు నొకటితో నొకటి కొద్దిగనో గొప్పగనో సంబంధ బాంధవ్యములం గల్గినవియే యని తలంచుచు ముగింతుము గాక.

## బాబాగుర్గార్:-

(కిస్మాక్ చూడుఁడు.)

## బికనీరు సంస్థానము; బికనీరు

**పురము:-** దీనిని desert capital అందురు. పుర మెత్తగుప్రదేశమునఁగట్టఁబడియుంటఁ బల్లఁ పుఁ బరిసరములకిట కడుంగడు వింతయందముతోఁ గాన్పించెడిని. క్రీ. వె. ౧౪౮౮ లో బికభూపతి దీనిని నిర్మించెనఁట. ప్రభువులు (రాష్ట్రకూట) వంశ రాజపుత్రక్షత్రియులఁట. ఇచటిదుర్గము సుప్రసిద్ధము. పట్టణమునఁ బెక్కు సుందరభవనములుఁ గలవు. దుర్గము సుప్రసిద్ధమైనది. దానిని క్రీ. ౧౫౮౮ నుండి ౧౫౯౩ వరకు నైదుసంవత్సర ములు నిర్మించిరఁట. నిర్మాత రాజారాయసింగు మహాపతియనియు నందే తన నివాసభవనమును నిర్మించెననియు నందురు. దాని నిప్పుడు old

palace అనుచున్నారు. అందు సంస్కృత పారశీకగ్రంథముల పుస్తకభాండాగారములు గలవు. ఆయుధశాలయు నందేయున్నది.

పురమున సుందరవంతములగు జైన, హిందూ, మహామ్మదీయ దేవస్థానము లున్నవి. ఊరిబైట నున్న శివాలయము గొప్ప దేవస్థానము. చేతిపను లందు తివాచులనేత సుప్రసిద్ధము. మహారాజు గారి ఇంపీరియల్ సర్వీసులాంన్సరు పటాలమును 'గంగారిసాలా' యందురు. అది పెక్కుయుద్ధము లందు (ఒంటెలపటాలము) జయమంది నిలచిన దళము. చీనా, సోమలీలాండు, ఈజిప్టు దేశము లం దై రోపామహాసంగ్రామమునఁ గాచిన దీ యొంటెలపటాలమే.

## బిక్కనూరు (తొల్లింటిబిక్కవోలు):-

ఇది ఘనతవహించిన నిజాముప్రభువుగారి రాష్ట్రములో దోమకొండసంస్థానమునఁ బ్రభునివాసస్థల ముగ నున్నది. దీని యాదినామము బిక్కవోలుగఁ జెప్పుచుందురు. దోమకొండసంస్థానము రెడ్లపరిపాలనలో నుండియున్నది. ప్రభువులలో మల్లారెడ్డి ప్రభువు పద్మపురాణా ద్యాంధ్రగ్రంథములను రచించినవాఁడు.

## బ్రిటీషు పార్లమెంటు గన్పౌడరు కుట్ర:-

(British Parlament & Gun-powder plot) బ్రిటీషుదేశమున నవంబరునెల ఐదవతేది సెలవుదినముగ నీసందర్భముననే వాడఁబడుచున్నది. భరతదేశమును బ్రిటీషుసామ్రాజ్యముతో సంబంధముగలదిగాన దానిని భారతీయు లెఱుఁగుట సమంజసము. క్రీ. వె. ౧౬౦౫ నాఁడు మొదటిజేమ్సు భూపతిపాలనకాలమున, రాజకీయకక్షులలోఁ గొందఱి కభిప్రాయభేదములు గల్గియుంట గొప్పకుట్రఁ బన్ని, భూపతిని, అప్పటి యాయనపార్లమెంటుసభ్యులను జంపఁ గోరిందఱు తలంచిరని కింవదంతి కలదు. ఆసంవత్సరము నవంబరునెల ఐదవతేదీని పార్లమెంటుసభ యోచనానిమగ్నత నుండుతఱిఁ దుపాకిమందు గాల్చి పార్లమెంటుభవనముం బేల్చుట కీకుట్రనడచెనఁట. దాని కాంగ్లమున 'గన్పౌడరుప్లాటన్' అని పేర య్యెను. నిజమేమో చెప్పఁజాలము గాని పార్లమెంటుభవనపు సెల్లరులలోఁ బెక్కుతుపాకీ మందుపీపా లగుపడెను. ఆసమయమున బాణసంచావర్తకుఁడో లేక చేయుపనివాఁడో గాని (Fire works) Mr Guy Fawkes అను పేరుగలవాఁడొకఁడు హాల్లు కగ్ని నంటింపఁ బ్రయత్నములోనుండఁ బట్టుపడెనఁట. ఈగండ మిట్లు దైవికముగాఁ గడచి, ౧౬౦౬ లో పార్లమెంటువారు నవంబరు ఐదవతేది సెలవుదినముగ శాసించిరి. నాఁడాదిగ నేఁటివఱకుఁ బార్లమెంటు సభను భూపతి తెఱచుటకుమున్ను యోామెన్ ఆఫ్ ది గార్డు (బీఫీటరు) పటాలమువాండ్రు భవనఁపుసెల్లరులను శోధించుచుండుట యొకపద్ధతియై నడుచుచున్నది. తొల్లి వారే దీనిం గన్గొనిరఁట.

## బేక్టేరియా జీవితకాలము:—

జరమ్సు, మైక్రోబ్సు, బేక్టేరియా, బైసల్లై, యనఁబడు నాల్గుజాతుల పరమాణువులఁగూర్చి వేరు తావు లఁ గనఁదగును. అందు బేక్టేరియా కొంతవఱకు నిరపాయకర మగుటకన్న మానవోపయోగము నకుఁ బనికివచ్చు ననియనుట సమంజసమని యిది వరకుఁజేసిన పరిశీలనలనుండి బయల్పడియేయున్నది. దీని జీవితకాలముంగూర్చి పరిశీలనల నధికముగా సల్పిన మహనీయుఁడు C. B. Lipman పరిశీలకుఁడు. ఈయన అమెరికాసంయుక్తరాష్ట్రముల లోని కేలిఫోర్నియావిశ్వవిద్యాలయ సంబంధపరిశోధకుఁడు. ఈపరిశోధకుఁడు పెక్కుపరిశీలన లొనర్చి

నటఁగాని యందు ముఖ్యమైనవి మూఁడుగ నున్నవి. అందు మొదటిది వేల్సుదేశమునుండియు, పెన్సిల్వేనియానుండియు, వచ్చిన anthracite coal నంటి బ్యాక్టీరియా జీవించియున్నదానింగాంచి యిరువదియైదునుండి యేఁబది వత్సరములదనుక గప్పఁబడిపోయియున్న మట్టినిఁ బరిశీలించి యందుం డుటఁ గనుఁగొనియు నఁట పిదప నొకటిన్నర శతాబ్దము నాటి (పాత) కాల్పంబడని పచ్చియిటుకలను పరీక్షించి, యందు జీవించియున్న బ్యాక్టీరియాను గన్గొనెనఁట. పిదప వేలకొలఁదివత్సరములులుగ నటులనే యుండినట్లుఁ జెప్పఁబడుచుఁ గదుపంబడనిమట్టి (పాత) దిబ్బలం ద్రవ్వించి, పరిశీలన లొనర్చి, యఁదునను గన్గొనెను.

కొన్ని సంవత్సరములక్రితము హిమాలయము లపైనున్న సిక్కింరాజ్యమున నొకటితరువాత నొకటిగ రెండుగొప్పభూకంపములు సంభవించి, లోని మన్నుపైకిఁ దిరుగఁబడి, దేశమునఁ గలరావంటి యొక విచిత్రవ్యాధి గన్పించెను. పిదప నిది భూమి నుండి బయల్పడిన బ్యాక్టీరియా ఫలితమని పండితు లనుమానింపసాఁగిరి. కాని బ్యాక్టీరియా పెక్కుభేద జాతులుగ నున్నది. కొన్ని బాధకరములు, కొన్ని నిర్బాధకరములు.

## బ్లేకుమేరియా పోలీసు వేగన్:—

అమెరికా సంయుక్తరాష్ట్రదేశమున Maria Lee అను పేరుగల యొక నీగ్రోజాతి యాడుమనిషి యొక వసతిగృహమును నందుఁ బూటకూళ్ళుం బెట్టి నడపుచుండిన దఁట. ఆమె కడుబలాఢ్యురాలఁట. పోలీసు ఉద్యోగులకు నేరస్తులఁబట్టి నిర్బంధించుటయందుఁ జాల సాహాయ్య మొసర్చుచుండెడిదఁట. ఆమెయందుఁ బోలీసుశాఖోద్యోగులకుఁగల విశ్వాసగౌరవములతోఁ దాము నేరస్తులను కారాగృహమునకుఁ గొంపోవుబండి Vagen కామెపే రిడి రఁట. అదియే వాడుకలోనికి వచ్చి అట్టిబండ్లను నేటికిని Black maria బండ్లని వాడుచున్నారఁట.

## బైసికిల్-కథనము (Bicycle story):-

బైసికిల్ ఇక్కాలమునఁ బ్రపంచమునం దెల్లదేశముల నొకేరీతిని వాడఁబడుచున్నది. ఎటఁగన్న నట బైసికిల్వాడకము గానఁబడుచునే యుండును. ఇది విచిత్రమగుపనితనముఁ గల్గినది. దాని బరువునకన్న నేడురెట్లధికభారమును మోయఁగలశకట మిదియని వర్ణింపఁబడియున్నది. చప్పుడు లేకుండ నడుచు శకటము. దాని యరుగుదలకన్న నితరవ్యయములు లేక దాని నెక్కినరౌతుయొక్క కాలుసేతులాడడముతో సౌఖ్యగమన మీయఁగల శకటము. బాటలపైననే గాక చదునగు నెల్ల ప్రదేశములపైనను క్షేమముగఁ బోఁదగినది. ఇంచుక నేర్పుతో క్షేమకరమైన గమనమును గంటకుఁ బదిమైళ్ళకుఁ దక్కువగాని వేగముతో నిచ్చునది. శరీరారోగ్యస్థితికి వలయుపరిశ్రమఁ జేకూర్చుసాధనముగ నుండును.

మొట్టమొదట ఫ్రెంచిదేశస్థుఁడగు పనివాఁడొకఁ డొకద్విచక్రశకటము (Bicycle) ను చేసెను. అది ౧౮౧౮ లో నాంగ్లసీమకుఁ జేరి, యాంగ్లేయులచే 'Dandy Horse' అని పేరిడఁ బడుచుండినదఁట. దాని రెండుచక్రములపై బిగింపఁబడిన యొకయడ్డుకమ్మిపైనఁ గూర్చుండు తావమర్పఁబడి, మిగుల యసౌఖ్యకరమైయుండి, వరుసగ నొక్కొకకాలితో భూమిందన్నుచు నడచుచుండినదఁట. కాని నేర్పరులు దానిపై గంటకుఁ బదిమైళ్ళదూర మరుగఁ గల్గుచుండిరఁట. తోడనే పలుదేశములం దీయంత్రమును జేయు ప్రయత్నములు జరుగుచునే యుండెనుగాని వాటి

చరిత్ర సరిగా లభింపమి నొక్క బ్రిటీషుదేశమందలి బై సికిల్ కథనముమాత్రమే వివరింప వీలగుచున్నది. ఆదికాలమున బ్రిటీషుసీమలందు డేండీ హార్సుబై సికిల్ కొంతవఱకు వాడఁబడుచున్నను సహాయము లధికములుగ నుంటచేతనేమొ పెక్కండ్రు దీనిని గేలిసేయుచు వికారముగ బొమ్మలను వ్రాసి నవ్వులాటగాఁ బ్రకటించుచుండిరఁట.

పిమ్మట ౧౮౪౦ సంవత్సరమున నొక స్కాట్లాండు దేశఁపుఁబనివాఁడు 'Kirk Patrick Mac Millan' అనుపేరుగల సంఘమున నొకకఱ్ఱబై సికిలు చేసెను. అది Low wheeled rear driven machine ను రచియించి చూపెఁగాని యది వాడుకలోనికి రాకమున్నే దానిపై నభివృద్ధిగా 'wooden horse'అనుపేరుతో వేరొకబై సికిలు యంత్రమునకుఁ గడంగి, యొకస్కాట్లాండు దేశఁపుఁబనివాఁడు ముగింపఁగల్గెను. అతనిపేరుGavin Dalzell అని చెప్పఁబడినది. ఇదియంతయు నించుమించు కఱ్ఱతోనే చేయఁబడిన దందురు. దీనిం గూర్చి యీనాటికాగితములం దిటుల వ్రాయఁబడియున్నది. 'It was constructed almost entirly of wood, had a low saddle and pedal which moved backwords and forwords alternately and were connected by iron rods with cranked axle of the driving wheel. Its great advantege over the Dandy horse is that the rider is entirely supported on the machine. This is more confortuble, and a little less ridiculons than its predicisor."

క్రీ. శ. ౧౮౬౦ లో ఫ్రెంచిదేశమునుండి యించుమించుగానొకేపరిమాణముగల రెండుచక్రములు కఱ్ఱవిగల నొకబై సికిల్ బయలుదేఱెను. దీనిముందుచక్రముం ద్రిప్పు Axle ను నడపు Pedels తో నినుపపట్టాలు చక్రములంజుట్టి, స్ప్రింగులు లేకయుండెడిది. దీనినెక్కుట కష్టతరముగ నుండెనఁట. దీని నాంగ్లదేశస్థులు 'Bone shaker' అని వాడనొడంగిరఁట.

పిదప ౧౮౭౦ లో Penny Farthing అను వాఁడుకనామముగల బై సికిల్ బయల్వెడలెను. అది యిక్కాలఁపుబై సికిల్ తెగకు మాతృకగా నెన్నఁబడుచున్నది. దానిముందుచక్రము పెద్దదిగా నుండెనఁట. దానివమునగనే పై నెక్కురౌతుయొక్క భారఁపు మధ్యభాగ (Center of Gravity) యమరియుండెడి దఁట. చిన్నదియగు వెనుకటిచక్రము దానిని ప్రజామోదముఁ గల్గించుచుండెడిదిగాని, బాటయందలి చిన్నరాళ్ళుసైత మడ్డమగుతఱిఁ జక్రము తుళ్ళి వాహకునిఁ బడఁజేయునదిగా నుండెనఁట. ఐనను నిది వాడుకలోనికి వచ్చెనఁట. దీనింగూర్చి 'The motive power of the rider used to be applied dirrectly to the front wheel by means of pedals and crauks' అని చెప్పఁబడియున్నది.

౧౮౯౦ సం॥రములో H. G. Lowson గారి rear driven safe bicycle యొకటి వచ్చియుండెను. ౧౮౯౪ లో Rover safety bicycle బయల్వెడలెను. ఇక్కాలమున దీని వ్యాపకము ప్రారంభమని చెప్పనొప్పు. ఇందుఁ crauks, Pedals ప్రత్యేకముగ axle పై నమర్పఁబడియుండెను. వీటికై single driving chain అమర్పఁబడియుండెను. చక్రములు రెండును నొకేయెత్తుఁగల్గి పెన్నీఫార్తింగుబై సికిల్ వలె నపాయకరము లేక safety bicycle అని తలంపఁబడియెను. దీనిసంబంధముననే ముందు చక్రమించుక చిన్నదిగాఁ బిదపఁ జేయఁబడెను.

ఆకాలమునందే Humber safety bicycle గూడ బయల్వెడలెను. ఇందు ముందుచక్రము వెనుకచక్రముకన్నఁ జిన్నదిగనే చేయఁబడియుండెను. తోడనే Geared Facile అనఁబడుసైకిల్ బయలుదేఱెను. అందు గొలుసు లేక Sein and planet అనఁబడు gear పై నడుపఁబడుచుండు నేర్పాటుండెను. అనంతరము బయలుదేరినవాటియందు రెండుచక్రములు సమములుగ నుండుటయు, వెనుకటిది driving wheelగా నుంటయు, Cleein communicathion గల్గియుంటయు, నధికోపయోగకరములని కన్గొనఁబడియెను. ఇనుపపట్టాలకన్న గట్టిరబ్బరుపట్టాలును, వాటికన్న గుల్లరబ్బరుపట్టాలును, నధికోపయోగకరములని స్పష్టమయ్యెను. పిదప Free Wheel చేర్పఁబడియెను.

## బూమెరంగు - ఆయుధము:—

(Boomerang) బూమెరంగు లేక బూమెరాం గనంబడునది యొకకొయ్యముక్క. కొంత వంకరగాఁ జెక్కఁబడునది. ఇంచుమించు చొకగజముపొడవుండును. చాల గట్టికఱ్ఱ. ఇందు గుంపులు, సుడులు, తిరుగుడులు, పంగలు నుండరాదు. దీనివంకర విశేష మేమన దీనిం గురిచూచి దేనిపైనైనను విసరిన దానికి దెబ్బతగిలినతఱిఁ దిరిగి విసరినవారికడనే వచ్చిపడును.

దీని నాస్ట్రేలియాద్వీపమందలి యాదిమనివాసులు కనిపెట్టి చేసికొనిరని దెలిసెడిని. ఇది నేటికిని వారియందు సుప్రసిద్ధాయుధముగ వాడఁబడుచునేయున్నది. దీనిని విసరుట చక్కనిగురి కుదిరినవాఁడుగ నుండుట యవసరము. అట్టిగురిగాఁడైయుండినచో నెగురుచుండుపక్షులంగూడఁ గొట్టఁగల్గును. బూమెరంగులను వా రతిరహస్యముగ దాచుకొందురు. దానివంపు కొలతల నితరులకుఁ దెలియనీయరు. వంకరగా నుండుటకుఁ దోడు నడుమ నెక్కువవం పుండునని మాత్ర మగుపడెడిని. అది యేకఱ్ఱయో యింతవఱకు బయల్పడలేదు.

**బౌరియాకులమువారు:—** ఇక్కాలమున బౌరియా లుత్కలదేశసీమలందుఁ గాననగుచుందురు. వీరు హడ్డీ – చచ్చటి – మాల – మాదిగ మొదలగుకులముల వంటి యొక జాతిగా నున్నారు. వీ రాదిని పాంచాలదేశసీమలం దుండినవారు. నేటికి నట నధికసంఖ్యాకులు వసించుచునేయున్నారు. కొందరు వంగదేశమునకుఁ జేరి, కాపురములఁ గుదుర్చుకొని యుత్కలమునకుఁ జేరినవారు స్వభాషను మరచి యోఢ్రభాషనే వారి మాతృభాషగ నవలంబించిరి గాని పాంచాలమునందున్నవారు, పంజాబీభాష కుటుంబమునకుఁ జెందిన యొకప్రత్యేకభాషను గల్గియున్నారు. అందు మాటలు, నుచ్చారణలు గూడ చాల తక్కువగానుంట యన్యభాషలపదములఁ గైకొనుచుండెదరు. పంజాబులోనిబౌరియాల నాదేశప్రభుత్వము వారు క్రిమినల్‌ట్రైబులలో నొకటిగ లెక్కించిరి. వారియాచారములు, మర్యాదలు, వేఱుగ నుండెడిని. బౌరియాలు చాందా - జోరాలసంతతివార మనెదరు. రాజపుత్రస్థానపుఁజిత్తూరు (ఇప్పటి యుదయపురసంస్థానము) రాజ్యమునఁ దుపాకులఁ ధరించు యుద్ధభటులుగ నుండినవారమని చెప్పకొందురు. చిత్తూ రారాజ్యమునకుఁ బ్రధాననగరమైయుండి, పుత్తాసింగుమహారాజును, జైమాల్ మహారాజును, రాజ్యమేలుచుండిన యానాడు షహాబుద్దీన్‌ఘోరీ చిత్తూరును ముట్టడించిన తఱి వీరు తుపాకులంబూనిన యుద్ధవీరులుగను, భిల్లులు బాణములంబూనిన యుద్ధవీరులుగను నుండిరని వీరిపూర్వగాథలం దెల్పుచుందురు. వివాహాది

కార్యములం దాహ్వానపత్రిములు మొదలగునవి వీరు సంస్కృతముననే వ్రాయఁజేతురు. ఆఁడ పెండ్లివారియింటనే పరిణయము జరుగుట వీరిలో నాచారముగ నున్నది. పెండ్లికుమార్తె, పెండ్లి కుమారులకు మేన పసుపురాచి భాషికము గట్టుదురు. గుజ్జఁపువెండ్రుకల తాళ్రిటని మంగళసూత్రముగఁ బెండ్లికుమారుఁడు పెండ్లికుమార్తె మెడకుఁ గట్టును. అది యామెచే సౌమంగల్యకాలమంతయు, దీయక ధరించి, భర్త మరణించినతతి నాతనిశరీరముతో నగ్నిని దహింపఁజేయును. పెండ్లి కాలమున వీరికిఁ బూజు పెండ్లిపీటగ నుండెడిని. వీరికి వేఁట కులవృత్తిగా నున్నది.

